శతావధాని వేలూరి శివరామశాస్త్రి

# వ్యాసవాణి

సంపాదకుడు

డాక్టర్ జంధ్యాల మహతీశంకర్
ఎం.ఏ., పిహెచ్.డి.

ఆంధ్ర శాఖాధ్యక్షులు
శాతవాహన కళాశాల - విజయవాడ




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

VYASA VANI – A Collection of Essays on Vedic Literature, Poetics, Philosophy, Astronomy, History, Geography and Culture by Veluri Sivarama Sastri, Edited by Dr. Jandhyala Mahati Shankar, M.A. Ph.D., Head, Department of Telugu, Satavahana College, Vijayawada.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు - 500 004

ప్రచురణ : 350

ప్రథమ ముద్రణ : 1984

ప్రతులు : 2,000

వెల : రూ. 26-00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004

ముద్రణ :
పద్మా పవర్ ప్రెస్,
కుత్బిగూడ, హైదరాబాదు - 27

# తొలిపలుకు

వేలూరి శివరామశాస్త్రిగారి సాహిత్య వ్యక్తిత్వం నాన్యతోదర్శనం. ఆయన బహు భాషావేత్త. విద్వత్కవి. దార్శనికుడు. బహుముఖీన ప్రజ్ఞా పాటవాలు సంపాదించుకున్న మనీషి. సమకాలిక సామాజిక సమస్యావగాహనలోనూ, ప్రాచీనార్వాచీన సాహిత్య, తత్త్వావలోడనలోనూ కథారచనాచాతురిలోనూ, సునిశిత వచనరచనావిధానంలోనూ, శాస్త్రిగారు ప్రదర్శించిన సాధించిన సిద్ధులు అశ్రుతపూర్వములు. ప్రాచీన ఖగోళ, భూగోళ విజ్ఞానంలోని రహస్యాలను ఎరిగిన విజ్ఞాన సింధువు ఆయన హృదయం. ఈ 'వ్యాసవాణి' సంపుటిలో ఒదిగిన వ్యాసాలన్నీ సాహిత్యపరమైనవిగా స్థూలదృష్టికి కనిపించకపోవచ్చు. మానవ జీవిత సాఫల్యానికి దోహదం సమకూర్చే పరిజ్ఞానమంతా సాహిత్యమే. సహితమైన భావమేకదా సాహిత్యం. కనుక సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే శ్రీ శాస్త్రిగారి ఈ వ్యాసాలన్నీ సాహిత్యపరమైనవే. సాహిత్యాధ్యయనానికి అత్యంతోపయుక్తమైనవే.

శ్రీ శివరామ శాస్త్రిగారి ముద్రితాముద్రిత వ్యాసాలన్నింటినీ సాధ్యమైనంత వరకు సేకరించి, ఒక సంపుటిగా వాటిని మలచి, తెలుగు పఠితృలోకానికి అందజేయాలని డా. జంధ్యాల మహతీశంకర్ ఆకాంక్షించినారు. ఈ ఉదాత్తాశయాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హర్షించింది. ఇలాంటి వ్యాసాలు రచయితలకూ, పరిశోధకులకూ, విజ్ఞానోపార్జనాభిలాషులకూ కరదీపికలుగా వెలుగులందిస్తాయనే నమ్మకంతో అకాడెమీ వీటిని 'వ్యాసవాణి'గా ప్రచురించాలని నిర్ణయించింది. డా॥ మహతీ శంకర్ గారు శివరామశాస్త్రిగారి సాహిత్యవ్యక్తిత్వాన్ని పరిశీలించి డాక్టరేటును సంపాదించిన విద్వాంసులు. ఈ వ్యాసాలను అకాడెమీ కోరికపై ఆయన ఏర్చికూర్చి, బహువ్యయ ప్రయాసలకోర్చి, చక్కని పీఠికను సమకూర్చి అకాడమీకి అందజేసినారు. 'వ్యాసవాణి' ప్రచురణ సందర్భంగా అకాడమీతో సహకరించిన డా॥ జంధ్యాల మహతీ శంకర్‌గారికి ధన్యవాదాలను సమర్పించుకుంటున్నాను. ఈ వ్యాస సంపుటి ప్రచురణకు తమ అంగీకృతిని తెలిపి తమవద్ద ఉన్న అముద్రిత రచనలను శ్రమకోర్చి వెలికిదీసి అకాడమీకి హార్దికంగా తోడ్పడిన సహృదయులు శ్రీ శివరామశాస్త్రి అన్నగారి పుత్రులు శ్రీ వేలూరి సదానందంగారికి మా కృతజ్ఞతా పూర్వకమైన అభివందనలు. 'నవభారతి' మాస పత్రికలో ముద్రితమైన శాస్త్రిగారి వ్యాసాలను కొన్నింటిని మాకు అందజేసిన మిత్రులు శ్రీ పేర్వారం జగన్నాథంగారికి, అంతర్జాతీయ తెలుగు సంస్థ నిర్వాహకులకు, మా కృతజ్ఞతలు. ఈ గ్రంథ ప్రచురణకోసం ప్రత్యేక నిధులను సమకూర్చిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వానికి ధన్యవాదాలు.

హైదరాబాదు. ఇరివెంటి కృష్ణమూర్తి

తేది. 4-1-1984 కార్యదర్శి

"పార మైశ్వర్యంబు పొరజూచిన మహా
దాత్తుండు నాదు ముత్తాతగారు
జన్నంబు చేయు పై జందెంబు తీసిన
తద్జ్ఞశేఖరుడు మా తాతగారు
వేదవేదాంగాది వేత్త చమత్కార
తర వాగ్విహర్త మా తండ్రిగారు
కవితచే నాంధ్ర లోకమునందు రసమును
గురిపించువారు మా గురువుగారు

సరవిగా నిద్ది యుభయ వంశప్రసిద్ధి
నేను పండిత పుత్త్రిండ నిక్క మిద్ది
నొక్కి చూచిన నాకిల్లె డొక్కశుద్ధి
నామమా పెద్దదే శివరామశాస్త్రి"

* * *

తిరుపతి వేంకటేశ్వర సుధీవర శిష్యుడ నాదు పేరు వే
లూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాధ్యమైన వ్యా
కరణము జీవనమ్ము నధికారము కావ్యపురాణ నాటకా
కరములఁ జేయఁజాలుదు నఖండమునాగ శతావధానమున్

# పీఠిక

"శివరామశాస్త్రిగారు ప్యూర్ ఇంటలెక్చ్యువల్. అందువల్ల వారి మనస్సు ఏ ఒక్క విషయం మీదా లగ్నమై వుండేది కాదు. వ్యాకరణం, సైన్సు, కవిత్వం, అవధానాలు, యోగం-ఇలా దేనిమీదపడితే దానిమీదకు ఆయన మనస్సు వెళ్లుతుండేది. ఆయనకు ఏ ఒక్క దానిలోనూ సంతృప్తి వుండేది కాదు. శాస్త్రి గారు మహావ్యక్తి- చాలా గొప్పవాడు. **He is an intellectual giant.** ఆయన్ని మీరెలా చూస్తున్నారు. కవిగానా ? తాత్త్వికుడుగానా ? విద్వాంసుడు గానా ? మరెట్లా ?"

ఈ మాటలు అన్నవారు నవ్య కవితా ప్రవక్తలు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు. రాయప్రోలువారు చేసిన వ్యాఖ్య శివరామశాస్త్రిగారి వ్యాసాల పట్ల ప్రత్యక్షరసార్థకం.

శ్రీ శివరామశాస్త్రిగారు శతావధాని, మహాపండితులు, కవిశేఖరులు, తత్త్వవేత్త, జ్ఞానతపస్వి. ఆయనకు తెలియని శాస్త్రం లేదు; ఆయన ఎరుగని భాషలేదు. ఆయన విజ్ఞానం అపారమైనది-ఆయన ప్రజ్ఞ బహుముఖీనమైనది. వివిధ భాషలలోని విభిన్నశాస్త్ర విషయాలను తెలుగు సోదరుల కందించాలని ఆయన తపస్సు. అమూల్యమైన ప్రాచీన విజ్ఞానాన్ని ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞానంతో సమన్వయపరచి-ప్రాచీన నవీన విజ్ఞాన సాగరాలమధ్య వారధిగట్టిన మహామేధావి శివరామశాస్త్రిగారు.

శాస్త్రిగారి జననం 1892లో - అస్తమయం 1967లో. ఈ డెబ్బది యైదేండ్ల జీవితకాలంలో శివరామశాస్త్రిగారు గురువులైన జయంతి భగీరథశాస్త్రి గారు, వేమూరి రామబ్రహ్మశాస్త్రిగారల సన్నిధిలో నేర్చుకొన్నవి సంస్కృత ఆంధ్ర సాహిత్యాలు - వ్యాకరణం, అలంకారశాస్త్రం - తర్కమీమాంసాలు. తిరుపతి వెంకటకవులు చెప్పింది ప్రధానంగా అవధాన రహస్యాలు మాత్రమే. మిగిలిన విజ్ఞానమంతా ప్రాక్తన జన్మ సంస్కారంవల్లనూ, స్వయంకృషివల్లనూ సంక్రమించినదే. 1920 వరకూ శాస్త్రిగారి జీవితం అవధాన కవితాపథంలో

నడిచింది. పిమ్మట రెండు దశాబ్దాలు వారి దృష్టి కథానికలు - వ్యాసరచన వైపు మరలింది. 1945-49 మధ్య కాలంలో ఆయన వేదవేదాంగ విజ్ఞాన సాగరాన్ని మథించారు. అనంతరం ఆయన కేవలం వేదాంత మార్గంలోనే పయనించారు. చిరకాలం అరవింద దర్శనం మననం చేశారు. అందులో సంతృప్తి పొందలేక, శంకరాద్వైతం వైపుకు మరలి శంకానివృత్తి చెంది చిత్తశాంతి పొందారు. యోగశాస్త్రాన్ని మథించడమే కాక నిత్యమూ కొన్ని గంటలసేపు యోగసాధన చేసిన అనుష్ఠాన వేదాంతి శాస్త్రిగారు.

తెలిసినంతలో శాస్త్రిగారి మొదటి వ్యాసం "నాస్తిక దర్శనములు" - ఇది 1921లో ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురింపబడింది. చిట్టచివరి రచనలు శ్రీ అరవిందుల పురుషోత్తమ తత్త్వవ్యాసాలు. ధారావాహికంగా "భారతి" లో వెలువడిన ఈ వ్యాసాలలో తుట్టతుది వ్యాసం 1967 ఏప్రిల్ సంచికలో ముద్రితమైంది. ఈ వ్యాసాలనే తెనాలి - సాధన గ్రంథమండలి వారు గ్రంథ రూపంలో ప్రచురించారు. 1921 నుండి 1967 వరకూ సుమారు ఐదు దశాబ్దాలకు పైబడి శాస్త్రిగారి అమృతలేఖిని నుండి అసంఖ్యాక వ్యాసాలు వెలువడ్డాయి. ఇవి చిన్నవీ-పెద్దవీ, ముద్రితాలూ అముద్రితాలూ దాదాపు 60-70 వరకూ వున్నవి. ఈ వ్యాసాలనన్నిటినీ సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే నిత్య జీవితంలోనూ సాహిత్య జీవితంలోనూ వచ్చిన క్రమవికాసం స్పష్టమవుతుంది.

విషయ వైవిధ్యాన్నిబట్టి శాస్త్రిగారి వ్యాసాలను అయిదు రకాలుగా విభజించవచ్చు.

(i) **ఆర్ష విజ్ఞానము :** అఖండ తపశ్శక్తి సంపన్నులయిన మహర్షులు వేదాలలో ఉపనిషత్తులలో స్మృతులలో పురాణాలలో నిక్షిప్తం చేసిన విజ్ఞానాన్ని వెల్లడించే వ్యాసాలు.

(ii) **సారస్వతము :** ప్రాచీన అర్వాచీన కవితా సంప్రదాయాలనూ-వివిధ సాహితీ ప్రక్రియల స్వరూప స్వభావాదులనూ వివరించేవి. ప్రబంధ పురాణాది కావ్యసమీక్షలూ - భాషా సంబంధమైన వ్యాసాలు.

(iii) **పీఠికలు - పరిచయాలు :** శాస్త్రిగారు పీఠికలు వ్రాసిన గ్రంథాలలో కొన్ని ప్రాచీన కవికృతములూ, మరికొన్ని ఆధునికములూ. ఇంకనూ

కొన్ని సంగ్రహ గ్రంథ పరిచయాలు. కొందరు రచయితలు శాస్త్రిగారు కేవలం లేఖగా వ్రాసిన వానినే అభిప్రాయాలుగా అచ్చొత్తించుకున్నారు.

(iv) **వేదాంతము :** జగన్నిర్మాణమూ - ఆత్మవిచారమూ - పరబ్రహ్మ తత్త్వమూ - అరవింద దర్శనములను గురించిన వ్యాసావళి.

(v) *ప్రకీర్ణకములు :* స్వీయానుభవాలనూ అనుభూతులనూ చిత్రించే రచనలు - ఏ పరిషత్తులలోనో, గ్రంథాలయ వార్షికోత్సవాలలోనో చేసిన ప్రసంగాదులు - మార్క్సు వ్యాసాలు, యోగదర్శనము, శ్రీలల్ల, శ్రీ సత్యసాయిబాబా

ఈ విభాగం కేవలం వస్తుస్వభావాన్ని మనసులో పెట్టుకొని, పఠన సౌలభ్యానికై చేసిన విభాగమే కాని స్వయం సంపూర్ణత్వాన్ని సూచించే సరిహద్దు రేఖలవంటివి కావని మనవి. అంతేకాదు- వ్యాసలక్షణాలను చెప్పడం కానీ, ఆయా లక్షణాలు ఈ వ్యాసాలలో ఎక్కడెక్కడున్నాయో ఎత్తిచూపడం కానీ, తెలుగులో వ్యాసం అందచందాలను వివరించడం కానీ నా లక్ష్యం కాదు.

శివరామశాస్త్రిగారి భావస్రవంతి ఎటువంటిదో-వచన రచనలో - అందులో ముఖ్యంగా వ్యాసనిర్మాణంలో వారి విశిష్టత ఎట్టిదో వివరించడం - ఈ వ్యాసాలు వారి నిజజీవితంలో వచ్చిన క్రమ వికాస పరిణామాలను ఎలా అభివ్యక్తం చేస్తున్నాయో సూచించడమే ఈ నా ప్రయత్నం.

## ఆ ర్ష వి జ్ఞా న ం

శివరామశాస్త్రిగారు వేదవాఙ్మయ పరిశోధకులలో అగ్రగణ్యులు. "నాస్తిక దర్శనములు" ప్రాచీన భరత వర్షమునందు శూద్రులకు గల అధికారము"— అనే వ్యాసాలు శాస్త్రిగారి నిష్పక్షపాతమైన నిశితపరిశీలనకు నిదర్శనాలు.

ఒక విషయాన్ని గురించి సామాన్యుల చూపు వేరు; శాస్త్రిగారి దృష్టి వేరు. నాస్తికులవల్ల లోకానికి హాని కలిగిందని ఆస్తికుల ఆరోపణ; కాగా ఆస్తికులనేవారు అనుష్ఠించే ఆచారాలకు నాస్తికులే మార్గదర్శకు లంటారు శాస్త్రి గారు. అంతేకాదు- ఆస్తికులే వేదవిహితమైన, స్మృతులలో చెప్పబడిన నియమా

వళికి విరుద్ధంగా నడుస్తున్నారని కూడా అంటారు. వైదిక కర్మలలో శూద్రులకు అధికారం లేదని సంప్రదాయజ్ఞుల అభిప్రాయం - కాగా శూద్రులకు వేద శాస్త్రాధ్యయనాధికారం, ఉపనయనాధికారం కలదని బాదరి ప్రభృతులు ఎలా నిరూపించారో ఈ వ్యాసాలలో చూపించారు శివరామశాస్త్రిగారు.

"ప్రాచీన ఖగోళం"లో వేదకాలం నాటి ఖగోళ విశేషాలను సమీక్షిస్తే, "ప్రాచీన భూగోళం"లో మన పురాణ వాఙ్మయంలో వున్న బంగారం వెలికి దీయడానికి ప్రయత్నం చేశారు. ముఖ్యంగా వాయు-మత్స్య-బ్రహ్మాండ పురాణాలు ఆయన పరిశోధనకు మార్గదర్శకా లయినాయి. పురాణాలెన్ని? అవి ఏవి? వాని కాలమేది? ఆ పురాణాలలోని భూగోళ విజ్ఞానం నేటిజాగ్రఫీతో సంవదించునా? ఇత్యాది ప్రశ్నలకు ఈ వ్యాసంలో సమాధానాలు దొరుకుతాయి. "గణిత విజ్ఞానం"లో, మూడు నాలుగువేల యేండ్లనుంచీ దైనందిన జీవితంలో గణితమెట్లా ఉపకరిస్తున్నదీ శుల్బసూత్రం, జ్యోతిష సంహితలు, లీలావతి భాస్కరాచార్యుల గణితాల ననుసరించి వివరించారు. కోటలూ పేటలూ కట్టటానికీ, నూతులు చెరువులూ త్రవ్వడానికీ, శిలాలోహాదులతో విగ్రహాలు చేయడానికీ, గణిత విజ్ఞానం ఎంత ఆవశ్యకమో ఆయన తెలిపారు.

"మధ్యాకర్షణ"లో పదార్థాల మధ్య ఆకర్షణ శక్తి గురించి ప్రాచ్య పాశ్చాత్య దేశాలలో జరిగిన కృషిని వివరిస్తూ న్యూటన్, మాక్స్వెల్, యూక్లిడ్, సీటార్ మతాలను తెలిపారు. అంతేకాక బ్రహ్మాండం గురించి జరిగిన పరిశోధనలో పరమ ప్రామాణికమైన "రీచీ" అపేక్ష వాదాన్ని సమీక్షించారు.

వాయుమండలంలో అయిదు పొరలున్నాయని నవీన వైజ్ఞానికులు కనుగొన్నారు. అవి : క్షుబ్ధమండలం, స్థిరతాప మండలం, హిమమండలం, ఓ జోన్ మండలం విద్యున్మండలం. ప్రాచీనులు జీవుని ఉత్క్రాంతి మొదలుకొని భూలోకం నుండీ బ్రహ్మలోకానికి వెళ్లేదారిలో ఒక విద్యుల్లోకం వున్నదని చెప్పారు. ఈ నవీన ప్రాచీన సిద్ధాంతాల సమ్యక్ పరిశీలనమే "విద్యుల్లోకం."

"కట్టడాలు", "సేద్యము", "కులపర్వతాలు"- ఈ మూడు ఒక రకమైన వ్యాసాలు. మొదటి వ్యాసంలో-"వూరు ఎట్లావుండాలి ? కోట ఎట్లావుండాలి ? ఇల్లు ఎలావుండాలి ?" అనే విషయాలను శిల్ప వాస్తుశాస్త్రాలూ, మత్స్య, అగ్ని

పురాణాలు ఆధారంగా వివరించారు. పాడుబడిన కోటలు చెప్పే ఆంధ్ర జాతి చరిత్ర వినమంటారు వేలూరి. రెండవ వ్యాసంలో పరాశర సంహిత-వాజసనేయ సంహితల ప్రమాణంతో ఖాద్యాలకు మూలమైన సేద్యాన్ని గురించి చెప్పారు. మూడవ వ్యాసంలో ఈభూమీ, కొండలూ ఎలా ఏర్పడ్డాయో వాయు పురాణాదులు చెప్పిన అంశాలను ముచ్చటించారు. ఆర్షవాఙ్మయ మాధారంగా చేసిన తన పరిశోధనల పరమార్థాన్ని ఇలా వివరించారు: "భారతీయులకు దేశాంతర వాసుల కంటె ముమ్మందే విజ్ఞాన సంపద సమస్తమూ వున్నదనీ, అదే సంపూర్ణమనీ చెప్పటం నా ఉద్దేశ్యం కాదు, "ఉన్నది"-అని తెలపడమే నావంతు".

## సా హి త్య వ్యా సా లు

శాస్త్రిగారికి శాస్త్ర విజ్ఞానమూ, సాహిత్యమూ రెండూ రెండు కళ్లు. వారి సాహిత్య వ్యాసాలలో కొన్ని భిన్న ప్రక్రియల లక్ష్యలక్షణాలు నిరూపించేవి, కొన్ని రాజకీయ సాంఘిక ఉద్యమాల ఫలితంగా కవితలో వచ్చిన పరిణామం చిత్రించేవి; కొన్ని మహాకావ్య నిర్మాతలను గురించినవీ; కొన్ని గ్రంథరచనా కాలానికి సంబంధించినవీ!

శాస్త్రిగారి సారస్వత వ్యాసాలలో అయిదారు అముద్రితాలు దొరకడం విశేషం. "నాటక మీమాంస" అసమగ్రమైనదైనా ఇది శాస్త్రిగారి అలంకార శాస్త్ర పాండితీవిభూతిని ప్రకటిస్తుంది. ప్రాచీనాలంకారికులు చెప్పిన నాటకలక్షణాలను సమీక్షించడమేకాక, ఆయాలక్షణాలను "రత్నావళి"తో సమన్వయించడం వల్ల ఈ వ్యాస మంతా గురువు శిష్యుడికి పాఠం చెపుతున్నట్లుగా నడుస్తుంది.

"షార్ట్ స్టోరీ"ని నేటి విమర్శకులు "కథానిక" అని అంటున్నారు-కాని శాస్త్రిగారికి ఈ శబ్దం సంతృప్తి నీయక 'ఉపకథ' అని వ్యవహరించారు. అయితే ఇక్కడ ఒక చిక్కు వున్నది. ఆంగ్ల నాటకాలలో ఇతివృత్తాన్ని Main-plot, Sub-plot అని విభాగంచేసి, Sub-plot ను 'ఉపకథ' అని వాడటం ఆంగ్ల సాహితీ విమర్శకుల సంప్రదాయం. మన ప్రాచీనులు ప్రధాన కథ మధ్యలో వచ్చిన చిన్నకథను "ఉపాఖ్యానం" అని వ్యవహరించారు. (శకుంతలోపాఖ్యానం, ఉదంకోపాఖ్యానం మొ). ఇప్పుడు ఆంగ్ల విమర్శకుల "ఉపకథకూ," మన ప్రాచీ

నులు చెప్పిన "ఉపాఖ్యానానికీ", శాస్త్రిగారి వాడిన "ఉపకథ" కూ భేదం స్పష్టం చేయవలసి వస్తుంది. అందువల్ల ఎట్టి భ్రాంతికి తావులేకుండా బహుళ ప్రచారం పొందిన "కథానిక" శబ్దమే స్వీకరిస్తే సమంజసంగా వుండేదేమో ?

"రూపమూ-రసమూ" అనే వ్యాసంలో రూపాన్నీ రసాన్నీ గురించి చెపుతూ-ఒకటి మనస్సుకూ మరొకటి బుద్ధికీ విషయాలని వింగడించారు. ఆది నుంచీ ఇప్పటివరకూ రూపం మీదే దృష్టి నిలిపిన కవులూ, రసంమీదే చూపుకల కవులూ, రూప రసాలు రెండింటికీ సమాన ప్రాధాన్యం ఇచ్చిన కవులూ, అన్ని భాషలలో అన్ని దేశాలలో కనిపిస్తారు. ఈ విషయాన్ని సోదాహరణంగా ఈ వ్యాసంలో సమీక్షించారు శాస్త్రిగారు.

ఏ విషయాన్నయినా ఒక విలక్షణమైన దృష్టితో దర్శించడం శాస్త్రిగారికి పరిపాటి. "కవులూ-స్వాతంత్ర్యమూ" అనే శీర్షిక చూడగానే సమకాలిక కవిత్వంలో స్వాతంత్ర్యసమరం ఎలా ప్రతిబింబించిందో వ్రాస్తారనీ, ఇదేదో దేశ భక్తికి సంబంధించిన వ్యాసం అయివుంటుందనీ (ఈవ్యాసం మనకు స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో వ్రాసింది) అనిపిస్తుంది. తీరా చూస్తే "భారతదేశంలో అందరికీ స్వాతంత్ర్యం వచ్చిందికాని మరి కవులు ఎంతవరకు సర్వతంత్ర స్వతంత్రు లయినారు ?" అని ప్రశ్నిస్తారు శాస్త్రిగారు. "దేశాలకూ దేశాలకూ ద్వేషం వస్తే రావచ్చుకాని కవితా రాజ్య సమష్టిలో ఒక దేశానికీ మరొక దేశానికీ ద్వేషబంధమే వుండదు. ఇట్టి కవితా స్వాతంత్ర్యం-మరి కవులు కోరే స్వాతంత్ర్యం" అని అంటారు ఆయన. కవిత్వం దేశ-కాల-అవధులకు అతీతమైనదని వారి అభిప్రాయం. మరొకరకంగా విశాల విశ్వ సామ్రాజ్యంలో కవి సింహాసనం ఎంత మహోన్నతమైనదో సూచిస్తున్నారన్న మాట.

శతావధానిగా దేశం నలుమూలలా విజయభేరి మ్రోగించిన శివరామశాస్త్రి గారు శతావధాన విద్యా విశేషాలను గురించి వ్రాసిన వ్యాసం పరమప్రామాణిక మని వేరుగా చెప్పనవసరంలేదు. ఆధునికాంధ్ర కవితా పరిణామ చరిత్రలో ఒక ప్రధాన ఉద్యమంగా వర్ధిల్లినది భావకవిత్వం-విమర్శకులు ప్రత్యేకంగా "లిరిక్ పొయిట్రీ" అని వ్యవహరించినా, నేటి భావకవిత్వం ప్రాచీనాలంకారికులు చెప్పిన ధ్వని-భావధ్వని-రసధ్వనుల ప్రతిధ్వనే అంటారు శాస్త్రిగారు "భావ

కవిత్వం" అనే వ్యాసంలో. విజయవాడ రామమోహన గ్రంథాలయంలో తిరుపతి శాస్త్రిగారి తైలవర్ణ చిత్రపటం ఆవిష్కరణసభలో గురుదేవులకు సమర్పించిన అక్షర నీరాజనం "తిరుపతి మహాకవి". సౌందర్య అన్వేషణలో పాశ్చాత్య ప్రభావం వల్ల ఆధునిక భారతీయ సమాజంలో వచ్చిన మార్పుకు కారణాలను చెప్పి, పాశ్చాత్యుల కామానికీ భారతీయుల శృంగారానికీ ఎంత అంతరమో సూక్ష్మంగా చూపించారు "శృంగారం" అనే వ్యాసంలో. దేనిని చదువుతూ వుంటే మన మనసు వ్యథపడదో-దేనివలన మనకు నిషాకలగదో-మరి దేనివలన మనకు ఆనందం కలుగుతుందో-దేనివలన మన సంఘానికి సభ్యతకూ సంస్కృతి ఏర్పడు తుందో అటువంటి శృంగారం కావాలంటారు శాస్త్రిగారు.

"నటుడు కవిని సంపూర్ణంగా మింగి వైచుటలో రాహువు; లేక వివ రించుటలో భాష్యము."

"నటుడు కేవలము కవి పోసిన పోత విగ్రహము కాదు; అతడు తన నిశిత పరిశీలనచే లోకము నలౌకికము కావించును."

"కవి నిరుపేద; నటుడు మహాధనికుడు."

—ఈ వాక్యముల వ్యాఖ్యానమే "నాట్యము" అనే వ్యాసము.

శాస్త్రిగారు ఆధునిక పరిశోధకులకు ఒక సమస్యను వదిలారు- "తిక్కన భారత రచనకు ముందే ఎఱ్ఱయ అరణ్యరచన" - అనే భావం వ్యక్తం చేశారు. ఈ కాల నిర్ణయం చారిత్రకంగా సమర్థనీయమా ? పరిశీలించాలి.

## పీ ఠి క లు : ప రి చ యా లు

పీఠిక కావ్యకన్యకు శ్రీ తిలకమువంటిది. పీఠికలేని గ్రంథం బొట్టులేని ఆడబడుచువలె కళావిహీనంగా కనిపిస్తుందని చాలమంది అభిప్రాయం. ఆంగ్లంలో పీఠికలు ప్రత్యేక వాఙ్మయశాఖకున్న ప్రాధాన్యం గడించాయి. తెలుగు కావ్య పీఠికలు ఇప్పటికీ ఆ స్థాయి నందుకోలేదనే చెప్పాలి. ప్రాచీన ప్రబంధాలలో సూరనగారి కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నాలకూ, నవ్యకృతులలో ఆంధ్ర పురాణానికీ మహాప్రస్థానానికీ అటువంటి సారవంతమైన పీఠికలు అమరాయి. ఇటీవల వెలువడిన వెంపరాలవారి మనుచరిత్ర పీఠిక సమగ్రమైనది.

గత దశాబ్దంనుండీ అకాడమీ ప్రచురించిన గద్య పద్యకృతులు సుదీర్ఘ పీఠికా లంకృతములై కొంతలో కొంత సంతృప్తి కల్గిస్తున్నాయి.

శాస్త్రిగారు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి నాట్యవేదమునకు వ్రాసిన "సచేతో హృదయ సంవాదము", శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి ఆంధ్ర ధ్వన్యాలోకమునకు వ్రాసిన "సమాలోకము"- ఈ రెండూ కలిపితే ప్రత్యేకంగా ఒక అలంకారశాస్త్ర గ్రంథం అవుతుంది. నాట్యవేదం పీఠిక వ్రాయడానికి ప్రత్యేకంగా ఎన్నో గ్రంథాలను తెప్పించారు శాస్త్రిగారు. నాట్యవేద రచనా కాలం - నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలు - అభినవగుప్తపాదులు - అభినవుని అభినవత్వం - ఇత్యాది బహువిధ విషయాలతో సుసంపన్నమైన పీఠిక యిది. కావ్య నిర్వచనంలో ఆలంకారికులు వెల్లడించిన విభిన్నమతాలను తెలిపి - ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంత స్వరూపాన్నీ, ధ్వని భేదాలనూ - ఆంధ్రీకరణ విశేషాలనూ ఆంధ్ర ధ్వన్యాలోక పీఠికలో వివరించారు. అంతగా శ్రమించి శ్రద్ధాసక్తులతో వ్రాసినవి కనుకనే ఈ రెండూ అలంకారశాస్త్ర సార సర్వస్వాలవుతాయి.

ప్రాచీన కావ్యాలలో ఎర్రన హరివంశ-నృసింహ పురాణాలకు శాస్త్రిగారు వ్రాసిన పీఠికలు అమూల్యాలు. ఎర్రన కాలనిర్ణయం - వంశవర్ణన - ఎర్రయ కృతుల పౌర్వాపర్యము - ఆంధ్ర సంస్కృత హరివంశముల పరిశీలన - నృసింహ పురాణాన్ని ప్రబంధంగా ఎఱ్ఱన దిద్దితీర్చిన పద్ధతి - పోతన ఎఱ్ఱనల తారతమ్యము - మొదలైన విశేషాలతో సాధికారమూ సాంగోపాంగమైన పీఠికలను వెలయించారు- అంతకంటె ప్రశంసనీయమైన అంశం, గ్రంథాంతంలో అర్థనిర్ణయ పట్టిక చేర్చడం.

ఆధునిక కావ్యాలలో గోవిందరామాయణ ఉపోద్ఘాతం పేర్కొన దగినది.. "ఈ గోవిందరామాయణం చదివిన తరువాత వేఱు వేఱు రామాయణాలు చదువనక్కరలేదు- ఆలాగే శ్రీమద్రామాయణానికి ఉన్న వేఱు వేఱు వ్యాఖ్యలలోని విశేషాలు కూడా పరికించే పనిలేదు" అని ఆరంభమైన ఈ ఉపోద్ఘాతం- "పూలవలె గుబాళించే మాటలతోనూ, హృదయాన్ని పులకరింపజేసే భావాలతోనూ మోడును చిగురింపజేసే భక్తితోనూ, ఇనుప గుండ్లను కరిగించే కరుణంతోనూ

పరుగెత్తే గోవింద రామాయణం చదివాక పానకం అక్కరలేదు.''- అని అంత మవుతుంది.

మహారణ్యం వంటి హిందూదేశ చరిత్రలో దివ్వెలూని సత్యనిరూపణ చేసిన దిగవల్లి శివరావు గారిని ''బ్రిటిష్ ఇండియా చరిత్ర''కు వ్రాసిన పరిచయంలో ఆయన అభినందించారు.

శాస్త్రిగారు ప్రత్యేకంగా పీఠిక వ్రాయకపోయినా - గ్రంథపరిచయం చేయకపోయినా - కార్డు మీద వ్రాసిన నాలుగు పంక్తులనే 'ముఖపత్రం' మీద ముద్రించుకొన్న ప్రముఖులు ఎందరో వున్నారు. విద్వల్లోకంలో శివరామశాస్త్రి గారి పలుకుకు అంత ప్రామాణికత వుందని తాత్పర్యం.

## వే దా ం త ము

కవిత్వమును వేదాంతముగా, వేదాంతమును కవిత్వముగా మలచిన మహా మనీషి శ్రీ శివరామశాస్త్రి. ఆయన రచనలలో ఆధ్యాత్మిక గంధ బంధురాలు కానివి సాధారణంగా గోచరించవు. దానికి కారణం వారి జీవితంలో ఉత్తరార్ధ మంతా తత్త్వచింతనలో గడవటమే :

"ఈ జగంబు సర్వ మేమిటి యేమిటి
యేమి ఈ జగం బిదెల్ల నెల్ల"

అని సృష్టి రహస్యాన్ని కనుగొనడానికై నిరంతరం అన్వేషణ సాగించి సత్య స్వరూపాన్ని సాక్షాత్కరింపజేసికొన్న బ్రహ్మజ్ఞాన సంపన్నులు శాస్త్రిగారు. ఈ సత్యశోధలో మొదటిమెట్టు వేదశాస్త్ర పురాణ అధ్యయనం - రెండవమెట్టు అరవిందుల పురుషోత్తమ తత్త్వ వివేచన - మూడవమెట్టు శంకరుల అద్వైత మార్గంలో ఆత్మజ్ఞాన సంసిద్ధి.

పురుషోత్తమ తత్త్వాన్వేషణలో వెలసిన వ్యాసాలు మూడు - "ఆరంభ వాదము, పరిణామవాదము, మాయావాదము". కణాదుడు గౌతముడు ఆరంభ వాద ప్రవర్తకులు, ఆరంభవాదులు కార్యము వేరు, కారణము వేరని భావించారు. పరిణామవాదులు కారణముయొక్క రూపాంతరమే కార్యమని ప్రతిపాదించారు. మాయావాదులు ఈ ప్రపంచంలో అన్ని వస్తువులూ మార్పు చెందుతాయి-

నశిస్తాయి - కాని ఒక్క వస్తువు మాత్రమే మాయామయం కాదు - అది ఆత్మ ఒక్కటే" - అంటారు. ఉపనిషత్తులు మాయావాదానికి మూలం.

తాత్త్వికమైన ఎంత గంభీరార్థాన్నయినా అరటిపండు ఒలిచి చేతికిచ్చినట్లుగా చిన్న చిన్న మాటలలో తేటతెల్లం చేయడం శాస్త్రిగారి నేర్పు.

(అ) "ఉనికి అనగా కలిమి, అస్తిత్వము లేక సత్త."

(ఆ) "ఎఱుక అనగా తెలివి, లేక జ్ఞానము."

(ఇ) "ఉనికి యెఱుకలు రెండును అన్నదమ్ములు."

(ఈ) "ఉనికి వ్యాపకము - ఎఱుక వ్యాప్యము."

(ఉ) "ఒక వస్తువునందు మరియొక వస్తువును ఆరోపించుట అధ్యాస"

(ఊ) "అధ్యాసకే మారుపేరు అవిద్య."

(ఋ) "స్మృతి అనగా పూర్వ మనుభవించిన విషయమువలన పుట్టు జ్ఞానము."

(ౠ) "ఏది లేకపోతే కార్యం కలుగదో అది శక్తి; దేనికి శక్తి ఉన్నదో అది శక్తం."

శాస్త్ర సంబంధమైన పారిభాషిక పదాలను చిన్న సూత్రాలలాగా నిర్వచించడం శాస్త్రిగారివంటి అనుష్ఠాన వేదాంతులకే సాధ్యం.

## అ ర విం ద ద ర్శ న ము

అరవిందులు కారణజన్ములు. ప్రజాప్రభుత్వ ఆదర్శాలనూ, స్వాతంత్ర్య సంపాదననూ - వేదాంతపు అచ్చులో పోసి చూచిన ఋషికల్పుడు. ఆయనకు కారాగారవాసం దివ్యావాసం.

గీత అరవిందులకు సర్వస్వం. నిరంతరం గీతా మననంవల్ల ఆయన పొందిన సిద్ధి అనితరసాధ్యం. ఆయన అనుభూతి ప్రపంచాన్నే మనం "గీతా వ్యాఖ్య"లో - "భాగవత జీవనము"లో - పూర్ణయోగము" లో చూస్తాం. అరవింద దర్శనానికి ఈ మూడు గ్రంథాలు ముంజేతి అద్దాలు.

సచ్చిదానందమయమైన ఒకానొక తత్త్వము విజ్ఞానముగా - మనస్సుగా - ప్రాణముగా - జడముగా అవతరించింది. మరల అది జడమునుండి ప్రాణమునకూ - ప్రాణమునుండి మనస్సునకూ ఆరోహించి అచట దాగివున్నది. అదే ఇపుడు మనకు కనిపించే జగత్తు. ఈ మనోమయలోకంనుంచి విజ్ఞానముగా వికసించుటకే దాని నిరంతర ప్రయత్నము. ఈ విజ్ఞానమునే అరవిందులు "సూపర్ మైండ్" అని పేర్కొన్నారు.

ప్రతి మానవుడూ తన స్వరూపమును వికసింపజేసికొని తన భగవద్ధర్మమును భాగవతప్రకృతిని పొందాలి - తమలోని దివ్యప్రకృతి వికసింపజేసికొని, ఈ ప్రపంచమునందే దివ్యజన్మమును పొంది, దివ్యకర్మలు చేసి, తమ అసంపూర్ణత దాటి, ఈశ్వరలీలలో ఆనంతమైన ఆనందం అనుభవించాలి.

అరవిందులు ఆంగ్లములో వ్రాసిన "Super Mind" అనే గ్రంథాన్ని, శివరామశాస్త్రిగారు "పురుషోత్తమ తత్త్వము" అనే పేరుతో అనువదించారు. మూలగ్రంథం ఎట్టఎదుట వున్నా కేవల పాండిత్యంతో ఈ పురుషోత్తమ తత్త్వం చేజిక్కదు. యోగమార్గంలో సాగే సాధకుడు మాత్రమే పొలకువ తెలిసి ప్రవచింపగలుగుతాడు. శ్రీశాస్త్రిగారు అన్ని శాస్త్రాలతోపాటు యోగశాస్త్రాన్ని - దానిలోని సర్వమర్మాలనూ ఆకళింపు చేసుకొన్నవారు. అందుచేతనే కేవల గ్రంథావలోకనంతో అందని అరవిందుల వేదాంతాన్ని అమృతంలాగా అందించారు.

"శ్రీ అరవిందులు" అనే శీర్షికతో "భారతి"లో ఆరు భాగాలుగా ముద్రితమైన వ్యాసాలు పురుషోత్తమ తత్త్వాన్వేషకులకు కరదీపికలుగా ఉపకరిస్తాయి.

అలంకార శాస్త్ర గ్రంథాలయినా - కాదంబరి అనువాదమైనా - టి.యస్. ఇలియట్ గ్రంథాలయినా - అమ్‌జద్ రుబాయీల నయినా - రవీంద్రుని గీతాంజలి నయినా - శరత్ నవలల నయినా సమానంగా చూడగల విశాల హృదయులూ, విద్వన్మణులూ శివరామశాస్త్రిగారు. అంతేకాదు- సాహిత్యమైనా, చరిత్ర అయినా, తంత్రశాస్త్రమైనా, మంత్రశాస్త్రమైనా, భూగోళమైనా, ఖగోళమైనా ఆయన కొకటే !!

## ప్రకీర్ణకములు

"మన ప్రాచీన విద్యాలయములు" "మన సాహిత్య పత్రికలు" "గ్రంథాలయములు" అనే మూడు వ్యాసాలు వాస్తవానికి ఉపన్యాసాలు, విలక్షణ భావ విన్యాసాలు; ఆయా విషయాల విజ్ఞానకోశాలు.

ఇట్లాగే "గారు శబ్ద విచారము" ఒక చమత్కార రచన. సాంఘిక స్థాయిని బట్టి, సంస్కారాన్ని బట్టి, విద్యార్హతలను బట్టి, సంగతి సందర్భాలను బట్టి 'గారు' శబ్దం ఎలా ప్రయోగింపబడుతుందో ఈ వ్యాసం తెలుపుతుంది. "కథలు-గాథలు" ద్వితీయ సంపుటంలో చెళ్లపిళ్లవారు ఇదే పేరుతో వ్రాసిన వ్యాసానికి ఇది పూరకమని చెప్పవచ్చు.

శిష్టాచార సంపన్నమైన వంశంలో పుట్టి పెరిగినవారూ, జాతీయవాదీ, "మహాత్ముని ఆత్మకథ"ను ఆంధ్రులకు అందించిన శివరామశాస్త్రిగారి దృష్టి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి ఆద్యుడైన మార్క్సు మహాశయుని సిద్ధాంతాల వైపు ఆకర్షింపబడటం ఆశ్చర్యకరమైన విషయం. శాస్త్రిగారు "మార్క్సు మతము", "మార్క్సు చెప్పిన చరిత్ర", "అర్థశాస్త్రము-మార్క్సు" అనే వ్యాసాలు రచించి, 1948లో "సమత" పత్రికలో ప్రచురించారు.

"లడ్విగ్ ఫ్యూర్‌బా అండ్ ది ఎండ్ ఆఫ్ క్లాసికల్ జర్మన్ ఫిలాసఫీ "(ఏంజిల్స్)" కమ్యూనిస్టు మానిఫెస్టో "(మార్క్సు ఏంజిల్స్)" వాల్యూ ప్రైస్ అండ్ ప్రాఫిట్" (మార్క్సు) "వేజ్ లేబర్ అండ్ కాపిటల్" (మార్క్సు)అనే గ్రంథాలను క్షుణ్ణంగా చదివి శాస్త్రిగారు ఈ వ్యాసాలు వ్రాశారు. అంతేకాని వాటికి ఇవి యథానువాదాలు కావు. ఒకానొక తీవ్రమైన జ్ఞానతృష్ణతో అధ్యయనం చేస్తేగాని ఆయా సిద్ధాంతాల సారం సంగ్రహించలేరు. పార్టీ సాహిత్యం విరివిగా దొరకని ఆ రోజుల్లో మార్క్సు గ్రంథాలను సంపాదించి,. చిత్తశుద్ధితో ఆ సిద్ధాంతాలు ప్రజాక్షేమానికీ విశ్వకల్యాణానికీ ఉపకరిస్తాయని విశ్వసించకపోతే శాస్త్రిగారు ఈ వ్యాసాలు వ్రాసి వుండరేమో!

"స్థానం నరసింహారావు" అనే వ్యాసం ప్రత్యేకంగా పేర్కొనతగింది. ఇది ఒక కమనీయ కవిత – ఒక ఖండకావ్యంలాగా దీని రచన సాగింది. స్థానం

వేషాలు చూసి, స్త్రీ పాత్రల అభినయంలో నాట్యవేదానుసారం శాస్త్రిగారు ఎన్నో సూచనలు ఇచ్చేవారట. నటుడుగా తనను తీర్చిదిద్దినవారిలో శివరామ శాస్త్రిగా రొకరని స్థానం వారే చెప్పుకొనేవారట!

"నా జ్ఞాపకములు" అనే శీర్షికతో వ్రాసిన రెండు రచనలు నిజ జీవితంలో చవిచూచిన రెండు అద్భుతమైన అనుభూతులు.

"ప్రతిభావంతుడైన రచయిత తన లోకజ్ఞత, పాండితీ ప్రాభవాలను రంగరించి రసజగత్తుకు విందుచేసే ఆలోచనామృతమే వ్యాసం" - అని మనం అంగీకరిస్తే ఈ సంపుటిలోని ప్రతివ్యాసం భావామృతాన్ని పంచిపెట్టే జగన్మోహిని!!

నా పరిశోధన సందర్భంగా కంటబడిన శివరామ శాస్త్రిగారి వ్యాసాల వివరాలను తెలుపుతూ, వాటి నన్నింటిని ఒక సంపుటిగా ప్రచురిస్తే బాగుంటుందని సాహిత్య అకాడమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారిని కోరాను. వ్యాసాల వ్రాతప్రతులు పంపితే, అకాడమీ కార్యవర్గం ముందుంచుతామన్నారు వారు. అప్పుడు దాదాపు 50 వ్యాసాలు పంపాను. అకాడమీ కార్యవర్గం శివరామశాస్త్రి గారి వ్యాస సంపుటి ప్రచురణకు నిశ్చయించిందని తెలుపుతూ, సంపాదకత్వభారాన్ని కూడా నామీదనే పెట్టారు. శాస్త్రిగారి వ్యాసవాణికి అక్షరరూపం కల్పించడానికి పూనుకున్న సాహిత్య అకాడమీకి-ముఖ్యంగా కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి ధన్యవాదాలు. శాస్త్రిగారి జీవితకాలంలో శిష్యులూ మిత్రులూ గ్రంథప్రచురణకై ఒక ప్రణాళిక సిద్ధం చేశారు. కీర్తికాంక్ష, ధనాపేక్ష లేకపోవడంవల్ల శాస్త్రిగారే దానిని పడనీయలేదు. ఇప్పటికైనా వారందించిన జ్ఞానకోశాన్ని తెలుగుజాతికి అంకితంచేసే అవకాశం కల్పించారు అకాడమీవారు.

ఈ వ్యాస సంపుటి ప్రచురణకు అనుమతించడమే కాక - తమ దగ్గర పున్న అముద్రిత రచనలను వెలికితీసి పంపారు శివరామశాస్త్రి అన్నగారి (యజ్ఞనారాయణశాస్త్రి) కుమారులు వేలూరి సదానందం గారు.

తాము కాపీచేసి భద్రంగా వుంచుకున్న వ్రాతప్రతులను కొన్నింటిని నా పరంచేసి శ్రమ తగ్గించారు డాక్టర్ గూడూరి నమశ్శివాయగారు.

మార్క్సు సిద్ధాంత వ్యాసాలలో సందేహాలు తీర్చారు శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు, శ్రీ సి. రాఘవాచారిగారు.

అందరికీ వందనాలు -

—మహతీశంకర్



# విషయ సూచిక

## III. పీఠికలు - పరిచయములు

పుట

## IV. వేదాంతము :



## V. ప్రకీర్ణకములు :

# 1. నాస్తిక దర్శనములు

నాస్తిక మతాచార్యులు తమ మతమును గురించి రచించిన స్వతంత్ర గ్రంథములు మనకుఁ గానవచ్చుట లేదు. బౌద్ధులయు, జైనులయు మతములు కొంచెముగానైనను గానవచ్చుచున్నవి. కాని, చార్వాక మత మూల గ్రంథములు స్వల్పముగానైనఁ గానవచ్చుటలేదు. ఈ మతమును ఖండించువారు తమ ఖండనమునకు ఉపయోగించునంత వట్టు ప్రతిపాదించిన విషయమే తన్మత స్వరూపమున కాధారమగుచున్నది. 'సర్వ దర్శన సార సంగ్రహము' నందు చార్వాక మతమును మాధవాచార్యులవారు ఉపపాదించియున్నారు. ఆ విషయమును గొంత యిట నాంధ్రీకరించుచున్నాఁడను.

## చార్వాక దర్శనము

చార్వాకుని చేష్టితము దురచ్ఛేదమయినది. ప్రాణు లందఱును తలఁచుగా :

"బ్రదుకు వట్టును సుఖముగా బ్రదుకవలయు
మృత్యుముఖమున బడని వాడెవడు లేడు
బూదె నలుసులుగా మారిపోయినట్టి
కాయ మీయది మఱల నే గతిని వచ్చు ?"

అను లోకగాథను అనుసరించుచు నీతి కామశాస్త్రానుసారముగా అర్థ కామములనే పురుషార్థములనుగాఁ దలంచుచు పారలౌకికమగు నర్థము నపహ్నవించుచు చార్వాకమతము ననుసరించు వారుగానే కానఁబట్టుచున్నారు. కావుననే ఆ చార్వాకమతమునకు 'లోకాయతము' అను అన్వర్థమగు నామాంతరము.

నేల, నీరు, నిప్పు, గాలి-యను నాలుగు తత్త్వములనుండి పరిణమించిన దేహాకారములవలన సురాబీజములనుండి మదశక్తివలెఁ జైతన్యము పుట్టుచున్నది. ఆ దేహాకారములు నశింపగా ఆ చైతన్యము కూడ నశించును.

విజ్ఞాన ఘనమైన ఆ చైతన్యము భూతములనుండి పుట్టి, వానితోపాటు నశించును. దేహములఁ బాసినచో దానికి సంజ్ఞ (జ్ఞానము) ఉండదు. చైతన్య

ముతోఁ గూడిన దేహమే ఆత్మ. ఆత్మ వేఱుగా లేదు. ఉన్నదనుటకుఁ బ్రమాణము లేదు. ప్రత్యక్ష ప్రమాణమే ప్రమాణము. అనుమానాదులకుఁ బ్రామాణ్యము లేదు.

ప్రోయాళుల కౌగిళులవలనఁ గలుగు సుఖమే పరమార్థము. ఇందును దుఃఖముండుటఁజేసి పురుషార్థము కాదనరాదు. ఏలన, అనివార్యమైన దుఃఖమును బరిహరించి సుఖము మాత్రమే అనుభవింపదగినది కదా! చేపలు కావలయు వాడు ముల్లు చేపలను, పొలసుల చేపలను బట్టుకొని, తనకుఁ గావలయు పదార్థమునే స్వీకరించును[1]. ధాన్యము వలయువాడు పొల్లుతోఁ గూడిన వానిఁ గైకొని యుపయుక్తమునే గ్రహించును. దుఃఖభీతిచే ననుకూలసుఖము నెవడును విడనాడడు. జంతువులు తినిపోవునని వరిపైరు నాటకుందురా? బిచ్చగాండ్రు కలరని కుండల పండకుందురా? దుష్టమగు సుఖము భీరుఁడెవ డేని వీడుచో వాడు పశువు.

"సరసుల కెప్పుడున్ విషయ సంగమ జాత సుఖంబు దుఃఖ సం
కరమని లోననెంచి విడగాదగునంట! విమూఢభావ మా
వరులను దెల్ల బియ్యము నపారముగా నిడుచుండు వానినిం
బరుసని, పెల్లు పొల్లులకుఁ బట్టని, ఎవ్వడు పారఁబోసెడున్."

ఓయీ! పారలౌకికసుఖము లేని యెడలఁ జాలధనముచేతను, శరీరాయాసముచేతను సాధ్యమైన అగ్నిహోత్రము మొదలగు కర్మలయందు విద్యావృద్ధు లెటుల ప్రవర్తించుచున్నారన్నచో నదియు ప్రమాణము కాదు. వైదికుల మని తలచు ధూర్తబకములచే నొండొండ అనృత వ్యాఘాత పునరుక్త దోషములచే కర్మకాండ ప్రామాణ్యవాదులు జ్ఞానకాండమును, జ్ఞానకాండ ప్రామాణ్యవాదులు కర్మకాండమును ప్రక్షిప్త మొనర్చుట చేతను, త్రయి ధూర్త ప్రలాప మాత్రమగుటచేతను అగ్నిహోత్రము మొదలగునవి బ్రదుకుదెఱువునకు బరమ ప్రయోజనములు.

1) ఈ యర్థముకల వాక్యములు 'స్వరితా త్సంహితాయా మమరాత్తానామ్' 1-2:38 ఇత్యాది సూత్రభాష్యములయందుఁ గానిపించుచున్నవి. వీని పౌర్వాపర్యము విచారింపవలసి యున్నది.

ఇందుల కాభాణకము కలదు :

"అగ్నిహోత్రంబు వేదత్రయంబు మఱియు
బూదె తాల్చుట దండంబు పుచ్చికొనుట
పౌరుషము బుద్ధియును లేని వారలకును
బ్రదుకుతెరువని యా బృహస్పతి వచించె."

కావున ముల్లు మొదలగు వాని వలనఁ గలుగు బాధయే నరకము. లోకసిద్ధుడగు రాజు పరమేశ్వరుడు. దేహనాశము మోక్షము.

'దేహమే యాత్మ' యను సిద్ధాంతమునందే "నేను కృశుఁడను. నేను నల్ల వాడను" అను నెడల సామానాధికరణ్యము కుదురుచున్నది. 'నా శరీరము' అను వ్యవహారము 'రాహువుయొక్క తల' అనునటులు ఔపచారికము. అనఁగా, దేహమే ఆత్మ. కావున (తాను) నేను కృశు నను నెడ అన్వయము సరిగా నుండును. అయితే 'నా శరీరము' అనునది యెటులు? అనగా, శరీరమే తాను. తాను శరీరముకంటె వేఱుకాడు. శరీరముకంటెఁ దాను వేఱగుచోఁ గాని, 'నా శరీరము' అనునది కుదఱదన్నచో 'రాహువు యొక్క తల' అను ప్రయోగమువలె ఔపచారికము. రాహువునకు తలవినాగా శరీరము వేఱే లేదు. అటులు లేకున్నను, తలకంటె వేఱుఁగాఁ గొంత యున్నటులు, 'రాహువు యొక్క' అని వాడబడుచున్నది. అటులే 'నా శరీరము' అనునది ఔపచారికమని యారయఁదగు. ఈ విషయమంతయు నీ క్రింది శ్లోకములచే సంగ్రహింపఁబడినది :

"అత్ర చత్వారి భూతాని భూమి వార్యనలా నిలాః
చతుర్భ్యః ఖలు భూతేభ్య శ్చైతన్య ముపజాయతే
కిణ్వా దిభ్య స్సమేతేభ్యో ద్రవ్యేభ్యో మదశక్తివత్
'అహం స్థూలః కృశోస్మీ'తి సామానాధి కరణ్యతః
దేహ స్థౌల్యాది యోగాచ్చ స ఏవాత్మా న చావరః
'మమదేహోయ' మిత్యుక్తి స్సంభవే దౌపచారికీ"

పృథివ్యాపస్తేజో వాయువులను నాలుగు భూతములనుండి, సురాబీజములనుండి మదశక్తివలెఁ జైతన్యము పొడమును. 'నేను స్థూలుఁడను. కృశుడను' అను

ప్రయోగ సామానాధికరణ్యము వలనను, స్థౌల్యాదియోగము వలనను దేహమే ఆత్మ. మరొండు కాదు. 'నాదేహము' అనునది ఔపచారికము.

స్వభావము-వలననే జగతి కలుగుచున్నది:

'నిప్పు వేడిగాను నీరు చల్లనిదిగా
గాలి సమపుఁ దాకు గలదిగాను
ఎవడు వీనినిట్లు సృష్టించియున్నాడు?
వాని యునికి ప్రకృతివలనఁ గలుగు.'

ఈ విషయము నంతయు బృహస్పతి యిటులు వక్కాణించియున్నాడు:

"స్వర్గములు లేవు, లేవప వర్గములును
పారలౌకికమగు నాత్మ వేఱలేదు
వర్ణములు నాశ్రమాదులౌ వానిక్రియలు
సుంత యేనియు ఫలమునుఁ జూపలేవు.

అగ్నిహోత్రంబు వేదత్రయంబు మఱియు
బూడెపూతయు, దండంబు పుచ్చికోలు,
పౌరుషము బుద్ధియును లేని వారలకును
బ్రదుకు దెఱువుగఁ జేసిరి బ్రహ్మగారు.

క్రతువున జంపంబడు పశు
తతి స్వర్గం బరుగుజాడ తప్పనిచో, నా
క్రతువుల యజమానులు తమ
పితరుల నేలా వధింప విడిచెద రౌరా!

చచ్చిపోయిన వారికి శ్రాద్ధకర్మ
తృప్తికిని దాను హేతువౌ నెడల నింక!
దిరుగు జంతువులకును బాధేయ కల్ప
నంబు లోకంబునందు వ్యర్థంబు కాదె!

దానం బిచ్చినచో స్వ
ర్గానం బడియున్న వారు కడుఁదృప్తి పడం
గా, నిట మేడల నుండెడు
మానిసి మూకలకు నేల మఱి యీయ రహో!

బ్రదుకు వట్టును సుఖముగా బ్రదుకవలయు
బదులు చేసియు నేయిఁ ద్రావంగవలయు
బూదె నలుసులుగా మారిపోయినట్టి
కాయ మీయది మఱల నేగతిని వచ్చు?

ఈ కాయ మీగి పరమగు
లోకము వేంచేయుచో 'నలోపొలో' యని శో
కాకులు రగు సఖి బంధుల
యాకలనము మఱలఁ జేయనయి రాడేలా?

కావునఁ బ్రేతకార్యములు కావు ఫలప్రదముల్, ద్విజాధముల్
జీవన మార్గముం గడవజేసి రుపాయము, వేదకర్తలున్
మూవురు, భండ ధూర్తులును మొండి నిశాచరుఁ డన్నవాడు వా
చావిధి వాగుచుండుదురు 'జర్ఫరి తుర్ఫరి' యంచుఁ బండితుల్.'

## సారాంశము

ఈ మతమున నీతి యుక్తమగు సుఖోపభోగమే పరమ పురుషార్థము. ప్రత్యక్ష ప్రమాణమే ప్రమాణము. తదితరములు అప్రమాణములు. వీరు అనుమాన, అనుమితి, శబ్ద ప్రమాణములను ప్రౌఢముగా ఖండించియున్నారు. ఆ ఖండనమును బౌద్ధులు ఖండించిరి. వారిని ఖండించియొకరీతిగా అర్హతులు తామొకమతమును సిద్ధాంతము చేసికొన్నారు.

## నాస్తిక శబ్ద విచారము

పాణిని 'నాస్తికః' అను శబ్దము నిటులు నిర్వచించినాడు. 'అస్తి నాస్తి దిష్టం మతిః' (4-4-60) కాశికాకారుడు ఈ సూత్రమునకు ఇటులు అర్థమును వ్రాసెను.

ప్రథమా సమర్థము లయిన అస్తి-నాస్తి-దిష్ట అను వానికి షష్ఠ్యర్థమున ఠక్ ప్రత్యయము. 'ఇతనికి మతి కలదు గాన ఆస్తికుడు. ఇతనికి మతి లేదు కాన నాస్తికుడు. మతియున్న మాత్ర ప్రత్యయము రాదు. ఇకనేమి? పరలోకము కలదను మతి యితనికిఁ గలదు. కాన ఆస్తికుడు. తద్విపరీతుడు నాస్తికుడు. ఈ యర్థము అభిధానశక్తి స్వభావము వలన (లోకమునందలి వాడుక వలన) లభించును, అని కైయటుడు :

'పరలోక కర్తృకా చ సత్తా విజ్ఞేయా' అని వ్యాఖ్యానము వ్రాయుటచే పరలోకము కలదను మతి కలవాడు ఆస్తికుడని తేలుచున్నది. అయితే మనువు: 'వేదము ప్రమాణము కాదని వాదించువాడు నాస్తికుడు.' అను నభిప్రాయమును (2-11లో) ఇచ్చియున్నాడు. మరికొందరు 'ఈశ్వరుడు లేడనువాడు నాస్తికుడు' అని యభిప్రేతు లగుచున్నారు. వారి మతమున సాంఖ్య మీమాంసా దర్శనములను నాస్తికములని చెప్పవలసివచ్చును. కాని, నాస్తికుడు కూడ ఆ మతములు నాస్తిక మతములని చెప్పనొల్లడు.

కొందరు వెనుకఁ జెప్పినదంతయు సంగ్రహించి మఱికొంత చేర్చి ఇటులు చెప్పుచున్నారు : 'పరలోకము లేదు. తత్సాధనమగు అదృష్టము, తత్సాక్షియగు ఈశ్వరుడును లేడను బుద్ధి యెవరికి గలదో, వాడు నాస్తికుడు.'

ఈ మతమునందలి ఏకదేశి మతస్థులు కొందఱిటులు చెప్పుచున్నారు : 'పరలోకము, ఈశ్వరుడు లేరు అనువాడు నాస్తికుడు.' ఈ ఉదాహరించిన మతముల నాలోచింపగా ఇటులు తేలుచున్నది. వేదకాలమునుండి సూత్రకాలము దాక కర్మవిధులు మిగుల ప్రచారమునందుండుట వలన, ఆ కర్మవిధులు చాల నట్టు, ముఖ్యముగా పరలోకమునందు పొందఁదగు ఫలములు కలవగుటఁ జేసి, యపుడు పరలోకమునందు విశ్వాస మత్యావశ్యక మాయెను. కాని నాడు కర్మానుష్ఠానమే సంభవింపకపోయి యుండును. అనేకములగు నీ కర్మములు ననుష్ఠించియు, ప్రత్యక్షముగ ఫల మిసుమంతయు బొందమిచేగాని, కొండొక కారణముచేగాని యెవరికి కర్మవిధియందు శ్రద్ధ నశించెనో వారికి క్రమముగా పరలోకమునందు విశ్వాసము హ్రస్వమై పోయి యుండును. బహుళాయాస సాధ్యము అయిన కర్మఫలము ఈ లోకమునందే చవిచూడ నెంచిన వీరికి ఆస

లడుగంటుట వలనను, వీరి ప్రతిపక్షుల కర్మలు ఫల మిచ్చి తీరునని సమర్థించు కొఱకు మిక్కుటముగా పరలోకము గూర్చి వ్రాయుటవలనను, వారు పరలోకమే లేదనువాదము గైకొనియుందురు. దానఁజేసి కాశికాకారుని వ్యాఖ్యానము సమంజసముగా నన్వితమగును. మఱియు వేదాప్రామాణ్యవాదియు నాస్తికుడను నిర్వచనముకూడ సరియయినదియే. ఎట్లను బరమును తిరస్కరించువారు తత్ప్రతిపాదకములగు వేదములను దిరస్కరింప వెనుదీయరు. తల్లిచెవులు ద్రెంపువారికి బినతల్లి చెవులు బీర పువ్వులును కావు కదా!

"ఈశ్వరుడు లేడనువాడు నాస్తికుఁ" డను వాద మర్వాచీనము. అధ్వర మీమాంస కానుష్ఠితములగు కర్మలలో నీశ్వరునిఁ బ్రవేశపెట్టుట కవకాశములేదు. కావున అచటనచట యాగములలో ఈశ్వరార్చనము కూడఁ నర్వాచీనులచే ప్రవేశపెట్టబడియుండును.

కాల విపరిణామమువలన ఏకైక ధర్మానుయాయులు స్వప్రతిపక్షులకు నాస్తిక పదమును ప్రయోగించుచు వచ్చిరి. "లింగార్చన పరాశ్శైవా నాస్తికా స్సం ప్రకీర్తితాః" అని మాధ్వులును-

"తప్త ముద్రాంకిత తనుర్నాస్తి కం ధర్మ మాస్థితః
పశుతుల్య స్స విజ్ఞేయ స్సర్వకర్మ సు గర్హితః"

అని శైవాదులును - ఇటులు తదితరులను - ఒకరి నొకరు నాస్తికులని దూషించుకొనుట సాజమైనది. ఇది యంతయు విద్వేష ప్రసూతమని విశేషించి చెప్పనక్కరలేదు.

## లౌకాయతికులు

'లౌకాయతిక'మను నామము నాస్తికాపర నామధేయమే. 'లోకాయతమ్ అధీతే వేద వా' అను నర్థమున, ఠక్ ప్రత్యయము చేయగా లౌకాయతికశబ్దము నిష్పన్నమగును. పాణిని సూత్ర పూర్వకముగా ఈ శబ్దమును బట్టించియుండుట జేసి ఈ వ్యుత్పత్తి యాయన కభిప్రేతము.

## లోకాయతికుడు

ఒకానొకట లౌకాయతిక శబ్ద స్థానమున 'లోకాయత' శబ్దము కూడ కలదు. శారీరక భాష్యమున: 'లోకాయతి కానా మపి చేతన ఏవ దేహః'

(2-2-2) ఇటులే (3-3-53) సూత్రభాష్యమునకూడ కలదు. ప్రతిపరాయ సంస్కృతమగు మహాభారతము (1-70-49) నందును గలదు.

## లోకాయతుడు

కొండొకట నాస్తిక పదమునకుఁ బర్యాయముగా లోకాయత పదము వాడబడుచున్నది. రామతీర్థకృతమగు వేదాంతసార టీకలో (జాకోబ్ పరిష్కృతము) 'లోకాయతానామ్ : చార్వాక విశేషాణానామ్' అని 141వ పుటలో గలదు. హరిభద్రసూరి షడ్దర్శన సముచ్చయమున :

"లోకాయతా వదం తేవ్యం నాస్తిదేవో న నిర్వృతిః
ధర్మో ధర్మో న విద్యేతే న ఫలం పుణ్యపాపయోః"

అని కలదు. తట్టీకాకారుడు మణిభద్రుడు 'లోకాయత' పదమునకు నాస్తికులని యర్థము వ్రాసెను. శ్రీహర్షుడు నైషధీయమున 17వ సర్గ 94వ శ్లోకమున లోకాయత పదమును నాస్తికార్థమునఁ బ్రయోగించెను. ఈ యర్థమునఁ గ్రమముగా లౌకాయతికులు, లోకాయతికులు, లోకాయతులు-అను పదములు ప్రచారమునకు తేబడినవి. లోకాయత మనగా చార్వాకశాస్త్రమని యమరటీకాకారుడు వ్రాసెను. అయినను ఈ పదము ఈ అర్థమునందే శక్తము కాదు. సామాన్యముగా దర్కశాస్త్రము గూడ దీని కర్థము. ఈ పదము తార్కిక పర్యాయమని వ్రాయుచు శబ్ద కల్ప ద్రుమకారుడు దానికి ప్రమాణముగా :

"ఐక్య నామాత్మ సంయోగ సమవాయ విశారదైః
లోకాయతిక ముఖైశ్చ శుశ్రువు స్స్వన మీరితమ్"
(248-30. హరివంశ)

ఈ శ్లోకము నుదాహరించినాడు. (ముద్రిత ప్రతులలో నీ శ్లోకము కానరాదు)

రామాయణమునకు టీక వ్రాసిన తిలకుఁడు :

"క్వచిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాన్ తాత సేవసే
అనర్థకుశలా హ్యేతే బాలాః పండిత మానినః" (2-38)

అను శ్లోకమునందలి 'లోకాయతిక' శబ్దమునకు శుష్కతర్కవావ దూకులని యర్థము చెప్పి, దీని ముందున్న :

"ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః
బుద్ధి మాన్వీక్షి కీం ప్రాప్యం నిరర్థం ప్రవదంతి తే" (2-39)

ఈ శ్లోకము నందులకు ప్రమాణముగా నుద్ధరించినాడు. ఇది బౌద్ధులం గూడ సంగ్రహించుచున్నది. అచట 'లోకాయత' పదముచే వితండాశాస్త్రము బోధింప బడుచున్నది. అభిదాన ప్రదీపికలో 'వితండ సత్థం విజ్ఞేయం, యం తం లోకాయతం' అని కలదు. ఈ విచారణవలన లోకాయతిక శబ్దము తొలుత శుష్కతర్కవావదూకులు జెప్పనదిగా నుండి, పిదప తత్సామ్యమునంజేసి నాస్తికులం గూడం జెప్పన దాయెను. లోకాయతా పరనామముకల ఈ వితండా శాస్త్రమే హేతుశాస్త్రమని చెప్పబడుచు, నచట నచట నిందింపబడుచున్నది.

[2]కేవల హేతువాదుల గర్హించుట ప్రసిద్ధమే కదా! 'హైతుకాన్ బక వృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్' (విష్ణుపురాణ, 3-18-99) కొన్నితావుల నత్యుక్తి చెప్పవాడును హైతుకుడు నాంబడుచున్నాడు.

"త్రైవిద్యో హైతుక స్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః
త్రయశ్చా శ్రమిణః పూర్వే పరిషత్ స్యా ద్దశావర"
(మను, 12-211)

ఇట హైతుకు డనగా శ్రుతి స్మృత్యవిరుద్ధ శాస్త్రజ్ఞుడని కల్లూకభట్టు వ్యాఖ్యానము.

## బార్హస్పత్యుడు

నాస్తికునకు బార్హస్పత్యుండనియుం బేరు కలదు. హేమచంద్రుడు 'బార్హస్పత్యస్తు నాస్తికః' అని తన నిఘంటువున వ్రాసియున్నాడు. బృహస్పతి నాస్తిక వాదమున కాచార్యుడని యెల్లెడం బ్రసిద్ధము. కావుననే కాబోలు మాధవాచార్యుడు చార్వాకునకు 'బృహస్పతి మతానుసారి' యని విశేషణమును దవిల్చినాడు. మిగులు తీర్థకారులును నాస్తికునిం దెల్పవలయు పట్ల నచట నచట బార్హస్పత్యపదమును వాడుచుందురు. ఈ వాదమునకు మైత్ర్యుపనిషత్తు (7,8)

2) చూ. మను 2-11 చూ. మహాభారతము.

మొదలగునవి మూలములుగాఁ గానవచ్చుచున్నవి. ఆయాయిచోటుల బృహస్పతి యసురులకు నాస్తికవాద ముపదేశించినట్లు చూపబడినది.

"బృహస్పతి శుక్రాచార్యుని వేషము వేసికొని ఇంద్రుని అభ్యుదయమునకును, అసురుల నాశనమునకును, ఈ అవిద్యను సృజించెను. ఈ అవిద్యచే మంగళము నమంగళముగను, అమంగళమును మంగళముగను తలఁతురు. వేదశాస్త్రములకు దూరముగా నుండవలయు నందురు."

ఈ ఉపనిషత్తునందే కొండొకట: "ఒకానొకప్పుడు దేవతలును అసురులును ఆత్మ తత్త్వమెఱుగ బ్రహ్మ కడకేగి నమస్కరించి ఇట్లు పలికిరి. 'భగవానుడా! మే మాత్మ తత్త్వ మెరుగగోరి మీకడకు వచ్చితిమి. మాకుఁ దెలుపుము.' అనగా బ్రహ్మ ఆలోచించి 'ఈ రాక్షసులు అన్యతాత్ములు-అనగా దేహాత్మవాదులు. గాన దేవతల కుపదేశించిన దానికంటె భిన్నముగా నుపదేశింపఁదగు'నని యటు లొనర్చెను. ఆ మూఢులు ఆ యుపదేశమును నిక్క మనుకొని, అసూయాపరులు ముక్తివిరోధులు అనృతవాదులునై ఇంద్రజాలమువలె అనృతమును సత్యముగాఁ గాంచిరి. కాన వేదమార్గము సత్యము. వేదములను విద్వాంసులు పోషించుచున్నారు. కాన బ్రాహ్మణు డవైదికము చదువకూడదు."

బృహస్పతియే కాక బ్రహ్మకూడ బోధకుడని తేలుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందుకూడ అసురులు దేహాత్మవాదులని కలదు. (8-8) అట విద్యాదాత బ్రహ్మపర నామధేయుడగు ప్రజాపతి- బృహస్పతి కాడు-ఆ కథాసార మిట నుదాహరించుచున్నాడ:

"దేవతల పక్షమున నింద్రుడును, అసురుల పక్షమున విరోచనుడును తత్త్వాన్వేషణమునకు దర్భపవిత్రపాణులై ప్రజాపతి కడకేగి బ్రహ్మచర్యము గైకొని మున్నూటేండ్లు నివసించిరి. ప్రజాపతి వారికొక నీరికుండయందుఁ బ్రతిబింబమును జూపి 'యిదియే యాత్మ' యని దెలిపెను. వారలు నెరింగితిమని చనిరి. పిదప నింద్రుడు సందేహానుడై తృప్తి నొందలేక, మరల ప్రజాపతి కడకేగి ఆత్మ తత్త్వ మెరిగెను. విరోచనుడు శరీరమే ఆత్మ యనుకొని, యసురులకు శరీరమే ఆత్మయని బోధించెను. ఎట్లనగా, ఈ లోకమున ఆత్మ పూజనీయమును, పరిచర్యమును. ఆత్మను బరిచరించుచు ఇహాముత్రల సుఖ మందును."

ఈ సంప్రదాయము నేటికిని గలదు. దానహీనుని, శ్రద్ధాహీనుని, యజ్ఞము చేయని వానిని 'అసురు'డని శిష్టులు తలతురు. ఈ ఉపనిషత్తు శ్రద్ధాదుల బోధింపక యసురుల నుపపాదించుచున్నది. (తత్వజ్ఞార్థమున) ప్రేతశరీరము నీ ఉపనిషత్తుచే సంస్కరించి, బట్టలతో నలంకారములతోను అలంకరించుచున్నారు. ఈ (శవ) సంస్కారముచే ఈ లోకమును జయింపగలమని వారి తలపు.

ప్రజాపతి యంతవాడు ఎంతటి అసురులనైనను వంచించి యుండడని తలచి, ఇటీవలి మైత్ర్యుపనిషత్తున బృహస్పతి నాస్తికోపదేష్టగాఁ జెప్పంబడెనని మోక్షమూలర్ –

"It is not unlikely that Brihaspathi was introduced in the latter Upanishad in order to take the place of Prajapathi, because it was felt to be wrong that this highest deity should ever mislead anybody, even the demons." అని వ్రాసినాడు.

బృహస్పతి పేరులు పలు తెఱంగులఁ గానవచ్చుచున్నవి. ధర్మశాస్త్ర కర్తయగు బృహస్పతి యొకడు కలడు.[3] భారతముననే కొండొక బృహస్పతి[4] ఉశనునితోఁగూడ (ఉశనుడు వేఱు-బృహస్పతి వేఱు) వంచనాశాస్త్రకారుడని కలదు. ఋగ్వేదమున (నా యెఱిగినంత వట్టు) బృహస్పతి పేర నిరువురు ఋషులు కలరు. అందొకడు అంగిరసుడు.[5] కొండొకడు లౌక్యుడు.[6] ఈ లౌక్యునకును లౌకాయతికమునకు గల సంబంధము విచారింపదగియున్నది. తత్సూక్తములలో నాస్తికవాద గంధమైనను లేదు. ఋగ్వేదముననే[7] బృహస్పతి యను పేర నొక దేవత కలదు. ఈ భాషాటవియందు ఏఱి పట్టుకొన్నచో బృహస్పతు లింకను దొరకకపోరు. కాని దొంగ యెవఁడో తేలఁడు. మహాభారతము ఏ బృహస్పతికి వంచనాశాస్త్ర కర్తృత్వ మారోపించుచున్నదో ఆ బృహస్పతి ఈ గౌరవమున కర్హుడు.

---

3) 13-12, 4) 13-39, 5) 10-71 'కపిబోధా దాంగిరసే' అను సూత్రము చూ.
6) 10-72, 7) 8-96-15.

"ఉశనావేద యచ్ఛాస్త్రం యచ్చవేద బృహస్పతిః
స్త్రీ బుద్ధ్యా న విశిష్యేతే తాస్తు రక్ష్యాః కథం పరైః?
స్త్రీణాం బుద్ధ్యర్థ నిష్కర్షా ధర్మశాస్త్రాణి శత్రుహన్
బృహస్పతి ప్రభృతిభిః మన్యే సద్భిః కృతాని వై.

(మహాభారత 13-39; 8-10)

ఇట్లు కాక మైత్ర్యుపనిషత్తునందలి బృహస్పతియే తత్కర్త యనుడు. నిర్వివాదము. దేవాచార్యుడును, పురోహితుడును నగు బృహస్పతికి నాస్తికవాద కర్తృత్వ మారోపించుట విస్మయావహమే! ఉపనిషత్కారు లట్లారోపింప నేమి హేతువో?

## చార్వాకుఁడు

చార్వాక దర్శన మను పేరఁ బరగు గ్రంథమే నాస్తిక శాస్త్రమునఁ బ్రసిద్ధ గ్రంథము. ఇంకను గ్రంథములు దొరకనంతవరకు దీనినే వారి యుద్గ్రంథముగా నంగీకరింపవలసియున్నది. సర్వ దర్శన సార సంగ్రహమున మాధవాచార్యులు - 'బృహస్పతి మతానుసారియు నాస్తికవాద శిరోమణియునగు చార్వాకునిచే'-అని వ్రాసినారు. ఇటులు చాలమంది చార్వాకుని నాస్తికశాస్త్రమునకు కర్తగా వ్యవహరించుచున్నారు. కాన నీ చార్వాకుని విచారింతము.

'చార్వాక' శబ్దమునకు ఇటులు వ్యుత్పత్తిని చెప్పుదురు. చారు + వాకః- చార్వాకః (పృషోదరాది) చారు : లోకచిత్తా కర్షకమైన, వాక = వాక్యములు కలవాడు.

మాక్సుముల్లర్ : "The name of Charvaka is clearly connected with that of Charva and this is given as synonym of Buddha by Bala Sastry in the Preface of his edition of Kasika" అని వ్రాసెను. ఇది పొరపాటు. శ్రీబాలశాస్త్రిగారు-చార్విబుదః-అని కొంత గ్రంథము వ్రాసినారు. అది వారి సొంతము కాదు. 'సం మాన నోత్స జ్ఞాన' అను సూత్రముపైఁ గల వృత్తి ననువదించిరి. అఁట, చార్వి-బుద్ధిః అని కలదు. బాలశాస్త్రిగారి 'బుద్ధః' అనునది ముద్రాదోషము. ఆ తప్పు నొప్పుగా తలచి మప్పుగొన్నారు మోక్షమూలరుగారు.

మహాభారతమునఁ జార్వాకుఁ డొకడు కలడు. వానికిని నాస్తిక మతమునకును సంబంధమేమియు గానరాదు. అతడు బ్రాహ్మణద్వేషి. దానఁజేసి ఈతడు రక్కసగాఁ దెలుపబడియుండెను. వేణీ సంహారమునందలి చార్వాకుడీతడే కాని నాటక చార్వాకుడు గాన వేఱుగాఁ గానబట్టును. "న్యాయ కుసుమాంజలి" యను గ్రంథము క్షణభంగవాది యగు బౌద్ధుని చార్వాకుడని వాడినది. ప్రకాశకారుడు నటులే చెప్పెను.

"స్యాదే తత్ మాభూ దధక్ష ఘనుమానం వా క్షణికత్వే తదాహి,
సందేహోస్తు ఏతావతాపి సిద్ధం సమీహితం చార్వాక స్యేతి"
(1-స్తబక, 192 సో-సా)

విచారింపగా చార్వాకుడు వేఱు; బౌద్ధుడు వేఱు. చార్వాకుడు నాస్తిక శిరోమణి. కాని స్వయముగా నాస్తికవాద రచయిత కాదు. ఈతడు బృహస్పత్యనుయాయి యని కానిపించెడిని.

## పాషండుడు, పాషండి, పాషండకుడు, పాషండికుడు.

'పాషండ' శబ్దముకూడ నాస్తికపరముగాఁ గవులచే వాడబడినది. శ్రీహర్షుడు నైషధీయమున :

"బభాణ వరుణః క్రోధా దరుణః కరుణోజ్ఝితమ్
కిం న ప్రచండాత్ పాషండపాశ ! పాశా ద్బిభేషి నః"
(17-102)

అని ప్రయోగించినాడు. సాంప్రదాయకులు దీనికిఁ గ్లిష్టముగా వ్యుత్పత్తి నిచ్చియున్నారు. 'పాపం + సనోతి'-చూపుచేతను, కలయికచేతను పాపము కలిగించువాడు.[8] పృషోదరాదులలో బెట్టి సాధింపవలయును. లేక, పాతీతి + పా (క్విప్) వేదధర్మము, షండయతి : పాడొనరించువాడు-కాగా పాషండుడు.[9] కొందరు పాషండశబ్దము సంస్కృతము కాదనియు, వైదేశికముకాని ప్రాదేశికముకాని

8) 3-18 వ. విష్ణు పు. చూ. 9) పాలనా చ్చ త్రయీధర్మః పాశబ్దేన నిగద్యతే తం షండయంతి తే యస్మాత్ పాషండా స్తేన హేతునా.

యగునని అభిప్రేతులగుచున్నారు.[10] ఈ శబ్దము న్యాయ కుసుమాంజలి మొ. గ్రంథములయందు కూడ ప్రయుక్తమైయున్నది. బౌద్ధులయెడ నీ శబ్దము అసకృదావృత్తమైయున్నది. అర్హతులు గూడ నీ శబ్దముచేఁ దిరస్కృతులు కాకపోవుట లేదు. ఇంతియకాదు. విరుద్ధాచారముకల ప్రతివాదును ఈ శబ్దముచే వ్యపదేశింపబడుచున్నాడు.[11] అటనట పాషండి,[12] పాషండక,[13] పాషండిక[14] పదము లీ స్థానమున బ్రయోగింపబడినవి.

## పాషండుడు; బౌద్ధ జైనుల యుద్దేశము

బౌద్ధ గ్రంథములలో 'పాషండ' శబ్దమున కెక్కుడు ప్రచార మున్నది. ఆ పదముచే బౌద్ధులు తమ్ము సంబోధించుకొనక, తమకు విరుద్ధములగు నన్నిటి యెడఁ బ్రయోగింతురు. వారు తొంబదియాఱు తెఱగులను పాషండులు కలరని వ్రాసినారు :

> "కుటీసకాది చతుత్తింసత్ ద్వాసట్టి దిట్టియో
> ఇతి చ్ఛన్నవతీ ఏతే పాషండా సంపకాసితా."
>
> (అభిదానప్ప దీపికా-440)

కుటీచనాది నామములు 34. మిగిలినవి 62. ఈ మతములు బ్రహ్మజాల సూత్రమున వర్ణింపబడినవి. అర్హతులు 363 మంది పాషండులను జెప్పిరి.

> "అసియ సయం (18-వం) కిరియాణం అకిరియవా ఈణహుతి
> చులసీ ఈ (84) అన్నణియ సత్తట్టీ వేణ ఇయాణం చ బత్తీసం
> (32) మణిభద్రః

పాణిని నాస్తిక శబ్దమును సాధించుటఁజేసి యాతనికంటె నీ వాదము ప్రాచీనతరము. మహాభారతము, రామాయణము, మైత్ర్యుపనిషత్తు, ఛాందోగ్యము, బృహదారణ్యకము, కఠము లందును నీ వాదము కలదు. దేవతల గూర్చి

---

10) The Great Epic of India (Hopkins) Page 49 – Foot-note చూ. 11) పద్మ పురాణము - ఉత్తరఖండ - 42 అ. 12) చూ. విష్ణు పురాణమ్ 18 13) చూ. శబ్దరత్నావళి. 14) చూ. మణిభద్రకృత షడ్దర్శన సముచ్చయ టీక.

ఋషులు, ఆయాయి వస్తువులు ప్రార్థించుపట్ల జెప్పిన కొన్ని ఋక్కులలో నీ విషయము కానిపించెడిని. ఏ విధముగానైనను వారి కోర్కె ఫలించునెడ నా మంత్రము మహిమ కలదని, వారికి దానియెడ ప్రమాణబుద్ధి పొడమియుండును. ఇటులు అప్రామాణ్యముగూడ కల్పింపకపోలేదు. అట హేతువు వారి స్తుతులు ఫలింపకుండుటయే. వ్యర్థమనోరథులకు దానఁ బ్రామాణ్యమెటులు? ఏదేవునందు విశ్వాసము మితిమీఱియుండునో ఆ దేవునందే అవిశ్వాసముకూడ నొక యెడ పెరుగుచునే యుండెనని కానబడుచున్నది. ఈ క్రింది విషయములు పై విషయమును స్థిరీకరించును :

[15]"యుద్ధమును గోరు ఓ జనులారా! ఇంద్రుడుండు నెడల మీరింద్రుని కొరకు నిజమగు స్తోమమును భరింపుడు. నేమర్షియగు భార్గవుడు ఇంద్రుడని యొకడు లేడనుచున్నాడు. ఆ ఇంద్రు నెవరు చూచిరి? మే మెవరిఁ గొండాడుదుము?"

ఇట్లనుటఁజేసి ఇంద్రుడు వాదమాత్రమని తేలుచున్నది. [16]"ఓ స్తోతా! నేనుగో! నీ ప్రక్కనున్న నన్నుఁ గనుము. సర్వభువనములను మహత్త్వముచేఁ దిరస్కరించుచున్నాను. సత్యోపదేష్టలగు విద్వాంసులు నన్ను స్తోత్రములచే సంతస పెట్టుచున్నారు. మరియు దారుణశీలుడ నగు నేను భువనముల దద్దరిల్ల జేయుచున్నాను."

[17]"జను లెవనిని ఘోరు డందురో ఆ ఇంద్రు డెట నున్నాడు? జనులు ఇంద్రుడని యొకడు లేడందురు. ఆ ఇంద్రుడు భయిపెట్టి శత్రువుల డబ్బు హరించును. కాన నింద్రుని విశ్వసింపుడు. ఇంద్రుడు కలడని విశ్వసింపుడు."

---

15) ప్రసుస్తోమం భరత వాజయన్త ఇన్ద్రాయ సత్యం యది సత్యమస్తి, నేన్ద్రో అస్తీతి నేమఉత్వ ఆహ కఈం దదర్శ కమభిష్టవామ (8-100)

16) అయమస్మి జరితః పశ్య మేహ విశ్వాజాతా న్యభ్యస్మిమహ్నా, ఋతస్యమా ప్రదిశో వర్ధయన్త్యా దర్దిరో భువనా దర్దరీమి,

17) యం స్మా పృచ్ఛన్తి కుహసేతి ఘోరే ముతే మాహుర్నైషో అస్తీత్యేనం సో అర్యః పుష్టీర్విజ ఇవా మినాతి శ్రదస్మై ధత్త సజనాస ఇంద్రః (2-12-5)

ఈ సూక్తమువలన నా కాలమున నింద్రుని యెడ విశయము కలదని తేలును. వైదిక దైవములలో నింద్రున కత్యున్నత పదవి కలదు. అటులు విచికిత్సయుఁ గలదు.

[18]"యోధుడగు నా ఇంద్రుడు గొప్ప బలముచే జనుల సౌఖ్యము కొఱకు యుద్ధము లొనర్చును. ఎప్పు డింద్రుడు చంపసాధనమగు వజ్రముచే మేఘముల గొట్టునో అప్పుడే ప్రకాశవంతమగు నాతని యెడ విశ్వాసము కలుగును.

[19]"మిగుల గొప్పయగు నింద్రుని బలముఁ జూడుడు. ఏలన నీత డావులను గుఱ్ఱములను నోషధులను నీరిని వనములను సంపాదించెను. ఆతని బలము నెడ విశ్వాసము చెందుడు."

[20]ఇటులు పెక్కు లుదాహరింపనగును: ఈ పర్యాలోచనముచే మంత్ర కాలము నాటికే దేవతల యెడ సంశయబుద్ధి కలిగె ననవచ్చును. బ్రాహ్మణ సమయమునను, సూత్రకాలమునను ఇట్టి విచికిత్స కలదని సువిస్పష్టము. వేయేల? జ్ఞాన మెపు డారంభమాయెనో అప్పుడే ఈ విచికిత్స కారంభము. మంత్రములు కొన్ని యనర్థకములని పలువు రుద్ఘోషించినారు. వారి వాదము ఖండింప మహా సంరంభముతోఁ గొందఱు గ్రంథములు రచించినారు. అంతియ గాక, వారు స్వమతము నుపపాదింపనుగూడఁ బలు గ్రంథములు వ్రాసియున్నారు. మంత్రము లనర్థకములని ప్రతిపాదించు కౌత్సుని స్వనిరుక్తమునందు యాస్కుడు ఖండించినాడు.[21]

## సంఘర్షణము

నాస్తిక శబ్ద పరిణామమును రెండవ ప్రకరణమువలన నెఱిగియున్నాము కాలము గతించిన కొలది చార్వాకులును, బౌద్ధులును, అర్హతులును నాస్తిక

18) స ఇన్మహాని సమిధాని మజ్మనా కృణోతి యుధ్మ ఓజసా జనేభ్యః అథాచన శ్రద్ధతి ఇంద్రాయ వజ్రం నిధ నిఘ్నతే వధం (1-55-5)

19) తదస్యేదం పశ్యతా భూతిపుష్టం శ్రదింద్రాస్యధత్త వీర్యాయ, సగా అవిందత్ సోవిం దదశ్వాన్ స ఓషధీః సో అపః సో అవః స వనాని. (1-103-5)

20) చూ. ఋక్ 1-104; 6-8; 6-101; 10-2-2. Max-Muller's Lectures on the Religion. P.P. 140, 147-307-110.

21) అథాపిద మంత్రేణ మంత్రేష్వర్థ ప్రత్యయో న విద్యతే........ యది మాత్రార్థ ప్రత్యయాయ అనర్థకం భవతీతి కౌత్సః అనర్థకాహిమంత్రాః (నిరుక్తమ్ పూ. ప. 1-5-1)

మతము క్రిందఁ బ్రత్యేకముగా విభక్తులయిరి. ఆ మూడును ఒండొండ భిన్నము లయినను ఆ మూడు కలిసి నాస్తిక మతము అను శీర్షిక క్రిందికి రానవకాశము కలిగియున్నది. బ్రాహ్మణ, మంత్ర, ఉపనిషత్, సూత్ర, కాలములందు నాస్తిక మతము నుపపాదించు గ్రంథములు కానరావు. పురాణ కాలమునందు అట్టి మతము అందలి కథలయం దుపపాదింపబడియున్నది. పదపడి మాధవాచులు ఖండనమున కుపయుక్తములగు నంశముల నటనట నుండి యుద్ధరించుకొనినారు. పురాణకాలము నందలి నాస్తికమత కథనొండు ఉద్ధరించుచున్నాను.

[22]ధర్మజ్ఞుడును మహారాజునగు వేన మహారాజు సభలో బ్రహ్మ చిహ్న ధారియు, నగ్నుడును, మహాకాయుడును, నరసిన వెండ్రుకలు కలవాడును, చంకయందు నెమలి ఈకలతో గట్టిన చీపురుకట్ట దాల్చువాడును, టెంకాయ కమండలువు చేఁబట్టినవాడును, వేద శాస్త్రముల దూషించు మరుచ్ఛాస్త్రములను బఠించువాడును అగు నొక పురుషుడు ప్రవేశించెను. వేను డాపాపిని జూచి-ఇట్టి చిత్ర రూపమును దాల్చు నీవెవడవు? ఏల వచ్చితివి? ఈ వేసమేమి? నీ పేరేమి? నీ ధర్మమేమి? నీ పని యేమి? నీ వేదమేమి? నీ ఆచారమేమి? నీతియేమి? భావనయేమి? జ్ఞానమేమి? ప్రభావమేమి? ధర్మలక్షణమగు సత్యమేమి? అని ప్రశ్నలు వేయగా పాపు డిటులు నుడివెను: "ఇట్టి శంకలు వైచుచున్నావు. నీవు మహా మూఢుడవు. నేను ధర్మమునకు గుండెకాయను. నేనే జ్ఞానమను. నేను సత్యమను. బ్రహ్మమను. పెక్కేల? జీవరూపము ధరించిన నేను సర్వమును."

వేనుడు : నీ ధర్మమేమి? దర్శనమేమి? ఆచారమేమి?

పురుషు : జైనులు దేవతలు. గ్రంథాభావము గురువు. దయ పరమ ధర్మము. అదియే మోక్షము. ఆచారమేమనగా, యజనము, యాజనము, వేదాధ్యయనము. సంధ్య, తపస్సు, దానము, హవ్యము, కవ్యము, పితృతర్పణము, అతిథి పూజ, వైశ్వదేవము, కృష్ణ పూజ-ఈ మొదలగునవేమియులేవు. జినధ్యాన ముత్తమము. ఇది జైన ధర్మము.

---

22) పద్మ పురాణము - భూమిఖండ - 36 అధ్యాయ.

వేనుడు : ఇది యెల్ల వేద విరుద్ధము. నిక్కము చెప్పుము.

పురుషు : పంచతత్త్వములచే వృద్ధినొందిన శరీరమే ఆత్మ. ఇది వాయు స్వరూపము. వేదప్రోక్తములగు కర్మలకు దీనితో నేమి సంబంధము? నీరిలో బుడగ లెటుల పుట్టునో, అటులే భూతములు పుట్టును. భూమి రజః కణముల సముదాయము. [23]భూమియందుదకము పుట్టును. వెలుగుకూడ నచటనే కలదు. ఈ మూడిటిని వాయువు కదలించును. పిదప నాకాశ మావరించెను. పిదపడి బుడగలు పొట మరించుచున్నవి. అనగా జీవులు. ఉదక మధ్యమున ఒకానొక గుండ్రని తేజస్సు రెప్పపాటు కాలము కనువట్టి వెంటనే యెట్లు నశించునో, అటులు భూతసమాయోగమయి నశించుచుండును. అంత్యకాలమును నాత్మ యైదింటిలోఁ గలిసిపోవుచుండును. మానవులు మోహయుక్తులై తిరుగుదురు. అజ్ఞానముచే శ్రాద్ధమును పితృతర్పణమును జేయుచున్నారు. చచ్చిన వాడెచటనున్నాడు? ఎటులు తినును? శ్రాద్ధము పెట్టుటెవనికి? ఇది నిక్కమనుటకు ఎవడు చూచెను? అతిథి ఇంటికి వచ్చునో విందు చేయవలసినదియే. వేదములఁ బ్రతిపాదితమగు కర్మము దారుణమయినది. అశ్వమేధమున గుఱ్ఱమును, వాజపేయమున మేకను, రాజసూయమున అనేక ప్రాణులను, పుండరీకమున ఏనుగును చంపవలసినదని వేదములు చెప్పెడిని. ఇదియేమి కర్మము? అట నేమి ధర్మము? ఏమి ఫలము? వేద పండితులకు పశుమారణము ధర్మమా? ధర్మము నశించినది. దయలేని ధర్మమేమి ధర్మము? జీవపాలనము ధర్మము కాని మారణము ధర్మమా? స్వాహాకారము, స్వధాకారము, తపస్సు-వీనికేమి? వీని నన్నిటి నెప్పుడు బట్టిన నప్పుడు చేయనగును. దయాహీనమగు కర్మ నిష్ఫలము. దయ పీడుచో వేదము లవేదములు. దయాదానపరుడై జీవుల రక్షింపవలయును. అటులు రక్షించు చండాలుడైనను, శూద్రుడైనను వాడే బ్రాహ్మణుడు. నిర్దయుడేని బ్రాహ్మణుడు చండాలుడు. పొల్లు మాటలను చెప్పునది వేదము కాదు. జ్ఞానమునేవి నిర్వచించునో

---

23) చార్వాక దర్శనమున శరీరమునకు భూతచతుష్టయమే కారణమని కలదు.

యవియే వేదములు. దయాహీనులగు విప్రులయందును, అట్టి వేదము లందును సత్యములేదు. జిన ధర్మము భక్తి ముక్తి ప్రదాయకము. బహు పుణ్యదాయకమగు విషయమును నీకుఁ జెప్పుచున్నాను. తొలుత శాంత చిత్తముతో దయ నేర్చుకోవలయును. చరాచరాత్మకు డగు జినుని ధ్యానింపవలయును. అతనికి నమస్కారాదికము చేయ వలయును. తలిదండ్రుల పాదములకెపుడు నెఱగరాదు. ఇక నితరులకు మ్రొక్కఁగూడదని వేఱే చెప్పనేల ?

వేనుడు : ఈ విప్రులు గంగాది నదులను బుణ్యతీర్థములనుచున్నారు. నిక్క వము నా కెఱిగింపుము.

పురుష : ఓ మహారాజా ! మిన్నులనుండి మబ్బులు వర్షించుచున్నవి. గుట్టల మీదను, నేలమీదను, నీరు పడును. అది యంతయు నదులగు గదా ! నదులు, జల ప్రవాహములు, చెరువులు, సముద్రములు నంతియ కదా ! పర్వతములు ఱాతి గుంపులు కావా ? ఇవి పుణ్య తీర్థము లనియు పుణ్యక్షేత్రములనియు నెటులు ఒప్పుదల ! ఆ పుణ్య తీర్థములలో స్నానము చేయుచో సిద్ధి కలుగునెడల వానియందు ఎల్లెపుడుండు చేపలేల సిద్ధిఁజెందవు ? కాన నిది యంతయు నసత్యము. జీవుడే తీర్థము. జీవునియందే ధర్మముకలదు. తపో దానాదికమగు సమస్త పుణ్యము జీవునియందే కలదు. జిను డొకడే సర్వమయుడు. తీర్థాదులన్నియుఁ గల్పితములు. జినుడే ధ్యేయుడు.

ఇటులు బోధింపబడి వేనుడు పాపి యాయెను.

*　　　*　　　*

ఈ కథవలన నాస్తిక మతమున దయ ముఖ్యమని తేలుచున్నది. ఈ యహింసనే మూల సూత్రముగాఁ జేకొనిన నాస్తిక మతమును ఒక మతము క్రింద నిలువబెట్టి యద్వైతులు ఖండించుచున్నారు.

ఏ భూతమును చంపరాదు. జన్నమునఁ బశువును జంపవలయును. [24]అని వేదము లిజంతముతో శాసించుచున్నది. అయినను వేద మతమునకు

24) మా హింస్యాత్ సర్వభూతాని యజ్ఞాయ పశు మాలభేత.

అహింసయే మూలము కాదు. అదియే మూలమగుచో [25]గీతాధికము విరోధించును. అట్లని హింసచేయుమని గీతాభిప్రాయముకాదు. తన్మతమున [26]దయకూడ నంతః పాతిస్థైయున్నది. బౌద్ధమతమున అహింసయే పరమ ధర్మమని మూల సూత్రము. బుద్ధునకు జన్మమునందేని పశు హింసయెడ నంగీకారము లేదు. రామానుజులు కూడ నీ యెడ బుద్ధుని హృదయమును సమీపించెను. ఆస్తికు లందఱు బుద్ధుని అందువలననే బహిష్కరించియుందురు. ఆ మతమునఁ గాన బడు విశ్లథత్వము కూడ బహిష్కారహేతువై యుండెను.

## నాస్తికుల వలన లాభములు

పరిశీలించి చూచుచో, వేదములు స్మృతులు (పురాతనములు) నేటి సంఘ సంస్కార పరాయణు లెంత సంస్కారములు కావలయునని తలచుచున్నారో, యంతకు మిక్కుటముగాఁ గూడ ననుజ్ఞ యిచ్చుచున్నవి. కలియుగమునందు నిషేధించిన ధర్మముల నన్నిటి బరిశీలించుచో నీ విషయము తేటతెల్లము కాగలదు. ఈ విషయముల కడ్డు దవిలిన వారు బౌద్ధులు. వారి ప్రచార మెక్కుడైన కొలది పురాతనాచారములు మార్పవలసివచ్చెను. బౌద్ధులకును బురాతనాచారపరాయణులకును మితిలేని వైరము పొసగెను. బౌద్ధు లహింసాధర్మ నిబద్ధులు. పురాతనులో అంతగా గారు. అనగా 'ఒక దవడమీదఁ గొట్టుచో రెండవ దవడను జూపించువారు' కారు. 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయువారు కూడ' నగుదురు. కాని క్రోధమును దీర్చికొనక మానువారు కూడ గారు. వారికిని వీరికిని ప్రబల వైర మున్నటులు 'హస్తినా తాడ్యమానోపి న గచ్ఛేజ్జినమందిరమ్' (ఏనుగుచే త్రొక్కింపబడినను జినాలయమునకు (జన దగదు.)లో నగు వాక్యములు నేటికిని విద్వాంసుల నాలుకలపై దాండవించు చున్నవి.

యాజ్ఞవల్క్యస్మృతి, అర్థశాస్త్రము, గౌతమ స్మృతి, మనుస్మృతి మొ॥ వానియందు వర్ణాంతర కన్యా వివాహము విహితమైనది. ఆదిత్య పురాణము,

25) గీతాభిప్రాయము యుద్ధమొనర్చుటతో తుదకు పర్యవసన్నమైనది.

26) అహింసా సత్య మక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునమ్, దయాభూతేష్వలో లుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్. (16-2)

బృహన్నారదీయము మొదలగునవి ఆ ధర్మమును కలి వర్జ్యములని ప్రతిపాదించెడిని. కావున నీ స్మృతులు ఆ స్మృతుల కంటె నిటీవలివనుట నిశ్చయము. క్రీ.శ. 8 వ శతాబ్దిదాక బ్రాహ్మణులు వర్ణేతర కన్యా వివాహము, మద్యపానము, మాంసాహారము, విధవా వివాహము, ప్రౌఢా వివాహము మొదలగు నాచారములు పాటించువారని నిశ్చయింపఁ గొన్నియుద్గ్రంథములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఆ కాలమున వర్ణేతర స్త్రీలయందు కలిగిన సంతానమునకు వారు బ్రాహ్మణ్యమును[27] ప్రసాదించుచుండిరి. ఇంతేకాక బ్రాహ్మణుల కాయబ్రాహ్మణ పుత్రులు దశపేయాది యజ్ఞ కర్మములయందు ఆర్త్విజ్యమును గూడ జేయువారు. ఈ విషయమును ద్రాహ్యాయణుడును,[28] ఆపస్తంబుడును[29] గూడ వక్కాణించి యున్నారు. అది యటుండె. ఇక కలి వర్జ్యముల విచారింతము.

## బృ హ న్నా ర దీ య ము న

సముద్రయాన మొనర్చిన వానిఁ జేర్చికొనుట, కమండలు ధారణము, వర్ణేతర స్త్రీ వివాహము, మఱదివలన పుత్రోత్పత్తి, మధుపర్కము నెడఁ బశువధ, శ్రాద్ధమున మాంసభోజనము, వానప్రస్థము, దత్తాక్షతకన్యను కొండొకని కిచ్చుట, దీర్ఘ బ్రహ్మచర్యము, నరమేధాశ్వమేధములు, మహాప్రస్థానగమనము, గోమేధము, మఖము, బ్రాహ్మణుల యిండ్ల శూద్రపాకము-ఈ మొదలగునవి నిషిద్ధములు.

## బ్ర హ్మ పు రా ణ ము

పునర్వివాహము, జ్యేష్ఠాంశము, గోవధ, భ్రాతృజాయ, కమండలువు, విధవకు పుత్రుడు పుట్టుటకై మఱదిని నియోగించుట, బాలికనుగాని అక్షత

---

27) గౌతమస్మృతి 4-22.24 చూ.

28) 'తే దశమాత్పూర్ధశ పిత్రూ నిత్యన్వాఖ్యాయ ప్రసర్పేయు రాదశమాత్పురుషాదితి హ్యాహ : యద్యబ్రాహ్మణీ మధిగచ్ఛేయు-ర్బ్రాహ్మణ్యై వాభ్యాసం దశసంపూరమేయుః । అస్మ రంతశ్చ యతః స్మరేయుః — శ్రౌతసూత్రమ్.

29) ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వాపూర్వం వర్ణమాపద్యతే జాతి. పరివృత్తౌ (5-11-10) అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే జాతి పరివృత్తౌ. (5-11-11).

యోనినిగాని మరొకని కిచ్చుట, వర్ణేతర స్త్రీ వివాహము, అతిథి పితృదేవతల కొఱకు గోవధ మొనర్చుట-వీనిని నిషేధించుచున్నది.

ఈ వర్జ్య ధర్మములన్నియు ప్రాచీనానుష్ఠితములని సువ్యక్తము. ధృష్టుడు, రథీతరుడు, అగ్ని వైశ్యుడు, యౌవనాశ్వుడు, కపి ముద్గలుడు, హర్యశ్వుడు - ఈ మొదలగువారి కొమారులు క్షత్రియులైనటులును పిదప బ్రాహ్మణులయి గోత్రకారులుగా కూడ నయినటులును విష్ణు పురాణము రెండవ యంశమునఁ జూపబడెడిని. దీని నంతయు వెరసిచేసి చూచుచో, వర్ణ వ్యవస్థ నేటివలె ప్రత్యభివృద్ధికిని ఆతంకముకాక మనుజునకుండవలయు సర్వ స్వాతంత్ర్యమునకు ఊతకోలగా నున్నదని గ్రహింపవీలగుచున్నది. కొంతకాల మీరీతి బోవగా గట్టుదిట్టము లేహేతువు చేతనో యెక్కుడయినవి. ఆ ప్రాచీ నాచారముల నెవ్వరో యడ్డియుందురు. ఆ ఆతంకమువలన భరతఖండమంతయు నచలాయతన మయిపోయినది. ఇపుడు మన ప్రాచీనాచారముల నడ్డినవానిని గూర్చి విచారింపవలసియున్నాము.

## కల్కి పురాణము

మహాభారత యుద్ధాంతకాలమందు సహభోజనములందును, వివాహ సంబంధములందును ఒండొండచిర మైత్రికల బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలోఁ జాలమంది ప్రాణి హింసనముకల యజ్ఞాది క్రియలనుండి విముఖులై, బహు భార్యా వివాహమునే కాక ఏకపత్నీ వివాహమును కూడ ఎడచి, మాంస మద్య నిషేవణమును బరిత్యజించి, నూతనముగా జైనమతమను నొక మతమును గల్పించి జైనులైరి అని కలదు. దీనిని బట్టి చూడగా ఈ జైనులే పూర్వా చారములు పరిత్యజించి నవీనాచారముల నెక్కొల్పినటుల సువిస్పష్టము. బుద్ధుని ధర్మముల గూర్చి చెప్పు నవదాన కల్పలత 'వివాహః కామాయతనమ్' (పెండ్లి కామమున కిల్లు) 'మద్య మాంస నిషేవణమ్ రాగ మోహ హేతుః' (మద్యమాంస సేవ రాగ మోహములకు కారణము) 'ధనం లోభకారణమ్ (ధనము లోభమునకు మూలము) అని వీనిని నిషేధించిరి. పరోపకారము, మాతా పితృశుశ్రూష, గవాది పశుసేవ, అనాథజన సహాయము, పేదఱిమి, సన్న్యాసము - ముఖ్య ధర్మములని ధమ్మపదము చెప్పుచున్నది. ఈ ధర్మములన్నియు జైన బౌద్ధ

నాస్తిక సాధారణ ధర్మములు. గతాను గతికములుగా వచ్చు ప్రాచీనాచారములఁ దొలగించుకొని, ఈ ధర్మముల నెలకొలుపుకొని, జైనాది నాస్తికులు ప్రాచీ నాచార పరాయణ సంఘము నుండి వేఱుపడి బాహ్యులయి క్రమముగా వారి మతముఁ బెంచికొనిరి. ప్రతి మతమునకు అభివృద్ధి నొంద కొంతకాల మావశ్య కముగాన బెరిగి బెరిగి బుద్ధునిచేతను జైనునిచేతను తుదకు ప్రతిష్ఠాపితము లయినవి. వైదిక మతాధిక్యము వారల కాలమునఁ బోవునటులు కానిపించెను. హింస, విధవా వివాహము, మద్యపానము, మాంస నిషేవణములఁగూర్చి బౌద్ధులు చేసిన దూషణములవలన వారు మేలుకొనిరి. "ధర్మపరీక్ష"యను గ్రంథమున అమితగతి యనునొక బౌద్ధుడు:

"మాతా వివాహ్యమానా స్వావరేణాన్యేన వీక్షితా
వినివేద్య స్వసంబంధం మయా పృష్టాస్తపోధనాః
ఆచక్షత నదోషోస్తి పరేణాస్యా వివాహనే
ద్రౌపద్యాః పంచభర్తారః కథ్యన్తే యత్ర పాండవాః
జనన్యాస్తవ కోదోష స్తత్ర భర్తృద్వయే సతి
ఏకదా పరిణీతాపి విపన్నే దైవయోగతః
భర్తర్యక్షతయోని స్త్రీస్స పునస్సంస్కార మర్హతి
ప్రతీక్షేతాష్టవర్షాణి ప్రసూతా వనితా సతీ
అప్రసూతాత్ర చత్వారి ప్రోషితే సతి భర్తరి
పంచ స్వేషు గృహీతేషు కారణేసతి భర్తృషు
నదోషో విద్యతే స్త్రీణాం వ్యాసపీనా మిదం వచః"[30]

[ఓ తపోధనులారా! నా తల్లి ఇంకొకని బెండ్లియాడుచున్నది. దోషము కలదేని తెలుపుడు. ద్రౌపదికి పాండవు లైదుగురు భర్తలు. ఇరువురైన యెడల నీ తల్లి కేమి దొసగు? ఒకతూరి పెండ్లియైనను దైవికముగా భర్త చనిపోయినచో అక్షతయోనియగు స్త్రీకి పునర్వివాహము విహితము. భర్త పరదేశమేగుచో సంతుకల యాడది యెనిమిదేండ్లును, లేనిది నాలుగేండ్లును ఎదురు చూడవల యును. కారణ పురస్సరముగా నీ యైదుగురు భర్తల యెడ స్త్రీలకు దోషము

30) ఈ అర్థముకల పద్యములు వేమన్నవి ఆంధ్రలోకమున వాడుకలో నున్నవి.

[illegible] పరికిరి. అని ప్రాచీనాచారముల నిందించినాడు. ఈరీతిగాఁ
[illegible] చున్నారు. ఆ కాలమున నీయాచారములను
[illegible] క్షులలో జైనులుగనో మాఱిపోయిరి. వారు వేదముల గూడ
[illegible] మద్య మాంసనిషేవణము మానిరి. బహుపత్నీ
[illegible] ఏకపత్నీ వివాహము, విధవా వివాహమును గూడ బోనాడిరి. జనుల
[illegible] వారి మీద విశ్వాస ముదయించెను. ప్రాచీను లేమి చేయుదురు ?
[illegible] పరిష్కరించుకొనవలసి వచ్చినది. పురాతన దురాచారముల
[illegible] ఆ కాలమునకుఁ దగినటులు వేదశాస్త్రములకు వ్యాఖ్యానములు వ్రాసి,
[illegible] స్మృతులను, పురాణములను రచించుకొని ప్రచ్ఛన్నబౌద్ధులయి
[illegible] వేదములను రక్షించుకొనిరి. కలి వర్జ్యధర్మము లన్నియు క్రీ. శ.
4 [illegible] శతాబ్దినుండి ఆచరణములోనికి వచ్చినవి. ఈ విషయము స్ఫుట
[illegible] సూత్రములందును, స్మృతులందును, భాష్యములందును జూపట్టుచున్నవి.

ఈ పర్యాలోచనము మనలఁ దాఱుమాఱొనరించుచున్నది. ఏలన, నేటి
[illegible] ఆస్తికుల మనుకొనువారు ఏ ఆచారముల ననుష్ఠించుచున్నారో వానికి
నాస్తికులు మార్గదర్శకులని యొప్పుకొందురా ? నేటి సంఘసంస్కర్తలు నాస్తికు
[illegible] యాచారములకు విరోధులని చెప్పిన విశ్వసింతురా ? కాని గ్రంథముల పరి
శీలించినచో నాస్తికులే మార్గదర్శకులని దృఢ ప్రమాణములు కానిపించు
చున్నవి. విచారింపగా నేటి యాస్తికులే పురాతన వేదస్మృతి విరుద్ధ వర్తనముల
[illegible] వారనియు, నేటి సంఘ సంస్కర్తలే పురాతన స్మృత్యనుయాయు
[illegible] వేఱకమానదు. తెన్నుగాఁ బరిశీలనము చేయనిచో నిది తలక్రిందులుగా
[illegible] తీరును. నాస్తికు లీ విధముగా సంఘమునకుఁ బవిత్రత్వము దెచ్చి
యున్నారు. ఈశ్వర సద్భావము మాత్రము వారికి గిట్టదు.



# 2. ప్రాచీన భరతవర్షమునందు శూద్రులకు గల యధికారము

[విశ్వభారతి త్రైమాసిక సంపుటిలో పండిత విధుశేఖర భట్టాచార్యులవారి వ్యాసమునకు అనువాదము.]

[ఈ వ్యాసమునందు ముఖ్యముగా శూద్రులకును దక్కిన వర్గముల వారికిని వైదిక కర్మలందుగల యధికారమును గురించి విచారింతము.. ప్రాచీన భరతవర్షమునందు వ్యాప్తమైయున్న వర్గ పద్ధతికి సంబంధించిన విషయము లానుషంగికముగా నెంతవఱకుఁ దెలియునో యంతవఱకే మన మిందు దృష్టిపడవలసియున్నాము.]

ప్రథమ ప్రశ్న యిది: వైదిక కర్మలందు శూద్రు లధికృతులా? 'ఔను' అని ప్రత్యుత్తరించువాడు బాదరి యను[1] ఆచార్యు డొక్కడే! ఆతడు 'యజేత' అను విధి (యజ్ఞముచేసి తీరవల్లయును) యజ్ఞము చేయగోరు నెవనికేనియు చెల్లు నని చెప్పుచున్నాడు. ఏలనగా, నిష్కృష్టమగు నిషేధ విధి లేమి జేసి పై విధి శూద్రులను వెలివేయదు. మరియు అతడు భిన్నముగా అభిప్రాయపడిన అత్రే యుని [2]ఖండించి వర్ణ వివక్ష లేకయే ప్రతివానికిని యజ్ఞాధికారము కలదని తేల్చినాడు. (మీమాంసా సూత్ర, 6-1-27)

ఇటులు సిద్ధాంతించి బాదరి శూద్రులకు గూడ వేదశాస్త్రాధ్యయనమున నధికారము కలదని అవశ్య మంగీకరించెను. శబరస్వామి బాదరి యభిప్రాయ ములను సంకలించి చెప్పిన వాక్యమువలన ఈ విషయము విస్పష్టమయ్యెడిని. (మీమాంసా సూత్ర, 6-1-27. 29) కావున ప్రతివానికి వేదాధికారము కలదని

---

1) బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణునికంటె నీతడు సాక్షిచ్చుచున్నాడు (4-4-10-13)

2) జైమిని అధారమున (మీమాంసా సూత్ర. 6-1-25-38) కాత్యాయనుడు (శ్రౌత సూత్ర. 1-9-6) అపస్తంభుడు (యజ్ఞపరిభాషా సూత్ర. 1-2)

బాదరి అభిప్రాయము పడెననుట విస్పష్టము. పై విషయము వలన బాదరి మతము శూద్రులకు ఉపనయనాధికారముకూడ కలదని తేలుచున్నది. ఏలన, వేదాధ్యయనము వినా యజ్ఞాదిక్రియలు విధి యుక్తముగా నెఱవేర్పబడజాలవు. చిట్ట చివర ఈ విషయమునకు వర్తము.

ఇదియంతయు కేవలము భావనయా? లేక, నిక్కముగా ఆచరింపబడెనా? అని మునిముందు తెలిసికొనుట ఇంతకంటె ఎక్కువ కుతూహలము కలుగును. ఆదరణమునకు గూడ సాక్ష్యము కలదని మనము కనుగొందుము. శూద్రులు కూడ వైదిక కర్మలలో భాగస్వాము లైరను సిద్ధాంతము దెస విచ్చలవిడిగా ప్రవహించు వేదవాక్యములు కలవని శబరుడును (మీ. సూ. 6.1.25-28) కర్కుడును (కాత్యాయన శ్రౌత సూత్ర 1.1.6) చెప్పిరి. ఒక ఉదాహరణము: దర్శపూర్ణమాసయందు హవిష్కృత్తు (ఆహుతి సిద్ధము చేయువాడు) బ్రాహ్మణుం డాయెనేని 'ఏహి' అనియు, క్షత్రియు డాయెనేని 'ఆగహి' అనియు, వైశ్యు డాయెనేని 'అద్రవ' అనియు, శూద్రు డాయెనేని 'ఆధావ'[3] అనియు ప్రేషయీయవలయునని ఆదేశము కలదు. (శతపథ బ్రాహ్మణ 1-1-4-2)

ఇంకొకటి. ఒకానొక వైదిక వ్రతమునందు శూద్రుడు పులి పెరుగును ఆహారముగా గొనవలయును. (శాబర భాష్య. మీ. సూ. 6, 1.31 మరియు కర్కభాష్య మీ. సూ. 1.1.5.1) పవిత్రమగు సోమము శూద్రులకు గూడ కలదని తరువాత గనుగొందము. సోమపానమున వారికి తప్పక అధికారము కల దని ఈ వాక్యమువలన గ్రహింపనగును. బ్రాహ్మణులనియు క్షత్రియులనియు వైశ్యులనియు శూద్రులనియు నాలుగు వర్ణములవారు కలరు. వీరిలో నెవరును సోమమును ఉమియరు. (శతపథ బ్రాహ్మణ 5.5.4.9) శూద్రు లొకానొక సోమయాగమున కధికారులని ఇది తెలుపకుండునా?

---

3) ఈ పదములన్నియు ఏకార్థబోధకములైనను గౌరవభేదమునకు సూచకములుగా గానిపించును. ఏహి = రమ్ము, ఆగహి = ఈవలికి రమ్ము; అద్రవ = వడిగా రమ్ము; ఆధావ = పరుగెత్తి రమ్ము - ఇటుల అర్థమిచ్చుచుండుటజేసి ఆయా యీ వర్ణములవారు అటులే వెళ్లియుందురో, లేక గౌరవ మాత్రభేదకమో ఆరయవలయును - ఈ ఉద్దేశ్యము కేవలము నాది.

ఇట్టి వాక్యములు శూద్రులకు గొంతయేనియు పవిత్రమగు వేదకర్మల యందు అధికారము కలదని తేట పఱచును. అయితే వేదకర్మలయందు అగ్రత్రైవర్ణికులకే భాగము కలదని వాదించు జైమినియు (మీ. సూ. 6-1) ఇతరులును ఈ బాదరి మతమును సంపూర్ణముగ త్రుంచివైచిరి. అయినప్పటికిని వీరు ప్రత్యేకముగ ఇరువురి విషయములో కొంత వైదిక కర్మాధికారమును నిష్కాపట్యముగ అంగీకరించిరి. ఈ ఆచార్యుల మతము ననుసరించి వీరిరువురును అగ్రత్రైవర్ణమునకు జెందినవారు కారు. వీ రనార్యు లనియు ముందు మన మెఱుగగలము.

అందు మొదటివారు సంహితలయందును, బ్రాహ్మణములందును[4] పలుమార్లు చెప్పబడిన రథకారులు (రథము చేయువారు) అగ్న్యాధాన ప్రసంగమున రథకారుడు వానకాఱున అగ్నినాధానము చేయవలయునని కలదు.[5]

## రథకారులు

ఇక రథకారులన నెవరు? అగ్ర త్రైవర్ణికులయందు రథములు చేయు వృత్తిగలవారు. రథకారులని తమ కనుకూలముగ ఛాందసులగు ఆచార్యులు (Orthodox Teachers) సులభముగ వాదింతురు. ఇట్లనుచో వారికి అగ్న్యాధానమునెడ శంకయే లేకపోవును. కాని అట్టి యర్థ ముపాదేయము కాదని గ్రహించుటకు వారికి జ్ఞానమునెడ భక్తిగలదు. అందువలన రథకారుల నిజస్థితి యెట్టిదో నిరూపింపవలసిన ఆవశ్యకత ఉదయించెను.

శూద్రవర్ణమునకు సంబంధించిన కరణమాతయందు జనించి శూద్ర స్త్రీ సంబంధము పడయుటవలన రథకారుడు శూద్రుడని కర్కుడు పరిగణించుచున్నాడు. (కాత్యా. శ్రౌ. సూ. 1-16)అగ్ర త్రైవర్ణికులకు సవర్ణ భార్యలందు

4) అథర్వ 3.5.6; కాఠక 17.13; వాజ 16.17; 30.61; తైత్తి 1-1. 48. 3.4.2.1; శతపథ బ్రాహ్మణ 13.4.2.17.

5) అగ్ర త్రైవర్ణికుల అగ్న్యాధాన విధినిగూర్చి తైత్తిరీయ బ్రాహ్మణమున (1.1.2,7 కలదు. ప్రాచీన వ్యాఖ్యాతలగు శబరునిచేతను (మీ. సూ. 6.1.44) కర్కునిచేతను (కాత్యా. శ్రౌ. సూ. 1.1.9) పలుమాఱు ఉదాహరింపబడినది. కాని రథకారుని అగ్న్యాధాన విధి తెలుపు వాక్య మందు గానరాదు.

జనించిన కుమారులుగాని లేక తరువాతి తక్కువ వర్ణమునందు (అనంతర) జనించిన కుమారులుగాని తండ్రి వర్ణమునకు చెందుదురని బోధాయనుడు చెప్పుచున్నాడు (ధర్మ. సూ. 1-8-6).

ఇటులు బ్రాహ్మణునకు బ్రాహ్మణి యందుగాని క్షత్రియ యందుగాని జనించిన కుమారుడు బ్రాహ్మణుడనియు, క్షత్రియునకు క్షత్రియయందుగాని వైశ్యయందుగాని జనించినవాడు క్షత్రియుడగుననియు జెప్పి, వైశ్యునకు శూద్రి యందు జనించినవాడు రథకారుడని చెప్పినాడు. (1-9-5)

ఇక ఈ విషయమునగూడ బోధాయనునిచే వక్కాణింపబడినట్టియు, గౌతమ పురస్కృతమయినట్టియు (4-16) పద్ధతినే మన మంగీకరించితిమేని రథకారుని వైశ్యునిగా అంగీకరించి తీరవలయును. ఇటులుకాగా, అగ్న్యాధాన ముతో కలిపి వైదికకర్మలందు అతడు భాగస్వామియగుట నిర్వివాదము. కాని అటు లంగీకరించునో చాల చిక్కులు కలుగును. ఏమన, రథకారు లగ్రత్రైవర్ణము లోనివారే యగుదురేని అగ్రత్రైవర్ణమునకు చెందు సూత్రముచేతనే సరిపోవు చుండగా వారి యగ్న్యాధానము కొఱకు ప్రత్యేకముగా నొక సూత్రమును విధింప తైత్తిరీయ బ్రాహ్మణమున కక్కఱయేమి ?

అయితే మనువు నవీనాచార్యుల ననుసరించి పై నుదాహరించిన ప్రమాణముల నుండి తొలగినాడు. అగ్ర త్రైవర్ణికులకు అనంతర వర్ణ భార్యలందు కల్గిన పుత్రులు తమ తండ్రులతో సవర్ణులుకాక తద్వర్ణమువంటి వర్ణమునకు (సదృశ)చెందుదురని మను విటులు చెప్పెను. (10.6) అవ్యవహిత వర్ణజాతీయలగు భార్యలయందు జనించినవారు మాతృదోష విగర్హితులు కాన [6]తమ తండ్రుల వర్ణమునకు సదృశమగు వర్ణమునకు జెందుదురు. మఱియు 'ప్రాచీనాచార్యులు వారిని తమ తల్లుల వర్ణమునకు జెందుదు రన్నారు.' అనియు పైని వ్రాసెను. వారు తమ తల్లులకు చెప్పబడిన సంస్కారములకు మాత్రమే అర్హులని వ్యాఖ్యాతలు వ్రాసిరి.

దీన్నిబట్టి రథకారుడు శూద్రవర్ణమునకు చెందినవాడు. (ఇతడు యాజ్ఞవల్క్యుని మతమున మాహిష్యజనకునకును కరణమాతకును జనించినను లేక

6) వీరు తమ తల్లుల వర్ణముకంటె నెక్కువయు, తండ్రుల వర్ణముకంటె తక్కువయు అగు వర్ణమునకు జెందుదురని మేధాతిథి వ్యాఖ్యానము.

బోధాయనుని మతమున వైశ్యజనకునకును శూద్రమాతకును జనించినను) ఇటు లాతడు ద్విజాతులకు జెందడు. కావుననే యతని కపూర్వముగా అగ్న్యాధానము విధింపవలసి వచ్చినది.

మీమాంసా సూత్రములకు వ్యాఖ్యాతృ శిరోమణియగు శబరస్వామి రథ కారు లగ్రత్రైవర్ణ్యమునకు పూర్తిగా వేఱయినట్టియు, అగ్రత్రైవర్ణికులకు కొంచెము తక్కువ అయినట్టియు, క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములకును వేఱయి నట్టియు, [7]ఒకానొక వర్ణమునకు జెందుదురనియు, కావుననే వారి కగ్న్యాధానము ప్రత్యేకముగా విధింపవలసి వచ్చినదని (6-1-50) ఇంకొక నడిమిత్రోవ త్రొక్కినాడు. తైత్తిరీయ బ్రాహ్మణము (1-1-48) రథకారుల నగ్రత్రైవర్ణి కులతో గలిపి చెప్పుటచే రథకారులకు శూద్రులకంటె నగ్రస్థానము కలదని స్పష్టము.

వారి అసలు వర్ణము ఏదేనియగుగాక, రథకారులు ద్విజాతులలో చేరరనుట విశదము. ఐనను వారు అగ్న్యాధానమునకును దానికి సంబంధించిన క్రియలకును అర్హులు.

## ని షా దు లు

ఇక నిషాదులను గురించి తెలిసికొందము. ఆత్మ వర్ణజాతుడగు నిషాద స్థపతి (నిషాదులలో పెద్ద) రుద్రునకు సంబంధించిన ఒక వైదిక క్రతువునకు అర్హుడని ఒక బ్రాహ్మణమునందు (జైమిని 6.1.15) మఱియు కాత్యా 1-1-12 శబర కర్కులును కలరు.

సంస్కృతమునందును పాళియందును ప్రాకృత వాఙ్మయమునందును అడవి బోయలుగా చెప్పబడిన చందమున ఈ నిషాదులు నిస్సంశయముగా అనార్యులు. మఱియు పై బ్రాహ్మణమునందే నిషాదస్థపతి ఆధ్వర్యుల కిచ్చు దక్షిణ పిట్టలబట్టు బోను (కూట) అని చెప్పబడినది. ఆ బోను ఆర్యులకుగాక

7) ప్రకృత ముద్రణములలో కానరాకున్నను బ్రాహ్మణులు కూడ కారని అందులోనే యున్నది.

నిషాదులకు మాత్రమే యుపయుక్తమగునని శబరస్వామి చెప్పుటచే నిషాదులార్యులకంటె సాక్షాద్భిన్నులనుట సిద్ధము. (మీ. సూ. 6-1-52)

ఐదుగురు పురుషులు లేక యైదుగురను నర్థమున వేదములందు (మంత్ర భాగమున) 'పంచజనాః' అని సమస్త పదముకాక సహచరములగు రెండు నిత్య బహువచనాంతములగు పదములు తఱచుగా దగులుచుండును. కొన్నిచోటుల 'జనాః' అను పదమునకు బదులు 'మానుషాః[8], మానవాః[9], కృష్టి[10], చర్షణి[11] అను పదములును వచ్చును. ఇవన్నియు బహువచనాంతములు. వీనికి జాత[12] అను పదమునుగూడ జేర్పనగును. ఇదియు బహువచనాంతము. వ్యాఖ్యాతల ననుసరించి ఈ శబ్దముకూడ తదర్థబోధకమే.

ఈ యైదుగు రెవరనునది ఇంకను సరిగా నిర్ధారింపబడని విషయము.

యాస్కుని నిరుక్తమున (3-8) రెండు విధములుగా వ్యాఖ్యాతమైనది. కొందఱ మతమున ఏకే[13] వారు గంధర్వులు పితృదేవతలు దేవతలు అసురులు రాక్షసులనియు, ఇక ఔపమన్యవుని మతమున నాలుగు వర్ణములవారును మిగిలిన నిషాదులును కలిసి ఐదుగురగుచున్నారు.

పాశ్చాత్య పండితులు 'వేదిక్ ఇండెక్సు' గ్రంథకర్తలు కూడ పై రెండర్థములును సందర్భముగా లేవని తలచుచున్నారు. వారిలో వారి యభిప్రాయములు కూడ చాల భిన్నములు. తూర్పు దక్షిణము పడమర ఉత్తరముల నున్న జనులును, మధ్యనున్న ఆర్యులును కలిసి ఐదుగురు (పంచజనాః) అని రాత్ గెల్డ్నర్ (Roth Geldner) అను వారి మతము. ఆర్యులకు దాసులకు తరచుగా చేసిన విభాగమును బట్టి అనార్యులకు 'జనాసః, మానుషాః' అను పదములు చెల్లవు కావునను, ఐదు వర్ణములకు సోమము సంబంధించు గావునను ఆ యైదు వర్ణములు సరస్వతీ నదీ తీరమున నివసించుచున్నటులు చెప్పబడె గావునను,

---

8) ఋక్ 8.9.2, 9) అథ 3-21-15, 10) ఋక్ 1-7-8 11) ఋక్ 5-56-2 12) ఋక్ 6-61-12.

13) ఇది కొందఱ మతమని యాస్కుని అభిప్రాయమైయుండగా ఇది యాస్కుని మతమేయని యాతని కంటగట్టుట వేదిక ఇండెక్సు గ్రంథకర్తల పొరపాటు. విచారింపగానిట ఔపమన్యవుని మతమే యాస్కాభిప్రేతము.

మఱియు ఇంద్రుడు పాంచజన్యుడని (ఐదు వర్ణములకు సంబంధించినవాడు) యుండె గావునను ఈ 'పంచజనాః' అను పదమునకు ఆర్యులనియే యర్థమని జిమ్మరు (Zimmer) పై వారిని ఖండించుచున్నారు (Vide Index A).

ఎంత ఆలోచించినను యాస్కుడుదాహరించిన 'ఏకే' మతము యోగ్యమైనది కాదనుట నిర్వివాదము. మనకు దెలిసిన ఏ వేద వాక్యములలోను దాని కాధారము దొరకదు. నిఘంటు కాండలలో (2-3) మనుష్యునకు పర్యాయ పదముగా (వాచకముగా) ఈయబడిన 'పంచజనాః' అను పదమువలననే మానవ మాత్రులేయని అర్థము విశదమయ్యేడినిగాని గంధర్వాసుర రాక్షసులని కాదు. ఇటులుండగా సమాన పదములగు 'పంచమానవాః, పంచకృష్టయః'-అనునవి మనుష్యుల ఐదు వర్ణములను నర్థమున స్థిరముగా వాడబడినవి. డాక్టర్ లక్షణ సరూప్ అనువారు[14] ఖండారంభమునందు (3-8) యాస్కునిచే ఉదాహరింపబడిన సూక్తమున (ఋక్ 53.4) ఐదు జాతులవారు (పంచజనాః) యజ్ఞమునందు భాగము పుచ్చుకొన ఆహూతులైరనియు, ఆ ఆహ్వానము రక్షః పిశాచకముల కని ఊహింపరానిదనియు, ఇంతియకాక మొదటి అర్ధపాదము నిస్సందిగ్ధముగా 'రాక్షసుల నభిభవింతముగాక' అని చెప్పుటచేతను, పంచజనాః-అనగా ఐదు వర్ణములవారేయని కొండొక హేతువును సముచ్చయించుచున్నారు.

ఔపమన్యవుని మతముగా ఎత్తబడిన రెండవ యర్థమును మొదటిదానివలె అనర్హమని యేల త్రోసి వేయబడినదో మాకు దురూహము. ప్రత్యుత మాకు అదియే సహేతుకముగను సహజముగను కానిపించుచున్నది. ఎటులేని నిషాదులనార్యులగుటచే దేనియం దార్యత్వము గుంఫితమైయున్నదో అట్టి చాతుర్వర్ణ్యమున వారికంటె భిన్నులని పైని చెప్పబడిన శబరుని యుద్దేశమును ఇది ధ్రువపరచుచున్నది.

శూద్రులును నిషాదులును పై మూడు వర్ణములవారితోపాటు చాల వైదిక కర్మలందు భాగస్వాములనియు ఔపమన్యవుని మతమున విశదమగుచున్నది. ఉదాహరణము: వేద మంత్ర భాగమున (Text) ఐదుగురు జనులు

14) వారి ఆంగ్లీకృత నిఘంటు నిరుక్తములయందు చూ. పుట 233.

యజ్ఞార్హులనియు (ఋక్, 10-45-6) అగ్ని ఐదుగురు జనులకు సంబంధించిన [illegible] (ఋక్, [illegible]; అధ 4-23-1) మఱియు వారు అగ్నికి హవిస్సు [illegible] (ఋక్ [illegible]) పవిత్రమగు సోమము ఐదుగురిలో నివసించు [illegible]. వారి యజ్ఞాయతనములోనికి వచ్చుననియు (ఋక్, 9-65-23) మరియు [illegible] సరస్వతీ నది వారిని (ఐదుగురిని) వర్ధిల్లజేసెననియు విస్పష్టముగా చెప్పబడినది.

వాజసనేయ సంహితలోని పాంచజన్యపద వ్యాఖ్యానమున ఉవ్వట మహీధరులు కూడ ఆ యీ ఐదుగురు వైదిక కర్మల కంగీకృతులని స్పష్టముగా [illegible].

ఉవ్వటుడు: 'పాంచజన్య' అనగా ఐదుగురికి మేలు కూర్చువాడని యర్థము. ఐదుగు రెవరనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నలుగురును, నిషాదుడైదవవాడు. నిషాదు లెటులగుదురంటేని వారికిని యజ్ఞార్హత కలదు. మహీధరుడు: పంచజనులనగా బ్రాహ్మణులు మొదలుకొని నాలుగు వర్ణముల వారును, నిషాదులును కలసి. ఏలయన, నిషాదులకును యజ్ఞార్హత కలదు.

శబరాది యుద్దేశ్యములతో కలిసి పై విషయములు ఆర్యులగు నాలుగు వర్ణముల వారికిని నిషాదులకును ఒకానొక అత్యంత మైత్రి కలదని తేట తెల్లముగా నిరూపించును. ఈ దిగువది కూడ నీ అభిప్రాయమునే దృఢపరచును. విశ్వజిద్యజ్ఞము చేసినవాడు (దిగ్విజేత) అవభృథమగు పదపడి మూడురే లొక యవనిలో నివసించి, పిదప మూడు రేలు నిషాదులతో నివసించుచు (పంచవింశ బ్రాహ్మణ, 17, 6.3.9) అపుడు నిషాదుల నుండి నెవ్వరి బ్రాలుగాని, నెవ్వరి యన్నముగాని, దామలుగాని దామ యన్నముగాని, అడవి జంతువుల మాంసము కాని నిస్సందేహముగా పుచ్చుకొన ననుజ్ఞాతుడైనాడు. (కాత్యా. శ్రౌ. 8.2.2.8) ఈ రెండు జాతుల వారికిని పరస్పర మైత్రి లేనిచో ఇటులు చెప్ప టసంభవము.

ఈ విషయమున నింక నిషాద శబ్దము స్వయముగా ఏమి చెప్పునో విచారింతము. యాస్కుడు దాని వ్యుత్పత్తిని గురించి (నిరుక్త. 3 8) ఇటులు వ్రాసెను: నిషాదన నామ మెటుల వచ్చెను? ఆతడు నిషాదున కాన; నైరుక్తు

లేమి చెప్పుదురనగా పాప మతనిలో నిషణ్ణమై యున్నది కాన. (తావుకొని యున్నది కాన). ఈ రెండవ వ్యుత్పత్తి ఆపాతరమణీయమని విశదమే. అయితే ఇక మొదటి 'నిషా'దన నేమి ? జంతువును చంపి వాడు జీవించును గాన నిషాదుడని డాక్టర్ లక్షణ సరూప్ అనువారు చెప్పుచున్నారు. అయితే ఇది మూలములో నిసుమంతయు లేని ఆంగ్లానువాదము. (అటు లనదగునేని) విచారింపగా నిచి కూర్చుండి చంపు గావున నిషాదుడు'-అనగా జంతువుల జంపి జీవించువాడని అర్థము"అని వ్రాసిన దుర్గాచార్యుని వ్యాఖ్యానము నుండి పుట్టిన దురభిప్రాయము. నిషాదన-అనునది ని+సద్ అనుదాని నుండి వ్యుత్పాదితము. ని = క్రింద, సద్ = కూర్చుండుట. కాగా నపుంసక లింగమున "క్రింద కూర్చుండుట" అని అక్షరార్థము; నివసించుట అని ఆలంకారికార్థము. (ఋక్. 1.162 14;9.7.5) పుంలింగమగుచో 'క్రింద కూర్చుండువాడు' లేక నిమ్నప్రదేశమున కూర్చుండు వాడు 'లేక' నిమ్నాసనము కైకొనువాడు'-అని అర్థమగును. ఈ చివరి యర్థమిచట (అక్షరికముగ ఆలంకారికముగ కూడ) సరిపోవును.

దీనివలన ఐదుగురిలో అంతర్గతులగు అనార్య నిషాదులు చాతుర్వర్ణ్యము వారికంటె దప్పక తక్కువగా పరిగణింపబడిరనియు దాన నీ యైదు వర్ణములు కూడిన సంఘమునందు నిమ్నాసనమునకు వారు నిర్ణయింపబడిరనియు వేఱె చెప్ప నక్కరలేదు. వారికిట్టి కొంచెదన నుండుటచే శ్రేష్ఠులగు త్రైవర్ణికులు వారికీపేరు (నిషాద) పెట్టి యుందురు. ఇట్టివే కొన్ని పదములు కలవు. చూడుడు: 'అంత్యావసాయి' అనగా 'పొలిమేరల నుండువాడు'-(మిక్కిలి నీచమగు వివిధ జాతులకు పెట్టబడిన నింద్యమగు పేరు) నిరవసితుడు (బహిష్కృతుడు); ఈ పదము వెలివేయబడిన కొన్ని జాతులను చెప్పును. అధునాతన కాలమున ఆసన విశేషము కూడ; (Gallery) దానియందు కూర్చుండు తక్కువవారి కిక్లే పెట్టబడిన పేరై యున్నది.

ఇక ధర్మ సూత్రములు నిషాదు గురించి యేమి తెల్పునో చూతము. నిషాదు లసలు అనార్యులని యెఱిగితిమి. కాని ఇచట వారి కార్యులతో రక్త సంబంధము కలిగి నటులు కనుగొందుము. ఇంతియ కాక బ్రాహ్మణులతోడనే సంబంధముకల కులము వారనియు నెరుగుదుము. ఏలనగా బోధాయను

ననుసరించి బ్రాహ్మణునకు శూద్రకు పుట్టిన నతడు నిషాదుడు. (ధర్మ 1:9:2) ఇటులుండగా బ్రాహ్మణునకు వైశ్యకు కలిగినవాడు నిషాదుడని నిర్ణయించుచు గౌతము డితనిని మఱియొక మెట్టెక్కించినాడు. (4.16) ఎవరి మతమున నేని ఈ కాలమే నాటికి అనార్య నిషాదుడు ఆర్య సమూహములో చేర్చుకొనబడి నటులు రుజువగుచున్నది. నాటి కాలమున ఏ లక్షణములు వర్ణమును నిర్ణయించి నవో లేక నిశ్చయించినవో అవి నేటి కాలమునగల లక్షణములకంటె చాల భిన్నములు. నిశ్చాయకములగు ఆధారము లీమూడు: ఒకటి-ధర్మాచరణముచే స్వయం సంపాదితమగు శ్రేష్ఠ్యము కాని, ధర్మమునాచరింపమి గలుగు నైచ్యము గాని; రెండు-వృత్త్యంతర గ్రహణము; మూడు-సమనంతర జన్మములందు అనుస్యూత ఫలముకల జన్య జనక భావము.

మొదటిదాని గురించి ఆపస్తంబుడు-(ధర్మ. 2.5.10.11) ప్రకృత జన్మమునందు తన ధర్మముల సరిగా నెఱవేర్చుచో ఏ వర్ణము వాడేని తరువాతి పుట్టువున సమనంతర శ్రేష్ఠవర్ణము కలవాడగును. ధర్మముల నుపేక్షించునెడల పిదప వర్ణమున బుట్టును. వ్యాఖ్యాత హరదత్తుడు దీనిని విపులముగా చర్చించి నాడు. స్వయం సంపాదితములగు గుణములయొక్క ప్రాబల్యమే సమనంతర సంతతియొక్క పై జెప్పిన వర్ణవిషయమైన గొప్పదనమునకును, కొంచెదనము నకును కారణమగుచున్నదనుట విస్పష్టము.

రెండవది వృత్త్యంతర గ్రహణము. దాని ఫలమును యాజ్ఞవల్క్యు డిటులు చెప్పుచున్నాడు. (1.96) ఒక వర్ణమునకు నియతమగు కర్మను మరి యొక వర్ణమువా డవలంబించుచో వా డా వర్ణమునకు జెందును. (వృత్త్యయే కర్మ నాని సామ్యం). మను విట్లనుచున్నాడు: (10.81.177) ఆపత్సమయములం దెవరైనను క్రింది వర్ణములవారి వృత్తి నవలంబింపదగును. తన కర్మలో గిట్టక పోయిన యెడల బ్రాహ్మణుడు క్షత్రియకర్మచే జీవింపనగును. అందును గిట్టని యెడల వైశ్యకర్మచేసిగాని, శూద్రకర్మ పర్యంతమునకుగాని వెళ్ళి జీవింప వచ్చును. అగ్రజాతుల కన్నిటికి నిది చెల్లును. అయితే అగ్రవర్ణమున వాడు ఇష్టానుసారముగా గ్రహించిన తక్కువ వర్ణములవారి కర్మయందే పాతుకొని యున్న యెడల, వాని సంతతియు కొన్ని తరముల దాకా అట్లే యున్నయెడల,

అట్లు క్షత్రియ కర్మయందు నియతమైయున్న బ్రాహ్మణ కుటుంబము ఐదవ తరమున క్షత్రియ కుటుంబముగా మారిపోవును. ఇట్లే వైశ్యు లగుట కారుతరము లును, శూద్రులగుట కేడు తరములును పట్టును. (యాజ్ఞ. మితాక్షర 1-96).

మూడవది రక్తసంబంధము: దీనివలన కొందఱ మతమున అయిదు తరములకును, మరికొందఱ మతమున ఏడు తరములకును వర్ణము సంపూర్ణముగా మారును. (గౌ. ధ. సూ. 4-22-23). హరదత్తు డిటులు వర్ణించుచున్నాడు: "బ్రాహ్మణునకు క్షత్రియునకు పుట్టిన సవర్ణకన్య (మూర్ధావసక్త) బ్రాహ్మణుని పెండ్లాడుచో, ఆమె స్త్రీ సంతతియు ఏడు తరములదాకా అటులే చేయుచో, ఆ ఏడవ తరపు ఆడుపడుచు బ్రాహ్మణి యగును. ఇక బ్రాహ్మణునకు క్షత్రియకు కలిగినవాడు క్షత్రియను పెండ్లాడుచో, అతని ఏడవ తరము దాక నున్న పురుషులుకూడ క్షత్రియులనే పెండ్లాడుచో, ఆ ఏడవ తరమునుండి పుట్టిన వారందరు క్షత్రియు లగుదురు"; ఇందు గర్భితముగా నున్న అభిప్రాయ మిది: బీజము అపవిత్రమగు సంబంధముచే క్రమముగా తఱిగిపోయినను శ్రేష్ఠ ధర్మ సంబంధము కలిగి తన పవిత్రత్వమును మరల సంపాదించుకొనును. అధమ ద్రవ్యముతో క్రమాక్రాంతమగు సంసర్గము అధమత్వమును నియతముగా నిలుప కారణ మగుచున్నది.

ఇక నిషాదుల విషయమునకు మఱలుదము. బోధాయను డిటు లనుచున్నాడు: వివాహము నిషాద సంఘమునందు లేక కులమునందుగాని పర్యాప్తమయి (భార్యాభర్త లిరువురును నిషాదులే యగుచురేని) అయిదు తరములదాక నటులే నియతమయి యుండుచో వారినుండి శూద్రత్వము తొలగును. అనగా అట్టి నిషాదుల యైదవ తరము వానిలో శూద్రాంశ యేమియు మిగిలియుండదు. కాని అతడు నిషాదశ్రేష్ఠు డగునో, లేక, వేఱు వర్ణము వాడగునో ఆ సంగతిని మాత్రము బోధాయనుడు తిన్నగా విశదీకరింపలేదు.

ఐనను అట్టి ఐదవ తరమువాడు ఉపనీతుడు కావలయునని (ధ. సూ. 1-8-14-16) బోధాయనుడు చెప్పుచున్నాడు. ఆఱవ తరమువాడు పురోహితానుమతిచే యజ్ఞమున కర్హుడనియు ననుచున్నాడు. ఇక ఏడవవాడు మలినుడు కాక మూలపురుషుని సంపూర్ణ స్వస్థితిని పొందుననియు చెప్పుచున్నాడు. నీచకులము

లలో కొన్ని తరములదాక బీజము ఊరక వ్యాపించు మాత్రమున దాని పూర్వ సౌభాగ్యము నెటులు చూరగొనునో నాకు నిక్కముగా తెలియలేదని ఒప్పుకొన వలసియున్నది. జన్యజనక భావ శాస్త్రజ్ఞులు ఈ విషయమును విశదీకరింపగలరా?

బోధాయనుడు పైన జెప్పిన వర్ణాధిక్య ప్రక్రియ ఉపనయనమున కర్హత యిచ్చినను తావన్మాత్ర ప్రయోజకమేయయి అగ్ర త్రైవర్ణికుల సమస్త విధుల కును అధికారములకును అనర్హతను తేల్చుచున్నది. ఇది యటుండె. ఉపనయన మును గురించి కొంత పరిశీలింతము.

సూతుడు[15] కాక, మిగిలిన ప్రతిలోములు[16] కర్మకలాపములందు[17] అంగీ కరింపబడరని ఆపస్తంబుడు చెప్పుచున్నాడు. (ధర్మసూత్ర. 4·25). కుల్లూక భట్టు అంగీకరింపకున్నను (10·41) ఒకానొక శాస్త్రము[18]నందలి ప్రత్యేక విధిచే సూతు డుపనయనమున కర్హుడని హరదత్తుడు వ్రాసినాడు.

ఇంకను అనులోములు[19] శూద్రకు పుట్టినవారు తక్క మిగిలిన అను లోములు ఉపనయనార్హులు. (బోధాయన ధర్మసూత్ర 4.26) ఈ ప్రక్రియయే సంకీర్ణ జాతుల సమనంతర వ్యతికరమున గూడ ప్రవర్తించును. (యాజ్ఞవల్క్య మితాక్షర 1.65) మస్కరి అనులోములకు ఉపనయనాధికారము నంగీకరించు చున్నాడు. కాని వేదాధ్యయన నిషేధ మొకటి కలుపుచున్నాడు. (గౌ.ధ.సూ. వ్యాఖ్య, 4-25) అతడొక స్మృతిని[20] ప్రమాణముగా చూపెను:

"అనులోముల కుపనయనాధికారము మాత్రమే కలదు. వేదాధ్యయన మున కాని, పంచ యజ్ఞముల కాని, గార్హపత్యాగ్నికాని, అగ్నిహోత్రమున కాని, ఇంధనాధానమునకాని, ప్రాత స్సాయం సంధ్యల కాని అధికారము లేదు-

15) బ్రాహ్మణికి క్షత్రియునకు కలిగినవాడు.
16) పైజాతి తల్లికి క్రింది జాతి తండ్రికి పుట్టినవాడు.
17) వ్యాఖ్యాతల ననుసరించి ఉపనయనమునకు, దానిబోలిన కర్మలకు.
18) ఆ శాస్త్రమేదియో వక్కాణింపబడలేదు.
19) పైజాతి తండ్రికి క్రింది జాతి తల్లికి పుట్టినవాడు.
20) దీని పేరు చెప్పబడలేదు.

ఇంతియకాక వీరి ఉపనయనము వేద మంత్రములు లేకుండ ఉపాంశువుగా జరుగ వలయును" అని.

ఇది ఉన్న దున్నపాళముగా ఉపాదేయము కాదు. ఏలన, సాంకర్యము లేని శూద్రుడు కూడ పంచ యజ్ఞము లందధికృతుడని తొల్లి మనము చూచి యున్నాము. భూత యజ్ఞము[21] పంచ యజ్ఞాంతర్గతమనియు, గృహ్యాగ్నిలో చేయబడుననియు నందఱకు తెల్లమైనదియే.

గృహ్యాగ్నికికూడ సంబంధించిన వేఱు వేఱు పాక యజ్ఞములకు శూద్రు లును అర్హులు. ఇందు వారికిగల భేదమేమనగా మంత్రోచ్చారణాభావము. భక్తి చిహ్నముగా 'నమః నమః' అని ఉచ్చరింపవలయును. (అటులు చేయుట కర్హత గల వారిచే ఆ మంత్రములు చెప్పబడు సమయమున) మస్కరి వ్యాఖ్యానము నుండి మరికొన్ని పంక్తులుదాహరింతును. (గౌ.ధ.సూ. 4.26)

"ఉపనయనము సవర్ణాంబష్ఠ నిషాదులకు మాత్రమే. ఒక స్మృతియం దిటులు కలదు. (పురోహితుల నుద్దేశించి) సవర్ణు నుపనయించి ధనుర్వేదము బోధింపవలెను; అంబష్ఠు నుపనయించి వైద్య శాస్త్రమును బోధింపవలెను. నిషాదు నుపనయించి హస్తి శిక్ష బోధింపవలెను."

మఱియు శూద్రులకు లౌకిక జ్ఞానము బోధించుటకు గూడ నుపనయన మావశ్యకమని సులభముగా సాధింపబడిన దగుచున్నది. వైద్య విద్యార్థుల ఉప నయనమును గుఱించి శ్రుశుతము: (నిర్ణయ సాగర ముద్రితము, 1-2-5) ఒక యోగ్యుడగు శూద్రుని వేద మంత్రములు వినా ఉపనయించి యతనికి వైద్యము బోధింపవలయునని చెప్పుచున్నది. తఱచుగా ఉదాహరింపబడు నీ శ్లోకమును మునిముందు చూపినవాడు ఆర్య సమాజ మూల పురుషుడగు స్వామి దయానంద సరస్వతియని నే ననుకొనుచున్నాను.



21) దీనికి వైశ్వదేవమనియు బలికర్మయనియు బెక్కు పేరులు గలవు.

# 3. మధ్యాకర్షణ

భారతీయ ఖగోళజ్ఞులు సుమారు వేయేండ్ల క్రితం 'మధ్యాకర్షణశక్తి' అంటూ ఒక శక్తి ఉన్నదనిన్నీ, ఇదే గ్రహాలకు నియామకం అనిన్నీ వ్రాసి పోయినారు. అటుపిమ్మట దాని విశిష్ట ఫలాలు తెలిసికోవడానికి గవేషణ యేమీ జరగకపోవడంవల్ల అది అలా పుస్తకాలలోనే శబ్దరూపంగా స్తంభించిపోయింది. తరువాత్తరువాత స్త్రీల పాతివ్రత్యమూ, పురుషుల పుణ్యమూ దీన్ని పారదోలి దీని స్థానాన్ని ఆక్రమించుకున్నై.

పాశ్చాత్య దేశంలో ఈ మధ్యాకర్షణ మళ్లా మొలకెత్తింది. 17వ శతాబ్ది శేషార్ధంలో ఐజాక్ న్యూటన్ అనే ఆయన మధ్యాకర్షణ అనే శక్తి ఒకటి ఉందని గ్రహించాడు.

## మధ్యాకర్షణ అంటే ఏమిటి ?

రెండు ద్రవ్యాలు పరస్పరమూ అభిముఖంగా ఆకర్షింపబడతై. ఆ ఆకర్షణ యొక్క పరిమాణం ఆ ద్రవ్యాల పరిమాణాన్ని బట్టిన్నీ, దూరాన్ని బట్టిన్నీ నియంత్రితం అవుతూ వుంటుంది. ఆ ద్రవ్యాలలో ఒకటి మరో దాని కంటె పెద్దది కాకపోతే ఆ ఆకర్షణకు ఫలం ఉండదు. అందువల్లనే భూమిమీద ఏ రెండు పదార్థాలూ డీడిక్కాలు కొట్టుకోవడంలేదు. ఈ భూమి ఇతర పదార్థాల కంటె చాలా పెద్దది. కాబట్టి అడ్డమాక లేమీ లేకపోతే ద్రవ్యాలు ఈ శక్తికి లోబడి నేలమీద పడిపోతై.

పండ్లు చెట్లనుండి నేలమీద పడడమూ, నీరు పారడమూ, సముద్రంలో ఆటు పోటులు కలగడమూ, భూమ్యాదులు సూర్యుని చుట్టూ తిరగడమూ, చంద్రుడు హాని వృద్ధులు పొందడమూ, గ్రహణములు సంభవించడమూ ఈ మొదలయినవన్నీ ఈ మధ్యాకర్షణవల్లనే అని తరువాత అవగతమయింది.

సూదంటు రాయీ, మెరుపూ మొదలయిన ద్రవ్యాలవల్ల కలిగే గమనం కాక మిగిలిన గమనమంతా మధ్యాకర్షణవల్లనే కలిగిందని క్రమక్రమంగా అనుకోవడం పరిపాటి అయింది. కాగా ఈ శక్తే ప్రకృతిలో ప్రముఖంగా పరిగణింపబడింది. గడచిన మున్నూరేండ్లలో ఈ శక్తిని నమ్మకుండా ఉండడానికి తగిన కారణాలు కనబడలేదు. కాబట్టి వైజ్ఞానికులు సూర్యచంద్రు లున్నారని నమ్మినట్లే ఈ శక్తిని కూడా నమ్మారు,

## సందేహం

భూచంద్రులూ, తతిమ్మా గ్రహోపగ్రహాలూ, వీని తాలూకు గమనం మధ్యాకర్షణ శక్తిచేతనే నియంత్రితం ఐతే, బుధగమనం కూడా ఈ మధ్యాకర్షణ శక్తిచేతనే నియంత్రితం కావాలి. అలా కావడం లేదు. 'అన్నిటిదీ ఒకదారి ఉలిపికట్టె దొకదారి' అన్నట్లు ఈ బుధుని గమనం వేరుగా కానవస్తూంది. పై శక్తితో మిగిలిన గ్రహాల గమనానికిగల సంబంధమూ, ఈ బుధుని గమనానికి గల సంబంధమూ సరిపుచ్చడానికి తల బద్దలుకొట్టుకున్నా సరిపడలేదు. ఇది ఇల్లా సరిపడక పోవడంవల్ల ఈ మధ్యాకర్షణ శక్తిని గురించి గణకులకు అపనమ్మకం కలిగింది. కొందరు గణితజ్ఞులు ఈ శక్తి నియమాన్ని బుధ గమనానికి సరిపెట్టి చూచారు. దానివల్ల మిగిలిన గ్రహోపగ్రహాల గమనంలో తేడా వచ్చింది. 'ఎగదీస్తే బ్రహ్మహత్య-దిగదీస్తే గోహత్య.'

## కిరణగమనం

లోగడ మాక్స్వెల్ మొదలైన వైజ్ఞానికులు 'కిరణాలు సూటిగా ప్రసరిస్తాయని' అనుకొన్నారు. గవేషింపదొడగిన కొద్దీ అవి వంకరగా ప్రసరిస్తున్నటులు సందేహం కలిగింది. అప్పుడు ఇంగ్లాండు మినహా మిగతా యూరపు ఖండంలోని వైజ్ఞానికు లందరూ జ్యామెట్రీ (జ్యామితి)ని పునాదిగా వేసుకొని గుణించడం మొదలుపెట్టారు.

## జ్యా మి తి

"ఏ స్థానమందైనా ఏదైనా ఒక జడ పదార్థము వుంటే దాని ప్రక్కనున్న స్థాన సమూహం యూక్లిడ్ చెప్పిన జ్యామితి పొసగదు. ఇట్టి స్థానాన్ని

మామూలు భాషలో వక్రస్థానం అని వాడవచ్చు. ఈలా చూస్తే సూర్యుని చుట్టూ ఉన్న స్థానం వక్రం. అందువల్ల సూర్యుని సమీపం నుంచి వచ్చే నక్షత్రాల కాంతి యూక్లిడ్ చెప్పినట్లు సరళ మార్గానరాదు." అని ఐన్‌స్టీన్ గ్రహించాడు.

## సీటార్

జడ పదార్థానికి దాపున ఉన్న స్థానమే కాక, జడ పదార్థం లేని స్థానం కూడా వక్రమే. యూక్లిడ్ చెప్పిన జ్యామితికి తావలమైన శూన్యస్థానం అంటూ ఒకటి లేదని ఈయన ఒక మతం ప్రచారం చేశాడు.

కొన్ని నక్షత్రాలు మనకు చాలా చాలా దూరంలో మిక్కిలి వడిగా పరుగెత్తుతున్నై. గణకులు చాలామంది ఈయన మతాన్నిబట్టి నక్షత్రాల గమనాన్ని సరిచూచుకొని ఈ మతాన్ని స్వీకరించారు.

ఈ రీతిగా యూక్లిడ్ తాలూకు జ్యామితియున్నూ, దాన్ని ప్రమాణంగా పెట్టుకొని చేసిన సిద్ధాంతాలున్నూ సరికావని తేలిపోయింది. న్యూటన్, అయిలార్ మొదలయినవారు వేసిన లెక్కలు తూచినట్లు సరిగ్గా లేవని కూడా నిశ్చితం అయింది. బ్రహ్మాండాన్ని గురించి అనుమాన ప్రమాణంచే సాధింపదగిన కొత్త విషయాలకు కొత్త గణితం ఒకటి కావలసి ఉన్నదని వైజ్ఞానికులందరికి తోచింది. కాగా ఆ గణితానికి కూడా విఘ్నేశ్వర పూజ జరిగింది. దీనికి ప్రథమాచార్యుడు రీచీ. ఇతడు ఇటలీవాడు.

## అపేక్షిక తత్త్వం

గణితమూ, పదార్థ విజ్ఞానమూ, ఖగోళశాస్త్రమూ-వీనిలో ఆలోచన జరుగుతూ వున్న సమయంలో జర్మనీ వాస్తవ్యుడు ఐన్‌స్టీన్ అనే వైజ్ఞానికుడు అపేక్షికతత్త్వాన్ని ఉద్ఘాటించాడు. ఇది ఎంత నూతనమో అంత కఠినం.

ఈతని ఊహ వెనుకటి ఊహల కన్నింటికీ నీళ్లు తోడిందని చెప్పవచ్చు. ఈ అపేక్షిక వాదం మొదట మొదట వైజ్ఞానికులకే సుగ్రహం కాలేదు. కా

పిదప పిదప ఈ వాదం పునాదిగా కొంత కొంత విజ్ఞానభిత్తి యేర్పడింది. దాంతో పదార్థ విజ్ఞానంలో కలిగిన కొన్ని సందేహాలకు సమాధానం వచ్చింది. అటు పిమ్మట కొందరు కొందరు ఈ మతం మీద విశ్వాసం కలవారయ్యారు. ఈ విశ్వాసం క్రమక్రమంగా విశ్వవ్యాప్తం అయింది.

ఈ అపేక్షిక తత్వాన్ని తెలపాలంటే అతి సూక్ష్మమూ, అతి కఠినమూ అయిన గణితంచే కాక మరో రీతిగా తెలపడానికి వీలులేదు. ఐనా దీని ఆభాస ఈ క్రింది రీతిగా ఉంటుంది :

బ్రహ్మాండం తాలూకు వెడలుపూ పొడుగూ ప్రస్థమూ వేధా-మొదలయిన స్వరూపమంతా కాలంతో కూడా సంబంధపడి ఉంది. కాబట్టి బ్రహ్మాండంలోని ప్రతి ఘటనా దేశ కాల సాపేక్షం అవుతూ వుంటుంది. దీన్ని అనుసరించి చూస్తే మనం ఇప్పుడున్న జగత్తుకూడా దేశ కాల సమన్వితమయిన ఒక సత్తా. ఇట్టి సత్తా నడుమ ఏ ద్రవ్యం ఉన్నా, ఆ ద్రవ్యం చుట్టుప్రక్కల వున్న ద్రవ్యాలకు ఒక గమనం వుంటుంది. అది న్యూటన్ వేసిన లెక్కకు అనురూపం. ఆ గమనం దేశ కాలాన్వితమయిన ఈ జగత్తులో ఉన్నంత మాత్రం వల్లనే కలిగేది కాని, న్యూటన్ చెప్పినట్లు మధ్యాకర్షణవల్ల మాత్రం కలిగేది కాదు.

ఈ రీతిగా ఊహించి గణితం వేస్తే లబ్ధమయిన గమన పరిమాణాన్ని బట్టి బుధుని గమనంలో లోటుపాట్లు చాలభాగం సర్దుకుంటై. ఇది ఇలా ఉండగా నక్షత్ర కిరణాలు సూర్య సన్నిధిలో సూటిగా పోక వంకరగా పోతై అని కూడా దీనివల్ల తేలుతుంది. సూర్యగ్రహణ సమయంలో ఎడింగ్టన్ మొదలైన వైజ్ఞానికులు చూచి, ఇది సత్యమని నిర్ధారణ చేశారు.

ఐతే న్యూటన్ కనుగొన్న మధ్యాకర్షణ శక్తి పొరపాటా అనే శంక కలుగుతుంది. కాదుగాని అతడు కనుగొన్నదాన్ని ఐన్‌స్టీన్ కనుగొన్న దానితో తావేజావేసి చూస్తే అది చాలా స్థూలం అని చెప్పాలిసి వస్తుంది. స్థూల విషయాలలో న్యూటన్ మాట పాటి ఔతుంది. సూక్ష్మ విషయాలకు మాత్రం న్యూటన్

మతం సమాధానం ఇవ్వలేదు. అట్టి విషయాలలో ఐన్‌స్టీన్ సిద్ధాంతమే అవలంబనీయం.

రీటీ వేసిన గణితానికి సరిపడేటట్లు ఐన్‌స్టీన్ మధ్యాకర్షణ ఫలితాలను నియంత్రితం చేశాడు. ఖగోళ సందేహమూ, కిరణ సందేహమూ, నూతన గణితమూ-ఈ మూటి ఆందోళనమున్నూ కలిసి ఐన్‌స్టీన్ ప్రతిభచే అపేక్షిక తత్వంగా మారింది.

ఈ అపేక్షిక తత్వానికి ఫలితంగా బ్రహ్మాండం తాలూకు ఆకార-ఆయతనాలను గురించి కొత్త కొత్త ఊహకు అంకురార్పణ అయింది. గడచిన నాలుగయిదేండ్లలో గణకులు నిరూపిస్తూన్న సంగతు లింకా సిద్ధాంతాలు కాకున్నా ఉపేక్షించడానికి మాత్రం వీలుకాదు.

# 4. కట్టడాలు

భరతఖండంలో తూరుపునుండి పడమటివరకూ, ఉత్తరమునుండి దక్షిణము వరకూ ఉన్న కట్టడాలలో అక్కడా అక్కడా సౌందర్యం కొద్దిగానూ, గొప్ప గానూ, వెదజల్లినట్లు కనబడుతూ ఉంది. ఇది సంఖ్యలో తక్కువే అయినా గుణంలో మాత్రం ఎక్కువే.

అరిపోని ఏరులూ, ఎత్తయిన కొండలూ దివ్యశిల్పానికి నిలయాలు. వానిలో అందం ఎక్కడ ఉందో అది కనిపట్టి ఆతావున శిల్పాన్ని పొందుపరచడమనేది చాలా విశేషం.

వైదిక వాఙ్మయంలో గ్రామాలూ, నగరాలూ, ఉద్యానాలూ, అరణ్యాలూ ఇండ్లూ, వాకిళ్లూ కనబడతై. ఆసియా ఖండంలో గానీ, భరత వర్షంలోగానీ మనిషి ఎపుడు ఇల్లు కట్టాడో ఎవరూ చెప్పలేరు. మనిషి ఎప్పుడు పుట్టాడో చెప్పడం ఎలాటిదో ఎప్పుడు కట్టాడో కూడా చెప్పడం అలాటిదే. దానికి చేసే ప్రయత్నం కాక దంతపరీక్ష 'అగ్న్యాధానం కోసరం ప్రాగ్వంశం. అనే శాలకృత్తికలలో కట్టవలెను; ఇప్ప డివిగో కృత్తికలు! కృత్తికలే తూర్పునుండి జారిపోవు. మిగిలినవన్నీ జారిపోవును అని శతపథ బ్రాహ్మణంలో (2-1-2) ఉన్నది. లెక్కవేసి చూస్తే ఆ కాలం నేటికి 4846 ఏండ్ల కీవలకాదు. కాబట్టి సంసారం అనాది అనే మాట ఈ విషయంలో కూడా ఇంచుమించు నిజం.

ఎవడయినా ఒక అడవిలో కాపురం చేయదలచుకొంటే ముందు అడవి జంతువుల బాధ, అటు తరువాత దొంగలబాధ కలగకుండా చూచుకొని ఇల్లు కట్టుకుంటాడు. అటువంటి ఇండ్లు మన్యాలలో కానవస్తవి. అటు తరువాతగాని గాలికీ నీటికీ, అనుకూల్యం ఆలోచించడు. తురుష్క దండయాత్రలకూ మరాటీ దండులకూ భయపడుతూ వున్న గ్రామాలు బళ్లారి మొదలయిన జిల్లాలలో చూస్తాము.

డబ్బులేనివాళ్ల ఇళ్లు ఎంతసేపూ వాళ్లవాళ్ల ఉపయోగానికి మాత్రమే కట్టబడతై. ఆ ఇండ్లలో బొమ్మలూ ముగ్గులూ మొదలయిన శిల్పా లుండవని కాదు. శిల్ప ప్రధానంగా ఆ ఇండ్లు ఉండవు. మరి ఉపయోగ ప్రధానంగా ఉంటవి. కొంచెం స్థితిపరుల ఇండ్లు కూడా అంతేకాని వారివారి ధనధాన్యాలకూ బంటు బైదకూ ఉపయోగింపగల వైశాల్యమూ, గాలివీలూ, నీటివసతీ ఈ మొదలగు వానిని చూపెట్టుకొని అవి వుంటవి. ఇక జమీందారులూ మొఖాసాదారులూ ధనికులూ కట్టిన ఇండ్లలో కొంతకొంత శిల్పం నేటికీ కనబడుతుంది.

క్రీస్తు వెనుక రెండో మూడో శతాబ్దులు మొదలుకొని నేటివరకూ ఈ గడ్డ మీద అడుగుపెట్టిన యవనులూ, పల్లవులూ, వలందులూ, బుడతకీచులూ, పరాసులూ, ఇస్లామీయులూ, బ్రిటీషువారూ ఈ మొదలయినవారి ధర్మాన పోయి నది పోగా మిగిలిన భారతశిల్పమూ, వాండ్ల శిల్పమూ తిలతండుల న్యాయంగా కనబడుతుంది. ఇప్పుడు అక్కడక్కడ పడిపోయిన సామంతరాజుల కోటలూ, మహారాజుల దుర్గాలూ, మహంజొదరో హరప్పా పూడికలూ, ఈ మొదలయిన వానివల్ల కొంతకొంత ప్రాచీనశిల్పం తెలియ వస్తూంది.

### తొమ్మిది రకాల కోటలు :

సార్వభౌముడూ, మహారాజూ, నరేంద్రుడూ, పాంచికుడూ, పట్టధరుడూ, మండలేశుడూ, పట్టభాజుడూ, ప్రాహారకుడూ, అస్త్రగ్రాహుడూ అని రాజులు తొమ్మిది విధాలు. ఈ తొమ్మండుగురు రాజుల ఉనికికీ అనువగునట్లు కట్టే కోటలకు ఒకటి మొదలుచేసి ఏడువరకూ ప్రాకారాలు, ఉండవలెను. ఆయాయి రాజుల అధికారోపయోగాల ననుసరించి ఈ ప్రాకార కల్పన. ఈ ప్రాకారంతర్భాగాలలో కొన్నిటిని అంతర్మండలమనీ, మహా మర్యాద అనీ అంత నిహారమనీ, మధ్య మహారమనీ, ప్రాకారమనీ ఈ రీతిగా ఇంకా కొన్ని పేళ్లు. ఈ మండలాల కన్నిటికీ కట్టే గోపురాలకూ లేక సింహద్వారాలకూ ద్వారశోభ అనీ, ద్వారశాల అనీ, ద్వార ప్రాసాదమనీ, మహా గోపురమనీ పేళ్లు. ద్వారశోభ నేటికీ కనబడుతూ వుంది.

## కోటల నిర్మాణం

పై కోటలూ, మండలాలూ, శాలలూ, నిలువులూ ఇవన్నీ ఆయా తరగతికి చెందిన రాచవారికి సంబంధించినవి. స్థల నిర్వచనమూ, స్థలశుద్ధీ చేసే

కొన్నాక నడుమ బ్రహ్మపీఠమున్నూ, దానిమీద ప్రధాన రాజగృహమున్నూ కట్టాలి. దానికి నాలుగువైపులా రాజీవాసవు కట్టడాలున్నూ, ఆ పై మండలంలో రాజకుమారులూ, రాజపురోహితులూ, మంత్రులూ ఉండదగిన మేడలున్నూ కట్టాలి. దాని తరువాత మండలంలో రాజపరిషత్తూ, తత్సభ్యులూ, పని బాగుల వాండ్లూ ఉండటానికి ఇండ్లు కట్టాలి. నాలుగవ మండలంలో యుద్ధ కార్యాదులను నిర్వహించడానికి తగిన మేడ లుండాలి. ఇవికాక వంట ఇండ్లూ, భోజనశాలలూ, దుస్తులు మార్చుకునే ఇండ్లు, కేళాకూళులు, తోటలు, పొదరిండ్లు, అవుతుఖానాలు, దవాఖానాలు, రంగ మండపాలు, ఆస్థాన మండపాలు, పడకటిండ్లు, ఇత్యాదులు వీలునుబట్టి కట్టుకోవాలి.

## జంతువుల కేర్పాటు

సింహద్వారం దాపల పులులు మొదలగు జంతువులకున్నూ, అంగజాలెలు ఉండేచోట, నెమళ్ళకున్నూ, దాని ప్రక్కన మేకలకున్నూ, సత్యకప్రకోష్ఠంలో కోతులకున్నూ, సోమప్రకోష్ఠంలో అనగా ఉత్తరంనుంచి ఈశాన కోణం వరకూ ఉన్న స్థలంలో గుఱ్ఱాలకున్నూ, దక్షిణమునుంచి ఆగ్నేయకోణంవరకూ ఉన్న స్థలంలో ఏనుగులకున్నూ (నేటికిన్నీ మిగిలి ఉన్న శ్రీకృష్ణదేవరాయల గజశాల ఈ రీతిగా ఉందో లేదో నాకు తెలియదు), అక్కడి నైరృతికోణం వరకూ కోళ్ల కున్నూ, వాయుకోణం మొదలుకొని ముఖ్య ప్రతిష్ఠాంతంవరకూ ఉన్న ప్రదేశంలో లేళ్లకున్నూ, మిగిలిన పశువులకున్నూ ఏర్పాటు చేయడం మంచిది.

## కృత్రిమ యుద్ధశాల

కృత్రిమ యుద్ధం జరపడానికిగాను ద్వారం పక్క పెద్దమంచె కట్టాలి. (భాగవతంలో దశమస్కంధం 42, 43 అధ్యాయాలు చూచేది). ద్వారానికి దాపుగా అందరకూ కనబడేటట్టు వధ్యస్థానం ఉండాలి. ప్రాకారానికి దవ్వుగా స్పృశ లేక అంతరిక్షప్రకోష్ఠంలో చెఱసాలలు కట్టాలి. బహిర్మండలానికి దూరంగా రుద్రభూమి ఉండాలి. అక్కడ శీతలాదేవి శ్మశానకాళీ మొదలయిన దేవతలకు ఆలయాలు కట్టాలి. క్రీస్తు వెనుక రెండో శతాబ్దిలో ఉన్నవి ట్రూవియస్ అనే ఇతలీ శిల్పాచార్యుడు గ్రామనగర బహిర్భాగంలో సిరిస్‌కు

చర్చి కట్టమన్నాడు. దానికీ దీనికీ పోలిక గమనించేది. ఈ విషయ మంతా మానసారం 40 వ అధ్యాయంలో ఉంది.

## తెలుగుదేశంలోని కోటలు

తెలుగుదేశంలో పాడుకోటలు చాలా కనబడతాయి. ఉదా: నూజవీటి సంస్థానం పద్దెనిమిది పరగణాలలోనూ, గురజ జమీలోనూ, వెంకటగిరి యిలాకా ప్రదేశాలలోనూ వాసిరెడ్డివారి రాజ్యంలోనూ పాడుపడిన కోటలు ఎన్నో ! పాడు పడిన యీ కోటల చరిత్రే ఆంధ్రదేశ చరిత్ర అని చెప్పవచ్చు.

ఈ కోటలకు చుట్టూ ఒక ప్రహరీ ఉంటుంది. కొన్నింటికి నాలుగు మూలలా బురుజులు కనబడతై. నా చూచిన వానిలో పాలవంచ మొదలయిన విట్టివి. సూరారము, కోటపాడూ మొదలయిన వానికి ఉన్నవో లేవో నిర్ధారణ చేయలేం. కోటప్రక్క పేట ఉంటుంది. పేట అనగా శాఖానగరమని అను కుంటాను. కోటలో మంచి నీళ్లకు బావి ఉంటుంది. కోటకు దాపుగానో దవ్వు గానో పెద్ద చెరువు. అందులోంచి కోటలోని బావికి గుప్తమైన తూము. కోటలో కత్తుల బావిగాని, బావులుగాని ఉంటవి. గర్తారుడి మసీదూ, బోగందాని దిబ్బా, ఏదో ఒక దేవళమూ బౌద్ధ విహారమో సమాధో కొన్నిచోట్ల ఉండడం మామూలు.

## గొల్లభామ రహస్యభంగం.

ఇంతంత కోటలు ఎలా లొంగిపోయాయా అని ఆశ్చర్యపోతాము. తురకలు ఎన్నాళ్లు ముట్టడివేసినా యీ కోటలు లొంగిపోలేదు. ఒకనాడు వాళ్లకు చల్ల అమ్ముకుని ఆ దారిని ఇంటికిపోయే గొల్లది కనబడ్డది. ఆపళంగా వాళ్లు దాన్ని పట్టుకునేసరికి అది వాళ్లకు దాసుళ్లూ దణ్ణాలూ పెట్టి, నన్ను విడిస్తే కోట పట్టుకునే ఉపాయం చెబుతానన్నది. వాండ్లు సరేననగా ఆ గొల్లది తూము దగ్గరకు వాళ్లను తీసుకపోయి ఆకో అలమో వేసింది. అది గిర్రున తిరుగుతూ కోట దారిన బడిపోయి మునిగింది. అపుడు వాళ్లు విషం తెచ్చి అక్కడ కలపగా ఆ నీరు తాగి కోటలోని వాళ్లందరూ చచ్చారట. ఈ కథ, ప్రతికోట దగ్గరా వింటాము.

తెలింగానాలో చిన్న చిన్న కోట లన్నిటికీ ఒక ప్రాకారమే కనబడు తుంది. ఏకశిలా నగరమూ అంతే. (చూ. క్రీడాభిరామము.) అద్దంకి, చందవోలు, కొండవీడు మొదలయిన వాని నన్నిటినీ సమగ్రంగా పరిశీలిస్తేనేకాని యీ కోట లన్నీ అర్థశాస్త్ర విభాగానికే చెందుతవో లేక మానసారం ప్రకారమే ఉన్నవో, లేక మత్స్యాది పురాణాల ప్రకారమే ఉన్నాయో మరి మయశిల్పమూ కామి కాగమమూ వీనిలో చేరుతవో లేక స్వయంసృష్టో నిర్ణయించలేము. వీని సంగతే ఇంత అయోమయంగా వుంటే సాతవాహనుని కోటల మాట ?

విహారాలు :

నగరాని కివి అట్టే దూరంగా గాని, దాపుగాగాని ఉండకూడదు. ఇందు వల్ల ఉపయోగ మేమిటయ్యా అంటే కావలసివచ్చినపుడు నగరంలో వారికిన్నీ రాకపోకలకు వీలు. నగరంలోని ధ్వని అందాకా రాదు. నిర్మానుష్యంగా ఉన్న ప్పటికీ జంతు బాధకుగాని, చోరబాధకుగాని నగరం నుండి వెంటనే సాయం వస్తుంది.

ఆశ్రమాలు :

బౌద్ధుల ఆశ్రమాలలో పడకటిల్లు, గుర్రాలసాల, గోపురశాల, నేలమాళిగ, (హఠయోగులు కూడ ఇటువంటి భూగృహాన్ని కట్టించుకుంటారు వేసవిలో ధ్యానానికి) ఉపాసనా మందిరము, భోజనాగారము, ద్రవ్యాగారము, భ్రమణా గారము, విపణి, ఉచ్చకక్షము, మహానసము, ఉష్ణగృహము, పురీషగృహము, కూపగృహము, శీతోష్ణ స్నానాలకు యంత్రగృహము. పుష్కరిణి, మండపం మొదలయినవి ఉన్నవి. దీని వివరాలు మహావగ్గం (3, 5-9) లో చూచేది.

ఇండ్లు :

నడిమిరకం డబ్బు కలవారి ఇండ్లను గురించి శిల్పశాస్త్రానికి సంబంధిం చిన వాస్తుశాస్త్రము, వాస్తుప్రబంధము, శిల్పశాస్త్రసార సంగ్రహము మొదలయిన చిన్నచిన్న పుస్తకాలేకాక పురాణాలూ, ఆగమాలూ, వివరించినవి. వీని నన్ని టిని పర్యాలోచన చేసి చూస్తే సంపన్న గృహస్థుల ఇండ్లకు ఐదు మొదలుకొని పదహారు కక్ష్యలు ఉన్నట్లు చెప్పవచ్చును.

1. ఈశాన్యంగా దేవగృహం, 2. తూరుపు సర్వవస్తు గృహం, 3. స్నానగృహం, 4. పల్లగడి. ఆగ్నేయంగా, 5. వంట ఇల్లు, దక్షిణాన. 6. ఘృత గృహం (?) 7. శైలగృహం, 8. పురీష-గృహం నైరృతీ దిక్కున, 9. శాస్త్రగృహం, (?) పడమట. 10. చదువులగది, 11. భోజనాల గది 12. పశువుల గది. వాయవ్యాన, 13. ధాన్యపుకొట్టు, 14. పడకటిల్లు, 15. ధనాగారం. 16. మందులగది.

కొన్ని కొన్ని గ్రంథాలలో దిగ్భేదంచేత కక్ష్యాభేదం కనిపిస్తుంది.

మత్స్యపురాణం తొమ్మిది కక్ష్యలు చెబుతుంది. వాయవ్యంగా కర్మశాల అంటూ ఒక కొత్తగదికి అమరిక ఉంది. (256 అధ్యాయం చూచేది).

పట్టణాలలో స్థలసంకోచం ఉంటుంది. కాబట్టి ఏకసాల, ద్విసాల, త్రిసాల, చతుస్సాల అనే కట్టడాలను అగ్నిపురాణం చెబుతుంది (106 అధ్యాయము చూడదగును.)

ఊరు :

అసలు ఊరు ఎక్కడ కట్టాలి ? అది ఎలా కడితే బావుంటుంది ?

చిన్నప్పుడు చదువుకున్న సుమతీ శతకంలో-

అప్పిచ్చువాడు వైద్యుడు,
ఎప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుడున్
చొప్పడిన యూర నుండుము
చొప్పడ కున్నట్టి యూర నుండకు సుమతీ.

అని వుంది. ఈ పద్యానికి చాణక్యుని అర్థశాస్త్రం మూలం. ఆ మూలంలో ఒక రాజు మాట ఎక్కువ ఉన్నది. బహుశా రక్షణకోసం ఈ యేర్పాటని తోస్తుంది.

ఏరు ప్రక్క ఊరుండాలి అని నియమం పెట్టుకుంటే భరతఖండపు గ్రామాలలో కొన్ని లక్షలలో ఎన్ని ఊరేగుతవో వెజ్జు ఒజ్జూ లేకపోతే ఎన్ని తగ్గుతాయో చాలా సులభమైన లెక్కలో చెప్పివేయవచ్చు.

ఆంధ్రదేశంలో కృష్ణాతీరం మొదలుకొని చెన్నపట్నందాకా ఉండే గ్రామాలలో వైష్ణవ గ్రామాలు చాలా అందంగా ఉంటవి. ఇది ఆంధ్ర విష్ణువుకు కాపురమయిన శ్రీకాకుళపు ఒరవడో, శ్రీరంగపు ఒరవడో, మరే ఒరవడో నేను చెప్పలేను. సువర్ణముఖి ఒడ్డున, పెన్న ఒడ్డునానూ కొన్ని గ్రామటికలు మనోహరంగా ఉంటవి. కోనసీమలో గంగలకుర్రు, వ్యాఘ్రేశ్వరం, ముంగండ మొదలయిన గ్రామాలకు పోకచెట్లూ, కొబ్బరిచెట్లూ, అరటిచెట్లూ శీతోష్ణస్థితి ఇవి అందం తెచ్చిపెట్టినై. మెట్టదేశంలో కొండలప్రక్క గ్రామాలు సహజ సుందరాలు. మొత్తమ్మీద అవీ ఇవీ మునిపల్లెలవలె ఉంటవి.

నూజవీటి సంస్థానంలో చెప్పదగిన ఊరు ఆకిరిపల్లి. సూత్రపట్టినట్టున్న నాలుగు చచ్చౌకపు వీధులూ, నాలుగు వీధుల కూడలిలో నాలుగు మండపాలూ పెద్దకోనేరూ, దాని నడుమ మండపమూ, శోభనాచలమూ, దానిమీద స్వామీ, నలుమూలలా చిన్నచిన్న గుట్టలూ మావితోటలూ కల యీవూరు ఆకిరిపల్లి కాదు మరి అందాలపల్లి. శోభనాచలస్వామివారి భక్తులు అప్పారాయల సృష్టి యీ అందాలపల్లి. ఈ సృష్టి సగంతో ఆగిపోయింది. ఇంత అందాలపల్లికి ఎంతో పెద్దకోనే రున్నా నీటివసతి చిల్లి.

మన దేశంలో బస్తీలలో బాగుండేది కాకినాడ అంటారు.

చరకుడు :

వైద్యాచార్యుడు చరకుని మతంలో రాతియిండ్లూ, పెంకుటిండ్లూ పనికిరావు. ఇది బహుశా సాధారణవిధి ఐఉంటుంది. కోటలూ పూరిండ్లూ కావుకదా? అలాగే బస్తీలలో కొన్ని కొన్ని ఇండ్లు పర్ణశాలలు కావడానికి వీలులేదు.

ఊరికి మనిషితోపాటే ఆయుర్దాయం. నూరేండ్లు నిండగానే ఆ యూరు తగులబెట్టివేయడమున్నూ, దాపుగా మరో వూరు కట్టుకోవడమున్నూ, మళ్లా నూరేండ్లు నిండాక వెనుకటిచోట మళ్లాకట్టుకోవడమున్నూ ఈయన అభిమతమని ఊహించవచ్చు. ఇందువల్ల విషూచి, మశూచి మొదలయిన అంటువ్యాధులకు ఉద్రేకం వుండదు. భూమియొక్క గుణం ముక్కిపోదు. జనపదోధ్వంసనీయాధ్యాయాషలు చూచేది.

## ప్రాచీన సంప్రదాయం :

ఆర్యులు పామీరు కొండలలోంచి దిగి వచ్చి తమ విజ్ఞానాన్ని భరత ఖండంలో నింపారనే మాట నమ్మినా నమ్మకపోయినా కాలవిజ్ఞానం మాత్రం బహుబహు పురాతనం. మన తెలుగునాటి యిండ్లు ధ్రువాన్ని చూడటం ప్రాచీన సంప్రదాయంలో ప్రధానాంశం. తరువాత బొడ్డురాయి. ఆగ్నేయకోణంలో వంటిళ్లూ దక్షిణాన పడకటిళ్లు నేటికే అనుస్యూత మవుతున్నవి. ఇంకా సోమ వీధులా, సూర్యవీధులా తీర్చి కట్టిన నల్లిండ్లూ, మేలిండ్లూ ఆర్య శిల్ప శేషాలు మృచ్ఛకటికంలో చెప్పబడిన చారుదత్తుని నాలుగిండ్ల భవంతీ, పది ప్రకోష్ఠాలు గల వసంతసేన భవనమూ ఆ శిల్ప శేషాలలో ఆలోచింపదగిన విశేషాలు.



# 5. సేద్యము

ఆదిమనుష్యుడు ముందుకనుగొన్నది నిప్పు. అందఱు నందురు. అతనికి చెట్లు గురువులై యుండవచ్చును. చెట్టు లొండొంట రాచికొని అడవులు కార్చిచ్చుచే దగులబడుచుండగా నతడు దైనందినమును చూచియుండును. నేటికిని అడవిదాపులవారు కందిపుల్లమీద కంపిపుల్లనుగాని, గుమ్ముడుపుల్లనుగాని రాచి నిప్పు పడవైతురు. ఇంపుల కొన్ని రాలనుగూడ నుపయోగింతురు. శ్రౌతకర్మలకు రావికఱ్ఱమీద జమ్మికఱ్ఱ పెట్టి మథించి నిప్పు పడునటులు చేయుట పదపటి నేర్పై యుండును.

అడవులందును కొండలమీదను తమంతట తాము పెరుగు తృణధాన్యములను చూచి ఆదిమానవులు సస్యోత్పత్తికి ప్రయత్నించియుందురు. అటులే మేఘుని దయవలనను, తమ శక్తి వలనను పెరిగిన చెట్లకాయలను, పండ్లను తిని తోట పెంచియుందురు. అదియే సేద్యమునకు[1] సూత్రపాతము. 'జగత్తున కాదియను నది లేదు; కావున ఆది మానవులను కల్పన హుళక్కి' అనువారు వాయు పురాణమును[2] చూచికొందురు గాక ![3]

ఇపుడు మనకు గల వాఙ్మయము ఋగ్వేదము. ప్రాచీనమగు నెడల అందలి నాగలి అను పనిముట్టు కనబడుచున్నది. నాడు నాగలితో దున్నుచున్నటులందు కనుగొందుము. కావున నాటికి వేలకొలది యేండ్ల క్రిందటనే సేద్యము కలదని ఊహించుట లగ్గు.

---

1) సేద్య మను పదము 'ఛేద్య' భవమని నా యనుమానము. భూమి మొదట ఛేద్యమును భేద్యమును అయి పిదప హల్యమయియు యుండును. నేను పిడివాదము చేయను. నిర్ణయించుటకు పరిశోధకులున్నారు.

2) మొదటి కొన్ని అధ్యాయములు.

3) భాగవతము చూ.

అథర్వణమున నాగలి, ఎరువు క్షేత్రము మొదలగు కృషి విషయములు పెక్కులు కలవు. అటులయినను వ్యవసాయశాస్త్రమున వేదమున మథించుటకాని.

వేదముల తరువాత వేదసంహితలు. తరువాత సంహితలు. తరువాత పురాణములు. ఈ చివరవగు సంహితలందును, పురాణములందును కృషివర్ణనము పరిపూర్ణముగా గలదు. పరిపూర్ణముగా ఆనాటికి పరిపూర్ణము..

## సంహితలు :

వేదసంహితలకు పిదప పలువురు ఋషులు పురాణ సంహితల నొనరించిరి. విష్ణు పురాణము సంహిత. వాయుపురాణము సంహిత. స్కాందము సంహిత. పాద్మము సంహిత- ఇటులు పలుసంహితలు కలవు. అచటనచట వ్యాప్తమయియున్న శ్లోకముల నొకటిగా గూర్చినచో నది సంహిత. కొన్ని పురాణములు ముఖ్యముగా మూడుకాలములందు సంహితము లయినటు లా పురాణములవలననే తెలిసికొనవచ్చును. ఖగోళమునకు సంబంధించిన విషయములను ఓపికపట్టి చూచినచో నీసంగతి తేటపడును. భారతమున భీష్మ నిర్యాణ కాలమును, విష్ణుపురాణమున 'మఘాదౌచ తులాదౌచ' చూచునది.

## పరాశర సంహిత :

పరాశరునకు కృషీపరాశరుడని ఒక బిరుదు కలదు. దానికి పరాశర సంహిత యని పేరు.

పరాశరుడు చాలా ప్రాచీనుడు. ప్రాచ్య పండితులమీదకంటె పాశ్చాత్య పండితులమీదనే ఎక్కువ ప్రామాణ్యమున్నవారికి శ్రీ బిత్‌పోర్టును ప్రమాణీకరించును. ఆతడు "పరాశరుడు క్రీస్తువెనుక 1391వ సంవత్సరము వాడని వ్రాసెను. శ్రీ వుకానన్ అతని మతమును ఖండించి పరాశరుడు క్రీస్తువెనుక 1300 సంవత్సరమున నున్నాడని చెప్పెను. సరియ. సదరు పరాశరసంహిత మూడు వేల యేళ్ళక్రింది దన్నమాట.

సేద్యము చేయుట చాలా మంచిపని యని దాని యుపదేశము. ఖగోళశాస్త్రము చెప్పిన చొప్పున వానలను తేమనుబట్టి యెప్పుడే పైరు పెట్టిన ఫలవంత

మగునో ఆయా సంగతు లందుగలవు. మఱియు ఎడ్లను, వాని లక్షణములును, గోష్ఠమును గోచరములును, గోమయము నెగువుగా మార్చుటయు, నాగలి సామా[గియు ఏఱుకట్టి సామానును, దుక్కి దున్నుతెఱగును, విత్తులుకట్టుటయు, వానిని కాపాడుటయు, విత్తులు చల్లుటయు, ఎరువు వేయుటయు, పైరు కోయు టయు, ధాన్యము నుఱిచి తూరుపారబట్టి క్రైవిలు చేయుటయు, పాతరవేయుటయు, గాదెల నింపుటయు, వానికి పురుగు పట్టకుండజేయుటయు, పైరులకు నీరు కట్టు టయు భాద్రపదమాసమున తెవులు తగలకుండ నీరుపోద్రోలుటయు, తెవుళ్ళ కుపాయములును, మళ్లలో నీళ్లు నిలుచుట కుపాయములును, కోతలు కోయుట మొదలగు విషయము లిందు గలవు.

## హలయంత్రము :

నాగలి కెనిమిది ముఖ్యాంగము లిందు చెప్పబడెను. ఏడి, కాడి, గొడగ, అనగా ఏడిలేని నాగలి, నిర్యోలము (?), పాశిక (?), (గొడుగకును ఏడికిని కలిపికొట్టు) అడ్డచీల, శౌలము (?), ములుకోల,

ఏడి-5 మూరలు. కాడి-ఎడ్లచెవులవరకు, నాగలి-5 జేనలు. నిర్యోలము $1\frac{1}{2}$ మూర. పాశిక-12 అంగుళములు. అడ్డచీల 12 అంగుళములు. శౌలము-మూరెడు. ములుకోల-9 గాని $12\frac{1}{2}$ గాని పిడికిలికొలదులు; దీనిచివర ఇనుపముల్లు. ఈ రీతిగా కొలతలు చెప్పబడినవి.[4]

## ఏఱుకట్టు సామాను :

మోకు నాలుగు చేతులు. పగ్గము ఒకొకటి 5 చేతులు. ఆ బంధము '?' 15 అంగుళములు. పాశిక జిల్లేడాకును బోలియుండును- 9 అంగుళములు.

---

4) ఈషాయుగో హల స్థాణుర్నిర్యోల సప్యపాశికా
అడ్డ చల్లశ్చ శౌలశ్చ పచ్చనీచహలాష్టకమ్
పంచహస్తా భవేదీషాస్థాణుః పంచవితస్తికః
సార్ధహ స్తస్తు నిర్యోలోయుగః కర్ణసమానకః
నిర్యోలపాశికాచైవ అడ్డచల్లస్త థైవచ
ద్వాదశాంగులమానోహి శౌలోఽరత్ని ప్రమాణకః
సార్ధద్వాదశ ముష్టిర్వా కార్యావానవముష్టికా
దృఢా పచ్చనికాజ్ఞేయాలోహాగ్రా వంశసంభవా.

మఱియు పల గొఱ్ఱునకు 21 మేకులు ఉండవలయుననియు, పాపటము 9 చేతు లుండవలయుననియును గలదు.[5]

ఇది నాటి వ్యవసాయపు సామాను. దీని నంతయు పరిశీలించినచో నాటికిని నేటికిని ఈ హలయంత్రములో నిసుమంతయు నభివృద్ధి యున్నట్లు కానుపింపదు. నాడు నేటివలె నిముషమునకు నూరుమణుగుల బియ్యమును 65 మణుగుల గోధుమలును 50 మణుగుల పప్పు దినుసులును పడమటి కెగుమతి యగుటలేదు.[6] అమెరికా సంయుక్త రాష్ట్రములలో పేదలలో నిరుపేదరైతున కొక్కనికే యొకచోటనే యేక ఖండముగా 160 ఎకరములకు తక్కువకాని పొల మున్నటు లీ భరతవర్షమున నే రైతున కేని వున్నదా? అథర్వణమున చెప్పబడిన చందముగా నేటికిని భరతఖండమున సాగు కాని భూములు చాల కలవు. ప్రాచీనకాలమున పాకశాస్త్ర మెవరేని రచించియుండిరేని[7] దాని జదివిన వారు నాటికిని నేటికిని పాకమున నభివృద్ధి యున్నటులు చెప్పజాల రనుకొందును.

## పొలము పైరు మార్పు

వైదిక కాలమున పైరుమార్పు కనబడుచున్నది. ఇటులు మార్చునపుడు రెండుగాని, మూడుగాని క్షేత్రములు ఉపయోగింపబడుచుండెను. ఏచేటను ఆ మూడు పొలములలో నొకదానిని బీడుగా నుంచుట కనబడును. దానికి ఖిలమని పేరు. ఔత్తరేయ భాషలలో పైరుకట్టక నిలిపిన భూములకు ఖిల్ అని నేటికిని

---

5) ఆ బంధోమండలాకారః స్మృతః పంచదశాంగులః ?
యో క్త్రింహ స్త చతుష్కంచరజ్జుః పంచకరాత్మికా
పంచాంగుళాధికో హస్తోహస్తో వాఫాలకః స్మృతః ?
అర్కస్యవత్ర సదృశీపాశికా చనవాంగుళా ?
ఏకవింశతి శల్యస్తు విద్ధకః పరికీర్తితః
నవహస్తాతు మదికా ప్రశస్తా కృషికర్మను.

6) ఇది యుద్ధమునకు చాల వెనుకటియేండ్ల లెక్క.

7) నలుడును భీముడును క్రియాశూరులే కాని వాక్శూరులు కారు. ఐనను సంస్కృత వాఙ్మయమున నలపాక శాస్త్రమని ఒక గ్రంథ మున్నది. రుచికలవారు దానికి వ్యాఖ్య వ్రాయ వలసి యున్నది.

వాడుక యున్నది. మఱుసటియేడు ఈ ఖిలమును దున్ని పైరు పెట్టుదురు. పైరు పెట్టిన పొలమును ఒకయేడు ఖిలమునుగా ఉంతురు.[8] యుక్తి కల్పతరువను ఇటీవలి యొక గ్రంథమునందు పైరు తప్పక మార్పవలయుననియు,[9] మార్చనిచో పొలము బీదపడుననియు నున్నది.

## గోచరములు :

మఱియు వైదిక కాలమునందు పశువులకుగాను బీళ్ళ యేర్పాటు కలదు. పశులు మేయు బీటికి వ్రజ[10] మనియు గోష్ఠమనియు[11] సుయవస[12] మనియు, ఖిలమనియు పేళ్ళు. సస్య పరివర్తనమునకుగాక పశుల మేతకు ప్రత్యేకముగా బీళ్ళు ఉండియుండును. ఆయకట్టులో జేర్పకమునుపు చాలా గ్రామములందు ఈ గోచరములు కలవు.

## ధాన్యములు :

పురాణసంహితలకంటె ప్రాచీనతరములని తలపబడు వేదసంహితలలో నొకటియైన వాజసనేయ సంహితలోని చమకమునందు వడ్లు మినుములు యవలు నువ్వులు, సెనగలు, స్వాల్వము, పశు గ్రాసము, ప్రియంగువులు (పెంఖణము) నవము, చామలు, నెవ్వగులు గోధుమలు, మసూరములు[13] ఉన్నటులు కానబడు చున్నవి. సంహితల వెనుకనున్న అథర్వణమున మినుముల[14] మాట యున్నది దానికి వెనుకటి దగు ఋగ్వేదమున యవలును వరులును[15] కనబట్టుచున్నవి.

---

8) ఋక్. 8-91, 5, 6.

9) తథా వర్షేషు వర్షేషు కర్షణాద్భూ గుణక్షయః
ఏకస్యాం గుణహీనాయాం కృషి మన్యత్ర కారయేత్.

10) ఋక్. 1-10; 7-1-92; 4-9-94-1.

11) 8-43-6-28-7 ఇత్యాది.

12) 6-28-2. 10-14-2-3 ఇత్యాది.

13) 4-140-2; 12-2-53.

14) 1-23-15.

15) 1-18.2; 3-35-3.

## రెండు పంటలు

ఇప్పుడు మెరకనేలలలో పునాస పైరులు కోసిన తరువాత దున్ని ఆ భూమిల్లోనే ఉలవవేయుట అంద తెలుగుదురు. ఇపుడు వేరుశనగ పంట యెక్కుడైన పిదప పునాసలు పూర్తిగా పోయెను. వేరుశనగ పూర్తిగా పక్వముకాక మునుపే తీయుటయు, వెను వెంటనే ఉలవవేయుటయు జరిగిపోవు చున్నది. వేరుశనగ యెంత పాడయినను దానికి వెలయున్నది. ఉలవలకు వలసినంతకన్న వలంతి వెల కదా! ఇట్టి పంటలు రెండు తైత్తిరీయమున తగులు చున్నవి.[16]

## పంటలు - ఋతువులు

పై సంహిత కాలమునందు యవలపంట గ్రీష్మమున వచ్చునని కలదు[17] కావున హేమంతమునందు యవలను గొర్రబట్టుదురని ఊహింప వచ్చును. మనదేశములో స్థలభేదముచే జొన్నలు మఖపుబ్బ కార్తెలలో విత్తుదురు. ఓషధుల వంటి సస్యములు వానకారున కోతకు వచ్చును. వరులు శరత్తున కావున గ్రీష్మముననో, వర్షఋతువుననో వరులు నాటుచుండియుందురు. లేక చల్లుచుండియుందురు. మినుములును, నువ్వులును హేమంత శిశిరములలో తీయుదురు. కావున గ్రీష్మాంతముననో, వర్షాకాల ప్రారంభముననో పైరు పెట్టుచుండియుందురు. సదరు పంటలు కోసిన తర్వాత కొన్ని చేలలో రెండవపైరు పెట్టుచుండియుందురు. సస్యపరివర్తనమునకు కొన్ని చేలు బీడుపెట్టుచుండియు నుందురు. మౌర్యుల యేలుబడిలో సస్యపరివర్తనము అమలులో నున్నటులు సాక్ష్యమున్నది.[18] ఆ కాలమున వరులు కేంద్రములు, నువ్వులు, ప్రేంఖణములు గ్రీష్మాంతమునను, శనగలు, మినుములు, పెసలు మొదలగునవి వానకారు నడుమను, యవ కుసుంభ కుడవ మసూర గోధూమ కలాయ సర్షపాదులు శరదృతువునను పైరు పెట్టుచుండినటులు కానవచ్చును.

---

16) దీర్ఘస్సంవత్సరస్య సస్యం పచ్యతే (5-1-7-3).

17) యవమ్ గ్రీష్మా ఓషధీర్ వర్షాభ్యో వ్రీహీం
శ్ర గదేమాషాతింహోమంత శిశిరాభ్యాం (7-2-10-2)

18) అర్థశాస్త్ర - రెండవ భాగము (మైసూరు ప్రతి).

క్రీస్తువెనుక సుమారు రెండువేల అయిదువందల యేండ్ల వెనుక సంవత్సరమును ఆరు ఋతువులుగా విభజించినటులు కానిపించును. అదియు చాంద్ర సంవత్సరము ఐనను ఆంధ్రదేశమున నేటి ఋతుపవనముల పట్టి ఆర్యావర్తము మొదలగు ఉత్తరదేశములందలి ఋతువులను పరిగణింపరాదు. దేశ భేదమునుబట్టి మార్పులుండును. మానభేదమును గూడ జాగ్రత్తతో గమనింపవలెను.

అన్నిటికంటె ప్రాచీనమగు ఋగ్వేదమునందు నాగలి యను కొఱముట్టు కనబడుచున్నదని లోగడ తెలిపియుంటిని.

> శునం వాహాః శునం నరః శునం కృషతు లాంగలం
> శునం వరత్రా బధ్యంతాం శున మష్ట్రా ముదిఙ్గయ (4-57-4)

ఎడ్లు సుఖముగా లాగుగాక. మనుష్యులు సుఖముగా పనిచేయుదురుగాక. నాగలి సుఖముగా దున్నుగాక. ములుకోల సుఖముగా తోలుగాక.

> అర్వాచీ సుభగే భవ
> సీతే ! వందామ హాత్వా
> యథా న స్సుభగా మసి
> యథా న స్సుఫలా మసి.

ఓ సీతా ! (నాగేటి చాలు) మా కభిముఖివి కమ్ము. నీకు నమస్కరింతుము. మాకు నిండుగా పండుము.



# 6. గణిత విజ్ఞానము

మూడు నాలుగు వేల యేండ్ల వెనుకటి సంస్కృత వాఙ్మయమున గణిత విజ్ఞాన మున్నది. యజ్ఞములలో పలు దెరగులగు చితులు రచింప వలసి యుండును. దానిని బట్టియే చితి యనగా కూడిక యను నర్థము గణిత పరి భాషలో కలదు. తైత్తిరీయ సంహిత కొన్ని వేదికల యాకారము గుండ్రముగను, కొన్నిటి యాకారము అర్ధచంద్రుని వలెను మరికొన్నిటి యాకారము త్రికోణము గను, మరి చతుష్కోణముగను, చెప్పుచున్నది. ఈ యజ్ఞవేదుల కెన్ని యాకార ములున్నను క్షేత్రఫల మొకటియే కావలయును. కావున నానాకారములు గల క్షేత్రముల క్షేత్రఫలము గనుగొనుట అత్యావశ్యకము. శుల్బసూత్రము దీనిని నిరూపించుచున్నది. చచ్చవుకమగు క్షేత్రపు భుజముతో (Side) దాని కర్ణము నకు (diagonal) గల సంబంధ మేమి? ఆయతమగు క్షేత్రముతో సమపడు వర్గక్షేత్రమును రచించు టెటులు? వృత్తాకారమగు క్షేత్రమునకు సమానముగా వర్గక్షేత్రమును నిర్మించుట యెటులు? అను నీ మొదలగు ప్రశ్నముల కీశుల్బ సూత్రమున సమాధి లభించును.

భారతీయులకు కర్మకాండ పెరిగిన కొలదియు యజ్ఞవేదులయు, యజ్ఞ కుండములయు నిర్మాణమున కుపయోగించు క్షేత్ర తత్త్వ గణితము పెరుగుచు వచ్చెను. ప్రాచీన కాలమున భారతవర్షమున వైదిక కర్మకాండలకే క్షేత్రగణి తము సంబంధించి వచ్చెకాని, గ్రీస్ కాల్డియా దేశములందువలె పొలముల కొలతలు మొదలయిన వ్యవహారకాండలకు సంబంధించుచు రాలేదు. ఆ కాలమున కాస వచ్చిన కాసంత గణితముకూడ శైశవములోనే సందు తగిలి పోయెను. గ్రీకులు క్షేత్రగణితమున చాల ముందరి కేగిరి. భారతీయులకు తెలిసిన తావన్మాత్రపు క్షేత్రగణితముగూడ గ్రీస్ దేశము నుండి ఎత్తుకొని వచ్చినదని కొందరు పాశ్చాత్యులు సంతసించిరి. శుల్బ సూత్రము నుద్ధరించిన థీబో 'భారతదేశము నందలి క్షేత్రగణితము భారతదేశము వారి సొమ్ము. ఇది క్రీస్తువెనుక ఎనిమిదవ శతాబ్దపు నాటిది' అని పై విమర్శకులు మోపిన కళంకమును క్షాళన మొనరించెను,

క్షేత్ర తత్త్వము, కుండసిద్ధి మొదలగు సుమారు పదియేను క్షేత్రగణిత మునకు సంబంధించిన గ్రంథము లిపుడు దొరుకుచున్నవి. యజ్ఞములు మూల బడిన తరువాత దేవాలయము లందును, శరద్వసంత నవరాత్రములం దనుష్ఠేయ మగు దుర్గాపూజ యందును, తంత్రములందును, మరికొన్నిటి యందును సంక్షిప్త యజ్ఞమే చూపట్టును. దీనిని గురించి విడిగా వ్రాయవలయును. ప్రాజ్ఞులంద రీ విష యమును పరిశీలించునది. ఈ క్షేత్ర తత్త్వ వ్యవహారము (Mensuration) ను, కుండరచనయును కడుగొలదిగా అగ్నిపురాణము నందు కనబడుచున్నది. ఆగ మము లందు కొంచెము విరివిగా కలదు.

## జ్యోతిష సంహితలలో గణిత విజ్ఞానము

క్రీస్తుకు వేయికి వెనుకపుట్టిన జ్యోతిష సంహితలలో పరికర్మాష్టకమునకు సంబంధించిన లెక్కలు కలవు. పరికర్మాష్టక మనగా కూడిక (చితి), తీసివేత, హెచ్చవేత, భాగహారము, వర్గము మొదలగు లెక్కలు; మనకు వేళ్లు పుట్టినపుడే కూడికలును, తీసివేతలును పుట్టె ననుకొందును. సంఖ్యావాచకములగు శబ్దము లందే కూడికయు, తీసివేతయు, హెచ్చవేతయు, కానిపించును. ఏకాదశ = ౧ + ౧ = ౧౧ (పదునొకండు) త్రయోదశ = ౩ + ౧౦ = ౧౩ (పదమూడు) ఈ మొదలగున వెక్కుడుగా కూడికలో నున్నవి. సంస్కృత సంఖ్యావాచక పదములం దేకాంకము మొదటను, తెలుగునందు చివరను గలవు. దీనికి హేతు వన్యత్ర విచార్యము.

"ఏకోనవింశ = ౧-౨౦ = ౧౯ (పందొమ్మిది). దీనికి నవదశ అనియు వేదకాలమున వాడుక కలదు. "సప్తదశచమే, నవదశచమే" అని యజుస్సంహిత. పంచమ ప్రపాఠకము. "ద్వాత్రింశత్" = ౨ + (3 + 10) = 32. చూ. పై. ఇందు కూడికయు, హెచ్చవేతయు కలిసియున్నవి. వేదకాలముననే ఇట్టి గణన వ్యవహార మున్నదని తెలుపుటకు వేదములనుండియే పై యుదాహరణముల నిచ్చి తిని. వేదము లందలి సంఖ్యేయములు, సంఖ్యలును విచిత్రముగ నుండును- పాణిని కాలమున కొంత మార్పు చూపడును.

ఇక సంహితలకు మరలుదము.

నాటి వారికి తిథిని కనుగొనుటకు గణితము కావలసి వచ్చెను. తిథి జ్ఞానమునకు నక్షత్రమును, చంద్రుడును ప్రాతితో దబ్బనమువలె వత్తురు. మరియు గ్రహములకక్ష, పరస్పర దూరము, వీనికొలత, లంబనము, పలనము, ఇష్ట సంఖ్య (×) కొండగుర్తు ఇవన్నియు కనుగొనుట సామాన్యమైన పనిగా కనపడదు. ఆనాడు కూడికకు + (ప్లస్) అనియు, తీసివేతకు — (మైనస్) అనియు, హెచ్చవేతకు × (ఇంటు) అనియు, భాగహారమునకు ÷ అనియు గురుతులు కలవు (భారతిలో. నా వ్రాసిన ప్రాచీన ఖగోళమును గూర్చిన రెండవ వ్యాసము చూచునది) ఆర్యభటుని కాలమున యీ గురుతులు వ్యవహారములోనికి వచ్చినచో అంతగా ఆశ్చర్యము పడము కాని, క్రీస్తుకు వేయేండ్ల వెనుకనే యివి కల వనుచో ఈవిషయ మాలోచింపవలసియే యుండును. ఈ గురుతులు గ్రీసు కాల్డియా దేశములో క్రీస్తు కించుమిం చొకటిరెండు శతాబ్దుల వెనుక కనబడును.

భారతీయులకు దేశాంతర వాసులకంటె మునిముందుగానే విజ్ఞాన సంపద యంతయు కలదనియు అది సంపూర్ణమనియు తెలుపుట నా యుద్దేశము కాదు. 'ఉన్నదిది' అని తెలుపుటయే నా వంతు. దీనివలన లాభ మేమేని కలదో, లేదో నే నెరుగను.

దానిని పాఠకులకే వదలుదును.

## అంక గణితము

పిషావర్ దాపులలోగల 'బక్షాలి' అను ఊరిలో 1881 సాలున భూమి తవ్వుచుండగా "అంక గణితమను" ఒక గణిత గ్రంథము దొరకెను. ఇది కొంత శిథిలమైపోయెను. కొందరు దీనిని క్రీస్తుశకము మూడవ శతాబ్దము నాటి దనియు, మరి కొందరు పంద్రెండవ శతాబ్దినాటి దనియు అనిరి.

దీనిలో కూడికకు 'యు' అను గురుతును, సమీకరణమునకు 'ఫ' అను గురుతును కలదు. యు = యుతి. ఫ = ఫలము. ఇటీవలి వారు కూడికకు యోగ మనియు, సమీకరణమునకు లబ్ధమనియు, వాడిరి. దీనివలన నిది ౧౨వ శతాబ్దిది కాదు. మరియు వేదకాలమునందలి చితి సంజ్ఞ ఇందు గలదు. ఈ

గ్రంథము నందలి గుణోత్తర శ్రేఢి, సంకలితశ్రేఢి, త్రైరాసికము, వృద్ధి, చక్రవృద్ధి, మొదలగు వానివలన ఆనాడంకగణితము ఏ స్థితిలో నుండెనో, భాస్కరాదుల కది యెటు లుపకరించెనో యింకను తగినవారు పరిశోధింపవలెను. ఈ గణితము నందలి 'కేన కాలేన సమతాంగణయిత్వావదాశుమే' ఇత్యాది రచనల యనుకరణము తరువాతి గ్రంథములం దన్నిటను చూపట్టును.

## దైనందిన గణితము :

పాటీ జ్యామితి పరిమితి త్రికోణమితి మొదలగు గణితములు సభ్యజాతికి నిత్యవ్యవహార్యములు. నిత్యవ్యవహారములలో 'అతిభుజ' (Hypotenuse), చతుర్భుజ (quadrilateral), త్రిభుజ (Triangle), పంచభుజ (Pentagon), షడ్భుజ (Hexogan), సప్తభుజ (Heptagon), దశభుజ (Decogon), బహుభుజా (Polygon), దులతోనే కాక బహువిధములగు కర్ణములతో పనియుండును. పది శతాబ్దులక్రింద పాకశాస్త్రమును రచించిన ఒక వంటబ్రాహ్మణుడు ఇన్నివిధములగు ప్రొయులలో తన పాండిత్యమును ప్రకటించెను. అది యటుండె.

మొదట మొదట సంఖ్యేయ శబ్దము సంఖ్యాబోధకము. నేటికి నది కలదు. మరియు నది పోదు. ఇది ఛందశ్శాస్త్రము నందును, కవులందును సూక్ష్మముగా ప్రవేశించెను. పాణినీ సూత్రములలో ఇందులకు చాల నుదాహరణములు కలవు. 'షడ్గవచ్' మొదలగు వానిని చూచునది. ఇక జ్యోతిషము నందంతటను ఈ వ్యవహారమే కనబట్టును.

> "నందా ద్రీందుగుణా స్తథా శకనృప
> స్యాంతే కలేర్వత్సరాః"

అనగా నందులు తొమ్మండ్రు కావున ౯ అనురాశి. కులాద్రులు ఏడు కావున 7 అనురాశి. చంద్రు డొకడు–1. గుణములు సత్త్వ రజస్తమస్సులు 3. 'అంకానాం వామతో గతిః'. అంకెల కరబ్బుల అక్షరములకు వలె పుర్రచేయి కావున ఎడమనుండి వ్రాయుచో 3179 అను అగును. కలిలో ఈ వత్సరమున శకనృపావసాన మని అర్థము. సంఖ్యేయమగు శబ్దము సంఖ్యార్థమునందు

వాఙ్మ యొక భారతదేశమునందే గాని యన్యదేశము లందు లేదని పాశ్చాత్యులు వ్రాసిరి.

## గణిత విశేషములు

పూర్వము మనదేశమున కన్యాపక్షమువారు వరుని యుక్తిలెక్కలడుగుట కలదు. ఆ పరీక్షలో నెగ్గినచో శుల్కముతోగూడ పిల్ల నిచ్చెడివారు. నా కాలమున ఆ పరీక్షయే యున్నచో నాకు బ్రహ్మచర్యము అవలంబింపగల సౌభాగ్యము కలిగెడిది. నాకు భద్దఫారములో నూటికి తొమ్మిది మార్కులు వచ్చెను. ఒక మార్కు వచ్చిన నాతమ్ము డొక డున్నాడు. ఆయన సంగతి ఇపుడెటు లున్నదో నాకు తెలియదుగాని నాచదువు భర్ధఫారముతోనే పూర్తియగు టాతనికి తెలియునుగాన నా సంగతి మాత్ర మాతనికి లెస్స తెలియును. మా కపుడు గణిత మెటులో చెప్పిన శ్రీ కామవరపు వీరరాజుగారిని (దువ్వ) స్మరింపకుండ జాలను.

గణితవిజ్ఞాన మటుతరువాత వాస్తుశాస్త్రమునకును అనగా ఇండ్లు, దేవళములు, కోటలు, పేటలు, కట్టుటకును, నూతులు చెరువులు తీయుటకును, శిలా లోహాదులతో దేవవిగ్రహములు చేయుటకును, లలితకళలలో ముఖ్యముగా సంగీతశాస్త్రమునకును, ఛందః ప్రస్తారమునకును కావలసివచ్చెను. ధనుశ్శాస్త్రము ప్రాముఖ్యముగా, గతిగణితము (Dynamics) నుపయోగించుకొనెను. తెలుగులో ధనుశ్శాస్త్ర మను పద్య ప్రబంధ మొకటి కలదు. అందీ గణిత పరిచితి లేదు గాని సంస్కృత ధనుశ్శాస్త్రమున కడుకొలదిగా నున్నది. గతివిజ్ఞానముచే విల్లనంబులు చేయుచో శత్రుసంహారము సుకరము. దీనికి భాస్కరుని లీలావతి నుండి యుదాహరణము.

## సర్పమయూర చిత్రము : (లీలావతి)

"కలదొకకేకి యెన్మిది యొకండగు చేతుల యెత్తు చెట్టుపై
నిలిచి గని యొక్కపా మిరువదేడగు చేతుల దౌలఁ జెట్టు నీ

డలగల పుట్టలోఁ బడగఁ దాఁ జనెఁ, దుల్యగతిన్ శిఖావళం
బిల డిగిపట్టెఁ, జెట్టునకు నెంతటి దవ్వునఁ బట్టెఁ జెప్పుమా !"

తొమ్మిదిచేతుల యెత్తుకల ఒకచెట్టుమీద నొక నెమలి యున్నది. చెట్టుకు ఇరువదేడుచేతుల దూరముగ నొక ప్రాముచున్నది. ఇవి రెండును ఒండొండ చూచుకొనినవి. పాము చెట్టుమొదటనున్న పుట్టలో పోయి పడుటకు ప్రాకిపో దొడగెను. నెమలి దానిని పట్టుకొనుటకు దానిమీధికి వాలెను. రెంటి గతియు సమము. ఈ స్థితిలో చెట్టు కెన్ని చేతుల దూరమున నెమలి పామును పట్టుకొన గలదు ?

దీనికి సూత్రము :- కోటి వర్గమును భుజకర్ణముల మొత్తముచే భాగించి లబ్ధమును భుజకర్ణముల మొత్తమునుండి తీసి వైచునది. దానిలో సగము భుజ పరిమాణము, భుజకర్ణముల మొత్తము నుండి భుజమును తీసివేయుచో శేషము కర్ణమని వేరుగా చెప్పనక్కరలేదు.

కోటి యనగా నిలువురేఖ. భుజమనగా సరళరేఖ. అది యిటు లుండును. కర్ణ మనగా నెదురుగా నుండు రెండుమూలలను కలుపు రేఖ . కఖ = (స్కంధము) కోటి. భుజాగ్రగ బిందువు కడ పామున్నది. కోటి ౯ చేతులు. క వృక్షమూలము. అటనుండి గ కు 27చేతులు. క బిందువున కెంత దవ్వున నెమలి పామును పట్టగలదో తెలిసికొనవలెను. ఘ బిందువు కడ నెమలి పామును పట్టుకొనె నని అనుకొందము అటు లగుచో ఖ బిందువునుండి ఘ బిందువు వరకును ఒక గీటు గీచుచో ఖఘ రేఖ ఘగ రేఖకు తుల్యమగును. రెంటి గతియు సమము కావున గ బిందువునుండి పామెంత దవ్వు రాగలదో ఖ బిందువునుండి నెమలియు సరిగా నంతదవ్వుననే వాలగలదు. కావున-


"కలదొక కేకి యెన్మిదియొకండగు చేతుల యెత్తు చెట్టుపై
నిలగని యొక్క పామిరువదేడగు చేతుల దాల జెట్టుని
డలగల పుట్టలోఁ బడగఁ దాఁ జనెఁ దుల్యగతిఁ శిఖావళం
బిలడిగి పట్టెఁ జెట్టునకు నెంతటి దవ్వున బట్టెఁ జెప్పుమా!"
(లీలావతి)
క
ఘ
గ



చక్ర క్రౌంచాకులిత సలిలే క్వాపి దృష్టం తటాకే తోయాదూర్ధ్వం
కమల కలికాగ్రం వితస్తి ప్రమాణం
మందం మందం చలిత మనిలే నాహతం హస్త యుగ్మే
తస్మిన్నగ్నం కథయ గణకే క్షిప్ర మంభః ప్రమాణం
(లీలావతి)

"చక్రక్రౌంచాకులిత సలిలే క్వాపి దృష్టం తటాకే
తోయాదూర్వం కమల కలికాగ్రం వితస్తి ప్రమాణం,
మందం మందం చలిత మనలేనా హతం హ స్తయుగ్మే
తస్మిన్మగ్నం కథయగణ కేక్షిప్రమంభః ప్రమాణం." (లీలావతి)

ఇచట ఖ పైభాగము జలోపరి భాగము. ఖ కడనుండి క వరకును తామరతూడును, దానిపై విచ్చిన తమ్మియు. తామరతూడు $\frac{1}{2}$ చేతియెత్తు. పద్మము గాలికి గ బిందువుకడ బడెను. భుజము 2 చేతుల పొడవు. ఇపుడు నీటి లోతు కనుగొనవలయును.

క ఖ $\doteq$ గ ఘ

$\frac{1}{2}$చే భుజవర్గమును భాగించిన 8 రాశి వచ్చును. $+\frac{1}{2}=\frac{17}{2}$ దాన సగము. $\frac{17}{4}$ ఇది కర్ణ పరిమాణము. $\frac{17}{4}-\frac{1}{2}=\frac{15}{4}$ ఇదియే కోటి పరిమాణము, లేక నీటిలోతు.

ఈ లెక్కలు గాక భరతఖండమునం దొక్కొక్క దేశమున నొక్కొక్క మాదిరి వింత లెక్కలను అనేకములను వినుచుందుము. జానపద గీతములతోపాటు ఇవియు జనముఖ భాండారముల నుండి జారిపోయినవి; పోవుచున్నవి. దొరికినంతవరకు వీనిని గ్రంథస్థము చేయుటెన్నడేని కలుగునా ?

ఇంకొక్క లెక్క—

నలుగురు వైశ్యవర్యు లొకనా
డొకదీవిని జేరి యొండు లొం
డులు పది యింద్ర నీలములు
నూరు సుపాణులు నైదు వజ్రముల్
కులమణు లెన్మిదిం బడసి
కూర్మిదలంచి సమాన మూల్యమే
ఓలయగ గొన్ని మార్చుకొని
రిందుల నెక్కటి విల్వ కట్టు మీ॥" (లీలావతి)

= ఒకనికి 10 నీలములును, ఇంకొకనికి 100 ముత్తెములును, మరొకనికి 5 వజ్రములును, వేరొకనికి 8 మణులును దొరకెను. వీరు నలువురును స్నేహ వశమున కొన్ని విడిగో లొనరించుకొని సమమూల్యము నొందిరి. అటులగుచో నొక్కొక్క మణి వెల యెంత.

సూత్రము :— వినిమయ స్వరూపమును జనసంఖ్యచే హెచ్చించి లబ్ధము నొక్కొక్కని మొత్తమునుండ విడివిడిగా తీసివేయునది. భాగశేషము రాని ఇష్టరాశిని వెనుక తీసివేసిన మొత్తముచే భాగించునది. భాగలబ్ధ మొక్కొక్క దానివెల.

ఇచట జనసంఖ్య 4. వినిమయస్వరూపము 1. 4 × 1=4. 10. 100, 5; 8—4=6, 96, 1, 4 వచ్చును. శేషము రాని అభీష్టసంఖ్య 96 అని అనుకొందము. దానిని వెనుక తీసివేయగా వచ్చిన 6, 96, 1, 4చే భాగింపగా 16. 1, 96, 24 వచ్చును. కావున ఒక్కొక్క నీలము వెల 16, ముత్తెము వెల 1, వజ్రము వెల 96, మణి వెల 24.

| | |
|---|---|
| 10 నీలములు × 16 | 160 |
| 100 ముత్తెములు × ∧ = | 100 |
| 5 వజ్రములు × 96 = | 480 |
| 8 మణులు × 24 = | 192 |
| ఏకోను | 932 |

4చే భాగింపగా 233.

కావున ఒక్కొక్కని సంపత్తి వెరసి 233.

విడిగోలు.

1 వజ్రముల వాని కడనుండి 3 వజ్రములు తీసికొని మణులవానికి 1 టీ, ముత్యాలవానికి 1 టీ ఇచ్చి, 41 ముత్యములు వీని కిచ్చునది. ఇపు డితని కడ 2 వ. + 41 ము. లుండును.

2 వ్రజములు = 192
41 ముత్యములు = 41
ఏకోను 233

2 మణులవానికడ నుండి 3 మణులు నీలాలవాని కొసగునది. మరియు వీనికి 17 ము త్తెములు ఇచ్చునది. ఇపుడు వీనికడ 5 మ. + 1 వ. + 17 ముత్యము లుండును.

5 మ. = 120
1 వ. = 96
17 ము. = 17
ఏకోను = 233

3 నీలమువాని కడనుండి 6 నీలములు తీసి ముత్యాల వానికిచ్చి వాని ముత్యమొకటి వీని కిచ్చునది. ఇపుడు వీనికడ 3 మ + 1 వ + 4 నీ + 1 ము ఉండును.

3 మ = 72
1 వ = 96
4 నీ = 64
1 ము = 1
ఏకోను 233

4 ముత్యాలు వాని కడనిపుడు 1 వ + 6నీ + 41 ము త్తెములు కలవు.

1 వ = 96
6 నీ = 96
41ము = 41
రాలఏకోను = 123 ఏకోను = 233.

# 7. కులపర్వతములు

భారతవర్షములో మహేంద్ర మలయ సహ్య శుక్తిమత్ ఋక్ష వింధ్య పారియాత్రములు అనే ఏడు కుల పర్వతాలు ఉన్నవని వాయుపురాణం.

(వాయు. 57 అ.)

గంగపుట్టిన చోటినుండి _ అనగా హిమవంతం నుండి కన్యాకుమారి వరకు దక్షిణోత్తరంగా వేయి యోజనములున్నూ తిర్యగుత్తరంగా తొమ్మిదివేలు యోజనములున్నూ తిర్యగుత్తరంగా తొమ్మిదివేలు యోజనములున్నూ (?) వ్యాపించి ఉన్న భూమి భారతవర్షం లేక భరతఖండం (5 అధ్యా.)

భరతవర్షంలో ఇంద్రద్వీపం మొదలుగా మరి ఎనిమిది దీవులున్నయ్! అవి సముద్రాంతరితాలు కాబట్టి ఒకదాని కింకొకటి కనబడదు అని వాయుపురాణం చెప్పిన (45 అధ్యాయం). ఆ దీవులు బహుశా అటు అరేబియా ఇటు బర్మా మొదలయినవి కావచ్చునేమో! ఆ సంగతి పరిశోధకులకు వదలివేదాం!

ఈ సందర్భములో ఈ సంగతిని గమనించాలి: కైలాసపర్వతాన్ని భారత వర్షాన్ని లేక ఖండాన్ని లేక ద్వీపాన్ని చెప్పేటప్పుడు వాయుపురాణం భారత ద్వీపానికి తూర్పునా పడమటా సముద్రాలున్నవని చెప్పడం వల్ల అటు గాండ్వా నాలాండ్‌గాని ఇటు లెమూరియా గాని వాయుపురాణం 45 అధ్యాయం ఎరుగదు అని చెప్పవచ్చు।

అమరసింహుడు, —

'హిమవాన్నిషధో వింధ్యో మాల్యవాన్ పారియాత్రకః
గంధమాదన మన్యేచ హేమకూటాదయో నగాః'॥

అని జంబూద్వీపంలోని కొన్ని పర్వతాలను గురించి చెప్పాడు। 'హిమవాన్ = మంచు కలిగినది.

ఇది కింపురుష వర్షమునకు దక్షిణమందు మేరయై యుండునది. నిషధః = సురలు దీని యం దుందురు! ఇది హరివరమనెడు వర్షమునకు ఉత్తరమందు

బాలసూర్య ప్రకాశమై యుండును. వింధ్యః = అగస్త్యునిచే వ్యథబొందినది. అది భారతవర్ష మందుండు కులపర్వతము.

మాల్యవాన్ = మాలాకారము గలది. మాల అనగా పూలదండ. ఇదియే క్రౌంచ పర్వతము. ఇది మేరు పర్వతమునకు పడమట గంధమాదన సమప్రమాణమై యుండును.

పారియాత్రకః = చుట్టువాఱ నడచుట గలిగినది. అది భారత వర్షమందు కులపర్వతము. గంధమాదనః = పుష్పగంధము చేత సంతోషింప జేయునది. ఇది మేరు పర్వతమునకు తూర్పున నుండునది. హేమకూటః = బంగారు శిఖరములు గలది. అది కింపురుషవర్షమునకు ఉత్తరమున నుండునది' అనిలింగాభట్టు.

దీన్నిబట్టి వర్షవిభాగానికి ఈ కులపర్వతాలు సరిహద్దులుగా ఎన్నుకోబడిన వని తోస్తుంది.

జంబూద్వీపంలో ఒకొక్క వర్షంలోనే కాక నిరక్షరేఖ క్రింది ఆరుదీవులలో దీనికి ఏడేసి కులపర్వతాలు ఉన్నవని పురాణాలు చెప్పినవి. అమరసింహుని 'అన్యేచ'కు అవి కూడా అని అర్థం.

ఈ కొండలు ఎలా పుట్టినవి? భూమి ఎలా పుట్టిందో చెప్పనిదే ఈ ప్రశ్నకు సమాధానంరాదు కాబట్టి భూజననం ఎలా అయిందో తెలిసికుందాం. నవ్యశాస్త్రజ్ఞు లిలా చెబుతున్నారు.

## భూమి సూర్యుని కూతురు

ఒకానొక పెద్ద నక్షత్రం ఎప్పుడో సూర్యునికి దాపుగా వచ్చింది. సూర్యుడింకా వేడివేల్పు ఐనాడు. అతనిలోంచి ఒక పిండం పెట్లి ఫెడేలుమని పడ్డది. ఆకర్షణ మహిమవల్ల అది సూర్యుని ప్రదక్షిణం చేస్తూ కూచుంది, ఇప్పటికినీ గిరగిరా తిరిగే ఆ అగ్నిపిండంలోంచి మళ్ళా మరికొన్ని ముక్కలు ప్రిదిలిపడ్డవి. ఇవన్నీ క్రమక్రమంగా చల్లబడి భూమిగానూ చంద్రుడుగానూ గ్రహాలుగానూ ఐనవి।

ఈ సంగతి వినంగానే ఎన్నో శంకలు తోస్తవి. భూమి బొగ్గువలె కన బడదేమి? చంద్రునికి అంత కాంతి ఎట్లా? సూర్యునిలోంచి పెటిలిపడిన యింత పలం కల భూమి, ఆకర్షణక్షేత్రం దాటకుండా తండ్రిచుట్టూ ప్రదక్షిణం చేస్తూం డానికి అంతశక్తి ఎటువలె వచ్చింది? అసలు సూర్యుడెల్లా సృష్టి ఐనాడు? సమాధానాలను ఆయాశాస్త్రులకు అప్పగించి ప్రకృతం అనుసరిద్దాం!

ద్రవ్యాలు అణువుల ప్రోవులు (Molecules). వానిని పరమాణువులు గానూ,- Atoms- వానిని మళ్లా ఎలెక్ట్రానులుగానూ ప్రోటానులుగానూ మరి యెన్నో టానులుగానూ విద్వాంసులు విభజించారు. వానిముందు వాలఖిల్యులు కులపర్వతాలు. ఈ అణువులో ప్రోటాను బరువు కాబట్టి అది నడుమ తన్నా వేసింది. దాని చుట్టాగిట్టూ సూర్యుని చుట్టూ గ్రహాలలాగా ఎలెక్ట్రానులు గిర గిరా పారా ఇస్తుంటవి.

మంచును వేడిచేస్తే నీరవుతుంది. నీటిని వేడిచేస్తే ఆవిరి అవుతుంది. ఆవిరిని చల్లబరిస్తే నీరవుతుంది. నీటిని చల్లబరిస్తే మంచవుతుంది. ఇనుము బంగారము మొదలగు ధాతువులు సూర్యునిలో ఆవిరి రూపంగా ఉన్నవి. ఆ ఆవిరిని చల్లబరుద్దాం: తరళద్రవ్యంగా మారుతుంది. అదే యీ భూమి.

పదిపుంజీల వాయుపదార్థాలను చల్లబరిస్తే వానిలో కొన్నికొన్ని అంశలు బిగిసి తరళపదార్థాలుగా మారుతవి. కొన్ని అలాగే ఉంటవి. ఏలంటే వాయువులో చాలా భేదాలున్నై. వానివాని అణువుల అమరిక వేరువేరు. కాన ఏని ప్రవర్తన వేరు. భూమి వాయ్వవస్థలో ఉండగా చాలా వాయుద్రవ్యాలు తరళాలై బిగుసుక పోయినై. భూమి రూపొంది కోటానకోట్ల యేండ్లయినా ఆక్సిజను నైట్రోజన్ కార్బానిక్ ఆసిడ్ హీలియం మొదలైన విప్పటికీ అలానే ఉన్నై.

సూర్యునిలోంచి పెల్లిపడిన యీ అగ్నిపిండం, తేజం విరజిమ్మి చిమ్మి తాపం తగ్గితగ్గి చల్లబడుతూ వచ్చింది. కాని దానిలోని ద్రవ్యాల ఆలోడనం పూర్తిగా ఆగక తగ్గుతూ రావడంవల్ల తేలికపదార్థాలు పైకుబికినై, బరువు వికేంద్రం దెస లోపలికి పోయినై. ఇంకా చల్లబడిన కొలదీ కొన్ని దినుసుల అణువుల అమరిక తరలద్రవ్యాల కనుగుణంగా ఏర్పడ్డవి. తేలిక వస్తువులూ

బరువు వస్తువులూ, పూర్తిగా వేరైపోకముందే తరళావరణం ఒక్కొక్కచో చేరి ఘనీభవించింది. ఇట్టి తరలపదార్థాల మడతలు కొన్నికొన్ని బరువైన వస్తువులను గూడ శిరసావహించినై. అందువల్ల వెండి బంగారమూ పాదరసమూ సీసమూ మొదలయినవి భూమిపై పొరలలగూడా తగులుతై.

నీరు, భూమికంటే 5½ రెట్లు ఎక్కువ బరువు. ఐతే భూమిమీది అంశం మాత్రం 3 రెట్లే బరువు. దీనివల్ల బరువువస్తువు భూమి బయటకంటే లోపలనే ఉందని తేలింది.

డోలకపరీక్షవల్ల ఇది యదార్థం అని చెప్పవచ్చు, కృశించిన ఉభయ మేరు ప్రదేశాలవద్ద దోలకం ఎక్కువగానూ పీవరమైన నిరక్షరేఖవద్దనూ పర్వత శిఖరాలమీదనూ తక్కువగానూ ఊగుతుంది. అద్రిమీద కంటె సముద్రం అడుగున ఎక్కువ ఊగుతుంది. బరువైన ద్రవ్యం కేంద్రంలో ఉండి ఆకర్షించకపోతే ఇలా జరగదు. భూమికి ఆచ్ఛాదన లేకపోవడాన పై భాగం బిగిసింది. లోపల పొరలలో తరళవాయవ్య ద్రవ్యాలు మీగడకింది పాలలాగా ఉంటూవచ్చె, ఇప్పటికీ ఉన్నై. పాలు చల్లారుతూ వచ్చిన కొద్దీ సంకోచం కలిగినట్లు లోపలి తరళద్రవ్యం చల్లారుతూ రాగా సంకోచం కలిగి భూమిపైన విషమతలం ఏర్పడది. పైనున్న బరువు అదుముడువల్ల పెద్దపెద్ద పాతాళాలు ఏర్పడినవి. పిదప నీరు నిండి అవి సముద్రాలైనై. 'పదికోట్ల యేండ్లాయె సముద్రాలంటూ ఏర్పడి' అని భూతత్త్వం ఎరిగిన జియాలజీ విద్వాంసులు చెబుతున్నారు. రెండుగోతుల నడుమ ఉబ్బెత్తుగా ఉన్న భూమి మెరకలుగానూ, తిప్పలుగానూ, పర్వతాలుగానూ, కులపర్వతాలుగానూ, రూపొందినై. నేటికిన్నీ లోపలి తరళపదార్థాలు తుకతుకా ఉడుకుతుండడంచేత లోపలి ఆవిరి బయటికి వస్తూ వుంటుంది. ఈ ప్రక్రియలో నిప్పురాళ్లూ (Igneous Rocks) పొరలరాళ్ళూ (Sedimentary Rocks) రూపాంతరిత శిలలూ (Metamorphic Rocks) మొదలైన రాళ్ళు పొరల లోలోపల ఏర్పడినవి (లోపలిశక్తి ఎక్కువై బయటికి తన్నినపుడు భూకంపాలు కలుగుతున్నవి. అగ్నిపర్వతాలు జ్వాలలను ఉద్గారిస్తున్నవి. సుమారు 40 కోట్ల ఏండ్లక్రితం బ్రిటిష్ దీవులలో ఒక నిప్పుకొండ పగిలిందని అనుమించిన ఘటన నేటికిన్నీ కనబడుతూంది.

ఈ నిప్పుతాళ్ళు Plutonic అనీ Vulcanic అనీ రెండురకాలు. భూమ్యాభ్యంతర దేవత Pluto అనిన్నీ, అగ్నిదేవత Vulcon అనిన్నీ గ్రీక్ పురాణాలు. ఆ రెంటినిబట్టీ యీ పేళ్ళు పాతాళాధిపతి బలి అనిన్నీ అతలాదుల సంవర్తకాగ్ని స్వరూపంతో విష్ణువు రోజుతూ బుస్సలు విడుస్తూ నిప్పులుకక్కుతూ ఉంటాడ నిన్నీ మన పురాణాలు చెప్పినై. లక్ష ద్వీపాలలోని అగ్నిపర్వతాలే యీ విష్ణువని నవ్యులు అంటున్నారు.

ఈ రీతిగా భూమి జననం రెండువందల కోట్ల పై చిల్లర ఏండ్లని భూగర్భ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఈ వైనం ఎల సాధిస్తారు? ఏదయినా కొండలో రేడియం గనుక దొరికితే ఆ కొండవయసు చెప్పవచ్చు. రేడియం కాంతిని కక్కుతూ వుంటుంది. కక్కిన కాంతి పరమాణువులు సీసంజాతై. ఇవి భగ్నం అయేటప్పుడు మెరుపు నలుసులు వెడలుతని. అవి ఆల్ఫాబిటా కణాలు ($\alpha + \beta$ Particles). ఇవి వాయ్వణువులకు ప్రలయం కలిగించి కాంతి చిమ్ముతై కాన వీనిని అమావాస్య చీకట్లలో గూడా చూడవచ్చు. ఇలా కాంతి చిమ్ముతూ తదను పాతంగా సీసం ఐపోవడంలో ఎక్కువ తక్కువ లుండవు. ఎప్పుడూ ఒకటే మోస్తరు చిన్నరేడియం చిదరతూచి ఒక పాత్రలో పెట్టి కొన్నేళ్ళ పిదప మళ్ళా తూస్తే రేడియం ఎంత వ్యయం అయిందో సీసం ఎంతవచ్చిందో తెలుస్తుంది. దాన్నిబట్టి యీ రేడియం జాతకం సరిగ్గా కట్టవచ్చు. కెనడాలో ఒక కొండలో దొరికిన రేడియం సీసం తూచగా సుమారు 123కోట్ల యేండ్లకు ముందు ఆకొండ పుట్టి ఉంటుందని విద్వాంసుల నిర్ణయం. మళ్ళా మొదటికి వెడదాం. భారత వర్షంలో మహేంద్ర మలయ సహ్య శుక్తిమత్ ఋక్ష వింధ్య పారియాత్రములనే ఏడు కుల పర్వతాలు ఉన్నవని వాయుపురాణం (57 అధ్యా.).

కులపర్వతా లనగా ప్రధాన పర్వతాలు. హిమవంతం కులపర్వతమూ వర్షపర్వతమూ అని వాయుపురాణం. (1 అధ్యా-57 అధ్యా).

సర్వత్రా ఉండేవనిన్నీ పర్వములు, అనగా సంధులు గలవనిన్నీ పర్వతపదానికి వ్యుత్పత్తులు ఉన్నవి. పర్వములు లేకపోతే గిరి. అది పర్వతం కాదు. రెండు పర్వతాల నడుమనున్న నేల- లోయ లేక కనుమ సంస్కృతములో ద్రోణి. గిరి పగిలితే దరి.

భారతవర్షంలో ఉన్న మహేంద్ర మలయాది కులపర్వతాలకు లెక్క పెట్టలేనన్ని శాఖలున్నవి. వానిలో కొన్ని శాఖాపర్వతము లివి. మందరం వైహారం దర్దురం. కోలాహలం ససురసం మైనాకం వైద్యుతం పాతం ధమం పాండురం కృష్ణం గంతుప్రస్థం గోధనం పుష్పగిరి శ్రీజయంతం రైవతకం కారు, కూటశిలం. ఈ కొండలలో ఆర్య మ్లేచ్ఛ జనపదాలు ఉన్నవి.

(వాయుపురాణము చూచునది.)

పర్వతాలు ఉన్నందువల్ల వర్షాలు కురిసిన ప్రయోజనం ఉంటూ ఉన్నది. వానిమీద పడినవాన ఏరులుగా పారుతవికదా! ఈ ఒడ్లు మనుష్యులకు ఉనికిపట్లు. ఇరుప్రక్కలా ఉన్న పల్లపునేలలు పంటలకు అనువు. కాబట్టి ఈ పెద్దకొండ లను వర్షపర్వతాలని అనడం ఎందుకో ఇపుడు మనకు కొంచెం తెలిసివస్తుంది.

'త్రిసామ ఋకుల్యా ఇక్షుల త్రిదివ లాంగూలిని వంశధార అనే నదులు మహేంద్ర అనే కులపర్వం 'కూతుళ్లు."

ఈ వంశధార మనమెరిగిందే. మిగులు నదులుగూడా పోలిస్తే- అయితే వీనిలో కొన్ని నదులు ఇప్పుడు లేవేమో!

ఉత్తర సముద్రంలోనూ కొన్ని కొండలు మునిగిపోయిన వని వాయు పురాణం చెబుతూంది. ఈలాటి ఘటన ఈ నడుమ ఒకటి జరిగింది. జావా దాపున Krakatoa అని ఒక చిన్నదీవి ఉన్నట్లు 1883 సెప్టెంబరుకు పూర్వం ఎవరికీ తెలియదు. కొద్దికొద్దీ సెగలూ పొగలూ మొదలుపెట్టి ఒక ఘనమైలు పొడవు కొండపట్టున్న పగిలి ఫెడేలుమని సముద్రంలో పడ్డది. దానికి లేచిన అలలవల్ల జావాతీరంలో 160 గ్రామాలు సర్వనాశనం ఐనవి. ఆ దీవి చుట్టూ ప్రక్కలా నూరుమైళ్ళదూరం నెలరోజులు రేయుంబవళ్ళు తేడా లేకుండా పోయింది. ప్రపంచావిర్భావం మొదలు ఇట్టి ఉత్పాతా లెన్ని జరిగిపోయెనో!

ఈ రీతిగా సరస్వతీనది పూడిపోయిందని చెబుతారు. ఒక నది ఇంకో నదిలో కలసి తన పేరు వదులుకోవచ్చు. కొన్నిటి పేరు మారవచ్చు. ఈ మహేంద్ర కులపర్వతపు ముచ్చట ఎన్నోచోట్ల వస్తుంది. దీనిని ఈ నదులను బట్టి పోల్చవలసి ఉంటుంది.

కృతమాల తామ్రపర్ణి పుష్పజాతి ఉత్పలావతి అనేవి మలయ కులపర్వతం ప్రసవించిన అమృతవాహినులు. వీనితో తామ్రపర్ణి సుపరిచితం. మలయ మారుతమా? దానిని తెలియనివాడంటూ ఉన్నాడా? కాని ఆ కొండను పట్టుకో అంటే అంతవరకూ నడననే కొందరు ఉదకమండలాన్ని మలయపర్వతం అని అంటూ వున్నారు.

గోదావరి భీమరథి కృష్ణవేణి నంజుల తుంగభద్ర సుప్రయోగ కావేరి అనే జలకన్యలు సహ్యకులపర్వతంనుంచి బయలుదేరారు.

శుక్తి మత్కులపర్వత సంతానం: ఋషీక సుకుమారి మందగకూప పలాశిని.

శోణ నర్మద మందాకిని దశార్ణ చిత్రకూట తమస పిప్పల శ్రోణికర తోయ పైశాచిక నీలోత్పల విపాశ జంబుల సితేరజ శుక్తిమతి మక్రుణ త్రిదివ అనే నదులకు తండ్రిగారు ఋక్షకులపర్వతం.

వింధ్యకులపర్వతం, తాపి పయోష్ణి నిర్వింధ్య మద్ర నిషధవేణ్య వైతరణి శితిబాహు కుముద్వతి తోయ మహాగౌరి దుర్గ అంతశ్శిల అనే బిడ్డల కన్నది.

పారియాత్రకులపర్వతం నుంచి వేదస్మృతి వేదవతి వృత్రఘ్ని సింధు వర్ణా నచందన సతీర మహతి పరచర్మణ్వతి విదిశ వేత్రవతి శిప్ర అవంతి అనే స్రవంతీ సంతానం.

ఇప్పు డొకసారి వెనుదిరిగి చూస్తే దక్షిణంనుంచి క్రమంగా ఉత్తరానికి వెళుతూ ఈ కొండలను పేర్కొన్నటుల కనబడుతుంది.

మన పురాణాలు వైవస్వత మనువు ఇప్పటికి సుమారు 300 కోట్ల యేండ్ల వెనుకటి వాడని చెప్పినవి. ఎవరివల్ల యీభూమి భారతవర్షం అని పేరు వచ్చిందో ఆ భరతుడు వైవస్వతమనువుకు మునిమనుమడు. ఇంతేకాక మనువుకు కూడా భరతు డని పేరు వుంది. మనుష్యులను భరిస్తాడు కదా? కాగా నాటినుంచీ నేటివరకూ భరతుని పేరు ఈ భూమి గుర్తు పెట్టుకుంటుందా? అసలా యీ భూమికి యిన్నేళ్లుంటయ్యా? అని సాధారణంగా సందేహం

తోస్తుంది. దీనికి ఉపపత్తి మనశాస్త్రాలు. ఆయన చలనము మొదలైన నక్షత్ర సంబంధమైన కారణాలలో స్వాయంభువ సృష్టియొక్క ఆరంభం సుమారు [illegible] కోట్లవెనుక అని నిర్ణయించారు. జియాలజీ విద్వాంసులు కొంతలు సుమారు [illegible] కోట్ల పైచిలుకు యేండ్లక్రింద పుట్టిన వని చెప్పినట్లు ఇంతకుముందే విని యున్నాము. భూమి తయారీ కూడా సుమారు 200 కోట్లయేండ్లక్రింద అని చాలా కారణాలు ఉదాహరిస్తూ వీరే నిరూపించారు. వారు చెప్పిన ఒకచిన్న ఉదాహరణ విందాం. శుద్ధమయిన అభ్రకపు రేకులు తెచ్చి యంత్రంలో పరీక్ష చేస్తే దానికేంద్రంలో ఒకకాంతిమండలం కనబడుతుంది. అది యురేనియం థోరియం అణువుల పరమాణువులు పెట్టే ముగ్గులు. ఈ కాంతి మండలమును చూడగానే ఆ అభ్రకానికి ఎన్నేండ్లున్నవో భూతత్త్వశాస్త్రజ్ఞులు ఇట్టే చెబుతారు. కొన్ని అభ్రకపురేకులు 2 వందలకోట్ల ఏండ్లక్రిందట పుట్టినవని నిరూపించారు. ఈలాటి అసాధారణమైన కారణాలచేత నిర్ణీతమైన ఆ భూమి తయారయి జీవ స్థితి కలుగడానికిన్నీ ఎన్నికోట్ల యేండ్లుపడుతుందో అందరూ సులభంగా ఊహించవచ్చు. కాబట్టి మనవాళ్లు చెప్పినవి జియాలజీ, బైయాలజీ మొదలైనవి యెరిగినవారు చెప్పినవి ఇంచుమించు సరిపోతున్నవి.



# 8. విద్యుల్లోకనం

## నవీన విజ్ఞానము

౧

భూమిని ద్రవ్వుచు లోలోతులకుఁ బోయినకొలఁది మన కంటికి కొన్ని పొర లగుపడుచుండును. ఆ రీతిగనే వాయుమండలము లందును కొన్ని పొరలు యంత్ర సాహాయ్యమునఁ గనఁబడునని నవీన వైజ్ఞానికులు ఋజువు చేయుచున్నారు.

పృథివిమీద సుమారు పండ్రెండు కిలోమీటర్ల[1] పర్యంతము ఒక పొర కలదు. వేళ కాల భేదముల ననుసరించి యీ పొర 5 మైళ్లు మొదలుకొని 10 మైళ్ళవఱకును వ్యాపించియుండునని కొందరు కనుఁగొనిరి. వాయు స్తరములలో దీని విస్తృతి కొలఁది అయినను ఇచట వాయవ్యములగు పదార్థములలో నూటికిఁ దొంబది పాళ్లున్నవి. దానఁ జేసి అన్య స్తరములకంటె నీ స్తరము సాంద్రతమము. ఇచట ఆక్సిజని, నత్రజని, ఆవిరి మొదలగు ద్రవ్యములు క్షీరనీరన్యాయమునను, జలతైల న్యాయమునను కలగూరగంపగాఁ గలసియున్నవి. ఈ స్తరము భూదేవిని జలుగుసెల్లావలె సంపూర్ణముగాఁ గప్పియుండుటచే భూమిమీద నే ప్రాంతమున నెంత వేడిమి కలదో అంత వేఁడిమిని అది గ్రహించును. సూర్య కిరణములచే వేడియెక్కిన భూమితో సామీప్యసంబంధమువలన నిచటి ఆక్సిజని మొదలగు వాయువు లెల్లపుడును సీసాలో నీరుపోసి గలివరించినటు లగుచున్నవి. ఏ గ్యాసు నందేని వేఁడి యెక్కుడగుచో నచటి అణువుల చలన మెక్కుడగును. కావున ఈ పొరలోని పవనాణువు లప్పసము తప్తములై పద పడి క్షుబ్ధములై నలుదెసలకును, క్రిందుమీఁదులకును పరుగు లిడుచుండును. సుమారు ఈ పది మైళ్ళ ప్రదేశములో ఎత్తునకుఁ బోయినకొలఁది గాలి పలుచ-

1) ఒక కిలోమీటరు $\frac{5}{8}$ మై. కాగా $\frac{5}{8} \times 12 = 7\frac{1}{2}$ మైళ్లు.

బడుటయేకాక చల్లఁబడియు నుండును. ఇది వాత్యలకును వానలకును నీరదముల కును నిర్ఘాతములకును క్రీడారంగము. తాపము కలిమిని తాపమండల మనియు, క్షోభము కలిమిని క్షుబ్ధమండల మనియును దీనికి పేరు (Troposphere).

## స్థి ర మ ం డ ల ము :

తాపమండలమున కెగువ ఇంచుమించు చొక మైలు మొదలుకొని ఒకటిన్నర మైలు వఱకుఁగల ప్రదేశము నీ తాపము హఠాత్తుగా ఆఁగినటులు కనుగొందుము. ఇచటి యాకాశము చిరనిర్మలము. ఇచట మబ్బులు లేవు. వేడిమి సుమారు 45 డిగ్రీ సెంటిగ్రేడ్. కావున దీనికి స్థిరతాప మండలమని పేరు(Tropopause).

## హి మ మ ం డ ల ము :

తాపమండలమున పయిఁబయికిఁ బోయిన కొలఁది గాలి చల్లచల్లగ నగును. హిమమండలమున నటులుకాక పయికిఁ బయికిఁ బోయిన కొలది గాలి వేడివేఁడిగ నగును. ఇచ్చట వేడిమి సుమారు 55 డిగ్రీ సెంటిగ్రేడ్. సముద్రము మీది ఒత్తిడిలో పదునొకండవ వంతు ఒత్తిడి యిట నుండును.

భూపృష్ఠము 9 మైళ్ళు మొదలుకొని, 60 మైళ్ళ వరకును హిమమండల వ్యాప్తి. ఇచటనుండి వాయువులన్నియు విభక్తములగుట కారంభించును. ఉదజని, నత్రజని మొదలగు బలువుకల వాయువులు ఇట నుండి ఉదకబిందువులవలెఁ గ్రిందికిఁ బడఁదొడఁగును. హీలియమ్, హైడ్రొజన్ మొదలగు తేలిక గాలులు మీఁదిమీఁదికిఁ దేలాడుచుఁ బోవఁ దొఁడగును.

ఇది మేఘరాజ్యమున కావలిది గాన నిటనున్నచో సూర్యనక్షత్రాదుల దర్శన మెల్లయపుడు చేసికొనవచ్చును. ఇచట మబ్బులుండవు గాన వాన లుండవు. ఇటనుండి చూచినచో ఆకాశము కారునలుపుగా కనిపించును. భూమి చెట్టు చేమలతోడను, పుట్టగుట్టలతోడను ఏకాకారమై ఏమియుఁ గానిపింపదు. సముద్రము మాత్రము అద్దమువలె తళతళ మెఱయుచుఁ గనఁబడును. ఈ హిమ మండలమునకు "Stratosphere" అని ఆంగ్లనామధేయము.

## ఓ జోన్ మండలము :

సూర్యకిరణములకు పలు రంగులు కలవు. బయటి కమ్మరవాని కొలిమి కడ నిలువఁబడి చూతము. కమ్మరవాఁడు మొదట నిప్పువేసిన తర్వాత ఇనుప ముక్క పెట్టి దానిపై నింత ఉఁక పోయును. అంత దూది పింజలవలె పొగ లెగయఁ దొడగును. పిదప ఆకుపచ్చగను, పాటలముగను, తెల్లగను, అరుణముగను మంటరంగు కనిపించును. కావున కాలుచున్న వస్తువునుబట్టి మంటరంగు మాఱుచున్నదని మనము గ్రహింతుము.

సూర్యుఁడు గూడ నొక కొలిమి. భూమిలోఁగల 92 మూల పదార్థములలో చాలవట్టిసూర్యునిలోఁ గూడ నున్నవని వైజ్ఞానికు లందురు. మరియు నీ కొలిమిలో నాలుగు మండుగాడ్పుల పొరలున్నవట. ఒకటి- ఆలోకమండలము, లేక **Photosphere**; రెండు-ప్రతిఫలక స్తరము, లేక **Reversing layer**; మూఁడు-వర్ణమండలము లేక **Chromosphere**; నాలుగు-ఛటా కిరీటము, లేక **Corona.**

కాగిన ధాతువులయు, ఆవిరులయు ఒత్తిడి ఎక్కుడయినపు డగ్ని పర్వతములు పగులును. ఆ పగుళ్ళనుండి లోలోపల నున్న ధాతువులును, ద్రవాదులును, బాష్పమును ప్రచండ వేగముతో ఫూత్కరించినటులు వెలువడును. ఆ చందముగనే సూర్యమండలమున తుకతుకలాడు ఆవిరులు మితిలేని వేగముతో పైకి లేచుచుండును. అపు డా సందులనుండి వెలుపటి వాయువులు లోపలి కేగుచుండును. ఈ రీతిగా ఆవర్త మాలికలు ఘూర్ణమానము లగునపుడు పెద్ద పెద్ద బీట లేర్పడును. ఆ బీటలగుండ ప్రచండవేగమున లెక్కలేనన్ని అణువులును, పరమాణువులును, అతి పరమాణువులును, మాత్రలును, ఎలక్ట్రానులును అంబులపొదినుండి శరజాలమువలె నంతటఁ బడుచుండును. ఇట్టి మంటలతో శబలమగు నీ కొలిమినుండి భూమండలము మీదికి వచ్చు నీ కిరణములు మనకుఁ దెల్లగాఁ గనఁబడును గాని అస లవి తెల్లవి మాత్రమే కావు. ముక్కోణమగు గాజుముక్క తెచ్చి, సూర్యుని కెదురుగా పట్టుకొని చూచితిమేని యింద్రధనుస్సునందలి రంగులఁ బోలు రంగులు మన కంటికిఁ గనబడును.

గారడీవాఁడు కొన్ని రంగులుగల తాటాకుల పొత్త మొకటి తెచ్చి విడఁబఱచి [illegible] మనకుఁ జూపును. అపు డది మనకుఁ దెల్లగాఁ గానిపించును.

ఆఁపినచో భిన్న భిన్నములగు వర్ణము లాయాకులపైఁ గానిపించును. ఆ రీతిగనే సూర్యకిరణములు గూడ కిరణ పింఛములు. పింఛమును విప్పినచో పలురంగులు కలిపినచో ఒక రంగే. అది తెలుపు.

ఈ రీతి పరీక్షలో కనఁబడు రంగులివి :

| | | | |
|---|---|---|---|
| 1. | ధూమలము. | (హిందీ: ఊదా) | Violet |
| 2. | అతినీలము | (నీలిమందు రంగు) | Indigo |
| 3. | నీలము | | Blue |
| 4. | ఆకుపచ్చ | | Green |
| 5. | పసుపు పచ్చ | | Yellow |
| 6. | నారంగ | | Orange |
| 7. | లోహిత | (ఎఱుపు) | Red |

ఈ వర్ణమాల మనకంటి కగపడును. వీనిలో మొదటి ధూమల వర్ణమున కును, చివర లోహిత వర్ణమునకును వెలుపట రెండు రంగులున్నవి. మఱియు మన కింకను తెలియని రంగు లెన్నో యున్నవని యూహించుట కెంతయో యవ కాశము కలదు. ధూమల లోహిత వర్ణములకు వెలుపటఁ గల రెండు వర్ణములలో మొదటిది బహిర్ధూమల రశ్మి, లేక Ultra Violet Light. ప్రకృతము మనకు దీనితో పని.

పలువన్నెలు కల యీ సూర్యకిరణములలో నీ బహిర్ధూమల కిరణములు హిమమండలము నందున్న ఆక్సిజని మీఁదుగాఁ బ్రసరించును. దానివలన ఓజోన్ స్పష్టమగును.

ఇదికాక మేరు ప్రదేశములందు చాల ఓజోన్ ఉన్నది. వసంత ఋతువులో ద్రాఘిష్ఠమగు మేరు రాత్రి శేషమున వాయుమండల మందు చాల ఎత్తునా ఈ ఓజోన్ కానిపించును. ఆ యెత్తున విద్యుత్ స్ఫురణమువలన ఓజోన్ స్పష్టమగు నని వైజ్ఞానికులు చెప్పుదురు.

భూమి పయినుండి 15 మైళ్లు మొదలుకొని 30, 31 మైళ్ళవరకును ఓజోన్ మండలవ్యాప్తి. ఓజోన్ స్తరమే లేనిచో మనము గ్రుడ్డివార మయ్యెడివారము,

లేక మలమలమాఁడి చచ్చెడివారము. ఏమనఁగా సూర్యుని యీ బహిర్ధూమల కిరణములను ఈ ఓజోన్ స్తర మద్దుడు కాగితమువలె పీల్చి జీవుల కుపకరించు భాగమును మాత్రమే వదులుచున్నది. ఈ ఓజోన్ మండల గుణ మిట్టిది కావుననే సూర్యుని వర్ణపింఛపుఁ దేజము బహిర్ధూమల వర్ణము దెస (Ultra Violet light) నొకానొకట మిక్కిలి తగ్గిపోవుచున్నదని వైజ్ఞానికుల ప్రవాదము.

## విద్యున్మండలము :

ఓజోన్ మండలము పైని విద్యున్మండల మున్నది. భూమిపై 56$\frac{1}{4}$ మైళ్ల యెత్తునుండి దీని యారంభము. ఈ ప్రదేశమునందు తటిదాశ్రితములగు జడకణములును, ఎలక్ట్రానులును గలవు. వీని కలిమినే యీ విద్యుత్ స్తరము విద్యుత్పరిచాలకము.

ఈ స్తరము జ౧, జ౨; చ౧, చ౨ అని నలు దెఱఁగులు. జ ౧ యు, జ ౨ ను క్రిందివి. చ ౧ యు, చ ౨ ను మీఁదివి. క్రిందివాని కాంగ్లమున E1 అనియు, E2 అనియు లేక కెనెలీ హెవిసాయిడ్ స్తరమనియు, మీఁదివానికి F1 అనియు, F2 అనియు లేక ఆపుల్టన్ స్తరమనియు వ్యవహారము. క్రింది జ – స్తరము భూమిమీఁది నుండి 62 మైళ్ల నుండియు, మీఁది చ – స్తరము సుమారు 156 మైళ్ల ఎత్తు నుండియు నారబ్ధము లయినవి.

తటిల్లోకమునకు సూర్యుని బహిర్ధూమల కిరణములు (Ultra Violet rays) ఒక ప్రధాన కారణమని నేటికి నిస్సందిగ్ధముగనే వైజ్ఞానికులు నిర్ణయించిరి. ఈ యతిధూమల కిరణములు ప్రసరించినంతనే వాయవీయములగు అణువుల నుండియు, పరమాణువుల నుండియు, అతి పరమాణువుల నుండియు, మాత్రల నుండియు ఎలక్ట్రానులు బయలుదేఱి సూర్యకిరణములవలెనే ప్రసరించి అన్ని దెసలకును తుఱ్ఱుమని పరుగులెత్త నారంభించును. దీనిని ప్రసరణమనియు, వికిరణమనియు, విస్ఫురణమనియు వాడనగును. దీని నాంగ్లమున Ionization అని అందురు. ఈ ప్రసరణమునకు ఫలితముగా వాయువునందు ఎలక్ట్రానులును, తటిదాశ్రితములగు నణువులు పరమాణువులు మాత్రలు మొదలగునవియు పుట్టుకొనుచున్నను. ఇటులివి పుట్టుకొని వచ్చినందువలన విద్యు

ర్లోకమునందలి వాయువు విద్యుత్పరిచాలక మగును. కావున సూర్యుని బహిర్ధామల కాంతులు (Ultra Violet rays) మీది స్తరములలోనున్న విద్యున్మండలమునకు కారణము.

భరతఖండమునందలి ప్రాచీన విజ్ఞానము ఈ విద్యు దాదికమును గూర్చి యేమి చెప్పుచున్నదో ఆ విషయమునుగూడ సంగ్రహముగా రాఁబోవు సంచికలోఁ జూతము.

ఈ మండలములకు ప్రక్క——



౨

వాయువు, మేఘములు, మెఱుపులు, సూర్యుఁడు, సూర్యకిరణములు, విద్యుల్లోకము ఈ మొదలగు వానిని గూర్చి మన ప్రాచీనుల విజ్ఞాన మొకతూరి గుర్తు తెచ్చికొందము. నవీన విజ్ఞానమునకు ప్రాచీన విజ్ఞానమే పునాది. ఆ పునాదిలో నెచటనేని చవుడురిలినచో దానిని బడఁగొట్టియే నూతన నిర్మాణ మారంభమగును. అది యథార్థ స్థితి.

కొందఱకు ప్రాచీన విజ్ఞాన మనినంతనే రోత. నవీన విజ్ఞాన మనినంతనే జోత. భక్తిపరవశులగు మరి కొందఱకు ప్రాచీన విజ్ఞానమునందలి అక్షరములు నూటికి నెలగ.

దినదినాభివృద్ధి చెందుచున్న నవీన విజ్ఞానమును జూచి ప్రాచీన విజ్ఞాన మును స్థాలీపులాకముగా రోయువారిని ఇటు లడుగవలయును. నక్షత్రములు స్ఫాటికము లనియు, భూమి అచలమనియు పిథోగరస్ అనెనా లేదా ? కోపర్ని కస్, గెలెలియో, న్యూటన్‌ల సిద్ధాంతముల వెనుక, అనగా పదునాఱవ పదు నేడవ శతాబ్దముల వెనుక భూమి అచలమనియు, సూర్యచంద్ర నక్షత్రాదు లీ యచలము చుట్టును తిరుగుచున్న వనియు పాశ్చాత్యు లనుకొనుచుండిరా, లేదా ? కెప్లర్ వెనుకటి వారు గ్రహాదులకు సమదూరత్వమును, సమగమనత్వమును అంగీకరించిరా, లేదా ? వేయేల ? ఈ పాతికయేండ్ల లోపల శబ్దతరంగము, వాయు తరంగము, హిమమండలము మున్నగున వెన్నియో విషయముల యెడల నెన్నియో పొరపాటు లెందఱికో వచ్చెనా, లేదా ? మార్కొనీ దదృష్టము కాదా ? కెనెలి హెవిసాయిడ్లకు సుమా రిరువది నాలుగేండ్లకు వెనుక విద్యుత్పరిచాలక మగు నొక స్తరము కలదని ఊహించిన బాల్‌ఫర్‌స్టు వార్టుకు పేరున్నదా ?

ఇక, భక్తి శ్రద్ధలతో ప్రాచీన విజ్ఞానమున అక్షరపూజ చేయువారల కొక విన్నపము:చంద్రకక్ష్య సూర్యకక్ష్యకు పైదను పురాణమతమును వరాహమిహిరాదు లేల ఖండించిరి ? ఆర్యభటుడు భూమికి చలనము లేదని అనెనా, లేదా ? ఆతని వ్యాఖ్యాత పృథూదకాచార్యుడు 'భూమి తిరుగునను సిద్ధాంతమే శ్రేష్ఠ'మని అనెనా, లేదా ? రాహువును గుఱించిన పురాణమతమును బృహజ్జాతకము తుత్తుని

యలు చేయలేదా ? ఈ శాస్త్రజ్ఞులకు పురాణముల యెడల మనకన్న భక్తిశ్రద్ధలు తక్కువా ?

ప్రాచీను లసత్యవాదులు కారు. 'నేనీ మహాపురుషు నెఱుగుదును.[1] తొంటి పెద్దలు మాకిటులు చెప్పిరి[2] అని యీ రీతిగా నందురు. వీరు వైదిక ఋషులు.

కన్ను, శాస్త్రము, నీరు, లేఖ్యము, గణితము - ఈ యైదును జ్యోతిర్గణన మున కాధారములని కొందఱందురు. వీరు పురాణములు చెప్పిన ఋషులు.[3] వీరి కన్న యథార్థ వక్తలుందురా? ఇక మనము మన జ్ఞానమును బట్టియు, ఓర్పును బట్టియు వీరిని అర్థము చేసికొందుము. అది యటుండె.

ప్రాచీన విజ్ఞానమున మునుల నాటికే కొంత సంప్రదాయ తంతువు విచ్ఛిన్నమయినదని అందఱకును దెలియును. "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్న హి సందేహా దలక్షణమ్" అను పరిభాషలోని సందేహ మీ సంప్రదాయ విచ్ఛేద ప్రసూతమే. 'అకృత వ్యూహ' పరిభాష దీనికి దోహదము. కానిచో "చత్వారి శృఙ్గే" త్యాదుల కొకనోటనే యిన్ని భిన్నభిన్న వ్యాఖ్యానము లెటులు? కావున అల్పవిద్యకలవాడు తనను గొట్టవచ్చుచున్నాడని వేదము జంకునని పురాణములు హెచ్చరించును. అర్థము తెలియక వేదపారాయణము చేయువానిని బరువుమోయు ఎద్దు అని వేదమే శాసించును. ఏమిగతి? ఆఁబోతుల నడుమ గిత్తలకాళ్లు నలుగుటయే గతియా? ఇఁక నీ అన్యోన్యాశ్రయమును పాఠకుల యెదుట నిడి ప్రకృతమునకు వత్తును.

వాయువు :

పాత పురాణములలో వాయువు లేఁడు.[4] ఆవహము, ప్రవహము, అనువహము, లేక ఉద్వహము, సంవహము, వివహము, పరావహము, పరివహము.

---

1) వేదాహ మేతం పురుషం మహాన్తమ్.

2) 'ఇతి శుశ్రుమ పూర్వేషామ్'

3) చూ. కూర్మపురాణము, వాయుపురాణము 53 వ అధ్యాయము.

4) వాయు విష్ణు మత్స్య పురాణములు చాల ప్రాఁత పురాణములు.

భూమి మొదలుకొని మేఘమండలము వఱకును ఆవహ వాయువు. మేఘ మండలము మొదలుకొని సూర్యమండలము వఱకును ప్రవహవాయువు. అట నుండి చంద్రమండలము వఱకును అనువహ వాయువు, లేక ఉద్వహ వాయువు. అటుపైని నక్షత్రమండలము వఱకును సంవహవాయువు. అటు తరువాత గ్రహ మండలము వఱకును పరావహ వాయువు. తరువాత ధ్రువమండలము వఱకును పరివహ వాయువు.

పైఁ జెప్పిన ఏడు వాయువులలో ఆవహప్రవహములను రెంటిని మాత్రమే సిద్ధాంత గ్రంథములు గ్రహించెను. అందును ప్రవహవాయువు నంగీకరించె నన్న మాటయే కాని అది అంగీకరింపని చందమే. కావున జ్యోతిశ్శాస్త్రము శేష వాయు విషయమున మూకమనియే చెప్పవచ్చును.5

మఱియొకటి ఆవహవాయు ప్రసారమున్నంతవఱకును అంతరిక్షము. ఈ అంతరిక్షముమీద స్వర్గము లేక ద్యౌః వేదమున మూఁడు లోకముల ముచ్చట కలదు. ఒకటి-పృథివి, రెండు-అంతరిక్షము, మూడు - స్వర్గము. గుఱ్ఱమెక్కి-వేయి దినములలో స్వర్గమున కేగవచ్చునని ఐతరేయ బ్రాహ్మణము.6 మేరు

5) ఆరుమైళ్ల యెత్తున వాయుసాంద్రత భూతల వాయుసాంద్రతలో మూడవ వంతు. 30 మైళ్ల యెత్తున రెండువేల వంతులలో నొకవంతు. ఇటులు మీది మీది కేగిన కొలదిని వాయువు తన అణుపరమాణువులకు సంఘట్టనము కలుగనంతగా పలుచబడును. ఈ యణు వులు కొన్ని 10 వేల మైళ్లవఱకు పైకెగసి వాయువునుండి తప్పించుకొని పోగలిగిన యెడల మహాశూన్యమున గలిసిపోవచ్చును. కాని భూమ్యాకర్షణము వలన మరల క్రిందికే రావలసి యుండును, అని నవీన వైజ్ఞానికుల మతము.

ముప్పది మైళ్ల యెత్తునగూడ నాలుగువందల మైళ్ల వడితో వీచు గాడ్పు కనబడెనని అతి నవీనుల మతము.

6) "సహస్ర మనూచ్య స్వర్గకామస్య సహస్రా శ్వీనే వా ఇతః
స్వర్గోలోకః స్వర్గలోకస్య సమష్ట్యై సంపత్త్యై సంగత్యై" (7 అధ్యా. 7 ఖండ.)

భాష్యము : ప్రబలోఽశ్వ ఏకే నాహ్నాయావంతి యోజనాని గచ్ఛతి తావద్యోజన పరి మితో దేశ ఆశ్వీనః. సచ సహస్రసంఖ్యయా గుణితః సహస్రాశ్వీనః 'అశ్వస్యైకాహ గమ్య' ఇతి పాణినీయసూత్రా దాశ్వీనశబ్ద నిష్పత్తిః. ఇతో భూలోకా దారభ్య సహస్రాశ్వీన ఊర్ధ్వదేశే స్వర్గోలోకో వర్తతే. అతః సహస్ర సంఖ్య స్వర్గలోకస్య సమష్ట్యై ప్రాప్త్యైభవతి. ప్రాప్తస్య సంపత్త్యై స్వాపేక్షిత సర్వభోగ్యవస్తు సంపాదనాయ భవతి. సంపన్నస్య చ సంగత్యై మహతా మింద్రాది దేవానాం ప్రీతిపూర్వక సంబంధాయ భవతి.

శృంగమున స్వర్గము. అది మనకు ఎనుబది నాలుగువేల యోజనముల దవ్వు అని[7] బహు పురాణ సాధారణము. సూర్యునికిఁ బైని చంద్రుఁడును, చంద్రునికిఁ బైని నక్షత్రములును నక్షత్రములకుఁ బైని బుధుఁడును, బుధునకుఁ బైని శుక్రుఁడును, శుక్రునకుఁ బైని కుజుఁడును, కుజునకు బైని గురుఁడును, గురునకుఁ బైని శనియునుఁ గలరని సర్వపురాణ సామాన్యము.

సూర్యుని మీదనే చంద్రుఁడు కలడని తైత్తిరీయ సంహితలోఁ గలదు. జ్యోతిస్సిద్ధాంత మీ చంద్రుని సూర్యుని క్రిందికి దింపెను.

సూర్యుఁడు :

వేదము నందలి సూర్యుఁడు అగ్ని మండలము గను, జ్యోతిర్మండలము గను గనిపించును.

వేదము జ్యోతిశ్శాస్త్రము కాదు. ఆ కాలమునందు ప్రచలితములగు జ్యోతిస్సిద్ధాంతముల నవలంబించిన విషయములందుండ వచ్చును. వాటి సిద్ధాంతములు మనకుఁ దెలియవు. ఇటీవలి జ్యోతిషము, అనఁగా వేదాంగ జ్యోతిషము మొదలగునది వేదమునకు అంగము.[8]

వేదమున సూర్యునకు సంబంధించిన సూక్తములు పెక్కులు కలవు. వానిలోఁ గొన్ని స్వభావోక్తులు.[9] కొన్ని రూప కాతిశయోక్తులు.[10] కొన్ని రూపకములు.[11] కొన్ని ఉపమలు.

కొందఱు కొందఱు విద్వాంసులు – కొందఱేమి? అందఱన్నను అతిశయోక్తికాదు. ఇందలి పదములను మెడ విఱిచి వానిచేతఁ దమ కనుకూలమగు

---

7) "తృతీయస్యా మితో దివి సోమ ఆసీత్" (తైత్తరీయ బ్రాహ్మణ. ౩-౨-౧)

8) 'యజ్ఞమునకుగాను వేదము. యజ్ఞము కాలాక్షేపము. జ్యోతిశ్శాస్త్రము కాలాది బోధకము. కావున నిది వేదమున కంగము' అని భాస్కరుఁడు.

9) చూ. ౧–౨౪ మొ.

10) చూ. ౧-౪౮ మొ.

11) చూ. ఆభ్రాతేత్యాది.

ఉన్నను చెప్పఁబడిరి. ఇది తప్పనిసరి వలె నున్నది. ఈ సంగతి అందఱికిని దెలిసిన విషయము.[12]

వేదమున మొదట మొదట నాదిత్యు లాఱుగురు. (చూ. ఋక్ ౨.౨౭) [illegible]. తైత్తిరీయ సంహితలో నొకచో నెనమండ్రు. అందే వేరొకచో పన్నిద్దఱు. వీరు ప్రజాపతికిఁ గొడుకులు.

ఉపాధిభేదముచేఁగాని యీ సంఖ్యాభేదమున కేక వాక్యత కలుగదు గదా. శతపథ బ్రాహ్మణ మా పనియే చేసెను. అది పండ్రెండు మాసములను పన్నిద్దఱు సూర్యులనుగా నిరూపించెను. తరువాతఁ గొన్ని పురాణములు [13]ద్వాదశాదిత్యులను స్వీకరించెను. మాస భేదముచే నామభేదమని కొన్ని వ్యాకరించెను. కూర్మపురాణ[14]మి యెడ విశేషముగా చూడఁదగినది. వాయుపురాణము

---

12. ఋగ్వేద ౧-౧౬౪ వ సూక్తమున 'సప్తరశ్మి' అను పదమొకటి కలదు. దీనికి సప్తగ్రహములని శ్రీ సామశ్రమి పండితులర్థము చెప్పిరి. రశ్మిలీ యేడింటినంటి రవి దెస లాగును. 'అశ్' - అశూ వ్యాప్తే. పృథివి కూడ నొక గ్రహమే. ఇవి ఆకృష్టములై స్వస్వ కక్ష్యలోఁ దిరుగుచున్నవని కొందఱు దీని నిటులు ఖండించిరి- "పృథివి తిరుగునా? అటు లగుచో 'ఆకాశము నిశ్చలము, పృథివి నిశ్చలము, కొండలన్నియు నిశ్చలము, విశ్వము నిశ్చలము' అని ఋగ్వేదము ౧౦-౧౭౩ లేదా" అని.

ఆ ఋక్కు నిమిత్తముగా చల - అచల - ఆకర్షణ సిద్ధాంతములకు ప్రవర్తింపలేదు. '[illegible] ధ్యాయతీవ పృథివీ ధ్యాయతే వాంతరిక్షం ధ్యాయ తీవ ద్యౌః" ([illegible]) ఇత్యాది వేటులు ఉత్ప్రేక్షలో అవియు నటులే గమ్యోత్ప్రేక్షలు. చిక్కులు వేదముల యర్థము తెలిసికొనుటకు ఛాందోగ్యము విజ్ఞానము కావలయుననును." విజ్ఞానేన ఋగ్వేదం విజానాతి."

13. మత్స్య కూర్మలింగ భారత భాగవతములు.

14. "వసంతే గ్రీష్మకే చైవ షడ్భిస్తపతి ప్రభుః
శరద్యపి చ వర్షాసు చతుర్భిః సంప్రవర్షతి
హేమన్తే శిశిరే చైవ హిమ ముత్సృజతి త్రిభిః
వరుణో మాఘమాసే తు సూర్యః పూషా తు ఫాల్గునే
చైత్రేమాసే సదేవేశో ధాతా వైశాఖ తాపనః
జ్యేష్ఠే మాసే భవే దింద్ర ఆషాఢే తపతే రవిః
వివస్వాన్ శ్రావణేమాసి కార్తికే మాసి భాస్కరః
మార్గశీర్షే భవే న్మిత్రః పౌషే విష్ణు స్సనాతనః
పంచరశ్మి సహస్రాణి వరుణ స్యార్క కర్మణి
షడ్భి స్సహస్రైః పూషా తు దేవేశ స్సప్తభి స్తథా
ధాతాష్టభి స్సహస్రైస్తు నవభిశ్చ శతక్రతుః
వివస్వాన్ దశభిః పాతి పా త్యేకాదశభి ర్భగః
సప్తభి స్తపతే మిత్ర స్త్వష్టా చైవాష్టభి స్తపేత్
అర్యమా దశభిః పాతి పర్జన్యో నవభి స్తథా
షడ్భి రశ్మి సహస్రైస్తు విష్ణు స్తపతి విశ్వధృక్. (కూర్మపురాణ. 43 అధ్యాయ)

కాబోలు నను పాత మిటులు చెప్పుచున్నది. మాఘ-5, ఫాల్గున, చైత్ర-7, వైశాఖ-8, జ్యేష్ఠ-9, ఆషాఢ-10, శ్రావణ-10, భాద్ర-11, ఆశ్విన-9, కార్తిక-8, మార్గ-7, పుష్య-6.

ఇక నీ పాతపురాణములను విడచి శాస్త్ర మేమి చెప్పునో చూతము.

'సూర్యుని శరీరము నిర్మలము. బింబము అవక్రము. కిరణములు స్పష్టములు, నిర్మలములు, దీర్ఘములు. సూర్యబింబమున మచ్చలు పుట్టును.[15] ఒకానొకపుడు సూర్యకాంతి వికృతమగును.[16] అని వరాహమిహిరుఁ డనెను. వరాహమిహిరున కిది సొంత కవిత్వము కాదు. ప్రాచీన సిద్ధాంతముల నతఁ డాకచో గూర్చెను.

కిరణములు :

వేదమునం దచటనచట సూర్యకిరణము లేడనియు, సహస్రమనియుఁ గలదు. ఈ సప్తరశ్మియే సప్తాశ్వుఁడు. వర్ణభేదముచే సప్తరశ్మియను పేరని కొందరూహించిరి.

పురాణ మీ యేడు కిరణములకును సుషుమ్న-(మ్ల) హరికేశ-విశ్వకర్మ-విశ్వశ్రవ-సంయద్వసు-అర్వావసు-స్వర్[17] అని పేరుపెట్టి వీనివలన క్రమముగా చంద్ర నక్షత్ర బుధ శుక్ర[18] మంగళ బృహస్పతి శనులు పుష్టలగుదురని

15) తామస కీలక సంజ్ఞా రాహుసుతాః కేతవస్త్రయస్త్రింశత్.

16) ఆదిత్య చారాధ్యాయము చూచునది.

17) కూర్మ. ౪౨. అధ్యా. చూ.

18) ఋగ్వేద కాలమున గురుశుక్రుల యెడల సందియములేదు కాని శని బుధ మంగళగ్రహముల యెఱుక యెడల నందఱకును సందియము కలదు. ౧-౧౦౫-౧౦ వ ఋక్కులో 'పఞ్చ ఉక్షణః' అని ఉన్నది. 'దీనికి' ఇంద్రవరుణాగ్న్యర్యమ సవితలని కాని, అగ్ని వాయు సూర్య చంద్ర విద్యుత్తులని కాని అర్థము' అని సాయణుఁడు. 'పంచగ్రహ ములే' యని బాలకృష్ణ దీక్షితులు. 'ఈ ఐదు తారాగ్రహములును నాటికిఁ దెలిసియుండవచ్చు నని బాలగంగాధర తిలకుగా రనుమానించుచున్నారు. చూ. ఓరియన్ - ౧౬౨ పుట.

[illegible]. ఈ యేడును గాక 'అమ'యను మఱియొక రశ్మి కలదని మఱియొకచో గలదు.[19]

సూర్యుడు సహస్రాంశుడుగా సర్వవేదపురాణ విదితుడు. అతని కిరణము లన్నిటిలో సమానమైన వేడిమి కలవని పురాణము లందున్నది.[20]

రంగు :

సూర్యుని దీప్తి తెలుపనియు, కారు నలుపనియు ఛాందోగ్యము.[21] కన్నులు మూసికొని చూచువాని కీకారునల్లదనము కానిపించునని శంకరులు.[22] ఛాందోగ్యము నందె యింకొకచో సూర్యుడు పింగళుడనియు, నీలుడనియు, పీతుడనియు, లోహితుడనియు గలదు.[23]

సూర్యుని రంగు వసంతమునందు కపిలముగను, గ్రీష్మమునందు కాంచనాభముగను, వర్షర్తువునందు శ్వేతముగను, శరదృతువునందు పాండురముగను, హేమంతమునందు తామ్రముగను, శిశిరమునందు లోహితముగను ఉండునని మత్స్యకూర్మములు వివరించుచున్నవి.

విద్యుత్తు :

వేదములందును, పురాణము లందును విద్యుత్తును, తటిత్తులును అసలు మెఱుపులకన్న నెక్కుడుగా మెఱయును గాని వీని కారణ మెరుగుటకు మనము జ్యోతిశ్శాస్త్రమునే ఆశ్రయింపవలెను.

---

19) రెండు కళలుండగా చంద్రుడు సూర్యునిజొచ్చి 'అమ'యను రశ్మియందుండును. కాన ఆ తిథి 'అమావాస్య' యని పేరు.

20) వాయు - 53, లింగ - 57, 61 మఱియు 'తస్యరశ్మి సహస్రంతు శీతవర్షోష్ణనిస్రవమ్. తాసాం చతుశ్శతా నాడ్యో వర్షన్తే చిత్రమూర్తయః" అని కూర్మమున 43-12 వివరము.

21) ఆదిత్యస్య శుక్లం భాస్సైవర్గధ యన్నీలం పరఃకృష్ణం తత్సామ. ౧-౬-౫

22) తద్వేకాంత సమాహితదృష్టే ర్దృశ్యతే - (ఛా. భాష్య) ౧-౬-౫.

23) అహోవా ఆదిత్యః పిఙ్గళ ఏష శుక్ల ఏష నీల ఏష పీత ఏష లోహితః - ౮-౬-౧.

సముద్రమున బడబాగ్ని యున్నది. దానినుండి పొగలెగయును. వాయువు వాని పయికిఁగొంపోయి, అటునిటు చెదరఁగొట్టును. అంతనవి సూర్య కిరణములచేఁ దప్తమగును. అపు డవి స్ఫులింగములఁ గ్రక్కును. అవియే మెఱుపులు. ఈ వైద్యుత తేజ మకస్మాత్తుగా మృత్తికాదులతోఁ గలియును. అపు డనుకూల ప్రతికూల వాయువుల యాఘాత ప్రతిఘాతములఁజేసి యాకాశ మున సుర గాడ్పువలె గిర్రున దిరుగుచుండును. అకాలవర్షములలో నవి క్రిందఁ బడును. ధూళి వానకారునఁ బయికెగయదు కావున అశనిపాతము కాదు.[24] విద్యుత్తు ముత్తెగ. ఒకటి పార్థివము. రెండు జలీయము. మూడు తైజసము.[25]

## మెఱుపుల రంగులు :

సూర్యకిరణములకు వలెనే మెఱుపులకును చాల రంగులు కలవు. కపిల వన్నె, లేక గోరోజనపు వన్నె, కారు టెఱుపు, పసుపు తెలుపు రంగులును,[26]

---

24) విద్యుదశనులు వేఱు వేఱు. విద్యుత్తు మెఱుపు. అశని పిడుగు. ద్యుత - దీప్తి - విద్యుత్. అశ - సంహతౌ - అశనిః. వేదములం దశనా యను పదము కలదు. విసరివేయ దగు రాయి యని దాని యర్థము. ఇంద్రుని వజ్రము రాయిగాని, యినుముగాని అయి యుండు నని వేదవ్యాఖ్యాతలు. "అశ్మమయం వా ఆయసం వా" చూ. వాయువు ౩౯-౪౧.

ఇటులే విద్యుద్గంధర్వ నగరములు వేఱు. గంధర్వ నగరము మేరుజ్యోతి కావచ్చునని కొందరి యూహ. (Polar lights) నిరక్ష వృత్తమునకు ఉత్తర దక్షిణముల 24-25 అంశల నడిమి ప్రదేశమున మాత్రమే అరోరా కనఁబడదు. మిగిలినచోటు లందెల్ల గనఁ బడును. కావున గంధర్వ నగరము 'అరోరా' కావచ్చునని పై యూహకు కారణము. ఇది శోధనకు విషయము.

25) శ్రీపతి చూచునది.

26) 'బహుపుత్రస్య విదుష శ్చతస్రో విద్యుతః కపి లాతిరక్త పీత సిత వర్ణాః (౧-౧౫-౧౩౪) అని 1882 వ సాలున అచ్చుపడిన తెలుగు లిపి విష్ణుపురాణము. 'వాతాయ కపిలా విద్యు దాతపా యాతి లోహితా, పీతా వర్షాయ విజ్ఞేయా దుర్భిక్షాయ సితా భవే దితి జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధాని' అని శ్రీధర వ్యాఖ్య. గోరఖ్‌పూర్ నూతన ముద్రణమున "బహు పుత్రస్య విదుష శ్చతస్రో విద్యుతః స్మృతాః" అని మాత్రమే యున్నది. వెనుకటి తెలుగు లిపి పాఠము తప్పని దాని మొగము మీదనే వ్రాసి యున్నది. గోరఖ్‌పూర్ ముద్రణమున శోధకులు కాబోలు 'వాతాయ' అను శ్లోకమును విశేష ప్రతిపత్తికి క్రింద నుదహరించిరి.

విష్ణు పురాణమును తెనిఁగించిన వెన్నెలకంటి సూరన 'బహుపుత్రునకుఁ బదు నలు వురు మనువులు పుట్టిరి" అనియే వ్రాసెను. (చూ. ౨ ఆ. ౨౭౬) అం దీవిద్యుత్తులుగాని, కపిలా ద్యన్యతరముగాని లేదు.

'చతుర్థీ సంప్రదానే' అను సూత్రము క్రింద 'ఉత్పాతేన జ్ఞాప్యమానే' అను వార్తికమున 'వాతాయకపిలా విద్యుదాతపా యాతిలోహినీ, పీతా భవతి సస్యాయ దుర్భిక్షాయ సితాభవేత్' అని మహాభాష్యము. (Keilhorn Edition) 'కృష్ణా సర్వవినాశాయ' అని నిర్ణయసాగర ముద్రణము. దీనినిబట్టి చూడగా కాత్యాయన పరాశరులకు ముందే పైజెప్పిన రంగులు జ్యోతి శ్శాస్త్ర ప్రసిద్ధము లయియున్నవని మన మూహించుకొనవచ్చును.

మఱియుఁ గొన్ని రంగులును అచటనచట జూపట్టును. భాస్కరుఁడు ఈ విద్యు ల్లోకమును గూర్చి యిటులు చెప్పెను :

"భూమే ర్బహి ర్ద్వాదశ యోజనాని
భూ వాయు ర(త్రాం)బుద విద్యు దాద్యమ్"

భూమికిఁబైని పంద్రెండు యోజనముల వఱకును భూవాయువు కలదు. అనఁగా ప్రవహము. ఈ ప్రవహ రాజ్యమున మేఘములు, విద్యుత్తులు, ఉల్కలు, మొదలగునవి కలవు.

యోజన మామడ యగుచోఁ బంద్రెండామడలు తొంబదియాఱు మైళ్ళు.

పదునొకండవ శతాబ్దిని అరేబియా దేశపు జ్యోతిష్కులు గోధూళినిఁబట్టి లెక్కకట్టి ఏబది యేడున్నర మైళ్ళ పైని ఈ విద్యుత్ స్తరమున్నదని చెప్పిరి.

నవీన వైజ్ఞానికులు విద్యున్మండలము 56 ¼ మైళ్ళ ఎత్తున నారంభమై 156 మైళ్ళ ఎత్తునకుఁ బైగా దాటిపోవు చున్నదని చెప్పుచున్నారు. యంత్ర సాహాయ్యములేని వెనుకటి దినములలో భరతఖండము వారును, అరబ్బులును ఇటు లూహించిన ఊహ సుమారుగా సరిపోవుట మన కాశ్చర్యము కలిగింపక మానదు.

## 3

భూలోకమునుండి బ్రహ్మలోకమునకుఁ బోవు వారి దారిలో నొక విద్యుల్లోకము[1] కనఁబడుచున్నది. ఇది భాస్కరుఁడు చెప్పిన పంద్రెండు యోజనముల పైదిగాని, నవీన వైజ్ఞానికులు చెప్పిన పదునాలుగు యోజనములపైదిగాని కాదు. ఈ విద్యుల్లోకము సూర్యచంద్ర లోకముల కావల నున్నది.

### రెండు దారులు :

గ్రామమునం దగ్నిహోత్రాదికమగు వైదికకర్మనుగాని, సప్త సంతానములు మొదలగు పుణ్యకర్మలనుగాని చేసినవారు [2]చంద్రలోకమును బొందుదురు. దహరాది విద్యోపాసకులు బ్రహ్మలోకమును బొందుదురు. చంద్రలోకమునకుఁ బోవు దారి పేరు పితృయాణము. బ్రహ్మలోకమునకుఁ బోవు దారి పేరు దేవయానము.

### పితృయాణము :

ధూమము[3] ఉత్క్రాంతి చెందిన జీవుని రాత్రి[4] కడకుఁ దీసికొనిపోవును. ఆ రాత్రి కృష్ణపక్షము కడకును, అది దక్షిణాయనము కడకును, అది పితృలోకము కడకును దీసికొనిపోవును. ఈ జీవుఁడిటనుండి భౌతికాకాశమును, దానినుండి చంద్రలోకమును[5] జెందును. ఎవఁడు దేవతల కన్నమో, ఎవని దేవతలు

---

1) తస్య హైతస్య హృదయాగ్రం ప్రద్యోతతే.... ౬-౪-౨.
విద్యుద్బ్రహ్మేత్యాహుః. ౫-౩-౧ బృహ.

2) ఆదిత్యాచ్చంద్రమసం, చంద్రమసో విద్యుతమ్ - ఛాందో, ఈ చంద్రలోకము వేఱు.

3) ధూమము = ధూమాభిమాని దేవత.

4) రాత్రి = రాత్ర్యభిమాన దేవత. ఇటులే ముందును గ్రహించునది.

5) ధూమాద్రాత్రిం రాత్రే రపరపక్ష మపరపక్షాద్యాన్ షడ్దక్షిణైతి మాసాం స్తాన్నైతే సంవత్సర మభిప్రాప్నువన్తి. మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశాచ్చంద్రమస మేష సోమో రాజా తద్దేవానా మన్నం తం దేవా భక్షయన్తి. ఛాందోగ్య. 5-10-3.

ఘజింతురో, ఎవనికి ద్విజరాజని ప్రసిద్ధి కలదో, మఱి యెవఁడు మన కంతరిక్షమునఁ గనఁబడుచున్నాఁడో అతడే ఈ చంద్రుఁడు. అచట నీ జీవుఁడు ఉదకమయమగు శరీరము తాల్చి, కర్మక్షయమగునంతవరకు సుఖముండి పిదప నాకాశమును, వాయువును బొంది మబ్బై వానగా[6] నేలమీదికి వ్రాలును.




6) ఛాందోగ్య బృహదారణ్యకములు. బ్రహ్మసూత్ర. 3-1-3.

# నాడీ రశ్మి సంబంధము

ఉత్క్రాంతి సమయమున దహరాది విద్యోపాసకుల హృదయము జ్వలించును. పుండరీకాకారమును, బ్రహ్మోపాసన స్థానమును అగు హృదయము నుండి చాల నాడులు[7] సూర్యునినుండి కిరణముల చందముగా శరీరమంతటను వ్యాపించియున్నవి. వీనిలో కొన్ని పింగళకమును, సూక్ష్మమునగు రసముచే నిండి పింగళకములుగా నుండును. మరికొన్ని తెలుపు నలుపు పసుపు ఎఱుపు రంగుల రసముచే నిండి తెల్లగను నల్లగను పచ్చగను ఎఱ్ఱగను ఉండును. సూర్యుడుగూడ పింగళుడు, శుక్లుడు, నీలుడు, పీతుడు, మఱియు లోహితుడు.

దూరముగా బోవు నొక ఘంటాపథము అన్ని గ్రామములను, అని పత్తనములను ముట్టుచుబోవునటులు ఈ సూర్యకిరణములు ఈ లోకమును ఆ లోకమును గూడ ముట్టుచు బోవును. ఈ కిరణములకు రేయింబవలను భేదములేదు. వాని కందఱయు నాడులతో సంబంధముకలదు. బ్రహ్మలోక మేగువారు రేయింబవళ్లను భేదములేక యీ రశ్మలగుండ ఊర్ధ్వ మాక్రమింతురు.

---

7) ఉపనిషత్తులలో కొన్నియెడల నాడులు నూఱులును వేలును గలవు. అవి వెంట్రుకలకంటె సన్ననివి. తంత్రము నాభిక్రింద పదునాఱు నాడులు కల ఒక నాడీ చక్రమును చెప్పెను. యోగులు మేరుదండము ప్రక్కల శాఖాప్రశాఖ సమేతమగు ఇడా పింగళా సుషుమ్నలను నాడిచక్ర మనిరి. (Plexsus) Radial Artery పట్టుకొని చూచుట నాడీ పరీక్షయని ఆయుర్వేద వైద్యుల వాడుక. శిరా-ధమనీ స్నాయు నాడుల కేకార్థమున లోకుల వాడుక కలదు. శిరా : Vein. ధమని : Artery అని ఆంగ్లకోశము. నాడికిని స్నాయువునకును Nerve అని కొందరు వాడుచున్నారు. డాక్టర్లు దీనిఁకొప్పరు. నాడులు రక్త శక్తి వాహకములు. చూ. 2-1-19 బృహ. శాం. భాష్య. Nerve లు అట్టివి కావు. అవి మస్తిష్క-జ్ఞాన-చేష్టా- ప్రేరణములను మాత్రమే వహించును. ఈ చిక్కునుండి 'నాడి'ని విడదీయుటకు చిక్కుపడి కలకత్తా విద్యాలయ పారిభాషిక సంఘమువారు Nerve ను 'నెర్వ్' అనియే భాషాంతరీకరించిరి.

## దేవయానము :

ఈ మార్గమునకు అర్చిరాది మార్గమనియు పేరు. దహరాది విద్యోపాసకులైన జీవులను అర్చిరభిమాని దేవత, అహరభిమాని దేవత కడకు[8] మోచికొనిపోవును. అది వీరిని శుక్లపక్షోత్తరాయణ దేవత[9] కడకు మోచికొనిపోవును. వారు వీరిని సంవత్సరాభిమాని దేవతకడకుఁ జేరవయితురు. అది వీరిని దేవలోకమునకుఁ దీసికొనిపోవును. అటనుండి వీరు వాయులోక మేగుదురు.[10] అది వీరికి బండిచక్రపు కన్నంత బిలము విడచును. వీ రాబలము గుండ ఆదిత్యలోక మరుగుదురు. అది వీరికి లంబర వాద్యపు కన్నంత బిలము[11] విడుచును. వీరట నుండి చంద్రలోకము మెట్టుదురు. అది వీరికి దుందుభికన్నంత బిలము[12] విడుచును. వీ రాబలమున బడి విద్యుల్లోకము[13] చేరుదురు. అమానవుడగు పురుషుఁడొకఁడు అటనుండి వీరిని వరుణేంద్ర ప్రజాపతుల లోకముల[14] మీదుగా బ్రహ్మలోకమునకు గొంపోవును. అనగా ప్రాణమును వశపఱచికొనినవారు మృత్యువు వాకిటనుండగా నిచ్చెన మెట్లమీదినుండి మేడమీదికి ఎక్కినటులు సుషుమ్న గుండ శిరస్సునెక్కి బ్రహ్మరంధ్రమును భేదించి సుషుమ్నాగ్రమున నంటు సూర్యకిరణముల ననుసరించి అగ్నిలోకాదుల మీదుగా బ్రహ్మలోకము చేరుదురు.

---

8) తేర్చిష మభిసంభవన్తి. ఛాం. 'అగ్నిం ప్రాప్య తతశ్చార్చిస్తతశ్చ వ్యవహోరాదికమ్ నారదీయ. 'దివాది దేవతాభిస్తు పూజితో బ్రహ్మ యాతి హి' బ్రాహ్మ.

9) పూజిత స్త్వయనే నాసౌ మాసైః పరివృతేన హి - గారుడ. సాహ్నో మధ్యందినేత్రేనాధి శుక్లేన చ సపూర్ణిమా. సవిష్వా చాయనే నాసౌ పూజితః కేశవం వ్రజేత్. బ్రహ్మవైవర్త.

10) చూ. కౌషీ. బృహదారణ్యకములు.

11) లంబరస్య ఖమ్.

12) దుందుభే ఖమ్. ఈ చంద్రలోకము సంగతి ఛాందోగ్యమునఁ గలదు. బృహదారణ్యకమున నెనిమిదవ యధ్యాయమున లేదు. ఐదవ అధ్యాయమునఁ గలదు. దీని వివరణ మచటనే చూచునది.

13) ఛాందోగ్యము విద్యుల్లోకమునుండి బ్రహ్మలోకమున కొక గంతు వేసెను. బృహదారణ్యకమును 6-2-15 కూడ అంతియే.

14) "స ఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోక మాగచ్ఛతి. స వాయులోకం, స వరుణలోకం, స ప్రజాపతిలోకం, స బ్రహ్మలోకమ్" - కౌషీ. 1-3.

పితృయాణమునం దాదిత్యలోకము తగులదు. దేవయానమున ఆదిత్య లోకము మీఁదుగా చంద్రలోకము తగులును. కాని ఇది జ్యోతిశ్శాస్త్ర విరుద్ధ మగుటవలన మఱొక చంద్రలోకమని కొందఱు వ్రాసిరి. మఱియు కైలాస వైకుంఠాదులును, మహర్జన తపోలోకములును ఏత దంతః పాతులని కొందఱు వ్రాసిరి. ఇది యంతయు కలిసి బ్రహ్మాండ కటాహము.




దేవ పితృయానములకు మూలము :

> ద్వే సృతీ అశృణవం పితౄణా
> మహం దేవానా ముత మర్త్యానామ్
> తాభ్యా మిదం విశ్వమేజత్ సమేతి
> యదంతరా పితరం మాతరం చ (ఋక్ 10-88-15)

మనుష్యులకు దేవమార్గము, పితృమార్గము అని రెండు మార్గములున్నవని వింటిని. తలిదండ్రులవంటి భూమ్యాకాశముల నడుమ గతిశీలమగు నీ విశ్వమెల్లయు ఆ రెండు మార్గముల బడిపోవుచున్నది.

అను నీ మంత్రము నుదాహరించి బృహదారణ్యకము దేవయానమనియు, పితృయాణమనియు[15] భేదము నేర్పరచెను. ఛాందోగ్యముగూడ నీ రెండు మార్గములఁ జెప్పెను. ఈ మంత్రమును తైత్తిరీయ బ్రాహ్మణము గ్రహించెను. ఆయెడ వినియోగ సంగ్రహము "సురా శేషం తు వల్మీకే నయతి ద్వే సృతీ ఇతి" అని చెప్పెను. వీనిని పురస్కరించుకొని పదపటి స్మృతి గ్రంథము లన్నియు ఈ రెండు మార్గములను ప్రహత మొనర్చెను.

## జ్యోతీ రూపము :

మున్ముందట విష్ణు వాయు మత్స్య పురాణము లీ దేవయానమునకు రూప కల్పన మొనరించెను. పిదప భాగవతాదులు వీని ననుసరించెను.

> "వైశ్వానరపథమునకు వెలుపల అగస్త్యునకు
> ఉత్తరముగా అజవీధికి దక్షిణముగా పితృ
> యాణము. నాగవీధికి ఉత్తరముగా సప్త
> ర్షులకు దక్షిణముగా ఉన్న సూర్యుని
> ఉత్తరమార్గము దేవయానము-"[16]

---

15) కొందరు ఈ మంత్రము దేవమర్త్య మార్గపరమేకాని పితృయాణపరము కాదు. మర్త్యమార్గమే పిదపఁ బిదప పితృయాణముగా మారెను. ఋక్కులందు పితృయాణము దేవ యాగాంతర్గతము అని చెప్పుదురు. మంత్రమునందు 'దేవీనాం ముత మర్త్యానాం ద్వే సృతీ అహం పితౄణామ్ అన్నృణవమ్; పితృసంబంధి శ్రవణమ్'' - అను వేరు రీతిగా అన్వయింతురు.

16) "ఉత్తరం యదగస్త్యస్య అజవీధ్యాశ్చ దక్షిణమ్
పితృయాణం స వై పంథా వైశ్వానర పథా ద్బహిః"
—విష్ణు. 2-8-87. వాయు. 50-208

"నాగవీధ్యుత్తరం యశ్చ సప్తర్షిభ్య శ్చ దక్షిణమ్
ఉత్తరః సవితుః పంథా దేవయా నశ్చ సస్మృతః"
—విష్ణు. 2-8-92. వాయు. 50-216

భాగవతమునందును ఈ వీథ్యాదికము సమమే. ఈ భాగవతము తెలుగు భాగవతమున లేదు.

పథ మననేమి? వీథి యననేమి? ఒక్కొక్క గ్రహమునకు మూఁడేసి స్థానము లున్నవి.[17] ఉత్తరమున ఐరావతము. దక్షిణమున వైశ్వానరము. నడుమ జారద్గవము ఈ మూడును పథములు, లేక మార్గములు. ఈ మూడిటికిని మరల మూఁడేసి వీథులు కలవు. ఒక్కొక్క వీథిలో మూఁడేసి నక్షత్రములున్నవి.

వాయు విష్ణు పురాణము లీయెడ సమానము. మత్స్యపురాణము 124 వ అధ్యాయము 52 మొదలుకొని 60 వరకు చూచునది. అందు కొంచెము మార్పు కలదు.

## నక్షత్ర వీథి మార్గములు :

| నక్షత్ర | వీథి | మార్గ |
|---|---|---|
| అశ్విని, భరణి, కృత్తిక | నాగ | ఉత్తర మార్గ లేక ఐరావత పథ |
| రోహిణి, మృగశిర, ఆర్ద్ర | గజ | |
| పునర్వసు, పుష్య, ఆశ్లేష | ఐరావత | |

17) ఈ జ్యోతీ రూపకల్పన కంతకును ఆధ్యాత్మికార్థము కొందరు చెప్పిరి.

| నక్షత్ర | వీధి | మార్గ |
|---|---|---|
| మఘ<br>పూ.ఫల్గుని<br>ఉ. ఫల్గుని | వృషభ | మధ్యమమార్గ<br>లేక<br>జారద్గవ |
| హస్త<br>చిత్ర<br>స్వాతి | గో | |
| విశాఖ<br>అనూరాధ<br>జ్యేష్ఠ | జారద్గవ | |
| మూల<br>పూ. ఆషాఢ<br>ఉ. ఆషాఢ | అజ | దక్షిణ మార్గ<br>లేక<br>వైశ్వానర పథ |
| శ్రవణ<br>ధనిష్ఠ<br>శతభిష | మృగ | |
| పూ. భాద్ర<br>ఉ. భాద్ర<br>రేవతి | వైశ్వానర | |

గర్గుని మతమున వీధీ మార్గముల ప్రకారము భిన్నము.
అవి ఈ దిగువ :-

| నక్షత్ర | వీధి | మార్గ |
|---|---|---|
| కృత్తిక<br>భరణి<br>స్వాతి | నాగ | ఉత్తరమార్గ |
| రోహిణి<br>మృగశిర<br>ఆర్ద్ర | గజ | |
| పునర్వసు<br>పుష్య<br>ఆశ్లేష | ఐరావత | |
| మఘ<br>పూ. ఫల్గుని<br>ఉ. ఫలుని | వృషభ | మధ్యమమార్గ |
| అశ్విని<br>రేవతి<br>పూ. భాద్ర<br>ఉ. భాద్ర | గో | |
| శ్రవణ<br>ధనిష్ఠ<br>శతభిష | జరద్గవ | |

| నక్షత్ర | వీధి | మార్గ |
|---|---|---|
| అనూరాధ<br>జ్యేష్ఠ<br>మూల | మృగ | దక్షిణ మార్గ |
| హస్త<br>విశాఖ<br>చిత్ర | అజ | |
| పూ. ఆషాఢ<br>ఉ. ఆషాఢ | వైశ్వానర | |

తరువాతc దరువాత ఈ వీధీమార్గము లింకను మాఱుచు వచ్చెను. భరణి మొదలు తొమ్మిది చుక్కలు ఉత్తరమార్గమనియు, పూ-ఫల్గుని మొదలు తొమ్మిది చుక్కలు మధ్యమ మార్గమనియు, పూర్వాషాఢ మొదలు తొమ్మిది చుక్కలు దక్షిణ మార్గమనియు మరియొక మతమని వరాహుcడు చెప్పెను. తొల్లి ఈ వీథీ గణనమునందు కొంకొక రీతి యుండెడి ధనుటకు వాయు పురాణ మవకాశ మొసగుచున్నది. కాలభేదముచే సూర్యుని ఉత్తర మధ్యమ దక్షిణ మార్గముల ననుసరించి వీధీ మార్గ గణనము మార్పు చెందెననుట సువిస్పష్టము.

విష్ణు వాయు మత్స్యపురాణములలోని దేవయాన పితృయాణ వర్ణనము అచ్చుతప్పులు కాక తక్కినదంతయు సమానమే. శ్లోక శరీరము కూడ సమానమే. ఈ మూటిలో నే రెంకో ఒక పురాణము ననుసరించి యుండవలెను. లేదా యీ మూటికిని ఆకర మేజ్యోతిస్సిద్ధాంతమో ఐయుండవలెను. ఇది పరిశోధనకు విషయము.

ఈ యానములు రెండును సూర్యమార్గమగు క్రాంతి వృత్తమునందు రెండు భాగములు. పై పురాణములతో నాగవీథీ సప్తర్షుల స్థాన నిర్దేశము లేదు. వీని యెల్లలకు వేఱుపాయము నెమకవలయును. దానికిది తావుకాదు.

ఈ యానద్వయ కల్పనా సమయమున ఆశ్లేష మూడవ పాదములోనో, మఘ మొదటి పాదములోనో ఉత్తరాయణము ముగియుచుండెడిది. ఏలనగా,

'పక్షమే పితృదైవత్యము కావున విజ్ఞులు మఘలోనే పితృకార్యములు తీర్తు' రని వాయుపురాణము.

మానవ సంవత్సరము దేవతల కహోరాత్రమని పురాణము లందును, జ్యోతిశ్శాస్త్రమునందును సుప్రసిద్ధము. మానవుల ఆఱునెలలు దేవతల కొక పగలు. మఱియొక ఆఱునెలలు రేయి. సూర్యుఁడు దేవయానం దాఱునెల లుండును. అపుడు దేవతలకు పగలు.

ఈ యుత్తర దక్షిణాయనముల ఆరంభమెచట? విషువత్తు అని శ్రీబాల గంగాధరులు.

విషువత్తొక నక్షత్రమునందే యుండదే. ఒకపు డే నక్షత్రమునందు విషువత్తుండునో మఱొకపు డచట అయన నివృత్తియగునే.

సూర్యుని ఉత్తర దక్షిణ మార్గము లెపుడు భేదించెనో అపుడు సూర్యుఁడు దక్షిణ దిక్కునుండి ఉత్తర దిక్కునకుఁ బోవుట ఉత్తరాయణమని ప్రసిద్ధ మాయెను. విషువత్తు స్థిరము కాదు. కావున గర్గాదులు వీథ్యాది గణనమునందు క్రమాంతర మవలంబించిరి. ఈ పయి సంగతులఁబట్టి చూడఁగా ఈ యాన ద్వయ కల్పనా సమయమున రోహిణిలో విషువత్తుండియుండునని యోగీశచంద్ర విద్యానిధు లూహించిరి.

ఈ కీలిగా బయలుదేఱిన యీ రెండు దారులును, మెలమెలగా సరిహద్దుల తోడను, అంచెలతోడను ఏర్పాటయి కర్మఠులకును, ఉపాసకులకును సిమెంటు రోడ్లుగా పోయెను. ఇంతటితో నీ సంగతి వదలి వెనుకకు మరలుదము.

స్థూలమార్గము :

జీవుని ఉత్క్రాంతి మొదలుకొని బ్రహ్మలోక పర్యంతము కల లోకముల నుపనిషత్తులును, పురాణములును కనులకుఁ గట్టినటులు వర్ణించెను. విద్యు

దంతములగు నీ యర్చిరాదులు బ్రహ్మలోకమునకుఁ బోవు నుపాసకులను[18] మోచికొనిపోవు దేవతలు. వెళ్లువారో లింగదేహులు; అచేతనులు. మోచికొని పోవువారు సచేతనులు. ఆదిత్యాది లోకములు తమతమ లోకములం దున్న వారికి భోగభూము లగుచో కావచ్చుఁగాని సంపిండితేంద్రియ సముదాయముకల యీ బాటసారులకు భోగస్థానములు కావు.[19]

## బ్రహ్మలోకము :

"భూలోకమునుండి లెక్కింపగా మూడవది[20] బ్రహ్మలోకము. అచట సముద్రములంతటి అమృత హ్రదములు కలవు. మఱియు నచట అన్నమయ మగు నొక కొలను కలదు. అమృతము వర్షించు అశ్వత్థ మొక డచట నున్నది. అచట కర్మజ్ఞాన శూన్యులకుఁ బ్రవేశింపరాని పత్తన మొకటి యున్నది. అందు హిరణ్యగర్భుఁడు నిర్మించిన బంగారు మంటప మొండున్నది-" అని ఛాందోగ్య మధ్యవసించి బ్రహ్మలోకమును వర్ణించెను.

## ముక్తులు :

ఈ బ్రహ్మలోకమునకు ప్రణవ దహరాద్యుపాసనములచే నేగిన వారి కచట శరీరము ఉండదని బాదరియు, ఉండునని జైమినియు నభిప్రాయపడిరి. ఈ రెండు విరుద్ధ వాక్యములును అవిరుద్ధముగనే యున్నవని బాదరాయణుని అభిప్రాయము. పెక్కు వత్తులలో దీపమునకు ప్రవేశమున్నటులు ముక్త జీవు

---

18) ఉపాసనములు పెక్కులు. ఉపాసకులును పెక్కురు. వీరిలో దహరాది విద్యోపాసకులకు మాత్రమే అపునరావృత్తి. ప్రతీకోపాసకులకు రెండవ దారిగాని, మూడవ దారిగాని లేదు. వారర్చిరాది మార్గమున విద్యుల్లోకమునకుఁబోయి ఫలక్షయానంతరమే భూమికి వంగుదురని సంప్రదాయము. మఱి సామోక్త బృహద్రథంతర వైరూప వైరాజ శాక్కర రైవత కాంధస కాలేయాద్యష్టాత్మకాసందిని, సస్తోమముగ మహతిని ఉపాసించి సామ్రాజ్య భౌజ్య స్వారాజ్య వైరాజ్యాదిక్రమమున బ్రహ్మలోకము నొందువారును అవృత్తి చెందుదురు.

19) కొన్ని పురాణములు ఉపాసకుల కిచట పూజలు కల్పించెను. శంకరానందీయమీ లోకములను వీరికి భోగస్థానములుగాఁ జేసెను.

20) స్వర్గము కూడ ఇటనుండి మూఁడవ లోకమే. అయినను ఇట దాని లెక్కలేదు.

లకు పెక్కు శరీరములలో ప్రవేశముండును. జగద్వ్యాపారము వినా వారి కోరిక లన్నియు సంకల్ప మాత్రముననే సిద్ధించును.

ఈ దేవయాన మంతయు ముఖ్యముగా సగుణ బ్రహ్మోపాసకులకు; ఇక బ్రహ్మవేత్తలకు కాక వారి లేదు. "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి. ఉదస్మాత్ ప్రాణాః క్రామన్త్యాహో నేతినేతి హోవాచ యాజ్ఞవల్క్య అత్రైవ సమవలీయన్తే." బృహ. 3-1-11. బ్రహ్మవేత్తలకుఁ బొందవలసినది లేదు. పొందఁదగిన దానిని వారిచటనే పొందిరి: వారిచటనే బ్రహ్మభూతు లయిరి.

మఱొక చింతాధార :

బ్రహ్మము నెఱుఁగుట యనగా బ్రహ్మసాక్షాత్కారము పొందుట. బ్రహ్మసాక్షాత్కారము పొందినవారలు బ్రహ్మవేత్తలు.

'బ్రహ్మము ఇట్టిది' అని అప్పుడు-అనగా ఏ రామకృష్ణ పరమహంసయో, ఏ రమణ మహర్షియో చెప్పఁగా తెలియుట బ్రహ్మ స్వరూప మాత్రమును తెలియుట.

బ్రహ్మవేత్తలకు ఉత్తరాయణాదికములతో పనిలేదు. ఇక బ్రహ్మ స్వరూపమాత్రమును తెలిసినవారు పుణ్యకాలమున చనిపోయినంత మాత్రమున బ్రహ్మప్రాప్తి నొందగలుట యుక్తిసహము కాదు. కాబట్టి కాలమేమి చేయ గలదు? అట్లైన భీష్ముఁడు బ్రహ్మవేత్తయయ్యు ఉత్తరాయణమునకుఁ బ్రతీక్షించె నేల? అని యడుగుదురు. అతఁడు బ్రహ్మప్రాప్తికి కాలము నపేక్షింపలేదు కాని బ్రహ్మోపాసకమేని బ్రహ్మవేత్తలందఱును చావునకు ఉత్తరాయణము కై కాచుకొని యుండవలయును. వేత్త లెవరు నటులు చేయలేదు. అదియుఁ గాక ఇట్టికాలమున జావవలయునని ఎచటను విధిలేదు; ఉండజాలదు. ఈ పరిగణనమే విధియని ఎవరేని వాదించినను ఎవరును చావరు. ఇక భీష్ముని మాట. స్వేచ్ఛా మరణ మతని చేతిలో నున్నది. ఉత్తరాయణాదికము కళేబర సన్న్యాసమునకు గల విశేషదాయకమని చెప్పు ఆగమములను ప్రమాణీకరించుట కతఁడటులు చేసెను.[21] కాబట్టి యీ కాలద్వయమునందేదో విశేషమున్నది.

---

21) ఈ కాలము మార్గపరమని కొందఱు, దేవతా పరమని కొందఱు. ఈ రెండు నొకటియేయని యింకొందఱు.

రహస్య శాస్త్రములు కాలము[22] బాహ్యమనియు, నాభ్యంతరమనియు రెండు విధములని చెప్పను. అందు సూర్యచంద్రుల చారముచే కూడుకొన్నది బాహ్యము. ప్రాణాపాన లక్షణమైన సూర్యచంద్రుల చారముచే నుపలక్షితమయినది ఆభ్యంతరము. ఈ రెంటిలో ముఖ్యార్థమగు సూర్యేందు చారోపలక్షితమగు కాలము పై హేతువులచే బాధితమగుచున్నది కాన నిచట గౌణమగు ఆభ్యంతర కాలమును గ్రహింపవలయును. కాగా కాలవాచకశబ్దములు ప్రాణగతి ప్రతిపాదకములు. రహస్య శాస్త్రములలో నచట నచట ప్రాణగతియే దివసాద్యుత్తరాయణ కాలావయవముగా ప్రసిద్ధము. కావున అంతకాలమునందు బ్రహ్మద్వారమునకు స్వరసముచే ప్రవహించు ప్రాణచారమునందు నియంత్రితమగు బ్రహ్మవేత్తల సంవిత్ప్రవాహము మహాసంవిత్సముద్రమునందు సమరసీభావము నొందును. ఇది బ్రహ్మవేత్తల దేవయానము.

ప్రాణవృత్తినే ఆశ్రయించి దేహమును విడుచు కేవలయోగులు బ్రహ్మవేత్తలు కారు. కావున తత్త్వ స్మృతి లేమి, దేహాదులం దాత్మభావము వదలమి అపానవృత్తియగు సంసారము నాశ్రయించి విశిష్టమగు దేహాంతరము నాశ్రయింతురు. ఇది పితృయాణము.

ఈ మతమున బాదరి, బాదరాయణులు కొండలవలె అడ్డు పడినను కార్య బ్రహ్మలోకము నెత్తివేయవలయును. అటులగుచో దహరాది విద్యోపాసకులు కూడ ధూపరిమళము నాస్వాదింపవలసియుందురు. ఇంతియకాక, ఆ సుధా హ్రదములలో స్నానపానములుండవు. ఈ యశ్వత్థశాఖల కెవరును మడిబట్ట లారంగట్టరు. ఆ యన్నసత్రమున అతిథు లుండరు. ఆ బంగారు మంటపమును, ఆ పత్తనమును ఖాళీ.

ప్రకృతమునకు వత్తము. ప్రకృత విద్యుల్లోకమునకును వెనుకటి విద్యుల్లోకమునకునుగల సంబంధమేమి? తెలియుట లేదా-అది బాదరాయణ సంబంధము.

---

22) చూ. సర్వతోభద్ర.

23) స్కాందాదులయందు సూర్యచంద్రనాదులును ధ్రువేందు మండల సుధాస్వాదాదులును ప్రసిద్ధము. "య ఏష స్తన ఇవావలంబతే, అంతరేణ తాలుకే, సేంద్రయోనిః" అను తైత్తిరీయోపనిషత్తునందు కొండనాలుక ఇంద్రలోకము. 'తస్యాసత ఋషయః సప్తతీరే' అను సప్తర్షులు సప్తప్రాణములు కదా- 'ప్రాణా వా ఋషయః' కావున ఇంద్ర చంద్ర విద్యుల్లోకాదులు శారీరకములు. బాహ్యములు వానికి స్ఫోరకములు.

# 9. ప్రాచీన భూగోళము

రఘువంశమున నాల్గవ సర్గము చదువుచో దేశభ్రమణము చేయవలయు నను కోరిక కలుగును. అది తీఱు నుపాయము అందఱకును గలుగదు. తెలుఁగు కవులలో దేశాటనము చేయించినవాఁడు పింగళి సూరన. పురాణములలోని బ్రహ్మాండ విన్యాసమును చదివినచో ఆ దేశ భ్రమణపు కోరిక దిగ్భ్రమణ ముగా మారును. ఏలన, ఈ పురాణములలో గల ద్వీపములు మనుష్యులు కొండలు; నదులు మొదలగువానినిఁ జదివికొనుచుఁ బోవుచో నివి యన్నియు కల్లయనియో, లేక ప్రళయము వెనుకటివనియో తోఁచును. ఏ కారణముననో, 19వ శతాబ్దిలోని పాశ్చాత్య విమర్శకులు కొందరు ఈ పురాణములన్నియు పెరటికుప్పలకు శరీరవృద్ధి చేయునని వ్రాయుటకు తెగించిరి. స్మిత్, విల్సనులు వంశాను చరితమును మాత్ర మొక కంట నాదరించి పరిశిష్టమును నమ్మకముగా బూటకమని బూకరించిరి. Pargitor మొదలగు కొందఱు పైవారికి ప్రతికక్షులు.

ఇరువదవ శతాబ్ది ఆరంభము మొదలుకొని మన దేశమునందు ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయము లెఱింగిన విద్వాంసులు పురాణములను పరిశోధించు చున్నారు. ఇపుడు శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును పురాణములను శోధింపఁబూనుట తెలుగువారి భాగ్యము.

తలనొప్పి రావించుకొనఁదలచుచో పురాణము లందలి భూగోళవర్ణనమును, పిదప రాజవంశ వర్ణనమును చదువవలయును. Pargitor, దీక్షితార్, B. C. Low, జె. సి. రే మొదలగు వారిలో కొందఱు ఈ తలనొప్పికి అమృ తాంజనమును, కొందఱు మిరియపు గంధమును వ్రాయుచుఁ బోయిరి. దీనికి సరి యగు మందు కనుగొనవలసియే యున్నది.

## పురాణ ప్రాచీనత :

[1]పురాణములలో వాయు విష్ణు మత్స్య మార్కండేయములు ప్రాచీనము లనియు, వానిలో వాయుపురాణము ప్రాచీనము లనియు, వానిలో వాయు పురాణము ప్రాచీన తమ మనియు పరిశోధకులలో పలువురి విశ్వాసము. దీని ఉత్పత్తికాలము క్రీ. శ. 5 వ శతాబ్దుల వెనుకకుపోదు, క్రీ. శ. 5 వ శతాబ్దుల కీవలకు రాదు అని వారి యూహ. మఱియు మన కుపలబ్ధమగునది వాయు సంహిత. తొలుతటి వాయు పురాణ మనునది దీనికంటె చాలఁ జిన్నదయి యుండును. ఇది మూడు కాలములలో పరివర్ధితము, పరిశోధితమును అయినది· ఈ మాట మత్స్యపురాణమునకును, విష్ణు పురాణమునకును చెల్లును. దీనికి సాక్ష్య మీపురాణములందే కలదని కొందరు విమర్శకులు సోదాహరణముగా నిరూపించిరి. ఈ పురాణములలో వాయు పురాణము ప్రాచీనతమ మనుటకు దగు హేతువులివి. పురాణలక్షణమగు సర్గము, ప్రతి సర్గము వంశము, మన్వంతరము, వంశా (శ్యా) ను·చరితమును దీనికి[2] గలవు. మిగిలిన వానిలో భిన్న లక్షణము లెక్కుడు. అనఁగా ఇతర పురాణములందు ప్రక్షిప్తము లెక్కువ. దీన తక్కువ.[3] ఈ పురాణమునం దవతారవాదము లేదు.[4] భారతమును దాని కను బంధమగు హరివంశమును దీనిని పేర్కొనెను.[5]

---

1) స్కాంద భాగవతాదుల పురాణ పరిగణనములో వాయు పురాణము లేదు. దేవీ భాగవతాదులలో ఇది మహాపురాణమని ఉన్నది.

2) భాగవతము తనకు పది లక్షణములు కలవని చెప్పుకొనెను. భాగవతము రెండవ స్కంధమున పదవ యధ్యాయము చూచునది. పురాణ సామాన్య లక్షణముకంటె నిది విలక్షణము. కావునఁ గొన్ని పురాణములు భాగవతమును పురాణములలో జమకట్టలేదు. ఐనను ఇది 'నిగమ కల్పతరోర్గళితం ఫలమ్'.

3) ఇందలి ఖగోళ సంగీతాద్యధ్యాయములు ప్రక్షిప్తములని నవీనుల యూహ. అటు లగుచో భూగోళాధ్యాయములు మాత్ర మేల ప్రక్షిప్తములు కావు ? ఇది సర్గమునకు సంబంధించిన దందురా, ఖగోళము మాత్ర మేల సర్గమునకు సంబంధింపదు ?

4) రుద్రావతార మవతారవాదములోఁ జేర దనినను విష్ణ్వవతారముల ముచ్చట ఇందు అందందు కలదు. చూ. 32-37 మొ.

5) భారతము వనపర్వము.చూచునది.

## పండిత సంప్రదాయము :

పురాణముల కాల నిర్ణయము చేయుటకు వీలులేదు. కల్పాదియందు బ్రహ్మ పురాణములను మనస్సులో సంకల్పించెను.[6]

'పురాణములందు రాజవంశ వర్ణనము కలదు కదా! కావున దానినిఁబట్టి పురాణముల కొక కాల మేర్పడుట లేదా?'

'లేదు. ప్రతికల్పమునందును రాఁగల రాజవంశముల వర్ణనము ఉండ వచ్చును.'

'అగుచో ప్రతికల్పము నందును ఈ రాజవంశమే యుండునా?'

'ఉండును- సూర్యాచంద్రమసే ధాతా యథాపూర్వ మకల్పయత్'

'ఐనను దీనికి ఏదో యొక కాలము కనబడుచున్నది కదా?'

'అగును. ఇది సంసారమువలె అనాది. అటులు కానిచో శ్రుతులందును ఇతివృత్తములు[7] కలవు. కావున పురాణము లనాదులు. కావుననే ఛాందోగ్య మున 'ఇతిహాస పురాణం పంచమం వేదానాం వేదమ్' అని కలదు.

కావున పురాణకాల పరీక్ష వీలుకానిది. మఱియు బ్రహ్మాండ మెల్లయు భగవంతుని స్థూలరూపమని తెలుపుటకే కాని పురాణములలోని భూగోళ ఖగోళ వర్ణనము నేటి అర్థములో భూగోళ విజ్ఞానముకాదు. మఱియు మాటిమాటికి మాఱుచుండు నీ జనపదములయు, దేశములయు వర్ణనమువలన నేమి యుపయో గము కలదు? ఆధునికులు స్థూలదృష్టితో సర్వేచేసి స్థూలజగత్తును వర్ణింతురు. మహర్షులో యోగదృష్టితో సూక్ష్మలోకములను చూచి పురాణములలో వర్ణించిరి. కాఁబట్టి పురాణములందలి బ్రహ్మాండ విన్యాసవర్ణనము నేఁటి జాగ్రఫీకాదు. విరాడ్ బ్రహ్మాండ వర్ణనము సూక్ష్మరూపాను ధ్యానము కొఱకే. ఇది ప్రాచీన పండిత సంప్రదాయము.

---

6) ప్రథమం సర్వశాస్త్రాణాం
పురాణం బ్రహ్మణా స్మృతమ్,
అనంతరం చ వక్త్రేభ్యో
వేదా స్తస్య వినిః సృతాః (వాయు. 1-60, 61)

7) 'ఉర్వశీ హాప్సరాః, సా పురూరవస మైడం చకమే'.

## పురాణ విద్య :

'వేదములఁ జదివినను 'పురాణములను జదువకున్న యెడల విచక్షణుఁడు కాఁజాలఁడు. పురాణేతిహాసములచే వేదజ్ఞానమును పెంపొందించుకొనవలెను. అటులు కానిచోఁ దనను కొట్టవచ్చుచున్నాఁడేమో యని ఆ యల్పునిఁ జూచి వేదము భయపడును' అని పురాణములు చెప్పును.

పురాణము లోక విద్యగా పూర్వకాలమున పరిగణింపఁబడెను. నన్న యాదులు పురాణ విద్యా పారీణులని వారి గ్రంథములే చెప్పును. పురాణములు తెలియవలయుచో నన్నిటినిగాని, కొన్నిటినిగాని చాల శ్రద్ధగా చదువవలయును. హిందూదేశమున నెల్లడ మొన్న మొన్నటివఱకును అందఱును సామాన్యముగా పురాణములను వినుచుండెడివారే. ఇపుడు పురాణపఠనమును శ్రవణమును గూడ బర్బరమై పోయెను. ఇఁకఁ గొలది నాళ్లలో ఈ యుచిత విద్య కఱవయి పోవును.

## చిక్కు :

ఇప్పు డతికాయులును, మహాకాయులును అగు ఈ పురాణసంహితల నుండి అసలు పురాణములను విడదీయఁజాలము. ఇపు డచ్చయిన వానిలో పాఠ భేదములు, ప్రక్షిప్తములు, అప్రాకరణికములు, తప్పులు మొదలగున వెన్నియో మన కడ్డు వచ్చుచుండును. ఇంతియకాక ముఖ్యములయిన గొట్లు నట్లే. ఆయా ద్వీపములయు, పల్లియలయు, పత్తనములయు పేరు ఏయే భాషలలోనివో యెవరు చెప్పఁగలరు ? నాటి దేశకాలము లెంత తాఱుమాఱాయెనో అది ఊహకు అందునా ? వాయుపురాణము నందొకచో ఇది వాయు ప్రోక్తమనియున్నది. రెండుపుటలు తిరుగవేసినంతనే ఇది బ్రహ్మప్రోక్తమను విషయము కంటఁ బడును. ఈ రెండు పాఠములను అంగీకరించినచో వాయురూపముగల బ్రహ్మ చెప్పెనని కాని, బ్రహ్మరూపుడగు వాయువు చెప్పెనని కాని చెప్పవలసివచ్చును. ఇది యొంక తిరుగుడు కదా. ఈ వాయు పురాణముననే యొకచో వాయుపుర మను[8] నొక పురము కలదని కనఁబడును. అటులే వాయువను మహర్షి యొకఁడు

---

8) ఇచటనే హనుమంతుని పుట్టుక. చూ. 60-67 వాయు.

తప్పులు :

వీనిలో అచ్చుతప్పులు[9] మిక్కుటము. వ్రాతప్రతులు వీనికన్న చెడుగా నుండును. ఏ పండితున కెటు తోఁచెనో ఆ పండితుఁ డటులు దిద్దెను. ఇపు డీ తప్పులను, పాఠ భేదములను కనుగొనుటయే కష్టము. వానిని దిద్దుటకు కృష్ణ ద్వైపాయనుఁడే మరల నవతరింపవలెను గాని వానిలో వేలు పెట్టుట కెవరికిని అధికారము లేదు.

ఈ గందములన్నియు నటుండగా అర్థము కాని పదములును,[10] శాస్త్రములను గూడ శాసించు అపూర్వ ధాతువులు, నిరుక్తులు మొదలగున వెన్నియో తగులుచుండును. 'శివా' యని ఏ పురాణము తీసినను 'నారాయణం నమస్కృత్య......తతో జయ ముదీరయేత్' అని యుండును. ఈ 'జయ' పదమునకు 'భారతము' అని కొందఱు అర్థము వ్రాసిరి. అటులగుచో అన్ని పురాణములందును ఈ శ్లోక మేల యుండవలయును ? భారతమే ప్రశంసించిన, అనగా భారతముకంటె వెనుకటిదగు వాయు పురాణమున నిది యెటులుండగలదు ? కావుననే పండిత స్వామి యగు శ్రీధరస్వామి భాగవతమున నీ యర్థము పొసఁగదని కాబోలు జయమనగా గ్రంథమని[11] అర్థము వ్రాసెను. ఇఁక మన ఎఱ్ఱాప్రెగడ ఏమి వ్రాసెనో చూతము—

గీ. హృద్యమగు పుస్తకము గొని యెలమి యొఱయఁ
బాఙ్ముఖో దఙ్ముఖత్వ తత్పరతనుండి.

క. నారాయణు నరుని నమ
స్కారంబునఁ దలఁచి వాణిఁ గల్యాణి నెదం

9) 'అచింత్యాః ఖలు యే భావా స్తాన్న తర్కేణ సాధ్రయేత్' అను శ్లోకము విద్వాంసుల కందఱకును కంఠపాఠము. 'తాంస్తు తర్కేణ సాధయేత్' అని కొన్ని ప్రతులలోఁ గలదు. ఇది పాఠ భేదమా, లేక తప్పా ?

10) 'నైవహాంషితః - నహాంషః'. చూ. పాద్మ-భూ 105 అధ్యాయ. 'హాంష' ధాతు వీప్రపంచములో లేదు. ఇఁక 'ఘుష్ జ్ఞాపితే' వంటి వెంత కావలసినంత.

11) చూ. ౧ స్కం - ౨ అధ్యాయ-10 శ్లో.

జేరిచి వేదవ్యాసుల
నారాధించి మఱి వలయు నారంభింపన్. (హరి. ఉ. భా. ఆ-10)

ఇఁక తిక్కన యేమి వ్రాసెనో పరికింతము—

ఉ. భ్రాజిత వృత్తిమైఁ బరగు భారత సంహిత సంయమీంద్రులా
రా జయనామకంబునను రాజితభంగి జగత్త్రితయంబునన్
బూజిత కీర్తియై నెగడు...... (స్వర్గా-82)

ఎఱ్ఱాప్రెగడ వ్యాసుడని కాని, గ్రంథమని కాని అర్థము చెప్పెనని యను కొనవచ్చును. తిక్కన భారతమని చెప్పెను. కావున గ్రంథ భారతోభయ వాచకము 'జయ' మనవలెను. ఇట్టి కష్టము లెన్నియో యున్నను ఈ పురాణము లందలి బంగారమును పైకిఁదీయుట కెవరికి వారు ప్రయత్నింపవలయును. భరతవర్షమునందలి విద్యాసంపద యెంతయో యీ పురాణము లందున్నవి. నియమపూర్వకమైన పరిశోధన మికముం దెంతయో యావశ్యకము.

## ముక్కారు పంట :

వాయు మత్స్య బ్రహ్మాండము లందలి భూగోళ వర్ణన మించుమించు సమానము. వాయు విష్ణు పురాణములు మూడు కాలములలో ముమ్మారు పెరిగి నటులు ఊహింపవచ్చును. విష్ణు పురాణమున మూడవ తూరి పెరిగిన సంగతు లెక్కుడుగా గానబడును గాన నిపటి దీనిని వదిలి పై మూడు పురాణములలోని అంశములనే చూతము.

## నాలుగు దీవులు :

దీవులెన్ని? సముద్రములెన్ని? కొండలెన్ని? వర్షములెన్ని? ఏఱులెన్ని? వీని పేరు లేమి? ఈభూమి పరిమాణమెంత? అని ఋషులు సూతు నడిగిరి.[12]

---

12) ఈ వాయుపురాణ శ్లోకమే మార్కండేయమున కలదు. దానికి మారన యిటుల తెలుగు చేసెను -

"ఎన్ని దీవులు జలనిధు లెన్ని నగము
లెన్ని వర్షంబు లెన్ని? యుం దేఱు లెన్ని? [మార్కం - 4-131]

'దీవు లేడు. వీనిలో వేనవేలు దీవు లున్నవి. వీని నన్నిటిని నేఁ జెప్ప జాలను.' అని యనుచు సూతుఁడు చెప్పుకొనుచుబోయిన దీవుల వెతికిన యెడల విస్మయము కలుగును. ప్రాచీన పాంథులు చైను కంపాసు పుచ్చుకొని భూ భ్రమణమునకు బయలుదేరలేదు. భూమి యాకారము పైని నక్షత్రములు ఈ మొదలగునవియు పరంపరా శ్రుతియు వారికి సంబళము. కొంద అనుకొని నటులు యోగదృష్టితోడను వారు కనుగొనలేదు. మిగిలినవాని మాట యేమో కాని జంబూద్వీపము మాత్రము వారి యోగదృష్టికి గుఱియైనటులు లేదు.

ఇవి సూక్ష్మలోకములును గావు. వారి స్థూలదృష్టికంటె స్థూలలోకములు. పురాణకర్తలు తర్క సాహాయ్యమునసే యీ దేశములను వర్ణించిరి.[13] సూక్ష్మ దృష్టితోఁ జెప్పిన విషయములును గొన్ని కలవు. ఈ రెండు మాటలును పురాణములందే కలవు.[14] పిడుగునకును బియ్యమునకును ఒకటే మంత్రము కాదు.

---

13) 'సప్తద్వీపం ప్రవక్ష్యామి
చంద్రా దిత్యగ్రహై స్సహ
యేషాం మనుష్యా స్తర్కేణ
ప్రమాణాని ప్రచక్షతే. (వాయు, 34-7)

యత్ర యత్ర హి దృశ్యన్తే
ధావంతి పంచ భౌతికాః,
తేషాం మనుష్యా స్తర్కేణ
ప్రమాణాని ప్రచక్షతే (పద్మ - ఆది - 4-11)

14) ''అచింత్యాః ఖలు యే భావా
స్తా న్న తర్కేణ భావయేత్,
ప్రకృతిభ్యః పరం యచ్చ
త న్నిత్యం చ ప్రచక్షతే'' - (వాయు 34 - 8)

దీనికి భాగవత - 5 స్కంధ - 21 అధ్యాయమున 'అనుములు సెనగలు మొదలగు వానిలో నొకదళ మెంతయుండునో, రెండవదళమును అంతయే యుండును. అటులే బ్రహ్మాండమునందు భూగోళ ప్రమాణ మెంతో ఖగోళ పరిమాణ మంత' అని కలదు. పురాణము లన్నిటిలోని మేరు వర్ణనము కలిపిచూచినచో నిది యేదోయొక సూక్ష్మలోక వర్ణనమని తోచును. దీనికి ఇలావృతవర్ష వర్ణన మొకతోడు. 'ఇందు పరపురుషుగాని పురుషుడు ప్రవేశింపలేడు' అని యున్నది. మేరువునకు మేరు దండము ప్రతినిధి. దీనికి రహస్యశాస్త్రములు చూచునది -

వారు తూరుపు, పడమర, దక్షిణము, ఉత్తరము అని స్థూలముగా నాలుగు దిక్కుల నాలుగు దీవులను నిర్దేశించిరి.

## మేరువు :

ప్రాచీన దేశవర్ణనమునకు మేరువు నాభి. మనము ఇప్పటికిని 'జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరో ర్దక్షిణ దిగ్భాగే' అని సంకల్పము చేయుచున్నాము. అది ప్రాచీనార్యుల స్వదేశమయి యుండవచ్చును. కావున అది నాభి, లేక వారి భూగోళ పరిగణనమునకు అది మధ్యము కావచ్చును. కావున అది నాభి. దీనినే వారు స్వర్గమనియు, దేవలోకమనియు కొనియాడుటలో చతుర్ముఖులైనది. "స హి స్వర్గ ఇతి ఖ్యాత" దానికి స్వర్గమని ఖ్యాతి. దీనికే మరియొక పేరు సుమేరువు. ఇది పర్వతమయమును విశాలము నగు సమభూమి. దీనిని బట్టియే ఎత్తగు నేలకు మేరువని పేరు వచ్చెను. ఈ పద మచ్చతెనుఁగు పదముగా కూడ భుక్తమాయెను. యయాతి చరిత్రము చూచునది. ఇది క్రమక్రమముగా జపమాలలో పెద్దపూసకును, హారమణులలో నాయక మణికిని, వ్రేలి గీఱలలో పెద్ద గీఱలకును, పెద్ద పెద్ద కట్టలకును, వెన్నెముకకును పేరాయెను.

## పర్వతములు :

పర్వతములు లేని యెడల మేరువు కాదు. పర్వము లేనిచో పర్వతము కాదు. పర్వము లేనిది గిరి. రెండు పర్వతముల నడుమనున్న లోయ, లేక సమభూమి ద్రోణి. పర్వతము బ్రద్దలగుచో దరి.

పర్వతము లిరుదెఱగులు. వర్ష పర్వతములు, కుల పర్వతములు. మనుష్యులు ఉనికి చేసికొనినవి వర్ష పర్వతములు. ఇవి మిగుల పొడవైనవి. ఇట్టి కొండల వరుసల నడిమి నేలలలో మనుష్యులు నివసించుటకు వీలగును. దేశమునకు దేహరూపముగను, పంజరరూపముగను ఉన్నవి కుల పర్వతములు.

## ద్వీపములు :

రెండు వైపుల నీరు క్రమ్మిన భూభాగము ద్వీపము. "ద్విర్గతా అపో యస్మిన్ ... ద్వ్యన్తరుపసర్గేభ్యోఽప ఈత్". ఒక వైపునగాని, మూడు నాలుగు వైపులగాని నీరు

క్రమ్మిన భూభాగమునకును ద్వీపమని వ్యవహార మున్నది. జలసంలగ్నమగు ఎత్తు నేలను ద్వీపమనవచ్చును. ప్రాచీనులును ఇటులు వ్యవహరించిరి. సముద్ర జలముననే కాక నదీహ్రదముల జలముచే సంలగ్నములగు భూభాగములును ద్వీపములే. ఇట్టి ద్వీపములు ఆంధ్ర దేశమున పెక్కులు. కావున భారతము ద్వీపము. మఱియు వర్ష పర్వతముల సంబంధమువలన వర్షము. వర్ష పర్వతముల దాపుననుండి సముద్రముచే అంతరితములగు ద్వీపము లంతర్ద్వీపములు. ద్వీపముల దాపున నున్న చిన్న చిన్న ద్వీపములు అనుద్వీపములు.

## సా గ ర ము లు :

సముద్రములకే కాక పెద్ద పెద్ద నదులకును సాగరమను వ్యవహార మున్నది. పెద్ద పెద్ద హ్రదములకును సాగరమను వాడుక యున్నది.

ఇపు డొకసారి సింహావలోకన మొనరింతము. తొల్లి పురాణ ఋషులకు మేరువు నాభి. పృథివి గోళాకారము కాదు. మఱి చక్రాకారము.

మేరువు చిన్న బిందువు కాదు. దానికి నలుదెసలను నాలుగు ద్వీపములు. మఱియు ఆ ద్వీపముల చుట్టును సాగరము. వాయు మత్స్య బ్రహ్మాండాది పురాణ ముల యందును భూమి చతుర్ద్వీప, చతుస్సాగర.

సాగరములు నాలుగనుట చాల ప్రచురము. నాలుగను అంకెకును, నాలుగు వస్తువులకును పర్యాయముగా సముద్రమును చెప్పు పదముల నన్నిటిని వాడుదురు. ఛందోజ్యోతిషములం దిది ప్రసిద్ధము.

ఈ మేరువునకు ఉత్తరమున కురుద్వీపము. తూర్పున భద్రాశ్వము. దక్షిణమున జంబూద్వీపము. పడమట కేతుమాలము.

మేరువునకు నలుదెసలను దవ్వుగా నాలుగు కొండలు. వాని నాశ్రయించు కొని సముద్రము వఱకును నాలుగు ద్వీపములు. మేరువు మత భేదముచే అష్ట కోణము, శతకోణము, సహస్రకోణము, చతురస్రము, శరవాకారము, సముద్రా కారము. ఏ ఋషి ఏ వైపును జూచెనో, ఆ వైపును బట్టి దాని యాకారము నిటులు చెప్పెనని పురాణమునఁ గలదు.

'యద్య ద్యస్యహి మత్సార్శ్వం
పర్వతాధిపతే ఋషిః
త త్ర దేవాస్య వేదాఽసౌ (వాయు. 34-64)

మేరువు ఉ త్తర భాగము ఎత్తు. దక్షిణ భాగముకూడ ఎత్తు. ఉ త్తర భాగమునకు ఉ త్తరవేది యనియు, దక్షిణ భాగమునకు దక్షిణవేది యనియు పేరు. మేరువు నుండి నాలుగు మహానదులు బయలుదేరి నాలుగు సముద్రములలో కలిసెను.

[ప్రక్క పుటలోని పటము చూడుడు]

ఇపు డాసియాపటము చూచి చూడగానే మేరువనగా చీనాయనిగాని, తుర్కీయనిగాని తోచును. ఈ చీనా తుర్కీలకు నలుదెసలను కొండలు. నలుదెసలనగా తూర్పు పడమర ఉ త్తర దక్షిణము లని అనుకొనరాదు. ఏ కొండలును తీర్చినటులు సరిగా దిక్కుల కనురూపముగా నుండవు. నలుదెసల గల నాలుగు నదులకును తూరుపున నేటి తరిమ్[15] దక్షిణమున ఆక్సస్, పడమట సీతాదరియా, ఉ త్తరమున ఇ ర్తిష్.

జంబూ ద్వీపము :

మేరువునకు దక్షిణమున జంబూద్వీపము. భరత వర్షమునకు వెనుకటి పేరులు - అజనాభము, జంబూద్వీపము. ఈ 'జంబూ' కే తత్సమము 'జమ్మూ'. ప్రకృతము ఈ జమ్మూ కాశ్మీరమున నొక మండలము.

'జంబూ పర్వతము నేటి పామీర్.[16] జేమ పండును నిలువుగా కోసి నేల మీద పెట్టినటులి పామీరు చదియ లుండును. ఉ త్తర దక్షిణములు వాలు, నడుమ

15) తరిమ్ దేశము నేడు ఇసుకలో పూడిపోయెను. నదియు లవనర్ హ్రదమున నదృశ్యమాయెను. హోయాంగ్ హో అని ఈ నదికి పేరు. చాలకాలము వెనుక అలకనంద గంగయాయెను. కొండలలో నేరుల నిరూపించుట దుర్ఘటముకదా. తరిమ్ దేశము నరుమటమున్న ఇసుక త్రవ్వగా తొంటివ త్తవములు బయటపడెను. ఇంకను లోతుగా త్రవ్వినచో పూర్వకాలావశేషములు తెలియవచ్చును.

16) పామీర్ పదము ప్రాక్మేరు పదమున కపభ్రంశ మేమో విచారింపవలెను.

ఎత్తు. ఇచట నిపుడు హిందుకుష్, కారకోరం, కువేన్ లుంగ్, తియాన్‌శాన్ అను నాలుగు కొండలు కలిసెను. పామీరు కొండలు బ్రద్దలగు చుండును. ఈ కొండలలో ద్రోణులకును సరోవరములకును లెక్కలేదు. పామీర్ పదమునకు ద్రోణి అని యర్థము.'

'సంస్కృతమున అగ నగ శిఖరి పదములకు చెట్లనియు, కొండలనియు అర్థము. జంబూ నగములనుండి హస్తి పృష్ఠాకారములగు జంబూ ఫలములు పడుచుండునని పురాణముల కవిత్వము. ఈ పామీర్ కొండలు పగిలి హస్తి పృష్ఠాకారములగు సానువులు జారి పడుటయే ఈ కవిత్వమున కర్థమయియుండు ననియు, పురాణములం దిందుల కాధారమున్నదనియు శ్రీ జె. సి. రే గారు వ్రాసిరి. కాని మిగిలిన కొండల మీఁది చెట్లకును, వాని పండ్లకును, వాని నదుల కును వేరు సమాధానము చెప్పవలసి యుండురు.

## భద్రాశ్వము :

చీనా మంగోలియాలు కలిసి భద్రాశ్వము. ఒక జాతి యెద్లకు భద్ర వృషభములనియు, ఒక జాతి యేనుఁగులకు భద్రగజము లనియు పేరున్నటులే ఒక జాతి గుఱ్ఱములకు భద్రాశ్వములని పేరుండియుండును.

మంగోలియా గుఱ్ఱములకు ప్రసిద్ధి. సుమంగలమే మంగోలియా అయిన యెడల భద్రాశ్వమను మాట అన్వితార్థ మగును. ఆసియా యనునది అశ్వదీపాప భ్రంశము. పడమటి తుర్కీ గుఱ్ఱములకు జన్మస్థానము. సమర ఖండపు గుఱ్ఱ ములు ప్రసిద్ధములు. ఋగ్వేదమున అశ్వవాహనములు కలవు. ఈ ద్వీపమున హయవదనుఁ డుండునని భాగవతము.

## కేతుమాలము :

మేరువునకు పడమట కేతుమాలము. సముద్ర మథనము నాడు దేవదాన వులకు కలిగిన కయ్యములో చెట్లన్నియు కూలిపోగా ఇంద్రుడు ఈ ద్వీపము నందలి రాతి మీద కేతువుగా మాల వైచినందు వలన దీనికీ పేరు వచ్చెనట. ఇపు డిది పడమటి తుర్కీస్తాన్.

## కురు ద్వీపము :

మేరువున కుత్తరమున కురు ద్వీపము. ఇతర మానస పుత్త్రులగు సప్తర్షుల నివాసము. ఎవరి మానస పుత్రులు ? బ్రహ్మమానస పుత్త్రులు. ఎవరి పుట్టుక బ్రహ్మ కడకు బోవునో వారి పుట్టుక అనాది యన్నమాట. వీరు సనత్కుమారావరజులు. వీరికి కురువులని పేరు. వీరి పేరుబట్టి యీ ద్వీపమునకు కురు ద్వీపమనియు, ఉత్తర కురు దేశము లనియు పేరు.

ఇటులు మేరువు నలుప్రక్కలఁ గల నాలుగు ద్వీపములను పురస్కరించుకొని లోకము చతుర్దళముల్గల పద్మమువలె నున్నదను కల్పన ఉదయించెను. ఈ విషయము గుఱించి ముందు.






## నవవర్ష విభాగము :

ఈ పైన జెప్పిన చతుర్ద్వీప విభాగము స్వాయంభువ మనువునకు వెనుకటిది- కాన చాల పురాతనము. స్వాయంభువుని కొడుకు ప్రియ వ్రతుడు. తన కొడుకులకు భూమిని పంచి పెట్టవలసి వచ్చెను. అపుడు అది తొమ్మిది చీలికలై తొమ్మిది వర్షము లాయెను. "వృష్యతే సిచ్యతే మేఘై రితి వర్షః"-వానలచే తడుప బడునది గాన వర్షము. ఈ తొమ్మిది వర్షములును పంట పొలములై యుండును.

ఆసియా పటము చూచినచో తూర్పు పడమరల పొడవగు కొండలు కనబడును. ఇవి హిమాలయమును, కుయేన్‌లున్, ఆల్‌తిన్‌తాగ్. ఈ మూడును వర్ష పర్వతములు. మరియు ఉత్తరమున దక్షిణ-ఆల్‌తాయి, పిమ్మట చాంగాయ్

పర్వతములును, అటుపిమ్మట ఉత్తర-ఆల్‌తాయ్ పర్వతములును కనబడును. ఈ మూడు వర్ష పర్వతముల బట్టి ఉత్తర సముద్రము వఱకును మఱి మూడు వర్షములు. మిగిలిన రెండు ద్వీపములకు మఱి మూడు వర్షములుగా విభక్తము లయి యుండును.

ఆసియా పటము చూడగా దక్షిణ సముద్రమునకు ఉత్తరముగా (౧) భారత వర్షము. పిమ్మట హిమాలయము. పిమ్మట, (౨) కింపురుష వర్షము (టిబెట్) పిమ్మట హేమకూటము (కుయేన్‌లున్) పైని, (౩) హరి వర్షము. అటుపైని నిషధ పర్వతము (ఆల్ టిన్). ఆ పైని, (౪) ఇలావృత వర్షము (చీనా తుర్కీ గోబీ ఎడారి). దానిపైని నీల పర్వతము (దక్షిణ-ఆల్తామ్). పైని (౫) రమ్యక వర్షము. (మంగోలియా). దానిపైని శ్వేత పర్వతము. (చాంగాయ్) పైని, (౬) హిరణ్మయ వర్షము. దాని కెగువ శృంగవత్పర్వతము. (ఉత్తర ఆల్‌తాయ్). పైని, (౭) కురువర్ష (సైబేరియా). దాని కావల సముద్రము. ఇలావృతమునకు తూర్పు పడమరల గంధమాదన మాల్యవంతములు. వాని నాను కొని, (౮) భద్రాశ్వవర్షము. (౯) కేతుమాల వర్షము.

ఈ భద్రాశ్వవర్షమున నారాయణుడు నాలుగు చేతుల తోడను, గుఱ్ఱపుం దల తోడను ఉండుననియు, ఆ నారాయణుని చేతులు కాళ్ళు తల మొదలగు అవయవము లన్నింటను కృత్తిక మొదలగు చుక్కలన్నియు నుండుననియు కేతు మాలమున హరి వరాహ రూపమున నుండుననియు, కాళ్ళు మొగము హృదయము తోక పార్శ్వములు-వీని యందు క్రమముగా కృత్తికాది నక్షత్రములు ఉండుననియు, కురు వర్షమున హరి మత్స్యావతారమున నుండుననియు, ఆయన తొమ్మిది అవయవముల యందు చుక్కలును జనపదములును ఉండు ననియు, మార్కండేయ పురాణమునం గలదు. ఇటులే భారత వర్షమున హరి కూర్మరూపముతో నుండుననియు. అతని మొగము తూర్పునను, పుచ్ఛము పడమటను, పార్శ్వములు దక్షిణోత్తరములుగను, ఆగ్నేయాది దిక్కులయందు కాళ్లను ఉండుననియు, ఆ తాంబేలు నడుమనుండి మొగము మొదలు దక్షిణముగా తొమ్మిది అవయవముల నడుమ మూడు మూడు తారలు ఉండుననియు మార్కండేయమునం గలదు. హిరణ్మయ వర్షమున హరి కూర్మ రూపమున

ఉండునని భాగవతము. (చూ. 5 స్కంధ-18 అధ్యా) ఈ రీతిగనే భాగవతమున ఇంకను మార్పులు గలవు.

దీనినిఁబట్టి ఆ కాలమునందు భూస్వరూప స్వభావాదులను చూచి దానిని భగవదవతారాదులతోఁ బోల్చుటయు, అచటనుండి చూచినచో నక్షత్రము లెటులు కనబడునో చూచి వానిని భూమ్యాకారములో గుఱిచూచి గుఱుతులు పెట్టిరనుట తెల్లమగుచున్నది. మార్కండేయమే కాక భాగవతముగూడ ఈ ద్వీపము లన్నింటికిని ఒక అధిదేవతను వర్ణించినది. ఇందు నక్షత్రముల మాట లేదు. భగవంతుని సూక్ష్మరూపము నెఱుఁగుటయే స్థూలరూప వర్ణనమున కేకైక ప్రయోజనమని భాగవతము కంఠోక్తముగాఁ జెప్పి యటులే చేసెను.

## సప్త ద్వీపములు :

వాయు బ్రహ్మాండ పురాణాదులలో ఈ సప్తద్వీపములకు మూలము దొరకదు. భాగవతాదులలో నాలుగు ద్వీపముల మాట లేదు. వానికి సప్త ద్వీపములే యారంభము. వెనుకటి నవవర్ష విభాగము ఎంతకాలము ప్రచారములో నుండెనో అది మారి సప్తద్వీప విభాగ మెప్పు డాయెనో మిగులలోతుగా నాలోచింపవలయును. వేఱు వేఱు కాలములలో చేయబడిన దేశ విభాగములును, క్రొత్తగా కనుగొనఁబడిన దేశములును, వాని విభాగములును అతిస్థూలములగు సరిహద్దులతో నయినను నిరూపించుటకు ప్రకృత గ్రంథ సామగ్రి చాలదు. ప్రకృత పురాణములలో వేఱుపఱచి చూపుటకు వీలు లేనంతగా ద్వీపములును, వర్షములును, అనుద్వీపములును కలగాపులగమై పోయెను.

మేరు గిరిమీద నివాస మసంభవము. దానికి చుట్టునుగల ఉపత్యకలు నివాసయోగ్యములు. మేరువునకు దాపునఁగల దేశము మేరు దేశము. ఇది నలుప్రక్కల నుండవచ్చును. మేరువునకు తూర్పున ఇలావృతము. కాలక్రమమున మేరువు పడమటి భాగము కొంత ఇలావృతములోఁ జేరెను. చాలకాలము తరువాత ఇలావృత మెంతయో పెరిగెను. ఏలనగా, మేరు విలావృత వర్షమునకు నడుమ నున్నదని పురాణములలో కనిపించును. ఇది 40-45 అక్షాంశముల నడుమనున్నది.

[ప్రక్క పుటలోని పటము చూడుడు.]




ఈ నవవర్ష విభాగములో ఆసియా పూర్వ పశ్చిమములందు మూడు వర్షములు – కేతుమాలము, ఇలావృతము, భద్రాశ్వము. మనువుల కొడుకులు వీనిని పంచుకొనుటచే ఇవి రూపాంతర నామాంతరముల కాస్పదమాయెను. ఆ విభాగములకు మరల ద్వీపసంఖ్య వచ్చెను. కేతుమాలము కూడ విభక్తమాయెను. ఆ విభాగములకును మరల ద్వీప సంజ్ఞ వచ్చెను. ఇపుడు ప్లక్షాది షట్కము తక్క పృథివియంతయు జంబూద్వీపము. అదియు తక్కుంగల ఆఱుదీవులును గలిసి సప్తద్వీపము లాయెను. భాగవతములో ఈ యేడు దీవులును ఏడేడు చొప్పున 49 దీవులయినటు లున్నది. పద్మపురాణము చతుర్ద్వీప విభాగము చెప్పెను. మఱియు సుదర్శనాది ద్వీపములను చెప్పెను.

జంబూద్వీపమునందలి పురాణ నామ ధేయములతో నిప్పటి నామములు కొన్ని కలియును. ఆ కలియుట మాత్రమే ప్రమాణముగ స్వీకరించుచో స్థల శైలాదికమును నిర్ధారింపవచ్చును. మిగిలిన ఆఱు దీవులలో ఈ సులువుగూడ దొరకదు.

పౌరాణికులు స్వాయంభువ మనువున కేడుగురు కొడుకులనియు, వారిలో ఒక్కొక్కడి కేడుగురు కొడుకులనియు, వారి అందఱకును ఒక్కొక్క ద్వీపమనియుఁ జెప్పిరి. ఒక్కొక్క ద్వీపమున నేడేసి కొండలను, ఏడేసి యేఱులను సరిపుచ్చిరి. ఒక్కొక్క ద్వీపమును తొమ్మిదేసి వర్షములుగా విభజించినటు లెచటను లేదు గాని భాగవత మీ యేడు దీవులను ఏడేసి వర్షములుగా విభజించెను. ఆ ద్వీపము లివి :- జంబూ ప్లక్ష (గోమేద) శాల్మల కుశ క్రౌంచ శాక పుష్కరములు. మత్స్య పురాణమున నామక్రమ మాత్రము భిన్నము.

౨

వాయు విష్ణు బ్రహ్మాండముల మతమున ఈ ఏడు ద్వీపములలో ఆచట ఏడేసి పర్వతములును ఏడేసి నదులును గలవు. వీనిలో ఐదు దీవులందు ఆర్యక, కురర, విదిశ్య, భావి నామములతో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు కలరు. ఆర్యక-ఆర్య, క్షత్రియ-కురర, విదిశ్య-వైశ్య నామములందు గల పోలిక గమనించునది. ఈ దీవులం దన్నిటను ధర్మమున్నది. ఏదో ఒక పేరితో ఈశ్వరారాధన మున్నది. కొందఱు సూర్యుని, కొందఱు చంద్రుని, కొందఱు వాయువును, కొందఱు రుద్రుని, కొందఱు బ్రహ్మను ఆరాధింతురు. ఈ దీవులన్నిటి యందును కాలము స్వాయంభువత్రేతా సమము. ఈ త్రేతలో నెవరికిని వాద వివాదము లుండవు. ఇవన్నియు భోగభూములు. అనఁగా భరత వర్షము వంటి కర్మభూములు కావు.

## ప్లక్ష ద్వీపము :

ఇది లవణోదకమును పరివేష్టించి యున్నది. విష్ణు మతమున లవణేక్షూదములను పరివేష్టించి యున్నది. ఇది జంబూద్వీపమునకు రెట్టి. ప్లక్షము లనగా జువ్వి చెట్టు, లేక కలజువ్వి చెట్టు. కలజువ్వికి గర్దభాండము సంస్కృతము. దీని మొదలు గాడిదవలె నుండును గాన దీనికి గర్దభాండమని పేరని

అమర వ్యాఖ్యాతలు. ఈ ద్వీపాకారము కలజువ్వి కాయలవలె నుండునని అధునాతనులు వ్రాసిరి.[1]

మత్స్య పురాణము దీనికి 'గోమేద' మని మఱియొక పేరు పెట్టెను. వాయువు శాకమునకుఁ జెప్పిన ఖగోళ సంబంధము మత్స్యమున ప్లక్షమునకు సంబంధించును.

## శాల్మల ద్వీపము :

ఇది సురోదయమను సముద్రమును పరివేష్టించియున్నది. మత్స్య మతమున దధిసముద్రమును పరివేష్టించియున్నది. ఈ ద్వీపముననే గరుత్మ జ్జననము. ఇందు వానలు లేవు. అట్లని దుర్భిక్షమును లేదు. ఇచటి చాతుర్వర్ణ్యము కపి లారుణపీత కృష్ణము.[2]

## కుశ ద్వీపము :

ఇది సురాఘృత సముద్రముల నంటియున్నది. ఘృత క్షీరోదముల నంటియున్నదని మత్స్యమృతము. ఇది శాల్మలము కంటె ద్విగుణమని పూర్వ మతము. శాకముకంటె ద్విగుణమని పరమతము.

ఇచట దైతేయులు, దానవులు, యక్షులు, కిన్నరులు, గంధర్వులు, దేవత లును, వారితోపాటు మానవులు గలరు.

ఇందు హరి పర్వతమను మారు పేరు మహాపర్వతము అగ్ని పర్వతము. ఇందలి ద్రోణ పర్వతము మిపులఁ బొడవు. దానిమీఁద విశల్యకరణియు, మృత

---

1) తెలుగువారు క్షేవమున నువయోగించు గాటిద గుడ్డునకును, దీనికిని - ప్లక్ష ద్వీప మునకుఁ గాదులెండు, మఱి కలజువ్వికి ఏమి సంబంధమో విచారించునది. ఇది టర్కీ, ఇరాక్‌ల నడుమ, లేక ఇరాకే అని శ్రీ జె. పి. రే మతము.

2) శాల్మల ద్వీపము Asia Minor. దధి పముద్రము Black Sea. సురా సము ద్రము Aqgean Sea. ఒకానొక కాలమున అసీరియా అసురదేశము. పుష్కర ద్వీపము నందలి ధాతకీ మహావీర ఖండములు అసీరియా బాబిలోనియాలు. అసురజాతిలోఁ బుట్టిన తేఁడా కరు శాల్మలేశ్వరుఁడు. అతఁడు క్రీ. పెనుక పదమూడవ శతాబ్దివాఁడు. ఆ శాల్మలేశ్వరునిచే ఈ ప్రదేశమునకు శాల్మల ద్వీపమని పేరు వచ్చినచో, ఈ సప్తద్వీప విభాగము భారత సంగ్రామము నకు వెనుకనవి చెప్పవలయును. ఎంత వెనుక ? ఆ కాలము స్వాయంభువత్రేత. స్వాయం భువుని మునిమనుమడు భరతుఁడు. కావున భరత వర్షోత్పత్తివెనుక. పురాణములలో మన్వంత రముల లెక్కగలదు. పరియువారు అచ్చట జూచునది-అని జె. సి. రే, మహాశయులు.

సంజీవనియుఁ గలవు. నడుమ కుశ స్తంబ ముండుటఁజేసి దీనికి కుశద్వీపమని పేరు.[3]

## క్రౌంచ ద్వీపము :

ఇది ఘృతోదక సముద్రమును పరివేష్టించియున్నది. దధిఘృత సాగర పరివేష్టితమని మత్స్యమతము.[4]

ఈ ద్వీపపు జనాభాలో తెల్లని వారెక్కువ. ఈ ద్వీపమునందు ఉష్ణ మనియు, పీవరమనియు రెండు దేశములు కలవు.[5]

## శాక ద్వీపము :

ఇది లవణోదధిని చుట్టియున్నది. మఱియు దధి మండ సముద్రము చేతను పరివేష్టితము.

మత్స్యమతమున దీనికి తూరుపున ఇందలి ఏడు కుల పర్వతములలో నొకటి యగు మేరువు. దక్షిణమున క్షీరోదము - పడమట క్రౌంచము.

మేరువు తూర్పుకొన పేరు ఉదయాచలము. పడమటి కొన పేరు అస్తాచలము. దీనికి మరియొక పేరు సోమకము. వాయు పురాణమున మేరువునకు పడమటనున్న ఒక ప్రత్యంత పర్వతము పేరు ఉదయాచలమని కలదు.

---

3) Caspian Sea కి దక్షిణమునగల Ellweg Mts. మహిష పర్వతము కావచ్చును. ఏలన, నిందొక నిప్పుకొండ యున్నది. Caspian Sea కి ఘృతోదక సముద్రము, Aral Sea క్షీరోదము. క్షీరోదమునుండి ఘృతోదము వఱకును, అనగా Caspian Sea నుండి Aral Sea వరకు కుశద్వీపము. కాస్పిసియన్ సీ-కి దక్షిణ పూర్వదిక్కున కుశలును, వానిఁబోలు గడ్డియు నేడును ఎక్కువగా పెరుఁగును. భారత పశ్చిమోత్తరమున కుశాన్ లేక కుషాన్ రాజ్యము కలదు. అది ఇదియే కావచ్చునని శ్రీ జె. సి. రే.

4) ఇది కాస్పియన్ సీ-కిని, బ్లాక్ సీ కిని నడుమ నున్నది. కావున అర్మీనియా. ఇందలి క్రౌంచపర్వతము Cancasus Mts. దీనికి ఉత్తరమున రషియా. దీని యింగితము పురాణము నందెచటను గనబడదు. దీని యాకృతి కొంగను బోలునేమో యని శ్రీ జె. సి. రే. ఈ మాటయేమో కాని కాస్పియన్ సీలో కొంగ ముక్కున్నది.

5) "ఉష్ణస్యోష్ణః స్మృతోదేశః పీవరస్యాపి పీవరః" (వాయు 33-22)

ఉదయాచలమున మేఘము లుదయించును గాని కురియవు. అవి అస్తాచలము మీది కెగసి యట వర్షించును.

ఈ దీవిలో సోమకగిరి మీద హిరణ్యాక్ష వధ జరిగెను. గరుత్మంతుం డమృతము నాహరించిన దిచట. ఇటులే ఈ ఏయేడు దీవులలోను ఏదో యొక పురాణగాథ జరిగినటులు కనఁబడును.

ఇచట జను లీ ఉదయాస్తాచలముల మీదుగా సూర్యుని ఉదయాస్తమయ ములఁ జూచుచుందురు.[6]

ఈ శాక దేశములకు రాజు లేడు, రెడ్డి లేడు. ఇచట నాలుగు వర్ణము లున్నవి. నల్లనివారు నడుమ నున్నారు.

ప్రియవ్రతుని కొడుకు మేధాతిథి రాజు కాడా? అతడు తన యేడుగురు కొడుకులకును ఈ శాకము నేడు ముక్కలుగా కోసి యిచ్చెనని పురాణములలో గలదే-యని యడుగుచో నిక్కమే. కాని "ఈ ఒయిదు దీవులందును రాజు లేడు" అని ఉమ్మడిగా ఒకమాట ఆ పురాణములందే కలదు. కావున 'అచట ప్రజకు రాజ బాధ లేదు' అని గ్రహించుచో స్వవాక్య విరోధ ముండదు.

ఈ ద్వీపమున సూర్యారాధన కలదు.

---

6) 'ఈ ఉదయాస్తాచలముల మీదుగా సూర్యోదయాస్తమయములను జూచుటకు ఈ కొండలలో ఉదయాచలము తూర్పు దక్షిణముగను, అస్తాచలము పశ్చిమ దక్షిణముగను ఆయతమయి యుండవలయునని "శ్రీ జె. సి. రే. వీరిది మత్స్యమతము. (వెనుకటి వ్యాసమున మూడవ పటము చూచునది) "ఉభయ త్రావగాథౌచ లవణక్షీరసాగరౌ" అను మత్స్యపురాణ మతమునకును, మఱియు ప్లక్షము మొదలగు అయిదు దీవులందును వర్ష పర్వతము లడ్డగీఁత గీచినటులు సముద్రమువఱకు వ్యాపించియుండవలె' నను శ్రీ రాయలకును ఈ మతము విరుద్ధము. "ప్లక్షాది పంచద్వీపేషు వర్షాద్రయ స్తిర్యగ్రేఖాకారా ఉభయతోబ్ధి స్పృశ (?) ఇతి గమ్యతే అన్యథా సప్తాబ్ధి స్పృష్టవర్ష విభాగాఽసంభవాత్. వైష్ణవే వర్షాణాం పూర్వాదిక్రమేణో క్తేశ్చ భాగ - 5-20] ఇట్టి విరోధమున్నను అది సామాన్యాకారమనియు, ఇది విశేషాకారమనియు అనుకొనవచ్చును. పర్వతముల మీదుగా చూతురను బలము దీని కున్నది.

సూర్యుడు శ్రవణమునందు ఉత్తరమున కభిముఖుడైనపుడు ఆఅవదగు శాకద్వీపము ఉత్తరాంతమున ఉదయించుచుఁ బయి కేగును.[7] (చూ. మూడవ చిత్రము) ఇది శాకవృక్ష బహుళము.[8]

## పుష్కర ద్వీపము :

ఇది క్షీరసాగరమును వలగొన్నది. స్వాదూదధిని చుట్టు వాఱి యున్న దని మత్స్యము.

దీన ధాతకి యనియు, మహావీర(త)మనియు, రెండు ఖండములు కలవు. శానక-రేక-ధాతకి-కుముద ఖండములని మత్స్యము.[9]

ఇచట వర్ణప్రసక్తియే లేదు. సన్యాన్నృతములు లేవు.

---

7) "శాక ద్వీపస్య షష్ఠస్య ఉత్తరాంతోదిత శ్చరన్" (వాయు, 50-119)

8) శక శాక పదము లొకటి. శాకద్వీపమునుండి భరతవర్షమునకు వచ్చిన బ్రాహ్మణులు నేడు కనబడుచున్నారు. వారు శాకద్వీపి బ్రాహ్మణులమని చెప్పుకొందురు. వీరు సూర్యోపాసకులు. శాకద్వీపమున సూర్యారాధనము కలదుగదా! ఇటనుండి వలసవచ్చిన క్షత్రియులు భరతవర్షమున శకభూపతులు. ఇందు ఉదయాచల పార్శ్వము శుష్కము. ఇచట చలియు, ఎండయు, మిక్కుటము. పడమటి భాగమున సంవత్సరమునకు పదిపండ్రెం డంగుళము వానలు. కొలదిగా కృషి జరుగును. ఇది తొల్లి శాకవృక్ష బహుళమయినను నేడు దేవదారు వన బహుళము. ఇంవలి లవణసాగరము నేటి L. Balkhash క్షీరసాగరము Aral Sea. పారసీకమున సీర్‌దరియా. సీర్ = క్షీర దరియా = సాగరము. సీర్ అనగా నదియనియు నొక అర్థము. Aral Sea లేక క్షీరోదము క్రమక్రమముగా పూడుకొనుచు వచ్చుచున్నది. లేక L. Balkhash పొడవు 300 మైళ్ళు వెడల్పు 50 మైళ్లు అని శ్రీయుతులు జె.సి.రే. వాయు మతమున ఇది యంతయు మారును. మత్స్యమతము వీరిది.

9) ఈ రెండును సిరియా, మెసపటోమియాలు (వీరు అసీరియా బాబిలోనియాలని వేఱొకచో వ్రాసిరి. ఇవి, సిరియా, ఇరాకులకు చెందినవే కాన విరోధములేదు) మత్స్యము చెప్పిన స్వాదూదధి టైగ్రిస్ యూఫ్రిటిస్ నదులు. పుష్కరద్వీపమును అనగా మెసపటోమియాను ఒకానొకప్పు డార్య లేలిరి. అపటి బోగజ్కుయిమున దొరికిన మిత్ర వరుణ నాసత్యాది విషయములే నిదర్శనమని శ్రీ జె. సి. రే.

## కేతుమాలము :

ఇది జంబూద్వీపమునకు పశ్చిమోత్తరముగను, ఘృత సాగరమునకు దక్షిణముగను[10] ఉన్నది. సప్తద్వీప విభాగమయిన పిదప ఇది కేతుమాల శేషము అని నవ్యులు.

## విరోధము :

పురాణములలో పరస్పర విరోధము బహుళము. వాయు మత్స్య పురాణములు భిన్నప్రదేశములందు ప్రవచింపబడినను ఇంచుమించు సమకాలికములు. వీనిలోనే ఇట్టి విరోధము లేల పొసగవలయును ? ద్వీప ప్రసంగమున వాయ్వాదులు ప్లక్షము నారంభించి పుష్కరాంతముగాఁ జెప్పెను. మత్స్యము శాకము నారంభించి కుశ క్రౌంచ శాల్మల ప్లక్ష పుష్కరములను జెప్పెను. ఇందు 'అన్యమతము నాశ్రయించి చెప్పుచున్నా'నని కలదు. పరిశోధకు లెవరో భారతము నవలంబించి చెప్పి దీన దూర్చినట్లు అనుమానించుటకు వీలు కలదు. మహాభారతమునందును ఇటులే కలదు. భూగోళమునందును వ్యాకరణము నందువలె ఉత్తరోత్తరమే ప్రమాణము. కావున కొందఱు అవ్యవహిత పూర్వమగు ఈ విభాగమునే గ్రహించిరి కాని దీనికిఁగల జ్యోతిర్విరోధమును గమనింపలేదు. ఈ విషయము ముందు ముందు చూతము.

## స్వరూపము :

ఈ ద్వీపము లన్నియు మండలాకారములు. వీని చుట్టును మండలాకారముగనే సముద్రములు. ప్లక్షము మొదలుగా పుష్కరము వఱకును ఒకదానికంటె మఱియొకటి పరము. పుష్కరముపైనున్న బంగారమువంటి ద్విగుణమైన నేల నంటియున్న క్షీరసముద్రమునకుఁగాని, స్వాదూదక సముద్రమునకుఁ గాని అవల లోకాలోకము.[11] అచట సూర్య చంద్ర నక్షత్రాది గతి నిరుద్ధము.

---

10) ఇది పారసీకాంతర్గతమని శ్రీ జె. సి. రే. ప్లక్షము పారసీకమని కొందఱ అభిప్రాయము.

11) 'స్వాదూదకస్య పరతో లోకాలోకాచలో మహాన్' అని పద్మము. విష్ణ్వాదులును ఇచట స్వాదూదక సముద్రమును చెప్పెను

ఈ రీతిగా ఈ ద్వీపము లుండవలయుచో ప్రక్క పటములోని చిత్రము వలె నుండవలయును.

ప్రకృత భూగోళమునకును, ఈ ద్వీప విన్యాసమునకును చెప్పినంత పోలిక లేదు. కావున నీ యేడు ద్వీపములును శరీరమునకు సంబంధించిన షట్చక్రములనియు, పుష్కరము సహస్రారమనియు కొందఱు చెప్పి ఆ చక్రములకుఁ గల మనువులను బీజములను, వర్ణములను లగింతురు. మఱియొక త్రోవ- విష్ణు పురాణము రెండవ అంశము మొదటి అధ్యాయము చివర- "శ్వేత వరాహ కల్పనమునందు మన్వంతరాధిపతియగు స్వాయంభువుని సృష్టి యిది"[12] అని చెప్పి, రెండవ అధ్యాయమున మరల ఆ ప్లక్షాదులనే అందుకొని వేఱురీతిగా




12) "ఏష స్వాయంభువ స్సర్గో యే నేదం పూరితం జగత్
వారాహేతు మునే కల్పే పూర్వం మన్వంతరాధిపః" (విష్ణు. 2-1

వర్ణించెను. మొదటి అధ్యాయమున ద్వీపము పేరు మాత్రమే కలదు. రెండవ అధ్యాయమున కొండలయు, సముద్రములయు వర్ణనము కలదు. ఈ ద్వీపములను ఈ రీతిగా రెండు తూరులు వేరు వేరుగా వర్ణించిన ఉద్దేశ మేమి ? ఈ దీవులేమి ? ఈ సముద్రము లేమి ? ఈ సురాసముద్ర మేమి ? ఈ క్షీర మేమి? పురాణము లీ రహస్యము నెచటను వెల్లడించలేదు.

ద్వీపము లన్నిటి నడుమ జంబూద్వీపము. దాని నడుమ మేరువు-అనగా నాభి. మనుష్యునిలోనిది మేరుదండము. జంబువు లక్షయోజనములు. దాని చుట్టును సముద్రము లక్షయోజనములు. ఇటు లొక దానికంటె మఱియొకటి ద్విగుణముగా ద్వీపములును, ఘృతాది సముద్రములు నున్నవి.

ఇపుడు మనమున్న భూమి జంబూద్వీపము. ఈద్వీపములు ఈ జంబువునకు పైన ఒకదానిపై నింకొకటి మన కంటికిఁ గానరాక సూక్ష్మముగను, సూక్ష్మతరముగను, సూక్ష్మతమముగను ఉన్నవి. వీని చుట్టును గల క్షీర ఘృత ఇక్ష్వాది సముద్రము లన్నియు నీహారముల గుంపులు. (Nebulae)

మూల బీజ భేదముచే మనువు లిరువదెంఁగులు. మూలమను వగు స్వాయంభువు సప్త విధమగు పరిణామమును తన హయాములో నెరపెను. ప్రలయము వచ్చెను. స్వారోచిషు డీ యేడు దీవులయు విత్తనమును దాచెను. పిదప నతడు బీజ మనువగు ఉత్తమున కిచ్చెను. అతడు తన పని తీఱుడు ఈ గుఱుములను బీజమనువగు తామసున కిచ్చెను. అతఁడు రైవతున కిచ్చెను. చాక్షుషమనువుతో అది సమాప్త మాయెను. ఇపుడు వైవస్వతుడు.

విష్ణుపురాణము మొదటి అధ్యాయము చెప్పు ప్లక్షాది ద్వీప విషయము స్వాయంభువమను సంబద్ధము. రెండవ అధ్యాయము నందలిది వైవస్వతమను సంబద్ధము. ఈ వైవస్వత మన్వంతరమున స్థూలరూపమే కాని సూక్ష్మరూపము లేదు. ఈ స్థూల పృథివి మీదనే ఈ యేడు దీవులును.

అగుచో అవి యేవి ?

ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచములు వెనుకఁ జెప్పినటులు ప్రలయము వాతఁబడెను. అటులగుచో శాక పుష్కరము లేవి ? అవి ఇకముందు తల యెత్తును. అవి ఈ క్రింది పటమువలె నుండును.




మానవజాతి మూలమును వృద్ధి చేయుటయే యీ ద్వీపముల పని. దాని
సమగ్ర పరిణామముతో ఈ పుడమి పని సరి అని మఱికొందఱు చెప్పచున్నారు.
"స్థితస్య గతి శ్చింతనీయా" అని సంస్కృతమున నొక న్యాయము కలదు.
'ఉన్నదానిని ఉజాడు చేయక దానికి గతి చూడవలయు'నని దాని అర్థము.
పురాణములు, ఒక భూమండలమును, దానిపైని జలమండలమును, దానిపైని
దానికి రెట్టి భూమండలమును, మరల రెట్టి జలమండలమును, ఇటు లీ యేడు
మండలము లున్నవి; ఆ భూమండలములందు ఏడేసి కొండలును, నదులను
జెప్పెను. ఇది సామాన్య విధి వంటిది. ఇటులు చెప్పిన సమనంతరముననే

'ద్వీప మనగా రెండువైపులఁగాని, లేక అన్ని వైపులఁగాని నీటిచేఁ జుట్టబడి నది.'[13] అని చెప్పెను.

దీనిని బట్టి ద్వీపమనగా నలుతట్టులను నీటిచేఁ జుట్టబడవలసిన గుండ్రడపు సున్న అను నియమము దుర్బలమయిపోయినది. మండలమనగా ప్రదేశము కాని గుండ్రమగు భూమియే అని నిష్కర్ష కాదు. ఆశ్వేషకి చెప్పిన ద్వాదశ రాజ మండలములు భూప్రదేశములే కాని కంపాసుతో చుట్టిన గుండ్రని సున్నలుకావు.

"ఉదకముల కాధానములు కావున ఉదధు"లని పురాణము నిర్వచించు చున్నది.[14] 'కాచినచో పొంగినటులు పొంగును కావున సముద్రము'లని నిర్వ చనము.[15] ఇటులా పురాణములు సముద్రమునకు వ్యుత్పత్తి చెప్పుటయ కాక పర్వములందు సముద్రములు 510 అంగుళముల యెత్తు పొడుచును అని చెప్పెను. అనగా సముద్రపు మట్టమునుండి (నదులలో) పొడుచు పోటు 510 అంగుళముల యెత్తువఱకు వ్యాపించునని దీని కర్థము. ఎంత సూక్ష్మముగా పురాణములు పరిశీలించి చెప్పెనో పరికించునది.[16] ఇది సత్యమగునో కాదో విజ్ఞులు విమర్శించునది.

---

13) "ద్విగరాపత్వాత్ స్మృతా ద్వీపా స్సర్వత శ్చోదకావృతాః" (వాయు. 49-135)

14) "ఉదక స్యాధానం యస్మాత్తస్మా దుదధి రుచ్యతే" (వాయు. 49-131)
"ఉద్భిదా న్యుదకాని న్యుర్గిరి ప్రస్రవణాని చ" (మ. 123-25)

15) "అపాం చైవ సముద్రేకాత్ సముద్రా ఇతి సంజ్ఞితాః" (వా. 49-124)
"దశోత్తరాణి పంచైవ అంగుళీనాం శతాని తు,
అపాం వృద్ధిః క్షయో దృష్టః సముద్రాణాం చ పర్వసు" (వా. 49-131)

16) ఈ శ్లోకమునకు వెన్నెలకంటి సూరన భిన్నముగా వ్రాసెను.
"అబ్ధి లేదును చంద్రోదయాస్తకలిత - వేళలందున కాగిన పాలఁబోలె
మీఁది వేయింటిమీద నేనూరు వ్రేళ్ళ - పొడవు పోటును నాటునై పొలుపు మిగుల" (విష్ణు పురా. 3-36)

పై శ్లోకము వాయు విష్ణు బ్రహ్మాండ మత్స్య పురాణములందు సమము.
"దశోత్తరాణి పంచాశత్" అని మత్స్యము.

మఱియు 'పర్వములు లేనివి గిరులు, పర్వములు కలవి పర్వతములు. కాబట్టి ప్లక్షమందలి గోమేదము పర్వతము' అని పురాణము ఉదాహరణ పూర్వకముగా పర్వతమునకు నిరుక్తి చెప్పినది. కావున ఇది యంతయు భూవిన్యాస వర్ణనమే అని యనుకొని వీనికి నేటికినిగల సాదృశ్యమును కనిపెట్టుటకు ప్రయత్నము చేయుట నేలవిడిచి సాము చేయుట కాదు. కావున మనము మనకు చేతనయినంత సాము నీ నేలమీదనే చేసి చూతము.

ఇది కొన్ని వేల యేండ్ల క్రిందటి భూగోళము. అది యెన్ని మార్పులొందెనో ఎవరెరుగుదురు ? సరస్వతీ నది పూడిపోయెను. తరిమ్ భూగర్భమునకు పోయెను. తొల్లి సముద్రమున్న చోటునఁ గదా నేటి హిమాలయము. సహారా ఒకపుడు సముద్రము ! మొన్న భూకంపమున బీహారులో ఒక నది యేమాయెనో తెలియనిది కాదు. నేడు మన కనుల యెదుట హిందూస్థానముమీద పాకిస్థాన్ ఆదిష్టమయినది. 'పురా యత్ర స్రోతః'. అట్టి తఱి నాటి ద్వీపములు బద్ధించినటులు కనబడకపోయినంత మాత్రమున నిది యంతయు కల్లయని అంగీకరించుటకు ప్రతికూల సాక్ష్యమును కొంత కలదు.

పురాణము లందలి సముద్ర వాచకములు నదీ హ్రద సముద్ర వాచకములు. ఆసియా నడుమ పడమటి సగమున నేడు నాలుగు పెద్ద హ్రదములు కలవు. చిన్నవియు రెండు కాబోలును ఉన్నవి. సీర్ దరియా వంటి నదులు ఐదారు కలవు. ఇరాన్ ఇరాకుల కంటి 'పర్షియన్ గల్ఫ్' కలదు. టర్కీచుట్టు 'మెడిటరేనియన్ సీ' కలదు. వీనిని బట్టి ఆ ద్వీపములను, ఆ సముద్రములను ఏల పోల్చరాదు ?

సరియె. ఈ క్షీరోదమునందును, ఘృతోదమునందును పాలు నేతులున్నవా ? లేవు; తిన్నంత ఉప్పే కలదు. అగుచో- ఇవి వాస్తవము లెటులగును ? ఈ కవిత్వమున కర్థము చెప్పవలసినంత దారిద్ర్యము మన కబ్బినది. ఐనను ప్రయత్నింతము. కొల్లేటిలో సమయ భేదములచే మంచినీరును, ఉప్పు నీరును ఉండును. దీనికి ఏఱనియు, హ్రదమనియు, సముద్రమనియును వ్యవహారము చూచుచున్నాము. ఇక చిలక సముద్రములో చిలక లేదు. హుసేన్ సాగర్‌లో అంతయు మంచినీరే. ఇది అసలు సాగరమునుకో కదా ! స్థలావి

సంయోగాదులచే గలిగిన రంగు, రుచి, నురుగు మొదలగు నెన్నిటినో బట్టి భావన నర్పించిన ఫలముగా వీని కీ పేరులు కలిగెను. వృక్ష బాహుళ్యమున ద్వీపముల కా వృక్ష చిహ్నముగా సంకేతమని పురాణమే చెప్పెను.

ఇక్కడి భూభాగముకన్న జలభాగము లెక్క కట్టినచో విపరీతముగా నుండవలయును గదా. అట్టి దిపుడు ఇసుమంతయు గనబడదేమి?

ఇక్కడి జలభాగము చాలవట్టు నశించియుండును. అందులకుఁగల సాక్ష్యము కొంత వెనుక నుదాహరించితిని. అదియుఁగాక సరిగా రెట్టి అని చెప్పుట లేదు. "అచటి భూమి కనుగుణముగా సముద్రము కల"దని పురాణ ములే నడుమ నడుమ మనలను హెచ్చరించుట కనబడును.

ఇచట కొండలును, నదులును ఏడేడేనా? ప్రియవ్రతుని కొడుకు లేడు గురేనా? వారిలో మరల నొక్కొక్కనికి ఏడుగు ఏడుగురేనా? తెలుగువారికి ఈ ఏడు సంఖ్య అమంగళమని భ్రమ. కానీ ప్రాచీనుల కీ 'సప్త' మంగళము. ఉత్తర కురువులలో ఆది మనుష్యులు, లేక ఋషు లేడుగురు. ఆకాశమున ఋషు లేడుగురు. లోకము లేడు. ఇటు లీ సప్త సంఖ్యాకములయిన వానిని పరిగణించుచుఁ బోయిన యెడల కొన్ని టావులు పట్టును. వాయు పురాణ 'ఏడే యేమి?' అని శంకించి 'ఏడే ఉండవలె'నని చెప్పి కారణము చెప్పబోయి సప్తావరణములను చెప్పెను. కావున దానిని ప్రాచీన వాఙ్మయ మెఱిగిన పాఠ కులకు వదలుదును. ఈ యేడులు కొన్ని ప్రక్షిప్తము కావచ్చును.

కొండలును, నదులును ప్రకృతి సిద్ధమగు ఎల్లలు. దానఁజేసి ఆ కాలము వారు వాని నెల్లలుగా నుపయోగించుకొనిరనుకొనుట సుగమము. ఈ విషయము మొన్న నీ నడుమ శ్రీ డా॥ అంబేడ్కర్, బౌండరీ కమీషన్ గురించి చెప్పిన మాటలు పాఠకులకు గుఱుతుకు రాగలవని తలతును. కొన్ని వేల యేండ్ల క్రింద యూఫ్రిటిస్ తీరమునందలి బాబిలిన్ కేంద్రముగాగల బాబిలోనియా యును, టైగ్రిస్ తీరమునందలి నినెవే కేంద్రముగాఁ గల అసీరియా సామ్రాజ్య మును పచ్చని పైరులతో భౌమ స్వర్గములని విఖ్యాతములు. అచటనే కదా మిత్ర వరుణ వాసత్యాది విషయ సంగ్రహము భూగర్భములో కానిపించినది!

ఇది పుష్కర ద్వీపమని తోచుట కే పురాణ పాఠకునకు నిసుమంతయు ప్రయత్న మక్కరలేదు. కావున లోభనీయమయిన యీ పుష్కర ద్వీపము నందును, శాకద్వీపమునందును సూర్య నక్షత్ర సంచారమను సుసూక్ష్మముగా పరిశీలించి ఆ పురాణము లేమి చెప్పెనో చూతము.

"రవి దక్షిణము నుండి మరలి విషువమునందుండు నపుడు పాలపుంత ఉత్తరాంతమున నుదయించును.[17] పుష్కరము నడుమనుండి రవి యేగు రజీ 30 దవ భాగ. అది రవి కొక ముహూర్త గతి.[18]

'వైశ్వానర పథమునకు వెలుపల నున్నపుడు రవి మొదటి వెలుగు పుష్కరముగుండ ప్రవర్తించును.'[19]

'రవి ఉత్తరాయణమున ఆఱవ దీవియగు శాకద్వీపపు ఉత్తరాంతమున శ్రవణమునం దుదయించును.'[20]

మత్స్యము నందును పుష్కర మేడవ దీవి. మిగిలిన వాని యెడలనే భేదము. కావున మత్స్యముగూడ ముప్పది భాగలు చెప్పెను.

భాగవత మీ పుష్కరమును క్షీరోదమునకు పరముగను, స్వాదూదకముచే బహిరావృతముగను జెప్పి మేరువును వలగొను రవి యిచట మానసోత్తరమను కులగిరి మెట్టి ఉత్తర దక్షిణాయనముల నేర్పఱచును అని (5-20) చెప్పెను. వీని నన్నిటిని బట్టి ఈ దిగువ సంగతులు తేలుచున్నవి.

---

17) "దక్షిణా ద్వినివృత్తో సౌ విషు వస్థో యదా రవిః,
క్షీరోదస్య సముద్రస్య ఉత్తరాంతోదిత శ్చరన్" (వాయు. 50-125)

18) "ఏవం పుష్కరమధ్యేన యదా సర్పతి భాస్కరః
త్రింశాంశకంతు మేదిన్యా ముహూర్తేనైవ గచ్ఛతి" (వాయు. 50-119)

వా. వి. మ. లలో ఈ శ్లోకమే అక్షరభేదముతో ఏకార్థముగా నున్నది. చూ. విష్ణు. 8-8-28, 29. మత్స్య. 124-40-48.

19) "లోక సంతానతో హ్యేష వైశ్వానర పథా ద్బహిః
వృష్టి ర్యావత్ప్రభా సౌరీ పుష్కరాత్ సంప్రవర్తతే" (మ. 124-81)

20) "శ్రవణే చోత్తరాం కాష్ఠాం చిత్రభాను ర్యదా భవేత్
శాకద్వీపస్య షష్ఠస్య ఉత్తరాంతోదిత శ్చరన్" (వాయు. 47-127)

1. రవి పాలపుంత ఉత్తరాంతమున నుదయించును. అపుడు విషువము.
2. ఆఱవదగు శాకద్వీపమునందు శ్రవణమున రవి యుండగా ఉత్తరాయణారంభము.
3. రవి పుష్కర ద్వీపమున మింటి నడుమ నుండగా ముప్పదవ నక్షత్రాంశము. అది రవికి ఐహూరాత్రిక గతి. దీని కీ దిగువ ఛేద్యకము—



వేదాంగ జ్యోతిషకాలమున ధనిష్ఠ ఉత్తరాయణారంభకము. ధనిష్ఠ ముప్పది ఐదవ న. అక్షాంశలో నున్నదని దాన గలదు. గర్గ వ్యాఖ్యలో ఒక విశేషమున్నది. దీనికి ఉత్తరపు దెస $8^0 18$ వక్రగతి ఈ ధనిష్ఠ. క్రీ. పె. 1372 సంవత్సరము 22 డిసెంబరు ప్రాంతమున సూర్యునకు గంటయునర ముందుగా ఉదయించి ఒక అరగంట సేపయినను కానిపించుచుండియుండవలయును. క్రీ.పె. 401లో శ్రవణము గుఱించి ఒక విశేషము. విశ్వామిత్రుడు లోగడనున్న నక్షత్రారంభమును విధ్వంసముచేసి మహాగ్రహమున శ్రవణముతో నక్షత్రారంభమును జేసెనని భారత రామాయణములలో నొక కథ కలదు.

"ఒకానొక మహారాజసభలో (మహా పద్మనందుడు కావచ్చును.) విశ్వామిత్రుడను మహా జ్యోతిషికుఁ డొకఁడు కన్నారఁజూచియు, చూపించియు క్రాంతివృత్త ప్రథమ బిందువు శ్రవణము కాని, ధనిష్ఠ కాదని నిరూపించుట ఈ పయి గాథలోని చరిత్రాంశము. (చూ. **The first of Aswini**).

25వ అక్షాంశమున నున్న రవి పొడుపునకు కొంచెము ముందుగా అపుడు శ్రవణము కనబడి యుండవలెను.

పా తా ళ ము :

దక్షిణ మహోదధిలో నున్న దీవులకు పాతాళ మని పేరు. థియాల ఫిస్టులు కొందఱు అమెరికా పాతాళమనియు, అది శాక పుష్కర నామాంతర మనియు, ఇఁక మనుష్యులకు అక్కడి వారే నాయకు లనియు, ఆటంబాంబు పుట్టక ముందే, ముప్పదేండ్ల క్రింద వ్రాసిరి. అది యటుండె. ఈ పాతాళమునం దెడు ఏవు లున్నవి. వాని పేరు లివి: అంగ, యమ, మలయ, శంఖ, కుశ, వరాహ, బర్హిణములు. వీనిలో వర్షములును గలవు. ఇవి మ్లేచ్ఛుల కునికి. ఇచటఁ గొందఱు పొడవు మీసలతోఁ బుట్టుదురు. వీరి కెనుబది యేండ్ల ఆయుస్సు.[21]

ఇందలి మలయ ద్వీపము నేటి మలయా. బర్హిణ ద్వీపము బోర్నియో ఈ పుట్టు మీసల మోకాల బంటివారు. ఫలమూలములు తినువారును, వావి వరుసలు లేనివారును, క్రోతుల వంటివారు నగుటచే నేటి సుమత్రా ద్వీపము నందలి ఉరాంగ్ ఉటాన్ వంశధరులని శ్రీ గిరీశ శేఖర్ వసు ఊహించెను.

గిరులు, నదులు, హ్రదములు, గ్రామములు, పత్తనములు, దేశములు - ఈ మొదలగు వాని ఐక్యమును నేటి పేరులను బట్టియు, అర్థములను బట్టియు, ఎల్లలను బట్టియు, మఱికొన్ని కారణములను బట్టియు నిర్ణయింపవలసి యున్నది. ప్రకృతము వీనికి మించిన ప్రమాణములు దుర్లభము. వీనిలో కొన్ని నిక్కములు కావచ్చును. కాకయు పోవచ్చును.

ఉదా ! కుబ్ - కాబూల్, శ్వేత - హిరాట్ బాహ్, బాలఖ్ - బాహ్లిక, మహిష-మేషేద్, వీని యాథార్థ్యమా వ్యాసులే చెప్పవలెను.

---

21) "దీర్ఘశ్మశ్రుధరాత్మానో నీలమేఘ సమప్రభాః
జాతమాత్రాః ప్రజాస్తత్ర అశీతి పరమాయుషః"
(జానుమాత్రాః అని పాఠాంతరము)

శాఖామృగ సధర్మాణః ఫల మూలాశిన స్తథాః
గోధర్మాణో హ్యనిర్దిష్టాః శౌచాచార వివర్జితాః" (వాయు. 48 - 8, 9)

ప్రాచీన భూగోళ రచన చేయువారికి ఈ నామైక్యము మిగుల నాకర్షకము. మొన్న మొన్నటి పతంజలి చెప్పిన ఎల్లలే యిపుడు మనము కనుగొనలేనంతగా మారెను. ఇక స్మార్త పురాణ వేదములలోని ఎల్లల మాట వేఱ చెప్పవలెనా? చాల ఏండ్ల వెనుక శ్రీ కన్నింగ్ హామ్ (Cunningham) తన "Ancient Geography of India"లో ఈ వస్త్వైక్యమునకు చాల యత్నించెను. నేడు మరల భండార్కర్ ఇనిస్టిట్యూట్ వారు ప్రయత్నించుచున్నారని శ్రీ దేవేంద్ర కుమార రాజారామ పటేల్ M.A. LLB., తమ 'Cultural Histry from the Vayu Purana'లో వ్రాయుచున్నారు. వీరు వాయు పురాణమునందలి కొన్ని కొన్ని నామముల చిట్టా ప్రకటించిరి దానివలనను చాల ప్రయోజనము కలదు. త్రిలింగ (వాయు పురాణ ప్రకారము) పండితు లెవరును ఈ పనికి పూనుకొనరా?

3

దక్షిణ మహోదధిలోని మలయ బర్హిణాది ద్వీపములు పాతాళాంతర్గతములని నవ్యుల యూహ. కాని అది సత్యముకాదు. ఆ ద్వీపము లను ద్వీపములనియు, భరతవర్షమునకు దక్షిణముగా నున్నవనియు, పాతాళము భూగర్భమున నున్నదనియు వాయు పురాణము విస్పష్టముగా జెప్పెను. (చూ. 48 అధ్యాయాంతము). సూర్య సిద్ధాంతముకూడ పురాణమునే అనుకరించెను. యోగ వాసిష్ఠముకూడ అటులే చెప్పెను. పాతాళము భూగోళ గర్భము నందున్న సంగతి అసంగత మగుచో అది అసంగతమేయని అందముగాక. పురాణమతమును అపలంపింపకుందుము గాక. పురాణము లీ ద్వీపములను పాతాళముగా చెప్పలేదు.

వాయు పురాణము కురు భద్రాశ్వములను వర్షములుగా విభజించుటయే కాక అచటి నదులను, గిరులను, మనుష్యులను, దేశ కాలములను వివరించెను. కాని జంబూ కేతు మూలములను వివరించినటులు వివరింపలేదు. అనగా పురాణకర్త ఈ రెండు ద్వీపములలోని కొన్ని కొన్ని విషయములను చూచినటులు కన

బడును. కావున వాయు పురాణకర్తకు గాని, కర్తలకు గాని యీ రెండు ద్వీపములలోని కొన్ని భాగములతో నయినను సాక్షాత్పరిచయ ముండవలయును. వెనుకటి ప్రకరణమునఆ సంగతి పాఠకులకు విస్పష్టముగా గోచరించి యుండును.

## అత్యుక్తి:

ఈ మూడు ద్వీపముల వర్ణనలలోను నమ్ముటకు వీలులేని అత్యుక్తులు కలవు. కవులొక రాజనగరమును వర్ణించుచో తమ మనోరాజ్యమును కుదువబెట్టి ఇంద్రుని అమరావతిని తెచ్చి మన కనుల గట్టుదురు. ఆ రీతిగనే పురాణకవులును ఈ భూగోళ ఖగోళముల నీశ్వరరూపముగా తలచి పామరుల కా సంగతి తెలుపుట కెన్నియో ప్రక్రియ లవలంబించిరి 'అవి అత్యుక్తులు కావు. నిక్కమే' అని వాదించువారును, నిష్కలుషముగా నమ్మువారును లేకపోలేదు.

'గోల కొండ వెలగ కాయ'

నా బాల్యమున నొక కథ వింటిని. కథకు డిటులు చెప్పెను.

మేము కొండజము దేశమును చూడబోతిమి. పోయి పోయి గోలకొండ చేరితిమి. ఆ కొండమీద దయ్యములు గోల చేయుచుండును గాన దానికి 'గోల కొండ' యని పేరు.

ఆ నగరమున తిరిపెమునకు బయలుదేరగా 'చందూలాలు[1] దివాను వారు పూర్ణమల్లు తోటలో రేపు సంతర్పణ చేయుదు'రని వింటిమి. మేమంతవరము నలునకును, భీమునకును గురువులము కావున వంటచేసి కొంత సంపాదింపుకొనవచ్చునని చందూలాల్ దేవిడీకి పోయి కొరడా దెబ్బలుతిని దానికి ప్రతిఫలముగా కొన్ని అషరఫీలును, వంటపనిని సంపాదించుకొని మజుమదారు ప్రొద్దుటికి సదరు పూర్ణమల్లు తోటలోనికి బోతిమి. ఆ తోట ఎటు చూచినను మూడామడ.

---

1) చందూలాల్ మీద కొన్ని గేయములు తెలుగునాటున వాడుకలో నున్నవి- "చందూలాలు మంచివాడు చచ్చిపోయెనూ, ఈతదరికెల చురకలు పోసె ఇచ్చేవాడు పిదలిపోయె- -ఇత్యాది. ఈతడు మహాదాత యని ప్రసిద్ధి. మూగిన యాచకులను జవానులు క్రమముగా నుంచుటకు కొరడా లుపయోగించుటయు, ఎన్ని దెబ్బలు తనబడిన అన్నిమాడలు చందులా లిచ్చుటయు ఇందు వర్ణితము.

పచ్చడి చేయవలసిన పని నాది. దాపునగల వెలగ చెట్టెక్కి మొదలు పెట్టి, తొమ్మిది గంటలకు చెట్టు నడిమికి చేరి ఒక కాయ గొడ్డట కూలగొట్టి రెండు జాములకు దిగి వచ్చి పచ్చడి చేసితిని. చందూలాల్ స్వయముగా వచ్చి చూచుచుండగా, ఆ పచ్చడి ఏబదివేల మందికి వడ్డించితిని. రాచిప్పెడు పచ్చడి తిన్నవానికి చందూలాలు కాసు రొప్పున నిచ్చెను. వడ్డింపగా మిగిలిన పచ్చడి నలుబది గూనల కెత్తితిమి."

అపుడీ వెలగకాయయు, ఆ పచ్చడియు ఒకటేమి అంతయు నిక్కమనియే అనుకొంటిమి. క్రమక్రమముగా కథకుని అత్యుక్తి అంతయు అడుగున బడి చందూలాలు మాత్ర మిప్పటికిని మిగిలెను.

## కురు ద్వీపము :

పురాణము కురుద్వీపము నిటులు వర్ణించెను. "ఇది ఉత్తర సముద్రము నంటియున్నది. ఇచట చంద్రకాంత సూర్యకాంత పర్వతములు కలవు. వాని నడుమ భద్రసోమ యనునది ప్రవహించును. ఇంకను ఇచట తేనెవాగులు, నేతి వాగులు, పెరుగు వాగులు, కల్లు వాగులు పాఱుచుండును. ఇది సిద్ధక్షేత్రము. ఇచటి స్త్రీలకు ప్రసవధర్మము లేదు. ఇచట వింతచెట్లు కలవు. అవి దంపతుల జంటలను కనును.[2] ఇచట క్షీరులను కొన్ని చెట్లు కలవు. వారు వాని పాలు త్రావుదురు. కొన్ని చెట్లు రంగురంగుల బట్టల నిచ్చును. వారు వాని దాల్తురు. అట వ్యభిచారము లేదు. వ్యాధి లేదు. జర లేదు. దుర్బుద్ధి లేదు. వారు స్వర్గ భ్రష్టులు. వారు కాలము తీఱగా బుడగలవలె మరణింతురు. వారి నీశ్వరరానుగ్రహమువలన కాలము తినివేయును. వారు 13,500 ఏండ్లు బ్రతుకుదురు. బ్రహ్మ మానసపుత్రుల కిది కాణాచి."

ఒక భరతవర్షము నందుకాక మిగిలిన వర్షములం దింత వింతగా వర్ణన కనబడును. ఈ వింతలు నమ్ముటగాని, నమ్మకుండుటగాని, ఆ వింతలోనుండి అసలు సంగతి చూచుట గాని పాఠకుల యిచ్ఛాధీనము.

---

2) "ఏ వేషము ధరియించిన, నా వేషము తనకు నందమై యద్ధాత్రీ
దేవుడు చెట్టున బుట్టిన, భావంబున నుండు రూపుపాయము కలిమిన్" (కాశీ)

పొడవు - ఆయువు :

మనుష్యుడు తన అంగుళి బెట్టి కొలుచుకొను నెడల ఎనుబది నాలుగు అంగుళముల పొడవుండును. అనగా ఏడడుగులు. యుగాంతమునం దీపొడవు తగ్గును. మఱియు గడిచిన యుగము లందును, రాబోవు యుగము లందును మనుష్యుడు తన అంగుళి కొలతచే ఎనిమిది తాళముల యెత్తుండును. (తాళ మనగా 12 అంగుళములు. అనగా ఎనిమిదడుగులు). తొమ్మిదడుగుల ఆజాను బాహుని దేవతలేని పూజింతురు.

కలిలో మనుజుల పరమాయువు నూఱేండ్లు. కాని ఇది అస్థిరము అని వాయు మత్స్య పురాణములు.

పురాణము జంబూద్వీపము కడకు వచ్చి అత్యుక్తి విడిచిపెట్టును. 'ఇది జంబూ వృత్తాంతమే కాదు, మఱి ప్రపంచ వృత్తాంత'మని ఎవరేని అనవచ్చును. కలి మొదలగు యుగములు ఒక భరతవర్షమందే కాని ఇతరత్ర లేవని పురాణ మనును. కావున ఇది జంబూ లేక భరతవర్ష వృత్తాంతమే.

'కావున మిగిలిన ద్వీపముల యెడ నత్యుక్తు లేల దొరలెను?' అను శంక ఉదయించుచున్నది. పురాణకర్తగాని సంస్కర్తగాని తాను చూడక కర్ణాకర్ణికగా వచ్చుచున్న అత్యుక్తులను విని వాని నటులే గ్రంథస్థము చేసియుందురు. ఈ యూహ పొరపాటయినచో అభిజ్ఞులు సరిగా ఊహింతురు గాక.

భరతవర్షము :

భరతవర్షమునందు తిలింగ[3] అంధ్ర[4] అంధ్రక[5] అంధ్రవాక[6] అంధ్ర[7] దేశము లున్నవని వాయు పురాణమున గలదు.

ఇందు తిలింగము మధ్య దేశమున గోదా వింధ్యలతో సంబంధ పడ్డది. ఇది తెలంగానా కానగును. అంధ్రకము గంగా ప్రాంతము. అంధ్ర వాకములు

---

3) వాయు. 47-111, 4) 99-335, 5) 38-69-70, 6) 98-108,
7) 47-1-160 వఱకు.

తూర్పు దేశములు. మిగిలిన అంధ్ర మొకటి దక్షిణా పథమున గలదనియు, మరియొక ఘట్టములో అంధ్ర, లేక ఆంధ్రదేశము దాక్షిణాత్యమనియు, ఇంకొక ఘట్టమున అంధ్రదేశము పాప దేశమనియు, బ్రాహ్మణు డెవడు నచటికి పోగూడదనియు గలదు. దక్షిణమున నున్నదని చెప్పిన అంధ్ర లేక ఆంధ్రదేశము ప్రకృతాంధ్రము కానగును.

## రెండు మేరువులు :

మేరు విలావృతమునకు నడుమ గలదనియు, అది స్వర్గమనియు కొన్ని పట్లను[8], సర్వోత్తరముగ నున్నదని కొన్ని పట్లను[9] చూపట్టును. ఇందు మొదటిది పర్వతము. రెండవది భూమి ఉత్తర బిందువు.

ఈ రెండవ మేరువు ఉత్తరధ్రువప్రాంతమని కాని, ధ్రువోపలక్షితమగు ఆకాశ మనికాని పురాణ మెచటను చెప్పలేదు. మేరువు భూమికి నాభియనుటయు, సర్వోత్తరముగా నున్నదనుటయు నెటులు పొసగును ? కావున నాభిస్థానీయ మగు మేరువు పర్వత మనియు, సూర్యుడు ప్రదక్షిణించు మేరువు ఉత్తర బిందువు, లేక ధ్రువము లేక నారాయణోపనిషత్తు చెప్పిన ధ్రువక్షితియని అనుకొని తీఱవలయును.

## కురువుల నమెరికా కిత్తురా ?

ఈ సంగతి ఆలోచింపక కొందరు తియాన్ షాన్ [Tien shan] శిఖరమును మేరువుగా జెప్పి అన్నిటికి నుత్తరమగు మేరువేది కలదో అదియే యిది యని వ్రాసి కురువులు ఉత్తర అమెరికా, లేక మెక్సికో అని చెప్పిరి. కొందరు టిబెట్టు కురుద్వీపమనిరి. మఱి కొంత ఉత్తర ధ్రువప్రాంతమే మేరుపర్వతము గాని, ఉత్తర బిందువు గాని అని అనిరి. ఈ క్రింది భూగోళ చిత్రమును చూచునది.

---

8) వాయు. 34, 94-95.

9) సర్వేషా ముత్తరే మేరుః. 50-108.



ఈ తియాన్ షాన్ శిఖరముగాని, మేరుపర్వత శిఖరముగాని, సర్వోత్తర మగు నెడల దానికి ఉత్తరముగా కురుద్వీప మున్నదని చెప్పుటయే అసంగతము. అప్పుడు కురుద్వీపము సర్వోత్తరమని చెప్పవలయునుగాని మేరు సర్వోత్తరమని చెప్పుట వృథా. సర్వోత్తరమగు మేరువునకు ఉత్తరమున నున్నది ఉత్తర దిగాకాశమును, ధ్రువమును. పటము మీద ఉత్తరబిందువునకు ఉత్తరముగా అమెరికా కనబడును గాని ఆ ఉత్తరబిందువు అమెరికాకును ఉత్తరబిందువే - అనగా నార్త్ పోలే.

## రెండు కురువులు :

లోక వేదములయందు కురు వ్యవహారము కలదు. ఇవి రెండు. ఒకటి పాంచాలము లందలిది. మఱియొకటి మేరు పర్వతమునకు ఉత్తరముగా ఉత్తర సముద్రము వఱకు వ్యాపించి యున్నది.

పాంచాలము లందలి కురుదేశముల కంటె ఉత్తర కురుదేశములు భిన్నము లని ఐతరేయ బ్రాహ్మణము. వాయు పురాణాదు లీ యుభయ కురువులను అచట నచట కలిపివేయును. ఆ కలిపి వేసిన భాగములు ప్రక్షిప్తములు కావలెను. ఏలన, వాయు పురాణకర్త యీ రెంటిని వేరుగనే వ్యవహరించెను.

ఆసియా నడుమ ఉత్తర కురువు లున్నటులు గ్రీక్ చరిత్ర కారులు క్రీ. వె. ఐదవ శతాబ్దిలో వ్రాసిరి. ఉత్తర కురు వను పత్తన మొకటియు [Uttara Korrah], పర్వత మొకటియు, నది యొకటియు చీనా టర్కీకి చెందిన సెరీక్ [Serique] దేశము నందున్నదని మొట్టమొదట మనకు టాలెమీ తెలిపెను. ఇతడు క్రీ. వె. 140 కి చెందినవాడు. కావున కురుదేశములు మేరు పర్వతమునకు ఉత్తరముగను, ఉ. సముద్రము నభివ్యాపించియున్న దనుట నిర్వివాదము.

అటులగుచో పురాణకర్త మిథ్యా వాదియా? కాదు. మనమే అతనిని సరిగా అర్థము చేసికొనవలసి యున్నాము. ఇది జటిలమగు విషయము. ఇందు మనము గూడ పొరపాటు చిత్తగించుచున్నామేమో యను మాట వినయము క్రింద జమకాదు.

## పురాణము వేదవ్యాఖ్యానము :

పురాణ కర్త తాను కన్నవియు, విన్నవియు, వేదమున గలయవియు, తానూహించినవియు గూడ జెప్పెను. ఇందులకు పురాణమే సాక్షి.

పురాణము మేరు విషయమున బ్రాహ్మణముల ననుసరించెను. ఇంకను పలు విషయముల యెడల బ్రాహ్మణముల ననుసరించెను. అటు పిమ్మట తన గురు సంప్రదాయము ననుసరించి ఆయా యీ విషయములను బహుముఖములుగా వివరించెను.

## బ్రాహ్మణములలో మేరువు :

బ్రాహ్మణముల కాలమునకే మేరువు ... ంపులలో బడుట కారంభిం

చెనని యీ దిగువ బ్రాహ్మణము వలన తెలియ గలము.[10] ఆరోగ భ్రాజ పటర పతఙ్గ స్వర్ణర జ్యోతిషీమ ద్విభా సులని సూర్యు లేడుగురు. వీరందఱును లోక ముల కూర్జ మొసగుచు ఆకసమున వెలుగు చున్నారు. కచ్ఛపు డెనిమిదవ సూర్యుఁడు. అతఁడు మహా మేరువును విడువడు.

---

10) ఆరోగో భ్రాజః పటరః పతంగః। స్వర్ణరో జ్యోతిషీమాన్ విభాసః। తే అస్మై సర్వే దివ మాతపన్తి। ఊర్జం దుహానా అనపస్ఫురన్తః। స ప్తకర్ణశ్చ ప్లాక్షిః। అనుశ్రవిక ఏవ నౌ కశ్యప ఇతి। ఉభౌ వేదయితే। నహి శేకు మివ మహామేరుం గన్తుమ్। అపశ్య మహ మేత త్సూర్యమండలం పరివర్తమానం। గార్గ్యః ప్రాణ తాతః. గచ్ఛన్త మహామేరుమ్ ఏకం చాఽజహాతమ్. (తై త్తి. ఆర. ౧ ప్రపా. 3 అను) లోతులకు దిగినచో ఈ బ్రాహ్మణము నందలి సూర్యులు సూర్యులు కారనియు, మేరువు మేరువు కాదనియు కశ్యపుడును, సూర్యు డాత్మయనియు, మేరువు శారీరక మేరువనియు తోచును. ఈ బ్రాహ్మణముననే ఈ 'సప్త సూర్యులు సప్తప్రాణములు, లేక సప్త జ్ఞానేంద్రియములు, లేక సప్తావరణములు' అని కొందరు వేదకర్త లభిప్రాయపడిరి. మరికొందఱు 'భౌతిక సూర్యులే కాని మన కంటికి కన బడరు' అనిరి. 'ఏడుగురు సూర్యుల నెటనుండి తెత్త'మని ఒక డడుగగా 'ఏడుగురే యేమి ? నీకు కనబడకపోయినంత మాత్రమున నయినదా ? వేగురు సూర్యులు కలరు; మఱి మాటాడిన లక్ష కలరు' అని వైశంపాయను డనెను. ఇటులని అతడు తన వాదమున కుపష్టంభకముగా "చిత్రం దేవానా ముదగా దనీకమ్" అని ఋక్కు నుదాహరించెను.

కాని ఈ ఉదాహరణము కూడ ఆత్మపరమే. ప్రాణత్రాతుడు 'భ్రాజాదులగు మూగురు సూర్యులు మేరువు క్రింద నుందురు. వారు కిరణములను క్రిందకు బంపుదురు. స్వర్ణరాదులు పైనుందురు. వారు పైకి పంపుదురు. వారి నడిమి దారిని బటి మీరు చల్లగా మేరువు మెట్ట గలరు!" అని చెప్పెను. ఇది ఆత్మపరమని వేఱ చెప్ప బనిలేదు.

అటు లగుచో ఈ సూర్యులకును, కశ్యప సూర్యునకును వేదకర్తలే కొందరు వైశం పాయనాదులు భౌతికత్వ మేల యాపాదించిరి ?

ప్రకృత విషయము - అరుణ కేతుకమగు మగ్ని తదా రాధనమున ఇష్టకా నిరూపణ మున్నది. దానిని ప్రత్యక్ష మటులు చూపవలయును. యజ్ఞమున చాలవట్టు ఆధ్యాత్మిక విషయ మును ప్రాకృత ప్రక్రియచే యటించుటయే చూపట్టును.

సరియ. అటులగుచో నచటి మహామేరువు శారీరకము గాదా ? కాకేమి ? ఈ మేరువు నగును. ఆ మేరువు నగును. సూర్యుడు కూడ ఈ సూర్యుడు నగును. ఆ సూర్యుడును అగును. ఈ రెంటికిని కలిసివచ్చుటకే సూర్యుడు మేరువును వదలడు, అని శ్రుతి చెప్పెను - "గచ్ఛన్త మహామేరుమ్ - ఏకం చాఽజహాతమ్.'

"మేమీ ఏడుగురు సూర్యులను జూచితిమి. కశ్యపుని మాత్రము వేదము నందే వింటిమి. మేమా మేరువు కడకు పోజాలకే పోతిమి" అని పంచకర్ణుడును సప్తకర్ణుడును ఆవేదించు చున్నారు.

"పరివర్తమానమగు నీ సూర్యమండలమును నే జూచితిని. ఈ సూర్యు డాకడే. అతడు మేరువు వదలడు. మీరును మహా మేరువునకు జనుడు. మేరువును వదలని ఆ సూర్యుని గనుడు" అని ప్రాణత్రాతు డనెను.

ఈ మహా మేరువు సూర్యుని జూపుటకు ఉపలక్షకము. కావుననే సాయణుడు మేరుమార్గ రూపమగు ఆకాశము అని[11] ఈ మహామేరు పదమున కర్థము వ్రాసెను. ఇక ఈ మేరువు ఖమేరువు. జ్యోతి స్సిద్ధాంతమునం దిది సంజ్ఞా మాత్రము. X వంటిది. అదియే ఉత్తర బిందువు.

సూర్యుడు భూమికి నాభి స్థానీయమును, ఇలావృత మధ్యస్థమును, అపర స్వర్గమును అగు మేరు పర్వతమును వలగొనుచున్నాడని పురాణములు చెప్పలేదా? చెప్పెను. ఏల చెప్పెను? ఇదియు మేరువు - అదియు మేరువు. ఈ రెంటికిని పర్వతమనియు, స్వర్గమనియు వ్యవహారమున్నది. కావున నటులు చెప్పెను. సూర్యుడు మేరు పర్వతమును వల గొనునను విషయమును భాస్కరు డెటులు ఖండించుచున్నాడో చూతము:

"మేరువే రేయికి కారణ మగునేని, అది సూర్యునకును భూమికిని నడుమ నుండునేని అది మనకేల కనబడదు?[12] మేరు వుత్తరమున నున్నదనియు, రవి ఎప్పుడును దాని వలగొనుననియు పురాణములు చెప్పును గదా. ఇది నిక్కమగుచో రవి దక్షిణమున కేగుచున్నటులు మన కేల కనబడును? కావున సూర్యుడు వలగొను మేరువు వేఱు, మేరు పర్వతము వేఱు."

---

11) మేరు మార్గ రూప మాకాశమ్ (తై. ఆర. 1-3)

12) రవి చాల దవ్వగుట చేతను, క్షితిజము అడ్డగుట చేతను కనబడదని పురాణకర్త చెప్పెను.

"విదూరభావా దర్కస్య భూమే ర్లేఖావృతస్య చ
హ్రియన్తే రశ్మయో యస్మా త్తేన రాత్రౌ న దృశ్యతే" (వా. 50-108)

భాస్కరుడు జ్యోతిర్మేరువు నిటు వేఱుచేసెను. గాని మేరు పర్వతము కడకు వచ్చి దానినే మరల సర్వోత్తరముగా భావించి దానికి పడమట నున్న ప్లక్షాది ద్వీపసప్తకమును జంబూ దక్షిణార్థమున కుక్కెను. ప్లక్షాదులీ మతమున కల్పనా మాత్రము. జల స్థల పర్యటనము చేయక కంట గనక పుస్తక కీటములై ఊహించిన దానిని ఒక శాస్త్రము చేయబోవుచో నిట్టి పొరపాటులు వచ్చునని నవ్యులు విమర్శించిరి. నిక్కమే. వారికి స్టీమరా - రైలా - తుదకు పడవా? ఒకవేళ ఏ కఱ్ఱయోడయో యున్నను సముద్రయానము నిషిద్ధము కదా, మఱియు కొన్ని సీమలే నిషిద్ధములు కదా!

భాస్కరుడు భూవిన్యాస విషయమున పురాణమునే అనుకరించి కొన్ని చోటుల స్వతంత్రించెను.

## భాస్కర భూగోళము :

"లవణ సముద్రమునకు ఉత్తరమున నున్న సాబాలు నేల జంబూద్వీపమని పలువురు ఆచార్యులు చెప్పిరి. మిగిలిన దక్షిణపు సాబాలున ఆఱు ద్వీపములును, ఏడు సముద్రములును గలవు......

పాతాళము భూమికి పుట స్వరూపముగా నున్నది. అచట నాగులు, నసురులు నుందురు. సిద్ధు లచట దివ్య రమణులతో క్రీడించుచుందురు.

శాక శాల్మల క్రౌంచ గోమేదక పుష్కర ద్వీపములు రెండు రెండు సముద్రముల నడుమల నున్నవి.

జంబూ ద్వీపమున తొమ్మిది ఖండములు. లంకకు ఉత్తరమున (నిరక్ష దేశ) హిమగిరి. దానికి ఉ. హేమకూటము. దానికి ఉ. నిషధము. ఈ పర్వతములు సముద్రము వఱకును వ్యాపించి యున్నవి. ఇటులు సిద్ధపురమునకు ఉ. (ఉజ్జని నుండి నూఱునెనుబది అంశలలో) నున్న తూరుపు మేర శృంగవంతము. వానికి ఉ. శ్వేతము. దానికి ఉ. నీలము.

మన ముందునది భారత వర్షము. దీనికి ఉత్తరమున కిం పురుష, లేక కిం నరవర్షము. దానికి ఉ. హరివర్షము. ఇటులు సిద్ధపురి నుండి చూచినచో మొదట కురు వర్షము. దానికి ఉ. హిరణ్మయవర్షము. దానికి ఉత్తరమున రమ్యక వర్షము.

యమకోటికి ఉత్తరమున (ఉజ్జని నుండి తొంబదంశల తూరుపు మేర) మాల్యవంతము. రోమకమునకు ఉ. (ఉజ్జని నుండి తొంబదంశల పడమటి మేర) గంధమాదనము. ఈ రెండు కొండలు నీల నిషధముల వఱకు వ్యాపించి యున్నవి. ఈ నాలుగు కొండల నడుమ ఇలావృత వర్షము. మాల్యవంతము నుండి సముద్రము వఱకు భద్రాశ్వము. గంధమాదనము నుండి సముద్రము వఱకు కేతుమాలము. నిషధ - నీల - గంధమాదన - మాల్యవంతముల నడుమ ఇలావృతము. దాని నడుమ మేరువు. అదియ స్వర్గభూమి."

ఈ పై భాస్కర భూగోళము పురాణ భూగోళము కంటె కొన్ని కొన్ని చోటుల భిన్నము. (మూడవ పటము చూ.)

## సూర్య సిద్ధాంతము :

"భూగోళము నడుమ గుహారూపముగా పాతాళము కలదు. ఓషధులు దానికి వెలుగిడును. అట నాగులును, అసురులును ఉందురు. భూగోళ మధ్య మును భేదించుకొని పైకి వచ్చి ఉభయ పార్శ్వము లావరించి మేరువు దండాకార ముగా నిలిచెను. దానికి తూర్పున భద్రాశ్వవర్షమున భూమిలో ఒక పాదము దవ్వున (90 అంశలు) యమకోటి కలదు. దక్షిణమున భారత వర్షమున లంకా పురి కలదు. పడమట కేతుమాల వర్షమున రోమకపత్తనము కలదు. ఉత్తర మున కురు వర్షమున సిద్ధపురి కలదు. ఈ పత్తనము లన్నియు భూ పరిధికి 90 అంశలు దూర దూరముగా నున్నవి. మేరువు గూడ వానికి అంత దూరము లోనే యున్నది.

ఈ దిగువ ఛేద్యకము చూడుడు:-




స్వాయంభువాదులు దేశముల నాక్రమించుకొనుటకు కత్తి పట్టి తిరిగి రేమో కాని, ఋషులు మాత్రము తాము పోగలిగిన దేశమునకు బోయి, చూచిన దానినెల్ల బ్రహ్మ - అండముగా జూచిరి. పరమేశ్వరుడు విశ్వమెల్ల నిండి యున్నాడు. ఆ పరమేశ్వరునకు మహ దహంకార పంచ భూతములను ఏడావరణ ములు కలవు. ఇది తెలియుటే భూగోళ మెఱిగిన ఫలము. ఈ ఆత్మ నెల్ల యపు

డును గుఱుతుంచుకొనుటకు భూగోళ ఖగోళముల నేడేసి విభాగము లొనరించితిమి, అని వారు విస్పష్టముగా వ్రాసిరి. అరి యటుండె.[13]

వారొక రీతిగా దేశ ద్రష్టలు. వారు తాము చూచిన దానిని బ్రహ్మ బుద్ధితో కవితలో పాకము పట్టిరి. ఇటులు భావాద్వైతము క్రియాద్వైత మగుట వలన ప్రాకృత మంతయు అతి రంజిత మాయెను. అగును. పిదప వారు తమ యెఱుకను శిష్యులకును, సూతులకును జెప్పిరి. అది వారి అందరి కంఠముల చేతను, గంటముల చేతను అత్యంత రంజిత మాయెను. ఈ అత్యంత రాగమును క్షాళించి వయిచినచో మూలమును మనము కనుగొన గలము.

భారతము :

భారతమున పాండవులు స్వర్గ కామనచే హస్తినసుండి ద్వారకకు బోయి అచటి నుండి ఉత్తరముగా నడచి హిమాలయమున కేగి యటనుండి వాలుకా సముద్రమును జూచినటులు ఉన్నది. ఈ వాలుకా సముద్రము గోబీ, లేక షామో ఎడారి. వారు సుమేరువు చూచిరి. అప్పటి కింకను అది స్థానభ్రష్టము కాలేదు. మహాభారత కవికి సుమేరువు స్వర్గము.

రామాయణము :

హిమాలయములకు ఉత్తరమున విశాలమగు శూన్యము కలదు. దానికి ఉత్తరమున ఉత్తర కురుదేశములు కలవు. దానికి ఉత్తరమున ఉత్తర సముద్రము కలదు అని ఉన్నది. అచటి విశాల శూన్యము టిబెట్ పీఠభూమికాని, మంగోలియా పీఠభూమి కాని, గోబీ ఎడారికాని కావచ్చును.

---

13) సప్తప్రకృతయ స్త్వేతా ధారయన్తి పరస్పరమ్. (49-185)

ఆణ్డానా మీదృశానాం తు కోట్యో జ్ఞేయా స్సహస్రశః (49-149)

తిర్యగూర్ధ్వ మధస్తాచ్చ కారణ స్యావ్యయాత్మనః.

కారణైః ప్రాకృతై స్తత్ర హ్యావృతం ప్రతిసప్తభిః (49-150)

దశాధిక్యేన చాన్యోన్యం ధారయన్తి పరస్పరమ్.

పరస్పరావృతా స్సర్వే ఉత్పన్నా శ్చ పరస్పరాత్. (49-151)

నవ ఖండములు :

ఈ పృథివిలో తొమ్మిది ఖండము లున్నవి. భరత దేశమునందును తొమ్మిది ఖండము లుండవలయును. ఈ పేళ్లన్నిటిని బట్టి చూడగా మొదట భూవిభాగమును, పిమ్మట భరత వర్ష విభాగమును అయినటులు తోచును. పైని ఉత్తరకురువు లున్నవి. భరత ఖండమునందును ఉండవలయును. ఈ దెసనే పలు దేశములయు, పత్తనములయు పేరులు ఔత్తరాహములు భరత వర్షమున గలవు.

నేరేడు బండు :

వాయ్వాది పురాణములు ప్రచారములోనికి వచ్చినపుడును, భాస్కరాది జ్యౌతిషికుల సమయమునను ఈ జంబూద్వీపము మాత్రమే, అనగా ఈ భరత వర్షమే నచనచగా వారికి తెలిసిన భూమి. ఇది పేరునకు దగినటులు ఈ జంబూ ద్వీపము భూమిలో నేరేడు పండంత. ఈ ఛేద్యకము చూడుడు.



ఆర్యజాతి నవ వర్ష విభాగము గల ఈ భరతఖండమునం దునికి గొనె ననుటలో మనము సందియం పడనక్కఱలేదు. అశ్వద్వీపమునం దిది చాల చిన్న దయినను అసామాన్యమైనది. ఎన్నియో పేరజాతు లీదేశమునుండి పడమటికిని, దక్షిణమునకును వలసపోయిరి. తొలుదొలుత ఆర్య జాతులలో నెవ రెవ రాసియా ఖండమున నానా వర్షములలో నెలకొనిరో ఎవరు చెప్పగలరు? ఉత్తరమున తెల్ల వారును, మతాంతరమున ఎఱ్ఱవారును, దక్షిణమున పచ్చవారును, పడమట నల్లనివారును, తూర్పున తెల్లవారును - మతాంతరమున ఎఱ్ఱవారును నివసించు చుండిరి. మన మందరమును ఆర్య నామముచే ఏక వర్ణులము.

ఏ వర్ణము దారి జూపునో మిగిలిన వర్ణము లాదారిని నడచును. ఆయా యీకాలములలో తెలుపు ఎఱుపు పసుపు రంగు కల జనులు ఈ భరత ఖండ మున ప్రవేశించిరి. ఎంతకాలము వెనుక ఈ ప్రవాహము ఇటులు ప్రవహించెనో దాని నెఱుగదగు నుపాయము లేదు. వేనుని పిదప మొదటి క్షత్రియుడు పృథు చక్రవర్తి. అత డెఱ్ఱనివాడు.[14] ఆ సమయమునందు పసపు రంగుగల వైశ్య జాతి తొలుత సేద్యము సేయ నారంభించెను.[15] అటుపిమ్మట కొంతకాలము నకు సెంట్రల్ ఏషియా నుండి (అశ్వద్వీప మధ్యము నుండి) శకులు, హనులు భారతమునకు వచ్చిపడిరి. మరి కొంతకాలమున కక్కడనుండియే టర్కీజాతి పుష్కర శాల్మల ద్వీపములకు వచ్చెను. కేతు మాలాంతర్గతమగు జంగదేశము నుండి వచ్చినవారు హైదరుజంగ్ మొదలగు వారి వంశధరులు. మఱికొంత కాలము పిదప చీనా—టర్కీ జాతియు, మంగల జాతియు (మొగల్) వచ్చి ఢిల్లీ సింహాసన మాక్రమించెను. ఈ రెండు జాతులును ముసలిమానులు కాక బౌద్ధులయి యుందురేని క్షత్రియులయిపోయెడివారు.

దీని నంతయు ఒకసారి సింహావలోకనము చేసి చూడగా పూర్వార్ధగోళ మున ఉత్తరధ్రువము మొదలుకొని లంక వరకు గల జనులు పరస్పర దేశము లలో ఎటులు కలసిపోయిరో, భరతవర్షమున చాతుర్వర్ణ్య మెటులు బిగిసిపోయెనో తేటపడును.

---

14) కేతు మాలమునకు వలసపోయి కురువులు కురరు లయినట్లును, పాంచాలములకు వచ్చి కురుదేశ మేర్పరచికొని క్షత్రజాతియై భరతఖండ మందంతటను క్షత్రియులుగా వ్యవ హృతు లయినట్లును ఒక ఊహకు ఆస్పద మున్నది.

15) వీరు కేతు మాలమున విదిశ్యులు. వీరు ఋగ్వేదమునుండి జనించినటులు అశ్వ మేధ పన్నము. (చూ. తై. బ్రా)

౪

ఎవడును ఒక మేరు పర్వతమునే సంపూర్ణముగా చూచియుండ లేదని మనము మొదటి వ్యాసమున చూచి యున్నాము. ఆ కాలమున భూభ్రమణ మొనరించిన కొందఱు ఋషులు తాము చూచినంత వఱకును కొందఱకు చెప్పిరి. ఆ విన్నవారు తాము విన్నంత మాత్రము వినువారికి చెప్పిరి. అంతటితో సరి. తావన్మాత్రమే పురాణములో ప్రవేశించెను.

వాయు విష్ణు మత్స్య పురాణముల తరువాత జైనులు వానినే అనుసరించి వర్షములను, వర్ష పర్వతములను, నదులను చెప్పిరి. భూమి, సూర్యుడు, చంద్రుడు, గ్రహములు-వీని పొడవు, వెడల్పు మొదలగు లెక్కలలో మాత్రము భేదించిరి. వారు వీని లెక్కలను కనుగొనుటకు ఒక సూత్ర గ్రంథము రచించిరి. ఈ జైన సూత్ర రచన క్రీ. త. 500-300 నడుమనని విమర్శకుల అభిప్రాయము. 398 వ శకమునకు చెందిన ఆర్యభటుడు[1] ఈ జైన గణితమును చూచెనో లేదో యిపుడు మనము తెలిసికొనుట కాధారము దొరకదు.

ఈ ప్రాచీన భూగోళము వలన మన కిపు డిసుమంతయు నుపయోగము లేనట్లె ఆ జైన సూత్రమువలనను మన కిపుడు ఉపయోగము లేదు. ఆర్యభటుని కడనుండి నేటి వఱకును పెరుగుచు వచ్చిన గణితము మాత్రము ప్రశంసనీయము.

పురాణ మతమును, సిద్ధాంత మతమును ఒకటి. సిద్ధాంతములు పురాణములకు విశదమయిన వ్యాఖ్యలు. నవ్యులు దక్షిణ ధ్రువముకడ నున్న పుష్క-

---

1) యష్ట్యబ్దానాం యష్టిర్యదా వ్యతీతా స్త్రయశ్చయుగపాదాః త్ర్యధికా వింశతి రబ్దాస్తదేహ మమ జన్మనోఽతీతాః."

'కలి 3600 ఏండ్లు చనగా నా కిరువది మూడేండ్లు నిండెను. అనగా ఆర్యభటుడు 3577 కల్యబ్దమున పుట్టెను. కల్యబ్దముల నుండి 3179 తీసి వేయుచో శకాబ్దములు వచ్చును. కావున 398 వ శకాబ్దమున ఆర్యభటుని పుట్టువు. ఆతడు తన 23వ ఏట సూర్యసిద్ధాంతము రచించెను భూమి గోళమని సిద్ధాంతీకరించిన దితడే. ఇతడు జ్యోతిర్గురువు. ఆర్యభటుడు గ్రీకులకు అందూ బేరియన్ లేక అర్ధూబేరియస్. అరబ్బులకు అర్ జభర్. ఇతని సిద్ధాంతము అర్కాండ్. ఇతని కుట్టక విధికి పాశ్చాత్యులంద రాశ్చర్యపడిరి.

రాది ద్వీపములను పడమటికి దెచ్చి కేతు మాలమున బడవయిచిరి. రెండవ వ్యాస మున ప్లక్షాది ద్వీపటీకలను చూచునది. దానికి వారు చెప్పగల హేతువులివి.

౧. (అ) పురాణము లీద్వీపము లెచట నుండెనో చెప్పలేదు. వాస్కరాదు లీద్వీపములను దక్షిణమున కుక్కిరి.

(ఆ) అచట నిపుడీ యాఱు ద్వీపములు లేవు సరికదా ఆఱంగుళముల నేలయినను లేదు.

౨. ఈ ద్వీపములో నొకటయిన శాకద్వీపమునకు తూర్పుగా మేరు వున్నదని మత్స్యపురాణము చెప్పెను. కావున మేరువునకు ఇది పడమట నున్నది. మఱియు నీ దీవులొకదాని కంటె మఱియొకటి పరముగా నున్నదని పురాణములలో కలదు. కావున నివి పడమటి సముద్రము వఱకును కేతుమాలమునం దంతర్గతములు.

౩ (అ) రవి దక్షిణము నుండి మరలి విషువమునం దుండునపుడు పాలపుంత ఉత్తరాంతమున నుదయించును. (వా. 50 - 125)

(ఆ) పుష్కరము నడుమ నుండి రవి యేగుతఱి 30° భాగ (వా - 50 - 119).

(ఇ) వైశ్వానర పథమునకు వెలుపల నున్నపుడు రవి మొదటి వెలుగు పుష్కరముగుండ ప్రవర్తించును. (మ 125—81) రవి ఉత్తరాయణమున శ్రవణమునం దుదయించును. రెండవ వ్యాసము నందలి మూడవ చిత్రము చూచునది.

ఈ దేవేంద్ర కుమార రాజారామ పటేల్‌గారు తమ Cultural History from the Vayupurana - 316 వ పుటలో వాయు పురాణము నందలి 50 - 119 శ్లోకమునకు "When the sun passes over the centre of Pushkara one third of the earth is traversed by the sun in one Muhurtha" - అని అర్థము వ్రాసిరి. అనగా పుష్కర మధ్యముమీదుగా పోవునప్పటికి రవి ఒక ముహూర్తమున భూమి మూడు వంతులు కడచును. కావున పుష్కరాది ద్వీపములు 300 వ Latitude లో (అక్షాంశములో) నున్నవి.

ఈ పై హేతువు లన్నియు హేత్వాభాసములు. ఇంతియేకాక ఈ హేతువులు పుష్కరాదులు నిరక్ష రేఖకు క్రింది వనుటకే సాధకములు. చూడుడు :-

౧ (అ) వాయువు పురాణ ముత్తర మేరువు మొదలుకొని దేశముల నుగ్గడించుచు జంబూ ద్వీపము కడకును, తదను ద్వీపముల కడకును వచ్చి పుష్కరాంత షడ్ద్వీపములను జెప్పి లోకాలోకమును జెప్పెను. (చూ వాయు - 50 108) అంతటితో దక్షిణ దిగంతము.

యోగవాసిష్ఠమున దిగంతముల గనుగొన నేగిన విపశ్చిత్తులలో పశ్చిమ విపశ్చిత్తు కేతు మాలమున కేగెననియు. దక్షిణ విపశ్చిత్తు ప్లక్షాది ద్వీపముల కేగెననియు కలదు. కావున భాస్కరాదులును, జ్యోతిస్సంహితాకారులును మనకంటె సరిగా అర్థము చేసికొనియే యీ దీవు లాఱును నిరక్షరేఖ క్రింద యామ్యార్థమున నున్నవని చెప్పిరి.

(ఆ) జపాను చుట్టుప్రక్కల నున్న దీవు లెన్ని మునుగుచున్నవో, ఎన్ని తేలుచున్నవో ఎవ రెఱుగరు ? కావున నివి యెపుడో మునిగియుండును.

౨. శాక ద్వీపములో నున్న ఒక వర్ష పర్వతముపేరు మేరువు. ఈ మేరువు వేఱు, మహా మేరువు వేఱు. (చూ. మత్స్య 122 - 8). ఈ మేరువులో నొక ఉదయ పర్వతమును, ఒక అస్త పర్వతమును గలవు. ఈ నవ్యులు ఈ మేరువును ఆ మేరువును ఒకటే అనుకొని ఈ ఉదయాస్తములను మహామేరువున కంటగట్టి ఒక చిత్తరువు సృజించిరి. (ఒకటవ వ్యాసమున మూడవ చిత్రము చూచునది) ఈ మేరువు మహా మేరువు కంటె వేఱగుట వలన శ్రీధరస్వామితో విరోధము లేదు. (చూ. ౨ వ్యాసము. శాక ద్వీపపు ౬ వ టీక).

౩. (అ) వాయు పురాణము నందలి 10—125 శ్లోకములోని 'క్షీరోదస్య సముద్రస్య' కు "పాలవెల్లి" అని అర్థము కాని "పాలపుంత" అని అర్థము కాదు. శాకద్వీపము క్షీర సముద్రములో నున్నది. 'క్షీరోదము' నకు ఈ రెండర్థములును గలవు. దానజేసి వీరిటులు పొరబడిరి.

(ఆ) పుష్కర మధ్యముగా రవి యేగు తఱి 30° భాగ(వాయు 50-119) ఇది దక్షిణ దిగ్భ్రమణపు ముచ్చట గాని ఉత్తర దిగ్భ్రమణపు ముచ్చట

కాదు. కావుననే 'ఈ నడకతో రవి మాఘమున దక్షిణ దిగంతమున కరుగును' అను నర్థము కల "ఏతేన గతి యోగేన యదా కాష్ఠాంతు దక్షిణామ్, సర్వాగచ్ఛేత్తదా ఒ దిత్యో మాఘే కాష్ఠాంత మేవహి" అను తదుత్తర శ్లోకము సంగతమగును. నవ్యులు క్షితిజమునకు ఉత్తరమున 30° భాగ అని అనుకొని దానికనుగుణముగా పటము లిఖించిరి. (చూ. రెండవ వ్యాసమున మూడవ చిత్రము). కాని వారు క్షితిజమునకు దక్షిణమున గూడ 30° వ భాగ కలదను మాటయే మఱచిరి. రవి ఒక ముహూర్తములో క్షితిజమునకు ఉత్తరమున 30° భాగలో నుండు టెంత విపరీతమో వారాలోచింపరైరి.

దీనికర్థ మిది :

రవి దక్షిణపు కొనసన్న పుష్కరము మీదుగా ఉత్తరమున నున్న ధ్రువచక్రము వఱకు నడచును. రవి పుష్కరము మీద నున్నపుడు, అనగా దక్షిణాయనమున మౌహూర్తిక గతితో నడచుచు 30 అంశలు గడచును. పగలు ఆఱు రాసులు, రేయి ఆఱు రాసులు 12 $\times$ 30=360 అంశలు. కావున ముహూర్తమునకు 30 అంశలు నడచునని దీనికర్థము. (విష్ణుపురా. 2-8-45,46 చూచునది). ఉత్తరాయణ మౌహూర్తిక గతి వేఱు- దక్షిణాయన మౌహూర్తిక గతి వేఱు. దాని గణనము వాయ్వాదిపురాణములలో కలదు. (చూ. వాయు 50-120, 121).

(ఇ) ఈ శ్లోకమునందు (మ. 124-81) "లోక సంతానతః...బహిః" అని ఉన్నది. దీనిని నవ్యులు పరికింపక అర్థము లగింపక వదలి వేసిరి. "లోకములకు వెలుపల" అని దాని అర్థము. అదియే ఇచట వైశ్వానర బహిర్భాగము. కావున రవి సర్వ దక్షిణమున నున్నపుడు ఆతని తొలి వెలుగు పుష్కరము గుండ ప్రసరించునని అర్థము. పుష్కరము పడమటి కొన నుండుటేమి? ఎక్కడో దక్షిణమున నున్న సూర్యుని తొలి వెలుగు పుష్కరము మీదుగా ప్రసరించు టేమి? ఇది ఎటులేని పొసగునా? కావున పుష్కర ద్వీపము దక్షిణాగ్రమునకు మేరువుకడ నున్నదని అంగీకరింప వలెను. (రెండవ వ్యాసము లోని మూడవ చిత్రమెంత విపరీతమో ఇపుడు చూడుడు).

(ఈ) శ్రీ పటేల్ గారు "త్ర్యం శాంశకమ్" అను పదమునకు 'మూడు వంతులు' అని అర్థము చేసికొనిరి. కాని అది కాదు. ఇది అచ్చు తప్పు 'త్రి+అంశ+అంశ' అనునది తప్పుకాదా? 'త్రింశా శకం' అను పాఠాంతరము వీరు చూడలేదు. త్రింశాంశ మనగా 30 వ అంశ. విష్ణు మత్స్యములలో 'త్రింశద్భాగంతు మేదిన్యాః' అని విస్పష్టముగనే కలదు. (చూ. విష్ణు. 8-8, మత్స్య 124-41) కావున వీరు తీసిన అర్థముల వల్లను, గీచిన పటములవల్లను పురాణ భూవిన్యాస మంతయు తలక్రిందాయెను.

## రెండు మేరువులు :

పురాణముల ఉద్దేశముల ప్రకారము గీచిన ఈ క్రింది చిత్రమును చూచినచో మేరుద్వయ కల్పనము వ్యర్థము. మేరువు చుట్టును ఇలావృత మున్నది. మేరువు పాతు 16 వేల యోజనములు. ఇలావృతము మేరువునకు ఉత్తరమున 9, దక్షిణమున 9 వేల యోజనముల విస్తీర్ణము. వెరసి 34 వేల యోజనములు.

మేరువునకు ఉత్తరమున నున్నది ఉత్తర దిగాకాశమును, ధ్రువమును అని మూడవ వ్యాసమున చూచితిమి.

భూమి గోళమైనను ఇది యంతటను గుండ్రము కాదు. ఉత్తర దక్షిణ ధ్రువముల వైపుననున్న ప్రదేశము లదుమ పడి మద్దెల కరిణివలె నుండును. దాని చుట్టుకొలత కొన్ని వేల యోజనములు. కావున నచటను దిగ్విభాగము కలదు. "అట నుండు దానికి ధ్రువమే ఖల్వస్తికము కావున ఉత్తర దిక్కనగా ఊర్ధ్వ దిశయే, దక్షిణ దిక్కనగా అధో దిశయే" అని అందురు. కాని అచటను కొన్నివేల యోజనముల సమ విషమ ప్రదేశముండుటవలన దిగ్విభాగముండును. ఒక వేళ వారికి లేకున్నను ఇతరుల దృష్టిలో నుండును.

ఉభయ మేరువుల కడ 6 నెలలు ఉదయాస్తమయములు కదా! ఇలావృతమునందు "చంద్రుడును సూర్యుడును నక్షత్రములును ప్రకాశింపవు." అని వాయు - 46 - 11. కావున మేరువన నేదియో, ఇలావృత మన నేదియో ఇపుడు లెస్స తెలియును. సవ్యులు చెప్పినటుల మేరువు 40-45 అక్షాంశముల

నడుమ లేదు. అటనున్నచో సూర్యచంద్రుల అప్రకాశ మసంభవము. (నక్షత్ర ప్రకాశ ముండునని కొందఱందురు.) వారు చెప్పినటులు ఇలావృతము మేరువునకు తూర్పు కాదు. మఱియు చీనా టర్కీయు కాదు.

ఇక సిద్ధాంతములును, సంహితలును ఈ పురాణముల నెటు లర్థము చేసి కొనెనో తెలిసికొందము.

బ్రహ్మాండ కటాహము నడుమ భూగోళము ఆకాశమున ప్రేలుచున్నది. దాని నడుమ నుండి దక్షిణోత్తరములుగా మేరువు కఱ్ఱవలె వెలి కుబికెను.[2]

దాని ఉత్తరాగ్రము సుమేరువు దక్షిణాగ్రము కుమేరువు లవణ సముద్రము భూపరిధి (Equator) నంటి యున్నది. ఈ భూవృత్తములో యమకోటి, లంక, రోమకము, సిద్ధపురి అను పత్తనములు సమానదూరమున గలవు. ఈనాలుగు పత్తనములును క్రమములుగా భద్రాశ్వ భారత కేతుమాల కురువర్షములకు జెందినవి. లంకా సిద్ధిపురులును, యమకోటి రోమకములును ఉభయ మేరువులును సమ దూరమున నున్నవి. ఈ దూరము నూఱునెనుబది అంశలు.

వీనిలో లంకకు తూర్పున యమకోటి. దానికి తూర్పున సిద్ధపురి. దానికి తూర్పున రోమకము. వీని అన్నింటికి సుమేరు వుత్తరము. కుమేరువు దక్షిణము. (చూ. వృద్ధ వసిష్ఠ సంహిత). పురాణ భూగోళ ఖగోళ పేటిక కిదియే కుంచిక.

సురలును, అసురులును, మనుష్యులును విషువత్తునందుండు రవిని క్షితిజమున గాంతురు. ఎవరేని 180° భాగలు చూడగలరు. అనగా కుడి యెడమ వెనుక ముందుల నెటు చూచినను 90° భాగలు మాత్రము చూడగలరని తాత్పర్యము. మేరువు నుండి విషువత్తు 90 భాగలు. కావున విషువత్ సూర్యుడు క్షితిజమునందు మన కగపడును.

క్షితిజమున పొడిచిన రవి సాయన మేషాది నుండి వృషభ మిథునములు గడచి మేరువు చేరజాలును. అపుడు కర్కాటకాది. సురల కపుడు మట్ట మధ్యా

---

2) వెనుకటి వ్యాసమునందలి చిత్రములో నవ్యులు మేరువు భూమిలో పాతిన కఱ్ఱ చందముగా చూపిరి. ఇపుడు నారింజ పండులో పుడక గ్రుచ్చినటులు కనబడును. ఒకటవ చిత్రము చూచునది

హ్నము. రవి మరల మూడు నెలలకు విషువమునకు వచ్చును. నాటితో సుర లకు పగలు చెల్లు. ఈ యాఱు నెలలను వారికి రవి క్షితిజమున కనబడును. సాయన మేషాదిని పొడిచిన రవి సాయన తులాదియం దస్తమించును. ఈ రీతిగా నీ యాఱు నెలలును వారి కొక్క పగలు.

కుమేరు (దక్షిణ ధ్రువ) వాసులగు అసురులకు రవి పై రీతికి విపరీత ముగా కనిపించును. రవి యిచట తులాదియందు పొడిచి మకరాదికి పగలు సాబాలు గడపి మేషాది కస్తమును పొందును.

ఇక ఉ. ద. ధ్రువముల నడిమి మాట – విషువమున నున్న రవి లంకా యమకోటీ సిద్ధపురీ రోమకముల మీదుగా బోవును. ఈ పత్తనములయందు విషువచ్ఛాయయు, అక్షాంశయు సున్న. లంబాంశములు 90°. మేరువునం దక్షాంశ ములు 90°. లంబాంశములు సున్న. యమకోటిలో మట్ట మధ్యాహ్న మప్డుడు లంకలో ఉదయము, రోమకమున అద్దమరేయి, సిద్ధపురిలో అస్తమయము[3] (సూర్య సిద్ధాంతము).

వృద్ధ వసిష్ఠ సిద్ధాంతమునందు వర్గ విభాగ మిటులు :-

భూమధ్య వలయమునకు దక్షిణమున లవణార్ణవము. దుగ్ధ దధి ఘృత ఇక్షు మద్య స్వాదుసముద్రము లొకదానికంటె నొకటి దక్షిణముగా లవణ సము ద్రమునకు దక్షిణమున నున్నవి. ఇవి క్రమ క్రమముగా నొకదానికంటె నొకటి చిన్నవి. లవణాబ్ధికి ఉత్తర తటమున నిరక్ష దేశమున లంకాది పత్తనములు నాలుగు. లవణాబ్ధికి ఉత్తరమున గల భూగోళమున సగము జంబూ ద్వీపము. యామ్యగోళమున లవణాది సముద్రములయందు క్రమముగా శాక శాల్మల కుశ క్రౌంచ గోమేద పుష్కర ద్వీపము లున్నవి.

౧. సౌమ్య భాగమున లంకకు ఉత్తరమున హిమ హేమకూట నిషధ పర్వతములు. లంకా హిమాద్రుల నడుమ భరత వర్షము. హిమ హేమకూట ముల నడుమ కిన్నర వర్షము. హేమకూట నిషధముల నడుమ హరివర్షము.

---

3) పురాణములు సూర్యుని ఉదయాస్తమయములు తెలుపుటకు మేరువుచుట్టును కొన్ని పురములను చెప్పెను. సిద్ధాంతములు నిరక్షరేఖమీద అవి కలవని తెలియజెప్పెను. వాని పేరులు వేఱు.

౨. యమకోటి కుత్తరమున మాల్యవంతము. ఈ రెంటి నడుమ భద్రాశ్వము.

౩. రోమక గంధమాదనముల నడుమ కేతుమాల వర్షము.

౪. సిద్ధపురి కుత్తరమున శృంగవ చ్ఛృక్ష నీల పర్వతములు. సిద్ధపురీ శృంగవత్పర్వతముల నడుమ కురు వర్షము. శృంగ వచ్ఛృక్షముల నడుమ హిరణ్య వర్షము. శుక్ల నీలముల నడుమ రమ్యక వర్షము.



ఇటు లీ నాలుగు పత్తనములనుండి ఉత్తరముగా బోవుదుమేని, నిషధ మాల్యవన్నీల గంధమాదనముల నడుమనున్న ఇలావృత వర్షములో నుందుము. దాని నడుమగా మేరువు పోయెను. ఈ మేరువు జంబూ మధ్యమున తమ్మి నడుమ దుద్దువలె నున్నది.

ఒక దబ్బపండునుగాని, గుమ్మడిపండునుగాని తెచ్చి సమానముగా నాలుగు డిప్పలుగా కోసి మరల వాని నతికించి నట్టనడుమ నొక త్రాడు కట్టి దాని తొడిమకు మఱొక త్రాడు కట్టి, ఆకాశమున నిలువుగా వ్రేలదీసి చూచునది. ఆ నడిమి త్రాడు నిరక్షరేఖ. నాలుగు డిప్పలయు కోత కడ త్రాటిమీద నాలుగు సుద్ద గుఱుతు లుంచునది. నాలుగు తెల్లబొట్లును నాలుగు పత్తనములు. తొడిమ సుమేరువు. అడుగు సొట్ట కుమేరువు. నాలుగు తెలుపు మచ్చలును, తొడిమయు, సొట్టయు నొకదాని కొకటి సమ దూరమున నుండును. ఇపుడు దానిని అడ్డముగా పట్టుకొని ఒక చిన్న దీపము పుచ్చుకొని నట్ట నడి త్రాటి మీదుగా త్రిప్పుచు చూచునది. వెనుక ముందుల డిప్పలలో కొలది కాంతియు, తానున్న డిప్పమీద నిండు కాంతియు, ఆవలి దెస డిప్పమీద చీకటియు నుండును. ఈ రీతి యూహ భూగోళ వర్ణనమునకు బీజము.

ప్రకృత భూగోళమున లంక క్రింద దక్షిణ ధ్రువము వఱకును దేశమే లేదు. (2 వ పటమారయునది).

ఇక తూరుపు దక్షిణముల నడుమ మాత్రము ఆస్ట్రేలియా మొదలగున వున్నవని సరిపెట్టుకొన వలెను. లేదా ఇది పూర్వ కల్పము మాట యనికాని, కలియుగమున దేశ విపర్యయము కలుగును—"కలౌ దేశ విపర్యయః" (చూ. వాయు) అని కాని నిర్ధారించు కొనవలెను. పురాకల్పము లందలి కొన్ని దేశములు మునిగిపోవుట వింతకాదు.




పురాణ భూగోళమే సంహితా భూగోళమని పాఠకులు ఇపుడు నిశ్చయిం చుకొన గలరు,

"భూమి గోళాకారము. మఱియు అది సూర్యుని చుట్టు తిరుగు చున్నది" అని ఆర్యభటుని మతము.

అందఱకును తేలికగా తెలియుటకు పురాణములు దేశ నిరూపణమందు భూమి పద్మాకారమనియు,[4] మండలాకారమనియు,[5] ఛత్రాకారమనియు,[6] వృత్తా కారమనియు,[7] చెప్పెను. అనగా మొత్తము మీద చక్రాకారము. పుష్కరద్వీపము నావల లోకాలోకము. పురాణములు చెప్పుట భూమి చక్రాకారమనుట కనుమాప కము. కావుననే లోకాలోకమునకు "చక్రవాళ" మని పేరు. "వల వల్ల-సంవ రణే సంచరణేచ" భూచక్రమును వలగొన్నది అని నిరుక్తి. కావున బోధ సౌల భ్యము కొఱకు దేశ విషయమున భూమి నడుమ ఉబ్బెత్తై, అంచుల వాల చక్ర మువలెను, కూర్మము వలెను, గొడుగు వలెను ఉన్నదని పురాణములు చెప్పెనన వలయును.

4) 41-86 వాయు. 5) 46-21 వా. 6) 50-51.
7) 46-21 "సర్వేషా ముత్తరే మేయ ర్లోకాలోకస్తు దక్షిణే" (50; 107, 8)

పౌరాణికులు భూవిన్యాస ప్రస్తావమున భూమి ఛత్రాకారమనియు, మండలాకారమనియు, వర్తులమనియు చెప్పిరి. జ్యోతిః ప్రస్తావమున గోళాకారమని చెప్పక చెప్పిరి.[8] భిన్నములయిన ఈ రెండు మతములకును సామరస్య మెటు

8) "భూమి బంతివలె గోళాకారము. అది సూర్యాదులవలెనే ఆకాశములో నున్నది. దాని క్రిందను మీదను ఎల్లెడలను జీవరాశి కలదు. భూమిమీద ఎక్కడ నున్న వారక్కడ తాము భూమి పైభాగమున నున్నామని అనుకొందురు." భూమి సంతతము క్రిందికి పడుచున్నదనియు, నీటిలో నావవలె తేలాడుచున్నదనియు, ఊరక పై కెగురుచున్నదనియు దక్షిణోత్తర ధ్రువములు అను ఇరుసుమీద తిరుగుచున్న'దనియు వాదములుకలవు. కాని భూమి అచలము." అని యోగవాసిష్ఠము. (చూ. నిర్వాణ. విపశ్చిదుపాఖ్యాన 127-131 మొ. సర్గలు).

యోగవాసిష్ఠము భూగోళ ఖగోళములయెడల పూర్తిగా పురాణానుయాయి. సప్తసముద్రావృతములైన శాకాది ద్వీపములను శాకమునందలి ఉదయ పర్వతము మొ. వానిని చెప్పెను.

కాశ్మీరములందు తనకు ప్రసిద్ధిగల్లు ఈ గ్రంథము తానే చెప్పుకొనెను. దీని కర్తృత్వమును గుఱించియు, కాలమును గుఱించియు పలువురకు సందియముకలదు. శంకరులెచ్చటను దీని నుదహరింపలేదు. కాని వారి శిష్యులు బ్రహ్మ సూత్ర వ్యాఖ్యానములో నుదహరించిరి. ప్రామాణ్యము కొఱకునేనిది వ్రాసితిని గాని కాల నిర్ణయమున శంతగా కాదు. ఆర్యభటుడు భూమి తిరుగుచున్నదని సూర్య సిద్ధాంతమున నిర్ణయించెను. ఈ వాదము ఇందు ఖండితము. దానజేసి ఈ గ్రంథరచన ఐదవ శతాబ్దికి పిదపనా అని సంశయము కలుగును. మఱియు "తథాఽఽత్మసిద్ధే ర్మ్లేచ్ఛానాం తద్దేశేషు నదుష్యతి" (నిర్వా. 97-10) అని కలదు. అనగా మ్లేచ్ఛులు వారి చింతాధార ననుసరించి జీవాత్మలను చెప్పిరి. ఆ దేశములందు ఆ సంప్రదాయము పొరపాటు కాదని దీని యర్థము.

"మ్లేచ్ఛులు యవనాదులు. దేహాకారము కల జీవుని ఈశ్వరుడు సృజించునని వారి సంప్రదాయము. చనిపోయిన పిదప జీవుడు పాతిపెట్టిన చోటనే ఉండును. కాలాంతరమున భగవంతుఁడు వారిని పరామృశించి పుణ్యాపాపానురోధముగా శాశ్వత స్వర్గనరకములకు పంపును." అని ఆనందబోధేంద్ర సరస్వతి వ్యాఖ్య. ఈ మూలమును వ్యాఖ్యను జూచి ఇది అర్వాచీన మన జెల్లదు. ఆంగ్ల విమర్శకులచే మనకు దూరదృష్టి తగ్గెను. ఈ గ్రంథకర్తకు పారసీకాది దేశముల ధర్మములతో పరిచితి కలదు. పారసీక స్మృతి గ్రంథమగు "వెందిదాద్ హొరాకాయితి" అంచలమందు ఖననమును, చఖ అంచలమందు దహనమును మహాపాపమని చెప్పుచున్నది. కావున ఈ గ్రంథకర్త వారి ఆచారమును గాని, భారత ప్రత్యంత దేశమందలి ఆచారములను గాని తడివి యుండవచ్చును. మఱియు జ్యోతిర్విశేషములలో ఇతడు విశిష్టుఁడు. మూడువేల యేండ్లకు ఇంకను వెనుకటి జ్యోతిర్విషయముల నితడు వ్రాసెను.

లోనగూడెనో తెలిసి కొనుటకు కుతూహలము కలుగును గావున ఆ విషయ మిచట కొంచెముగా తెలిసికొందము.

ధ్రువము క్రింది భూమికి మేరువని పేరు. అది భూమికి నాభి. తొల్లిభూవి భాగమున పద్మకర్ణిలకు నాలుగు దెసలను నాలుగు రేకులవలె ఈ నాభికి నాలుగు దెసలను నాలుగు దీవులు. ప్రాచీన ఋషులు మేరువు మీద పద్మయోని నివాసమును కల్పన చేసిరి. అనగా మేరువు ఖస్వస్తికమున సత్యలోకము కలదని తాత్పర్యము. దీనికి కారణము వారు మేరు గిరిజాలము చుట్టును నివసించిరి. వారు చెప్పిన విషయములు చాలవట్టు వారి స్వదేశము నందలివే. కాలాంతరమున పద్మ చతుర్దళములలో దక్షిణోత్తర దళములయందు వర్షములు, మనుష్య నివాసము- ఇవి వారు చూచినవి.

ఆ సమయమున సుమేరువు స్వస్థానచ్యుతము కాలేదు. నానా దేశములు తిరుగుటలో సూర్యచంద్రాదుల గమనమునందు విశేషము వారికి కనుపట్టెను. వారే దేశము మెట్టినను వారికా దేశమంతయు చక్రాకారమే. కాని సూర్య చంద్రులయు, నక్షత్రములయు మార్గ మొక రీతిగా నుండదు. ఒక దేశమున ఒక రీతిగను, వేఱొక దేశమున మఱియొక రీతిగను కనబడును. ఉదయాచలమని ఒకటియు, అస్తాచలమని మఱియొకటియు నుండదు. పర్వతము లెక్కువగా నున్న దేశమునందు భూపృష్ఠము గోళాకారముగా నుండునని ఊహింప వలను కాదు కాని సూర్య చంద్ర నక్షత్ర గమనమును లెస్సగా పరిశీలించినచో నపుడు భూమి గోళాకారమని ఒప్పుకొని తీరవలసి వచ్చును. వారపుడు భూమి బల్లపఱుపుగ లేదనియు, గోళాకారముగా నుండవలయు ననియు నిర్ణయించిరి. 'సూర్యునికి ఉదయమును లేదు. అస్త మంతకంటె లేదు. కంటికి కానబడుటయే ఉదయము. కానబడక పోవుటయే అస్తము. ఐతరేయ బ్రాహ్మణమున (3-44) ఇట్టి మాట కలదు. దీని ననుసరించియో, లేక స్వయముగా నెఱిగియో వాయు విష్ణు మత్స్యములు' ఎప్పుడును ఉన్నవానికి ఉదయాస్తమయము లేమి ? సూర్యుని దర్శనాదర్శనములే ఉదయాస్తమయము"[9] అని చెప్పెను.

---

9) నైవాస్తమన మర్కస్య నోదయ స్సర్వదా సతః
ఉదయాస్త మనాఖ్యం హి దర్శనా దర్శనం రవేః (వి. ౨-౮-౧౬,౧౭)

భూమి గోళాకారమగునెడల, సూర్యుడు రేయుంబవలు భూమిని ప్రదక్షిణించునెడల గమనవృత్తపు నాభి, లేక కేంద్ర మెచట ? 'భూమికి సర్వోత్తరమున' అని అపుడు చెప్పవలసి వచ్చెను. అదియే ధ్రువక్షితి. ఉత్తర బిందువు. మేరువు. ఇది జ్యౌతిషికులయు, వేదములయు, పురాణములయు మాట. ప్రాణత్రాతుడు చూచిన చందముగా, చూడక, అనుమాన ప్రమాణము చేతనే ఈ విషయము సాధిత మయినదని అనుకొన్నను, చూచిన విషయమును చెప్పుచో ఎటులు చెప్పుదురో ఈ యనుమానము కూడ అటులే చెప్పించెను. కాగా భూగోళోత్తర ప్రదేశము మేరువు. కాగా భూవిన్యాస ప్రకరణమున భూమి చక్రాకారమనియు, జ్యోతిః ప్రకరణమున గోళాకారమనియు, వారు పామరుల సౌలభ్యమునకు రెండు విధములుగా వ్యవహరించిరి. ఈ రెండు సంగతులును వారెచటను వాచ్యము చేయలేదు. ఈ సంగతి బాగుగా మనస్సునకు పట్టించుకొనక కొందరు పెద్దల పురాణములు భూమిని దర్పణనిభముగా జెప్పెనని[10] ఖండించిరి. వారే ఖండింపగా ఇక ఖండింపని వారెవరు ? నేడు బడిలో నాలుగవ తరగతి చదువు బాలుడు కూడ బాదరాయణుని మీద బార సాచువాడే.

రేయి నక్షత్రము లన్నియు తూర్పున పొడిచి పడమటగా అస్తంగతములగును గాని ఒక నక్షత్రమటులు కాదు. దాని పేరు శింశుమారము. మఱియు నొకటి. శింశుమార. ముఖమున ఒక నక్షత్రము కలదు. అది కొంచె మేని కలదు. అది నియతముగా ఒక చోటనే ఉండును. కావుననే దానికి ధ్రువము అను సంజ్ఞ. దీనికి ఖాల్దియా దేశమున ధ్రుబన్ అని పేరు. నక్షత్రములును, చంద్రుడును దీని చుట్టును తిరుగుచుందురు. ధ్రువము ఎత్తుగా ఆకాశమున పాతిన కట్టుకొయ్యవలె నుండును. అది గ్రహ నక్షత్రములకు పగ్గము కట్టి త్రిప్పుచున్నటులుండును. సూర్యుడు దానిని ప్రదక్షిణించుచుండును. ఇది క్రీ. పె. సుమారు మూడువేల యేండ్ల క్రిందటి మాట. అపుడు, లేక అప్పటికి ముందు సూర్య

---

10) పుష్కర ద్వీపమున కావల దర్పణ నిభమగు భూమి కలదు. కురు ద్వీపమున కలదు. అనియే కానిపించును గాని భూమి యెల్లయు దర్పణ నిభమని కాని, బల్లపఱుపనిగాని నాకు వా. వి. మ. ప. బ్ర. మా. పురాణములలో కానరాలేదు. ఎవరేని చూచుచో సూచ్యటింతురు గాక.

చంద్రాదుల దైనిక గమనము తెలిసికొన వలయునను కోరిక ఉదయించి యుండ వచ్చును.

మిగుల ఎత్తగు ఆకసమున ధ్రువము. నేలమీద సూటిగా దాని క్రింద మేరువు. దీనిని గూడ నొక పెద్ద కొండయని కల్పన చేయనిచో కట్టుకొయ్య దొరకదు. నేల నడుమ నుండి సూర్యుడు లక్ష యోజనముల ఎత్తు. కట్టుకొయ్యయు అన్ని యోజనముల ఎత్తు అని కల్పన చేయవలెను. భూగోళ వ్యాసము ముప్పది రెండువేల యోజనములు. మేరువు పాతునేలలో పదునాఱువేల యోజనములు. భూమిపై 84 వేల యోజనములు.



జైను లీ లెక్కను తగ్గించి చెప్పిరి. మేరువు వేయి యోజనములు నేలలో పూడియున్నదని వారి అంచనా.

శింశుమారమున కెదురుగ నున్న ఈ నక్షత్రము నాలుగయిదువందల ఏండ్ల వఱకును ధ్రువముగనే యుండెను. అప్పుడు ధ్రువదర్శనము కానిచో వివాహము పూర్ణాంగ మాయెడిది కాదు. ధ్రువు డెటు లచలుడో నవదంపతుల ప్రేమయు అటులు అచలముగా ఉండవలయు ననుభావము నుప్పతిల్ల జేయుటకై అపుడు ధ్రువదర్శనము చేయించుచుండెడివారు. ఇటులు కొంతకాలము కడచిన తరువాత ఆ ఖగోళ పరిశీలకులకు ఆ కాలమున తెలియరాని కారణములచే శింశుమారము కడ నున్న నక్షత్రము లన్నిటితోపాటు ఈ ధ్రువుడును కదలు చున్నటులు[11] కానబడెను. అపుడు పెండ్లిండ్లలో అరుంధతీ వశిష్ఠులను చూపు ఆచారము మొదలాయెను. కాని ధ్రువమున నున్న గృహ నక్షత్ర రస్మలు వెనుకటి వలెనే యుండెను. కావున కట్టుకొయ్యకు బదులుగా ఇపుడు పోలికకు నూనె గానుగును, దానిపై కఱ్ఱయు[12] వచ్చెను.

11) ధ్రువుడు కదలడు. మిగిలిన చుక్కలన్నియు కదలును. మాబోటి యోగుల కిది ప్రత్యక్షము అని యోగ వాసిష్ఠము వసిష్ఠుని నోటితో ననెను. (చూ. 127, 128 వ అధ్యా. 1వ శ్లోకము.)

వాయు పురాణమునకు ధ్రువునకు భ్రమణము చెప్పెను. "-భ్రమద్ భ్రామయతే-" కావున ధ్రువ భ్రమణ మెఱుగని కాలమున వాసిష్ఠ రచన అవి అననగును గాని ఒక తంటా ఉన్నది. యోగదృష్టితో పని లేకయే మాంస చక్షుస్సులకే ధ్రువము కదలునటులు కనబడును. యోగదృష్టికే కదలునటులు కనబడవలయును.

12) "తైల పీడాకరం చక్రం భ్రమ ద్భ్రామయతే యథా
తథా భ్రమంతి జ్యోతీం షి వాత బద్ధాని సర్వశః" (వా. 52-88)

ఈ క్రింది చిత్రము చూచునది :-



మేరువు ఇచట దార్ష్టాంతికము. నేలలో పాతిన చింతమాను దృష్టాంతము. మేరు శిఖరాదికము. దార్ ష్టాంతికము. గానుగులో తిరిగెడి కఱ్ఱ దృష్టాంతము. ఆకాశమునందలి ధ్రువము, గానుగులోని పొడగు కఱ్ఱ అగ్ర బిందువు. ప్రవహనామకమగు వాతరశ్మి పగ్గము. కఱ్ఱ చివఱ నుండి ఒక పగ్గము వ్రేలాడు చుండును. ఎద్దు ఆ త్రాటితో చక్రాకారముగా తిరుగును.

వాయు మత్స్య విష్ణు పురాణములు కుమ్మరి సారెను పోలికగా చెప్పెను. భాగవతము విష్ణు పురాణమునకు వివరణమే కావున దానినే వెతుక బని లేదు.

పురాణ శేషకాలమున శింశుమారము తోక చివర నున్న నక్షత్రము ధ్రువమాయెను. ఈ నక్షత్ర మిపుడు ధ్రువమను తలపునకు గుఱియగు చుక్కకు దాపుగా వచ్చును.

ఇపుడు పురాణము రచియింపబడె నేని గానుగతో పోలిక చూప బని యుండదు. వరి కళ్లము నడుమ పాతిన కట్టుకొయ్యను ఉపమించిన సరిపోవును.

జైను లీ గానుగ కఱ్ఱ పోలిక చెప్పిరి. కాని అది క్రింద లావు. చివర సన్నము.




పైభూగోళ వర్ణనమెల్లయు ముఖ్యముగా వాయు విష్ణు మత్స్య పురాణముల లోనిది. ఈ పురాణముల కాలమును మనము నిర్ణయించుకొనగలిగినచో ఈ భువన విన్యాస మెంత ప్రాచీనమో మనకు వెన వెన కనబడును.

ఈ పురాణముల కాలమును కనుగొనుటకు వీనియందే స్ఫుటమయిన సాక్ష్యము కలదు. ఈ సాక్ష్యము రెండు రకములు. ఒకటి-రాజులు మొదలగువారు; రెండు- అయనాది కాలము. పై వ్యాసములో వానిని పరిశీలింతము.

# ప్రా చీ న భూ గో ళ ము

పురాణములు పదునెనిమిదని ప్రసిద్ధి.[1] ప్రతి పురాణమునందును పురాణముల పట్టిక కలదు. కొన్ని పురాణములలో కొన్నిటి పేరు కలదు, కొన్నిటి పేరు లేదు. కొన్నింట వాయు పురాణము పేరు లేదు.[2] శివ పురాణములో వాయవీయ సంహిత కలదు. మత్స్య నారదీయములలోని పురాణ పట్టికలో వాయవీయసంహిత యున్నది. కలకత్తా, కాశీ, బొంబాయి శివ పురాణములకు పురాణ లక్షణము సమగ్రము కాదు. కొందరు దీని నుపపురాణ మందురు.[3] వాయు పురాణము శైవము కావున శివపురాణమునందలి వాయవీయ సంహిత వాయు పురాణమునకు బీజమని కొందఱును, వాయు సంహితకే వాయు పురాణ మాకరమని కొందఱు వ్రాసిరి.

ముద్రితమగు వాయు పురాణమున గుప్తవంశము వఱకును రాజుల వర్ణనము కలదు. వ్రాతప్రతులయంచు ఎందునులేదు. ఈ కారణమున వాయు పురాణమంతయు నాధునిక మనరాదు. కొంద ఱాంగ్ల విమర్శకులు అట్లనిరి.

---

1) మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం
అ, నా, వ, లింగ, కూ, స్కా_ని........

2) కాశీ కలకత్తా బొంబాయి పూనాలలో అచ్చయిన నాగర లిపి పురాణములలో పరస్పర భేదములు కలవు. చెన్న పట్టణము మొదలగు చోట్ల అచ్చయిన తెలుగు లిపి పురాణములకును వానికిని భేదము కలదు. ఈ భేదములు స్వల్పములు. కొన్ని ముద్రణములలో కొన్ని శ్లోకములును కొన్ని భాగములును లేవు. ఇట్టి వానిని ప్రక్షిప్తములని ఊహించవచ్చును. కాని ఈ భేదములకు కారణాంతరములు ఏమేని ఉన్నవో లేవో నిర్ధరింపనిదే ప్రక్షిప్త కోటిలో వీనిని పడవేయరాదు. శ్రీ ముదిగొండ వీరయ్య శాస్త్రిగారు (సికిందరాబాదు, దక్కన్) మొన్న మొన్న ఈ శివ పురాణమును మనోహరముగా తెలిగించిరి. వీరు కాశీ బొంబాయి ప్రతులు ఎఱుగుదురు. చూ. వారి పీఠిక. వారిది బొంబాయి ప్రతికి అనుసరణము. వారు వాయవీయ.

3) చూ. దేవీ భాగవత.

ప్రాత దేవళమును బాగుచేసి దాని ముందొక మండపమును, ప్రక్కనొక మట్టు పల్లిని కట్టించినంతమాత్రమున దానిని నూతనక్షేత్రముగా భావించువారుందురా ?

## బ్రహ్మవిద్య - కూసువిద్య :

సూక్ష్మముగా పరిశీలించినచో సంహితాబ్రాహ్మణాను గతములును, భగ వద్ బోధకములును జ్యోతిస్సంహితా ప్రతిపాదితములు నగు రహస్యము లిందు కనబడును. "రహస్యము లనినంతనే ఎవరికిని చెప్పదగనివి కాబోలు, అట్టి వున్న నేమి లేకున్న నేమి ?" అని పలువు రనుకొనుట వినుచున్నాము. అది లెస్సకాదు. జ్ఞానులందఱును "ముందు నీ మనమును కనుగొనుము, పిదప నిన్ను కను గొనుము" అని చెప్పుదురు. మనకు మనసే దొరకదాయె. ఇక 'నేను' దొరకు టెచట ? ఇట్టివే రహస్యము లన్నియు. మన అధికారమునకు మించినది రహ స్యము. మనకు తెలియనిది బ్రహ్మవిద్య, తెలిసినది కూసు విద్య.

## గాలి పురాణము :

చాలకాలము నాటి తత్త్వవేత్తలయు, పండితులయు పామరులయు ఎఱుక లోనున్న విషయముల విత్తనములు ఈ మూడు పురాణములందును గలవు. ఇందలి సంగీత శాస్త్ర బీజములు హరివంశమున చిగురు పెట్టెను. ఇందలి ప్రతి మాలక్షణము మత్స్య, విష్ణు పురాణములలో స్ఫుటమాయెను. ఈ రీతిగా వ్రాయుచు బోయినచో నది ఒక గ్రంథ మగును. ఈ పురాణము నర్మద కుత్త రమున మాలవ దేశమున ప్రసిద్ధమయి యుండవచ్చునని ఔత్తరేయులు వ్రాసిరి. దీనికి జన్మస్థలము గురువాయూర్, అనగా గురువాయు పురమని దాక్షిణాత్యులు. కాని రత్నావతి యను మారుపేరు గల దృషద్వతీ తీరమున గల వాయుపురము. దీనికి అభిజన దేశమని వాయు 59. అధ్యా.[4] వాయు పురాణము గాలి మాటల

4) బాణుడు విద్య ముగించుకొని తన గ్రామమునకు వచ్చినపుడు వాయు పురాణ శ్రవణము జరుగుచున్నది. చూ. హర్షచరిత.

పోగు అని కొందఱందురు. శబ్ద బ్రహ్మమునకు వాయువు వాహకమని అభిజ్ఞులు.

మత్స్య పురాణము :

ఇదియు శైవము. మన కిపుడు కనబడు వా. వి. మ. పురాణములకు మాతృక ఏదో ఉండవలయునను ఊహ కాధారములు కలవనుమాట పాఠకులకు గురుతుండుట మేలు. వాయు పురాణమున వ్రతాదికములు తక్కువ. దీన నెక్కువ. చైత్రామావాస్యనాడు పార్వతి కుక్షిని ఛేదించుకొని షడననుడు పుట్టెనని యిందు కలదు. భారతమున "కార్తికామావాస్యనాడు, లేక అగ్రహాయణ శుద్ధ ప్రతిపత్తునాడు శరవణమున కుమారోత్పత్తి" యని కలదు. ద్వీప సన్నివేశ విషయమున మత్స్య భారతము లొకటి.

కాళిదాసునకు కుమారసంభవ కావ్య రచనలో శివపురాణముతో పాటు ఇందలి కుమారకథ కూడ అలతి ఆధారము.

ఇందలి శ్రాద్ధకల్పము ప్రాచీనము. శ్రాద్ధమునకు ద్రవిడులును, కోకసులును (అనగా కొంకణులు) నిషిద్ధులు. ఇందుత్తర దేశములయందు లేని దేవాలయ గోపురములయు, దేవదాసికలయు ప్రసంగ మున్నది. ఇందు ఐదు విష్ణ్వవతారముల ప్రశంస కలదు. ఇందధునాతనములగు విషయము లెన్ని ఎపుడు చేరెనో వేర్పఱుప నరిది. కాని క్రీస్తుశక మాఱవ శతాబ్దిలో ప్రక్షిప్త ప్రవేశమునకు భరతవాక్యము అని ఊహింప నగును. ఎటులనిన క్రీ. శ. ఆఱవ శతాబ్దిని పుట్టినదని పలువురు విమర్శకు లొప్పుకొనిన నారదీయమునందు మత్స్యము నందలి భవిష్యద్రాజ సూచిక కలదు. 'మత్స్యము నారద పురాణము నుదహ

5) మత్స్య పురాణమను పేరితో హరి భట్టారకుడు దీనిని తెలిగించెను. కవిత అను పత్రికలో విష్ణు ధర్మోత్తరము 1912 సాలున అచ్చయినది. అది మత్స్య పురాణము కాదు. దీని గద్యలో మత్స్య పురాణ ఖండమగు విష్ణు ధర్మోత్తరమని కలదు. హరి భట్టారకునకు దొరికిన ప్రతిలో నటు లుండియుండును. దీనివలనను వా. వి. మ. పురాణముల ఐక్యము కన నగును. మత్స్య పురాణమున నెర నడుగగా అచ్చముగానే. దీనిని నాకొసగిన విద్వత్కవులు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి కృతజ్ఞుడను.

రించెనే?" అని ఏరే నడుగుదురు. అది బృహత్కల్పము నందలి నారద పురాణము. అనగా అది మూల నారద పురాణము కావలయు. "యత్రాహ నారదో ధర్మాన్ బృహత్కల్పాశ్రయాణి చ" (మ. 53 అధ్యా). దీన భవిష్యద్రాజ వంశము కలదు. ఎవరో ఇటీవలి పురాణములలోనో, ప్రాచీన పంచాంగములలోనో ఉన్న గుప్తవంశమును చేర్చి ముద్రించియుందురని చాలమంది అభిప్రాయము. ఒడ్డె దేశమునందును, వంగదేశమునందును పంచాంగకర్తల కీ రాజవంశమును జేర్చు నాచారము నూఱేండ్ల క్రిందటి పఱకును కలదు.

## విష్ణు పురాణము :

ఇది వైష్ణవము. ఇందు ఆఱంశములు కలవు. మొదటి నాలు గంశములు వాయు పురాణమునకు సంగ్రహము. వాయు పురాణ శైలి వదులు వదులుగా నుండును. విష్ణు పురాణమునం దా శ్లోకములే రూపాంతరము నొందెను. ఇది కావ్యము వలెను, తత్త్వముపట్ల ఉపనిషత్తువలెను ఉండును. ఈ పురాణమునందు వ్రతాదులు లేవు. ఇందలి ఐదవ అంశము శ్రీకృష్ణుని బాల్యలీల. ఇక ఆఱవ అంశమున ఆఱే అధ్యాయములు.

అసలు మొదట నాలు గంశములే కలవని తోచును. ఐదు, ఆఱు అంశములు పదపటి చేర్పు. నారద మతమున విష్ణు పురాణోత్తరభాగము పేరు విష్ణు ధర్మోత్తరము. దీనియందును భవిష్యద్రాజవంశము కలదు.

విష్ణు పురాణము భాగవతమునకు మూలమని చెప్పవచ్చును. విశిష్టాద్వైత స్థాపనాచార్యులు రామానుజాచార్యుల వారి శ్రీభాష్యమున ఎచట చూచినను విష్ణు పురాణమే.

## శింశు మారము :

తైత్తిరీయారణ్యకము(2 ప్ర. 19 అ) శింశుమారపు మీదలను ధ్రువుగను, క్రీడలను ధర్మునిగను, మీ జెక్కిలిని బ్రహ్మగను, క్రీజెక్కిలిని యజ్ఞముగను, హృదయమును విష్ణువుగను, ప్రజననమును సంవత్సరముగను, ముందు కాళ్ల నశ్వినులుగను, నడుము అత్రిగను, వెనుక కాళ్లు మిత్రావరుణులుగను, తోక

మొదటి భాగమున అగ్నిని, రెండవ భాగమున ఇంద్రుని, మూడవ భాగమున ప్రజాపతిని, నాలుగవ భాగమున అభయమగు బ్రహ్మమును భావన చేయుచున్నది.[6]

## నక్షత్ర ప్రజాపతి :

తైత్తిరీయ బ్రాహ్మణము (1 కాం, 5 ప్ర, 2 అ) నక్షత్ర ప్రజాపతికి హస్తయే హస్తము. చిత్ర తల, స్వాతి హృదయము విశాఖ తొడలు, కాళ్లు అనూరాధ అని భావించుచున్నది.

వాయు మత్స్య విష్ణు భాగవతము లీ కల్పనలను కొంచె కొంచెముగా మార్చి విపులము చేసెను.

వాయు మత్స్యములు 'మీ జెక్కిలి ఉత్తానపాదుడు, వెను పిక్కలు మిత్రావరుణులు, అపానము మిత్రుడు, ప్రజాపతి ప్రజాపతి' అని చెప్పి, తోక మీద 1 అగ్ని, 2 ఇంద్ర, 3 మరీచి, 4 కశ్యప, 5 ధ్రువులను చూపి "ఈ నలుగురును ఎపుడును అస్తమింపరు" అని వర్ణించుచున్నది. (వా. 52-92-5 మ. 127-21-4). ఇందలి మరీచి సంస్కర్తల చేరుపేమో! మరీచితో ఐదుగు రగుదురు కాని నలుగురు కారు కదా! ఇంతియకాక విష్ణు పురాణము మరీచిని చెప్పలేదు. మిగిలిన వాని నన్నిటిని జెప్పెను. (2-12-31, 4).

---

6) "భూః ప్రపద్యే భువః ప్రపద్యే స్వః ప్రపద్యే భూర్భువః సః ప్రపద్యే బ్రహ్మకోశం ప్రపద్యేఽమృతం ప్రపద్యేఽమృతకోశం ప్రపద్యే చతుర్జాలం బ్రహ్మకోశం యం మృత్యు ర్నా వపశ్యతి తం ప్రపద్యే దేవాన్ ప్రపద్యే దేవపురం ప్రపద్యే పరీవృతో పరీవృతో బ్రహ్మణా వర్మణాఽహం తేజసా కశ్యపస్య. యస్మై నమస్తచ్ఛిరో ధర్మో మూర్ధానం బ్రహ్మోత్తరా హనుర్యజ్ఞో ధరా విష్ణుర్హృదయం సంవత్సరః ప్రజనన మశ్వినౌ పూర్వపాదా వత్రిర్మధ్యం మిత్రావరుణా వనరపాదా వగ్నిః పుచ్ఛస్య ప్రథమం కాండం తత ఇంద్రస్తతః ప్రజాపతి రభయం చతుర్థమ్ - సవా ఏష దివ్యః శాక్వరః శింశుమారం స్తంహ"- మొదటి వాక్యమునందలి 'చతుర్జాలం' గమనింపదగినది. తోకమీది నాలుగు నక్షత్రములును, అవ్వ ష్టుమము మొదలగు నాలుగు కోశములు అని రూపకము. ఈ భావనను అన్ని పురాణము లును వదలి సమగ్ర భావమునే వివరింప దొరకొనెను.

భాగవతము విష్ణు ప్రోక్తమును, బ్రాహ్మణారణ్యక ప్రారబ్ధము నగు శాక్వరమును దివ్యము నగు నీ శింశుమారమునే తీసికొని ఆకాశమునందలి మేలి చుక్కల నన్నిటి నందు జొనిపి భగవదాకారభావన చేసెను.

## చుక్కల అస్తమయము :

పై ఆరణ్యకమున శింశుమారపు తోకమీద గల చుక్కల అస్తమయపు మాట లేదు. కాని శింశుమారమును "ధ్రువస్త్వమసి, ధ్రువస్య క్షితిమసి" అని అనుచున్నది.

ఈ చుక్కలు మేరు ప్రాంతమున అస్తమింపవు. మఱియు మథురా ప్రాంతమునను అస్తమింపవు. మేరుప్రాంతమున నివాస మసంభవమై చాల కాలమాయెను. కావున మథురాప్రాంతములం దీ పురాణత్రయ రచన మయి యుండవచ్చును.

## మనుతార :

కొంద ఱీ నాలుగు చుక్కలలో నొక చుక్క "మనుతార" అని అందురు. మనుతార క్రీ.శ. మొదటి మేరువునకు 16° అంశల దవ్వున నుండెను. ఆంగ్ల తారాపటమున మనుతార "Alpha Draconis".

## పురాణత్రయ శ్రవణము :

వాయు పురాణమున-

నృపతిసత్తముడు విక్రాంతుడు అనుపమతేజుడు. అధిసీమ కృష్ణుడు ధర్మము ననుసరించి పుడమి యేలుచుండగా నైమిశారణ్యమున ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమునందు దృషద్వతీ నదీతీరమున అరజస్కులును, శాంతులును, దాంతులును, సంశితాత్ములును, సత్యవ్రతులు నగు ఋషులు శాస్త్రానుసారముగా దీక్షితులై ఒక దీర్ఘ సత్రమును మొదలిడిరి. అపుడు పౌరాణికోత్తముడును, సూతకులజాతుడు నగు లోమహర్షణుడు వారలు జూచుట కచటికి వచ్చెను. అతని పలుకులవలన వినువారికి పులకలెత్తెడివట. అతడు వేదవ్యాసులవారి

శిష్యుడు. చాల మేధావి. త్రిలోక విశ్రుతుడు. అతనిలో ఐదవ వేదము మాత్రీ భవించెను. అపు డా సత్రమున గృహపతి ఋషుల కుతూహల మెఱిగి "సూతా! నీ వితిహాసములయు, పురాణములయు గుఱించి వ్యాసు నుపాసించితివి. ఇచట నున్న ఋషులందఱును పురాణము వినగోరుచున్నారు. వీరు నానా గోత్రముల వారు. వీరందఱును నీ వలన తమ తమ పెద్దల వంశవృత్తాంత మెరుగుదురు గాక. మే మీ యజ్ఞారంభమునకు మున్నే నిన్ను తలపెట్టితిమి." అని అడిగినట్లు కలదు. ఈ అధిసీమ కృష్ణునకే "అధిసోమకృష్ణ"డని పాఠాంతరము.

మఱియు తొంబది తొమ్మిదవ అధ్యాయమున-

"ఇపుడు ధర్మాత్ముడును, మహాయశస్కుడు నగు అధిసీమకృష్ణుని ఏలుబడిలో దృషద్వతీ తీరమున దుశ్చరమగు దీర్ఘ సత్రము మొదలిడి రెండేండ్లు దాటెను... పౌరవుడగు అధిసీమకృష్ణు డిపుడు ఏడు." అని కలదు.

విష్ణు మత్స్యములందును ఈ అధిసీమకృష్ణుని మాట కలదు.

## అధిసీమ కృష్ణుడు :

ఈ క్రొత్త కృష్ణుడెవడు ?

పరీక్షిత్తు కొడుకు జనమేజయుడు. వాని కొడుకు శతానీకుడు. వాని కొడుకు అశ్వమేధదత్తుడు. వాని కొడుకు అధిసీమకృష్ణుడు. కాగా ఇతడు పరీక్షిత్తునకు నాలవవాడు. కురు సంగ్రామ సంవత్సరమున పరీక్షిజ్జననము. కావున పరీక్షిత్తునకు సుమారు నూఱేండ్ల పిదప ఈ వాయు పురాణ శ్రవణము. మఱియు కొంత రచనము. పురాణము లన్నియు పూర్వకాలమున నెప్పుడో ఒక్కసారి ఆవిర్భవించెనని అనుకొనువారు పరీక్షిత్కాలమున గూడ పురాణ రచనము కలదని వినుచో వింత పోవుదురు. విష్ణు పురాణము పరీక్షిత్పర్యంతము చెప్పికొని వచ్చి "ఇల్లిత డిపుడు భూమండలము నఖండాయతి ధర్మముగా ఏలు చున్నాడు"[7] అని చెప్పెను. వాయు మత్స్యములు రెండును అధిసీమకృష్ణుని పిమ్మట రాజవంశమును, విష్ణు పురాణము పరీక్షిదనంతర రాజవంశమును

7) 4-1-53. గోరఖ్‌పూర్ ప్రతి.

వర్ణించెను. మత్స్య పురాణమున శౌనకుడు శతానీకునకు యయాతి చరితము చెప్పెనని కలదు. విష్ణు పురాణమున—

"ఎవడిపుడు ఱేడో, అతనికి నలుగురు కొడుకులు పుట్టగలరు. పెద్దవాడు జనమేజయుడు. వాని కొడుకు శతానీకుడు. వాని కొడుకు అశ్వమేధదత్తుడు. వాని కొడుకు అధిసీమకృష్ణుడు" అని కలదు. కావున పరీక్షిత్కాలమున విష్ణు భాగవత పురాణములును, జనమేజయుని కాలమున భారతేతిహాసమును, శతానీకుని కాలమున మూలపురాణమునందు కొన్ని అంశములును, అధిసీమ కృష్ణుని కాలమున వాయు పురాణమును, తదనంతరమున మత్స్యపురాణమును వివృతములయి యుండును.

పురాణ వక్తలు :

"వేదవ్యాసులు వేదములను విభజింపదలపెట్టి పైల, వైశంపాయన, జైమిని, సుమంతులు అను నలువురను వేదపారగులను శ్రావకులనుగా జేసెను. పిదప నతడు సూతకులమున బొడమిన లోమహర్షణునకు ఇతిహాసములను, పురాణములను చెప్పెను"[3] అని విష్ణు పురాణము.

ఈ ఐదుగురు శిష్యులకును పలువురు శిష్యులు కలరు. లోమహర్షణునకు ఆఱుగురు శిష్యులు. వారిలో మూగురు గురువు చెప్పిన సంహిత నవలంబించి మూడు సంహితలను జేసిరి. ఈ రీతిగా గురువుగారి దొకటియు, శిష్యులవి మూడును గలిపి నాలుగు సంహితలాయెను. ఈ నాలుగు సంహితల సారమే విష్ణు పురాణము.[9] వేదవ్యాసులు భారతసంహితను, పురాణ సంహితలను జెప్పిరి. వారు చెప్పిన సంహిత లిపుడు దొరకు నుపాయములేదు. కాని వారి పురాణ సంహితలకు మూలగ్రంథకర్త ఒకడే యగుటవల్లను, లేక పలువురయినను వారి గ్రంథములకు మూలము వేదమును, గురుసంప్రదాయమును, జనశ్రుతియు ఒకటే యగుటవల్లను భారతమునందును మిగిలిన పురాణములందును భేదము కంటె ఐక్యమే ఎక్కువ కాననగును. పరివర్థితము లయిన వాని యందును. ఈ యైక్యము చెడలేదు. బ్రహ్మసృష్టియు, ఋషివంశమును, రాజవంశమును,

8) 3-6-17, 9) 3-6-18.

భూవిన్యాస వర్ణనమును, జ్యోతిశ్చక్ర వర్ణనమును, మన్వంతర వర్ణనమును, సబ్బండు యుగముల వర్ణనమును ఇంకను చాల విషయములు వాయు విష్ణు మత్స్య పురాణములయందు అవికలముగా ఒకటి. ఈ మూటను ఈ ఐక్యము లేనిచో ఈ మూటికిని మూల మొకటియేయని అనుమించుటకు వీలులేదు. వెను కటిమాట యేమోయని అనుకొన్నను అథమము ఈ విషయములు వేదవ్యాసుల నాటి నుండియైనను సమానముగా వచ్చుచున్నవి.

పురాణముల మూలము :

వేదవ్యాసులవారికి ఇన్ని పురాణములు చెప్పుట కుపకరణ మెచటిది ? పురాణ కథ లల్పములు కావు. అల్పకాలమునకు సంబంధించినవియు కావు. అనినచో దీనికి ప్రత్యుత్తరము పురాణములందే కలదు. వ్యాసు డొకడు కాడు. వ్యాస నామ మొక ఉపాధి. అనగా పురాణకర్తలందఱకును వేఱు వేఱు పేరు లున్నవి. నేడు పండితులు రామశాస్త్రి, సోమశాస్త్రి[10]యని వ్యవహరించుకొను చున్నటులు నాడు పురాణకర్తలకు 'జయవ్యాస' 'శక్తివ్యాస' 'కృష్ణ ద్వైపా యన వ్యాస' - ఈ రీతిగా వ్యవహార ముండెడిది. ఆ యాయా యుగములం దాయాయావ్యాసులు పుట్టిరి. వారు వేద సంహితలను, పురాణ సంహితలను జేసిరి. గత వ్యాసుడు కృష్ణ ద్వైపాయనుడు. ఇతని తరువాత ఇంతవాడు మఱి ఇప్పటికి పుట్టలేదు. పుట్టబోవు ద్రౌణి వ్యాసుల సంగతి మనము చెప్పజాలము. ద్వైపాయనవ్యాసుడు పూర్వ సంహితలను గురువుల కడ నోట జెప్పుకొను గాక, లేక వ్రాసిన వానిని పఠించుగాక. సంపూర్ణముగా గ్రహించి వానిని వ్యాస పఱచెను. వ్యాస మనగా విపులము, లేక విభజనము. సమాస మనగా సంగ్ర హము. సరియ. ఇతనికి మూల మెచట ? విష్ణు పురాణమున– "దీనికి వక్త పరాశరుడు, శ్రోత మైత్రేయుడు" అని కలదు. పరాశరుడు ద్వైపాయనుని తండ్రి. మైత్రేయుడు పరాశరుని శిష్యుడు. మఱియు నొకచోట ఆ విష్ణు పురా ణమునందే వసిష్ఠుని కడ పరాశరుడు వినినటులు కలదు. కావున పురాణములు పరాశరుని కడకును, అతని ముత్తాత వసిష్ఠుని కడకును వేళ్లు పెట్టెను.[11] విద్యా

10) ఈ సమాసము దుష్టమని 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అను సూత్రముమీది మహా భాష్యోద్యోతమున నాగేశుడు. విశేష్య విశేషణభావము తాఱుమాఱగుట దీనికి బీజము.

11) వసిష్ఠసుతుడు పరాశరుడని నిరుక్తము.

వంశమున వసిష్ఠునకు కృష్ణ ద్వైపాయను డిరువది యొకటవవాడు. (చూ. వాయు. 103-53, 66). దీనిబట్టి చూడ ఆ వసిష్ఠుడు పరాశరునకు తాతగాని, ముత్తాతగాని కాడు. అది యటుండె. ఆ వంశమున పుత్ర పౌత్ర పారంపర్యముగా పురాణవిద్యయు, దానికి మూలమగు బ్రహ్మవిద్యయు వచ్చుచున్నదనిన ఇందసంగత మేమున్నది" ?

## లోమహర్షణుడు - అధిసీమకృష్ణుడు :

పరీక్షిత్కాలమున ద్వైపాయనుని కుమారుడు శుకుడుండనగును. మఱియు ద్వైపాయనుడును నుండనగును. కాని ద్వైపాయనుని తండ్రి ఎటు లుండ గలడు? ఒకవేళ నాటికిని బ్రతికియున్నాడా ?

భాగవత ప్రథమ శ్రోత పరీక్షిత్తు. వక్త శుకుడు. శుకుని కాలమున లోమహర్షణుడు కలడు. అతడు పరీక్షిత్ ప్రప్రపౌత్రుడు - అధిసీమకృష్ణుని కాలమున నున్నాడా ?

పరీక్షిత్కాలముననే లోమహర్షణుడు లేడు. ఒక సత్రమునందు పురాణము చెప్పుచుండగా బలదేవు డచటికి వచ్చెను. ఋషులందఱును లేచి నిలుచుండిరి. సూతుడు లేవలేదు. బలరాముడు కినిసి సూతుని తునిమెను గదా. అపుడు మరణించిన లోమహర్షణుడు పరీక్షిత్ ప్రప్రపౌత్రుని కాలమున నున్నాడా?

ఈ ప్రశ్నలకు ఆంగ్లేయులకు సమాధానము దొరకు టరిది. వారందఱు నిట్టి విషయములు మూచూచినంత మాత్రమున నివియన్నియు నసంగతములని త్రోసివేసిరి.

ఈ పై శంకలకు సమాధానము కడు సులభము. ద్వైపాయనుడే ప్రథమ సంహితాకారుడు కాడు. ఆతని తండ్రి పరాశరుడును సంహితాకారుడు. అతని తాతయు సంహితాకారుడు. కాని, ద్వైపాయను డొనరించిన సంహితలనే అతని శిష్యులును, ప్రశిష్యులును ప్రచార మొనరించిరి. ఒకటి రెండేమి, ఎన్నియో సంహితలు ఇంకను మిగిలిపోయి యుండును. వానిలో నొకటి మూల విష్ణుపురాణమున కాధారము. తత్కర్త ద్వైపాయనుని తండ్రి పరాశరుడు.

## ఆదికర్తయే గ్రంథభర్త :

ఆ కాలము వారు సత్యసంధులు. వారు కీర్తికొరకు కితరుల ద్రవ్యమును దొంగిలించువారు కారు. వారు ప్రాచీన విషయములను కొన్నింటిని పరివర్తించియు, నూతన విషయములకు కొన్నింటిని అనువర్తింపియు మూలమును మింగువారు కారు. సంహిత కాదికర్త పరాశరు డయినచో దానికి సంస్కరణములును, లోపములును, గ్రంథపాతములును, ప్రక్షేపములును, అంతస్స్థాపనములును, ఇట్టి వెన్నియో జరిగినను కర్త మారడు. అతడు పరాశరుడే. తమ్ము తమ తమ గురువులలో లయము చేసికొనగల భక్తి యీ శిష్యులకు గలదు. కేవలము పురాణముల మాటయే కాదు. అన్ని దర్శనము లందును అంతే. పరాశరు డిపుడు మనకు కనిపించు విష్ణుపురాణ కర్తకాడు; అతని శిష్యాను శిష్యు డెవడో! పరాశరు డాది సంహితాకర్త కావున సంస్కరణములచే బలసిన నేటి విష్ణుపురాణమునకును అతడే కర్త. ఆది పరాశరోపజ్ఞకము. కావున నతడే వక్త. అతని శిష్యుడు పరీక్షిత్ కాలమున నుండవచ్చును. అందు అసంగతమేమియు లేదు. లోమహర్షణుని సంగతియు గూడ నంతియే. పీటమీద కూర్చున్నవాడు వసిష్ఠు. వ్యాసపీఠము పట్టినవాడు లోమహర్షణుడు.[12]

పరీక్షిత్తు పేరును, అధిసీమకృష్ణుని పేరును చెప్పి అధునాతను డొకడు దీనికి పురాణత్వము కల్పించెనని తలపోయవచ్చును. మఱియు ఇంతమంది వ్యాసులమాట యసత్యము. ద్వైపాయను డొకడే నిక్కము; అతని కిటీవలనే ఎంతోమంది వ్యాసులు అంబికాదత్తవ్యాసులవలె బయలుదేఱి కొన్ని పురాణములు రచించి ద్వైపాయనుని కంటగట్టి యుందురు - అని ఎందఱో బుద్ధిమంతులు

---

12) వసిష్ఠులు పలువురు. మూలపురుషుల పేరనే వ్యక్తుల చలామణీ. ఉపనిషత్తుల యందీ వ్యవహారము బహుళము. ఈ వ్యవహారము నేటికిని ఉత్తర దేశములలో కలదు. మనలో తాత తండ్రుల పేరే ఆస్తితోపాటు బహుళముగా సంక్రమించుచున్నది. పై రీతిగా వసిష్ఠ గోత్రము వారందఱును వసిష్ఠులే. ఇంతియ కాక ఇంకొక గోత్రము వాడయినను పీట నెక్కిన యెడల వాడు వసిష్ఠు. నేటి పురోహితునకు వసిష్ఠు పర్యాయపదము. మొదటి వసిష్ఠుడు బ్రహ్మ మానసపుత్రుడు. ఆ స్మృతి యీ విధముగా నేటికిని మనము రక్షించుకొను చున్నాము.

ఎన్నో వికల్పములు చేయవచ్చును. ఇట్టి వికల్పములకంటె ప్రాచీను లొనర్చిన బహువ్యాసా విష్కార[13]వాదము దొడ్డది కదా? మఱియు వ్యాసు డొకడే పదు నెనిమిది మూల పురాణములను చెప్పవచ్చును. దానజేసి బృహత్కాయములుగల వీని యన్నింటికిని వ్యాసులే ఆదికర్త. ప్రకృతము మనకు కనపట్టు నీ పెద్ద పెద్ద సంస్కరణము లొకనాటివి కావు.

పరాశరుడు వక్తయని విష్ణు పురాణమున జూచితిమి. అతడు వసిష్ఠుని కడ వినెను. అత డెవని కడనో వినియుండవలెను. అతడు ఇంద్రుని కడ, అతడు మృత్యువుకడ, అతడు సవిత కడ, అతడు బృహస్పతి కడ, అతడు శుక్రుని కడ, అతడు వాయువు కడ, అతడు బ్రహ్మ కడ వినెను. ఈ రీతిగా ఇది అనాది. వేదము లనాది యనినచో ఈ చింతాధారలో తార్కికుని మనస్సు కూడ నెదురు తిరుగదు. వారికి పూర్వము ఎన్ని పురాణములు, ఎన్ని వేదములు, ఎంత విజ్ఞానము ఉండెనో ఆ సంగతి ఊహా గమ్యమా? ప్రపంచ మనాది. జ్ఞాన మనాది.

సూతులు :

మహాత్ములగు ఋషులయు, రాజులయు వంశ చరిత్రమును ధారణ పట్టుట సూతుల పని" అని వాయు పురాణము.[14]

---

13) వైవస్వత మన్వంతరమున ప్రత్యేక ద్వాపరయుగముల మహర్షులు వేదము నిప్పటికి 28 మాఱులు విభజించిరి. వారికి వ్యాసులని పేరు. ఆ వ్యాసులు వీరు- స్వయంభువు, ప్రజాపతి, శుక్రుడు, బృహస్పతి, సవిత, మృత్యువు, ఇంద్రుడు, వసిష్ఠుడు, సారస్వతుడు, త్రిధామ, త్రిశిఖుడు, భరద్వాజుడు, అంతరిక్షుడు, వర్ణి, త్రయ్యారుణుడు, ధనంజయుడు, క్రతుంజయుడు, జయుడు, భరద్వాజుడు, గౌతముడు, హర్యాత్మ వాజశ్రవుడు, తృణబిందుడు, ఋక్షుడు (వీరికి వాల్మీకి యనియు పేరు) శక్తి పరాశరుడు, జాతుకర్ణుడు కృష్ణ ద్వైపాయనుడు. (చూ. విష్ణు పు. 3-9, 9-19).

14) స్వధర్మ ఏష సూతస్య సద్భిర్దృష్టిః పురాతనైః దేవతానా మృషీణాం చ రాజ్ఞాం చామిత తేజసామ్. వంశానాం ధారణం శ్రుతానాం చ మహాత్మనామ్. నహి వేదే ష్వధికారః కశ్చిత్ సూతస్య విద్యతే. వైన్యస్య హీ వృథో ర్యజ్ఞే వర్తమానే మహాత్మనః. సుత్యాయా మభవ త్సూతః ప్రథమం వర్ణ వైకృతః- వాయు 3-31.... ఇటీవలి స్మృతులలో సూత మాగధులు ప్రతిలోమ జాతివారు.

పూర్వము భరత ఖండమున ఎన్నియో దేశము లుండెడివి. ఒక్కొక్క దేశమున ఒక్కొక్క రాజుండెడివాడు.

ఋషులును, రాజులును తఱుచు యజ్ఞములు చేయుచుండెడివారు. రాజులందఱకడను సూతులుండెడివారు. వారు తమ తమ ఏలికల వంశ చరిత్రమును, యశః కలాపమును గానము చేయుచుండెడివారు.

తెలుగునాడులో భట్రాజులు సూతు లనుకొందును. భట్టరాజు, భట్టమూర్తి, భట్టవర్తి ఈనామము మొదలగు పదముల చరిత్రమును తఱచి చూచునది.

ఈ రీతిగా సూతులు State Historians. యుద్ధములందును, వివాహములందును తమ రాజుల కుత్సాహము కలిగించుట కీ సూతులు తమ చుట్టుప్రక్కలనున్న ద్వాదశ రాజమండలము చరిత్రమును గూడ కంఠస్థము కావించుకొనెడివారు. అట్టియెడ సూతులు సత్యవ్రత పరాయణులని పురాణము చెప్పను. వీరప్పటి Department of Imperial Records. కాని వీరంతిజనము చేయక మానరు. కావుననే "బూతు వొగడినట్లు వొగడెను." అని భారతము. సభా. ౨-౪౮.

## యజ్ఞ సభ్యత :

ఆ కాలమున యజ్ఞములకు అందఱును వెళ్లెడివారు. యజ్ఞములు పిలువని పేరంటములు. మన ఈ సభ్యత యజ్ఞ సభ్యత అని యనినను అనవచ్చును. సూతు లందఱును ఆయా యజ్ఞములకేగి తాము సంగ్రహించి తెచ్చిన చరిత్రము నంతయు చెప్పకొనుచుండెడివారు. కొందఱు ఋషు లా చరిత్రమునంతయు వ్రాసి యుంచెడివారు. ఋషి వంశములును, రాజవంశములును పురాణములలో నిటులు లిపిబద్ధమాయెను.

## పురాణము జగచ్చరిత్ర :

పురాణ సంగ్రహ మెన్నివేల క్రిందటినుండియో జరుగుచు వచ్చుచున్నది. ఇది ఇంటింటను ఉన్న మ్యూజియము. పురాణర్షులు వేఱు వేఱు కాలములయందు

వేఱు వేఱు విషయములతో పురాణములను పూరించుచు వచ్చిరి. వారు వింతలగు సృష్టి విలాసములను మన్వంతరములతో సముచ్చయించి వాని స్మృతిని కాపాడిరి. మన్వంతర నిర్దేశమనగా కాలనిర్దేశము. "సృష్టి స్థితి లయము లనేక భంగుల ఆవృతము లగును." అని పురాణ ఋషుల మతము. ఎంతోకాలమునకు గాని ఇట్టి యావృత్తి ఒకటి జరుగదు. వారు సృష్టి మొదలుకొని ప్రలయము వరకును జరిగిన వివిధములగు ఘటనలను కాలముతో జోడించి సంగ్రహించిరి. పంచలక్షణములను పరిశీలించి చూడుడు. పురాణము జగచ్చరిత్ర. లేక దేశ కాలముల చరిత్ర. ఈ చరిత్ర నశింపకుండుట కీ సూతులు!

ఎప్పుడో జరిగిన భూకంపములు, నదీ విలయములు, అంగారోద్గారములు, పర్వత పాటనములు, కాలపు కునికిపాటులు, దేవాసుర యుద్ధములు, జ్యోతిర్మండల చరిత్రములు మొదలగున వెన్నియో కల ఈ పురాణములకు ఈ సూతులు అనశ్వరమగు ఆశ్రయము. సూతు లనిన ఋషులకు మితిలేని గౌరవము.

అధికారము :

వేదవాహకులు ద్విజులు. పురాణ వాహకులు సూతులు. సూతులకు వేదాధికారము లేదు. అధికార మనగా తెలిసికొను శక్తి.

తెలిసికొనగల బ్రాహ్మణునకు వేదము. తెలిసికొనలేని బ్రాహ్మణునకును, స్త్రీకిని, శూద్రునకును పురాణము. "స్త్రీ శూద్ర ద్విజ బంధూనాం త్రయీన శ్రుతి గోచరా".

తెలిసికొనగల శూద్రున కీ యధికార మేల లేదు? తొల్లి సాంఘిక వ్యవస్థలో శూద్రునకు కర్మలలో సేద్యమును, చదువులలో పురాణము నేర్పాటాయెను. అప్పసము సేద్యములో బడి కొట్టుకొనువానికి, వచ్చెడి వఱకును వల్లించి, చచ్చెడి వఱకును గుఱుతుంచుకొనదగిన వేదమునందు గాని ప్రవేశ మస్వాభావికము. అట్లయ్యు తమ కర్మలలో మెలగుచు జ్ఞానులయిన శూద్రు లెందఱో కలరు. జనకుడు మొదలగు క్షత్రియులును, జాజలి మొదలగు వైశ్యులును, ధర్మవ్యాధుడు మొదలగు శూద్రులును, నామదేవాదులగు తదితరులును

జ్ఞానులు; భక్తులు. వారు బ్రహ్మీభూతులు. వారికి మ్రొక్క వలయును. 'దైవ ద్విజ గురు ప్రాజ్ఞ వందనమ్' అను గీత మీది మధుసూదన సరస్వతి చూచునది.

శూద్రు లనార్యులని పలువురు వ్రాసిరి. ఇంచుమించుగా యజ్ఞము లొన రించుట మానినది మొదలుకొని చాతుర్వర్ణ్యములో గలిగిన ఆచార వ్యవహారముల మార్పులవలన వారిట్లు లూహించి యుందురు. శ్రుతి పురాణముల బట్టి ఇట్లు చెప్పతగము కాదు. శూద్రులు మొన్న మొన్నటి వఱకు పంచ యజ్ఞములు చేయు వారు. వారు కొన్ని సందర్భములలో బ్రాహ్మణు లాయెడివారు. (చూ. శౌత సూత్ర.)

ధ ని ష్ఠ :

ఈ మూడు పురాణములకును మూలమగు ఏ పురాణము కలదో దానిని జెప్పిన పరాశరుని కొడుకు కృష్ణ ద్వైపాయనుడను వ్యాసుడు భారత సంగ్రా మము నాటి వాడు. అది సుమారు మున్నూరు ఏండ్ల క్రింద. కాన వ్యాసుడు నాటి వాడు. మొదటి ప్రకరణమున సంప్రదాయవిదులు ఐదువేల ఏండ్ల క్రింద వ్యాసు డున్నాడని కలదు. కాని ఈ దిగువ హేతువులచే సుమారు మూడువేల ఏండ్ల వెనుక నున్నాడని చెప్పవచ్చును. భారత సంగ్రామము కాలము నాటికి పరాశరు డుండిన నుండవచ్చును. లేకున్న లేకపోవను వచ్చును. కురు సంగ్రామ కాలమును గురించి విడిగా ఒక వ్యాసము వ్రాయువలెను. ప్రాచీన విషయముల కాలము నిర్ధరించుటకు కురు సంగ్రామ కాల నిర్ణయము దిగ్దర్శక యంత్రము.

ఈ మూడు పురాణము లందును ఆశ్లేషార్ధమున దక్షిణాయన ప్రవేశ మును, ధనిష్ఠలో ఉత్తరాయణ ప్రవేశమును కలదు. పురాణకర్త శాక పుష్కర ద్వీపములలో ఈ సంగతి తాను చూచిన చందముగా చెప్పెను. వేదాంగ జ్యోతి షము కూడ ధనిష్ఠలో ఉత్తరాయణ ప్రవేశము చెప్పెను.[15]

---

15) "మాఘ శుక్ల ప్రపన్నస్య పౌషకృష్ణ సమాపినః, యుగస్య పంచవర్షస్య కాల జ్ఞానం ప్రచక్ష్యతే. వే. జ్యో. 5. ఆ నాళ్లలో మాఘ శు. పాడ్యమి ఉగాది. మాఘ 15 మఘ. దానికి 14 నక్షత్రముల వెనుక శతభిష. దానికి పిదప ధనిష్ఠ. మాఘ పూర్ణిమకు వెనుక 14న రవి ధనిష్ఠలో నుండును. ధనిష్ఠాదిని దక్షిణాయనము ముగియుచో నటకు 90 అంశల వెనుక విషువము. 90 అంశము లనిన ఎంతో 6¾ నక్షత్రము లనినను అంతే. కావున వేదాంగ జ్యోతిషకాలమున ధనిష్ఠనుండి అనులోమముగా ఏడవదగు భరణి శేషపాదమునందు విషువమాయెడిది. "శ్రవణాంతం శ్రవిష్ఠాదియుగం స్యాత్ పాంచ వార్షికమ్." వాయు-53.

"పూర్వశాస్త్రములందు ఆశ్లేషార్థమున దక్షిణాయనమును, ధనిష్ఠాదిని ఉత్తరాయణమును ఆయెడిది" అని కలదని బృహత్సంహితలో వరాహమిహిరుడు.[16]

"ఈ పూర్వశాస్త్రములు పరాశరాదులు చెప్పినవి" అని భట్టోత్పలుడు. "సౌమ్యాద్యాత్సార్పార్థం గ్రీష్మః" అని పరాశరసంహితనుండి అతని ఉద్ధరణము.[17]

ఇపుడు ఆర్ద్రాదిలో ఉత్తరాయణ మంత మగుచున్నది. నాటికిని నేటికిని అయనము 34° నక్షత్రములు వెనుక బడెను. ఇంత వెనుక బట్టుటకు 3360 ఏండ్లు పట్టును.

## అగస్త్యుడు :

అగస్తిని గురించి ఈ మూడు పురాణము లందును గలదు. బృహత్సంహితకు వ్యాఖ్య వ్రాసిన భట్టోత్పలుడు పరాశరుని గ్రంథమునుండి అగస్తి ఉదయాస్తమయముల గణనము నుదాహరించెను– "రవి హస్తలో జొరబడుడు అగస్తి ఉదయము. రోహిణిలో జొరబడుడు అస్తమయము."

కోల్‌బ్రూక్[18] లెక్కవేసి "క్రీ.వె. 13వ శతాబ్దిలో అగస్తి ఉదయాస్తములు ఇటులు జరుగును." అని చెప్పెను.

---

16) "ఆశ్లేషార్ధా ద్దక్షిణ, ముత్తర మయనం రవే ర్ధనిష్ఠాద్యమ్. న్యూనం కదాచి దాసీ ద్యేనోక్తం పూర్వం శాస్త్రేషు. —బృహత్సం.

17) మృగశిర మొదటినుండి ఆశ్లేషార్థము వరకు గ్రీష్మము. ఉత్తరాయణాంతముతో గ్రీష్మాంతము. రవి దక్షిణాశనుండి ఉత్తరాశ నారోహించుట ఉత్తరాయణ మనియు, ఉత్తరాశనుండి దక్షిణాశ కవరోహించుట దక్షిణాయన మనియు ప్రాచీనులు. కాని ఈ నియమ మెంతో కాలముండలేదు. కొలది కాలము తరువాత విషువద్వృత్తమునకు ఉత్తర దక్షిణముల రవి భ్రమణము క్రమముగా ఉత్తర దక్షిణాయనము లని వ్యవహారములోనికి వచ్చెను.

18) శ్రీ కోల్‌బ్రూక్ క్రీ.వె. ఇన్ని శతాబ్దులు చూడలేక– "ఆ వట్టిమాట పరాశరు దేమిటి? ఇంత ప్రాచీను దేమిటి?" అని గుండెలు బాదుకొని, "అత డే పూర్వుల మాటనో గ్రంథస్థము చేసియుండును." అని వ్రాసెను. కిరస్తానీవారు క్రీస్తు వెనుక కాలమే లేదందురు.

క్రీ. వె. 1372 అబ్దమున ధనిష్ఠలో ఉత్తరాయణ ప్రవేశము. దానికి ముంగలి మఘా రేవతులమాట యీ మూటను ఉన్నది కాని ధనిష్ఠకు పిమ్మట అయన ప్రవేశము మాట లేదు. కావున పరాశరుడును, ఈ మూటి మూలమును క్రీ.వె. 14వ శతాబ్దికి చెందినవి.

ధనిష్ఠ క్రీ.వె. 1372లో ధ్రువక ౩౦౯°-౪౯న విభాగ ౩౧౦°-౦మున ఉన్నది ధనిష్ఠ. **Alpha Delphini** కాదు, మఱి **Beta Delphini.** ఇది శాకల్య సంహితాసూర్య సిద్ధాంతములకు కొంచెము భిన్నము. దానికి గల ఉపపత్తిని గూర్చి విడిగా వ్రాయవలసియున్నది.

## భూగోళ చిత్రము :

భారతమునందలి పండితులు భూగోళ మెరుగరనియు కావుననే భూగోళ చిత్ర మెవరును గీచి యుండలేదనియు గ్రీసు దేశమునందలి హికేటూన్ అను పండితుడు జగత్తులో నెల్ల మొదటి భూగోళకర్త యనియు, అతని సమయము క్రీ.వె. 550-475 అనియు కొందఱు తలతురు. పరాశరుడు భూగోళ చిత్రమునే కాక, ఖగోళ చిత్రమునే కాక, కాలతలతో కూడ బ్రహ్మాండ చిత్రమునే మన మనఃఫలకములమీద చిత్రించెననియు, అదియు క్రీస్తు వెనుక పదునాలుగు శతాబ్దములనాటిదనియు పాఠకులు గట్టిగా తెలిసికొనియుందురు. మఱియు భూగోళానుసార మా లయములు కట్టుట సంప్రదాయము. ఇది చెఱదని చిత్తరువు కదా.[19]

## ముక్కారు పంట :

ఈ దెస పురాణములు చాల ప్రాచీనములు. మూల పురాణము మూడు వేల ఆర్నూరేండ్ల వెనుక రచితమై పదపడి వేయేండ్లలో నొకమాఱును, ఇరువది రెండువేల ఏండ్లక్రింద రెండవ మారును, పదేను వందల ఏండ్లక్రింద మఱొక

19) ...."సదరహీ గణపతిగారి కుమారుడైన ఈ గణపతిగారి హయాములో పిన్న చోడ దేవరాజు పేవాధిపత్యం వహించి ఈ దేశానికి ప్రభుత్వం చేసే కాలమందు అతను చేబ్రోలులో భూగోళ ప్రకారంగా శివాలయం కట్టించి చోడేశ్వరు డనే లింగమూర్తిని ప్రతిష్ఠ చేసి, ఆ దేవునికి ఈ గ్రామం. శా. శ. 1157 నందు యీనాం యిప్పించి శ్రీ వీరభద్రేశ్వర స్వామివారి ఆలయం బాగుగా కట్టించినారు." మెకంజీవార్యం. 14-22.

మాఱును పరివర్తితమును, సంస్కృతమును, ప్రక్షిప్త పూర్ణము నాయెను. కాన భూగోళ రచన సుమారు 3300 ఏండ్లక్రింద ఎంతో వెనుక మొదలై క్రీ. శ. 400 ఏండ్ల వఱకు పరిపుష్టమగుచు వచ్చెననిన అసంగతము కాదు. ఇందలి పాఠభేదముల కిపుడు కారణము కనుగొనుట మిగుల సులభము.

మొదట భూమి చతుర్ద్వీప. చతుస్సాగర. నడుమ సప్తద్వీప. సప్త సాగర. చరమ కాలమున నవవర్ష, బహువర్ష, అష్టాదశవర్ష, అనంతద్వీప, బహుసాగర, అనంతసాగర.



# 10. మంజూష[1] - భీష్ముడు

భీష్మునకు తర్పణము వదలి అర్ఘ్యము ఇచ్చువారందఱును :

"వైయాఘ్ర పద్యగోత్రాయ సాంకృత్య ప్రవరాయ చ
గంగాపుత్రాయ భీష్మాయ ఆజన్మబ్రహ్మచారిణే
అపుత్రాయ దదామ్యే తదుదకం భీష్మ వర్మణే"–[2]

అనియు;

"వసూనా మవతారాయ శంతనో రాత్మజాయ చ
అర్ఘ్యం దదామి భీష్మాయ ఆబాల్యబ్రహ్మచారిణే"[3]

అనియు మంత్రములు చెప్పి తర్పణము విడుచుచున్నారు, అర్ఘ్య ప్రదానమును చేయుచున్నారు. ఈ మంత్రములు పూర్వాచారముగా నేటి దనుక వచ్చుచున్నవి. ఈ రెండు మంత్రములలో భీష్ముడు మనకు ఆజన్మబ్రహ్మచారిగా కానిపించుచున్నాడు. మఱియు: "అయం పితర మాజ్ఞాయ కామార్తం శంతనుం పురా ఊర్ధ్వరేత స మాత్మానం చకార..."[4] అను వచనము వలనగూడ ఇతడు నిత్యబ్రహ్మచారి యని విస్పష్టము. కాని యీ విషయమున కొన్ని సందేహములు కానిపించుచున్నవి.

---

1) మంజూషయను వ్యాకరణ గ్రంథమును రచించినవాడు శ్రీ నాగోజీభట్టు. ఇతడు సర్వతంత్ర స్వతంత్రుడు. విశేషించి పతంజలి తరువాత పతంజలి యంతవాడు. ఇతని కాలము ఇంచుమించు క్రీ. శ. 1715–1800 నడుమ.

2) ఇది పద్మపురాణము నందలిది. వైయాఘ్ర పద్యగోత్రుడును, సాంకృత్య ప్రవరుడును, గంగకొడుకును, అపుత్రుడును, ఆజన్మ బ్రహ్మచారియునగు భీష్మునకు ఈ యుదకము నిచ్చుచున్నాను.

3) ఇదియు పద్మపురాణము నందలిదే. వసువుల యవతారము, శంతనుని కొడుకు, ఆబాల్య బ్రహ్మచారియునగు భీష్మునకు అర్ఘ్యమిచ్చుచున్నాను.

4) తండ్రియైన శంతనుడు కామార్తుడని తెలిసికొని భీష్ముడు తన్నూర్ధ్వ రేతస్కునిగావించుకొనెను.

శాంతి పర్వమున :

"త్వాం హి రాజ్యే స్థితం స్ఫీతే సమగ్రాంగ మరోగిణం
స్త్రీ సహస్రైః పరివృతం పశ్యా మీహోర్ధ్వరేతసమ్"

ఇచట 'పశ్యామీ వోర్ధ్వరేతసమ్' అనియు, 'ఋతే శాంత నవా ద్భీష్మా న్నపశ్యా మ్యూర్ధ్వరేతసమ్' అనియు పాఠాంతరములు. "అంగవైకల్యముగాని, రోగము గాని లేక వేలాది స్త్రీలతో పరివేష్టితుడవై సమృద్ధమైన రాజ్యమునందున్న నిన్ను ఊర్ధ్వరేతస్కునివలె చూచుచున్నాను-" అని యున్నది. ఇచట వేలాది స్త్రీలచే పరివేష్టితు డనుట 'వివాహితుడేమో'యని సందియము కలిగించుచున్నది. కాని ఇచట 'స్త్రీలు'-అనగా 'దాసికలు' మొదలగువారని యర్థము. స్త్రీ శబ్దము పత్నీ పర్యాయముకాదు. పెక్కువేల మందిని పెండ్లి చేసికొనకపోవుట జేసియు, ఇచటి స్త్రీ శబ్దము పత్నీ పర్యాయముకాదు. 'పశ్యామీ వోర్ధ్వ రేతసమ్' అను పాఠము నకు "శివునివలె చూచుచున్నా"నని అర్థము. 'ఋతే శాంతనవాత్...' అను పాఠమునకు "భీష్మునికంటె వేఱు ఊర్ధ్వరేతస్కుని మఱి చూడను" అని అర్థము. ఊర్ధ్వ రేతస్త్వ మనగా ఎనిమిది తీరులైన కామము లేకపోవుట.

ఆది పర్వమున-

"అద్యప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి"-[5] [ఓ దాశుడా! ఇపుడు మొదలుకొని నాకు బ్రహ్మచర్యము కాగలదు.] అని ఉన్నది. ఇందలి 'అద్యప్రభృతి = ఇపుడు మొదలుకొని; అనునది సందేహాస్పదమని అనరాదు. దాశు నెదుట జేసిన ప్రతిజ్ఞవలన ఇదివఱకున్న బ్రహ్మచర్యమే మరల నిపుడు మొదలుకొనియు కాగలదనియు నర్థము. తొల్లి బ్రహ్మచర్యమే లేనినాడు అమోఘ వీర్యు డగుటచే అతనికి పుత్ర భావ మెటులు? మఱియు వేలాది

5) ధృతిబూని బ్రహ్మచర్య
వ్రత మున్నతి దాల్చితిని ధృవంబుగ ననప
త్యత యైనను లోకము లా
యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై. (ఆది. 4-187)

ఈ నన్నయ తెలిగింపులో 'అద్యప్రభృతి' అనునది మెలకువతో విడువబడెను.

పత్ను లున్నచో "ఋతుస్నాతాంతు యో భార్యామ్" - ఇత్యాదులచే దోషము చెప్పబడుటచే బ్రహ్మచర్యప్రతిజ్ఞ అత్యనుచిత మయి పోవును. అట్టి యెడ దాశుడు మాత్ర మెటులు పర్యనుయోగము చేయును ? కావున ఈ బలము చూచుకొని భీష్మునకు పత్ని కలదని కల్పించుట సమసినది.

'ఋతుకాలమందు భార్యోపగమము నిత్యము. తండ్రి కొఱకు దొరకొన్న బ్రహ్మచర్యము నైమిత్తికము. ఈ నైమిత్తికముచే నిత్యమునకు బాధ చెప్ప రాదా? అనగా అతనికి పత్నికలదు. కాని విధించుకొన్న బ్రహ్మచర్యముచే భార్యోపగమ మొనరించుటలేదు.' అని చెప్పరాదా ?

...నిత్యము చేతనే ఆయా యీ నైమిత్తికము లన్నిటికిని బాధ కను పట్టుచున్నది. కావుననే ఋతుకాలమందు శ్రాద్ధ దినమునందేని భార్యోపగమము వలన బ్రహ్మచర్యమునకు హానిలేదని మితక్షార.

ఇంకొక పెద్ది సందియము : భీష్మ స్వర్గారోహణ పద్యమునందు :

"మహతా రాజయోగేన[6]
పరివారేణ[7] సంయుతః
స్తూయమానో మహాతేజా
భీష్మస్యాగ్ని[9] నను వ్రజన్

6) 'రాజభోగేన' అని పాఠాంతరము.

7) 'పారిబర్హేణ' అని పాఠాంతరము.

8) గీ. "అనఘ ! వచ్చితి ధర్మనందనుఁడ బ్రణతి
యాచరించెద నాపలు కవధరింప
నవసరంబేని విను సమయంబు వార్చి
యగ్ని మొదలుగ దేదగునట్టివాని"

సీ. తెచ్చితి........ (అను. 5.452-3)

ఈ తిక్కన తెలిగింపులో ఇచ్చట 'అగ్నీన్' అను బహువచన కేకవచన మున్నది. 473 వచనమున "దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతిచేసి" అని యున్నది.

9) భీష్మ స్యాగ్నీనితి - తేన తస్యాపి పత్నీ ఆసీత్ యద్వా సంస్కారకా వగ్నీన్ - అని నీలకంఠుడు. భీష్మ స్వర్గారోహణ పర్వ. 11వ శ్లోక.

ప్రాప్తోఽస్మి సమయే రాజ
న్నగ్నీ నాదాయతే విభో !"

...'నీయగ్నులను దీసికొని సమయమునకు వచ్చితిని' అని ధర్మజుని వాక్యము.

మఱియు :

"య ఏష రోషాత్ ప్రతపన్ బలస్థో
యోనస్సేనాం సింహ ఇవార రక్ష
స ఏష భీష్మః కురువంశకేతు
ర్యేనా హృతా స్త్రిదశా (త్రిశతం) వాజిమేధాః"

[ఎవడు కోపముతో మండిపడుచు మనబారి నుండి తన సేనను రక్షించెనో, ఎవడు ముప్పది (మున్నూరు) అశ్వమేధము లొనరించెనో కురువంశ కేతువగు భీష్మ డిడుగో !) అనియు కలదు. ఈ రెండు చోటు లందును భీష్మునకు అగ్నులు కలయట్టులు స్పష్టము.

భీష్మ డపత్నీకు డగుచో అపత్నీకునకు 'పత్నీవదస్యాగ్ని హోత్రం భవతి'-ఈ మొదలగు వచనములచే అగ్నిసాధ్యమైన కర్మయం దధికార మెటులు?

ఇట్టిదే యింకొకటి : కాళిదాస మహాకవి శాకుంతలము ప్రథమాంకమున :

'రాజా-భగవాన్ కాశ్యపః శాశ్వతే బ్రహ్మణి స్థిత ఇతి ప్రకాశః,
ఇయం చ వ స్సఖీ తదాత్మ జేతి కథమేతత్ ?'

దుష్యంత : కణ్వ భగవానుడు శాశ్వత బ్రహ్మచర్యమున నున్నవాడని లోక ప్రసిద్ధము. మీ యీ నెచ్చెలి కణ్వ భగవానుని కూతురగు టెట్లు ?

అని భారతోక్తమగు కణ్వుని ఊర్ధ్వరేతస్త్వమును కాళిదాస మహాకవి స్వయముగా చెప్పి, నాలవ యంకమున :

"అమీ వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః
సమిద్వన్తః ప్రాన్త సంస్తీర్ణ దర్భాః

అపఘ్నన్తో దురితం హవ్యగంధైః
త్రైతా నాస్త్వాం వహ్నయః పావయన్తు."

["వేది చుట్టు తమ తమ తావులలో సమిధల నొప్పి, ప్రాంతములందు పఱచిన దర్భలు కలిగి, హవ్య గంధములచే పాపములు పోద్రోలుచున్న యీ యజ్ఞాగ్నులు నిన్ను పవిత్ర పఱచుగాక"]

అని కణ్వునకు యజ్ఞ సంబంధమైన త్రేతాగ్ను లున్నటులు వర్ణన మొనరించెను. ఈ రీతిగా అనధికారులగు ఆధునికులకు కూడ అగ్ని సాధ్యమగు కర్మ చేయనగునా ?

బహ్వృచ బ్రాహ్మణమున - "అపత్నీకోఽగ్నిహోత్ర మాహరేత్ = అపత్నీకు డగ్ని నాహరింపనగునా? కూడదా ?" అని విచారింప దొరకొని, "ఆహరేది త్యాహుః, యది నాహరే దనద్ధా పురుషః స్యాత్। కోఽనద్ధా పురుషః। నదేవాన్న పితౄన్ న మనుష్యా నితి. తస్మా దపత్నీకోఽప్యగ్ని హోత్ర మాహరే దితి. తస్మాత్ సౌమ్యం యాజయేత్" - ("ఆహరింపనగునని వక్కాణింతురు. ఆహరింపని యెడల అసత్పురుషుడగును. అనగా దేవతలను గాని అతిథులనుగాని పూజింపని వాడగును. కావున అపత్నీకుడు గూడ అగ్ని హోత్రము నాహరింపవలెను."] అని చెప్పబడుటజేసి అపత్నీకున కగ్నిసాధ్య మగు కర్మయెడల నధికారము కలదు. ఇచట 'అపత్నీకోఽపి: అపత్నీకుడు గూడ' అనుచోట, అపి: కూడ అను శబ్దము ఒక యెడ పత్ని యుండేనేని, పత్ని లేకుండ యాగము చేయరాదని సూచించును.

ఈ బ్రాహ్మణము 'రామాండారుడు' చెప్పినటులు మృత పత్నీకుని గూర్చి చెప్పినదని ఏల చెప్పరాదు ?

పెండ్లి చేసికొనకపోవుట వలనను, చచ్చిపోవుట వలననుగూడ పత్ని లేక పోవచ్చును. ఇట్టి ఇరువురును అపత్నీకులే. అట్టి అపత్నీకుని గూర్చి సామాన్య ముగా ఈ శ్రుతి ప్రసక్తించినది. ఇట్టి శ్రుతిని సంకోచించి మృతపత్నీకపరమే యని వ్యాకరింపదగదు. కావుననే: "యా యజమానస్య పత్నీ సాఽభిద్రు త్యాపహన్తి, యోవా కశ్చి దవిద్య మానాయామ్"-అను ఆపస్తంబ సూత్ర

వ్యాఖ్యానమున రుద్రదత్త విద్యారణ్యులు 'అవిద్యమానాయామ్'- అనగా చెఱగు మాయుట మొదలగు నిమిత్తములచే పత్ని అసన్నిహితమై యుండినను, పత్ని లేకుండినను'- అనియు అర్థము వ్రాసి'అవిశేషమువలన'అని చెప్పిరి. మఱియు 'అస్యాగ్నిహోత్రం మే'- అనునది యజమానునకే స్వామిత్వము ప్రకటించు చున్నది: దానవ్రీహి యవపశ్వాజ్య కపాలపత్నీ సంబంధాని' అని ప్రసిద్ధాంగ సమభివ్యాహారముచేగూడ పత్ని అంగమగుటచే పత్ని లేకున్నను యాగము సిద్ధించును. మఱియు విద్యమానపత్నికి సహాధికార మున్నను ఆమెకు యజమానునితో సామ్యములేదు. ఇంతియకాక : 'వసంతే బ్రాహ్మణోఽగ్నీ మాదధీత', 'దర్శ పూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' - ఈ మొదలగు కర్మచోదనయు యజమానునే అధికరించుచున్నవి. గాని పత్ని నధికరించుట లేదు. కావున 'అపత్నీకోఽప్యగ్ని మాహరేత్' అపత్నీకుడు కూడ అగ్ని నాహరించునది - అని బహ్వృచ బ్రాహ్మణము. ఇంతియకాక కణ్వ విభాండక భీష్మాదులును, భగవంతుడగు శ్రీరాముడు మొదలగు తొంటి శిష్టుల పూర్వాచారముగూడ కానబడుచున్నది. వీరిలో శ్రీరాముడు అసన్నిహిత పత్నీకుడు. కణ్వాదులు పత్ని లేనివారు- అని చెప్పియున్నారు. ఇచట నిటులు చెప్పిన విద్యారణ్యులకు శ్రుతిని సంకోచించి వ్యాకరించుట అభిమతము కాదని విస్పష్టము. తొల్లిటి పెద్దల యాచారముచే శ్రుతి కీ అసంకుచిత వ్యాఖ్యానమే లభించుచున్నది. మఱియు, "పత్నీ వదస్యాగ్నిహోత్రం భవతి' అను సూత్రమున రుద్రదత్తుడు 'స్వే ఆయతనే పత్నీ ఉపవిశతి' అను ఉత్తర సూత్రముచే సిద్ధించుచుండగా పత్నీవద్వచనము పత్ని ఉన్నచో ఆదరార్థమనియు, 'అస్య' అని చెప్పుటచే యజమానునకే కర్మస్వామ్యము కాని పత్నికి కాదనియు వెల్లడి యగుచున్నది' అని వ్రాసి యున్నాడు. కావున 'అపత్నీకోఽప్యగ్ని మాహరేత్' అను బహ్వృచ బ్రాహ్మణమునకు రామాండరుడు చేసిన మృతపత్నీకత్వసంకోచము రుద్రదత్త విద్యారణ్య విరుద్ధమే కాక శిష్టాచార విరుద్ధము. కావుననే శాకుంతల నాటక రూప కావ్యము శాస్త్రవిరుద్ధత్వ దోష దుష్టముకాదు.

ఇంక నొక శంక : వేదాధ్యయనము కావించిన పిదప సమావర్తన మొనరించినను ఏదే నొక కారణముచేగాని, అనిచ్ఛచేగాని, దారపరిగ్రహము చేయని భీష్మాదులకు అనాశ్రమిత్వ దోషము లేదా ? 'అనాశ్రమీన తిష్ఠే తక్షణ మేక

మపి ద్విజః'- 'ద్విజుడు ఏ ఆశ్రమమును లేక నిమిషమయినను ఉండగూడదు' అని ఉన్నది గదా !- అనుచో 'అగ్నిహోత్రానుష్ఠానాతిథిపూజనాదులచే వారికి గృహస్థాశ్రమము సిద్ధించినది. అగ్నిహోత్ర విధురునితోపాటు అగ్నిహోత్రాదిక ముచే వారికి దేవర్షి ముక్తి, పితృభక్తిచే భీష్మునకు పితౄణముక్తి, ఇతరులకు దత్తకాదులచేగాని, తపోబలముచేగాని, మానస పుత్రులచేగాని సిద్ధించినది.

"త్రిభిః ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏషవాఽనృణోయః పుత్రీ యజ్వా బ్రహ్మచారీ చ". (ఋషులకు, దేవతలకు, పితృదేవతలకు అప్పుతో పుట్టుచున్నాడు. బ్రహ్మ చర్య మొనరించి, యాగము చేసి, పుత్రునికని, పై మూడు అప్పులు తీర్చు చున్నాడు-') అని శ్రుతి కలదు. ఐనను నైష్ఠిక బ్రహ్మచర్యము ననుష్ఠించు వారికి యప్పుల బాధలేదు. బ్రహ్మచర్యము, అగ్నికార్యము మొదలగు వానిచే వారికి ఋణ విముక్తియని స్మృతులు చెప్పుచున్నవి.

భారతమువందలి 'వాజిమేధ' పదమునకు 'వాజిమేధము లొనరించినచో ఎంత ఫలము కలిగించునో అంత ఫలము కలిగించు దానాదులు' అని అర్థము.. ఏలనగా, 'భీష్మునకు పత్ని లేకపోవుటచే వాజిమేధమునం దధికారములేదు' అని కొందరనిరి. 'అగ్నులను తీసికొని వచ్చితిని.' అనుచోట అగ్నిపదము సంస్కార కాగ్నిపరమని కొందఱు చెప్పిరి. ఇదియే భీష్మునకు పత్ని ఉన్నటులు తెలుపు చున్నదని ఇంక కొందరు చెప్పిరి. ఇది యంతయు పైన వ్రాసిన గ్రంథము వలన ఎగిరిపోయినది.

ఇక 'ఇప్పటివారు గూడ అటులు చెప్పవచ్చునా?' అను శంక మిగిలి నది. అట్టి యాచారము పోవుటవలనను ఊర్ధ్వరేతస్త్వము మొదలగు గుణములు గల తొల్లిటివారికె చేయదగిన దగుటను ఇప్పటివారి కట్టిది మిక్కిలి యగుటను కూడదు.

# 11. తంత్రవార్తికము - భీష్ముడు

కుమారిలభట్టు 'శిష్టకోపేఽవిరుద్ధ మితిచేత్' న శాస్త్ర పరిమాణత్వాత్'- అను నీ రెండు సూత్రములు బాహ్య సౌగతాదుల ఆచారముల ప్రామాణ్యమును నిరాకరించుననియు, 'అపివా కారణా గ్రహణే ప్రయుక్తాని ప్రతీయేరన్' (1 మీ.ద. 1-3-7) అను నీ సూత్రము 'సదాచారములు ప్రమాణము' అని చెప్పుననియు చెప్పి, కొన్ని సదాచారముల నుదాహరించి వానిలో ధర్మ సంశయము చూపి త్రివర్గము సిద్ధించుటకు ధర్మావిరోధము నిరూపించెను. ఇతడు ఏడవ శతాబ్దివాడు.

## ధర్మ సంశయము

శిష్టు లనబడువారిలో ధర్మవ్యతిక్రమమును,[1] సాహసమును[2] కానిపించు చున్నవి. ప్రజాపతి తన కుమార్తె ఉష నభిగమించెను. ఇది అగమ్యాగమన రూపమగు అధర్మాచరణము. ఇంద్రుడును, ఇంద్ర పదవిలో నున్న నహుషుడును పరదారాభియోగము నొనరించిరి. పుత్ర శోకముచే ఆర్తుడగు వశిష్ఠుడు నీట మునిగి ఆత్మహత్య చేసికొన సాహసించెను. విశ్వామిత్రుడు చాండాల యాజన మొనరించెను. వశిష్ఠునివలెనే పురూరవుడు ఆత్మహత్యకు తెగించెను. నైష్ఠిక బ్రహ్మచర్యమును గొన్న ద్వైపాయనుడు విచిత్రవీర్యుని భార్యలందు సంతానోత్పత్తికి పాయపడెను.

భీష్ముడు సర్వాశ్రమ ధర్మములకును వ్యతిరేకముగా ఉండుటయకాక శ్రీరామునివలె క్రతువు లొనరించెను.[3] (తం.వా) 'భీష్ముడు బ్రహ్మ చర్యా

---

1) లోభాదులలో చిక్కికొని సన్నిహితములగు అనర్థములను జూడక అధర్మ మొనరించుట.

2) అధర్మము కనబడుచున్నను బలదర్పముచే లెక్కగొనక అధర్మ మాచరించుట. అని భట్ట సోమేశ్వరుని 'న్యాయసుధ' అను తంత్రవార్తిక వ్యాఖ్య.

3) మిగిలిన సదాచార సంశయములను తన్నివృత్తిని చూడగోరువారు తంత్రవార్తికమును చూచునది.

శ్రమమున నున్నటులు భారతము చెప్పుచున్నదే. అని యనినచో భార్యలేనిదే క్రతువు లొనరించుటకు వీలులేదు. ఇతడు రామునివలెనే క్రతువు లొనరించెనని భారతమే చెప్పుటచే[4] నితనికి భార్యకలదని తెలుచున్నది. అట్లగుచో భార్య యుండియు నితడు బ్రహ్మచర్యము చేయుచుండెనని యనవలయును. కావున నతడు సర్వాశ్రమ ధర్మములను పాటింపక ప్రవర్తించెనని చెప్పవలసి వచ్చుచున్నది.

పోనిండు. నాతిగల బ్రహ్మచర్యము పనికిరాదా? రాదు. సన్నిధిలో ఋతుస్నాతయగు భార్యయున్నచో ఉపగమింపకుండుట విహితాతిక్రమము.[5] కాగా భార్యయుండియు బ్రహ్మచర్య మొనరించుట ధర్మ వ్యతిక్రమము. భార్య లేదనిన యెడల, భార్య లేకుండ క్రతువు లొనరించుటయు[6] ధర్మ వ్యతిక్రమము. కావున భీష్ముడును రాముడును ధర్మ వ్యతిక్రమ మొనరించిరా ?

"పితృ భక్తి కతన భీష్మునకును, స్నేహము కతన రామునకును ధర్మ విరోధము లేదు." (తం. వా) భీష్ముడు దాశరాజు కడ కరిగి తన తండ్రికి సత్యవతి నిమ్మని కోరెను. మహాబలుడవగు నీవు రాజ్య మభిలషించియుండగా, 'సత్యవతీ సంతానమునకు రాజ్యము లభింపదు.' కావున 'ఈయను.' అని దాశ రాజనెను. 'నాకు రాజ్యము వలదు. నేను పుడమి నేలను.' అని భీష్ముడు ప్రతిన యొనరించెను. నీవు రాజ్య మభిలషింపకున్నను నీ సంతతిని చూచి సత్యవతీ సంతతి భయపడును గావున సత్యవతీ సంతతికి రాజ్యము దుర్లభము' అని దాశరా జనెను. 'సంతతి కనకుండుటకు కూడ నిశ్చయించితిని. ఓ దాశ

---

4) 'య ఏష రోషాత్ ప్రతపన్ బలిష్ఠో
యోన స్సేనా సింహ ఇవా రరక్ష
స ఏష భీష్మః కురువంశకేతు
ర్యేనా హృతా త్రిశతం వాజిమేధా'

5) ఋతు స్నాతాంతు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి తస్యా రజసితం మాంసం తర ప్తస్య శేరతే.

6) న్యాయసుధ చూడుడు.

రాజా! ఇది మొదలు నాకు బ్రహ్మచర్యము కాగలదు.[7] అని భీష్ముడు పితృ భక్తిచే బ్రహ్మచర్య మవలంబించెను.[8]

భీష్మునకును రామునకును ధర్మ సూత్రమునకు దారలు కలరు. (తం.వా)

వీరిరువురకును భార్యలున్నారని యే పురాణమును చెప్పలేదే? ఉన్నారని నీ వెటులు చెప్పగలవు?

భీష్ముడు పెక్కులు అశ్వమేధము లొనరించినటులు భారతమును, రాముడు పలు జన్నము లొనరించినటులు రామాయణమును[9] చెప్పుచున్నవి. కావున వీరిరువురకును, కేవల యజ్ఞార్థ పత్నీ సంబంధము కలదని ఏ పురాణమేని చెప్పకున్నను, అర్థాపత్తి ప్రమాణముచే గమ్యమానమగుచున్నది. 'ఎప్పుడు ఇది తండ్రి చేయి యని తెలిసినను శాస్త్రార్థాతిక్రమమునకు జంకి, ఆ చేతిలో పిండము నుంపక దర్భలమీదనే యుంచెనో, అట్టి భీష్ముడు[10] భార్యలేని యేకాకి యజించునా? (తం.వా).

---

7) అపత్య హేతో రపిచ కరోమ్యేతి ద్వినిశ్చయమ్
ఆద్యప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి'

8) చూ. న్యాయసుధ.

9) యజ్ఞే యజ్ఞే ప్రకురుతే సీతాం పత్నీం హిరణ్మయీమ్.

10) సీ. అనఘ మాతండ్రి శంతనుడు లోకాంతరం
బున కేగినను నేను విజయ మొప్ప
నౌర్ధ్వ దైహికమున యందు బ్రశస్తిమై
నెసగు పిండము దగ నిడదొడంగ
గంకణ కేయూర కమనీయమును నరు
ణాంగుళీ దళమును నైన హస్త
మూర్వి భేదించి సముత్థితం బగుటయుఁ
గని యన్నరేంద్రుని కరముగాగ

నిశ్చయించి యధిక నిపుణంబుగా విచా
రించి శాస్త్ర నియమ రీతి యొకటి
యాదరించి భువి గుశాస్తరణంబు సే
సితిని శాస్త్రవిధి బ్రసిద్ధ బుద్ధి. (హరి. పూ. ౨. అ)

సరియ. భార్యయుండియే భీష్ముడు యజించెనందము. మఱి ఋతు కాలాగమన ప్రత్యవాయము రాదా ? అనినచో, నితడు పూనిన బ్రహ్మచర్య వ్రతము నైమిత్తికము. దీనిచే నిత్యమగు ఋతుకాల గమనమునకు బాధ. దాన ధర్మ మాత్రార్థమే నేను పెండ్లాడగలనని చెప్పి, పెండ్లాడిన భార్య నుపగమింప కున్నను దోసగులేదు.

శ్రీరాములవారును సీతమీది స్నేహముచే కొండొక భార్య నుపగమింపనని వ్రతముగొని ధర్మమాత్రార్థ మొకభార్య నట్లే పెట్టుకొనిరి. దాన రామునకు యాగసిద్ధి. ఇటులగుచో- 'యజ్ఞే యజ్ఞే ప్రకురుతే సీతాం పత్నీం హిరణ్మ యీమ్'- అని చేసిన ప్రతియజ్ఞమునందును బంగారు సీత నేల చేయించి పెట్టు కొనెనని యందురా, లోకాపవాదభీతిచే విడిచిన సీత యెడల నిష్ఠురత్వము లేదని తెలుపుటకే. సీత మీది స్నేహము కతన భార్యాంతరాగమనవ్రతము గొనుటచేత రామునకును ధర్మవ్యతిక్రమము లేదు.[11]

భీష్మునకు సంతానము లేదు కదా! ఇతనికి పితౄణాపాకరణ మెటులు ? భీష్మునకు వ్యవహితాపత్యకృతమైన పితౄనృణ్యము కలదు. 'సోదరులలో ఒకడు పుత్రవంతు డగునేని ఆపుత్రునిచేతనే మిగిలిన వారందఱును పుత్రవంతు లని" మనువు చెప్పె;[12] గాన విచిత్ర వీర్య క్షేత్రజులగు పుత్రులచేతనే పుత్ర వంతుడై భీష్ముడు పితౄణమునుండి విముక్తి బడయగలడు. (పితృభక్తిచేత పితౄణ విముక్తి యని నాగేశుడు.) రాముడో, కుశలవులచే సాక్షాత్ పుత్ర వంతుడు. కావున తద్విషయమున ఏమియు చెప్పనే పనిలేదు: (తం. వా).

తంత్రవార్తికము చెప్పిన 'రామునకును భీష్మునకును ధర్మ మాత్రార్థ దారలు కల'రను నభిప్రాయమును వ్యాఖ్యాత భట్ట సోమేశ్వరుడు భీష్మ విషయ మున భారతమునందలి 'అపత్యహేతోః' (సంతతి బడయకుండుటకుగూడ నిశ్చ

11) చూ. న్యాయసుధ.

12) "భ్రాతౄణా మేకజాతానా మేకశ్చేత్ పుత్రవాన్ భవేత్
సర్వే తేనైవ పుత్రేణ పుత్రిణో మను రబ్రవీత్"

యించితిని)- ఆద్యప్రభృతి- (ఇది మొదలు నాకు బ్రహ్మచర్యము కాగలదు.) అను విశేషణముల సామర్థ్యముచే[13] బలపఱచెను.

పద్మపురాణము భీష్ము డా జన్మబ్రహ్మచారి యనియు, ఆబాల్యబ్రహ్మచారి యనియు చెప్పుటయు, అందఱును భీష్మునకు తర్పణము విడుచుటయు, అర్ఘ్యము నెత్తుటయు కుమారిలు డెరుగడా ?

ఈ ప్రశ్న ఇంకొక ఎదురు ప్రశ్న నాకాంక్షించును. అది, ఇది: భారత వాక్యములకు రెండింటికి (అపత్యహేతోః)- (ఆద్యప్రభృతి-) వ్యాఖ్యాత చెప్పిన అర్థము కుమారిలునకు సమ్మతమా ? సమ్మత మనుచో దాశుని ముందు ప్రతిజ్ఞ చేయుటకు వెనుక ధర్మమాత్రార్థ పత్ని అక్కఱలేదు ! కావున ప్రతిజ్ఞ చేసిన నాటికి ముందే భీష్ముడు గృహస్థు అని అనవలెను ! అపుడు పద్మపురాణము బాధక మగును ! అగుచో అది ప్రక్షిప్తమని అందురా ? అసమ్మత మగుచో యాగసిద్ధికి ప్రతిజ్ఞ తర్వాత నెపుడో జరిగిన ధర్మసూత్రార్థ వివాహముచే ఆజన్మబ్రహ్మచర్యమున కిసుమంతయు హానిలేదు. కాన పద్మపురాణము బాధకము గాదు. కావున కుమారిలుడు పద్మపురాణ మందలి భీష్ముని ఆజన్మ బ్రహ్మచర్యము నెఱుగు ననవచ్చును. కాని 'ఆద్యప్రభృతి'- (ఇది మొదలు బ్రహ్మచర్యము కాగలదు.) అనునది వ్యాఖ్యాత భట్ట సోమేశ్వరునిపై పడగ యెత్తును. ఏలనగా సోమేశ్వరు డీ 'ఆద్యప్రభృతి'లో నుండి భీష్ముని భార్యను చూచుచున్నాడు. అట్టి వానికి పద్మపురాణము బాధకము. ప్రతిజ్ఞకు పూర్వమే గార్హస్థ్యములో నున్న భీష్ము డాజన్మబ్రహ్మచారి యెటులు కాగలుగును ? పోనీ, పద్మపురాణమునం దీ శ్లోకములు రెండును ప్రక్షిప్తములా ?

భీష్మాష్టమి, భీష్మపంచక వ్రతము మొదలగు వానినిచెప్పిన కౌస్తుభము, ధర్మసింధువు మొదలగు గ్రంథములను బట్టి వీనిని ప్రక్షిప్తములని త్రోసి

---

13) కేవల యజ్ఞార్థ పత్నీసంబంధ అపీ దిత్యర్థాపత్త్యాను క్త మపి గమ్యతే. (తం. వా.) నను తయోర్ధర్మమాత్రార్థ దార సద్భావః క్వచిదపి పురాణేతిహాసయో రను క్తః కేనప్రమాణే నావగమ్యేతేత్యా శంక్యాహ - కేవలేతి - అపి శబ్దేనాపత్యహేతో రద్యప్రభృతీతిచ విశేషణ సామర్థ్యా దప్యేవ మవగమ్యత ఇతిసూచితమ్. న్యాయసుధ.

పుచ్చుట దుష్కరము. మఱియు భరతఖండమునకే పితామహుడును, ఏకైక ప్రతినిధియు, మహా యోగేశ్వరుడు నగు నీ భీష్మునకు భరతఖండ మెన్ని శతాబ్దులుగా తర్పణ మర్పించుచున్నదో యెవరెరుగనిది? అదియటుండె.

భీష్మునకు యాగసిద్ధికై పత్ని కలదను నభిప్రాయము విద్యారణ్యుల కిష్టము కాదని 'మంజూష-భీష్ముడు' అను వ్యాసమున చూచియుంటిమి. వారి మతమున భీష్మ డవివాహితుడు. శ్రీరాము డసన్నిహిత పత్నీకుడు.

నైమిత్తికముచే నిత్యమునకు బాధ చెప్పిన తంత్రవార్తిక వ్యాఖ్యాత భట్ట సోమేశ్వరుని భట్ట నాగేశుడు శోధించెనని అర్థాపత్తిచే అనుక్తమును గూడ మన మూహింపవచ్చును.

'ఆద్య। ప్రభృతి' అను దానికి ఇతడు చెప్పిన అర్థమునుగూడ నాగేశభట్టు కాదనెననియు ఊహింపవచ్చును.

ఇక పత్ని లేకుండ యాగసిద్ధికి నాగేశుడు 'అపత్నికోగ్ని హోత్రమాహ రెన్నాహరేత్? అహరేదిత్యాహుః' అను బహ్వృచ బ్రాహ్మణమును జూపెను. ఈ బ్రాహ్మణము కుమారిలునకు తెలియదా? తెలియ దనుట పాడి గాదు. ఈ శ్రుతికి సంకుచితార్థ మీతనికి అభిమతము కావలయును. కాన దాప నితడు ముట్టక యాగసిద్ధికి అర్థాపత్తి ప్రమాణము నూతగా కొని 'అపివా కారణా గ్రహణే ప్రయుక్తాని ప్రతియేరన్'- అను సూత్రమును సదాచారాత్మ తుష్టుని యెడ ప్రామాణ్యపరముగా యోజించి రామభీష్ములను గూడ ఈ పద్దులో జేర్చెను. రామభీష్ముల ప్రక్క పేర్లు లేని ఆ యిల్లాండ్రు 'తగుదుమా' యని కూర్చుండుట కెన్ని గుండె లుండెనో కదా![14] విద్యారణ్యుల కిది అనిష్టమని 'మంజూష-భీష్ముడు' అను వ్యాసమున కనియుంటిమి. కుమారిలుని మతమున

---

14) "పతాం హి సందేహ పదేషు...." అను కాళిదాసు నుదాహరించిన కుమారిలుడు రఘువంశము నందలి "సీతాం హిత్వా దశముఖ రిపుర్నోపయేమేయ దన్యాం తస్యా ఏవ ప్రతికృతి సఖో య త్క్రతూ నా జహార...." (14-87) అను శ్లోకమును మరచి స్వర్ణసీతను పక్కను పెట్టుకొని యాగముచేయుట ఆనృశంస్యమును ప్రకటించుటకే యని చెప్పెను.

కణ్వ విభాండవాదులకును ఒకొొక యిల్లాలి నంటు గట్టవలెను. నాగేశుడు కణ్వు నకు భార్య నంటగట్టుచో శాకుంతలము శాస్త్ర విరుద్ధత్వ దోష దుష్ట మగు ననెను. గాని యీమె ఉళ్లక్కి యిల్లాలు గదా! ఆ ఉళ్లక్కి యిల్లాలు కూతు గాదు గదా శకుంతల! ఈ ధర్మమాత్రార్థదారచే అతని శాశ్వత బ్రహ్మచర్య స్థితికి ధోకా లేదే?

ఇక నొకటి: 'అపత్నికోఽప్యగ్ని మాహరేత్'- అనునది సామాన్య శ్రుతియే యగు నెడల అపత్నీకునకును యజ్ఞము విధి విహితమే యగుచున్నది. కావున ఇదానీంతనులు చేయరాదని వివేచన మేల?

అట్టి యాచారము పోయినది. ఊర్ధ్వరేతస్కత మొదలగు గుణములు కల వారే దాని కధికారులు అని నాగేశుడు!

తల్లివంక తమ్ముడగు విచిత్రవీర్యుని పుత్రవంతు నొనరించిన కృష్ణ ద్వైపాయనునకు ధర్మవిరోధము.[15] తొల్లి చేసిన తపోబలము కలిమిని, ఎల్లి చేయబోవు తపము కతమునను సమయుగలదనియు మఱియు అట్టి తపోబలము కలవా డెవడేని ఇట్టి పనిని చేయనే చేయుననియు కుమారిలు డనెను. కాని పత్ని లేక యాగసిద్ధికి భీష్మునిలో తపోబలమేని అతనికి కనబడలేదు. కనబడకున్న మానె, వాసుదేవాదులకుగూడ విస్మయము కలిగించునది భీష్మదేవుని యోగ బలము-

"ధారయామాస చాత్మానం
ధారణాసు యథాక్రమమ్
తస్యోర్ధ్వ మగమన్ ప్రాణా
స్సనిరుద్ధా మహాత్మనః"

"యద్యన్ముంచతిగాత్రం హి సశంతను సుత స్తదా
తత్త ద్విశల్యం భవతి యోగయుక్తస్య తస్యవై
క్షణేన ప్రేక్షతాం తేషాం విశల్య స్సోఽభవ త్తథా"[16]

---

15) నియోగము వాగ్దత్తా విషయము, అంబికాంబాలికలు విచిత్రవీర్యునిచే పరిణీతలు. దాసి భాతృజాయా కాదు. బ్రహ్మచారికి సంప్రయోగము నిషిద్ధము. చూ. న్యాయసుధ.

16) "ధారణానుక్రమంబున సమాహితాత్ముండయి వాయువుల సన్నిరుద్ధంబు చేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె- నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు వాపి గొనుచు వచ్చు నయ్యైచోట్లు శల్యరహితంబు లగుచుండె- నట్లగుటం గాంచి కృష్ణాదులగు నఖిల జనం బులు నాశ్చర్య భరితాంతః కరణు లగుచు గీర్తించిరి. (అను. 5-468).

అని భారతము. (భీష్మ స్వర్గారోహణ పర్వ). 'ఇప్పటి వారి కది అశక్యము' అని నాగేశభట్టు. శక్యమగుచో చేయవచ్చునా?

జగద్గురువగు శ్రీరామకృష్ణ పరమహంస, కృష్ణద్వైపాయనుడును భీష్ముడును చేసిన పనులవంటి పనులు చేయకున్నను, శ్రీశారదామాతతో వసించెను. వారిది భక్తియోగమని కొందరు సమర్థింతురు గాని శ్రీతోతాపురియే దీనికి తగిన సమాధానము చెప్పెను. 'అట్టి తపోబలము కలవాడెవడేని... చేయనే చేయు'నని కుమారిలు డనెను. మరి నాగేశభట్టు జంకి 'ఊర్ధ్వరేతస్కత మొదలగు గుణములు కల తొల్లిటి వారికే అట్టి అధికారము.' (అపత్నీకునకు యజ్ఞమునందు) అని అనెను.



# 1. భావకవిత్వము

"అంబ! నవాంబు జోజ్జ్వల కరాంబుజ! శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్న దీపికా
చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ! భా
వాంబర వీధి విశ్రుత విహార! నను గృపజూడు భారతీ!

సహృదయులారా,

భావకవిత్వము భావకవిత్వమని సుమారు పది పండ్రెండేళ్ళ నుండియు తెలుగునాట ఒక ధ్వని బయలుదేరినది. దీని ప్రతిధ్వనులతోడను, ప్రతిస్పందములతోడను, దూషణ భూషణములతోడను దిక్కులు బధిరితము లగుచున్నవి.

భావము లేనిచో కవిత్వమేకాదు. కావున పునరుక్తి[1] మనియు, దానఁజేసి భావకవిత్వమనియు, మూపకవిత్వ మనియు పండితులు అనుచున్నారు.

నవీనులు ఆంగ్లభాషా కోవిదులు కొందఱును, తదనుయాయులు కొందఱును భావకవిత్వమనియు, భావ గీతములనియు, మాటిమాటికి వ్రాఁత కోఁతలలో ఉప్పువలె వాడి వేయుచున్నారు. ఏల వాడఁగూడదని కొందఱు మొరాయించుచున్నారు. అసలులోనే తగాదా.

భావకవిత్వమను నామకరణము ఏనాడు ఏ బారసాలలో చేసిరోకాని ఇది వివాదగ్రస్తమై పోయినది. లేనిదానికి పేరు పెట్టముకదా? అలులేదు చూలు లేదు- అల్లుని పేరు సోమలింగము!

అయితే నవీన వస్తువులను నిర్మించి దానికి పేరు పెట్టుట చూచుచున్నాము. గ్రామఫోను మొదలగు యంత్రముల పేరులు యోగరూఢములు. రూఢములు కావా? నా సతీర్థ్యుడు- మహా ఉపజ్ఞకలవాడు- పెద్ద INVENTOR ఒకాయన

---

1) Lyric poetry అను వ్యవహారమునందును (Tautology) పునరుక్తి కలదు.

వేదములను శ్లోకములను అనుకరించి అవ్యక్తముగా గబగబా ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయములతో ఒక గ్రంథము సాంతత్యముగా చెప్పికొనుచుఁ బోవు చుండెడివాఁడు. యజుర్వేదము వచ్చిన వారెవరేని ఇదియేమి యని యడుగుచో ఋగ్వేదమనియు, ఋగ్వేదు లడిగిన యజుర్వేదమనియు ప్రత్యుత్తరించువాడు. చలానా అయ్యెడిది. ఒకానొకప్పుడు ధనుర్వేదముతోఁగూడ పని పట్టుచుండెడిది. కొన్నాళ్లకతఁడు దానికి అర్యమణ వేదమని సంకేతము సృష్టించి పాఱవైచెను. దానివలె ఈ భావ కవిత్వము అర్యమణవేదమా? నిస్సందేహముగా కాదు. సిద్ధ మైన వస్తువున్నది. పేరులోనే పోరు.

పేరు నందింద్రజాలమున్నది. దంపతులు తమకుఁ గూర్చు బిడ్డనికి పేరు పెట్టుటలో వివదింతురు. భర్తకు నచ్చినపేరు భార్యకు, భార్యకు నచ్చిన పేరు భర్తకు నచ్చదు. కొన్నాళ్ళనుండి మఱచిన ప్రణయకలహము బారసాలనాడు మఱల మొలకెత్తి కలహమగును. పర్యవసానము బిడ్డనికి పేరుండదు. లోక వ్యవహారమునకు చిన్నవాఁడు, పెద్దవాఁడు, అను పేరులు ఖాయపడును.

ఈ సందర్భమున ఒకటి గుర్తు వచ్చుచున్నది. ఇరువురు ధనికు లొక కొన్నివేల యెకరముల భూమి కొనిరి. అందు నూతులు చెఱువులు త్రవ్వించిరి. కొంతమంది రైతులను ప్రవేశపెట్టి ఇండ్లు వేయించిరి. మంచి ముహూర్తమున పీఁటలపై కూర్చుండి గ్రామమునకు నామకరణము చేయనారంభించిరి. ఒకరి పేరొకరి కిష్టము కాలేదు. నూతులొకరు పూడ్వఁగా, చెఱువులొకరు పూడ్చిరి. ఒకరు కొంపలు కూల్చఁగా ఒకరు రైతులను తరిమిరి.

అయితే పెద్దలు What is in a name? అనియు, 'నామమాత్రే వివాదః' అనియు నందురు. ఈశ్వరుఁ డనువాఁడొకఁ డున్నాడని తేలుచో ఆయనకు మనము శివుఁడనియో విష్ణువనియో పేరు పెట్టుకొందుము.

ఇంగ్లీషులో 'లిరిక్' అనునది కలదు. దానికి 'భావకవిత్వ'మని తెలుఁగు.

'లిరిక్' అను ఈ భావకవిత్వము మన సాహిత్య శాస్త్రమున ధ్వని- భావ ధ్వని- రసధ్వని ఈ మొదలుగా పరిభాషింపఁబడును.

[లైర్ అనునది చితారువంటి జంత్రము. ఒంటి తీగ తంబురా, శ్రుతితో బొబ్బిలి కథ మొ. పాడి నటులు లైర్ శ్రుతితో పాడు పాటలకు లిరిక్ అని తొల్లిటి వ్యవహారము. తరువాతఁ దరువాత లాక్షణికముగా వ్యవహరింపబడు చున్నది. గ్రీసులో క్రీస్తు పూర్వము 610 నాట శాఫో అను నామె గొప్ప లిరుక్కులు చెప్పెనట!]

అయితే లిరుక్కు యొక్క రాజ్యమున భావకవిత్వమునకు పట్టాభిషేకము చేసి దానిని కొలుతుము. "స్థితస్య గతి శ్చింతనీయా".

కవిత్వ మన నేమియో తెలియనిది భావకవిత్వము తెలియదు. మృగ మన నేమియో తెలియనిది కస్తూరీ మృగము తెలియదు గదా?

కవిత్వమును తత్‌జ్ఞులు అనేక మంది అనేక విధములుగా నిర్వచించిరి. కేవలము ఆ నిర్వచనములను ఒకచోఁ జేర్చుచో ఒక కోశ మగును. అందులో పరస్పర భేదములు పరస్పహ్రసము. వారి వివాదముతో వాణి వీణాతంత్రులు తెగుటయేకాక వీణబుఱ్ఱయు, వినువారి బుఱ్ఱయు పగిలిపోవును. అయినను విభిన్నములగు ఆ ధ్వనులలో కవిత్వమును గూర్చి తెలిసికొనవచ్చును.

చంద్రుడేడి అని యడుగుచో మనము చూపఁగలము. చంద్రుడనగా ఏమిటి? అనుచో ఆలోచింతుము. ఒకడు మంచు ముద్ద యనియు, ఒకఁడు ఒకానొక దేవుఁడనియు, ఒకడు గ్రహ విశేషమనియు కల్పనలచే, మత విశ్వాస ములచే, శాస్త్రములచే మెలమెల్లగా పరిష్కరింతురు. అన్నిటిలో సత్యము లేక పోదు. కాని ఏదియు సంపూర్ణ సత్యము కాదు. అనుభూతియే సత్యము.

ఆ రీతిగనే కవిత్వమును శృంగగ్రాహికగా చూపగలము. కాని అవ్యాప్తి అతి వ్యాప్తులు లేకుండ నిర్వచించుట సులభము కాదు. ఎంత నిర్వచించినను చక్రవాళము వలె ఆవలనే యుండును. తెలిసిన వారికే ఆ నిర్వచనము లుపయో గించును. తెలియని వారికి ప్రత్యుత భ్రాంతి జనకము కూడ నగును.

కుఱ్ఱఁడొకడు బడిలో ఏనుగు పాఠము చదివికొనెను. చదివిన కొలఁది నాళ్లకే బందరు వెళ్లెను. అచ్చట విచ్చలవిడిగా విహరించు పందులను చూచి "నాయనా! ఈ యూర ఇన్ని యేనుగు లున్నవేమి?" యని అడిగెను.

కవిత్వ మనఁగా నేమియో తెలియుటకు కవిత్వమునకు విషయమేమో, దాని ప్రయోజనమేమో ఈ మొదలగునవి విచారించుట లగ్గు. మన మీ బాటను నడిచి కవిత్వ మన నేమియో తెలిసికొందము. మనకు దారి బత్తెము మాత్రము సాహిత్య శాస్త్రము పెట్టిన బిచ్చమే.

మంత్రములు, ఉపనిషత్తులు, పురాణములు, కావ్యములు, నాటకములు లహరులు, భావశతకములు, చాటువులు, అన్యోక్తులు, శిశుక్రందీయములు- ఈ మొదలుగా లెక్కించుటకు వీలులేనన్ని భేదములతో నిండిన గ్రంథరాశిలో కవిత్వ మున్నది. ఋషులు, దేవ మనుష్యులు, మనుష్యులు వీనికి కర్తలు.

వీని యన్నింటి యందును "ముత్తెపు సరుల్ పోహళించిన లీలఁ దమలోన దొరయు శబ్దము"లును, చక్కని అర్థములును కలవు. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అని జగన్నాథ పండితులు, The best words in the best order- అని కోల్రిడ్జి.

వీనిలో మనస్సు అందుకొనఁగలిగిన పదార్థము నుండి అందఁజాలని పదార్థము వఱకు, కుటీర సృష్టి నుండి చిన్మయసృష్టి వరకు, ఉన్మాదము నుండి ఆనందము వరకు, ఉత్తేజనము నుండి తన్మయత వరకు మనము చూచుచున్నాము.

ఇటులు కవిత్వము ఆబ్రహ్మస్తంబ పర్యంతము వ్యాపించి యున్నది. కవితకు విషయము కానిది లేదు; శక్తిమాత్రము ఉండవలయును గాని, కవి కాంచనిచో రవి కాంచ నేర్చునే!

కవి, కవియొక్క జీవితము; విశ్వము, విశ్వముయొక్క జీవితము, ఈశ్వరుఁడు - కవితా దర్పణమునందు ప్రతిబింబించు చున్నారు. కాగా కవిత్వమును ఒక విధముగా లోకవృత్త మనఁ జెల్లును. 'నాటకం లోకవృత్తం స్యాత్'. ఇదియే Interpretation of life - 'సారం విశ్వస్య' అని గోవర్ధనుడు.

కవిత్వము యశస్కరము. కాళిదాసు నెవ రెఱుఁగరు? తెలుగు నాటిలో తిరుపతి వేంకటేశ్వరులకు తిరుపతి వేంకటేశ్వరులకు భేదములేదు. టాగోరు జగ

మెరిగిన బ్రాహ్మణుడు. 'కావ్యం యశసే'. అన్నిటికంటె కవిత అప్పటికప్పుడు అతి సంతోష జనకము, 'సద్యః పర నిర్వృతయే".

కవి యొక్క సంకల్పము, భావనచే సత్యముగా సుందరముగా ఉద్దీపిత మగుచున్నది. మఱియు ధ్వనిచే ఆత్మవంతమయి తన్మయత కలిగించి ఆనంద మున ముంచి యెత్తుచున్నది.

## భావన : సృష్టి : అలంకారము

కవి కొక దివ్యదృష్టి కలదు. అతఁడు దానితో విశ్వము నందలి సత్య సుందర రూపము కనును, దానిని సహృదయులకుఁ గూడ గోచరింపఁజేయును.

ఒక్కొకచో యథార్థమునే రమణీయముగా సృజించును :

"శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులం
జారుతరంబు లయ్యె, వికసన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి, సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచి పూరములం బరిపూరితంబులై"

[భారత - అరణ్య 4 - 142]

"అరుదగు తత్పయోద సమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుద ధ్వనియుఁ, బల్వలభూముల భూరి దర్దురో
త్కర రవముల్, మహీరుహ శిఖండము లందు శిఖండితాండవాం
తర మద మంజుల స్వన ముదార తరంబగుచున్ వనంబునన్"

[భారత - అరణ్య - 4 - 137]

కొన్ని చోటుల కొంచెము దవ్వుగ :

కులిశ ధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగు మోవఁగ జేగుత్తైన తటులఁ
గనుపట్టు లోయ గంగా నిర్ఝరము వాఱఁ
జలువయౌ నయ్యేటి కెలఁకు లందు

నిసుక వెట్టిన నేల నేచి యర్కాంశువులఁ
జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముక పున్నాగ నారంగ రంభా నారి
కేళాది విటపి కాంతార వీథిఁ

గెరలు పిక శారికా కీర కేకి భృంగ
సారస ధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతి శబ్ద మీన గంధర్వ యక్ష
గాన ఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె.

[మనుచరిత్ర, ద్వితీయ - 19]

ఇది ప్రకృతి కనుకృతి లేక ప్రతిసృష్టి.

అఖిల లోకానందుఁ డగు చంద్రుఁ డెందేనిఁ
గలిగె నుజ్జ్వల ఫేన కణము మాడ్కి
నై రావణాది మహాకరు లెందేనిఁ
బ్రభవించె మకర శాబముల పగిదిఁ
గమనీయ సురతరు సముదయం బెందేని
జనియించె శైవాలచయము భంగి
భువనైకమాత మాధవు పత్ని యెందేనిఁ
బొడమె మాణిక్యంపు బొమ్మ పోల్కి

నాది మత్స్య కూర్మములు విహారలీలఁ
దనరు నెందేని ప్రకృతి సత్వముల కరణి
నట్టి యంభోధి యొప్పారు నద్భుతైక
సార మహనీయ మహిమ కాధార మగుచు.

[నృసింహ పురాణ 1-26.]

ఈ సముద్రము వట్టి నల్లనీరు కాదు :

కవికి సుందరమైన యిల్లు, సుందరమైన తోట, సుందరియగు సుందరి. సుందరమగు ప్రపంచము - ప్రతిది సుందరమైనదే కావలయును. అతని సృష్టి లోని ప్రతి పరమాణువు నందును ఎత్తుకెత్తుగా సౌందర్య మిమిడి యున్నది.

అందఱకు లత లతగానే కానవచ్చును; కవి కది ఉద్యాన లలన.

"అతి రుచిరాగతుండయిన యాతనికిన్ హృదయప్రమోద మా
తతముగ నవ్వనంబున లతా లలనల్ మృదులానిలాప వ
ర్జిత కుసుమాక్ష తావళులు సేసలు వెట్టిన యట్టిరైరి సం
పత దళిసీ నినాద మృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్"

[భారత - ఆది. 4-17]

చంద్రుఁడు రాగనే కలువ వికసించును. కవి అందలి సాధర్మ్యము గొని ప్రణయములోనికి వడియఁ గట్టెను-

"కటికి చీకటి తిండి కరముల గిలిగింత
నెవ్వాడు తొగకన్నె నవ్వఁజేయు" [మను. 1-18]

ఇచట చంద్రుడు నాయకు డయ్యెను. కిరణములు చేతులు. కలువకన్నె. గిలిగింత వెట్టగా కన్నె నవ్వుచు నీకు ఆనంద మిచ్చుచున్నది.

ఇటులే నదులు, పర్వతములు మొ. నాయికా నాయకులుగా సృజింపబడు చున్నారు. వసుచరిత్రము మొ. అట్టివే! సాంఖ్యుల ప్రకృతి పురుష లట్టివారే; ప్రకృతి గడ్డి; పురుషుఁడు కుంటియట! స్వర్గము కవి సృష్టియే. అచటివారు నిత్యయౌవనులు. ప్రాయమున సంఖ్యలో వారికి ముప్పదికి పైనిలేదు. నిత్య సుందరులు! గంధర్వులు, అచ్చరలు వీరంద రెవరు?

కవి కడువత్సలుఁడు; ఎంత వాత్సల్యము లేనిదే జగతిని సుందరముగా చూడఁగలడు? అతఁడు విశ్వ చేష్టిత మందు తన చేష్టితమును చూచును.

"వేడుక చేతులు విచ్చి యాడెడునట్లు
లోలోర్మి పంక్తులఁ గ్రాలిక్రాలి" [అరణ్య 4-228]

"దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీ రజో
మిళిత సుగంధ బంధుర సమీరణుఁడన్ సఖుఁడూచుచుండగా
నులియుచుఁ బువ్వుగుత్తులను నుయ్యేల లొప్పగ నెక్కియూగె ను
ల్లల దళిసీ కులంబు మృదుల ధ్వని గీతము విస్తరించుచున్."

[అరణ్య 4-138]

ఇచట కవి తరంగ కల్లోలమును చేతులెత్తుకొని యాడుటలో చూచెను. తుమ్మెదలు పూగుత్తుల నెక్కి మ్రోయగా ఉయ్యేల లెక్కి పాడుట అను మనుష్య చేష్టితములుగా తీసికొనెను. మనుష్యునకు తనయందు, తన చేష్టయందు ఎంత ప్రీతియో! అవ్యక్తశబ్దములకుఁ గూడ తన యర్థము ముడివెట్టుట చూచుచో కవి విశ్వ విశ్వమును తనలోనికి తెచ్చుకొనుట విశదమగును.

"ఇవి రాజసుతులు చేయవలసిన పనులు
కావుకావంచుఁ గాకంబు లఱచె." [బుద్ధ చరిత్ర]

కాకులు కావు కావని కూసినవి. ఇవి రాజుసుతులు చేయవలసిన పనులు కావు-కావని కూసినవట.

"యేషాం శ్రీమద్యశోదా సుత పదకమలే నాస్తి భక్తి ర్నరాణాం
యేషా మాభీరకన్యా ప్రియగుణకథనే నానురక్తా రసజ్ఞా
యేషాం శ్రీ కృష్ణ లీలా లలిత గుణరసే సాదరౌ నైవ కర్ణౌ
ధిక్తాన్ ధిక్తాన్ ధిగేతాన్ కథయతి సతతం కీర్తనస్థో మృదంగః-"

ధిక్ అనగా ఛీ. ధిక్ తాన్ అనగా వారిఁ గూర్చి నిందలగు గాక. మద్దెల కృష్ణ భక్తి లేని వారిని ధిక్తాన్ ధిక్తాన్ అనుచున్నదట.

ప్రబంధ మిటులు అపూర్వముగ సృజింపఁబడును. ప్రవర వరూధినీ సృష్టి అపూర్వము. షెల్లీ- ఎపిప్సైకిడియను.

భావన ఇంకొక మెట్టెక్కినది. మంత్రద్రష్టలు ఇటులు చెప్పిరి.

"ద్వా సువర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే;
తయో రన్యః పిప్పలం స్వా ద్వ
త్త్యనశ్న న్నన్యో అభి చాకశీతి."

మంచి రెక్కలుగల రెండు పిట్టలు చెలిమితో ఒక చెట్టుననే ఉన్నవి. దాని తీయనిపండు ఒక పిట్ట అరగించుచున్నది. రెండవది తినక చూచుచున్నది.

[అలంకారికులు దీనిని రూపకాతిశయోక్తి అని అందురు. Mystic poetry అని కొందరు. Allegory కి రూపకాతిశయోక్తియే బీజము.]

కవికి భావన యోగశక్తి. దీనిచే దూరశ్రవణము, పరకాయప్రవేశము మొదలగు మహిమలు పొందియు కవి ద్రష్టయే. అతని నాగబెత్తము తాకుచో శూన్యమునందు నగరములు పుట్టును; భరద్వాజ విందులు జరుగును. అతడు దేనిని సంకల్పించునో అది సిద్ధమగును. "సత్య కామః సత్యసంకల్పః, స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః : తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" అని సగుణ ముక్తుని విషయమై ఛాందోగ్యము చెప్పినటులు మహాకవియు మానస జగత్తునందు సత్యకాముఁడు, సత్య సంకల్పుఁడు; అతడు తినుచు తిరిగెడి సత్య సంతోషి; అన్ని లోకము లందును అతనికి కామచారము.

## ధ్వని లేక వ్యంగ్యము

ఒక గృహస్థు సభాగృహమున విద్వాంసులతో మాటలాడుచున్నాడు. తెరలో నుండి మోము వెట్టి కాంత మృదు మధురముగా పిలిచెను. మాటల సందడిలో ఈ ధ్వని యేమి ? అని అటుచూచి ఆలకించెను.

ధ్వని ఒకానొక లోపలి పిలుపు. దాని యాకర్షణము మెండు. ధ్వని యొక్క గాఢంతయు, గాంభీర్యమును అక్షరాలా ఎంత మొత్తుకొనినను రాదు.

ఆవశ్యకములగు పనులలో మునిగి తేలుచున్న తల్లితో 'అమ్మా నాకు అన్నము పెట్టు'మని అడిగినచో, ఆమె పనులు ముగించుకొని వచ్చి అన్నము పెట్టును. 'అమ్మా ! ఆకలి యగుచున్నది, లేక కడుపు మండుకొని పోవు చున్నది' అని యనుచో పనుల నన్నిటిని పారవైచి ముని ముందు అన్నమిడును.

సంభాషణమునందును ఇట్టి ధ్వనులు ఉపయోగించువారు కలరు. వారి మాటలు మంత్రములు. వారిని వినుటకు సభ్యులు చెవికోసుకొందురు. పెద్దిభట్టు గారు, బులుసు పాపయ్య శాస్త్రిగారు, మంగళంపల్లి విశ్వేశ్వరశాస్త్రిగారు – వీరి ప్రసంగములు ధ్వని పూరితములయి ఉండెడివట ! లోకులు వీరి మాటలు నేటికిని చెప్పుకొందురు.

సొక్రటీసు, జాన్సన్ అట్టివారు; రామకృష్ణ పరమహంస ధ్వని సరస్వతి; నేటి తెలుగు వారిలో వేంకట రామశాస్త్రిగారు, సాంఖ్యాయనశర్మగారు, లక్ష్మీ నృసింహముగారు; వేంకట శాస్త్రిగారి సంభాషణ లన్నియు ఎవరును వ్రాయలేదు గాని అది ఒక గ్రంథము - ఇట్టి వా రరిది.

వ్యంగ్య మనఁగా తోఁపజేయదగినది మొ. అర్థము. అదియు పదముచేఁ గాని, అర్థముచేఁ గాని.

మూగవారు చేతులతో కనులతో సంజ్ఞ చేసి ఒక యర్థమును తోఁపఁజేయు దురు. అటులే పదముగాని, అర్థముగాని మూగలై ఒక అర్థమును తోఁపజేయును. 'గంగలో గొల్లగూడెము కలదు.' అను వాక్యము వినగనే, గంగలో గొల్ల గూడె ముండుచో 'నదీనాం సాగరో గతిః' అని కొట్టుకొని పోయెడిదే కాన 'గంగలో గొల్లగూడె ముండజాలదు' అని తోచును. అయినను ఇట్టి వాక్యమున్నది. గంగలో గొల్లగూడె ముండుటకు వీలు లేదు. కాన గంగా పదము మూగ. ఇది యేమి యర్థము తోపఁ జేయును? ఆ మూగది గొల్లగూడెము కడుచల్లనిది, పవిత్ర మైనది అని తోపఁ జేయును.

లేక గంగా పదము జాఁగ. అది నాలో గొల్ల గూడెము 'ఉండదో ఉండదో' అని కెరటములచే ఘోషించును. కాగా గంగ యొడ్డున గొల్ల గూడె మున్నది- అని చెప్పుటకు గంగలో గొల్ల గూడె మున్నది అనుకొందము. గంగ యొడ్డున గొల్ల గూడె ముండుట యేల? అను ఆలోచనము కలుగును. అపుడు గంభీరమైన గంగలో నుండి ఈ ధ్వని బయలుదేరును. 'నాలోని చల్లదనము, పవిత్రత గొల్ల గూడెమున ఉన్నవి' అని.

ఇటులే సూర్యుడు అస్తమించెను- అనఁగనే ఒకడు సంధ్యావందనమునకు లేచెను; ఒకడు పశువును కట్టఁబోయెను; మరి యొకడు సంకేతస్థల దారి బట్టెను. ఇట్టి వ్యంగ్యములు రమణీయములు.

ఒక్కొక్కప్పుడు వాచ్యార్థమే రమణీయమై వ్యంగ్యార్థమే లొచ్చుగ నుండును.

"సిరిగల వానికిఁ జెల్లును
దరుణులఁ బదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దఱేలా ?
పరమేశా ! గంగవిడుము పార్వతి చాలున్."

విష్ణు వసలే సిరికలవాడు. కావున అతనికి పదాఱువేల భార్య లున్నను చెల్లును. ఆది భిక్షువు ఉన్న భార్యనే అమ్ముకొనవలసియుండగా ఇద్దఱేల ? అను వాచ్యార్థము చమత్కారముగా నున్నది.

శ్రీనాథుడు పల్నాటిసీమలోఁ దిరుగాడుచు నడిదారిలో నీరు దొరకక తంటాలుపడి దవ్వుల ఒక చెఱువు చూచి శ్రమించి అటకుఁ బోవగా అందును నీరు లేకపోయెను. అపు డీ పద్యము చెప్పెనట: ఇందు జలముయొక్క అత్యంతాభావము గూఢ వ్యంగ్యము- ప్రకరణము తెలియనిచో వ్యంగ్యము తెలియదు. మిగిలిన ధ్వను లన్నిటికంటె వెంటనే స్ఫురించును గాన రసధ్వని మొ. వానినే సాహిత్య శాస్త్రము మేలుతరముగా నెన్నెను.

మహాకవులందరు వ్యంగ్య వైభవము తోడనే పుట్టిరి. ధనికుఁడు బంగారు పిచ్చుక యగుచో కవి వ్యంగ్యకలహంసము. ధనికుఁడు Golden Spoon తో పుట్టుచో కవిని 'జిహ్వాతే మధుమత్తమా' అని యందుము.

"ఎవ్వాని వాకిట నిభమద పంకంబు
రాజభూషణ రజోరాజి నడగు" [విరాట. 2.191]

ఎన్ని యేనుగు లుండుచో వాని మదధారలు బురదకావలయు ? లోని కేగుటకు ఎంత ఒఱపిడి యుండి వారినగలు రాచుకొని రజము కావలయు ? ఎంత రజము రాలి ఆ బురద గట్టిపడవలయు ? అన్ని యేనుగులు, అందరు సామంతులు, ధర్మరాజు హజారమున ఉన్నారు- అని వ్యక్తమగుచున్నది.

ఈ రీతిగా కథా కథా, ప్రబంధమూ ప్రబంధమూ, నాటకమూ నాటకమూ వ్యంగ్యముగా చూచుచున్నాము. వేదము లందలి స్తావకము లిట్టివే. పురాణము లందు, ఇతిహాసములందు కథలిట్టివే. నేటి ఉపకథ (Short Story) లట్టివే. అందును విశేషించి టాగూరువి.

కవిత్వమునందు కూర్పఁబడు రతి, క్రోధము, కరుణ మొదలగు చిత్త వృత్తి విశేషము లన్నియు వ్యంగ్యము మొగము మీద వ్రాసికొనియే పుట్టినవి.

నాయికా నాయకులకు ప్రీతి కలిగినది అనికాని, ఇందు శృంగారరస మున్నది అనికాని చెప్పచో రసోత్పత్తి కలుగదు. రసాదులు వాచ్యములగుచో వమనమను దోషమును లాక్షణికులు చెప్పుదురు.

దప్పి తీఱుటకు 'నీరు నీరని' పలుమాఱు లనుకొనినచో దప్పితీఱక పోవుట యటుండ మఱికొంచెము దగ యెత్తును.

ప్రియుల పరస్పర విలోకనములు, సుందరమగు ఏకాంతము, శృంగార లజ్జ, వెళ్ళిపోవుచు చేతిలోని తారహారము ఏ పొదరింటినో చిక్కు పడునట్లుచేసి వెనుదిరిగి ప్రియుని చూచుట- ఈ మొదలగునవి చక్కగా చెప్పచో పాఠకుల హృదయమున ప్రణయము వ్యక్తమగును. కావుననే రసము వ్యంగ్యము "విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః"- అని భరతుఁడు.

"నిలయము శూన్యమౌటఁ గనిఁనెమ్మదిఁ బాన్పున లేచి కల్ల ని
ద్రలుగను నాథు మోమును నిదానముగాఁ గని నమ్మకంబుతో
జిలిబిలి ముద్దువెట్టి నునుఁజెక్కులు చెమ్మగిలంగ గాంచి మో
మలతిగవంచు బాల నగి యాతఁడు ముద్దుల ముంచి తేలిచెన్"

—అమరుకము

ఇందు ప్రేయసి, ప్రియతముఁడు, ఏకాంతము, నిదానపు చూపు, సిగ్గు- ఈ మొ॥ అన్నియు కలసి ప్రణయము వ్యక్తమగుచున్నది.

[2]ప్రణయము మొదలగు ఈ చిత్తవృత్తులు కార్యకారణ భావములచే చక్కగా వ్యక్తమగుచో రసధ్వని అని సాహిత్య శాస్త్ర సంకేతము. దీనినే ఉత్తమోత్తమ కవిత్వమందురు. కావుననే మనుష్యభిన్నములగు జడాజడములకుఁ గూడ చేతన ధర్మములను, అందును విశేషించి ప్రణయము, కరుణ మొ॥ చిత్తవృత్తులను ఆరోపించి కవులు రసింపఁజేయుచున్నారు.

---

2) రతి, హాసము, క్రోధము, ఉత్సాహము, శోకము, జుగుప్స, భయము, విస్మయము, నిర్వేదము.

ఆనందజనకమయిన ధ్వని సత్య సుందరమగు భావనను వేయిరెట్లు సత్యముగను సుందరముగను జేయును. ఇట్టి ధ్వని కావ్యము సృజింపఁగలుగుట మహాభాగ్యము. కవితా కుటుంబమున వ్యాస వాల్మీకి కాళిదాసు ప్రభృతు లేయైదారుగురో వ్యంగ్య వైభవ భద్రులని ఆనందవర్ధనాచార్యులుగారు చెప్పిరి.

ఈ రీతిగా ముత్తెముల వంటి పదములు, తేనెలవంటి అర్థములు, నిత్య వైభవము పచ్చతోరణమగు సృష్టి, బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసా నందము మొదలగునవి కావ్యములందు కానిపించుచున్నవి. అటువంటి కావ్యము లందు ఉత్తమ కవిత్వము కలదనుచున్నాము.

ఇప్పటికి కవిత్వ మననేమియో తూ. చా.లు తప్పకుండా తార్కికముగా నిర్ధారింపకపోయినను అందుగల విశేషములను చూచాయగా తెలిసికొన్నాము-ఇక!

## భావకవిత్వము

కూడ ఇప్పుడనుకొన్న ఉత్తమ కవిత్వమే!

గ్రంథము లన్నియు కవితాగ్రథితము లయ్యును ఒక దానికి పురాణ మని, ఒకదానికి ప్రబంధమని, ఒకదానికి నాటకమని, ఒకదానికి శతకమని,- యిటులు వ్యవహారము వివిధముగా నున్నది.

పురాణము- ఇది కొన్ని యేండ్లు, కొన్ని మాసములు చదువదగిన మహా గ్రంథము; కొన్ని జగత్తుల కూడలి; శాస్త్రములకు ఏకసభ; కథలకు కాణాచి; నీతులకు నిధి. అందు కవి తన కవితామణి స్పర్శ సోకించి ప్రతి విషయమును కవితగా మార్చి వైచినాడు.

ఇక ప్రబంధము - ఒకనాడు గాని, కొన్నాళ్ళుగాని చదువఁ దగినది. నాటకము కొన్ని కొన్ని గంటలు చూడఁదగినది; ప్రబంధమునందును, నాటకము నందును, పురాణమునందు వలెఁగాక ఒక కథయే యుండును. ఆంతరాళికముగా మరొక కథ యున్నను, అదియు ప్రధానకథకు అంగముగనే యుండును.

వానియందు కొన్ని నియతపాత్రములను సృజించి మనోవృత్తులను స్ఫుటము చేసి రసప్రహదమును ప్రవేశించి సహృదయుల మనస్సను నావకు కవి కర్ణధారుడై యుండును.

ఈ గ్రంథము లన్నిటియందును కవి కథకుడైనను కానఁబడక విలీనుడై యుండును. శతకమునందు విడిగా నాయికా నాయకుల కల్పనలేదు; శృంగార శతకములందు ఉన్నను కవియే నాయకుఁడు; కథకుడును. భక్తి శతకములందు తన భక్తికి తానే కథకుడు.

## అన్యోక్తి

"ఈకలు నల్లనైనవని యెంచి విశాల రసాలశాఖ యు
త్సేకముతోడ నెక్కి వికసించి ఫలంబులు నీవు మేయుచున్
గోకిల రీతి నుందు ననుకొన్నను నంటివి కాక, పాపపుం
గాకమ! నీకు నమ్మధురగానము గల్గునె యెన్ని వల్కినన్"

ఇత్యాదులందు కవియే నిందకుఁడుగాని భూషకుడుగాని కవియే కథకుఁడును.

అన్నియు బంగారముతోడనే చేయబడినను హారమని, కంటెయని, నాగరమని, జిగినియని గొలుసని భిన్న వ్యవహారము కలదు. అయితే ఇది యెల్లమ బంగారమే.

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్"

## భావకవిత్వ (లిరిక్) చిహ్నములు

సామాన్యముగా అయిదారు పద్యములలో ముగియును. అమరుకము, గాథా సప్తశతి, ఆర్యాసప్తశతి మొదలగు వానియందు ఒక్కొక్క పద్యమే. కొన్ని కొన్ని చోట్ల ఏబదివఱకును కలవు. ఇది సంఖ్యా విషయము.

దీనిని కొన్ని నిమిషములలో చదివికొనవచ్చును; కొన్ని సంవత్సరములు మఱవకుండ నుండవచ్చును.

ప్రబంధమునందుఁగాని నాటకమునఁగాని ఒక కథయే యైనటులు దీని యందు ఒకటియే విషయము. కోకిల-నాయిక-నాయకుఁడు-పూవు-ప్రపంచము-ఈశ్వరుడు-ఏదైన నగుగాక, ఒకటి!

కవికి తన్మయ జ్యోతి మెఱుపువలె చరాలున ఒకసారిమెఱయును. దానికి ప్రతిఫలమే ఉత్తమ కవిత, లేక భావకవిత. అట్టి తన్మయత మెఱపువలె ఎంతో కాలము ఉండజాలదు.

ప్రబంధములు, నాటకములు అన్నియు ఈ మెఱపు తునియల చేతనే కూర్పఁబడినవి.

భావకవిత్వమున ఇంకొక విశేషము: ఇందు కవి సాక్షాత్తు తన సొంత విషయమునుగాని, అనుభవమునుగాని చెప్పుకొనును. శతకాదులందువలె రంగమున తానే నిలువబడును.

పురాణములందుఁ గూడ కవి తన్మయుఁడై ఒకానొకట శ్రీకృష్ణునివలె 'ఊర్ధ్వ బాహు ర్విరౌ మ్యుచ్చైర్నచ కశ్చి చ్ఛృణోతి మామ్ – ధర్మా దర్థశ్చ కామశ్చ'–

'చేతు లెత్తుకొని బిగ్గరగా అఱచుచున్నాను. ఎవ్వడును నన్ను వినఁడు. ధర్మమువలన అర్థము, కామము కలుగును. అధర్మమును మీరనుష్ఠింపరు.' అని వ్యాసులు రంగమున కురికెను.

"కవిరాజు కంఠంబుఁ గౌగిలించెను గదా
పురవీథి నెదుఱెండ బొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరి వాకిట నుండు నల్లగుండు
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురుగొడియ
ఆంధ్ర నైషధకర్త యంఘ్రి యుగ్మంబునఁ
దగిలి యుండెనుగదా నిగళయుగము
కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ దంకంబు లేడునూర్లు?"

"కాశికా విశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయడిచ్చు
రంభఁ గూడెఁ దెనుంగురాయ రాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సన మంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మేరాజు దీర్చఁగలఁడు

భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
గలియుగంబున నింకనుండఁ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగు చున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి."

ఇది మేలి భావకవిత్వము-లేక లిరుక్కు. సాహిత్య శాస్త్రమున ఇది రసధ్వని. ఇందు వీరారెడ్డి మొదలగు మహారాజులు చనిపోవుటయు, ఏనూ ఱుటంకములు చెల్లింపకపోవుటచే తనను ఎండలో నిలబెట్టుట, బండ ఎత్తుట లోనగు దైన్యమును, "దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ" అనునెడపాండిత్య వీరత అంగముగాఁ గల కవ్యాలంబన మగు మృతియు-ఇవి యన్నియుఁ గలసి కరుణరసము వ్యంగ్యమగుచున్నది.

సంబోధ్యుడైన రాజు నెదుటను, ఈశ్వరాదుల యెదుటను కవి తానయి నిలువబడుచున్నాడు!

"నిఖిల భూధర దరీ నిమ్నోన్నత స్థలీ
విహరణాగతమైన వెనుక బెణుకు
యమి రక్షణార్థమై యమహ్రాత్కవాటంబు
పగులఁ దన్నిన నాటి ప్రాతనొప్పి
బ్రహ్మాది సకల నిర్జర కృతార్చన కాల
మున నిల్వబెట్టిన మోనయుగుదులు

ఏకాంఘ్రిపై నిల్చి నృత్య మత్యంతంబు
విరచించునాటి తిమ్మిరియుఁ దీఱ
తోమి గ్రుద్దెదఁ బిసికెద ధూళి ముడిచి
వ్రేళ్ళు విరిచెదఁ జూపవే కాళ్ల తండ్రి !
నిగమ నుతకీర్తి యెలకుర్తి నగరవర్తి
యీశ ! మల్లేశ ! లింగ ! క్షమాశతాంగ :

ఇవి యన్నియు మంచి లిరిక్కులు. సాహిత్యశాస్త్రము దీనిని 'భావధ్వని' యనును. కవిగత భగవదాలంబమగు భక్తి ఇచట వ్యంగ్యము.

కవి సాక్షాత్తు తాను ప్రవేశము కలిగించుకొనుట, తన సొంత తన్మయత, అనుభవము మొదలగునవి ఉల్లేఖించుట అనునవి భావకవిత్వమునకు భేదకమన్ని యందురు. అటులు కవి తాను పొడుచుకొని వచ్చినను, తన సొంత అనుభవాదులే వర్ణించినను అవి యన్నియు సాధారణీకృతములై Public Property వలెనే అనుభవింపబడును. రసము ననుభవించు దశలో కవి కానబడడు.

ఒకసారి సింహావలోకనము సేయుదము. కవి సాక్షాత్తు ఉండుట, తన అనుభవము చెప్పికొనుట, ఏదో ఒకానొక విషయమును గుఱించి కొలఁది పద్యములలో ఉత్తమోత్తమ కవిత్వము ఉండుట- ఇవి భావ కవిత్వము (లిరిక్) న చూపట్టును.

## భావ కవిత్వమను పేరు బాగుగా నున్నదా ?

పురాణములందును, ప్రబంధములందును, నాటకములందును, శతకములందును, చాటువులందును అవిశేషముగా ఈ ఉత్తమ కవిత్వమున్నది. ఈ పైజూపిన శ్రీనాథుని పద్యములకు భావకవిత్వమను పేరు తొడుగుదమా ? నాలుక వెనుకాడుచున్నది.

భావకవిత్వ మనునది ఒక పుస్తకమునకు పేరు కాజాలదు. మంచి కవిత్వము అను నర్థముగల ఈ పదము ఒక జాతి గ్రంథమునకు పేరెటులగును?

ఆ జాతి గ్రంథమునకు లాక్షణికముగనో, వ్యంజకముగనో ఒక పేరు కావలయును.

అమరుకము, గాథా సప్తశతి, [3]ఆర్యాసప్తశతి- ఇవి మంచి లిరిక్కుల సంపుటము: ఏ పద్యమున కా పద్యమే ఒక గ్రంథము. 'అమరుక కవేరేకః శ్లోకః ప్రబంధ శతాయతే'. అందులకే అమరుకు డను కవి తన భావకవిత్వము లకు [లిరిక్కులకు] అమరుకమని తన పేరే పెట్టుకొన్నాడు. శాతవాహనుడు తాను సేకరించిన 'ఏడు వందల గాథా సంపుటి' అను నర్థమిచ్చు 'గాథాసప్త శతి' అను పేరిడెను. గోవర్ధనుడు ఏడు వందల ఆర్యలు అను నర్థమిచ్చు 'ఆర్యాసప్తశతి' అని పేరు పెట్టుకొన్నాడు.

అటులే ఇప్పటి తెలుగు కవులుగూడ "ఊహాగానము, హృదయేశ్వరి, జడకుచ్చులని, సంధ్యారాగమని, మునిమాపని, కృష్ణపక్ష"మని ఈ మొదలుగా వ్యంగ్యముగనే తమ పుస్తకములకు నామకరణము చేయుచున్నారు.

కావున భావకవిత్వమనగా ఉత్తమ కవిత్వ మనియు అట్టి ఉత్తమ కవిత్వములు పైని చెప్పిన కొన్ని చిహ్నములు కల గ్రంథజాతికి పేరు లుప్తమై యున్నదనియు గ్రహింపగలిగితిమి.

ఆ పేరునకు మనకు అంతగా తొందరలేదు. ఆ గ్రంథజాతి బహుళ ముగా ఎప్పుడు పెరుగునో అప్పుడే తన పేరు తాను సంపాదించుకొనఁగలదు. సౌందర్యము, పరిమళముకల పూలు పూచు ఒక జాతి తీగలు మన ఉద్యానమున మొలిచిన వనుకొందము. దేవతార్చన దైనందినము ఆ పూలతోడనే. అట్టి తీగలు గేస్తులచే వెంటనే మధురమైన పేరు పెట్టించుకొనెను.

ఇక నీ చర్చ విరమించి భావకవిత్వము (లిరిక్కు)ను గూర్చి తుది మాటలు ఒకటి రెండు చెప్పెదను:

భావకవిత్వము (లిరిక్కు) వేదాంతము వలె కవిత్వాంతము. గ్రంథము కొలఁది, ఆనందము హెచ్చు. పిట్ట కొంచెము, కూత ఘనము: కవిత్వమున కిది

---

3) సంస్కృతమున 'ఆర్య' అనునది ఒక జాతి శ్లోకము. తెలుగు కందమునకు దీనికి కొంచెము చుట్టరికము కలదు, బహుశా అప్పా చెల్లెండ్రు కావచ్చును.

శిరస్సు! తెలుగు భాషలో లోగడనున్న లిరిక్కులను ఉద్ధరించుట ఆవశ్యకము. తెలుగు కవులను దీని ప్రాశస్త్యమును గుర్తించిరి. అమితముగానే వ్రాయుచున్నారు. ఇంకను వ్రాయుటకు పండితులు ప్రోత్సాహమిత్తురు గాక-ప్రకృతమున లిరిక్కులు వ్రాయువారివి ఒకటి రెండు :

## విరహము

హేమ పాత్రలఁ జందన మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి హారములను
సాన లందించె స్నాన కషాయ గంధ
మబల! యెవని కోసము సగమయి కృశింతు?

చెక్కు చెదరని పాపట చిక్కువడియె
వేణి బంధము శిథిలమై పిఱుదు లందె
కరగి చెదరిన తిలకరేఖలను దుడువ
పతివ! యెవ డాహరించె నీ యార్ద్రహృదిని?

పాలు పొంగిన గతిఁ బొంగు ప్రణయరక్తి
నాఁపు కొనలేని పడుచు ప్రాయంబుతోడ
నమ్మి యెవనికి నీ మన మ్మమ్ముకొంటి
పువిద! యీ మేఘమాస నవోదయముల.

ఇది భావకవిత్వము. (లిరిక్కు) సాహిత్యశాస్త్రమున ఇది రసధ్వని. విప్రలంభము వ్యంగ్యము.

## చిత్రకుబ్జ

ఎన్ని మార్గములన్ నిరంతర
మెంత సాధన చేయు చున్నను
పోవ కున్నది వక్రగమనము
బుద్ధి యందుఁడి.

కుబ్జ నీ వొకమారు ప్రీతిని
గ్రుచ్చి కౌగిటఁ జేర్చి నంతనె
వదలిపోయిన దంట ఆయమ
వక్రిమము కృష్ణా!

ఎల్ల వేళల యందు నీకై
యెదురు చూచుచు నున్న దెపుడీ
చిత్తకుబ్జను నీదు కౌగిట
జేర్తువో కృష్ణా!

—తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

ఇదియు భావకవిత్వము. (లిరిక్కు) వక్రతా సాధర్మ్యమున చిత్తము కుబ్జగా రూపింపఁబడినది. ఆ రూపకము శృంగార భక్తికి తాళము వేసినది. అవాఙ్మానసగోచరమైన భగవంతుని మహిమచే, దయచే అనుభావితమై కవిగత భగవదాలంబనమగు శృంగారభక్తి- అందును విప్రలంభము ధ్వనించుచున్నది. సాహిత్యశాస్త్రమున దీనికి 'భావధ్వని' అని పేరు.

తెలుగు కవులారా! నూతనసృష్టి ఒక్క అక్షరమే యగుగాక! అది యొక ప్రపంచము. శిక్షాజన్యమై ప్రతిభలేని ప్రాచీనసృష్టి యొక్క నకలు స్కాందముకంటె ఎక్కువయగుగాక, అదియంతయు ఒక అక్షరమేని కాదు.

ఈ జాతి (లిరిక్కు) కవిత్వము నిక్కముగా కవియొక్క సర్ఫకాస్ (సొంత ఆస్తి- Private property) ఇందు కవి దానవీరుడై [జీమూత వాహనుడు మొ. వారికన్న నెక్కువగా- వారు శరీరమే కోసి యిచ్చిరి. కవి మనస్సును ద్రాక్షవలె పిండి యిచ్చును] 'న మమ' అని సంకల్పించిన తన సర్వస్వమును లోకులకు ధారపోయును. ఇది హృదయము యొక్క విల్లు. (will).



# 2. నాట్యము

## నాట్య మందిరము

నాట్య మందిరము పాదములుకల ఒకానొక దివ్యక్షేత్రము. అది తైర్థికులకు వింత గొలిపి సుఖమును గొలకొట్టి వారి మానసమును ఒకానొక యానంద ధామమునకు గొంపోవును. నీచుని కడనుండి జ్ఞానివరకును, దరిద్రుని నుండి ధరాపాలుని వఱకును. భోగకాంత నుండి కులకాంత వఱకును గల వర్తనము వేఱు వేఱ చూపి హేయోపాదేయములను నిగూఢముగా నిరూపించును. చంద్రోదయమున నుప్పొంగు సముద్రమువలె క్రమక్రమముగా పొంగి పొరలు రస వాహినికి ప్రభవమగు నాట్యమందిరమం దెవ రోలలాడగోరరు ?

## నా ట్య ము

యువకుడగుట, మఱియు నతడు సాధువగుట, యింకను చదువెఱుగుట, పిదప శాసకుడు దృఢిష్ఠుడు బలిష్ఠుడు నగుట అట్టి వాని వశమున సిరిసంపదలతో తులతూగు నీనేల యెల్లయు నుండుచో వాని యానందమొక మానుషానందమని యుపనిషత్తు చెప్పుచున్నది. [తైత్తి-బ్రహ్మానందవల్లి 2-8] అట్టి మానుషానందము కూడ రసానందమునకు వాచుకొనును. మానుషానందము కంటె అతీతమగు రసానందమునకు కందరమగు నాట్యమందిరము లున్న యెడల దైనందినము మొదటి టిక్కెట్టు నాదే.

క్షేత్రమున కేగిన ప్రతివాడును తన్మయుడయి పోవుచుండును. ప్రతి రాయియు వానిలోని భక్తి నుద్దీపింప జేయును. ప్రతి విగ్రహమును వానికి సజీవముగాఁ గానిపించును. అటులే నాట్యమందిరమున నున్న శ్రీనివాసులు, రాఘవాచార్యులు, నరసింహారావు, సూర్యనారాయణ, సుబ్బారావు, సంజీవరావు, సుందరరామయ్య లోనగువారు దుష్యంతుడుగా, ఒథెల్లోగా, సత్యభామగా. సత్యవంతుడుగా, రాధగా, సావిత్రిగా, నారదుడు లోనగు వారుగాఁ గానిపింతురు,

అందు ప్రేక్షకుని లౌకికానంద మంతయు అలౌకికానందముగా మారును. అత డపుడు అన్నమయ ప్రాణమయ కోశముల నతిక్రమించి మనోమయ కోశము నందలి యూయెలలో నూగుచు పోయి పోయి గుణములలో గుణమై సాధారణత్వ మును బొంది ఏదో యొక నిమిషమున తనను కొంచెము సమీపించి హృదయ కవాటముల తాళమును తెఱచిపైచును. ఇది సావలంబన సమాధి వంటిదని పండితరాయలు.

నటులును, సహృదయులును కలిసి ఒక అలౌకిక ప్రత్యయ ప్రవాహ మునఁబడి కొట్టుకొని పోవుచుందురు. [టిక్కెట్లు కొనలేనివారు వాకిట నల్లాడు చుందురు.] ఓహో ఎట్టి మార్పు! ఎట్టి యారోపణము! సుఖశిఖరమునకు గొంపోవు నీనాట్యమందిర మెంత పవిత్రము! పాపము! నటులింకను నాందిని వదలలేదు. అంతియ చాలు.

తొల్లి నాట్యమందిర మితరకళాభవనములవలె కేవల రాజపోషితమై కొన్ని కొన్ని నియత సమయములందు-తిరునాళ్లలో, రాజోత్సవములలో, పండువులలో- అందఱను పేరంటము పిలుచుచుండెడిది. ఇపు డితర కళామందిరములతో పాటు ఒక రీతిగా సార్వజనీనమై శన్యాదివారములలో, సెలవులలో లేక వీలయినపు డెల్ల ఒక పావలాకు తలుపు తీయుచున్నది.

ఈ విధాన మొక రీతి నష్టికి కారణము. దీనిచే సహృదయుడు కూడ ప్రేక్షకుడే యయినాడు. [ప్రేక్షకుడు సహృదయుడయి పోయినాడు.] ప్రతి దమ్మిడీకి నటునిపై హక్కు గలదు. అది అయిదు నిమిషము లోపిక పట్ట నీయదు. సంతసము కలిగెనా యది యెగిరిపడును. కలుగక పోయెనా పదివేలు బుణ మిచ్చినటులు మ్రోగును.

ఈ విధానము నటులకు కూడ కొన్ని లోపములను తెచ్చిపెట్టినది. అది సతత ప్రదర్శనము. సతత ప్రదర్శనము ప్రతి పదమందును తారళ్యము, సౌందర్యము, జీవనమును గల నటుని శక్తిని కుంచీకరించి జడత్వము, మోటు దనము, రాపాటు పనితో సన్నగిల జేసి దానికొక విసుపు నాపాదించుచున్నది.

నటునకు కొంత విశ్రాంతి యావశ్యకము. అతని చూపు ఏకాంతములలో, పత్తనములలో, దేవాలయములలో, కసాయి దుకాణములలో, వీధులలో, పిఱికి

పందలో విహరింపవలయును. ఒక ప్రదర్శనమునకును మఱియొక ప్రదర్శనము నకును నడుమ సహస్ర నూతన భావములు నటునిలో నుదయించవలయును. నటుడు ప్రతిదినమును నాటక చక్రమును లాగికొనిపోవు ఇంజను కాడు. తగిన విశ్రాంతియే లేని యెడ నటుడు కొలదికాలముననే మరుగుజ్జయి పోవును.

సిద్ధులగు నటులైనను ఒక రూపమును వరుసగా రెణ్ణాళ్ళు ప్రదర్శింతురేని మూడవ ప్రదర్శనమునకు సహృదయు డెవడును పోజాలడు. తనపై మొదట గలిగిన యభిప్రాయమును పలచబడకుండ చేసికొనుటకును, మరల నభినవ రూప మెత్తుటకును, నటునకు అవకాశ మనునది చింతామణి.

## ప్రసాధనా మందిరము

ప్రసాధనా మందిరము (Green room) నాట్యమందిరము, అంగడిగాని వేశ్యావీథిగాని కాదు. ప్రసాధనా మందిరమందు ప్రసాధకులును, నటులును మాత్రమే సత్యసంపన్నమగు మానసములతో తల్లిబిడ్డలవలె సోదరులవలె నుండుట విధి. దీనిలోనికి ప్రేక్షకుడు చొఱడు. ఒకవేళ వెళ్లెనా గ్రుడ్డు నవియించినటు లగును. ప్రసాధనా మందిరాంతరమును ప్రవేశించిన నటుల మిత్రులు కొందరు నటుల యెడ సేవము పొందుటయు, మఱికొందరు వికారము లకు పాల్పడుటయు, దాన నటులు గూడ చెడుటయు మనము వినని మాటలా? త్రేతాగ్నులు కల గృహ మెంత పవిత్రమో నటులు కల ప్రసాధనా మందిర మంత పవిత్రముకాదా? ఇచట సామాన్యముగా నటులకు గల దురభ్యాసము ధూమపానము. నటునకు సామాన్యముగా చుట్టయే చుట్టము. నటుడు చుట్ట త్రావుచో చుట్ట యతని నేవళమును ముఖశక్తిని త్రావును. నేనొక నాటక మందిరమున లోపలి గోడమీద "చుట్టలు సిగరెట్టులు బీడీలు తాగకూడదు" అను శాసనమును చూచి సంతసించితిని. నన్ను ప్రసాధనా మందిరమునకు గొంపోయిరి. ప్రసాధనా మందిర మంతయు అగరు ధూపముచేతను పూలచేతను వాసితమగుటకు బదులు చుట్ట పీకెలతో నిండి, వాని పొగచే వెల్లవేయబడి యుండెను. అనుపదముననే గిరీశము హవానా చుట్ట నోట నిడికొని రంగమున కాడియుమియుము మందిర మంతయు దాని పొగచే చిరు మబ్బులు క్రమ్మించెను.

పిదప రామప్పంతులు దానిని ధూమ పానశాలగానే మార్చెను. అసలు స్థలము మధురవాణి పడక టిల్లు. రంగము-ఓహో! నీ నీత్యనీతులకు నే నావల నున్నా నని నాటక తత్త్వమును వెల్లడింపను కాబోలు. నేను నీతి దృష్టిలో మాట లాడుటలేదు. దానివలన నటునకు గలుగు ప్రత్యేకాపాయమును వివరించు చున్నాను. ప్రతి నటుడును విరామములో సత్వసంపన్నుడై ఆనందములో విశ్రాంతి ననుభవించుటకును ఆకృతి మార్చుకొనుటకును తావైన ఆ ప్రసాధనా మందిరము గర్భనరకము కాదు. సుఖాపవరకము! నూతనముగా సృష్టికి సిద్ధపడిన ప్రకృతి యెంత తదేక తానమయి యుండునో ప్రసాధనా మందిర మును అంత తదేక తానమయి యుండనగును. దాని నొక చిత్ర కళాశాల చేయుట లెస్స.

## న టు డు

నాటకశాల యజ్ఞశాల. నాటక మొక చాక్షుష యజ్ఞము. "కాంతః క్రతు శ్చాక్షుషః". నటు లధ్వర్యులు. ఇందు సహృదయులు చెవులతోడను, కనులతోడను సోమరసము గ్రోలుదురు.

నాటకమునందు కవి నిర్మించిన ఒకానొక చిన్మయమైన పాత్రమునకు నటుడు చతురస్రము సజీవమునగు చిత్రకళను, అనురూపమగు గానమును దివ్య మగు శరీరమును ఒసగుచున్నాడు. కవి పురుషుడగు నెడల నటుడు ప్రకృతి. కవి తండ్రి యగుచో నటుడు కుమారుడు.

నటుడు తన తండ్రి కడనుండి సంక్రమించిన రసధనమును సహృదయు లందఱకు పంచియిచ్చు మహాత్యాగి. తనకు విహితమగు కర్మమును కామక్లేశ భయమువలన విసర్జింపక సమగ్రముగా ననుష్ఠించి ఫలమునుగోరని కర్మయోగి.

అతడు కవి నిర్మితమగు పాత్రకు తన జీవితమును కృతియిచ్చి కాలిక ముగా తన అస్తిత్వమును దానమిచ్చు మహాదాత. అట్టి సమయములలో పరిచ్ఛిన్నమయిన యతని మానసము వికాసము నొంది కొంతసేపు ఒకానొక ఉన్నత భూమిలో నిలువబడును. అతడు వాచకుని (Prompter) వాక్యము

విని నంతనే ఇతరుల సుఖ దుఃఖములు మోసి క్రమక్రమముగా తనవి చేసికొని నవ్వి నవ్వించి, యేడిచి యేడిపించి జనహృదయములను తన అదుపాజ్ఞలలో నుంచుకొనును. ఆహా! ఇదెట్టి సృష్టి! కవి తరువాత నటుడిదే మకుటము!

నటుడు కవిని సంపూర్ణముగా మ్రింగివైచుటలో రాహువు; లేక వివరించుటలో భాష్యము; పాత్రకు వన్నె పెట్టు ప్రతిబింబము; మనుజుల వివిధ ప్రకృతులకు ప్రతినిధి. అతడు నాటక దేవత. ప్రదర్శనమునందు నాటక కర్తగాని, పాత్రముగాని స్వయముగా వచ్చి కూర్చుండు గాక; అట నటునిదే సామ్రాజ్యాధిపత్యము! సమస్తము నటునిలో ఉత్పన్నమయి నటునిలో లయ మగును. నటుడు కవి నత్యంతము సంతసపఱిచి యతని పేరునందు తన పేరును స్థాపించుకొనగా కవి యెంత యానందించునో కదా! 'పుత్రా దిచ్ఛే త్పరాజయమ్'—తా మొనరించిన సృష్టికి—'ఈ సృష్టియంతయు నేమి! ఎందుల కీ దుఃఖము? ఏల యీ కర్మము? ఎటులు సమన్వయము?' అను నీ మొద లగు ప్రశ్నపరంపర లేకుండ ఆనంద ముప్పతిల్ల జేయునవి యీ రెండాత్మలే! ఈ వీరి సృష్టిలో దుఃఖము కూడ నానందమే! సీతతో పాటు దుఃఖింప నెంత మంది రారు? హరిశ్చంద్రుని దుఃఖపరంపరలో ఆనందబాష్ప పరంపర నెంత మంది విడువరు? చారుదత్తుని దుఃఖము నెంతమంది పంచుకొని నూవిళ్లూరరు? అదెట్టి సుఖము!

నటుడు కేవలము కవి పోసిన పోత విగ్రహము కాడు. అతడు తన నిశిత పరిశీలనముచే లోకము నలౌకికముగా ననుకరించును. లోకముయొక్క వేషభాషలలో నడవడిలో సర్వములో తన కుపయోగించు నంశమును నీరక్షీరము లలో క్షీరమును హంసవలె గ్రోలి దానిని తన ప్రత్యేకోపాధిచే ప్రత్యేకించి అలౌకికము చేయును. అపు డా వేషభాషలకును, అన్నిటికిని అద్భుత మావహించును. ఎపుడు నటుని వేషభాషాదులను మఱల లోక మనుకరించునో అపు డా చిత్రకళ, ఆ గానము, ఆ నటనము, ఆకాలమున ఆ సంఘమున కాష్ఠకు పరుగిడినదని మనము తలంపవచ్చును. స్థానం నరసింహారావుగారి యాహార్యాభి నయమును (వస్త్రధారణము, అలంకారము మొ॥) ఎంతమంది స్త్రీలనుకరించుట మనము వినలేదు? ఆయన 'అబ్బా'యను దీనాలాపమును ఎంతమంది రామ

స్మరణముగా మార్చికొనలేదు? రాఘవాచార్యుల వారి ఆంగికాభినయమును, నేత్ర వ్యాపారమును ఏకాంతమున ఎంతమంది అనుకరించి నిట్టూర్పులేదు? ఎంతమంది పారుపల్లి సుబ్బారావుగారి రాధలుగా మారలేదు?

నటుడు డాక గారడీడు. ప్రసిద్ధ నటుని పేరు విన్నంతనే లోకుల చెవులు నిక్కబొడుచుకొనును. కరుణమునగాని, భావశబలత యందు గాని, విఫల ప్రేమయందు గాని, వియోగమునందుగాని, భక్తియందు గాని రసించిన లోకము మజల వాని దర్శించుటకు ఎన్ని జాగరణములయిన చేయును. మానసమను లక్కపై నటు లొత్తిన ముద్రలను తుడిచి కొనలేక కొన్ని నెలలు కొన్ని సంవత్సరములు కూడ ఆ సుఖ దుఃఖములలో అలౌకిక సుఖమును స్మరించు కొనుచుండును. గిరీశమును చూచి గిరీశములయి పోవువారు కలరు; సత్యభామను చూచి సత్యభామలగువారు కలరు; రుక్మిణులుగా మారువారు కలరు; నారదుని భక్తిలో బడి భక్తులగువా రెంత మంది? సారంగధరుని పాదచ్ఛేదము చూచి నా బాల్యమున నేను రెండు నెలలు లేవలేదు.

కవి నిరుపేద; నటుడు మహాధనికుడన్న మాట నిక్కువము. [కవి ర్దరిద్రో నటకో ధనాఢ్యః] కవియగు షేక్స్పియరు పది రూకలీయ జాలడు. నటుడగు షేక్స్పియరు పదివేలు పంచి యీయ గలడు. రాఘవాచార్యులుగారి లోని నటుని సంపాదనము రాఘవాచార్యులుగారిలోని లాయరునకు గలదా? నట రాఘవాచార్యులుగారి వితరణము లాయరు రాఘవాచార్యులుగారే చేయతే రనిన ఏరాజు చేయగలడు?

నటుడెంత ధనికుడో అంత దుబారావాడు. అతని చాకిజీతముతో ద్రౌపదికి వస్త్రము లీయవచ్చును. అతని క్షౌరదుర్వ్యయముతో కొన్ని కుటుంబ ములు క్షౌరము కావించుకొనవచ్చును. అతని ప్రయాణ వ్యయముతో భూ ప్రదక్షిణము చేయవచ్చును. కేవల నటనమే జీవికగా గలవారు ఇటులు దుర్వ్యయము చేయుచో తుదకు బికారులయి పోవుదురు; యువకులే బికారులైనవా రెందరు లేరు? వారి నటనము వారి కపుడు గురుతువచ్చును. ఒకనాడు బిచ్చగాడు, ఒకనాడు చక్రవర్తియైన నటుడు కొన్ని యేండ్లు రాజుగా వెలిగి కడపటికి

భిక్షుకుడగుట వింతకాదని యతడెఱుగునుగాని ఆ భిక్షుకత్వము నతడు పాపము ! భరింపజాలడు. నటు డెంత చలుడో లక్ష్మి యంతకంటె చంచలురాలు.

నటునకు పంక్త్యర్హత లేదను నపవాదము మిగిలిన వానితో పాటు సన్నగిలి పోయినది. తన ధర్మమా యని భరతమునియే తీసివయిచినాడు. ప్రతిపద క్షౌరము, స్త్రీ వేషధారణము ఈ రెంటిని పెద్దలు లోపముగా చూతురు. ఈ రెండును నటునకు జీవగఱ్ఱలు; ఛాందసులకు ప్రాణ గొడ్డములు. పోనిండు ! నటుడేలయని కొందఱందురు. నటుడేల యనినచో కవియేల ? యను ప్రశ్న ముదయించును. ప్రశ్న కలాప మంతయు ఇక్ష్వాకుల నాటి మాట. నటుని పెద్ద లెపుడు తిలకించిరో యతని కళకు కావలసిన సదుపాయము లపుడే స్మరింప బడినవి. నటుడు లేనిచో నాటకము లేదు; నాటకము లేనిచో కవి లేడు; కవి లేనిచో నంధకారము; ఏ మండలమున నటు డుదయింపలేదో ఆ మండలమున నాటకములేదు. ఏ మండలమున నాటకము లేదో దాన రససౌందర్యము లేదు.

ఆంధ్ర మండలమున మంచి నాటకముల కన్న మంచి నటు లెక్కువగా నున్నటులున్నారు. వారు త్వరపడి యేడవ మాసముననే ప్రపంచములోనికి వచ్చిరి. వారు నాటక కళను అమ్ముచున్నారు గాన మంచి సెబ్బర లను మాట లేక చాల నాటకములను ప్రదర్శించి తీరవలెను. దానిచే వారి కళకొక నైచ్యము, సంఘమునకు రుచిలో హానియు కలుగుచున్నవి. భాషలలో నవీన సృష్టి తక్కువ యయినపుడెల్ల ఈ జబ్బు పుట్టును. కొన్ని నాటకములలో తమ శక్తి కవకాశములేక నటులు నాటకముల నంతయు ఒక ఆంగికాభినయముగా మార్చిరి. అది జీవ జంతువుల సినిమావలె పొడగట్టినవి.

నటత్వముచే నటుని గౌరవము పోవదు సరికదా మఱి హెచ్చును. నాట్యము కొఱకే నటుడయినను, జీవికకే నాట్యమయినను అది నటునిలో ప్రత్యేక లోపము. కవిత్వము కొఱకే కవియయినను, జీవికకోసమే కవిత్వమయి నను అది కవిలో లోపము. గానము కొఱకే గాయకుడయినను, జీవికకొఱకే గానమయినను అది గాయకునిలో లోపము, శిల్పములన్నిటియందును ఇట్టి లోప నిరూపణ మార్య సంప్రదాయ మయియున్నది. "విటులము కాము, నటులము కాము, గాయకులముగాము... స్తనభారానమితలమగు స్త్రీలముగాము. రాజును

జూడ మాకేల ?" అని భర్తృహరి యనును. కవి గూఢ నటుడు; నటుడు గూఢకవి. కవి నటునకు దోహదము; నటుడు కవికి గౌరవ మిప్పించును; కవి నటునకు గౌరవమిప్పించును. నటునకు గౌరవము పోవుచో అది యితర సామాన్య దుర్గుణముచేఁగాని నాట్యముచే నెంత మాత్రము కాదనుటకు భరత మునియే ప్రమాణము. నటుడు తన సంఘము యొక్కయు, తన దేశము యొక్కయు, తన భాష యొక్కయు గౌరవమునకు ప్రతిభువు.

కవి చనిపోవుచో వాని గ్రంథము వానికి ప్రతినిధి. నటుడు చనిపోవుచో వాని వెనుక కింవదన్తియే. అదియు కొలదికాలముననే జీర్ణవస్త్రమయి పోవును. లక్ష్మణరావుగారి కళకేమి మిగిలినది? శ్రీనివాసులుగారి కళకు వారసుడేడి? సినిమా ప్రదర్శనమున కెక్కినను గ్రామఫోను ప్లేట్లవలె అది యొక మృతకళ. నటుడు ప్రకృతి లోకము నెఱిగి కీర్తి కొఱకే తన నాట్యము కాదని విశ్వసింప వలయును. నటుని జీవితమంత ఒడుదుడుకు జీవితము మఱియొకటి లేదు. చాలమంది పిన్నవారు కీర్తి మొదలైన వాని కొఱకు వింతగా నాట్యమందిరము లకు బలియగుచున్నారు. చదువులు సమాప్తించుచున్నారు. చదువు వేఱు, నటనము వేఱని వారి వేదురు. జీవితోద్దేశము సంపూర్ణముగా నెఱుగనివాడు నటుడు కాఁజనదు. జీవితోద్దేశము నెఱుగని నటుని జీవితము రాత్రులందు కొన్ని గంటలు మాత్రమే. ఇంచుమించ చతనికి సూర్యదర్శనములేదు. కావుననే క్షేమేంద్రుడు కాబోలు-

"నీ తలపైని దివ్య తపనీయ కిరీట మెసంగు, నంగదా
ఘాతము చెందు నీ బుజము, కంచుకి లోనుగ నీదు సేవక
వ్రాతము 'దేవ' యంచనుచు వచ్చును, తేడవా దాన? ఆట త
ర్వాత మశీరసంబె కదరా మిగులున్ నట! నీదు నెమ్మెయిన్"

అని చెప్పిన మాట యథార్థము.

వివిధ జీవితములకు ప్రతినిధియగు నటుడు ఈ జగతి యంతయు ఒక మహా నాటకమని సూచించును. అతడు కూరి కూర్చుండి యొకరి సుఖ దుఃఖ ముల తనపై నెత్తుకొని ద్రాక్షుమ్మరును. ఓహో ఎంత విచిత్రుడు! అతడు

గౌరవింపదగిన మోసగాడు. ఇపుడు కుచేలుడు, అప్పుడు కుబేరుడు; ఇపుడు మధురవాణి, అపుడు రుక్మిణి; ఇపుడు పరమ పాతకి, అపుడు మహాజ్ఞాని. కొన్ని యేండ్లకు ముదిసి తాను తానుగా నయిపోవుచున్నాడు. అపర సారంగ ధరుడగు హరిప్రసాదరావుగా రిపుడు హరిప్రసాదరావుగారే! చివరకు మిగులు నది తానే.

నటుడు తనలోని కర్మయోగి నెరుగడు. ఆ విషయము నత డనుభవము లోనికి తెచ్చికొనవలయును. అనుకార్యము నందలి సుఖదుఃఖములు తనవికావు. కామక్రోధములు తనవికావు. భక్తి తనదికాదు. అవి తన వనుకొనినంత మాత్రమున తన వగును. అదియొక చిత్రమగు ఉన్మాదము. ఒక ఆరోపితమగు మాయ. అది ఉభయతోముఖమగు ప్రజ్ఞావిశేషము. జాగ్రత్ స్వప్నముల సంధి; ఒక జాగ్రత్స్వప్నము; ఒక మూర్ఛ.

నేలను కొట్టిన బంతివలె నత డొక క్షణమున పాత్రములోని కెగిరి వెను వెంటనే తనలో కూలును. వాచకుడందింపగనే పరకాయమును తనలో ప్రవేశింప జేసికొనును. అది యతనికి పుట్టువుతో సంక్రమించిన సాధన లేక నేర్చిన శక్తియేయగుగాక; అతనిలో విజాతీయమగు వింత అదియే. అది తెలియని పిచ్చికాదు. తెలిసిన లేక చదివికొనిన లేక యెరిగిన పిచ్చి. ఆ పిచ్చియే యతనికి తారకము. అతడు క్రమక్రమముగా తన మానసమును, తన గానమును, తన చిత్ర కళను, తన నాట్యమును, సర్వమును రసపిండముగా మార్చి ఆనందాకాశమున నడచును. అత డున్నతమయిన తన మనస్సోపాన మెక్కి సుఖ దుఃఖముల సమీకరించు లౌకికానంద బ్రహ్మానంద వాహినుల నడిమి పాయలో దుముకును. సహృదయులందరను తనతోపా టందీత లాడించును. అపు డాక్షణమున తాను లేడు; నటుడు లేడు; సహృదయుడు లేడు; ఒక ఆనంద కాసారమే.

నటుడు శాస్త్రీయ జ్ఞానముచే విభావానుభావ సంచారిభావ వ్యభిచార భావముల వెనుకనున్న దొకటియే యని యెరిగి, మనస్తత్వ జ్ఞానముచే తార తమ్యము లెర్పరించి, మంచి గ్రహించి, గూఢముగా నణగియున్న నిత్యానిత్యులలో

ీతి నభ్యసించి, రసజ్ఞానముచే ఆనందమును, సౌందర్యమును ననుభవించి తన కర్తవ్యమయిన కర్మయోగాభ్యాస మనదగు నాట్యమును కర్మయోగముగా మార్చికొని, తనలోను, మనుజునిలోను గల మహానటు డగు నీశ్వరు నారాధింప వలయును. తనలో రచింపబడిన నాటకము తనలో ప్రదర్శింపబడుచున్న దను పరమార్థము నటు డెరుగుగాక! సర్వనాటకశాల యొక్క సాధు వాదములకును ధిగ్గర్జనములకును ఒక చెవియే యొగ్గి సర్వ మీశ్వరార్పణముగా నటు డెపుడు నటించునో, అపుడే లోకమును ఈశ్వరుని ఆరాధించినవా డగును.



# 3. సంఘము - సాహిత్యము

ఈ భూగోళమున పెక్కుదేశములును, పెక్కుజాతులును, పెక్కు భాషలును, పెక్కు సాహిత్యములును గలవు. ఒక్కొక్క సాహిత్యమున కొక్కొక్క విశేషమున్నది. ఆయా యీ జాతుల లేక సంఘముల బాహ్యజీవనమును భాషాదికమును దీనికి కారణము.

ఈ భాషాసీమను, ఈ బాహ్యజీవన పరిధిని దాటితిమేని జీవుఁడే సుఖదుఃఖ సమ్మిశ్రితమగు జీవనము గాని, నటుని అందముగా నానారూపములతోడను, నానావేషములతోడను వేఱువేఱు సాహిత్యములందు వికసించి నటులు తెలిసికొనగలము. మఱియు హర్షవిషాదములు, చింతాసూయలు, ప్రేమ వైరాగ్యములు, ఈ మొదలగున వన్నియు మానవ సాధారణమనియు, జగజ్జీవనము దేశకాలముల దాటి సాహిత్య దర్పణమున ఐక్యప్రతిష్ఠ చేసికొనుచున్నదనియు కనుగొనఁగలము. ఇంతియకాదు, మనకు దవ్వు దాపుగను, లాతిది మనదిగను కనిపించును.

సాహిత్యమునందు మనము శకుంతలాశోకమునకు శోకించినటులే, డెస్‌డిమోనా శోకమునకు శోకింతుము. సుఖమునకు సుఖింతుము. ఆ క్రొత్తవారి పరిచయముచే ముగ్ధులమగుదుము. దేశవిదేశములకును, ఆగతానాగతములకును సాహిత్య మొక వంతెన. వ్యాసవాల్మీకులును, క్రీస్తు మహమ్మదు మొదలగు ప్రవక్తలును, కాళిదాసు షేక్స్పియరు గెటీ మొదలగువారును-వీరు ప్రాచ్యులే కారు-అప్రాచ్యులే కారు-భూతకాలమువారు కారు-భవిష్యత్కాలమువారు కారు - మఱి విశ్వజనీనులు. సార్వకాలికుల జీవనముక్తా ఫలముల నన్నింటిని కలుపు సూత్రము సాహిత్యము.

సామాన్య జీవనమునందును మానవులకు సమవేదనయు, ప్రీతియు ప్రచ్ఛన్నముగాఁ గలవు. కొన్ని కారణములచే జాతికిని జాతికిని, వ్యక్తికిని వ్యక్తికిని విరోధము కలుగవచ్చును. కాని సాహిత్యమునం దదిలేదు. శత్రువయి

నను బాగుగా నున్న కవిత్వమును ఓగుగా నున్నదని అనఁడు. ఒకవేళ ముష్కరుఁడెవడేని అట్లనుగాక, రచయిత పేరు రహస్యముగా నుంచినచో అట్లనజాలడు గదా! సాహిత్యము విశ్వజనీనము. దేశకాలములవేఁగాని, వాసనా విశేషముచేఁగాని సాహిత్యము బద్ధమై యుండదు. సాహిత్యము జీవన ప్రకాశము కదా!

మానవుడు సంఘజీవి. దాని కనుగుణముగ సాహిత్య సంభూతి. మానవుడు తన సుఖముననే సుఖించుచు, తన దుఃఖముననే దుఃఖించుచు కూరుచుండఁ గలిగిన యెడల వానికి ఆత్మప్రకాశముతో పనిలేదు. వాని కితరుల సంగతి కావలయును. తన సంగతి యితరులకు దెలుపవలయును. ఒకని కొరుల యాత్మను ప్రకటించుచో పరమతృప్తి. భాష ఆత్మప్రకాశమున కుపాయము. సాహిత్యము దాని ఫలము.

ఆత్మప్రకాశముతో పనిలేని భక్తులు జీవన్ముక్తు లెందరో యుండి యుందురు. అట్టివారిలో శుకుని వంటివాడు కూడ పరీక్షిత్తునకు భగవద్గానము చేసెను. దానఁగూడ నాత్మప్రకాశము కలదు. 'తాలెల్ల తాలెల్లలే యీ జగమెల్ల తాలెల్ల తాలెల్లలే' అని పాడుకొనిన మాయావాదియు లేక మాయావేదియు సంఘముసుండియు ప్రపంచము నుండియు ప్రతియోగిగనో అనుయోగిగనో ఉపకరణమును దీసికొనును. ఎచటనో యొకానొకఁడు తనకు మాత్రమే సంబంధించిన విషయమును భగవంతునకు కవితారూపమున విన్నవించుకొనవచ్చును. అం దాత్మప్రకాశము లేకపోవచ్చును.

మానవుడు తనకు సుఖ మిష్టమయినటులే అన్ని ప్రాణులకును సుఖమిష్టమనియు, తనకు దుఃఖము కష్టమయినటులే అన్ని ప్రాణులకును దుఃఖము కష్టమనియు గ్రహించుచున్నాడు. ["ఆత్మౌపమ్యేవ సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున సుఖం వా యదివా దుఃఖమ్"-గీత] గూఢమగు నేత్రమును దెఱపించు వృత్తియే కల్పన. కల్పనకు సమవేదన కన్నతల్లి. ఆత్మౌపమ్యముచేఁ గలిగిన యీ సమవేదనను పురస్కరించుకొని పరుల జీవన సంబంధములగు సుఖదుఃఖములను కల్పనచేయుటకు మానవుడు సమర్థుడగుచున్నాడు. ఈ సమవేదనవలనఁ గలిగిన కల్పన సాహిత్యమునకు జీవగఱ్ఱ. కంటిచే మాత్రమున చూచును గావుననే మానవుడు పెక్కింటఁ గ్రుడ్డి. కానని కన్ను తెలపికి వచ్చిన

కవిచే సృజింపఁబడిన సాహిత్యమునందు సాంఘిక మనుష్యుఁడు తానే భిన్న దేశములలో, భిన్నాచారములలో, మాయావేషములలో ఖేలచేయుచున్నటులు చూచికొనఁ గలడు.

లోకమునం దీసమవేదన యొకటి మాత్రమే కలదా? నిక్కమున కిది యున్నను లేని చందమే భాసించుచున్నది. వేదాంతములు సామ్యమును సాధించు చున్నవి. ప్రపంచము వైషమ్యమును ప్రకటించుచున్నది. ఒకపెడ నెవడో యొక మానవుని కరుణకును అంతులేదు; ఒకపెడ మానవుని క్రౌర్యమునకును అంతులేదు. ఒక పాతికయేండ్ల కాలములో మనము రెండు యుద్ధముల జూచితిమి. నల్లజాతులమీద తెల్లజాతులవారి కసిని స్వజాతులలో పరస్పర ధ్వంసమును జూచుచుంటిమి. ప్రతి దేశమందును, ప్రతికాల మందును ఈ విషజ్వాలలు లేచు చున్నవి. పరస్పర సంఘర్షణముచే ధనకరుఁడును, కర్మకరుఁడును నుగ్గునుగ్గయి పోవుచున్నారు. హృదయహీనమగు నీ వైరము నిత్యప్రకృతము వలె కాననగు చున్నది. ఇటు లగుటచే నిగూఢమగు నీ సమవేదన యీ ప్రేమ అసత్యమనియు, విరోధమే సిసలయిన సత్యమనియు సాధారణ మానవుడు నమ్ముచున్నాడు.

లోకమునందును జాతులయందును దౌష్ట్యము కలదు. కావుననే సాహిత్యమునందును నరకాసురవధ మొదలగు వధలును, ట్రాజెడీలును స్థానముగొని ప్రబలమయినవి. సుఖ శాంతి మైత్రుల యనుభూతి కంటె, దుఃఖ - అశాంతి - ద్వేషముల యనుభూతి తీవ్రతరము. నీవు నీ మిత్రులకు నూరుమేళ్లు చేసి, యొక కీడొనరించి చూడుము. ఆ నూరుమేళ్లను ఖర్చులో పడి పగ మొదలగును. కాని సాహిత్యమునం దది సమానీకృతమై ఆస్వాదింపఁబడుచున్నది. వెనుక నొక విజేత విజితజాతి చిత్రకళా కౌశలమునకు చిత్తము ద్రవింపగా మరల మైత్రి నెలకొలిపి వారి శిల్పసంపదను తన దేశమునకు గొంపోయినటులు చరిత్ర చెప్పుచున్నది. ఇంతియగాక నేడాంగ్లేయులు విజితమగు మనదేశమునుండి బంగారముతోపాటు శ్రీరాధాకృష్ణుని గూడఁ దత్త్వజిజ్ఞాసకుఁ దమ దేశమునకుఁ దీసికొనిపోవుచున్నారని మనమందరమును శ్రీరామలింగారెడ్డిగారితో నేక కంఠుల మగుచున్నాము. ఇది వేరు విషయము. అది యటుండె-

16

ప్రకృత జగత్తు మైత్రీ విరోధముల మధ్యమార్గమునుండియే నడచు చున్నది. భౌగోళిక- ఐతిహాసిక- రాష్ట్రీయ- తదితర అనేక కారణములచే ప్రతి దేశము నందును వేఱు వేఱు సంఘములు ఉదయించెను. వీనిలోని విరుద్ధశక్తులు, వీని వైశిష్ట్యమును తీవ్రతరముగను స్ఫుటతరముగను చేసిపెట్టెను. హిందూ- హీబ్రూ- గ్రీక్- లాటిన్ మొదలగు సంఘము లీ రీతిగనే అభివ్యక్తములై నెలకొనెను.

సభ్యత కలది సంఘము. కల్యాణ గుణవత్త సభ్యత సంఘ పురుషుని కల్పనచేసి యీ సభ్యత యతని కిత్తము. ఆ సంఘము నందలి వారి ఐహికాముష్మికములు సంఘ పురుషుని మనస్సునకును, వాక్కునకును కట్టుబడి యుండును. సాహిత్యమునం దీ సంఘ పురుషుని మనోముద్ర పడుచుండును. కావుననే హిందూ, హీబ్రూ మొదలగు సాహిత్యములు సంభవించుటకు యోగ్యత కలిగెను. ఏకరాష్ట్రము నందలి జనసమూహముగాని, యొక జాతిజనుల గుంపు గాని ప్రకృత సంఘముకాదు. ఆచారము- శిక్ష- ఇతిహాసము- ధర్మము-భాష మొదలగు సంస్కారము సంఘములకు వైలక్షణ్య మొడఁగూర్చును. కావున నొక దేశమున నున్నప్పటికిని, ముప్పాతిక మాప్సింసము ఒక జాతియే యైనప్పటి కిని ముసలిమాను సంఘము హిందూసంఘము నుండి విచ్ఛిన్నమయి యున్నది. మనదేశమున కొందరు దూదేకుల సాయిబులకును, మరికొందరు సాయిబులకును ఉరుదు రాదు. వంగదేశమునను తమిళదేశమునను ఈ మాటలే విందుము. రాజకీయ కారణములచే నిపుడిపుడు తెలుగుదేశమునందు ఇస్లాము ధర్మము నవలంబించినవారు ఉరుదును, దానితోపాటు ఐబాయీ నమాజులను నేర్చుకొను చున్నారు.

ఇప్పట్టున దేశము కృత్రిమము; సంఘము స్వాభావికము. దేశము వ్యాపకము; సంఘము వ్యాప్యము.

సంఘము బాహ్యము-సాహిత్యము మానసికము. ఐహికాముష్మిక ధర్మములతో సంఘమేర్పడును. భావన చింతనాదులతో సాహిత్య మేర్పడును. సమానస్వాపన్నులగు కొందరు లోకుల వంశానుక్రమ చేష్టాఫలము సంఘము; సంఘపురుష చింతాఫలము సాహిత్యము. సాహిత్యమున సాంఘిక మనస్సు చరితార్థ మగును.

రామాయణము, మహాభారతము, అష్టాదశపురాణములు, ఇలియడ్, ఓల్డ్ టెస్టామెంట్ - ఈ మొదలగునవన్నియు సాంఘిక సాహిత్యము. విశాలమును గభీరమునగు నీ సకల సాహిత్యరచనలలో కవి యెపుడో లోపించిపోయెను. కవులను మఱపించి సంఘమే సాహిత్యమునం దాత్మప్రకాశ మొనరించుకొనెను. ఇయ్యెడ సంఘవ్యక్తుల సంబంధమును నిర్ణయించుటకు ముందు సాహిత్యమను దినుసెట్టిదో తెలిసికొనవలెను.

సుందరమగు వస్తువెల్లయు మానవుని యానందమునకు విషయము. సుందరముగా ననుభవింపఁజేయబడున దెల్లయు శిల్పము. ఇచట నొక విశేషము. దార్శనికు లెన్నడో ద్రవ్యమునుండి భిన్నముగా గుణమును కనుగొనిరి. కవులు సుందరమగు వస్తువునుండి సౌందర్యమును అనుభవింపజేయుట వారికి ముందే కనుగొనిరి.

జ్ఞాతలు, వస్తునిరపేక్షముగా సౌందర్యమును చవిచూచిరి. ఇక ప్రకృతమునకు వత్తము. శిల్పమెల్లయు మానవుని సృష్టి. ఈ రీతిగా సాహిత్యముకూడ శిల్పము లేక కళ. కళలన్నిటితో మనుజుల కామనయు ఆలోచనయు అనుభూతియు నణగిపెనగి యున్నవి. కామనాలోచనానుభూతులతో మనుజుల యాంతరజీవనము నిండియున్నది. కాఁగా సాహిత్యము జీవన లీలేతిహాసము, జీవనలీలాలోచనము.

సాహిత్యము మన కుపభోగ్యము. ఆవేగానుభూతులను సాహిత్యము పట్టియిచ్చును. సాహిత్యజీవన మేతదుభయమయము. కవుల యావేగానుభూతులు భాషగుండ సహృదయ హృదయములలో సంచారితమగును. ఇయ్యెడ కవికి భాషాగ్రంథికాని, భావగ్రంథికాని నత్తివంటిది. కావుననే శ్రీహర్షుడు "గ్రంథగ్రంథిరిహ క్వచిత్ క్వచి దపిన్యాసి ప్రయత్నాన్మయా... శ్రద్ధారాద్ధగురుశ్లథీకృత దృఢగ్రంథిః"- అని కైఫీతు ఇచ్చుకొనవలసివచ్చెను. "Literature was written not to be studied but to be enjoyed" [M. V. Moore] అను నేటి విమర్శకులను, శ్రీనాథుడు 'సోమరిపోతులు' అని తెలుపు నైషధమున అనెను. సాహిత్య క్షేత్రమున ఇది విమర్శకుల నిత్య సంగ్రామము.

కవి యిచ్ఛా నిచ్ఛల మీదు గదా సాహిత్యసౌధము; కావుననే ఆలంకారికులు నారికేళపాకమనియు, ద్రాక్షాపాకమనియు వివరించిరి.

యుక్తి ప్రజ్ఞల ఫలము శాస్త్రము. శాస్త్రాలోచనమునకు పక్షపాతము సున్న. సాహిత్యమునకి వైరాగ్యములేదు. బాగుగానుండుట, బాగుగా లేకుండుట అనువాని మీద నీ సాహిత్యసౌధము కట్టబడుచున్నది. ఇచ్ఛానిచ్ఛలు, అనురాగ విరాగములు సాహిత్యమును నియంత్రిత మొనరించును. కావున రసమన నేమియో నిర్వచింపకయే సాహిత్యము రసస్పృష్టి యనవచ్చును. బహిరింద్రియములచే మన ముపభోగించు రసము స్థూలము; అంతరింద్రియముచే ఉపభోగించి ఆస్వాదించు రసము సూక్ష్మము. కొందరు సాహిత్యమును భావాభివ్యక్తియనియు, జీవిత వ్యాఖ్యయనియు, ఆనందమయోపదేశమనియు, సత్యమునకు పాత్రమనియు, సౌందర్యప్రకాశమనియు, ధ్వనియనియు ననిరి. ఆలంకారికుల సూక్ష్మతరతర్కము లోనికిం జొరక సాహిత్యమును సాధారణముగా రసస్పృష్టియని అందురు. నాకు వాస్తవ, అవాస్తవ, ప్రగత్యాది సాహిత్య వేత్తలతో వివాదము లేదు. 'Damaged goods' మొదలగు వానికిని, జీవానందమునకును సాహిత్యమున స్థానమున్నది. అట్టిది రసస్పృష్టియా, కాదా అనుమాట వేఱు. కావున విచార సౌలభ్యమునకు ఆలోచనప్రధానమగు సాహిత్యమును జ్ఞాన సాహిత్యమనియు, భావ ప్రధానమగు సాహిత్యమును రససాహిత్యమనియు విభజించుదును.

మానవ జీవనము సాహిత్యమునకు ఉపకరణము. 'జీవనమునకు లక్షణ మేమి?' అని ప్రశ్నించుచో దానిని నిర్దుష్టముగా పరిష్కరింపజాలము. జీవనమును గుఱించి అందఱ ఉద్దేశములకును ఐక్యముండదు. తత్త్వవేత్తలు కవులు జీవనమును గుఱించి వేఱు వేఱు రీతులుగా విచారించిరి. ఈ మానవ జీవనము కవి హృదయమున ఏ ధ్వని పుట్టించెనో దాని ప్రతిధ్వనియే సాహిత్యము. కవి హృదయాంతరాళమునుండి యాత్ర చేయుచు మానవజీవనమేని, ప్రకృతియేని, యతని యుద్దేశానుసారము రూపాంతర మొందును. రూపాంతర మొందిన యీ భావమే రసరూపముగా పాఠకుని మనస్సును మార్చును. మానవజీవనము సాహిత్యమున కుపాదాన మాత్రము. సాహిత్యము రసస్పృష్టి.

ఇటులయ్యును ఈ యుపకరణము లేనిచో సాహిత్యము సృజింప పీలుపడదు. సాహిత్యమునకును సంఘమునకును ఇదియే కూడలి. మానవ జీవనముచే సభ్యతచే సంఘము నిర్మింపబడుచున్నది. జీవనలీలా బాహ్యప్రకాశము సంఘము. ప్రపంచము - సంఘము, ఈ రెంటి నడుమనే జీవనమును మనము విశేషాకారముగా చూడగలుగుచున్నాము. మనుష్యునిగురించి మనుష్యునకుఁగల ఉద్దేశము, మనుష్యుని యెడల మనుష్యునకు గల వ్యవహారము సంఘమును వ్యవస్థాపించును. ఈ యుద్దేశ వ్యవహారములు రెండును సాహిత్యమునందు భావమూర్తిని ధరించును. అడవిలోఁ గూర్చుండి సాహిత్య సృష్టి చేయవచ్చుఁగాని దాని కుపకరణము మాత్రము సంఘమే. ఒకరీతిగ ఇతిహాసము గూడ సాహిత్యమే. సాంఘిక జీవన స్థూల వ్యాపార మితిహాసము, ఆంతర వ్యాపారము సాహిత్యము. జీవన రసాలమున కితిహాస సాహిత్యములు రెండును ఏక మాత్ర ఫలము. దాని చర్మము ఇతిహాసము, రసము సాహిత్యము.

సాంఘిక జీవనపు వ్యాపారములు వాస్తవములు. ఇతిహాసమునం దీ వాస్తవఘటనల వివరణమును మనము పడయుదుము. భావగతమైన జీవనేతిహాసమును సాహిత్యమునఁ బడయుదుము. ఏది జరుగునో అది ఇతిహాసము. ఏది జరుగనగునో అది సాహిత్యము. యోగ్యతను పురస్కరించుకొని సాహిత్య సంఘటనము తథ్యమే కేవల సత్యముకాదు - జీవన సంభావనాయోగ్యతలో నిహితమైన సత్యము వాస్తవ సత్యముకంటెను శక్తిశాలి.

## 2

హిందూ సంఘమున అవాంతర సంఘములు చాల ఉన్నవి. ఈ సంఘముల కొకచోట భాషయు, మఱియొకచోట దేశమును భేదకము. అనగా ఒక విశిష్ట లక్షణము. ఉదాహరణకు ఆంధ్ర సంఘము, కర్నాటక సంఘము, మహారాష్ట్ర సంఘము - ఈ మొదలగునవి. హిందూదేశమునందు తెలుఁగు అరవము మొదలగు భాష లెన్నియున్నను కృష్ణరాయ, శివాజీ మొదలగు రాజు లెందరున్నను, శివకేశవాది దేవత లెందరున్నను ఈ ఖండ సంఘముల కన్నిటి

కిని ఒకే ధర్మము; అనఁగా మతము. ఈ కారణమున శ్రీకృష్ణరాయఁ డొక్క తెలుగుదేశమునకు మాత్రమే రాజుకాడు. జీవద్దశలో నాతఁడు తెలుగుతేదేకాని నేడు హిందూ రాజు. ఇటులే శివాజీ. అటులే ప్రతాపసింహుఁడు. మఱియు శివుఁడే పంగనామములు పెట్టుకొని విష్ణువాయెననియు, విష్ణువే విభూతి దాల్చి శివుఁ డాయెననియు, వీరిరువురిలో నున్న యొకానొక తేజమే భూమి యనియు-అనగా దైవమనియు హిందువుల ఏకైక ధర్మము - అనగా మతము. ఆచార వ్యవహారములలో నీ ఖండ సంఘముల కెంత భేదమున్నను ఈ ఖండ సంఘముల అన్నిటి హృదయమును ఒక్కచే!

వ్యక్తులు సాహిత్య స్రష్టలు. వ్యక్తులకును, సంఘమునకును అంగాంగీభావ మున్నది. మనుష్యుఁ డొకపెడ స్వతంత్రుడు. మఱియొక పెడ పరతంత్రుడు. భావనచే స్వతంత్రుఁడు; సంఘముచే పరతంత్రుడు. సాంఘికుడగు మనుష్యుని వాస్తవ జీవన వ్యాపారము సీమాబద్ధము. సంఘ బాహ్య వ్యాపారములచే మనుష్యుఁడు నియంత్రితుడు. కాని సాహిత్యమున నతడు స్వతంత్రుఁడు. ఈ స్వతంత్రత కర్థమేమి? సాహిత్యము లోకాతీతమా? కాదు.

విభావనాదులగు నలౌకిక వ్యాపారములచే విభావాదు లలౌకికము లనుటయు, రస మలౌకిక మనుటయు వేరుమాట. సంఘము నందేని, వ్యక్తి మానసమునందేని సంఘటించినవియు లేక సంఘటించుటకు యోగ్యత కలవియు నగు విషయములను మనము సాహిత్యమునఁ గనుగొనుచున్నాము. ఇట్టి విషయ జాతములో మనలను పరిచితులను గావించుటకు దేశకాలములు కవులకు సాహాయ్యక మొనరెంచును.

కాలవశమున సంఘ మొకప్పుడు కృత్రిమ మగును, లేదా జడమగును. ఈ కృత్రిమత్వము ఈ జడత్వము ప్రకృత సాహిత్య సృష్టికి విభ్రాంతి కలిగించి అంతరాయమగును. భాష యెడలను ఈ వికారము సమము: కవియగువాడి బాధలనన్నిటిని సబలముగా పారద్రోలి ఆ దేశ కాలములలో నభివృద్ధి చెందఁదగిన జీవనైశ్వర్యమును గాన మొనరించును.

జీవనము సహస్రముఖము. అనగా జీవన వ్యాపారము లనేకములు. జీవగీ ప్రధాన వ్యాపారములలో వివాహము కూడ నొకటి. ఇది సాంఘికము.

హరవిలాసుని బిల్లు పూర్వాచారమును తాఱుమారుచేసెను. ఇది ఒక విప్లవము.

ప్రేమ సాహిత్యమున కొక ప్రప్రధానమైన విషయము. ప్రేమ యను దినుసు సాంఘికమునుగాదు, అసాంఘికమును గాదు. కావున కవుల కీ హర విలాసుని బిల్లుతో నావంతయు బనిలేదు. కవులెన్ని శతాబ్దుల క్రిందనో ఈ బిల్లును సాహిత్యముగ జనమనోరంజకముగ అమలు జరిపిరి.

సాహిత్యమునకు సారము రసము. దేశకాల పరివర్తనముచే అనుభవ మునఁగూడ పరివర్తన మేర్పడును. కవి మనోభావముగాని కావ్యమునందలి విషయముగాని సహృదయ సాపేక్షము. మానవజీవితమునం దేదిశాశ్వతమో అది రసము నంటిపెట్టుకొని యున్నది. ఇది అపరివర్తనీయము. మానవు లందఱకును శాశ్వతమగు నొక ప్రకృతిగలదు. దాని నంటుకొని మఱికొన్ని ప్రవృత్తులు కలవు. అవియు నపరివర్తనీయములు. ఆ ప్రవృత్తుల వలనఁ గలిగిన భావముల ప్రకాశమున కాలంబనము వలయును. ఈ యాలంబనము చుట్టును భావసమూ హము వికసించును.

శోకముగాని ప్రేమగాని రసముకాదు. అవి సాహిత్యమున కథాశరీరము లగు పాత్రములలో బడి, ఆ పాత్రముల యాచరణమువల్ల మన హృదయ ద్వారముచేరి హృదయముతో కలిసి రసముగా పరిణమించును. ఈ పాత్రములు సంఘ బహిర్భూతములు కావు. ఆయా పాత్ర లాయా దేశకాలాదుల కనుగుణ ముగా నుంచవలయును. పాత్రలకు సంబంధించిన వైశిష్ట్యమును కాపాడనిచో రసమునకు ముప్పుకలుగును.

తెలుగు పాత్రమును వర్ణించుచో తెలుఁగు సంఘపు బొమ్మనే గీయవల యును. తెలుగుదేశపు నాయికా నాయకులను చిత్రింపవలయునేని లాతిదేశముల యందలి నాయికా నాయకులను తయారుచేయరాదు. ఒక యెల్లలో మనుష్యున కేవైశిష్ట్యము కలదో, ఆ వైశిష్ట్యమునకు భిన్నముగా ప్రవర్తించుచో రసమున కంగహాని కలుగును. ఇదియే "అనౌచిత్యము".

ఆసియాకును ఐరోపాకును కలిగిన కలయిక వలన పలువురు ఐరోపా వధువులు ఆసియాకు కోడం డ్రయిరి. ఇంతియకాక ఈ స్వరాజ్య యత్నమున పలువురు ఐరోపా స్త్రీలు హిందూదేశమున ప్రీతిగలవారై ప్రచారము చేయుచు నిచట నివసించిరి. వీరిలో కొందరు కొందరు హిందూదేశాచార వ్యవహారముల నాదరించుచున్నారు. అట్టివారిని సాహిత్య స్రష్ట లాలంబనముగా గొన్నయెడల వారి క్రియాచార వ్యవహారాదికమునే నిర్ణయించుచో నది రసమున కంగహాని కలి గింపదు. ఇట్టి వింతలు శ్రీ రవీంద్రకవి 'గోరా' యందును, శరచ్చంద్రుని 'శేషప్రశ్న' 'నవవిధాన్' మొదలగు వానియందును కనుపట్టును.

రస శిల్పముల సౌందర్యము అంగప్రత్యంగముల సౌందర్యము నపేక్షించును. అందులకు వైకల్యము కలిగినచో అది అతృప్తికి కారణమగును. సంఘముతో సంగత మొనరింపక మానవ జీవితమును చిత్రించినచో సౌందర్యబోధ భగ్నమగును.

తెలుగునాటి వారి సమాజమునం దేవిషయము లింత వట్టు అంకురింప లేదో, ఆ విషయములను పూరింపఁదలపెట్టినచోఁగాని, తెలుగు ఆడువారుగాని మగవారుగాని ఏ విషయములను విశేషాకారముగా తలపెట్టరో ఆ విషయములను గాని తెలుగు నాయికా నాయకుల ముఖములందు ప్రవేశపెట్టినచో రసమాతంకము చెందును. ఇటులగుచో నూతన సంస్కారములు సాహిత్యమునకు విషయములు కావా ? ఎందులకు కావు ? నేటి రచయితలలో పలువురు ముందడుగువేసి జీవ గానము చేయుచున్నవా రున్నారు. ఈ ముందడుగులో ముండ్లు గ్రుచ్చుకొనునని చూపు సాహిత్యముగూడ స్వల్పముగా గోచరించుచున్నది. సహృదయులు వీని కన్నిటికిని స్వాగత మిత్తురు. అది యటుండుగాక ! గాలివారి 'అపోహ' మొదలగునవి గాలిమేడలా ?

సంఘమునందు ఆలుమగలలో మగఁడు పెద్ద; ఆలు చిన్న. సాహిత్యమున, అనగా పూర్వసాహిత్యమున మన కీ విభాగమే గోచరింపదు. భవభూతి ఉత్తరరామ చరితమున సీత రామునికన్న చిన్నదని తెలియును. భవభూతి ఈ సంఘశాస్త్రమును– అనగా ధర్మశాస్త్రమునుగాని వైద్యశాస్త్రమునుగాని అచట జెప్పనుద్దేశింపలేదు. అది యటుండె.

రామునికంటె సీత పెద్దదని ఒక ప్రవాదము కలదు. దాని యాథార్థ్యమును విచారించుట కిది తావుకాదు. ప్రకృత సంఘ బహిర్భూతములగు పెక్కు ఆచారములు తొల్లి కలవు. అవి మారి నవీనాచారములచే మరపునఁబడినపుడు అప్పటి సాహిత్యస్రష్టలు వాని కుపపత్తులను కల్పించుచు వచ్చిరి తారుమారులు గూడఁ జేసిరి. ఈ విషయములన్నియు వేఱొకచో మథింపఁదగినవి.

వివాహమున మగవానికన్న నాడుది కొంచెము పెద్దగా నుండుట మేలను నూహ తలచూపి జీవ వైద్యశాస్త్రములందు క్రమాభివృద్ధి పొందుచున్నది. ఈ విషయము సోదాహరణముగా ఎక్కడేని సిద్ధాంతమాయెనో లేదో నా యెరుక కావల. ఈ సిద్ధాంత మపసిద్ధాంత మగుచో ఈ 'ఊహ' అపు డపోహయే!

ఈ విషయమును సామాన్యాకారముగా స్త్రీలందరును నవ్వుల పాలొనరింతురు. కొందరు దూరపుఁజూపుగల స్త్రీలు ఆలుమగలలో నేడాదికంటె హెచ్చు ఉండరాదని అభిప్రాయపడుచున్నారు. వైద్యశాస్త్రమునందు ప్రావీణ్యముగన్న కొందరు స్త్రీలు వివాహమున పురుషుడు చిన్నగా నుండవలయుననుటకు సుముఖులు.

విధవా వివాహము మనకు కొట్టిన పిండి. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వందలకొలది కన్యాదానము లొనరించిరి. ఈ రీతిగా ఇంకను ఇట్టి పెక్కు సంస్కరణములు సాహిత్య క్షేత్రమును విశాల మొనరించును.

సగోత్ర వివాహము కావలయునని మనమిత్రులు శ్రీ కాశేశ్వరరావుగా రొక బిల్లు తెచ్చిరి. రావు కమిటీవారును, మరికొందరును దీనికి తాతలనాటి ధర్మశాస్త్ర మొకటి ప్రమాణము చూపిరి.

ఇది మసలిమాను మొదలగు సంఘములయందే కాక గోత్ర పరామర్శము లేని హిందూవర్ణములలోగూడ జరుగుచునే యున్నది. 'గోత్రమే లేనివారికి సగోత్ర వివాహ నిషేధ మేమి?' అని కొందఱవాదము. గోత్ర పరామర్శముకల ద్విజాతులలో నీయాచార మొకప్పు డుండియుండును. దానిలో దోష మేదేని యుండుట జేసియో, మఱి యేకారణముననో అది నిషిద్ధమయియుండును. సత్సంతానము కిది ప్రతిబంధకమని కొందరూహించిరి. ఎవరో యొక రటుగాని, మఱియింకొక రిటుగాని చెప్పుదురుగాక- నేటి వైద్య విజ్ఞాన మీయెడ మూకము.

శ్రీకాకేశ్వరరావు కూతుంద్రకు పెండ్లికాక, వరులు కఱవయి పాప మీ బిల్లు చెల్లుబడి కొఱకు తిప్పలు పడుచున్నారని కొందరు చమత్కరించుట వినుచున్నాము.

ఇచట నిది చెప్పవలసియున్నది. సంఘబుద్ధి యింకను ఈ సంస్కారము లను జీర్ణము చేసికొనలేదు. కొందరు కొందరు వ్యక్తులే యీ సంస్కారములకు సుముఖులు. కావున నీ సాహిత్యమును జదివి యావత్సంఘమును రసించునని ఎవరును చెప్పఁజాలరు. ఇంతియకాక యిది ప్రాచీనాచార పరాయణుల కుద్వేజకము. ఇటులని ముందడుగువేయ కవులీ రచనను మానరు.

చేఁప చెరువును వదలఁజాలనటులు మనుష్యుఁడు సంఘమునువదలజాలఁడు. వేరు వేరు దేశములలో వేరు వేరు సంఘము లున్నవి. ఒక దేశమునందలి సంఘము కాలగతిచేఁగాని, సంఘాంతర సంబంధము వలనఁగాని మెల మెలగా మాఱవచ్చును. ప్రకృత హిందూ సంఘస్థితి అట్టిది. ఇటులెంత మారుచున్నను, వర్తమాన పరివర్తనముకంటె భూతవర్తనమే కంటి కెక్కువగా కానబడును. కాని దేశభేదముచే నొక సంఘముకంటె సంఘాంతరభేదము విస్పష్టమును, అనతిక్రమణీయమును అగుచుండును. సాహిత్య స్రష్ట తానే సంఘమున జనించెనో, లేక చిన్ననాటి నుండియు నే సంఘ పరిసరములలో బెరిగెనో విశేషించి ఆ సంఘము నతిక్రమింపనేరడు. సాహిత్యములో రచయిత మనస్సు ప్రతిబింబించును. ఆ రచయిత మనస్సును నిర్మించునది సంఘము.

ఒక కల్పనచేసి చూతము. క్రీస్తు శకము ముప్పదవ శతాబ్దినాటి కీసరి క్రొత్త సంస్కారము లన్నియు నాచారములో నుండును. అపు డీ బాల్య వివాహము నేడు సహగమనమువలె భయంకరముగఁ దోచును. విధవా రజస్వలా స్వయంవరాది వివాహములు గుణదోష మిశ్రము లయినను విడాకుల షరతుతో ఉపాదేయము లగును. ఇవి యన్నియు సాహిత్యమున ప్రతిబింబించును. అప్పుడు ఆ రచనలు ఆ పాఠకుల సౌందర్య బోధన భగ్నమొనరించునా ?

మానవులకు శాశ్వతమైన ఒక ప్రకృతి కలదు. దాని నంటుకొని మరి కొన్ని ప్రవృత్తులు కలవు. అవి అపరివర్తనీయములు. రస సముద్రమున నీ సంఘాచారము నురుగు.

మన వైజ్ఞానికు డిటు లనుచున్నాడు :

భావచర్వణము రసముగా పరిణమించు ననుటయే చివరమాటకాదు. రసమును వేరుపరచి చూపవలయును. మనుష్యుని మానసమునందు బలవత్ ప్రవృత్తులు కొన్ని కలవు. ఆ ప్రవృత్తులకు చారితార్థ్యము వలయును. మన స్సులో రెండు పొరలున్నవి. ఒకటి వెలుగుపొర - మరియొకటి చీకటిపొర. వెలుగుపొర సాంఘికము, చీకటిపొర ఇంచుమించుగా అసాంఘికము. ఈ చీకటి పొర వెలుగుపొరను నియమించును. వెలుగు పొరలో అసామాజికములగు కామన లుండవు. ఇవి చీకటి పొరలో పాతుకొనిపోయి యుండును. ఆ కామనలే విచిత్రములగు మాయాకారమును దాల్చి స్వప్నము లందును, సాహిత్యము నందును కాల్పనిక తృప్తిని పొందును. ఎచట నీ గోపన పరితృప్తి కలదో అచట రసముండును.

"ఎరిగి యెరిగి అసామాజికములగు నీ కామనలను వ్యక్తముచేయబూనుచో రసహాని ఘటిల్లును. సాహిత్య రచనలో బుద్ధి పూర్వకముగా చేయు నీ అసా మాజికత క్షమింపరానిది. ఏల అనగా అది రస పరిపంథి.

నెరవేరక దాగియున్న కోరికలు కావ్యమునందు గూఢముగా రస సంచారము చేయును. కవికి తెలియకయే కావ్యమునం దీవ్యాపారము జరిగి పోవును. మనోగుహలో దాగియున్న సంఘదూష్యము లగు ప్రవృత్తులు నిషేధ భయమున బయటపడవు. సంఘ విశ్వాసాది భయముచే నివి సామాజిక చ్ఛద్మ వేషము తాల్చును. అజ్ఞాతములును, ఆవేగశీలములును, విరుద్ధములునగు కామ నాప్రవాహముల ప్రకటనమునకు సాహిత్యమొక ఊట, లేక ఒకానొక అభయ క్షేత్రము. ప్రయత్న పూర్వకముగా అసామాజికతను స్థాపింపబూనినచో రస హాని అనివార్యము. మనస్సున నడగిన వృత్తులు వివర్తము చెంది మంగళ ములగు సాంఘిక రూపములను దాల్చి సుషమామండితము లగును. విష మప్పు డమృతమగును."

ప్రపంచ ప్రవృత్తి అంతయు మదనానంద మూలకమను ఫ్రాయిడ్ సిద్ధాంత మీరస సిద్ధాంతమునకు మూలము. ఈ ఫ్రాయిడ్ సిద్ధాంత మప

సిద్ధాంతము. కావున నిదియు. ఇది యెంతయు ననుభవవిరుద్ధము. నాసదీయ సూక్తములోని 'కామ స్తదగ్రే సమవర్తత' అనునది దీనికి సాక్షాదుపష్టంభకము కాదు. శిల్ప సాహిత్యముల చమత్కార మెక్కువగా అభ్యాసాపేక్షకము. మన అభ్యాసమున కది వ్యతిరిక్త మాయెనేని అది శిల్పముకాదు. ఈడిపస్ కాంప్లెక్సుతో కూడిన వ్యాపార మొకరిద్దరకు బాగుండవచ్చునేమోకాని, అది అందరకును బాగుగా నుండదు. అది విధి ముఖముగా శిల్పమునకు గొఱకాదు. మఱియు నతి పరిచితమగు వస్తువుకూడ శిల్పమునకు గొఱకాదు. వివాహమును గైకొని ఒకటిరెండు మేలిపుస్తకములు వ్రాయనగు నేమోకాని సాధారణముగా నది శిల్పముకాదు. ప్రేమ అను దినుసు పరిచితమైన కొలదిని వింత యైనది. అది సామాజికమును, అసామాజికమును కాదు. కనుక ప్రేమ శిల్పమునకు విషయము. మన ఎరుక కావలయు, మన జీవనాభిజ్ఞతకు దవ్వయినదియునగు వస్తువులను తీసికొని సాహిత్యమును నిర్మింపబూనినచో ప్రకృతి రసస్సృష్టి కాదు. ఐన్‌స్టీన్ మత మవలంబించి శ్రీ బుచ్చిబాబుగారు వ్రాసిన 'నాలుగో పరిమాణం' అను స్వప్ననాటిక మొదలగునవి దీని కుదాహరణము. విషయమును వివరించు పీఠికలు వీని కావశ్యకము. (నవోదయ 12 సంచిక చూచునది). ఇది రస సృష్టి కాదన్నంత. ఈ సృష్టిని నేను ధ్వంసము చేయదలచితి ననుకొనకుడు ప్రత్యుత ఇట్టి సాహిత్య సృష్టికి స్వాగతమిత్తును. ఈ విజ్ఞాన సాహిత్యమెంతయున్న నంత మంచిది. మనకు విజ్ఞాన సాహిత్యము కన్ను. రస సాహిత్యము హృదయము.

భావ జగత్తునందు దేనియోగ్యత అనిశ్చితమో, లేక అల్పమో దానిని రచింపబూనిన యెడల రసము వ్యాహతమగును. యథార్థ ఘటనల తోడనే సాహిత్యము కానక్కరలేదు. ఘటనాయోగ్యతలతో కావచ్చును. మన సాంఘిక వాసనలు లేక అభ్యాసములు ఈ ఘటనా యోగ్యతలను సులువుగా అర్థము చేసికొనును. ఇటు లయ్యును సాంఘిక వైశిష్ట్యము బాహ్యము. భావము చుట్టును ఈ వైశిష్ట్యము గుడికట్టి రసాస్పద మగును. రసామృతమును గ్రోలుపట్ల సంఘ భేదము తెలియదు. ఇదియ 'రసోవై సః'. కావుననే మానవుని మానసము సాహిత్యమున చారితార్థ్యము నొందును. సార్వజనికమగు సాహిత్యమునందు కవి యొనరించిన గానము ప్రతి వ్యక్తియందును ప్రతిస్పంద మొనరించును.



# 4. శృంగారము

స్వరాజ్యం కావాలి, స్వాతంత్ర్యం కావాలి, అనే కోరిక పుట్టిననాటినుండీ మనదేశపు పిన్నలలోనూ, పెద్దలలోనూ కలిగింది. ఆ కోరికతోపాటు మనజాతిని ఎలా పునరుజ్జీవితం చేయాలి అనే తహతహ ఒకటి కూడా తలచూపింది. ఆచార వ్యవహారాలలో, చదువు సంధ్యలలో, వేషభాషలలో- ఒకదాంట్లో అనే ఏమిటి అన్ని విషయాలలోనూ నవ్యత ఆరంభమయింది.

బాంగ్లాదేశంలో శ్రీరామకృష్ణ పరమహంస వ్యావహారిక భాషాప్రయోజనం చూపించాడు. బుద్ధుడులాగా వివేకానందుడు ప్రాబంధికభాషకు స్వస్తిచెప్పి వ్యావహారికభాషకు ప్రాముఖ్యం తెచ్చాడు. ఆంధ్రదేశంలోనూ అయా యీ పండితులు వాడుకభాష ఉపయోగాన్ని అనేక విధాలుగా ప్రచారం చేశారు. దానికి ఫలితంగా తెలుగుదేశంలో పత్రికలు పుస్తకాలూ చలద్భాషను అవలంబించడం వలన మూకప్రాయమైవున్న తెలివితేటలన్నీ కంఠాలూ గంటాలూ సంపాదించుకొన్నవి. తెలుగు సాహిత్యంలో ఒకకొత్తవికాసం ఆరంభించింది. అప్పుడు రుషియా, ఫ్రాన్సు, స్వీడన్, నార్వే, ఇటలీ, ఇంగ్లండ్, జర్మనీ సారస్వతాలు ఒక్కసారిగా కనిపించడం మొదలుపెట్టినవి. హిందూదేశంలోని బంగాళీ, హిందీ, గుజరాతి ప్రాంతాల పిన్నవారల కుతూహలానికి మేరలేకుండా పోయి "న పీయతే కావ్యరసం పిపాసితైః" అనే మాటకు స్వస్తి పుట్టింది. ఒక ఇంద్రజాలం వారి ఇంద్రియాలకు గోచరించింది. అంతట వారు అన్ని కళలలోనూ మేలుకొలుపులు పాడటం మొదలుపెట్టారు. దానికి పర్యవసానంగా ఈ నవజాగరణంలో, మేలూ కీడూ రెండూ రెండు తలలతో కనబడుతున్నవి.

మనదేశంలో ఇంతకుముందు సాహిత్యానికి సంబంధించిన భావరాజ్యంలో పౌరులు సౌందర్యాన్ని అన్వేషిస్తూ శక్తికొలదీ సభ్యతాసంప్రదాయాలను పాటిస్తూ క్రమక్రమంగా ముందడుగు వేసుకుంటూ వస్తున్నారు. పరంపరా ప్రాప్తాలయిన మన సభ్యతాసంస్కారాల చూపుడువేలు నిర్దేశించిన ఘంటాపథం

మీద హక్కును పొంది పరస్పర వైరం లేకుండా పిన్నలూ పెద్దలూ మెల్లగా నడుస్తున్నారు. కవులు, చిత్రకారులు, సహృదయులు, గాయకులు, శ్రోతలు అందరూ ఆ బాటగుండానే సౌందర్యయాత్ర చేస్తున్నారు. మన సభ్యతకుగాని, సంస్కారానికిగాని తిరుగుబా టెంతమాత్రమూ కనబడలేదు. నేటి నవ జాగృతిలో గలిగిన ఒకభాగంవల్ల సభ్యప్రపంచంలో కళాలక్ష్మికి వస్త్రాప హరణం జరిగిపోతూవుంది.

నవ్యజాగృతిలో తలచూపిన యీభాగం కొత్తదా అంటే కొత్తదీకాదు; పాతదా అంటే పాతదిన్నీకాదు గాని ఇది ఒక నవీన భంగిమం. ఇది జీవన రహస్యం ఎదుట ప్రపంచ సమస్య యెదుట ఒక క్రొత్త తీరు. ఈ భంగిమలో అత్యాశనమైన క్షుధ ఉంది. సంయమం లేదు. బర్బరత ఉంది. వీరత్వం లేదు. రూఢత ఉంది. పౌరుషం లేదు. ఇట్టి రచనల నన్నిటినీ ఏకీకరించి చెప్పగల సంజ్ఞ దొరకదు. ఈ రచనలలో నుంచి కొత్తవాణి వినిపిస్తుందా అని ఆలకిస్తే ఏమీ తేలదు. "ఈ రచనలలో కొత్తదనమేమీ లేదు, ప్రాచీన సాహిత్యంలో ఇటువంటి రచనలు కావలసినన్ని ఉన్నవి, లేక ఉంటవి" అనిగాని "లేక యీ రచనల చూపు కేవలమూ అట్టి విశేష ఘటనలమీద మాత్రమే" అనిగాని అంటే, ఇది కేవలం చూపుగాని, విపులీకరణంగాని లేక ఒత్తిచెప్పడంగాని కాదు; "ఇదే వీని సర్వస్వం" అని అనవలసివస్తుంది. మహాకావ్యసముద్రంలో తరంగితమై ఉద్గమించే మానవ జీవనలీలలో తార, అహల్య మొదలయిన పాత్రలు సగం మునిగిన ద్వీపాలలాగు కనిపించీ కనిపించకుండా ఉంటవి. కాని యీనాటి వాస్తవ వాదోపాసకములయిన రసరచనలకు ఆ వస్తువే కొత్తగా కనుగొన్న మహాద్వీపం. వాని కల్పనాశక్తి అంతా ఆద్వీపం చుట్టూ నురుగులతో వెల్లివిప స్తున్నది. పౌరాణి కాఖ్యాయికలతో వాని యింద్రియ క్షుధ ఆరదు. అవి ఆధునికము లను పేరిటి వస్తుతంత్రాలు. మరి వాని వస్తుతంత్రత స్త్రీపురుషుల యౌవన ఘటితమయిన ఇంద్రియోద్రేకముతో పొగిచి ఒకానొక రూపమును ఏర్పాటుచేసే తొత్రుపాటు. ఈ శ్రేణికి చెందిన రచనలు 'మాది వాస్తవ వాదం' అని చెప్పికొనుటకు వెనుదీయవు. ఈలాటి రచనలు ఒక తెలుగు భాష లోనే కాదు. ముమ్మరంగా వంగభాషలోనూ, ఉద్ధృతంగా గుజరాతీలోనూ మందంగా హిందీలోనూ, తెలుగుతో భుజాలు రాచుకుంటూ కన్నడంలోనూ

బయలుదేరి విలాయతీ సరుకుతోపాటు మార్కెట్‌లో చలామణీ కావడానికి పోటాపోటీలు పడుతున్నవి.

పాశ్చాత్య దేశాలలో జీవతత్త్వ మూలకమైన ఆలోచనాప్రవాహానికి చలనం కలిగింది. అచటి బుద్ధిమంతులు హార్మోన్‌తత్త్వం గ్రహించారు. కొత్త పద్ధతిమీద జీవతత్వ గవేషణం బయలుదేరింది. ఫ్రాయెడ్ అనే మనస్తత్వ శాస్త్రజ్ఞుడు "మానవుల చిత్తవృత్తి అంతా మదనానంద మూలకం" అని సిద్ధాంతం చేయడానికి ప్రయాస పడ్డాడు. ఈ సిద్ధాంతం అనేకులను అటూఇటూ ఊపింది. పాశ్చాత్య దేశాలలో ఫ్రాయెడ్‌కు అనేక మంది శిష్యులు వెలిశారు. సమాలోచకులు బలిశారు. అంతకు పూర్వం బహిరంగంగా ఆలోచించడానికి సంకోచ పాత్రాలయిన విషయాలు బటాక బయలుగా సభాస్థానాలలో అర్హత సంపాదించుకొన్నవి. వానిలో కొన్నికొన్ని విషయాలు కస్తూరీ మాత్రల పరిమాణంతో హిందూదేశపు పత్రికలలో అవతరించినవి. ఈనాటి పాశ్చాత్యుల ఆచార వ్యవహారాలలో ఉన్న తత్వాన్ని పలువురు గ్రహించి సాహిత్యంలో విప్లవస్వరాన్ని వెలువరించారు. సాధారణ జీవితం లగాయతు నరకజీవితం వరకూ గల ఇంద్రియ క్షుధ వీరివలన బయటపడ్డది.

మనదేశంలోని భావుకులు ఇంతగా ఈలాగు చిత్రింపకపోయినా దానిని అతీత భావ ధారలోనే కనుక్కున్నారు. కొందరు కనుక్కోక దానికే జయగీతాలు పాడుతున్నారు. కనుగొన్నప్పటికీ కొందరు అదే మంచిదని దానిని సాహిత్య కులాయంలో ఉంచుతున్నారు. ఈ కులాయంలో ఆదిమ జంతువు మహాకాయంతో కనబడగలదు. జీవనానికి కామ్యవస్తువు కామమే అని అది అరుస్తుంది.

ఆధునికమైన పాశ్చాత్య సాహిత్యంలో ఏ భావం వికసించిందో అది కేవలమూ వారి సంఘసామాగ్రి. దానిలో చిరంతనమైన సత్యం ఎంత పట్టు కలదో అది అన్ని సంఘాలలోనూ ప్రయోజనీయమే. ఆ సత్యం ఏదో దానిని గ్రహించి చిత్రించడానికి, ఏ సంఘసామాగ్రి మన సంఘధాతువులో అతకదో దానిని ఆలోచించి చూడడానికీ, మన యువకులకు అవకాశం ఎక్కడుంది? సతీత్వానికీ, శరీరానికీ ఏమీ సంబంధం లేదని కొందరు వ్రాశారు. పెండ్లిని

తీసివేయడం ఆపాతరమణీయమే కాని సతీత్వానికి మాత్రం కొత్త అర్థం చెప్పాలని ఇంకొందరు వ్రాశారు. ధర్మపత్ని కన్న వారవనిత వేయిరెట్లు దొడ్డది;- ఇద్దరూ శరీర విక్రయం చేస్తారు. కాని ఇష్టం గనుక ఐతే వారవనిత శరీర విక్రయం చేయకుండా ఉండగలదు అని మరికొందరు ఆచార్యుల మతం. ఇదంతా ఆకళించి ఈ మతాలనే పెక్కురీతులుగా మనవారు రచిస్తున్నారు.

మన ఆదికావ్యాలలోనూ ఇతరత్రా ఉన్న పచ్చి శృంగారం భావ నాగరికతా, సంస్కార కుశలతా కల సంఘంలో ఆరోగ్యవంతులయిన యువకులను కేంద్రచ్యుతులను చేయలేదు. సమగ్రమయిన మహాకావ్యం ఒక విపులస్పందంతో నడుస్తూ యీ శృంగార శకటాన్ని తీసుకపోయి శాంతికి తగిలిస్తుంది. దానివల్ల వారి చరిత్ర మీదపడే రేఖాపాతం ఎట్లా పర్యవసన్న మవుతుందో, అనగా అది ఐహికాంత మవుతుందో, ఆముష్మి కాంతమవుతుందో వివరించవలసిన పని ఉండదు. వారు వేరుమార్గం పట్టారంటే అది స్వశక్తివల్లనే అని చెప్పవలసి ఉంటుంది.

ఇపు డొక వైపరీత్యం కనబడుతుంది. పరాపర విద్యలను గురించి ఎవరికినీ ఇంగితమే లేదు. ఇప్పటి శైక్ష్యోపాధ్యాయిక వర్తకం చేసే ఒక దుకాణం. గురువు చేతిలో దివ్వెకాదు, శిష్యులు లక్ష్యభ్రష్టులు. అంతా కంగారు కామలోకమే కామ్యలోక మయితే ఏ యుపాధ్యాయు డేశిష్యుడికి 'అది తోవకాదు' అని ఉపదేశించ గలడు ? మనదేశంలో మనం మన జీవన పరమార్థానికీ జీవన అంతరార్థానికీ సంబంధించిన విషయాలను విశదంగా తెలిసికోడానికి ఏమయినా ఉపాయాలను చేశామా ? త్యాగంలో ఉండే మాహాత్మ్యం, పరాక్రమంలో గల గౌరవం, బ్రహ్మచర్యంలోని ప్రభావం, శృంగారంలోని గౌరవం, వీనికి సంబంధించిన పరిచయం వీరికి నేటి చదువులలో ఏ మాత్ర మయినా ఉన్నదా ?

కాల ప్రభావంచే మనజాతి వెన్నెముక విరిగిపోయింది. శతాబ్దాల తరబడి ఆవరించిన కుంభకర్ణ నిద్ర నుండి ఇపుడిపుడే మేలుకొంటూంది. మనం పశ్చిమాభిముఖులము కావాలో, అంతర్ముఖులము కావాలో తెలిసికొంటూంది. అనేక యుగాలనుంచీ వస్తూన్న "నిన్ను నీవు తెలిసికో, నిన్ను నీవు తెలిసికో" అనే మాట ఆశియా ఖండపు అంతరాళంనుండి ప్రతిధ్వనిస్తూ ఉంది. కాని బలంలేక

పోతే 'నిన్ను నీవు' తెలిసికో లేవు—"నాఽయమాత్మా బలహీనేన లభ్యః".మనం బలహీనుల మని ఎందుకు అనుకోవాలి ? మనకు మన ఆత్మీయతను వెల్లడించు కోగల సాహిత్యసారం లేదా ? అపక్వ ప్రేమాహృదయభేదం నాయకనాయికా తిరస్కారం, బహిర్భూతమైన యింద్రియాకాంక్షా వెరసి సెక్స్-అప్పీలేనా మన కున్నది ? ఈ రచన లింకా కొన్నాళ్లు ఈ నడకతోనే నడుస్తే రచయితలూ, పఠితలూకూడా దివాలా తీస్తారు.

మనదేశం మన విశిష్ట సభ్యతారేఖనుంచి జారిపోతే మన యువకులు రేపటి ఇతిహాసమును ఎలా నిలబెడతారు ? యీ భంగిమ, ఈ తీరే మన యువ కుల కందరకూ యథార్థస్వత్వం కాకుండా ఉండాలి. ఇలాగని మన కసలు శృంగారం వద్దని ఎన్నడూ అనం. మనకు కావలసినంత శృంగారం కావాలి. ఇంకా కావాలి ఇంకా కావాలి అని అనిపించే శంగారం కావాలి. దేనికి చదువుతూ వుంటే మనసు వ్యథపడదో అటువంటి శృంగారం కావాలి. దేనివలన మనకు నిషా కలగదో, మరి దేనివలన ఆనందం కలుగుతుందో అటు వంటి శృంగారం కావాలి. దేనివలన మన సంఘానికీ, సభ్యతకూ సంస్కృతి ఏర్పడుతుందో, మరి దేని వలన హిందూదేశం అర్ధనారీశ్వరుడనే భావసత్యాన్ని చిత్రించిన దనే ప్రతిష్ఠ సభ్యతా ప్రపంచంలో ప్రశంసింపబడుతుందో అటువంటి శృంగారం కావాలి. ప్రపంచ మంతా శృంగారం. దానిని చూస్తూ వుంటే మన కెట్టి జడానందం కలుగుతుందో, కవులు చిత్రించే శృంగారం దానికి మేలుతర మైన అజడానందం కలిగించాలని కోరుదాం.



# 5. తిరుపతి మహాకవి

[పరమేశ్వరుని గుర్తుంచుకోవటానికి నిగమాలు ప్రణవమునూ, ఆగమాలు ప్రణవముతోపాటు ప్రతిమనూ చెప్పినవి. ప్రాతఃస్మరణీయులైన పూజ్యులకు గూడా ప్రతిమలు నిర్మించి, యిండ్లలో వుంచుకొని ఆయాయీ అవసరాలలో పూజా పురస్కారాలు చేయడం ప్రాచీనులకు పరిపాటి అని ప్రతిమానాటకం మొదలైన గ్రంథాలవల్ల మనం ఊహించగలం. అయితే ఆ ప్రతిమలు చేయడం ఒక యెత్తు; వానిని జాగ్రత్త పెట్టడం ఇంకో యెత్తు. ఇప్పుడు ఆయిల్ పెయింటింగ్స్ మొదలైన శిల్పాలు వచ్చి ఆ కష్టం లేకుండా చేసినయ్. నాబోటి వాడు కూడా ఒక ఆయిల్ పెయింటింగో- అంతకంటె సూక్ష్మం, ఒక ఫోటో గ్రాఫో తీయించుకొని బంధువుల గోడలమీదా- అధమపక్షం, తనకో యిల్లుంటే సదరు ఇంటి గోడలమీదా వేలాడవచ్చు. అయితే ప్రకృతం.

ఈ మహా గ్రంథాలయంలో గ్రంథకర్తల ప్రతికృతులు, విశేషించి మహాకవుల ప్రతికృతులు ఉంచడం చాలా సంగతం. 'ఇంత భవనం ఉంది కదా, చూచి మరీపోదాం' అని ఏ వ్యక్తి అయినా లోనికి వచ్చి, కుర్చీలో జేర్లబడే సరికి ఎట్టెదుటి గోడలమీద ఫోటోలు కనిపిస్తే, వాట్ల పుట్టుపూర్వోత్తరాలద్వారా వ్యక్తులూ వారి గ్రంథాలూ పరిచితమవుతవి. ఇవి పరంపరా ప్రయోజనాలు.

కొన్ని గ్రంథాలయాలలో బొమ్మలు మాత్రమే ఉంటవి. కొన్నింటిలో గ్రంథాలూ ఉంటవి,- బొమ్మలూ ఉంటవి, చదివేవారే ఉండరు. ఇది సార్వత్రికమేకాని యీ రామమోహన గ్రంథాలయం ఎప్పుడూ కిటకిటలాడుతూనే వుంటుంది.

ప్రతికృతులవల్ల వచ్చే ప్రయోజనా లెట్లావున్నా నేడిక్కడ చేరిన మన మందరమూ మనకున్న యావదాస్తికతతో శ్రీ తిరుపతి మహాకవుల ప్రతికృతిని ప్రతిష్ఠించి వారిచరిత్ర చెప్పుకొందాం. ఈ సందర్భంలో - ఈ ప్రతికృతిని

గీచిన శ్రీ వేముల కామేశ్వరరావుగారికి ధన్యవాదాలు చెప్పిగాని ప్రకృత విషయం అందుకోను.]

## వంశాదికం

తిరుపతిశాస్త్రిగారి తండ్రిగారినిగాని తల్లిగారినిగాని నేనెరుగను, ఈ పద్యం ద్వారాగా గాని:

హరిదశ్వ పూజా పరాయణత్వ ప్రసం
గమువాఁడు తండ్రి వేంకటవధాని
అన్న మెన్నం దేరికైన లేదనని యు
త్తమురాలు తల్లి శేషమ సుసాధ్వి
ఆజన్మ ధర్మ విధ్యధ్యాపకత్వ మిం
పఁగువాఁడు గురువు బ్రహ్మయ్యశాస్త్రి
గోచిపెట్టక మున్న కోమలకవిత చె
ప్పినవాఁడు సహపాఠి వెంకట కవి

లలిత గుణనిధి వెంకట లక్ష్మి పత్ని
కలిత కవితా విలాసిని వలపుసాని
ఉండుగ్రామంబు జల్లిలో నెండగండి
పేరు తిరుపతి పండితులార నాకు.

ఈ పద్యంలో శ్రీ వేంకటశాస్త్రిగారు తిరుపతి శాస్త్రులవారికి సహపాఠకులే కాక గురువులని కూడా తేలుతూంది. అదే కవితా గురుత్వం. శ్రీ తిరుపతి మహాకవికి శ్రీ వేంకట మహాకవి కవితా గురువంటే చాలామందికి విస్మారంగా తోస్తుంది.

## కవితా గురుత్వం

కవిత్వం మొదలయిన లలితకళలు వేదంలాగా శాస్త్రంలాగా చెప్పకుంటే వచ్చేవి కావు. ఇవి పిచ్చి కళలు. ఎందుకంటే పుట్టింది మొదలు చచ్చేటంత వరకూ పిచ్చి ఎత్తదగినంత తన్మయత్వం ఉంటేనేకాని వీటిలో పేరురాదు.

బ్రహ్మవిద్య అంటూ ఒకటుంది, అదీ వేదంలా చెప్పుకోరు. కవిత్వాల మాటకేంగాని పిచ్చి విద్య అంటే ఇదీ పిచ్చి విద్య:—"గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్న సంశయాః" గురువుగారు చెప్పడం, నోరు బిడాయించుకొని కూచోడం! శిష్యుల సంశయాలో ఎగిరి చక్కా పోవడం, తరువాత శిష్యుడు-బాల-ఉన్మత్త-పిశాచవత్ కూచోవచ్చు! భాష్యం తెచ్చుకొని - గురువుగారు చదువుకొన్న పుస్తకం పట్టి చదివితే బాగా వస్తుందని లోకంలో వాడుక-నాకు మాత్రం ఒక్క ముక్కగూడా రాలేదు లేండి-శ్రీ జయంతి భగీరథశాస్త్రిలవారి వద్ద మడికట్టుకొని మరీ చదివి-ఆ మహాభాష్యం చాలా పురాతనం, 'శిలాఛాపా' అనడంవల్ల రెణ్ణెల్లకే పోక పెౌత్తిలో పెట్టి వారిది వారి కిచ్చివేశాను. అయితే ఈ పుస్తకాలు దగ్గర ఉంచుకోడం గూడా డాబే-'కోశవా నాచార్యః' అని యింకో రనవచ్చు.

## శ్రీ వెంకటరాయశాస్త్రిలవారి ప్రసంగం

బ్రహ్మశ్రీ వేదం వెంకటరాయశాస్త్రిలవారు ఒకానొక ప్రసంగంలో రెంటాల సుబ్బారావుగారి యింట్లో జరిగిన అష్టావధానంలో "అథ శబ్దాను శాసనమ్" అనే దానిమీద తమకూ తిరుపతి వెంకట కవులకూ చర్చ జరిగింది-అని స్వయంగా నాతో చెప్పారు. ప్రసక్తానుప్రసక్తంగా ఇంకో సంగతి యిచట చెపుతాను-ఆ ప్రసంగంలోనే ఆ వెంకటరాయశాస్త్రిగారు-'బాల వ్యాకరణంలోని చిన్నయసూరిగారి సూత్రాలకు శిష్టు కృష్ణమూర్తిగారి సంస్కృత సూత్రాలు ఫోర్జరీ అని మా తండ్రిగారు చెప్పారు. శ్రీకృష్ణమూర్తిగారి ద్వారానే యిది తమకు తెలిసినటులు వారి డైరీలో వ్రాసుకున్నారు, నేను చూచాను' అని చెప్పారు. ఇక ప్రకృతం-

## ఆర్థికాంశ - ప్రక్రియాంశ

ఇంకో తమాషా - శ్రీబ్రహ్మయ్య శాస్త్రులవారి వ్యాకరణ పాండిత్యమే అంతంత మాత్రం అని మరి కొంద రనగా విన్నాను. ఆ అన్న వారెవరయ్యా అంటే : వ్యాకరణంలో అర్థికాంశ చదువుకొన్న విద్యార్థులు.

ఇక్కడ ఒక విషయం చెప్పవలసివున్నది. మొన్న మొన్నటివరకూ తెలుగు వారూ అరవవారూ మహారాష్ట్రులూ మొదలైన వారందరూ కాశీ వెళ్ళి శాస్త్రాలు చదువుకొని వచ్చేవారు. ఆ కాశీలో కొన్ని సంవత్సరాల వెనుక వ్యాకరణంలో రెండుశాఖలు బయలుదేరినవి. ఆర్థికాంశ ఒకటి, ప్రక్రియాంశ అని ఒకటి. ఆర్థికాంశలో తర్కం ఎక్కువ కలిసి వుంటుంది. ప్రక్రియాంశ తర్కం లేకుండానే శబ్దసిద్ధికి ప్రయత్నిస్తుంది. మొదటిది సభలలో శాస్త్రార్థాలకు. తర్కంతోపాటు సాగుతుంది. రెండవది గంభీరంగా శబ్ద బ్రహ్మమునే చూస్తుంది. మనదేశంలో ఆర్థికంలో మహామహులు శ్రీ దండిబొట్ల విశ్వనాథశాస్త్రులుగారు, ప్రక్రియాంశలో పతంజలి కపరావతారం అనబడే శ్రీభాగవతుల హరిశాస్త్రులుగారు. మన బ్రహ్మయ్య శాస్త్రులవారో ప్రక్రియాంశకు చెందినవారు. శ్రీహరి శాస్త్రులవారి కేమీ రాదని ఒప్పుకుంటే శ్రీ బ్రహ్మయ్యశాస్త్రులవారు కూడా వైయాకరణఖసూచి అని నేను వొప్పుకుంటాను. గురువులయెడ ఇట్టి మాటలు అవినయాలు- వానిని విస్మరిద్దాం.

ఇక మన తిరుపతి శాస్త్రిగారి వ్యాకరణంలో ప్రజ్ఞ వారి కవిత్వంలోనే కనపడుతుంది చూడండి-

> "అర్థవత్తని యనధీనమని సమస్త
> దేశ సంగత మనియు నదేహమనియు
> అర్థవత్ సూత్రమందు నీయశము కొంత
> గూఢముగఁ జెప్పెఁబాణిని కువలయేశ !"
>
> "కొందరు పచాద్యజంతం
> బందురు మరికొంద రర్మ ఆద్యంతంబే
> యందురు మేముభయంబని
> యందుము నీ నామధేయ మానందనృపా !"

ఇట్టివింకా వుదాహరించగలను. వీరి 'ధాతురత్నాకరం' అచ్చు కాలేదు. కాబట్టి అందరూ ఎరుగరుగాని ఒక్కమాట చెప్తాను. కవికి శాస్త్రం ఎంత వచ్చినా అది గౌణం అయిపోతుంది. కవిత్వాని కుపయోగించేటట్లే కవి శాస్త్రాన్ని మలచు కుంటాడు. అలా కాకపోతే-" నమః ప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే."

తిరుపతి వెంకట కవుల కిరువురకూ గూడా మహాభాష్యకారుని మీదా ఆయన శైలిమీదా గూడా ఎంతో యిష్టం. కాబట్టే :

"అల పతంజలికృతంబైన భాష్యమునకే
పరిఢవిల్లును మహాభాష్య పదము" అని చెప్పారు. తిరుపతిశాస్త్రిగారిని గురించి శ్రీ వెంకటశాస్త్రిగారు-

"గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవని క
ర్ణాట సీతారాము సాటిఁ జేసి
తోడి కలార్థు లే ధూర్వహు తెల్వి కీ
ర్ష్యవహించి కలహమ్ము సలుపుచుండ్రు
ఎవఁ డెన్నడును పాఠ మెలమి విప్పకయె వ్యా
కరణ పాండిత్య ప్రకర్షమూనె
ఒరుడు నచ్చని నాదు గరువంబు సడలింప
జాలె నెవ్వని మనీషా లవంబు

ఎవడు నాకెక్కుఁడయ్యు నా యెడలఁ గార
ణాంతరంబున గురుభావ మంతరంగ
మునసె కాక వెలికిఁగూడ గనఁగఁజేసె—"

అని చెప్పారు. ఇంత పండితులు శ్రీ తిరుపతిశాస్త్రిగారంటే ! ఇక వారి కవిత్వం గురించి చెప్పుకొందాం.

## సర్వ జనీనత్వం

తిరుపతి వెంకట కవులంటే తెలుగుదేశంలో ఎరగనివారంటూలేరు. వారి కవిత్వం ఆస్వాదించని వారంటూలేరు. ఈ సంగతి అందరూ ఒప్పుకుంటారు. దీనికి కారణం ఏమిటి ? వీరు స్వయంగా తెలుగుదేశం చాలా భాగం సంచారం చేశారు– 'తిరిగితి మెల్ల దేశము లదేపనిగా'. వీరి కవిత్వం పండితులకూ పామరులకూ అందుబాటులో ఉంటుంది. 'నీవే పద్యం చెప్పి, నీవే దాని కర్థం చెప్పుకో' 'వసరం లేదు.' అంతేకాక ఆశ్చర్యం ఏమిటంటే రసవంతంగా ఉంటుంది !

వీరు కవిత్వాన్నే జీవికకూ ఆధారం చేసికొన్నారు. అవధానం అనే అతి కష్టమైన వినోదాన్ని సునాయాసంగా చేసేవారు. అందువల్ల వీరికి ప్రజాసామాన్యాన్నీ పండిత సామాన్యాన్నీ మెప్పించవలసి వచ్చింది. అవధానిక్కి ఆశుకవిత్వం అవసరం. ఎంత పండితుడయినా దీనికి పూనుకుంటే అందరకూ సులభు డవుతాడు. వీరి ప్రతిభావిశేష మేమిటంటే ఆ అవధాన కవిత్వంలోనూ ఆశుకవిత్వంలోనూ ధ్వనులూ జాతీయాలూ మొదలయిన రవ్వలు రాలుస్తూ ఉండటం. ఇది గనుక లేకపోతే ఆ కవి ఇట్టే మరపున పడిపోతాడు. అట్టివారు మన ఆంధ్రదేశంలో రెండు మూడు శతాబ్దాలనుంచీ ఉన్నారు. వీరేశలింగంగారిని గురించి ఎవరో అడిగితే—

1. 'మాడబ్బు చెడద్రొబ్బె మార్చె బుద్ధులటంచు మగవాండ్రు తన్నుం గుణింప (విధవలకు వివాహాలు చేయించటం మొదలు పెట్టాడని వ్యంగ్యం).

2. "ఎద్దునెక్కును నీదు నెమ్మికాడని నవ్వ
గ్రద్దనెక్కును నీమగం డటనియె" (లక్ష్మీ పార్వతుల పరిహాసాలు)

3. "పెరిమె నాకసమను పీర్లపంజాను ని
ల్చిన లాలసాయెబు పీరనంగ" (చవితినాటి చంద్రుఁడు)

4. "కాచినాఁడవు కదా కరిరాజు ప్రాణమ్ము
కఠిన నక్రమును చక్రమున ద్రుంచి"
(తిరుపతి వెంకటేశ్వరస్వామి)

5. "రాత్రి యెప్పుడు వచ్చురా దైవమా యంచుఁ
బలుమాఱు మదిని జప మ్మొనర్చు."
(పరకీయాసక్తుడు)

6. "స్రగ్ధారీ దండధారీ వివిధ వసనయుక్ చోళ
ధారీ వికారీ (విదూషకః)

7. "సీరుంగోరదు గడ్డినడ్గ దొక కొన్నే నుల్వాలన్ వేడదు
[బైసికిల్ గుఱ్ఱం కంటె దొడ్డదని వ్యంగ్యం]

ఇట్టి వెన్నో వున్నయ్.

చాలామంది నన్నయ, ఏఱ్ఱాప్రెగడ, నాచన సోమన, పాల్కురికి సోమన, రాయలు, వెంకట నాథుడు ఇటువంటి మహాకవులను ఎఱుగరు. శ్రీనాథుని కాశీఖండంగాని నైషధంగాని విందామని కాదు. మరి? 'సిరిగల వానికిఁ జెల్లును' 'హంసీయానకు కామికిన్' శ్రుతి శాస్త్ర స్మృతులభ్యసించుకొని, 'పూజారి వారికోడలు— వీనిమాటలు అల్లా వుంచండి—' దీనారటంకాల 'కవి రాజు కంఠంబు కౌగిలించెను గదా పురవీథి నెదు రెండ పొగడదండ'— ఇట్టివి వినడానికి. ఇవన్నీ అందరకు తెలిసేవి. జీవితంలోని సుఖదుఃఖాలు తెలిసే చాటువులలోనే మహాపండితుఁడైన యీ శ్రీనాథుడు ప్రజలలో పాకిపోయినాడు.

## కవితా వీరత్వం

ఇలా ఎల్లచోట్లా అవధానాలు చేయడంలో అసూయాగ్రస్తులకు కన్నెఱ్ఱ గలగడం, దానికి ప్రతిక్రియ అవలంబించడం అవసరం అవుతుంది. అందువల్ల వీరి కవితా వీరత్వం ఉబుకుకొని వచ్చింది. వీరి ప్రతిజ్ఞ చూడండి-

"దోసమటం చెఱింగియును దుందుడు కొప్పగ బెంచినార మీ
మీసము రెండు బాసలకు మేమె కవీంద్రులమంచుఁ దెల్పగా..."

"ఇచ్చెదవు కాక మానెద వేమికొదువ
మా కవిత్వ పరీక్ష సమ్యగ్గతిని ర
చింపు మే కథ నేనియుఁ జెప్పునపుడు
చేయి యాపిన నది తెగవేయు మధిప!"

"నూటికి సెలగయ్య"

"వెలనాటి వార కవితకు వెలనాటితి"

ఇట్టి సింహగర్జనంతో వీరు దేశమంతా మారుమోగారు.

## ధారణా శక్తి

దేశాలన్నీ తిరిగి వానప్రస్థం పుచ్చుకునే వయసులో వీరికి నేను శిష్యుడ నయినాను-

అవధానాపర నామధేయమగు గార్హస్థ్యంబు నందున్న యె
క్కువ సౌఖ్యం బనుభూతమయ్యెఁ గడుప్రాజ్ఞుల్ శిష్యులై రింక స
త్కవితాసాధ్వియు సేవజేయఁగ సుహృద్ గ్రైవేయ కావ్యాటవిన్
కవులీ తిర్పతి వేంకటేశ్వరులు వానప్రస్థు లౌటొప్పదే !

అని నా తెనాలి అవధాన సమాప్తిలో శ్రీ తిరుపతి శాస్త్రిగారు చెప్పారు.

శ్రీ వెఁకటశాస్త్రిగారికి ధారణ తగ్గింది. వారు మొదటి పాదం చెప్పక పోయి కుర్చీలో కూచుంటే పదపటి మూడు పాదాలూ శ్రీ తిరుపతి శాస్త్రిగారే నిర్వహిస్తూ వుండేవారు. తెనాలి పక్క పినపాడు లగాయతు పిఠాపురం పక్క లక్ష్మీ నరసాపురం వరకూ జరిగిన చాలా అవధానాలలో శ్రీ తిరుపతి శాస్త్రిగారి ధారణా శక్తితో నాకు బాగా పరిచయం ఉంది. కొన్ని అవధానాలు మే మిరువు రమే చేశాం.

'గ్రహణ శక్తి తిరుపతిశాస్త్రి గారికి పెచ్చనీ, ధారణా శక్తి తనకు పెచ్చనీ' వెంకటశాస్త్రిగారు వ్రాసి వున్నారు-కాని నాకు తెలిసినంత మేరలో శ్రీ తిరుపతిశాస్త్రిగారి ధారణలో యిసుమంతైనా త్రుటి కనబడలేదు. నేను వారి కంటె సగానికి సగంపైగా చిన్నవాడనయినా వారితో పరిగె త్తలేకపోయేవాణ్ణి. వారు ఒక పాదం తరువాత యింకో పాదం ప్రవాహముగా చెప్పుకొని పోతూ వుంటే 'మెల్లగా మెల్లగా' అని అనవలసివచ్చేది. 'ధుర మేకాకినా న్యస్తామృష భేణ బలీయసా' అనే రామాయణం చెవిలో గింగురుమనేది. చిట్టచివరికి చదవడం గూడా వారు వచ్చిన పాఠం గడగడ అప్పగించినట్లు అప్పగించేవారు. అది వినడానికి కనడానికి నాకే వింతగా ఉండేది. ఐతే శిష్యులను కూడగట్టుకొని వెళ్లడం తిరుపతిశాస్త్రి గారికే తగు.

## వాత్సల్యం

శిష్యకోటిలోవారు ఏ పద్యంకాని వినిపించనీయండి. శ్రీ తిరుపతిశాస్త్రి గారు ఆదరంగా విని బాగుందని మెచ్చుకొనేవారు. తమ సంతానం మీద కంటే శిష్య సంతానం మీద వీరిలో వాత్సల్య క్షీరం ఎక్కువ. నేను చెన్నపట్నంలో ఒంటరిగా అవధానం చేయడానికి వెళ్లినపుడు వారు నాకు వ్రాసిన ఉత్తరం

ఇప్పుడవ వెల్లడిస్తే అది ఆత్మస్తుతిగా పరిణమిస్తుందని అంత పిచ్చి పని చేయకుండా-"...నేను నీ వెనుకనే యుంటి నీ హృదయ వీథిని గాంచుచుంటి..." అని ఈ మాత్రం ఉదాహరించి ఊరుకుంటాను. అయితే ఈ సందర్భంలో నా గురువుగారి కవధాన మప్పటి పద్యాలుదాహరింపవలసి ఉన్నవి. వాటికీ ఈ దోషం పడుతుంది. ఇవి నేను నా కోసం కాకుండా వారి వాత్సల్యం తెలపడం కోసమే ఉదాహరిస్తున్నానని మీరు హృదయపూర్వకంగా నమ్మితే నే నొడ్డున పడతాను. ఇక వినండి:

> జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబునం గొన్కొలం
> పగ సాంగంబు సలక్షణంబుగ శరద్వావింశతిం బేర్మి హె
> చ్చగ మాయేలిన యీ వధానకవితా సామ్రాజ్య భారంబు మో
> యగఁ బూనంగదవయ్య తండ్రి ! శివరామయ్యా ! చిరంజీవివై !

ఇది నేను మోయగల వాత్సల్యమేనా ? ఇంతేకాదు. శ్రీ వేంకటశాస్త్రిలుగారు రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో పండిత పదవి సంపాదించడం కోసం పనిగట్టుకొని చెన్నపట్నం వెళ్లారు. నేనూ అప్పుడు వారి వెనుక ఉన్నాను. ఒకనాడు సైదాపేట, ఇంకోనాడు యెగ్మూరు, యింకోనాడు మైలాపూరూ ఇలా తిరగడంలో ఒకనాడు ఆచారప్పన్ వీధికి వెళ్లాం. అక్కడ గోపాలాచార్లుగారు ! ఆ గడ్డమూ - దానికి తోడు గడగడా సంస్కృతం మాటాడటమూ - నాకిప్పుడు కళ్లకు కట్టినట్టున్నాయి ! వారింటికే ఆత్మకూరు నుంచి శ్రీనివాస విలాసచంపు వ్రాసిన కృష్ణగారి బందుగులున్నూ కొందరు కవులున్నూ వచ్చి వున్నారు. అప్పుడు శ్రీ గోపాలాచార్లుగారు 'జీవానందం' అనే సంస్కృత నాటకం ఒకటి తీసి 'దీన్ని నాకు కృతిగా తెలుగు చేయండి' అని శ్రీ వేంకటశాస్త్రిలుగారి చేతిలో పెట్టారు. తరువాత శ్రీ వెంకటశాస్త్రిలు గారు సదరు నాటకాన్ని తీసుకొచ్చి కాకినాడలో తిరుపతి శాస్త్రిలు గారికిచ్చి దాన్ని తెలిగించే భారాన్ని తాను దింపుకొన్నారు. కొన్నాళ్ల దీ మూలనే పడి ఉండేది. శ్రీ తిరుపతి శాస్త్రిగారు కొన్నాళ్లకు దాని దుమ్ము దులిపారు గాని అది సాగిపోలేదు. నన్ను అప్పుడు సాయం కలుపుకున్నారు. నాలుగు రోజులంతల్లా ఎక్కడినుంచో ఆహ్వానం వచ్చింది. దాంతో ఆది వెనక్కి వెళ్లింది. ఈలాగే సువర్ణ పాత్రికమూనూ- అందులోనూ నన్ను

భాగస్వామిని చేశారు గాని అదీనిన్నీ ఒక అంకంతో చెల్లు. ఎందుకు చెప్పవచ్చానంటే ఏ గురువు ఏ శిష్యుణ్ణి తనలో కలుపుకొన్నాడు ? వారి దంత వాత్సల్యం !

అవధానాలకూ ఆశువులకూ జీవికకూ ఆధారమై అందరకూ అందుబాటులోకి వచ్చిన వీరి కవిత్వం ప్రబంధాలలో కూడా అలాగే అందరకూ అందుబాటయింది.

తెలుగు కవిత్వం శ్రీవెంకటకవిగారి నోటిలోపుట్టి శ్రీతిరుపతి కవిగారి హృదయంలో పెరిగింది ! తిరుపతి వెంకటకవులది తెలుగుకు తెలుగు నోరు, సంస్కృతానికి సంస్కృతపు నోరు:

"వేసవి దగ్గఱాయె మిము వీడుటకున్ మనసొగ్గదాయె మా
వాసము దూరమాయెఁ బరవాసము చేయుట భారమాయె మా
కోసము తల్లిదండ్రు లదిగో ఇదిగోయని చూచుటాయె..."

"వికస దిందీవర ప్రకరమ్ము నకును నో
నామాలు దిద్దు నీ నాతి కనులు" (ఏలామాహాత్మ్యం)

"దాతృత్వమందు రాధాతనూజాతున
కవల నేడాకు లెక్కువ పఠించె (గీరతం)

"పదక్రమ జటాద్యటత్ ప్రకట వేద వేదాంగా టూః"
(కాశీ సహస్రము)

"అణంతో రణంతో వణంతో భణంతో
మణంతః కణంతః క్వణంతో వ్రణంతః." (ధాతురత్నాకరం)

శ్రీ తిరుపతికవులు తమకింపయిన కవనాన్ని ఇలా వర్ణించారు:

"కేవల సంస్కృత మర్మా
దావిదులును గేవలాంధ్ర తత్వ్రదులును గా
కేవార లుభయ భాషా
కోవిదు లవ్వారు దీని గురువులు జగతిన్."

ఇదే తిక్కన్న 'ఉభయకవిమిత్ర'త్వం, 'మాఱుమూల పదములు గుప్పిన ముచ్చటగునె? ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁ గాక' (శ్రవణా) అని మామూలుగా అందరకూ ఉపస్థితిలో వున్న పదాలే పుచ్చుకొని అమృతం కురిపించగల మహాశక్తి వీరిది.

'శ్రవణానందం' వీరి ప్రప్రథమ ప్రబంధం అని అనుకుంటాను. ఆ ప్రబంధంలో కథాశరీరమూ కథారచనకూడా చాలామందిని ఆకర్షించింది. దీని తరువాత 'పాండవ విజయం.' అది సరస్వతి అనే పోలవరం రాజావారి మాస పత్రికలో పడ్డది. ఇటీవల శ్రీ వెంకట శాస్త్రులవారు పాండవ నాటకాలన్నీ వ్రాయాలని [ఈ సంకల్పమున్నూ రామాయణం గూడా నాటకాలుగా వ్రాయాలన్న సంకల్పమున్నూ శ్రీ తిరుపతి శాస్త్రిగారిదే] వ్రాసి ఆ పాండవ విజయాన్ని కొంత కత్తిరించారు. ఈ రెండు పుస్తకాలూ బుద్ధచరిత్రతోపాటు శ్రీ తిరుపతి కవులు ఆంధ్ర సరస్వతికి పెట్టిన అలంకారాలు.

శ్రవణానందంతో పాటు పాండవ విజయం కూడా ఆంధ్రులకు సుపరిచితం. ఈ నడుమ త్రిలింగ; "వారందు రచించిన పద్యములు తిక్కన రచనవలె ఉదాత్తమైనవి కాకున్నను సులభశైలిలో నుండి పండిత పామరుల కెల్ల అర్థమయ్యేడిని" అని వ్రాసింది. 'లోకో భిన్నరుచిః' కదా! ఈ నాటకం గొప్ప నాటకాలలో ఒకటి. 'వేణీసంహారం' గొప్పదైతే ఇదీ గొప్పదే! ఇప్పటి కొలబద్దలతో, ఇప్పటి రంగస్థలాలతో, ఇప్పటి నటులతో ఇప్పటి సహృదయతతో కాదు దీనికి విలువ కట్టడం! రసానందమే దాని విలువ కట్టుకుంటుంది. దీనిలో ఒక పద్యం వినిపించి యీ విషయం ముగిస్తాను.

దుర్యోధనుఁ డొకఁడు మిగిలి ఉన్నాడు. అందును నాటకం నడుస్తూంది. అప్పుడు—

ఉ. ఆఱునిలోతు నీటి కొల నక్కట పూచిన తమ్మికై విధి
ప్రేరణ రాలిపోయినవి ఱేకులు తొంబది తొమ్మి దిప్పు డా
నీరజమందుఁ దా మిగులునే యొకఱే కటులుండెఁబో యలం
కారములౌనె యాకొలనుగాని సరోజముగాని భూమికిన్.

స్వతంత్రాలైన వీరి పదిపన్నెండు నాటకాలలోనూ ప్రాచీన నాటకాలలోనూ కవిత్వానికే ప్రాధాన్యం. నాటకత్వం మొదలయిన మిగతా తత్త్వాలన్నింటికీ సమప్రాధాన్యం సంస్కృత నాటకాలలో లాగానే లేదు. ఆ ప్రాధాన్యంకూడా పరిష్కరించడం కష్టం.

## ఆ ం ధ్రీ క ర ణ ం

శ్రీ తిరుపతి శాస్త్రిగారి ఆంధ్రీకరణం చాలా హృదయస్పర్శి. బాలరామాయణం, మృచ్ఛకటికం, ముద్రారాక్షసం వీట్లల్లో తిరుపతిశాస్త్రిగారు బాగా కనబడతారు. వీనిలో మృచ్ఛకటికం అసలు వస్తువుచేతా తెలిగింపులో ఉండే గొప్పదనం చేతా చాలా ఉదాత్తం. భాసుడు లేక శూద్రకుడు- వీరిలో ఎవరో యొకరి మనస్సులో పుట్టిన వసంతసేన - శ్రీ తిరుపతిశాస్త్రిగారివల్ల 'కమలము కేల లేనిసిరి, కామునిచేతి ప్రహేతి, శోకము మగవాండ్ర కందఱకు కంజశరాగమ పుష్పమై సిగ్గుపోడిమిగల కూర్మితో తెలుగుదేశపు వసంతసేనయై మనకు కనబడుతుంది. ఈమెను చూచుకొనే పలుచోట్ల శ్రీ తిరుపతిశాస్త్రిగారు 'లలిత కవితావిలాసిని వలపుసాని' అని అనుకొని ఉంటారు.

బాలరామాయణం కూడా చాలా గొప్ప తెలుగుసేత. అది యెక్కడా తెలిగింపువలె ఉండదు. సహజంగా కవి నోట్లోనుంచి వచ్చినట్లు ఉంటుంది. దీన్ని చదువుతుంటే ఏలామాహాత్మ్యమూ- ఏలామాహాత్మ్యము చదువుతుంటే బాల రామాయణమూ నాకు గుర్తుకు వస్తవి.

## గ ద్యం

శ్రీ తిరుపతి శాస్త్రిగారి విక్రమాంకదేవచరిత్రం చూచినా, హర్షచరిత్రం చూచినా, చంద్రప్రభ చరిత్రం చూచినా పరివర్తనలోని ఆ నేర్పు మనసుకు పట్టుకుంటుంది! వీనిలో విక్రమాంకదేవ చరిత్రంలోని చివరి ప్రకరణం మరీ మనోహరం. శ్రీ తిరుపతిశాస్త్రిగారు ఎక్కువ వ్యాసరచన చేయలేదు. వెంకటశాస్త్రిగారు పరుగెత్తుకొని పోతూవుంటే వెనుకనుంచి వీరు బలాధానం చేస్తారు. వెనక అండచూచుకోకుండా వారు పరుగెత్తి అలసటవచ్చి నిలబడి వెనుకకు చూసేసరికే శ్రీ తిరుపతిశాస్త్రిగారు అవష్టంభం ఇస్తారు. వెంకటశాస్త్రిగారి వ్యాస

రచన చాలా విపులం. చాలా చమత్కారం. ఎక్కడెక్కడి నుంచో ఊరుకొని వస్తుంది. శ్రీ రామకృష్ణ పరమహంసను ఒక భక్తుడు "అయ్యా! మీకిన్ని మాటలు ఇన్ని చమత్కారాలు ఎలా వస్తవి?" అని అడిగాడట! అప్పుడాయన- 'ధాన్యరాశి కొలుస్తూవుంటే మా అమ్మ వెనుకనుంచి ఆ రాశిని తరగకుండా తోస్తూ వుంటుంది' అని అన్నాడు. అలాగానే వీరు కలం పట్టుకుంటే సరస్వతి ఆ కలాన్ని ఊరకే ముందరికి లాక్కోపోతూ వుంటుంది.

వీరు సారస్వత రాజ్యం అంతటిలోను విహారం చేశారు. ఆశువు, చాటువు, పాట, ప్రబంధము, నాటకము, ప్రహసనము, కథ, వ్యాసము, విమర్శనము, వ్యాకరణము, స్వకీయచరిత్ర, అన్యోక్తి... ఈ మొదలయినవెన్నో. వీని అన్నిటిలోను స్వగతమైన చమత్కారం మహోజ్జ్వలంగా ప్రసరిస్తూ వుంటుంది.

## ఉ ప సం హా రం

ఏ కవి అయినా ఒకే ఒక గొప్ప పుస్తకం వ్రాసి పేరు తెచ్చుకోవచ్చు. నోబెల్ బహుమతిని గూడా సంపాదించవచ్చు. ఆ పళంగా రచన మానుకొని కూచుంటే ఆ కవిని లోకం మరిచిపోతుంది. లోకానికి రోజురోజూ ఒక కొత్త ఆనందం కావాలి. ఆ ఆనందాన్ని సరఫరా చేస్తూ వుంటే ఆ కవి అమల్లో వుంటాడు. నోబెల్ బహుమానం స్వీకరించి మూటాడక కూచున్నవారు కొంద రిప్పుడు మరుగులో పడ్డారు.

శ్రీ తిరుపతిశాస్త్రిగారు కలం పట్టింది లగాయితు మృత్యువొచ్చి లాక్కునేటంతవరకూ పట్టిన కలాన్ని కిందపెట్టలేదు. కాసేపటికి పోతారనగా :

"దయ యే మూలను దాగెనో భవదుదాత్తంబైన మంత్రం బనా
మయ్యదం బేమయి పోయెనో యమలనామ ప్రాభవం బెందులో
వ్యయమై పోయెనొ దేవభక్తునకు సంప్రాప్తించునే మేహ నా
కయ్యె మెంత మోసమిది యౌరా! స్సూర్యనారాయణా!"

ఈ రెండు పద్యాలు నోటితో చెప్పలేక కాకితంమీద తిరుపతిశాస్త్రిగారి కుమారుడు చి॥ వెంకటశాస్త్రిగారి

వద్ద ఉండి ఉంటుంది. వారి నడిగి తీసికొని జాగ్రత్త పెట్టడం మంచిదని అనుకుంటాను.

తిరుపతిశాస్త్రిగారి తండ్రిగారు హరిదశ్వ పూజా పరాయణులని తెలిసికొన్నాం- వారి వంశ వర్ణన పద్యంలో శ్రీ తిరుపతిశాస్త్రిగారు పాదుకాంత దీక్ష పుచ్చుకొన్న వారేకాక సూర్యోపాసకులు కూడాను. కాబట్టి చరమవేళలో ఆ తేజస్సును కవిత్వంతో ఉపాసిస్తూనే వున్నారు.

తిరుపతిశాస్త్రిగారికంటె వెంకటశాస్త్రిగా రెక్కువవారా ? లేక వెంకటశాస్త్రిగారి కంటె తిరుపతిశాస్త్రిగా రెక్కువవారా ? అని కొందరు ప్రశ్నిస్తారు. వారికి :

"తిరుపతిచేత వచ్చెనొ యతిప్రతిభా మహిమమ్ము వేంకటే
శ్వరునకు, వేంకటేశ్వరుని వల్లనె చెందెనొ యా మహత్త్వముల్
తిరుపతి, తద్వివేకము నిలింపులు సైత మెరుంగరు"

అనే ఈ గీరతపద్యం ఉదాహరిస్తాను.

తిరుపతిశాస్త్రులుగారు శక్తి అయితే వెంకటశాస్త్రులుగారు చైతన్యం; వెంకటశాస్త్రులుగారు శక్తి అయితే తిరుపతి శాస్త్రులుగారు చైతన్యం.



# 6. శతావధానం

అవధానాలకు పుట్టినిల్లయిన ఆంధ్రదేశంలో శతావధానమంటే ఏమిటి? ఎలా చేస్తారు? అని అడిగే రోజులు వచ్చినవి. ఇది ఒక విధంగా మంచిది; ఒక విధంగా చెడ్డదీను- అని నే ననుకుంటాను. ఎన్నో ప్రజ్ఞలుంటేనేగాని శతావధానాన్నిగాని, అష్టావధానాన్నిగాని రక్తికట్టించడం దుస్తరం. ఉపన్యాసాలెందరెందరో చెపుతుంటారు. కూచున్నట్టే ఎరుగకుండా చేయగల వక్త లెందఱుంటారు? విషయ గాంభీర్యం ఎంతో వుంటుంది, ఇంకా ఏమేమో ఉంటుంది, ఏమయితేనేం? కొంతసేపటికి సభాధ్యక్షుడు మాత్రమే మిగులుతాడు. అలాగే శతావధానులు కూడాను. అవధాని శ్రావ్యంగా పద్యం చదవలేకపోతే శతావధానమల్లా ఏకావధానమై పోతుంది. పిదప, ఆశువుగా పద్యం అల్లలేకపోతే సభ్యులకు విసుగెత్తుతుంది. అసలు చమత్కారం లేకపోతే శతావధానమే కాదుగదా, కవిత్వం చెప్పటమే మానుకోవచ్చు. ఇంకో దినుసు ధారణ; అనగా జ్ఞాపకశక్తి. మొదట అడిగిన విషయాలమీద ఒక్కొక్క పాదం చెప్పుకపోయి, రెండవపాదం చెప్పడానికి సాహసించాడురా అంటే, అతగాడికి ధారణాశక్తి ఉన్నట్లే! ఈ వెనుకటి శక్తులేకాక, యీ ధారణాబలం కూడా ఉంటే, అటువంటి అవధాని ఒక మాదిరిగా సహృదయులను ఆకర్షించి 'శతావధాని' అని పేరు పడతాడు. కాని యీ ధారణాబలం ఎంతకాలం ఉంటుంది? శ్రీ తిరుపతి వేంకటకవులకే, విశేషించి శ్రీతిరుపతి శాస్త్రిగారికే-ఇదిన్నీ అవధానం మటుక్కే పరిమితం; శ్రీ వెంకటశాస్త్రిగారికి నిర్యాణ పర్యంతమూ ఉన్న అవధానేతర- అసాధారణ ధారణాబలం అందరకూ తెలుసు. అవధాన ధారణా బలంకాక, కొందరకు ఎన్నెన్నో పద్యాలు ధారణలో ఉంటై. అలాటివారిలో శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారినీ, శ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహంగారినీ నే నెరుగుదును. వీరిద్దరూ చదివిన పద్యం చదవకుండా కొన్నాళ్లు సభ్యులకు ఉల్లాసం కలిగించేవారు. నాటక పరీక్షలు 'హరిఃఓమ్' అని మొదలుపెట్టిన గయోపాఖ్యాన ప్రదర్శనానికి వీరిరువురున్నూ, శ్రీ హరి నాగభూషణంగారున్నూ, నేనున్నూ, మరికొందరున్నూ జడ్జీలు. ఆ పోటీ

ఓ వారం పదిరోజులు నడిచింది. ఆ రోజులలో మేము ముగ్గురము పోటీబడి చదివినపద్యం చదవకుండా చదివేవాళ్ళం. దానికి జడ్జి శ్రీహరి నాగభూషణంగారు. అందులో ఎవరెవరి జ్ఞాపకశక్తి యెంతెంతో వారికి తెలుసు. శ్రీ వైద్యుల నారాయణరావుగారని ఒకరున్నారు. వారికి ఈ కాలంలోని అధునాతన కవుల మంచిపద్యాలు చాలా వచ్చు. కొన్నాళ్ళ వాట్లతో కాలక్షేపం చేయగలరు.1 కాటూరు పింగళులు అవధానంలో కాలుపెట్టారో లేదో కాని వీరికిన్నీ ధారణాబలం కద్దు. అవధానాలలో అడుగువేయక పోయినా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తాము రచిస్తున్న గ్రంథం ఏదయినా, యాభై, అరవై పద్యాలు అల్లుకొని ధారణ పట్టి, ఆ పిదపనే కాగితంమీద ఎక్కిస్తానని ఒకమారు చెప్పారు. ఈ రీతిగా ధారణాబల వైవిధ్యం కద్దు.

ఈ రకంగా ఈ శతావధానానికి పుట్టిం దగ్గరనుంచీ గండాలే! ఇందుకనే లక్ష్మీనరసాపురం శ్రీ చెల్లయ్యమ్మారావుగారి షష్టిపూర్తిలో శ్రీ తిరుపతి శాస్త్రిగారూ, నేనూ కలిసి సుమారు ఏబది మందికి అవధానం చేసినప్పుడు, శ్రీ నారాయణదాసుగారు నిండుసభలో "నీవి అవధానం మానెయ్యి. ఎన్నాళ్ల ఎన్నేళ్లచేస్తే దీనివలన నీకు సుఖజీవనం అబ్బుతుంది? నా దగ్గరకు రా. హరికథ చెబుతాను. నాలాగా నా తరువాత హరికథ చెప్పేవాడుండడు. లక్షలార్జిస్తావు." అని అంటే-శ్రీ వెంకటశాస్త్రిలుగారు లేచి "అయ్యో! చూడండి. ఈ హరిదాసు గారు పట్టపగలే పదిమందిలో మావాణ్ని దోపిడీ చేస్తున్నాడు." అని అన్నారు. ఏతావాతా ఏండ్లు పైబడ్డ కొలదీ ధారణాశక్తి తగ్గడమూ, ధారణను మరికాస్త కాపాడుకుంటే ఆరోగ్యానికి అపకారము కలగడమూ, తలత్రిప్పుడూ తప్పని సరి! ఇది ఇలా ఉండగా అవధానాలతోనే జీవనం చేయవలసివస్తే కావ్యరచనకు అవకాశం ఉండదు. దీనికీ దానికీ ఉద్యోగానికీ అవకాశం కల్పించుకున్నవారు ఈ కాలంలో శ్రీ తిరుపతి వేంకటకవులే! ఈ పయి విషయాన్నే కొంచెం వివరిస్తాను. బందరులో భైరవప్రెస్ కెదురుగా కొత్తగా బాగుచేసిన భైరవమూర్తిగారి యింటి

1) పింగళి కాటూరి కవులు ముదునూరు, బందరు, నెల్లూరు మున్నగుచోట్ల శతావధానములు చేసినారు. సం.

వాకిటి అరుగులమీద శ్రీ వెంకటశాస్త్రిలవారితో నేనూ పడుకునేవాణ్ణి! అవి బాగా కవిత్వపు రోజులు! ఒకనాటి తెల్లవారకట్ట నేను ఇలా మొదలుపెట్టి-

"చిత్రభారతము రచించి మించిన చరి
కొండ ధర్మండను కొండ నెక్కి-
వసుచరిత్రము వ్రాసి వాసికెక్కిన రామ
రాజభూషణు వాగ్ఝరమ్ము గ్రమ్మి
మూడర్థముల కావ్యముం జెప్పు నెల్లూరి
రాఘవకవి వచోహ్రదము నింపి
అపర పండితరాయిలౌ వెంకటాచార్యు
వాచాస్రవంతితో వచ్చి కలిసి-"

అని ఇంతవరకూ చెప్పిన పద్యాన్ని-

"వఱలి తిరుపతి వేంకటేశ్వరుల దరుల
మూలమునఁ దీర్థరాజులై యొలిఁ గదలి
కరిగెడు శతవధాన దివ్య స్రవంతిఁ
గటకటా! నల్ల ఉప్పాడ కాల్వఁ ద్రోచె."

అని శ్రీ వెం. శా. గారు చటుక్కున ముగించారు.

ప్రబంధకవులు తాము చెప్పుకున్న సంగతులనే సీస పాదాలలో నే నుటంకించాను. చరికొండ ధర్మన్న చిత్ర భారతంలో-

శతలేఖిన్యవధాన పద్య రచనా సంధా సురత్రాణ చి
హ్నితనామా! చరికొండ ధర్మసుకవీ! నీ వాగ్విలాసంబు లా
శితి కంఠోజ్జ్వల జాట కోటర కుటీ శీతాంశు రేఖా సము
న్నిత గంగా కనకాబ్జ నిర్భర రసావిర్భూత మాధుర్యముల్"

అని చెప్పుకొన్నాడు. నాకు తెలిసినంత వరకూ ఇతడు తెలుగు ప్రబంధ కవులలో శతావధానులలో మొదటివాడు- కాకున్నా ప్రాచీనుడని అనుకుంటాను. ఇది ఇంకా పరిశోధనీయం. ఈ సంగతిని ఇలా ఉంచుదాం.

ఈపై పద్యంలో :

'చంద్రరేఖా సమన్విత పద్మాలలోని తేనెలు నా పద్యాలలో ఉన్నవి'- అని ధర్మకవి అన్నాడు. చంద్రునికీ పద్మాలకీ విరోధమేకదా! ఇవి ముకుళించుకోపోతే ఏటిలో ఇంకా తేనె లేమిటి? అనే శంక. "సర్వకామ పరిణయం"లో శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారికి, 'లంకా విజయం'తో దిగ్విజయం చేసిన శ్రీ లక్ష్మణకవిగారికీ మధ్య జరిగిన రగడ గుర్తుకు తెస్తుంది. ఆ రగడకు తావలమైన పద్యం ఇది :

> "తరణి శశాంకులా భరణ దంభమునన్ వదనాక్షి కైతవాం
> బుజ దసితోత్పలాగ్రమున ముద్దియ కుంతలదేశ మాక్రమిం
> చి రొకఫలంబు గాననగుఁ జివ్వనుచుం బరరూప యుక్తి ని
> బ్బరముగ నంత సొంతముగ బ్రహ్మ యొనర్చిన సీమ పొల్పుగన్."

ఈపద్యం విని- "సూర్యుడు రాగానే కలువలూ, చంద్రుడు రాగానే పద్మాలూ ముకుళించుకొని పోతవి. కాబట్టి మీరు వర్ణించినామె కన్నులేని కబోది కావాలి ! ఇది ఇట్లావుండగా పాపట తీసిన తర్వాత సూర్యచంద్రుల నలంకరిస్తారో,సూర్య చంద్రుల నలంకరించే పాపట తీస్తారో యింతమాత్రం లోకజ్ఞానంలేదు తమకు" అని లక్ష్మణకవిగారు విమర్శచేసినారట ! ఈలాగే ధర్మన్నగారి పద్యంలో కూడా చంద్రకమలాల సన్నివేశం ! అని కొంద రన్నారు. కాని యింకొంచెం సహృదయతతో ఈ పద్యాన్ని ఆలకించండి అని అంటారు పెద్దలు.

ఇక రామరాజ భూషణుడు-ఈయనయే ప్రబంధాంక భట్టుమూర్తి, నరసభూపాలీయంలో :

> "శత లేఖినీ పద్యసంధాన ధౌరేయు
> ఘటికా శత గ్రంథ కరణ ధుర్యు"

అని తన శతావధానిత్వం చెప్పుకొన్నాడు. నెల్లూరు రాఘవ కవి శతావధానం ప్రచారంలోకి రాలేదు. ఇలా వ్రాయడం కంటే వారి విశేషాలు నాకు తెలియవని వ్రాయడమే మంచిది.

పిదప 'అభినవ పండితరాయలు' శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యుల వారు-పిరు గోదావరి జిల్లా పెంటపాడులో అష్టావధానం చేస్తుండగా శ్రీ వెం.శా. గారు చూచామనిన్నీ దానిని బట్టి మేమున్నూ అలాగు పాకుకొని పోయాము అనిన్నీ చెప్పారు.' వీరి చాటు పద్యాలలో కొన్నిన్నీ, ఏకైక శకుంతలా పరిణయ ప్రబంధమున్నూ మనకు దొరికినవి. వీరి ధారణా శక్తిని గురించి యీ దిగువ కథ ప్రచారంలో ఉంది. ఆచార్యుల వారొకసారి ఒక వ్యాజ్యంలో ఏదో ఒక కోర్టులో సుమారు ఏబది టావుల సాక్ష్యం చెప్పి మళ్లా ప్రత్యక్షరమూ యథా పూర్వంగా చదివేశారట! ఇట్లా చదివినందువల్ల సాక్ష్యం వేసుకొన్న వారికి దుష్ఫలితం కలిగినా ఆచార్యుల వారిని మాత్రం పండిత రాయలను చేసింది. పండిత రాయలు ఉరుదులో విన్న గుర్రపురౌతు - మావటివారల వివాదం యావత్తూ, విన్నది విన్నపాళంగా ఢిల్లీ పాదుషా ముందు గడగడా అప్పగించాడట! ఈ సామ్యం చేతనూ శ్రీ వేంకటాచార్యుల వారు అభినవ పండిత రాయలు అనే బిరుదును ఆర్జించారు. వీరి కవితాధార చాలా శుద్ధమైనదీ, అపారమైన దీన్ని. శకుంతలా పరిణయంలో శ్రీ వేదాంత దేశికులను ఇలా వర్ణించారు.

'శతదూషణీ మహాశస్త్ర ధారాపాత
వినిహి తాద్వైతాది విమతవాది"

ఈ పాదం మాత్రం చాలు మచ్చుకు. ఇక్కడ కొంచెం శాఖా చంక్రమణం చేస్తాను. శ్రీమద్దేశికులను వీరిట్లా స్తుతించారు. 'శతదూషణి'-అనేది అద్వైతంలో నూరు దోషాలను ఖండించే గ్రంథం. శతం అంటే నూరు-నూరంటే నూరే కావనుకోండి. ఈ గ్రంథంలో అరవై దాకా ఖండనలు ఉన్నటు లున్నవి. 'శత దూషణి' అనే కత్తితో అద్వైతాన్ని నరికివేశారని అర్థం. ఈ శాఖా చంక్రమణంలో మరో చంక్రమణం చేస్తాను. ఈ 'శతదూషణిని' మహామహోపాధ్యాయ 'శ్రీ అనంత కృష్ణశాస్త్రిగారు ఖండించారు. ఈ గ్రంథం పేరు 'శతభూషణి'. ఈ కాలంలో వ్యక్తిని ఎంత మాత్రమూ దూషించకుండా విషయ మాత్రాన్నే ఖండన చేసి చూపిన మహాగ్రంథం ఇది. కాని పేదవారు దీనిని చదువనోచుకో లేదు. వెల ఇరవై రూపాయలు మరి!

ఇటు తరువాత, ప్రకృత సీసంలో ఎత్తు గీతిలో ఉన్న శ్రీ తిరుపతి వేంకటకవులు శతావధానాన్ని తమ సామ్రాజ్యం చేసికొని పరిపాలించారు.

"జగతీనాథులు పెక్కుమంది ముదిత స్వాంత[illegible] గాన్కలం
పగ సాంగంబు సలక్షణంబుగ శరద్ ద్వావింశతిన్ బేర్మి హె
చ్చగ మాయేలిన యీ వధాన కవితా సామ్రాజ్య భారంబు మో
యఁగఁబూనం గదవయ్య! తండ్రి శివరామయ్యా! చిరంజీవివై."

అని తిరుపతి శాస్త్రిగారు నా గుంటూరు శతావధానానంతరం చెప్పారు.

పూజనీయులైన శతావధాను లింకా ఎందరో లేక పోలేదు గాని వారెవరూ దానినే ఒక కళగా చేపట్టి చాలాకాలం ప్రదర్శన చేయించిన వారు కారు. దేవుల పల్లి వారు ప్రసిద్ధులయిన శతావధానులు. రాజాశ్రయం ఉండడం చేతను, శ్రీవారిచ్చిన ఉపపత్తి ఉండడం చేతను వీరికి దేశాటనంతో పనిలేకపోయింది. 'మహేంద్ర విజయం'లో శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడు గారి పీఠిక లేకపోతే వీరు శతావధానులనే మాట లోకులకు తెలిసేదేకాదంటే అత్యుక్తియై అపచారం మాత్రం కాదని అనుకుంటాను. శ్రీమాన్ వేంకటాచార్యులవారు కూడా నూజివీటి జమీందారుతో విగ్రహించి కవితా వ్యాసంగాన్నే నిగ్రహించారు అని పెద్దలు చెప్పగా విన్నాను. సంస్కృత కవిత్వంలో ఒక ఉద్దండుడైన వైష్ణవ మహాకవి కంచి ప్రాంతం నుంచి ఆకిరిపల్లి మకాంలో, తఱచుగా భగవంతుని సేవలో ఉండే అలవాటుగల నూజివీటి ప్రభువుల సన్నిధిలో ఒక శతావధానం చేశారు. అది అచ్చుపడ్డది; అది నేను పుట్టక పూర్వం. ఆ పుస్తకం నేను చూశాను. శతావధానంలో అలాంటి కవనం దుర్లభం. అది సంపూర్ణ శతావధానం. శ్రీ తిరుపతి వెంకటకవులు నూజివీటిలో శ్రీ వానమామల జియ్యంగారి సన్నిధినిచేసిన శతావధానం లోనూ, బందరులో చేసిన శతావధానంలోనూ అలాటి కవనమే ఉన్నది. వీరి తరువాత కొప్పరపు కవులూ, వెంకట రామకృష్ణకవులూ, ఈ పద్ధతిలో పడ్డారు. రాజశేఖరకవీ, గడియారం శేషశాస్త్రీ, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, పిశుపాటి చిదంబరశాస్త్రి మొదలైనవారు నేనెరిగిన కొందరు. ఎఱిగినా మరచిన వారు కొందరు వుంటారు. చూచారా, శ్రీ కాశీ కృష్ణాచార్యులవారినే మరిచాను. వీరందరూ అవధానాలు చేసినవారే! దోమాకవీ, సుబ్బన్నకవీ. ఈ మధ్య

బెజవాడ రేడియోలో శతావధానశ్రవణం చేయించారు ఒకరు. వారిపేరు మరచాను. ఈలాగా ఇంకెందరో ఉండి ఉంటారు. 'ఎందరో మహానుభావులు' అని కద!

వీరిలో గాడేపల్లి వీరరాఘవశాస్త్రికి ప్రాచీన కవీశ్వరులకున్న ప్రతిభ ఉన్నది. ఈయన డెబ్బది, ఎనుబది అవధానాలు అనర్గళంగా చేశాడు. ఈతని గురించి మేడవరపు సుబ్బారాయడనే పిన్నకవి-

రాగవశాస్తులో రడుగొౌరా! అదెసూడె, పెఋంత మాసి బౌ
లాగవ మంట కైతలొొ, సెలాకు పరీచ్చట! బుద్ధి మేదయే
మోగడె కొక్క పొెచ్చకము వున్నది వుండి రసిస్తుడంట! అ
బ్బే గదవాల కాడ పెదపెద్ద పెసంగము చేస్తడంటరా!"

అని పామరులును చెప్పుకొంటున్నటులు సొగసుగా పద్యం చెప్పాడు. ఆశు కవిత్వాదులలో వీరరాఘవ కవి శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి కోవలో వాడు. అకాల మరణం చెంది అన్యాయం చేశాడు.

## శతావధాన మంటే ఏమిటి?

మేము చేసిన ప్రక్రియ ఇది- నూరుగురు పృచ్ఛకులు నూరు విషయాల మీద పద్యాలు అడిగితే, మొదట ఒకొక్క పాదమే చెప్పుకొని పోయి, తిరుగావచ్చి, రెండవపాదం మాత్రం పూర్తిచేసి, మళ్ళావచ్చి మూడో పాదమున్నూ తరువాత నాల్గవ పాదమున్నూ, సీసాలు వుంటే ఎత్తుగీతలతో సహా పూర్తిచేసి, ఒక్కొక్క పద్యమే చదవడం.

ఒక ఉద్దండుడు పద్యాలేకాక కొన్ని వందల విషయాలు కూడా ధారణ పట్టి సహస్రావధానం చేసినట్లు ఆయాయీ విషయాలతో సహా వివరంగా 'తత్త్వబోధిని' అనే మాసపత్రికలో ప్రకటించబడింది. ఈ పత్రికా సంపుటాలను నేను శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి కడ చూచాను. ఆయన సహస్రావధాని కాని శతావధాని మాత్రుడుకాడు. ఇది అత్యుక్తిగా కొందరకు తోచవచ్చునేమో కాని నేను నమ్ముతాను. కారణమేమిటంటే రెండువందల పద్యాల ధారణ

ఉంటుందేమో అని నేనొకసారి పరీక్షచేసి చూసుకొన్నాను. ఆ ప్రశ్నించినాతడు, వ్రాసినాతడు, ధారణ పట్టి చదువుతుంటే సరిచూచి నాతడూ సోమనాథశాస్త్రి. ఇతడు మాగురువులు వెం. శా. వారి వియ్యంకుడు. ఈ విషయం వ్రాయడం అనవసరమే కాక ఆత్మస్తుతిగా ఐంది. ఎంచేతనంటే శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మన సమక్షంలోనే ఉన్నారు. వీరు సహస్రావధానం చేశారనిన్నీ, ఈ డెబ్బదవ పడిలో గూడా చూచేవారుంటే చేస్తారనిన్నీ విన్నాను. ఆంధ్ర నలంద స్థాపనాచార్యులు శ్రీ అడుసుమిల్లి నారాయణరావుగారు నిన్న నాకీ విషయం చెప్పారు.

శ్రీ మాడభూషివారూ దేవులపల్లివారూ చేసిన అవధానాలు మొదట ఒక పాదం చెప్పకోపోయి తిరిగి వచ్చి రెండు మూడు పాదాలు పూరించడమే అనుకుంటాను. ఏలంటే మాడభూషివారి పద్ధతినే మే మవలంబించామని మా గురువుగారు చెప్పారు. వారి పద్ధతినే నేనూ అవలంబించాను. నా మాదిరిగానే పిశుపాటి చిదంబరశాస్త్రిగారు [వీరిపుడు కీర్తిశేషులు] చేసేవారు. వీరి కభ్యాసం నావద్దనే. వ్యాకరణంలో మొట్టమొదట వీరు నాకు సహపాఠులు. గణపతి నవరాత్రాలలో వీరు చేసిన మొమ్మొదటి అష్టావధానం ఎరిగినవారు కొందరిప్పటికీ ఆగిరిపల్లిలో ఉన్నారు.

## శతావధానం ఒక కళ

శతావధానం ఒక కళగా సాధించి లోకులను ఆనందపరచడానికి ఆశు కవిత్వంలో మాంచి నేర్పూ కూర్పూ ఉండాలి. వల్లమాలిన బుద్ధిబలంతోపాటు దేహబలం కూడా ఉండాలి. శాంతీ దాంతీ ఉండాలి. సంగీతంలో ప్రజ్ఞ లేక పోయినా మంచి పద్యం మట్టిచేసే కంఠకౌశలం లేకుండా ఉండాలి. ధనలోభమూ కీర్తిలోభమూ ఉండాలి. ఇంకా ఎన్నో ఉండాలి. కాని వీని అన్నిటికి కిరీటంగా దారిద్ర్యం ఉండాలి. అప్పుడు గాని 'ఇదొక కళ' అని అందరూ అనుకోలేరు. సభను బట్టీ సభాస్తారులను బట్టీ ఒకప్పుడు వేం. శా. గారు శతావధానాన్ని సర్కస్‌గా వర్ణించారు. కాని ఇది తెలుగు వారి యక్షం. తిన్నగా చేయగలిగితే ఈ యక్షంలో కవిత్వమూ ఉంది; ప్రతిభా ఉంది. జ్ఞాపకశక్తీ ఉంది. వివేకమూ ఉంది; వినోదమూ ఉంది; విద్వారమూ ఉంది. ఇది వీని అన్నిటి ఏకాగ్రతకూ మళ్లా యోగభూమి.

శతావధానాన్ని జాగ్రత్తగా పరిశీలించి చెప్పిన శ్రీ పరిమి సూర్య నారాయణాచార్యుల పద్యాలు రెండు ఉదాహరిస్తే దీని లోతు కొంత తెలుస్తుంది.

"ఒక మూల ప్రశ్నల నుల్లాసముగఁ బూర్తి
చేసితి వయ్య నిశ్శేషముగను
ఒకప్రక్క సంతోష మొదవు నటుల యలం
కారంబు గుప్పించి మీఱితయ్య
ఒక చెంప జనులకు నుత్సాహ ముప్పొంగు
బాణీని గీతంబు బాడితయ్య
ఒక చాయఁ జక్కగా హూణ భాషజ్ఞుల
కనుకూలముగ మాటలాడితయ్య

తక్కువేమియు లేక యే తప్పులేక
గొణుగు కొంటలు లేక గగ్గోలు లేక
కోపమును లేక నీరమ్ము గ్రోలినట్లు
శతవధానమ్ము సల్పి తాశ్చర్య లీల!!

ప్రథమ పాదముఁ జెప్పి పైని దండముపెట్టు
నట్టి వాడేటి శతావధాని
నియమముల్ లేకున్న నేర్పుజూపింతు న
న్నట్టి వాడేటి శతావధాని
వేమాఱు విషయంబు వినిపింపు మని యడుగు
నట్టి వాడేటి శతావధాని
ధారణా గరిమంబు దారిద్ర్యముగ నున్న
యట్టి వాడేటి శతావధాని

దొంగతనముగ వ్రాతలఁ దొంగి చూచు
నట్టి వాడెట్లు తాను శతావధాని
వెదకి చూచిన నిసుమంత కొదవలేక
శతవధానమ్ము సల్పి తాశ్చర్య లీల!!

## ధా ర ణా బ ల ం

ఈ పద్యాలలో 'ప్రథమ పాదము' అనే ప్రథమ పాదం ధారణా బలాన్ని పట్టి చూపుతుంది. పృచ్ఛకులూ, వర్ణ్యముల పూర్వాపరాలూ, సంఖ్యా మొదలైనవి ధారణకు మేకులు. ఈ మేకుల మీద ఆయా పద్య శరీరాలను తగిలించి భద్రంగా ముందు ముందుకు పోతూ ఉంటాం. ఈ మేకులలో ముఖ్యంగా మనిషి మేకులు మారితే ధారణ తలక్రిందులై బండి బోల్తాకొట్టవచ్చు. వర్ణ్యాల పూర్వాపరాలు కూడా ఒక్కొక్కప్పుడు ఊడిపోతే భట్టుమూర్తి అన్నట్లు అప్పుడు గుర్రం అరణ్యం పట్టవచ్చు. సంఖ్య అనే మేకు భద్రమే కాని అదీకూడా ఒక్కొక్కప్పుడు తలకంటా లోపలికి దిగిపోతుంది. అట్టి సమయంలో ఏకాగ్రత ఒకటే శరణ్యం! దాన్నే శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు హయగ్రీవుడని అంటారు! చిదంబరశాస్త్రి ఐతే గణపతి అంటాడు! మరొక రయితే సరస్వతి అంటారు! ఈలాగా ఎవరి విద్యాదేవతను వారు ప్రార్థించి ఏకాగ్రతాబలం వల్ల రస్తాలోకి వచ్చేస్తారు. రస్తా తప్పినప్పుడు కలిగే విషాదం గర్భశత్రువుకైనా వద్దు! రస్తాలోకి వచ్చినపుడు కలిగే ఆనందం బ్రహ్మకే కద్దు!

## ఇందలి కవిత్వం ఉత్తమోత్తమమా?

ఆశుకవనం కాబట్టి ఉత్తమోత్తమం కావడానికి వీలు చాలా తక్కువ! గాడేపల్లి యీ విషయంలో అఖండుడుగా కానవస్తా డీ కాలంలో! ఈయనలో కూడా కొంత కచ్చా పచ్చా లేకపోలేదు. దానికి కారణం తొందరే. ప్రశ్నలను బట్టి కూడా ప్రతి పద్యమూ ఉత్తమోత్తమ కవిత్వ లక్షణంలో పడుతుందనటానికి వీలులేదు. శ్లోకాలను తెలిగించమంటారు. ఉండ- బండ- రండ- ముండ- లాంటి పదాలు వచ్చేటట్టు చిత్రకవిత్వం చెప్పమంటారు. సీసానికి బంగారం, కందానికి మాకందం పద్యాలు లాంటి ఛందస్సులు చెప్పమంటారు! ఈలాంటి ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా వచ్చే పద్యాలు పద్యాలుగా చెప్పుకోవడానికి వీలుండదు. కాని అట్టివి సభకు మాత్రం తృప్తిగా వుంటాయి. ఇక ప్రశ్న ఏమీ కష్టపెట్టనిదైతే ప్రత్యుత్తరం కూడా ధారాశుద్ధిగా వెలువడుతుంది. ఒక అవధానంలో హాలికునిమీద పద్యం చెప్పమని కోరారు:

"ఆనందం బన వానిదే ధనము ధాన్యం బన్న నవ్వానిదే
జ్ఞానం బన్నను వానిదే బలము బింకం బన్న నవ్వాని దె
వ్వానిన్ ఖార్యయుం బొలము పాపల్ బందుగుల్ గూడి ని
త్యానందుం 'నరించు వాడె గృహి యాహా! హాలికుండేనియున్."

అని ప్రత్యుత్తరంగా ఈ పద్యం వచ్చింది. దీని బాగోగులకు సహృదయులే ప్రమాణం.

ఒక అవధానంలో కుంకుడుకాయను కుటిల హృదయునితో పోల్చి చెప్ప మన్నారు. చెప్పిన పద్యం ఇది:

నీదు కౌటిల్యము న్వీక్షించి పగులగొ
ట్టంగ నెక్కెద వుత్తమాంగ మందు
ఎందు కీమాత్ర పోనీ యంచు నెంచ ఫే
నంబన్న మిషచేత నవ్వుచుందు
నిస్సార తరమైన నెఱి పిప్పిచే నెల
నాగల నున్ గురుత్ లాగుచుందు
వొకసారి నీసార మొలసిన చిననాటి
దొండాకు పసరునుం దోకఁజేతు
వెంత స్నేహంబు సూపిన నింతలోనె
వెళ్లగా జేయుచుందు దుర్విధము బలిసి
జగతి నినుబోలువాడు కుజనుఁ డొకండె
ఓసి కుంకుడు కాయ! నీ బైసిమాయ!

పృచ్ఛకుడు కుంకుడుకాయతో కుటిల హృదయ సాదృశ్యం కోరకపోతే, కుంకుడుకాయ కుటిలునితో పాటు నెత్తియెక్కి నురుగుతో నవ్వి, జట్టు పట్టుకు లాగి, దొండాకు పసరుతో దబ్బుకూడా ఉజాడు చేయిస్తుందనీ చెప్పడం పడదు! మఱి, ఎంత స్నేహం శ్లేషలో పోగొట్టావు, మాసిన తల శుభ్రపఱవకనే అందాలు చిందవు! ఒకప్పుడు ఏవం పుట్టించేదైనా సరళ ప్రశ్న కవిని ఒక యెత్తుకు తీసుకుపోతుంది. గజ్జిమీద పద్యం చెప్పమని ఒక ప్రశ్న! దీనికీ పద్యం వెలువడ్డది:

తను దాన వలచి వచ్చిన కామినింబోలె
నాలింగన ప్రౌఢి నలరి యుండు
కట్యుదోదేశ సంకటకారియై రహః
కలనా విశేష సంకలనఁ బెరయు
గడచిరాగను నఖక్షత మాచరింపఁగఁ
కించి దుత్కంపాభి కీర్ణమగును
నౌషసకాల సోన్మేష పరిస్ఫూర్తి
పొంపిరి వోవంగఁ బొటమరించు
సమయమున యందు కనిపెట్టి సలుపు జేసి
తీపు దీయుచునుందు వీ వేపుమీఱి
రసికురాలగు నామె యారజము తోడ
గజ్జి! వంకాయ బజ్జికి కాళ్లగజ్జి!!

ఒకరు స్త్రీ విద్యాభ్యాసం వల్ల లాభం గుఱించి అడిగారు సంస్కృతంలో-
అప్పటి చిత్తవృత్తి:

"కళా విలాసో హృది బాలికానాం
భినత్తి మౌఢ్యంచ వృణోతి సంవిదమ్
వినాతి యోదం చలునాతి దుష్క్రియాం
జినాత్య సౌఖ్యం చ కృణాతి దుర్భ్రమమ్"

అని ఇలా క్ర్యాది ప్రయోగాల ప్రకటనలోకి లాగింది.

## సరళ ప్రశ్నలు - ఉత్తమ కవిత

ప్రతిభగల కవిని సరళ ప్రశ్నలే మబ్బులలోకి తీసుకొనిపోతవి. కవిని ఏలాగయినా పడవెయ్యాలని అనుకొనేవా రడిగే ప్రశ్నలను లౌక్యముగా దాటుకపోయే తెలివి కవికి కూడా ఉంటుందని పృచ్ఛకులు కొంచెం ఆలోచించుకొని సరళమైన ప్రశ్నలనే అడిగితే మంచి కవిత్వం వింటారు. లేకుంటే అపమార్గమే! చూడండి. ఈ దిగువ బైసికిల్ మీద ప్రశ్నా, లక్ష్మీ పార్వతుల వేళాకోళం గుఱించి ప్రశ్నా-వీని జవాబులు:

"నీరుం గోరదు గడ్డి వాడ దొక కొన్నే నుల్వాలన్ వేడ, దే
వారే నెక్కినఁ గ్రింద ద్రోయ దొకడుం బజ్జన్ ఛటుండుంటచే
కూరం గావల దెందు బైస్కిలునకుం గోపం బొకింతేని లే
దౌరా! వాజికి సాటియైన యిది విశ్వామిత్ర సృష్టం బొకో!"

(తి.వేం.)

ఈ పద్యంలో 'వాజి'కి ఇత్యాది లేకపోతే వస్తు ధ్వని అయేది.

"గంగాధరుడు నీ మగండని నవ్వంగ
వేషధరుండు నీ పెన్మిటనియె
ఎద్దునెక్కుడు నీ నెమ్మెకాడని నవ్వ
గ్రద్ద నెక్కు నీ మగండటనియె
వల్లకా డిల్లు నీ వల్లభున కనంగ
నడిసంద్ర మిల్లు నీ నాధునకనె
నాట్యంబు సేయు నీ నాయకు డన హంగు
గావించు వెన్క నీ కాంతు డనియె

ముష్టి కెక్కడి కేగె నీ యిష్టుఁ డనిన
బలి మఖంబున కేగె నో లలన యనియె
నిట్టు లన్యోన్య మర్మంబు లెంచుకొనెడి
పర్వతాంభోధి కన్యల బ్రస్తుతింతు.

[తి. వేం.]

## పద్మ వ్యూహం

ఇక సమస్యాపూరణాలు చిక్కు లెక్కలను విడదీయటం లాగా తుపానును నివారించడంలాగా ఉంటవి:

"తుని లోపల జగములెల్లఁ దూగుచు నుండెన్."

– భగవంతుని లోపల ... ...... ...... ...... ...... ...... ......

"రణము ముఖ్యంబు భువి కవి రాజులకును."

– వ్యాకరణము .............................................

"బళా మయూరో లవశేష సింహః."

'ఈ సమస్య ఇచ్చినవారు మహామహోపాధ్యాయ మానవల్లి శ్రీ గంగాధర శాస్త్రులవారు' అని వేమూరి శతావధానిగారు చెప్పారు. ఇందులో గుట్టు ఏమంటే, మిగతా అంతా అలా ఉండగా, 'బ భ మ య ర ల వ శ ష స హ' అనే అక్షర క్రమం. ఇవి పదకొండు అక్షరాలు. పూర్వ పాదాలలో గూడా ఈ క్రమం కొంత అవలంబింపవలసి ఉంటుంది. పూరింప బూనుకొన్నవాడు అర్థం సరిపెట్టడానికి ప్రయత్నిస్తే మాయలో పడిపోతాడు. తిన్నగా విచారిస్తే ఇది గంగాధరశాస్త్రిగారికి పూర్వమే పుట్టింది. ఇంకా ఇంకో మాదిరి చిక్కు ప్రశ్నలు చాలా తెస్తారు పృచ్ఛకులు. అట్టివాళ్ళు కవిత్వ సహజావస్థ ఎఱుగరు. వారి ఉద్దేశం కవిని లేవిడీ కొట్టిద్దామని కాదు గాని ఇంత క్లిష్టవిషయాలను గూడా సాధించినాడని మరి కాస్త గొప్ప చేయడానికే ఐయుంటుంది;

## రా బో యే త ర ం

వెనుకటి తరం వెళ్లిపోయినట్లే! ఈ తరంలో వారికి ఇల్లింత తీరుబడీ తిరుగుచూపూ తక్కువ. వడి, ఒకటే వడి! మోటారూ విమానాలూ రాకెట్లూ పీట్లవడిలో సుడిగుండాలు పడి తేరుకోవాలి. మన సభ్యత జాతీయమైన ఆంధ్ర కవిత తన పుట్టినింటిని మరిచిపోతుంది. స్వభావ సిద్ధులైన తెలుగు కవులకు ఇక కరవు రావచ్చు. నేటి కవితా సామగ్రీ - కవిత్వమూ కూడా పొట్టిగానూ, పారదర్శకముగానూ ఉండాలి. జీవికకుగాని కళకుగాని ప్రాచీనపుది బరువు. ఇట్టికాలంలో శతావధానాన్ని బతికించి ఉంచడం కష్టం! ఐనప్పటికీ ఇది తెలుగువారి సొమ్ము. దీన్ని కాపాడుకొనేవారు నూటికో కోటికో ఒకరు ఉండకుండా ఉంటారా? కల్యాణమే కోరాలి!

"కల్యాణం రసనే! నమస్సుకవితే! భద్రం పదేభ్యో నమ
స్కారః కాల్పనికోత్తమాయ మనసే వృత్తాని! వో వందనమ్
అస్తు స్వస్తి శతావధాన విధయే విద్వజ్జనాయాంజలిః
యుక్తా యుక్త వివేకినే సుకవిత్వ సారస్య సంగ్రాహిణే!!" - తి. వేం.

~~~
~~~

# 7. కవులూ - స్వాతంత్ర్యమూ

స్వాతంత్ర్యం అనే పదాన్ని విరిచిచూదాం : స్వ + తంత్ర = ప్రధాన, దశ, అధీన, ఇచ్ఛ-ఇత్యాది, స్వేచ్ఛ కలవాడు. ఈ మొదలుగా కొన్ని అర్థాలు వస్తవి. అట్టివాని ధర్మం స్వాతంత్ర్యం.

అన్ని శాస్త్రాలలోనూ పెద్ద ప్రజ్ఞ కలవాణ్ణి 'సర్వతంత్ర స్వతంత్రుడు' అని అంటాం.

ఎవడిష్టం వచ్చినట్లు వాడు ప్రవర్తించడం స్వాతంత్ర్యం అనుకొని బలిష్ఠుడు దుర్బలుని మీద బలప్రయోగం చేస్తే ఆ స్వాతంత్ర్యానికి ఫలితంగా వెంటనే చేతులకూ కాళ్ళకూ సంకెళ్లు తగులుకుంటై. ఇది అందరకూ తెలిసినా ఎవరి యిచ్ఛప్రకారం వారు ప్రవర్తించడమే స్వాతంత్ర్యం అని అందరూ అనుకుంటూనే వుంటారు. దీనికి కారణం స్వార్థం.

ఈ ప్రపంచంలో ఎవడికీ స్వాతంత్ర్యం లేదు. ఈ ప్రపంచంలో ప్రతి మనిషీ కొన్ని విషయాలపట్ల తన కిష్టం లేక పోయినా ఐహికంగా సంఘశక్తికిన్నీ రాజశక్తికినీ బద్ధుడై వుండాలి. ఆముష్మికంగా యమనియమాది బద్ధుడై ఉండాలి. ఈబంధాలతోనుంచి తప్పించుకొని పోవడానికి వీలులేదు. ఈ రీతిగా చూస్తే కొన్ని నియమాలకు నిక్కచ్చిగా బద్ధుడై ఉండడమే స్వతంత్రతా లక్షణంగా కనిపిస్తుంది.

ఎవడయినా ఒకడు తప్పుచేసినపుడు 'వాడు స్వతంత్రుడయ్యా' అని అంటారు. ఎవరూ చేయని గొప్పపనికి సాహసించిన వానిని గూడా 'స్వతంత్రుడు' అని అంటారు. ఈ రెండు వాక్యాలలో ఉన్న స్వతంత్ర పదం ఈ యిరువురూ నియమోల్లంఘనం చేసినా, మొదటివాని నియమోల్లంఘనం వ్యతిరేక లక్షణంచే అప్రశస్తమైన స్వాతంత్ర్యం ఉపయోగించాడనిన్నీ, రెండవవాని నియమోల్లంఘనం ప్రశస్తమనీ తెలుపుతుంది.

## నియమోల్లంఘనమూ - స్వాతంత్ర్యమూ

అయితే నియమోల్లంఘనం ఎలా ప్రశస్త మవుతుంది? అవుతుంది. కొందరికయినా అవుతుంది. ఎలాగంటే, మనం పెట్టుకున్న నియమాలే ఒకానొకప్పుడు మనకు ఉరి అవుతయ్. సాధారణులందరూ ఆ నియమాలను ఉల్లంఘించలేరు. ఎవడో ఒకడే ముందు ఉల్లంఘిస్తాడు. "తీర్థకరస్తు విరళః", తరువాత తరువాత అందరూ ఉల్లంఘించడం మొదలు పెడతారు. ఈ రీతిగా ఆ మార్గం రానం దాడిగా ప్రహత మవుతుంది. ఉదాహరణకు-సముద్రయానం, వితంతూద్వాహం, రజస్వలా వివాహం.

ఈ విధంగా ఆరాతీస్తే బంధంనుండి తప్పుకోవడమే స్వాతంత్ర్యం అని అర్థమవుతూంది. నిషేధ ముఖంగా ఉన్న ఈ అర్థం దీని పొట్టలో మనకు కనబడకుండా ఉన్నదన్నమాట.

## బంధం లేనివాడు ఒక్కడే

అయితే బంధం లేక పోవడం స్వతంత్రం అవుతుందా? ఆహా, అవుతుంది. అట్టి స్వాతంత్ర్యం ఒక్క పరమకారణానికే ఉన్నదని అంటారు. అందువల్ల బంధమోక్షమే మోక్షమని ప్రసిద్ధి.

"అవిద్యాస్తమయో మోక్షః సా చ బంధ ఉదాహృతః" - "బంధరూపమయిన అవిద్య పోవడమే మోక్షం".

ఈ మోక్షంలో కొత్తగా పొందేదేమీలేదు. కొత్తగా పొందిన దేమైనా వుంటే విడిపించుకొని తానుతానుగా నిలబడడం. బద్ధావస్థలో కూడా తానుతానుగా నిలిచే ఉన్నాడుకాని అది అజ్ఞాతంగా ఉండి పోతూందని వేదాంతులు చెబుతారు. ఇట్టి స్వాతంత్ర్యం ఆత్మకే చలామణి కాని మరి యెవరికీ కాదు.

ఇక లోకంలో లోకులు కోరుకోవలసిన స్వాతంత్ర్యం ఎట్టిది?

## ప్రేయమూ - శ్రేయమూ

లోకంలో ప్రేయంఅంటూ, శ్రేయంఅంటూ రెండు ఉన్నవి. 'ప్రేయం' అంటే మిక్కిలి ప్రియమైనది. అనగా తమకు అత్యంతమూ ఇష్టమైనది

ప్రేయం.'శ్రేయం' అంటే మిక్కిలి శ్రేష్ఠమైనది. అనగా తమకు అత్యంతముగా శ్రేయస్సు కలిగించేది శ్రేయం. ఈ రెంటిలో ప్రేయం శ్రేయం కాకపోవచ్చు. కాబట్టి శ్రేయమే ఆశ్రయణీయం. శ్రేయమే ప్రేయమవడం అందరూ కోరుకొన దగినదని అంటే ఎవరూ వివదించరని అనుకుంటాను.

ఆలాటి లోక శ్రేయస్సుకు భంగం కలిగింపని యేపని చేయడానికీ ఎవడికి బడితే వాడికి ఏ అడ్డూ ఉండగూడదు. అనగా లోకానికి మేలుచేసే అధికారమే స్వాతంత్ర్యంకాని, లోకానికి చెడ్డచేసే అధికారం స్వాతంత్ర్యంకాదు. ఈ సంగతి బాగా ఆలోచనం చేసిం తరువాత ఎవడున్నూ - "నేను నా యిష్టం వచ్చినట్లు నడుచుకుంటాను, నీ ఇల్లు పీకి నా ఇంట్లో వేసికొంటాను." - అని అనడు. ఇలా అనకపోగా - 'ఈ స్వాతంత్ర్యం రక్షించుకోవడానికి చాలా శిక్షణ ఉండాలి.' అని బుర్రగోక్కుంటూ మరీ అంటాడు. ఈ రీతిగా చూస్తే క్రమశిక్ష లేని మనిషికి స్వాతంత్ర్యం బంధమే అనిపిస్తుంది.

## కవులూ - కట్టుబాట్లూ

కవిత్వంలో గూడా స్వాతంత్ర్యం కావాలని కవులు ఆశిస్తారు. 'అయితే కవులకు ఏమి నిర్బంధాలు ఉన్నవి?' అని అడుగుతారు. పద్యం మొదలుపెడితే అడుగడుక్కూ బంధమే! ఛందస్సు ఒక బంధం- వ్యాకరణం ఒక బంధం- యతి ఒక బంధం- ప్రాస ఒక బంధం- ఇవి శరీరానికి సంబంధించినవి. ఆత్మ భూతమైన అర్థానికి సంబంధించిన వెన్నో ఉన్నవి.

ఈ కట్టుబాట్లతో నిన్నటి వరకూ కవులందరూ చక్కని కవిత్వం చెప్ప గలిగారు కాదా? చెప్పగలిగారు. సందేహంలేదు. నేటివారు కూడా చెపు తున్నారు. ఆ విషయంలోగూడా సందేహంలేదు. అలా చెప్పగలిగిన శ్రీ తిరుపతి వేంకట కవులే-

"కవుల మిప్పటి రూల్సుకు కట్టుబడము
... ఘనులు పండిత రాజాది కవుల మార్గ

మనుసరింతుము ... ... ... ... ...

...'మాకు వల్లభులు లేరు' అని అన్నారు. ఇక్కడ ఒక కట్టుబాటుకు లోగక పోవడమూ, ఇంకొక కట్టుబాటును అనుసరించడమూ ఉన్నది. ఈ రెంటిలో మొదటిది చెడ్డదీ, రెండవది మంచిదీ అని కవుల అభిప్రాయం. అయితే శ్రీ తిరుపతి వెంకటకవులు పై జెప్పిన ఛందస్సునుగాని, యతినిగాని, ప్రాసను గాని విడనాడమని చెప్పరు. వ్యాకరణాన్నిగూడా ఝాడించి పారెయ్యమని చెప్పరు. గాని లోకప్రహతమైన ప్రయోగాలు అవైయాకరణాలయినా ప్రయోగించమంటారు - ప్రయోగించారు - ప్రయోగిస్తారు. ప్రాచీన కవులందరూ ఈ పని చేశారు. కాని వీరెవరూ మిగిలిన మూడు కట్టుబాట్లను దాటమనలేదు.

ఇప్పటి వారిలో కొందరు ఈ యతి ప్రాసలనూ ఛందస్సునూ తీసి వేయాలి. ఈ ఉచ్చులు బిగించుకొని గొగ్గి లేకుండా కవిత్వం చెప్పడానికి కొన్నేండ్లు పడుతుంది; కొన్నికొన్ని చోట్ల యతిప్రాసలకు కొన్ని పదాలను బలివేయవలసి వస్తుంది - అని ఏవేవో కారణాలు చెబుతారు. అయితే ఈ ఉచ్చుల వల్ల కవిత్వానికి ఒక అందం రాదా ?

వస్తుంది. ఇంతేకాదు, తెలుగువారి సంభాషణలో కూడా యతిప్రాసలు ప్రసరిస్తవ్. తెలుగు సామెత లన్నిటిలోనూ యతిగాని ప్రాసగాని కనబడుతుంది. ఇంత మాత్రం చేత ప్రతి పద్యంలోనూ యతిప్రాసలు ఉండాలనడం భావ్యంకాదు. కందంలో మొదటిపాదంలోగాని మూడో పాదంలో గాని యతిలేదు. ప్రాసమాత్రం ఉంది. ఈ ఉచ్చులతో అందం వచ్చినట్లే, అందం పోయేచోట్లు కూడా ఉంటై. ఈ ఉచ్చు లూడ్చివేసినా అందం వస్తుంది.

పదాలకూ అర్థాలకూ సంబంధించిన యీ కట్టుబాట్లు కొన్ని నగలవలె అలంకారాలు కావా ?

అగును.

ఆ కట్టుబాట్లు తొలగిస్తే సౌందర్యానికి కొరతేకదా ? ఈ విషయంలో మీమాంసింపదగినది చాలా ఉంది. "అసలు వస్తు సౌందర్యమే మేము కోరుతాం,

నగలవల్ల కలిగే సౌందర్యం కంటే అది ఉత్తమం. అట్టి ఉత్తమ సౌందర్యం ఆవిష్కరింపలేనివారు ఆయా నగలతో అలంకారం చేసుకోవచ్చు. ఇక ప్రాచీన రీతిగా నిర్బంధాలతో కవిత్వం అల్లలేని వారున్నూ, అల్లగలిగినా యీ నిర్బంధాలను తొలగించుకొన దలచిన వారున్నూ, తమతమ భావవేగాలకు అనుగుణంగా ఛందస్సును మలచి, యతినీ ప్రాసనూ వ్యాకరణమునూ బంధంగా భావించి వానిని అతిక్రమిస్తాం" - అని అతిక్రమిస్తున్నారు. ఇది భాషా రాజ్యానికి మాత్రమే సంబంధించింది. ఇది ఇల్లాఉండగా ఆర్థికంగా కూడా కవులు స్వాతంత్ర్యం వాంఛిస్తున్నారు. 'కవికి విషయం కాని దేవీ లే'దని భరతుని దగ్గరనుంచీ అందరూ అంటూనే వస్తున్నారు. "విశ్వశ్రేయఃకావ్యం"అని అందరూ అంటారు. ఈవిశ్వశ్రేయానికి ఉన్న పరిధి సామాన్యమయినది కాదు. కాలం గడచిన కొలదీ ఇది విశాలమవుతూ వుంటుంది. కవిత్వాన్ని ఈ వైశాల్యపు అంచుల వరకూ వ్యాపింప జేయడమే స్వాతంత్ర్యం అని నవకవులంటారు.

ఇంతేకాకుండా రాజ్యంతోపాటు కవితారాజ్యానికి కూడా అంతర్జాతీయ బాంధవ్యం ఏర్పరచి భావ సౌభ్రాత్రం అభిలషిస్తారు. రాజ్యాలకూ రాజ్యాలకూ ద్వేషం వస్తే రావచ్చు కాని కవితారాజ్య సమష్టిలో ఒక రాజ్యానికీ ఇంకొక రాజ్యానికీ ద్వేషబంధమే ఉండదు. ఇదిన్నీ ఇట్టిదిన్నీ కవితా స్వాతంత్ర్యం. మరి కవులు కోరే స్వాతంత్ర్యం.

మనదేశంలో బ్రిటిష్ పరిపాలన వచ్చిన తరువాత ప్రజాసామాన్యానికీ కవిత్వానికీ బాగా ఎడమయింది. వాస్తవ జగత్తుకు కవు లేమాత్రమూ ఉపయోగించడం లేదని ఒక ఘోష ఉన్నది. ఇది నిజం కాదని నే ననలేను. ఇపుడు కవితాక్షేత్రం విశాలమయింది. ఇంకా ఇపుడు మన పరిపాలన వచ్చింది కాబట్టి కొలది యేండ్లలో ఈ ఘోష పోవచ్చు.

## విమర్శకులూ - స్వాతంత్ర్యమూ

కొన్ని కట్టుబాట్లను దాటడానికి ప్రయత్నించిన కవులను లోగడ కవులే విమర్శించేవా . ఇప్పటికీ చాలమంది విమర్శిస్తారు. అది మంచి విమర్శన మయితే [illegible] అనిపిస్తుంది- కు విమర్శన మయితే మాత్రం మూతి

విరిపిస్తుంది. అస లిట్లా ఒకళ్ల విమర్శ చేయడం ఎందుకు? వాళ్ల కేమి హక్కు? వాడి కిష్టం వచ్చిన కవిత్వం వాడు చెప్పుకుంటే వీడికేం ? ఇది హక్కా ?

హక్కును గురించి నేనిక్కడ ఆలోచింపను గాని అనుభవంలో ఉన్న విషయం చెబుతాను. కావ్య పురుషులు కవి మానసపుత్రులే అయినా, వారిని పెంచేవారు లోకులు. "కవిః కరోతి కావ్యాని లాలయత్యుత్తమో జనః-" కాబట్టి వారు లోకు లందరకూ ముద్దుల బిడ్డలు. వారిలో ఏమయినా లోపాలుంటే వాళ్లు దిద్దుకుంటారు. ఇంతవరకూ ఏమీ ఇబ్బందిలేదు. గాని కొందరు విమర్శకులు వారి తలిదండ్రుల జుట్టు పీకుతారు; అప్పు డొస్తుంది ఇబ్బంది. ఇట్టి దుస్స్వాతంత్ర్యం ఎవరూ నెత్తిమీద వేసికోదగినది కాదు.

## కొత్త - చెత్త

ఇది కొత్త త్రోవలు త్రొక్కేవారు ఎంత ప్రతిభావంతులయినా వారి కొత్త బాట మునిముందందరకూ సుగమం కాదు. అది చాలామందికి చెత్తగా కనిపిస్తుంది. ప్రాదేశిక భాషలలో మరీనీ. ఎంచేతనంటే జన సాధారణ్యానికి చదువు తక్కువ. చదివిన వారిలో గూడా ప్రకర్ష కలవారు తక్కువ. వారిలో కూడా నవ్యతాభిరుచి తక్కువ. ఏ మనిషీ అలవాటులను వెంటనే తప్పుకోలేడు. విజ్ఞాన పరిధి ఎక్కడయితేనే కాని నవ్యత్వమందు అభిరుచి పెరగదు. ఇక అది ఎక్కువడవడాని కవకాశం వచ్చింది.

ఇట్టి నవ్యత్వాన్ని ఈసడించే వారిని గురించి వాల్ట్ విట్ మన్-

"Go lull yourself with what can you understand
And with piano tunes,
For I lull nobody and you will never Understand me."

-అనిన్నీ; చేమకూర :- "సమకాలము వారలు మెచ్చరే కదా-" అనిన్నీ; భవభూతి- "కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ-" అనిన్నీ; కాళిదాసు- "పురాణ మిత్యేవ న సాధు సర్వమ్" అనిన్నీ అన్నారు.



# 8. రూపమూ - రసమూ

విఘ్నేశ్వర చవితినాడు మన మందరమూ గణపతిని పెట్టుకుంటాం. నాడు గణపతిని చేదామని నాకు బుద్ధి పుట్టింది. ఏలాగబ్బా చేయడం అని ఆ పుస్తకాలూ ఈ పుస్తకాలూ తిరగేశాను. లక్ష్మీగణపతి శారదాగణపతి ఇలాగా ఎన్నెన్నో గణపతులు! ఇహ ఇదికాదని అనుకుని ఆ పుస్తకాలన్నీ మడిచి అవతలపెట్టి, ఇంత మట్టి ముందు వేసుకున్నాను. ఆలోచించాను. కాళ్లు ముందు చేశాను. తరువాత ఇంత బొజ్జ, పిదప చేతులు, అటుపైని మొహం, ఆవల తొండం, ఇలాచేసి ఒకటొకటే అతుకుపెట్టాను. చూచాను – అయ్యవారిని చేయబోతే కోతయ్యింది. ముక్కుమీద వేలేసుకొని విస్తుపోయి చూస్తున్నాను. ఇంతలో శివార్చకుడు గబగబా వచ్చి తాను చేసి తెచ్చిన గణపతిని అక్కడపెట్టి నా గణపతిని చూని–

> "అందగాడ వౌదు లేవయా
> పందిరూపు తాల్చినావయా"

అని పాడుతున్నాడు. ఆ శివార్చకుడు చేసి తీసుకొచ్చిన గణపతి ఇన్ని పూవులూ ఆకులూ మోయడానికి బలంగానేవుంది. అంగ విన్యాసాలన్నీ బాగానే వున్నాయ్. కాని ఆ మొహం చూద్దునుగదా మహమ్మద్‌గజనీ పన్నెండుసార్లూ దానిమీదే దండయాత్ర చేసినట్లుంది. ముఖంలో కళ లేకపోయినా – అంత శరీరంలోనూ ఎక్కడా జీవం లేక పోయినా, మనం తెచ్చిన బండెడు ఆకులూ పూవులూ మోయడానికి ఇంతశరీరం ఉందిగదా అని అనుకుని సంతోషించి అతనికిచ్చే మామూలిచ్చి శివార్చకుణ్ణి సాగనంపాను. ఇక ఆ విగ్రహాన్నే పెట్టి పూజకు కూచుందాం అని అనుకుంటూ వుండగా ఎక్కణ్ణుంచో ఊడిపడ్డాడు విశ్వబ్రాహ్మణుడు. సర్వజ్ఞాచార్లు చేతులలో గణపతిని పెట్టుకొని. ఓ! ఎలా వుందని చెప్పను! జీవం ఉట్టిపడుతూంది.

"శివ శివ మూర్తివి గణనాథా నివు
శివుని కుమారుడవు గణనాథా !"

"యత్కర్ణాంటోల కేలీ సమయ సముధయ ద్వాయు వేగానుకూలం
తోలంతౌ పుష్పంతా నఘటన ఘటనా పాటవం నాటయంతౌ
సంధ్యాయా మంధకారే రధి నటనవిధా స్వర్ణకాంస్యాగ్ర తాళ
క్రీడా మప్యానయేతే స భవతు భవతః స్వస్తి దో హస్తి వక్త్రః"

స్థిరో భవ - వరదో భవ

అని పీఠంమీద కూచోపెట్టి పూజ ఆరంభించాను.

## శిల్పి - కవి

నాబోటివాళ్లు చేస్తే ఆయా యీ అవయవాలు మాత్రం చేయకలరు. శివార్చకుడు ఆకారం మాత్రం చేయగలడు. విశ్వబ్రహ్మ ఉన్నాడే అతడు జీవం పోయగలడు. ఈ ముగ్గురిలో నాకు మాత్రం లెక్కా జమా లేదు. ఇక శివార్చకుడు ఉన్నాడే అతడు శిల్పి - విశ్వబ్రహ్మ ఉన్నాడే అతడు మాత్రమే కవి.

మనుష్యుణ్ణి చేసింది దేముడైతే, అతడు శిల్పి కవీని! అనగా స్రష్టా ద్రష్టా. మనిషి దేముడిప్రతిబింబం కాబట్టి - దేముడి అంశ కాబట్టి-చిన్నదేముడు కాబట్టి అతడున్నూ చిన్న స్రష్ట, చిన్నద్రష్ట. అనగా శిల్పి, కవీ. ఈ చిన్న దేముడు సృష్టి చేయడమే కాకుండా జీవం కూడా పోస్తాడు. అయితే ఈ సృష్టి రక్తమాంసాదులుగా పరిణమించే 'ప్రోటో ప్లాజమ్' కాదు- (అట్టిదీ ఉందిలెండి) మణి కావ్యంగా వివర్త పరిణామంగా మారే ఆనంద అణువు.

ఈ కావ్యంలో ఈ చిన్న దేముడు సృష్టిచేసిన మనుష్యులు, మనలాగా అన్నంతిని, పడుకొని, లేచి నడచిపోయే వ్యావహారిక వ్యక్తులుకారు. కాని అన్నం తిన్నట్లే - పడుకొన్నట్లే - నడచి పోయినట్లే ఉంటారు. మధురలో ఆ బుద్ధ మూర్తి! సముద్రం వంటి గాంభీర్యంతో, హిమవంతంవంటి స్థైర్యంతో, తల్లి వాత్సల్యంతో నీ హృదయంలో ఆడుతూ వుంటాడు. మరి అజంతాలో

ఆ అప్సరోయుగళమో ! అందాల మెరుపులతో నడల తీగలతో భంగిమల చక్రాలతో నీ యింటి గవకు ముందు పారా యిస్తుంటారు.

## కవే తల్లీ తండ్రీ :

రూపాన్ని మాత్రం చేసే శక్తి శిల్పం. ఆనందమయంగానూ అనుభూతిమయంగానూ చేసేశక్తి కవిత్వం. "త్వ గస్సృఙ్మాంస మేదోఽస్థి ధాతవో మాతృ మూలకాః మజ్జా శుక్ల ప్రాణ జీవదాతవః పితృ మూలకాః" - అని ఆగమాలూ వైద్యశాస్త్రాలూ చెపుతై. అంటే శరీరము రక్త మాంసాలు మెదడు ఎముకలు అనే ధాతువులు అమ్మవల్ల నుంచీ, నెనడు శుక్లము ప్రాణము జీవము అనే ధాతువులు అయ్యవల్ల నుంచీ సంభవిస్తవి. కావ్యంలో మనుష్యులకో కవే తల్లీ తండ్రీని! మనిషి చిన్న దేముడు కాదూ మరి ? అసలు దేముడు ఈ బ్రహ్మాండానికి తల్లీ తండ్రీ కదా ! కవి పదాల చేతా, అర్థాలచేతా శరీరం చేస్తాడు. తన జీవంనుంచి తన ఆనందంచే తన వేదనచే తన పాత్రలను మానవంగా చేస్తాడు. ఈ రీతిగా ఆకారానికీ గుణానికీ లంకె.

- 'యత్రాకృతిః తత్ర గుణాః'
- 'ఆకార సదృశ ప్రజ్ఞః'

అని ఆకారం ఉన్నచోట ఆత్మ సౌందర్యం కూడా ఉంటుంది. అయితే మెరిసేదంతా బంగారం కాదు :

'నిక్కమైన మంచినీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టె డేల ?'

అనికూడా అంటారు. ఈ రెండు వాక్యాలకూ విరోధం లేకుండా మనం అభిప్రాయం చెప్పుకోవాలి కాబట్టి- "తళుకు బెళుకులు లేని ఆకారం, నిర్మలమైన ఆకారం" అని మనం అర్థం చెప్పుకుని, సాత్వికమైన సౌందర్యం ఉన్నచోట గుణం కూడా ఉంటుంది అని ముందుకు పోదాం. ఈలాగే శిల్పానికీ అనుభవానికీ కావ్యం కూడలి.

## రూ ప ర సా ల కు లం కె

నీ వొక స్త్రీనిగాని, పురుషుణ్ణిగాని చూస్తావ్- బయటినుంచి రూపం- లోపలినుంచి గుణం, జీవితం. ఈ రెండూ సమంగా వుండే ఆ మనిషిలో నీవు

మునిగిపోతావ్. అలాగే కావ్యాన్నిగాని చిత్రరువునుగాని బయటినుంచీ లోపల నుంచీ పరీక్ష చేస్తాం. బయటినుంచి రూపం, లోపలినుంచీ రసం. రూపం మనస్సుకు విషయం, రసం బుద్ధికి విషయం. రూపం చూడగలుగుతాం. కాబట్టి విశ్లేషణానికి విషయం. రసం ఆస్వాదిస్తాం కాబట్టి అనుభూతికి విషయం. రసానికి రూపం ఆధారం. రూపాన్ని అవలంబనంగా చేసుకునే మనం రసంలోకి పోతాం. అయితే రసంలేని రూపం ఉండవచ్చు. గాని రూపం లేక రసానికి ఉనికి లేదు. ఈ రీతిగా సాహిత్యం రూపము మీదా రసము మీదా నిలిచివున్నది.

## మ న రూ ప మూ - సా హి త్య రూ ప మూ

ముక్కూ మొగమూ కాలూ చేయీ మొదలైన అవయవ విన్యాసమూ, రంగూ పొంగూ ఒడ్డూ పొడుగూ మొదలయిన దంతా కలిసి మానవుని రూపం. ఈలాగే శబ్దమూ అర్థమూ, వస్తువూ (అనగా కథ) అలంకారమూ, రీతీ శయ్యా ఈ మొదలయిన దంతా కావ్యానికి రూపం.

ప్రేమించవలసిన వాళ్లను చక్కగా ప్రేమించడమూ, చుట్టుప్రక్కల వారి కందరకూ సంతోషం కలిగేటటులు నవ్వు తెప్పించడమూ, సమయం వస్తే తననూ తనవారినీ కాపాడుకోవడానికి పరాక్రమించడమూ, తగిన వారిమీద దయ చూపడమూ, తప్పును రోయడమూ, ఈశ్వరుణ్ణి తననూ తెలిసికోవడమూ ఈ మొదలయిన చిత్తధర్మాలు అలవరచుకోవడం మన జీవితం.

ఈ చిత్త ధర్మాలను అనగా ఈ ప్రేమను, ఈ హాస్యాన్ని, ఈ తేజస్సును లేక యీ వీరాన్ని, ఈ కరుణను, ఈ జుగుప్సను, ఈ భక్తి ఈ నిర్వేదం మొదలైనవానిని మనంత మనం మీ-మా అనే భేదం లేకుండా, మనవి లాగా, ఆస్వాదించేటట్లు అనుభవించేటట్లు చేయగల మంత్రశక్తే కావ్యజీవితం లేక రసం.

మనంతట మనం - మీ మా భేదం లేకుండా - మనవిలాగా ఆస్వాదించే టట్లు చేయడమంటే ఏమిటి? ఒక గణితాచార్యుడు మనకు ఒక చిక్కు లెక్క చేయడం నేర్పుతున్నాడు - అని అనుకుందాం. చేయడం ఎల్లాగో ఆ కిటుకు

మనకు తెలిసి పోతుంది. అప్పుడు మనకు ఎల్లా ఉంటుంది ? ఇల్లాగే ఒక తర్కో-పాధ్యాయుడు మనకు 'వ్యధికరణ ధర్మావచ్ఛిన్నా భావం' – అంటే ఏమిటో బోధిస్తున్నా డనుకుందాం.

ప్రాచీన నైయాయికులు అభావం నాలుగు విధాలని అన్నారు. నవ్య నైయాయికుడు గంగేశోపాధ్యాయుడు ఐదవది కనిపెట్టి దానికి 'వ్యధికరణ ధర్మా వచ్ఛిన్నాభావం' అని పేరు పెట్టాడు-'బండతనంతో కుండలేదు. కుండ యొక్క-ధర్మంతో బట్ట ఉండదు.' అని దీనికి ఉదాహరణలు చెప్పాడు. ఒక వస్తువు మరొక వస్తువుయొక్క- ధర్మంతో ఉండదు- అని చెప్పడమే ఈ అభావం.

ఒక కవి దీనిని ఇల్లా ఆవిష్కరించాడు:-

"శ్రుతం తంత్రే తారాచరణ మనసాం నైవ విపదో
మనోమే తత్రాసీ దథ చ విపదో మే ప్రతిదినమ్
శివాజ్ఞానో మిథ్యా తదపి చ న మిథ్యా కి ముదితమ్
త్వయైతత్ స్వీకృత్య వ్యధికరణ ధర్మేణ విరహమ్"

-తారోపాసన చేసే వాళ్ళకు ఆపదలు రావని శివాజ్ఞ ఐనప్పటికీ నాకు ఆపదలు వస్తూనే ఉన్నవి అయితే శివాజ్ఞ తేనిదే చీమయినా కుట్టదే ! మరి ఆపద ఎలా వస్తవి ? అంటే ఆ శివుడు వ్యధికరణ ధర్మావచ్ఛిన్నా భావాన్ని మనస్సులో పెట్టుకొని చెప్పివుండవచ్చు. మంచితనంతో ఆపదలు రావు. 'అని ఆశివుని ఉద్దేశమై ఉండవచ్చు. ఎంచేతనంటే మంచితనం అనేది ఆపద్ధర్మం కాదు. అది అన్యవస్తుధర్మం. 'ఆ ధర్మంతో ఆపదలు రావుగాని అసలు ఆపదలు రావని అర్థంకాదు,' 'అని ఇచట చమత్కారం' అని తర్కోపాధ్యాయుడు బోధించాడని అనుకుందాం.

ఈ పదాలలో ఉండే ఇంద్రజాలం తెలియగానే మనకు కొంచెం మనో వికాసం కలుగుతుంది.

ఇక కావ్యం చదువుకు పోతుంటేనో మనం ఈ క్షేత్రాన్ని దాటతాం. మనోరాజ్యాన్ని దాటి కవితారాజ్యంలో ప్రవేశిస్తాం. ఎప్పుడు ఈ రాజ్యంలో మనం ప్రవేశిస్తాం ?

వస్తువు అనగా కథ మాత్రమే ఉండి, ప్రేమ మొదలయినవి లేక, ఎంత గొప్ప భాషతో తీర్చిదిద్దిన రచన అయినా అట్టి కావ్యం గొప్ప సాహిత్యంలో జమ కాదు. అట్లా అయినా అట్టి తీర్చిదిద్దిన రచన ఒకానొకపుడు మన మనస్సును ఆకర్షిస్తుంది-

"పున్నమ వన్నె, శంభు తలపూవు, ముకుందునిచూపు, దట్టపుం
వెన్నెల దుంప, జక్కవల వేసరి చీకటి మూక విప్పు, వా
రాన్నిధి యుబ్బు, తామరల రాయిడి, వేల్పుల పంట, మింటిపై
దిన్నని పూర్ణ చంద్రికలు దిక్కులకున్ వెదచల్లుచుండగన్."

—ఇచట మన మనస్సును ఆకట్టింది శిల్పమే. మనస్సంపర్క మాత్రమే ఉన్నచోట కావ్యపురుషుడు శైశవంలో ఉంటాడు. ఇక్కడ నిజానికి చెప్పదలచు కొన్న వెన్నెల రూపురేకలు కాక శాఖాచంక్రమణ రూపురేఖలే కానవస్తయ్.

"... ... ... ... ... కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాజీవబింబాననన్
సమపీనస్తని నస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్."

—అనే శ్రీనాథుణ్ణిగాని,

"అతడావాత పరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చోటని చేరబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్."

అనే పెద్దన్ననుగాని చదివినప్పుడు రూప సామగ్రిని చూస్తాం. ఇక్కడ మన మనస్సును ఆకట్టింది రూపమే.

కవులు కొందరు బహిర్ముఖులు - కొందరు అంతర్ముఖులు - మరి కొలది మందె ఉభయతోముఖులు. అయితే ఈ ఉభయతోముఖులుగూడా దేశాన్ని బట్టి, కాలాన్నిబట్టి, పాత్రనుబట్టి, ఔచిత్యాన్నిబట్టి, ఒకానొకపుడు బహిర్ముఖులు గానే కనిపిస్తారు. అంతమాత్రంచేత వారిని కేవల బహిర్ముఖుల కిందనే జమ కట్టగూడదు. చూడండి శ్రీనాథుడు ఒకానొక ఘట్టంలో-

"సొగసు కీల్జడదాన! సోగ కన్నులదాన!
వజ్రాలవంటి పల్వరుస దాన!
బంగారు జిగిదాన! పటువు గుబ్బలదాన!
నయమైన యొయ్యారి నడలదాన!
తోరంపుఁ గటిదాన! తొడల నిగ్గులదాన!
పిడికిట నడగు నెన్నడుము దాన!
తళుకుఁ జెక్కులదాన! బెళుకు ముక్కరదాన!
సింగాణి కనుబొమ చెలువుదాన!

మేలిమి పసిండి రవ కడియాల దాన!
మించి పోనేల రత్నాల మించుదాన!
తిరిగి చూడవె ముత్యాల సరుల దాన!
చేరి మాటాడు చెంగావి చీరదాన!

ఈ రీతిగా బహిర్ముఖుడై రూప రచనతోనే సరిపెడతాడు. అంతమాత్రం చేత అతనిని అడుగున పడవేయగూడదు. సర్వతోముఖ ప్రజ్ఞగల వ్యాస వాల్మీకులు భారత భాగవతాలలో రామాయణంలో దేశకాలాదుల ననుసరించి ఒకచోట బహిః ప్రజ్ఞులుగానూ, ఒకచోట అంతఃప్రజ్ఞులుగానూ ఇంకొకచోట సర్వతః ప్రజ్ఞులుగానూ చూపడతారు.

అన్ని దేశాలలో గూడా, అన్ని భాషలలో గూడా రూపం మీదే మోజుగల కవులూ రసమ్మీదే మోజుగల కవులూ, రూప రసాలమీద మోజుగల కవులూ కనబడతారు.

ఉదాహరణకు ఇంగ్లీషులో చూదాం: కీట్సూ, షెల్లీ. ఈ యిరువుర కవిత్వాలు క్లాసిక్‌లో అంతర్గతాలు. ఈ యిరువుర కవిత్వాలలోనూ రసాభివ్యక్తి విషయంలో ఎవరికీ సందేహంలేదు. కాని కొంచెం లోతుకు దిగిచూస్తే ఒకడు రూపం పక్షంలోనూ, ఇంకొకడు రసపక్షంలోనూ ఉన్నటులు కనబడతారు. కీట్సు-

Yet she had
Indeed, locks bright enough to make me mad;
And they were simply gardained up and braided
Leaving in naked Calmliness, unshaded.

Her pearl-round ears, white neck, and orbed brow
The which were blended in, I know not how.
With such a paradise of lips and eyes
Blush tinted cheeks, half smiles and faintest sighs
That when I think thereon my spirit clings
And plays about its fancy...

—అనే ఈ పద్యంలో ముడువబడ్డ వేనలీ, తురగలించు ముంగురులూ గోళాకారమూ ముక్తామసృణమూ అయిన శ్రవణయుగళమూ, చక్కని గ్రీవం, వంకల కనుబొమలూ, నయనములూ, మోవియొక్క ఐశ్వర్యమూ, చిరునగవూ, అలతి వలతి యూర్పులూ - వీనిలో తన అసాధారణ ప్రజ్ఞతో ఒక బొమ్మను చేశాడు-

ఇట్టి వర్ణనే షెల్లీలో చూదాం —

A lovely lady garmented in light,
From her own beauty deep her eyes as are
Two openings of unfathomable night
Seen through a temple's cloven roof her hair

Dark-the dim brain whirls dizzy with delight picturing her form.

- తన అందపు వెలుగే తన దువ్వలువ. అతలాన్ని ముట్టబారుతూ రేయిలా వున్న కన్నులు, నల్లని వేనలి ఈ రీతిగా మూర్తిని కల్పింపబోతే దుర్బలమైన మెదడు ఆనందాతిశయంచే ఘూర్ణిల్లిపోతుంది-అట్టిది ఆమె!

ఇక్కడ షెల్లీ తన హృదయానుభూతికే- అనగా అంతర్ముఖత్వానికే ప్రాధాన్యం ఇచ్చాడు. షెల్లీ ప్రధానంగా రసోపాసకుడు.

ఇచ్చటి రూపకల్పనంలో కొంచెం హృదయ సంపర్కం ఉంది. కాబట్టి వెనకటి పట్టి రూపంలో నుంచి రసంలోకి తొంగి చూడగలిగినాం.

మానవుని హృదయం సంశయాత్మకమైన మనస్సు మాత్రమే కాదు- హృదయం అనేది రసానికి ఊట. కావ్యం శిల్పమాత్రం కాదు. మరి రసాత్మకం.

ప్రేమతో నగవుతో తేజస్సుతో దయతో భయంతో బిడియంతో ఆశ్చర్యంతో భక్తివిరక్తులతో ఘటితమై అగాధమైన హృదయాన్ని చూచి దానికి స్పందించి- ఆ స్పందాన్ని గంధర్వగానంతో కవి ఆవిష్కరిస్తాడు. కవియొక్క హృదయావేగంచేత, భావం రూపాంతరం చెంది పాఠకుల మనస్సును తన్మయం చేస్తుంది. అలా చేయగలిగితేనే అది కవనమని అనిపించుకుంటూంది.

కవి హృదయానికీ పాఠకుని హృదయానికీ పోరాని చుట్టరికం ఉండాలి. ప్రతి కవిలోనూ పాఠకుడు లేని రసం పిండాలని కాదు. ఉన్నచోట దాని పుట్టుపూర్వోత్తరాలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండాలి. అలా లేకపోతే రసోద్భోధ కాదు- 'అరసికాయ కవిత్వ నివేదనం శిరసి మా లిఖ మా లిఖ మా లిఖ.'



# 9. ఉపకథ (Short Story)

హూణభాషా సంపర్కము వలననే మన మువకథ యొక్క ప్రాచుర్య మును ప్రాముఖ్యమును గమనించితిమి. 'షార్ట్ స్టోరీ' అను పదమునకు 'చిన్నకథ' అనునదియే సరియగు మాటయైనను, దానియందు ఉండవలసినంత సౌందర్యము నాకు కానరామి, దానికి బదులు 'ఉపకథ' యను పదమును రూఢము చేయుచుంటిని. 'ఉప' అను ఉపసర్గము సాపేక్షము. ఒక మహాకథలో ఒక పిట్ట కథ వచ్చినపుడు ఆ పిట్టకథను ఉపకథ యందుము. పురాణము లందును, వేదము లందును ఇవి అర్థవాదలుగా ఉపయుక్తము లగుచున్నవి. కొన్ని ప్రబంధముల యందును ఇవి కలవు. కథ లేనిదే ఉపకథలేదు. కాని ప్రకృతము మఱియొకకథ కంగము కాక స్వతంత్రముగా నుండు స్వల్పకథకే ఉపకథ అనుపదము రూఢము. 'ఉప' అను ఉపసర్గ మల్పసదృశాద్యర్థబోధకము. ఉపకీచకాదు లుదాహరణ ములు. సాదృశ్యము బట్టి యైనను చిన్నకథ అనునర్థము చెప్పికొనవచ్చును.

## లక్ష్యములు

పురాణముల కాంధ్రీకరణములగు పాండురంగమాహాత్మ్యము మొదలగు ప్రబంధములయందు ఉపకథలు చాలనున్నవి. కళాపూర్ణోదయ మందలి సుగాత్రీ శాలీనోపాఖ్యానము తెలుగుభాషలో గొప్ప ఉపకథ. ఇవి యన్నియుఁ బద్యమయ ములు. ప్రకృతము ఇవి గద్యమయములుగా వ్రాయఁబడుచున్నవి. ముద్రితము లును అముద్రితములును అగు కావ్యములలో స్వకపోలకల్పితములును, ప్రశస్త ములును, స్వతంత్రములును అగు చిన్నకథ లున్నచో లాక్షణికులు వాని నెత్తి చూపి యుపకరింతురు గాక !

## ఫలము

కావ్యముల కన్నిటికి ఏ ఫలమున్నదో ఆ ప్రధానమగు ఆనందము (సద్యః పర నిర్వృతి) ఉపకథకును గలదు.

## పురాణము - ఉపాఖ్యానము

పురాణ మొక మహాఖ్యానము. అందు చాల ఉపాఖ్యానము లుండును. అవి ప్రకృతార్థమునకు ఉపష్టంభకములుగా ఉండును. అనగా ప్రకృతార్థ దార్ఢ్యమునకు అవి యారంభింపఁబడినవి. అవి ప్రకృతార్థమును మనస్సునకు లక్కవలె పట్టునటులు చేయును. వాని శరీరము స్వల్పముగా ఉండును. ఉన్న కొంచెము శరీరమునందును ఆత్మ స్ఫుటముగా ప్రకాశించుచుండును. ఈ యుపాఖ్యానములే ప్రకృతము ఒక మహాకథకు అంగములు కాక తామే స్వతంత్రములై ఉపకథలను పేర వాఙ్మయ మహా రాజ్యమున నొక హేమ సింహాసనమును సంపాదించుకొన్నవి. ఇవి యిఁకఁ గలకాలము ఏలఁ గలవు.

## నవల - ఉపకథ

నవల సామాన్యముగా జీవితవృక్షము యొక్క పేరు మొదలుకొని పూవు పండు వఱకును అన్ని విషయములు ప్రతిపాదించును. ఉపకథ ఒక పూవునో పండునో వివరించి కొలఁది కాలముననే యానందము కలిగించును. గంటలకొలఁది, దినములకొలఁది చదివించి కొంతకాలము మనఃఫలకమునఁ దన చిత్తరువును మాయకుండ నుంపఁగల నవల యొక్క ఆవశ్యకత వేఱు. నిమిషములకొలఁది, గంటలకొలది చదివించి కొలఁదికాలము మనఃఫలకమునఁ దన చిత్తరువు యొక్క ముఖమును మాయకుండ నుంపఁగల ఉపకథ యొక్క ఆవశ్యకత వేఱు.

పత్రికలు హెచ్చిన కొలఁది ఉపకథలును హెచ్చినవి. ప్రతి సంచిక యందును సంపూర్ణములగు ఉపకథ లుండిననే కాని జీవితావేగము హెచ్చిన యీ కాలములోని పాఠక ప్రపంచమునకు తుష్టి ఉండదు. ఇపుడు మనకు పిండీకృతమగు చమత్కారము (రసము) కావలయును. ఇదియు కాలసిద్ధమే. పురాణమైనది, ప్రబంధమైనది, నాటకమైనది, నవలయైనది, ఉపకథయైనది. మొదటి మూడును ఒక విషయమున ఒక తెగ, పదపటి రెండును ఒక తెగ. ఈ రెండు తెగలలోను రసము పిండీభూతమగుచు వచ్చినది. పురాణమును గొన్నియేండ్లు, ప్రబంధమును కొన్నాళ్ళు, నాటకమును కొన్నిగంటలు రసింతుము. నవలను కొన్నాళ్ళు లేక కొన్నిగంటలు, ఉపకథను కొన్ని నిమిషములు లేక

కొన్నిగంటలు రసింతుము. వీని యన్నింటను మనస్సులో నిలుపయుండుటలో భేదమున్నది. కాని యానందాంశము సమానము. కావున ఉపకథ కథా శరీరము స్వల్పమై, కొలఁది కాలమున చదువఁదగినదై, జీవితము యొక్క ఏక దేశమును తెలుపునదై పిండీకృతమగు చమత్కారము కలదై యున్నది.

## స ం వి ధా న ము

కావ్యమునఁగాని నాటకమునఁగాని నవలయందుఁగాని ఉపకథయందుఁగాని నెందేని చమత్కారము లేకున్న నది కావ్యము కాదు, నాటకము కాదు, నవల కాదు, ఉపకథ కాదు. చమత్కారహీనమగుచో నది కావ్యశవము. అనుభూతమగు విషయమునుగాని, కల్పిత విషయమునుగాని కవి ఉపకథగా చెప్పఁగాక, అది చమత్కారజనకమైయుండి తీఱవలెను.

చమత్కార మననేమి ? ఒక మహాకవియొక్క గ్రంథమును చదువుదువు. నీ మనస్సున కొక ఆనందము కలుగును. అదియే చమత్కారము.

'అనఁగనఁగా వెంకయ్య. అతనికి మూగురు కొడుకులు. అతఁడు అఱువదియేండ్లు బ్రదికెను. అతఁడు తన ఆస్తి కొడుకులకు సరిగా పంచిపెట్టి కాల ధర్మము చెందెను' అను నీ విషయములనే పెంచి వ్రాయుచో దానివలన చమత్కారము కలుగదు. అది ఉపకథ కాఁజాలదు.

సాక్షా దనుభూతమగు విషయమును కవి యుపకథగా రచించెనేని సర్వ సామాన్యముగా అందఱకు అందుబాటుగా నుండును. అందలి విషయములు ప్రతివి అనుభవమునకు దాపుగా నుండును.

కల్పితమగు విషయము మనోగోచరమై సర్వ సామాన్యముగా రసింపఁబడదు. తావన్మాత్రముచే దానికి న్యూనత లేదు. మంచి మనశ్శక్తి కలవారల కది చుట్టము. అట్టివానిలో కవియొక్క దూరదృష్టియు గూఢమగు సత్యమును ఇమిడియుండును. కావున కవికి ఈ రెండును ఉపాదేయములే !

కథయొక్క చివరభాగము మాత్రమే ఏదో యొక ప్రసంగము వలన చమత్కార జనకముగాఁ జేసినఁ జాలదు. కథయొక్క మొదటి అక్షరమునుండి

తుది అక్షరము వఱకు చమత్కారముచే ప్రాణింపఁజేయవలయును. అనఁగా మొదటినుండి తుదిదాఁక చతురస్రముగా కథా విషయమును పంచి, తక్కువ కాకుండ ఎక్కువ కాకుండ రచింపవలెను. కథయొక్క బాగోగులకు (సహృదయుఁడే) యావద్రసము గ్రహింపగల పాఠకుడే నిర్ణాయకుఁడు. అనఁగా మంచి మనస్సే నిర్ణాయకము. దానివంటి కొలబద్దగాని త్రాసుగాని వేఱొకటి లేదు. కథలో ఏమాత్రమేని తక్కువ ఆయెనా దాని డిప్పి తీఱదు. ఏ మాత్ర మెక్కువ ఆయెనా దానికి పుల్లితేపులు వచ్చును.

కవియొక్కశక్తి మొదట కథా శరీరమును రచించుట యందే యున్నది. శరీరమునందే వికార మున్న యెడల ప్రాణమును వికారముగనే యుండును.

కొందఱు-శరీర మెటులున్న నేమి? ఆత్మకేమి లోపమందురు. ఆ శరీరమందెచట లోపమున్నదో-అనఁగా కన్ను లేదనుకొనుఁడు, లేక కాలులెదనుకొనుడు, ఆ శరీరమునందలి ఆయాత్మకు కంటితోగాని కాలితోగాని సంబంధములేక ఆయాత్మయు గ్రుడ్డిదిగాని కుంటిదిగాని అగుచున్నది. కావున కథా శరీరము సర్వాంగీణముగా నుండుట సమంజసము.

కథా శరీరమును చక్కగా చూచికొన్న తరువాత కవి చెప్పు ప్రతి వాక్యమును ప్రతిఅక్షరమును చమత్కార జనకముగా ఉండవలయును. ఆ విగ్రహమునకు సరిగా ప్రాణ ప్రతిష్ఠ చేయవలెను.

అనగనఁగా ప్రతాపుఁడను రాజు కలడు అని యీ మొదలుగా ఒక కథ రచింతుము. ఈ వాక్యమునందేమి చమత్కారముండును ? అని కొందఱందురు. నిక్కము. ఆ కథ ఆ వాక్యమేకాదు. కథ చమత్కారమగుచో అందేక వాక్యత కల యీ వాక్యమును చమత్కార జనకమే యగును.

ఉప కథను సామాన్యముగా రెండు తెగలుగా విభజింప వచ్చును. ఒకటి భావితము. రెండు భావ్యము. ఊహితములైన వన్నియు భావితములు. ఇవి జరిగినవి కాక మనోజన్యములు. దీనికి రవీంద్రనాథుని Skeleton మొదలగునవి ఉదాహరణములు-అనుభవమునకు దాపుగా నుండునవి, అనుభూతములైనవి (జరిగినవి) భావ్యములు, దీనికి Supreme Night, Kabuliwala మొదలగునవి ఉదాహరణములు.

# 10. నాటక మీమాంస

నాటకమునకు లక్షణము చెప్పిన వారలలో భరతముని ప్రాచీనతముఁడు. ఆ భరతముని నిర్వచించిన లక్షణమునే తరువాతివారగు ధనంజయ మహాకవి[1] దశరూపకమునందును, హేమచంద్రుడు[2] కావ్యానుశాసనమునందును, విశ్వనాథ తర్కపంచాననుఁడు[3] సాహిత్య దర్పణమునందును, కృష్ణకవి[4] మందార మరంద చంపువునందును, విద్యానాథకవి[5] ప్రతాపరుద్రీయమునందును వివరించి యున్నారు. నాలుగు వేదములనుండి తత్తద్బీజముల గైకొని[6] బ్రహ్మ నాట్య మొనరించినటులు భరతముని నాట్యశాస్త్రమున వక్కాణించి దీని కనాదిత్వ మేర్ప రచినాడు. గంధర్వులు అచ్చరలు దేవతల యోలగముల నాట్యమును నృత్య మును నృత్తమును ప్రదర్శించువారలట!

కవిచే వర్ణింపబడిన పాత్రముల యవస్థలను నటు లభినయించి యనుక రించుట నాట్యము. ఇది రసాశ్రయము. ఈ నాట్యము చూడదగిన దగుటచేత రూపమనబడును. ఒక రూపము మనచే జూడబడినదగు గదా! నటునియందు ఆయా యీ పాత్రముల నవస్థల నారోపించుటచే గలిగిన యా రూపమునకే రూపకమనియు పేరు.

---

1) ఈతడు క్రీ. శ. 996 ప్రాంతములోనివాడు.

2) క్రీ. శ. 1151.

3) ఈతని కాలము సరిగాఁ దెలలేదు. ఈతఁ డుదహరించిన కవులు ఇటీవలివా రగుటచేత నీత డాధునికుడు.

4) ఈతని కాలము నేటివరకును తెలియలేదు.

5) ఈతడు క్రీ. శ. 1295-1323 మధ్య కాలము నాటివాడు.

6) జగ్రాహ పాఠ్యమృగ్వేదా త్సామభ్యో గీతమేవచ
యజుర్వేదా దభినయాన్ రసానాథర్వణాదపి ॥

(చదువదగు దాని ఋక్కునుండియు, పాటను సామము నుండియు, అభినయముల యజుర్వేదము నుండియు, రసముల నథర్వణము నుండియు గైకొనెను.)

## నా ట క భే ద ము లు

రూపకములనియు, ఉపరూపకములనియు నాటకము లిరుతెరగులు. మరియు రూపకములు పది తెరగులు. ఉపరూపకములు పదునెనిమిది తెరగులు.

1. నాటకము
2. ప్రకరణము
3. అంకము
4. వ్యాయోగము
5. భాణము
6. సమవకారము
7. వీధి
8. ప్రహసనము
9. డిమము
10. ఈహామృగము

ఇవి రూపక భేదములు.

1. నాటిక
2. త్రోటకము
3. గోష్ఠి
4. సట్టకము
5. నాట్యరాసకము
6. ప్రస్థానకము
7. ఉల్లాప్యము
8. కావ్యము
9. ప్రేంఖణము
10. రాసకము
11. సంలాపకము
12. శ్రీగదితము
13. శిల్పకము
14. విలాసిక
15. దుర్మల్లిక
16. ప్రకరణిక
17. హల్లీసక
18. భాణిక

ఇవి యుపరూపక భేదములు.

వస్తువు - నాయకుడు - రసము : వీని భేదములజేసి నాటక మిన్ని విధములుగా విభజింపబడినది. వస్తువనగా ఇతివృత్తము లేక కథ. అది యిరుతెరగులు. ఆధికారికమనియును, ప్రాసంగికమనియు. ఆధికారికమనగా ప్రధానము. ఉదా : రామాయణమున సీతారామ వృత్తాంతము. ప్రాసంగిక మనగా అంగభూతము. అదియు నిరుతెరగులు. పతాక అనియు, ప్రకరి యనియు. ప్రధాన కథను చాలవట్టు ననుసరించి వచ్చు కథ పతాక- రామాయణమున సుగ్రీవ కథ.

ప్రధాన కథను గొలదిగా ననుసరించి వచ్చునది ప్రకరి - రామాయణము జటాయుశ్రవణాది వృత్తాంతము.

మరల నీవస్తువు ము త్తెరగులు- ప్రఖ్యాతము, ఉత్పాద్యము,[7] మిశ్రము అని. ప్రఖ్యాతము ఇతిహాసాదుల నుండి కైకొన్న ప్రసిద్ధ కథ: [illegible] చరితము మొదలగునవి. ఉత్పాద్యము కల్పితము - మాలతీ మాధవీయము మొద లైనవి. మిశ్రము ప్రసిద్ధ కథయు, గొంత కల్పితమును- ఉత్తర రామాయణము మొదలైనవి.

లాక్షణికులు చెప్పిన లక్షణమంతయు పొలుత వలబడు [illegible] నాటక సామాన్యమును స్థూలముగా నిర్వచించుచున్నది. నాటక [illegible] జదివి నాటకము వ్రాయనెంచువారికిని, అట్టివిమర్శకులకును ఇది అయో[illegible] నుండును. నాటకముల జదివినవారికి ఇది చాల ఉపయోగపడును. [illegible] కిది శిరశ్శూల. వార లీ లక్షణాంతమునందలి ఉపన్యాసము [illegible] జనించుచో నీ పరిభాషాటవిని సంచరింపకుగాక!

బీజ - బిందు - పతాకా - ప్రకరీ కార్యములును, ఆరంభ - యత్న - ప్రాప్త్యాశా - ప్రాప్తి నిశ్చయ - ఫలాగమములును అనునవి నాటక [illegible] ప్రథమ సోపానములు. బీజ బిందు పతాకా ప్రకరీ కార్యములు కథా [illegible] సిద్ధిహేతువులు. కావున[8] అర్థప్రకృతు లనంబడు. [illegible] సృజింపబడి విరివిగా పెరిగి తుదకు ఫలమును పొంది ముగియును. [illegible] గావున బీజము. ఎట్లన విత్తునుండి చెట్టు, చెట్టున బూవు, [illegible] కాయ పండి పండు అగుగదా! ఇవి బీజముకంటె [illegible] వృద్ధకాది సంబంధముచే బీజమే యున్ని అవస్థలను రూపములను [illegible]

7) నాట్యశాస్త్రాదులు ఉత్పాద్యము కానగు ననుచున్నవి. విశ్వనాథ కవిరాజు పురాణ చరితములనే కైకొనవలయు ననుచున్నారు. కొంటి పరానువారును, కొంటి [illegible] నాటక కళ ననుసరించి కల్పిత వస్తువు కూడదనిరి. చూ. 'Dramas' By H. H. Wilson. Page : 13.

8) కథా శరీర కారణములని భోజరాజాదులు నిర్వచించుచున్నారు.

9) రత్నావళిలో యౌగంధరాయణ వ్యాపారము బీజము. అది వత్సరాజునకు రత్నా వళి లభింప బీజమగుచున్నది. పాఠకు లాయాయి నాటకములందు ఈ విధముగా బీజము మొదలగువాని నారయునది. ఈ బీజము ము త్తెరగులు. పలవర్యవసాయి. ఫలబీజము; వస్తు బీజము కథ; అర్థబీజము నాయకుడని మాతృగుప్తాచార్యుని వివరణము.

ప్రయోజనములకు విచ్ఛిత్తి కలుగుచుండగా తుదివరకు మరల ననుసంధించునది బిందు వనబడును.[10] జలమున నూనెబొట్టు ప్రసరించునటులు ఇదియు కథయందు ప్రసరించుగాన దీనికి బిందువని పేరు.

ఎవరి చరితము పరప్రపంణమును ప్రధాన నాయకోపకారమును అయి ప్రధానమువలె భాసించునో అది పతాక:[11] దీని కుదాహరణము సుగ్రీవాది వృత్తాంతమని తొల్లి జెప్పబడియె.

---

10) రత్నావళిలో మదనపూజా సమాప్త్యవసరమున వైతాళికుని స్తోత్రపాఠము. ఈ స్తోత్రము విన్నపిదప సాగరిక వత్సరాజును బొందగోరును. 'ఇది అవాంతరబీజము. దీనికే బిందువనియు బేరు' - అని దశరూపకము. చూ. పు-6.

11) పతాకకు అనుసంధియనియు పేరు. (చూ. నాట్యశాస్త్ర 18 అధ్యాయ) ఇంగ్లీషున దీనికి 'Sub-Plot' అని పేరు. నిర్వహణ సంధి పర్యంతము అనగా తుదివరకు ఉండునదియు, ప్రధానేతర పాత్ర నిష్పాద్యమును, ప్రధాన ఫల సాధనమును, ప్రాసంగికమును అనునది పతాక యనునది నిష్కర్ష. పతాకా నాయకుని స్వకీయ ఫలము పతాకలో జేరదు. ఏలనగా ఆ ఫలము గర్భ సంధియందుగాని, విమర్శ సంధియందుగాని నిగూఢమగును. ఉదా : సుగ్రీవాది రాజ్యప్రాప్తి మొ॥ నిర్వహణ సంధి వట్టు పతాకకు వ్యాప్తి కలదు. కావున బతాకా నాయికా స్వకీయ ఫలము పతాక కాదు. అటులగుచో భరతముని "ఆగర్భాదా విమర్శాద్వా పతాకా వినివర్తతే" (ఆగర్భాదా విమర్శాంతా - అని పాఠాంతరము) 'గర్భసంధి నుండి కాని విమర్శసంధి నుండిగాని పతాక మరలును' అని యెటులు చెప్పె? ననుచో పతాక యనగా పతాకాఫలమని వారి తాత్పర్యము.

అభినవ గుప్తపాదాచార్యులు అటులే అర్థము వ్రాసినారు. కావున నిట గల పతాకా పదము పతాకా ఫలమను అర్థమున బర్యవసన్నమై గౌణమని తేలుచున్నది.

'శారదా తనయుడు' మొదలగు పండితులు సుగ్రీవాదులకు వేరు ఫలము కనబడుచున్నది. కావున పతాకయందు భిన్నఫలాంగీకారమును జేయుచున్నారు. ఇది న్యాయ్యేతరము. అంగములకు ప్రధాన ఫలములవలనే ఫలవత్త్వమని నియమము. అంగములకు ప్రత్యేక ఫలమున్నను ప్రధాన ఫలము లేకున్నచో నా యంగముల ఫలము ఫలమగునా? మరియు ఫల సంతుష్టుడైన యనుచరుడే క్రియాకారియగుటచే ఆతని ఫలము కూడ స్వామి ఫలత్వాభిమానము కలదగుచున్నది.

ప్రకరీనాయక ఫలముకూడ నిటులే యూహింపదగినది. పూవులు మొదలగునవి యితరములగు వేదికాదులకు అలంకార మెటులగుచున్నవో యటులే ఋతువర్ణన, జటాయు శ్రవణాది రూపమగు ప్రకరి ప్రధానమునకే ఉపయోగించునుగాని తనకు గాదని యారయునది.

ప్రాసంగికమును కథలో గొంతవరకే సంబంధించి యుండునదియు ప్రకరి యనంబడు.[12] ప్రకరీ నాయకుని ప్రత్యేక ఫలము ప్రకరిలో జేరదు. ఉదా: జటాయుర్మోక్షాది ప్రాప్తి.[13]

ఎయ్యది కోరబడినదో, ఎందుల కారంభింపబడినదో అది సిద్ధించుటయు, సమాప్తి బొందుటయు గలుగగలయది కార్యము నాబడు. ఉదా: రామచరితము నందు రావణ వధ.

ఈ అయిదు అర్థ ప్రకృతులను కథా ప్రయోజన సిద్ధి హేతువులని కాని లేక భోజరాజాదులు చెప్పిన రీతిగా కథా శరీర కారణములని కాని యననగును.

## అవస్థలు

ఒక కార్యము నిర్వహింప నైదు అవస్థ లుండును. అవి ఆరంభము, ప్రయత్నము, ప్రాప్త్యాశ, ప్రాప్తినిశ్చయ, ఫలభాగములు :

1. ఆరంభమనగా ముఖ్యఫలసిద్ధి కొరకైన ఔత్సుక్యమాత్రము- ఉదా : రత్నావళిలో అంతఃపుర నివేశమునకై యౌగంధరాయణుని యౌత్సుక్యము. ఇటులు నాయికా నాయకాదులయు నౌత్సుక్యము నారయునది.

2. ప్రయత్నమనగా ఫలము పొంద నొనర్చు శీఘ్రవ్యాపారము. ఉదా : రత్నావళిలో సాగరిక యొనర్చు చిత్రలేఖనము మొదలుకొని వత్సరాజు సంగమో పాయము.

3. ప్రాప్త్యాశ యనగా ఉపాయాపాయముల వలన గలుగు అనిశ్చిత ఫల ప్రాప్తి. ఉదా : రత్నావళిలో వత్సరాజును బొంద సాగరిక వేషము మార్చు నుపాయము. వాసవదత్త కోపాపాయశంకచే ఫలము సందిగ్ధమాయెను.

4. ప్రాప్తి నిశ్చయమనగా అపాయము లేక నిక్కువముగా ఫలము చేకూరుట. ఉదా : రత్నావళిలో దేవిని దేర్చుటకంటె గొండొక యుపాయము లేదని యగ్గొనర్చుటచే సాగరిక జీవించునను నిశ్చయము.

---

12. ప్రసిస్యాత్కాచిన్మృణాల్యాది ర్విపక్ష ప్రచయేయది-యని ప్రకరీ పదము జీషంతము*

13. వైదిక శోభకు పూవులు అక్షతలును ఎట్లో ప్రసంగమున ఋతువర్ణనాదికము ప్రకరి యనబడును అని భావ ప్రకాశము-ఉదా: తరువాత మావి చిగురు జూచుచుఁ జేటి ప్రవేశించును. దాని వెనుక మరొకతె అనునది మొదలుకొని 'తెరలో' అనునంత వరకు.

5. ఫలాగమమన ఫల్రగముగా ఫలము సిద్ధించుట. ఉదా : రత్నావళీ లాభము. తత్కారణమున నుదయనునకు జక్రవర్తిత్వ లాభము.

అర్థప్రకృతులు అవస్థలును యథాక్రమముగా కలిసి (పతాకా ప్రకరులు వికల్పము) పంచ సంధు లేర్పడును.

| | అర్థప్రకృతులు | అవస్థలు | సంధులు |
|---|---|---|---|
| 1. | బీజము | ఆరంభము | ముఖసంధి |
| 2. | బిందువు | యత్నము | ప్రతిముఖసంధి |
| 3. | పతాక | ప్రాప్త్యాశ | గర్భసంధి |
| 4. | ప్రకరి | ప్రాప్తినిశ్చయము | విమర్శసంధి |
| 5. | కార్యము | ఫలాగమము | నిర్వహణసంధి |

## ప ం చ స ం ధు లు

ఈ అయిదు అర్థప్రకృతులును అవస్థలును యథాక్రమముగా కలిసి నాటకమును అయిదు భాగములుగా విభజించును. వానికే పంచసంధులని వ్యవహారము.

ఒక ప్రయోజనముతో కూడిన కథాంశములకు అవాంతర ప్రయోజనముతోడి సంబంధము సంధి యనంబడును. (1) ముఖ, (2) ప్రతిముఖ, (3) గర్భ, (4) విమర్శ లేక అవమర్శ, (5) ఉపసంహృతి లేక నిర్వహణ సంధులు.

## వి వ ర ణ ము

౧. అనేక వస్తువులకును రసములకును వ్యంజకమగు బీజము ఎచట ప్రారంభమగునో అది ముఖసంధి.

ఉదా : రత్నావళిలో– 'దైవమే ఎటనుండియేని గైకొనివచ్చి యభిమత వస్తువును గూర్చును'– అని యౌగంధరాయణుడు రత్నావళీ లాభమును సూచించుట యను బీజమును, కార్యసిద్ధి కాతడే పూనుకొనుటయను ఆరంభమును గలిసి ముఖసంధిగా నేర్పడియె.[14]

---

14. రోమియో అండ్ జూలియట్ నాటకమున కాప్యు గృహమునందలి విందు ముఖసంధి.

౨. ముఖసంధియందు నెలకొన్న ఫల ప్రధానోపాయము ఎచట కనబడీ కనబడనటుల కానిపించునో అది ప్రతిముఖసంధి.

ఉదా: రత్నావళిలో- సాగరిక చిత్రరువు వ్రాయుట యను బిందువు తత్ప్రయత్నము గలిసి ప్రతిముఖసంధి యేర్పడియె. ప్రథమాంకమున విత్త బడిన వత్సరాజు సాగరికా సమాగమహేతువగు ననురాగ బీజము సుసంగతా విదూషకులచే దెలియబడి చిత్రరువుం గనుగొన్న వాసవదత్తచే కొంచెము బైకి దేబడినది.[15]

౩. ప్రతిముఖ సంధియందలి ఫల ప్రధానోపాయమునకు తరచు వికాసము హ్రాసము అన్వేషణము ఎచట గలుగునో యచట గర్భసంధి. కొందరు ఫలమును గర్భమున ధరించునది గర్భసంధి యనుచున్నారు.[16]

ఉదా : రత్నావళిలో రెండవ యంకమున సుసంగత- "భర్ర హస్తముచే నిన్ను గ్రహించినను కోపము బాయమిచే నీవదక్షిణవు" అను నెడల వికాసమును, మరల వాసవదత్తా ప్రవేశముచే హ్రాసమును, మూడవ యంకమున- "తద్వార్తా న్వేషణముకై వసంతకు డింత యాలసించెనేమి ? అనునెడ అన్వేషణమును.

విదూ : "ఇహిహీ ! నా ప్రియవచనమును వినగా కలిగిన సంతసము కంటె నను గు జెలికానికి గౌశాంబీ రాజ్యలాభముకూడ నెక్కుడుకాదు." అనునెడ నుద్భేదమును, మరల వాసవదత్తా ప్రత్యభిజ్ఞానము వలన హ్రాసమును,సంకేతమున సాగరికాన్వేషణమును, మరల లతాపాశముచే బంధించుకొన్నపుడు ఉద్భేదమును గల ఈ ప్రఘట్టక మంతయు గలిసి గర్భసంధి.[17]

ఈ గర్భసంధియందు అర్థప్రకృతియగు పతాక యుండవలయును-అను నియమము లేదు.[18] ఏలయనగా ప్రతివస్తువునందును సహాయకథ యగు పతాక

---

15. ఉద్యానమునందు రోమియో-జూలియట్టుతో గలియుట ప్రతిముఖ సంధి.

16. దృష్టనష్టాన్వేషణము గర్భసంధియని కొందరు.

17. తన కిష్టము లేకున్నను తండ్రికడ జూలియట్ పారిస్ అనునాతని పెండ్లాడుదునని యొప్పుదల జూపుట గర్భసంధి.

18. పతాకాస్యాన్నవా-దశరూ. ప్రథమ-36.

(Sub-plot) యుండవలెనను నియమములేదు కదా! ఉపకథ యున్న చోట నీ సంధియం దుండదగును. అవస్థయగు ప్రాప్త్యాశ యీ గర్భసంధి యందుండును.

౪. ముఖ్యఫలోపాయము తొల్లికంటె నెక్కుడుగా స్ఫుటమై, శాపాది విఘ్నములచే వెలయునది[19] కాని క్రోధ వ్యసన విలోభనాదులచే అపాయము లేక ఫలలాభము చూపట్టునదికాని యవమర్శ (లేక విమర్శ) సంధి.[20]

ఉదా: రత్నావళిలో నాలుగవ యంకమున అగ్ని విద్రవ పర్యంతము. వాసవదత్తా ప్రసక్తిచే నిరపాయముగా రత్నావళీ ప్రాప్తి లాభము. ఇందు ప్రకరి యుండవలయు నను నియమము లేదు. పతాకకుబలె నిదియు సహాయకథ కావున అవస్థయగు ప్రాప్తి నిశ్చయ మిందున్న చాలును.

౫. బీజముతోగూడిన ముఖాది సంధులు వికీర్ణంబులై ప్రయోజ నైక్య ముంబొంది, ఎచట మహాప్రయోజ నైక్యముం బొందునో యది నిర్వహణ సంధి యనిగాని యుపసంహృత సంధియని గాని యనంబడును.

అర్థప్రకృతియగు కార్యము అవ్యవధియగు ఫలాగమము గలిసి యీ సంధి యగును.

ఉదా: రత్నావళి నాలుగవ యంకమున-

బాభ్రవ్యుడు- "అమాత్యా! నాకును ఈమె రత్నావళివలె దోచుచున్నది" అని మొదలుకొని తుదివరకును.[21]

ఈ యైదు సంధులకును అరువది నాలుగు అంగములు కలవు. అందు ముఖసంధికి అంగములు-

19. శాపాదులకు శాకుంతలాదులు నారయునది.

20. జూలియట్టు యొక్క విశ్వాసము రక్షింప నొనర్చిన యుపాయమువలన రోమియోకు గలిగిన మహాశ విమర్శ సంధి.

21. పారిస్, జూలియట్టు, రోమియోల మరణ ఘట్టకమంతయు నిర్వహణ సంధి.

1. ఉపక్షేపము : ఇది వృత్తబీజమును విత్తుట.
2. పరికరము : దాని బెంపొనర్చుట.
3. పరిన్యాసము : దాని సమ్యగ మొనర్చుట.
4. విలోభనము : ఆసక్తి వొడముటలు బీజగుణముల వర్ణించుట.
5. యుక్తి : బీజ ప్రయోజన సిద్ధికై యాలోచించుట.
6. ప్రాప్తి : బీజ సుఖాగమము.
7. సమాధానము : వీజభూత విషయమును సమీపించుట.
8. విధానము : బీజ సుఖ దుఃఖ కృతార్థము.
9. పరిభావన : బీజ విషయమునకు గుతూహలోత్తరమగు రసావేశము.
10. ఉద్భేదము : బీజార్థ ప్రరోహము.[22]
11. కరణము : బీజమును సఫలముగా జేయు నారంభము.
12. భేదము : సమూహమునుండి విడివడుట.[23] లేక ప్రోత్సాహము.

ఈ పంద్రెండంగములలో గురుతు వెట్టిన ఉపక్షేప పరికర పరిన్యాస యుక్తి సమానోద్భేదములారును ముఖ్యములు. వీనిలో ఉపక్షేప పరికర పరిన్యాసములు క్రమముగా నుండవలయును. అది సహజము. మిగిలిన వానిలో నీ నియమము లేదు.

## ప్రతిముఖ సంధ్యంగములు

1. విలాసము – రతి విషయ కేచ్ఛ.
2. పరిసర్పము – ఇష్ట నష్టానుసరణము
3. విధుత – తొలుత నొనర్చు ననునయమును జేకొనకుండుట.[24]

---

22. "బీజార్థస్య ప్రరోహో యస్స ఉద్భేద ఇతి స్మృతః. నాట్య 18-67 – "ఉద్భేదో గూఢ భేదనమ్" అని దశరూపకము.

23. ధనంజయుడు దశరూపకమున నాట్యశాస్త్రముకంటె భిన్నముగా 'భేదః ప్రోత్సాహనమతా' అని యర్థము చెప్పి, సరియగు నుదాహరణము నిచ్చినాడు. ఇదియ యుక్తమని తోచెడిని.

24. విధూతయని పాఠాంతరము.

4. తాపనము – ఉపాయ దర్శనము లేక అరతి.[25]
5. నర్మ – క్రీడార్థమగు హాస్యము.
6. నర్మద్యుతి – పరిహాసము వలన కలిగిన కాంతి.[26]
7. ప్రగమనము – ఉత్తర ప్రత్యుత్తరములచే ప్రేమను పెంపొందించుట.[27]
8. విరోధము – వ్యసన ప్రాప్తి.
9. పర్యుపాసనము – అనునయము.
10. పుష్పము – సవిశేష వచనము.
11. వజ్రము – ప్రత్యక్ష నిష్ఠుర వచనము.
12. ఉపన్యాసము – సోపాయ వచనము.
13. వర్ణసంహారము – చాతుర్వర్ణ్యమును యథా సంభవముగా వర్ణించుట.[28]

ఈ సంధి యందు పరిసర్ప తాపన పుష్పవజ్రోపన్యాసములు ముఖ్యములని దశరూపకము. పరిసర్ప ప్రగమన వజ్రోపన్యాస పుష్పములు ముఖ్యములని మందార మకరంద చంపు ప్రతాపరుద్రీయములు.

## గర్భ సంధ్యంగములు[29]

1. అభూతాహరణము – కపట వాక్యము.
2. మార్గము – తత్త్వార్థ కథనము.
3. రూపము – వితర్కవాక్యము లేక చిత్రార్థ సమవాయము.

---

25. శమనము అని పాఠాంతర. శమము అని దశరూపక. అరతి లేక శాంతియని వారి వివరణము. శర్మ అని మందార మకరంద చంపువు.

26. నర్మచ్యుతి అని పాఠాంతర.

27. ప్రగపణము, ప్రగణము, ప్రగయణ యనియు పాఠాంతరములు.

28. వర్ణ-పాత్రములు, సంహార-కలయికయని అభినవ గుప్తపాదాచార్యులవారు చెప్పి, రత్నావళిలోని రెండవ యంకమునందలి 'అదో - ఏమె' అని యుదాహరించిరి. ఇదియే యుక్తమని తోచెడిని.

29. గర్భ సంధికి అంగములు పదమూడని నాట్యశాస్త్ర సాహిత్య దర్పణములు. దశరూపక, మందార మరంద చంపువు ప్రతాపరుద్రీయములు పన్నెండంగములనే చెప్పుచున్నవి. మరియు కొన్ని యంగములు మారు పేరులతో కూడ నుదహరింపబడినవి.

4. ఉదాహరణము – ఉత్కర్ష వచనము.
5. క్రమము – భావదత్త్వోపలబ్ధి.
6. సంగ్రహము – సమాదానోర్థోక్తి.
7. అనుమానము – కారణముచే కార్యము నూహించుట.
8. ప్రార్థన – రతి హర్షోత్సవార్థాదుల బ్రార్థించుట.
9. క్షిప్తి – రహస్యార్థోద్భేదనము.
10. తోటకము – సంరంభవాక్యము.
11. అధిబలము – కపటాభి సంధానము.
12. ఉద్వేగము – రాజులు శత్రువులు దొంగలు మొదలగు వానివలన కలుగు భీతి.
13. విద్రవము – శంకా భయములవలన గలుగు సంభ్రమము.

వీనిలో అభూతహరణ – మార్గ – తోట – కాధిబలాక్షేపములకు బ్రాధాన్యమని దశరూపక మందార మరంద ప్రతాపరుద్రీయములు. ఈ యాక్షేపమను నది నాట్యశాస్త్రమునను సాహిత్య దర్పణమునను లేదు. ఆక్షేప మనగా గర్భబీజ సముద్భేదమని దశరూపకమునను, ఇష్టార్థోపాయానుసరణమని ప్రతాపరుద్రీయమునను గలదు.

## విమర్శ సంధికి అంగములు

1. అపవాదము – దోషమును వెలువరుచుట.
2. సంఫేటము – రోసపుఁ బలుకు.
3. (అభి)ద్రవము – గురువు నతిక్రమించుట.
4. శక్తి – విరోధ ప్రశమము.
5. ప్రసంగము – గురుకీర్తనము లేక కోపపు బలుకు.[30]
6. వ్యవసాయము – ప్రతిజ్ఞాహేతువు.
7. నిరోధము – ఉత్తరోత్తర వాక్యము.[31]

---

30. నాట్యశాస్త్రము చూ.

31. విరోధః–అని పాఠాంతర. 'విరోధనమ్' అని సాహిత్య దర్పణము. అందే దీనికి కార్యాత్యయోగమనము అర్థమని వ్రాయబడినది.

8. ప్రరోచన – కార్యార్థ సూచన.[32]
9. విచలనము – అనుమానార్థముతో గూడినది.
10. ఆదానము – బీజ కార్యోత్సాహ గమనము.
11. బాధనము – కార్యసిద్ధికై ఉవమానమును సహించుట.
12. వ్యాహారము – ప్రత్యక్షముగా జెప్పుట.
13. ద్యుతి – ప్రగల్భ వచనము.

వీనిలో అపవాద – శక్తి – వ్యవసాయ – ప్రరోచనా దానములు ముఖ్యములని దశరూపకము.

## నిర్వహణ సంధికి అంగములు[33]

1. సంధి – ముఖసంధిలో విత్తిన బీజమును ఫలప్రాప్తి కనుగుణముగా జెప్పుట.
2. విబోధము – ప్రధాన కార్యము వెతుకుట.
3. గ్రథనము – చేయవలయు కార్యముల నుపన్యసించుట.
4. నిర్ణయము – అభూత విషయము చెప్పుట.
5. పరిభాషణము – అపవాద వాక్యము.
6. కృతి – లబ్ధార్థస్థిరీకరణము.
7. ప్రసాదము – శుశ్రూషాదికము.
8. ఆనందము – కోరికలు నెరవేరుట.
9. సమయము – శోక నాశము.
10. ఉపగూహనము – అద్భుతప్రాప్తి.
11. భూషణము – సామదానాది వాక్యములు ప్రబలుట.
12. పూర్వవాక్యము – కార్యదృష్టి.

---

32. సంహారార్థముం జూపుట అర్థమని సా.ద. ఈ తెరగున పాఠాంతరములు, అర్థ భేదములు పెక్కులు.

33. ఈ సంధిలోని ముఖ్యాంగ పరిగణనము లాక్షణికులు చేయలేదు. సంధి గ్రథన కృత్యానంద పూర్వ వాక్య కావ్య సంహారములు ముఖ్యములని పరిగణింపవచ్చును.

13. కార్యసంహారము - వరప్రాప్తి.
14. ప్రశస్త - నృపాదిశాంతి.

వెరశి చేయుచో అరువది యైదంగములు అగుచున్నవి. కొందఱ మతమున నిర్వహణ సంధిలో ప్రశస్తియను అంగములేమి నరువది నాలుగంగములు. కొందఱు ప్రశస్తి యను నంగము కలదు, గర్భసంధిలో ప్రార్థనయను నంగము లేదు అను వారి మతముననును అరువది నాలుగంగములు. నాట్యశాస్త్ర సాహిత్య దర్పణములందు ఈ రెండు రూపముల కనురూపముగా నరువది యైదంగములు లిఖింపబడియె.

~~~
~~~

# 11. నేటి సాహిత్యము-కొత్త పోకడలు

సాహిత్యమునకు సంబంధించిన భావరాజ్యమునందు విధినిషేధములను శక్తి కొలది పాటించుచు ఇన్నాళ్ళబట్టి సులభముగా మనము పదప్రచలనము చేయుచు వచ్చుచున్నాము. మన సింహద్వారము ముందు పరాసు - ఎకాడమీ వంటి విచ్చుకత్తుల పారాలేదు. విక్టోరియా కాలపు సురుచి శుచిత్వములు మన కళా భవన ప్రాంగణమును గోమయ లిప్తము చేసి యుండలేదు. మన పెద్దలు మన దేశ - సంఘ పరంపరాగతమగు సంస్కృతి యొక్క చూపుడు వ్రేలి చూపున నడచిన బాట హక్కును చిన్నలందఱును స్వీకరించి వైరము లేకుండ నడచిరా దొడగిరి. శబ్దశిల్పులు, చిత్రశిల్పులు పాఠకులు దర్శకులు గాయకులు శ్రోతలు అందరును ఆ మార్గమునందే సౌందర్యము దెస యాత్ర యొనరించిరి. శాసనము నకు తిరుగుబా టిసుమంతయు సూచితము కాలేదు. నేటి కాలమున వస్తుతంత్ర దుశ్శాసనుడు సభా మధ్యమున కలాలక్ష్మి వస్త్రాపహరణ మొనరించుట చూచి కొందరు సిగ్గుచే తల వాల్చుకొనుచున్నారు.

ఇది శిష్టులపట్ల పోట్లాటకాదు. ఇదొక నవీన భంగిమము. జీవనరహస్యము నెదుట, ప్రపంచసమస్య నెదుట ఒకకొత్త attitude ఈ భంగిమమున రూఢత కలదు, పౌరుషములేదు. బర్బరత కలదు, వీర్యములేదు. క్షుధ కలదు, సంయ మము లేదు. ఇట్టి రచన చేయువారి నందఱను ఏకీకరించు సంజ్ఞను నిర్దేశింప వీలులేదు. వీరేమి చెప్పదలచిరో, వీరి కంఠమునుండి క్రొత్తవాణి వెలువడు చున్నదా లేదా యని చూచినచో ఏమియు తేలదు.

"ఇందు క్రొత్తదన మేమియులేదు, ప్రాచీన సాహిత్యమునం దిట్టి రచ నలు వేలకొలది కలవు"- అనిగాని, లేక యుండవచ్చుననిగాని, వీరి చూపు కేవ లము అట్టి విశేష ఘటన మీద మాత్రమే అనుచోగాని ఇటులు ప్రత్యుత్తరము చెప్పవలసియున్నది- 'ఇది కేవలము చూపుగాని, Emphasis మాత్రముగాని కాదు; వీరి సర్వస్వమిదియే; ఒక పెద్ద మహాకావ్యము నడుమ మానవ జీవన

లీల యెటులు తరంగితమై నడచినదో అట్టి జీవన లీలాసముద్రమున అహల్య చిత్రాంగద తార మొదలగువారి ఘట్టములు సగము మునిగిన ద్వీపములవలె ఇంచుమించు కానిపించకయే యుండును. కాని నేటి వస్తుతంత్రోపాసకులగు రసస్రష్టలకు అట్టి వస్తువే క్రొత్తగా కనుగొన్న మహాదేశము. వారి కల్పనాశక్తి యంతయు దానిచుట్టును నురుగులతో లేచుచున్నది. కాని పౌరాణిక ఆఖ్యాయికలో వారికి తృప్తి సనదు. వారు ఆధునిక సంఘము పేరిటి వస్తుతంత్రులు. మరి వారి వస్తుతంత్రతత స్త్రీ పురుషుల యౌవన ఘటితమైన మసాలాతో పొగిచి ఒకానొక రూప మేరుపాటుచేయు త్రొటుపాటు. ఈ వ్యాపారము మిగుల ఆధునికము. ఈ శ్రేణికి చెందిన లేఖకులు 'మేము రియలిస్టుల'మని చెప్పుకొనుటకు కొంచెముయి నను వెనుదీయరు. పైగా అటులు చెప్పికొనుట గౌరవమని అనుకొందురు.

రాజనీతి క్షేత్రమున ఇంగ్లీషువారు మనలను మనపారిపార్శ్వక అవస్థలను గుఱించి మాటిమాటికి హెచ్చరించుచుందురు 'మీరు రియాలిటీనుండి విచ్ఛిన్నులై దూరముగా పోవుచున్నారు సుడీ' యని. ఈ రియాలిజము ఈ వస్తు తంత్రతత ఇంగ్లీషు వారికి వెన్నతో బెట్టినదైనను, వారి సాహిత్యమునందు రిరంసావృత్తి యొక్క కేంద్ర స్థానమును పరివేష్టించిన భావావిష్కృతి రూపమగు ఏ చేష్టయు యువకుల నెవరిని విద్రోహులుగా చేసి పెట్టి యుండలేదు. విక్టోరియాకాలపు కథ కాదిది. రాబ్‌వే బాల్‌జాక్ ప్లిబియాన్ జోలా మొదలగువారి గ్రంథములు అతికష్టము మీద ఇంగ్లండులో ప్రచారమునకు వచ్చెను. ఎడ్వర్డు జార్జి కాలపు సారస్వతులు క్రొత్తక్రొత్త భావతరంగములలో మునిగిరి. కవులు నూతన ఛందస్సుతోను, శిల్పులు నూతన రేఖా విన్యాసముతోడను సౌందర్యమును స్ఫుటీకరింప ప్రయత్నించిరి. కాని వారెవరును విద్రోహస్వరముతో నూతన యుగవాణిని వినిపింపలేదు. ఇది గత మహాయుద్ధమునకు పూర్వకాలపు మాట. వారి సాహిత్యమున చుంబనాలింగనముల ఇంగితము కలదు కాని ఐడియలిస్టెవ డును వ్యథపడడు.

భావనాగరకత, సంస్కార కుశలతలతో కూడిన సంఘమునందు హృష్ట పుష్టులయిన యువకులను హఠాత్తుగా ఏదేనొక కావ్యముగాని నవలగాని కేంద్ర చ్యుతుల గావింపలేదు. విచారణ చేయక దుర్నీతి ప్రవాహమున మునిగి అనా

చాక స్వైరవిహారములకు తావొసగరని మనము నమ్మవచ్చును. ఇట్టి నమ్మకము మనకు వేరు తన్నుకొని యున్నది. దీనికి విశేషకారణము కలదు. రామాయణ-మహాభారత-భాగవతముల బాల్యమునందే విని, పిదప సొంతముగా చదువుకొనిన వారు విద్యావంతులలో ఉండరు. అందుకొంత పచ్చిశృంగారమున్నను గ్లానిలేదు. సమగ్ర మహాకావ్యము ఒక విపుల స్పందనముతో వారి సమగ్ర స్థితిని ఉద్బోధించుచున్నది. వారి చరిత్రమీద పడు రేఖాపాతము చెరగిపోదు. ఉత్కటమగు ఈ లాతి 'రియాలిజము' వారిని వ్యథితుల గావించునుగాని సహజముగా మార్గభ్రష్టుల గావింపలేదు.

ఇపుడొక వైపరీత్యము కాననగుచున్నది. ఇపుడిరువదేండ్లు దాటిన వారిలో కొలది మంది మాత్రమే భారతాది పరిచితికలవారు. కళాశాలలలో వారు టాబ్లాయిడ్ పరిమాణముగా మింగి యుందురుగాని సంపూర్ణముగా గట్టి పరిచయము వారికుండదు. రస పరిచితి వారి కంతగా ఉండదు. భక్తి-స్నేహము-ప్రేమ-వీని సౌభాగ్యమునుండి వారి నెవరు వంచితుల నొనరించిరి? పురాణ శ్రవణము హరికథా శ్రవణములకు బదులు సినిమా బయస్కోపులు వీరి భావమును ఏవెసకు మప్పుచున్నవి?

తెలుగు సాహిత్యమునం దీ క్రొత్త వికాసము, ఈ అత్యంతాధునిక రియాలిజము కొలది యేండ్ల క్రిందనే కలిగినది. సుమారు పది పదియేనేండ్లలోపుదై యుండవచ్చును. మనకు రుషియా, జర్మనీ, నార్వే, స్వీడన్, ఫ్రాన్స్ ఇటలీ, ఇంగ్లండు సారస్వతములు ఒక పెట్టెగా గానబడినవి. పిన్నవారల కుతూహలము పెరిగెను. ఒక యింద్రజాలము వారి ముందు కానబడెను. "ఇబ్సేన్ ఏమి అనెను?-" చాలకాలమునుండియు పురుషుడు స్త్రీని కొల్లగొట్టుచు వచ్చుచున్నాడనియా?'- "స్ట్రిండ్ బర్గ్ ఏమని బదులు చెప్పెను?" 'తల్లిగా కూతురుగా భార్యగా స్త్రీ చాలకాలముగా పురుషుని కొల్లగొట్టుకొనుచు వచ్చుచున్నదనియా?- "ప్రియో కర్మక్షేత్రమునందు స్త్రీ పురుషుల ద్వంద్వ సంబంధమున ఏమి చెప్పగోరును?"- బర్నార్డు షా నేషన్ పత్రికయందు తాను దుర్నీతి పరాయణుడగు వ్రాయసకాడనని యేల వాకొనెను?- యూరోపు ఆధునికతా విజయఢక్కను ప్రయోగించుచున్నమాట నిజమనియు, అది తాత్కాలికపు

ఉ త్తేజనావశము వలన గాదనియు, అది చిరంతనమగు నొక సత్యమనియు, ఒక eternal verity దాని జెండామీద నిగనిగలాడునటులు వ్రాయబడె ననియు అందరు అనుకొనిరి. ఆధునిక యూరోపు సత్యమునందు యూరోపు సాహిత్యమునందు ఏ భావము వికసించెనో అది కేవలము వారి సంఘసామగ్రి. దానిలో చిరంతనమగు సత్యమెంత వట్టు కలదో, అది సర్వత్ర అన్ని సంఘము లందును ప్రయోజ్యమే. కాని దాని నాలోచించి చూచుటకు కాల మేడది ?

ఒక మార్కిన్ లేఖిక ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ ఎతిక్స్ పత్రికలో స్త్రీ జాతిని మూడు తరగతులుగా విభజించెను. 1. తల్లి (Mother Woman) ఈమెకు జననీత్వము పరమానందము, చరమ లక్ష్యము. 2. కామిని లేక రమణి, (Lover Woman) ఈమె ప్రేమ సర్వస్వ, పెండ్లి చేసికొన సమ్మ తించును గాని తల్లియగుట కెంతమాత్రము సమ్మతింపదు. 3. క్లీబ తరుణి (Neuter Woman) ఈమె పురుష సంబంధమున సంపూర్ణముగా అచేతన. ఈమెకు రిరంసావృత్తి (Sex appeal) లేదు. మన సంఘధాతువునందు లేని యిందలి నూతనాంశము మన యాడువారికి కొరుకబడదు. సతీత్వమునకును శరీర మునకును ఏమియు సంబంధములేదని మనవారు కొందరు వ్రాసిరి. పెండ్లిని తీసి వేయుట అపాతరమణీయమేకాని సతీత్వమునకు మాత్రము క్రొత్త అర్థము చెప్పవలయును - అని కొందరు వ్రాసిరి. ధర్మపత్ని కన్న వారవనిత వేయి రెట్లు పొడ్డది - ఇరువురును శరీర విక్రయ మొనరింతురుకాని వారవనిత ఇచ్చ వచ్చెనో శరీర విక్రయ మొనరింపకుండ నుండగలదని కొందఱమతము.

ఈ మతములనే పెక్కురీతులుగా మనవారు రచించుచున్నారు. పాశ్చాత్య భూఖండమునం దీనడుమ పెద్ద ప్రళయమై పోయెను. ఈ మతములవలన రాష్ట్రమునందును సమాజము నందును భావవిపర్యయము అయితీరవలెను. ఈగడబిడలో నీతులు రీతులు మొదలగునవి తారుమారగుట వింత కాదు. పూర్వ మేది దొడ్డదనియు, మిగుల ఆవశ్యకమనియు తలపబడెనో ఆరెండును లేకుండ బోయెను.

రుష్యా జపాను యుద్ధ మారంభ మాయెను. యుద్ధమునకు ముందొక జపాను వారకాంత రష్యా సేనాని పడకటింటి నుండి సంకేతములతో ఛాయా

చిత్రములు వ్రాసి టోకియోకు పంపు ఏర్పాటు ఒనరించెను. అది యిపుడు పెద్ద యితిహాసమునకు సామగ్రి అయెను. పతితల మాహాత్మ్యము పెరిగిపోయెను. ఆమె అపాంక్తేయ యనుకొనుట అనుచితము. ఈరీతిగా మాటలు వినబడదొడగెను. ఇటులయినను ఏ సాహిత్యమునం దయినను సతీత్వ దేహతత్వ సంబంధమున ఏ స్త్రీయు ఆనాటికి క్రొత్త వ్యాఖ్యాన మొనరించుట నాకు తెలియదు. ఏదేశమున సీతా సావిత్రీ దమయంతుల కథలు ప్రవాహరూపమున వచ్చుచున్నవో ఆదేశపు వారే ఇపు డిట్టి క్రొత్త వ్యాఖ్యలు కావించుచున్నారు.

ఇది ఇటులుండుగా మరియొక వ్యాపారము పాశ్చాత్యుల జీవతత్త్వ మూలక మగు ఆలోచనా ప్రవాహమును కదిలించెను. 1901వ సాలున హార్మోన్ తత్త్వము బుద్ధిమంతులచే గ్రహింపబడెను. జీవతత్త్వగవేషణము క్రొత్త పద్ధతిమీద బయలు దేర దొడగెను. ఫ్రాయిడ్ అను మనశ్శాస్త్రజ్ఞుడు 'మానవుల చిత్తవృత్తి యంతయు మదనానంద మూలకము' – అని వ్యాఖ్యాన మొనరింప ప్రయాస పడెను. పాశ్చాత్య భూములలో ఫ్రాయిడ్‌కు పలువురు శిష్యులు వెలసిరి. సమాలోచకులును బయలుదేరిరి. విక్టోరియా కాలమునందు బహిరంగముగా ఆలోచించుటకు సంకోచము కలిగించు విషయములు సర్వసాధారణముగా అందఱకును బహిరంగముగా ఆలోచింపదగిన వాయెను. ఈ ఫ్రాయిడ్ సిద్ధాంతము పైవారిని కలత పెట్టెను. వానిలోని కొన్ని విషయములు మందుమాత్రల పరిమాణముగా భారత దేశములోని పత్రికలలోనికి వచ్చెను.

నేటి పాశ్చాత్య సంఘము నందలి ఆచార వ్యవహారముల ద్వంద్వములో గల తత్త్వమును ఇబ్‌సెన్, బ్రియోస్ట్రిండ్‌బర్గ్, బెర్నార్డుషా గ్రహించి, సాహిత్యమ నందు విద్రోహస్వరమును వెలువరించిరి. మనదేశము నందలి భావుకులు దానిని మన అతీతభావధారయందే కనుగొనిరి. కొందరు దానిని కనుగొనక దానికే జయగీతములను పాడుచున్నారు. కనుగొనియు కొందరు అదియే మంచిదని చుట్టును సాహిత్యమును అల్లుచున్నారు. ఈ సాహిత్యమునందు ఆదిమ జంతువు మహాకాయముతో కనబడగ..దు. అది కామమే జీవనము యొక్క కామ్య వస్తువని -ప్పగలదు

నేటి సాహిత్యపు రియాలిజము పశ్చిమ దేశమున ఆధిపత్య మొనరించు చున్నమాట నిజమేకాని అయికేన్ ఏమైనను చెప్పగాక, నేటికిని వీరి నీతి (morality) నుండి శిల్పము (art) సంపూర్ణముగా విచ్ఛిన్నము కాగోరలేదు.

మనదేశమున మనము మన యువకుల కనుల యెదుట జీవన పరమార్థము నకును అంతరార్థమునకును సంబంధించిన విషయములు విశదముగా కానవచ్చు నుపాయములను ఏమయినను చేసితిమా ? త్యాగమాహాత్మ్యము, పరాక్రమ గౌరవము, బ్రహ్మచర్య ప్రభావము మొదలగు వాని పరిచితి వీరికి గలదా ? ప్యారిస్ సభ్యపద్ధతి, పరాసువారి శిక్ష, దీక్ష ఈ మొదలగునవి మనకు అనుకర ణీయమా ? వారి కల్చర్ మన కల్చర్ ఒక్కటియా ? కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయా ధ్యాపకుడు ఆక్సన్ అనునాతడు తన శిష్యులను కొందఱను ప్యారిస్ తీసికొని వెళ్ళి "ఇక్కడ మిమ్ములను విడుచుచున్నాను, ఇచట శిక్షా ప్రణాళిక మీరు మీయంతట తెలిసికొనుడు, వీరి సంఘము నందలి వ్యవస్థలు ఇంగ్లాండు సంఘపు ఆచారములతో కలియకున్నను తెలిసికొనుటలో అశ్రద్ధ వహింపవలదు. వెక్కిరింపవలదు"- అని చెప్పెను. ఇంగ్లీషుజాతి సంతానమింతవరకు లక్ష్య భ్రష్టము కాలేదు. వెనుకటి కాలము చందమున నేడు మన దేశమున శ్రేష్ఠోపా ధ్యాయిక లేదు. అది యెన్ని శతాబ్దుల క్రింద అస్తమించెనో మన కెరుకయేలేదు. మనము మనలను మరచి పోయితిమి. గురువు చేతిలో దివ్వెలేదు. శిష్యులు లక్ష్య భ్రష్టులు ! పరాపర విద్యలను గురించి యెవరికిని పట్టుదలలేదు. అంతయు కంగారు. కామలోకమే కామ్యలోకమయిన యెడల ఏ ఉపాధ్యాయుడే శిష్యునకు 'అదికాదు' అని చెప్పగలడా ?

జర్మనీకి స్వతంత్ర సభ్యతా ధార కలదు. ఎన్ని విప్లవములు వచ్చినను ట్యూటన్‌జాతి తన 'కల్చర్'ను మాత్రము పోగొట్టుకొనలేదు. అదియే దానికి ఏక మాత్రావలంబనము. అచటనే దాని యథార్థమగు స్వప్రకాశము. గత మహా ప్రళయమున అది విపర్యస్తము కాలేదు. ఒజ్జలచుట్టును శ్రద్ధావంతులై శిష్యులు మూగిరి. వారి శిక్షాభిత్తియు బ్రహ్మచర్యముమీద కట్టబడకున్నను కామలోకము వారికి కామ్యలోకము కాలేదు. వారొక జ్యోతిర్మయలోకమును వెతుకుటకు తిరుగుచున్నారు.

స్వదేశీ-ఆందోళనము వలన మనదేశములోని పిన్నలలో పెద్దలతో కొలది కాలమునుండి నవజాగరణము కలిగినది, కలుగుచున్నది. తెలుగుజాతి శతాబ్దుల తరబడి నిద్రించుచున్న నిద్రనుండి మేలుకొనుచున్నది. మనము పశ్చిమాభి ముఖులము కావలయునో అంతర్ముఖులము కావలయునో తెలిసికొనవలసి యున్నది. అనేక యుగములనుండి వచ్చుచున్న- "ఆత్మానమ్ విద్ధి = నిన్ను నీవు తెలిసి కొనుము" అనుమాట ఆసియా ఖండపు Whispering galleries అంతరాళము నుండి ప్రతిధ్వనించుచున్నది. కాని "నాయమాత్మా బలహీనేన లభ్యః" - బలములేని వానికి ఆత్మ దొరకదు.

మనము బలహీనులమని ఏల యనుకొనవలెను ? మనము మన ఆత్మీయ తను వెల్లడించుకొనగల సాహిత్యసారము లేదా ? అపక్వప్రేమయు, విరహ మును, హృదయభేదమును, నాయక నాయికా తిరస్కారములును, పరస్పరము మృత్యుకుండ ప్రవేశమును, విధి బహిష్కృతమైన సంయోగాకాంక్ష యొక్క బెంగయును వెరసి Sex Appeal వినా మనకున్నది ? దీనికి నేటి (Fashion) ఆధునిక లేఖకులు మాత్రమే కారకులు కారు. ఇట్టివానినే చదువువారును, పోషించువారును కలరు. ఈ ప్రాత లిటులే కొన్నాళ్లు నడచుచో వారును వీరును దివాలా తీయుదురు. ఇందెచటను పౌరుష చిహ్నము ఉండదు. జీవనముయొక్క ప్రాణ వస్తువు యొక్క మాయ యిది !

పదియేండ్ల వెనుకనుండి కథాప్రధానములగు ఆంగ్ల పత్రికలను చూచి నచో అందొక ప్రధాన వస్తువును కనుగొందుము. చాలకథలు ఆంగ్లో-సాక్జన్ జాతి జయగాథలు ! అందు ఒక యింగ్లీషు యువకుడుగాని, యువతిగాని తెలి యని యొక ద్వీపమునకేగి తమ పరాక్రమమును ప్రకటించి నటులు రచనలు ఉన్నవి. 'ఆఫ్రికాలో బర్బర జాతుల రాజొకడు కలడు. అతనికడ కొక ఆంగ్ల యువకుడు వెళ్లి వేలెత్తగనే అతడు తలవాల్చెను'- మొదలగు విషయములు ఉన్నవి.

ఇంగ్లీషు కథలలో Sex appeal లేకపోలేదు. ఉన్నది. ఇపుడు పెరి గియు నుండవచ్చును. కాని అందున్న మిగులు అంశముల ఆకర్షణ శక్తి అల్పము కాదు. ఒక పత్రికా సంపాదకుడు ఓపెన్‌హామ్ అను నతనినిగూర్చి

'కథాసాహిత్య మంతటిలో ఏ చరిత్రను సృజింపగలుగుచో గౌరవ పాత్ర మగును ?' అని ప్రశ్నించెను. అత డిటులు ప్రత్యుత్తరించెను- "షర్లాక్ హోమ్సు: నేటి సాహిత్యపు మదనోత్సవమునందు ఇతడు రచించిన చరిత్రలు అన్నిటికంటె బాగుగా నుండును."

జర్మనీయందు తలసూపిన యువకులపై నందఱ దృష్టులు పడుచున్నవి. భావికాలము వారియెడ ఆశగొన్నటులు తోచుచున్నది. ఈ దేశముయొక్క విశిష్ట సభ్యతా రేఖనుండి జారి పోయినచో ఈ యువకులు రేపటి ఇతిహాసము నెటులు నిలువబెట్టగలరు ? ఈ భంగిమ, ఈ attitude యువకులందఱయు యథార్థ స్వత్వము కాకుండుగాక ! సరస్వతీ పాద పీఠమున గూరుచుండి భాషాలాపన మొనరించుట మిక్కిలి తక్కువ వ్యాపారముకాదను ఇంగితము పెరెరిగి యున్నచో ఎక్కువ చెప్పబనిలేదు.



# 12. శిల్పము కొఱకే శిల్పమా?

శిల్పము కొఱకే శిల్పమా? ఇంతకును ఈ సూత్రమేమి చెప్పును? దీని అంతరార్థ మేమి? ఈ సూత్రము ప్రచారమునకు వచ్చిన మొదటి దినములలో నే ననుకొను నట్టులు లక్షణానుగుణమగు రచనమే శిల్పసర్వస్వ మని దీనికి అర్థమయి యుండెనా? అటులగుచో నీవేమి వ్రాసినను ఏమి గీచినను ఏమి చెక్కినను ఏమి పాడినను ఆ వ్రాత సుందరముగను ఆ చిత్తరువు యోగ్యము గను, ఆ చెక్కడము చక్కగను, ఆపాట ఇంపుగను ఉన్నచో చాలునని నిర్వచించినట్లు అగును. ఈ నిర్వచన మొకానొక విధముగా నిక్కమే యనిపించును. ఆ యర్థమిది- ఏ విషయమైనను తత్తచ్ఛిల్ప వ్యవస్థ ననుసరించి సరిగా ప్రకటితమును ప్రతి ఫలితమును అభివ్యక్తమును ఆయెనేని దానజేసియే ఆ విషయము శిల్పపరిశ్రమమునకే న్యాయమగు నుపకరణ మని యంగీకృతమగు చున్నది. అనర్గళమునగు నీ యంగీకారము అతి సాధారణములనియు హీనములనియు దలపబడు అరటిపండ్లు, అంట్లకుండలు, గాడిదలు, గోంగూర మొదలగునవి కాక నైతిక ప్రస్తావాలకును దార్శనిక సిద్ధాంతములకును సాంఘిక పరిశోధనలకును శిల్పరాజ్యమున పౌరత్వాధికారమును ప్రసాదించగలదు. ఇంతియకాక పంచవర్ష ప్రణాళికకును స్థానిక సంస్థా కార్య చర్చలకును పత్తనములందలి కలుషజల నిష్కాసనోపాయములకును మరియు సరికొత్తగా నడపదగిన విద్యుత్ యంత్రాలకును ఒక పెద్ద హోటలుకును లేక అత్యాధునికములయిన బోల్షెవిక్ పద్ధతికిని శిల్పరాజ్యమున ప్రవేశ మిప్పించవచ్చును. ఏలనగా సలక్షణ రచనయే, రూప నిర్మాణమే శిల్పసర్వస్వము కావున కవియు చిత్రకారుడును మొదలగు నా యా శిల్పులు తాము చేసికొనిన విషయములలోని కష్టములను దాటి గట్టెక్కిరా లేదా! తాము కావించిన సృష్టిని సజీవముగా వెలువరించినారా లేదా యన్న ప్రశ్న మాత్రమే యుదయించును. ఇయ్యెడ అరటిపండును మాత్రమే గ్రహించి షా వ్రాసినను త్రోసిరాజు చేయుద మనుట యుక్తిసహము కాదు. శిల్ప నైతిక, సాంఘిక, రాజకీయ విషయములను గ్రహించినను ఆ విష

యములను రసాభినివేశముతోపాటు విహరింపచేయుట ముఖ్యోద్దేశముగా పెట్టుకొనుడు. గావున అధమపక్షము శిల్పి లక్ష్యము కేవలము శిల్పమే యని సీవన వచ్చును. అత డిటు లొనరించిన శిల్ప నియమముల్ల నెరవేర్చి పరినిష్ఠితముగా రూపమును నిర్మించి దాన సౌందర్యమును పరిపూర్ణతను ఏల ప్రకటింపజాలడు ? నైతికులును అర్థశాస్త్రవేత్తలును తరచుగా తరచుగా శిల్పులగుచుందురు. ఉదాహరణములకు ప్లేటో, షెల్లీలు కలరు. ఈ మతము నాధారపరచికొని శిల్పి కావించిన సృష్టి శిల్పసాఫల్యముననే మంచి శిల్పమని నిర్ణయింపబడును గాని వస్తువును బట్టి నిర్ణయింపబడదు. కావున నైతిక ప్రస్తారములు యోగ్యతచేతగాని తత్త్వాన్వేషణములచేతగాని అతని ఉత్సాహావేశములచేతగాని శిల్పము మహత్తరము కాదని సీవనవచ్చును.

కాని యీ సిద్ధాంతమంతయు కొంతదూరము వరకే సత్యము. శిల్పము లేక రూపకల్పనము ప్రకాశమున కుపాయము మాత్రమే. రమణీయములగు శబ్దముల నుపయోగించుటకే ఎవడును గ్రంథములను రచింపడు. మంచి రేఖలను మంచి రంగులను చూపుటకే ఎవడును చిత్రములను వ్రాయడు. ఇంక నేమనిన ఈ యీ యుపాయములవలన ఒక విశేషమును ఆవిష్కరించుటకుగాని వ్యక్తము చేయుటకుగాని శిల్పి ప్రయత్నించును. ఆ విశేషమేది ? దీనికి మొదటి ఉత్తరము సృష్టి, సౌందర్యావిష్కరణము. శిల్పము సౌందర్యావిష్కరణమునకే, సౌందర్యమును వ్యక్తము చేయుటకే. సౌందర్యావిష్కరణమును బట్టియే శిల్పపు విలువ. అందముగా నవతరింప జేయుట కాస్పదమైన దెల్లయు శిల్పి కుపకరణమే. ఈ ప్రపంచమునందు శారీరక సౌందర్యమేకాక నైతిక సౌందర్యమును మానసిక సౌందర్యమును ఆధ్యాత్మిక సౌందర్యమును గలవు. ఇటులున్నను శిల్పము కొఱకే శిల్పము - అను సూత్రమునకు రసీభవమునకు యోగ్యతకల సౌందర్యమునకే రూపొసగ వలయుననియు సౌందర్యరసానుభూతి కద్భుతగులు దాని నెల్ల విడనాడ వలయుననియు అర్థమని యింకను సీవు పట్టుపట్టవచ్చును. జీవనతత్త్వమునే తెలుపు నుద్దేశముతో జీవనముతోగాని వస్తుతత్త్వమునే తెలుపు నుద్దేశముతో వస్తువుతో గాని సత్త్వమును శివమును అగు ఆత్మతత్త్వమునే తెలుపు నుద్దేశముతో ఆత్మతో గాని శిల్పమున కేమియు సంబంధము లేదుకాని ఈ వస్తువులు రసముఖముగా సౌందర్యమున కెంతవఱ కుపయోగించునో అంతవరకే

వీనికిని శిల్పమునకును సంబంధము. ఈ హేతుబలము నిపుడు పంచవర్ణ ప్రణాళిక లను నిత్యోపదేశములను దర్శనపరామర్శలును శిల్పరాజ్యమునుండి బహిష్కరింప వచ్చు ననుటకు మంచి ఆధారము దొరకుచున్నది. అయినను సౌందర్య మన నేమి ? అని విచారింపవలసియే యున్నది. సౌందర్యము కేవలము వస్తువులో ఎంత యున్నది దాని తెలిసికొను చేతనలో ఎంత యున్నది. శిల్పి సాధారణము లును, హీనములను భీభత్సములును అగు విషయములనుండి రసమూల్యము గల ఒకానొక వస్తువును సంతతమును గ్రహించి తన ఉపకరణములగు శబ్దముల వలనను రేఖా రాగములచే తీర్చిన ఆకారము వలనను దానిని విజయానందముతో వ్యక్తము చేయుటలేదు.

యోగలబ్ధ మగు నొకానొక చేతన కలదు. వస్తువు లన్నియు కేవల మాధ్యాత్మికములే యగుటవలనను మరియు నవి తమ తమ ప్రత్యేక సత్తాచేత నలరూప రేఖా గుణ సామర్థ్యములచే గూఢముగ విశ్వము నధిష్ఠించిన ఆత్మము వ్యక్తము చేయుటవలనను యోగికి యోగాలబ్ధములగు నాచేతనలో వస్తువులన్నియు సుందరములుగనే కన్పించును. బాహ్య ఇంద్రియములకు అందముగా కన్పించు వస్తువు సాధారణ రసదృష్టికి అందముగా కన్పించక పోవచ్చును. అది అట్లగు టయు తఱచు సంభవించుచుండును. మఱియు యోగి ఆ వస్తువునందు కనుగొన జాలని ఒకానొక విశేషమును అంతఃపురుషుని ఆత్మనేకాక స్థూలనేత్రముల కందని రేఖలను రంగులను ఐక్యములను అభివ్యక్తిశీలములగు చిహ్నములను చూచును. అతడు తనలోగల విశేషము కొంత వస్తువులో జేర్చి దానికి రూపాం తర మొసగునని నీవనవచ్చును. శిల్పియు నిటులు కొంచెము చేయునుగాని వాని దారివేరు. యోగియు శిల్పియు దేనిని చూతురో అది వస్తువునందే కలదు. వారి దృష్టి రూపాంతరమును సాధించును. ఏలనగా అంతరత మేమైన వస్తువును వ్యక్తము చేయగలదు. అది కనబడు రూపము వెనుకనున్న ఒకానొక విశేషమును ఆవిష్కరించి చూపగలదు.

ఈ రీతిగా నిత్యసిద్ధమగు ఐక్యమును ఆవిష్కారము చేయగల దృష్టితో చూచిన యెడల శిల్పి కన్ని వస్తువులును విషయము లగును. లేక కానగును. ఏలనగా సార్వత్రికమగు నీ సౌందర్యమును శిల్పి అన్ని వస్తువులందును చూచి

ఆవిష్కారము చేయగలడు. ఈ విషయము చూచినచో మనము ప్రళయము చేకూర్చు ఒకానొక మర్యాకాదార్యములో మరల పడిపోవుచున్నాము, ఏలనగా ఇచ్చటకూడా ఇది హద్దు అని ఒకగీటు గీయలేరు. నాకరములోగాని దానిని బొడుచు నీటిలోగాని మందుమాకుల ప్రకటనలలోగాని కొళాయిలోగాని ఆవిష్కరించవచ్చునిగాని అనుట కష్ట మనిపించును. కాని నేటి శిల్ప సాహిత్యములు ఈ చందపు పనులనే చేయుచున్నటులు కనుపట్టును. ఈ పయి సిద్ధాంతమును కొంచెము విపులీకరించినచో శిల్పి నీతినుండి కానీ సంఘ సంస్కారమునుండి కానీ రాజకీయ ఆందోళననుండి కానీ సౌందర్యము నుద్బుద్ధము చేయు సమర్థుడయి యుండవలయును అని గాని లేక యిచ్చవచ్చినచో అధమపక్ష మీ విషయము లన్నియు శిల్పి కుపాదేయములు కావచ్చునని గానీ అంగీకరించవలసి ఉండును. ఇటు లంగీకరించియు శిల్పి నీతినిగానీ సంఘ సంస్కారముగానీ రాజకీయోద్దేశ్యముగానీ ప్రప్రథమముగా పెట్టుకొనక సౌందర్యము మీదనే చూపు నిలిపి తీరవలయును అనే షరతును ఎవరును పెట్టజాలరు. ఏలననగా ఈ ఉద్దేశ్యము చొప్పున శిల్పి తన లక్ష్యము దెస నడచుచు సౌందర్యము నావిష్కరించి రస విరుద్ధములగు విషయములు ఉన్నను తన పనివానితనము నుపయోగించి ఒకానొక సృష్టిని చేయగల్గిన అతనిని మనము కోరగల దెల్లయు నేమనగా నీ ఉపక్రమ మేది అయినను నీవు సౌందర్య స్రష్టవు కావలయుననియే, శిల్ప మనగా సౌందర్యావిష్కారము. సాక్షాత్ సౌందర్యప్రకాశము. నిషేధముచేగానీ సంకోచముచే గానీ దీని కెక్కుడు చెప్పవలసినది కానబడదు. ఇచట చెప్పదగినది మరియొకటి కలదు. అది పెద్ద భేదమును తెచ్చిపెట్టును. విశ్వ సౌందర్యమును తిలకించు యోగి చూపునకు అన్నియు సుందరముగనే కన్పడును కాని అవి అన్నియు ఒక సమతలమునకు రావు. ఈ విశ్వ సౌందర్యమునందు సోపాన క్రమమున ఎక్కువ తక్కువ లున్నవి. వస్తువునందు తనకు దావికసించు చేతనానందముల విభూతినిబట్టి ఈ సౌందర్యము ఒకదానియం దెక్కువగను మఱియొక దానియందు తక్కువగను నెలకొనుట మనము చూచుచున్నాము. వస్తువులన్నియు దివ్యములే కాని కొన్ని మరికొన్నిటి కన్న దివ్యతరములు. అటులే శిల్పదృష్టియందును ఎక్కువ తక్కువలున్నవి. షేక్స్పియరు డగ్‌బెరీ, మాల్వోలియోలను రూపకమునం దెట్టి స్థితికి తీసికొని రావలయునో అట్టి స్థితికి

తీసికొని రావచ్చును. మాక్‌బెత్‌నుగానీ, లియర్‌నుగానీ సృజించుటలో నతడెంత శక్తిగల శిల్పియో తెలియును. కాని షేక్‌స్పియరు ప్రతిభకు సాక్ష్యముగా డగ్బెరీ, మాల్వోలియోలే యుండి, మాక్బెత్ లియర్లు లేకుందురేని అతడిప్పటంత నాట్యశిల్పియు స్రష్టయు కాగలడా? వివిధ వస్తువులందుగల విభిన్న సంభావనలచే విపులమగు భేద మేర్పడినది. అప్పెలో చిత్రించిన ద్రాక్షపండ్లు తమ్ముదినవచ్చిన పక్షులను భయపెట్టెను, కానీ ఫిడియా చిత్రించిన క్రీస్తుబొమ్మ ద్రాక్ష పండ్లలో కంటె నెక్కుడు రసవస్తువు కలదు. మరియు సౌందర్యాధారను నిండుగా వ్యక్తము చేయుటవలన అధికతరమగు చేతనాసంపదయు కలదు. కావుననే అధిక తరమగు ఆనందమును కలదు. ఈ ఇరువురు శిల్పులును ఈ రెండు విషయములును సౌందర్య మూలస్వరూపమును ఇంచుమించుగా సమానమును పరినిష్ఠతమును అగు రసముచేతనే రంజించి ఉందురు.

దీని కారణ మిది, శిల్పమునకు కేవలము రూప నిర్మాణమే ఎటు లుపాదానముకాదో కేవలము సౌందర్యము కూడా నటులే ఉపాదానము కాదు. శిల్పమనగా రూప నిర్మాణమే. సుందరాకారమే కాదు. సౌందర్యావిష్కారమే కాదు. ఇక నే మనిన రసాత్మకమగు దృష్టికిని నిర్దోషమగు సృష్టికినిగల విధుల ననుసరించిన చిదాత్మ ప్రకాశమని యనవచ్చు. ఏలయనగా శిల్పమునందున్న దొకరసమద్భావయే కాదు. దీనియందు జీవనమునకును మనస్సునకును ఆత్మకును విలువకలదు. శిల్పి తన చిదైశ్వర్యమునకే కాక యీబ్రహ్మాండమును పిండాండమును సృజించిన పర చిదైశ్వర్యమునకును ఆకారము నావిష్కరించు చున్నాడు. వేదాంతములదృష్టిలో ఈ చిత్స్వరూప మంతటను సమానమయి యున్నను, దాని ప్రకాశము అన్ని వస్తువులందును సమానముకాదు. ప్రాకృత జనులలో భగవత్ప్రకాశము తక్కువ, విభూతులలో ఎక్కువ. కొన్ని ఆధారములం దాత్మాభివ్యక్తి కవకాశము లెక్కువ. కొన్నింట తక్కువ. ఇంతియకాక చేతనలో కూడా ఎక్కువ తక్కువలు గలవు. దాన చేసి శిల్ప రచనలో ఆకారగతమగు సౌందర్యపు విలువయందుగానీ గొప్పదనము నందుగానీ భేదము దొరయుకున్నను శిల్పరచనలోని వస్తువులందు భేదము కలుగుచున్నది. హోమరు మానవుల బాహ్య జీవనమునుండి సౌందర్యము నుబికించి నచట నాగిపోయెను. షేక్స్పియరు ఇంకొక

మెట్టెగిరి హోమరు కందని ప్రాణమయమగు ఆత్మను, ప్రాణమయమగు శక్తులను ప్రాణమూల్యమును ఆవిష్కరించెను. జీవనమునకును, తద్గతములుగు సకల వృత్తులకును సంబంధించిన గొప్పభావములును గొప్ప ఆదర్శములును వ్యాస వాల్మీకులలో ఊరుచుండెను. ఇవి హోమర్ షేక్స్పియరుల దృష్టి పరిధి కావలివి. మరియు ఈ భావములకును ఈ ఆదర్శములకును ఆవలగూడ మరొక తెగ సత్యములు గలవు. ఇవి మిగుల లోతైనవి. జడాజడములకు వెనుక సత్పదార్థమును దాని శక్తి సముదాయమును కలదు. ఇవి అన్నియు శిల్పమునకు విషయములు కాగలవు. శిల్పి యింత కంటె నెక్కుడు సిరితోడను గాంభీర్యము తోడను రాణింపగలడు. వీనిని కనుగొని తొంటి మహాకవుల ప్రతిభతో వీనికి వాణీమూర్తి నొసగగల కవి కేవల సౌందర్య సృష్టి విషయమున వారికంటె గొప్పవాడు కాక పోయినను అతని శిల్పమునందలి పదార్థముల విలువయు అతని ఎరుక విలువయు పూర్వ సృష్టికంటె గంభీరమును ఉచ్చైస్తరమును పూర్ణతరమును కావచ్చును. "శిల్పము కొరకే శిల్పము" లేక సౌందర్యము కొరకే శిల్పము అను వీని తలదాగినది మరియొకటి ఇచట గలదు. ఇవి అన్నియు సౌందర్య సృష్టి కత్యావశ్యకములగు ప్రధానోపకరణములను చెప్పను. ఇట్లు చెప్పుట కొన్నిపట్ల నుపయోగకరమే. కానీ యీ ప్రధానోపకరణములకంటె వేరైన విశేష వస్తువొకటి శిల్పమును నిత్యపరివర్తనచే పరోచిత మొనరించుచున్నది. ఏలనగా వ్యష్టిరూపమున కానీ సమిష్టిరూపమున కానీ ఏతదతీత రూపముగా గానీ అన్నీ భగవంతుని గుప్తమగు దివ్యత్వమునుగానీ, వ్యక్తమగు దివ్యత్వమును గానీ క్రమక్రమముగా అధికముగను, అధికతరముగను వ్యక్తమొనరించును. ఇదియే శిల్పమునకు ఎడతెగని పని.

ఇటులు మూటిచే శిల్పము సమగ్రమగుచున్నది. ఒకటి ప్రకాశక్షమమును లేక సౌందర్యావిష్కారము. రెండు వస్తుమూలమునందలి సత్పదార్థపుటభివ్యక్తి లేక ఆత్మాభివ్యక్తి. మూడు పై రెండంగములును వేనికి వాహనములో సృష్టి పటువగు నాచిదానందముల అభివ్యక్తి, ఈ మూటిని కలిపి చూచినచో ఉభయపక్షములకు సామరస్యము కలిగి దారి దొరకగల దనుకొందము. శిల్పము శిల్పము కొరకే అనుట నిశ్చయమే. ఏలనగా శిల్ప మొక దృష్టిలో అనపద్యమగు రూపము సౌందర్యాభివ్యక్తియు. ఇంతియకాక శిల్ప మంతః పురుషునికొరకు

ఆత్మకొరకు. మరియు నీ అంతఃపురుషుడు సౌందర్యద్వారముననేని నిర్మింప దలచినచో వాని యన్నింటియు ప్రకాశముకొరకు ఈ ఆత్మ ప్రకాశమున శిఖరమునకు గొనిపోవు సోపానములు కలవు. శిల్పమును అతి విశాలమగు పరమ వైశాల్యమున అభిముఖముగా నడిపించుటయే కాక దాని నూర్ధ్వ శిఖరము నుండి ఊర్ధ్వతర శిఖరమునకును, ఊర్ధ్వతమ శిఖరమునకును దీసికొని బోవలసి ఉన్నది. ఇదియే మన శిల్పి - ఆధ్యాత్మిక - ఉభయ సాధనల ప్రయాసము.

[మూలం: అరవిందులు]

~~~
~~~

# 13. ఆనందత్రయము

## లౌకికానందము

మన మొక కొండనుగాని కోరిన వస్తువునుగాని చూచి సంతసింతుము. పసిపాపల పలుకులుగాని కోయిలల యెలుగులుగాని విని సొగియుదుము. అగలు పొగలు గాని పూతావిగాని మూర్కొని మురియుదుము. తేనియలు క్రోలిగాని భక్ష్యములు నారగించిగాని తనియుదుము. మలయ మారుత స్పర్శవల్ల గాని మిత్రుల యాలింగనము వల్లగాని మే మరతుము. ఈ సుఖమెల్ల జ్ఞానేంద్రియములవల్ల.

కర్మేంద్రియములచే గూడ నిటులే మనకు సుఖము కలిగించు వస్తువులు విషయములు కాగా మన మనుభవించునది విషయసుఖము లేక లౌకికసుఖము.

ఇంద్రియముల గుండ మనస్సునకు విషయములతో గలుగు సంబంధమునకు వృత్తి యనిపేరు. విషయముల కింద్రియములతో సంబంధమున్నను మనస్సు వేరొకచో నుండెనేని విషయజ్ఞానమే కలుగదు. ఇక సుఖమెట్లుకలుగును? దీనివల్ల సుఖ మనుభవించునది మనస్సని తేలినది.

అన్ని వస్తువుల వలనను అందరకును సుఖము కలుగదు. జంతుభేదము వలన కొన్ని వస్తువుల వల్లనే కొందరికే సుఖము కలుగును. 'తలకొక బుద్ధి; నాల్కకొక రుచి' అని సామెత. మరియు విషయము లేనిదే లౌకిక సుఖములేదు.

"గోవిందా యనుకొంచూ గొబ్బరి తినుకొంచూ
నారాయణా యంచూ నమలి కొంచూ-"

అను పాటలో చెప్పినటులు సుఖసాధనమగు ఆహారమును ప్రీతితో నమలి భుజి తు మనుకొందము. నమలుటతోపాటు ఆహారము స్వాద్యమై నమలిన కొలదే సుస్వాద్యమై రసమగుచున్నది. అపుడు రసముగాని సత్త్వముచే

పదునైన చిత్తమునందు స్వాత్మానందము ప్రతిబింబించును. విషయోపభోగము నం దెల్లెడ నిదే రీతి.

వేరొకరీతి - విషయలబ్ధి కలిగి కోరిక తీరగా చిత్తవృత్తి సాత్త్వికమై ఏకాగ్రత చెందును. అపుడు దానియందు స్వాత్మానందము ప్రతిఫలించును. ఈ ప్రతిబింబానందమే విషయానందము. అనుభవ సమయమునందు చిత్తవృత్తికిని చైతన్యమునకును సంబంధ ముండును. గాన ఆ సుఖము అంతఃకరణ వృత్తితో గూడిన చైతన్య స్వరూపము. తాతగారి మాటలలో నిది ఇటుల చెప్పబడినది :

"ఎందే డెందము గందళించు రహిచే, నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందుం గుంభగత ప్రదీప కళికా శ్రీదోప నెందెందు బో
కెందె నింద్రియముల్ సుఖంబుగను ............"

ఈ పద్య మింతవరకే ఉపయోగించుకొనవలెను. ఈ సుఖము "పంచకోశ వివేకముచే మిథ్యాత్మది యగునా కాదా? ఇది అంతర్బుద్ధి నూహింపుమా" అని ఆ వరూధినికే వదలును.

సుఖ మందరకును అనుభవమే. కాని దానికి లక్షణము చెప్పమన్న చెప్పుటకు తట పటాయించవలెను. 'యదర్థమ్ సర్వమ్, యచ్చ నానార్థమ్, తత్ సుఖమ్' అని సుఖమునకు లక్షణము. మన ప్రవృత్తి యంతయు దేనికొరకో అది సుఖము. ప్రతివాడును ఏ పని చేసినను అది సుఖముకొరకే కదా? మరియు ఏది మరొకదానికి ఉపాయము కాదో అది సుఖము. అనగా సుఖమే ఉపేయము - అనగా ప్రాప్యము. దానికి మరియొక ప్రాప్యము లేదు.

ఈ విషయ సుఖాతిశయమును ముక్తిగా మోసగించుచు తెనాలి రామకృష్ణకవి -

"కీలారమున నుండి పాలింటి కేతేర
బహుధాన్యములు చేలబండి యొఱగ
యెడనెడ బెండ్లిండ్లు వడుగులు వొడవు
గృతార్థులై యర్థించు నర్థు లలర
బరిచారికా కోటి పనిపాటు పాటింప
జుట్టంపు సందడి నెట్టు కొనగ

> గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన
> సత్య నిష్ఠకు దన్ను సాక్షి గోర
> నిత్య నైమిత్తికములు నిర్నిద్రబుద్ధి
> నాచరించుచు హరిభు క్తమాత్మభార్య
> భక్తినిడ భుక్తి గొనుచున్కి ముక్తిగాని
> నిదుర వంటిది రాతివంటిదియు గాదు."   [పాండురంగ : 5 - 216]

అని ఒక కరణము సుఖమో - దేశపాండ్యా సుఖమో గొప్ప ఆనందముగా చెప్పెను. (ఇది గౌణాత్మ). తైత్తిరీయ మిటుల చెప్పెను-ఆరోగ్యము, బలము, దార్ఢ్యము, చదువు-ఇవికల పిన్నవాని కీ పృథివి యెల్ల యున్నచో నాదవు ఆనందము ఒక మానుషానందము. ఈ ఆనందము గూడ ఆరోగ్యాదులలో నేవి పోయినను పోవును గాన అల్పము. దాననే- 'యోవై భూమా తత్ సుఖమ్, నాల్పే సుఖ మస్తి'- అని సనత్ కుమారుడు-అనగా ఏది పరిపూర్ణమో అది సుఖము; అల్పము సుఖముకాదు. కాన దీని తెలియు ముందు కావ్యానందము లేక రసానందము కనుగొందము.

పూర్వమొక పండితుడు - 'ఇంత మంది పండితులు రసమును గూర్చి తలా యొకరీతిగా తట్టెడు గ్రంథములు వ్రాసిరి. నేను సులువుగా చెప్పెదను వినుడు-

"పాలు గోరెడు మార్జాల పరివృఢుండు." అని చెప్పెనట. 'ఇందు రస మేమి కలదండీ ?' అని అడుగగా 'పాలకు మించిన రస మెక్కడ నున్నదయ్యా?' అని అనెనట. 'సరే, పద్యమునకు నాలుగు పాదము లుండవలెనే?' అని అడుగగా పిల్లికి లేవటయ్యా' అనెనట. కాగా రస మీమాంస పిల్లి పాలు కావలసి వచ్చెను. అది యటుండె :

మనకిప్పుడు తీరికయు ఓపికయు లేదు గాన కావ్యాంగణములో గాక నాటకరంగములో ప్రవేశింతము. పుష్పోద్యానములో అదుగో ఇరువురు. ఒకడు యువకుడు. ఓక్తు యువతి. ఆమె తళుక్కను కీజూపునే అతనిపై తూపుగా విసరెను అతని నెమ్మేను పనసకాయ యాయెను. వీరు వలపు గొన్నారని మన కొకరు పాఠము చెప్పవలెనా ?

అరుగో - ఇరువురు! కన్నులలో నిప్పులు! కంఠములలో పిడుగులు! వారరుగో మల్ల సరచుచున్నారు! వీరు క్రుద్ధులని వార్తా పత్రికలు చూడవలెనా? నిట్టూర్పులతో విరిసిన వెంట్రుకలతో కన్నీటితో మింటి మోమై ఇతర మెరుగని ఒక డిడుగో! ఇతడు శోకదగ్ధుడని రాలకు రప్పలకు కూడ తెలియును. ఇతడింకొకడు. విప్పుకనులు. ప్రసన్న మగుమోము. రెప్పార్పని చూపు. ఆనందాశ్రువులు. పులకలు. అనిశ్చలత. ఇతడు విస్మయావిష్టుడు కాడా? మేన చెమరుతో కదలు కనీనికలతో, ఎండిన ఓష్ఠములతో, గద్గద కంఠముతో వడవడవణకుచు ఇదె పోవువానిని చూచి - మనమాట వినిపించు కొనకున్నను 'భయము వలదని' ఆశ్రయ మీయకుందుమా?

వీడుగో! ఒక మీసము పైకి, మరొకటి క్రిందికి! పాగాపై రొట్ట, మోకాలి సొట్ట! ముక్కుమీద బొట్టు, ఎగుడు దిగుడు కట్టు! ఇట్టి ఇతనితో మనము శ్రుతి కలుపకున్న నవ్విపోరా!

అదె బూడిద బుస్సను నేల! గద్దలు గోళ్ళకు మెలివైచిన ప్రేవులను ముకుపట్టుకారులతో లాగుచున్నవి! కాలుచున్న తలనుండి మెదడు నురుగువలె వెలి కుబుకుచున్నది! ఈస్థితి చూచి నీవేమగుదువో! ఓహో! ఎట్టి జుగుప్స నీకు!

సముద్రమువలె గంభీరతా రామణీయకము లితనిలో! ఎదిరిని చూచి నీకీ భ్రాంతి యేల? నేటికేని మంచి దారికి రా! రానిచో ఇదె నాభుజము కోరలులేని త్రాచు' అని అనుచున్నాడు. కర్తవ్యార్థములం దితడు పట్టిన పట్టు విడువడని ఉడుములకును తెలియును!

ఓహో! మనుష్య రూపమగు నిదెక్కడి తేజము! గోచిపాతరాయడు. ఏకాగ్రదృష్టి! పిల్లలు వెంటబడుచున్నారు! ఇతనికి చేతులు తమంత తామే మోడ్చును!

పరుల మనోవికారములకు స్పందించుట అనగా హృదయ సంవాదము చెందుట మానవస్వభావము. దీనికి సంస్కారము బీజము.

శబ్దశ క్తియు అర్థశ క్తియు మనకు తెలియు ననుకొనుడు. భావనా శ క్తియు తలకట్టుగా కలదు. ఇట్టి మనము ఒక కవి చక్కని సన్నివేశములచే నాయికాదులను, కటాక్షపాతాశ్రుపాతాదులను, హర్షచింతాదులను వర్ణింపగా నటీనటుల వాగంగ సత్త్వాభినయద్వారమున వినుచు కనుచు నున్నాము. వీనిలో నాయికా నాయకాదులు, వారి కటాక్షాదులు, ఉద్యానాదులు, మన హృదయమున ప్రతిబింబించుటతోపాటు రస మంకురించెను. అనగా మనలోని రాగాదివాసన మేలుకనెను. ఇపుడు సీతారాములో శకుంతలా దుష్యంతులో వారి వారి కటాక్షాదులో అశ్రుపాతాదులో కార్యకారణములతో తమతమ సంబంధమునకు చెల్లు చీటీ ఇచ్చిరి. ఇపుడు వీనిని విద్వాంసులు విభావము లనియు అనుభావములనియు నందురు. రాగాది సహకారులగు హర్షామర్షాదులు విభావానుభావములచే వ్యక్తము లగుచో వ్యభిచారు లందురు. మనము వీనిని విభావనము అనుభావనము సంచా రణమును చేయుదుము. ఇవి అలౌకిక వ్యాపారములు. వీనికే సాధారణ, చర్వణ, స్వదన, భావన, వ్యంజన అని పేళ్ళు. మన మిపుడు రసానందములో మునిగితిమి. ఇపుడు నాయికాదులందును, వారిచేత లందును, చిత్తవృత్తులందును పరత్వముగాని మమత్వముగాని పరకీయత్వముగాని మామకీనత్వముగాని లేదు. మన యీ రసానుభవవేళ విభావాది త్రయము రత్యాది విశిష్టమై మిళితమై అభిన్నమై యున్నవి. ఇచట నీ ఉద్దాలకుని మాట గమనింతము- 'తేనెటీగలు నానా పుష్పముల నానారసముల కేకరసత్వ మొదగూర్చుచున్నవి. ఆ తేనియలో ఇది మావిపూరసము, ఇది మాలతీ పూరసము, అని వేరుపరుపలేము'- యథా సోమ్య మధుమధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాగ్ం రసాన్ సమవహారం మేకతాగ్ం రసం గమయన్తి! తే యథా తత్ర న వివేకం లభన్తేఽ ముష్యాహం వృక్షస్య రసోఽస్మ్య ముష్యాహం వృక్షస్య రసోఽస్మీతి.(ఛాం-69).

ఈ రాగ క్రోధ హర్షా మర్షాదులు వాసనలు. ఇవి సాక్షి భాస్యములు. లౌకికములగు రాగక్రోధ హర్షా మర్షాదులో చిదాభాస భాస్యములు. కావున వాని లోని క్రోధామర్షా ద్యనుభూతిలో క్రోధాదులే గాని ఆనందము లేదు. లౌకిక రాగ హర్షాదులందేని కావ్యానందము వంటి ఆనందము లేదు.

మంచి నాటకము చూడ మొదలిడుచో-ఇతర వృత్తులు పోయి, హృదయ సంవాదము కలిమి నాయికా నాయకులయు గాని, నాయక ప్రతి నాయకులయు గాని అనురాగ క్రోధములచే మనలోని అనురాగ క్రోధములు మేలుకనును. ఇచట మనము ప్రేమించుటకు స్త్రీలును, ద్వేషించుటకు శత్రువులును లేరు. కవి పుణ్యమా యని స్త్రీలు, శత్రువులు మొదలగువారు లేకుండనే కవి ప్రవేశ పెట్టిన బొమ్మలమాటున మనలోని రాగ క్రోధ హాస్య శోక భయోత్సాహ జుగుప్సా విస్మయ నిర్వేదాదు లుద్బుద్ధములై మేళకర్త లగుచున్నవి. ఇవి మాత్రమే ఏల? రసానుభవ విశ్రాంతి ప్రధానముగ ఇటనే గనుక. ఎంత వింత! ఈ యలౌకిక వ్యాపార మావరణమును తొలగించినది. ఇపుడు స్వప్రకాశమగు ఆత్మ సాక్షియై యీ అలౌకిక రాగాదులను ప్రకాశింపజేయు చున్నాడు. అలౌకికమగు ఈ రత్యాదికము సాత్త్వికము గాన స్వస్వరూపా నందముతో కలిసి మనకు గోచరమైనది. భక్ష్య భోజ్య చోష్య లేహ్యములను నమలి ఆస్వాదించి రసముగొని ఆనందించినట్లు, విభావాదులచే అంకురితమైన అలౌకికమైన యీ రత్యాది స్థాయి భావములను అనుభావ సాత్త్వికభావ సంచారి భావములతో నమలి - భావన చేసి చర్వణ మొనరించి రసముగొని మన మానందించుచుంటిమి.

ఈ రసము జ్ఞాప్యమును, కార్యమును, నిత్యమును అనిత్యమును, భావము కలదియును లేనిదియును, వర్తమానమును భూతమును భవిష్యమును సవికల్ప నిర్వికల్పక జ్ఞానవిషయమును, పరోక్షమును ప్రత్యక్షమును కాదు. లోక మందిట్టిది లేదు. పోనిండు. అసలిది లేదందమా? కలదనుటకు సహృదయు డెల్ల సాక్షి. కాన నిది అలౌకికము. విషయానందము కంటె భిన్నము. విషయ ములు లేకుండ నీలోని రాగాదులను నీవు చర్వణ మొనరించి సాక్షివై ఆనందించు చుండుట లేదా? ఇక చాలు.

ఈ యానందము గూడ చర్వణా సమనంతరముననే అంతమగును గాన నిదియు నల్పము. కాన నిపు డాత్మానందమును అన్వేషింతము.

# ఆత్మానందము

బృహదారణ్యక మీ యాత్మానందము నెంతో సుందరముగ నిరూపించెను. యాజ్ఞవల్క్యుడు అమృతత్వమును గోరు మైత్రేయి కిటులు చెప్పెను- 'పత్నికి పతి ప్రియుడందురు. దానికి కారణము పతికాడు! మరి యేమి? పతిలో పత్ని తన స్వరూపము చూచుకొనును. గావుననే పతి ప్రియుడు. ఇటులే పతికి పత్ని ప్రేయసి అని అందురు. దానికి కారణము పత్నికాదు. మరియెవరు? పత్నిలో పతి తన స్వరూపమును చూచుకొనును. కావుననే పత్ని ప్రేయసి. కాగా తేలిన దేమి? 'ఆత్మయే ప్రియ తమ' మని. ఆత్మసంబంధము లేనిచో నేదియును ప్రియము కాదు-అని. ఆత్మప్రీతి కొక కారణము లేదు. విషయప్రీతికో సుఖము కారణము. అది ఆనందము యొక్కయే ప్రకాశము.

విశ్వమెల్ల తన రూపరాశిచే మన ఆత్మలోని ఆనందమును మేలుకొల్పును. ఈ రూపరాశిలో మనము విశ్వాత్మనే చూడబడయునది. కావున యీ రూపరాశి ఆత్మయొక్కయే విశ్వరూపము.

ఏ ఆనంద మీ విశ్వమూలమునందో ఆ యానందమే మన హృదయార విందమందు: 'కోహ్యే వాన్యాత్ కః ప్రాణ్యాద్యదేష ఆకాశ ఆనందో నస్యాత్'- హృదయగుహయం దానందము లేనిచో ఎవడు ఊర్చును? నిట్టూర్చును? అనగా బ్రతుకును? అని తి త్తిరి. ఆ యానందమే ఆత్మ. ఇటు లాత్మయే పరమాత్మ.

ఆత్మ ఆనందము కావుననే దాని నిరతిశయప్రీతి! మన కానందము వలయును! ఏల? మన స్వరూపము ఆనందము కావున.

ఆత్మని విశ్వరూపము విశ్వప్రీతికి నిదానము. విశ్వప్రీతి కాత్మప్రీతి పునాది. కాన ఆత్మ అందరికంటె అంతర తరము. దాన ఆత్మ పుత్రుని కంటె, విత్తముకంటె, మరి యన్నింటికంటె ప్రియతరము. ప్రియతరము కావుననే ఆనందము.

మనకు బాహ్య విషయములతో సంబంధము కలిగినపుడు ఆ యాయీ వస్తువుల జ్ఞానము చిద్రూపమని తెలియవచ్చును. ఆత్మ ఆనందరూప మేని ఈ చిత్తవృత్తులలో చిద్రూపము తెలిసినటులు ఆనందరూపము ఏల తెలియదు?

మన యింద్రియము లేకైక గుణగ్రాహులు. కన్నే రూపము గ్రహించును. చెవియే శబ్దము నెరుగును. అటులే చిత్తము సత్త్వవృత్తిచేతనే ఆనందమును పొందును. చిత్తమునందు సత్త్వరజస్తమస్సులు చక్రనేమి క్రమముగను, అక్రమముగను తిరుగుచుండును. సత్త్వవృత్తి కాదాచిత్కము. అది మాత్రమే ఆనంద గ్రాహకము. రజోవృత్తి మలినము. కాన ఆనందాంశము తిరస్కృతము. సత్త్వవృత్తిలో ఇచ్ఛలేదు. అది శుద్ధము. కాన అందు చిదానందైక్యము గోచరించును. 'రసోవైసః రసంహ్యే వాయం లబ్ధ్వాఽ నందీభవతి-అని తిత్తిరి. అనగా-అతడు రసమే జీవుడు, రసమును పొందియ కదా ఆనంది యగుచున్నాడు.

సారము లేక స్థిరాంశమే రసము. దాని గ్రోలియే మన మానందింతుము. విషయసుఖమునం దిది విశ్వజనీనము.

నిద్రలో విజ్ఞానఘనోపాధికుడగు ఆనందమయుడు సూక్ష్మములగు అజ్ఞాన వృత్తులచే ఆనంది యగును. అపుడతడు సాక్షియు భోక్తయు. కావుననే అతడు- 'సుఖముగ నిద్రించితిని. ఏమియు నెరుగను' అని మెలకువ గని అనును- 'సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞాన ఘన ఏ వానందమయో హ్యానందభుక్ చేతో ముఖః' (మాం-15)

ఆవరణము లేమియే ఆనందము. ఆనంద సంవేదన మిందు లేదు. అదియ ఆనందస్వరూపము. కాగా ఆవరణము లేని ఆత్మ ఆనందము. కావున ఆత్మనే ఉపాసించవలెను.-' ఆత్మానమేవ ప్రియ ముపాసీతు-' (బృ- 48).

ఇటులుకాక' నేను వేరు. దేవుడు వేరు'- అని తలచు వా డజ్ఞుడు. వాడు దేవతలకు పశువు- అన్యోఽసావన్యోఽహ మస్మీతి, న స వేద, యధా పశురేవం సదేహినామ్ (బృ. 1-4-0) ఇటులు ఆత్మయే బ్రహ్మము. ఆత్మా నందమే బ్రహ్మానందము. అఖండమగు ఆత్మాకార చిత్తవృత్తి కలుగుటయే ఆవరణనాశము. ఆ చిత్తవృత్తి క్రమక్రమముగా ఆత్మహత్య చేసికొనుడు నిర్మలము నిస్తరంగమును అగు ఆనందము. విషయలబ్ధి వల్ల చిత్తము సాత్త్వికమై ఏకాగ్రత చెందగా, అందు ప్రతిబింబించిన స్వాత్మానందమే విషయానందము లేక లౌకికానందము.

విషయములవల్ల చిత్తము సత్త్వము చెంది ఏకాగ్రత పొందగా అందు ప్రతిబింబించిన స్వాత్మానందమే లౌకికానందము; కవి వ్యాపారముచే ఏకాగ్రమైన చిత్తమున మేలు కనిన రాగాది వాసనలతో కలిసి భాసించు శుద్ధచైతన్యానందమే రసానందము, లేక కావ్యానందము; చిత్తవృత్తులు భస్మీభూతములు కాగా ఉన్మన్యవస్థలో శేషించిన ఆనందమే ఆత్మానందము.



# 14. రాష్ట్రభాష

ఉత్తరదేశములందలి భాషలు సంస్కృతవికారము లగుటవలనను దక్షిణ దేశపు భాషలందు సంస్కృత పదములు చాలినంత యుండుటవలనను, హిందీ రాష్ట్రభాషయగుట కర్తవ్యమని గాంధిజీ 1917వ సాలున చెప్పెను.

ముస్లిములను గూడ కలిపికొని వచ్చుటకు హిందూస్తానీ రాష్ట్రభాష కావలయుననియు దానిని నాగరలిపిలోగాని ఉరుదు లిపిలోగాని వ్రాయనగుననియు పిదప పిదప వారికి తోచెను. వారిప్పటికిని ఆ మాటయే చెప్పుకొనుచు వచ్చుచున్నారు.

దేశ భాషల కపకారము కాని రాష్ట్రభాష మనకు కావలయును. అది హిందూస్తానీ. ఇది 12 కోట్ల వ్యవహారములో నున్నది. మరియు నిది లక్షలకొలది కోట్ల కొలది ఇతరులకును అర్థమగును అని నెహ్రూజీ వ్రాసెను. (Congress Political and economic series No. 6' 37).

దాక్షిణాత్యులలో పట్టాభిజీ ప్రకాశంజీ, రాజాజీ, మొదలగు వారును జాతీయ ముస్లిములును, హిందూస్తానీ రాష్ట్రభాష కావలయునని అనిరి; నేటికి అనుచున్నారు. ఇన్నాళ్ళనుండి వీరు చేసిన ప్రయత్నమంతయు రాజకీయ పరిజ్ఞానమునకును హిందూ ముసల్మానుల యైక్యమునకును అని వేరుగా చెప్పబనిలేదు.

అగస్ట్ 15 – '47 తరువాత :

ఆంగ్లభాష స్థానమును దేశభాష లాక్రమింపవలయు ననియు హిందూస్తానీ రాష్ట్రభాష కావలయు ననియు గాంధీజీ యిపుడు చేయెత్తి చెప్పుచున్నాడు.

ఇంగ్లీషును మెల్లమెల్లగా ఉపసంహరించు కొనవలయును గాని వెంటనే రద్దు చేయరాదని మీర్జా ఇస్మయిల్‌జీ అజాద్ యును సలహా ఇచ్చుచున్నారు.

'హిందీ రాష్ట్రభాష కావలయు'నని శ్రీ గోవిందవల్లభులు రాహుల సాంకృత్యాయనులు, మున్షీత్యాది మహాశయులు గాంధిజీకి విరుద్ధముగా వక్కాణించుచున్నారు.

'హైస్కూలు చదువులును కాలేజీ చదువులును హిందీలో జరుగవలయు నని రీవాలో ఆల్ ఇండియా ఎడ్యుకేషనల్ కాన్‌ఫరెన్సు తీర్మానించెను.

సి. పి. బీహార్ గవర్నమెంట్లు హిందీని స్వరాజ్య భాషగా అంగీకరించెను.

భాషా చక్ర మిటులు గిర్రున తిరుగుచున్నది. బహుభాషలు గల మన దేశములో రాష్ట్రభాష ఒకటి కావలయుననుట నిర్వివాదము. అగస్ట్ 15-'47 తరువాత హిందీయే రాష్ట్రభాష. షుమారు 20 కోట్లు దీనిని మాట్లాడుదురు. హిందూ ముసల్మానులకు దీనివలననే ఐక్యము కలుగవలెను. దీనిని నాగరిలోనే వ్రాయవలెను అని శ్రీ మున్షీ మొదలగు వారి అభిప్రాయం.

## హిందూస్థానీ వాదము :

"హిందూదేశము నాది" అనుకొని ఉరుదు మాట్లాడు నేషనల్ ముసల్ మానులకున్ను, ఉరుదు మాట్లాడలేని బహుభాషలగు హిందువులకున్ను ఐక్య మున్నది. హిందూస్థానును పకీస్థానుగా చేయదలచి హిందీగానీ, సంస్కృతము కానీ మాటలాడినను అట్టి ముసలిమానులకు హిందువులకు ఐక్యత ఉండదు. కావున దేశాత్మబోధమునకు భాషైక్యమే గతి కాదా !

దేశాత్మబోధము లేనివారు భాషనుకూడా ద్వేషింతురు. కావున హిందూ ముస్లిం ఐక్యత కొరకు హిందూస్థానీ కావలయుననుట హేతువుకాదు. ప్రపం చంలో అందరకును అందరితోడను ఐక్యత కావలెను. ప్రపంచంలో అందరు సంస్కృతిలో పరిచయము కావలెను. అట్టి హృదయములు వేరు, దాని కుపాయములును వేరు.

అరబీ మాటలుకానీ పారసీమాటలుకానీ, సంస్కృత మాటలుకానీ ఎక్కు వగా వాడరాదు. అని అసాధ్యమగు ఒక షరతు హిందూస్థానీ వాదములో కలదు.

మొగల్ కోర్టులు హిందీలో ఉన్న సంస్కృత పదములను కంట వత్తిడుకొని తొలగించుచూ రాగా ఉస్మానియా యూనివర్సిటీ, ఆలిండియా రేడియోల కృషితో ముసలిమానుల ప్రకృత ఉరుదూలో హిందూ సంస్కృతిని తెలుపు పదములు తక్క మరియొక్క సంస్కృతపదము దొరకదు. ఉత్తరదేశము నందలి హిందీ పత్రికలలో (సంస్కృతిని తెలుపు అరబీ పారశీ పదములు తక్క) అరబీ పారశీ పదములు విరళములు.

హిందూస్థానీ రాష్ట్రభాష యగుచో ముసలిమానులు అరబీ, పారసీ పదము లెక్కువగను హిందువులు సంస్కృతపదము లెక్కువగను ఉపయోగించి తీరుదురు. కావున ఉన్నత విద్యలకు అరబీ పారసీ సంస్కృత భాషలతో వలసినంత పరిచయం ఉండి తీరవలెను.

## హిందీ వాదము

ఉత్తరదేశమునందలి భాషలం దన్నింటియందు ముప్పాతిక ముప్వీసము సంస్కృత పదములు కలవు. మరియు ద్రావిడభాషా కుటుంబములో సాబాలు పాతికపాలు, పరకపాలుగా సంస్కృత సంపర్కము లెన్సగా ఉన్నది. కావున వారు కూడా హిందీ అభ్యసించు నెడలనే ఐక్యము సాధ్యము. కావున హిందీ రాష్ట్రభాషగా చేసికొనుట అర్హమని శ్రీమున్షీ ప్రభృతులు.

"భాషైక్యముచే భావైక్యము కాదు" అని తేలినది. ఇక సంఖ్యాధిక్యమును బట్టియు సంస్కృత ప్రాచుర్యమును బట్టియు నూటికి ముప్పదిమంది గానున్న ద్రావిడభాషా కుటుంబమువారు హిందీని రాష్ట్రభాషగా స్వీకరింపవలయు ననుట ఎంత క్లేశజనకమో విచారింతము.

హిందీయందలి తత్భవములను తెలుగు మొదలగు ద్రావిడభాషా కుటుంబము నందలి తద్భవములును సగోత్రములేకానీ, వానికి తరములు దాటిపోయెను. ఔత్తరాహులు నుపయోగించు తద్భవములు ఔత్తరాహులకును అర్థముకావు.

మరియు "హిందీ ఒకటి వచ్చినచో హిమాలయముల నుండి కన్యాకుమారి వరకును తిరిగి రావచ్చును" అని ఒక ప్రవాదమున్నది. ముసలిమానులే

ఈ ప్రవాదమును నిలువ బెట్టగలరు గానీ హిందువులు నిలువబెట్టలేరు. హిందియందును ఉరుదునందును సంస్కృత, అరబీ, పారశీ పదములు కొన్ని సామాన్యము. కావున ఆ హిందీ, ముసల్మానులకు తెలియునుగాని ద్రావిడ భాషలవారికి తెలియదు.

## హిందీ, హిందూస్థానీల పొరుపు

హిందీ వంటి అందమైన భాష ప్రతీపములగు రెండు సాహితీ రూపములందుట శోచనీయము. ఈ రెండు రూపములయు అక్షర సమామ్నాయము వేరు. భావ ఘనములును శ్రవణ మధువులునగు వాని శబ్దజాలము వేరు. వీని వ్యాకరణములు కూడా కొంచెము జటిలములు. పొరుపు పుట్టిన హిందీ గృహములో నడుమ అడ్డుగోడ పట్టుకొని ఒకటి ఆవలను ఒకటి ఈ వలను ఉన్న చందముగా హిందీ ఉర్దూలు ప్రకృతము కాపురము చేయుచున్నవి. వ్యాకరణమును బట్టియు ఇండ్లలో మాటలాడుకొను పదములను బట్టియు చూచినచో సాధు హిందీయు ఉర్దూను ఒక్కటియే కాని అక్షర సమామ్నాయము వేరు. కలా శిల్పములు ధర్మ దర్శనములు జ్ఞాన విజ్ఞానములు ఈ మొదలగు వానికి సంబంధించిన పదములు వేరు. ఈ రీతిగా భేదము వచ్చి పడినందున ప్రతి విషయమునందును హిందువులకును ముసలమానులకును కలుగుచున్న అశాంతిని ఈ భాష గూడా వృద్ధి చేసెను.

### లిపి:

వైజ్ఞానిక రీతిలో ఏర్పాటయిన దేవనాగరి ఉత్తరభాషలకు మాతృక. హిందీకి దేవనాగరియే లిపి. హిందీ మాటాడువారు దాని విడనాడజాలరు. ముసలమానులు అరబీలిపిని విడనాడరు. అరబీ సమామ్నాయము నవలంబించి నంతనే హిందూస్తానీ ఉర్దూ అయిపోవునని ముసల్మాను లనుకొందురు. నాగరిలిపికిని అరబీ లిపికిని ఏ కోశమునను పోలికలేదు. ఈ రెంటికిని సౌభ్రాత్రము లేకపోవుటయే కాంగ్రేసు చిక్కునపడి "రాష్ట్రభాష హిందూస్తానీ. దానిని నాగరిలో గాని అరబీలోగాని వ్రాసికొనుడు" అని ఆదేశము పంపెను.

ఈ హిందూస్తానీ సింధు హిందీ కాదు, ముసల్మానుల ఉరుదు కాదు.

ఈ గొడవ చూచి కొందరు రోమన్ వర్ణమాల అవలంబనీయమని అనిరి. పిట్టపోరు పిట్టపోరూ పిల్లి తీర్చెను.

వివాదగ్రస్తమగు ఈ హిందూస్థానీనే రాష్ట్రభాషగను, ఉన్నత విద్యకు వాహకముగను వర్ధించుచో ఇటు సంస్కృతమునందును అటు అరబీ పారశీకములందును పరిచయము సంపాదించుకొనవలయును. గ్రంథకర్తలకు ఈ మూటను గట్టి పాండిత్యము కావలయును.

హిందీ, హిందూస్థానీలు జన్యభాషలుగానీ జనకభాషలు కావు. యూరపు భాషలలోని పదములకు ప్రతిపదముల నేర్పాటు చేయవలయుచో సంస్కృతమును అరబీకి, పారశీకమును ఆశ్రయింపవలసిఉండును. ఇంతటితోనే తీరదు, ఉన్నత విద్య అభ్యసించువారికి ఆంగ్లభాషతో పరిచితి ఉండి తీరవలెను. మాతృభాష సరేసరి. కావున సంస్కృత మొకటి, అరబీ రెండు, పారశీ మూడు, ఆంగ్లము నాలుగు, మాతృభాష ఐదు, హిందూస్థానీ ఆరు- ఈ ఆరు భాషలలో అన్నిట సామాన్య పరిచయమును, కొన్నిట పాండిత్యమును కావలయు ననుట నిశ్చయము.

మరియు కాన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీ హిందీలో వ్యవహరింప నురికి, వెనుకడుగు వైచి, మరల ఇంగ్లీషునే ఆశ్రయించెను. పరిపాలనా సూత్రములను హిందీలోనూ ఇంగ్లీషులోనూ వ్రాయవలయునని నిర్ణయించెను.

## సంస్కృతము

హిందూ దేశమున భాషలన్నిటికిని ఆశ్రయణీయమైన సంస్కృతమును రాష్ట్ర భాషగా స్వీకరింతుము. దానితో ఉన్నత విద్యల కిక నొక ఇంగ్లీషుతో సరిపోవును. మాతృభాషతో ప్రతివానికిని మూడు భాషలతోనే సరిపోవును. ఉన్నత విద్యతో ప్రసక్తి లేనివానికి రెండు భాషలతోనే సరిపోవును. హిందీగానీ, హిందూస్థానీగానీ రాష్ట్రభాషయగుచో ఆరు భాషలలోగానీ, అయిదు భాషలలోగానీ పరిచయము ఆవశ్యకము. ఇన్ని భాషలలో సాధారణ జ్ఞానము సంపాదించుటతోడనే మనశ్శక్తి వ్యయమగును. పిన్నవారి మనశ్శక్తి నిటుల దుర్వ్యయము చేయించుట తగునా అని పెద్దలందరును తొందరగా నాలోచింప

వలసియున్నది. మొన్న జరిగిన హిందీ సాహిత్య సమ్మేళనమున శ్రీరామకృష్ణ షైతాన్ "సంస్కృతము రాష్ట్రభాష కాజాలదు" అని అనిరి. వ్యాకరణము కష్టము కావున వారటు లనియుందు రని అనుకొందము. దానిని సాధ్యమయి నంత సులభము చేయవచ్చును. తార్కికు లందరును వేదాంతు లందరును వైయాకరణులు కారు. వారు సంస్కృత భాషలో ఉపన్యసింపగలరు, గ్రంథ ములు వ్రాయగలరు.

సంస్కృతమున ధాతురూపము లెక్కుడు. ఉపయోగములో కొన్ని లకా రములను తగ్గించుకొనవచ్చును. భూతభవిష్యత్‌లందు ఉపయోగించు లిట్, లఙ్, లుఙ్, లుట్, లృట్, ఈ ఐదింటిలో భూతమున కొకటి భవిష్యత్తున కొకటి, వెరసి రెంటినే చేసికొనవచ్చును. ఈ రీతిగా నింకెన్నియో లఘూపాయ ముల నవలంబించి వ్యాకరణమును సులభము చేసికొనవచ్చును. భాష వాడుక లోనికి రాగానే దాని వ్యాకరణ వ్యాఘ్రము పాడియావగునని భాషావేత్త లెరుగ నిది కాదు. మనకు సంస్కృతము రాష్ట్రభాష కావలయునని సంకల్పమే యున్నచో వ్యాకరణము అడ్డురాదు. అట్టి సంకల్పమునే మనము బలపరుచుకొన వలయును.

కలకత్తాలో ఆంగ్లేయులు విద్యాలయములు స్థాపింపబోవు ముందు అందు సంస్కృతము సూచించిరి. అంతకుముందు రెండు మూడు శతాబ్దుల నుండియు పారశీకిని, హిందూస్థానికిని అలవాటుపడిన అప్పటి ప్రజ ఆ సూచనను నిరాక రించెను. ఆంగ్లము మన పాలబడెను. అదియే మన కనులు తెరిచి యిపుడు ప్రక్క కొదిగెను.

ప్రాచ్య విద్యావేత్తలలో ప్రసిద్ధుడగు F. W. Thomas సంస్కృత మును రాష్ట్ర భాషగా చేసికొనుడని కొన్ని ఏండ్ల క్రింద మనకు సలహా ఇచ్చెను. ఇపు డొరిస్సా గవర్నరు కట్‌జూ మహాశయు డొక డటులు చెప్పుచున్నాడు. ఇప్పుడు తప్పటడుగు వేయుచో మరియేనాటికిని కలిసిరాదు. ఇది స్వయం నిర్ణ యము చేసికొనగల పుణ్యసమయము. కావున నేషనల్ ముస్లింలతో కలిసి హిందూదేశమునందలి ప్రజలందరును రాష్ట్రభాషను నిర్ణయించబోవు ముందు హిందూస్థానీయా, హిందీయా, సంస్కృతమా అని మరొక మారు ఆలోచించుకొను టత్యావశ్యకము.

# సంస్కృత ప్రశస్తి

ఇండో-యురపియన్ భాషలన్నింటిలోనికి సామాన్యతః మనః శిక్షణకును ప్రత్యేకించి కఠినమైన భాషాశిక్షణకును ప్రారంభాధ్యయనముగా సంస్కృతము చక్కగా అనువు పడుచున్నది; సంస్కృతమునకు సాటి లేదు. దాని నిర్మాణ వైశద్యము కేవల మద్వితీయము. ఉపసర్గలు, ధాతువులు, విభక్తి ప్రత్యయములు, తద్ధితములు మున్నగునవి కలిసి శబ్దరూపమును ధరించుచో వాటిని క్రొత్తగా పాఠములు మొదలుపెట్టినవాడుగూడ వెంటనే, సరిగా సులభముగా విడదీసి గ్రహించనై ఉన్నవి. ఈ విధమైన ఇంగ్లీషు, గ్రీకు. లాటిను మున్నగు భాషల వ్యవస్థకు ఏ ప్రధాన సూత్రము లంతర్గతమై యున్నవో వాటిని వ్యక్తము చేయుటకు సంస్కృతము విశేషించి తోడ్పడుచున్నది. ఏలన, ఈ భాషలు చాలా రాపిడి పడినందున వాటి మూల వ్యవస్థా లక్షణము లిపుడు పోల్చ రాకుండా ఉన్నవి.

చురుకైన పరిశీలన, భాషావిషయకమైన పర్యాలోచనచే- ఉదాహరణకు పుస్తక సహాయము లేకనే Batch-Bake, Drink-Drench, Fil-th-Foul, Gris-t-Grind, Hinge-Hang పదముల సంబంధము నరయగల అభ్యాసము, శక్తి అన్యభాషాధ్యయనము వలన లభించగలవు. ప్రమాణ గ్రంథముల సాయమున ఒక్క సంవత్సరము సంస్కృత మభ్యసించిన యెడల,- ఇంగ్లీషు, గ్రీకు, లాటిన్ భాషలు పరిశోధించదలచువారికి ఆ భాషయం దెక్కువగ సార్థకముగ, చురుకుగ, పరిశోధించు శక్తి అభ్యాసము అలవడగలవు.

అనుషంగిక భాషాశాస్త్ర నిగమనములు ఇపుడు సాధారణతః నవీన వ్యాకరణములు, పాఠ్యగ్రంథములు, నిఘంటువులలో చేర్చబడినందున సంస్కృత జ్ఞానము కొద్దిగనైనను వచ్చినంత క్షుణ్ణముగా వచ్చినచో, ఉపాధ్యాయులు చేయు బోధ బోధకమై ప్రయోజనకరమగునట్లు మిక్కలి తోడ్పడగలదు. అది అట్లుండగా కవేః శిక్షాప్రణాళికగా నెంచి చూచుచో సంస్కృతమును, భారతదేశ సాహిత్యములు ధర్మములును నానాటికి ప్రధానమగుచు రాగా జర్మనీలోకి 20 విశ్వవిద్యాలయములలోనికి ఒక్కటి వినా అన్నింటిలోనూ సంస్కృతము బోధించుచుండిరి.

# 15. న బహూనాం ప్రేయః కిం తు సర్వేషాం శ్రేయః

అనేక భాషా సంపన్నస్య భారతస్య సంస్కారవ్యవహారయో స్సిద్ధయే ఏకభాషా అవశ్యకీత్యత్ర నకస్యాపివివాదః । పరంతు 'కాసాభాషా?' ఇతిపృచ్ఛా. ఆంధ్రీత్యాంధ్రో ద్రావిడీతి ద్రవిడో వంగీతి వంగో వక్తి! ఏతయైవరీత్యా సర్వోపి స్వకీయామేవ భాషాం మనుతే ! కి మత్ర కారణం? మమత్వమేకమ్, పరభాషా పరిశ్రమాద్ భయం చాపరమ్.

## హిం దీ

పాశ్చాత్యానామాధిపత్యే పరతంత్రతాకులే కాలే స్వయం ఘూర్జరోఽపి మహాత్మా గాంధీ-హింది రాష్ట్రభాషా భవతు. ఇత్యాశశాసే। కారణ మస్య హిందీ భాషిణాం సంఖ్యాబాహుళ్యమే వేత్యాపాతతోఽస్మాకం గోచరీ భవతి। కింతు ముసల్మానా నామె క్యాయ, అంతర్జాతీయ వ్యవహారాయ చేత్యస్యోపయుక్తతా అనుపదమేవ స్ఫురిష్యతి। తాత్కాలికీం స్థితిం పర్యాలోచ్యాపరేచ దేశనాయికా మహాత్మనోఽభిప్రాయసార మన్వమన్వత। దాక్షిణాత్యేషు స్వల్పతయా, ఔత్తరాహేషు బహులతయా చాస్యాః ప్రచార స్సమజని। సోఽయం ప్రచారోఽద్యాపి ప్రవహతి.

స్వాతంత్ర్యస్య సమనంతరమ్.

బ్రిటన్ దేశీయాస్స్వాధిపత్యముపసమాహార్షుః ఖండితోపి భరత ఖండ స్స్వాతంత్ర్య మండితోఽభూత్। తదను రాజ్యశాసనమ్ వ్యరచి। తృణజలూకాన్యాయే నాంగ్ల భాషాం పరిత్యజ్య హిందీభాషా యాదేశ భాషానాం చాసనం కల్పనీయ మిత్యస్మిన్ శాసనే ఏకో ఘట్టః। యథాచాంగ్ల భాషాయాహఠాదపమార్జనం దుశ్శకమ్। ఏదాదృశ్యా మవస్థాయాంబహుభాషా పారదృశ్వానాం విచారః ప్రజ్వలతీతి సాంప్రతమ్। తస్యైవ సహస్రముఖీజ్వాలా శ్రీ తిరుపతి క్షేత్రే భవిత్రీయం విశ్వపరిషత్.

## శ్రీ నెహ్రూ పండితః

అస్మిన్నేవ సంక్షోభే పరుద్యాపరా రివాకస్యాం చిత్సభాయామ్—

'యది ప్రజా అకామయిష్యత్తదా సంస్కృతభాషా సింహాసన మల మకరిష్య దితి శ్రీ నెహ్రూ పండిత ఉపన్యాస్థత్। యద్య పీద మన్యోన్యాశ్రయ గ్రస్తం తథాపి సమ్య గవధాతవ్యమేవ। పండితస్యాస్య అస్మిన్ వాక్యే 'ప్రజా' శబ్దస్య ఏకానాద్వేవ త్రిస్రోవా ప్రజాఇతినాఽర్థః। కిం తు బహ్వ్యఏవేతి। తథాచయే సంస్కృత భాషాయాః ప్రాముఖ్య మఖిలషంతి త్రైరవశ్యమ్ బహుళ సంఖ్యాభిః ప్రజాభిః సంస్కృతభాషా కామయితివ్యేతిపర్యవసన్నమ్। బహ్వ్యాచ ప్రజా సంస్కృతభాషాయా రాష్ట్రభాషాత్వం మాస్తు, తస్యా అవశ్య పతనీయతాం చ నకామయేత్। కుతః? సంస్కృతభాషా చేయమత్యంత శ్రమేణ సంపాదనీయేతి బహూనాం లోకానా మాశయః.

## ప్ర వా హి నీ

సంస్కృతభాషాపరస్సహస్రాణి వత్సరాణి ప్రవహన్తీ కదా వా సరస్వతీత్వ మాపద్య అలుపదితిన వయంజ్ఞాతుం శక్నుమః! తస్యాం చ భాషాయాం శ్రుతిస్మృతి పురాణానాం, సూత్రదర్శనభాష్యాణాం కావ్యనాటకాఖ్యాయికాదీనాం చ శబ్దసభ్యతయో ర్విస్ఫులింగా గోచరీభవన్తి! బహుషు యుగేషు ప్రవృద్ధస్య, బహోఃకాలాత్ ప్రవహతః శబ్దప్రపంచస్య అష్టాధ్యాయీ క్రీడాగృహః! ప్రవాహో త్రుటితనా దేనాం దేవభాషాం మత్వా ప్రజా న కామయేయుః.

అధునా బహూనాం లోకానాం కస్యాం చ నాఽపి భాషాయాం నాస్తి ప్రవేశః! ప్రవాహినీ చ సర్వేషామపి సులభా కుతః? రసనాగ్రే న ర్తనాత్.

ప్రవాహిన్యపి అర్థాత్ చలద్భాషాపి యది సంస్కారవతి తథా సులభేతి వక్తుం న శక్యా! తస్మాత్ ప్రజాసు శతస్య తు శతమ్ చలంతీం భాషామనుమన్యేత.

## రా ష్ట్రి భా షా

అంగుళిగణనీయా ఏవ సంస్కృతస్య రాష్ట్రిభాషాత్వ మిచ్ఛన్తి! కస్మాత్? భాషాత్వేన భాషితు మర్హాయా స్సామగ్ర్యా స్సంస్కృతస్య విద్యమానత్వాత్ హింద్యావా, అన్యస్యావా భాషయా స్తథాత్వేనాంగికారేఽపి తస్యాశ్చ సంస్కృతభాషాయా అనంగికారే చ సర్వాసాం దేశభాషాణాం పూర్వస్యాః స్థితే రనపాయాత్! అర్థాత్ సంస్కృతస్యావశ్య పఠనీయతానంగికారే కస్యా అపి దేశభాషాయా అభివృద్ధే రభావాత్। య దీమే విషయా స్సర్వై రభ్యుపేతా స్తర్హి సంస్కృత భాషాం రాష్ట్రిభాషాత్వేన స్వీకర్తుం న కేవలం బహూనాం జనానా మపి తు యస్య కస్యాపి వా న విప్రతిపత్తి ర్భవతి.

## వ్యవహారతో భ్రంశః కియాన్

బహోః కాలాత్ ప్రాక్ సంస్కృతభాషా ప్రవాహాద్ భ్రష్టేతి నైతత్ సర్వాంగీణం సత్యం। కర్తృ కర్మక్రియా పరిపూర్ణో వాక్యప్రయోగ ఏవ వ్యవహారాద్ భ్రష్టః। సర్వాస్వపి దేశభాషాసు తత్సమరూపేణ వా తద్భవరూపేణ వా అవ్యయై ర్ధాతుభి స్సాకం సంస్కృతభాషా స్వీక్రియత ఏవ సర్వానామపి భారతీయానాం భాషాణాం సంస్కృతభాషైవోపజీవికా! ఇయ మజ్ఞాతసారాణా మస్మాకం కంఠమణిః। యదీయం రాష్ట్రిభాషా న స్యా త్తర్హి సర్వేషా మపి బాలానాం ద్విగుణో వా త్రిగుణో వా శ్రమోఽనుభవనీయ స్స్యాత్। దేశభాషాశ్చ నశ్యేయుః యద్యపి న నశ్యంతు తథాపి– 'యావాన్ మాంస శ్రోఽప్యేడకః, తస్య పుచ్ఛస్తు ప్రాదేశమాత్ర ఏవేతి న్యాయస్య పాత్రతామియుః।

## సంస్కృత భాషా క్లిష్టా

వ్యవహ్రియ మాణాయా భాషాయా అవ్యవహృతా భాషాక్లిష్టతరా। మాతృభాషాతః పరభాషా శ్రమసాధ్యా। జన్మతోలబ్ధాయా భాషాయా వేతతో లబ్ధభాషా కిం సులభా? భారతీయానా మాంగ్లభాషాయాం శుద్ధో వ్యాహారోవా శుద్ధగ్రంథరచనా వా కిం సులభా? అపికిం భారతీయా నామాంగ్లత సంస్కృతభాషా కష్టతరా? అస్మద్దేశభాషారచనా సుసంస్కృతపదాని కియంతి దేశ్యాని కియంతి

కృతే సతి విమర్శే, వాక్యగ్రథనమేవా స్మాభిస్సమ్యక్ శిక్షణీయ మిత్యేవ గమ్యతే! ఏతావన్మాత్రేణ సందర్భేణ సంస్కృతభాషా సులభేతి న వాచం వ్యయం కర్తు మిచ్ఛామి। శ్రీమాన్ ద్విజేంద్రలాల రాయః పాణినిం పర్యహసీదిత్యహం జానామి। ఆంగ్లభాషావా హిందీవా, అథవా యావా కావాఽపి పూర్ణా భాషా ప్రతిభిస్సూత్రైః కేనాఽ ప్యుపనిబధ్యతే కిమ్?

## వ్యాకరణం ద్రవతి

కృతశ్చ తద్ధితాశ్చ నిఘంటు కల్పాః। అన్యే చ తిఙ్ఙంతాదయ స్సంగ్రహీతుం శక్యాః విద్యాలయేషు యది సంస్కృతభాషా అవశ్య పఠనీయా అభవిష్యత్తర్హి వ్యాకృతిః స్వయమేవ అద్రవిష్యత్। ఇద మే వాత్ర రహస్యమ్। జనతయా ఇద మవగంతవ్యం, విద్వద్భిశ్చ జనతా సంబోధయితవ్యా। ప్రజా స్వధికా సంఖ్యా నావమమత ఇతి నైషా అపనేయా। తథా చ ప్రతిపద్య, సర్వేషామపి కంఠేష్వియం రజ్జు ర్న బద్ధవ్యా। ఇద మత్రావగంతవ్యమ్। క్రమశిక్షయా అభ్యసనీయం యం విషయం హతా ల్లోకం స్వీకుర్యాత్? 'సత్యం వద, ధర్మం చర' ఇత్యాదీని త్రైకాలికాని సత్యాని సర్వేణాఽపి లోకేన అవలంబయితుం కోవా శక్నుయాత్? అథవా దండధారిణా కేనాఽపి రాజ్ఞా శక్యతేవా? తథా చ న శక్యతఇతి యఃకోఽపివా మహాత్మా తూష్ణీ మతిష్ఠద్వా? కిం చ యఃకోఽపి నమాత్మావా ఘోష మాసీద్వా? తస్మా దత్రాస్మాభి రనుసంధాతవ్యం,- న బహూనాం ప్రేయః కింతు సర్వేషాం శ్రేయః। యది న సంస్కృత భాషా అవశ్యపాఠ్యా క్రియేత తదా బహుభిరస్యా మాతృమూర్తి ర్న జ్ఞానగమ్యా భవతి। అస్యా ఆవశ్యకతా యది నాఽజ్ఞాస్యత తర్హి అధికో లోక ఏనాం నాన్వమోదిష్యత। యద్యున్మాదో నాఽహోస్య ద్వివాహో నా భవిష్యత్, యది వివాహో నాభవిష్య దున్మాదో నాఽహోస్యాత్.

## అందరకూ శ్రేయస్కరమయినది
## అందరకూ ప్రియము కాకపోవచ్చును

వ్యవహారము నడవను సంస్కృతి వడయను యావత్ భారతమునకును ఒక భాష కావలయుననుట నిర్వివాదము, కాని 'ఆ భాషయేది' అని ప్రశ్నించు

నెరల తెలుగువారు తెలుగందురు, అరవవారు అరవమందురు. వంగీయులు వంగమందురు. ఈ రీతిగా ఏ దేశమువా రా దేశభాషయే భారత భాష కావలయునని సమాధానము చెప్పుదురు. ఇటుల చెప్పుటకు మమత్వ మొక కారణము, అన్యభాషా పరిశ్రమ వలన భయ మింకొక కారణము.

## హిందీ

బ్రిటీషువారి యేలుబడిక్రింద దేశమంతయు దిక్కులేనిస్థితిలో నున్నప్పుడు తాను గుజరాతియైనను గాంధీజీ 'హిందీ రాజ్యభాష యగుటమే'లని చెప్పెను. దీనికి మనకు వెంటనే తోచు కారణం హిందీ మాటలాడువారి సంఖ్యా బాహుళ్యము. కాని ముసల్మానుల ఐక్యమునకును అంతర్జాతీయ వ్యవహార సిద్ధికిని గూడ ఇది కారణమని తరువాత మనకు తోచకపోదు. నాటిస్థితిగతులను బట్టి తాత్కాలిక నాయకులందరును గాంధీజీ మాటలోని సారమును గ్రహించిరి. దాక్షిణాత్యులలో కడుకొలదిగను ఔత్తరాహులలో కొంచె మెక్కువగను దీనికి కృషి జరిగెను. నేటికిని ఇది సాగుచున్నది.

## స్వాతంత్ర్యానంతరము

బ్రిటీషువారు తొలగిరి. భారతము స్వతంత్రమాయెను. పరిపాలనకు చట్టమేర్పడెను. తృణజలూకా న్యాయముగా ఆంగ్ల భాషా స్థానమును హిందీభాషకును దేశభాషలకును, కలిగించుట ఈ చట్టములో ఒక ఘట్టము. వెంటనే ఆంగ్లమును తుడిచిపెట్టుట కెట్లు వీలులేదో వెంటనే యీ భాషలను ప్రవేశ పెట్టుటకును అట్లు వీలులేదు. ఇట్టిస్థితిలో భాషలెరిగిన వారికి కలవరము కలుగుట సహజము. దాని ఫలకరమే తిరుపతిలో జరుగు విశ్వపరిషత్తు.

## శ్రీ నెహ్రూ

ఈ కలవరము నడుమ శ్రీ నెహ్రూ పండితుడు 'ప్రజలు కోరుదురేని సంస్కృతమును అవశ్యము ప్రముఖభాషగా చేయగలము' అని ఒక ఉపన్యాసములో చెప్పెను. ఇది అన్యోన్యాశ్రయ దోషగ్రస్త మయినను సావధానముగా

ఆలోచింపదగినది. మరియు ప్రజలలో ఎక్కువమందిచే కోరుకొనునట్లు చేయ దగినది.

ప్రజలలో ఎక్కువమంది సంస్కృతము రాష్ట్ర భాషగా కాదుగదా, అవశ్య పఠనీయముగా నయినను చేయగోరరు ఏల ? ఇది చాలా కష్టపడి నేర్వదగిన భాష యని వారి యూహ.

## వ్యావహారిక భాష

సంస్కృతభాష ఎన్నో వేల యేండ్లు ప్రవహించుచువచ్చి సరస్వతిగా ఎప్పుడు 'అంతర్వాహినియై' పోయెనో మన కెరుగరాదు. ఆ భాషలో శ్రుతి స్మృతి పురాణములయు సూత్రదర్శన భాష్యములయు కావ్య నాటకాఖ్యాయి కాదులయు శబ్ద సభ్యతల మెరుపులు గోచరించును. బహు యుగములనుండి ప్రసరించుచు వచ్చిన శబ్ద ప్రపంచమునకు అష్టాధ్యాయి అనగా వ్యాకరణము బొమ్మరిల్లు. ప్రవాహము విచ్ఛిన్నమై పోవుటవలన దేశభాషగా తలచి ప్రజలలో ఎక్కువమంది దీనిని కోరరు.

ఇపుడు ప్రజలలో ఎక్కువమంది ఏ భాషయందును ప్రవేశము లేనివారే. వ్యావహారిక భాష అందరకును సులభము. ఏల ? వాడుకలో నుండబట్టి. వ్యావహారికభాషయు సంస్కరింపబడెనేని అనగా వ్యాకరింపబడునేని సులభమని చెప్పుటకు వీలులేదు. కావున వ్యావహారిక భాషకు వోటుపెట్టినచో నూటికి నెలగ.

## రాష్ట్ర భాష

వ్రేళ్ళమీద లెక్కపెట్టతగిన కొలదిమందియే సంస్కృతమును రాష్ట్ర భాషగా కోరుదురు. ఏల ? భాష అనుపించుకొనుటకు వలయు సామాగ్రి సంస్కృతమునం దుండుటచేత. హిందీని గాని మరి దేనినిగాని రాష్ట్రభాషగా చేసి కొనుచో అట్టి వానికిని సంస్కృతభాషా స్తన్యము కావలసియే యుండుటచేత, మరియు సంస్కృతము నంగీకరింపనిచో దేశ భాషలకన్నిటికిని ఎప్పటిస్థితియే ఉండును గావునను, అనగా సంస్కృతము అవశ్యపఠనీయము కానిచో ఏదేశ భాషయు రేకట్టక పోవుటచేత, యీ విషయములు సత్యమైనచో, సంస్కృతమును రాష్ట్రభాషగా జేసికొనుటలో ప్రజల్లో ఎక్కువమందికే కాక ఏ ఒకరికిని విప్రతి పత్తి ఉండదు.

సంస్కృతము వాడుక నుండి తొలగి యెన్నియో శతాబ్దులాయెనని అను కొనుటయు సంపూర్ణసత్యము గాదు. కర్త కర్మ క్రియ పూర్ణమగు వాక్యములతో మాటలాడుట మాత్రమే వాడుకలేదు. కాని భారతమునందే యొక్క భాషలోనో తక్క మరి యేభాషలో తత్సమ రూపముగనో తద్భవరూపముగనో ధాత్వవ్యయ సమేతముగా సంస్కృతము వాడబడుట లేదో చూడుడు. భారతమునందలి ప్రతి భాషకును ఉపజీవకము సంస్కృతము. ఇది మనకు తెలియకుండా మన కంఠ మణిగా నున్నది. దీనిని రాష్ట్రభాషగా జేసికొనకున్నచో ప్రతి బాలుడును ఇబ్బడి పరిశ్రమకు పాల్పడవలసివచ్చును. దేశభాషలు ప్రుచ్చును. ప్రుచ్చ కున్నను 'గొడ్డె ఎంత బలిసినను తోక బెత్తెడు'గా ఉండి పోవును.

## సంస్కృతము కష్టము

వాడుకభాషకంటె వాడని భాష కష్టము. మాతృభాషకంటే పరభాషకష్టము. వెన్నతో బెట్టిన భాషకంటె బెత్తముతో బెట్టుభాష సులభమా ? భారతీయులకు శుద్ధముగా ఆంగ్లము మాటలాడుటయు అందు గ్రంథరచన చేయుటయు సులభమా ? మరి భారతీయులకు ఆంగ్లముకంటె సంస్కృతము కష్టతరమా ? మన దేశభాషా రచనలలో సంస్కృతపదము లెన్ని దేశ్యములెన్ని అని లెక్క కట్టినచో మనమిక నేర్వవలయునది కారకాదు లెరిగి పదములను వాక్యములనుగా కూర్చుటయని తెలియగలము. ఇంతమాత్రముతో తేలగొట్టి సంస్కృతము సులభ మని వాదింపను. ద్విజేంద్రలాల్‌రాయి పాణినిని వేళాకోళము చేయుట నేనెరుగుదును. ఆంగ్లభాషగాని నిండుభాష మరియేదేనిగాని మూడు సూత్రము లతో ముడివడునా?

## వ్యాకరణము కరగును

కృత్తద్ధిత లించుమించు నిఘంటువు. అవియే వ్యాకృతిలో సాబాలు. ధాతు ధాతు భాగములుకూడ సంగ్రహింపనగును. సంస్కృతము నవశ్య పాఠ్యము చేయుచో వ్యాకరణము కరగిపోవును. ఇదియే రహస్యము. ఈ విషయము ప్రజ లకు తెలియవలెను. తెలుపవలెను. ఎక్కువమంది ప్రజలు ఇందులకంగీకరింపరని అనుకొనరాదు. అటులని దీనిని వారి మెడకును తగిలింపరాదు. క్రమశిక్షచే అలవరిచికొనదగిన విషయములను ప్రజలలో ఎక్కువమంది స్వీకరింతురా ?

'నిక్కము పలుకుము. నీ పొరుగువాడు నీతోపాటు వాడు' అను సత్యార్థములను ఎక్కువమంది ప్రజలచే అవలంబింపజేయ నెవరితరము? ఏ ప్రభుత్వముతరము ? అటులని వీని ప్రచారమునే మహాత్ముడే కాదు- మరియు ఏ సమాత్ముడుమాత్రము మానెను ? ఇయ్యెడ మనము చూడవలయున దెక్కువమంది ప్రేయముకాదు. అందరయు శ్రేయము, సంస్కృతము నవశ్యపఠనీయముగా చేయనిదే ఎక్కువమందికి దీని మాతృమూర్తి గోచరముకాదు. దీనిఆవశ్యకత తెలియనిదే ఎక్కువ మంది దీని నామోదింపరు. పెండ్లికానిదే పిచ్చికుదురదు పిచ్చికుదురనిదే పెండ్లి కాదు.

(తిరుపతిలో జరిగిన విశ్వ సంస్కృత పరిషత్తు సందర్భమున వెలువడిన ఆంధ్రపత్రిక ప్రత్యేక సంచిక)



# 16. తెలుగు భాష - కొన్ని విశేషాంశములు

సంస్కృతభాష కేవల గ్రంథస్థభాషకాదు. ఏ భాషా అట్లుకాదు. ఇది ఒకానొకపుడు చలద్భాషే. ఆర్యావర్తదేశానికి సరిహద్దులు చెప్పి అక్కడ నివసించే కుంభీధాన్యులు...శిష్టులు వాడుకొనే భాషప్రమాణమని పతంజలి మహాభాష్యంలో అంటాడు. ఐతే ఇపుడు కేవలమూ గ్రాంథికమే కదా సంస్కృతం? అని అంటే గ్రీకు లాటిన్లున్నూ డిటో. అలాగే సంస్కృతం కూడా. ఆయా యీ దేశాలలో అఱు, పిదప పిదప పద్దెనిమిది కాబోలు ప్రాకృతాలుగా మాఱి అవీనిన్నీ కాల క్రమేణ మార్పు చెందినవి. ఈ ప్రాకృతాలు మాటాడే దేశాలకు వేరుభాష-మాటాడేవారు వచ్చి వర్తకమూ, యాన సంబంధమూ పెట్టుకొన్నప్పుడూ,ఈదేశాలను కొన్నింటిని జయించి-ఓడి, ఈ దేశాలలో నెలకొనినప్పుడూ వారిమాటలు కూడా చాలా మన భాషలలో కలిసినవి. వేదములోనే పిక, వీణాది శబ్దములను గురించి మీమాంసా వ్యాఖ్యాత శబరస్వామి ఏమి వ్రాశాడో గమనించేది. (అప్పటికే కొన్ని యీలాటి పదాలు పరదేశ్యాలనే అనుమానం ఉన్నది). దీనివలన తేలేదేమిటంటే 'ప్రాకృతులు మాటాడినవి ప్రాకృత భాషలు' అని. నేటి చలదాంధ్రభాష-గ్రాంథికభాషల వలెనా? కాదు. మఱి తలక్రిందులు. సంస్కృతజన్యం ప్రాకృతం; చర్త్రి తెలుగును సంస్కరిస్తే గ్రాంథిక-తెలుగు ఇంకొక వికల్పం. వేదభాషను ప్రాకృతులు మాటాడితేనూ ప్రాకృతములు పుట్టివుండవచ్చు - వాని సంస్కార రూపంగా సంస్కృత (గ్రాంథిక) భాష తయారు అయియుండవచ్చు. ఇది ఇంకా పరిశీలనకు (Research) అర్హం. ఇది ఇటు లుండగా, ప్రాకృతాలకు సంస్కృతచ్ఛాయ చూపినట్లు, సంస్కృతానికి వైదిక భాషాచ్ఛాయాత్వం చూడవచ్చు. Vedic Index దగ్గఱ పెట్టుకొని చూడవచ్చు. ఉదాహరణం చూచేది: 'యో దేవానాం జనిమా న్యద్భుతః', వైదిక భాషలోని జనిమయే

1) 'ఆంధ్రదేశ పురస్థాయులైన - శిష్ట' అప్పకవీయం చూ.

సంస్కృతభాషలోని 'జన్మ'. వైదికభాష-గ్రాంథిక సంస్కృతమూ-ఈ రెంటికీ జన్య జనక భావం విస్పుటం. ఆ వేదభాషయే దేవభాష అని స్తుతింపబడి ఉంటుంది. పదపడి గ్రాంథిక సంస్కృతానికిన్నీ ఆ వాసన పట్టి ఉంటుంది. "దైవీం వాచ మజనయన్త దేవాః" అను శ్రుతిని ఆలోచించి చూచుకొనేది. "చత్వారి శృంగాః...మర్త్యాన్(గ్ం)ఆవివేశ"-అను శ్రుతిని కూడా అనుసంధించు కొనేది. ఏతావతా సంస్కృతానికి పూర్వరూపం వేదభాష. అదిన్నీ ఒకప్పుడు మాటాడబడేదిగా ఉందా లేక అదిన్నీ [2]గ్రాంథికమేనా? గ్రాంథికం కాకపోతే యీ సముద్రంలో పరస్పరం యింత సారూప్యం అరుదు. ఐతే ఇపుడు మనకు కనబడేదంతా గ్రీక్ లాటిన్లతోపాటు గ్రాంథికమే. కాగా వీట్లకు మూలభాష Indo-Aryan ఉండాలి అని అనుమేయం. ఉదా:

| సం. | ఆ-క-తె. | Greek & Latin | English |
|---|---|---|---|
| పితృ (పితర్) | తండ్రి | Pater | Father |
| మాతృ (మాతర్) | తల్లి | Mater | Mother |
| భ్రాతృ (భ్రాతర్) | తంబి | Frater | Brother |

(Phylology లో ఇవి అందరకు తెలిసినవే. 'త' తో తెలుగు మాటలకు కలయిక అలవోకయో కాదో తెలిసికొనుటకు వ్రాసితిని).

వీనికి (పూర్వరూప భూత) మౌలిక రూపం అనుమేయమని పెద్దలు చెపుతారు. అనగా తమిళానికీ, మలయాళానికీ, కన్నడానికి, తుళుకూ, తెలుగుకూ పూర్వరూపమూలభాష ఒకటున్నట్లు చెపుతారు. దానిని అనుమించి చెప్పటం మటుక్కు ఇంకా ఎవరూ ఆలోచించలేదు. దాన్ని ఎవరయినా ఊహిస్తే లేక భూమిలో పూడిపోయిన శాసనా లేవో దొరికితే దానిని బట్టి ఆ మూలభాష యిదే అయివుంటుందని ఎవరయినా అంటే, దానికిన్నీ పూర్వరూపమేమిటి అని మనం

2) "యజ్ఞకాలంలో సంస్కారంలేని భాషను మాటాడదగదు. అట్లా మాట్లాడిన ఇద్దఱను వారు మాటాడిన మాటల పేరు పెట్టి హేళన చేశారు" అని పస్పశాహ్నికంలో పతంజలి అన్నాడు. దీనినిబట్టి వైదికభాష ఆ కాలానికే "మృతసంస్కృతం" అన్నమాట.

అడుగక పోము. ఇట్లా భాష అనాది. ఈ అనాదిత్వమే[3] జాతి.

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి ఆంధ్రభాషా చరిత్ర, విద్వాన్ గంటి జోగి సోమయాజులవారి 'ఆంధ్రభాషా వికాసము' చదివి యుందురు. ఈరెండూ చాలాదొడ్డవి.[ఆంధ్రయూనివర్సిటీ పబ్లికేషన్సు ఒక్కొక్కటి రు. 15] ఆ రెంటినీ బాగా చదివితే మీ అంతట మీరే తెలుగు సంస్కృత జన్యమా ? కాదా ? పైన ఉదాహరించిన Indo-Aryan Language వంటి ఒకానొక మూల చలద్ భాష ద్రావిడ భాషా కుటుంబములకు మూల పురుషుడా అనే మాట నిర్ణయించుకొనగలరు. అప్పటికీ కొన్ని సందేహాలు మిగలవచ్చు. ఆ మాట వేరు. వానిని జీర్ణం చేసికొననిదే ఏ నిర్ణయానికి వచ్చినా ఆ నిర్ణయం నిలువ బడదగినంత నిటారుగా ఉండదు. నే ననుకోడం— "తెలుగు సంస్కృతానికి చెందదు; ద్రావిడభాషా కుటుంబానికే చెందుతుంది." అని. ఇక మతాలమాట— జైనం ప్రాచీన మనిన్నీ అది క్రమంగా బౌద్ధంచే ఆవృతమై క్రమక్రమంగా యోగ, వేదాంతాలచే [శంకర - అద్వైత] గ్రస్తమైన దనిన్నీ, జైన బౌద్ధాలే ద్రావిడ అయి ఉంటవనిన్నీ ఇంతవఱకు కొందఱు పెద్ద లను కొన్నారు. శ్రీరాధా కృష్ణయ్యగారు కూడా తమ Indian Philosophy లో జైనమతం అనే Chapter మొమ్మొదటనే యీ మాట వ్రాసినటులు గుఱుతు.

జైనం ఉత్తరాదినుంచే దక్షిణాది వచ్చి ఉంటుందని భాగవతంవల్ల అను మితం. శ్రావణ బెళోలా మొదలగువానికి పునాది యోగీశ్వరుడు భరతుడు.

---

3) ఈ జాతి విచారం చాలా విపులం. జాతియందే సంకేతమని మీమాంసకులు. దీనిని తఱచి చూస్తే బ్రహ్మగారి దగ్గరికి పోతుంది. (Creator) కాబట్టి సంగ్రహిస్తాను. తెలుపు, పసుపు మొ॥ గుణాలు పెరుగు-కొంగలు-ఆకులు-బంగారం- మొ॥ వానిని ఆశ్రయించు కొని ఉన్నా స్వతహాగా వేఱువేఱే. ఆయా వస్తువులన్నీ బట్టి తెలుపు పసుపులలో తారతమ్యం వుంటుంది. అలా వున్నా తెల్లన తెల్లన పచ్చన పచ్చన అనే ప్రతీతికి హేతువైనదిన్నీ, పిల్లలు పెద్దలు మొ॥ వాళ్ల నోళ్లలో వటి మాటిమాటికీ భేదం కాపింపించే హరి ఉత్థాది పదాలలో హరిత్వ దిత్థత్వాది ప్రతీతికి హేతువైనదిన్నీ, పాలు, బెల్లం మొ॥ వానిలో పాకత్వాది ప్రతీతిని కలిగించడానికి కారణమైనదిన్నీ జాతియే కాబట్టి శబ్దాలన్నింటికీ జాతి ఒక్కటే ప్రవృత్తి నివృత్తి భూతము' అని.

సంస్కృత భాగవతం చదవండి, తెలుగు భాగవతం చూచినా చాలునని అనుకొంటాను.

ద్రావిడమత మంటూ ఒక మతం ఎక్కడా ఆచూకీ లేదు. ఆ మతం నశించనూలేదు. నాగరికత ఉంది. ఆటవ-మలయాళ - సింహళాది దేశాలలోని ప్రాచీన మానవ కంకాళ శిరస్సులలోనూ, నేటి వానిలోనూ ఆర్య-ద్రావిడ భేదం ఉన్నదని నృతత్త్వజ్ఞులు చెప్పారు. మహేంజో-దరో-హరప్పాలలోని ద్రావిడ నాగరికత ఇంకను విచారింపదగియే యున్నది. ద్రవిడ దేశానికీ, తక్షశిలకూ (దరో) నడుమ ఎక్కడా కనబడదేం? దానికి ప్రక్కనే ఉన్న గాంధారంలో ఆఫ్గనిస్తాన్‌లోనూ (అబ్ ఘనస్థానమునకు ఆఫ్గనిస్తాన్, అపభ్రంశమని నా యూహ. ఏలంటే అక్కడ, 'వైదిక-బౌద్ధ' చిహ్నాలు దేవళాలతోసహా కనబడ్డయి) లేవేం? పారసీకంలోనూ డిటో. కాశ్మీరంలోనూ సింధులోనూ డిటో. ఇవన్నీ వైదిక నాగరికతే! వీని నడుమ ఏ కొద్ది Area లో ఉన్నదిబ్బలలో (దరో-దిబ్బ) ద్రావిడ చిహ్నాలు దొరికితే కారణాంతరం ఊహిస్తే తప్పు కాదు, అశాస్త్రీయ మున్నూ కాదు.[4] ఏదో ప్రబల కారణంచే నడుమవచ్చి పడవచ్చు.

మహాభారత యుద్ధము క్రీ. పె. 1400 పై చిలుకు. ఈ సంగతి Astronomical Truth. రామాయణము దానికి మిగుల వెనుక గదా! 'ఎంత వెనుక' అనునది ఆలోచించుకోవాలి. రామాయణం ఒకే ఒక చేతి వ్రాత. భారత-మహాభారతాలలో కొన్ని చేతులు ఉన్నట్లు Internal evidence ఉన్నది. ఇంతేకాక కొన్ని (కొద్దికాదు-గంపెడు) Interpolations ఉన్నవి. రామాయణంలో లేవని అంటారు. గాని కొలదిగా ఉన్నవనియే నేను నమ్మ

---

4) Semetic దేశాలలో ఒకప్పుడు వేదం ఉన్నదని ఊహలు ఉన్నవి. ఐసెర్‌బైజాన్ (ఇపుడు అది రషియాకు చెందింది. పర్షియా ప్రక్క ఉన్నది.) వైదిక చిహ్నాలు దొరికినవి. వీటినేమంటాం? ఒక్క మహేంజో ప్రాంతంలోనే ఉన్నంత మాత్రాన ద్రావిడ మతాన్ని నాగరికతనూ ఎలా అంటకట్టడం? ఇంకా విచారించాలి. ఉత్తర చాళుక్యుల నాగరికత దక్షిణ చాళుక్యులకూ దేశానికి, దక్షిణ చాళుక్యుల భాషా నాగరికతా ఆంధ్ర ప్రాంతాల కన్నింటికీ అంటినట్లు కనబడుతుంది. శిల్పాలు పరిశీలించేది. భాషలోని పదాలు, ఆచార వ్యవహారాల వినిమయం గమనించేది.

తున్నాను. ఉత్తరకాండ వాల్మీకం కాదు. భారత కర్తలకు పాణిని దరిదాపు కాలంలో ఉండి ఉంటాడు. దానివల్ల ఆయాయా దేశాలలో ప్రమాణంగా తీసికోబడిన వ్యాకరణాలను బట్టి అపాణినీయాలు భారతంలో కనబడతవని నా యూహ. అప్పటికే ప్రాకృతాలు గ్రాంథికభాషలుగా ఆరబ్ధమయి ఉంటవి. ఎట్లంటే భాసనాటకాలలో ప్రాకృతమున్నూ బుద్ధఘోషుని నాటకంలో ఒక ఆకున్నూ [ఇది Middle East లో గావోలు దొరికింది] ఇంకా చాలా గ్రంథాలున్నూ సాక్ష్యం ఇస్తవి.

ఇక రామాయణభాష ఆశ్చర్యజనకం. దానిలో అపాణినీయాలు చాలా తక్కువ. పాణిని రామాయణం చదివి ఉంటాడు. రామాయణంలోని ప్రయోగాలు అతనికి సమ్మతం అని తోస్తుంది. [రామాయణంలో కోతులూ కొండముచ్చులూ రాకాసులూ నాకు యథాతథంగా కనిపించరు] మనుష్యులలోకి Metamorphose చేసుకోకపోతే ఎట్లా రసించగలం? ఇది వేరే విషయం.

విరుద్ధరస సమ్మేళనం దోషం అనేమాట అలంకారశాస్త్రమే చెప్పనక్కఱ లేదు. అది Psychological. పైగా అందఱకూ ఇట్టే తెలిసేది ఏవగింపు కలిగిస్తుంది. కవులు అట్లా చెప్పినంత మాత్రాన అలంకారశాస్త్రానికి కొఱుకరాని కొయ్యయేమిటి? అది కవుల దోషం. క. "పదినీతులు పదిబూతులు"...అంటూ చౌడప్ప చెప్పాడని బూతులు కూడా శాస్త్రానికి కొఱుకుడు పడవని అనడమేమిటి?

సరే! రససిద్ధాంతం, ధ్వని సిద్ధాంతం. ఈ రెంటినీ కలిపి చూడాలి. రసం ఎల్లప్పుడూ వ్యంగ్యమే అవుతుంది. అయితే రసంలేని ధ్వని యున్నూ గ్రాహ్యమే. ఆలాగే పండితరాయలు మొ॥ వారు చెప్పిన కావ్యలక్షణంలో ఉదాహరణములున్నూ గ్రాహ్యాలే. దీనిని గురించి చాలా వ్రాయాలి. ఇలా తేలదు.

గౌరవనీయ (గరణీయ) ఆధ్వర్యము (ఆధ్వార్యవము) ఈలాటి పదాలు

తప్పులే.[5] ఈ తప్పులే ప్రకృతం అపభ్రంశాలని వైయాకరణులచే అనిపించు కొన్నా వోట్ల బలంతో అప్రాజ్ఞులు ప్రెసిడెంట్లు ఐనట్లు గ్రాహ్యాలై కూచుంటవి. ప్రవాహినికదా వాడుక భాష. (ప్రవాహినీ దేశ్యా ?).

అ ( లు తీసేస్తే లోటులేదు కాని ద్రావిడభాషాది సంబంధం తెలపడానికి ఇవి Relics 'పూచె పద్మము'-అనుటకంటె 'పూచె బద్మము' Phonetic Law కి దగ్గఱ. బాగా ఆలోచించి చూచేది. పూచె పద్మమని పలుకుట కష్టము. పూచె బద్మమనుటయే తేలికయని ఎందరో వ్రాసిరి. అనుభవము కూడ అంతే. కాల్డ్వెల్ చూచేది.

యతియు ప్రాసయు కొంత చెడగొట్టతవి; కొన్ని మెఱుగున్నూ తెస్తవి. కాని అవి కవితా ప్రవాహానికి ఆతంకమనే మాట అందఱూ ఒప్పుకొంటారు. ఎంత భాషాభిజ్ఞుడయినా యతిప్రాసల దగ్గఱ సులువుగా పొదగని ఘట్టాలు వస్తాయి. నన్నయలోనూ ఇంకొందఱిలోనూ ఇట్టి క్లేశం కనిపిస్తుంది. సాహిత్య మును చెడగొట్టినవి అనే నిర్ధారణ చేయడానికి ఆలోచించాలి.

ధూళి-నళిన[6]-ఇత్యాదులలో కొన్నిట, 'ల' అనేది 'ళ'గా ఉచ్చరింపబడు తుంది. కొన్నిట 'డ' 'ళ' - 'యద్దేనా దేవ హేళనం' అనే ఇత్యాది శ్రుతులలో 'హేడృ' అనాదరే' అనుధాతు ల్యుడంత రూపం. హేడనం కంటె హేళనం సులువుగా ఉచ్చరింపబడుతుంది. వీట్లకు Harmonic sequence (సమ

5) పునీత పదం ఇలాంటిదే. 'శబ్దరత్నాకరం', Apte వగైరాలు గ్రహించినై కాని అపాణినీయం. నిష్ఠాక్త్వలలో ఇది వేట్. పూతః పవితః, పూత్వా పవిత్వా అని అవుతై. భాగవతంలో (సంస్కృత) చాలా 'పునీత'లు ఉన్నవి. అందఱూ వాడేస్తే దీనికి వెలిపోతుంది. ఒక సమర్థనం ఇల్లాంటిది బయలుదేరుతుంది.

"సంజ్ఞా తు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే
కుర్యా ద్విద్యా దనూబంధ మేతచ్ఛాస్త్రస్య లక్షణమ్"

అని ఉండడాన పూఞ్ ధాతువుకంటె పైదానివంతా ప్రత్యయమని అనేయచ్చు. ఇట్లాగే తప్పులు ఒప్పులవడం. 'బాహితము' శిక్ష్యన్నగా రెవ్వోచోట్ల వాడారు. దానికిన్ని గతిలేదు.

6) వల్యతే ఇతి వళినం - అని ఒకరు, నద్యతే అని ఇంకొకరు. చూ. అమర.

స్వరత)గా చెబుతారు. ప్రథమమీది గసడదవాదేశ విధానం సమస్వరతయే. తమిళంలోని ; ప్రాజ్ఞన్నయలోని 'లు'; పదపటి 'ఱ' - దేశ లేక నాడు భేదంచే ఉచ్చారణ భేదం కలిగి తదుచ్చారణలోని భేదం ఈ సమస్వరతకు ఫలమే.

యహోవా-జహోవా; యూదు-జూదు; యూసఫ్-జోసఫ్ - ఇవియు, మాధ్యందిన శాఖలోని [శుక్ల యజస్సు] యమున-జమున - మిగిలిన శాఖల వారి 'య'ను వారు 'జ'గా నుచ్చరింతురు. [ఈ శాఖ ఉత్తర దేశాలలో పెచ్చు] తెలుగు వారున్నూ యజ్ఞము-జన్నము; యోగి-జోగి ఇత్యాదిగా ఉచ్చరింతురు. [చూ. Phonetics]. దూళి-దూళ్లు; కాలు-కాళ్లు; రాయి-రాళ్ల ఇత్యాదులలో 'ళ్ళ'కు బదులు 'ళ్ల' అని అగును అని వైయాకరణులు.

సంస్కృతానికి మూలం వైదిక [సంస్కృత] భాష అనిన్నీ, దానికేదో వాడుక భాష ఉండి ఉండుననీ, అది Indo-Aryan కావచ్చు, మఱొకటియైనా కావచ్చుననిన్నీ వ్రాశాను. రామాయణంలో హనుమ సీతమ్మతో మాటాడిన భాష యేది? అని నే నెపుడో వ్రాశాను. కాని నిర్దేశించడం ఎట్లా? మాధ్యందిన శాఖలో నూటికి 60 శాతం 'య'-'జ'గా కనబడుతుంది. యహోవా-జహోవా ఇత్యాదులలోని య - జలు చూచిన్నీ, ఇంకా కొన్ని కారణాలు చూచిన్నీ Semitic దేశాలలో ఒకానొకపుడు మాధ్యందినశాఖ ఉన్నదన్న వారున్నారు. శ్రీ కంచి కామకోటివారి జగద్గురు బోధలు[7] మొదటి సంపుటమున్నూ, శ్రీ తిలక్ గారి Orion, Arctic Homeన్నూ చూచేది.

దారం - సంస్కృత జన్యం
అత్త - సంస్కృతం

'అత్తా ఏత్థ నిమజ్జతి' అని ఉండడాన ప్రాకృతం కూడాను. అక్క - సంస్కృతం. 'హే అక్క హే అల్ల' అని లోగడే వ్రాశాను. మనిషి మాటలు నేర్చునపుడు - ఇపుడు అన్ని భాషలు మాటాడేవారి మొదటి మాటలు ఇలాగే - అనగా ఒకలాగే ఉంటవి-అని ఊహించాలి. అందులోనూ Oriental దేశాలలోనూ Occidental లోనూ వేటిమి కనబడుతుంది. దీనికి కారణం వాతాతపాది

---

7) 'జగద్గురు బోధలు' - సాధన గ్రంథమండలి. తెనాలిలో దొరుకుతవి.

పరిసరస్థితులు కావచ్చు. ఇంక 'వాగుట' వాక్ - (వచ పరిభాషణే) అనుదానికి ప్రాకృతం మరాటీ 'వాగు' తోడు - (తోడ్ధ్ర్యాతువు చూ) అక్కడ- ఆ+కడ, అని మనం చెప్పుకుంటున్నాం. కాని దిగర్థకమైన కాష్ఠాభవం 'కడ'. అది ప్రదేశ వాచి ఐనది. పిదప ఆ+కడ=అక్కడ ఐనది. మఱి 'తప్పేలా' వంటి భాషా కతిపయాలలో సమానమైన శబ్దాలు accidental. తెలుగులో వెసల-Englishలో Vessel; ఇట్టివి మున్నూటికి పై చిలుకు చూచాను. వీనిలో కొన్ని ఇతరులు వ్రాయగా చూచినవి- 'భాషా అనంతా విపులా శ్చ శబ్దాః'.

(ఇది శీర్షిక లేకుండా లభించిన వ్రాత ప్రతి. ఒక జిజ్ఞాసువునకు తెలుగు-ద్రావిడ భాషా కుటుంబమూ మొ॥ విషయములపై శాస్త్రిగారు వ్రాసిన లేఖ అయివుండవచ్చు.)

సం/-



# 17. ఎఱ్ఱన ఆరణ్య రచన ఎప్పుడు?

ఇటు నన్నయకూ అటు తిక్కనకూ నడుమనున్న అరణ్యంలో పూర్తి దారివేసినవాడు ఎఱ్ఱాప్రెగడ. ఈయన నివాసం గుడ్లూరు. ఇది నీలకంఠేశ్వర స్వామికిన్ని నివాసము. ఇది నెల్లూరుజిల్లాలోని కందుకూరుకు దగ్గరగా ఉన్నది. (ఈ గుడ్లూరు రావూరి రాఘవరెడ్డికి ముఖ్యపట్నంగా ఉన్నట్లు వెన్నెలకంటి సూరన్న చెప్పాడు. అయితే అది 1480-1500 నడుమ.)

ఎఱ్ఱాప్రెగడది చెదలువాడ అని ఎఱ్ఱయ మునిమనుమడు మల్లయ్య విప్ర నారాయణ చరిత్రలో వ్రాస్తాడు. వేమారెడ్డి చదలువాడను రెడ్డిమల్లపరంగా మార్చాడు. ఒకవేళ దానిని ఎఱ్ఱయ కిచ్చాడేమో! ఈ వంశం వా రక్కడికి మారి వుండాలి. మల్లవరం మళ్లా చదలువాడైనట్లు వినికిడి. ఓరుగంటి చక్రవర్తి ప్రతాపరుద్రుణ్ణి ఢిల్లీ చక్రవర్తి చెఱపట్టి ఆంధ్రదేశాన్నంతా అతలా కుతలం చేశాడు. అప్పుడు ఢిల్లీ సైనికులు చేసిన దారుణం ఎంతదంటే తెలుగుదేశంలో ఉండే ప్రతివాడూ ప్రాణాలు దక్కించుకోవడాని కెంత పిరికి పందయినా ఎదురు తిరుగవలసివచ్చినంతది. అయితే వీరికి ఒకనాయకుడు కావాలి. అతడు ప్రోలారెడ్డి అనే మహావీరుడు. ఒకటి రెండేళ్ళలోనే అత డా విప్లవాన్ని వెనుకకు నెట్టి గతించాడు. పిదప అతని కొడుకు వేమారెడ్డి ఆ తండ్రికి కొడుకై పగపురుగేరి పూంగిదేశానికి క్రమక్రమంగా వేంగీదేశానికి రాజయినాడు; అద్దంకిలో గద్దె యెక్కాడు. వేమారెడ్డిని గద్దె యెక్కించినవాడు అతని తమ్ముడు సేనాపతి మల్లారెడ్డి.

పంటరెడ్లయిన ఈ కుటుంబంవారు కాకతి రాజులకు సామంతులు. ప్రోలారెడ్డి భద్రాచల ప్రాంతంలో రేకపల్లి దుర్గానికిన్నీ, కొడుకు మల్లారెడ్డి కడపదగ్గర కురుములూరు దుర్గానికిన్నీ అధ్యక్షులుగా ఉండేవారు. ఈ కురుములూరి మీదికి లకుమయ దండెత్తివస్తే తిక్కసిద్ధి తరిమి కొట్టాడని తిక్కన చెప్పాడు అంతకు పూర్వం యీ దుర్గం గోనగన్నారెడ్డి క్రింద ఉన్నట్లు ఒక శాసనంలో వుంది.

కురుములూరి నాయకుడైన మల్లారెడ్డి, ఇంత సిరిసంపద లిచ్చి మన ఎఱ్ఱాప్రగడ గారిని దగ్గర ఉంచుకొన్నాడు. 1323 ప్రాంతాలలో చెలరేగిన యుద్ధాలలో జయం పొంది వేమారెడ్డి అద్దంకికి ప్రభువైనప్పుడు మల్లారెడ్డి కురుములూరు వదిలేసి అద్దంకికి వచ్చి ఎఱ్ఱయను అన్నగారి చేతులలో పెట్టాడు. వేమారెడ్డి రామాయణమూ, భారతానికి ఖిలం, శేషమూఐన హరివంశమూ, తెలుగులో చెప్పించి రోజూ వింటూవుండే వాడు.

"ఎఱ్ఱయ్యగారు అరణ్యం ఎపుడు వ్రాశారు?" దీనికి సమాధానం రావడానికి ఎఱ్ఱాప్రగడగారి ఆద్యంతాలతో సంబంధం తెలియాలి. [1]వేమారెడ్డి చేసిన గొప్ప పనులలో శ్రీశైలానికి అహోబలానికి మెట్లు కట్టించడము ఒకటి. ఈమాట హరివంశంలో లేదు. హరివంశంలో ఉదాహరింపదగినంత గొప్పదా యిదని అంటారేమో! ఇంచుమించు ఆ కాలంలోనే శ్రీశైల కుమారపర్వతానికి రెంటాల మల్లినాథుడు మెట్లు కట్టించాడని సోమనాథుడు బసవపురాణంలో వ్రాశాడు. పిదప శ్రీనాథుడు వేమారెడ్డి కట్టించిన సోపానాలను స్వర్గానికి నిచ్చెనలని ఉత్ప్రేక్షించాడు. ఇంతగొప్ప విషయాన్ని ఎఱ్ఱన చెప్పక పోవడాన ఆ మెట్లకుముందే ఎఱ్ఱన లేడని ఊహించక పోవడం ఎట్లా?

కొందఱు మల్లవరపు శాసనంలో సోపానాల ముచ్చట ఉన్నది. అది 1325 నాటి శాసనం. కాబట్టి 1325కు వెనుకనే ఎఱ్ఱయ్య లేడు అని అంటారు. కాని ఆ శాసనం 1345 నాటిది. ఈ మెట్లమాట 1325 చీమకుర్తి శాసనంలో ముందర స్తిగా కనబడుతుంది. కాబట్టి 1335కి పూర్వమే యీయన లేడు. ఇతడు నృసింహ హరివంశ పురాణాలలో తిక్కన భారతాన్నీ తిక్కన్ననూ ప్రశంసించాడు. తాను అరణ్యశేషం చెప్పినట్లు నృసింహ పురాణంలో వ్రాసుకొన్నాడు. కురుములూరు మొదలుగా అద్దంకి వరకూగల ఈ ముచ్చటలన్నీ ముందర వేసికొని చూస్తే—80 ఏండ్లు జీవించాడని ఉజ్జాయిస్తే 1255లో పుట్టి 30 ఏండ్లు వచ్చినాక గ్రంథరచన సాగించి 1285 ప్రాంతాలలో కురుములూరిలో మల్లారెడ్డి వద్ద ప్రవేశం సంపాదించుకొన్నాడని అనుకోవాలి. ఐతే యీ 50 ఏండ్లలో ఈ కాసిని పుస్తకాలేనా వ్రాసేది? కాబట్టి 60 ఏండ్లే బ్రతికాడని అందాం. అలైతే 1275 లో పుట్టాడని అనాలి. ఇక మల్లారెడ్డి కేమీ కృతి యీయక పోవడమూ

1) ఈయన శాసనం మన దగ్గరలేదు. 1323 తరువాత హరివంశ రచన.

ఇతరత్రా ఈయన అలికిడి వినబడక పోవడమూ, చూచి 1300-1310 నడుమ ఎఱ్ఱయ కురుములూరు వెళ్ళి వెళ్ళినకొద్ది రోజులకే వేమారెడ్డి అర్ధంకిఆస్థాన కవి ఐనాడని అనుకోవాలి. ఇదైతే 1275, 85 నడుమపుట్టి 1335 ప్రాంతాల అంతర్ధానమైనాడని ఊహించాలి. 'ఇప్పుడు అరణ్య రచన ఎప్పుడు? దీనికి సమాధానం నృసింహ పురాణంలో 'నన్నయ తిక్కనల మీద నీకు చాలా భక్తివుంది. అందువల్ల అరణ్యశేషం నిర్వహించావు. ప్రబంధ పరమేశ్వరుడవని అనిపించుకున్నావు! అని తనతాత ఎఱపోతన తన్నుగూర్చి అన్నట్లు ఉంది. దీనివల్ల తిక్కన భారతం చేసినాక దాన్ని పఠనం చేసి అరణ్యశేషం నిర్వహించి ప్రబంధ పరమేశుడైపోయి నృసింహపురాణం వ్రాస్తున్న ఎఱ్ఱన్న మన ఎదుట కనబడుతున్నాడు.

అరణ్యశేషం కాక ఎఱ్ఱయ చేసిన ఇతర గ్రంథాలు ఇవి: రామాయణం, హరివంశం, నృసింహపురాణం. నీలకంఠేశ్వర శతకం కూడా చెప్పాడేమో!

ఈయన తండ్రి సూరకవి. సూరకవి చేసిన సంక్షేపరామాయణం ఒకటి సంస్కృతంలో ఉంది. అతడూ ఇతడూ ఒకడో కాడో! తెలుగు సంక్షేప రామాయణం ఎఱ్ఱయరచనగా లక్షణ గ్రంథాలలో కనబడుతుంది. ఆ సంస్కృత-ఈ తెలుగు సంక్షేపరామాయణాల సంబంధం చూదామని అనుకుంటే తెలుగు సంక్షేపం లేదు.

ఎఱ్ఱయ యీ అరణ్య శేషం మల్లారెడ్డికి గాని వేమారెడ్డికిగాని కృతి ఇవ్వలేదు. ఆశ్చర్యమేమిటంటే నన్నయమీద తనకుగల భక్తి వల్ల ఆయన రచనగానే రాజరాజుకు కృతి యిచ్చాడు. నన్నయ రచనగానే ఎపుడు సాగాడో అవుడు రాజరాజుకే కృతి ఇచ్చి తీరాలి 'శౌంఠి కాయవు, నీ విది చేయగలవా?' అని అంటారేమో అని అనుకున్నాడేమో- 'నన్నయభట్ట మహాకవీంద్ర సరస సారస్వతాంశ ప్రశస్తి దన్ను జెందుటయు'అని ఆయనది ఆయనకే ఇస్తే బాగన్నట్లు-

'తద్రచనయ కా నారణ్యపర్వశేషము పూరించె గవీంద్ర కర్ణపుట పేయముగన్' అని వ్రాసి కొన్నాడు.

'.............నన్నయ
లాగు చెప్పియు రాజరాజుకే
యీగియిచ్చిన యోగిరన్నా!'

# గా లి పం ట

తిక్కన్న గారున్నూ, వారి శిష్యుడు సూరన్న గారున్నూ, అప్పయ్య గారున్నూ-నన్నయ్య మూడు పర్వాలు వ్రాశారని అన్నారు. కాబట్టి నన్నయ్య మూడాశ్వాసాలమీద నూటనలభై రెండు పద్యాలేకాక అరణ్యం సమగ్రంగానే వ్రాసివుండాలి. నూటనలభై మూటినుండీ కడవరకూ చెదలు తినడం వల్లనో, పురుగులు కొట్టడంవల్లనో, ప్రతులన్నీ ప్రాతగిల్లి చిల్లులు పడడం వల్లనో కొన్ని చోట్ల పద్యాలూపోయి ఉండాలి. పోయినచోట్ల ఎఱ్ఱయ్య అతుకులు పెట్టాడే కాని అది పూర్తిగా ఎఱ్ఱయ రచనకాదు'. అని సుమారు 50 ఏండ్ల క్రితము ఒక గాలివార్త బయలుదేరి ఇప్పటికి గాలిపంట అయింది. ఒకరు ఔనంటే ఇంకొకరు కాదంటూ ఆ వాదాన్ని లాగుకుంటూ వస్తున్నారు. అప్పయ్య అప్పకవీయంలో "స్ఫురదరుణాంశు"-పద్యానికి అక్షర మైత్రి చూపి అక్కడినుండి ఎఱ్ఱయ సొంత అల్లికయే అని తాను భారీగా చెప్పిన మూడు పర్వాలు అనే మాటకు ఇంచుమించుగా మూడు పర్వాలనే అర్థం తానే చెప్పుకొన్నాడు.

ఇక 'ఎఱ్ఱయ సొంత అల్లికయే' అని అనే వారలలో కొందరు – తిక్కన భారతానికి ముందే అరణ్యం ముగించి ఎఱ్ఱయ నన్నయరచనగా రాజరాజుకే కృతియిచ్చాడు కాబట్టి తిక్క మారయ అప్పయలకు అసత్యదోషంలేదు.' అని అంటారు. అనగా ఎఱ్ఱయ ఆశ్వాసాంతాలలో నన్నయ వ్రాసినట్లే గద్యవ్రాశాడు.

కొందరు—— 'అరణ్యమంతా నన్నయసొమ్మే. ఆ సొమ్ము తుప్పు తిని కొంత రాలిపోతే ఎఱ్ఱయ తన బంగారం కొంత అతికాడు! ఆ అతుకులు అతుకులుగానే కనబడుతున్నవి. చూడండి నన్నయగారి "రయవిచలత్తురంగ మాని"కి తన పాదాలు రెండతికించి ఎఱ్ఱయ బయటపడ్డాడు. నన్నయ సీసాల-అక్కఱల నియమాలు నిలుపలేకపోయాడు! అని అంటారు.

ఎఱ్ఱయ అల్లికయే అని అనేవారు- ఆ రయవిచలత్తురంగమం నన్నయదా? నన్నయ్యకూ మరికొందరకూ ఇంకొకళ్ల కబ్బాలలోని జాతిరత్నాలను తీసుకునే అలవాటు. అలాగే ఎఱ్ఱయా తీసుకుని ఉండవచ్చు. అదీగాక నన్నయ రచనగా సాగేతీరులో నన్నయ్య పాదములే గ్రహించి ఉండవచ్చు. చూడండి ఎఱ్ఱయ్య;

క. "సనకుడు సనందనుండును
సనత్కుమారుడు సనత్ సుజాతుండనగా"

అనే అనుశాసనికంలోని (1-3-16) తిక్కన గారి కందపాదాలు రెండూ నృసింహపురాణంలో పెట్టుకొన్నాడు.

ఇక బిగిలేని వెనుకదళాలు ముందుదళాలూ కల చంపకాలూ ఉత్పలాలూ నన్నయ్యవీ ఉన్నవి. సీసాలలోనూ అక్కఱలలోనూ తిక్కన్నను చూచి ఎఱ్ఱన్న నియమాలను వదులుచేశాడు. తిక్కన అక్కఱలతో అక్కర పెట్టుకోలేదనుకోండి. మిగిలిన గ్రంథాలలో ఎఱ్ఱనా పెట్టుకోలేదు' అని అంటారు.

కొందరు - 'తిక్కన రచనకు ముందే ఎఱ్ఱయ అరణ్యరచన కాబట్టి తిక్కనే ఎఱ్ఱన ననుకరించా' డని అంటారు.

కొందరు - 'ఈ పేర్లు కందంలో ఎవరు ఇముడ్చదలచినా ఈ క్రమంగానే' సరిగ్గా ఇల్లాగే ఇమిడిపోతవి. కాబట్టి ఇది ఒకళ్ళ సొమ్మింకొకళ్లు పెట్టుకోడం కాదు' అని అంటారు.

కొందరు అరణ్యం నన్నయదే అయితే దానిలోని - 'వెఱగుపడి'(7-159) అనే కందమూ ఎఱ్ఱయ నృసింహ పురాణంలో పాతుకుంటాడా ? అని అంటారు.

కొందరు-'అరణ్యంలో ఈ కందమంతా ఎఱ్ఱయ అతుకే. తన పద్యమంతా తాను తీసుకోవడంలో తప్పేమిటి ?' అని అంటారు.

ఇట్లా ఖండనమూ మండనమూ జరుగుతూ వున్నది. ఈ రీతిగా సాధక బాధక ప్రమాణాలతో నిజం కనిపట్టడం మేలే - 'శేషం కోపేన పూరయేత్తు'గా ఉండకుండా ఉంటే నృసింహపురాణంలోని; -

'ఉన్నత సంస్కృతాది చతు
రోక్తి పదంబుల గావ్య కర్తపై
యెన్నికమై ప్రబంధపర
మేశు డనంగ నరణ్య పర్వశే

షోన్నయ మాంధ్రభాష సుజ
నోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయ భట్ట తిక్క కవి
నాథుల కెక్కిన భక్తి పెంపునన్'.

ఈ పద్యంలో - "అరణ్య పర్వ శేషోన్నయము నిర్వహించితివి, ప్రబంధ పరమేశు డనంగ నిర్వహించితివి, ఆంధ్రభాష నిర్వహించితివి" గమనించండి. ఈ మాసికలకు తానూ తన తాతా ప్రబంధ పరమేశ్వరుడని అనుకుంటే మంచి రోజు చూచి మహాకవి అని బిరుదు వేసికున్నటు లుండదూ ? ఐక్కన అనవద్దూ? శ్రీనాథు డనవద్దూ ? లోకు లనవద్దూ ?

ఇంకొకటి - తిక్కన రచనకు ముందే ఎఱ్ఱయ అరణ్యరచన అని ఈ పద్యము నాలుగవచరణంవల్ల తేలిపోలేదూ ?



# 1. నాట్యవేదము

## "సచేతో హృదయ సంవాదము"

### నాట్యవేద రచనా కాలము

లక్షణము పుట్టుటకుమున్న లక్ష్య ముండవలయుననుట నాట్యవేదమువంటి సమగ్రమగు లక్షణ గ్రంథము ఉదయించుటకు మున్నె నాటక సమృద్ధి ఉండితీర వలయును.

నాట్యశాస్త్రమున అచట నచట యాస్కుని నిరుక్తము పోలికలున్నవి మఱియు నిది ఐంద్రవ్యాకరణపు పొలిమేరలలో సొనసొన పొడచూపును.

రామాయణము, భారతము - ఈ రెండును నటులను నాటకములనుగూడ నెరుగును. పడమటి విమర్శకు లివి యెరుగవని వ్రాసిరికాని బాల, యుద్ధ కాండలను - శాంతిపర్వమును జూచునది. వాత్స్యాయనుఁడు ప్రేక్షణీయకమును కుశీలవులను జెప్పటయకాక వారికిని ప్రేక్షకులకును గల సౌహార్దమును తెలిపెను.

మఱి పాణిని నాట్య సంబంధమున వేదముతో తాకుగల శిలాలిని మఱియు కృశాశ్వనే చెప్పెగాని భరతుని చెప్పలేదు. భారతుల జెప్పలేదు. భారతీయుల నైన (భరతార్థమున) చెప్పలేదు.

భాసుడు పాణిని వరరుచి మొదలగు వారికి ముందు ఒక్క నాటకమేని మనకు కనబడదు. మనకు కానవచ్చునవన్నియు భాసున కిటీవలివి. కావున సరి యగు సాధన సామగ్రి దొరకనంతవఱకును నాట్యవేద రచనా కాలమును భాసునకును కాళిదాసునకును నడుమనున్న కాలముగా చెప్పవలసి యున్నది. కాని ఈ హేతువాదముచే హృదయమును నమ్మింపగలుగు టెటులు? భాసున కును కాళిదాసునకును నడుమ పట్టుమని పదుగురు కవులేని ఇపుడు మనకు కన బడరు. కనబడిన నాటకము లీ మహా శాస్త్రలక్షణములకు వటధానిక యేని

కాగలుగునా ? కాన ఎవరు ఏ హేతువాద మవలంబించి నాట్యవేదరచనా కాలమును క్రీ. పె. ఐదవశతి కంటించిరో, వారు మరల ఆ హేతువాదమునె యవలంబించి అంతకు కడువెనుకనె ఎన్నో నాటకములు ఉండెననియు, ఏ కారణముననో కాలగ్రస్తము లాయెననియు, దాన నీ శాస్త్రము ప్రాచీనతరమనియు నిర్ణ యించుట లెస్స. దొరికిన వ్రాతప్రతులు నలుబదింటిలో ఏ రెండును పోలమియు, కొన్నిట వందలాది శ్లోకములు పెచ్చుగను కొన్నిట మిగుల లొచ్చుగను నుండు టయు దీనికి దోహదము. ఇదికాక ఈ శాస్త్రము నందే కల 'కారిక అనువంశ సూత్రానుబద్ధ' మొదలగు పలుపదములు పూర్వాచార్యాది ప్రసక్తములు. వాసుకి నవరస నిర్ణేతగా చెప్పబడెను. మఱియు భరత శిష్యులలో కోహలుడు కాక మరొక ప్రాచీన కోహలుడు వినబడుచున్నాడు. వీని నన్నిటిని బట్టి దృష్టి సారించితిమేని అది హరిజమునకు దాకి వెనుకకు మరలదా ?

## భ ర తు డు

క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది కావల నున్న పలువు రాలంకారికులు- వీరిలో ముఖ్యముగా శారదాతనయుడు మొదలుగా ఇటీవలి వారు ఇరువురు భరతులను పేర్కొనినారు. ఒక డాది లేక వృద్ధ భరతుడు. ఆది భరతుడు 12 వేల గ్రంథము నాట్యవేదమునకు కర్త. మరి ఉపపదము లేని భరతుడు దానికే సంగ్రహము 6 వేల గ్రంథము- 36 అధ్యాయములును గల నాట్యశాస్త్రమున కును కర్త. శ్రీమదభినవగుప్తపాదాచార్యులవారు దీనినే 'షట్సహస్రి' అనియు, 'షట్త్రింశి' అనియు, 'నాట్యవేద' మనియు వ్యవహరించిరి. ఇతడు భరతుని మునిగా జెప్పెను. ఇటీవలి వారును భరతుని మునిగను, సూత్రకారుని గను వాడిరి.

ఈ గ్రంథమువలన గాని యితరులవలన గాని భరతుని గురించి యేమియు తెలియరాదు. భ-భరతములో, ర-రాగములో, త-తాళములో నితడు లయము చెందుటతో చెల్లు. నాట్యశాస్త్రమున భరత శిష్యుల చేయి గూడ కలదని కిం వదంతి కలదనియు, అది నాలుక బుజమున వేసికొని తిరుగు పండితం మన్యుల మాట యనియు అభినవు డనెను. ఇది యెటు లున్నను ప్రకృత ముపలబ్ధమైన 36 అధ్యాయములును క్రీస్తు తరువాత ఎనిమిదవ శతాబ్ది మొదలు

కొని నేటివరకును చెరగక ఉన్నటుల భామహుడు మొదలుగా శాకుంతల వ్యాఖ్యాత రాఘవభట్టు వరకు గల ఉదాహర్తలవల్ల తెల్లము.

ప్రథమాధ్యాయము భరతుని బ్రహ్మలోకమున కెత్తుకొనిపోవుట చేతనో, మిగిలిన నాలుగధ్యాయములును అంతగా శాస్త్రీయములు కాకపోవుట చేతనో ప్రక్షిప్తములని మ. మ. శ్రీకాణేగారు. ఏ హేతువులచే వీరిటు లనిరో ఆ హేతువులచేతనే మరికొన్ని అధ్యాయములును ప్రక్షిప్తములని యనవలసి యుండును. ప్రక్షిప్తములు లేవని నే నన నుగాని 'హేతు వేక దేశమందే వ్యాపించు'నని అనుగమ మొనరించుట న్యాయమునకు తలపోటు. మరియు నాట్యశాస్త్రమునందె నటార్థమున భరత శబ్ద ముపయుక్తము. (చూ. 13-63) యాజ్ఞవల్క్య స్మృతి గత మగు:

"యథా హి భరతో వర్ణై ర్వర్ణయ త్యాత్మన స్తనుమ్
నానా రూపాణి కుర్వాణ స్తథాత్మా కర్మజా స్తమాః (తృ. 162)

ఈ శ్లోకమున వాడబడిన 'భరత' పదము నటార్థకము. ఈ స్మృతి నాట్యశాస్త్రమున కంటె ప్రాచీనతరము. బహురూప మిశ్రుడు - రాఘవభట్టు మొదలగు ఇటీవలి వారు వృద్ధ భరత-భరతసూత్రకృన్మ్మల భరతాది పదములను భిన్న భిన్న భరతు లందు వాడిరి. కాన భరతుని వీరినుండి విడబరచి చూప దుశ్శకమని మ. మ. శ్రీ కాణేగారు. ఇది నిక్కమే. మరియు సదాశివ భరతము, బ్రహ్మభరతము వీని వ్రాతప్రతుల తాటియాకులు కొన్ని దొరికిన వున్నవి ప్రకృత నాట్యశాస్త్రము ద్వాదశ సహస్రికి సంగ్రహమని కొందరి యూహ.

ఇది యిటుండగా శ్రీకాణేగారి వలెనే మొదటి ఐదధ్యాయములు 'నంది భరత'మని కొంద రూహించిరి. ఇట్టి యూహలు ఇంకను ప్రాచీనులవె కలవు. పై ఊహకు విరుద్ధముగ 'రూపక నిరూపణీయమ్ భరతః, రసాధికారికం నందికేశ్వరః'- భరతుడు నాటకములను, రసమును నందికేశ్వరుడును నిరూపించెనని రాజశేఖరుడు. ఇట్టి యూహలన్నియు భరతు డతి ప్రాచీనమని ఘోషింపవా?

## వ్యా ఖ్యా త లు

వ్యాఖ్యానము లేనిచో నాట్యశాస్త్ర ముండియు ప్రయోజనము లేదు. ఈ నాట్యశాస్త్ర మొక ప్రపంచము. ఈ గ్రంథము కాశ్మీరములందే పుట్టి, అచటనే పూడిపోయి మరల నెటు లెటులనో క్రీ. త. ఏడవ శతిలో కవిత్వమును సాహిత్యమును కలకల లాడినపుడు అనేక వ్యాఖ్యలతో విస్తరించి ఆసేతు శీతాచలము వ్యాపించినటులు కనబడుచున్నది. దీనిమీద వ్యాఖ్యాతల యెడ :—

"వ్యాఖ్యాతరో భారతీయే లోల్లటో భట్ట శంకుకః
భట్టాభినవగుప్తశ్చ శ్రీమత్కీర్తి ధరోఽపరః"-

అను శ్లోకము కనబడుచున్నది. వీరేకాక దత్తిలాచార్యులు, రాహులుడు, భట్టయంత్రుడు, నాన్యదేవుడు, 12వ శతికి చెందినవాడును వార్తిక కారుడును అగు హర్షుడు (కనోజాధిపతి) అనుమానముగా కోహలుడు, భట్టనాయకు డాదిగా పలువురు కనబడుచున్నారు. వీరిలో కొందరు నిండుగను, కొందరు పాతిక పఱక గను, వ్యాఖ్య లొనరించి యుందురని కొందరి యభిప్రాయము. వీరందరిలో శ్రీమదభినవగుప్తపాదాచార్యులవారి వ్యాఖ్య 'అభినవ భారతి' నేటికిని అభినవము. ఇదియు సంపూర్ణము కాదు. కాని ఇపుడు ఉపలబ్ధమయినది సుబహుశము. ఇది మహాభాష్యమునకు దీటు.

ఈ వ్యాఖ్యాతలందరు నించుమించు 8-11 శతాబ్దుల నడిమివారు. దశరూపకము, కావ్యానుశాసనము, సాహిత్య దర్పణము, నాట్యశాస్త్రము నందలి కొన్ని ఘట్టములకు వ్యాఖ్యాన ప్రాయములు. నాట్యశాస్త్రమునందలి రస సూత్రమె ధ్వనిప్రస్థానమునకు మార్గదర్శి. ఆనందవర్ధనుని వెల్గునె భట్టతోతు డభినవున కిచ్చెను. అతడు సహృదయ లోకమునకు 'లోచన' మిచ్చెను.

## అభినవ గుప్తపాదులు

వేయినోళ్ళతో చెప్పదగిన నితని నొకనోటనే చెప్పవలసివచ్చెను. అత్రిగుప్తుడు మూలపురుషుడు గాగల ఇతని తండ్రి నరసింహగుప్తుడు. తల్లి విమలకల. తమ్ముడు మనోరథగుప్తుడు. బృహద్విమర్శిని మొదలగు నితని

గ్రంథములను బట్టి ఇతడు క్రీ. శ. 950_1015 సంవత్సరముల నడుమ నుండెనని నిర్ణయింపవచ్చును.

మేడమీద ఒక పాఠశాలలో నితని చదువు. ఇతడు సహపాఠుల నోరు కట్టెడివాడట! కాన ఒజ్జలితనికి 'బాల వలభీ భుజంగః'_ ముంజూరు లేతపాము_ చిన్నచూరుత్రాచు-అని బిరుదు లిచ్చిరట. ఈ విషయమునే మమ్మటుడు 'అభినవగోపానసీ గుప్త పాదః' అని చమత్కరించినటులు వామనుడు కావ్య ప్రకాశటీకలో వ్రాసెను. అభినవుడు మాత్రము తన తంత్రాలోకమున "అభినవస్య కృతి స్సేయం యస్యోదితా గురుభిరాఖ్యా"- ఇది నా కొజ్జలు పెట్టిన పేరని చెప్పకొనెను. "పిత్రా స శబ్ద గహనే కృత సంప్రవేశః" అని ఇత డందే చెప్పకొనుటచే వ్యాకరణ పాండిత్యమును జూచి 'అభినవ పతంజలి' అను నర్థమున ఈ నామకరణము జరిగి యుండునని కొందరనిరి. ఈ బిరుద మితని అసలు పేరును మ్రింగివైచెను.

బాల్యముననే అభినవగుప్తునకు మాతృవియోగ మొదవెను. "మాతా వ్యయూ యుజదముం కిల బాల్య ఏవ"- ఆ దుఃఖానలము నితడు అమితమగు విద్యాతృష్ణచే మ్రింగ యత్నించెను. దాన గురువు లితనికి పెక్కురు- వ్యాకరణమున తండ్రి నరసింహగుప్త - ద్వైతాద్వైతమున వామనాథుడు- ధ్వనియందు ఇందురాజు- నాట్యమున భట్టతోతుడు_ బ్రహ్మవిద్యలో భూతిరాజు- ద్వైత శైవమున భూతిరాజ తనయుడు- క్రమత్రిక మార్గముల లక్ష్మణగుప్త. ఇతడు మరి పదమువ్వుర బేర్కొనెను గాని వా రే చదువులం దొజ్జలో చెప్పలేదు. మరియు ఆశ్చర్య మే మనగా ఇతడు జైన బౌద్ధములను గూడ నొజ్జలవద్ద చదివి—

"అహమప్యత ఏ వాధశ్చాత్ర దృష్టి కుతూహలాత్
నాస్తి కార్హత బౌద్ధాదీ నుపాధ్యాయా ససేవిషమ్—"

అని తన కళాతృష్ణను వెల్లడించెను.

## గ్రంథములు

అభినవుడు తంత్రమునం దారు గ్రంథములను, అలంకారమున రెండింటిని (కావ్య కౌతుక వ్యాఖ్య దొరకలేదు) వేదాంతములం దెనిమిదింటిని, చిన్న చిన్న

స్తోత్రాదుల నెనిమిదింటిని, ఉరమరిక యిరువది నాలుగు రచించెను. అందరకు లోచనము అభినవ భారతియె తెలియును గాని మిగిలిన వాని సంగతి తెలియదు. అభినవుని ఈ అలంకార గ్రంథములే కాక తంత్రాలోకము, బృహద్విమర్శిని లేక ప్రత్యభిజ్ఞా విమర్శిని, మాలినీ విజయవార్తికము మొదలగు గొప్ప గ్రంథములు తప్పక చదువదగినవి. ఇతని ప్రతిపాదన వైచిత్రి చూచినచో మమ్మటు డని నటులు కాక 'అభినవ పతంజలి' అను నర్థమునందే గురువు లితనికి 'అభినవ గుప్త పాద' బిరుద మిడియుందురని అనుకొనకమానము.

## మ హే శ్వ రు డు

ఇత డిన్ని శాస్త్రములయం దాచార్యు డగుటయకాదు. మరియొక విశేష మున్నది. మాతృ విషాద మితని వెన్నాడుచునే యుండెను. దాస మిగుల విరక్తి చెందెను. తల్లి బెంగ తన మెడకు పలుపని తెలిసికొనెను. "మాతా పరం బంధురితి ప్రవాదః స్నేహోతిగాఢీ కురుతే హి పాశాన్–" ఇంటిని, చుట్టమును పెండ్లిని విడనాడెను. "దారాసుత ప్రభృతి బంధు కథా మనాప్తః–" క్రమ మార్గమున త్రికమున సాధన చేసి తృప్తి సనక తుదకు శంభు (బు) నాథుని కడ కులమార్గమున పరమశివు నెరిగికొనెను. పోనుపోను మహామహిమ మండితు డాయెను. తుట్టతుదకు పంద్రెండు వందల మంది భక్తులతో భైరవ గుహ సొచ్చి మరల రాలేదు. ఈ గుహ శ్రీనగరము–గుల్మార్గ్‌ల నడుమ 'మాగమ్' అను పల్లెకు గవ్యూతి దూరమున నున్నదని కాశ్మీరములో కోవిదు లగు గ్రామవృద్ధులు చెప్పుదురు. కాశ్మీరముల బోయినవారీ గుహ చూడకమానరు.

## అభినవుని అభినవత్వము

బిడ్డలు లేమి విమలా నరసింహగుప్తులు భైరవు నారాధింపగా నభినవుడు కలిగెనట! 'క్రొత్తయ్య' అని మనము పేరు పెట్టుకొనుచో ఏ యర్థమొదవునో, ఆ యర్థమే ఈ యభినవ నామధేయమునకును మున్మొదట నొదవి యుండ నోపును గాని యిత డన్నివిధముల నభినవుడుగా కానిపించును. కాశ్మీరము లందు 7వ శతాబ్ది మొదలు 11వ శతాబ్ది వరకు వివిధ శాస్త్రములం దవిచ్ఛిన్న

ముగా మహాతరంగములు నిట్టపొడిచెను. అభినవుని సమయమున బహుశాస్త్రము లం దాచార్యులు కలరు. 'తస్యమే సర్వశిష్యస్య నోపదేశ దరిద్రతా'— అందరకు శిష్యుడనయిన నాకు ఉపదేశమున లేవడిలేదు—అని అతడు తన సకల శాస్త్రాభిజ్ఞత చెప్పుకొనును.

ఖండనలో పలువు రాచార్యులు ప్రతిపక్షుల తూల నాడుదురు. పరాత్రీశికా వివరణమునం దితడు— 'పద వాక్య సంస్కారములేని వారితోడి గోష్ఠి లజ్జాకర' మని ప్రతిపక్షి నెత్తిపొడిచినను, పదపటి అభినవ భారతీ రచనలో 'సత్పురుషుల మతముల దూషింపను గాని శోధింతును.' అని యనెను. అభినవునకు గురువు దైవము. ఏ గురువు ఏయే విశేషముల జెప్పెనో ఆయా విశేషముల ఆయా గురువుల పేరు చెప్పి వ్రాయసము సాగించును. ఇది మూఢభక్తి కాదు. భట్ట తోతుడును, సోమానందనాథుడును ఇతనికి నెత్తిమీదివారు. ఇట్లైనను తనకు సమ్మతి లేనిచో చెప్పక విడువడు. 'సరియగు పాఠమును ఎత్తి విరోధముల నుడిపి లక్ష్యము ననుసరించి ముళ్ళను విడదీసి పునరుక్తుల కేకవాక్యత చూపి తేట తెల్లముగా వ్యాఖ్య వ్రాయుదు' నని చెప్పి అభినవు డటులే చేసెను.

ఇతని అభినవత కొక చిన్న ఉదాహరణము— విశ్వకర్మ 'నాట్య మండపము నిర్మించితి'నని మనవి చేయగా బ్రహ్మ దేవతలతో తటాన అటకుజని కని 'దేవతలారా, మీలో చంద్రు డీమండపమును, లోకపాలురు దిక్కులును, మారుతులు విదిక్కులును, మిత్రుడు నేపథ్యగృహమును, వహ్ని వేదికను ఉప కరణములతోడి చర్మవాద్యముల సరంజామాను దివౌకసులు కాపాడుదురుగాక' అని నాట్యశాస్త్రమునందున్న కథకు — ౧ నాట్యగృహాధికారికి [General Manager] సౌమ్యత వలయునని (నాట్యశాలాపతి యగు దివాకరుడను బ్రాహ్మణునికడ నాట్యవేదమును చదువుకొంటినని భావప్రకాశకర్త శారదా తన యుడు) ౨ నాట్యశాలలో తగినంతగాలి ఉండవలయునని, ౩ నగ నట్ట మెరయు నంత వెలుగుతో నేపథ్యగృహ మొప్పవలెనని, ౪ రంగ వేదికాధ్యక్షుడు [Stage Manager] కరకుగా నుండునదనియు, ౫ శబ్దము మంద్రముగను గంభీరము గను ఉండుటకు మేఘముల ఉనికి ఉండవలయుననియు అభినవుడర్థము చెప్పెను. విక్రమోర్వశీయమున కాళిదాసు, కుట్టనీ మతమున దామోదరగుప్త మొ॥ కవు

లద్భుతత్వఖ్యాపనకు బ్రహ్మ భరతకథను యథాశ్రుతముగా గ్రహించినను, తాను సంప్రదాయమును రక్షించుకొనినను అభినవుడు భరతుని నూరుగురు పుత్రులకు అచ్చరలు మొ॥వారికి నాట్యానుగుణమును హృదయంగమమునగు నర్థము చెప్పను. కొన్ని కొన్ని విషయములు నవ్యులకును అతినవ్యముగ కనబడగల వగుటచే సర్వథా ఇత డభినవుడు.

మనువు నాట్యమును నిషేధించినను అభినవుడు యాజ్ఞవల్క్యుని స్వీకరించి నటులు, స్వోచిత ధర్మమును వీడనక్కరలేదనియు, వారికృత్యాకృత్యములతో మన కేమి పని యనియు, పైగా నిది వారికి మోక్షప్రద మనియు ఉదారత వెల్లడించును. [నటుల పతనము గురించి భరతుడు 36 అధ్యాయమున చెప్పెను.]

ప్రత్యభిజ్ఞా బీజమును తమ కెంతయో కాలముముందే అభిజ్ఞాన శాకుంతల మున నాటెనని కాబోలు నభినవునకు కాళిదాసుపై ఇబ్బడిమోజు. కావుననే అభినవ భారతిలో 'రమ్యాణి వీక్ష్య—' ఇత్యాదికము వివరించును.

## నా ట్య శా స్త్ర ము

దీనియందు నృత్తము నృత్యము నాట్యము — అనగా కావ్యములు నాటక ములు గానము మొదలగు వానికి సంబంధించిన అశేష విశేషములు కలవు. విషయము లివియకదా యని యనుకొందము. ఇందలి విషయసూచిక చదివినచో కనులు పెద్దవియగును. భగవంతుని ఉదరము ప్రవేశించిన మార్కండేయుడే ఈ గ్రంథమున ప్రవేశించిన చదువరి. ఇటీవల పరశ్శతములుగా రచితములగు నలంకార గ్రంథము లన్నియు దీని విభూతియే. వేయేల ? ఇట్టి గ్రంథ మే భాష యందును ఏ ఖండము నందును లేదు.

దీని యారంభము చూడ పురాణ మనిపించును. ఈ మొదటి కట్టుకత యందంతట రస భావ నాట సామాజికాదుల తత్త్వము గుప్తము చేయబడినది. మరియు వేదము బ్రహ్మముఖోద్భూతము. నాట్యమునకు వేదత్వకల్పనములో బ్రహ్మకర్తృతయు గుప్తమై యున్నది. దీని గూడ భరతుడే రచించి యుండ వచ్చుననియు, వృద్ధాచారాదుల ననుసరించి వృద్ధ భరతున కీ భరతుడు బ్రహ్మలోకాదుల సంబంధము కల్పించెననియు, నేల యూహింపరాదు ? ఈ కథ

మాత్రము పిచ్చికథ కాదే! కాని ఈ యూహ అభినవాది విరుద్ధము. ఇచట వరరుచి 'ఉభయాభిసారిక' యందలి నటవేశ్యాసంవాదములోని కుసుమపురమున గల ఇంద్రుని కోవెలను, అందు పురందర విజయమను నాటకపు పోటీని భావుకులకు గుర్తొనరింతును. ఇది ఇటుండుగాక! మనము ఈ నాట్యశాస్త్రమునను ముందులకు సాగుదుమేని ఒకానొక శాస్త్ర సముద్రతీరమున నిలుతుము. దాని మథింతుమేని, నిస్సంశయముగా ఒకానొక వేదామృతము దొరకగలదు. వేదము చెప్పునది, తన్ను అన్నిటను, అన్నిటను తన్నును కనుగొను బ్రహ్మానందము లేక భూమ. నాట్యవేదము చెప్పునది స్వసంవిదానందము లేక ఆత్మానందము. మఱియు శాంతరసపక్షమున తాత్కాలికమేయగు బ్రహ్మానందము. ఈ రెంటికినిగల పోలికల నారయునది.

రసశాస్త్రము భరతోపజ్ఞకము కాదు. భరతునకు మున్ను రసము నిరూపితము కాకపోదు. మఱి దానియెడ మతభేదములు నెన్నియో దొరకకపోవు; కాని మనకే తెలిసిన మేరలో భరతుడు రసప్రవక్త. ఇతడు రససూత్రము చెప్పి చక్కగా ఇటులు దృష్టాంతాదికముల వివరించెను.

'పలు సంబారువులతో సంస్కరించిన అన్నము, చక్కెర, పొంగలి, పులియోర మొదలగు వానిని నమలుచు, చవులూరగొనుచు హర్షాదుల ననుభవించునటులు, సుమనస్కులగు ప్రేక్షకులు నానాభావములను అభినయములను కనుచు వినుచు రత్యాదుల చవిగొనుచు హర్షాదుల ననుభవింతురు.'

ఇచట నమలుట దేహవ్యాపారమనియు, చవులు గొనుట మనోవ్యాపారమనియు అభినవుడు వివేచించెను. [స్థాయి భావములు అను రసముల చవిగొందురు.]

మరియు మరియొక దృష్టికోణమునుండి చూచి భరతుడు ప్రవచించిన రసస్వరూపమును అభినవుడు— "నటుడు నాటక మర్మము చేసికొని నటించును. అతని వ్యాపారమునకు సాధారణీభూతమగు కవిసంవేదనము మూలము. కవి సంవిత్తే రసమని పరమార్థము. సామాజికుడు కవి సంవిద్వశుడై రసమును చవిగొనును." అని చెప్పెను. [చూ. 6–38].

సాహిత్యశాస్త్రమున కంతకు రససూత్రమె హృదయము. ఈసూత్రమును లోల్లట, శంకుక, భట్టనాయకులు మూడురీతులుగా వ్యాకరించిరి. అభినవుడు మొదలుగా పలువురు వీరిని ఖండించిరి. వీని నన్నిటిని చక్కగా అవగతము చేసి కొనుట మనసుకు పదను.

భరతు డెనిమిది రసములనే చెప్పెను. (చూ. 6–16). అతనికి ముందున్న కవులాధికారికముగా శాంతరసమును గాని వత్సలాదులను గాని నాటకములందు నిరూపింపకుండుటయే దీనికికారణము కావచ్చును. సౌందరనందము నాగానందము మొదలగు కావ్యములు భరతున కిటీవలివి. మరియు భరతుడు ఎనిమిదిరసముల కును జాతి వృత్త్యాదులజెప్పి శాంతమునకు చెప్పలేదు. ఈ కారణములచే భరతు డెనిమిది రసములనే చెప్పెనని – ఒప్పెననికాదు. పలువుర నిశ్చయము. భరతు డష్టరసములనే చెప్పెనన్నచో భారతము నెరుగడని చెప్పవలెను. ఆనందుడు మొగలుగా ఈవలి వారందరును భారతమున శాంతరస మొప్పిరి. కాని వీనికి విరుద్ధముగా కాళిదాసు, వరరుచి అష్టరసములనే పేర్కొనిరి. కాగా భరతుడు నాట్యమున మాత్రమే ఒప్పలేదా ? కాని భరతుడు శాంతము చెప్పక పోవుటయె ఎలుగెత్తి చెప్పుట అని అభినవు డనును. ఇది యిటుండగా నిర్ణయసాగరముద్రిత మగు నాట్యశాస్త్రమున పాఠ్యగుణగణనమున వర్ణరసముల విషయమున "తత్ర హాస్య శృంగారయోః స్వరితోదాత్తైః వీరరౌద్రాద్భుతేషూదాత్త కంపితైః, కరుణ వాత్సల్యభయాన కేష్వనుదాత్త త్స్వరిత కంపితై ర్వర్ణైః పాఠ్యముపపాదయతి"– ఈ వాక్యమున వాత్సల్యము చెప్పబడినది. వత్సల రసమును భరతసమ్మతమని విశ్వనాథుడు సా. ద. 'మునీంద్ర సమ్మతముతో వత్సలరసః' అని వ్రాసెను. ఇచట మునీంద్రపదము భరతార్థకము. అది యటుండె.

అభినవుడు శాంతరసమునకు భరతముద్ర ఇచ్చి స్నేహ కార్ప్య శ్రద్ధా భక్తులను ఖండించి పదవ రసమును వెలివేసెను. కాని నేటి వరకును రసములు పెరుగుచునేయున్నవి. అభినవుడు శ్రద్ధారసమును భక్తిరసమును ఖండించినను రసరత్నహారమున శివరామపండితుడు శ్రద్ధను, భక్తిరసాయనమున మధు సూదనుడును, ఉజ్జ్వలనీలమణి యందు రూపగోస్వామియు లేవనెత్తిరి. రుద్రటుడు ప్రేయోరసమును, ధనంజయుడు అక్ష మృగయారసములను, భానుదత్తుడు

మాయారసమును ఉద్భావనచేసిరి. భోజదేవుడు ఉదాత్తరసము లేక ఊర్జస్విని ఉద్ధత రసమును నిరూపించెను. మధుర రసమును పలువురు స్థాపించిరి. అనుయోగ ద్వార సూత్రము వ్రీడనకరసమును చెప్పెను. శ్రీచైతన్యదేవుని శిష్యుడు కవికర్ణపూరుడు ప్రేమరసమును ప్రతిపాదించెను.

భావములన్నియు రసములు గావచ్చు నను నభిప్రాయము లోల్లటునితో మొదలై రుద్రటునితో పెరిగి, భోజదేవుచే—"రత్యాదులు అతిప్రకర్ష కలుగుచో రసములయినపుడు హర్షాదులేమి యపరాధము చేసినవి?" [శృంగార ప్రకాశిక] అని అనిపించెను.

ఇంకొకటి. రసమాత్ర మానందజనకమను ప్రాచీనుల యభిప్రాయము గూడ నిటీవలి వారి గ్రంథములలో రసకలికా, శృంగారదర్పణ, నాట్యదర్పణము లందు అంగీకరింపబడలేదు. మధుసూదనసరస్వతి భక్తిరసాయనమందు రెండవ ఉల్లాసముగ సాంఖ్యము ననుసరించి వివిధ రసానుభూతిలో తేడాగలదని అనెను.

## నాట్యశాస్త్ర సంగ్రహము

సంస్కృతము నందలి నాట్యవేదమును శ్రీ మాధవరామశర్మగారు సంగ్రహించి శ్రీమదభినవగుప్తపాదుల మహాభాష్యముతో తెలిగించిరి. వీరిది వరకు రసగంగాధరమును, ప్రతాపరుద్రీయమును, ధ్వనిసారమును, కావ్య ప్రకాశమును, అలంకార సూత్రమును, వక్రోక్తి జీవితమును తెనుగున రచించుట జేసి ప్రకృత నాట్యవేదమును గూడ తెనిగింపదగినవారని వేరచెప్పవలసిన పనిలేదు. తెలుగు సేతలో దేనికష్టము దానిదేకాని, దీని తెలుగు సేత మాత్రము తెలిగించు వారికి మాత్రమె తెలియగలది. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు దీని నెంత తొలచి అచ్చొత్తించినను అచట నచట నింకను మసకగనే యున్నది. దీని నవగాహన మొనరించుకొనుటకు ముందు వెనుకలు కూర్చుకొని సమన్వితి చేయగల దేగచూపు కావలెను. ఇంతియకాదు; శ్రీమదభినవగుప్తపాదుల ప్రత్యభిజ్ఞాది వాదములనేస్తము ఉండవలె. ఈ సామగ్రికంటె ఎక్కుడేగల శ్రీ మా. శర్మగారు దీనిని మనకొసగి ఆంధ్ర సరస్వతీ శరీరమును బలిష్ఠ మొనరించిరి.

చదువరు లలంకార శాస్త్ర వ్యాఖ్యాతలనుండి కవుల భావనాశక్తినే కాక, విషయమును విశదముగా విపులీకరించుశక్తినిగూడ కోరుకొందురు. వీరిలో భావనాశక్తిని మించిన విపులీకరణశక్తియు, విపులీకరణశక్తిని మించిన భావనాశక్తియు కలవు. "అందరు వత్సరాజులు కారని శ్రీహర్షు డనినట్లును, అందరును...కాళిదాసులు కారు అని అభినవు డనినట్లును, అందరు అభినవులు కారని శ్రీ మాధవులందురు. తాము అభినవులే అయిపోయినంతటిది వీరి భావన. ప్రాతిశాఖ్యమునందలి వీరి ఈ వాక్యములు గమనింపదగినవి :

"ఒకప్పు డొక పంక్తిభావము గోచరముకాక దినము దినములు గడిచినవి. ఏకదాభావ లోచనముతో నున్నపుడు...వచ్చి తెలియజెప్పినట్లు భావించితిని. తెలిసినట్లుండ వ్రాసెడివాడను... ఏమి వ్రాయుదునో అభినవుడే యెరుంగును... అక్కడక్కడ అభినవుల భారతీ పంక్తులు లేకపోయిన అభినవ పంక్తులు వ్రాయుట కుత్సుకపడిన నా యభినవ భావభావితమైన చిత్తరితియని నాకుగా నేనే వ్రాయుటయు నా కర్తవ్యముగ భావించితిని."

ఈ పంక్తులలో కల్మషములేని వీరి తపస్యా మనకు కనపడును. ఈతపస్యా ఇంకొకరు గుర్తింపగలయది కాదు. ప్రాతిశాఖ్యమునం దెల్లెడ నీ విషయమె ఒక భావన వెంట మరియొక భావనగా సముద్ర తరంగములవలె నిట్టపొడుచుచున్నవి.

వీరిబాస వేరు. కుంతకాభినవాదుల నిత్యమననము వలన నాకీబాస యలవడినదని వీరే వ్రాసికొనిరి. హేతువు కార్యము సరిగా నున్నవాయని తెలిసికొనుట మనపని. మరియు చదువరు లా మబ్బులలో దూరి మిన్నులను, మెరుపులను చూడవలసి యుండును. "శ్రీహర్షా! శ్రీ కృష్ణరాయా! తమరీ కొబ్బరికాయల కేల కృషి చేసితి రయ్యా"! అని గొణిగికొనినను వానిలోనిఅమృతమును గ్రోలని సహృదయు లుందురా? వీరిలో శ్రీ హర్షుడు పెట్టవలెననియే కొన్ని ముళ్ళుపెట్టితినని "గ్రంథి గ్రంథి రిహ క్వచిత్" చెప్పనె చెప్పెను. ఇటులే శ్రీ మాధవులు కూడ — నా ప్రయుక్త భాషను నే నారాధించుట నేర్చుకొంటిని. ఇది నాతపస్యా — అని చెప్పుచున్నారు. ఇక మనకేది దిక్కు? వీరిది మాత్రము నాటకేళము కాదు — మరి ప్రబంధమును కాదు — ఇదియో శాస్త్రము. ఇది ఒక

క్రొత్త సాహిత్యశైలి. మనము గుణలుబ్ధులమేని రచయిత మనస్సులో దూరుదము. దీనిని చదువను భావింపను మనమె అలవాటుపడిన సరి !

వీరు ఏయే విషయములందు కౌశలము చూపిరో ఆయా విషయములను మరియొక పోకగా ప్రాతిశాఖ్యము 45వ పుటలో ఉదాహరించి యున్నారు. భావుకులు వానిని పరిశీలింతురుగాక !

నాట్యగృహమునకు సంబంధించిన పెక్కు [పారిభాషికముల వలె కానిపించు] పదముల కర్థము నిర్ణయించుటలో అభినవుడే బహు విధములుగా భావించెను. నాట్య గృహప్రతిమలను లోగడే ఒకరు గీచి ముద్రింపించిరిగాని అవి సంతుష్టికరములుగా లేవు. రెండవసారి ముద్రించిన నేటి నాట్యశాస్త్రమున **Prof D. Subba Rao, B. E. A., M. I. E., Dean, Faculty of Technology and Engineering, M. S. University of Baroda** గారి వ్యాఖ్యయు, ప్రతిమలును ఆరవ అనుబంధముగా పరిశిష్టమున చేర్చబడినవి. ఇందు 'మత్తవారణి' మొదలగు క్లిష్టపదముల కర్థము విస్పష్టము. సదరు శ్రీ సుబ్బారావుగారు తమ వ్యాఖ్యాంతమున రచించిన :

> "అభినవ గుప్తో ప్యనుభవలుప్తో
> హ్యనుబత మర్థం వితరతి యత్ర
> అభినవ దృష్ట్యా సముదిత మర్థం
> ప్రముదిత బుద్ధ్యా విస్మృశత తత్ర."

అను శ్లోకము చదువతగినది. ఆ యనుబంధమును వారియనుజ్ఞతో ఇందు చేర్పతగియున్నది. మరియు ఈ ముద్రణమున అష్టోత్తర శతకరణములయు ప్రతిమలు కలవు. ఇవి చిదంబరమున నటరాజాలయము నందలివి. వీనిని గూడ నిందు జేర్పవలయును. దీనికెంతయో ధనము కావలెనని నేనెరుగక పోను. గాని, ఇది నా యభీష్టము.

వీరిశ్రమను నేను గుర్తించితిని. నేను లోటు వెదల శతముఖుడను. గుణముల యెడ వాచం యముడను.

నాట్యవేదము రెండవ సంపుటము గూడ కొలది నాళ్ళలో చూడగలమని ఆశింతము.



# 2. ఆంధ్ర ధ్వన్యాలోకము

## స మా లో క ము

ఎవరును కన్ను తెఱవక ముందే భరతముని కావ్యార్థము రసమని చెప్పెను. పిదపఁ బిదప ఆఱవ శతాబ్ది మొదలుకొని తొమ్మిదవ శతాబ్ది వఱకును కావ్య ప్రపంచమును కలకలలాడునటు లొనరించిన ఆచార్యులలో కొందఱు-కావ్య రస మాస్వాదించియు, నొకరు కావ్యమున కాత్మ 'అలంకార' మనియు - నింకొకరు 'గుణ' మనియు - వేఱొకరు 'రీతి' యనియు, వేఱువేఱు త్రోవలు త్రొక్కిరి. ఉరమరిక తొమ్మిదవ శతాబ్దిలోనివాడగు రుద్రటుడు - 'ప్రయత్నించి కావ్యమును రసములతోఁ గూడుకొనునటు లొనర్చునది' అని చెప్పియు, 'భావము' అను నలంకారమును వివరించు పట్ల 'వ్యంగ్యము కావ్యమునకు ఆత్మ' అను తలపు ముంగిట కాలు వెట్టియు, వెనుదిరిగి పోయి 'కావ్య మలంకార ప్రధానము' అని యనెను. పదునొకండు నాటి వాడగు నన్నయ - 'మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులును' [ఆది-౧.౮] అని చెప్పుట గమనింపదగినది. ఇటులు కావ్యాత్మ నొక రేటికిని, ఇంకొకరు కోటికిని లాగుచుండగా 860-'90 ల నడుమ కవితా పాండితీ ప్రతిభ చూపిన ఆనంద వర్ధనుడు - "కవితాకాంతకు ఆత్మ ధ్వనియనియు, శబ్దార్థములు - శరీరమనియు, అలంకారము లలంకారములేయనియు, గుణములు - గుణములేయనియు," ఎలుగెత్తి చెప్పెను. ఇది విద్వత్సభలలో కల్లోలము కలిగించెను. అవు ననువా రొకరిరువురు; కాదనువారు పలువురు. అట్టియెడ మనోరథుడను విమర్శకుడు- అర్థాలంకారములతో కాని, శబ్దాలంకారములతోఁగాని, మంచి సంఘటనతోగాని, కూడిన కావ్యము హృదయాహ్లాదమగునుగాని, ఇది యేదియును కాని ధ్వని యెటులు హృదయాహ్లాద మొనరించును ? కావ్యమునకు ధ్వని - ఆత్మ యేమిటయ్యా మూఢుడా ! 'ధ్వని యననేమి ?' అని మేము నిలువఁదీసి యడిగినచో "పెప్పెపె మెమ్మెమె' అని కాక మఱి యేమందువో"అని, అర్థమగునటు లీ పద్యము చెప్పెను.

యస్మిన్నస్తి నవస్తు కిఞ్చన మనః ప్రహ్లాది సాలంకృతి
వ్యుత్పన్నై రచితం చ నైవ వచనై, ర్వక్రోక్తి శూన్యంచ యత్
కావ్యం తద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యా ప్రశంసన్ జడో
నో విద్మోఽభిదధాతి కిం సుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః

మ. హృదయాహ్లాది, యలంకృతార్థ, మగు నేయే వస్తువున్ లేని దె
య్యేది, వ్యుత్పన్న వచో విహీనకృతియే, దెచ్చోట వక్రోక్తి యుం
డదొ, దానిన్ – ధ్వని యుక్త కావ్యమని, మూఢాత్ముండు-ప్రీతాత్ముడై
వదరున్, విజ్ఞుడు తెల్పుమన్న, ధ్వని రూపమ్మేమి భాషించెడిన్ ?

[పం. ల. నా. శాస్త్రి]

ఇది–విని, ఆనందవర్ధనుడు – ఈ ప్రశ్నములకును, వీనిని బట్టి తల యెత్తిన ప్రశ్నములకును, సమాధానము చెప్పుటకు నడుము బిగించెను. ఈ మనోరథుని మాట యిటుండగా, ఇంకొకడు – 'కావ్యమునకు ధ్వనియే జీవిత మాయెనేని, కంచే – కావ్యము కావలసివచ్చునే! కావ్యకాంతకు ధ్వని జీవితమా?' అని యిటు లొక పద్దె మల్లెను.

కాంస్యం కావ్యం కుతో న స్యాత్
కావ్య స్యాత్మా ధ్వని ర్యది ?
కిం కాంస్యవద్ ధ్వనేత్ కావ్యం ?
కంఠం భఙ్క్త్వాఽపి పశ్యతామ్.

ఆ॥ వె॥ ధ్వనియె కావ్య జీవితంబగు నెడలను
కంచు కబ్బమేల కాదొ చెపుమ !
కంచు మ్రోగునట్లు కబ్బంబు మ్రోగునా ?
గొంతు చించు కొంచుఁ గూయిడినను.

ఈ పద్యము విని ఆనందవర్ధనుడు నవ్వుకొని యుండును. అతడు – "అయ్యో ! మేము చెప్పునది కాదు. సహృదయులు మెచ్చుకొను నర్థమొకటి కలదు – అది ప్రతీయమానము. అనగా తోచుబడి యగునది. దానికి ధ్వని యనిపేరు" అని. ఇటులగుచో, ఇంకొక శంక కలుగుచున్నది. అశ్లీలము,

అసుందరము, ఈ మొదలగు నర్థము తోచుబడి యగునేని, అదియు – కావ్యమున కాత్మయా ? ఈ శంకించిన వారును, ఒక పద్యమే చెప్పిరి. కాదు. దానిని సహృదయులేకాదు. అసహృదయులును కొందఱు మెచ్చుకొనరు. [అసుందరమగు దానిని గుఱించి 283 వ పుట యందలి దిగువ ప్రభామతిని "అప్రయోజనమును గూఢముగాఁ జెప్పినంతమాత్రమున నది – ధ్వని కాదు...అసుందరమగు ప్రయోజన రూపార్థమును – గూఢముగాఁ జెప్పినను, ప్రకటముగాఁ జెప్పినను, గూడ – విశేషములేదు" అను దానిని పాఱఁజూచునది]. పోనిండు ! దానిని ధ్వనియని యెవరేని చెప్పిరా ? విద్వదగ్రగణ్యులగు వైయాకరణులు– "పలికినదె తడవుగా వర్ణములు మాయమై పోవుచున్నవి. అటులయ్యు వానివలన మనకర్థమగుచున్నది. కావున నిత్యశబ్దముండ వలయును. కార్య శబ్దమునందలి పూర్వ పూర్వ వర్ణముల అనుభవముచే గలిగిన సంస్కారముతోఁ గూడి, చిట్టచివఱ మొరయు వర్ణము, లేక, నాదము–ధ్వని. ఈ ధ్వని– అనిత్య శబ్దమును వ్యక్తము చేయును, వ్యక్తమగు నాశబ్దము–స్ఫోటము. దానమనకర్థము భాసమగును, ఈదెస, ఇచట ధ్వని – వ్యంజకము. స్ఫోటము – వ్యంగ్యము" అని చెప్పిరి. ఈ పోలికనుబట్టి కావ్యమున కాత్మయగు ప్రతీయమానమును మేమును ధ్వనియని వ్యవహరింతుము.' [ఆంధ్ర ధ్వన్యాలోకము – ప్రథమోద్ద్యోతమున 20½ పుటలో 'ధ్వనతీతి ధ్వనిః' ఈ మొ. ఘట్టములు – చూ]. అని చెప్పి ఆనందవర్ధనుడు ధ్వని సంప్రదాయ ప్రవర్తకుడాయెను. ఇది ధ్వన్యాలోకావతార చరిత్ర. ఇదియా ? ఇటులగుచో ఆలంకారిక పితామహుడు భామహుడు——

"శపథైరపి చాదేయం వచో న స్ఫోటవాదినామ్
నభఃకుసుమ మస్తీతి శ్రద్ధ ధ్యాత్క స్సచేతనః ?"

[భామహాలంకార – ౬–౧౨]

ఈ దెస-స్ఫోటము నభః కుసుమమని చెప్పెనే ? మఱియు భగవదుపవర్షుడును, దేవతాధికరణమున శంకర భగవత్పాదులును, కుమారిలుడు వార్తికమునను, ఖండదేవుడు ౧–౩–౧౧ అధికరణమునను, పార్థసారథిమిశ్రుడు శాస్త్రదీపికలో ౧–౧ పంచమాధికరణమునను, జయంతభట్టుడు– న్యాయమంజరిలో ౬వ అహ్నికమునను, శ్రీరామానుజులు జిజ్ఞాసాధికరణమునందును, వేదాంత దేశికులు వాచస్పతి మొదలగు వారును 'స్ఫోటము-బరువు'

అని ఖండించిరే! అని యందురు కావలయు; అది – వేఱుమాట. మఱియు వర్ణపదవాక్యభేదముచే స్ఫోటము-త్రివిధము. అది మరల-జాతివ్యక్తి భేదముచే ఆఱు విధములు. అఖండపద, వాక్య, స్ఫోటములు-రెండు. వెరసి స్ఫోట మెనిమిది విధములు. స్ఫోటము-ఆంతర ప్రణవరూపము. పరావశ్యంతులు-శబ్ద బ్రహ్మవ్యంజకములగు వాక్కులు. వైఖరీనాదరూపమగు ధ్వనిని- చెవి వినును. అది-భేరీనాదాదికమువలె, అర్థహీనము. మధ్యమానాదము – అర్థ వాచకమగు స్ఫోటాత్మక శబ్దమునకు వ్యంజకము. 'స్ఫోటము-ఉపాధి భేదముచే బహువిధము గాని, నిక్కమున కాకాశమువలె నొక్కటియే.' అని మంజూషలో నాగేశుడు – మఱియు – నతడే –

"వైయాకరణ నాగేశః స్ఫోటాయన ఋషేర్మతమ్!
పరిష్కృత్యోక్త వాం స్తేన ప్రీయతా ముమయా శివః!"

అని చెప్పుటచే స్ఫోటవాదము-పాణినికి పూర్వము. "సంగ్రహము" అను గ్రంథమున వ్యాడి-నిత్యశబ్దమును, కార్యశబ్దమును, చెప్పెను." అని మహా భాష్యము. హరి, కైయట, భట్టోజీ, నాగోజీలు దీనిని వివరించిరి. భాగవతము ౧-౨-౬-౩ మొదలగు సుమారు పంద్రెండు తావుల స్ఫోటమును చెప్పెను. 'ప్రాకృత ధ్వని-స్ఫోటమును గ్రహించుటలో హేతువు' అని హరి. శంకర భగవత్పాదులును వ్యవహార దశలో నిత్యశబ్దమును గ్రహించిరి. దానజేసియే, ఆనందుడు – తనయాలోకమున– "ఈ గ్రంథోద్దేశము ధ్వని యున్నదని స్థాపించుట కాదు. మరి వ్యంగ్యమున్నదనియు, అది రసాది రూపమనియు, చూపుట."

"అతఏవచేతి వృత్తమాత్రవర్ణన ప్రాధాన్యేఽఙ్గాఙ్గిభావరహిత రసభావ నిబంధేన చ కవీనా మేవంవిధాని స్ఖలితాని భవన్తీతి రసాదిరూప వ్యఙ్గ్య తాత్పర్య మేవైషాం యుక్తమితి యత్నోఽస్మాభి రారబ్ధో న ధ్వనిప్రతిపాదన మాత్రాభి నివేశేన."

"ఇతివృత్తమాత్ర వర్ణనమే ప్రధానమగునపుడు అంగాంగి భావ రహితము లగునట్లు రసభావములను నిబంధించుటచేత కవుల కేవంవిధములగు స్ఖలితములు [ప్రమాదములు] సంభవించును. కావున వీరికి [కవులకు] రసాది

రూపవ్యంగ్య తాత్పర్యమే యుక్తమని మేమీ ప్రయత్నము నారంభించితిమి. కాని ధ్వనిప్రతిపాదన మాత్రాభినివేశముచేఁ గాదు" అని చెప్పెను.

[ఆంధ్ర ధ్వన్యాలోకము 3 ఉ. ౧౧౩ పుట]

కావున ధ్వని-వ్యంజకము, స్ఫోటము-వ్యంగ్యము అను వైయాకరణుల పోలికను-ఆనందుడు తీసికొని ఈ వ్యంగ్య ప్రస్థానమునకు 'ధ్వని' అని పేరు పెట్టెను.

## వ్యం గ్య ము

పేరులో పోరు ఇటుల సమసెను. ఇక వ్యంగ్యమగు అర్థములో పోరు. ఈ కయ్యమునకు ముందితడు చాటువులను, అందఱకును ప్రమాణమగు ఆదికావ్యములు రామాయణ మహాభారతములను, కాళిదాసాది కవుల గ్రంథములను, సుమారు ఏఁబదింటిని అక్షయ తూణీరములనుగాఁ గొని సవ్యసాచి యాయెను. ఇక నిత డాదికావ్యములనుండి యొసగిన లక్ష్యముల నొకటి రెండు చూపుట పాడి.

(౧)

"రవి సంక్రాన్త సౌభాగ్య స్తుషారావృత మణ్డలః
నిశ్వాసాన్ధ ఇవాదర్శశ్చన్ద్రమా న ప్రకాశతే" [రామాయణము]

దీనికి, శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి ఆంధ్రీకృతి ఇది :—

గీ॥ అర్క సంక్రాంత సౌభాగ్యుడయి, తుషార
సంవలిత మండలుండైన, చంద్రమసుడు
తనరకున్నా డిపుడు, నిశ్వసనము తోడి
స్పర్శమున, నంధమైన [గ్రుడ్డిదైన] యాదర్శమట్లు [3].

ఇందలి అంధశబ్దము [అత్యంత తిరస్కృత వాచ్యము] "నిట్టూర్పులు సోకిన గ్రుడ్డి యద్దమువలె చంద్రుడు ప్రకాశించుటలేదు. [రామా] అద్దమునకు చూపేమి, అది గ్రుడ్డి దగుటేమి ? కాన నిచట ముఖ్యార్థము పొసగదు. ఈ నిమిత్తముచే అంధశబ్దము – 'అద్దము – పదార్థములను స్ఫుటీకరించు శక్తి లేనిది.' అని ముఖ్యార్థముతో సంబద్ధమగు నర్థమును లక్షింపజేయును. పిదప

వ్యంజనచే _ నిట్టూర్పుతో సంబంధము నొందిన యర్థము – అత్యంత మలినము, ఉపయోగహీనము, సౌందర్య రహితము, ఈ మొ॥ లక్షణా ప్రయోజన రూప మగు వ్యంగ్యార్థమును తెలుపును.

(ఆంధ్ర ధ్వన్యాలోకము – ౨౮. 13–14 పు.చూ.)

(౨)

గీ॥ ప్రత్యుపస్థిత ఘోర రూపమ్ములగుచు
కాలము లతిక్రమిత సౌఖ్యలీలలయ్యె
దినదినమ్మును, పాపీయ దివసయగుచు
విగత యౌవనయయ్యె పృథ్వీలతాంగి.

ఇందు కృత్ _ తద్ధిత – వచనములచేత – అసంలక్ష్య క్రమ వ్యంగ్య ధ్వనియు, "దినదినమ్మున్" "విగత యౌవన" అను వానిచేత – అత్యంత తిరస్కృత వాచ్య ధ్వనియు ప్రకాశింప చేయబడినవి.

ప్రభా :– అతిక్రాన్త సుఖాః కాలాః
ప్రత్యుపస్థిత దారుణాః
శ్వః శ్వః పాపీయ దవసా
పృథివీగత యౌవనా

అనునది వ్యాసభగవానుని మూల శ్లోకము.

[ఆంధ్ర ధ్వన్యాలోకమున, తృతీయోద్ద్యోతము గల ద్వితీయ
భా. 95.95 పు. చూ.]

మీది పద్యమునందు ఉపస్థిత, అతిక్రమిత, గత, అనునవి [క్తరూప] కృత్తులు 'పాపీయ' అనునది _ ఛ ప్రత్యయ తద్ధిత. 'కాలములు' అనునది బహువచనము.

'ప్రత్యుపస్థిత' అనుచోట 'క్త' ప్రత్యయముచే - దుఃఖము లిదివఱకే ప్రాప్తించి యుండుటయు, అవి – నిరాకరింపరానివగుటయు, 'అతిక్రమిత' అనుచోట భూత కాలార్థక 'క్త' ప్రత్యయము చేత _ సుఖమున కింకెప్పుడును

వర్తమాన కాలికత్వము లేకుండుటయు, ఆ కారణమున కాలము భయంకరమైన దగుటయు, 'గత' అనుచోటగల 'క్త' ప్రత్యయముచే — పృథివికి తిరుగ యౌవనము రాకుండుటయు, దాన నామె నిస్సార యగుటచే విడువదగియుండుటయు, పాపిజన సంబంధ బోధకమగు 'ఛ' ప్రత్యయముచే :— దివసములు నీచములగుటయు, 'కాలములు' అనుచోట నున్న బహువచనముచేత — కాలములు నానా విధములై యుండుటయు, వానిని త్రోసి పుచ్చుటకు వీలు లేకుండుటయు, వానిని క్లేశముచే గడుప వలసి యుండుటయు, 'దిన దినమ్మను' అనుటచే — ఒక నాటి కొకనాడు పాపీయములగు దివసములయొక్కయు, 'విగత యౌవన' అనుటచే వృద్ధ స్త్రీవలె నసంభావ్యమాన సంభోగయగు పృథివి యొక్కయు, దౌర్భాగ్య మత్యధికమగు చుండుటయు, ప్రకాశింప జేయబడుచున్నవి. కాలము స్వభావము చేతనే దుఃఖమయము. అందును పాపిష్ఠ జన స్వామిక పృథివీ లక్షణదేశ దౌరాత్మ్యము వలన మఱియు నది విశేషించి దుఃఖమయమగు చున్నదని భావము. మీది కృదాదులన్నిటి చేతను — నిర్వేదద్వారమున శాంతరసము ధ్వనింప జేయబడుచున్నది. జడమగు పృథివి యందు యౌవనము సంభవింప కుండుటవలన, 'విగత యౌవన' అను పదము 'పృథివి' — ఉపభోగ సమర్థము కానేరదు' అను లక్ష్యార్థమును ప్రదర్శించుట చేత — ఇం దత్యంత తిరస్కృత వాచ్యధ్వని కూడ కలదని యెఱుగునది. [ఆంధ్ర ధ్వ...ద్వితీయభాగము. ౯౩—౬ పు. చూ.

ఇక చాటువులలోను, కాళిదాసాది పద్యములలోను గల వ్యంగ్యమును ఆంధ్ర ధ్వన్యాలోకమున జూచునది. ఆనందవర్ధను డీరీతిగా వ్యంగ్యార్థము కలదని చూపి చాటుటకు మనోరథుడు, ప్రతీహారేంద్రరాజు, భట్టనాయకుడు, మహిమభట్టు, కుంతకుడు మొదలగువారితో సంకుల సమరము చేయవలసి వచ్చెను. ఇటులొనరించి యిందితడు జయించెను. జగన్నాథపండితరాయ లంత వానిచే జయపతాకముఁ బడసెను. నిక్కువమున కతని జయపతాక — "లోచనమే".

ఈ ధ్వని శాస్త్రము — సాహిత్య చరిత్రమును దివ్యచరిత్రముగా నొనర్చి దానియం దొక క్రొత్తశకమును ప్రవేశ పెట్టెను. ఇది వ్యాకరణ శాస్త్రమునకు పాణినీయము వంటిది. వేదాంత శాస్త్రమునకు బ్రహ్మసూత్రముల వంటిది.

'ధ్వన్యాలోక మలంకార శాస్త్రమున అనుసరింపదగిన సరణిని వ్యవస్థాపించెను' అని మహామహోపాధ్యాయులు పి. వి. కాణే గారి యభిప్రాయ మెవరికి శిరోధార్యము కాదు ?

ధ్వన్యాలోకము పాణినీయమగుచో లోచనము మహాభాష్యము. ధ్వన్యాలోకము బ్రహ్మసూత్రములగుచో లోచనము శంకరభాష్యము. అభినవునిగుఱించి శ్రీ జ. మాధవరామశర్మగారి నాట్యవేదము పీఠికలో వివరించితిని. గాన ఇచట నిక వినిపింపను. ధ్వనికర్తయు, ఆలోక కర్తయు నొకరా ? యిరువురా ? యను విషయము – పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారే వివరింతురు. పాఠకులు "కారికాకార వృత్తికార ద్వైతాద్వైతములు" అనువ్యాసమును చూచునది ?

## ఆంధ్రీకరణ మేల ?

వాదయుగమునం దెపుడో యవతరించిన ఈగ్రంథము నాంధ్రీకరింపనేల? మఱియు నీ ధ్వన్యాలోకమునే యాంధ్రీకరించుట కెందఱెందఱో 'నేను నేన'ని యెగబడి రేల ?

మంచిమాట. 'జాకోబీ' – దీనిని జర్మన్ భాషలోని కేల యనువదించెనో? శబ్దమునకు పాణినీయమెట్టిదో, కావ్య శబ్దార్థములకిది యట్టిది కావలయును. కావుననె జర్మన్ కవులకును, సహృదయులకును ఉపయుక్త మగునని తలపోయక. యతడిటులు చేయునా ? ఈ సాహిత్య శాస్త్రరత్నము సకల భాషలయందును అనూదితము కావలయును. మనకు చేతకాక, యింతకాలమునుండియు మిన్నులు చూచుచుంటిమి. ఇప్పుడు మన కృతజ్ఞతకు పాత్రము కావలయు వారు ఆంధ్రీకరించిరి. గ్రంథ ప్రయోజనము–మూలమిటులు చెప్పుచున్నది. చూడుడు.

> "ఇత్యుక్త లక్షణో యో
> ధ్వని ర్వివేచ్యః ప్రయత్నతస్సద్భిః
> సత్కావ్యం కర్తుం వా
> జ్ఞాతుం వా సమ్యగభియుక్తైః" [3–45]

"సత్కావ్యమును రచించుటకుఁగాని, తెలిసికొనుటకుఁగాని ధ్వనిని వివేచింపవలయును.' కావున కవులకుమ, కవులను అర్థము చేసికొను సహృదయులకును

అత్యావశ్యకము. శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు కవులు, మఱియు సహృదయులు. విశేషించి శాస్త్రజ్ఞులు. ఇట్టివారు దీనికి దొరకొనుట జాదులు ప్రసాదము.

## ప్ర భా మ తి

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఈ ధ్వన్యాలోకమును సంపూర్ణమగు లోచనముతో శాస్త్రీయముగను, సుందరముగను అనువదించి తెలుఁగులకు వెలుఁగులు చూపిరి. ఆలోకమున్నను కన్నులేనిచో ఏదియు కనరాదని అభినవుడు మనకు లోచన మొసగెను; మతిలేనిదే, లోచనమున్నను, తిన్నగా కానరాదని పం. ల. గారు— కౌముదీ ధవళితమగు 'ప్రభామతి'ని మన కొసగిరి.

## ఆం ధ్రీ క ర ణ ప ద్ధ తి

శాస్త్ర గ్రంథములను తెలిగించునపుడు – ప్రతిపదాంధ్రీకరణము మేలని కొంద ఱందురు. పాఠము చెప్పి ప్రవచనము చేయు రీతికి దరిదాపుగా నుండునటుల విపులమగు వ్యాఖ్య వ్రాయు పద్ధతి మేలని కొందఱందురు.

* ధ్వని కారికలును, వృత్తియు, మాత్ర మున్నచో మనకు లోచనము లేని చందమే! అది దైవికముగా నేటికి విప్పారినది. 'అగస్త్య డొక యెత్తు; అతని కమండల మొక యెత్తు'— అనునటులు— "ధ్వన్యాలోక మొక యెత్తు; లోచన మొక యెత్తు."— ముక్కూటమూడే ఈ ధ్వనిశాస్త్రము. ఈ మూటిలో నేయక్షరము మనకు తెలియకపోయినను మన కన్ను గ్రుడ్డికన్నే! కావున శ్రీ పం. ల. శా. గారు ఈ మూటిలోను దేనిని పోనీక, ఆంధ్రీకరించుటయు కాక, పాఠము చెప్పి ప్రవచనము చేయు రీతికి దరిదాపుగా నుండునటులు విపుల వ్యాఖ్యారూపముగా ప్రభామతిని సంతరించి మన కొసగిరి. * మఱియు ప్రభామతి ప్రథమోద్యోతమున శ్రీమదుత్తుంగోదయుని కౌముదిచే – అభినవు డెత్తుకొనిన వాదఘట్టముల మూలమూలల చీకటులను పారద్రోలినది.

విద్యార్థులును కవులును ఈ ప్రభామతితో ఆంధ్ర ధ్వన్యాలోకమును స్వయముగాఁ జదివికొని సాహిత్యశాస్త్రమున వ్యుత్పత్తి సంపాదింపగలరు.

కఠినమగు ఘట్టము లిందు పెక్కులు. అట్టివానిలో నిందలి ప్రథమోద్యోతము— ధ్వని లేదను వారి వాదములు మూటిని, ధ్వని లక్షణాంతర్గతమను వారి వాదమును, ధ్వని అనాఖ్యేయమను వారి వాదమును లెస్సగా పరిశీలించి ఖండించి సోపాన క్రమమున సాధించి 'ధ్వని ఉన్నది' అని స్థాపించును. ప్రభామతి యిట్టి పట్ల అభిధాశక్తిచేతనే—లక్షణాశక్తిచేతనే—తాత్పర్యశక్తిచేతనే— అనుమానముచేతనే—వ్యంగ్యార్థ మేల గతార్థము కాదు? మఱి స్మృతిలో నేల చేరదు? మఱియు లక్షితలక్షణచేతనే యేల సిద్ధింపదు? అను గహనములగు నీ ఘట్టములం దన్నియెడలను పాఠకుల కెచటఁ దెలియకపోవునో యని కంట వత్తిడుకొని ఉత్తర ప్రత్యుత్తరములతో మెట్లుమెట్లుగా వివరించుకొనుచు బోవును. ఇటులు చేయుట కెంత 'విజ్ఞత', 'బోధకత', 'ఓపిక' ఉండవల యునో కదా!

ప్రథమోద్యోతము—మఱియు 'కబ్యములందు వాచ్య'మనియు, ప్రతీయ మాన మనియు రెండర్థములున్నవి. వానిలో అలంకార రూపమగు వాచ్య మెల్లరెరిగినదే! మఱి ప్రతీయమానము, స్త్రీలలో ప్రసిద్ధములగు నవయవముల కంటె వేఱగు లావణ్యమువలె వాచ్యాదులకంటె వేఱా? అనిన వేఱే! ఈ ప్రతీయమానము రస వస్త్వలంకారభేదముచే ముత్తెఱగులు. ఈ ముత్తెఱగు లయు, భిదలలో ముక్కోటి భిదలు. ఈ వ్యంగ్యార్థము—వ్యాకరణ జ్ఞాన మాత్ర మునఁ దెలియునది కాదు. ఇది సహృదయైక వేద్యము. ఇట్టి ప్రతీయమానార్థము ప్రధానముగా భాసించు కావ్యమే—ధ్వని కావ్యము. సమాసోక్తి మొదలగు కొన్ని యలంకారములలో ప్రతీయమానమగు అర్థమున్నను, వాచ్యార్థమే ప్రధాన మగును. గాన నట్టి అలంకారములు మాత్రమే ఉన్న కావ్యము—ధ్వని కావ్యము కాదు. రామాయణ మహాభారతాదులలో కనబడు నీ ధ్వని—మాచే లక్షితమైనది— ఇది, ఇక అనాఖ్యేయ మెట్లు?" అను అంశములతో ముగిసినది.

చూచాయగాఁజెప్పిన పై విషయములలో - రోచనము లోతు లోతులు పరికించి చెప్పిన, ప్రతీయమానమగు నర్థమునందలి లౌకికత్వము, కావ్యవ్యాపా రైక గోచరత్వము, రసాదిధ్వనిత్వము, మఱియు రసాదులకు స్వశబ్దావాచ్యత్వము మొదలుగాగల ఎన్నియో రహస్యములు - ఈ ప్రభామతి సాయముచే మన కవ

గతములగును. * ఈ కాలమున కొంద రాంగ్లవిమర్శకుల త్రోవఁబడి - శిల్పము నందును కావ్యమునందును 'సౌందర్యము సౌందర్యము' అని ఒక ఘంటా ఘోషము వినబడును. ఇది కీట్స్ చెప్పిన "A thing of beauty is a joy for ever" - 'సుందరమగు వస్తువు శాశ్వతానందకరము' అను దానికి ప్రతిధ్వని. కీట్స్ వెనుక నున్నవారును దీనిని చెప్పలేదన రాదు. కాని కీట్స్‌తో దీనికి ముద్రపడెను. ఆయీ సౌందర్య ప్రతీతియే - కావ్యాత్మయా ? అను విషయమెంతయో శాస్త్రయుక్తముగా విచారించిన యీ లోచనమును, దానిని బాలురకును దెలియునటులు వివరించిన వీరి తేటతెలుగు వివరణమును, 20౩వ పుటలో నరయునది. మఱియు అవివక్షిత వాచ్యధ్వని కుదాహరణమగు :

"సువర్ణ పుష్పాం పృథివీం చిన్వన్తి పురుషా స్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్"

అను శ్లోకమును వీరెంతయో సొగసుగా :

పరిచరణ కృతియు, విద్యా
పరిచయ యుక్తుడును, శౌర్యవంతుడు, ననగన్
బరగు నరుట, చయనింతురు
పురుషులు ముగ్గురు – సువర్ణ పుష్పగఁ బృథివిన్. [ప్ర. 75వ పేరా]

అని తెలిగించిరి.

"పృథివిని సువర్ణములను పుష్పించు దానినిగా చయనింతురు" అనగా "సంఘటింతురు" అనునది – వాచ్యార్థము. ఇందు 'సువర్ణాని పుష్యతి' అని లోచనమున చెప్పబడినది – విగ్రహవాక్యము కాక, అర్థప్రదర్శకము మాత్రమే అగును. కనుక నిచట [ సువర్ణ మేవ పుష్పం యస్యాస్సా ] సువర్ణమే పుష్పముగా గలది. "సువర్ణపుష్ప" అను బహువ్రీహి – యుక్తము. కాగా 'భూమి బంగారు పూలను పూచునది' అను నర్థము గాని, 'భూమి బంగారు పూలు గలది' అను నర్థముగాని, ఏదయినను – సంభవించునది యగు నర్థము గలదికాదు. కనుక లక్షణచేత – 'సేవానిపుణుడును, విద్వాంసుడును, శూరుడును' అని తెలుపబడిన ప్రత్యేకములగు, సముచ్చయములచేత –

'వీరిలో నెవడయినను గూడ — అనాయాసముగనే విపులమగు ధనము నుపార్జించును' — అను లక్ష్యార్థము లక్షితమగును. తదుపరి 'ఈ లోకమునందు ఈ ముగ్గురే — అధికోత్కర్షము గలవారు' అనునర్థము వ్యంగ్యమగును. ఈ వ్యంగ్యము మిక్కిలి నిగూఢముగాక యించుక గూఢమై యుండుటవలన "ఘనకర ఘూర్జరీ కుచయుగ క్రియ గూఢముగాక ద్రావిడీ స్తనగతి తేటగాక, యరచాటగు నాంధ్ర వధూటి చొక్కపుం జనుగవవోలె' నుండును" అని తెలియునది, అని చక్కగా వివరించిరి. ఇచట మహామహోపాధ్యాయులు శ్రీకుప్పుస్వామి శాస్త్రి పాదులు తమ ఉపలోచనమున—

"సువర్ణాని పుష్ప్యతీతి సువర్ణ పుష్పా" అని లోచనము. ఇట కావ్యానుశాసనకారులు, — చిన్వన్తి = దైనందినమును సారముఁ గొందురు. [గృహీత సారనొనరింతురు] మేమన్ననో ఇటులు వక్కాణింతుము — 'చిఞ్ ధాతువు — ద్వికర్మకము. సువర్ణపుష్ప ప్రధాన కర్మ; పృథివి అప్రధాన కర్మ — [కాగా; కాంచన లతను, పృథివిని, పుడుకుదురు, లేక, కోయుదురు అని యర్థము] సువర్ణపుష్ప అనునది ఉత్ప్రేక్షించిన ఒకానొక కాంచనలత; ఆంగ్లభాషలో 'పగోడా టీ' 'Pagoda tree' ఇట్టిదే. ఇది లతార్థకమేని-సాక కర్ణ పర్ణ పుష్ప ఫల మూల వాలో త్తరపదాచ్చ' అని జీష్-ఏల రాలెదు ? ఇది—అప్రసిద్ధమును, గగన కుసుమము వంటిదియు, నగు లత; కాన జాతి వాచికాదు, గానరాదు. 'సువర్ణాని పుష్ప్యతీతి సువర్ణపుష్పా' అని చెప్పిన లోచనకారుల అభిప్రాయము—ఇదే' అని వ్యాకరించిరి. ఈ యూహ వినసింపుగనే యున్నది. పాఠకులు పరికించి చూతురు గాక !

శ్రీపంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు — తమ ఆంధ్ర ధ్వన్యాలోకమున నానందవర్ధనుడు — ఉదాహరణమున కొసగిన శ్లోకములనే [సూత్రములతోగూడ] తెలిగించిరి. మఱియు లోచనోదాహృత శ్లోకముల నన్నింటిని [లక్షణములతో గూడ] తెనిగించిరి. ఇది — ఎంతయు సాహసమనక తప్పదు. కాని వీరికిది-తగినసాహసమే. వీరి తెలిగింపులో నూటికి తొంబది చొప్పున స్వతంత్ర పద్యములనియే తోచును. గ్రంథ గౌరవ భీతి విడిచి యిచట నొకటి రెండు నుదాహరింపకమానను: [వీరు స్వతంత్రముగా నిబంధించిన నవలా: అనుఛందస్సు]. ఇది లోచనోదాహృత శ్లోకమున కాంధ్రీకృతి రూపము.

శాణోల్లీఢమయిన మణి _ శరదాశ్యాన పులినయగు తరంగిణి – మద క్షీణుడయిన నాగాధిపుడు – కళాశేషుడయిన శ్రీకుముద బాంధవుడు, ప్రాణేశ ప్రియ సురతమృదిత యగు బాల–హేతిదళితుడు రణ విజయియు దానర్థులయెడ గళిత విభవుడగు దాతయు _ 'కృశించియును శోభింతురు'

[ఆంధ్ర ధ్వ – ప్ర. 223 పేజీ]

చూడగలరా యిందొక పొల్లేని పొల్లు ? ఇంకొకటి _ లోచనోదాహృత మున కాంధ్రీకృత రూపమే.

నాకేలా పొరుగిండ్లవార్త లివి; యైనన్ దాక్షిణాత్య స్వభా
వైకాత్మన్, క్షణమూరకుండఁ, బ్రకృతిన్ వాచాలుడన్ నేను; భూ
పా ! కాంతున్ బ్రతి గేహమందు, విపణిన్, బానీయగోష్ఠ్యాదులన్
నీకీర్త్యంగన పిచ్చిదానివలె హా ! నిత్యభ్రమిన్ నర్తిలున్

[ఆం. ప్ర. 253 చూ.]

తెలుగునాడులో ప్రసిద్ధమగు—

'వెలమ కులంబునందు నిలువెళ్ళరు కాంతలటంచుఁ బల్కిన
ప్పలుకుల సత్యమయ్యెఁ గులపావనుఁ డీ ఘను దప్పరాయరాట్
కలభము కీర్తికాంత, కృతికాంత, మహీజయకాంత యిప్పు డీ
కలిజగమంతటన్ దిరుగగాఁ గనుగొంటిమి చిత్రమారయన్'

అను పద్యము – పై చాటువునకే పశ్యతోహరము. అదియటుండె. ఈ గ్రంథము – శాస్త్ర గ్రంథమయినను, శాస్త్ర గ్రంథమువలె చదువుటకు విసువు గలిగింపక, పెక్కుచోట్ల ప్రశ్నోత్తర రూపమున విషయమును వివరించుచు, చక్కని నాటకమో, నవలయో, చదువునప్పుడు కలుగు నానందమును కలిగించుచున్నది. మఱియు నీ తెనిగింపు – సాహిత్య విషయముననను, భాష యందును, సామాన్య జ్ఞానము కలవారికి గూడ – తెలియునంత సులభముగ నున్నది. వీరిచేత వెనుక 1944లో లఘువ్యాఖ్యతో ప్రకటింపబడిన ప్రథమ భాగము నందలి [ప్రథమ ముద్రణమునందలి] భాషాకాఠిన్య మీ ప్రచురణము నందు పూర్తిగా పరిత్యజింపబడినది. భావగాంభీర్యము, భావకాఠిన్యమువలె తోచును. ఆ భావగాంభీర్యమును త్యజించిన యెడల, ఈ శాస్త్రమునకు గౌరవ

ముండును ? కనుక అది — ఈ యాంధీకృతి యందు — పరిపుష్టమైనది. శ్రద్ధా యుక్తులగు పాఠకులకు గ్రహణ సౌలభ్యమును గలిగించు విషయమున, ఈ యాంధీకృతికర్త చేయవలసినదంతయు చేసియే యుండెను.

ఆంధ్ర ధ్వన్యాలోకమునందు ప్రగాఢములును, నిగూఢములు నగు శాస్త్ర చర్చలపట్ల ఒజ్జల యలతి సాయమున వలతిగా తెలిపినవారు ధ్వనిలేనిచోట ధ్వని యున్నదని వ్రాయసాహసింపరు. "ఇట్టివారు [సాహసించిన వారు] ఉందురా?" అని యందురేమో ? 1956 సం॥ సెప్టెంబరు భారతిలో 'అమృత్' అనువారి "కొన్ని ధ్వనులు' అను వ్యాసమును చూడుడని మనవి. మఱియు, ఈవ్యాసమున చూపబడిన కొన్ని ఉదాహరణముల కంటె వింతలగు నుదాహరణములనిచ్చి సమన్వయ పఱుప శ్రమించినవారును ఉన్నారు. అభినవ 'డిటులనును'—కేవలం తునయ మనవలంబ్యాపశ్రవణే [అర్థ శ్రవణేన] నాత్మ సంస్కార ఇత్యనార్య చేష్టితమ్' — ఇటులు చెప్పుచు బోయినను ఈ గ్రంథమునందలి మెలకువలెన్నియో మిగిలియేయుండును. అన్నారు కదా, శ్రీరాయడు శాస్త్రిలవారు _ "వీరి యీ గ్రంథమును గూర్చి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలుగారును, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారును, ఇతర విద్వాంసులును, సంతోష పూర్వకముగా నభిప్రాయము లిచ్చియున్నారు. కాని యవియుగూడ నీగ్రంథము యొక్క ఘనతను సాకల్యముగ చెప్పలేక పోయేనేమోయని తలంతును. ఘనమైన వస్తువును సాకల్యముగ నిరూపించుట కష్టసాధ్యముగదా !" అని. లఘువ్యాఖ్యతో ప్రకటించినపుడే, శ్రీ శాస్త్రిలవా రిటు లభిప్రాయపడిరి. శిష్యవత్సలులగు శ్రీ శాస్త్రిలవారిపుడు జీవించియున్నచో, సాంగమును, సలక్షణమును, సంపూర్ణమును, ముద్రితమును, అగు, ఆంధ్ర ధ్వన్యాలోకమును జూచి — శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి నాశీర్వదించి యెంత మురిసిపోయెడి వారో కదా ! అస్తు.

స్కూలు ఫైనల్ మొదలు జేసి యమ్మే [M. A.]వఱకును, తెలుగుగాని, సంస్కృతముగాని, ప్రధానముగా గాని, అప్రధానముగాగాని, చదువు విద్యార్థుల కనుగుణముగా - ఈ గ్రంథమ నలుతెఱగుల నవదరించి, పాఠ్యముగా చేసినచో తెలుగునాడున శబ్దజ్యోతిని నిలుపుటయ యగునని విద్యాధికారులకు విన్నవింతును.

ఈ బంగారును [illegible] నా వెలిగార [illegible] [illegible]యినది. వలసినంత వట్టు దీనిని దుడిచి అలంకరించుకొ[illegible]రుగాక !

చిరివాడ — శ్రీలూరి శివరామశాస్త్రి

25-2-'59 — శతావధాని

# 3. నృసింహ పురాణము

లక్ష్మీనృసింహావతార మను ఈ పురాణకథను ప్రబంధముగా వ్రాసినతడు కవిత్రయములోని ఎఱ్ఱయ. రామాయణారణ్య పర్వశేష హరివంశము లితని యితర కృతులు. వీనిలో రామాయణము నామావశిష్టము. కాని నేడు కొందఱు పరిశోధకులు ఇందలి పద్యములు చాల భాస్కర రామాయణములో కలిసె పోయెనని గాలించి పయికిఁ దీయుచున్నారు. నిజము నిలుకడమీదఁ దెలియును.

## ఊరు - తీరు

ఎఱ్ఱాప్రెగడ యూరు పాకనాటిలో గుడ్లూరు. ఇందు నీలకంఠుని దేవళము కలదు. విప్రనారాయణ చరిత్ర రచించిన మల్లయ 'ఎఱ్ఱయ చెదల్వాడ నిలయు'డని చెప్పెను. [1-13. విప్ర]. దాన ఎఱ్ఱయ గుడ్లూరు వదలి చెదలువాడను నివాసముగాఁ జేసికొనెనని ఊహింపవలయును. ఇతని తల్లి పోతమ్మ. తండ్రి సూరన్న. ఇతనిది శ్రీవత్స గోత్రము. ఆపస్తంబ సూత్రము. ఇతఁడు శివభాగవతుఁడు. [1]లక్ష్మీనరసింహావతారమును బట్టి [2]ఎఱ్ఱయ వంశవృక్ష మిటులు నాటుకొనెనని చెప్పవచ్చును.

భీమన

| | |
|---|---|
| బొల్లన | పోలమ [భార్య] |
| ఎఱ పోతన్న | పేరమ [భార్య][3] |
| బొల్లన పోలన జన్నన | సూరన పోతమ [భార్య]. |

ఎఱ్ఱాప్రెగడ

---

1) చూ. అరణ్య. 7-469.

2) 1-15. లక్ష్మీనరసింహావతార పీఠిక.

3) ప్రేకమా' అని శ్రీ వీరేశలింగం గారి పాఠము.

## కాలము

ఇతడు హరివంశమును వేమభూపాలునకు అంకిత మిచ్చెను. వేమభూపాలుఁడు ప్రోలయ వేమారెడ్డి. ఇతఁడు అనవేమారెడ్డి తండ్రి. ఇతఁడు ప్రతాపరుద్రుని ప్రభుత్వకాలమున ఒక సేనా నాయకుఁడు. ప్రతాపరుద్రుఁడు చెఱలో పెట్టఁబడిన పిదప 1320 మొదలుకొని 1349 వఱకు ఇతఁడు రాజ్యము చేసెను. కావున ఎఱ్ఱాప్రెగడ ఆనాఁటివాడు. అనఁగా ఇప్పటికి సుమారు ఆరు వందల సంవత్సరముల క్రిందటివాడు.[4]

## గురువు - తండ్రి - తాను

ఎఱ్ఱయ గురువు శ్రీ శంకరస్వామి.[5] ఇతఁడు కామకోటి మొదలగు పీఠములకు చెందిన ఆచార్యుఁడు కాడు. మఱి నిత్య శివరాత్రి వ్రతపరుఁ డగు శైవాచార్యుఁడు.[6] ఇఁక ఎఱ్ఱన తండ్రి సూరన ఆరాధ్యుఁడు.[7] ఇఁక ఎఱ్ఱన శంభుదాసుఁడు. అటులయినను విష్ణు విద్వేషి కాఁడు. విష్ణుభక్తుడు.[8] ఎఱ్ఱన తాత ఎఱపోతన "కబ్బము లల్లుట నీకు వెన్నతోఁ బెట్టినది.[9] ఆరణ్యపర్వ శేషము పూరించి ప్రబంధ పరమేశుఁడ వైతివి.[10] బహు పురాణములను ధర్మ

4. శ్రీ వీరేశలింగం గారి కవుల చరిత్ర చూ.

5. లక్ష్మీనృసింహావతార పీఠిక 1-18.

6. యామము లెన్మిదింట నియతాకృతిఁ బ్రత్యహమున్ శివార్చనా, రామత యొప్ప నిత్య శివరాత్రి వ్రతంబుగ బూని. లక్ష్మీ-పీఠిక 1-11.

7. బసవ పురాణమును సంస్కృతీకరించిన శంకరారాధ్యదెవరో తెలిసికొనవలెను.

8. ప్రాజ్ఞ ప్రాస్తుత భవ్య భోగ విభవ స్ఫారాత్ముఁ డారాధ్య సర్వజ్ఞుండు....లక్ష్మీ-పీఠి 1-25.

9. ....శంభు దాసుం డనగాఁ బరగిన గోవింద గుణాదర సంభృత సౌమనస్య ధన్యుఁడ వెదున్. లక్ష్మీ. పీఠిక 1-18.

10. ప్రబంధ రచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధంబై వెలసినయది. లక్ష్మీ. పీఠిక 1-20.

శాస్త్రములను ఎఱిగినవాఁడవు." అని ఎఱ్ఱనతో ననెను.[11] వేమభూపాలుఁడు "సకల భాషాకవిత్వ విశారదుఁడవు." అని ఎఱ్ఱయను ప్రశంసించెను.[12] ఇక ఎఱ్ఱన తన్ను గుఱించి "సకల లోకైక విదురు డయిన నన్నయభట్ట మహాకవీంద్ర సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ జెందుటయు" అని తాను జెప్పుకొనియెను.[13] విద్యాబల మింతగా నున్నను ఎఱ్ఱయ వినయమునఁ గాళిదాసును మించినవాఁడు.

> వ. 'కతిపయాక్షర పరిగ్రహ జనితంబయిన నైసర్గిక చాపలంబు కతంబున' [లక్ష్మీ 1-12]

ఇతని సౌజన్యము మునిమూర్ధన్యము. ఒజ్జల కితఁ డడిగఱ్ఱ,[14] సచ్చరితుఁడు. నిత్య సౌమ్యమతి. ధీరోత్తముడు.[15] ధర్మైక తత్పరుఁడు. శివ చిత్తుఁడు.[16] తన దైవమునకు దుష్టుని గాలి ఎక్కడ తగులునో యని వీవనతో విసరఁగలవాఁడు.

> "ఎక్కడి దెద్దు భూతియును నెమ్ములు సొమ్ములు భిక్ష జీవనం
> బొక్కటి కట్టఁ జీరయును నుండగ నిల్లును లేదు నిక్కువం
> బిక్కఱకుం దపస్వి జను నేఁచిన నయ్యేఁడు నేమి యంచుఁ దా
> నొక్కని శర్వునిం బఱుప నొల్లఁడు దైత్యుఁ డనాదరంబునన్."
>
> [లక్ష్మీ. 2-124]

## రచనకు బీజము

ఏదో ఒక మహా ప్రబంధము వ్రాయవలయు నను కుతూహలము ఎఱ్ఱయ కుత్కట మాయెను. ఒక క్షణము సమాహితచిత్తుఁడై కూరుచుండెను. అప్పుడు

---

11. సరస బహు పురాణ ధర్మశాస్త్ర కథా విస్తర వేదివి. లక్ష్మీ. 1-19.

12. హరి పూ. 1-37.

13. అరణ్య 7-469.

14. క. గురు భజన పరాయణుఁడు....వినయోచిత భరితుఁడు. లక్ష్మీ. పీ. 1-18.

15. హరి పూ. 1-37.

16. ....ధర్మైక తత్పరుఁడు....శివ పదాబ్జ సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు. అరణ్య 7-469.

తాత ఎఱపోతసూరి భావమున ఆవిర్భవించి "నాయనా! నీవు ప్రబంధ పరమేశ్వరుఁ డనఁగా ఆరణ్యపర్వ శేషమును నిర్వహించితివి. ఇపుడు నా ప్రియ దైవమగు అహోబలేశ నరసింహుని అవతారమును స్తుతింపుము" అని ఆదేశించెను. ఎఱ్ఱయ పులకించెను. ఆతని మనసు వికసించెను. ఆతని కనులు విచ్చెను. అతఁడు అద్భుతానందరసమూర్తి యాయెను. "ఇది ఈశ్వర శాసనము. నా తాత ప్రాచీన మునులవంటివాఁడు. నీవు నాపేరి వాఁడవని నన్నెపుడును ఆదరించుచుండును. ఆ మహాత్ముఁడును ఉభయ కవిత్వప్రౌఢుఁడగు నా తండ్రియు విష్ణు ప్రశంసచే పవిత్రమైన నా ప్రబంధము వలన సంతోషింతురు గాక" అని అనుకొనెను. ఈ లక్ష్మీనరసింహావతార రచన కుపక్రమించెను.

## ప్రబంధమా లేక పురాణమా?

ఎఱ్ఱయ యీ లక్ష్మీ నరసింహావతారమును ప్రబంధ మనియు,[17] కావ్యమనియు,[18] విశేషించి విజ్ఞాన వాఙ్మయ మనియు[19] వ్యవహరించెను. మఱియు ఈ ప్రబంధమునందు... "అనుచు ననేక విధంబులఁ బ్రహ్లాదుండు విజ్ఞాన పరవశుండై పలుకుచున్న పలుకులు" _ (5-73).

"తన తనిగాలి సోఁకునఁ జాల జిగురొత్తు
చతుర మనోజ్ఞ విజ్ఞాన లతలు" (5-157)

"పురుషాకారముతోడ నున్న సిరియో పుంస్త్వంబులేదో యచే
తరువో పుత్తడి రూపో చిత్తమును జైతన్యంబు నూన్యంబొకో
విరసత్వంబుల ప్రోవొ నిశ్చలకళా విజ్ఞాన సర్వస్వమో" (2-83).

17. ఇట్లు మహా ప్రబంధ కల్పనా కుతూహలా యత్తంబగు. లక్ష్మీ పీఠిక 1-14.
'ఆ తీర్థం బెఱిఁగింపు మాకుఁ బరమోదాత్త ప్రబంధోక్తులన్.' 1-5.

18. శ్రీకర కావ్య రూపతన్. లక్ష్మీ-పీఠిక 1-28,

19. ఈ విజ్ఞానాత్మక వాఙ్మయంబున. లక్ష్మీ పీఠిక 1-26.

అని యితఁడు విజ్ఞాన శబ్దమును శ్రీ, కల్యాణ[20] శబ్దములతోపాటు ఇను మిక్కిలిగా వాడెను. ఈ విజ్ఞానము భక్తి ప్రధాన మయినది.[21] ఇందు నాలు గైదాశ్వాసములు జ్ఞానభక్తి భరితములు. కాగా ఈతఁడు ఉపయోగించిన ఈ జ్ఞాన, విజ్ఞాన శబ్దములు పరమేశ్వరోద్దిష్టములు, ఆ పరమేశ్వరుడు ఈ ప్రబంధమున నామరూపములుకల నరసింహస్వామి.

## దీనికి మూలము

ఈ లక్ష్మీనరసింహావతారమునకు మూలము బ్రహ్మాండాది పురాణములు. వ. "మహర్షులు... అఖిల పురాణేతిహాసంబులు పరిపాటి వినుచుండి బ్రహ్మాండ పురాణంబునఁ దీర్ఘ భాగ శ్రవణంబు సేయు సమయంబున" (కథారంభ 1-1) వ. "బ్రహ్మాండాది పురాణోక్తంబయిన శ్రీ నృసింహావతారం బను పురాణంబుఁ దెనుగు బాసఁ బ్రకటింపవలయును." (లక్ష్మీ-పీఠిక 1-27).

కాని బ్రహ్మాండ పురాణములో ఈ కథ అల్పాల్పము.

ఎఱ్ఱన దేవశ్రవునిచే :

"ఏనును పెద్దలచే మును
వీను లలరఁ దరతరంబ విన్న విధంబున్
మానసమున నున్న తెఱఁగుఁ
గానుపునం గన్న క్రమముఁ గథన మొనర్తున్."
(లక్ష్మీ - పీఠిక 1-24)

అని చెప్పించెను. కావునఁ గొంత కల్పించినటులు మన మూహింప వలసి యున్నది. ఆ కొంతలో ఈ క్రింది కొంత చేరదు. ఏలనఁగా ఇందలి నాలవ యాశ్వాసమును, ఐదవ యాశ్వాసములో కొంతపాలును విష్ణుపురాణమునదలి నృసింహావతార విషయక ప్రశ్న ప్రతి వచనములకు ఆంధ్రీకరణము. ఇది భారతాంధ్రీకరణము వంటిదే. ఉదా :

20. చూ. హరి వంశము.

21. ప్రసన్న భక్తి నయ వాఙ్మయు. లక్ష్మీ 1-16.

"పఠ్యతాం భవతా వత్స సారభూతం సుభాషితం,
కాలే నైతావతా యత్తే స ఙోద్యు_క్తేన శిక్షితమ్.

శ్రూయతాం తాత వక్ష్యామి సారభూతం తవాజ్ఞయా,
సమాహిత మనా భూత్వా యన్మే చేత స్యవస్థితమ్.

అనాది మధ్యాంత మజ మవృద్ధి క్షయ మచ్యుతం,
ప్రణతో౽స్మ్యంత సంతానం సర్వ కారణ కారణమ్."

[1. అంశ. 17 సర్గ. 13, 14, 15]

పాపఁడ యింతకాలమును బాయక యొజ్జల యొద్దనుండి నీ
వే పగిదిం బఠించి తది యేర్పడఁ బ్రస్ఫురితార్థసారమై
తీపులు వీనులం గురియ దివ్య సుభాషిత రత్న మొక్క టు
ద్దీపిత ధీ విజృంభణ విధేయత యొప్ప నుపన్యసింపుమా.

అనుటయుఁ బ్రహ్లాదుం డి
ట్లనియెను నీ యాన తిచ్చి నట్టిద యయ్యా
వినిపించెద నామది మె
చ్చిన యర్థం బవధరింపు చిత్తప్రీతిన్.

ఆదియు మధ్యంబు నంత్యంబు నెవ్వాని
కరయ లేదని చెప్పు నాగమములు
పొదముటయును లేక పొదలుటయును లేక
తఱుగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వని వలనన యెంతయు సంభవ
స్థాన సమాహార దశలు చెందుఁ
గారణంబులకెల్ల కారణంబై యెవ్వఁ
డపగత కారణుండై వెలుంగు

నమ్మహానుభావు నచ్యుతు నవికారు
నమితతేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించినాఁడ నధిప యింతయకాక
యితరమైన యర్థ మెఱుఁగ నేను."

[చతుర్థ. ఆశ్వా. 5, 6, 7]

"విద్యాబుద్ధి రవిద్యాయా మజ్ఞానా త్తాత జాయతే,
బాలోఽగ్నిం కిం న ఖద్యోత మసురేశ్వర మన్యతే ?
తత్కర్మ య న్న బంధాయ సా విద్యా యా విము క్తయే,
ఆయాసా యాపరం కర్మ విద్యాఽన్యా శిల్పనైపుణమ్.
తదేత దవగ మ్యాహ మసారం సార ముత్తమం,
నిశామయ మహాభాగ ప్రణిపత్య బ్రవీమి తే.
న చింతయతి కో రాజ్యం కో ధనం నాభివాంఛతి
తథాపి భావ మే వైత దుభయం ప్రాప్యతే నరః.
సర్వ ఏవ మహాభాగ మహత్త్వం ప్రతి సోద్యమాః,
తథాపి పుంసాం భాగ్యాని నోద్యమా భూతిహేతవః.
జడానా మవివేకానా మశూరాణా మపి ప్రభో,
భాగ్య భోజ్యాని రాజ్యాని సం త్యనీతిమతా మపి.
తస్మాద్యతేత పుణ్యేషు య ఇచ్ఛే న్మహతీం శ్రియం,
యతితవ్యం సమత్వే చ నిర్వాణ మపి చేచ్ఛతా.

[1 అం. 19 సర్గ. 40-6]

మిడుఁగు అని తలఁచు బాలుఁడు
మిడుఁగుఱుఁ బుర్వుఁ గని మేన మిడికెడు జనుఁడున్
బొడుగునఁ దగు ప్రో వింతయు
జడనిధిగాఁ జూచు నవుల జాఱని తెలివిన్. [4-15]

అట్లగుటం జేసి: [4-16]

పెడవిద్య లెవ్వియును భవ
ముడుపఁగ లే వాత్మబంధ ముడుపునదియ యె
క్కుడు విద్య యట్టి విద్యలు
దొడగు పనియ మంచిపని విధూతకలంకా. [4-16]

ఇదియంతయుఁ దగఁ గనుఁగొని
మది నిస్సారంపు విద్య మరగక బంధ

చ్ఛిదఁ జేయు నాత్మవిద్యకు
నీదవఁ దొడఁగి నాఁడ నుడుగ నుద్యమ మెట్లున్. [4-162]

ఉద్యోగములకెల్ల నొదవునె ఫలసిద్ధి
యెవ్వాఁడు తొలుమేన నెంత చేసె
నంతియ వానికి నబ్బు నిబ్బాముున
శ్రీలు విద్యలు నెల్ల మేలు నాత్మఁ
గోరనివాఁడును గోరి యోపినయంత
నుత్సహింపనివాఁడు నొకడు గలఁడె
శూరత లేక యుదారత లేక యే
తెలివియు లేక యేతెఱఁగు లేక

యూరకుండెడు నీచుల కొదవు గరిమ
వారి వెరవున నెయ్యది వచ్చుఁ జెపుమ
యయిన నుద్యోగి గావలె నండ్రు బుధులు
భాగ్య మిట్టిది యని కానఁ బడదు గాన. [4-163]

కావున ముక్తికి యత్నము
గావింపఁగ వలయు సమత గల్గుటఁ గోరం
గావలయు నెప్పుడును స
ద్భావంబున సమత యెవ్విధం బండ్రేనిన్. [4-164]

ఇందు మొదటి మూఁడాశ్వాసములలోని వర్ణనాదులలో ఇత రానుకరణః లేనిచో అవి స్వకపోల కల్పితములు.

## వాస్తవ కథ

హిరణ్యకశిపుఁడు మహా పరాక్రమము గల రాజు. ఇంద్రుఁడును మఱి యే బలశాలి. ఇతఁడు ఇలావృత వర్షమునకు రాజు. ఇలావృతమునకు స్వమని పేరు. ఇలావృతవర్షము నందలి వారికి దేవతలని పేరు. హిరణ్యకుఁడు ఇంద్రునితో పోరి స్వర్గమును ఆక్రమించుకొనెను. దేవత లతనికి భీచెంది మనుష్యవేషములతో తిరుగఁ దొడగిరి. అపుడు భారతవాసులకు

మనుష్యులని పేరు. వారు ఒనువు ప్రజలు. పూర్వకాలమున మనుష్య శబ్దార్థ మిప్పటివలె ఇంత వ్యాపకము కాదు.

హిరణ్యకశిపుఁడు విష్ణు సమకాలికుఁడు. ఈ విష్ణువు వామన విష్ణువునకు వెనుకటివాఁడు. ఇలావృతమునకు ఉత్తరమున నున్న క్షీరోదర తీర భూములకు (?) ఇతఁ డేలిక.

ప్రహ్లాదునకును తండ్రికిని పడలేదు. హిరణ్యకశిపుఁడు కొడుకు నెంతయో హింసించెను. ప్రహ్లాదుఁడు విష్ణువు నాశ్రయించెను. తుద కెటులో ఈ తండ్రికొడుకుల నడుమ సద్భావము ఏర్పడెను. హిరణ్యకశిపుఁడు అను తాపము చెంది ప్రహ్లాదు నెడల వాత్సల్యము పూనెను. ధర్మజ్ఞుఁడగు ప్రహ్లాదుఁడును తండ్రిని పరమభక్తితోఁ[22] జూడ మొదలిడెను. నృసింహుఁ డేల హిరణ్యకశిపుని వధించెనో విష్ణుపురాణము చెప్పదు. నృసింహుఁడు స్తంభవను బ్రద్దలు కొట్టుకొని ఆవిర్భవించుటయు విష్ణుపురాణమున లేదు.

మృగయా విహారమున హిరణ్యకశిపుని ఒక సింహము చీల్చి, చంపి యుండును. ఇతఁడు విష్ణు విద్వేషి కావున ఆ విష్ణువే సింహరూపమున హిరణ్య కశిపుని చంపెనని కల్పన చేసియుందురు - అని వాస్తవవాదులు అందు. ఇది అధునాతనుల హిస్టరీ.

## కథాశరీరము - రసము

మొదటి మూఁడాశ్వాసముల కథాశరీరము భిన్న రసములయు భావములయు ఉదయాస్తములచే సుళ్లు తిరిగెను. ఏ రసమునకును నిలుకడలేదు. పిప

---

22. ఇత్యుక్త్వాంతర్దధే విష్ణు స్తత్ర మైత్రేయ పశ్యతః,
స చాపి పునరాగమ్య వవందే చరణౌ పితుః
తం పితా మూర్ధ్న్యుపాఘ్రాయ పరిష్వజ్య చ పీడితం,
జీవసీత్యాహ వత్సేతి బాష్పార్ద్ర నయనో ద్విజః
ప్రీతిమాం శ్చాభవ త్తస్మి న్ననుతాపీ మహాసురః,
గురు పిత్రోశ్చకారైవం శుశ్రూషాం సోఽపి ధర్మవిత్
పితర్యుపరతిం నీతే నరసింహ స్వరూపిణా,
విష్ణునా సోఽపి దైత్యానాం మైత్రేయాఽభూత్పతి స్తతః —విష్ణు. 1. అ

(శ్రీ నృసింహ) రౌద్రమున కంగముగా అంకురించిన ప్రహ్లాదుని భక్తి మాత్రము హిరణ్యకశిపు ద్వేషాదులచే పల్లవించి పుష్పించి ఫలించెను. ఆ భక్తి జ్ఞాన సమకక్షమై వెలసెను. కావున నీ ప్రబంధము కలగా పులగమై పురాణమని పేరు పొందెను.

ఈ కథకు బ్రహ్మ మానసపుత్రుల శాపము బీజము. హిరణ్యకశిపు వధ కార్యము. భగవంతుఁ డీ శాపమును-"శత్రుండు నిరంతరంబు ను (మ) ద్గతం బైనహృదయంబునం దస్మదీయ సాదృశ్యంబు తనకుఁ గావలయుటం దలంచుటఁ దత్ప్రకారంబు సాయుజ్య సంపత్కారణంబు-" (1-101) అని విశేషించెను. దీని కనుగుణముగా ఎఱ్ఱయ హిరణ్యకశిపుని చిత్రింపలేదు. హిరణ్యకశిపుఁడు "ఏను జగము లెల్ల నేలువాఁడ, విష్ణుఁ డనఁగఁ గలఁడె వేఱొకండు? నేనే పరమేశ్వరుఁడను" అని యీ మొదలుగా నను. వాత్సల్యమే లేని అతని హృదయము భయాదులచే భ్రమర కీట న్యాయముగా భాగవతము నందలి కంసాదుల హృదయమువలె భగవంతునికి గూడు కాలేదు. నిధన సమయము నందును హిరణ్యకశిపుఁడు జయుఁడని పాఠకులకు జ్ఞప్తి కలుగదు. శాపమునకు భగవంతుఁడు చెప్పిన ప్రతిఫలము ఇంచుకయు ముట్టదు. భగవంతుఁడు ప్రహ్లాదునితో 'నీ తండ్రికి ఉత్తమలోకప్రాప్తి యగు'నని మాత్రము చెప్పెను.

ఇందు కరుణ వీర రౌద్రాద్భుత శృంగార రసములు ఉన్నను ఈ ప్రబంధము వర్ణనీయుఁడగు నరసింహమూర్తివలె 'శృంగార వీర కరుణాద్భుతానేక రస నికర సంకుల ప్రకార దుర్నిరూపోపస్థానమై' యున్నది. (5-82). పౌరాణికమగు నీకథ కథపాళముగా నడపుచో నిటులు కాకతప్పదు. దానఁ జేసియే గద్యమునం దెఱ్ఱయ 'లక్ష్మీనరసింహావతారం బను పురాణకథ'యందు' అని వ్రాసెను. చెదలువాడ మల్లయ, అప్పకవి మొదలగువారు ఈ లక్ష్మీ నరసింహావతార మను ప్రబంధమును నృసింహ పురాణ మనియే వాడిరి. ఈ పేరిలో సౌలభ్య మున్నది కదా! తండ్రి పెట్టుకొన్న పేరునకు సొద్దుపెట్టి, లోకులే బొద్దుకోసి, పెట్టు పొట్టి పేరులు మన మెఱిగినవే. మఱియు భీమన నృసింహ పురాణ మొకటి కలదని వినికి.

## అష్టరసవాదియా?

"ఆడుదు రెల్ల ప్రొద్దు లలితాభినయంబున దేవకామినుల్
పాడుదు రింపు వీనులకుఁ బండువు సేయఁగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వ రసగోష్ఠి సుఖింతురు యోగి బృందముల్
క్రీడ యొనర్తు రష్టరస కీర్తిత భంగిఁ బ్రసన్ను లయ్యెడన్." [1-61]

అను వైకుంఠవర్ణనలో అష్టరస ప్రసక్తియే కలదు గాన, ఇతఁ డష్టరసవాది యని యనుచో ఈ ప్రమాణము దుర్బలము. ఏలనఁగా ఈ ప్రసన్ను లది భక్తి కావున ఇది ప్రకరణానుగతము.

శాంతరసము లేదని యెవరు ననరు. మహాభారతము శాంతరస ప్రధానమగు మహాకావ్యము. దానిఁ గొంత తెలిఁగించిన ఎఱ్ఱయ అష్టరసవాది యనుట ఆతని తల్లి గొడ్రాలని యనుట. శాంతము రసము కాదను పక్షము రూపకములలో. ఇంతియకాక ఇట 'ఇష్టరస' అని పాఠాంతరము. ఈ పాఠమే సాధు పాఠము.

## పోతన

సంస్కృత మహాభాగవతమున ప్రహ్లాదకథ ప్రసిద్ధము. పోతనవలన ఆంధ్రలోకమున సుప్రసిద్ధము. మొనమొన్నటివఱకు తెలుఁగునాట బాలుర కందఱకును కంఠస్థము. స్త్రీలు చల్ల చిలుకుచునో, మెల్లయలుకుచునో యీ కథను కోయిలల కుగ్గుపెట్టుదురు. ఆంధ్రభాగవతమునకు మాతృకయగు సంస్కృత భాగవతములోని విజ్ఞాన వాక్యములకును విష్ణు పురాణమునకును పోలిక కలదు. విష్ణు పురాణము భాగవతమునకు మూలము కదా! ఎఱ్ఱయ పద్యములు కొన్ని పోతన పోఁతలోఁబడి పద్మములవలె విప్పారెను.

(i) కుడిచినపుడు నిద్ర గూరిన యప్పుడు
మేలుకొనిన యపుడు మెలఁగినపుడు
విష్ణు కీర్తనంబు విష్ణుచింతయుఁ కాని
పలుకఁ డొండు బుద్ధిఁ దలఁపఁ డొండు. — [లక్ష్మి. 3-150]

పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మఱచెన్ సురారి సుతుఁ డే తద్విశ్వమున్ భూవరా!

[భాగ. 7-123]

(ii) ఊషరబీజముల్ భసిత యోజ్య ఘృతంబులు షండ కన్యకా
న్వేషణముల్ పయోధిగత వృష్టితతుల్ మృగ తృష్ణికాంబుగం
డూషలు దుర్గకానన కఠోరిత చంద్రిక లేడమూక స
ద్భాషలు విష్ణుమంగళ కథా విముఖాత్ముల కష్టజన్మముల్.

— [లక్ష్మీ. 5-24]

అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక సద్
గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడసద్
గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్.

[భాగ. 7-168]

(iii) వాసుదేవుని పాద వనరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁ దండ్రిగాఁడు
వేదచోదితమైన విష్ణు ధర్మమునకుఁ
గోపించు గురుఁడును గురుఁడు గాఁడు
భవదుఃఖములు మాన్పఁ బ్రభువైన హరిసేవ
నెడలించు హితుఁడును హితుఁడుగాఁడు
వర యోగమతమగు వైష్ణవ జ్ఞానంబు
వదలిన చదువును జదువుగాదు
కేశవాకార లీలలు గీలుకొని ము
దంబుఁ బొందని తలఁపును దలఁపుగాదు
మాధవస్తోత్ర ఘన సుధా మధుర రుచులఁ
జిలుక కుండెడు జిహ్వయు జిహ్వగాదు. [లక్ష్మీ. 5-22]

నిషేధ రూపమగు ఈ యర్థము పోతన పోఁతలో అర్థాంతర సంక్రమిత వాచ్య ధ్వనియై సుందర శబ్దమూర్తిని ధరించి యిటులు వెలువడెను :—

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని( జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి( దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీ(ది బుద్ధి బుద్ధి
దేవదేవుని( జింతించు దినము దినము
చక్రహస్తుని( బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు( జెప్పెడి గురు(డు గురు(డు
తండ్రి! హరి(జేరు మనియెడి తండ్రి తండ్రి [భాగ. 7-169]

ఇట్టి వ్యంగ్య రచనకును ఎఱ్ఱయయే పోతనకు త్రోవ చూపెను.

"హరిభక్తుల తపము తపము
హరిభక్తుల జపము జపము..." [లక్ష్మి. 2-33]

(iv) అడ(గబోయి నవ్వు దసురాత్మజు( డంబుజనాభు నవ్యయుం
బాడుద మాదిదేవు పదపంకజ పూజలు సేసి భక్తిమై
నాడుద మచ్యుతైక శరణాగతులం గని కర్మబంధమున్
వీడుద మంచు( బల్కు( గడు విస్మయ మందగ( దోడిబాలకుల్.
[లక్ష్మి. 3-149]

ఆడుదము మనము హరిరతి(
బాడుద మేప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజ సంగతి(
గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్. (భాగ. 7-248)

(v) ...వ... హిరణ్యకశిపు ప్రహ్లాద విషయ నిగ్రహానుగ్రహావేశ
వ్యతికర
విషమ సంరంభ దుర్వార గర్వారంభ భీషణాభిరూప సంస్థానంబును
(లక్ష్మి. 5-82)

వ... ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ
బహిరంగ జేగీయమాన కరుణా వీరరస సంయుతుండును......
(భాగ. 7–285)

(vi) "అంబుజోదర ధ్యాన తత్పరత యొకటి కాని బాలకుండు...
(లక్ష్మీ. 3–147)

"అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్తము.................. [భాగ. 7–122, 150]

ఇట్టివి ఇంకను పెక్కు లుదాహరణీయములు కలవు. వీనివలన ఎఱ్ఱన్న పోతన్నకు అన్నయని తెల్లము.

## భా వు క త

ఇందలి క్షీరసముద్రము వైకుంఠము భగవానుఁడు వసంతము పానగోష్ఠి నరసింహమూర్తి మన కనుల వ్రేలుదురు. ఎఱ్ఱయ భావనావిహంగము నడుమ నడుమ మూలాధారమునుండి సహస్రారమునకును, భూమినుండి స్వర్గమునకును ఎగురుట యీ వర్ణనములం దెడనెడ మనము కనుఁగొనఁగలము. ఎఱ్ఱయ జన్మతః కవి. భావుకత అతనికి పరివేషము. అతని కవితాశయ్య పుష్ప గుంఫితము. హృదయము రసప్రస్రవణము. ఈ పాట వినుడు :—

"పొందవు దుఃఖముల్ భయము పొందదు పొందదు దైన్య మెమ్మెయిన్
బొందవు తీవ్ర దుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్ర సౌఖ్యములు పొందు సమున్నత కీర్తు లెందు గో
విందపదారవింద పదవీ పరిణద్ధ గరిష్ఠ చిత్తులన్." (2–31)

పద్య మెంత అప్రయత్నముగా నడచునో !

"సనకుఁడు సనందనుండును
సనత్కుమారుఁడు సనత్సుజాతుం డనఁగా

మునివరులు వనజభవు నం
దను లేతెంచిరి ముకుంద దర్శన వాంఛన్. (2–82)

అర్థమున కనుకూలముగా ఛందస్సు ఎటులు పరుగిడుకో!

"రండు పోదము లెండు వేగమ ప్రస్ఫుర త్కులిశాయుధా
ఖండ ఖేలన హేతి భీతి నగ ప్రజాభయ దాయితా
చండ చండ తరంగ సంభ్రమ సంప్రవర్ధిత వార్ధికిన్
బుండరీక దళాక్ష మందిర భూమికిన్ మహి నేమికిన్." (2_145)

ఎత్తిచూపుటకుఁగాని, ప్రయత్నించి తెలిసికొనుటకుఁగాని పనియుండనంతగా ఇతని కవిత్వమం దెచటఁ జూచినను సౌందర్యము తరంగిత మగుచుండును.

తరంగములు లేచిపడుచు, నురుగుల కాంతి ప్రసరించుచు, పగడపుఁ దీగలు అటు ఇటు కొట్టుకొనుచుండ – బడబాగ్నితోడి సముద్రుడు చేతులాడించుచు, అట్టహాసము చేయుచు, జడలు విదిర్చుచు ఫాలనేత్రముతో తాండవించుచుండు శివునివలె నతనికిఁ గనుపట్టును. (1-34) హిరణ్యకశిపుఁడు నీట నిల్చి చేయు నుగ్రతపమునకు కమలి, కమలిని కన్ను మూసెనట. అతని వెచ్చ యూరుపులకు నీ రిగురగా మాఱటగా మంచునీరు కురిసెనఁట. అతని తపము తెఱఁ గంతయు నిదురలేక సరసి నల్లఁగల్వల కన్నులతో చూచుచున్నదఁట. 2.21) దిగ్గంతుల దంతములు ఊడఁబెఱికి బ్రహ్మాండ మను వాద్యమును వాయించుచు ముక్తాప్రాలంబములు కల రాకాశశాంకుఁ డను ఛత్రము తాల్చి మేరు సింహాసన మెక్కి జూచుచున్నాడఁట హిరణ్యకశిపుడు! (2–4) మలయ పవనుఁడు వేసఁగికి కలఁగి తలఁగి పోనేరక తాలవృంతములలో తల దాఁచికొనెనఁట. (3–69).

పెద్ద లుత్ప్రేక్షను అతిశయోక్తిని పెద్దగాఁ జెప్పుదురు. స్వభావోక్తి మాత్రము తక్కువ తిన్నదా? చూడుఁడు. వేసవిలో:

"పగళు లెలతోట నీడలు ప్రాఁతి యయ్యెఁ
బగళులును రేలు తనుగాలి ప్రాఁతి యయ్యె

రేలు వెన్నెల బయళులు ప్రియము లయ్యె
రేలఁ బగళులు నిద్రలుఁ బ్రియము లయ్యె" [3-73]

ఇప్పటి ప్రభుత్వమున నిషిద్ధమైన పానగోష్ఠిని పట్టుకొందము. ఒక సుందరిచేతి పానపాత్రమునఁబడి చందమామ గడగడలాడుచున్నాఁడు. ఎందుల కందురా, వినుడు. ఆ సుందరి మోమునందమునకు కన్నవెట్టిన దొంగ కాఁడా ఆ మామ? ఇపుడు పట్టుపడ్డాడు. ఇఁక వడవడ వడఁక కేమి చేయును? [3-97] ఇఁక వెన్నెలలోనికి పోదమా? అది రాత్రి యను తలఁపు పుట్టనీక, తమ మనుమాట విననీక, అవ్యక్త యను శంక నంకురింపనీక అంతఃకరణము నకు బ్రహ్మానందముగా నుండలేదా? [3-91] ఇఁక బ్రహ్మమునే చూతము. అది పాప పానుపున పండియున్నది. మంచుకొండ నెత్తమునఁ గ్రమ్మిన నీటి మబ్బు చాయకు నుపమేయము దాని సోయగము. అది విజ్ఞానమునకు నిర్దేశము ఒక పెడ సగుణము, ఒక పెడ నిర్గుణము. వెరసి ఉభయము. [3-14]

"జ్ఞానినా ముపకారాయ త్రిధా రూపం ప్రభు ర్వహన్
సగుణం నిర్గుణం చైవ తస్మాత్ సగుణ నిర్గుణమ్."

అను సూతసంహిత యిచట గుఱుతు వచ్చెడిని. ఎఱ్ఱాప్రెగడకు పరమేశ్వరుని యెడఁ గల అభిజ్ఞత ఎంతలోఁతో అంత విరివి. అది విశేషించి మూడవ యాశ్వాసమున అంగవర్ణనము నందును, దర్శనముల ఊఁతతోఁ జేసిన భగవత్ స్తుతి యందును, ఐదవ యాశ్వాసమున స్తంభోద్భవ వచనమునందును, దండకమునందును కనఁబడును. దర్శనముల ప్రాపునఁజేసిన స్తోత్రమున సాంఖ్యప్రస్తావములో ఈ దిగువ పద్యము కలదు:—

"దృష్టాదృష్ట ఫల స్పృహా విముఖులై దిక్పూర్వ తత్త్వక్రియా
సృష్టిం బ్రస్ఫుట తీవ్ర బోధమున నుత్సేకించి యవ్యక్త సం
సృష్టిం బాసి నిరస్త వైకృతు నుదాసీనాత్ము షడ్వింశు వి
స్పష్టైశ్వర్యుని నిన్ను సాంఖ్యు లెలమిన్ భావింతు రాత్మేశ్వరా!"

"ఓ పరమపురుషా! సాంఖ్యులు ఇహ పరలోక భోగముల ఆశకు పెడమొగము పెట్టి ఆకాశము మొదలుగా గల తత్త్వముల సృష్టిని (దిక్పూర్వ

మిచట ఆకాశపరము) నిశితజ్ఞానముచేఁ దాటి, అవ్యక్త సంబంధమును (సంసృష్టిః తిలతండులముల కలయికవంటి కలయిక)వీడి,నిస్సు వికారదూరునిగను ఉదాసీనుని గను షడ్వింశునిగను అనఁగా ఇరువ దాఱవ తత్త్వముగను తలతురు." అని అర్థము.

వేదాంతుల మతమున జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, భూతము లైదు, శబ్దాది విషయము లైదు, మనో బుద్ధ్యహంకార ప్రకృతి చిదాభాసు లైదుగురు. వెరసి ఇరువది యైదు-ఇరువ దాఱవవాఁడు పురుషుఁడు.

ఈ పద్యమున ఉదాసీనుఁడగు సాంఖ్య పురుషుఁడు ఇరువదిఆఱవ వాఁడని చెప్పఁబడెను. అనఁగా ఇదియే పరతత్త్వము లేక తత్త్వాతీతము.

## ౨౫. తత్త్వములు

సాంఖ్యము ఏమి చెప్పునో చూతము. సాంఖ్యకారిక-

"మూల ప్రకృతి రవి కృతి, ర్మహ దాద్యాః ప్రకృతి వికృతయ స్సప్త
షోడశక శ్చ వికారో, న పకృతి ర్న వికృతిః పురుషః"

అనియు, సాంఖ్య సూత్రము-"సత్త్వ రజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృతే ర్మహాన్, మహతోఽహంకారోఽహంకారా త్పంచ తన్మాత్రాణ్యుభయ మింద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని, పురుష ఇతి పంచ వింశతి ర్గణః" (౧-౬౧) అనియు ఇరువదియైదు తత్త్వములనే చెప్పును. "పంచ వింశ ఆత్మా భవతి" అను శ్రుతి యిందుల కుపష్టంభకము. ఇటు లగుచో ఈ షడ్వింశుఁ డెవఁడు?

## వి ద్యా ర ణ్యు లు

సర్వదర్శన సంగ్రహమున విద్యారణ్యులు సాంఖ్యదర్శనము ఇరువదేను తత్త్వములను చెప్పుననియు, పాతంజల దర్శనము—

"ప్రధానాదీని పంచవింశతి తత్త్వాని ప్రాచీనాన్యేవ సమ్మతాని. షడ్వింశస్తు పరమేశ్వరః క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుషః స్వేచ్ఛయా నిర్మాణకాయ మధిష్ఠాయ లౌకిక వైదిక సంప్రదాయ ప్రవర్తకః సంసారాంగారే తప్యమానానాం ప్రాణభృతా మనుగ్రాహకశ్చ."

[సాంఖ్యము చెప్పిన ప్రధానాదులగు ఇరువదియైదు తత్త్వములే యోగ దర్శనమునకును సమ్మతము లయినను, ఇరువది యాఱవవాఁడు పరమేశ్వరుఁ డొకఁ డున్నాడు. అతఁడు క్లేశాదులచే అంటబడఁడు. అతడు ఇచ్ఛామాత్రమున నిర్మాణకాయ మధిష్ఠించి [23]లౌకిక వైదిక సంప్రదాయములను నడుపును. మఱియు సంసారాగ్నిలో దహించుకొని పోవుచుండు జీవుల ననుగ్రహించును] అని యోగము ౨౬ తత్త్వముల నొప్పెననియు చెప్పెను. ఇటు లితఁడు చెప్పుటకు-'క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః' (౧-౨౪) అను యోగ సూత్ర మాకర మనుచో సాంఖ్య సూత్రమునను ఇట్టి ఈశ్వరుఁడు కలఁడు.

"సహి సర్వవిత్ సర్వకర్తా" (౩-౫౬)

"ఈదృశేశ్వర సిద్ధిః సిద్ధా" (౩-౫౭)

యోగదర్శనమును సాంఖ్య దర్శనమును చెప్పిన యీ యీశ్వరుఁడు జన్యేశ్వరుఁడు. దాననే అనిత్యుఁడు. కొందఱు సాంఖ్యు లీశ్వరు నొప్పరు. వారు నిరీశ్వరులు. దానఁజేసి విద్యారణ్యు లీ స్వల్ప భేదము నాశ్రయించి, షడ్వింశుని ఈశ్వరుని విడివిడిగా చెప్పియుండ నోపును.

## ౨౬ తత్త్వములు

ఇది యిటులుండఁగా భారతము సాంఖ్యముననే ఇరువదాఱు తత్త్వములు గాని, యోగమున ఇరువదేనే తత్త్వములని యిటులు చెప్పుచున్నది :-

... ... యోగానాం ... ... ...
పంచ వింశా త్పరం తత్త్వం పఠ్యతే న నరాధిప,

---

23. ఒక పరియే ఒకటిగాని పెక్కులుగాని శరీరముల నిర్మించి వానియం దునికి గొని, అని అర్థము.

24. క్షరంబగు వ్యక్తంబు దొఱంగిన పంచ వింశకుం డక్షరం బనంబరగు. నక్షరంబునకుం బరంబైన దానిం బెక్కండ్రెఱుంగరు. సాంఖ్య సూక్ష్మ దర్శకులు గాంతురు. క్షరాక్షర పరంబు లప్రబుద్ధ బుధ్యమాన బుద్ధంబులను నిర్దేశంబులు గలిగియుండుఁ బరతత్త్వ నిర్దేశంబునం బొల్చు షడ్వింశకంబు బుద్ధంబును విమలంబును నప్రమేయంబును సనాతనంబునునై పంచ వింశకంబును జతుర్వింశంబునుం గనుచు వెలుంగు. (శాంతి. ౬-౫౬)

... ... ... ...

బుద్ధ మప్రతిబుద్ధత్వా ద్బుధ్యమానం చ తత్త్వతః
బుధ్యమానం చ బుద్ధం చ ప్రాహు ర్యోగనిదర్శనమ్.[25]
-వావిళ్ల వారి ప్రతి. శాంతి. 307

యోగు లిరువదేనవ తత్త్వముకంటె నింకొక తత్త్వమును చెప్పరు. స్వరూప మెరుగమి బుద్ధుఁడు (పురుషుఁడు) బుధ్యమానుఁడు. అనఁగా తెలియఁబడుటకు విషయమగుచున్నాఁడు. కావున యోగులు బుధ్యమానుని బుద్ధినే చెప్పుదురు.[26] అనఁగా తెలియఁబడు దానిని(అవ్యక్త), తెలిసిన వానిని మాత్రమే (పురుష) చెప్పుదురు.

ఇఁక అనుశాసన పర్వమన్ననో-

"అథ మూర్ధసు(ని) యః ప్రాణాన్ ధారయేత సమాహితః
బుధ్యమాన మవాప్నోతి ద్రవ్యావస్థం న సంశయః[27]
బుధ్యమానా[28] ప్రబుద్ధాభ్యాం స బుద్ధ ఇతి పఠ్యతే
బుధ్యమాన మబుద్ధశ్చ నిత్య మేవానుపశ్యతి

వికార పురుష స్త్వేష బుధ్యమాన ఇతి స్మృతః
పంచ వింశతి తత్త్వం తత్ ప్రోచ్యతే నాత్ర సంశయః
యది బుధ్యతి చైవాయ మన్యోయ మితి భాస్వరః
న ప్రబుద్ధోఽను వర్తేత పానీయం మత్స్యకో యథా.[29]

---

25. అవ్యక్తము పురుషుఁడు అను రెండు తత్త్వములనే స్వీకరించు నెడల విధి నిషేధ మోక్ష ప్రతిపాదకమగు శాస్త్ర మెవరికి? కావున జీవుని గూడ విడిగా నొక తత్త్వము క్రింద స్వీకరింపవలయునని యోగము దెస సాంఖ్యుల ఆరోపణ. ఇది భారతము సాంఖ్యమును తన పక్షముగాఁ జేకొని చేసిన ఆరోపణ అని వేఱ చెప్పనక్కఱలేదు.

26. తిక్కన దీనిని తెలిగింపలేదు.

27. వావిళ్ల ప్రతి. అనుశాసన. ౯౦-౧౧౦.

28. ప్రబుద్ధ అని పాఠాంతరము. దీనికే తిక్కన తెలిగింపు అనుగుణము.

29. తెలిగింపులో అబుద్ధుఁడని యుండుటవల్ల పాఠాంతరమేదో ఇచటనుండియుండును. చూ. అను. 4-200, 201.

సనత్కుమారుఁడు శివునకు యోగమును వివరించుచు ఈ శ్లోకములచే బుధ్యమానుని ప్రబుద్ధుని అబుద్ధునిఁ జెప్పెను. కాగా యోగమునఁ గూడ ఇరువదాఱు తత్త్వములు తేలినవి. ఇది పూర్వాపర విరోధము. వావిళ్లవారి ముద్రణమున ఈ యధ్యాయములు రెండు మూఁడు ప్రక్షిప్తములని తోఁచెడిని. దీనికి నీలకంఠ వ్యాఖ్య లేదు. పూనా ప్రతిలో ఈ భాగములేదు.

అనుశాసన మీ యధ్యాయముననే-

"చతుర్వింశతి మేవాత్ర కేచి దాహు ర్మనీషిణః 27
కేచి దాహు స్త్రయోవింశం యథా శ్రుతి నిదర్శనం,
వయం తు పంచవింశం వై తదధిష్ఠాన సంజ్ఞితమ్ 28
తత్త్వం సమధి మన్యామ స్సర్వతంత్ర ప్రలాపనాత్." 29

"అరయఁగఁ దత్త్వము లనునవి
యిరువది నాల్గంద్రు కొంద ఱిభదనుజహరా
యిరువది మూఁడనుటయుగల
దిరువదియే నంద్రు వానినే యెట్లన్నన్. [అను. ౪.౧౩౩]

అనియు, శాంతిలో :- "ఆత్మానం బహుధా కృత్వా తాన్యేవ ప్రవిచక్షతే" (309-1) ఆత్మను మాయచే విశ్వ తైజస ప్రాజ్ఞ విరాట్ సూత్రాంతర్యాము లనుగా విభజించి, విభజించిన ఆ రూపములనే తత్త్వములనుగా చూతురు. కాన ఆత్మ ఒకటే తత్త్వము : అనియు,

"ప్రబుద్ధులగు సాంఖ్యులును యోగులును బుద్ధి కిం
బరంబై పంచ వింశతితమంబైన యా తత్త్వంబు నాలోకింతురు."
[౬-౩౭]

అనియు చెప్పుట సాంఖ్యయోగ వేదాంత దర్శనములను సమీకరించుట కని తోఁచును. ఈ దిగువ కోష్ఠకము చూచిన నిది తెల్లము :

| ఉపని | క్షర | అక్షర | అన్య |
|---|---|---|---|
| గీత | క్షర | అక్షర | పురుషోత్తమ |

| | | | |
|---|---|---|---|
| శాంతి(సాంఖ్య) | బుధ్యమాన (అవ్యక్త) | అప్రబుద్ధ | బుద్ధ |
| యోగ | బుధ్యమాన | – | బుద్ధ |
| అనుశాసన | బుధ్యమాన | ప్రబుద్ధ | అబుద్ధ |
| సాంఖ్య దర్శన | అవ్యక్త | – | పురుష [జీవ, ఈశ్వర] |
| యోగదర్శన | — | — | — |

ఎఱ్ఱయ యీ 26వ తత్త్వమును భారతము నుండియో పురాణాంతరము నుండియో గ్రహించియుండును. 'సాదాఖ్యకళ సదాశివునితోఁ గలిసి ఇరువదాఱవ తత్త్వమగు' నను తంత్ర సంప్రదాయము నిచట పోల్చి చూచునది.

## నానుళ్లు

తెలుగువారితోఁ బుట్టిన నానుళ్లు ఎఱ్ఱయనోట నీట మొలచిన తామరవలె మనోహరముగా నుండును. ఈ దిగువ నుదాహరించిన సామెతలను మణులతో తాపటము చేసిన ఆయా పద్యములను జదివినచోఁ బ్రకృతార్థమున కవి ఎంత నైగనిగ్యము కూర్చెనో స్ఫుటము కాఁగలదు.

| | |
|---|---|
| 'కుంపటిలోఁ దామర మొలచిన క్రియ' | 3–127 |
| 'బలియు నింట బానిసనైనఁ జెఱుప వెఱతురు' | 3–47 |
| 'మూఁడేండ్లలేని సద్బుద్ధి ముప్పదేండ్ల లేదు' | 3–151 |
| 'ఒక గుడ్డు ముఱిగిపో నేమి యగున్ ?' | 4–25 |
| 'నిప్పునఁ జెదలంటునె ?' | 4–32 |
| 'నోరు మూయఁ బెడతల వాపోయెడు' | 4–37 |

## భాషా జాతీయములు

ప్రతిభాషయందును జాతీయ పదములు కుప్పతెప్పలుగా నుండును. కవులు సంగ్రహించినవి కడుఁగొలఁది గొప్పకవులు ప్రకరణానుగతములయిన వానిని మాత్రమే వాడఁగలరు గదా! ఇవి భాషకు ప్రాణము వంటివి. వీని కొక

నిఘంటువు వ్రాయుట ఆవశ్యకము. నన్నయ తిక్కనలవలె నెఱ్ఱయగూడ ఏని నచట నచటఁ జక్కఁగా వాడెను.

| | |
|---|---|
| 'నాలు కాడునే' | 2-26 |
| 'మాకు దిక్కు' | 3-50 |
| 'వాఁడు నాకు, వానికిఁ గల నేను' | 3-56 |
| 'అమ్ముడు వోయినట్లు' | 3-62 |
| 'కలువల ప్రొమొక్కు దైవమునకు నెక్కొననఁగ' | 3-75 |
| 'ఏల చెడితి రోరి' | 4-15 |
| 'పొవ మడిసె' | 4-28 |
| 'చే చఱచి కొంచు' | 4-170 |
| 'మీదికి మూరెఁడు వేర్చి' | 5-95 |

## ప్రయోగ విశేషములు

కనిన కంటె [3-138] చెప్పననియె నిదె యొజ్జలు [4-13] అతని మచ్చరంబునఁ గన్నదియ తలఁపఁ జలమో [5-28] తా రొకరులఁ గోరరు. [5-56] ఏల కలుగఁడు. [2-30] ఒలసిన నరు గొంత కాలమునికియు [4-64] మాన్పఁగల యంతయు నింకను నాడి చూతమే (5-7) ఇంతమాత్రము నకు (1-93) ఎందేని ప్రకృతి సత్యముల కరణి...అట్టి యంభోధి...(1-25) ఇది నన్నయ వాడుక :

"ఇంబుగ సర్వలోక జను లెవ్వనియేని ముఖామృతాంశు బిం
బంబున నుద్భవంబయిన భారతి వాగమృతంబు కర్ణ రం
ధ్రంబున నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోక వం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్."

(ఆది. 1-76)

ఈ 'ఎందేని, ఎవ్వని యేని, లోని ఏని అట్టి'శబ్దములు నిత్య సంబంధము కల యత్తచ్ఛబ్దముల వంటివి. ఇట విశేషము అనుప్రయుక్తమగు 'ఏని'.

'వ...ఎయ్యేని వేల్పు నాహ్వానంబు సేసెద నవ్వేల్పు' ఆర. 7–324.
ఇందులకు భిన్నముగను నన్నయ వాడెను.

వ. ఎందేని నుండి యొక్క మహామహుండు...వచ్చి. ఆది. 3-180

ప్రశాస్త్రి 4-14

దేవబలంబు సిద్ధంబగుట యవలంబింపవలయుట నాకుఁ దోచిన కర్జంబు 2–138.

## దో షా భా స ము లు

1] సీ. 'ఏను దియ్యమున నటించిన' (2–56) అను నెడ ఇంచుగాగమయతి.

2] చ. ...క్రి క్కదలగ దాడివెట్టిన యఖర్వ [3–34]

3] ఆదియు మహిమయు నేర్పడ
నాది పురుషుఁ డొకఁడ యెఱుఁగ నన్యుల కెఱుఁగం
గాఁ దరము గాదు... [1–39]

4] ఆ దేవు దివ్య మహిమం
బాదేవుఁడు తానె యెఱుఁగు నన్యుల కెఱుఁగం
గాఁ దరమె... [1–64]

5] మ. ఒం। డొకటన్... రిపులన్ ఘోరాజి – ఈయతులును.

6] పేఁపున నబ్ధి నొక్క పృథివీ ధరముం దగఁ దాల్చె నంచు ల
క్ష్మీపతి... (4-181).

అను పద్యములందు ప్రాస సాంకర్యమును;

7] వేదము లాదిగఁ గల య
ష్టాదశ విద్యలకు నీవ స్రష్టవు త త్తద్
బోధకులును... [3-30]

అను పద్యమున ద-ధ ప్రాసమును;

8] 'షద్మజుకు' [2-28] అను నెడ నగాగమాభావమును చూపట్టును. ఇవన్నియును నన్నయకును తిక్కనకును సమ్మతములే. ఉ. 'కాదన కిట్టి పాటి' అను నన్నయ పద్యమున 'సంబోధనము'ను'సంబోదనము'గా మార్చి, బుధ ధాతువ్యు దంతమని సమర్థించువారు ఈ పద్యము నందలి 'బోధకులు' గమనించి సింహావలోకనము చేసికొనవలసియుందురు. కానినాఁడు దీనిఁ గూడ 'బోదకులు'గా దిద్దవలసియుందురు.

"మందా. వేలాక్రాంత త్రిభువన మహద్విద్విష ల్లక్ష్మి" [4-188]

"సుమహత్" [ఆరణ్య. 5-355, 6-1]

అను ప్రయోగములు—

'సుమహదుపనిషత్ ప్రస్తుత్యభిశ్రావ్య సేవ్యా'
—[మహాప్రస్థాన. 1-79]

అను తిక్కన ప్రయోగమును తలఁపునకుఁ దెచ్చుచున్నవి. మఱియు

'అట్టి క్రూరమునకు నట్టి ఘోరమునకు' 4–121
'వీని మనోగతమునం దవిలిన దైవము' 5–6
'పతి రహితంబు దుస్సహము' ఆరణ్య. 5–307
'అపగతమునఁ బడ' 7–249

అను నీ ప్రయోగములు చూపట్టును. ఇట్టివి తిక్కనలోను.

'సాత్యకి సమేతంబుగా శౌరియు' శాంతి 1–371
'సహాయంబు నొల్లక' శాంతి 3–83
శాంతము ధర్మప్రచయం బంతటికి' శాంతి 5-186

ఉన్నవి. ఈ ధర్మ ధర్మి వ్యత్యయాదులు తెలుగునాట శిష్ట జన వ్యవహారములో నున్నవి.

తపోగ్రత :—

ఇచట 'పదార్థాగ్ర ప్రాగ్రహర ప్రాగ్ర్యాగ్ర్యాగ్రీయ మగ్రియమ్' అను అమరమును బట్టి తపమున ఉత్కర్ష మొందినవాని ధర్మము – అని అర్థము చెప్పి

పదసాధుత్వము సాధింపనగునుగాని - 'కమలిన నేత్రమ్మి' కనుగుణముగా అర్థ మమ్మరదు. 'కాన సకారాంతము లకారాంతములును అగును' అను మత మవలంబించి, ఎఱ్ఱయ 'తప+ఉగ్రత' అని గ్రహించి యుండును. భారతమునఁ గూడ నితఁడు - 'సమ్యగ్యశశాలి' [అరణ్య. 6-92] అని యశశ్శబ్దమును అకారాంతముగా ప్రయోగించెను.

## కా ర క వి శే ష ము లు

'ఎవ్విధంబు నందైన'

... ... ... విషభక్షణంబునం

'దమృతము కంటె భీతికరమయ్యె' 4-88

'మేడమీఁ దెడలెడు' 4-133

'ఆత్మ విద్యకు నొదవఁ దొడఁగినాఁడ' 4_162

విడిపించు పనికినై యొదవి యుత్సహించి యున్న వాఁడు.'

ఆరణ్య. - 6-349

'శీతగిరి ఉపాంతము వలనం గదలి' 2-19

ఇట్టివి నన్నయ తిక్కన లందును గలవు. ఇవి వైయాకరణులకు సుపరిచితములే. నాఁటికిని నేటికిని కారకమునఁగలిగిన పరిణామమును పరిశీలించుటకు వీని నుదాహరించితిని. ఎఱ్ఱయ ఆరణ్యము నందును హరివంశమునందును కనుఁగొనవలసిన భాషా విశేషములు బహుళమ్ములు.

## స్వ సం వా ద ము లు

[i] స్ఫురదరుణాంశు రాగ రుచి సూరెలఁ బర్వఁగ లక్ష్మి 1-74

స్ఫురదరుణాంశు రాగ రుచిఁ బొంపి వోయి ఆరణ్య 4-113

[ii] వెఱగు పడి హర్షరాగము

దళిగిన వదనములు వెల్లఁదనము గదుర బి

ట్టిఱ మూర్ఛ మునిఁగి, యయ్యు

ద్ధఱు నిలిచిరి వేత్రదండ తాడిత తనులై. లక్ష్మి 1-91

వెలుగువడి హర్ష రాగము
దళిగిన వెలవెల్లనై వదనములు వ్రాలం
దెఱఁగేది ఱిచ్చపడి, ర
త్తఱిఁ దత్ పరిజనము లెల్లఁ దద్దయు వంతన్. ఆరణ్య 7_159

[iii] మెచ్చక యెదురైన మృత్యువు మెడఁ ద్రొక్కి
క్రొవ్వాడి కోఱలు ద్రెవ్వరాచి – లక్ష్మి 2_119

మెచ్చక యెదురైన మృత్యువు మెడఁద్రొక్కి
క్రొవ్వాడి కోఱలు ద్రెవ్వఁదాచి – హరి. పూ. 4–155

[iv] శిత నారసింహ నఖరా
హత దైత్య మహీప సూపహారంబునఁ ద
ర్పిత యయ్యె ననఁగ బరిశాం
తత నొందెఁ ద్రిలోక పీడ తత్ క్షణ మాత్రన్. లక్ష్మి 5–107

ఈ పద్యమే సరిగా హరివంశమున పూర్వ భాగము 4–39లోఁ గలదు.

ఈ కబ్బము ద్వితీయాశ్వాసమునందుగల 'తపములఁ గుస్సిన తపసుల బట్టి తెప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు' అను పద్యము శ్రీనాథునిగా హర విలాసమునందు ముద్రితమైనది. ఈ పద్యము ఎఱ్ఱయదో శ్రీనాథునిదో ఊహింప వలసి యున్నది. ఈ క్రింది పద్యమునకు దిగువ నుదాహరించిన శ్లోకము ఆకరముగాఁ గానిపించెడిని :–

దైవాధీనము త్రిజగము
దైవము తన్మంత్రవశము తన్మంత్రము భూ
దేవతల చేతి దగుటను
దైవములకు దైవతములు ధరణీ దివిజుల్. [1–99]

దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తు దైవతమ్
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమ దేవతా.

ఇఁక నా శుష్కవాక్యముల కట్టిపెట్టెదను. నన్నయ తిక్కనలలోఁ జేరుటకు;

"మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁగడంగుభంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్య శయ్యఁ గీ
లించిన కీర్తి సంగ సుఖలీలకు నేనును గాంక్ష చేసితిన్."

[లక్ష్మీ. 1-13]

అని జంకినటులు వినయము చూపి వారి కొఱత దీర్చిన ఎఱ్ఱాప్రెగడ మధుమయ ఫణితుల నిఁకఁ జదువుఁడు.

చిరివాడ, కృష్ణా జిల్లా
19-1-1953

వేలూరి శివరామశాస్త్రి.

---

[నృసింహ పురాణ పీఠిక : వావిళ్ల ప్రచురణ : 1953]



# 4. ఎఱ్ఱాప్రెగడ : హరివంశము

ఈ హరివంశమును రచించిన ఎఱ్ఱాప్రెగడది పాకనాటిలో గుడ్లూరు. ఇది యిపుడు నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాలో నెల్లూరికి సుమారు నూఱు మైళ్లలో నున్నది. మఱియు నిది మన్నేఱు అను ఏటి ఒడ్డున నున్నదని వెన్నెలకంటి సూరన—

సీ. "గౌరీసమేతుఁడై గరిమతో నేవీట నేపారు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట గిరిభేది సుతుఁడైన కేశవుండు
యోగినీసహితుఁడై యొప్పారు నేవీటఁ బసిఁడి పోలేరమ్మ
భవునికొమ్మ

పాపవినాశయై ప్రవహించు నేవీట మన్నేఱు మాఱటగుచు
గుంజరములు వేయి కొలువంగ నేవీటఁ గొడగు చక్రవర్తి
పుడమి యేలె

నట్టి రాజధానియై యొప్పు గుడ్లూరి నొనర నేలుచుండి
యొక్కనాడు."

అని చెప్పెను. ఎఱ్ఱయ గుడ్లూరు నీలకంఠేశ్వర స్థానమని చెప్పెను. ఈ దేవునిపై ఎవరో చెప్పిన—

"నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటీవధూటీఘటీ
ఘనకోటీశ కటీకటీ తటిపటీ గంధేభ నాటీపటీ
రనటీహారిపటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయనుహాతురంగ ! శివలింగా ! నీలకంఠేశ్వరా !"

అను ఈ చాటువు వినబడుచున్నది.

క్రీ.శ. 1550 లో విప్రనారాయణ చరిత్రము రచించిన మల్లయ ఎఱ్ఱయను తన వంశస్వామిగాఁ బేర్కొని తన్నతని చిన్న మనుమనిగాను,

ఎఱ్ఱయను చెదలువాడ నిలయునిగాను జెప్పెను. ఎఱ్ఱాప్రెగడ అరణ్య పర్వ శేషమున —

సీ. "భవ్యచరిత్రుఁ డాపస్తంబ సూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతత ధ్యాన సంసక్తచిత్తుఁడు సూరనార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాకపాటిలో నీలకంఠేశ్వర స్థానమై యెసకమెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుఁడు ధర్మైక తత్పరాత్ముఁ

తే. డెఱ్ఱనార్యుండు సకల లోకైక విదితుఁడయిన నన్నయభట్ట మహాకవీంద్ర
సరససారస్వతాంశ ప్రశస్తిఁ దన్నుఁజెందుటయు సాధుజన హర్షసిద్ధిఁగోరి."

అని చెప్పిన పద్యముఁబట్టి అరణ్యశేషము గుడ్లూరుననే యుండి రచించి నటులు కొంచె మూహింపవచ్చును. పిదప వేమారెడ్డి కతన చెదలువాడను నెలవుగాఁ జేసికొని యుండఁబోలును. ఇటు లూహించుటకుఁ గారణము రెడ్డి మల్లవరపు శాసనము. ఎఱ్ఱయను మునిముందుగా గారవించిన మల్లారెడ్డి చెదలువాడలో రామలక్ష్మణులకు దేవాలయము కట్టించెను. వేమారెడ్డి చెదలువాడకు తన తమ్ముని పేర రెడ్డి మల్లవర మని కొత్తపేరు పెట్టి ఆ గ్రామమును దేవభోగముగా నిచ్చెను. వంగవోలు దాపున ఈ గ్రామము ఉన్నది. చదలువాడ విడిగను దానికి అరక్రోసు దవ్వున గుండ్లకమ్మ యొడ్డున రెడ్డి మల్లవరమును అందు శ్రీరామాలయమును నేఁటికిని ఉన్నవి.

"కుండీనదీ సలిల చుంబిత సౌధమాలే లక్ష్మి(యుతే)
చెదలువాడ పురేఽ(భిరామే)
శ్రీరాజ మల్లవిభునా రచితప్రతిష్ఠౌ శ్రీరామలక్ష్మణ విభూ
జయతాం ప్రసిద్ధౌ.

**శాకాబ్దే శైలవార్ధిద్యుమణి పరిమితాహోశ్వినస్యావసానే**
**రాహుగ్రస్తేఽహిమాంశౌ సురగురు దివసే సైకతే పుణ్యనద్యాః**

.... .... .... .... .... .... .... ....

**పుర మధికముదా దత్తవాన్ వేమభూపః**
**శ్రీరెడ్డి మల్లాంకిత............యేన........"**

అని ఈ శాసనములో చెప్పఁబడిన కాలము సరిగాలేదు. కాని శాసనము నందలి విషయములన్నియు యథార్థములే. మల్లయ వేమయలు ఎఱ్ఱయకు ఇచట వసతి కల్పించినందువలన ఎఱ్ఱయగాని ఆతని వంశమువారుగాని గుడ్లూరు నుండి చెదలువాడకు మాఱియుందురు. ఈ శాసన కాలము సరిగా నిర్ణీతము కానందున ఇది మల్లారెడ్డి మృతికి వెనుక వేయఁబడెనో పిదప వేయఁబడెనో తెలియ వీలులేదు.

ఎఱ్ఱన వంశస్వామి భీమన. ఈ వంశ వృక్ష మిది:




ఎఱ్ఱాప్రెగ్గడ తండ్రియగు సూరన 'ఆరాధ్య సర్వజ్ఞుఁడు. మఱియు సుకవి మిత్రుడు. నృసింహ పురాణమునందలి పీఠికను ఆశ్వాసాంతములందలి గద్యములను గనుఁగొనునది. వంశస్వామియగు భీమన వెలనాటి చోడునివలన మన్నన గన్నవాఁడు. వెలనాటి చోఁడులు పలువురు. వీరిలో నితడు మొదటి వాఁడో రెండవవాఁడో యీ దిగువ వంశ వృక్షములను జూచి నిర్ణయించు కొందురు గాక.




హరివంశ పీఠికలో వేమయ ఎఱ్ఱయతో—

**నా తమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత**
**శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటన్**
**జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ**
**ఖ్యాతిం బొందితి వింకనుం దనియ నేఁగావ్యామృతాస్వాదనన్.**

౧-౩౮

అని చెప్పి మల్లయతో మనకు పరిచితి కలిగించుచున్నాడు. మల్లారెడ్డి ఎఱ్ఱయకు సిరిసంపదలిచ్చి గారవించుచున్నాఁడని దీని వల్లఁదెల్లము. వేమారెడ్డి కులస్వామి యగు వేయయకడ నుండియు ఈ వంశస్థులు కాకతీయులకు సామంతులుగాఁ గానవచ్చుచున్నారు. ఈ వేమయ కొడుకు ప్రోలయ పోలికలేని పోటుమగడు. ఇతఁడు భద్రాచలమునకు దాపుననున్న రేకపల్లికి నాయకుఁడు. ప్రోలయకొడుకు వేమయ మఱల ప్రోలయ యంతవాఁడు. ఇతఁడు అమరావతికి నాయకుఁడు, ఇతని కడగొట్టు తమ్ముఁడు మల్లారెడ్డి వీరులకుఁ దలకట్టు. ఇతఁడు కురుములూరికి నాయకుఁడు. ఈ కురుములూరు కడపజిల్లా సిద్ధవటము తాలూకాలో ఇప్పటి కుడుములూరు. ఈ కురుములూరి మీదికి లకుమయ ఎత్తివచ్చినటులును మనుమసిద్ధి తండ్రి తిక్కసిద్ధి అతని గుఱ్ఱములను లాగుకొని నటులును నిర్వచనోత్తర రామాయణమున తిక్కన యిటులు చెప్పెను—

సీ. 'లకుమయ గురుములూరికి నెత్తివచ్చినఁ గొనఁడె
యాహవమున ఘోటకముల' (౧-౩౩)

తిక్కసిద్ధి పృథ్వీశుని జంపి, లకుమయ గుఱ్ఱములఁగొని నిర్వచనోత్తర రామాయణమునందును పిదప కాంచీపురాది శాసనమునందును గానిపించుచున్నాడు. మనుమసిద్ధి శాసనములు క్రీ. శ. 1256 నుండి కానిపించుచున్నవి. కావున తిక్కసిద్ధి 1256కు వెనుక గతించి యుండును.

ఈ లకుమయ యెవఁడో తిక్కసిద్ధికిని ఇతనికిని పోరేల పొసఁగెనో మనకుఁ తెలియదు. తెలుగుఁ చోళులలో నెల్లూరి సిద్ధిరాజుల దొక కోవ. తెలుఁగు చోళులు పొత్తపినాడు ములికినాడు మొదలుగా నేటి కడపజిల్లాయందును వేఱు చోటులను చిన్నచిన్న నాడుల కేలికలై తమకు జ్ఞాతులగు సిద్ధిరాజుల యేలుబడి సాగనీయకుండిరి. కావున ఈ లకుమయ తెలుఁగు చోళులలో నొకఁడో, వారి పంపున ఎత్తి వచ్చిన సేనానాయకుఁడో అని ఊహింపనగును. ఇది యిటుండుఁ గాక ! సిద్ధిరాజులు కాకతీయ గణపతిదేవునకు సామంతులు.

పొత్తపినాడు పల్లెనాడు ములికినాడు సకలి ఏఱువపూంగి గండికోటలకు ఏలికయగు అంబదేవుఁడు కాకతీయులకు సామంతుడు. ఇతనిని గణపతి జయించి నట్టులు సాక్ష్యముకలదు. ఇతని మంత్రి గంగదేవుడు లేక గంగయ సాహిణి — ఇతనికి ఘోడియరాయ గంగదేవుడనియు వ్యవహారము కలదు — అంబదేవ మహారాజు పుణ్యమునకుఁగాను క్రీ.శ. 1287—వ సంవత్సరమున అత్తిరాలలో పరుశ రామేశ్వరాలయమును బాగుచేయించి కొందఱకు మడి మాన్యము లిచ్చెనని నెలందలూరు కైఫీయత్‌లో ఉన్నది. రుద్రాంబా ప్రతాపరుద్రుల కాలముననున్న గన్నారెడ్డికిఁ గూడ ఈ కురుములూరిపై అధిపత్యము కలదు. క్రీ. శ. 1294 నాటి రాచూరి శాసనము చూచునది. గన్నారెడ్డి సమనంతర కాలములోఈ కురుము లూరు నాయంకరము మల్లారెడ్డికి వచ్చియుండును. ఎఱ్ఱయను మల్లయ కురుము లూరికిఁ గొనిపోవుటగాని ఎఱ్ఱయ మల్లయను వెదకి కొనుచుఁబోవుటగాని క్రీ. శ. 1290 — 1320 నడుమ నెప్పుడోకావచ్చును. కాకయుఁ బోవచ్చును. ఎఱ్ఱయ కురుములూరిలో కాలు పెట్టెనో లేదో !

## ఎఱ్ఱయ వేమయలు

క్రీ. శ. 1323లో కాకతీయ సామ్రాజ్యము కూలిపోయెను. అపుడు తురకల దండు చేసిన దుండగములు చెప్పరానివి. విలసశాసనము ఈ యుపద్రవము వర్ణించి ద్రవించిపోయినటులున్నది. ఆ సమయమున వేమయతండ్రి ప్రోలయ కాకతీయుల క్రిందనున్న ఉరమరిక డెబ్బది యయిదుగురు నాయకులలో పలువురు నాయకుల తోడుగొని ఒకటి రెండేండ్లలో ఆ విప్లవ మడఁచివైచి దేహము చాలించెను. పిదప వేమయ మఱల మఱలఁ దలయెత్తుచున్న తురకలదాడుల నడఁచుచు అద్దంకి రాజధానిగా మధ్యాంధ్రమును పరిపాలింపఁ దొడఁగెను. ఈ సంగతి ఎఱ్ఱాప్రెగడ హరివంశమునం దిటులు చెప్పెను :

తనకు నద్దంకి తగు రాజధానిగాఁ బరాక్రమంబున బహుభూము
లాక్రమించి
యనుజ తనుజ బాంధవ మిత్రజనుల కిచ్చె నెదురె యెవ్వారు
వేమ మహీశ్వరునకు ? (౧-౨౩)

శ్రీమాద్య దంధ్రదేశ క్షేమదకరవాల ! సుజన కీర్తిత గుణలో
లా మంజుల వాగ్జాలా ! వేమక్షితిపాల నిత్యవిజయ విశాలా !
(ఉ. ౨-౧)

ఎఱ్ఱయ చెప్పిన వేమయ వంశవృక్ష మిది :

సీ. పంటకులస్వామి ప్రఖ్యాతుఁడౌర వేమయ పితామహుఁడును
మాన్యతయును
ధూతకలంకుండు దొడ్డయసైన్య నాయకుఁడు మాతామహుఁడను
వినుతియు
ఆది రాజన్య తుల్యాచారనిధి మాచవిభుఁడు పూర్వజుఁడను
విశ్రుతియును
శ్రీయుతుల్ పోతయ చిట్టయ నాగయప్రభులు మాతులు లను
భవ్యతయును.

గీ. దనమహత్త్వంబు భూషింపఁదాను వారిపేరు వెలయింపఁజాలు
గభీర మహిమ
నాత్మగుణముల వెలయించు నన్వయైక పావనుఁడు
**వేమజనపతి కేవలుండె?** (౧-౨౨)

ఈ పద్యమునకు వెనుక ముందులఁగల కొన్ని పద్యములలో చెప్పఁబడిన వారిలో వేమయ వంశమును కేటాయించి చూపిన యెడల నిటులుండును.




ఈ వృక్షము నందున్నవారు ఎఱ్ఱయ కాలమునందున్న వారు. రెడ్డి రాజులలో ప్రసిద్ధుడైన అనవేమారెడ్డిని [వేమయ కుమారుని] ఎఱ్ఱయ ప్రశంసింపలేదు. క్రీ. శ. 1366లో అనపోతారెడ్డి చనిపోయెను. ఇతని కొడుకు కుమారగిరి బాలుఁడగుటచే అనపోతారెడ్డి తమ్ముఁడు అనవేమారెడ్డి ఱేఁడాయెను. అది యటుండె. మన మిపుడు క్రీ. శ. పదునాలుగవ శతాబ్ది మొదటి పాదమున నున్నాము.

## వేమయకు వెనుక అద్దంకి

క్రీ. శ. 1254 వఱకు సింఘణదేవుని అద్దంకి శాసనములు కానిపించినవి. పిదప 1255లో సారంగపాణి అద్దంకికి ప్రభువయినటులు శాసనములు చెప్పుచున్నవి. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున,

'శృంగారంబు నలంగదేమియును బ్రస్వేదాంకుర శ్రేణి లే
దంగంబుల్ మెఱుఁగేద వించుకయు మాహారాష్ట్రి సామంతు సా
రంగుం దోలి తురంగముం గొనిన సంగ్రామంబునన్ దృప్త స
ప్తాంగ స్ఫారయశుండు మన్మవిభుపంపై చన్న సైన్యంబునన్'

అని చెప్పిన సారంగుఁ డీ సారంగపాణి. ఈ ఘటనకుఁగల పూర్వాపర సందర్భములు మనకుఁ దెలియవు. మఱియు నిర్వచనోత్తర రామాయణము,

రంగ దుదారకీర్తియగు రక్కసగంగనఁ బెంజలంబు మై
భంగమొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాచికొన్న రా
జ్యాంగములెల్ల నిచ్చి తన యాశ్రిత వత్సల వృత్తి యేర్పడన్
గంగయ సాహిణిం బదముఁ గైకొనఁ బంచెఁ బరాక్రమోద్ధతిన్.

అని చెప్పుచున్నది. ఈ ఘటనకును గల పూర్వాపర సందర్భములు మనకుఁ దెలియవు. మనుమసిద్ధి పరరాజ్యాక్రమణ మొనరింపఁగల స్థితిలో లేఁడు. మఱియు తిక్కన వర్ణనలఁబట్టి అతఁడట్టివాఁడుగాఁ దోఁపఁడు. సారంగపాణియు గంగయ సాహిణియు సీమాక్రమణము చేయఁబ్రయత్నించి యుందురు. మనుమ సిద్ధి వీరిని వెనుకకుఁగొట్టి యుండును. క్రీ. శ. 1256 మొదలుకొని 1260 వఱకును మనుమసిద్ధి శాసనములు అగపడుచున్నవి. కాటమరాజ మనుమసిద్ధులు పుల్లరి పోరితములో క్రీ. శ. 1263న చనిపోయెను. కావున పైరెండు యుద్ధము లును క్రీ. శ. 1256 - 60 నడుమఁ గావచ్చును.

పై సారంగపాణి మనుమసిద్ధికి సామంతుఁడు. మనుమసిద్ధి గణపతికి సామంతుడు. గణపతి గంగయసాహిణిని జయించి మండలాధిపతిగ నియమించెను. కావున గంగయ సాహిణియు గణపతికి సామంతుడు. కడపజిల్లా సిద్ధవటము తాలూకా జ్యోతి గ్రామమునఁగల జ్యోతినాథ దేవాలయావరణపు రాతి మీద క్రీ. శ. 1247 సంవత్సరమున రక్కస గంగయ పరిపాలన మొనరించు చున్నట్లున్నది. క్రీ. శ. 1257వ సంవత్సరపు అత్తిరాల శాసనములో నితడు కనుబడెను. నాఁడు తిక్కసిద్ధి రా [illegible] చేయుటలేదు. తిక్కసిద్ధి సారంగపాణి తండ్రియగు సింఘణదేవుని కప్పమునకు ఒప్పించినటులు —

సీ. 'చేది మండలము గాఁసిగఁజేసి కాడవసతి నియ్యకొలుపఁడే
పలచమునకు' (౧-౩౩)

అని నిర్వచనోత్తర రామాయణము చెప్పుచున్నది. సింఘణ లేక సింగళ దేవుఁడే వ్యవహారములోని కొప్పెరుంజింగడు. ఇతని చేది మండలము దక్షిణార్కాడు. అతఁడే కాడవ లేక లేక కాళవపతి. ఈ కాడవపదము దక్షిణార్కాడులోని కాడు మీఁద అణ్ ప్రత్యయాంతమైన రూపము. ఈ కాడవపతి కొడుకే సారంగుడు. గణపతికి సామంతుఁడగు రక్కెసగంగు అండతో సారంగుఁడు సారంగుని చెలిమికి రక్కెస గంగును మనుమసిద్ధితో వైరముగాని రని యూహించిన యెడల మనుమసిద్ధి క్రీ.శ. 1256లో పరిపాలన ప్రారంభించిన వాడును క్రీ. శ. 1263లో అస్తమించినవాఁడును గావున నీ రెండు ఘటనలును ఆ నడిమి కాలమువి అయియుండును. అవి అంతటి వెనుకటి వయనను 1255–1263ల నడుమ అద్దంకి మనుమసిద్ధి సామంతుఁడగు సారంగపాణి చేతులలో ఉండి యుండవచ్చును.

తురుష్కదండయాత్ర లోరుగంటిని రణక్షేత్రమునుగా మార్చిన వాడి ప్రతాపరుద్రుని నిధనము వఱకును ఈ యద్దంకి యెవరి యేలుబడిలో నుండెనో కాని క్రీ. శ. 1330 సంవత్సరమున పుట్టిన వవ్వేరు శాసనమునను హరివంశము నందును ఈ యద్దంకి ప్రోలయ వేమునికి రాజధానిగా కానిపించుచున్నది. ప్రోలయ స్వర్గమున కతిథియైన తరువాత వేయమ అద్దంకిని స్వాయత్తము చేసి కొని యుండును. ఇటు లగునెడల క్రీ. శ. 1323–1330 నడుమ అద్దంకి వేమయ యేలుబడిలోనికి వచ్చెనని అనవచ్చును. క్రీ. శ. 1361 నాటి అమరావతి శాసనమున—

'తస్యా మద్దంకి రాఖ్యాతా విఖ్యాతా విభవోన్నతా
సురకిన్నర (గంధర్వ) దైత్యేంద్ర ఫణీంద్ర నగరీష్వపి
తాం పురీం పాలయామాసు స్సురసింధు సహోదరాః
నృపా విక్రమ సంపన్నా ధర్మజ్ఞా స్సత్యవాదినః
ఆసీద్వేమప్రతో ధతణి భృత్కోటీర కోటీ మణి
శ్రేణీరంజిత........ప్రోలాన్వవా యాంబుధేః'

అద్దంకి శూరులు సత్యవాదులు నగు జేం డ్లెలిరి. పిదప వేముఁడు జేఁడాయెను.

దీనివలన వేమయతండ్రి తాతలు కూడ అద్దంకికి ఏలికోలని తోఁచును. 1343 క్రీ. శ. నాటి ముట్లూరి శాసనమున—

'తస్మా దభూ ద్వేమయ దండనాథో వంశస్య కర్తా'

అను శ్లోకము వంశకర్తయగు వేమయను [వేమయ తాతను] దండనాథునిగను—

'పుత్త్రిస్తస్య భుజాద్వినిర్జితరిపుః ప్రోలక్షమాధీశ్వరో'

అనుశ్లోకము వేమయ కొడుకగు ప్రోలయను జేనిగను చెప్పుచున్నది. కావున వేమయయు ప్రోలయయు అద్దంకికి రాజులే కాఁదగుదురు. ఎఱ్ఱయ 'వాహినీవర'! [౭—౧] అనియును 'నాయక' [౮౧-౧] అనియును ప్రోలయ వేముని కీర్తింప లేదా ? కావున దండనాథాది పదములు రాజత్వమునకు పోషకములేయగును. మఱియును గణపతిదేవుని సామంతుడును మండలేశ్వరుఁడును అగు ఘోజియరాయగంగయ వేమయకు గురువు.

శ్రీపల్లవత్రి నేత్రాంకో ధన్యో వేమ మహీపతిః
శ్రీ ఘోడెరాయ గంగాఖ్య గురుపాపాబ్జ షట్పదః

అనుశ్లోకముచే అత్కూరి శాసనము [క్రీ. శ. 1345] వేమయకు గంగయను గురువునుగాఁ జెప్పుచున్నది. ఎఱ్ఱాప్రెగడ—

శ్రీపర్వతేశ భక్తి ఖ్యాపితగుణ ! ఘోడెరాయగంగ గురుకృపా
స్థాపిత సామ్రాజ్య సముద్దీపిత ! వేమక్షితీంద్ర ! దీప్తిదివేంద్రా !

అను పద్యమున వేమయ గంగయకృపచే ఆంధ్ర సామ్రాజ్యమును స్థాపించినటులు చెప్పుచున్నాఁడు. గణపతిదేవునకు సామంతుఁడును మంత్రియు నగు ఈ గంగయ రుద్రాంబ ఏలుబడిలోనేని ప్రతాపరుద్రుని ఏలుబడిలోనేని ప్రోలయనుగాని వేమయనుగాని అద్దంకికి అధిపతిగా చేసియుండవచ్చునని ఊహించిన యెడల 'అమరావతీ శాసనము సత్యమే చెప్పెనని అనరాదా ?' అని ప్రశ్నింపవచ్చును. మల్లయ కురుములూరికిని ప్రోలయ [పాలవంచ తాలూకా]

రేకపల్లికిని నాయకులుగా మనకు కనఁబడుచునే యున్నారు. ఇదియుఁగాక తురకల క్రిందు నఁడచి నాయకుల నందఱను తమ తమ దేశముల కనిచి ప్రోలయయు తన దేశమున కేఁగెనని [రేకపల్లి] విలసశాసనము చెప్పుచున్నది. కావున ప్రోలయ అద్దంకిని ఒక రాజ్యమునకు రాజధానిగా చేయలేదనుట స్పష్టము. రెడ్ల చరిత్ర మందు ప్రతాపరుద్రుని యేలుబడిలో వేమయ, దన్నాల కోట దన్నడకోట ధాన్యవాటి అని మాఱుచు వచ్చిన అమరావతికి నాయకుఁడుగాఁ గానబడుచున్నాడు. అమరావతీ శాసనము నందలి — 'సురసింధు సహోదరాః నృపాః' అను పదములు వేమయాదులలో ఎవని మాటయు చెప్పక గోడమీఁది పిల్లి వాటముగనే యున్నవి. దీనికి వెనుకటి ముట్లూరిశాసనము ప్రోలయ తండ్రి వేముని దండనాథ మాత్రునిగనే చెప్పుచున్నది. కాన 1323 కి పిదపనే అద్దంకిని వేమారెడ్డి మున్మొదట తనకు రాజధానిగాఁ జేసికొనెనని ఊహించుట లగ్గు.

## గంగదేవయ

ఘోడియరాయ గంగదేవుఁ డనియును గంగయ సాహిణి యనియును గంగరుసు అనియును చెప్పఁబడు నీ గంగయ గంగదేవునకు సామంతుఁడై పానుగల్లునుండి మార్జవాడి వఱకుఁగల దేశమున కధీశుఁడయిన అంబదేవునకు కొంతకాలము మంత్రిగను, గణపతిదేవునకు కొంతకాలము మంత్రిగను సామంతుఁడుగను ఉండెను. ఇతఁడు రాజనీతి చతురుఁడు. సేనలతో చదరంగ మాఁడు మహావీరుఁడు. ఐహిక రూపముతోఁ గనఁబడు నితని కొక యాధ్యాత్మిక రూపమును ఉన్నది. ఇతడు శ్రీశైల ప్రాగ్ ద్వారపాలకుఁడగు త్రిపురాంతక దేవునికి పరమభక్తుడు. పాశుపతయోగి. ఇతని కొక పీఠము కలదు. మల్లికార్జున శిలామఠ పీఠమునకును ఈ ఘోడియరాయ పీఠమునకును కొంత సంబంధ ముండి యుండును. ఇతఁడు ప్రోలయ వేమయకు గురువు. ఎఱ్ఱయ— 'ఘోడెరాయగంగ గురుకృపా స్థాపిత సామ్రాజ్య సముద్దీపిత' అని చెప్పిన దీ గంగగురువే. ఇతఁడే దండు నడపి వేమయచే తెలుగు రాజ్య మేలించెనని కొందఱ అభిప్రాయము.

క్రీ. శ. 1254లో ఇతని భార్య కమలాంబ కమలేశ్వరాలయము కట్టించి నటులు ఒక శాసనము కనఁబడుచున్నది. మఱియు నితఁడు గణపతిదేవునిచేతను

మనుమసిద్ధిచేతను ఓడింపఁబడినటులు చూచియున్నాము. ఈ రెండు ఘటనలును 1261, 1263 కిని వెనుకటివి. మఱియు నితని అత్తిరాల శాసనము చూచి యున్నాము. అది క్రీ. శ. 1287 వ సంవత్సరములో పుట్టినది. 1254 లో ఇతని భార్య కమలేశ్వరుని గుడి కట్టించునప్పటి కితనికి ఇరువది యయిదేండ్లుండునని యనుకొన్నను, 1323 నాటి విప్లుతికి ఇతడు సుమారు తొంబది నాలుగేండ్లవాఁడై యుండును. మూఁడుకాళ్ల ముసలియగు నితఁడపుడు గుఱ్ఱమునే యెక్కలేకపోగా గుఱ్ఱపు దడముల నడిపించెననుటకు వీలులేదు. ఎఱ్ఱయ పద్యమున నున్నదెల్ల గంగగురుకృపయే అనియు అది అతని యాధ్యాత్మిక స్వరూపోత్కర్ష అనియు అనుకొనవలసి యున్నది.

గంగదేవయ పిదప ఘోడియరాయ పీఠాధిష్ఠాత త్రిపురారి, అతని పిదప భీమేశ్వరుఁడు. 'ఘోడె రాయాంక స్సద్గురు రాజ భీమేశ్వరస్వామి...' అని శ్రీనాథుడును, 'భీమేశ్వరున్ త్రిపురారీంద్ర గురూత్తమాత్మభవునిన్ దేవేంద్ర కోలాహలున్' అని నిశ్శంక కొమ్మనయుఁ జెప్పిన దీ భీమేశ్వరుఁడే. కాటయ వేముఁడీ పీఠమును పట్టిసమునం దుంచి యుండును. క్రీ. శ. 1423 నాఁటి అనితల్లి శాసనము చూచునది.

కాగా 1323 లో కాకతీయ సామ్రాజ్య మస్తమించిన పిదపనే ప్రోలయ వేమయ అద్దంకికి ఏలిక యాయెను. చరిత్ర పరిశోధకులు చేసిపెట్టిన కృషివలన మనము క్రీ. శ. 1330 నాటినుండియే ప్రోలయ వేమయ శాసనములను చూడఁగలుగుచున్నాము. క్రీ. శ. 1323 కు వెనుక ప్రోలయగాని ప్రోలయ తండ్రి వేమయగాని అతని తండ్రిగాని సారంగపాణికిఁ బిదప నాయకు లయినటు లాధారము దొరకనంతవఱకు క్రీ. శ. 1323 కిఁ బిదప అద్దంకి వేమయ ఏలుబడిలోనికి వచ్చెనని యనుకొనుటయే క్షేమము. ఈపైఁ జెప్పబడిన కారణములచే క్రీ. శ. 1323 విప్లవము పిదప ఆ ఱేడేండ్లకు వేమయ అద్దంకి రాజధానిగా బహుభూము లాక్రమించెనని నిశ్చయింపవచ్చును. కావున క్రీ. శ. 1326-35 సంవత్సరముల నడుమ ఎఱ్ఱాప్రగడ రామాయణ హరివంశముల రచించెనని చెప్పవచ్చును.

## శ్రీశైలాహోబల పర్వత సోపానములు

క్రీ. శ. 1330 మొదలుకొని 1353 వఱకును వేమయ వేయించిన శాసనము లిప్పటికి కనిపించుచున్నవి. వీనిలో శ్రీశైల సోపాన ప్రసక్తియు అహోబల సోపాన ప్రసక్తియు ప్రప్రథమముగా క్రీ.శ. 1335 చీమకుర్తి శాసనమున 'శ్రీ పర్వత అహోబల నిర్మిత సోపాన' అని కనిపించుచున్నది. పిమ్మట వేయించిన పెద్ద శాసనములం దన్నిటను ఈమాట ఉన్నది. నూఱేండ్ల పిదప శ్రీనాథుడు—

**'శ్రీపర్వతసోపాన స్థాపక! వేమక్షితీశ సామ్రాజ్య శ్రీ
వ్యాపారిముఖ్య! యన్వయదీపక! యలకాధిరాజ! దేవయతిప్పా!'**

అని హరవిలాసమునను,

**'రాజ్యం వేమ-స్స చిర మకరోత్ ప్రాజ్యదానైకతానో
భూమిదేవై ర్ధ్రువ మురుభుజో భుక్తశేషా మభుఙ్క్త
శ్రీశైలాగ్రాత్ ప్రభవతి పథిప్రాప్త పాతాళగంగే
సోపానాని ప్రమథపదవీ మారురుక్షు శ్చకార'**

అని సంతాన సాగరమను చెఱువు ప్రతిష్ఠచేసినపుడు వేసిన ఫిరంగిపురము శాసనమునను చెప్పియున్నాఁడు. ఇట్టి సోపాన నిర్మాణ ప్రస్తావము హరివంశమున లేదు. రామాయణము మన మెఱుగము గాన దాని సాక్ష్యము మనకు దొరకదు. దీనినిఁ బట్టి యీ సోపాన స్థాపన ఎఱ్ఱాప్రగడ ఎఱుఁగఁడవి నిర్ధారణ చేసితిమేని దానితోపా టితఁడు ఈ నిర్మాణమునకు పూర్వమే శరీరమును చాలించినాడని నిర్ధారించినట్లే.

ఎఱ్ఱాప్రెగడ యీ సోపాన స్థాపన మెఱిగి యున్నను ఇదియొక విశేషముగా తలఁపకపోవచ్చును. దానఁజేసి తన రచనలో దాని నొక సోపానముగా గ్రహింపక పోవచ్చును, అని అనుకొందమనినచో నది లెస్సకాదు. హేమాద్రి చెప్పిన దానములన్నియు తుచ తప్పకుండ నొనరించిన దానవీరుఁడు వేమయకీ సోపాననిర్మాణము మానవసేవయేగాక మాధవసేవ. మరియు నిది అసాధారణ మగు నిర్మాణము. శ్రీశైలమునకు అహోబలమునకు నేఁటేఁట బోవు యాత్రికు

లును గూడ ప్రమథ పదవి కెక్కించు సోపానములేయివి. ఇట్టి సోపానములను కట్టించిన వారి ప్రస్తావము శాసనములందే కాక గ్రంథములందును సుపరిచితము. బసవపురాణమున శ్రీ పాల్కురికి సోమనాథుడు—

'అసలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పుదెసను సోపానముల్
దీర్చి పొల్పార
మహిత సద్భక్తి సమంచితవృత్తి మహిఁజను రెంటాల
మల్లినాథుడును'

అని రెంటాల మల్లినాథుని కీర్తించెను. ఈ సోమనాథుఁడును మల్లినాథుఁడును ప్రతాపరుద్రుఁ డున్నపు డున్నవారే. మఱియు ఈ విషయము అంబదేవ మహారాజు నీలిగంగవరపు శాసనమున—

'పూర్వద్వారే కుమారక్షితి భృదుపరిత స్తత్ పురారేః పురస్తాత్
రమ్యం సోపానమార్గం సుఖకర కమలం'

—అని ప్రస్తావింప బడినది. ఇంతియేకాక ఎఱ్ఱయ నృసింహపురాణమును రచించెను గదా ! దాన అహోబలశైల ప్రసక్తి కలదు గదా ! అందు వేమయ కట్టించినటులుగాక యింకొక తెఱఁగున కేవల సోపాన ప్రసక్తి తేవచ్చును. లేక అహోబలస్మృతి బలమున హరివంశమున చెప్పియుండవచ్చును గాని యటులు చెప్పలేదు. అయిా కారణములచే ఎఱ్ఱయ యీా సోపాన నిర్మాణ మెఱుఁగఁడనియు దానఁజేసి క్రీ. శ. 1325కి వెనుకనే దేహము చాలించెననియు తేలుచున్నది. క్రీ. శ. 1340 మంచాళ్ళ శాసనమున—

'సరాజధానీం జగతీప్రసిద్ధాం శ్రీకుండినీ నామ పురీ మతిష్ఠత్'

అని కొండవీఁడు వేమయకు మఱియొక రాజధానిగాఁ గానఁబడుచున్నది. హరివంశమున అద్దంకియే రాజధాని. కావున కొండవీఁడు ఎఱ్ఱాప్రెగడ ఎఱుఁగఁడు.

క్రీ. శ. 1340 మంచాళ్ళ శాసనము నందును క్రీ. శ. 1343 ముట్లూరు శాసనమునందును క్రీ. శ. 1345 అతుకూరి శాసనము నందును—

'తతశ్చ పుత్త్రా న్నపి పంచ లేభే........'

'సింధోః శ్రీరివ దొడ్డయాద్గుణనిధే ర్జాతాన్న మాంబాతత
స్సాసీ త్తత్పురుషో త్తమస్య దయితా సాసూత పంచక్రమాత్
సాధ్వీ వీర మసూత మాచనృపతిం శ్రీవేమ పృథ్వీపతిం
దొడ్డక్ష్మాభుజ మన్న భూమిరమణం శ్రీవల్లభూ వల్లభమ్'

'అగ్రే మాచ నృపాల మున్నత మథ శ్రీవేమ పృథ్వీపతిం
పశ్చాద్దొడయ భూప మన్నయనృపం శ్రీమల్లయక్ష్మాపతిమ్'

అను శ్లోకములు ప్రోలయ కయిదుగురు కొడుకులని చెప్పుచున్నవి. వీనిలో మొదటి మంచాళ్ళ శాసనము అయిదుగురు కొడుకులని స్పృశించుచున్నది. ముట్లూరు శాసనము మాచ వేమ దొడ్డ అన్న మల్లభూవల్లభులని వివరించుచున్నది. ఆతుకూరి శాసనము ముట్లూరి శాసనములోని క్రమమును సవరించి ముందు 'మాచ పిదప వేమ పిదప దొడ్డ' అని చెప్పుచున్నది. హరివంశములో వేమునకు ఆదిరాజన్య తుల్యాచారనిధి మాచవిభుఁడు పూర్వజుఁడనియును తమ్ములు 'అన్నవిభుఁడు మల్లప్రభుఁడున్' అనియే కలదు. ఈ దొడ్డతమ్ముని మాట ఎట్టియ చెప్పలేదు. దీనినిఁ బట్టి హరివంశ రచన నాఁటికి దొడ్డారెడ్డి పుట్టలేదని కొందఱు ఊహించుట తెన్నకాదు. 1325-30 నడుమ నెన్నఁడో ప్రోలయ చనిపోయెను. అనితల్లి కలువచేఱు శాసనము,

వరాహవద్వారిధి వారిమగ్నాం ధరామశేషాం యవనోదరస్థామ్
సముద్ధరన్ ప్రోలయ నాయకేంద్ర స్తతః ప్రతిష్ఠాపయతి స్మ
తద్వత్

స్వర్గాతిథౌ ప్రోలయ భూమి పాలే .... .... ....
.... .... .... .... .... .... .... ....
తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం ధర్మాత్మనా మగ్రణీః
.... .... .... .... .... .... .... ....

అని చెప్పుచున్నది. వేమయ విజృంభణమునకు వెనుకనే ప్రోలయ పోయెను. ఇఁక దొడ్డయ యేడ అన్నయ యేడ మల్లయయు నేడ ? కావున

ఈ దొడ్డయ హరివంశ రచనకు వెనుకనే లేఁడు. లేని యీ దొడ్డయ పదపటి శాసనములలోనికి ఎటు లెక్కెను? స్మృతి మాత్ర ఫలమునకు వేమయ చెప్పి వ్రాయించి యుండునని యూహింపవలయును.

క్రీ. శ. 1345 అమరావతి శాసనము మల్లారెడ్డి పుణ్యమును చెప్పు చున్నది. అనగా ఆనాఁటి కతఁడు వీరస్వర్గమందెను. హరివంశమున మల్లారెడ్డి మోటుపల్లి జయించి అన్నయగు వేమారెడ్డికి సముద్రునిఁగూడ సామంతుని జేసినటులున్నది. కాని యీ మోటుపల్లిని మల్లారెడ్డి కైకొన్న కాలము తెలియదు. ఇట్టి మోటుపల్లి విజయమునకు వెనుకనే హరివంశ రచన.

వేమయ జీవితకాలములో వేసిన శాసనము లందును పిమ్మటి శాసనము లందును వేమయకు సూర్యచంద్రులవలె ఇరువురు కొడుకు లని కలదు. రెడ్ల యేలుబడి చివర రోజులలోని అనితల్లి కలువచేఱు శాసనము మాత్రము 'వేమయకు ముగ్గురు మూర్తులవలె ముగ్గురు కొడుకులు' అని చెప్పుచున్నది.

వీరి పేరులు: అన్నపోత—అన్నమాచ—అన్నవేములు.

హరివంశమున ఎఱ్ఱయ—

.... .... .... .... రాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్
వితత యువరాజ విభవోన్నత పోతయ దండనాథ .... ....
(ఉ. ౯-౨౬౦)

అనియు,

'దానంబునఁగర్ణుని సరిసమానంబునఁ బేర్మి ననుషమాన్యుఁడు బుధ స
మ్మాన చతురుండు ప్రోలయ సూనుఁడు కోమటి సమస్త సులభుఁడు కరుణన్'

అనియు, పోతయ కోమటులను మాత్రమే చెప్పెను. ఈ పద్యము మూడవ పాదమునందలి ప్రోలయకు మాచయ అని పాఠాంతరము. కాగా కలువ

చేఱు శాసనమునందలి 'అన్నమాచ' యితఁడు. హరివంశమునను ఈ శాసనము నను దక్క వేఱుచో నితఁడు మనకు దక్కలేదు గాన అనవేముని పుట్టుటకు వెనుకనో రాజ్యమునకు రాక వెనుకనో యితఁడు బుదుంగుమని యుండును. కాగా ఎఱ్ఱయ అనపోతారెడ్డిని యువరాజుగా నెఱుఁగునే కాని అతనికిఁ దమ్ముఁ డగు అనవేముని పుట్టుక యెఱుఁగఁడు. క్రీ. శ. 1335కు పయిని జరగిన ఘటన లేవియు నెఱ్ఱయ యెఱుఁగక పోవుటచే హరివంశ మానాఁటికి వెనుకనే రచింపఁబడెననియును అతఁడును 1335కు వెనుకనే కాలధర్మము చెందెనని యును నిగమన మొనరింపవచ్చును.

## ఎ ఱ్ఱ య కృ తు లు

అరణ్య పర్వశేషము, నృసింహ పురాణము, రామాయణము, హరి వంశము, అను నీనాలు గితని కృతులు. వీనిలో రామాయణ మెచటను ఇపుడు కానరాలేదు. గణపవరపు వెంకటకవి కూచిమంచి తిమ్మకవి మొదలగు లాక్షణి కులు ఎఱ్ఱాప్రెగడ రామాయణము లోనివిగాఁ గొన్ని పద్యముల నుదాహరించిరి. వెంకటకవి ప్రయోగరత్నాకరము, ఆనంద రంగరాట్ ఛందము, ఎఱ్ఱన సంక్షేప రామాయణములోనివని కొన్ని పద్యముల నుదాహరించెను. వీని ప్రామాణ్య మనుమానము. 'ఈ సంక్షేప రామాయణము' వాల్మీకి ననుసరించిన గ్రంథాది కథా సంగ్రహమో లేక సూర్యకవి సంస్కృత సంక్షేప రామాయణమున కాంధ్రీకృతియో మఱియు ఈ సూర్యకవి మన ఎఱ్ఱయ తండ్రి సూర్యకవియో యింకొకఁడో' యని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఈ విషయ మెల్లయు ఎఱ్ఱాప్రెగడ రామాయణము దొరకనిదే తెలియ వీలులేదు. ఇప్పటి కిన్నూటేండ్ల క్రిందటి కూచిమంచి తిమ్మకవి ప్రకృత రామాయణము నుండి కొన్ని పద్యములను ఉదాహరించెను.

## గ్రంథ పౌర్వాపర్యము

అరణ్యశేషము ముందు, నృసింహపురాణము వెనుక, రచింపఁబడెనని నృసింహ పురాణమువలనను, రామాయణము ముందు, హరివంశము పిదప రచింపఁబడెనని హరివంశము వలనను మన కవగతమగుచున్నది. నృసింహ

పురాణము రామాయణమునుగాని హరివంశమునుగాని పేర్కొనదు. హరివంశము అరణ్యా శేషమునుగాని నృసింహపురాణమునుగాని ఉగ్గడింపదు. కావున వీని పౌర్వాపర్యము తెలిసికొనుటకు వీలులేదు. దొరకిన ఆధారములఁ బట్టి రామాయణ మును హరివంశమును క్రీ. శ. 1325–1335ల నడుమ రచింపఁబడినటులు నిర్ణయింపవచ్చును. '35 పిదప ఎఱ్ఱయ లేఁడుగాన ఆరణ్యాశేష నృసింహ పురాణములు ఈ రెండు గ్రంథములకును వెనుకనే రచింపఁబడి యుండునని ఊహింపనగును. కూచిమంచి తిమ్మన ఉదాహరింపని కొన్ని రామాయణ పద్యములఁజదివి ఆ రచన అంత ప్రౌఢముగా లేదని కొందఱు అభిప్రాయపడిరి. అది యుక్తమగునేని రామాయణము బాల్యముననే రచింపఁబడి యుండవచ్చును. వేమయ కోరికపై నెఱ్ఱయచే నిండువయసుననే కృతి యీఁబడియు నుండవచ్చును. రామాయణము దొరకనిదే యీ విషయము సునిర్ధారితముకాదు. రెడ్డి మల్లవరమున రామలక్ష్మణ ప్రతిష్ఠకును రామాయణమునకును ఏదో సంబంధమున్నటులు తోఁచును, మల్లవరపు శాసనకాలము సరిగా తెలియరాదు కావునను రామాయణ మింతపట్టు దొరకలేదు. కావునను నిక్కముగా సంబధమున్నదో లేదో చెప్పఁ జాలము. ఈ పౌర్వా పర్య విచారణ మంత ముఖ్యము కాకున్నను అట్టి జిజ్ఞాస కలుగుట అందఱకును సహజము. నిక్కమెఱుక పఱుప వీలు కలిగింపనివియు సంశయములను కలిగించు నవియునగు కొన్ని ఆధారములు ఈ మూడు కబ్బము లందును గలవు. కావున ఈ విచారమునకు శ్రమయే ఫలము.

ఇక రచనా ప్రౌఢిలో ఆరణ్యాశేష నృసింహ పురాణములకు హరివంశము లొచ్చుగాన రామాయణ హరివంశముల రచన మొట్టమొదటిదని కొందఱందురు. విరాటమును ఆనుశాసనిక పర్వమును ఉదాహరణముగాఁ జూపి రచనా ప్రౌఢికి అద్యప్రయత్నమునే కారణముగాఁ జెప్పి కొందఱు వెనుకటి వాదము నియ్య కొనరు. ఇతని కవితారచన హరివంశముననే విశ్రాంతమయినదని కొందఱందురు. ఎఱ్ఱయ దేనిని జెప్పి ప్రబంధ పరమేశ్వరుఁడాయెనో అట్టి అరణ్యాశేషమునే సార గానమునుగాఁ గొందఱు తలఁచిరి. "భిన్నరుచిర్హి లోకః". ఎవరి లక్ష్యకేంద్రము వారిదే.

## ఆరణ్యపర్వ శేషోన్నయము

**ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి య**
**ష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ నం**
**దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి**
**ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్**

అని తిక్కనయును,

'సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
**భారత సంహితన్ మును త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టివి**
ద్యారమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టు గొల్చెదన్'

అని మారయయు,

'ఆ మూఁడు పర్వములలో నాశూన్యుఁడు నుడువు తెలుఁగు
లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కసుధీమణి మొదలైన తొంటి తెనుఁగు
కవీంద్రుల్'

అని అప్పయయుఁ జెప్పఁటఁజేసి నన్నయ మూఁడు పర్వములను సమగ్రముగనే రచించెను. తిక్కన మారనల కాలమున మూఁడు పర్వములును నిండుగనే యున్నవి. కావుననే తిక్కనకు ఆరణ్య పర్వమును రచింపవలసిన పని పట్టలేదు. పిదప ఏ కారణముననో అది ఉత్సన్నమయినది. కావుననే తిక్కనకుఁ బిదప నూతేండ్లకు ఎఱ్ఱన ఆ యుత్సన్న భాగమును మఱల వ్రాసి యుండునని పూజనీయులగు శతఘంటము వెంకటరంగశాస్త్రిగారు ఆనంద ముద్రణాలయమువారు ముద్రించిన భారతములో పీఠికలో వ్రాసిరి. ఇంచు మించు ముప్పది యయిదేండ్ల వెనుక నొకరు— ఆరణ్య పర్వములో కొన్ని తాటాకులు కీటదష్టములై చిల్లులు వోయెను. ఎఱ్ఱయ యా చిల్లులకే అతుకులు పెట్టెను; అని ఊహించిరి. ఈ యూహను కొందఱు నిరసించిరి. కొందఱు ప్రోది చేసిరి.

ఈ యుత్పన్నవాద శిథిలపూరణవాదము లిటు లుండఁగా మఱియొక రీ రెండు వాదముల నంగీకరింపక తిక్కనకు ముందే ఎఱ్ఱయ నన్నయ పేర నారణ్యశేషమును పూర్తి చేసికొని కూర్చుండెననియు—నద్దాన ఎఱ్ఱయ చెప్పిన భాగమును నన్నయదిగనే గణించి తిక్కన 'మూఁడుకృతులు' నన్నయభట్టానర్చెనని చెప్పెననియు— దాన నసత్య దోషము లేదనియు వ్రాసిరి. మఱియు ఎఱ్ఱన కాలము క్రీ.శ. 1260-1340 అరణ్యశేషరచనము 1280-90 నడుమ అనియు— నృసింహ పురాణము రచనము 1290–1300 ప్రాంతమనియును— తిక్కన జననము 1230 ప్రాంతమున ననియు నిర్వచనోత్తర రామాయణ రచన 1268–70 ప్రాంతమున ననియు భారత రచనము ప్రారంభించిన కాలము 1280–90 ప్రాంతమున కాఁదగుననియు కొంత చారిత్రక బలముతో నూహించిరి. నన్నయ భారతమును జూడకయే తిక్కన భారతము వ్రాయఁ దొడంగియుండునని ఒకానొకరు వ్రాసిరి. వీరు తిక్కనకు కృతి యిచ్చిన కేతన–ఆంధ్ర భాషా భూషణమును మఱచియుందురు.

అప్పయ తన అప్పకవీయమునందు అక్షర చక్ర సంబంధము చూపి 'స్ఫురదరుణాంశు రాగరుచి' అను పద్యము కడనుండియు ఎఱ్ఱయ రచన యని చెప్పి తిక్కన 'మూఁడు కృతులకు' మారయ 'త్రిపర్వములకు' తన 'మూఁడు పర్వములకు' 'ఇంచు మించు మూఁడు పర్వములు' అను తాత్పర్యము చెప్పిన వాఁడాయెను.

'అరణ్యమంతయు నన్నయ సొమ్మే. ఆ సొమ్ములో కీటములు కొంత యెత్తుకొనిపోయి యుండును.' అని ఊహించువారి వాదసారాంశ మిది–'ఎఱ్ఱయ అరణ్య శేషములో నన్నయ 'రయ విచలత్తురంగమాది పద్యపాదములు కొలఁదిగా కనఁబడుచున్నవి. మిగిలిన పాదములలో రచనా శైథిల్యము ఉన్నది. సీసములందును అక్కఱలందును నన్నయ నియమము కనఁబడదు. వచన రచనమునందును ఈ భేదము కలదు. మఱియు 'ఉన్నయ' మనగా రచనకాదు. పైకిఁ దీసికొనివచ్చుట లేక యూహించుట.

ఎఱ్ఱయయే 'అరణ్య పర్వశేషము పూరించెన్' అని 'ఉన్నయ' పదమునకు అర్థము చెప్పుకొనెను.

మఱియు ఆరణ్య పర్వము పూరణీయము కాని ఆరణ్యశేషము కాదు. కుండలో నీరు కొంత పోసి కొంత పోయకయున్న పుడేది పూరణీయము? కుండకదా! నిండుట అనునది కుండయొక్క సమష్టి ధర్మముకాని అవశిష్ట భాగపు ధర్మము కాదే? దాని ధర్మము జలకలితమగుటయే. కావున ఆరణ్య శేష మెఱ్ఱయ సొంత రచనయే యగునేని అతఁడు 'ఆరణ్యము పూరించెన్' అని చెప్పవలసియుండును. కాని అతఁడు 'ఆరణ్య పర్వశేషము పూరించెన్' అని చెప్పెను.

'తత్ కవితా రీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా' ఆరణ్యపర్వశేషో న్నయము నిర్వహించిన' అనగా 'ఆరణ్య పర్వశేషము పూరించిన' ఎఱ్ఱయ రచనలో నన్నయ రచనవంటి రచనయు ఎఱ్ఱయ రచనయు కలిపి కొన్నిపట్ల తెలియరాని చందముగాఁగాని తెలియఁగల చందముగాఁగాని కనఁబడుట సహ జము. ఈ యిరువురయు రచనలపోలికలను విడఁదీసి చూపు ప్రయత్నము దొడ్డది. కాని కొంత నన్నయదిగను కొంత యెఱ్ఱనదిగను కనుబఁడు ఈ కలయిక, నన్నయ యరణ్యపర్వములో కొంతపాలు చెఁడియో నుసిపురువో చిల్లులు చేసె ననుటకు ప్రమాపకముకాదు. ఉభయ విధమగు ఈ భ్రష్టవాదమునకు తిక్కన- "ఆది దొడఁగి మూఁడు కృతులు...ఒనర్చె...నన్నయభట్టు' అనునది హేతువు. దానిఁబిదపఁ బరిశీలింతము.

నృసింహ పురాణమునందలి 'ఆరణ్య పర్వశేషోన్నయము' నందలి 'ఉన్నయ' పదమునకు ఊర్ధ్వమును పొందించుట అని అర్థము. దానికి 'నిర్వ హించితి'తో నన్వయము. అనఁగా నన్నయ చెప్పఁగా మిగిలిన ఆరణ్యమును కడముట్టించితివని తాత్పర్యార్థము. ఆరణ్యములో మిగిలిపోయిన గ్రంథమును కడముట్ట రచించుటయే 'తద్రచనయ కాఁబూరించుట'.

'ప్రతిభతో నారణ్యపర్వశేషము చెప్పె' అని చెదలువాఁడ మల్లయ. మునిమనుమని సాక్ష్యము పనికిరాదుకాబోలు! అటులేని,

> **'నెల్లూరి తిరుకాళ మనుజవిభుని, సమ్మఖమ్మన సాహిత్య**
> **సరణి మెఱసి**
> **మహిమఁగాంచిన పెద్దయామాత్యసుకవి మనుమఁడు' జక్కన-**

'ఈ(త్రయిఁదాఁ (బబంధ పరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చి(త్రి నరణ్యపర్వమున శేషము'

అని చెప్పెను. ఇతని తాత (కీ.శ. 1265-79 నడుమ తిరుకాళనితో సమకాలికుఁడు. ఇతఁడు (కీ.శ. 1410 (ప్రాంతములవాఁడు. కావున చెదలువాడ మల్లయకంటె వెనుకటివాఁడు.

'ఏకారణముననో నన్నయ విడిచిన భాగము నెఱ్ఱయ రచించె'నను అర్థమున – ఎఱ్ఱయ ఆరణ్యపర్వము పూరించెననియు ఆరణ్య పర్వశేషము పూరించెననియు అనవచ్చును. ఆరణ్య పర్వము పూరించెననుటకంటె ఆరణ్యపర్వశేషము పూరించెనని చెప్పుట సంశయోచ్ఛేదకము. 'రాముఁడు కుండలో సాఁబాలు నీరు పోసెను. భీముఁడు మిగులు సాఁబాలు నీరితో నింపినచో భీముఁడు కుండనిండ నీరు పోసెననియు అనవచ్చును. ఈ చివరవాక్యమే నిక్కమునకు చేరువ. ఘటము పూరితమగునుగాని ఘటశేషము కాదని' కొంద అనుచున్నారు. ఇటు లెందేని రాజాజ్ఞయున్నదా ? శూన్యము పూరణీయము. అది అలఁతి యగు గాక వలఁతి యగుఁగాక ! ఇటులు కా దనువాదము 'శేషం కోపేన పూరయేత్'.

'శేషము చిల్లులు వోయిన'దని చెప్పి ఉన్నయ పదము సార్థకమైన దనువాదమునకు 'మిగిలిన (గంథము తుదముట్టించుట యను నర్థము చెప్పిసార్థకమై'న దనువాదము సమకక్షము. ఇంతకు చిల్లులకే అతుకులు పెట్టుచో ఎఱ్ఱయకు 'ఉన్నయ' పదములో దాగవలసిన పని యేమి ? కేతనవలఱకును తిక్కనవలఱకును మారనవలఱకును తిన్నగా నున్న మూఁడు పర్వములు తిక్కన కాలము నందేయున్న ఎఱ్ఱయకడకు వచ్చుసరికి పురువుమేసెనని ఎవరిని నమ్మింపగలరు? కీటములు కొట్టివేయని నన్నయ ఆరణ్యపర్వపు తాళపత్ర (గంథ మెచటనేని దొరకిన యెడల తన (ప్రయత్నమంతయు వమ్మయి పోయి (ప్రబంధ పరమేశ్వరత్వము లజ్జాపాదకమగునని మూఁడు కాళ్ళ ముదుసలులగు కేతన తిక్కనల ముందు నూనూగు మీసములవాఁడై యుండఁదగు ఎఱ్ఱన యెఱుఁగఁడా ? నన్నెచోడుని కుమారసంభవ మెఱిగిన నేఁటివారును ఇటు లూహింతురా ?

'ఎఱ్ఱయ రామాయణము కనఁబడకుండ బోలేదా ?' అను నేఁటి (ప్రశ్నమునకును కూచిమంచి తిమ్మనకడఁగల రామాయణమునకును నడుమ ఇన్నాళ్ళేండ్ల

వ్యవధానమున్నది. మఱియు చిల్లల శేషమునే పూరించిన యెడల 'భవ్యచరిత్రుఁడును' 'ధర్మైక తత్పరుఁడును' అగు ఎఱ్ఱన చిల్లులకే అతుకులు పెట్టితినని చెప్పుకొనఁగలఁడు. అతుకులు పెట్టినట్లు తెలియకుండ అతుకులు వెట్టుట అసాధ్యసాధనమే. ఇది ఎంత అసాధ్యమయినను ఈ పోత్తుల సొమ్మునకు 'ప్రబంధ పరమేశ్వరత్వము' దురాశామాత్రము. ప్రతివాదు లీయతుకులు గూడ గతుకులని అనుచున్నారు కదా! ఆరణ్యపర్వము గుఱించి ఎఱ్ఱయ కంఠోక్తి యిది :

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధ పరమేశుఁ డనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్టు తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"
(నృసింహ. 1-17)

ఇతరుల ప్రబంధమునందు కొన్నిచోటులు కొన్ని పద్యములను, కొన్ని పద్యములం దతుకులను పెట్టినవాఁ డెవఁడేని ఆ యతుకులను 'ఆంధ్రభాష నిర్వహించితివి' అని అనిపించుకొనఁగలఁడా? దాన 'ప్రబంధ పరమేశుఁడవు' అని ఎఱపోతతాత ముఖమున తన్నుఁబొగడుకొనఁగలడా? భీమేశ్వర యజ్వపట్టర్క పరమేశ్వరుఁడు? సాళ్వాభ్యుదయకర్తయగు డిండిముఁ డష్టబాషా పరమేశ్వరుఁడు! అతుకుల బొంతను పైని వేసికొనిన ఎఱ్ఱనయు ప్రబంధ పరమేశ్వరుఁడు!

ఇంకొకటి– ఇది నన్నయ రచితమే యగునేని అందలి లుప్తములను గుప్త మొనరించుటకు తిక్కనమీఁద భక్తి యెందులకు? అంతయుఁ దనరచన యయిననే ఇటు నన్నయ తిక్కనల నడుమ రాదారి యేర్పడి 'సుజనోత్సవ' మగును. తిక్కనమీఁది భక్తియు సార్థకమగును.

## ఆరణ్య రచన యెపుడు?

సమకాలికుఁడగు ఎఱ్ఱయ తిక్కనగారు భారతము రచింపక ముందుగాని రచించుచుండఁగా గాని ఆరణ్యశేషము రచించి యుండరాదా? వయస్సునుబట్టి

రచించి యుండవచ్చునని యూహింపవచ్చును. క్రీ. శ. 1280-90 ప్రాంతముల తిక్కన భారతము రచింపఁదొడఁగెనని యందము. నాఁటి కెఱ్ఱయ కిరువది యయి దేండ్లు ఉండవచ్చును. ఇటులగుచో ఎఱ్ఱయ క్రీ. శ. 1255 లో పుట్టి ఎనుబదేండ్లు జీవించి, క్రీ. శ. 1335 కు ముందు శివసాయుజ్యము చెంది యుండవచ్చును. దాన పాతికయేండ్ల లోపలనే ఎఱ్ఱయ ఆరణ్యశేషము రచించి యుండవచ్చును. లేక యింకను కొంచెము వయసు ముదిరిన పిదప, తిక్కన భారతము రచించు చుండఁగా ఆ సంగతి అపుడు తెలిసిగాని తెలియకగాని ఆరణ్యశేషము చెప్పెనని అనుకొనవచ్చును. ఇది నిక్కమగు నెడలను దానిని తిక్కన యెఱిఁగిన యెడ లను అతఁడు ఎఱ్ఱయను గుఱించి ఒకమాటయేని రాల్పఁడా? తిక్కన 'పరవచః శ్లాఘలో వాచంయముఁడు' కాఁడే! బయ్యన మంత్రిని 'భవ్యభారతిని' జేసెనే! కేతనను పూజించి అతనిచే కృతిఁగొనెనే!

తిక్కన భారత రచనకు ముందే ఎఱ్ఱయ అరణ్యశేష రచన యను నూహలో ఇంకొక క్రొత్త యూహ పుట్టుకొని వచ్చుచున్నది. 'భాసుర భార తార్థముల భంగులు' అను పద్యము వలన తిక్కన భారత రచనానంతరమున నృసింహపురాణ రచనయని చెప్పవలయును. 'ఎఱ్ఱయ విరాట పర్వమునకేల పూనుకొనలేదు?' అని ప్రశ్నించుచో తిక్కన దానికి పూనుకొనెనని విని తానం దులకుఁ దొడంగలేదని చెప్పవలెను. ఇటులగునేని ఎఱ్ఱయ ఆరణ్యము చెప్పి తిక్కన భారతమును ముగించువఱకును నోటిలో వేలువేసికొని కూర్చుండెనని అనవలయును. అది యటుండె. తిక్కన భారతమునకు పూర్వమే ఎఱ్ఱయ ఆరణ్యము చెప్పెనను వారికి పైఁజెప్పిన 'ఉన్నత'-పద్య చతుర్థ చరణము బాధకము. ఇంతియకాక,

'భాసుర భారతార్థముల భంగుల నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీత పరమార్థము తెల్లగఁజేసినట్టి య
భ్యాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్'

-- పద్యమునందలి 'అద్యుల' యుఱియు,

"మించినవేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మరా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు భంగిఁ బ్రా
ఞ్చిత శబ్దసారులు మహాకవులాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తిసంగ సుఖలీలకు నేనును గాంక్షఁజేసితిన్"

అను పద్యమునందలి 'ఆద్యులు' బాధకము. భారత కర్తృత్వముననే యీ యాద్యత.

## మూఁడు కృతులు

మూఁడు కృతు లనఁగా మూఁడు పర్వములు. 'నన్నయ మూఁడు కృతు లొనరించె'నని తిక్కన చెప్పెను. కాని ప్రతులం దన్నిఁటను ఆరణ్య పర్వము నాలుగవ ఆశ్వాసమున నూట నలుఁబది రెండవ పద్యము క్రింద—

'నన్నయభట్ట కవిత్వము సంపూర్ణము'
ఇక్కడనుండి యెఱ్ఱాప్రగడ కవిత్వము' 'స్ఫురదరుణాంశు'

అని ఉన్నది. ఈ వ్రాఁతలకంటె తిక్కన మాటలు ప్రమాణము. మూఁడనగా మూఁడే. కాని రెండుం బాతికగాని రెండున్నఱగాని కాదు. తిక్కన బ్రహ్మంతవాఁడు. అతఁడు కల్లలాడఁడు. ఇదీ వాద ధోరణి !

ఆశ్వాసాంతములందును పర్వాంతములందును నన్నయ 'జనమేజయునకు వైశంపాయనుఁడు చెప్పెనని' అనియు సమనంత రాశ్వాసములందును పర్వము లందును— 'అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె' ననియు పూర్వాపర వాక్యార్థములను కలుపును. ఎఱ్ఱయ నన్నయ ననుసరించెను. ఇఁక తిక్కన—

"దేవా ! దివ్యచిత్తంబున నవధరింపుము.
కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వపర్వార్థ యుక్తి సేయునట్టి యెడల
యత్న మించుకంత యయినను వలవదు వలసినట్లు చెప్పవలసి యుండు.

మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమత శుభావహంబునుం గావున నొక మహాఫలంబు గోరి జనమేజయుండు కృష్ణద్వైపాయన మహాముని కారుణ్యంబు వడసి తదీయ ప్రియ శిష్యుండయిన వైశంపాయనువలన వినినకథ యుపకటంజేసి తత్ ప్రకారంబు నడపెద నది యెట్లనినం బరమ పవిత్రులగు పాండుపుత్రుల చరిత్రం బుపాఖ్యా సహితంబుగా* విని జనమేజయుండు వైశం పాయనున కిట్లనియె".

అని కథ కలుపుచున్నాడు. పూర్వకథకును ఉత్తరకథకును నడుమ లుప్తభాగ ముండుటంజేసి 'కథ అందఱకును తెలిసినదే. పూర్వపర్వార్ధ సంగతికి నేను ప్రయత్నింప నక్కఱలేదు' అని చెప్పుకోవలసి వచ్చెను. పూర్వ పర్వాంత మున్న యెడల పయి పద్యమునకుఁ గాని క్రింది వచనములో 'నడపెద' నను నంతవఱకుఁ గల గ్రంథమునకుఁగాని ప్రయోజనము ఉండదు.

ఇఁక అరణ్యాంతమున ఎఱ్ఱయ ఏమి చెప్పెనో చూతము—

"వ.... కౌంతేయులు గ్రమ్మఱ నిజాశ్రమంబున కరిగి ధరణీ దేవుల కరణిప్రదానంబు సేసి తత్ప్రయుక్తాశీర్వాద శతంబులు గైకొని పరమానందంబునుం బొందిరని యిట్లు పాండుతనయుల వనవాస ప్రకారంబు సవిస్తమధురంబుగా నుపన్యసించి,

**అనఘుఁడు కృష్ణద్వైపా,**
**యనశిష్యుఁడు బోధనిధి సమంచితమేధా**
**ఘనునకుఁ బారిక్షితునకు,**
**ననవరతానంద సుఖసమగ్రత యొసఁగెన్"**

దీనికి మూలము :

**సమేతాః పాండవాశ్చైవ సుఖసుప్తా మనస్వినః**
**అభ్యేత్య చాశ్రమం వీరా స్సుఖ సుప్తా మనస్వినః**

---

* నన్నయ, 'ఆదిపర్వము చివర-ఆదిపర్వ కథయెల్లను నిమ్ముగఁ జెప్పె'అని వ్రాసెను. [ఆది-8-322]

ఆరణేయం దదు స్తస్మై బ్రాహ్మణాయ తపస్వినః

.... .... .... .... .... .... ....

తిక్కన వచనము తుదనున్న 'వారల వనవాససమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని' అను దానికిని ఎఱ్ఱన వచనము తుదనున్న 'పాండు తనయుల వనవాస ప్రకారంబు సవిస్త మధురంబుగా నుపన్యసించి' అనుదానికిని ఐక్యము చూపట్టుచున్నది. ఈ మాటలు మూలములో లేవు. ఈ యైక్యమెటులు పొసఁగును ? తిక్కన రచన నెఱ్ఱయయేని ఎఱ్ఱయ రచనను తిక్కనయేని చూచి యుండవలెను. 'కథ జగత్ప్రసిద్ధి గావున' అను పద్యము చెప్పుకొనిన తిక్కన ఎఱ్ఱయ రచనను చూచియుండఁడు. తిక్కన రచించిన భారతము నెఱ్ఱన లెస్సగా నెఱుఁగునని నృసింహపురాణ హరివంశముల వల్ల తెల్లము. కావున ఎఱ్ఱయ,

'ఆదిఁదొడంగి మూఁడు కృతు లాంధ్ర కవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

అను పద్యమును సార్థక మొనర్పఁగల తిక్కనమీది భక్తితోడను, అటు నన్నయ మీఁది భక్తితోడను నన్నయ పేరనే 'ప్రతిభతో ఆరణ్య శేషము చెప్పె'ననుట సంగతము. మఱియు తిక్కన చెప్పిన 'సవిస్తరంబుగా' అనునది సంగతమగుటకు ఎఱ్ఱయ 'సవిస్తర మధురంబుగా' అనుమాట చేర్చెనని అను కొనుటకును వీలున్నది.

ఆరణ్య శేషము చెప్పిన పిదప ఎఱ్ఱయ నృసింహపురాణము చెప్పెను. 'ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల (పథంబులఁ) గావ్యకర్తయై' అను దానిలోని కావ్యము రామాయణమేని దాని పిదపనే ఆరణ్య శేష నృసింహ పురాణములఁ జెప్పెననియు వేమయ కోరఁగా తొల్లి రచించిన రామాయణము కృతి యిచ్చి భారతమునకు ఖిలమగు హరివంశమునకుఁ బూనుకొనెనని చెప్ప వలెను. మఱియు ఈ 'చతురోక్తి పథంబులు'* సంస్కృత భాషలో ఆదె

---

* చతురోద్యన్మతి వాతపోతక మహా సాంయాత్రికుండై తగన్
జతురామ్నాయ పథంబులన్ మెలఁగి శాస్త్రరత్నముల్ రామ స
న్నుతి రూపంబుగఁ గూర్చి విశ్వజగమున్ భూషించె నే ధన్యుఁడా
వ్రతిముఖ్యుండు ప్రసన్నుఁ డయ్యెడుఁ గృపన్ వాల్మీకి మా కెప్పుడున్.
(హరి. పూ. 1-7)

కావ్యములని ఎఱ్ఱయ ఉద్దేశించెనేని రామాయణ హరివంశములు చెప్పిన పిదపనే ఆరణ్య శేషమును నృసింహపురాణమును చెప్పెనని అనవలయును. ఇటులగు నేని ఎఱ్ఱన రచనయంతయు తిక్కన భారతమును రచించిన పిదపనే యని చెప్ప వలయును. తిక్కన భారతము భక్తితోఁ జదివి చదివి సొంత రచన సాగించిన ఎఱ్ఱయ క్రీ.శ. 1335 లో లేఁడు కావునను తిక్కన భారతమును స్వోపయోగ మొనరించుకొనుటకు నాఁటికి పాతిక యేండ్ల వాఁడయినను కావలయును గావునను ఉరమరిక క్రీ.శ. 1275 ప్రాంతముల జనన మొందియుండును. ఎనుబదేండ్లు జీవించెనేని క్రీ.శ. 1255 ప్రాంతమున పుట్టి యుండును.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారును, డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారును రెడ్డిరాజుల శాసనములను వెలుగులోనికి దీసికొని రాని యెడలను, వడ్డాది అప్పారావుగారు (B.A.B.L.) రెడ్డిసంచికలో రెడ్డిరాజుల చరిత్రము సమగ్రముగా సమాలోకన మొనర్చి శ్రీపర్వత అహోబల సోపాన ప్రసక్తి ఎఱ్ఱయ యెఱుఁగఁడని ప్రప్రథమముగా కనుగొనకున్నను, శ్రీ కొండ ముది నరసింహముగారు అప్పకవీయమునుండి అరివర్ణ చక్రోద్ధారణమును త్రవ్వి యెత్తకున్నను, ఎఱ్ఱాప్రగడ పుట్టు పూర్వోత్తరము లింత విశదముగా తేలి యుండునవి కావు గావున వీరందఱకును ధన్యవాదములు—



## ఆంధ్ర సంస్కృత హరివంశములు

అధ్యాయముల తుదను, పర్వముల తుదను 'ఖిలేషు' అని యుండుటఁ జేసియు, ఆదిపర్వమున-

"హరివంశస్తతః పర్వపురాణ ఖిల సంజ్ఞితమ్"

"భవిష్యత్ పర్వచాప్యుక్తం ఖిలేష్వేవాద్భుతం మహత్"[1]—అనియు,

---

1. 2-71, 2-72, 2-257. (వావిళ్ల ప్రతి)

"ఖిలేషు హరివంశశ్చ భవిష్య చ్చ ప్రకీర్తితమ్" - అనియు ఉండుటంజేసి హరివంశము భారతమునకు ఖిలము. ఖిలమనగా పరిశిష్టము.[2]

ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణపర్వము వఱకుంగల గ్రంథము భారత మనియు, హరివంశముతోం గలిసిన గ్రంథమును మహాభారత మనియునందురు.

"మహాన్ వ్రీ హ్యపరాహ్ణ గృష్టి ష్వాసజాబాల భారభారత హైలిహిల
రౌరవ ప్రవృద్ధేషు"(౬-౨-౩౮)

అను ఫిట్ సూత్రమునందు మహాభారత శబ్దమును, 'సుమంతు జైమిని వైశంపాయన పైల సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యాస్తృప్యంతు' అను ఆశ్వలాయన గృహ్యసూత్ర వాక్యమునను భారత మహాభారతముల ప్రశంస యుండుటవలన పై సూత్రకారులకు ముందే భారతమనియు, మహాభారతమనియు విభాగము కలదని తెల్లము. మఱియు మహాభారతమునే భారతమని, మహాభారతమే వ్యవహరించును.[3] అది యటుండె.

ఈ సంస్కృత భారతమునకు ఉత్తర దేశములందును దక్షిణ దేశము లందును వ్రాతప్రతులు కలవు. ఈరెంటను శ్లోకసంఖ్య యందును అధ్యాయము లందును భేదము కలదు. దక్షిణదేశమున గ్రంథాక్షరములతో వ్రాయఁబడినవియు

---

2. 'పూర్వత్రానుక్తం పరిశిష్టం వస్తు ఖిల శబ్ద వాచ్యమ్.' (బృహ దారణ్యక ఆనందగిరి వ్యాఖ్య 5-1) 'యచ్చ శాఖాంతరస్థమ్ శాఖాన్తరే ప్రయోజనవశాత్ పఠ్యతే, యథా బహ్వృచేషు శ్రీ సూక్త మేధాసూక్తాది తత్ ఖిల మిత్యుచ్యతే తథాఽత్రాష్టాదశ పర్వాత్మ కేతిహాసే హరివంశాఖ్యం ఖిల విష్ణు పురాణం భవిష్య పురాణం తత్ర తత్ర సూచితస్య కృష్ణ మాహాత్మ్యస్య మోక్ష ధర్మోపయోగినో వైరాగ్యస్య చోపబృంహ ణార్థమ్ పఠితం 'పురాణం ఖిల సంజ్ఞితమ్' ఇతి తత్ర పురాణ శబ్ద ప్రయోగాత్ ఏవం చ యథాఽధ్వర్యు వేద విహితోఽపి యాగో వేదాంత రహితాభ్యాం స్తోత్ర శస్త్రాభ్యాం వినా న పూర్యతే. ఏవం భారత పారాయణ మపి హరివంశం వినా న పూర్యత ఇతి జ్ఞాపనార్థమ్ పర్వ సంఖ్యాయాం శ్లోక సంఖ్యాయాం చా స్యాంతర్భావ ఉక్తః అన్యథా తత్ర సంఖ్యాంతర మేవా వక్ష్య దిత్యాస్తాం తావత్.

3. భవిష్యోత్తర మేతత్తే కథితం భారతం మయా.

ఆంధ్రాక్షరములతో వ్రాయఁబడినవియునగు తాటాకు పొత్తములు కలవు. తెలుఁగు దేశమునందు నన్నయ తాను తెలిఁగించిన మహాభారతమున పర్వములయు శ్లోకములయు లెక్కయిచ్చెను. నన్నయ భారతపు వ్రాతప్రతులలోఁ గూడ ఈ లెక్కలకు పాఠభేదములు కలవు. అటులున్నను నన్నయకు ముందే అనఁగా క్రీ. శ. 1022 కు ముందే - జావాకును సింహళమునకును గొంపోఁబడిన ప్రతులను దక్షిణదేశపు వ్రాతప్రతులన్నిటను అనైక్యముకంటె నెక్కువ ఐక్యము కనఁబడుచున్నది.

పదునాఱవ శతాబ్దిలో కర్పూరగ్రామ[4] వాస్తవ్యుడు నీలకంఠుడు మహాభారతమునకు భావదీపిక అను వ్యాఖ్య వ్రాయఁబోవుచు ఆ కాలమునందు దొరికిన వ్రాతప్రతులు చాలమట్టు శోధించెను. తనకు ముందుగల వ్యాఖ్యల నన్నిటిని జదివి యతఁడు అతృప్తు డాయెను. పాఠభేదము లతని నెంత చిక్కు వెట్టెనో యీ క్రింది విచారణ వల్ల మనకు తెలియఁగలదు—

"నవోగ్రసేనస్య సుతాస్తేషాం కంసస్తు పూర్వజః
న్యగ్రోధశ్చ సునామా చ కంకః శంకుః సుభూమిపః
రాష్ట్రపాలోథ సుతను రనాధృష్టి శ్చ పుష్టిమాన్"
—హరి. ౩౭—౩౦—౩౧

దీనిని ఎఱ్ఱయ ఇటులు తెలిఁగించెను-

"ఉగ్రసేనునకుఁ గంసుండు జ్యేష్ఠుండుగాఁ గ్రమంబున న్యగ్రోధుండును సునాముండును గుహ్యుండును శంకుండును సుభూమిపుఁడు రాష్ట్రపాలుండు సుతనుండు ననాధృష్టుండు సారసుండు పుష్టిమంతుం డనఁ దొమ్మండ్రు[5] కొడుకులును"
—పూర్వ. 3-151

ఇచటఁ బది పేరు లున్నటు లాభాసించుటవలనఁ దొమ్మండ్రుకు పదుండ్రను పాఠాంతరము వ్రాయసకాండ్రు కల్పించియుందురు.

4. కోపర్‌గామ్. ఇది అహమ్మద్‌నగర్ జిల్లాలో నున్నది.

5. పదుండ్రు. పా.

దీనికి నీలకంఠుఁ డిటులు వక్కాణించెను——

"సుభూమిప ఇతి శంకోర్విశేషణమ్: గౌడ పాఠే – సుభూషణ ఇతి వా తస్యైవ విశేషణమ్: అన్యేతు– 'సుభూమిప ఇతి కంసస్యైవ నామే త్యాహుః తేషాం తస్య పూర్వజో క్తి ర్విరుధ్యతే, పరే పునః– కంకు శ్చైవ సుభూమిప ఇతి శంకు పదే లోప మేవ కుర్వంతి. తత్ర పాఠ తత్త్వం వ్యాస ఏవ వేద"[6]

'సుభూమిపః' అనునది శంకువునకు విశేషణము. 'సుభూషణః' అని గౌడ పాఠము. ఆ పాఠమునను 'సుభూషణః' అనునది శంకువునకు విశేషణము. కొందఱు 'సుభూమిపః' అనునది కంసునకే పేరని అందురు. కాని వారికి 'కంసుఁడు జ్యేష్ఠుఁడు' అను మాట విరోధించును. మరికొందఱు 'కంకు శ్చైవ సుభూమిపః' అని పఠించి శంకుపదమును మ్రింగివేయుచున్నారు. ఇచటి అసలు పాఠము ఆ వ్యాసులకే తెలియును.'

ఈ రీతిగా భారతము చాల పాఠ భేదములతో చిక్కుపడియున్నది. నీలకంఠుఁడు పరిష్కరించిన వ్రాఁత పుస్తకము లన్నియు ఉత్తరదేశము నందలివే; దక్షిణదేశపు వ్రాఁతప్రతు లతఁ' డెఱుగఁడు. భండార్కర్ ఇన్‌స్టిట్యూట్ వారు నీలకంఠుని పాఠములనుగూడ పరమప్రమాణముగాఁ జెప్పలేదు. అది సరియయినదే.

నన్నయ్య ఏ వ్రాఁతప్రతిని పురస్కరించుకొని శ్లోకసంఖ్యను పర్వ సంఖ్యను జెప్పెనో, ఆ వ్రాఁతప్రతి పుత్రికలనే తిక్కనయు నెఱ్ఱనయు నుప యోగించి యుండవలెను. కావుననే ఉత్తరదేశపు హరివంశమునకును, ఎఱ్ఱయ హరివంశమునకును భేదము కనఁబడుచున్నది. ఈ పాఠభేదములను గుఱించి శతఘంటము వెంకటరంగశాస్త్రిగారు ఆంధ్రభారత పీఠికలో 'ఆంధ్రీకరణ పద్ధతి' అను శీర్షిక క్రింద వివరించియున్నారు. ఆనంద ముద్రాక్షరశాలలో ముద్రింప బడిన భారతము పీఠిక– పుటలు 23, 24, 25, 26, 27 చూచునది.

---

6. క్రీ.శ. 1936 సం. పూనాలో చిత్రశాలా ముద్రణాలయమున పండిత రామచంద్రశాస్త్రి కింజే వడేకర్ గారిచే ముద్రితమగు ప్రతి.

7. నీలకంఠుఁ డిటు లనుకొనుటకు ఈ కొందఱ పాఠమున–"తేషాం కంసస్తు పూర్వజః" అను దళము లేదని అతని అభిప్రాయమని యనుకొనవలయును.

మనలో ఎక్కువ మంది చదివికొను సంస్కృత భారతము ఉత్తర దేశమునందుఁగాని, కుంభకోణమునందుఁగాని ముద్రితమయిన నాగరాక్షర పుస్తకము లని యనుకొందును. అవి దాక్షిణాత్య గ్రంథామయాయులు కావు. పురాణం హయగ్రీవశాస్త్రులవారు ముద్రించిన తెలుఁగు ప్రతి నేను చూడలేదు. అందలి హరివంశమును, ఎఱ్ఱయ యుపయోగించిన హరివంశమును ఒకటి యగునో కాదో చూడవలసియున్నది.

నన్నయ అదిపర్వమున, హరివంశ భవిష్యత్ పర్వంబులతోఁగలిపి మహాభారతమున నూఱు పర్వములు కలవని లెక్కించెను.[8] ఎఱ్ఱయ తదనుగుణముగనే రెండు పర్వములకు బదులుగా హరివంశమును పూర్వభాగమనియు, ఉత్తరభాగమనియు విభజించెను. బొంబాయి ప్రతులందు పూర్వహరివంశమనియు ఉత్తర హరివంశమనియుఁ గలదు. పర్వవిభాగము లేదు.

క్రీ. శ. 1936 సంవత్సరమున పూనాలో భారతభావ దీపికతో ముద్రింపఁబడిన హరివంశమునందు హరివంశపర్వము, విష్ణుపర్వము, భవిష్యపర్వము అను మూడు పర్వములు కలవు. ఈ మూఁటితోఁ గలిపి నూఱు పర్వములు.

ఉత్తరదేశపు హరివంశపు ప్రతులలోను, దక్షిణదేశపుఁ ప్రతులలోను శ్లోకముల సంఖ్యలో భేదము కలదు. కథాక్రమమునందును భేదము కలదు.

మఱియు ఎఱ్ఱన హరివంశమునందు లేని జూదమాట, హంసడిభకోపాఖ్యానము సోమన హరివంశమునందుఁ గలవు. సోమన హరివంశమునందు లేని జరాసంధుని మధురాక్రమణము, రుక్మిణీ పరిణయము, పారిజాతాపహరణము ఎఱ్ఱన హరివంశమునందుఁ గలవు. కావున ఆంధ్రదేశపుఁ ప్రతులందును వైవిధ్యము కలదనుట తెల్లము. కొన్ని తెలుఁగు హరివంశపు వ్రాఁతప్రతులలోను కథాంశములందు వేఱిమి యున్నది. ఇటీవలి నేమాని భైరవకవి ఎఱ్ఱన హరివంశములో లేని కొన్ని కథాంశములను తెలిగించియున్నాఁడు. అందు కోటగిరి శ్రీనివాస భూపతి :

"...పారిజాత హరణాది కథావళి లేక యున్నచో..."

8. 1-32.

గీ. ఎఱ్ఱనార్యుండు తెలిఁగింపఁడేల నొక్కొ
తెలుఁగు సేసిన పిదపను దొలఁగె నొక్కొ..."

అని సందేహించెను. కావున భైరవికవి మూలము ఉత్తరదేశపుఁ బ్రతి. వీరే కాక సుమారు నూఱేండ్ల క్రిందటి గూళికల్లు వెంకటరమణకవి తన కనక రంజిత శిఖామణీ పరిణయమునందు–

"మునుపు హరివంశమంతయుఁ దెనుఁగు సేసి యంకిత మొనర్చితిని"

అని తన యిష్టదైవము శ్రీ వేంకటేశ్వరుఁడు తన్నుఁగూర్చి చెప్పినటులు వ్రాసి కొనెను. మఱియు కానాల నరసింహకవి తాను రచించిన "శేష ధర్మములు" హరివంశమునందలి ఆశ్చర్య పర్వములోనిదని వ్రాసెను. ఇది యేడదో !

పూజ్యపాదులగు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్ర భవిష్య పర్వము లేనిచో మహాభారత మసంపూర్తిగా నుండిపోవునని తలంచి దానిని మనోహరముగాఁ దెలిఁగించుచు–

మ. హరివంశంబును విష్ణుపర్వము భవిష్యంబన్న పర్వత్రయిన్
హరివంశం బలరారెడున్ ఖిల పురాణాఖ్యన్ సదాఖ్యాన సుం
దరమై సాత్యవతేయ వాగమృతమై, దానన్ భవిష్యంబు శ్రీ
హరి తత్త్వ ప్రతిపాదకంబు శతపర్వామ్నాయ శీర్షంబగున్.

గీ. ఆది నించుక గొనె నెఱ్ఱనార్యుఁ డందు,
తుది నొకించుక సోమనాథుండు గొనియెఁ
గాన వారిద్దఱిఁ దలంచి దాని నిపుడు
పూర్తిగాఁ దెనిఁగించుట పోల దొక్కొ !

అని చెప్పిరి. దీనిని బట్టి వీరి మూల గ్రంథము పూనా ప్రతి. అనఁగా ఉత్తర దేశపుఁ బ్రతి.

ఇంతకు క్రీ.శ. 14 వ శతాబ్దిలో నిరువది ముప్పదేండ్ల నడుమఁ బొడమిన ఎఱ్ఱన సోమనల గ్రంథములందలి భేదముఁబట్టి, తెలుఁగు దేశములో రెండు విధములగు ప్రతులున్నవనియు, ఆరణ్యము పూరించిన ఎఱ్ఱన హరివంశ మూలమును నన్నయ మూలమును సజాతీయములనియుఁ దేలినదని చెప్పవచ్చును

ఎఱ్ఱయ తెలుఁగు హరివంశము తొలిసారి వావిళ్లవారిచే క్రీ.శ. 1864 సం. ముద్రింపఁబడినది. పిదప వారిచేతనే పాఠాంతరములతో 1901 లో ముద్రింపఁబడినది. ఇపుడు దానికంటెఁ గొలఁది తప్పులతోడను, కొలది ఒప్పుల తోడను ముద్రితమయినది. ఇవిగాక శ్రీమాన్ కొ. అనంతాచార్యులవారిచేఁ బరిష్కరింపఁబడి యద్దనపూడి సంజీవయ్యగారిచే స్టార్ ఆఫ్ ఇండియా ముద్రాక్షర శాలయందు ఒకటి ముద్రిత మయినది. నా చూచిన పుస్తకమునందు ఏ సంవత్సర మున ముద్రితమాయెనో ఆ సంవత్సరము అక్షరములు ఉండు ప్రదేశము చినిగి పోయెను.

ముద్రితమగు నీ గ్రంథమునఁ గొన్ని పద్యములకు అర్థశుద్ధి లేదు. శబ్ద శుద్ధిలేదు. ఇన్ని పర్యాయము లచ్చయినను ఇది యింకను అఱగొఱగా ఉండి పోవుట కాంధ్రుల ఔదాసీన్యమే కారణము. 1901 లో అచ్చయిన ప్రతి మరల 1960 లో అచ్చగుచున్నదనిన, రమారమి 60 ఏండ్లకుఁగాని వేయి ప్రతులు అమ్ముడు పోలేదన్నమాట. గ్రంథమా భారత శేషము ! కవియా ఎఱ్ఱాప్రెగడ ! కవిత్రయములో నొకఁడయిన ఎఱ్ఱయ గ్రంథమునే తెలుఁగువారు చదువుకొనుట లేదన్నమాట ! !

నూతేండ్ల తరువాత ఎఱ్ఱన్నను తొలిసారి కీర్తించినవాఁడు జక్కన. పిదప శ్రీనాథుఁడు.

శ్రీనాథుని కాలముననే రెడ్డి రాజ్యము ఛిన్నాభిన్నమగుటయు; పిదప ఆంధ్రదేశము తురుష్కదండయాత్రలకును, తెలుఁగు ఱేండ్లలోఁ జెలరేగిన అంతః కలహములకును మరల మరల లోనగుచుంటయు మొదలుగాగల కారణ ముల వలననో, మఱి యింకే కారణములవలననో ఎఱ్ఱాప్రెగడ నృసింహ పురాణము, రామాయణము, హరివంశము సురక్షితము చేయఁబడలేదు. వీనిలో రామాయణము పేరు మాత్రము మిగిలెను. నృసింహపురాణము హరివంశముల ప్రాఁత ప్రతులు చూచినవారు తమ తమ శక్తికొలఁది దిద్దుకొనవలయువారే !

ముద్రణ కార్యాలయ మొకచోటను, నేను బహు దూరమున నొక పల్లియ యందును ఉండుటవలనను, శ్రీ వావిళ్లవారు ఎన్ని గ్రంథముల నిందులకు

సమకూర్చినను అవి చాలకపోవుటవలనను, శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు 'హరి' యనుటవలనను ఈ పీఠిక ముద్రణావశిష్టమయి యుండెను. ఈ కూర్పు రాఁగల కూర్పున కుపకరించునది మాత్రమే కాఁగలదు. పుటల క్రిందఁ జూపఁబడిన పాఠాంతరములు కొన్ని మూలమునం దచ్చయిన పాఠములకంటె మంచివే యయినను వీనికంటె మంచి పాఠము లింకను దొరకఁగలవేమో యను నాసతో మూల పాఠముల నెచటనో తప్ప నేను మార్చలేదు. ఊహించిన మార్పులను గూడ వీనికంటె మేలు తరములగు మార్పుల నెవరేని సూచింతురు గాతమని, ఆ యుద్దేశముచేతనే వివిక్తముగా చూపితిని. పద పట్టికను అర్థములతో చిట్ట చివర చేర్చితిని.

నృసింహపురాణ హరివంశ పాఠములలో చాలఁ జోటుల శబ్దరత్నాకరము కంటె సూర్యారాయ నిఘంటువు మంచి పాఠముల నుదాహరించి, సంగతమగు అర్థములకు చక్కఁగా ప్రయత్నించెను. శోధకుల కీయెడల ఇంకను తీరని పని యున్నది. ముద్రితమగు నీ పుస్తకమునందు అనన్వితములగు పద్యములు కొన్ని యున్నవి. మనస్సునను తృప్తి పఱపని పాఠాంతరములున్నవి. యతి భ్రంశము లున్నవి. కవి ప్రయుక్తములా, లేఖక ప్రమాదములా యని సంది యం పడఁదగిన పదముల శోధనమున కివి జరుగఁబోవు ముద్రణమును కని పెట్టుకొని యున్నవి. శోధన చేయఁగల పాఠకులందఱును ఈ భారము వహింప నిదే యిది నెఱవేఱదు. అందఱకును తలాయొకటి తోపవచ్చునుగాని ఒకనికే అన్నియుఁ దోఁపవు కదా! ఇంత చెప్పనేలనఁగా నిది ఉత్తమ గ్రంథము. ఇది లేనిదే మనకు మహాభారతము పూర్తికాదు.

చిరివాడ, కృష్ణా జిల్లా.

వేలూరి శివరామశాస్త్రి
శతావధాని

గోవింద రామాయణం :

# 5. "ఉపోద్ఘాతం"

౧

ఈ గోవింద రామాయణం చదివిన తరువాత వేలు వేలు రామాయణాలు చదువనక్కఱలేదు. అలాగే శ్రీమద్రామాయణానికి ఉన్న వేలువేలు వ్యాఖ్యల లోని విశేషాలు గూడా పరికించే పనిలేదు.

ప్రతిభా వ్యుత్పత్తులు ఈ కవిలో సమంగా కనిపిస్తున్నవి. ఇవి ఎక్కువగా కలిస్తే కవి దుర్బోధుడై పోవడం అక్కడక్కడ చూస్తాం. గోవింద రామాయణానికి వ్యాఖ్యతో అయే పని సున్నా.

గోవింద రామాయణంలో రాముడు మనిషి కాడు. ఆచార్యులుగారు మనిషినిగా నిలబెట్టాలని అనుకొంటారుగాని ఆ రాముడో ఇట్టే దేముడై కూచుంటాడు. ఈ కవి జన్మతః వైష్ణవుడు. ఇపుడు రామభక్తుడై రామాయణం చెపుతున్నాడు.

రామాయణం దీర్ఘశరణాగతిట! ఇంకేం; కవికి శరణాగతేకాక రామాయణం చెప్పడమనే దీర్ఘశరణాగతి దొరికింది. ఆకించన్యం మొదలయిన పంచాంగాలూ, అర్థపంచకమూ మొదలయినవి రామాయణ పాత్రలలో ఉన్నవి. ఇవేకాక ఆచార్యులవారు పంచసంస్కార సంస్కృతులు. ఈ రీతిగా ప్రసన్నుడయిన వాడు కవి.

అయితే ఇల్లా భక్తి భక్తి అంటూ శరణాగతి లేక ప్రపత్తి ప్రపత్తి అంటూ వాచ్యంగా కవిత్వం చెపితే కావ్య ప్రయోజనమయిన రససిద్ధి కలుగుతుందా? అనే ప్రశ్న ఎవరయినా వేస్తారేమో! అలవారిని నేను ఈ రామాయణం చదివి ఆనందం కలిగిందో లేదో చెప్పండి అని అంటాను.

రెండేసి మూడేసి అక్షరాలు గల మాటలు, చిన్న చిన్న వాక్యాలు, పొంకమయిన పలుకుబళ్లు ఉన్న— ఈ గోవింద రామాయణం చదివిన తరువాత

పానకం అక్కఱలేదు.

**ఇతఁడే పరబ్రహ్మ మిదియె రామకథ**
**శతకోటి విస్తరము సర్వపుణ్య ఫలము**

అన్నమయ్య XI–225

పేరు :

అన్ని భాషలలోనూ శతకోటి ప్రవిస్తరంగా రామకథ పెరుగుతూనే వుంటుంది. ఈ గోవింద రామాయణంతో తెలుగు రామాయణాల బలగం పెరిగింది. గోవిందాచార్యులవారు తమ రామాయణానికి గోవింద రామాయణం అని పేరు పెట్టకపోయినా లోకులు శృంగగ్రాహికగా దీనిని గోవింద రామాయణ మనియే అనేవారు. మంచిదే, పేరు ముద్దుగా వుంది.

## రా మా య ణ ం

కొంచెం పరిశీలించి చూచేవారందరూ రామాయణ కథ నిజంగా జరిగిందేనా అని ఆలోచింపక మానరు. కారణం అందరకూ తెలిసిందే. ఆ రాకాసులూ ఆ రాబందులూ ఆ కోతులూ ఆ కొండముచ్చులు, ఆ ఆయుధాలూ ఆ యుద్ధాలూ ఈ మానవుల కథలో ఎలా ఇముడుతవి ? త్రేతాయుగంలో వాళ్ళెవళ్ళయినా వుంటే వాళ్ళకు సందేహం కలుగక పోవచ్చునేమో కాని కలియుగంలోవాళ్ళకు ? ఈ మహాయుద్ధంలో మానవులనేవాళ్లు ఇద్దరంటే ఇద్దరే. ఒకడు రాముడు, రెండవ వాడు లక్ష్మణుడు. ఎదిరి పక్షం అంతా రాక్షసుల సముదాయం. రామబలం చూదామా కిష్కింధాపురపు అగ్రహారీకులు. రావణుడందామా ఒకపెద బ్రాహ్మణుడు. ఇంకొకపెద రాజు. – 'అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే.' ఒకపెద శివభక్తుడు ఇంకొకపెద కామభక్తుడు. ఆంజనేయులను చూదామా ఒకపక్క కిచకిచలూ, ఇంకొకపక్క నవవ్యాకరణాలే కాక—

## సా శ ం గ నా ట

"హరికి లంకిణీహంత కంతర మిట్టున్నది
కరుణ నింత మన్నించె కమలా విభుఁడు." పల్లవి॥

విశ్వరూపు చూపినాఁడు విష్ణుఁడు దొల్లియట్టె. విశ్వరూపాంజనేయుఁడు వీఁడె చూపెను. శాశ్వతుఁడై యున్నవాఁడు సర్వేశ్వరుఁడు వీఁడె శాశ్వతుఁడై యున్నాఁడు జగములో నితఁడు.

హరికి ప్రాణవాయు సంబంధి పరమాత్ముఁడు అట్టె
ప్రాణవాయు సుతుఁడు పవనజుఁడు !
రాణింప రవివంశ్యుఁడు రామచంద్రుఁడు తాను
నాణెపు రవిసుతుని నమ్మిన ప్రధాని ॥హరికి॥

దేవహితార్థము చేసెఁ ద్రివిక్రముఁడు అట్టె
దేవహితార్థమే జలధిలంఘనుఁడు
శ్రీ వెంకటేశుఁడు చిన్మయమూర్తి తాను
కోవిదుఁడు జ్ఞానమూర్తి గొప్ప హనుమంతుఁడు. ॥హరికి॥

అని అన్నమయ్య చెప్పినను ఈ కపి వట్టి కపియే కాక వృషాకపి అంతవాడు. వాలి చూదామా సగం మృగం, సగం దైవం, జటాయువైతే పిట్టే కాని వేయి మంది పెట్టు. ఇటువంటి సిబ్బందితో వాల్మీకి రామాయణం అల్లాడు. ఈ కథ ఇట్లా జరిగిందా లేదా అనే సందేహమే ఆయనకు వున్నట్లు తోచదు. పైగా కుశ లవులచే పాడించి ఆనాటి యజ్ఞశాలలోకి వచ్చిన వాళ్ళందరికీ వినిపిస్తాడాయె. ఇంతేకాక ఆయన కథా సమకాలికుడు, భారత కథా సమకాలికుడు వ్యాసుడైనట్లు. ఆ ఆదికవికి సందేహమే ఉంటే—

ఉ॥ సీతయు లేదు రావణుని చెల్లెలు లేదల రాముఁ డబ్ధిలో
సేతువు గట్టలే దతనిచే దివిజారులు చావలేదు సా
కేత పురమ్ము లేదచటఁ గేకయ పుత్రియు లేదు సర్వమున్
నూతన సృష్టియే.......................

అని కొందరంటారని మా గురువులు తిరుపతి వేంకట కవులన్నట్లు రామాయణం అనే మాటే ఉండకపోయేది.

## పురాణకాలంలోనే సందేహం

వ్యాసులవారు రామాయణం చదివినటులున్నారు. వాలి వధ ఘట్టంలో భారతం కొంత గ్రంథం నడిపింది. ఇంతేకాక ఆరణ్యంలో రామాయణ కథను టూకీగా చెప్పింది. విష్ణుపురాణం-

యః కార్తవీర్యో బుభుజే సమస్తాన్
ద్వీపాన్ సమాక్రమ్య హతారి చక్రః
కథా ప్రసంగే ష్వభిధీయమానః
స ఏవ సంకల్ప వికల్ప హేతుః (౪-౪ (424146)

× × × ×
× × × ×
భగీరథాద్యా స్సగరః కకుత్స్థో
దశాననో రాఘవ లక్ష్మణౌ చ
యుధిష్ఠిరాద్యాశ్చ బభూవు రేతే
సత్యం న మిథ్యా క్వను తే న విద్మః (౪-౨౪-IV౪౯)

శత్రువుల నందరనూ చంపి ద్వీపాలన్నీ ఆక్రమించి కార్తవీర్యుడు పుడమి నంతా ఏలాడు. రాచవారి మాటలు వచ్చినప్పుడు 'ఇంతవాడు, అంతవాడు' అని కీర్తింప బడతాడు. అట్టి కార్తవీర్యుడే' ఉన్నాడా, లేడా'అని సందేహానికి ఆస్పదం(౩౪౬). 'భగీరథాదు లున్నారు, సగరు డున్నాడు, రావణు డున్నాడు, రామలక్ష్మణు లున్నారు, ధర్మరాజాదు లున్నారు. ఇది నిక్కమేకాని కల్లకాదు, వారు(ఇపుడు) ఎక్క డున్నారో తెలియదు' అని అంటుంది. ఈ శ్లోకాలు సందేహాన్ని మేలుకొలిపి ఆ సందేహాన్ని స్థూణానిఖనన న్యాయంగా ప్రకటించినవి.

## కవులు సహృదయులు

రామాయణం నాటకభేదాలలో రచింప దలచికొన్న కవులందరు మాత్రమే కాక సహృదయులు కూడా చాలామంది ఏమిటీ పాత్రలు ? అని తల తడుము

కున్న వారే. తడుముకొన్నా మురారివలె 'యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతామ్। అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి'.

'న్యాయంగా నడచేవానికి జంతువులు కూడా సాయపడతై. అపమార్గంలో పోయేవాణ్ణి తోబుట్టువుగూడా వదిలిపెడతాడు' అని వాల్మీకం యథాస్థితంగా నమ్మినవారే. త్యాగయ్యగారున్నూ... కపి వారధి దాటునా ? అని అన్నారు. దాటె ననియే ఆయన నమ్మకం.

"ఉమ్మడి కోతులకూట మదధికి గట్టువచ్చె
తమ్మునిబుద్ధి రావణు తలపోయెను"

అని అన్నమయ్యకున్నూ ఇయ్యెడ సందేహంలేదు.

ఎల్లా అయితేనేమి ఆ కోతులు వారధి కట్టినట్టే వారి నమ్మకం. అవకాశం కలిగినప్పు డెప్పుడో ఒకప్పుడు అందరూ ఇంతో కొంతో సందేహం రాల్చినవారే. నాటక కవులు భాసుడు మొదలుకొని అందరున్నూ అవసరం వచ్చినచోట-'అన్యథా వా ప్రకల్పయేత్' అనుసరించినవారే. ఉత్తర కథలో పూర్వ మీమాంసకులు కొంత చోటు చేసుకొన్నారు. ఎందుకంటే తామనుకొన్న ధర్మం రాముని కంటగట్టడానికి. అందుకని ఆయనకు పునర్వివాహం చేశారు. ఇది కాంట్రాక్ట్ వివాహం. అంటే అశ్వమేధం చేయడానికి గాను ప్రక్కన వేసిన పీట నిలపడానికి. ఈలాగే ఐతిహాసికులు కూడా ఉత్తర కథలో తమ సొంత సోది కొంత కలిపారు. ఆలంకారిక పక్షాన అభినవ గుప్తులు నాట్యవేద భాష్యంలో— వేదం చెప్పినా ఈ ఉత్తర కథ కొంత మేం నమ్మం అని అన్నారు.

'ఇది త్రేతాయుగంనాటి కథకదా. రావణుడు బ్రాహ్మణుడై పుట్టి రాజ్యం చేయడమేమిటి? కలి ధర్మాలకు కాపు కావలసినవాడు త్రేతలో పుట్టడమేమిటి? పద్మా పిప్పలాద చరిత్ర ధర్మానికి హానివృద్ధులున్నటులు చెప్పినా (ఈ కథ ఏ యుగంలో జరిగిందో) నాలుగు పాదాలలో అన్ని పాదాలకూ లంకలో హానా ? ఇంకేదో విశేష కారణం వుందని ఊహించుకోవాలి' అని ఇలాగే కోతులయెడలా కొండలయెడలా (సంజీవి పర్వతం మొదలైనవి) ఖగముల యెడలా మృగముల యెడలా (జాంబవంతుడు) సందేహాలు సందోహాలుగా ప్రతిపాదించినవా రున్నారు.

పరదేశీయులు నమ్మనే నమ్మరని (అందరూకాదు) అనుకోండి. పై సందేహాలకూ ఇంకా ఈలాంటి సందేహా లెన్నింటికో ఎందరో ఎన్నో సమాధానాలున్నూ చెప్పు కుంటూనే వస్తున్నారు. కాని సంశయాత్ములంతా విని 'రామునికి సీత ఏమవు తుందని' అడుగుతూనే వస్తున్నారు. భారతదేశంలో అందరకూ రామాయణం ఉగ్గుపెట్టడంవల్ల నేమో కొందరకు సందేహమేరాదు. పైగా అన్ని జాతులవారి లోనూ రామోపాసకులూ, ఆంజనేయోపాసకులూ ఎందరో వున్నారు. రావణో పాసకులే ఎక్కువమంది ఉన్నారని అనుకోండి. సహృదయులు కథా శరీరాన్ని తెంకాయలాగా మోచినా తెలియకుండానే లోపలిరసం ఆస్వాదిస్తున్నారు. ఇటీవలి నాటక కవులున్నూ ఔచితిని ఒక కంట కనిపెట్టుకుంటూనే నడక సాగిస్తున్నారు. భవభూతి శంబుకవధ ఘట్టంలో—

> రే హ స్త దక్షిణ మృతస్య శిశోర్ద్విజస్య
> జీవాతవే విస్సృజ శూద్రమునౌ కృపాణమ్
> రామస్య గాత్ర మసి దుర్భర గర్భ ఖిన్న
> సీతా వివాసన పటోః కరుణా కుత స్తే?

"నా దక్షిణ హ స్తమా! చనిపోయిన బాపన పిల్లవానిని బ్రతికించ డానికి, శూద్ర మునిమీద క త్తి విసురు! నీవు నిండు చూలాలు సీతను అడవిలో పారేసి రమ్మన్న రామన్న చేతివి కావా? నీకేటి కరుణ?" అని రామునిచేత రాముణ్ణే తిట్టించి ఔచిత్యాన్ని ఎంతో వంతుకూ వానికి ఎక్కించాడు.

> (శ్రీ గోవిందాచార్యులవారున్నూ ఇలా అన్నారు ... ... ... ఉ
> ఆహారము తీరునం బ్రతిభ యబ్బదు ప్రాణులకెల్ల సృష్టిలో
> వారని యోగసిద్ధిగను భవ్యులు మాత్రమె జ్ఞానులౌదు ర
> వ్వారల వర్ణభేదమును బట్టి వధింపఁగ జెల్లునే నృపా!

గీ. అంచు గొందఱు దమలోఁ దలంచుచుండ్రు
శంబుకుని చావునందలి సత్యనిరతి
నాత్మ శంకించువారు.

(ఉ త్తర-సుతోదయాశ్వాసము III)

అని చెప్పి- 'ఈ పీడ నాకెందుకు' అన్నట్లు ఈ శంకను లోకులమీద పార వయిచారు.) ఇదంతా ఈలాగుండగా శ్రీమద్రామాయణమంతా గబ్బున తేచిన మహాత్ము లెవరో—

వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా.

'వేద వేద్యుడయిన పరమపురుషుడు దశరథునకు కొడుకై వెలయగా వాల్మీకి వల్ల వేదం రామాయణంగా వెలసింది' అనే శ్లోకం చెప్పారు. ఈ శ్లోకానికి అర్థం ఎలా పొసగుతుంది? కృష్ణుడు పరమపురుషుడు కాడా? భాగవతం వోతి భాగోతమేనా? అని కొందరు ప్రశ్నిస్తారు. 'శ్రీకృష్ణః శ్యామలాదేవీ, శ్రీరామో లలితాంబికా' అని కొందరు సమాధానమున్నూ చెప్పుకుంటూ వస్తున్నారు. ఈ కవి గూడా అచటనచట 'లలిత స్వరూప', 'లలిత రామ' అనన్య పరాత్మ-106, పుట. లలిత వినీల సుందరి 110 పుట, వాసుదేవుండు 112 పుట, కులకాంత 116 పుట, త్రిపురసుందరి-133 (పుంవద్భావం లేదనుకోండి) ఈ మొదలుగానే కాక—

సీ. సర్వోపనిషదర్థ • సకల స్వరూపంబు
శ్రీనివాసంబుగాఁ • జెలఁగు దీవ
భక్త శిరస్త్రాణ • పరిధవ శ్రీ రాజ
రాజేశ్వరీ మంత్ర • రాజ మీవ
భువనైక మోహన • మూర్తి శివంకర
త్రిపుర సుందరి దివ్య • తేజ మీవ (పాదుకాశ్వాసము-86)

అని చెప్పి వారితో కంఠం కలుపుతున్నాడు.

'సందడిలో సడామియ్యా' అని శివుడీ ప్రకరణంలో చొరబడడానికి ఇష్ట పడడు గాబట్టి ఆయన తరపున నుండి వచ్చే ఒత్తిడి ఉండదు. పెద్దలు పై నుదాహరించిన శ్లోకానికి గల సంగతి ఇలా చెపుతారు—

వేదంలో పూర్వకాండ అనిన్నీ ఉత్తరకాండ అనిన్నీ రెండు కాండ లున్నాయ్. ఉత్తరకాండకు జ్ఞానకాండ అని నామాంతరం. కర్మకాండ ధర్మాన్నీ

అనుష్ఠానాదులనూ బోధిస్తుంది. దానికి ఫలం చిత్తశుద్ధి. తన్మూలంగా జ్ఞానసిద్ధి. ఆ జ్ఞానాన్ని చెప్పేదే ఉత్తరకాండ లేక ఉపనిషత్తులు.

అడవికి పోబోయేముందు శ్రీరాముడు తల్లి కౌసల్య కడకు వెళ్ళినప్పుడు ఆ యమ్మ—

'యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ। సవై రాఘవ శార్దూల ధర్మ స్త్వా మభిరక్షతు'

'నాయనా! ఏ ధర్మాన్ని నీవు ధైర్యంతోటీ నియమంతోటీ కాపాడు కొంటూ వస్తున్నావో ఆ ధర్మమే నిన్ను కాపాడాలి'

అని ఆశీర్వదిస్తుంది! దీనిని బట్టి చూస్తే రాముని పరిసరాలన్నీ ధర్మం చేత గారచేయబడినటులు కనిపిస్తుంది. గోవిందాచార్యుల వారు కూడా ఆ ధర్మాన్ని ఉటంకించారు.

"వెడలి రాదగు రామయ్య విపినమునకు
ధర్మ సంరక్షణార్థమై ధార్మికుండ
నీకు విజయంబె యగు గాక విపిన సీమఁ
గాలము నతిక్రమింపగాఁ గలమె రామ.

(233 సత్యాశ్వాసము)

మరలి రా మహీపతి వౌచు వరలు నిన్ను
గాంచి కనులార ముదమునఁ గ్రాలు దాన
ధర్మ విజయుండవౌ నిన్నుఁ గాంచు దాన
మంగళంబగు రామ సుమంగళంబు.

(234 సత్యాశ్వాసము)

ఇంతాచేస్తే శ్రీరామునికి ఇంకా పాతిక నిండలేదు.

## ధర్మం

ఐతే సరేకాని ధర్మం అంటే ఏమిటి? అనే ప్రశ్న ఇపుడు తలయెత్తు తుంది. 'పరోపకారాన్ని మించిన ధర్మం లేదు. పరాపకారాన్ని మించిన

అధర్మం లేదు' అని మనం సామాన్యంగా అంటూ ఉంటాం. కానీ విచారించి చూస్తే దీనికి మెరుగుపెట్టవలసివస్తుంది. ఏమంటే ఆకొన్న పులికి ఆవుని బలి యిస్తే అది పులికి ఉపకారమే అవుతుంది గాని ధర్మం కాదు. బాలుణ్ణి చదువు కొమ్మని శిక్షిస్తే అది వాని చూపులో అపకారమే అవుతుంది కానీ అధర్మం కాదు. అందుకని 'వేదచోదితమై శ్రేయస్సాధనమైనది ధర్మం' అని చెప్పాలి.

'చోదనా లక్షణో ర్థో ధర్మః'

అనే జైమిని సూత్రానికి కేవలము వేద చోదితమే కాదు మఱి శ్రేయస్సాధనము కూడా కావాలి అని అర్థం చెప్పారు. అట్టి ధర్మానికి మూలమేమిటి? అని అంటే—

'వేదో ఽఖిలో ధర్మమూలమ్'

వేదమంతా ధర్మమూలమనిన్నీ—

'తద్విదాం చ స్మృతి శీలే'

వేదవేత్తల స్మృతిశీలాలు గూడా ధర్మమూలమనిన్నీ గౌతమ ధర్మ సూత్రాలు చెప్పతై.

## పరమపురుషుడు - ధర్మావతారం

పైఁజెప్పిన ధర్మాన్ని స్వయంగా ఆచరించి లోకులకు చూపి లోకంలో ధర్మాన్ని నెలకొలపడానికి "ధర్మం చర". ఎవరి ధర్మం వానిచేత ఆచరింప జేయడానికి శ్రీరాములవారు అవతరించినటులు కనబడుతుంది. రాముడు శరీరం తాల్చిన ధర్మం – 'రామో విగ్రహవాన్ ధర్మః' అని శ్రీమద్రామాయణం చెబుతుంది. 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అనే గీతావాక్యం గుర్తువస్తే ఆ పుట్టేవాడు శ్రీకృష్ణునితో పాటు శ్రీరాముడు కూడా అని స్మృతి పటహం మోసులెత్తుతుంది. కానీ ఏపన్నిద్దరు మహర్షులకో కాని మిగతా వారెవరికీ రాముడవతారమనే మాట తెలియదట. రాముణ్ణే అడిగి చూడండి. 'నేను మానవుణ్ణే' అని అంటాడు. అందులకే కాబోలు వసిష్ఠుడు శ్రీరామునకు శక్తిపాతం చేయ వలసి వచ్చింది (యోగవాసిష్ఠం చూచేది). ఇది ఇట్లా ఉండనీండి, వెనుకటి గీతా

శ్లోకంలోని 'యుగే యుగే'కు కృతయుగంలో కూడా ఏ విశేషకారణం చేత నయినా ధర్మచ్యుతి కలిగితే ధర్మసంస్థాపన కావలసియే ఉంటుందని కొందరు స్వారస్యం చెప్తారు.

ఇపుడు ధర్మానికి వేదానికీ, వేదానికీ, రామాయణానికీ, వేదవేద్యత్వానికీ, పరమ పురుషత్వానికీ, పరమ పురుషునకూ శ్రీరామునకూ కల చుట్టరికం తెలుసు కొన్నాం. 'రామునివలె మెలగండి, రావణుని వలె మెలగకండి' అని కబ్బం కాంతా సమ్మితంగా చెబుతుంది' అనే మాటలకున్నూ 'వేద వేద్యే' అనే శ్లోకానికిన్నీ ఉన్న చెలిమిన్నీ ఇపుడు గుర్తించగలం.

పై జెప్పిన రీతిగా చిత్తశుద్ధి కలిగించి శ్రీమద్రామాయణం జ్ఞానమునకు ద్వార మయినది. కొందరు దీనిని సాక్షాద్వేదముగానే పరిగణించారు. ఆడవాండ్లకు వేదాధికారంలేదు కాబట్టి శ్రీమద్రామాయణం అడంగులకు చదివే అర్హతలేదని అన్నారు. కొందఱు శ్రద్ధావతులు శ్రీమద్రామాయణం పఠింపరని విన్నాను. ఈ రీతిగా ధర్మోపదేశం చేస్తూ రసవంతమయిన ఆదికావ్యాన్ని ఆదర్శంగా చేసు కొని ఆలంకారికులందరూ కావ్యం అనగా కావ్యంవల్ల ఆస్వాద్యమైన రసం ధర్మోప దేశంద్వారానే వికసించాలని శాసించారు. విభావాదులచే అధర్మాన్ని గూడా రసావస్థకు రప్పించవచ్చు. దీనికి పురాణాలలో మనస్సును చిందువందుచేసే చీడ కథలు అక్కడక్కడ సముద్రంలో చిన్నపొన్న లంకలవలె కానిపిస్తవి. చిననాటి నుండి సరియయిన శిక్షణం లేనివారికి 'రసానికీ, ధర్మానికీ, నీతికి ఏమీ చుట్టరికం లేదు' అని తోచవచ్చును. మరియు అది ఒక విధముగా నిజమే కావచ్చును. కానీ 'దానివల్ల మనస్సుకు శాంతి ఉండదు. అది విప్లవం తేవచ్చు. సంఘ శాంతి నిర్మూలితం కావచ్చు. అప్పటికి సంతసం కలుగవచ్చు. ఆత్మజ్ఞానానికి అప కారం కలుగవచ్చు' అని చేతులు కాలిపోయిన తరువాత గాని తెలియదు. ధర్మా ఖ్యానపురాణేషు వృద్ధాఽస్త్రప్యంతి నిత్యశః' (అశ్వమేధ పర్వ) 'భాషా గానం న గాతవ్యం హరి కీర్తిం వినా నఘ'.

## పరదేవత

వాల్మీకి రామాయణం తరువాత సంస్కృత భాషలోనే ఎన్నో రామా యణాలు వచ్చాయి. వీనిలో కథమాత్రం సంగ్రహంగా చెప్పేవి క్షేమేంద్రుడు

రచించిన రామాయణ మంజరి, నడిమింటివారి బాలరామాయణం వంటివి కొన్ని. రాముడు అవతారం అని చెప్పనెంచి తదనుగుణంగా మిగతా పాత్రలనుకూడా తమ తమ అధ్యాత్మమార్గాలలో నడిపించినవి కొన్ని. ఏవయినా ఇవి వాల్మీకి రామాయణమంత విపులాలు కావు.. కానీ ఏదో చమత్కార సౌరభం వెదజల్లేవే. —అహిరావణ, మహిరావణ వంటి పాత్రలను (తెలుగులో ఐరావణ, మైరావణ) సృజించినవి కొన్ని— 'వాసిష్ఠ' దేశ్యరామాయణాలు (చూ. గోవిందరామాయణం, బాలకాండ, అవతారాశ్వాసం-17). వాల్మీకి రామాయణంలో గాయత్రి పొదుగబడి వున్నది. అది—

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్."

'రామ చరిత్ర శతకోటి గ్రంథం: దానిలో ప్రతీ ఒక్కొక్క అక్షరమూ పాతకాలను పటాపంచలు చేస్తుంది' అని కీర్తింపబడ్డది. ఇంతేకాక సుందర కాండలో సప్తకోటి మహామంత్రాలున్నవి అని మంత్రోపాసకు లంటారు. ఇట్లా అయినా ఇంతవరకెవరున్నూ రామాయణంలోంచి మంత్రోద్ధారం చేసినట్టు నేను వినలేదు. ఎవరయినా చేస్తే చేసివుండవచ్చు. వెనుకటి సాత్వతాదితంత్రాలు శ్రీకృష్ణుని శ్రీరాముని తమ అగ్రపీఠాపీఠ నిలబెట్టినై, శైవతంత్రాలు పరశివుని శాక్తతంత్రాలు పరశక్తిని నిలబెట్టినట్లు. ఐతే వైదిక తంత్రాలన్నీ వేదంలోంచే మంత్రోద్ధారం చేసినవి. నేటి ఈ గోవింద రామాయణంలో శ్రీరాముడు ఉభయ బ్రహ్మము, లేక పరదేవత—"పరస్యాం దేవతాయామ్" లేక పరశివుడు లేక లలితాంబిక. అయితే సీత ఎవరు? ఛాయ. 'ఛాయేవానుగతా సదా' (రామాయణమ్) లేక మాయ—'దేవ మాయేవ నిర్మితా'. ఈలాగే అన్నిటికీ తంత్రభాష (సంధ్యాభాష కాదు) అంతర్వాహినిగా సమన్వయం ఉన్నది. లోగడనే పలువురు ఈ దారి తొక్కారు. శ్రీ గోవిందాచార్యులవారు ఆ దారినే నడిచారు. కొంత స్వాతంత్ర్యం చూపిస్తూ కొంత గూఢంగానూ కొంత అగూఢంగానూ వ్యక్తం చేస్తూ. కొన్ని పట్ల అనగా విశ్వామిత్ర శరణాగతి మొదలగు ఘట్టాలలో వాచ్యంగానే చెప్పారు.

చ. ఇలఁ గల యట్టి మంత్రముల నెన్నిటినో జపియించినాఁడ నేఁ
బలుమఱు మంత్రదేవతలఁ బాల్పడినాఁడఁ దరింపఁ జేయఁగాఁ

గల దొక చేని లేదు, రిపుకాండము త్రుంచఁగలట్టి వానితో
ఫలితము లేదు నాకిఁకను బట్టుము వానిని ధారపోసెదన్.

గీ. అన్యు లెవ్వరి శరణమ్ము నడుగ నిన్నె
శరణ మంటి ననుచు మనసారఁ దలఁచి
గాధి సూనుఁడు రాముని కరము వట్టి
ధార వోసెను వివిధ మంత్రముల నొకట
(బాలకాండ-శరణా-139, 140)

ఇట్లే—

ఆ. కాది హాది సాది వేద విద్యల రూపు
రామమూర్తి గాఁగ రాత్రి పవలు
పాదుకా ద్వయిపయి భరతుండు గనుచుండు.
(పాదుకాశ్వాసము-55)

ఇట్టి పద్యాలు సంప్రదాయం తెలిసినవారికి ఉబలాటంగా ఉండవచ్చు. పదాలకు ఉన్న అనేకార్థాలు తెలిసిన సాహిత్యపరులకు శ్లేషార్థాలు కల పద్యాలు సంతోషపెట్టినట్లు మంత్రతంత్రాలు తెలిసిన సాహిత్యపరులకు పరశురామ సంవాదం శివధనుర్భంగం మొదలయిన ఘట్టాలలోని కొన్ని పద్యాలు సంతోషం కలిగిస్తవి.

౨

## అ భి రు చి

భావమూ రసమూ తెలిసి వానితోపా టయిపోయే ఆంతరమయిన యంత్రానికీ ఈ గోవిందరామాయణమందలి భాషకూ నడుమ ఒక దుబాసీతో పనిలేదు, కొన్ని కొలది పట్టులలో తప్ప. కవి ఇట్లా అంటున్నాడు—

చ. వడిగల భాషతో మధుర భావ పరంపరలన్ మృదూక్తులన్
గడగడ నిక్షు పానకము గైకొని త్రావునటుల్ రచింతు నల్

గద రసవత్ ప్రపంచమునఁ గాంచుచు మా రఘురాము నాతఁడే
యెడఁదఁ బ్రతిష్ఠ గైకొనఁగ
—(పాదుక-ఇష్టదేవతా ప్రార్థనము-15)

క. ద్రాక్షాపాకము నెక్కొన
దీక్షను గృపజేయు మమ్మ దేవీ
(సీతారామం 8)

కవి యీ రీతిగా అన్నట్లే గ్రంథమంతా ద్రాక్షాపాకంలోనే పడ్డది. కవుల కందరకూ ఒక్కొక్క అభిరుచి ఉంటుంది. అదే అలవాటయిపోతుంది. ఆ యభిరుచి తమకు తెలియకుండానే పుట్టుకొస్తుంది. పుష్పదంతుడన్నాడు—

'రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథ జుషామ్' అని. 'పుర్రెకొక బుద్ధి; నాలుక కొక రుచి' అనే సామెత ఈ అర్థమే చెబుతుంది. తిక్కన్నగారు తమ అభిరుచిని—'తెలుఁగుబడి విశేషణంబు తేటపడంగా' అనిన్నీ—

'జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప'

అనిన్నీ'-......అలఁతి యలఁతి తునియలఁగా

హల సంధించిన విధంబు నతుకఁగ వలయున్

అనిన్నీ వెలిబుచ్చారు. నన్నయ్యగారు......

'పేచోషాదిక శబ్దాన్ ప్రవ్యాహరం తు శబ్దశాస్త్రజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్'

అని శాసించారు. (ఇది అభిరుచి కాదు) తిక్కన్నగారి అభిరుచి తెలుగు భాషకు సమ్మసరి. అయితే క్రోధానికీ వీరానికీ ఈ పంచదార పలుకులూ ఈ దూదిపింజలూ ఈ ఇతలీ సంగీతాలూ సంగాతం అవుతాయా? "నైక మోజః ప్రసాదో వా రసభావ విదః కవేః"-రసభావా లెరిగిన కవికి ఒకే ఒక ఓజోగుణంగాని ఒకే ఒక ప్రసాద గుణంకాని పనికిరాదు అని మాఘు డంటాడు. అచ్చ తెలుగు కబ్బాలు వ్రాసిన తెలగన్నా తిమ్మన్నా ప్రభృతులలో ఈ విచారణ చొరబడిన చందం కానరాదు. తిక్కన్నగారు వ్రాసింది అచ్చ తెలుగు భారతం కాదు.

కాబట్టి అవసరమైన చోటులలో ఓజోగుణం కల పద బంధాన్ని 'భీష్మ, ద్రోణ, కృపాది ధన్వి నికరాఖిలంబు' ఇత్యాదిగా వాడుకొన్నారు. శ్రీనాథుని అభిరుచి తిక్కనకు విరుద్ధం—

మ. హర చూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతస్స్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధర ద్వయతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీ గేహరంగంబులన్.

అని భీమఖండంలో చెప్పుకొన్నాడు. వీరు మూవురూ చెప్పినటులే చేశారు. తిక్కన్నగారు గాఢబంధం ఉండవలసిన చోట్లగూడా కొన్నిపట్ల కప్పురపు పలుకలతోనే నెట్టుకొని వెళ్ళారు. నాచన సోమన్న శ్రీనాథుడు మొదలయిన వారుగూడ మెత్తటి శయ్య పరచవలసినచోట చంద్రకాంత శిలలు పఱచుకుంటూ పరుగులెత్తారు. పోతన్నగారు—

క. కొందఱకుఁ దెనుగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు • గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతు • గృతుల నయ్యయి యెడలన్

అని చెప్పి అందఱనూ మెప్పించారు. కొందఱకు భక్తి అంటేనూ, గ్రాంథిక భాష అంటేను రుచిగా ఉండదు. అట్టివారు యీ కాలానికి యివి 'నప్పవు' అని అంటారు. నేనూ ఒప్పుకుంటాను. ఏమంటారా ? అందఱ మెప్పింప (పోతన్న గారి మాటకాదు) బ్రహ్మకైనను వశమే ?

అభిరుచి అనేది జన్మాంతర సంస్కారం ఐయుండాలి. అది కవితా ప్రారంభ దశలో కవిని తన కనుకూలమైనవారి సంపర్కంలోకి తీసుకోపోయి పరిపక్వం ఔతుంది. కాబట్టి 'నీవు సమాసాలు ఊరకే దొర్లిస్తావేం. డబ్బా వాయిస్తావే ?' అని అంటే అది భేరె జోకొట్టినట్లే. కవిత్వం గూడా సంసారం లాటిదే. అపోరకపు సంసారం.

ఆలంకారికులు అగూఢవ్యంగ్యంగా ప్రసాదగుణంతో చెప్పగలిగిన వాడే మంచి కవి అని అంటారు గాని నన్నెచోడుణ్ణి ఏమనాలి? శ్రీనాథుణ్ణి ఏమనాలి? సోముణ్ణి ఏమనాలి? రాయలను ఏమనాలి? గొప్పవాండ్లే అనక మానరు గాని జుట్టు కూడా లేని నారికేళం అనీ, గూఢ వ్యంగ్యం అనీ అంటారు. అన్నా సహృదయులు ఆ ముప్పేట తెంకాయలలోని చిక్కని తియ్యనీటిని రుచి చూడక మానరు. సహృదయులకే కవితాస్వాదం. కాని మూక ఉమ్మడిగా స్వాదావస్థ రప్పించడం ఏ కొలదిమందికో చేతనవుతుంది. కాని దానికి ఆమోదం సార్వజనికంగా నూటికి నూఱు వోట్లూ రావు. సంకుసాల నరసింహకవి చెప్పినట్లు—

'లోకుల రసనలె యాకులుగా'

అనేది ఏ కొన్ని చాటువులకో ఏ కొన్ని రసోత్తరపు పద్యాలకో ఏ చమత్కారాలకో కాని అన్నిటికీ కాదు. పుష్పదంతుడు—

'నృణా మేకో గమ్య స్త్వ మసి పయసా మర్ణవ ఇవ'

'నీరు అనేదాని కంతకూ సముద్రం'వలె నరులందరకూ 'నీవొకడవే ప్రాప్యుడవు' అని అన్నటులు సులభకవనమే కానీండి కఠిన కవనమే కానీండి వీటన్నిటికీ నారాయణునకు మరో పేరయిన రసమే గమ్యం. ఈ రీతిగా కవులందరూ రసోపాసకులే కాని ఎవరి అభిరుచి వారిది. శ్రీ గోవిందాచార్యులవారు 'ఉత్తర రామం' చెప్పి, నిల్రదొక్కుకున్నాక పాదుకలో కవితా సంసారం పెంచుకున్నారు. వారి అభిరుచి యిది-

ఉ. అన్నది కన్నదే అటుగ నౌచితితో రసభావయుక్తమౌ
తిన్నని శయ్యతోఁ బలుకు తీరు నెఱుంగమిచే సమాధి సం
పన్నుఁడు కానివాఁ డుపమవంటి యలంకృతులన్ బిగించు, కా
దన్న సమాస జాలముల దాఁగు గటూ కవితాప్రతారణన్

(పాదుక—147)

ప్రతిపదార్థం పొసగించి యీ పద్యపరమార్థం చెప్పడానికి కొంచెం పిండి ఉండాలి. అది లేనివారు — ఏకాగ్రత కలవాడు ఏది అంటే అది రసభావయుక్తంగా తిన్నని శయ్యతో ఔచితితో ఉంటుందనిన్నీ ఆ యేకాగ్రత లేనివాడు

కావ్యాన్ని కేవలాలంకార ప్రాయంగానో శుష్కసమాస శరీరంగానో చేస్తాడు అని తాత్పర్యం చెప్పుతారు. కేవల అలంకారాలూ సమాసాలూ లేక; రస భావ ధ్వని కవిత్వమందు వీరికి అభిరుచి అన్నమాట.

## ర స ము

తే. భక్తి రసము పునాదిగాఁ బ్రబలఁజేసి
కరుణరస కావ్యసౌధంబు గట్టువాఁడ
జానకీ రామ లక్ష్మణుల్ దీనియందు
కాపురముఁ జేయుచుంద్రు స్వకర్మఁ జిక్కి

అని ఉత్తర రామచరిత మందున్నా—

తే. కరుణ రసవర్తి యీ మహాకావ్యమూర్తి
భవ జలధి దాఁటు గతిఁ జూప భక్తతతికి
భక్తిరసము పునాదిగాఁ బాదుకొలిపి
కట్టెదఁ బ్రపత్తిసౌధ మీ కావ్యమందు

తే. 'భక్తిరసము ప్రధానమౌ ఫణితి యిద్ది'

సీతారామ మందున్నా,

తే. భక్తిరసము పునాదిగాఁ బాదుకొలిపి
కట్టెదఁ బ్రపత్తిసౌధ మీ కావ్యమందు

అని పాదుకా పట్టాభిషేకంలోనూ ఉన్నది.

'భక్తి అనేది రస మవుతుందా?' అని ప్రశ్న. సంకీర్తన కాలంలోనూ భాగవతాది శ్రవణ సమయంలో కొందరకు హర్షం కలుగుతుంది. గగురుపాటు కలుగుతుంది. కన్నీరు కురుస్తుంది, రాపాటు పుడుతుంది. శ్రీ చైతన్యప్రభువు శ్రీ రామకృష్ణులు మొదలయినవారు నామం వినంగానే మైమరచి సమాధి పొందే వారు. 'రోజూ ఏడు సార్లు చచ్చి యేడుసార్లు పుట్టేవాడ'ని పేరే వుంది పరమ హంసకు. ఇట్టిస్థితిలో భక్తి రసంకాదు అని ఎట్లా అనగలం? ఇదేమిటి? కవ్యా లలో భక్తి రసం అవుతుందా అనగా కావ్యాలలో కవి వర్ణించిన భక్తి సహృదయుల

మనసులలో పడి రసావస్థకు వస్తుందా? ఈ ప్రశ్నకు ఇది సమాధానమా? సాధనచే చైతన్యాదుల మనస్సు చటుక్కున తన్మయమై సమాధికి పోగలదుగాని సహృదయులు బ్రహ్మానంద సోదరమయిన రసానందం పొందుతారా?

ఆ! పొందుతారు.

## పండితరాయలు

భగవదనురాగరూపమైన భక్తే భక్తిరసానికి స్థాయి, భగవానుడే ఆలంబన విభావం, పులకాదు లనుభావాలు, హర్షాదులు సంచారి భావాలు. ఈలాగా రసానికి ఉండవలసిన సరంజామా యావత్తూ ఉంది. కాబట్టి భక్తిని రసం అని అనవచ్చు గాని భరతముని మిగులు రసాలను కంఠోక్తిగా చెప్పినటులు భక్తివత్సలాలను చెప్పలేదు. పోనీ మన మెందుకు చెప్పరాదు? పాతదారికి కంపకొట్టి కొత్తపుంత వెయ్యాలి కాబట్టి రసేతరమయిన మరోపేరు పెట్టుకుందాం భక్తికీ వాత్సల్యానికీ. పేరులో ఏముంది? 'పేరుకే పేచి' అని పండితరాయలన్నారు.

లోకంలో మహాభక్తు లెందరో ఉన్నారు. రామాయణంలోనే హనుమ ఎవడు? తమ సంతుమీద జీవులకన్నిటికీ ఎంతో ప్రేమ. రామాయణంలోనే చూదాం. దశరథుడు ప్రాణాలెందుకు విడిచాడు? మొన్న మొన్న మన యీ తెలుగునాడులో తెలింగానాలో గోపన్నగా రెండు కేడేండ్లు చెరలో ఉన్నారు? దీనివల్ల 'పరాభక్తి' అనేది ఒకటి ఉన్నదనిన్నీ చక్కగా వికసింపజేయగలిగితే రసమవుతుందనిన్నీ అనుకొని కూడా పాతపుంతంతా కంతలు పడిపోతుందని పండితరాయాదులు భరతముని యెడ భక్తితో వినయం అవలంబించారు.

## మధుసూదన సరస్వతి

వీరిమాట ఇట్లా ఉండనిద్దాం. బ్రహ్మానంద సరస్వతిచే—

'మధుసూదన సరస్వత్యాః పారం వేత్తి సరస్వతీ' అని కొనియాడబడిన అద్వైతాచార్యుడు మధుసూదన సరస్వతి పదహారణాల అద్వైతి. తిరుగవేస్తే మళ్ళా పదహారణాల భక్తుడు. ఆయన రచించిన గ్రంథాలలో భక్తిరసాయనం అనేది ఒకటి. ఆ గ్రంథం - 'లోకంలో మెత్తని మనసులూ ఉన్నవి. మరి

నిబ్బరమయిన గుండెలూ ఉన్నై. ఈ రెంటిలో రెండోరకానికి నిర్వేదమున్నూ మొదటిరకానికి భక్తిన్నీ స్వభావం!... భక్తి అంటే సర్వేశ్వరుని ఆకారంపొందే చిత్తవృత్తి. విషయాలనుండి విముఖులైన మహానుభావులు ఉంటారు. సంకీర్తనము భగవత్కథాశ్రవణము భజనము మొదలగువానివల్ల వారి మనోవృత్తి ద్రవించి భగవదాకారం చేకొంటుంది. అట్టి ఆ మనసులో విభావాది భావసంయోగంవల్ల రసం నిష్పన్నమవుతుంది.'

## భక్తి రసం

భక్తిరసానికి భగవంతుడు ఆలంబనం. తులసి చందనాదులు ఉద్దీపనాలు' కనుల మూత, లోజూపు, బయలుచూపు, నిండుచూపు మొదలైనవి అనుభావాలు' నిర్వేదాదులు సంచారులు. వీనిచేత భగవదాకారం వ్యక్తమవుతుంది. రసమని చెప్పబడే స్థాయిభావం అదే. అది పరమానంద సాక్షాత్కారాత్మకం. మరి భక్తి యోగమన్నా ఇదే.

బింబాన్నే ప్రతిబింబం అని అంటారు—ఉపాధిలో పడితే. 'పరమానంద స్వరూపుడైన భగవానుడు మనస్సులో ప్రతిబింబించి స్థాయిభావత్వం పొంది రసత్వం ఆపాదిస్తాడు కాబట్టి. భక్తిరసం పరమానంద రూపం' అని అంటే ఎవరున్నూ కంయ్ కంయ్ మని అనరు. అయితే ఒకటి – 'ఆలంబనమయిన భగవత్ ప్రతిబింబమూ స్థాయియైన భగవాదాకారక చిత్తవృత్తీ ఈ రెండూ ఒక్కటంటే ఒక్కటేనే. మిగతారసాలు వేనిలోనూ ఇలా ఉండవే అని ఎవరయినా కయ్యానికి కాలు దువ్వవచ్చు. మంచిదే. జీవునికీ ఈశ్వరునికీ వ్యవహారంలో భేదం వుంది. అలాగే బింబానికి ప్రతిబింబానికీ వ్యవహారంలో భేదం ఉంటుంది. కాబట్టి మనకు నెయ్యంతోనే కాని కయ్యంతో పనిలేదు. ఈ రీతిగా భక్తి రసం ఎంతో మహనీయమైనది. దీనిముందు మిగతా రసాలన్నీ దివిటీ ముందటి దీపాలు' అని చెపుతుంది. తరచిచూస్తే యీ రెండు మతాలకూ పెద్ద తేడా లేదనే తేలుతుంది. సరే శక్తిగల కవి భక్తిని రసం చేయగలడు. ఆచార్యుల వారు భక్తిరసం పునాదిగా కరుణరసపు కావ్యం చేస్తానని ఉత్తరరామంలో అన్నారు అభినవగుప్తులు—'రామాయణే హి ఉపరచయితా' అని రామాయణం కరుణరస ప్రధానం అని అన్నాడు.

'సీతాత్యంత వియోగ పర్యంత మేవ' (వాల్మీకి రామాయణ రచన అని గ్రహించేది) అని వాల్మీకి రామాయణం కరుణరస ప్రధానం అని అన్నాడు. కరుణరస ప్రధానమైన యీ కావ్యానికి అంతర్భాగమైన సీతారామంలో 'భక్తి రసం పునాదిచేసి ప్రపత్తి అనే మేడ కటతాను; భక్తులు భవజలధి దాటడానికి' అని ఆచార్యులుగారు అన్నారు. పూర్వం అశ్వఘోషుడుకూడా సౌందరనందం చివర—

అశ్వఘోషుడు :

> ఇత్యేషా వ్యుపశాంతియే నరతయే మోక్షార్థ గర్భాకృతిః
> శ్రోతౄణాం గ్రహణార్థ మన్యమనసాం కావ్యోపచారాత్ కృతా
> యన్మోక్షాత్ కృతమన్య ద్త్ర హిమయా తత్ కావ్యధర్మాత్ కృతమ్
> పాతుం తిక్త మివౌషధం మధుయుతం హృద్యం కథం స్యా దితి.

'బెల్లంలో చేదుమందు పొదిగి పెట్టినట్లు ఈ కావ్యంలో మోక్షార్థం పొదిగాను' అని అన్నాడు. అయితే యీ కావ్య కథేకాక ఇందులో పొదగబడిన భక్తిగూడా మధురాతిమధురం— పోసేండి. ఆ మాధుర్యం సహృదయులైన ముసలివాళ్లకూ ముక్కాళ్లకే అని అందాం. దేనికి తగినవాళ్లు దానికుంటారు. అయితే ఈ కవి-'కట్టుదు ప్రపత్తి సౌధ మీ కావ్యమందు' అని అంటాడే— అది స్థాయిభావ మవుతుందా ? పరమానంద సాక్షాత్కారక మవుతుందా ? అని ప్రశ్నిస్తారేమో. అన్నమయ్య ఇట్లా అంటాడు—

**అలౌకికానందం :**

> 'పట్టినదెల్లా పరమానందమే
> గట్టిగా శరణాగతునికిని'. (VIII–137)

'శరణు జొచ్చినవానికి సర్వేశుడు ఆత్మభూతు డౌతాడ'ని(భాగవతం 11–29,4) చెప్పింది. అయితే 'దాసోఽహమని' కూచున్నంతమాత్రాన ఆనందం కలుగుతుందిటండీ ?

ఈ మూడక్షరాలన్నర పలికినంతమాత్రాన కలుగదు. ఈ మూడక్షరాలన్నర తమంత తోచాలి. అట్లా తోచడానికి వెనుకముందు 'సాధన' ఉండాలి. ఏమిటా సాధన ?

"భక్తుల సేవా, భక్తుల దయకు పాత్రమవటమూ, భగవంతుని గుణకర్మల యెడల శ్రద్ధా, భగవద్ గుణశ్రవణంతోగాని కీర్తన - స్మరణ – పాదసేవన - అర్చన - వందన - దాస్య - సఖ్య - ఆత్మసమర్పణాలతోగాని భక్తి మొలకెత్తుతుంది. పిదప స్వరూపాధిగమమూ, ప్రేమవృద్ధీ – పరానంద స్ఫురణమూ— కలుగుతుంది. అటు పిదప భగవద్ధర్మ నిష్ఠ–గుణాభివర్ణనము–ప్రేమ పరాకాష్ఠా– ఏర్పడుతుంది. ఇది : "భక్తియోగం".

శ్రీమద్రామాయణ కావ్యాదులలోని భగవత్ స్వరూప స్వభావాదులను చదవడం వల్లగాని, వినడంవల్లగాని చిత్తం ద్రవిస్తుంది. అట్టి చిత్తవృత్తి విభావాది సంయోగంవల్ల భక్తిరసాన్ని ప్రతీతియోగ్యంగా చేస్తుంది. అది దేశ–కాల– ఉపాధులకు - అతీతమైన అలౌకికానందం.

## ప్ర తి భ - వ్యుత్పత్తి

కవితాప్రవాహానికి ప్రతిభావ్యుత్పత్తులు రెండూ రెండొడ్లు. వ్యుత్పత్తి అంతగా లేకున్నా లేబరం లేదుగాని ప్రతిభలేకుంటే పాడె. వ్యుత్పత్తిగంధం లేని వేమన్నను కవిగా జేసింది ప్రతిభే. శ్రీ గోవిందాచార్యులవారి కవితలో రెండూ కనిపిస్తవి. ఆ రెంటిలో అత్యావశ్యమయిన ప్రతిభ గ్రంథమంతటా కనిపిస్తుంది. సీతారామంలో లీలాకృపాశ్వాసము, శరణాగతాశ్వాసము; పాదుకలో మాయా, సత్య, భక్త, ప్రపన్నాశ్వాసాలు వ్యుత్పత్తి సంగతాలయినా, ఎక్కువగా ప్రతిభచే ఉన్మీలితాలే. ఈ ప్రతిభ భక్తి జ్ఞాన మంత్ర ఉపాసనా వాసితమేకాక భావనోద్దీపితం.

ఉ. ఎందఱు రాములో యిక మఱెందఱు సీతలొ యీ వధూవరుల్
వందలుగాఁగఁ దోఁచెడిని ప్రక్కను ముందును వెన్క నెల్లచో
నిందఱలోన నెవ్వరొకొ యెంచ వధూవరులంచు సభ్యులా
నందముతోడఁ గాంత్రు రఘునందను జానకి చెంత దిగ్భ్రమన్.

× × × ×

శా. నా చెంతం గలవాఁడు రాముఁ డనుచున్ నాచెంత నాచెంత నే
దోఁచెన్, రాముఁ డిదేయటంచు జనమెంతో ప్రేమ నేకాగ్రతన్
జూచున్ సన్నిధి నున్నవానివలెనే చూపట్టు బింబమ్ము దో
బూచుల్ సల్పెడి రామచంద్రుఁ డఁనగా మోదంబు పెంపొందెడిన్"

శ్రీమద్రామాయణంలోని పదపదార్థాలు రెండూ గూడా పై పైకి తేటతెల్లముగా వెలకిలా పడుకున్నట్లుగానూ కానుపించుతూ ఉంటై.

"విశ్వంభరే! భరత్వం మామ్" ఇత్యాదులెన్నో. మళ్ళా ఇట్టిపట్ల భారతంలో గూడా, దృష్టిలోనికి మరలించిన కొలదీ, పదపదార్థాలు రెండూ వ్యక్తి నాశక్తి అనే అర్థాన్ని మన హృదయమ్మీదికెత్తి పరమార్థాన్ని గోచరింపజేస్తవి.

వాల్మీకి తాను నేర్చుకోనివిద్య—ఈ రామాయణంలో చెప్పిందే చెప్పటం చెప్పిందే చెప్పటం; దీంతో విసుగుపుట్టిస్తాడు. అరణ్యాదికాండలలో అవి ప్రక్షిప్తాలేమో! కాదు. ప్రక్షిప్తాలే అని అంటే 24 వేల శ్లోకసంఖ్య తగ్గవచ్చు.

దానివల్లనే అభినవగుప్తపాదులు వాల్మీకికి హారతి యెత్తుతారు. 'ఆది కవేః పురా' 'శోకః శ్లోకత్వ మాగతః' (ధ్వని) అని. ఆ వాల్మీకి భాషాభావాది సౌందర్యమూ చమత్కారమూ చిటిపొటి వ్యంగ్యమూ 'నిశ్వాసాంధ ఇవాదర్శః' మరి 'దర్శయన్తి శరన్నద్యః పులినాని శనైశ్శనైః। నవసంగమ సవ్రీడాజ—ఘనానీవ యోషితః' వంటి ఉపమలు గోవిందరామాయణంలో కనబడతవి. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాగరక్షకు తీసుకొని వెళ్ళేటప్పటిది యీ దిగువ పద్దెం—

దొరకరాని దేవా దొరకిన చందాన
అబ్బి విడువరాని దయిన యటులు
తనువు పొంగ మనసు తత్పరమైయుండ
గాధి సుతుడు నడువఁ గడఁగె ముందు (శరణాగ—59)

× × × ×

అని యలంకారమే కవితా ... ...
ధనువు న.త్ పేక్ష జేసి ... వలంతు

రితని చారిత్ర మెంతదో యంత దంచు
నచటి కవులెల్ల నబ్బురమంది యంది.

శరణాగతాశ్వాసంలో వివాహఘట్టం ఒకపట్టాన మరచిపోము. గోవింద రామాయణంలో ఘట్టాలన్నీ తంత్రసంప్రదాయమునో వైష్ణవ సంప్రదాయమునో వెంటబెట్టుకొని స్ఫుటమైనవి.

గీ. ధాత్రిజావక్త్రి మల్లవిధాత్ర పదము
శిష్ట వక్షస్థలము సదా శివపదమ్ము
విమల మధ్యము శ్రీ లసద్విష్ణు పదము
నాతి ధమ్మిల్ల మది సుమనః పదమ్ము

ఈ పద్యం వినంగానే 'బ్రహ్మ విష్ణు శివాత్మికాయై నమః' అనేది స్ఫురణకు వస్తుంది.

అధర మరుణధరమ్మునై యలరు వధువు
వాణి మధురాపురమ్ము జవ్వని నితంబ
సీమ కాంచీ ప్రదీప్తము, సిరుల పేటి
యంగన శరీరమెల్ల శ్రీరంగభూమి.

అరుణాచలంలో ఉండే అబ్బయే మధురలోను కంచిలోను శ్రీరంగంలోనూ ఉండే అమ్మయే. మాయమ్మ సీతమ్మ యని తోపచేస్తూ సౌందర్య పవిత్రతను ఈ పద్యం వెదజల్లుతూంది. మామూలు శరీర సౌందర్య వర్ణనం కంటె ఈ మార్గము ఎంత దివ్యంగా భాసిస్తూందో !

వాల్మీకి రాముని చూపి జనకుని చేత—

'ఇయం సీతా మమ సుతా. సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం, భద్రంతే, పాణిం గృహ్ణీష్వ పాణినా'

అని అనిపిస్తాడు. 'ఈయమ నాకూతురు సీతమ్మ. నీవు చెప్పినట్లు వినుకుంటుంది. ఈమెను ఏలుకోవలసింది. శుభమస్తు. పాణిగ్రహణం చెయ్యి !' అని సరళార్థం. దీనికి వ్యాఖ్యాతలు వ్యంగ్యార్థాలెన్నో వక్కాణించారు. ఆచార్యులవారు వానిని ఉటంకిస్తూ ఈ ఒక్క శ్లోకాన్నే ఎనిమిది పద్యాలుగా వివరించారు. ఈ పద్యాలు

చదువుతుంటే పాఠకులకు విసుకు వచ్చే సమయానికి— 'గ్రహియింపుము పాణి పాణిచే' అనే మకుటం మంత్రం వేసినట్లు విసుగు పోగొట్టుతుంది.

చ. ఇది సహధర్మచారిణి త్వదీప్సిత భోగపదార్థ కర్త్రి నీ
హృదయ సమాన నీదు తను వెంచఁగ భద్రము కల్గుఁగాత! నీ
విదిత కటాక్ష వీక్షణము వీడక యేలఁగదయ్య సీత యి
య్యదియ మదీయ పుత్రిక సుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే'

ఈ పద్యంలో – 'నీదు తనువు' అనేది సౌందర్య లహరిలోని – శరీరం త్వం శంభోః అనేదే.

గౌతముని తపోవనం గుండా దారి తీశాడు విశ్వామిత్రుడు. అప్పుడు రాయిగా పడివున్న అహల్య దొర్లుకుంటూ దొర్లుకుంటూ రాముని పాదములకు శరణాగతి చెప్పిందని వర్ణించిన ఆచార్యులవారు, సంసార జీర్ణారణ్యంలో నల్ల సేసపురాళ్ళుగా పడియున్న మన డెందాలను గూడా ఆ రాముని పాదాలముందుకు దొర్లించి ఆ రాళ్ళచే ఏరులను పాద్యంగా సమర్పింపఁ జేయలేదా ? ఓ గోవింద కవీ ! "నీ రామనామమే నిరుపమ నిద్రయై మనియుంటి" నన్న నీవు జడాన్ని నిద్రించే చైతన్యంగా చూచి, మాచే భక్తిరసముగా అనుభవింప చేయలేదా ? చాలు ! "జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః"

ఉ. జానగు మోముతో విపుల సారస నేత్రుఁడు శూన్యదుర్గ మో
ద్యానవనిన్ బదమ్ము లిడె నంతఁ దదంఘ్రిరజమ్ము రేఁగె రా
రా నలినాక్ష యో యఘువిరామ పవిత్ర పదాబ్జరామ యన్
ధ్యానమునన్ శిలాప్రతిమ తారసిలెన్ భువి దొర్లివచ్చుచున్.

ఆ రాతిబొమ్మ యిలా అంటుంది—

సీ. నీ రామనామమే నిర్మలాహారమై బ్రతికితి నిన్నేండ్లు భక్తవరద !
నీ రామనామమే నిరతపానీయమై జీవమ్ముతోనుంటి దేవదేవ !
నీ రామనామమే నిరుపమ నిద్రయై మనియుంటి నేవేళ వనజనేత్ర
నీ రామనామమే నిఖిలసౌఖ్యమ్ముసై కడపితి నిన్నేండ్లుక మలనాభ!

ఇనకులేశ్వర నీరాక కింతదనుక
భక్తనై వేచియుంటి నీ భస్మమందు
ప్రకృతిఁ జిక్కి విరూపనై పరమపురుష
పడసి యుంటిని స్వస్వరూపంబు నిపుడె

వైదిక వైష్ణవ సంప్రదాయంలో 'దీర్ఘ శరణాగతే శ్రీమద్రామాయణం' అని అనుకొనబడే మాటను గోవిందాచార్యులవారు చెప్పి చూపించారు. వీరు 'సీతారామం' అని ముద్దుపేరు పెట్టుకొన్న బాలకాండలో దశరథ శరణాగతి, అహల్యా శరణాగతి, సీతా శరణాగతి, విశ్వామిత్ర శరణాగతి, పరశురామ శరణాగతి ఉన్నవి. ఈ దశరథాదులందఱిదీ భక్తియోగం. సహృదయులు కూడా ఆయా యీ పాత్రలతోపాటే శరణాగతి చేసినవారై పూర్వార్జితం ఉంటే భక్తియోగులు కాగలరు. ఈ మాదిరిగా కావ్యపరమార్థమైన భక్తిరసం(ధర్మం ద్వారా)భక్తిద్వారా వికసించింది. ఉపేయమైన భక్తే రసరూప పరమానందానుభవానికి ఉపాయం గూడా ఔతుంది. భక్తి రసాయనం చూచేది.

మనం సీతారాముల కల్యాణం కన్నుల పండువుగానూ ఆనందంగానూ చూచి అక్షింతలు వేసికొంటాం. పిదప శ్రీరాములవారిని యువరాజులుంగారెనిగా చూదామని అయోధ్యకు మళ్ళా పెండ్లినడకలు నడచుకొంటూ వస్తాం. మిథిలలో ఆ ప్రకృతి – పురుషుల పెండ్లి యేర్పాటులలో పెద్దయెత్తున జీవితం సాగించిన మనకు అయోధ్యలో గూడా జీవన ప్రమాణం ఏ మాత్రమూ తగ్గకపోగా మొగ్గు చూపుతుంది. అయోధ్యా – అయోధ్యా ఒక్కసారిగా అమరావతై పోతుంది— 'దేవానాం పూ రయోధ్యా.'

అదిగదిగో కోతి! చూడు ! ఆ ఏడంతస్థుల మేడమీద ! కోతికాదు.మంథర, ఆ మేడ కైకది. ఈ గూని మంథర ఆమెదాసి. మీకు కోతివలె కనిపించింది. ఆదికవి జ్ఞాతి దాసీ అని అన్నాడీ మంథరను. ఇంకొకచోట గంధర్వి అని అన్నాడు. ఒక వ్యాఖ్యాత జ్ఞాతులలో ఒకానొక జ్ఞాతికి దాది అని అర్థం చెప్పాడు. ఇంకొకడు అతి జ్ఞానంకల దాది అని అన్నాడు. వీని యన్నింటిని చూస్తే గోవిందులకు ఇలా కనబడ్డది :

"ఎరుక లే దీమెపుట్టుక యిద్ధరిత్రి
ఎక్కడిదొ ! యెప్పు డెచ్చోట నెటుగఁ బెరిగె
నెటుల కైకను జేరెనో యెరుకకాదు
కైకతోడ నయోధ్యలో గాలువెట్టె"

పాదుక – మాయాశ్వాసము 21.

పద్మపురాణకర్త యీామె పూర్వజన్మం తిరగేసిచూచి యిలా చెప్పాడు:- "ఈమె పూర్వజన్మంలో ఒకానొక అచ్చర. రావణ వధకోసం దేవత లీమెను భూలోకంలో పుట్టమన్నారు. ఆమె మంథరగా పుట్టి - నేను మీ రాణివాసంలో దాదిగా ఉంటానని కేకయ మహారాజులుంగారి దగ్గరకు వచ్చి కుదురుకుంది. పిమ్మట ఆ మహారాజు కైకను అత్తింటికి పంపుతూ ఈ మంథరను అరణంగా ఇచ్చాడు." ఇంకో కథ గూడా దీని విషయమై పుట్టింది. ఆ కథనే ఆచార్యులు గారు—

క. గంధర్వీరూపము గొని
మంథర దుందుభి యనంగ మారుచు దపమున్
సంధించెన్ హరిపై గసి
బంధించెన్ గద హృది విధి వరమున్ గోరెన్.

అంటూ ఇంకా కొన్ని పద్యాలలో ఈమె చరిత్రకు మొదలూ తుదలూ తీర్చారు.

వీరంతా ఎందు కిన్ని పాట్లుపడ్డారు? ప్రపంచానికి వరవడిగా ఒజ్జబంతిగా తీర్పు దిద్దవలయువారుగా ఉండవలసిన మహారాజదంపతులు బుద్ధిపూర్వకంగా అధర్మానికి ఒడిగట్టారని కావ్యంలో చెపితే ఆ మహారాజదంపతులు కావ్యనాయకునకు జననీజనకులుగా ఉండతగరని వారు ఇన్ని పాట్లుపడ్డారు. వీరిని చూచే కావచ్చు, ఇంకో మెట్టెక్కి ఆనందవర్ధనులు ధ్వన్యాలోకంలో—

"విభావ భావానుభావ సంచా ర్యౌచిత్యచారుణః
విధిః కథా శరీరస్య వృత్త స్యోత్ప్రేక్షితస్య చ
ఇతివృత్తవశా యా తాం. త్యక్త్వాననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యోవ్యంతరాభీష్ట రసోచితకథోన్నయః. —(3-10, 11)

"కల్పితకథలోనయినా సరే నిజకథలోనయినా సరే విభావాద్యౌచిత్యం రసానుగుణంగా చూడాలి. అసలు కథలోనే అననుగుణమయినది ఉంటే తొలగించాలి" అని అన్నారు. ప్రబంధదోషహానమూ అనౌచిత్యపరిహారమూ చేయాలంటూ భోజరాజు—

"తత్ర దోషహాన మనౌచిత్యాదిపరిహారేణ యథా
మాయా కైకేయీ దశరథాభ్యాం రామః
ప్రవాసితో న మాతాపితృభ్యా మితి రాజ
శేఖరస్య బాల రామాయణే."

"రాజశేఖరుడు బాలరామాయణంలో ప్రబంధదోషహానంకోసం మాయా కైకేయీ దశరథులను సృష్టించాడు. వారే రాముణ్ణి అడవికి వెళ్ళగొట్టారు కాని అసలు తలిదండ్రులు వెళ్ళగొట్టలేదు" అని శృంగార ప్రకాశికలో అంటాడు.

శ్రీమద్రామాయణంలో వాల్మీకి కైక స్వభావం చాలా దొడ్డదిగా చెప్పాడు. మంథర చెడుతలంపుతో "రామ పట్టాభిషేకం రేపు జరగబోతుం"దని చెప్పింది. కైక తన సంతోషానికి చిహ్నంగా మంథరకు పసదనాలిస్తుంది. పిదప మంథర దురోధకు లోనైపోతుంది. ఇంతమాత్రం చాలుననే ఆదికవి తలపు.

"ఇది నాటకం కాదు కాబట్టి వాల్మీకి మార్చలేదు" అని ఎవరయినా అంటే అనవచ్చు. అది వేరే సంగతి. మంథర మాటలకు మారిపోయిన కైక మాయాకైక గాక నిజ కైకా? వాల్మీకి రాముని అక్కడక్కడ భగవంతునిగా చూపినా ఉపాధినిబట్టి పొసగే మానవత్వాన్నే వెనువెంటనే సృష్టిస్తాడు. పాఠకుడు మళ్ళా రాముణ్ణి ఆదర్శమానవునిగా గాని, ప్రమాదానికి పాలుకాగల మానవునిగా గాని, (వాలివధ ఘట్టాదులలో) అర్థం చేసుకుంటాడు. అనగా వాల్మీకి రామాయణ కావ్యాన్ని భక్తిరస ప్రధానంగాగానీ భక్తిరస ప్రధానంగా భాసించేదానినిగా గాని చేయలేదు. రాముడు భగవంతుడని కొన్నిపట్ల రహస్యంగానూ, వ్యంగ్యంగాను, కొన్నిపట్ల వాచ్యంగానూ చెప్పాడు. చెప్పినా మానవత్వము మనకు కనబడుతూనే ఉంటుంది. అది వాల్మీకి కౌశలం.

శ్రీ గోవిందులు రాముణ్ణి ఎడాపెడా వాచ్యంగానూ ('పర్యంక విద్యాప్రకాశమూర్తి' సత్యాశ్వాస–43), వ్యంగ్యంగానూ ('రమణీయ హేమపర్యంక

మందున' సత్యాశ్వాస-42), అద్వైతుల బ్రహ్మముగానూ, విశిష్టాద్వైతుల విష్ణువుగానూ, శాక్తుల పరశక్తిగానూ, వెరసి భగవానునిగా చిత్రించి (బాల కాండను-అయోధ్యాకాండను)- సీతారామమును పాదుకా పట్టాభిషేకమును భక్తి రసప్రధానంగా చేశారు. దీనితో ఈ కావ్యానికి ఒక నవ్యత్వం వచ్చింది. దానిని బట్టి దాని అంగాలకూ ఉపాంగాలకూ గూడా నవ్యత్వం చేకూర్చవలసివచ్చింది. అలా చేకూరింది. ఈ పట్టున గోవిందాచార్లుగారు ఆ గూనిదాన్నే బాగా అలంక రించి గ్రంథం నడుపుకొన్నారు. కైకను కౌసల్యా సుమిత్రలతో పాటు చిత్రకూటంపంపి—

ద్వి. అనెడి వసిష్ఠుని వెనువెంట గైక
జని రాము నేకాంతమున జూచి పలుకు."

"మన గురుడౌ వసిష్ఠముని • మాన్యుఁడు నేడె వచింప వింటి నీ
జననవిధమ్ము నాదిపురు • షా! యవివేకముజేసి ని న్నిటుల్
వనమున కంపితిన్ బతిత • పావన! దుష్టసు గూరురాల నన్
గనవొ కృపన్ దయాపర! య • కార్యము చేసినదాన బాపనై."

"మాయామోహిత చేతనన్ బతితనున్ • మానాథ! నారాయణా!
మాయామానుష రూప మూని జగతిన్ • మాయం బడంద్రోయుదే
నీ యీ మోహజలాబ్ధి నీదుటకు నిన్నే • దిక్కుగా జూతు నీ
మాయం దాటగ నాకు శక్య మొకొ! రా • మా! యాపదుద్ధారకా!"

"పొందితి బశ్చాత్తాపము
వందన మిదె కొ మ్మనంత పాపిష్ఠను, బ్రో
వందగు, నన్నుఁ క్షమింపుము
మంథర నుడి వింటి జెడితి మాధవ! రామా!"

"అచ్యుతా! జగన్నాథ! యాద్యంతరహిత!
విశ్వమయ! భక్తవత్సల! ప్రేమమూర్తి!

అమల! నారాయణా! సత్కృపార్ద్రహృదయ!
పాహి మాం పాహి పాహి తుభ్యం నమోఽస్తు"

అని ఆమెచే శరణాగతి చేయించారు. ఇట్లా చేయగా రాము డంటాడు :

* * * *

"అమ్మ మోక్షంబు నీ వెంచ నంద గలవు
సాధు రక్షణకార్యంబె సలిపి తీవు
దుష్టశిక్షణ దీక్షకు దోడ్పడితివి
సర్వ మీగతి హరి సేవ జేసినావు."

"నీ వొనరించితే యిటుగ! • నీ వెపుడున్ నను గూర్మి జూడవో
నీవు కులీనవున్ సతివి • నేనయి కొంటి నరణ్యావాసమున్
దైవవిధంబునన్ బృథివి • ధర్మము శ్రేయము నెంచి, యింతకున్
నీవ నిమిత్తమై జగతి • నింద భరించుచునుంటి వమ్మరో!"

* * * *

ఈ రీతిగా కైక శరణాగతి, శ్రీరాముని అభయప్రదానము—వీనితో కైకమ్మ భక్తురాలుగానూ, శ్రీరాముడు దైవముగానూ మనకు కనబడతారు. పాపం! ఇంతా చేసింది ఆ మంథర. ఆమె మాటే ఎవరికీ గుర్తులేదు ఈ ఘట్టంలో. పోనీండి. ఈ పాదుకాపట్టాభిషేకమంతా పాదుకాంతవీక్షతో, భక్తిలో ఎన్ని భేదా లున్నాయో కొలది గొప్ప అన్ని భేదాలతోనూ ప్రస్ఫుటమై భక్తి రసానికి ఉదాహరణంగా ఉన్నది.

రాముడు అడవికి పోయేముందు కౌసల్య అనుమతి తీసుకోవడానికి వెళ్లి తన నిశ్చయం చెప్పినప్పుడు ఆమె మూర్ఛిల్లి సేదదేరి కన్నీరు కాలువలుకట్టగా కుమారుని చూచి—

'లలిత స్వరూప నా లావణ్యమూర్తి
కులకాంత నీ తల్లి ఘోషించుదాని
వీడుచు వని కేఁగువాఁడవా! యిపుడె

పీడను నిన్నేను వీడఁగాఁజాల
తమి నుందు నీ సన్నిధానంబునందె
అమితమౌ ఆనంద మదియె నాకెంచ' —(సత్యాశ్వాస-160)

చ. అనుచు.........నార్తిని గుందుచు సారెసారెకున్
గనుచుఁ దదేక దృష్టి రఘుకాంతునిఁ గన్నుల నీరు నింపుచున్
వని జనరాదు పుత్ర యను, ప్రాంజలి నుండిన దివ్యమూర్తికిన్
విను విను నిన్ను వీడ వెనువెంటఁ జరించెద నీదు సన్నిధిన్. 161

× × × ×

మ. కనుపాపన్ జరియించువాఁడవగుచున్ గంజాక్ష సంశ్లేషమున్
జననం బాదిగఁ గూర్చి కూర్చి త్రుటిలో సాన్నిధ్య విశ్లేషమున్
గను మంచున్ హిత మాడఁజూచెదవొ! లోకం బెట్లు హర్షించు నీ
పని నిన్నేగతి వీడుదాన వెత సంభాషింతువే మాతకున్. 164

× × × ×

తే. ..................అతుల రూపు
కౌఁగలించుచు మూర్త్యాని కౌఁగలించి
ఆత్మను నివేదన మొనర్చి యమిత తృప్తి
సేసలను జల్లి చందన సేవఁ జేసి
మంగళంబగుఁగాత సన్మంగళ మను. 249

× × × ×

తే. సకల మంగళ రూపంబు స్వాంత మందు
పాదుకొన నిల్పెఁ గౌసల్య భాగ్యమేమొ
పుత్రు తనువున గంధంబు పూసి పూసి
అంబ యంతఁ ప్రదక్షిణ మాచరించు. 253

తే. రామ జయరామ శుభరామ లలితరామ
మరలుమీ వేగ నిటకు నీ మాతఁదలఁచి

జన్మ ధర్మమౌ నెఱవేర్పఁ జనుము వనికి
ననుచు నక్షతలను జల్లె నతని తలను. 254

తే. రాము విడనాడఁజాల దా రామమాత
మర్కట కిశోరవిధమున మాత యొప్ప
సంతతిని నోటఁబట్టు మార్జాలగతిని
తల్లి విడనాడి చనలేఁడు దాశరథియు. 260

ఈ పద్యాలలో తల్లి కొడుకు లౌకవిధంగా తల్లీకొడుకులుగానూ ఇంకో విధంగా భక్తురాలు భగవంతుఁడుగాను కనఁబడతారు. తల్లి అనే ఉపాధిలోనుండి ఒక భక్తురాలున్నూ, కొడుకు అనే ఉపాధిలోనుండి భగవంతుడున్నూ పయికి నెట్టుకొనివస్తారు.

ఇచట–"తదేకదృష్టి రఘుకాంతుని" చూడటమూ, కన్నుల నీరునింపడమూ, "నీ వెనువెంట వత్తును," "కనుపాపం జరియించువాఁడవ"ని అనటమూ, కౌఁగలించడమూ, మూర్కొనడమూ, వాత్సల్యానికీ భక్తికీ సాధారణమైన అనుభావాలు, 'ఆత్మను నివేదించడమూ సేసల చల్లడమూ చందనసేవ చేయడమూ సకల కల్యాణగుణ స్వరూపాన్ని హృదయంలో పాదుకొలపడమూ ప్రదక్షిణం చేయడమూ, ఇవి భక్తికి అనుభావాలు (రామాయణ వ్యాఖ్యాతలు ఈ ప్రదక్షిణం పుత్రస్వస్తికరం అని అన్నారు) ఈ రీతిగా కౌసల్యలో వత్సల రస మిశ్రమయిన భక్తిరసము గోచరిస్తూంది. ఈలాగే సీతలో సుంత మధురము కొంత ప్రేయమూ కలిసిన భక్తియున్నూ లక్ష్మణునిలో, గుహునిలో, ప్రేయోరసమిశ్రమైన భక్తియున్నూ, దశరథునిలో వత్సలమిశ్రమయిన భక్తియున్నూ, (సర్వత్ర స్వశబ్దవాచ్యమయినా) చక్కగా కనిపిస్తవి. వీరి కందర కున్నూ మకుటంగా భరతుని భక్తి చెప్పుకోదగినది. ఉదాహరింపనూ దగినది.

భరద్వాజ విందు అనేమాట లోకంలో విశ్రుతం. అది ఎందుకు జరిగింది? భరతుని భక్తి తెలిసికోవడానికి! భరద్వాజుని యోగమహిమచే మేడలు మిద్దెలు ఏర్పడినవి. దివ్యములైన శబ్ద స్పర్శ రూప రసగంధాలు ఆవిర్భవించినవి. కర్మేంద్రియములను తనియజేసే విషయాలన్నీ ఏర్పడినవి. సేనాంగములన్నీ 'ఖాదత మోదతలు' సోడుముట్టగా సుఖం అనుభవిస్తున్నవి. అట్టి సమయంలో——

తే. సచివ పరివేష్టితుండు దాశరథి యంత
మౌని కోరుట గనఁబోయె మహితరీతిఁ
జూచుచున్నంత కనుకట్టు చొప్పు దోఁప
తమకుఁ దాఁ బుట్టినట్టి సౌధముల సౌరు. 188

ఉ. అందొక సౌధరాజము మ • హారమణీయము సౌఖ్యదాయి, యా
నందమయమ్ము, దివ్యశయ • నమ్ముల నాసన భోజనాదులన్
బొందగు దాని రాజు కొలు • వుండగ నొప్పు సభాగృహంబుతో
నందము చిందుదానిఁ గని • యందునఁ జొచ్చెఁ బురోహితాళితోన్. 189

ఉ. భాసుర సౌధమందున స • భాసదనంబునుఁ జొచ్చి ఛత్రసిం
హాసన చామరద్వయము • నాతఁడు గన్గొని మంత్రియుక్తుఁడై
యాసన మొంటనుండె సచి • వాళి సమేతము గాఁగ గాని సిం
హాసన మెక్కలేదు హృద • యంబున నిల్పుచు రామచంద్రునిన్. 190

తే. రాచతీవి దనర • రాజ్యాధికారులు
చేరి రెల్ల, సభను • శీఘ్రగతిని
రాజొకండె లేడు • రత్నపీఠంబున
విందు వేడ్కలన్ని • వెలయుచుండె. 191

తే. భరతుఁ డుపవిష్టుఁడై యుండ • వరలఁ జేసె
రత్న సింహాసనము, మౌని • రాజు, కాని
సచివులు పురోహితాళియు • సైన్య పతియు
భరతుఁడును నొక్కవరుసనే • వరలినారు. 192

తే. మౌని యంతట రావించె • మహిత గాయ
కులను నారద తుంబుర • గోపవరుల
రాల గరగించు గానాన • రహిఁ జెలంగు
నృత్యముల మన్ను మిన్నును • నేకమయ్యె. 193

చ. భరతుఁడొ విందు నందుఁగల • భక్ష్యము లంటడు, గాన నృత్య సం
భరిత వినోదముల్ గనఁడు • ప్రాంజలి రాముఁ దలంచి ఛత్రచా

మర మహితాసనంబులకు • మాన్యతఁ జూపి, ప్రదక్షిణించి, చా
మరమును బూని కేల, నృప • మంత్రులతో నుపవిష్టుఁడై సభన్. 194

తే. "దాస భూతోస్మి"యనుచు లోఁ • దలఁచువాఁడు
రామ కింకరుగతి చామ • రంబుఁ బూని
రాఘవుఁడు పెద్ద గద్దియ • రాజిలు నటు
లాత్మ భావించి కైంకర్య • మంతఁ బూనె. 195

—(ప్రపన్నాశ్వాసము)

ఈ పద్యాలలో భరతుని నిగ్గు మనకు ప్రత్యక్షమయింది. మహాభారతంలో అష్టావక్రుని బ్రహ్మచర్య ఋజుత్వం ఈ చందంగానే పరిస్ఫుటమవుతుంది. అనుశాసనిక పర్వం చూచేది.

ఇటు తరువాత భరతుని ప్రేయోరసం వడపోతలో పడి శుద్ధభక్తిరసంగా మారుతుంది.

తే. ఇదిగో రాజ్యంబు గైకొను మినకులేంద్ర !
లోకముల నెల్లఁ బాలించు నీకు లెక్క
యొక్క కోసలఁ బాలింప ? దిక్కు నీవె
గావె యని ప్రణమిల్లెఁ గైకమ్మసుతుఁడు. 515

తే. రాము పాదము లంట శిరఁబు మోపి
పలు విధంబులఁ బ్రార్థించె భరతుఁ డంత
రాఘవుని పాదయుగ్మంబె రక్ష యనెడి
రీతి నన్యాశ్రయములేని రీతి గాఁగ 516

భరతుఁడు ఇలా చేసినా ఆ రామయ్య అంటాడు— 'చంద్రుడు చలువ విడిచినా, మంచుకొండ మంచు విడిచినా, సముద్రం చెలియలికట్ట దాటినా నేను నా తండ్రి ముందు చేసిన ప్రతిజ్ఞను దాటేదిలేదు' అని.

ఈ మాటే భక్తుడైన భరతునకు గుచ్చుకొని సాధన రహస్యం తెలుపుతుంది :

తే. అన్న తుదిమాట వినుచుఁ బ్రసన్నుఁడౌచు
భరతుఁడు స్వయంకృషిని వీడి పారతంత్ర్య
మూని గురు వసిష్ఠునివైపు బూని దృష్టి
నాత్మఁ దలపోయసాగె......... 522

× × × ×

ఉ. పౌరులు కోరినన్ వినఁడు భక్తుని యాచనఁ బాటిసేయఁ డే
తీరున సుప్రసన్నుఁడగు ? తెల్వి సమస్తముఁ జూపి ధర్మపుం
బో రొనరించితిన్ గృహము ముంగల బండితి, మువ్వురమ్మలున్
గోరిరికాని యొప్పుకొనకుండె నటం చెద నెంచుచున్ ధృతిన్. 524

మ. కనుచున్ రాఘవునిన్, సఖున్, బ్రియుని భక్తత్రాణ దీక్షాపరున్
తన సర్వస్వము రాఘవుం డతని పాదద్వంద్వ మొండే, యుపా
యనమం చాత్మ, ననన్యభక్తి శరణం బంచున్ విశుద్ధాత్ముడై
వినతిన్ సల్పి పదంబులన్, విమలుడై పృథ్వీశు నర్థించెడిన్. 525

మ. వరదా దివ్యసువర్ణపాదుకలపైఁ బాదంబులన్ మోపు మీ
భరియించున్ ధర నీకు మాఱుగను భూపా ! పార్థివవ్యంజనం
బరయం దాల్చిన నీదు పాదుకలె నిత్యానందముం జెందుచున్
శిరసా దాల్చెద వాని యాజ్ఞ లవి, శాసింపన్ ననున్ రాజ్యమున్. 526

తే. వరద ! నే నల్పుఁడను నిన్ను శరణ మంటి
పాదపద్మమ్ము లంటి నీ పాదయుగళిఁ
గోరుచుంటి నౌదలఁ దాల్పఁ గోరుచుంటి
అన్యథా శరణం నాస్తి యంటి రామ ! 527

ఇహ పర సాధకంగా భరతుడు పాదుకాదీక్ష వహించి అయోధ్యలో అందర మనస్సులలోనూ ఆత్మారాముడై యున్న రాముణ్ణి పదునాలుగేండ్ల తరువాత అభినవంగా చూడగలుగుతాడు ! ఈ రీతిగా భక్తిరస భరితమై, యీ పాదుకా పట్టాభిషేకం చదువరులను బ్రహ్మానంద భరితులను జేయఁగలదు.

అయితే ఒక విశేషం ఉన్నది. ఆలంబనమయిన భగవంతుడు సిద్ధుడయియే శ్రీరామరూపంలో అయోధ్యలో అందర ఎట్టెదుటా ఉంటాడు. ప్రహ్లాదుడు మొదలగు భక్తులు కఠోరమైన సాధన చేసి చూడగలిగారు. ఇటీవలి చైతన్యుడూ రామకృష్ణుడూ కన్నప్పా గోపన్నా మొదలయిన వారెందరెందరో కనిపింపని భగవంతుణ్ణి పలువిధములుగా భావించి భావించి కనిపింపజేసికొన్నవారే! అట్టివారి చరిత్రలను కవులు కావ్యాలు చేసినప్పుడు విభావాదుల కలయికవల్ల స్థాయ్యుపహితమయిన చిత్తురసంగా ఔతుంది. అనగా భగవదనురాగం స్థాయి. దానిచే ఏకాగ్రమయిన చిత్తే భక్తిరసం అని జగన్నాథుడుగాని మధుసూదన సరస్వతిగాని అంటారు. భరతుణ్ణి గురించి చెపుతూ గోవిందరామాయణం, ప్రసన్నాశ్వాసంలో—

క. ప్రేమ తన స్థాయిభావము
గా మది భరతుండు... 47

అని అంటుంది. సహృదయులగు చదువరుల కీయానందం గుత్తకాదా?

ఇక ఇచ్చట శ్రీరాముని వివాసముచే కలుగు ఎడబాటు వలననే అటు తల్లులకూ తండ్రికీ అర్ధాంగికీ తమ్ములకూ స్నేహితులకూ ఒకరేమిటి అయోధ్య కయోధ్యకూ వివిధాకారములుగా ఉన్న ప్రేమ ఉవ్వెత్తుగా ఉబికింది. అదే వారి సాధన. మళ్ళా పధ్నాల్గు ఏండ్లవరకూ చేయవలసిన సాధన. ఎదురుగా ఆ భగవంతుడుంటే మాత్ర మేమయింది?

'భక్త్యా మా మభిజానాతి యావాన్ య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్'

'నా నిండు రూపును ఉండు రూపును భక్తిచేత సరిగ్గా తెలిసికొన్న బ్రహ్మవేత్త బ్రహ్మమే అయిపోతాడు' అని గీత చెపుతుంది.

అట్లా గనుక అయితే 'ఆత్మారాములయిన భరద్వాజాది ఋషులు రాముని ఎందులకు సేవించారు?' అని ప్రశ్నిస్తారేమో!

'ఆత్మారామా శ్చ మునయో
నిర్గ్రంథా అప్యురుక్రమే

వహ న్త్య హైతుకీం భక్తి
మిత్థం భూత గుణో హరిః'

'హృదయగ్రంథి మొదలైన గ్రంథులు విడిపోయినా ఆత్మారాములయినా మునులు అకారణంగా భక్తి నవలంబిస్తారట! ఎందుకు ? హరి గుణములు అట్టివి' అని భాగవతం చెబుతుంది.

సహృదయులుకూడా శ్రీమద్రామాయణం చదివి కౌసల్యలో కౌసల్యలై దశరథునిలో దశరథులై సీతలో సీతలై భరతునిలో భరతులై, లేక సాధారణీకరణ వ్యాపారంచేత లేక వ్యంజనాశక్తిచేత వ్యష్టి జీవత్వం పోగొట్టుకొని భక్తి రసమనే ఆనందాన్ని అనుభవించగలరు. సంసార ప్రాబల్యం గనుక ఉంటే అదే భక్తి యోగానికి దారితీసి చదువరులను తరింప జేస్తుంది.

యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి
నిందిత స్స వసే ల్లోకే స్వాత్మా ప్యేనం విగర్హతి.

## నిగమనం

ఈ గోవింద రామాయణం వేరువేరు రామాయణ పోకడలలోని బంగారాన్ని పొదుగుకొన్నది. శ్రీమద్రామాయణానికి గల భిన్న భిన్న వ్యాఖ్యలలోని వెన్న కరగించి పెట్టుకున్నది.

కవిలో ప్రతిభా వ్యుత్పత్తులు మరీ ఎక్కువై వానిని కావ్యంలో జోడింపగల మనుకుంటే ఆ కావ్యం దుర్బోధమైపోతుంది. ఇట్టి అవస్థ తెలుగుభాషలోనూ, సంస్కృత భాషలోనూ కొన్ని కావ్యాలకు పట్టింది. వానికి వ్యాఖ్యాత లెందరితోనో పని. ఈ గోవింద రామాయణానికి వ్యాఖ్యాతతో కాగల పనిలేదు.

ఈ గోవింద రామాయణంలో ఇంతవరకు ఒక వచనమైనాలేదు. నిర్వచనం చేయడం వీరికి అభిమతమై యుండవచ్చు. వీరికి త్యాగయ్యమీదా గోపయ్యమీదా చాలా ఇష్టం : వీరి ఒకటి రెండు వాక్యాలు అక్కడా అక్కడా చక్కగా వాడుకున్నారు.

శ్రీ గోవిందాచార్యులుగారు—

ఉ. కష్టచయమ్ము శల్యగతిఁ గన్నది నేటికి నీదు సత్కృపా
విష్టత శాంతిఁ గొంతఁ గని పీడను నీ స్మరణమ్ము కాని, నా
యిష్ట మదేమి ? నీవె రచియింపఁగ జేయుమ నీదు గాథ ను
త్కృష్టగతిన్ బ్రపూర్ణముగఁ దుష్టినిబొంద బుధాళి రాఘవా.

ఉ. చదివిన సంస్కృతాంధ్రముల సాహితి సర్వము నిన్ స్మరింపఁగా
హృది, మది, నా కుపాధి సుమ! యింక మఱేమియు నా కలమ్ము
వ్రాయదు సుమీ !........................

అని వ్రాసికొన్నారు. ఇక మిగిలిన కాండలనుగూడా ఇతోధిక భక్తిశ్రద్ధలతో రచించి ఆంధ్రభాషకూ, భక్తులకూ ఉపకరిస్తారని దేముణ్ణి ప్రార్థిస్తాను.

గోవింద రామాయణంలో రాముడు మనిషి కాదు. ఆచార్యులుగారు శ్రీరాముని మనిషిగా నిలబెట్టాలని అనుకున్నట్లు కనపడతారు. కాని ఆ రాముడో ఉపాధి ఊడదీసుకుని ఇట్టే దేముడై కూచుంటాడు.

ఈ కవి జన్మతః పూర్వం కూడా శ్రీవైష్ణవుడు. ఇప్పుడు రామభక్తుడై రామాయణం చెబుతున్నాడు. రామాయణం దీర్ఘశరణాగతి కదా ! ఇంకేం, కవికి శరణాగతేకాక, రామాయణం చెప్పడమనే దీర్ఘశరణాగతే దొరికింది. అకించన్యం మొదలైన పంచాంగాలూ, అర్థపంచకమూ మొదలగునవి రామాయణపాత్రలలో అటనటా ఉన్నవి. ఆచార్యులు కూడా పంచసంస్కార సంస్కృతులు. ఈరీతిగా ప్రపన్నుడీ కవి. ఈ రామాయణంలో రస మేమిటంటే కరుణరసం అనిన్నీ, దానికి భక్తి, వత్సలము మొదలైన రసాలు అంగాలు అనిన్నీ కవే చెప్పాడు.

**పూలవలె గుబాళించే మాటలతోనూ, హృదయాన్ని పులకరింపజేసే భావాలతోనూ మోడును చిగిరింపజేసే భక్తితోనూ, ఇనుపగుండ్లను కరిగించే కరుణంతోనూ పరుగెత్తే *గోవిందరామాయణం చదివాక పానకం అక్కరలేదు.***

---

(శ్రీ గోవింద రామాయణము - కృతికర్త : ఆత్మకూరి గోవిందాచార్యులు - ప్రథమ ముద్రణ : 1963)



బ్రిటిష్ ఇండియా చరిత్ర :

# 6. పరిచయము

చరిత్రకారుడు సత్యశిల్పి. అతడు వాస్తవ చరిత్రనే చిత్రించును. ఉన్న దున్నటులుగా చెప్పునదే చరిత్ర. అందు కల్లగాని కపటముగాని ఉండదు.

చరిత్రకారుఁ డనృతవాదిగాని పక్షపాతిగాని కాఁడు. అతఁ డట్టివాడగునేని అతని జాతియంతయు అనృతమునబడి నీచజాతిగా మాఱును.

హిందూదేశము తెల్లవారి చేతులలోఁ బడెను. వారు తమ జయగీతములు పాడుకొని, నల్లవారిచే గూడ పాడించుకొనిరి. తెల్లవారు దొరలు; నల్లవారు బానిసలు. తెల్లవారు గురువులు; నల్లవారు శిష్యులు. తెల్లవారు గ్రంథకర్తలు; నల్లవారు అనువాదకులు.

చిన్ననాడు బడిలో నేను దేశచరిత్ర చదివితిని. హిందువులు నీచులనియు, తురకలు రాక్షసులనియు, తెల్లవారు దేవతలనియు నాకొక అభిప్రాయము కలిగెను. ఆ కాలమున నా తోడి బాలకులందఱును ఈ చదువే చదివిరి.

"ఈ యేబది యేండ్లలో పుట్టిన దేశచరిత్రల కంటె, నూరు నూటయేఁబది యేండ్లకు మున్ను పుట్టిన దేశచరిత్రలో ఏ యొండో రెండో తక్క తక్కిన వన్నియు పక్షపాతములేని వనియు, సమగ్రమైనవనియు" సుప్రసిద్ధ చరిత్రకర్తలగు ఎడ్వర్డు థాంప్సన్, జి.టి. గారెట్టులు వ్రాసిరి.

అసత్యము దాగదు కదా! సత్యము లన్నియు పుంఖానుపుంఖములుగా బయటపడుచున్నవి. విశేషించి ఆంగ్లేయుల నోటినుండియే యివి వెలువడుచున్నవి. అట్టి సత్యముల పుట్టయే ఈ బ్రిటిష్ రాజ్యతంత్ర యుగము!

ఈ ప్రమాణములు ప్రోవుచేయుటకు శ్రీ దిగవల్లి శివరావుగారి కెన్నియో యేండ్లు పట్టియుండును. వీరిందుల కెన్నియో గ్రంథములు చదివియుందురు.

తేనెపెర పెట్టుటకు తేనెటీగ కెంతకాలము పట్టునో, అది యెన్నెన్ని పూలబడి తిరుగాడునో యెవరికేమి పట్టె? ఎవరికిని తేనెపెర మీదనే పెరపెర! అట్టి తేనె పెర ఈ గ్రంథము.

కుంఫిణీవారు హిందూదేశమును స్వాహావేయువఱకును ఇచట పలువురు రాజులు నక్షత్రములవలె వెదజల్లఁబడినటులుండిరి. వీర లందఱితోడను, వీరి ప్రజలతోడను, వీరి ధనముతోడను గల సంబంధమే ఈ గ్రంథము. కావున నిది కలగూర గంపవలెను, కప్పలతక్కెడవలెను ఉండక తప్పదు. ఇచట నొక్కొక్క రాజున కొక్కొక్క చరిత్రయు, ఒక్కొక్క దేశమున కొక్కొక్క రాజనీతియు కలదు. ఇట్టి రాజులు పలువురు. ఇట్టి నీతులు పెక్కు. ఇట్టి హిందూదేశ చరిత్ర మొక మహారణ్యము. శ్రీ దిగవల్లి శివరావుగారు దివ్వెబూని, ఈ యరణ్యమున నడచుచు, నడుమ నడుమ మనకు పూవులను కాయలను పండ్లను గోసియిచ్చి మనలను నడిపించుచు తీసికొనిపోవుచున్నారు.

మనకందఱకును సామాన్యముగా-"తెల్లవారు కాలిడక ముం దిచట నెందరు రాజు లుండిరి? ఇచట ఏలుబడి ఎటు లున్నది? ఇచట ప్రజ యెట్టిది? ఇది యడవి దేశమా? అన్యదేశమా? ఇంగ్లీషువారు భుజబలముననే హిందూదేశమును జయించిరా? తెల్లవారు కొల్లగొట్టిన ధనరాశి ఎచట మూల్గుచున్నది? మ్యూటినీలు ఏలవచ్చెను? కిరస్తానీ మత మెటులు చొచ్చెను?-అని యిటులు ప్రశ్నలనంతముగా తోచును. వీని కన్నిటికీ పుస్తకమున సరియగు ప్రత్యుత్తరములు మనము పడయగలము. ఇవిగాక పంచాయతీల వినాశనము, బ్రిటిష్‌వారి న్యాయ విచారణ, నూజివీడు అయోధ్య హైదరాబాదా బాకీలు, భూస్వామిత్వము, జమీందారీ రైతువారీ పద్ధతులు, శిస్తులు, మిషనరీలు, గాజులు లక్ష్మి నరుసు గారు, జాన్ బ్రూన్ నార్టన్ ఉద్యోగములు, కాంగ్రెసు - మొదలగు నెన్నియో గనులనుండి యెత్తబడి ఇందు ఉల్లేఖింపబడినవి. "కాసట బీసటే చదివి గాథలు త్రవ్వు తెనుంగు వారికి" ఈ గ్రంథము ప్రామాణికమే కాక, అభిరుచికి కూడా కాణాచి.

అమృతాంజనముతోఁగాని, కాఫీతోఁగాని పనిలేకుండ ఒక గుక్కలో ఈ చరిత్రము నంతయు చదువఁ గలిగించిన శ్రీ దిగవల్లి శివరావుగారు అభినందనీయులు.

బెజవాడ,
23-9-1938

వేలూరి శివరామశాస్త్రి.

× × ×

['భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్ర యుగము' అను 'బ్రిటిష్ ఇండియా చరిత్ర' గ్రంథము పేరు. రచయిత దిగవల్లి వేంకట శివరావు. ప్రథమ ముద్రణము : 2-10-1938.]



# 7. ఆశంస

కిరాతార్జునీయానికీ, మేఘ సందేశానికీ, దశకుమార చరిత్రకూ,కాదంబరికీ, ప్రాచీన నవీన ప్రబంధాలు కొన్నింటికి ఏకైకంగానూ, మరికొన్నింటికి అనేకం గానూ అనువాదాలు ఉన్నవి. కాదంబరికి సంస్కృతంలోనే 'మోతాదు కాదం బరులు' (సంగ్రహ కాదంబరులు) ఏకాధికంగానే ఉన్నవి. డుంఠి అభినందుడు- మొదలయినవారి కాదంబరీ కథాసారము, అభినవ కాదంబరి ఇత్యాదులే కాక నాట కాలు కూడా ఉన్నవి. క్షేమేంద్రుడు కాదంబరీ నాటకంలోంచి కొన్ని శ్లోకాలు ఉదాహరించాడు. తెలుగులోనూ కాదంబరీ నాటకమని ఒకటి విన్నానుగాని అచ్చులో చూడలేదు. ఇలా ఉంటవి నాచూడని వెన్నో. తెలుగు కాదంబరీ ప్రబంధంలో...దానిలోని రెండు పద్యాలు శ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు కుమార సంభవము అర్థ వివరణంలో ఉదహరించారు. ఈ ప్రబంధాలన్నిటికి ప్రయోజనం లేదనలేము కాని, అది చాలా తక్కువ. ఎందుచేతనంటే, వీనిలో చాలా ప్రబంధాలు కథామాత్రాన్నే మాత్రా ప్రమాణంలో తెలిపినవికాని, కవి హృదయంతో మనకు పరిచయం కలిగించలేదు.

విద్వాన్ విశ్వంగారు సంస్కృత వాఙ్మయాన్ని తెలిగించి 'ప్రభ'లో కుమ్మరించేటప్పుడే దాని పరిమళం తెలుగునాటి నలుమూలలా వ్యాపించింది. ఇప్పుడు అన్నపూర్ణా ప్రచురణకర్తల పనితనంతో ఈ గ్రంథాలు మొగలిరేకుల లాగా మన చేతుల నలంకరిస్తున్నందుల కెంతో సంతోషం.

నేను సుమారు పదేండ్ల క్రితం - 'ప్రభ' కార్యాలయంలో - అప్పుడు కాదంబరి పూర్వభాగం ప్రభలో ముద్రిత మవుతూంది - శ్రీ విశ్వం గారిని అడిగాను : అంతవరకు అచ్చుపడ్డ కాదంబరి కాగితాలు ఈయండని. వారు అత్యాదరంతో 'అలాగే ఇస్తా' మన్నారు. గాని ఆ యీయడం పదిహేనురోజుల క్రిందట. ఎప్పుడుచూద్దామా, ఎప్పుడు చూద్దామా అనే నా పదేండ్ల ఉత్కంఠ పది హేను రోజులక్రితం తగ్గింది.

ఈ గ్రంథాలు నాలుగూ ఒక్కమారుగా నాచేతులలోనికి రావడంతో ఉక్కిరి బిక్కిరి అయాను. చిన్ననాడు 'భారవి' చదివాను, పాఠాలు చెప్పాను. మమ్మటుడూ, మహిమా చేసిన ప్రశంసలూ, అభిశంసలూ ఆకళింపు చేసికొన్నాను. కాబట్టి మునిముందు దానిని చదువుదామని చూస్తే—మిత్రుడులా మేఘసందేశం ముందుకొచ్చింది. వచ్చిందే తడవుగా చివరకంటూ చదివించుకుంటూ పోయింది. చాపల్యం తెచ్చుకొని ఇంకో గ్రంథం చూదామని అనుకున్నా, చూడజాలక పోయాను. ఈ మేఘసందేశం అట్టతోసహా బాగున్నది. చదు వొకరి సొమ్మా ? ముఖే ముఖే సరస్వతీ ! దేవులపల్లి కృష్ణశాస్త్రి ధన్యుడు !

ఆటు పిమ్మట, దేంతో జగత్తంతా ఉచ్ఛిష్టమైనదో ఆ కాదంబరిని ఆస్వాదించడం మొదలుపెట్టేను. అయిపోతుందేమోనని భయం ! తనిసీ తనయక ఉన్నాను. తనువులోనే ఉండేందుకు చదవాలి, చదవాలి, మళ్ళా చదవాలి'. "ప్రతి స రకంతో కాని తృప్తికాదు". అని అంటారు కదా !

మూలకాదంబరి తనివితీరా ఆస్వాదించడానికి అధమపక్షం ఏడాదైనా పడుతుంది. విశ్వంగారి ఈ తెలుగు కాదంబరి నవలలాగా వెళ్ళిపోతుంది. కవి హృదయం అవగహిస్తూ. విశ్వంగారి ఈ కాదంబరి దేశకాలాలను ఇట్లా తనలో స్వీకరించుకుంది.

బాణవేగంతోపాటు పయనించి ప్రపంచపు పొలిమేరలు చూడదలచుకొంటారా ? లేక భావనా సమాధిలోని ఆనందం అనుభవించ దలుస్తారా ? లేక బహిః ప్రపంచమూ, అంతః ప్రపంచమూ – ఈ రెంటి వైవిధ్యమూ చూడదలచుకుంటారా ? లేక మూటిని దలచుకుంటారా ? మీ యిష్టం. విద్వాన్ విశ్వం సాయంతో చూడండి. తప్పక చూడగలరు.

*   *   *   *

---

(విద్వాన్ విశ్వం సన్మాన సంచికలో పునర్ముద్రితం.
పుట-73. అక్టోబరు 1976.)



# 8. సాధన సామగ్రి

## [ తంత్రశాస్త్ర విశేషములు ]

తంత్రశాస్త్రము పలుతెఱగులగు ఆగమములకు మహాసముద్రము. వీనిలో శైవ వైష్ణవాగమములందు ద్విజాతులకే అధికారము. కాని శాక్తాగమములు మానవులందఱకును తలుపులు తెఱచి యుంచెను. వేదములు విడిచి పెట్టిన ఆడు వారికి ఇవి అగ్రతాంబూల మిచ్చెను. ఆఱితేఱి పవిత్రురాలగు "ఆచార్య" యుండునెడల నామెకడ దీక్షగొనుట మేలు తరమనియు, శీఘ్రసిద్ధి ప్రదమనియు నివి చెప్పును.

పలు తెఱగులగు నీ యాగమములలో నీ దిగువ అంశములు సాధారణ ములు : "మానవుడు పరదేవతాంశము. మఱియు అతడొక సూక్ష్మబ్రహ్మాండము. అతనిలో సృజన శక్తియు నిద్రాణమై యున్నది. బ్రహ్మాండమునందున్న శక్తు లన్నియు ఈ పిండాండము నందును ఉన్నవి. మానవుడు వీటినన్నిటిని నిదుర బాపి తన దివ్యత్వమును తెలిసి కొనవలయును. కర్మ వలయునే కాని నైష్క ర్మ్యము తగదు. జీవిత క్షేత్రమునందలి సందుల గొందుల చీకటి తొలగించి పరదేవతను తనలో నావిర్భవింపఁ జేసికొనవలయును."

సాధన చేసి అనుభవమునకు తెచ్చికొనుమని చెప్పునదే తంత్రశాస్త్రము. కావుననే దీనిని ప్రత్యక్షశాస్త్రమని, సాధన శాస్త్రమని, ఉపాసనాశాస్త్రమని అందురు. ఈ శాస్త్రమునకు జ్ఞాన – యోగ – క్రియా – చర్యా పాదములని నాలుగు పాదములు.

### జ్ఞాన పాదము

జగత్కారణమును నిర్వచించునది జ్ఞాన పాదము. బ్రహ్మము ఒక్కటన్న నొక్కటే. అది మారదు. ఎంగిలి కాదు. అది సచ్చిదానందము. జీవుల ననుగ్ర హింప బోవుముందు ఉపాసనమునకు వీలుగా ఆనందము బెల్లుబికి అమ్మగను, అయ్యగను అగును. అమ్మయే అయ్య; అయ్యయే అమ్మ. వెరసి అమ్మయ్య

లేక అయ్యమ్మ - ఇదియే - శక్తి శివుడు. ఈ శివశక్తి తత్త్వమునుండి సృష్టి ప్రవహించును. తంత్రసాధనకు మూలస్తంభము శక్తి. శక్తి స్ఫురణము వలన తత్త్వాంతరములతోపాటు పరమతత్త్వానుభూతి. శక్తి నిత్యము. దీనికి ఉన్మేషము, వికాసము, నిమీలినము అనునవి కలవు. ఇది అనాది, అనంతము. శివశక్తులకు గల సంబంధ మభిన్నము. శక్తి శివు నాశ్రయించి ఎడతెగని సృష్టికిని, గతికిని కారణమగును. శక్తికి నిర్విశేష సవిశేష ప్రకాశములున్నవి. శక్తి శివునందుండి సవిశేష స్పందముచే నామరూపాత్మకమగు విశ్వమును, నిర్విశేష స్పందముచే నామరూపాతీతమగు విశ్వమును ప్రకాశింపజేయును, శక్తి వికాసము నందలి ప్రాథమికావస్థ నిర్విశేషము, ప్రశాంతము. ఇచట శక్తికి పరిణామములేదు. ప్రకాశము మాత్రము కలదు. ఇచట శక్తిసముద్రములో తరంగములున్నను వీని కంపనము ఒక మూర్తి గొనదు నిర్విశేషమగు నీశక్తి పరాశక్తి'. దీనికిముం దీశక్తి శివునిలో స్తిమితమై యుండును. ఇది నిమీలినము. ఇదియ పరమ శివ తత్త్వము. శైవాగమము లీ యవస్థను శూన్యమని అనును.

## యోగ పాదము

అజ్ఞానమును అడచి తనలో నిగూఢమైన దివ్యత్వమును వికసింపజేసి, ప్రాణశక్తి కాధారమును, శివశక్తి స్వరూపమును అయిన ఆనందములో తన జీవానందమును మేళవింపఁ దెలుపు నుపాయములు యోగపాదము. జ్ఞానపాదము నందు చెప్పబడిన తత్వముల నన్నిటిని అనుభవమునకుఁ దెచ్చికొనకున్న యెడల, ఆ జ్ఞానము శాస్త్రముగానే శేషించును. కావున ఈ యోగపాదము పూర్వపాదము నందలి ప్రతి విషయమును అనుభమునకు దెచ్చుకొనుటకు ఎన్నియో సాధనముల నుపదేశించెను. అంతరంగ సాధనమనియు, బహిరంగ సాధనమనియు, సాధనము రెండు విధములు. ఇవి రెండును జీవన క్షేత్రమునంతయు పవిత్రమొనరించును. దీనివలన సాధకుడు మనోవాక్కాయ కర్మములను మాతృమయముగాఁ గను గొనును. ఇందు కుండలినీ యోగము ముఖ్యము; భక్తి బాసట.

## క్రియా పాదము

క్షేత్ర దర్శనము, దేవ దర్శనము, దేవళము, యాగము మొదలగు వానిని జెప్పునది క్రియాపాదము. ఇవి యన్నియు తన చుట్టునున్న మానవ

సమాజముతో సన్నిహిత సంబంధమును పోరాని చుట్టఱికమును కల్పించును. చక్రపూజ వీనిలో నొకటి. దీనిచే భేదమనుమాట లేకుండఁ బోవును-'సంప్రాప్తే భైరవే చక్రే సర్వే వర్ణా ద్విజాతయః'—చెడుగున కిది దారి—యని యొక యభిప్రాయము లేకపోలేదు. చెడ్డవారి చేరిక వలనను చెడు పనులవలనను మేలు కూడ కీడగును. కడవెడు పాలు ఒక విషబిందువుతో కడవెడు విషము కాగలదు గదా! కాని సమష్టి సాధనలో వ్యక్తులకును సంఘమునకును మేలున్నది. అది యటుండె. వైదిక తంత్రములందలి అగ్ని గృహము దేవాలయముగను, యజ్ఞములు నవరాత్రములందలి దేవీ యాగములుగను, కర్మకాండ ఆగమకాండగను, వైదిక దేవతా రూపము మంత్ర రూపముగను, సగుణ బ్రహ్మము గాయత్రిగను తంత్ర సాధనలో మాఱెనని పెద్దలందురు.

## చర్యా పాదము

సాధకులు చేయవలయు పూజా ప్రకారము సాంగోపాంగముగా వివరించునది చర్యాపాదము. సాధనలో నిది చాలా ముఖ్యము. పాణిని ప్రాఙ్ముఖముగా కూర్చుండి, దర్భ పవిత్ర పాణియై, వ్యాకరణ సూత్రముల జెప్పునపుడు ఆయాచార్యులవారు రెప్పలల్లార్చినను, మోము చిట్లించినను, చేయి విదిలించినను దాని కర్థముండునని' మహాభాష్యమున పతంజలి. అయితే తంత్రము, న్యాసము మొదలైన క్రియాకలాపమును రూపకాతిశయోక్తి భాండారముతో నింపి ఉపాసనము నెంతయో పరిపుష్ట మొనరించెను. ఈ పాదమున ఎన్నియో సాధన తెన్నియో రూపులతో నున్నవి. ఏలయనగా తలకొక బుద్ధి. అందఱకును ఒకే తెఱగు సాధన ఉండదు. కావున సాధకులను ముక్కూట మూడు విధములుగా తంత్రము విభజించెను. సత్త్వ రజస్తమో గుణభేదముచే భిన్నులయిన ఆయా దివ్యవీర పశు సాధకులకు ఇది తగిన ఉపాసనము బోధించెను.

'నేను కర్తను. భోక్తను. ఇది నా యిల్లు అది నా పొలము' అని సంసారమును పట్టుకొని ప్రాకులాడు వాఁడధమ పశువు. పశువు పలుపుచే కట్టబడును. సంసారి అవిద్యా రజ్జువుచే కట్టబడును. పరోక్ష జ్ఞానము కలిగి సత్కర్మపరాయణుడై, అపరోక్ష జ్ఞానము కొఱకు కారాట పడువాడుత్తమపశువు.

అవిద్యా రజ్జువును తెంపుకొని ఆనందహ్రదము దెస కుఱుకువాడు వీర సాధకుడని చెప్పబడును. ఇత డెరుకదగిలి దానికై మేనినేని లెక్కింపక దాని వెంటఁ బరుగు లెత్తువాడు వీరుఁడు. ఎంత పర్యంత మాత్మ సామర్థ్యమును పెను పొందింపవలయునని ప్రయాసపడునో అంత పర్యంత మతడు వీర సాధకుడు. ఈ స్థితిలో అతని ద్వైతము కొంత అంతరించును. అతఁ డపు డీవిశ్వమును శివ శక్తుల విభూతిగా తెలియగల యోగ్యత వడయును. అతడు చేయునది కర్మ యోగము. అపుడు తన్నతడు ఈశ్వర యంత్రముగా దలచును. కామవాసనల నడచి సంసారము నందు వీరునివలె విహరించును. ఈశ్వరుని ప్రమోల కర్మలను, కర్మ ఫలమును వాసనలను నివేదించి శుద్ధ ప్రవృత్తి పొందును. శివశక్తి ప్రేరణ చేతనే అపు డతని నడత. అతని వాసనాహంకార బీజములు దగ్ధమయిపోవును. అతని యీ యవస్థ "భోగో యోగాయతే......మోక్షాయతే చ సంసారః". వీర సాధకుడు ప్రకృతిని నిగ్రహింపక దానియెడ నిర్లిప్తుఁడగును. కాని దాని నవలంబించియే సంశోధన మొనర్చి, దానికి ఊర్ధ్వగతి చేకూర్చి దానితోపాటు శక్తి సాయుజ్యము వడయును. ఈ వీర సాధకుని 'కాలమార్గ రహస్యము' చూచునది.

ఇంద్రియములకు లోబడకుండుటయకాక నిర్లేపముగా నుండుటయకాక, భగవానునకు శరణాగతి చెందువాడు దివ్య సాధకుడు. అహైతుకమగు భక్తియు, పరానురక్తియు దివ్యభావమును పూర్ణమొనర్చును. అపు డా దివ్యసాధకుఁ డాద్యాశక్తికి లేక ఈశ్వరునకు 'అతీత ప్రియుడు'. ఐహిక జీవనమునం దత్యుత్తమమగు నిట్టి జీవుని అవస్థలో ప్రకృతి శుద్ధ భావమయమూర్తితో కలకలలాడును. ఏలన మానవరూపియగు జీవుడు ప్రకృతి శ్రేష్ఠాభివ్యక్తి. దివ్య సాధకు నందలి చైతన్యాభివ్యక్తి యెంతయో ప్రకృత్యభివ్యక్తియు నంతయే. ప్రకృతికి ప్రతినిధిగా ఒక మెట్టుమీద నుండి మరియొక మెట్టుమీదికిఁ బోవునపుడు అతని వెంట అతని ప్రకృతియు ఊర్ధ్వగతితో అనంతముదెస నడచును. ఇదియ అభివ్యక్తి.

పశుమానవునిలో దేహ–ప్రాణ–మనో రూపముగా ప్రకృతి అచేతన మటులు నిదురించుచుండు నంతవట్టు గతానుగతికముగా నతడు దేహయాత్ర చేయుచుండును. వీరసాధకుడు దేహ–ప్రాణ–మనోతిరిక్తుఁడగు ఆత్మ ననుసంధించి ప్రకృతికి నిద్రాభంగ మొనరించి దానిపై తన యధికారము నెలకొల్పు

జూచును. దివ్యసాధకుడు తనలో పరమాత్మను చూచి తన ప్రకృతితోఁగూడఁ దాను అతనికి శరణాగతు డగును. అపుడు నిదురమంపులోనున్న ప్రకృతి పూర్ణముఁగా జాగరిల్లి పరమాత్మ స్పర్శకొఱకు పాదరసమువలె ప్రసరించును. ఆరోహణమున కిది అవధి.

సాధకుని క్రమక్రమముగా పైకిఁ దీసికొనిపోవుట తంత్రసాధన మూలోద్దేశము. ఈ దివ్య భావసాధన సాధకుని దేహప్రాణ మనోనిర్మితములగు ప్రాకృత భువనములనుండి పరాప్రకృతి నిర్మితములగు భువనములకు తీసికొనిపోవును. జీవాత్మను జడ ప్రకృతిలోని కవతరింపజేసి మరల చిజ్జగత్తునకు గొనిపోవుట మహా మాయలీల. దివ్యభావ సాధనలో సాధకుని అంతరాత్మకు భగవానునితో ప్రత్యక్ష యోగము కలుగును. కాన భగవంతుడు మాయకు పైనున్న విద్యాశక్తి నాకర్షించి జీవుని పైలోకములకుఁ గొంపోవును. అపుడు మేను తాల్చిన జీవుడు శివశక్తిమయమగు జగతిలో సమాధి ననుభవించును. అచటి యమృతము నతడు మాటి మాటికి ననుభవించును. సిద్ధ పురుషుల జీవనమునం దీసమాధి లక్షణములను మనము కనుగొందుము. వారు సమాధి వీడినపుడు జీవన్ముక్తులై ప్రపంచమున దేనికిని బద్ధులు కాక 'పరమహంసలై' 'పరమజీవులై' ఉందురు. వారి ప్రపంచము నందున్నంత వట్టు మహాశక్తి కేంద్రరూపముగానే ఉందురు. వారిలో కొందరు జ్ఞానులుగా మఱికొందఱు భక్తులుగా, ఇంకొందఱు ఉభయ భావముతో నున్నను అంతరాత్మ యోగముచే నెల్లపుడును సర్వభావములయు కేంద్రమున సమాసీనులే. సిద్ధపురుషులు జాగ్రదవస్థలో నున్నపుడు ఈ జగత్తును, ఈ జగత్తునందలి ప్రతి పదార్థమును శివశక్తిమయముగాఁ జూతురు. వారి జీవనయాత్ర విశ్వశక్తి లీలా యంత్రము. విశ్వేశ్వరి ఇచ్ఛలో వారి యిచ్ఛ ఏకీభూతము. అప్పటి పరమాత్మతోడి జీవాత్మయోగము నీటిలో నీరువలె పాలలో పాలువలె, నేతిలో నేతివలె నుండునని 'కులార్ణవ తంత్రము' చెప్పును. సిద్ధులు అద్వయజ్ఞానము, పరాభక్తి లాభముతో ఈశ్వరకోటిలో చేరుదురు. బాలోన్మత్త పిశాచములవలె నున్నను వారు వారి పరమేశ్వరితోనే యుందురు. ఇదియే తంత్రము చెప్పు సిద్ధయోగుల అవస్థ.

మూర్తితో పరశివుని ఒక విశిష్ట కేంద్ర రూపముగా నుండనగును. లేక ఆనందము కొఱకు పరమ శివునితో ద్వైతా ద్వైత లీలగా నానందింపనగును. ఇవన్నియు నపుడు సచ్చిదానందమునందలి తరంగముల భంగీ విశేష మాత్రము. ఇచటి ద్వైతా ద్వైత బోధల భేదము మీద చూపులేదు. ఉన్నదెల్ల లీలానందము మీద.

## ఆంధ్రదేశము-తంత్రము

తొల్లి తంత్రశాస్త్రము అధీతి బోధాచరణ ప్రచారణములచే కాశ్మీరము లందును, గౌడములందును, కేరళములందును ప్రసిద్ధము. తెలుగు తేండ్లు తంత్రోపాసనలో సిద్ధి నొందిన కొందఱను ఆదరించి తమ ఆస్థానములందు నెలకొలుపుకొని యుండని యెడల దీని పేరయినను లేకుండబోయెడిది. ఇట్టి స్థితిలో గూడ నిపుడు సిద్ధులును, సాధకులును మనదేశమున వ్రేళ్ళమీద లెక్కింపదగిన వారున్నారని వినుచుందుము. పఠన పాఠనములు లేక నివుఱు గప్పియున్న యీ శాస్త్రమును కొందఱు పండితుల తోడ జదివి విమర్శించి ప్రపంచమునకు వెల్లడించిన పేరు Sir John woodroff కే దక్కెను.

ఆంధ్రదేశము నందు తంత్ర శాస్త్రము తెలిసి సాంప్రదాయికముగా దీక్ష నంది, ఉపాసనలో అమ్మతో ముచ్చటలాడి ఆడించుచు నున్నవారు శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారను శ్రియానంద నాథులు. తెలుగుబాసలో స్వతంత్ర తంత్రశాస్త్ర రచనమునకు (నాయెఱిగినంత వట్టు)వీరిదే శ్రీ. 'అమ్మతో ముచ్చటలు' అను పద్య రచనము వీరికి శబ్ద బ్రహ్మముతోడి బ్రాహ్మణితోగల యెఱుక నెఱుకపరచును. ఇది సజీవమైన గ్రంథము. ఇది అమ్మతలపై వాడని పూవు. ఇది ఇంద్రనీలము మీది చెక్కడము.

## సాధన సామగ్రి

ఈ సాధన సామగ్రి సులభముగా జీర్ణించుకొనదగిన మేలిగ్రంథము. ఇది యెన్నియో చాటుమాటల తెరను తొలగించి వానికి వెలుగొసగెను. 'సాధనకు లక్ష్యమేమి ? దాని నెందులకు జేయుదురు ?' ఈ మొదలగు విషయములను ఎంతయో నిపుణముగా సమగ్రముగా నిరూపింప దొరకొనినది. తంత్రము చెప్పు

జ్ఞానపాదమునందును, యోగపాదమునందును, క్రియాపాదము నందును గల కొన్ని విశేషములనే కాక చిజ్జడములయు జ్ఞాన క్రియలయు ఏకత్వమును, కర్మ జ్ఞాన సముచ్చయమును తాంత్రిక దృష్టితో వివరించినది. ఈ సాధన సామగ్రి మొదటి పుట మొదలుకొని చివరిపుట వఱకును సాధకుల కొక క్రొత్త వెలుగును జూపుచు కరదీపికవలె నిది మనతో పయనించును. మొత్తముమీద నిది తంత్ర శాస్త్ర ప్రవేశికయే యయ్యు చక్కని తంత్రకావ్యమువలె మనచే చదివించును. శ్రీ సత్యనారాయణ శర్మగారు ఇప్పుడు మన కీమాటనిచ్చిరి. దీనిని విప్పి, ఇందలి సామగ్రిని వినియోగించుకొనుట పాఠకుల పని. సాధన సామగ్రి రెండు మూడు భాగములు కూడ త్వరలోనే ప్రకటితములు కాగలవు. దీని సంపూర్ణ స్వరూపము తంత్రశాస్త్రమున కొక అలంకారముగను, సాధకులకు కంఠమణిగను ఉండ గలదు.

ఈ శ్రీయానందులను దీక్షా నామముకల శ్రీ సత్యనారాయణ శర్మగారు భవవైద్యులే కాక ఆయుర్వేదమును కూడ లెస్స జదివిన వైద్యులు. ప్రబోధ చంద్రోదయ మద్వైతమును, సంకల్ప సూర్యోదయము విశిష్టాద్వైతమును, ఉభయ గ్రాస రాహోదయము ద్వైతమును దెలుపు నటులు 'జీవానందన'మను నాటక మాయుర్వేదమును దెలుపును. దీని 'నానందరాయమఖి' రచించెను. ఈ 'జీవా నందన' మును వీరు 'నహి ప్రతి'గా తెలిగించిరి. వీరు—'అమ్మ బిడ్డ నెయ్యపుం జవిని వేసారులు చవిచూచిన యొక వెఱ్ఱినాగమ్మ' అనియు – 'వాగ్రూపమున నుచ్చరించు నమ్మ యంగములను పద్యరూపములుగ సాధక లోకమునకుఁ జూపు వేడుక చిన్ననాటఁగోలెఁ గల వీని దొక తీరు తిక్క' అనియు—

"వెలదుల రిమ్మయున్ ధనముపిచ్చి యశమ్మునఁ బిచ్చ కూటి వి
ద్దెల బలు తిక్క యిట్లు పలుతీరుల వెఱ్ఱుల కాసుపత్రి యౌ
నిలను త్వదీయ సత్ కృప గడించు నుమాదము నాది, దీనిఁ బోఁ
దొలచెడు వెజ్జెవం దొరుడు దోచఁడు; మందును లేదు శాంభవీ!"

అని తఱచు తమ వెఱ్ఱితనము చెప్పుకొనుచున్నారు. ఇట్టి వెఱ్ఱి, తిక్క, పిచ్చు, ఉన్మాదము మనకు లేకపోయెనే యని నా గోడు. తంత్రశాస్త్రము చదివి

ఏకాగ్ర భూమికలో ఉపాసింపగలిగి పండిత కవులయినవారు ప్రత్యక్షముగా నెఱిగి యున్నవారు - శ్రీ శ్రీయానంద నాథాపర నామధేయులగు శ్రీ సత్య నారాయణశర్మగారిని నాకంటె లెస్సగా దెలుపగల్గుదురు. వారు నాయెడ జూపిన ప్రేమకు శిశువువలె వివశుడనై నేనింత మాత్రము వ్రాయగలవాడ నైతిని.

చిరివాడ,
8-7-'64

వేలూరి శివరామశాస్త్రి

---

[ సాధన సామగ్రి : గ్రంథకర్త - శ్రీ శ్రీయానందనాథుడు. ఈశ్వర సత్యనారాయణశర్మ. తొలి ముద్రణ : 1964. ప్రచురణ : సాధన గ్రంథ మండలి - తెనాలి ]



# 9. శ్రీ రామకృష్ణుని జీవిత చరిత్ర

"పవిత్రం చరితం యస్య పవిత్రం జీవనం తథా
పవిత్రతా స్వరూపాయ నమస్తస్మై నమో నమః"

శ్రీరామకృష్ణుడు జగద్గురువు. "కామినీ కాంచన త్యాగ ముపదేశించి అర్ధ నారీశ్వరుఁ డిటులు విడివడెనా ? సత్త్వైశ్వర్యము ప్రకటింప రామకృష్ణావతార ములు రెండు నిటులు సమ్మేళనమొందెనా ? శంకర, చైతన్య, రామానుజుల ప్రోవా ? అని తలపించు నితడు సర్వమత సమన్వయ స్వరూపము. ఇతని చరిత్రము మన యిహాముత్రల కేకైక జ్యోతి. ఇతని శీలము అందఱకును ఒజ్జ బంతి. నిగూఢముగా నవతరించిన యీ పరమ పురుషునిలో మొదలు నుండి తుది వఱకు బాలలీల యెటులు వికసించునో చూతము.

గదాధరుడను పందొమ్మిదేండ్ల కుఱ్ఱడు దక్షిణేశ్వరమున రాసమణి కట్టించిన దేవళము ప్రవేశించి రెండు మూడేండ్లలో కాళికాల యార్చకుడయ్యెను. అటనున్న వారందరును కూడబడి గదాధరుడు పిచ్చివాడని అనుకొనిరి. పెచ్చరిల్లిన యీ పిచ్చిలో నతడు ఆలయములోని అమ్మవారి ఱాతిబొమ్మతో సంభాషించును. ఆ బొమ్మచే అన్నము తినిపించును. గాలి యాడుచున్నదా లేదా యని ముకు పుటముల ముందు దూదిపింజ పట్టుకొని పరీక్షించును. దానికి ఫలితముగా "ఱాతి రూపము కైవడిఁ జిత్తంబు కన్ను కదలక యుండెన్"[1] అనునటులు తాను ఱాబొమ్మ యాయెను. అతడు అమ్మ ఱాబొమ్మ చిన్మయమనును; తనను మట్టి బొమ్మ యనును. ఇది చూచినవారు గదాధరునకు "బ్రహ్మ పిచ్చ"యని ఉద్ఘోషించిరి. కాళీప్రతిష్ఠ రాసమణి చేసెనా ? గదాధరుడు చేసెనా ? కాళికాలయ నిర్మాణము రామకృష్ణునిచే సఫలమని రాసమణి నమ్మెను.

ఈయెడ నిట్టి సంఘటన మొకటి గుఱుతు తగులుచున్నది. సదాశివేంద్ర సరస్వతి కావేరీ పులినములలో పిశాచమో యన తిరుగాడుచుండగా చూచినవారు

1) జ్ఞాన వాసిష్ఠము 5-184.

పరమ శివేంద్ర యోగితో "అయ్యా! తమ శిష్యుడు పిచ్చివాడై పోయె" నని చెప్పిరి. అతడది విని "అయ్యా! నాకు అట్టి పిచ్చి యెత్తకపోయెనే"యని పరితపించెను. శృంగేరీ మఠాధిపతులు శ్రీ శివాభినవ నృసింహ భారతు లాయీ సంగతిని తమ సదాశివేంద్ర స్తుతిలో నిటులు క్రోడీకరించిరి :

"ఉన్మత్తవ త్సంచర తీహ శిష్య
స్సవేతి లోకస్య వచాంసి శృణ్వన్
ఖిద్యన్న్ వాచస్య గురుః పురాహో
ఉన్మత్తతా మే నహి తాదృశీతి"

మన యీ దక్షిణేశ్వరపు పిచ్చి వాడును ఇట్టి పిచ్చివాడే! ఈ పిచ్చివాడే ప్రపంచ మంతయు నిపు డవతారమని ఎఱిగిన శ్రీ రామకృష్ణ పరమహంస!

రామకృష్ణునకు స్వగ్రామము నందును, దక్షిణేశ్వరము నందును చదువు లెరుగని సాధువులతోడను, ఎఱిగిన సన్న్యాసులతోడను చాల సాంగత్యము కలిగెను. ఇటులితడు మధ్యయుగము నందలి సాధువులకును, ఆధునికులగు సన్న్యాసులకును కూడలి. కావున శ్రీరామకృష్ణుడు తత్త్వము లెన్నియో పాడును. "గీత తత్త్వనవనీత" మనును.

## సమాధి మేఘము శ్రీరామకృష్ణుడు

అమ్మ యాదేశముచే శ్రీరామకృష్ణుడు 'భావ ముఖము'న నుండెడివారు. ఐనను అతడు తఱచు పొందుచుండెడి భావ సమాధి స్థితిని జూచి కొందఱు మూర్ఛయనియు, మూర్ఛవంటి యేదో వ్యాధి యనియు ననిరి. ఇటులు చెప్పువారు మొన్న మొన్నటి వరకు ఉండిరి. యాథార్థ్య మెరిగిన విజ్ఞులును నేటికి నున్నారు. ఉరమరిక ముప్పదేండ్ల వెనుక నాకు హైదరాబాద్‌లో శ్రీ దండి స్వాములవారి దర్శనము లభించెను. వారిది రాజపుత్ర స్థానము. ప్రసంగవశమున వారిటులు చెప్పిరి—'నేను సన్న్యసించిన కొత్తలో దక్షిణేశ్వరమున శ్రీ రామకృష్ణ పరమ హంసను జూచితిని. అపుడు వారికి తఱచు 'చేతన సమాధి'[2] కలుగుచుండెడిది. సమాహితమగు నా యవస్థ జగన్మోహనము. ఈశ్వరుడు వారి మోమునను, వారు

2) చేతన సమాధియన్నను భావ సమాధియన్నను ఒక్కటే. 'భక్తిచేఁ గలుగు సమాధికి చేతన సమాధియని పేరు' - శ్రీరామకృష్ణ కథామృత, శివ భాగము, పుట. ४0.

భూమి మీదను నృత్యము చేసెడివారు. ఆ సమాధి పట్టు భగవంతుని గుట్టుకు రట్టు. సాధకుల కది మార్గజ్యోతి. వారు కీలు వ్రేసి కెరలి యాడుటొక యెత్తు. ఈ సమాధి యొక యెత్తు'.

"తాము ఆ పట్టు యేల పట్టుకొనక పోతిరి ?" అని నేనడిగితిని. 'నీవే తెలిసికొనుము." అని వారనిరి. వారు జ్ఞానయోగులు.

సమాధి చక్షుష్మంతులకు చాక్షుష బోధ; మనస్వులకు మానస బోధ; అది వేయి శ్రవణ మనన ధ్యానముల పెట్టు.

శ్రీరామకృష్ణునకు శ్రీ తోతాపురి సన్న్యాసము ఇచ్చెను. ఆతడు గురువు కడ నుపదేశముగొని మూన్నాళ్ళడతెగని సమాధిలో మునిగిపోయెను నలుబదేండ్లకు గాని ఆ స్థితి శ్రీ తోతా భగవత్పాదులకు దొరకలేదు. అల్పకాలములో ఈ స్థితి చూరగొన్న శిష్యుని జూచి ఆ మహాయోగి 'ఏ కేయారే !' అని విస్తుపోయెను.

సమాధి యన నేమి? ఈ ప్రశ్నకు శ్రీరామకృష్ణులు పలుమాఱులు పలు చోటుల పెక్కు ఉపమానములతో సమాధానము చెప్పియున్నారు. వారి మాటలనే ఉదాహరింతును :

"ఒక చిన్న హుండీలో ఉండే చేపను గంగలో వదిల్తే ఎలా వుంటుందో సమాధిలో అలా ఉంటుంది."

"మట్ట మధ్యాహ్నం ఎండలో నిలబడితే నీడ కనబడకుండా పోయినట్లు సమాధిలో 'నేను' కనబడకుండా పోతుంది."

"భగవంతునికై మొరపెడితే దర్శన మౌతుంది. సమాధి సిద్ధిస్తుంది. ఏడిస్తే అమాంతంగా కుంభకం కుదురుతుంది. దాంతో సమాధి."

"నాటకం చూచుటలేదా? చూడవచ్చిన వారంతా కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. అట్టి సమయంలో తెర పైకి పోతోంది. అప్పుడందరి మనస్సూ ఆట మీదికి పోతుంది. బాహ్యదృష్టి మరి ఉండదు. దీని పేరే సమాధిలో ఉండటం."

"విచారం చేస్తూ పోతూవుంటే 'అహం' నశించక కలిగేది స్థిరసమాధి లేక నిర్వికల్ప సమాధి."

"సమాధి కలుగకపోతే సరియైన యెఱుక కలుగదు."

అయిదు విధములైన సమాధులలో నేదో యొకటి యొదవి సడలుచుండు టచే శ్రీరామకృష్ణునకు 'దైనందిన మేడు మారులు పుట్టి యేడు మారులు గిట్టు చుండువాడు-'అని పేరు వచ్చెను. వీరి ఈ సమాధియే ఆకాలమున శ్రీ కేశవ చంద్ర సేన్ మొదలగు కొంతమంది ముఖ్యుల నాకర్షించియుండును. ఈ యెడ వారికిని శ్రీ 'మ' కును జరిగిన ఈ దిగువ సంభాషణము ఉదాహార్యము :

శ్రీరామ : లోకులు ఏమనుకుంటారు ? భావావస్థ చూస్తే ఎలా వుంటుంది ?

మ : ఈ అవస్థ చాలమందికి ఏమీ అర్థం కాదు, ఎవరికో ముగ్గురు నలుగురికి తప్ప; ఐతే ఈ అవస్థే వాళ్ళ నాకర్షిస్తుంది.

శ్రీ చిరంతనానందులు ఈ సమాధినీ గూర్చి - 'మల్లెపొదల యాకు గుముల నడుమ వెల్గొందు పూవులవలె తత్త్వసంగముల నడుమ నాతడు పొందు దివ్య భావ సమాధి స్థితులు శ్రోతలను అద్భుత రీతిని ఆకర్షించుచుండెను.' అని గద్యములో పద్యము వ్రాసిరి.[3]

ఏ గురువు పాదముల ముందో కూర్చొని శ్రవణము చేయవచ్చును. మనస్సును మథించి మననము చేయవచ్చును. ఏ విక్షిప్త భూమికలోనో ధ్యానమును జేయవచ్చును. కాని ఈ సమాధి ? ఎవరికేని దీని జూడనేని సమ కూరునా ? కాళికాలయ దాసివగు నో బృందా ! నీవెంతయు ధన్యురాలవు.

ఈ దెస చైతన్యులు పాతిన భక్తి వృక్షమునకును, శంకరులు కాపాడిన జ్ఞాన వృక్షమునకును తనకుఁ దాను నంటు దొక్కుకున్న మొక్క శ్రీరామ కృష్ణుడు !!

సర్వమతైక ద్రష్ట శ్రీరామకృష్ణుడు.

ఈ యెడ నీ సంశయ మొదవును-'దార్శనికులందరును స్వమతమును స్థాపించుట, పరమతమును ఖండించుట అను వాదమును జల్పమును స్వీకరించిరి. 'నైకో ఋషి ర్యస్య మతం న భిన్నమ్'అను నటులు వేఱడము లేనిదే దర్శనము

3) శ్రీరామకృష్ణ చరిత్ర. పుట. 386.

...డు. 'సాంఖ్యాది దర్శనముల కంటె మా దర్శనము వేఱు'-అని శ్రీ శంకరులు బ్రహ్మసూత్ర భాష్యమున చెప్పనే చెప్పిరి. కావున మతైక్య మెటులు? 'పిల్ల, తల్లి పదములకే పొందు లేదే !' అని.

ఇటులగుచో మా దర్శనము వేఱనిన శ్రీ శంకరులు షణ్మతస్థాపనాచార్యు లెటులైరి ? కావున జిజ్ఞాసువులకును ముముక్షువులకును వైరుధ్యముతో పనిలేద ...మునకు దర్శనము. 'రుచిభేదమును బట్టి సాధకుడు షడ్దర్శనములం ...ఏదో ఒక దర్శనము నవలంబించి బ్రహ్మవిచారము చేయునది ?' అని పెద్ద ...

'యుక్తి శాస్త్రమగు దర్శన మంతయు గ్రుడ్డిది.' అని కొందఱు యుక్తిచే సాధింపజాలుదురు కాని వీరు గురువెందలు. అది యటులుండె :

శ్రీరామకృష్ణులు ఇటులు సమన్వయింతురు : "మతములెన్నో మార్గము ...[4] ధర్మాలన్నీ సత్యం. చాల బాటలగుండా కాళీఘాట్ పోవచ్చు. ధర్మం ... (ఏ దర్శనమూ) దేముడు కాదు. వేరు వేరు ధర్మాలను పట్టుకొని దేముడు ...కు పోవచ్చు.

'ఎన్నో ఉపాయాలతో మిద్దె పైకెక్కవచ్చు. రాతిమెట్లు, కఱ్ఱమెట్లు, ...మెట్లు - ఆఖరికి తాడు వేసుకొని కూడ ఎక్కవచ్చు. ఎక్కేటప్పుడు ...తం ఏదో ఒకరకం మెట్లు మీంచి ఎక్కాలి గాని రెండు మూడు మెట్లమీద కాలు పెట్టరాదు. కాని మిద్దె ఎక్కిన తర్వాత అన్ని రకాల మెట్ల మీంచి దిగి రావచ్చు. మళ్ళీ ఎక్కనూ వచ్చు.'

ఒకడు—అయ్యా ! అన్య ధర్మములో భ్రమ ఉంటే ?

శ్రీరామ—ఏ ధర్మంలో లేదూ ! నా గడియారమే సరిగా నడుస్తుందని ప్రతివాడూ అంటాడు. కాని ఏదీ సరిగా నడవదు. అన్ని గడియారాలనూ సూర్యునితో సరిచెప్పాలి.

నేను ప్రతి ధర్మాన్నీ ఒక్కొక్కసారి అవలంబించి చూచా. ముసల్మాన్, క్రైస్తవ్, శాక్తం, వేదాంతం... వీని అన్నిటిగుండా ఆ ఒక్కడే కనబడ్డాడు.

4) 'Many faces, many theologies'.

అన్నీ వేరు వేరు బాటలగుండా ఆ ఒక్కని దగ్గరకే వస్తున్నయ్- ఇదీ శ్రీరామ కృష్ణుని సమన్వయం. అజ్ఞులకు అనులోమ మార్గము, విజ్ఞులకు విలోమ మార్గము. నేను సాక్షాత్తు చూస్తున్నాను. అతడే చతుర్వింశతి తత్త్వాలుగా అవుతున్నాడు. అతడు సాకారుడూ, నిరాకారుడూ. ఈ రెంటికి కూడా అతీతుడు' అని శ్రీరామకృష్ణ డనెను.

శ్రీరామకృష్ణుడు కవి- 'కవిం కవీనామ్'

పరమహంస పలుకు తత్త్వదృష్టిలో నెట్లు గురువాక్యమో కావ్యదృష్టిలో నట్లు రసవాక్యము. అది చీకటి కోణములో నెటులు వైద్యుత ఘర్షమో, జాగ్రత్ క్షేత్రములో నటులు ఆనందవర్షము. బుద్ధుని చందముగా నీతడు పదుగుర భాషలో బోధించును. ఆ భాషకు రెండు వైపుల పదను. అది రెండు చేతుల తోడను రెండు కత్తులతో సాము చేయును. అది యెంత తేటతెలుఁగో అంత లోతు వెలుఁగు. దాని మాహాత్మ్య మెఱిగియే శ్రీ వివేకానందస్వామి కాదంబరి మొదలు కావ్యముల భాషను నిరసించి తత్త్వ ప్రకాశమునకు వాడుక మాటల అక్కఱను కన్ను పొడిచి చూపెను.[5]

శ్రీరామకృష్ణుని ఒక్కొక్క కథ ఒక్కొక్క కావ్యము. అతఁడు చేత్యములో మునిగియు చిత్తులో తేలి మెఱపులఁ గ్రుమ్మరించును. మఱి చిత్తులో మునిగి చేత్యములో తేలి ఆనందమును చిమ్మరించును.

—"అమ్మా! నన్ను రసములో ముంచు, మరి వసంలో ఉంచు. అంతే శుష్క సన్యాసిని మాత్రం చేయకు!" అని వారందురు. రసమునం దుంచనిచో ఎండక తప్పదు. వశమునం దుంచనిచో ఈ పంచదార బొమ్మ రసములో ఐక్యమొందక తప్పదు.

ఈ మహాకవిది గద్యకవిత. అది వింటివలె ఝుంకరించును. తూపువలె లక్ష్యమును భేదించును. దానికి ఉపమా దృష్టాంతములు రెండే రెండు కన్నులు. ఈ రెండును ఒకానొక అవ్యక్తమును, ఒకానొక అవిజ్ఞాతమును, ఒకానొక

5) శ్రీ వివేకానంద విరచితమగు భావ్ బార్ కథా.

వాఙ్మన సాతీతమును నీ మనోదర్పణమున తళుక్కు మనిపించి కుంభక మొన గూర్చును. శ్రీరామకృష్ణుని ఉపమ వాల్మీకి కాళిదాసులకు త్రోసిరాజు. యోగ వాసిష్ఠము నందలి కొన్ని ఉపమల కితడు కథా శరీరము సృజించెను. 'ఉపమా కాళిదాసస్య'– అను ఆభాణకము పూర్వకాలమున. ఇప్పుడో 'ఉపమా రామ కృష్ణస్య.[6] శ్రీరామకృష్ణుని పలుకు ఆబాలగోపాలమునకు పిలుపు, ఆద్యాశక్తికి మేలుకొలుపు! అతని ప్రతిమాటయు నవ్వుల యూట, ప్రతిబోధయు రసము పాట !! 'జ్ఞాని ఈశ్వరుడు తేజోమయుడు, భక్తుని ఈశ్వరుడు రస మయుడు'[7] - అని ఒకచో చెప్పిరి. అతడెంత రసికుడో! మఱి ఆనంద మయుడో!

శ్రీరామకృష్ణుడు భావనాసిద్ధుడు.

కవి ఒక వస్తువు నింకొక వస్తువుగా భావించును. మానస ప్రపంచమున దానికేదో ఒక స్థానమును కల్పింపవచ్చును. కాని ఈ భావకవి భావించెనా, అది సత్యము కావలసినదే!

అతడు దాస్య భావమున హనుమగా భావించుకొనెను. తోక మొలచుకొని వచ్చెను. మాధుర్యమున రాధగా తలంచుకొనెను. తనలో స్త్రీత్వము వికసించెను. వత్సత్వము వరించెను; అటు జగదంబనే అంబగా జేసికొనెను. శిశువై యిటు 'గోపాల్ కా మా' (గోపాలుని తల్లి)ను ఆవహించెను. మరల తాను రామునకు, రాఖాల్‌కు తండ్రి! ఏమిటి విచిత్ర సృష్టి! యౌగికమగు ప్రకృత్యాపూరమా? ఏమో! వీరి భావనాలేశములలో ప్రాణమును, రూపమును జాగరణ మందు చున్నవి.

శ్రీరామకృష్ణుడు భగవత్ప్రీతినిధి. పందొమ్మిది శతాబ్ది పాశ్చాత్యుల తాకిడికి గుఱి. నాగరకులు తాలుమాత్రై పోవు తఱి. అట్టి తఱిలో సనాతన ధర్మ మీగకయే పాశ్చాత్య సభ్యతను జీర్ణింపచేసికొనగల శక్తి నను గ్రహించిన శ్రీరామకృష్ణుడు భగవదవతారములలో ఒకానొక సాత్త్వికావతారము కాదా?

---

6) శ్రీ అచింత్యసేన్ కుమారగుప్త ప్రణీతమగు 'కవి రామకృష్ణ'.

7) శ్రీ రామకృష్ణ కథామృత – 2వ భాగ. 11వ సంపుట. పుట 292.

ఈ ప్రపంచము నేడుండి రేపుడుగు బుడగయే. అటులయ్యు ఉన్నంత వట్టు ఇది ఉన్నదియే. మఱి ఇది ఉత్తరోత్తరము ఉన్నతి గొను విరాట్త్రూపము. జీవుడు అంశము. పూర్ణు డయినను అంశమువంటి అతడెల్ల వేంట పూర్ణుడగుట జీవితమున కొద్దు. ఈ ప్రాఁజదువులకు సారమగు— 'నేను' పనిచేయనిచో లోకులు చెడిపోవుదురు— అను భగవదుపదేశమును మానవ దృష్టికోణమునుండి చూచి— నిర్వికల్పస్థితి నుండి సైతము దిగి రాగలిగి కొందఱు లోక శిక్షణమున కీ లోకమునందే 'యాడుచు పాడుచు నగుచు నేడ్చుచు' నుందురు. వారు సంసారుల దుఃఖములకు జాలిగొనక జ్ఞానోన్మాదముచే తమ తరణోపాయమే చూచుకొను లుబ్ధులు కారు. నారదుడు, ప్రహ్లాదుడు, శుకుడు, శంకరుడు, రామానుజుడు, చైతన్యుడు నట్టివారే. 'నేను మరను. అతడు మర కాడు.' అని పరమహంస యనును. లోకులకు చైతన్యము కలిగించుట కీ ఘట్టమున హంస వాలెను. శ్రీ కేశవ సేనాదులు శ్రీరామకృష్ణుని ప్రచారము చేయుమని చెప్పిరి. తా నందులకు దిగలేదు. కాని తగిన ప్రచారకులను సిద్ధపఱచుటకు నడుము కట్టెను. అతడు రామానుజులవలె గోపుర మెక్కి నరేంద్రాదులకై మొఱలిడెను. ఎట్టకేల కతని ఆహ్వానము నరేంద్రాదులను బలిమితో నాకర్షించెను. సూదంటు రాకొండకు నావలంటుకొని పోయెను.

కాని ప్రకృతిశాస్త్ర ప్రభావములో భగవదేక వైభవ మెవరికి గోచరించును? శ్రీరామకృష్ణు డిట్లనెను: 'ఈశ్వరు డున్నాడని ఎవరైనా చెపితే లోకులు నమ్మరు. ఏ మహాపురుషుడైనా నేను ఈశ్వరుని చూచాను అని అన్నా, సామాన్యులు పాటించరు. అయినా దేవుణ్ణి చూస్తే మాకు చూపించమను' అంటారు. కాని ఒకనాటిలోనే నాడిచూడటం తెలుస్తుందా? వైద్యుని చుట్టూ ఎన్నాళ్ళో ప్రదక్షిణాలు చేయాలి, చేశాక శ్లేష్మ నాడేదో, వాతనాడేదో, పిత్త నాడేదో తెలుస్తుంది. నాడి తెలుసుకోవాలంటే నాడితో ఆడేవాడితో తిరగాలి. 'అవతారంవస్తే గోప్యంగా వస్తుంది. ముగ్గురు నల్గురు ఆంతరంగ భక్తులు తప్ప సాధారణులు కనుక్కోలేరు. రాముడు పూర్ణ బ్రహ్మం, పూర్ణావతారమనే సంగతి పన్నిద్దరు ఋషులకు మాత్రమే తెలుసు. ఇతరులకో, దశరథుని పిల్లకాయ అని మాత్రమే తెలుసు.

ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో అతడే భక్తుల నిమిత్తం ఈ రామ కృష్ణ రూపంతో ఇపు డవతరించాడు.

లోక శిక్షణమునకు తానేఱుకొనిన యిరువది ముప్పది మందిలో శ్రీ పెట్ట దగిన నరేంద్రుడే దొడ్డ సంశయాళువు. శ్రీరామకృష్ణుడు శక్తిపాతము చేసెను. దానితో నరేంద్రునికి పునర్జన్మ. 'తమ కృపచే నాకు సమాధి కలుగుచున్న'దని యిత డనును.

ఇది యిటులుండగా శ్రీరామకృష్ణునకు వ్యాధి ముంచుకొనివచ్చెను. అది మందుల మాట వినదు. అట్టి స్థితిలో ఈ సంభాషణము గమనింపదగినది.

శ్రీరామ :- ఆయన యింతవాడు గదా! ఐతే ఈ జబ్బేమిటి? అని లోకు లంటారు.

ఒక గోస్వామి :- మీ వ్యాధి ఇతరుల నిమిత్తం. మీ సన్నిధి కొచ్చేవారి పాపాన్ని మీరు తీసుకుంటున్నారు. ఆ పాపాలన్నింటినీ స్వీకరించడం వల్లనే మీకు వ్యాధి.

ఒక భక్తుడు :- ఈ వ్యాధి నివారింపమని మీరు అమ్మని అడిగితే, శీఘ్రంగా నివారణమై పోతుంది.

శ్రీరామ :- వ్యాధి నివారింపమని అమ్మను అడగలేను.

ఈ రీతిగా వారికి శరీర మత్యంత భిన్నముగా ననుభవ మాయెను. ఇపుడు 'నే'ననేది వెతికినా దొరకటం లేదు—అని వారనిరి. వారు తమ అవతార సమాప్తికి ముందు కనబడిన వారందఱకును శక్తిపాతము చేసి రుచి చూపించిరి. పిదప శరీర ముపసంహరించిరి. రుచి చూచిన భక్తులు ఆ రుచి నెల్లప్పు డధీనములో నుంచుకొనుటకు ఎట్టి సాధన లొనర్చిరో దేవునికే యెరుక. వీరిలో అనక్షరాస్యుడు 'లాటూ' యొకడు. "శ్రీరామకృష్ణుని అద్భుత సృష్టులలో లాటూ పరమాద్భుత సృష్టి" అని వివేకానందు డనెను. శ్రీరామకృష్ణుల బోధ లోక కల్యాణమునకు వివేకానందాదులచే బరానగర మఠమే బీజముగా ప్రపంచమంతయు ప్రాకి ప్రాకి పోవుచున్నది. సేవాలాభము వడసిన యే

కొలది మంది భక్తులకో కాని భగవదవతారమని తెలియని శ్రీరామకృష్ణు డవతారమే యని వీరి వలన ఇపుడు ప్రపంచమున కెల్ల విదితచరము.

ఈ రీతిగా సాధనలో, మత సమన్వితిలో, బోధలో, భావనలో శ్రీరామ కృష్ణుడు విజాతీయమగు నొక సౌందర్యమును చూచి చూపించిరి. శ్రీచైతన్యుడు బుల్లా మొదలగు వారితోఁ బ్రవహించుచు వచ్చిన సంస్కరణ ధారను అవిచ్ఛిన్న ముగా పాఱఁజేసిరి. వీరి యీ ధారకు శ్రీ గాంధీ రెండొడ్డులను తీసివేసిరి. ఇట్టి ఈ అవతార పురుషుని వాణి ఒక భాషకు, ఒక జాతికి, ఒక మతమునకు, ఒక దేశమునకు మాత్రమే సంబంధించినది కాదు. అది సర్వ బాషలకు, సర్వ జాతు లకు, సర్వ మతములకు, సర్వ దేశములకు గాలివలె వలయునది. లీలకు జీవుడై పుట్టి దేవుడై పోయిన ఈతని చరిత్ర శ్రీ చిరంతనానంద స్వాములవారి వలన నేటికి లభించుట తెనుగు వారి సుకృతము, కల్యాణము!

శ్రీ చిరంతనానందులకు శ్రీరామకృష్ణులు పరమ గురువులు. శ్రీవిజ్ఞానా నందులకు శ్రీరామకృష్ణుడు గురువు. శ్రీ విజ్ఞానానందు లొకపుడు వినోదమునకు శ్రీరామకృష్ణులతో కుస్తీ పట్టి ఒక గోడ కడకు నెట్టిన జెట్టి. అట్టి జగజెట్టి శిష్యులు మన చిరంతనానందులు!

శ్రీరామకృష్ణుల మానస పుత్రులు బ్రహ్మానందస్వామివారు శ్రీవిజ్ఞానా నందులను గుఱించి– 'ఇతడు గుప్త బ్రహ్మజ్ఞుడు; తెలిసినటు లెవరికిని పట్టు వడడు' అని చెప్పిరి. అట్టి గుప్త బ్రహ్మజ్ఞుల ఛాత్రులు మన చిరంతనానందులు!

శ్రీవిజ్ఞానానందులు నారద పాంచరాత్రమును, దేవీభాగవతమును, బృహ జ్జాతకమును, సూర్య సిద్ధాంతమును, రామాయణమున కొంత వట్టును ఆంగ్లీ కరించిరి. పాంచరాత్రమున వీరు వెల్లడించిన మంత్రతత్త్వము దేవతా తత్త్వము. సాధనా రహస్యము లోనగు విషయములు సాధకులకు అవశ్యావలోకనీయములు. దేవీ భాగవత పీఠికలో వీరు చేసిన సూక్ష్మ మీమాంస పాండితీ స్ఫోరకము. ఇట్టి పండితస్వామి యంతేవాసులు మన చిరంతనానందులు!

కొందఱు భక్తులు శ్రీరామకృష్ణుల బోధలను, సంభాషణలను, ఇతర సంఘటనములను విన్నవి విన్నటులు, కన్నవి కన్నటులు దినచర్యలలో తిథి,

వార, పూర్వకముగా వ్రాసికొనిరి. వీరిలో ముఖ్యులు శ్రీ మహేంద్రనాథ గుప్త (M) అనువారు. శ్రీరామకృష్ణుల చరమ జీవితమున రమారమి అయిదు సంవత్సరములు తమకు వీలైన వేళలందు వీరు శ్రీరామకృష్ణుల పాదముల ముందు కూర్చుండి విన్నమాటలు విన్నటులు వ్రాసి ప్రకటించిరి. మఱియు శ్రీరామకృష్ణుల సమకాలికులును, భక్తులును, మహాకవులును అగు శ్రీ అక్షయ కుమార సేన్ అనువారు 'శ్రీరామకృష్ణపుంథి' అను మహాకావ్యమును అల్లిరి. శ్రీ శారదానందస్వామి శ్రీరామకృష్ణలీలా ప్రసంగము రచించి గురు హృదయమును హృదయంగమ మొనరించిరి. శ్రీరామకృష్ణులే చెప్పిన కొన్ని అపూర్వ విషయములను వీరును వారును మఱికొందఱును గ్రంథస్థము చేసిరి. శ్రీరామకృష్ణులు శరీర ముపసంహరించి నేటికి డెబ్బదేండ్లు. ఈ డెబ్బదేండ్లలో వారి వాణి చాలవట్టు వెల్లడికి వచ్చెనని అనుకొందును. ఆంగ్లభాషయందును, పరాసుభాషయందును శ్రీరామకృష్ణుని నిండు చరిత్రములు వెలువడియున్నవి. శ్రీచిరంతనానందులు పలుపూవులనుండి తేనియలు సేకరించు తుమ్మెదవలె ఈ గ్రంథ సముదాయమునుండియు, తమ గురువులు విజ్ఞానానందులనుండియు, ఆయాయీ విషయములను సేకరించి శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర మను మధుచక్రమును నేటికి తెలుగు బాసయందును నిర్మించిరి. "శ్రీరామకృష్ణుం డాపాదమస్తకము ఆత్మవైభవము"- అని శ్రీ ప్రతాపచంద్రులును, "దివ్యవైభవము" అని- శ్రీవిజయగోస్వామియు అనినటులు ఈ చిరంతనానందుల శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే, దివ్యవైభవమే. ఇది యొకదెస కావ్యము. ఇంకొక దెస చరిత్రము: వెరసి తత్త్వసంహిత లేక దివ్యకావ్యము!

ఎంత వ్రాసినను ఎంత చెప్పినను శ్రీరామకృష్ణులు మిగిలియే పోయినను, ఈ గ్రంథము ఓరపారలు లేక ఆ మిగులును సూచించుచునే యానందమునను సంధానము చేయుచున్నది. ఇన్ని కొలది పుటలలో ఇంత నాద్యైశ్వర్యముతో మిళితమైన మహానంద మిముడ్చుట శ్రీ చిరంతనానందుల శక్తిస్ఫూర్తియే! ఈ గ్రంథమును చదువుటయే నిది ధ్యాస. ఈ గ్రంథమును చదువుకొనుచుం బోదుమేని శ్రీరామకృష్ణులే తమ కథ తాము చెప్పుకొనిపోవుచుండగా మనము వినుచున్నటు లుందును.

ఐహికాముష్మిక శ్రేయస్సాధన భూతమగు నేదేని ధార్మిక వీరచరిత్రను ఉన్నత పాఠశాలలలోఁగాని, కళాశాలలలోఁగాని మన బాలురచే జదివింప దలచినచో శ్రీరామకృష్ణ చరిత్రముకంటె సర్వ ధర్మ సమన్వితమగు గ్రంథ మింకొండు దొరకునా ? ఆబాలగోపాలము తెలియుచు మహావేగముతో ప్రవహించుచు, అదోషమగు భాషతో అందఱ నాకట్టు శ్రీరామకృష్ణ జీవితచరిత్ర శారదాకంఠమున ఓంకార ఘంట ! రోమాంచముల పంట !

ఈ గ్రంథ పురుషుడు - చరిత్ర - బోధ - గ్రంథకర్త - రచన— మధురము. సర్వము మధురము.

సబ్రహ్మచారీ ! శ్రీచిరంతనానందులు నీచేతి కందించిన యీ గ్రంథమునం దేపుట యెత్తినను అది నీ అంతఃకరణమును కబళించును. భగవద్దర్శనమున కే వ్యాకులత కావలయునని శ్రీరామకృష్ణులు చెప్పిరో, యా వ్యాకులత దీనివలన నీకు కలుగక తప్పదు. ఇందలి ప్రతి పుటయు నీ ఆనందాశ్రువులచే తడియక తప్పదు.

సతీర్థ్యుడా ! భగవద్వ్యాకులత వలయునా, దీనిని జదువుము ! మొఱయుఁగూతయు నిడఁ గోరుదువా, దీనిని జదువుము ! రోమాంచనేత్రములఁ దాల్పఁ దలతువా దీనిని జదువుము ! బ్రహ్మచారి వర్షించు టెటులో నేర్చుకొందువా, శ్రీరామకృష్ణ జీవితచరిత్ర చదువుము !!

చిరివాడ
12-6-1956.

వేలూరి శివరామశాస్త్రి
శతావధాని

---

[శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర : రచయిత : చిరంతనానంద స్వామి. శ్రీరామకృష్ణ సేవా సమాజము, తెనాలి. తొలికూర్పు : 1956. పీఠికా రచయిత : శ్రీ వేలూరి శివరామశాస్త్రి.]

# 10. పరిచయము

శ్రీ సదాశివులు తాము తెలిఁగించిన ఉరుదూ కవితలను కొన్ని కొన్నిఁటిని నాకు చవిచూపుట వారి కలవాటు; చదివి ఆనందించుట నా కలవాటు. ఒకపుడు వారు శ్రీ అమ్జద్ రుబాయీలను పదిపంౘెండు పంపిరి. అవి నన్నాకర్షించెను. శ్రీసదాశివులు మాత్రము తమ తెలుగుసేతకు తృప్తి పొంద లేదు. కాని నేను ప్రోత్సహించుచు వచ్చితిని. దాని ఫలముగా నేను కొందఱ ఉరుదు కవులను వీరి వాక్కులో చదువఁగలిగితిని.

## శ్రీ అమ్ జద్

వీరి భాష ఉరుదు. శ్రీ సదాశివుల కంటియద్దములు పెట్టుకొని నేను శ్రీ అమ్‌జద్ కవిత చదివితిని. ఇంత మాత్రమున శ్రీఅమ్‌జద్ కవిని పరిచయము చేయుటకు నేను తగను. 'తగుదునమ్మా' యని నాచేయు పరిచయము కాసంతలో సుంత.

ఇతడు చెప్పినవి రుబాయీలు. మన భాషలో ముక్తకములు. భక్తి మొదలయిన భావములు ఏ మతము వారి వయినను ఒకటే! ఆవిష్కరించు ఆకారము వేఱుగాని అనుభూతి ఒకటియే. ఇతఁడు సూఫీకవులకువలె భారతీయ కవులకును బంధువే. ఒకవేళ భారతీయకవులకే దగ్గఱ చుట్టమేమో!

ఇతఁ డెల్లపుడును ఈశ్వరచింతన చేయు భాగవతుడు. ఆ స్థితి మహా పదవిగా నితండు తలంచును.

గీ॥ స్వర్గమును దాఁటె నా యదృష్టంపు నిడివి
నా ప్రయాణమ్ము ముగిసెఁ గేంద్రమ్ము చేరి
నీ పదమ్ములపైఁ దల నిల్పినంత
నా పదమ్ములఁ దల నిల్పినది జగమ్ము.

ఇతఁడు మక్కా కేగెనో, లేదో కాని సంసారములో డక్కామక్కీలు తినినటు లున్నాడు.* "నిప్పు నీటిచే చల్లారును. నేను సిగ్గుచే నీరయితిని; నరకాగ్ని నన్నేమి చేయును." (22) అని ధైర్యము తెచ్చుకొనును. జీవితము నిప్పు దగ్గఱ మంచనియు, నీటిలో ఉప్పుగల్లనియు, ప్రతిరేయి వేకువతో ముగియుననియు నితఁ డెఱుఁగును.

ఇతఁడు 'నేను', 'నీవు'లతో 'జీవుని', 'ఆత్మ'ను వ్యవహరించును. ఇతఁడు ఆత్మ యెడల సందిహానుఁడుగా, సాధకుఁడుగా, భేదాభేద దర్శిగా, అద్వైతిగా కానిపించును. ఇతని ముక్తకములు స్వానుభవములుగా తోఁచి తీఱును. ఇవి సహృదయ హృదయములతో సంవదించును.

సాధారణముగా ఆలోచించువారికిని, విశేషించి సాధకులకును, 'ఈ ప్రపంచ మేమిటి? దీనికి కారణమేమిటి?' అని తోఁచును. ఉన్నదో లేదోయను సంటియ ముప్పతిల్లును. (1,2,5) "(ఇయం విసృష్టి ర్యత ఆబభూవ..." సో అఁగవేద యది వా న వేద. అని ఋక్కు అనినను 'హిరణ్యగర్భ సమవర్త తా (గే) అని అనును.)

ఇటులయ్యు నితఁడు నిత్య సాధకుఁడే.

గీ॥ ఈ యరణ్యాన విరిగె నెన్నే మనసులు
శిలలు పగిలెను గాజుకుప్పెల విధాన
ఈవలకుఁగల ముడి యొక్కటేని విడదు
ఈవితాపూన్కి నెఱకల యుఁకలూడె. (21)

ఇతండు భేదవాదములో మునిఁగి– 'జీవుఁ డీశ్వరుడు కాఁడు' అను అవిశ్వాసము పోగొట్టుమని యిటులు ప్రార్థించును:

గీ॥ జీవ శూన్యమౌ తనువులో జీవమట్లు
చేరరమ్మ; విశ్వాసమ్మ తీరు మదిని
నిలువు మీకనుల్ నీదెస నిల్చు నెపుడు
రమ్ము దిగి యొక్కనాఁడు ఖురాను వోలె. (35)

జీవుని గుఱించి యితఁ డొనరించిన వికల్పములు వింతలు.

---

* ఇతఁడు మక్కాకేగెను. 'హజె-అహ్మద్' అను వచన గ్రంథ మా సందర్భమున వ్రాసినదే. —సదాశివ

గీ॥ ఏ రచన కేను వ్యాఖ్యనో యిది యెఱుంగ
ఎవరి దస్తూరినో యిది యే నెఱుంగ
నేను కలనా? నాతెర నెవ్వఁడేని కలఁడొ
వ్యక్తినో లేక చిత్తరువనొ యెఱుంగ. (3)

తా నీశ్వరాంశమనని (13-57) యీ కవి గమనించెను. 'అంశో నానా వ్యపదేశాత్'- బ్రహ్మసూత్రము, 'మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః'- అను గీతయు మనకు గుఱుతుఁ దగులును. మఱియు ఇతఁడు సమాధికి దాపయిన ఒకానొక తన్మయతలో- "ఇది సుషుప్తియొ జాగృతియొ, దవులఁ దరగలు లేచు; నదియో మృగతృష్ణయో' అని అనుకొనును. మఱియు భేదాభేదము ననుభవించి కాఁబోలు-

గీ॥ కల మిరువురము లేదనఁగా దెవరిని
ఇరువురము సత్యమే మిథ్య యెవరు గారు
ఒక్కరమె 'నీవు' 'నే' ననుచున్న నేని
ఎవ రెవరిలోఁ గల రనున దెఱుఁగరాదు : (58) అని అపూర్వముగా చమత్కరించెను.

ఈ కవి ముక్తకములలో పెక్కులు అద్వైతమును సర్వాత్మభావనను తేటతెల్లముగా చెప్పను. మాండూక్యము నెఱిఁగినవారును, గీత చదివికొన్న వారును ఔపనిషదమగు ఈ తత్త్వము నితఁడు వినియుండును లేక చదివి యుండునని అనుకొనుటలో వింతలేదు.

గీ॥ సంభవము ప్రకృతియును దృశ్యంబగుటయు
భ్రాంతి యద్వైతమున ద్వైత భావనంబు
దృష్టి భ్రాంతమ్ము కాని యదియె యిదెల్ల
అలలు, సుడులు, బుడగలును జలమ కాదె. (67)

గీ॥ నేను వ్రేసినవ్రేటు నాపైన పడియె
ఇతరులను బాధపెట్టి యేడ్చితిని నేనె. (73)

ఈ కవి ఇస్లాము సంప్రదాయమునకు చెందియు మహా మానవ సంప్రదాయమునకు లేక విశ్వమానవునకు దగ్గఱవాఁడు. కాన, మనకును, మానవులందఱకును చేరినవాఁడు. ఇతని ముక్తకములు తెలిఁగించి పెట్టి శ్రీ సదాశివులు ఆంధ్రులకు పరమోపకారము చేసిరి.

వేలూరి శివరామశాస్త్రి

చిరివాడ, కృష్ణా
15-8-'64.

---

[శ్రీ సదాశివగారి "అ మ్జ ద్ రు బా యీ" లకు వ్రాసిన పరిచయము]

అమ్జద్ రుబాయీలు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ (1964). వెల: 1-50 పై.

# 11. మంగళాశాసనం

మనము వాడుకొనే మాటలకు మనకు తెలిసినంతలో వాని మూలపురుషు లెవరో, వారి వంశం ఏయే దశలలో ఎలా ఎలా ఇంతవరకూ వికసిస్తూ వచ్చిందో ఆ సంగతులు తెలపడానికి చేసే ప్రయత్నం ఈ "సమగ్ర-ఆంధ్ర-సాహిత్యం" అనే పన్నెండు సంపుటాల గ్రంథం దీనిని కొంతవరకు చదువుతూ రాగా ఈ నా చిన్ననాటి విషయాలు గురుతుకు వచ్చేయ్.

నేను నాలుగవ తరగతి చదువుతున్నాను. మాకు చరిత్రమును గూర్చిన పాఠం ఉంది కాని పుస్తకం లేదు. మా అయ్యవారే చంద్రగుప్తుణ్ణి గూర్చి నవనందులను గూర్చి, అశోకుణ్ణిగూర్చి ఆకాశ పంచాంగం చెపుతూ ఉండేవాడు. 'అదిరా మనదేశం'- అని నేననుకొనేవాణ్ణి. 'అయ్యా, ఆ చంద్రగుప్తుణ్ణి గురించి, పురుషోత్తముణ్ణి గురించి, అశోకుణ్ణి గురించి ఇంకా చెప్పండి.'- అని అయ్యవారిని విసిగించేవాణ్ణి వాళ్ల చరిత్ర ఇంకా చూడాలని దుర్భిణిలో చూచే వాణ్ణి. చూపు వెనుదిరిగి వచ్చేది. అటు తరువాత పద్యాలు అలవడము అలవడిన తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగం గారి కవుల చరిత్ర కనపడ్డది. 'ఆహా! ఇక్కడ ఉన్నారు, మన బంధుగులంతా' అని ఇంకా వెనుకకు వెళ్లి చూదామని ఇంతవరకూ ప్రయత్నిస్తూనే వున్నాను. తెలియని పురాతన చరిత్రలో ఏమాత్ర మయినా తెలియరావడంలో అతి నూతనత్వం ఉంది. నూతన ప్రియులకుగూడా ఆ పురాతన అంశం అత్యంత నూతనం అన్న సంగతికి ఎవరికి వారే ప్రమాణం. ఈ గ్రంథము చదవడం మొదలుపెట్టి ముగించేటంతవరకూ నాకూ ఈ చందం గానే ఉంది. విశేషించి పావులూరి మల్లన, నన్నెచోడుడు, భీమన మొదలయిన వారి విషయాలు అజ్ఞాతసీమలో మెరుపుల చినుకులు కురిసినయ్.

సుమారు అరువదేండ్లనుండీ పండితులు పరిశోధించి ఏర్చి యిచ్చిన రత్నాలూ, తాము సేకరించిన పచ్చలూ ఈ సంపుటంలో శ్రీ ఆరుద్రగారు

కుప్పలు పోశారు. తెలుగుభాషకు పీఠిక అయిన ఈ గ్రంథం తెలుగు పుస్తకాలన్నింటినీ చదివించడమే కాక, తన్నే తా నెన్నోమారులు చదివించుకుంటుంది. తెలుగు భాషా ప్రపంచంలో ఈ ద్వాదశ సంపుటాలూ ద్వాదశాదిత్యులవలె వెలుగు ఇస్తవి. శ్రీ శేషాచలంగారు ఈ పనికి శ్రీ ఆరుద్రగారిని వినియోగించడమున్నూ, తాము చక్కగా ముద్రించడమున్నూ— ఈ రెండూ ఒకటికొకటి తగి ఉన్నవి. ఈ ప్రయత్నం సర్వోత్తమంగా నెరవేరాలని నా మంగళాశాసనం.

చిరివాడ
21-3-'65.

వేలూరి శివరామశాస్త్రి

---

[సమగ్ర ఆంధ్ర సాహిత్యం – మొదటి సంపుటం. చాళుక్య యుగం.]



# 1. ఉపనిషత్తులలో ఆత్మ

జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములను నాల్గవస్థ లందును జ్ఞానము కలదు. జ్ఞానమే "ఆత్మ". జాగ్రత్ జ్ఞానమును జ్ఞానమే. స్వప్న జ్ఞానమును జ్ఞానమే. సుషుప్తి జ్ఞానమును జ్ఞానమే. వీనిలో ఏదియు జ్ఞానమునకు స్వరూపము కాదు.

మానవులందఱలోను స్వతస్సిద్ధముగానున్న వస్తువును జ్ఞాను లెఱిగి యుందురు. అది "నేను" అను అనుభవము. ఈ "నేను" అను అనుభవము జ్ఞానమునకు పునాది. మన జ్ఞానములో నుండి "నేను" అను అనుభవము స్ఫురించుట స్వతస్సిద్ధము. ఇది అందఱకును అనుభవమే–ఈ "నేను" అను అనుభవము జ్ఞానమునకు మధ్య బిందువు............విక్షిప్తమయిన నానా జ్ఞానములు ఈ మధ్య బిందువు చుట్టే తిరుగుచుండును. సంశయమునందును 'నేను' అను నీ అనుభవము స్ఫురించుచునే యుండును.

జ్ఞానము లోపల 'నేను' అను ఈ అనుభవము మధ్య బిందువయినను అన్ని సమయములందును కేవలము శుద్ధమగు నేను అనుభూతము కాదు. జ్ఞాన స్వరూపమునకు కొన్ని అవస్థలున్నవి. ఆ యవస్థలను విడఁబఱచి చూచినచో జ్ఞాన రూపమగు 'నేను' అనునది అన్ని సమయము లందును అనుభవమునకు రాదని తెలిసికొనఁగలము.

జ్ఞానము విషయమును ప్రకాశింపఁజేసినను విషయమును ప్రకాశింపఁ జేయుటయే దాని స్వరూపము కాదు. వెలుఁగుయొక్క స్వభావము చీఁకటిని పోగొట్టుట. అట్లని వెలుఁగు యొక్క స్వరూపము చీకటిని పోగొట్టుటయే కాదు. మఱి యేమనిన దాని స్వరూపము దీప్తి. అటులే జ్ఞానము యొక్క స్వరూపము ప్రకాశము. దీపము ముం దేవస్తువున్నను అది కనఁబడును. అటులే జ్ఞానము కడ విషయము కూడ వెలుఁగొందును. కాని యిటు లగుటఁజేసి విషయమును వెలుగొందఁ జేయుటయే జ్ఞాన స్వరూప మనుటకు వీలులేదు. విషయమునకును

జ్ఞానమునకును నిత్య సంబంధము లేదు. విషయము లేకుండియు జ్ఞానముండ వచ్చును. అది స్వతః స్ఫూర్తము. స్వతస్స్ఫూర్తమగు ఈ జ్ఞానము ముక్తి నిచ్చును. ఈ జ్ఞానముతోడి పరిచయము మనకు కడుంగడుఁ గొలది. అథవా లేదనియే చెప్పవచ్చును. ఏలనఁగా చిత్తము విషయముల వెంట పరుగిడును. విషయముల నతిక్రమించి స్వస్వరూపము దెస త్రిప్పుకొను శక్తి ఏ ఒక రిద్దఱకో ఉండునదుచో నదియు అత్యుక్తి.

యాజ్ఞవల్క్యుని జ్యోతిర్బ్రాహ్మణ రహస్య మేమనఁగా— "జ్ఞానముయొక్క స్వస్వరూపము స్వయంజ్యోతి, అనఁగా స్వయంప్రకాశము అని." మనము విషయమును ప్రకాశింపఁజేయు జ్ఞానమును మాత్రమే ఎఱుఁగుదుము – స్వరూపము నెఱుఁగము.

జాగ్రదవస్థ యందలి జ్ఞానమెట్టిది? జాగ్రద్ భూమిలో మద్దెల మొదలగు వాని చప్పుడు విందుము. చెలికాఁడు మొదలగు వారిని కౌగిలించుకొందుము. మెత్త_దనుసుల వస్తువుల జాతుము. పలుతెగల రుచులుగల పండ్లు, వంటకములు మొ.వానిని తిందుము. చాల తావుల మూరుకొందుము. జ్ఞానము పైఁజెప్పిన విషయములను ఇంద్రియముల గుండ తెలియఁజేయును. ఈ తెలివివలన ఇంద్రియములచే గ్రహింపఁదగిన శబ్ద స్పర్శ రూప రస గంధముల జ్ఞానము కలుగును. శబ్దముయొక్క జ్ఞాన మనగానేమి? శబ్ద జ్ఞానమా? కాదు. ఇటులే స్పర్శయొక్క జ్ఞానమనఁగా స్పర్శయా? కాదు. మఱియేమి? జ్ఞానమును విషయమును ఒకటి యైనచో శబ్దజ్ఞానమనఁగా శబ్దము కావచ్చును. జ్ఞానమును విషయమును ఒకటి కావు. ఈ రెండును వేఱు వేఱు. విషయ ప్రకాశము తనలో నున్నను జ్ఞానము విషయము కంటె వేఱు. జాగ్రద్ భూమిలో శబ్ద స్పర్శ రూప రస గంధముల కంటె వేఱుగా విషయము నెఱుగము. జ్ఞానము విషయముతో సంబంధపడినపుడు చేతనలో కొన్ని స్పందనలు అనగా కదలికలు కలుగును. జ్ఞానమునం దాయవస్థలో కదలికలు తక్క మఱి యే పదార్థమును అనుభూతము కాదు. కదలికకు కారణము ఉండవచ్చును. గాని అది మన జ్ఞానములో ప్రకాశింపదు. మన అంత స్స్పందనయే జ్ఞాన జగతిని సృజించును. ప్రతి జ్ఞాతకును ఒకొక్క జగత్తు కలదు. తత్త్వము వేఱు, జ్ఞానము వేఱు. జ్ఞానము కేంద్రీభూతమై క్రియాశీలమైనపుడే జ్ఞానానుభూతి జాగరిల్లును. మన జగత్తు ఈ కేంద్రమును అధికరించియే.

సృజింపఁబడినది. జాగ్రత్ జ్ఞానములో రెండవస్థలను మనము గనఁబడయుదుము. ఒకటి - స్పందము కనబడు అవస్థ. రెండు - కనఁబడని అవస్థ. ఈ స్పందనమే-కదలికయే-జ్ఞానక్రియ. ఈ క్రియ విషయమును తెలియజేయును. అంతఃకరణమును ఇంద్రియములను ఆశ్రయించుకొనియే జ్ఞానమునం దీక్రియ జరుగును. అంతఃకరణముతో సంయోగము కలుగఁగనే జ్ఞానము జ్ఞాతగా అగును. జ్ఞానము యొక్క స్వరూపమునం దీజ్ఞాతృత్వము లేదు.

జాగ్రదవస్థలో జ్ఞాతృత్వ రూపముగానే భాస మగును. ఏలనఁగా అపుడు అంతఃకరణముతో గూడియే విందుము, తాకుదుము, చూతుము, తిందుము, మూచూతుము. ఇటులయినను జ్ఞానముయొక్క ఉన్ముక్త రూపము - అనగా విషయముల నుండి విడివడిన స్వస్వరూపము ఎన్నటికిని పోదు. మనకు స్పష్టముగా తెలియకున్నను జ్ఞాతృ రూపముగాఁ గూడ జ్ఞానము ఉన్ముక్తమే. ఏలనఁగా జ్ఞానమున కొక మేరలేదు, మరియు ఏదో ఒక కేంద్రము లేదు. జ్ఞాతకో ఒక ఎల్ల, ఒక కేంద్రము కలదు.

జాగ్రద్భూమిలో పరిధిలేని ఈ జ్ఞానముతో మనకు పరిచయము లేకున్నను అపుడపుడు జ్ఞానము యొక్క సాక్షి రూపముతో పరిచయము కలదు. కేవలము చూచుచుండువాడు సాక్షి. సాక్షి విషయమును చూచును గాని గ్రహింపడు. అతడు అసలు దృశి. సాక్షి స్పందములేని జ్ఞానము.

జాగ్రదవస్థలో ఎవరి జగత్తు వారిదే. కాని వేరు వేరయిన యీ జగత్తు ఒక జగత్తునకు మాత్రమే సంబంధించినది. అది యీ వ్యావహారిక జగత్తు. రాముడును కృష్ణుడును చందమామను చూచిరనుకొందము. వీరి యిరువురయు సంవేదనములు (feelings) వేరు కావచ్చును. కాని వారి సంవేదనములు మాత్రమొకేవస్తువును గూర్చి. వస్తువులు అనేకములు కావు, సంవేదనములు మాత్రము అనేకములు. ఈ సంవేదనముల కావల మఱియొక జగత్తు కలదు. కాని యీ విధమైన జగత్తు ఉన్నను దాని ప్రకాశము జ్ఞానమునందే. 'పదార్థము ఉన్నది కాని దాని యెఱుక లేదు' అను మాట అసంభవము. జ్ఞానమే అట్టి దొకటి కలదనుటకు సాక్షి. దానఁజేసి విషయముల అన్నిటియు బోధము సమ్యగ్జ్ఞానమునందే స్ఫూర్తము. ఈ సమష్టి జ్ఞానముచే విశ్వము విధృతమై యున్నది. వ్యష్టిసమష్టి

జగత్తుల కూడికయే విశ్వము. సమష్టి జగత్తు విరాట్ చైతన్యమునందు కలదు. వ్యష్టి జగత్తు ఖండచేతనయందు భానమగును. ఈ వ్యష్టి జగత్తునకును సమష్టి జగత్తునకును ఈ రెండును కలిసిన సమష్టి జగత్తునకును ఒక సూక్ష్మరూపము కలదు. అది ఇంద్రియములకు ప్రత్యక్షముకాదు. స్వప్నలోకమునందు అది ప్రకాశించును. స్వప్న జగత్తునందు సంవేదనము కలదు గాని అది సంస్కార సంవేదనము, మఱి విషయ సంవేదనముకాదు. అచట ఇంద్రియములతో అంతః కరణమునకు సంయోగము లేదు. సంస్కారములు నానా విధములు. మనస్సు నందు గల సబ్బందు మడతల నుండి ఈ సంస్కారములు ఉత్పన్నములగును.

స్వప్న మిటులు సంస్కార సృష్టి. ఈ సంస్కారములు అంతఃకరణము నందలివే. నిదురపట్టగనే అంతఃకరణము విషయముల నుండి విచ్ఛిన్నమగును. అప్పుడు ఇంద్రియములు క్రియనుండి విరతములగును. ఈ యవస్థలో అంతః కరణ సూక్ష్మసంస్కారములు స్వప్నరూపముగా ప్రకాశించును. స్వప్న జగత్తు కూడ ఒక జగత్తే. ఈ జగత్తును చూచునదియు (ద్రష్ట) అనుభవించునదియు (భోక్త) ఆత్మయే. స్వప్న సృష్టి కదా యని దీనికి సృష్టిలో ఒక పద్దు లేక పోలేదు. అంతఃకరణ మింద్రియముల లోపల నుండి విషయాభిముఖమగు ననియే మనము జాగ్రదవస్థకు స్వప్నముకంటె ప్రాధాన్య మొసగుదుము. కాని సూక్ష్మముగా చూచినచో స్వప్నము కదా యని స్వప్న సృష్టి మిథ్యకాదు. ఇంతియకాక సృష్టియొక్క మాయామయమగు రూపము స్వప్నమునందే తేటగా కనబడును.

స్వప్నము రెండు రీతులు. ఒక రీతి కలలో మనము స్వప్నజగత్తును అనుభవింతుము. కని, విని ఆనంద మనుభవింతుము. ఈ రీతి కలలలో విషయ ములకే ప్రాధాన్యము. ఆత్మ ఆయా విషయములను అనుభవించును. ఇంకొక రీతి కలలున్నవి. ఆ కలలలో ఆత్మ అచటి జగత్తును చూచునేకాని అనుభవిం పదు. అచటి సుఖదుఃఖములతో లిప్తముకాదు. ఎడతెగక స్వప్న ప్రవాహము ప్రవహించుచుండగా ఆత్మ ఉదాసీనతతో చూచుచుండును. సృష్టికి రెండు రూప ములు – ఒకటి వాస్తవము, రెండు మాయికము. వాస్తవరూపముగా ఈ విశ్వ దృశ్యము ప్రకృత సత్యము. మఱియు దీని కీశ్వరుడు స్రష్ట. మాయిక సృష్టి

స్వప్న సృష్టి. దానికి ప్రకాశమున్నది, ఉపస్థితి ఉన్నది, కాని అది వాస్తవము కాదు. మాయికరూపముగా ఈ దృశ్యమున్నను అది సత్యము కాదు దానికుపాదాన కారణము మాయ. రూపము గూడ మాయ. ఏల యిది మాయికమని అనుచో-దీనిని మనము చూతుము, ముట్టుకొందుము, అనుభవింతుము, కాని దీనికి వాస్తవమగు రూప మేదియు లేదు. ఇది ఉన్నది, మరియు లేదు. వాస్తవ దృష్టి చిరకాలము నుండియు ఉన్నది, చిరకాలము ఉండును. మాయిక సృష్టి ఏనాడును లేదు, ఉండను బోదు, కాని మనము దీనిని చూచుచుంటిమి. జ్ఞానమునకు విషయమయియు సత్యము కాకపోవుట వలన ఇది మాయికము.

మాయిక సృష్టికిని వాస్తవ సృష్టికిని మఱియొక విశేషము కలదు. వాస్తవమగు ఉపాదానమేదియును లేక సృజింపబడుటయే ఆ విశేషము. వాస్తవమగు ఉపాదానము గ్రహింపబడుచో ఆ సృష్టి నిత్యమును సత్యమును ఐపోవును. కాని సృష్టి ఎచట శక్తి కేంద్రమునుండి తొలగునో అచట వాస్తవమగు ఉపాదానము ఉండదు. ఈ సృష్టి ఒకానొక వికాసమే కాని తన్మూలమున ఉపకరణమేదియు నుండదు. స్వప్నవికాసమువలె ఇది అవాస్తవము. దానజేసి ఈశ్వరుఁడు మాయి అని ఉపనిషత్తు చెప్పును. వ్యష్టి స్వప్నము, వ్యష్టి సంస్కారముల పరిణామము. సమష్టి స్వప్నము సమష్టి గతములగు సంస్కారముల పరిణతి.

ముక్తిమార్గమున మున్ముందట విశ్వదృశ్యము స్వప్నము, మిథ్య యను జ్ఞాన మావశ్యకము. ఈ జ్ఞానమే ముక్తిని చూపును. ఈ జ్ఞానముచేత ప్రాణ చాంచల్యము తఱుఁగుచు వచ్చును. జీవుని జీవత్వమునందలి చేతనము పోవును. విశ్వము స్వప్ననగరతుల్యమై మాయామయ రూపముగా కనిపించును.

ఆత్మ ఈ స్వప్నజీవనమునకు నిమిత్తోపాదాన కారణము. ఆత్మ తన విశ్వసృష్టి తానే చేసికొనును. ఈ సృష్టి ప్రాతిభాసికము. సృష్టియెడ ఇట్టి దృష్టి యిష్టానిష్ట విభేదములను విగళిత మొనరించి మనుజులను ప్రబలములగు బహుళాకర్షణములనుండి రక్షించుచు ప్రాణశక్తి ప్రశాంతప్రాయమై ఆత్మకు బాసటయై యీ విశ్వమును చూచును. వ్యవహారభూమికలో ఆత్మ ఉదాసీనమై సాక్షిగా ఉండును. ఇట్టి బోధము ముక్తిభూమికకు అవ్యవహిత పూర్వాస్తరము. ఇచట సాధకుని కర్తృభావమున కపసారణము, ఆత్మభావనకు అంకురము. స్వప్నము

ప్రాణ జగచ్చాంచల్యమునుండి మనలను ముక్తుల నొనర్చును. మరల మరల ప్రాణము ప్రవేశించుటచే ఆత్మ విషయరసము నాస్వాదించును. ప్రాణముల ఈ సంకోచవృత్తినుండి స్వప్నము మనకు ముక్తి నొసగును. స్వప్నమునందు ప్రాతిభాసిక భోగమున్నను ఆ భోగము బంధనముకాదు. ఏలనఁగా ఆ భోగము నందు ప్రాణవృత్తికి చాంచల్యములేదు. భోగముచే ప్రాణవృత్తికి చాంచల్యము కలిగెననుచో ఉర్రితాడు వదులు కాలేదన్నమాట. ఈ రీతి స్వప్నసృష్టికి 'సాంధ్యసృష్టి'యని ఉపనిషన్నామధేయము. జాగ్రదవసానమునందు ఈ సంస్కార సృష్టి దీనికి సరిగా వెనుకటి క్షణమున తెలిపి మఱపి, నిదురలో స్వప్నము సంపూర్ణ మిథ్యారూపముతో ప్రతిభాసింపదు. జాగ్రదవస్థలో స్థూల సంస్కారములు క్రియాశీలములగును. ఇచట నట్టిదిలేదు. కాఁగా ఈ యవస్థ విజ్ఞాన సృష్టి రూపముగా భాసింపదు. ఆరోహక్రమమునందు చిత్తమున కిది యొక యవస్థా విశేషము. ముక్తిభూమికలో ముందు ముందులకేఁగ వాస్తవ విశ్వము నామరూపములుగా పరిణమించును. సృష్టి వాస్తవత విగళితమగుటతో ఈ సంస్కారము కూడ తుడుచుకొనిపోవును.

ఈ జాగ్రత్ స్వప్నములకంటె వేఱగు అవస్థ సుషుప్తి. దీన సంస్కార ములకు ఎట్టి క్రియయు ఉండదు. ఇందు కేవలము ప్రాణ క్రియ యుండును. అంతఃకరణము శాంతమగును. జాగ్రత్తునందు గాని స్వప్నమునందుగాని విషయ ముండును, సుషుప్తిలో అది యిసుమంతయు ఉండదు. విశేష జ్ఞానమేదియు నుండదు. విషయాభావమే సుషుప్తికి విషయము. విషయమునుండి విడివడుట జేసి సుషుప్తిలో జ్ఞానము ప్రశాంతము, ఉదారము, కాని అజ్ఞానావరణము నుండి విముక్తముకాదు. 'నాకేమియు తెలియదు' అనునదియే యిచటగల జ్ఞానమునకు స్వరూపము.

పదపటి జ్ఞానులు సుషుప్తిలో మూడు వృత్తులున్నవని చెప్పిరి. అవిద్యా వృత్తి, సాక్షివృత్తి, ఆనందవృత్తి. 'నాకేమియు తెలియదు. గాఢముగా నిద్ర పట్టెను'-అనునెడ విషయమునకు విలయము కలిగెను - ఇది నిర్విశేషమగు అవిద్యయొక్క ప్రకాశము. ఇది గాక ఈ జ్ఞానమునందు సాక్షిభావమున్నది. విషయ రాహిత్యము కలదు గాన, ఆనందము కలదనవలెను. విషయముండదు

గాన చిత్తము క్రియాశీలముకాదు-ఇటులగుటజేసి చిత్తమునందు ప్రతిఫలించిన తత్త్వము అఖండ రూపముగా స్ఫూర్తినొందును. ఇది సమ్యక్‌స్ఫూర్తి కాకున్నను తత్తాదృశరూపముగా ఉద్గమించిన ఆనందము.

మాండూక్యమునందు జాగ్రచ్చేతన స్థూలభుక్కనియు, స్వప్నచేతన ప్రవివిక్త భుక్కనియు, సుషుప్తిచేతన ఆనందభుక్కనియు చెప్పబడెను. ఒకటి స్థూల ప్రపంచ జ్ఞానము-ఇంకొకటి సూక్ష్మ ప్రపంచ జ్ఞానము-వేఱొకటి కారణ ప్రపంచ జ్ఞానము. ఒకదాని ఉపాదానము స్థూలవస్తువు; రెండవదాని ఉపాదానము సంస్కారము, మూడవదాని ఉపాదానము అవిద్య. ఈ విశ్వమంతయు సమష్టి గాన జాగ్రదవస్థలో సమష్టి, స్థూల విశ్వము ఒక సమష్టి చేతనచే ఉద్భాసిత మగుచున్నది.

ఇచట చేతన సమష్టి స్థూల జగత్తునం దనుస్యూతమై స్థూల విశ్వమును ప్రకాశింపజేయును. ఈ రీతిగనే సూక్ష్మ ప్రపంచమునందు సమష్టి సంస్కార జ్ఞానము సమష్టి సూక్ష్మచేతనచే ఉద్భాసితము. సమష్టిగత కారణ చేతనచే సుషుప్త ప్రపంచము ఉద్భాసింపజేయబడుచున్నది. జ్ఞానమునకు ఈ మూడు తావులందును విషయము కలదు. అది స్థూలము, సూక్ష్మము, మఱి కారణము. సుషుప్తిలో జ్ఞానమున కెట్టి విశిష్ట విషయము లేకున్నను నిర్విశేషమగు అవిద్యయే విషయము. సవిశేషమనియు, నిర్విశేషమనియు అవిద్యకు రెండు రూపములు. స్థూల సూక్ష్మ ప్రపంచములందు సవిశేష రూపమును, నిర్విశేష రూపము కారణ ప్రపంచమునందును మూర్తమైయున్నది. ఇది సక్రియము కాగనే దీనికెట్టి మూర్తరూపము (Concrete)ను ఉండదు. కార్య ప్రపంచమున సృష్టిలో అవిద్య మూర్తరూపముతో ప్రకాశమొందును. కారణ ప్రపంచమున నిర్విశేషమగు ఉపాధిగాని యుండును. ఈ భూమికలోని చేతన ఆనంద భుక్కని చెప్పబడెను. విషయ పరిచ్ఛిన్నత నుండి తొలగుటయే యిచటి ఆనందావ భాసత. విషయాకారమగు వృత్తినుండి వేరగుటజేసియే ఇచట అమూర్తమగు ఆనంద సంవేదన స్ఫురితియున్నది. కాని అవిద్యకు సంపూర్ణతిరోధానములేదు. కావున ఈ భూమికలో పూర్ణజ్ఞానమునకుగాని పూర్ణానందమునకు గాని వికాసములేదు.

ఈ మూడును గాక తురీయమగు వేఱొక యవస్థ కలదు. ఈ భూమిలో జ్ఞానమునకు విషయమేమియు లేదు. జ్ఞానమే కలదు. నిర్విషయమగు ఈ జ్ఞానమే చరమ స్థితి. ఇది సంపూర్ణముగా నొకానొక స్వతంత్రావస్థ. విషయ–విషయి–బోధము ఇందేమియు ఉండదు. ఈ యవస్థ అభయము, అశోకము. సాధకుఁడు దీన తృప్తి గనును, సమాహితుడగును. ఈ భూమి జీవత్వము యొక్క వ్యష్టిత్వమును, ఏనాటికిని లేకుండ తుడిచివైచును. సుషుప్తిలో విషయ జ్ఞానముండదు. ఇచటను ఉండదు. సుషుప్తిలో విషయ మేదియు లేదను జ్ఞాన ముండును. ఇందు నదియు నుండదు. సుషుప్తి కంటె తురీయమునకు ఇచటనే భేదము. సుషుప్తిలో అవిద్యా వృత్తి ఉండుననియు, తురీయమునం దేవృత్తియు నుండదనియు ఎఱుక గలవారు చెప్పుదురు. వేదాంత భాషలో చెప్పినచో-'జాగ్రత్ స్వప్నములందు అవిద్య విశేషాకారముగను సుషుప్తియందు నిరాకారముగను భాసించును' అని చెప్పఁదగును. తురీయమునందు సవిశేషా విద్యగాని నిర్విశేషా విద్యగాని ఉండదు. ఆత్మ జ్యోతియే అచట వెలుగుచుండును. ఛాందోగ్యమున ఇంద్ర విరోచన సంవాదమున ఇది వివేచింపబడెను.

బృహదారణ్యకమున ఆత్మజ్యోతిని గూర్చి యీ ఉపాఖ్యానము చెప్పబడెను–

జనకుడు : జీవుఁడు ఏ వెలుగును సాయముగాఁ గొని కార్యములు నిర్వహించుకొనును ?

యాజ్ఞవల్క్యు : సూర్యుని వెలుఁగు.

జనకుడు : సూర్యుని వెలుఁగు ఆకాశమున లేనపుడు ?

యాజ్ఞవల్క్యు : చంద్రుని సాయమున.

జనకుడు : అదియు లేనపుడు ?

యాజ్ఞవల్క్యు : ఆత్మజ్యోతిచే అపుడు విశ్వము వెలుఁగును.

ఆత్మజ్ఞానమే అన్ని జ్ఞానములకును ఆధారమని యీ సంభాషణమునకు తాత్పర్యము. అన్ని భూమిక లందును ఈ యాత్మజ్ఞానము ప్రతిబింబితమగుట చేసియే జాగ్రదాదుల జ్ఞానము మనకు విడివిడిగా కలుగుచున్నది. అన్ని

జ్ఞానములును ఆత్మనుబట్టియే కలుగుచున్నవి. కాని ఆత్మజ్ఞానమునకో దేని అపేక్షయు లేదు. అది స్వయంజ్యోతి.

## ఉపనిషత్తులలో ఆత్మ స్వరూపము

### ఆ త్మ స్వ రూ ప ము

జీవాత్మకును పరమాత్మకును భేదములేదని ఉపనిషదాశయము. ఉపనిషద్భాషలో– 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' అని ఆత్మస్వరూపము.

ఉపనిషదుక్తమగు ఈ సాక్షిరూపము అనుభవముచే లెస్స తెలిసికొనవలసియుండును. ఉపనిషత్తుల విద్యాసాధనను సిద్ధిని ఏతదనుభవము మోసియున్నది. సాక్షి ఉదాసీనుడైన ద్రష్ట. అతనికి క్రియలేదు, జ్ఞానము కలదు. అన్ని తెగల జ్ఞానమునకును సాక్షి కలదు, సాక్షి జ్ఞాన స్వరూపుడు. జాగ్రదాదుల మూటను సాక్షి కలడు. ఒకటి విషయ ప్రకాశము, విషయ భోగము కల అవస్థ. మఱియొకటి విషయముల యెడ ఔదాసీన్యము. విషయముల భోగించు జ్ఞానము సాక్షి కాదు. ఏ భోగమును భుజింపక చూచుచుండునది సాక్షి. చూచుట క్రియ కాదా ? అని నీ వడుగ వచ్చును. చూచుటయు ఒక క్రియయే కాని అనుభవింపక చూచుట క్రియ కాదు. 'పశ్యన్ స్వపన్' అని గీత చెప్పెనే అని యందువా, నిక్కమే. చెప్పెను. కాని అది భోగముగల చూపు. ఈ చూచుటలో భోగము లేదు. నిక్కమున కది ఒక ఉనికి. ఆ చూపు నీ కలవడుచో అది క్రియ కాదని నీవు చెప్పగలవు. చూచు ధాతువున కిట్టి యర్థము లేకపోవుట సామాన్యదృష్టిలో. సామాన్యదృష్టి దురదృష్టమూ–విషయములతో ఎట్టి సంగమును కలుగకపోవుట వలననే సాక్షి చైతన్య మఖిలావస్థల యందును ఏకాకారమగు జ్ఞానము.

ఉపనిషత్తుల యందు సాక్షిని గురించి ఉన్నమాటలు కడుఁగొలఁది. ఐనను తత్స్వరూపము బ్రహ్మమను నింగిత మెల్లయెడలను గలదు. ఈ సాక్షి చైతన్యము నధిగమించినచో ఉపనిషత్తులు చెప్పిన విద్యలు సిద్ధింపగల దారి దొరకగలదు.

# సత్యజ్ఞానానంద - బ్రహ్మము

సత్తాయొక్క రూప మానంద రూపము. ఉపనిషత్తులలో ఇది తుది మాట. తొలి చూపులో బ్రహ్మసత్తా రూపముతో అనగా ఉనికిగా (Existence) ప్రతీత మగును. అన్నిటికీ మొదటి అవిభక్తమగు సత్త లేక ఉనికి. విభక్త సత్త అపూర్ణ రూపము. అవిభక్త సత్త సత్య రూపము. అనవచ్ఛిన్నమగు సత్త యనగా బాధితము కాని స్థితి. స్థితి రూపము సత్తా ప్రధాన లక్షణము. కాని యీ సత్త కేవలము స్థితి రూపమే కాదు- ఇది సంచార శూన్యమగు జ్ఞానము ఆనందమును- ఎట చైతన్యానందముల సంచారమో అట సత్యము కేంద్రమై స్ఫురించును. కేంద్రస్థమగు సత్త నవలంబించియే జ్ఞానానందముల సంచార వికాసమునను సంభవము. ఇది సృష్టి ప్రాథమిక క్షణము. సృష్టికి అర్థము—సత్త కేంద్రమందునికియు శక్తికి మూర్తమగు వికాసమును. కాని సృష్టికి వెనుక సత్త అఖండము, అవిభక్తము. అపుడు జ్ఞానానందముల సంచారము లేదు. అపుడు స్పందశూన్యములగు జ్ఞానానందములు సత్తా స్వరూపముగనే యుండును. ఉద్వేలము కాని నిర్విశేషదీప్తియు ప్రసారము మాత్రమే అప్పటి స్థితి. దీప్తి జ్ఞానసూచకము. ప్రసారమానంద సూచకము. ఆవరణ శూన్యత్వమే ఆనంద స్వరూపము. ఆనంద సంవేదన మిపుడుండదు. సంవేద శూన్యమగు ఆనందమే ఆనంద స్వరూపము, ఇట్టి ఆనందము సత్తాకు మారుపేరు. ఉద్వేలానంద మిపుడుండెను. అపుడు శాశ్వతానందము. సంచార శూన్యమగు నానందము బ్రహ్మనందము.

అఖండ సత్తా జ్ఞానము నిరుపాధికము. దీప్తి రూపమగు జ్ఞానమునకు స్ఫూర్తి లేదు. విషయము లేదు. ప్రజ్ఞా స్వరూపముగా ప్రజ్ఞాలోకమునకు ప్రభ లేదు. స్థూల సూక్ష్మ లోకముల ఆలోక స్పందములేదు. ఏ ప్రజ్ఞాలహరీ మాలికచే విశ్వమును సూక్ష్మ విశ్వమును ఉద్భాసితమో, దేనిచే ఋతము ధృతమో అది ప్రజ్ఞాతీతము. అది ప్రజ్ఞారూపము. నిర్మలమును ఆర్ద్రమునగు నీజోది ప్రజ్ఞాన ఘనము. స్పందన రహితమగు ప్రజ్ఞయే బ్రహ్మజ్ఞానము. బ్రహ్మ జ్ఞాన రూపమనినపుడు దాని ప్రకాశరూపమే మనకు తట్టును. ఆనంద రూపమన్నపుడు "శివమ్ సుందరమ్" తట్టును. నిర్ముక్తమును నిరావరణమునగు ప్రకాశము పరమ సుందరము.

# పరమ కారణ సత్త

ఛాందోగ్యమున ఈ దిగువ కథ కలదు– అనగా అనగా ఆరుణి అను ఋషి ఉన్నాడు. ఆయన కొడుకు శ్వేతకేతువు. శ్వేతకేతువు చదువు ముగించుకొని, గురువుకడ సెలవు తీసికొని ఇంటికి వచ్చెను. ఇటులు వచ్చిన కుమారుని జూచి ఆరుణి– "నాయనా! దేనిని తెలిసికొనిన యెడల సర్వమును దెలియునో దానిని తెలిసికొని వచ్చితివా ?" అని అడిగెను. కొడుకు– 'లేదు' అని తెల్ల బోయెను. అది గని తండ్రి– "నాయనా! వినుము! కుండ మొదలగు కార్యములు తమకు కారణమగు మన్ను మొదలగు వానికంటె వేఱుకావు. కారణాకారము కంటె కార్యాకారము వేఱుగా నుండుటచే మన్ను వేఱు–కుండ వేఱు– అనగా కార్యము వేఱు, కారణము వేఱు అని తోచునే కాని నిజమునకు కారణము కంటె కార్యమునకు వేఱు సత్తలేదు. కావున వికారము, అనగా మార్పు నిక్కము కాదు, కారణమే మన్నే నిక్కము. ఇటులే కారణము. మురుగు, గొలుసు, ఉంగరము ఈ మొదలగునవి కార్యములు. బంగారమను కారణము యొక్క వికారము లీ కార్యములు. బంగారమే సత్యవస్తువు. మురుగు మొదలగునవి వికారము. అది అసత్యము." అని కార్యకారణ దృష్టి నవలంబించి దృష్టాంతము చూపి దార్ష్టాంతిక మిటులు నిగమించెను – ప్రపంచము కార్యము – బ్రహ్మము కారణము. ప్రపంచము బ్రహ్మము యొక్కయే కార్యము.

## పరమ కారణ

నామ రూపక్రియలు దీని కార్య రూపములు. దీనికి కారణరూపము బ్రహ్మము. ఈ నామ రూపక్రియలు వికార మాత్రము. కారణము కార్యమున చొచ్చుటయే సృష్టి. సృష్టికి బ్రహ్మముకంటె వేఱు కారణము లేదు. కావుననే బ్రహ్మ మద్వితీయము.

కారణములు పెక్కు లుండును. అందు ఉపాదానము, నిమిత్తము అనునవి ముఖ్యములు. కుండకు మన్నుపాదాన కారణము. కుమ్మరి నిమిత్త కారణము. ఉపాదానకారణమగు మట్టి నటుకొట్టి యిటుకొట్టి కుమ్మరి దానికి సబ్బందు రూపములు కలుగజేసి కుండలను కడవలను దాకలను బానలను మూకుడులను మల్ల

చిప్పల నింకెన్నిటినో మన యెదుట బెట్టును. జగత్ సృష్టిలో ఉపనిషత్తెన్న డును రెండు పదార్థముల జెప్పదు. బ్రహ్మ భిన్నముగా ప్రపంచమునకు వేఱు కారణములేదు; బ్రహ్మమే ఉపాదానము, నిమిత్తమును. ప్రపంచము బ్రహ్మమునకు వివర్తము. అతడు ప్రపంచమును సృజించి, ప్రపంచములోనున్నను అతని స్వరూపమునకు పరిణామము లేక మార్పులేదు. సృష్టిలో నతడు పెక్కురూపములతో భాసించినను అతని స్వరూపమునకు విచ్యుతి లేదు. సృష్టికిముం దతడెటులుండెనో సృష్టికి పిదపను అతడటులే యుండును. అతని స్వరూపమునకు ఎట్టి మార్పును ఉండదు. స్వభావముగా అతడొక్కడును ముత్తెగలగు భేదము లేనివాడయ్యును సృష్టిలో అనంత రూపములతో ప్రకాశించును. గార్గి-యాజ్ఞవల్క్య సంవాదమున ఇది ఇంకను విస్పష్టమాయెను. గార్గి బ్రహ్మజిజ్ఞాసువై జనకుని సభకు జని యిటులు సూక్ష్మసత్తావతరణిక చేసెను- కారణసత్త కార్యసత్తకంటె సూక్ష్మమును, వ్యాపకమును. ఎటులన, కుండ కార్యము; మన్ను కారణము. ఈ కారణము కుండ కంటె సూక్ష్మము వ్యాపకము. నేలకు కారణము. నీరు, నీటికి కారణము నిప్పు, నిప్పునకు కారణము గాలి, గాలికి కారణము నింగి. ఇటులు కారణ సత్తను వెతకికొనుచు బోవుచో సూక్ష్మముకేసి వ్యాపకముకేసి పోవుదము. గార్గి యిటులు పోయి- 'నింగి ఎటనున్నది ?' అని యాజ్ఞవల్క్యు నడిగెను, యాజ్ఞ వల్క్యు డింకను సూక్ష్మతర లోకముల నెత్తుకొని- నింగి గంధర్వలోకముచేతను, అది ఆదిత్యలోకము చేతను, అది నక్షత్రలోకము చేతను, అది దేవలోకముచేతను, అది ఇంద్రలోకము చేతను, అది ప్రజాపతిలోకము చేతను, అది బ్రహ్మలోకము చేతను వ్యాప్తమైయున్నదని జెప్పెను. కాగా బ్రహ్మలోకము పరమసూక్ష్మ మన్నమాట! అపుడు గార్గి- 'ఆ బ్రహ్మలోకము ఎచట?' అని అడుగగా, యాజ్ఞవల్క్యుడు- 'ఆ ప్రశ్న చేయవలదు' అని అనెను. అనగా కారణబ్రహ్మము కార్యాకారణ శృంఖలకు అతీతము.

ఇపుడు 'బ్రహ్మము పూర్ణమయ్యు ప్రపంచమును సృజించునేమి ?' అనియు, 'ఒక డయ్యు బహురూపములతో ప్రకాశించునేమి ?' అనియు, వేఱొక తరహా ప్రశ్న రాగలదు. దీని కిది జవాబు-బ్రహ్మమున కొక శక్తి యున్నది. దాని పేరు మాయ. దాని నవలంబించి అత డొక డయ్యును బహురూపి-'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే!

## ఉపనిషత్తులలో మాయ

సృజించు శక్తి మాయ. ఈశ్వరు డీశక్తి నవష్టంబించియే సృజించును. ఏ శక్తిచే పరిపూర్ణములో ఖండము కలుగునో, అసీమములో సీమ కలుగునో ఆ శక్తియే మాయ. అసీమమునందు సీమప్రకాశమే సృష్టి. దేశ కాలములు లేని వస్తువు దేశ కాలములలోనుండి వికసించుట సృష్టి. ఈ శక్తి విశ్వమునకును, ఈ శక్తికి ఈశ్వరుడును కారణము గావున ఈశ్వరుడు పరమ కారణము. శక్తి అతని చేతనచే విధృతమై సృజించును. దానజేసి సృష్టిలో ఆనందము మిలమిల లాడుచున్నది. సృష్టి అయినందువల్ల ఆనందమున కించుకయు స్వరూపచ్యుతి కలుగకపోగా, పై పెచ్చు లది ఆనందము లగు రూపములతో స్ఫురించును. ఆనందము యొక్కయే సంచార మీ సృష్టి. ఏక రూపమగు తత్త్వమును అనంత రూపముగా చూపించు శక్తి కడు విస్మయకరము. సృష్టి బ్రహ్మసృష్టియొక్క కౌతుక క్రీడ. ఆనంద సంచారముకన్న వేరుగా, అంతరున్మేషముకన్న భిన్నముగా ఈ సృష్టికి కారణము లేదు, ఉండుటకును వీలులేదు. అనంతమగు వస్తువును బ్రహ్మాండముగా పిండాండముగా చూపుట మాయయొక్క ఖేల... లేక లీల. లీలయొక్క కౌతుకమయమగు శక్తియే మాయ. దీని స్వరూపము రహోగర్భము. నిండును, ఖండముగా చూపు శక్తి బుద్ధికి విస్మయకరము. మాయదే ఈ పని. ఈ రహస్య మెన్నటికిని విస్మయావృతమే.

స్వస్వరూపముచే బ్రహ్మము పరిపూర్ణమయినను, దానిలోపల విశ్వ వికాసమునకు సంచారము కలదు. ఇట్టి సంచారమువలన అత డే యుపకరణమును లేకయే సృష్టి యొనరించును. అత డొక పెడ ఎంత శాంతుడో, ఇంకొక పెడ సకల క్రియలకును సకల శక్తులకును ఆశ్రయుడు. శాంతస్థితిలో గతిస్ఫూర్తి. ఘనీభూతమగు సత్తులో ఆనంతమగు మూర్తి ప్రకాశము. బ్రహ్మము శక్తికి అతీతమయ్యు, శక్తికి ఆశ్రయము. మాయ ఈ శక్తి. మాయ నవలంబించి జ్ఞానమునందు రసమునందు శక్తియందు ఆత్మయొక్క విశ్వవిభూతి ప్రకాశము.

## జీవుడు - బ్రహ్మము

ఉపనిషత్తులలో నాలుగు మహా వాక్యములు గలవు. త్రిసత్యమును దెలుపునది మహావాక్యము. జీవబ్రహ్మ సంబంధ మావాక్యము లందున్నది. ఆ

వాక్యము లివి :

"అయ మాత్మా బ్రహ్మ"

"ప్రజ్ఞానం బ్రహ్మ"

"అహం బ్రహ్మాస్మి"

"తత్త్వమసి"

ఇవి నాలుగు వేదములకును సంబంధించిన నాలుగు ఉపనిషత్తు లందలివి.

శ్రుతి వాక్యములను వివేచించి జీవ, బ్రహ్మ సంబంధము నెఱిగికొనవలయును. జీవ స్వరూపమును, ఈశ్వర స్వరూపమును సాధారణముగా చెప్పునప్పుడు జీవు డల్పజ్ఞుడనియు, ఈశ్వరుడు సర్వజ్ఞుడనియు చెప్పుదురు. జీవుడు వ్యష్టి చైతన్యము. ఈశ్వరుడు సమష్టి చైతన్యము. ఈశ్వరు డీ జగత్స్రష్ట. సృష్టికి పూర్వము సత్తు ఒక్కటి కలదు. అది అద్వితీయము. సృష్టికి కొండొక పదార్థముతో పనిలేదు. ఉపనిషత్తులు జీవు డీశ్వరుని కంటె భిన్నుడని పలుచోటుల చెప్పినను ఆత్మ పరమాత్మ స్వరూపమని మహావాక్యముల తాత్పర్యము.

మహావాక్యముల అర్థము పరిష్కరింప లగ్గు. జీవు డల్పజ్ఞుడు. అతనికి వేదనయు జ్ఞానమును క్రియాశక్తియు గలవు. ఇవి అతని 'నేను' అను ఎఱుక లోపలనుండియే ప్రకాశించును. "నేను జ్ఞానము కలవాడను. నేను కర్తను" అను ఈ జ్ఞానమే అతని ప్రకృత స్వరూపము. ఇచ్ఛా జ్ఞాన క్రియలు మూడును అతని ఈ 'నేను' అను జ్ఞానము నవలంబించియే యుండును. ఈ 'నేను' అనునది ఏమి? అనియే ప్రకృతము ప్రశ్న. మఱియు ఈ 'నేను' అను జ్ఞానము వేఱు వేఱు అవస్థలలో ఎటులు ప్రకాశము పడయునో దానిని పరిశీలింపవలయును.

జీవత్వము మన కారోపితము. ఇది కొన్ని అవస్థలలో ఉండదు. కొన్ని అవస్థలలో ఉండును. ఆరోపితమగు ఈ జీవత్వమును బట్టియే ఈశ్వర సంబంధ ముత్థితమగును. ఏలనగా వ్యక్తిత్వమునుబట్టి సంబంధ మేర్పడును. దానంజేసి యీశ్వరునకును జీవునకును గల వ్యక్తిత్వము మనకు స్ఫురించినపుడే జీవేశ్వర సంబంధము ఉద్బుద్ధమగును. వ్యక్తిత్వము దర్శనములందు అనేక లక్ష్యముల

నుండి విసృష్టమైనది. ఏలనగా వ్యక్తిత్వము నవలంబించియే మన వ్యవహారము నడచును. కాగా జీవునితో విరాడ్ వ్యక్తియగు నీశ్వరునితో సంబంధము విచార్యము. ఉపనిషత్తులం దీవ్యక్తి బోధము స్వీకరింపబడెను కలలో, మెలకువలో. కావుననే ఈ రెండవస్థలనుబట్టి ఈశ్వరునకును వ్యక్తి బోధ మున్నదన్నమాట. వ్యష్టి సమష్టి చేతనలనుబట్టియే జీవేశ్వరభేదము. ఈ రెండు తావులను వ్యష్టిత్వము నవలంబించియే జీవునితో ఈశ్వరుని సంబంధము చూపబడెను. ఈశ్వరు డంతర్యామి యనియు ఒకచో కలదు. దీనివలన ఈశ్వరసత్త మనలో అనుస్యూతమై యున్నదని తెలుచున్నది. కలలో సూక్ష్మ ప్రపంచమున విహరింతుము. ఇచట సమష్టి చేతనము, సమష్టి స్వప్నమున కధిష్ఠాత! జ్ఞాన ప్రసారముచే చైతన్యముయొక్క శక్తులన్నిటితోడను, ఐశ్వర్యముల తోడను మనకు పరిచయము కలుగును. ఇది ప్రత్యక్ష పరిచయము. ఉపనిషత్తులందు అనేకోపాసనముల ప్రసక్తియున్నను వాని లక్ష్యము మాత్రము జీవబ్రహ్మముల అభేదము. అభిన్నత నెలకొలిపియే ఉపాసన ఆరంభింపవలెను. ఉపనిషత్తు భేద బుద్ధి నియ్యకొనదు.

ఇటీవలి ఆచార్యులు జీవబ్రహ్మ సంబంధమును పెక్కువిధముల వ్యాఖ్యానించిరి. ఐనను ఈ సంబంధ నిర్ణయము ముక్కట మూడు తెఱగులని మనము వారిని చూచాయగా తెలిసికొందము.

మధ్వముని జీవేశ్వరులు అత్యంత భిన్నులని, విషయి విషయతల, గుణి గుణత్వముల, జ్ఞాతృజ్ఞేయత్వముల భేదమొప్పెను. ఈ మతమున జీవబ్రహ్మములందు నిత్యభేదము. ఈ భేదమెన్నటికిని పోదు. అతని మతమున జ్ఞానదృష్టిచే రెండు వస్తువులు వేరు. అవి విడివిడిగనే ఉండును.

రామానుజులు భేదాభేదము నొప్పిరి. వారి మతమున భేదాభేదములు పరస్పర సంబంధములు. అభేదమునందు భేదముండును. భేద మభేదము యొక్కయే ఏదోయొక విశేషభావమునో రూపమునో వ్యక్తము చేయును. భేదమభేదముతో కలిసియుండును. భేదాభేదవాదులు జీవు డీశ్వరునికంటె అత్యంత భిన్నుడని కాని అభిన్నుడని కాని అనరు. వారి మతమున ఈశ్వరుడు అంగి. జీవు డతని కంగము– 'మ మైవాంశో జీవలోకః.' భేదాభేదవాదుల మతమున జీవేశ్వరు లిరు

వురును పృథగ్రూపముగా గాక అపృథ గ్రూపముగా సత్యము. బ్రహ్మము అవయవి-జీవు డవయవము.

శంకరు లభేదము నంగీకరింతురు. వీరు భేదమునకును అభేదమునకును ఒకచో తావులేదు-భేదాభేదములు విరుద్ధములు. అభేదమునం దెన్నడును భేదముండదు. భేదము ప్రతిభాసమే కాని అభేదమే సత్యము. అభేదవాదులు ఒక అఖండ సత్యముయొక్క మహిమనే ఉద్ఘోషింతురు. ఉపనిషత్తులందు జీవేశ్వరుల మాట ఉన్నను ఆ యిరువురయు ఏకత్వము ప్రతిపాదిత మయినపుడే పరమ తత్త్వము చెప్పబడినటు లగును. ఈ ఏకత్వము చైతన్యైకత్వము. జీవతత్త్వమును ఈశ్వరతత్త్వమును చైతన్యముయొక్క భిన్నఉపాధులు మాత్రమే. ఈ ఉపాధుల నావల నుంచినచో చైతన్యసత్త ఒక్కటియే ఉండును. ఉపనిషత్తులందు జీవేశ్వరుల నొకటిగా తలపవలయుననుమాట కలదు. శక్తిని బట్టికాదు-స్వరూపమునుబట్టి. భావనాగభీరతచే జీవుని బోధానుభూతి వ్యాపకమగుటజేసి శక్తికి పెద్ద వికాసము కలిగినను అది స్వరూప ప్రకాశముకాదు- కాగా స్వరూపముచే జీవేశ్వరు లొకటి.

## 'త త్త్వ మ సి'

'స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో' అను ఛాందోగ్య మహావాక్యమున 'ఆత్మా + అతత్త్వం + అసి' అని పదచ్ఛేద మొనరించి జీవబ్రహ్మభేదమును ద్వైతులు చెప్పిరి.

తత్త్వమ్ — 'నీవు బ్రహ్మసంబంధివి' అని విశిష్టాద్వైతులు అర్థము చెప్పి, జీవబ్రహ్మములకు ఒక సంబంధము చెప్పిరి. ఆ సంబంధము అంగాంగి భావరూపమగు నిత్యసంబంధము.

'తత్, త్వమ్, అసి=నీవు అతడవు-అనగా బ్రహ్మమవు అని అద్వైతవాదులు చెప్పిరి. దార్శనిక సిద్ధాంతము లెటులున్నను అధ్యాత్మ జీవనమునందీ మహావాక్యములకు గంభీరమగు అర్థము లేకపోలేదు. సంబంధార్థమును నిర్ణయించుపట్ల శాస్త్రీయవిశేష మద్వైతవాదుల కుపకరించునా, ఉపకరింపదా అనునది దర్శనము చెప్పవలసినది. అధ్యాత్మ జీవనానుభూతి సంబంధ మూలకము

కావచ్చును. గాని సంబంధమేదో కలదని యెఱుగుటయే కడపటి యెఱుక కాదు. సంబంధము కలదను నెఱుక మనోబుద్ధులకు విషయము. అధ్యాత్మ జీవనానుభూతి మనోబుద్ధుల కతీతము.

సాధారణముగా పై మూడు వాదములును దార్శనిక మీమాంసా రూపముగా గ్రహింపవచ్చును. కాని వీనికి ఒక ఆధ్యాత్మికానుభూతి అను ద్వారమున్నది. దర్శనములుచేయు మీమాంస యేదియు తత్త్వమును విడబఱచి చూపుటచే తృప్తి చేయలేదు. ఏ మీమాంసయేని ఆధ్యాత్మిక జీవన రహస్య సంబంధమున ఇతర సిద్ధాంతములను ఖండించుటతో తృప్తిపడక సుచింతతమగు ధారణ నొకదానిని ప్రతిష్ఠింపకపోయినచో జీవనము దెస నది కార్యకారి కాదు. ప్రత్యేక జీవనముకంటె విశాలమగు నొకానొక జీవనము దెస, ప్రకృత జ్ఞానముకంటె విశాలమగు నొకానొక జ్ఞానము దెస కెగురవలయునను వ్యాకులత గభీరమగు మానవుని ఉనికినుండి ఉబుకుకొని వచ్చును.

ద్వైతవాదియే యగుగాక విశిష్టాద్వైతవాదియే యగుగాక, అద్వైతవాదియే యగుగాక- వీరందరును విరాడనుభవమే, భూమానుభవమే అధ్యాత్మ జీవనము యొక్క పరమ సంపత్తుగా భావింతురు. కాని యీ ఆస్వాదన మనుభవించు దారి వేరు.

ద్వైతి విరాట్పురుషుని గ్రహించినను జీవుని పరమాత్మనుండి సార్వకాలికముగా పృథక్కరించివేసెను. ముక్త్యవస్థయందును జీవేశ్వరులు వేరేయని ద్వైతి యనును. ఇంతియకాదు. ముక్తి భూమికలో జీవాత్మ పరమాత్మనే ఆస్వాదించినను, జీవాత్మ పరమాత్మకంటె భిన్నుడని అతడనును. వీరి మతమున ప్రతి జీవునికిని ఒకొక్క జగత్తు కలదు. తద్భావానుయాయి యగు పరమాత్మనే వారు గ్రహణము చేయుదురు. జీవుడు పరమాత్మానుభవమువల్ల కలిగిన సుఖమునకును కల్యాణమునకును ఆశ్రయుడయినను జీవభేదము ఉండియే పోవును.

విశిష్టాద్వైతి విరాట్ చైతన్య సత్తను ఆనందానుభూతిని అధ్యాత్మ జీవనమున పరమ వస్తువుగా గ్రహించి యీశ్వరుని నికట సంబంధమును జీవుని కంగీక

రించెను. అధ్యాత్మజీవనమున జీవుడు విరాడనుభూతి నందుటమాత్రమే కాక ప్రియరూపముగా ఆస్వాదించును. ఈ ప్రియభావనయే ఆనందమును అధ్యాత్మ జీవనమునకు ఉత్కర్షమును ఇచ్చును. సంబంధ బోధము జ్ఞానమును, ప్రియ బోధ మానందము నిచ్చును. ఈ ప్రియబోధము ఆత్మీయతను నెలకొలుపును. ఆత్మభావము నెలకొనుచో ప్రియభావ సంచారము కలుగును. పరమాత్మయం దాత్మభావము దృఢమగుకొలఁది ప్రియభావము లేక రతి అంతగాఢమగును. ఈ ప్రీతి, ఈ రతి అధ్యాత్మ జీవన స్వరూపము.

ద్వైత విశిష్టాద్వైతము లందీ మమత్వభావము అధ్యాత్మ జీవన మూలము నం దున్నను భేదజ్ఞానము నొక్కమాఱుగా తీసివేయజాలదు. ద్వైతియు పర మాత్మయెడ ప్రియబోధమును నెలకొలుపుకొన్నను జీవుని భిన్నరూపునిగనే-సేవకునిగనే తలంచును. కాని యీ సేవ్య సేవక భావములోగూడ ఒక ఏక త్వము కలదనియు దానినీ అవలంబించి, ఆ సేవ్య సేవక భావములోపల రసా నందముల సంచారము కలదనియు ఆత డారయఁడు.

విశిష్టాద్వైతి యీ ప్రేమసూత్రము పట్టుకొని యీశ్వరునితో ఐక్యము నెలకొలుపుకొనును. అతడు ప్రియుఁడా? అగుచో ఆ ప్రియునిలో 'నన్నే' వడసికొందును. అతడు ఈశ్వరుడా? ఎవరికి? నాకు. అగుచో అతడును నాలో 'తన్నే' చూడబడయును. ప్రియభావన ఈ రెంటిని ఇటు లైక్యమొనరించును. ఈ రెంటిలో ఏకత్వబుద్ధి నెలకొననిచో ప్రియభావన పరిపూర్ణముకాదు. అధ్యాత్మ జీవనము భేదము నతిక్రమించియే నడవగోరును. ఏలన, భేదము దూరత్వమును సృజించును. మరి అధ్యాత్మ జీవనమో దూరత్వమును దూరీకరించును. ఈ యైక్యమే అధ్యాత్మ జీవనమునకు పునాది. ఈ పరతత్వము ప్రియమని బోధ పడనిదే సాయుజ్యమబ్బదు. సాయుజ్యమనగా కేవలము సంబంధముకాదు. దానిలో ఏకాత్మ భావసంచారము కలదు. భేదముండుటవల్లనే ప్రియుని బడయు నావేగము శక్తి సంచారద్వారమున జీవునం దీశ్వరుని విరాడ్రూపము వికసించును. కాని పూర్ణముగా ఈశ్వరుని పరమ సత్తైక్యము కలుగదు.

ఈశ్వరానుభూతి రససముద్రము. జీవుడీ రసము గ్రోలును. రస మనుభ వించి రసాభిన్నత చెందును. ఆదాన ప్రదానము లానంద యజ్ఞమునందలి రీతి.

ఈ విశ్వము ఆనంద స్ఫూర్తిచే పూర్ణము. ఈ ఆనంద యజ్ఞమునం దాత్మసమర్పణ మొనరించి ఈశ్వర సారూప్య మొందిననే జీవునకు పరమశాంతి. ఈ యానందయజ్ఞము విశ్వయజ్ఞము-"విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్"- జీవు డిందు తన అల్పత్వమును దేశకాలముల ఎల్లలను దాటును. విశ్వబోధముచే ఈశ్వరునకు యంత్రమై విశ్వయజ్ఞము నుద్యాపన మొనరించును. ఈ ఘట్టము దాఁటుపై విశ్వాతీత యజ్ఞమున జీవన్ముక్తుడయ్యీ ఈశ్వరుని సేవాసుఖములకుఁ బట్టగును. విశ్వయజ్ఞమునకు కాలమున్నది. విశ్వాతీత యజ్ఞమున ఆనందోత్సవమున కాల మనునది లేదు. అది సార్వకాలికానందము. కాలమన ఒకటి యెరుగని ఆనందము. 'ఈశ్వరునికంటె నేను వేఱు' అను భేదబోధ ఏకకాలమునందును తెలియని శక్త్యావేగ మీ యానందమున ఇంత గంభీరము. శక్త్యావేగముచే గాని ప్రేమావేగముచేగాని యీ ఆనంద ముదయించును గాని అది క్షణికము. ఏలనఁగా విశిష్టాద్వైతులు గాని (శాక్తులుగాని) తత్త్వములో జీవబ్రహ్మ భేదము పాటింపరు. తత్త్వములోనే భేదము. లేనిచో అపుడు ప్రేమ ఏ పనియు చేయజాలదు. అది యటుండె. విశ్వాతీతావస్థలో జ్ఞానదృష్టికి ఒక మహాసమన్వయము స్ఫురించును.

విశిష్టాద్వైతమునకు అద్వైతమునకును ఇచటనే భేదము. 'ప్రేమకు ఉపజీవ్య మానందము. ఆనందమే రసము' అని అద్వైతమనును. ఆత్మ ఆనంద స్వరూపము. ప్రేమకు ఆత్మకేసి స్వాభావికగతి. అందఱిలోనూ ఈ ఆత్మబోధ స్ఫురణము కలదు. కావున అందఱును (ఆత్మ) ప్రియులు ఆత్మబోధము, తుదకు ఈ ఆత్మబోధగంధ మెచట లేదో అచట ప్రియభావమునులేదు. అద్వైతమునం దాత్మప్రియత్వము ఏటులు స్వీకరింపఁబడెనో ఇతర వాదములం దటులు స్వీకరింపబడలేదు. ఆత్మ పరమాత్మతో అభిన్నుడు. మఱియు అతనిదే స్వరూపము. అద్వైత వాదమున ఈ అభిన్నావస్థయే ఆనంద స్వరూపావస్థ, నిరుపాధికావస్థ. నిరుపాధి కానందమున ప్రీతి స్వాభావికము. అది ప్రీతికి గల సత్య స్వరూపము.

'తత్త్వమసి' — అను మహావాక్యము చెప్పు అభిన్నత సత్తాపేక్షమును, స్వరూపాపేక్షమునుకాక శక్త్యపేక్షమని తాంత్రికులందురు. దీనికి శక్త్యద్వైతమని పేరు. జీవుని యిచ్ఛను ఈశ్వరేచ్ఛతో కలిపి శక్తిపూర్ణ నొనరించుటయే శక్త్య

ద్వైతలక్ష్యము. ఉపనిషద్భాషలోనిది "అహంగ్రహోపాసనము." ఈశ్వరుని ఇచ్ఛాశక్తుల నాకర్షించి జీవునే పరిపుష్టుని చేయుట ఇందలి ఉద్దేశము. ఇందు జీవుని వ్యక్తిత్వము ఈశ్వరునందు లయమొనరించుట కాదు. కాని జీవేచ్ఛ యీశ్వరేచ్ఛతో అభిన్నము చేయుట. దీనికి ఫలమేమనగా జీవుడు నానాశక్తులతో పరిపూర్ణుడగును. అహంగ్రహోపాస్తి శక్తినిచ్చి యీశ్వరశక్తితో ఐక్యము కలిగించును. ప్రేమ ఆనందముతో ఐక్యమును, జ్ఞానము సచ్చిత్తులతో ఐక్యమును సంపాదించును. జ్ఞానము, ఇచ్ఛ, ప్రేమము. వీనికి బ్రహ్మానుభూతి దెసకే స్వాభావిక గతి. ఇచ్ఛకు ఈశ్వరేచ్ఛతో ఐక్యము కలిగినంతనే కృతార్థత. ప్రేమకు బ్రహ్మానందము పుష్టి. జ్ఞానమునకు అపరిచ్ఛిన్నమగు సత్తానుభూతితో సామగ్ర్యము. ఈ అనుభూతులన్నిటకిని తారతమ్యము కలదు. నిస్తరంగమగు బ్రహ్మసత్త క్రియాశీలము కాదు. గనుక ఆ భూమికలో ఇచ్ఛకు క్రీడయుండదు. ప్రేమకును ఇచట వికాసముండదు. ఒకవేళ ఉండినను అది నిరుపాధికము. ఇచ్ఛాప్రేమల వికాసము సగుణ భూమికయందే. ఈ భిన్న ప్రకారములగు అభిన్నత్వము "తత్త్వమసి"లో నిహితమైయున్నది. కాని సగుణమున జీవేశ్వరులకు అభేదము సంభవింపదు. కాన ఈ మహావాక్యము నిర్గుణ ద్యోతకముగా గ్రహింపబడెను. మన సత్త లేక ఉనికి లోలోపల నిండువెలుఁగు పడయుటకు అంతర్నిహితమగు ప్రేరణ యొందున్నది. దీనివల్ల ఈశ్వర భూమికయు బ్రహ్మభూమికయు దొరకును. మఱియు ఉనికి నిండుగా జాగరిల్లును. అనగా తానెవరో తనకు నిక్కముగా తెలియును. కాని ఆ ఎఱుక చివరమెట్టు; అద్వైతజ్ఞానము. ఏలన జీవుని ఆవరణమునకు ఇచటనే శేషము. అప్రతిహతమగు నిచ్ఛయు ప్రేమస్ఫూర్తియు విశ్వజ్ఞానము. ఇవియన్నియు ఒక యెల్లలో తిరుగు జీవసంవేగమునుండి తొలగిపోవునుగాని అప్పటికిని జీవత్వసీమ ఉండనే యుండును. జీవత్వ మెంతయేని పరిపుష్టి చెందుగాక, దాని యల్పత మాత్ర మొసరిల్లదు. జీవుడు తన నిరుపాధిక స్వరూపమునందు నెలకొననిదే జీవత్వము పోదు. స్వరూపజ్ఞానమునందే స్వరూపస్థితియందే జీవన కల్లోల మడగును. అపుడు మేఘముక్తమగు ఆకాశము మాడ్కి బంధనముక్తమగు ఆత్మ నిజమహిమమందు నెలకొనును. ఇది శూన్యముకాదు, పూర్ణముకాదు – ఈ రెంటికిని అతీతము – శాంతమ్ శివమ్ అద్వైతమ్.

# దహరోపాసన

**ఈ** ఉపాస్తియందు సాధకుడు హృదయ గుహలో నుండును - హృది హ్యేష ఆత్మా.' అనగా దహరాకాశమున మనస్సును లగ్న మొనరించి 'నేను బ్రహ్మ'మను అని ధ్యానింపవలయును. హృదయము ధ్యానమునకు పవిత్రమగు క్షేత్రము. ఇచట ధ్యానము గంభీరమగుచో తత్త్వ ప్రకాశము కలుగును. దీని వలన సంకల్పసిద్ధి యగును. హృదయమును కేంద్రీకరించి ధ్యానము చేయుచో శీఘ్రముగా అఖండమగు నొకానొక తేజస్సు కనబడును. హృదయమనిన మనము హృదయాకాశ మనియే అర్థము చేసికొందుము. ఈ యాకాశమున కెల్లలు లేవు. ధ్యానము గంభీరమగు కొలదిని దీని నైజము మనకు ఉపలబ్ధమగును. ఇంతియ కాదు, ధ్యానము నిరూఢమైనపుడు హృదయ గుహ నుండి సహస్రారమునకు బోవు నాడీరూపమగు నొకానొక దారి కనబడును. సాధకు డీదారినిబడి పోగలుగు నెడల తేజోమయమగు ఒకానొక సత్తను అధిగ మించును. ఇచ్ఛగలుగుచో ఆ దారిని నిష్క్రమించి యీ శరీరమును విడువ గలుగును. ఈ మార్గ మతి సూక్ష్మము. దీని యెఱుక యొదవిన నాడు సాధకుని జ్ఞానము అపరిసీమమును, గతి అప్రతిహతమును అగును. ఎటులంటేని యీ దారికిని దివ్య జగతికిని మనో బుద్ధుల కందని సంబంధమున్నది. దహరాకాశ మున ధ్యానమునకు ఫలముగా సాధకుడు ఆధ్యాత్మానుభవ సంపన్ను డగును. మఱియు అతని అలౌకిక జ్ఞానము సత్యోద్భాసితమును సతత ప్రకాశ శీలమును అగును. కర్మ మితని నంటదు. సాధారణ జ్ఞానము దీని నెఱుగ జాలదు. ఇది స్వతః స్ఫూర్తము, దివ్యము. దీనివలన అహంకారమునకు నాశము కలుగును. స్వచ్ఛమును వ్యాపకమును నగు అస్మితాబోధ ఒదవును. అస్మిత 'నేను' మయ మయిన జ్ఞానవృత్తి-'తన'మయమయిన జ్ఞానవృత్తి. ఇది అత్యంత స్వచ్ఛమును సుఖమయమును. ఈ అస్మిత దృఢముగా నెలకొనినచో 'సర్వ'మయ బోధలో పర్యవసన్న మగును. యోగశాస్త్రమున ఈ తత్త్వము హిరణ్య గర్భుడు. ఈ బోధద్యోతన శీలము-ఈ బోధమును సర్వ బోధములకును సూత్రము జేసియే దివ్యసత్తాప్రకాస్తి.

దహరమనిన అల్పమని అర్థము. సూక్ష్మమగుట జేసి అల్పము కాని, దేశ వ్యాప్తిచే అల్పమని కాదు. అది యీ ఆకాశముకంటె విశాలము. పై నెంత స్వచ్ఛమో క్రింద గూడ అంత స్వచ్ఛము. ఆధారముమీదను క్రిందను గూడ స్వచ్ఛమును శాంతమునగు జ్యోతి. అనుభవము గంభీరమగు కొలది చిత్తమందంతట నిది ప్రతిఫలించును. ఒకానొక జ్యోతిర్ధార సాధకుని ఉనికిని ప్లావిత మొనర్చును. సాధకుడు దానికి సాక్షిగా బ్రహ్మప్రతిష్ఠ కలవాడు కావలయును. ఈ జ్యోతిర్ధారచే అపార్థివమగు సిద్ధి ఆవిర్భవించును. కాని ఔదాసీన్యమునే స్థిరముగా చేకొనినచో తత్త్వోదయము కా నారంభించును.

ఉపాసన సిద్ధించుచో విశ్వవ్యాప్తియగు జ్ఞానముతో పరిచయము కలుగును. దానికి అస్మితయే ద్వారము. అస్మితాబోధ మత్యంతము సూక్ష్మము. ఈ అస్మితా సూత్రముతో విరాడాత్మకు సంబంధము కలదు. ఈ వైరాజమునకు సాక్షి కాగలుగునెడల బ్రహ్మబోధము సుప్రతిష్ఠితమగును. కేంద్రీభూతమగు నీయస్మిత అందు లయమగును. అస్మితానుసంధానము అపార్థివమగు జ్ఞాన మార్గమును చూపును. 'ఈ అస్మితను సాక్షిగా చూడగల నేర్పు బ్రహ్మప్రతిష్ఠను కలిగించును. జ్ఞానమార్గ సాధకుడు ఈ రీతిగా ఉపాస్తినే అవలంబించియు స్థితిని బడయనేర్చును'.

## అహం గ్రహోపాసన

కొన్ని ఉపాస్తులలో బాహ్య పదార్థములయెడ బ్రహ్మదృష్టి చెప్పబడినది. ఈ యుపాస్తియందు సక్రియమగు తన సత్తయెడ బ్రహ్మదృష్టి చెప్పబడినది.

మానవుని అహం వృత్తి-'నేను' అను వృత్తి-మనశ్శరీరేంద్రియములపై సంచరితమై వానియందే బిగిసియుండును. అనగా ప్రతివాడును తన శరీరమునే తాననుకొనును. తన ఇంద్రియములనే తానని అనుకొనును. తన మనస్సే తాననుకొనును. ఉపనిషత్తులు 'నేను' అను ఈ వృత్తిని వ్యాపకమును ఉదారమును చేయమని ఉపదేశించును. ఇది పెద్దదగు కొలదిని దీని సంకోచము సమయును.

ఈ ఉపాసన పద్ధతి యిటులు-నీవే పదార్థమును చూచినను మనస్సంయోగ మొనర్చి దానిలో 'నేను' అను బోధమును నెలకొలుపవలయును. అనగా

ప్రతిదియు నేనే అని భావింపవలయును. క్రమక్రమముగా 'నేను'అను నీ భావన సూక్ష్మమై ఆయా యీ పదార్థ స్వరూపము వడయును. ఈ రీతిగా అన్ని పదార్థము లందును ఇటులు భావించుటవల్ల ఆ పదార్థ సత్త 'నేను' అను ఈ ఎఱుకలో లీనమగును. సూర్యునియం దాత్మ ప్రతిష్ఠ యొనరుచుచో 'నేను' అను ఈ ఎఱుకలో విశ్వస్ఫూర్తి కలుగును. వాయువునం దిటులు చేయుచో శక్తి స్ఫూర్తియు కలుగును. ఇటులీ ఆత్మప్రతిష్ఠ లెస్సగ నెలకొన్నచో విశ్వమంతయు 'నేను'లో అంతర్గతమై ఉద్భాసితమగును. అపుడు అంతయు 'నా' యందే అంతర్గతము, 'నా' యందే వికసితము, 'నా' యందే ఉన్నదియునై పోవును. ఉపనిషత్ సాధనలో ఇదియే విశేషము. సకల పదార్థములను ఆత్మరూపముగా చూచుకొనుచు పోవగా పోవగా నిజవిరాట్ స్ఫూర్తి కలుగును. అటు పిదప దేశ కాలములలో ఆత్మ బుద్ధి బంధింపబడి యుండదు.

ఈ అనుభూతికి చాల విలువ కలదు. 'జగత్తు మనకు వెలుపల నున్నది' అని మన అందఱకును సాధారణాభిప్రాయము. కాని యీ అహం గ్రహోపాసన ఆ యభిప్రాయమును మార్చివైచును. విషయితను విశాల మొనరించును. దీన పెక్కు రీతులగు యోగ విభూతు లబ్బును. ఏ పదార్థముమీద నేననుకొనబడు సాధకుని చూపు పడునో ఆ పదార్థమునందు శక్తి విస్తృతమగును; దాని ఆవరణము తొలగును; దాని యెడ చిత్తమునకు సంకోచముండదు. ఇటులు సాధకుని చిత్తవృత్తి ఆ పదార్థము నభిభూత మొనరించును.

ఇటులు ప్రపంచమంతయు తానైనందున ప్రపంచము దుఃఖ స్వరూప మను మాట పోవును. దాని విరాడ్రూపమగు అహం వృత్తి యేర్పడును.

## గాయత్రి

గాయత్రి ఒక ఛందస్సు. బ్రహ్మోపాసనమున కిది ప్రధానావలంబనము. ఛందస్సు లెన్నియో కలవుగాని గాయత్రీ ఛందస్సే బ్రహ్మజ్ఞానమునకు మోసాల యని శంకరులు చెప్పిరి.

యత్రి వాగ్రూప-'వాగ్వై గాయత్రీ' అని బృహ. ఈ మంత్రమును గానము చేయుచో ముక్తి కలుగును అని-'గాయంతం త్రాయతి'-ఉపనిషత్తును-

గాయత్రీ మంత్రమున విరాట్ స్వరూపద్యోతన మున్నది. ఇది విరాడుపాసన. ఇది విరాడ్రూపమును ప్రకాశింపజేయును. ఈ ఛంద మంతస్సత్తను విశాలము చేసి సంపూర్ణత నిచ్చును. ప్రాణ మనస్సులకు శాంతి గూర్చి వాని విరాట్ సత్తాస్పందనమును జాగరిల్లఁ జేయును. ఈ స్పందనముతో విరాడ్ జ్ఞానము కలుగును.

ప్రతి మంత్రమునకును ఇట్టి స్పందములను సృజింపగలశక్తి ఉన్నది. ఈ స్పందము లోపల నొక స్వాచ్ఛంద్య మున్నది. ఏలనగా మంత్రము ఛందో యుక్తము. ఒక్కొక్క మంత్రమున కొక్కొక్క ఛందస్సుండును. అన్ని మంత్రములును ఒకే తెఱగు ధృతిని జాగరిల్ల జేయజాలవు. శక్తి చ్ఛందమును జాగరిల్ల జేయగల మంత్రములు ద్యోతన శీలములు. అవి జ్ఞానమునకు గొంపోవును. కొన్ని మంత్రములు ఆనంద ధృతిని మేలుకొలుపును. దానజేసి మంత్రశాస్త్ర నిపుణులు మంత్ర విభాగము నతి కౌశలముతో చేయుదురు.

గాయత్రి కడు గంభీరమైనది. గాయత్రీచ్ఛందము వికాసశీలము. చిత్తమును అల్పమగు నభినివేశముల నుండి తొలగించి విరాడ్ బోధమున కాయత్త మొనరించును. గాయత్రీ చ్ఛందము అతి మానస-అనుభూతి సహజముగా కలుగునటు లొనరించును. విశ్వచేతనను విశ్వాతీత చేతనను అది తెలుపును.

గాయత్రీ మంత్రమున మూడు విభాగములు: సూక్ష్మ, స్థూల, అంతర్లోకము లందలి చైతన్య ప్రకాశము నవలంబించి ఈ విభాగము చేయబడెను. గాయత్రీ మంత్రము ఈ అంతశ్చేతనా బహిశ్చేతనా సూక్ష్మ చేతనలను మూటిని సాధకుని చిత్తమునకు దెచ్చి అచట ప్రకాశింపజేయును. గాయత్రి సవితప్రతీకముగా గల విశ్వ చైతన్యమునకును జీవ చైతన్యమునకును భేదము పోగొట్టును. అంతరదీప్తికిని విశ్వదీప్తికిని సంబంధము కలిగినచో నపుడు విశ్వవిజ్ఞానముతో అంతరము పూర్ణమగును. ఆ సాధకు డపుడు విశ్వచ్ఛందముతో యుక్తుడగును. సవితృమండలము నుండి ఏ కల్యాణమూర్తి ప్రకాశించునో ఆ కల్యాణమూర్తితో ఆ సాధకునకు పరిచయము కలుగును. అపుడు స్వచ్ఛతా స్వాచ్ఛంద్యములచే జీవనము పరిపూర్ణమగును.

## శబ్దము-బ్రహ్మము

ఉపనిషత్తులలో శబ్దము బ్రహ్మమని చెప్పబడినది. శబ్దమున కర్థముతో దృఢమగు సంబంధముకలదని అందఱకును తెలియును. శబ్ద మర్థమును తెలుపును. ఘట పటాదులు శబ్దములు. వీనికి విషయము ఘటమును వస్తువు - పటమను వస్తువు. కాని తొల్లిటి శబ్దశాస్త్రము శబ్దము యొక్క కారణావస్థను కార్యావస్థను స్వీకరించును. సృజింపబడిన వస్తువునకు సంజ్ఞ కలదు. ఈ సంజ్ఞ శబ్దము లేక నామము. కాని ఈ శబ్దము సాధారణ శబ్దము. దీనికంటె 'పర-శబ్ద'మని ఒకటి ఉన్నది. అది అనాది. సృష్టి మొదలగుటతోడనే దానికి మొదలు. అది చెవులకు వినబడదు. ఇది నిశ్శబ్ద శబ్దము, అనాహత శబ్దము (Voiceless voice). శబ్ద శాస్త్రాచార్యులు దీనినే 'వస్తువు' అని అందురు. వాఙ్మయ విశ్వము విశ్వ-ప్రాథమికావస్థ. నామరూపక్రియలే వాస్తవ విశ్వము. సృష్టి ప్రథమ స్పందము లేక శబ్దము నాదము. నాదమునుండి బిందూత్పత్తి. సాధారణ దృష్టిలో రూపము వస్తువుకంటె వేఱైనటులు యోగదృష్టిలో కాదు. పదార్థముల సూక్ష్మరూపమును పరిశీలించినచో అంతయు శబ్దసమావేశమే కాని అర్థమని వేఱ యొకటి లేదని తెలియుదుము. శబ్ద తరంగము సూక్ష్మరూపమును సంజ్ఞను బడయును. ఇటులు పడసి వస్తువుగా భాసించును. వస్తుతః శబ్ద తరంగమేకాని దానికి వేఱుగా ఉనికి లేదు. శబ్ద తరంగమే సృష్టికి మూలము. వాక్‌స్థూల వికాసము అర్థము. వాక్ అనగా శబ్దము—వాక్కు యొక్క సూక్ష్మ సంచారము రూపము. భావనయందును సంజ్ఞయందును రూపము ప్రకాశించును. ఈ వాక్కును లేక శబ్దమును అవష్టంభించి ప్రజ్ఞాలోకమునకు ప్రాకవలెను.

సృష్ట్యాదినుండియు వాగర్థములకు సంయోగ సంబంధమున్నది. ఇది ఈశ్వరేచ్ఛాకృతమని తార్కికులు. ఇట్లనుటకంటె దీనిని నైసర్గిక సంబంధ మనుట లెస్స. ఈశ్వరు డిచ్ఛగించినను ఈ సంబంధము పోవునది కాదు.

శబ్ద ప్రపంచమున స్థూలవస్తువు లేదు. ఉన్నవి నామరూపములు. కావున వాఙ్మయ ప్రపంచమే ప్రపంచమునకు పూర్వరూపము, 'వస్తువు' రూప ప్రపంచ మునకు పూర్వమున్నను అది అపార్థివము. అది సృష్టికి ఉత్సము. ఈ శబ్ద ప్రపంచమున ప్రవేశింపగలిగిన యెడల సాధారణమగు వస్తువును అనగా పదార్థ

జ్ఞాన సీమ నతిక్రమింపవచ్చును. శబ్ద వికాసమునకు ముందు ప్రాణమునకు సంచారము కలుగును. ప్రాణమే విశ్వప్రకాశ శక్తి. ప్రాణ స్పందముచే అవ్యక్తము వ్యక్తమగును. ప్రాణ కంపనము ఆకాశమున ఆఘాతము కలిగించి శబ్ద తరంగముల బుట్టించును. దాన చేసియే ఒకొక్క శబ్దమున కొకొక్క రూపము. ఈ ప్రాణ స్పందము, ఆకాశవ్యాప్తి, వీని తారతమ్యమును బట్టి రూప వికాసమున తారతమ్యముండును. ఒకానొక శబ్దమున ప్రాణ స్పందన మెక్కుడుగను, ఒకానొక శబ్దమున తక్కువగను ఉండును. ఆకాశములో ప్రాణము చేయు ఆఘాతముచే మంత్రోత్పత్తి. ప్రాణ కంపనము మందమగుచో ఆకాశమున తదభిఘాతమును శాంతముగనే ఉండును. ఈ అభిఘాతముయొక్క తీవ్రతా శాంతితలబట్టి మంత్రముయొక్క స్వరూపముండును. మంత్రముచే మహాప్రాణమునందును సూక్ష్మాకాశమునందును స్పంద సంచారమగును. ప్రతి మంత్రమును ఇట్టి శక్తికి ద్యోతకము. సాధకుని చేతనను క్రమముగా పైపైకి కొంపోయి బోధమునందు నెలకొలుపగల సామర్థ్యము మంత్రములలో గలదు. ఇదే మంత్రశక్తి. మానవులు ఎపుడును చేతోముఖులు; విషయాభిలాషులు. అపరిచ్ఛిన్నమగు చైతన్య స్వాభావిక వృత్తి మానవు లెఱుగరు. ఈ అనుభవమును శబ్దము లేక మంత్రము కలిగించి తీరును. చేతనావకాశమున ప్రతిష్ఠ గొనుటకు శబ్ద మొక కౌశల మాత్రము.

ఉపనిషత్తు లిటు లగుట జేసియే శబ్ద బ్రహ్మ వాదమును స్వీకరించెను. బ్రహ్మము శబ్ద రూపముగా ప్రకాశము పొందును. శబ్ద మతనికి ప్రతీకము. ఈ శబ్దము ప్రణవము-ఓమ్. సాధకుని మహా-అవకాశ బోధమున ప్రతిష్ఠింప గల శక్తి దీనికి సహజము. మహాకాశమున విశ్వమంతయు లయ మగును. అవకాశము మాత్రముండును, నాదముండును, చేతన ఉండును. సాధకుడే స్థూలాకాశమునుండి చేతనావకాశము నెలకొనును.

ఈ అవకాశమునకు ఆత్మ సాక్షి. శబ్దమునకు కేంద్రాభిముఖమగు ఒక శక్తి కలదు. విక్షిప్తమగు చేతనను ఆ శక్తి మరల కేంద్రమునకు తీసికొని వచ్చును. చేతనను అంతఃకరణ బంధమునుండి తొలచి తన నిస్సీమత్వము లోనికి నెట్టును. ఈ దెస శబ్ద బ్రహ్మ సాధన బ్రహ్మనిష్ఠకు బ్రహ్మస్థితికిని

కారణము. చేతన సామాన్యముగా దేశకాలములలో నుండి విశ్వమును ప్రకాశింప జేయును. ఇది దేశ కాల వ్యవధానమునకు అతీతము. శబ్దము బ్రహ్మ ప్రతిష్ఠ కలిగించును గాన దానికి శబ్దబ్రహ్మ మని పేరు. అన్ని శబ్దములకు నీ శక్తి లేదనుట నిక్కమే. దేనికి కలదో అది శబ్దబ్రహ్మము.

## సత్యము - ఛందస్సు

సత్యబోధకును ఛందస్సునకును దగ్గఱ సంబంధమున్నది. ఛందోమయ జీవనము సత్యధారణము చేయగలదు. జీవనము సత్యమందు నెలకొనుచో జీవన మెల్లయు ఛందోబద్ధమగును. అరూపమగు సత్యముయొక్క మూర్తప్రకాశము ఛందము. సత్యము 'స్వే మహిమ్ని ప్రతిష్ఠితమ్' - అది అజ్ఞాన ఘనము, ఆనంద ఘనము.

సత్య చ్ఛందస్సుల కెట్టి సంబంధము ? ఉపనిషత్పాఠ మొక శాంతి పాఠముతో ఆరంభమయి శాంతి పాఠముతో ముగింతుము. ఏల ? మంత్ర చ్ఛందమునకును చిత్త స్వాచ్ఛంద్యమునకును చుట్టఱిక ముండబట్టి !

ఛందము చిత్తములో ఏకాగ్రతను మేలుకొలిపి సత్యమును నిలుపుకొనగల పటిమనిచ్చును. కోమలమగు ఛంద - ఆఘాతముచే గభీరమగు అనుభూతి ఉన్మీలిత మగును. సత్యబోధము జీవనమంతటి నాచ్ఛాదించి దానిని దివ్య మొనరింపనంతవట్టు సత్యమునందు ప్రతిష్ఠ దొరకదు. సత్యబోధమే సత్యము నందు సాధకుని ప్రతిష్ఠించును. అదియు పరమ కామ్యము. దీనివల్ల జీవనము యొక్క పార్థివభావమును భాషయు సంపూర్ణముగా రూపాంతర మొందును. సత్యచ్ఛందము జీవనమున నెలకొనుడు ఉనికి యను దిగుడు బావిలో చేప లన్నియు బయటబడును. అపుడు సత్యము యొక్క విరాడ్రూపము కనిపింప గలదు. ఆ విరాడ్రూపమే కల్యాణమూర్తి ! ఛందస్సునకు నానా రూపములు. సత్యమొక ఛందము, సుందరమొక ఛందము; జ్ఞానమొక ఛందము, ఆనందము నొక ఛందము. ఇట్లులయ్యు వీని అన్నిటియులోనుండి సత్యద్యోతన స్ఫురిత మగును. ఛందము సత్యముయొక్క అనంత ప్రకాశ భంగి. జీవనానుభూతి యెట నెంత లోతో ఛందమట అంతవికాసశీలము ! ఛందమనుభూతి రూపము. ఉపనిషత్తత్త్వ మెంత గంభీరమో ఛందమును అంత గంభీరము. ప్రతి

మంత్రమునకును ప్రతి శ్రుతికిని ఛందోవిన్యాస మనంత సంగతి సంపన్నము. కావున భావైశ్వర్యమునకును భాషైశ్వర్యమునకును ఉపనిషత్తు తఱుగని భాండారము.

ఛందోబద్ధమగు మంత్రోచ్చారణము స్వాధ్యాయము. దానినుండియే ప్రతి శబ్దమునకు శక్తి ప్రకాశము. వేదమంత్రము కేవల శబ్ద సంఘటనమే కాదు. దానికి స్వరము కలదు. అది భావద్యోతకము. వాక్య మర్థప్రకాశకము. స్వరమును ధ్వనియు అర్థమునకును భావమునకును స్ఫోరకము. వాక్యమునకు గల అర్థముకంటె స్వరమునకు గల అర్థము సూక్ష్మము.

అనుభూతి ఛందస్సుయొక్క సూక్ష్మతర రూపము తాల్చును. సూక్ష్మ-అంతరముననే జీవనము చక్కగా వికసించును. ఈ సూక్ష్మధారణకే ఛందః ప్రయోగము. అపార్థివమగు జ్ఞానము యొక్క రూపము శబ్దము తనలో తాల్చును. ఆ రూపము మానస ప్రత్యక్షము కాదు-అది అతి మానస ప్రత్యక్షము. కావున ఛందస్సూక్ష్మరూపముతో తత్త్వమునకు నిత్య సంబంధము. అది అతిమానస చేతనా స్తరమున అనుభవ మగును. చేతన నీ స్తరమున కెత్తగల కౌశలమే మంత్రము. నామ రూప క్రియా విముక్తమగు చేతనకు గొనిపోవుటయే ఉపనిషత్తుల ఉద్యోగము. ముక్తచేతనమే ఉపనిషల్లక్ష్యము. కాని యీ చైతన్యస్థితి జ్ఞానమునకు పట్టుపడదు. మంత్రము ఆ స్థితికి గొంపోవగలదు.

ఉపనిషత్తులు శాస్త్రము కాదు. సత్య దృష్టి. కావున వానిని తెలిసికొనుటకు విశ్వ-కల్యాణరూపముతో పరిచితి ఉండుట అవసరము. విచార మెంత దృఢమైనను చిత్తము స్వాచ్ఛంద్య సంపన్నము కాదేని సత్యము దొరకదు. కాన జీవనములో కల్యాణ స్పృహయు కల్యాణ దృష్టియు కలుగవలెను. సత్యానుభూతి సామాన్యముగా సుకఠినము. ఏలనగా ఉనికి అరలన్నిటి నుండియు కల్యాణ స్పృహ మూర్తమై కనబడదు. ప్రాణ మనశ్చిత్తములలో కల్యాణ స్పృహ పూర్ణమాయెనేని దివ్య జీవనచ్ఛందముచే ఉనికి ఉబికిపోవును. అపుడు జడతగాని చంచలతగాని అలతి తనముగాని దాపులకు రాదు. అతి మానసానుభూతి కపు డంకురార్పణము. ఉపనిషత్తత్త్వ మెఱుగగల యోగ్యత అపుడు. చిత్తాధికార మెచ్చట అస్తంగతమో అట్టి ధ్యాన ప్రశాంతిలో ఉపనిషత్తత్త్వము!

ప్రాణ కంపనము పోనిదే, మనస్సు సంకల్ప శూన్యము కానిదే సాధనకు ఫలములేదు. ప్రాణ మనస్సులు ఛందోబద్ధము అయిన మణుసనాడు విజ్ఞానానందముల సోపానముల నెక్కగలము.

# సగుణ బ్రహ్మవిద్య

ఉపాస్తిచేగాని ధ్యానముచేగాని స్వస్వరూపము వికసింపజేయుటయే ఉపనిషత్తుల లక్ష్యము. ఇటులయ్యును అది కలుగజేయులోపల పలుతెగల అలౌకిక రహస్యములతో పరిచితి కలిగించుటయు ఉపనిషత్తుల అవాంతర వ్యాపారము. విద్యలకు అనగా ఉపాసనములకు చేతనను చక్కగా మేలుకొలిపి, చేతనలో నెలకొలుపుట పరమ ప్రయోజనము. సంపూర్ణమగు చేతనావస్థితికి ముందు సమత్వమును చిత్తశుద్ధియు వ్యాపకమగు చైతన్యముతో పరిచయము కలిగించును. వ్యాపకమగు చైతన్యబోధమునందు ప్రతిష్ఠకలుగుట పయిమెట్టు నెక్కుటకు యోగ్యత కలిగించును. దానఁజేసి ఉపనిషత్తులలో సగుణ బ్రహ్మవిద్య పిదపనే నిర్గుణ బ్రహ్మవిద్య చెప్పబడెను.

శంకరులవారి నిర్గుణ బ్రహ్మవిద్యయే ఎల్లెడల ప్రాధాన్యము బడసియున్నది. దానజేసి మాటలు చెప్పువారేగాని యీ విద్య లనుష్ఠించువారు కఱవు. సగుణ బ్రహ్మ విద్యవలన కలుగు ధృతియు శక్తియు వీనిమీద ఎవరికి ఆస్థలేదు. 'ఈవిశ్వమంతయు మాయ' అను నీమతమున ఉపాసనకు తావున్నను తత్త్వబోధమున తావులేదు. ఉపాసన బుద్ధిని స్వచ్ఛమొనరించునుగాని అజ్ఞానమును నాశన మొనరింపదు. ఇటులు తలచి సగుణ విద్యానుష్ఠానమునకు పూనుకొనక పోవుట అన్ని దేశములను చూపట్టుచున్నది. ఆ తత్త్వజిజ్ఞాసకును అంతరశుద్ధి అత్యవసరము. తత్వవిచారము సత్యబోధ కలిగించును. కాని దీనికి ఏకాగ్రతయు బుద్ధికి ఔజ్జ్వల్యమును వలయును. ఉపాసన ఈ రెంటిని కలిగించును. ఇట్టి నైర్మల్యము లేనిచో విచార సంపన్నుడు కావచ్చునుగాని బ్రహ్మసంపన్నుడు కాజాలడు. సగుణబ్రహ్మోపాసన అంతరమును ఉద్దీపింపజేసి అభయమునందు

ప్రతిష్ఠించును. చిత్తముయొక్క సూక్ష్మపరిణామము అదృశ్యము అలౌకికమునగు జగత్తును ప్రకాశింపజేయును. దానఁజేసియే ఉపనిషద్విద్యాగాంభీర్య మింత యెక్కుడు.

అన్ని ఉపనిషత్తులయు అభిప్రాయ మొకటికాదని ప్రాచీనాచార్యు లెరుగుదురు. కొన్ని అద్వైతమునే చెప్పును. ఉపాసనలను మాత్రమే కొన్ని చెప్పును. మఱికొన్ని రాముడే పరమతత్త్వమని లేక గోపాలుడు లేకన్రుసింహుడని చెప్పును. కర్మపూర్వకములగు ఉపాసనములను కొన్ని చెప్పును—వీనిలో ఒక మంత్రముతో తత్త్వప్రసంగము చెల్లు. ఇటులగుటచేసి దార్శనికులు తమతమ బుద్ధి కౌశలముచే ఉపనిషత్తులను తమ మతమున కనుకూలముగా లగించుకొనిరి. కాని తేరిపాఱ జూచినచో ఈ మంత్రముల గూర్చి స్థిరమగు ఒక సిద్ధాంతమునకు వచ్చుట అసంభవము కాదు.

ఉపనిషదుపాస్తి కేవల దేవతాధ్యానముకాదు. మఱి బ్రహ్మచైతన్యమును మేలుకొల్పి దానిలో నిన్ను నిమగ్నుని చేయుట ఉపాస్తికి ఫలము. ధ్యానము సాధకుని విక్షేపమును పోగొట్టి విరాట్ చైతన్య ప్రకాశము కలిగించును. చైతన్యము యొక్క యథార్థ జాగరణమును ఉపాస్తి కలిగించును. మనుజునకు ఆనందము దెసబోవుట నైజప్రవృత్తి. ఇదియే మనుజుని ప్రకృతరూపము. కావున ఆనందము కలుగు వఱకు తృప్తిలేదు. అనావృతమగు సత్తానుభూతి మానవునకు కలుగవలెను- తృప్తి తీరవలెను.

కర్మానుయాయులకు ఒక విశిష్టరూపమున్నది. దేశకాలములు, కర్తృత్వ బుద్ధి—వీనిని పురస్కరించుకొని కర్మ చేయవలసి యుండును. మానవులు వ్యక్తిత్వముచే ఉద్బోధితులై కర్మ సంస్కారముచే ఆచ్ఛన్నులగుదురు. ఈకర్మ గ్రంథినుండి ఉపనిషత్తులు ముక్తి కలిగించును.

## జ్ఞానము - ఉపాసన

మనోగతి యెప్పుడును వెలుపలికి. ఆత్మకేంద్రముకాని మనస్సు విషయములను చుట్టుకొని యుండును. ఉపాసనమునందును మనస్సు ధ్యేయమును గూర్చి పరుగిడును- ఆ ధ్యేయము ఆత్మాతిరిక్తమగు అనగా తనకంటే వేఱగు

ఈశ్వరుడు కావచ్చును, ఈశ్వరుని ఏదోయొక పేరు కావచ్చును. శక్తిరూపమగు ఈశ్వర విగ్రహముగాని కావచ్చును. ఈశ్వరజ్ఞానము కావచ్చును. ఆత్మ కేంద్ర హీనతా రూపమగు మనస్సునకు స్వాభావికమగు ఈ వృత్తి ఉపాసనము నందును తొలఁగిపోదు. ఉపాసమునకు లక్ష్యము వ్యాపకమగు ఈశ్వరీయ రూపమయినను ఈశ్వరజ్ఞానమున్నదాఁటి ఉపాసన నడవనేరదుగదా ! ఇచటవృత్తి యీశ్వర విషయ మగుటఁజేసి, అది రమణీయమగుటజేసి సూక్ష్మజ్ఞానముచే దివ్యభావముచే దివ్య శక్తిచే ప్రేరితమగును.

ఇచట జ్ఞానము విశేషాకారముగా నుండును. ఆత్మజ్ఞానమే నిర్విశేషము. కావుననే ఉపాసన సిద్ధించినను జ్ఞానము కలుగవలసియే యుండుట శేషించియే యుండును. ఏలనగా "ఆత్మా వై ఇదగ్ం సర్వం" — ఇదియెల్లయు ఆత్మయే అను ఎఱుక ఉపాసనమం దొదవదు. జ్ఞానము బాహ్యమును దేనిని అపేక్షింపదు. అది లోపలను వెలుపలను ఉన్న అఖండవస్తువు. ఇందు బాహ్యవృత్తి యనుమాట ఉండదు. ఇంతియకాక ధ్యానముచే ఆస్వాదింపఁదగినది ఏదియు నుండదు. ఇచట అసంసారియగు తాను జాగరిల్లును. ఈ జాగరణమున కొక విశేషరూపమున్నది. కర్తృత్వ భోక్తృత్వముల అవసానమే ఆరూపము. దీన ఇటీవలి ఆచార్యులు బ్రహ్మమునకు వృత్తి వ్యాప్యత్వము నొప్పిరి. వృత్తి హీనమగు జ్ఞానము బ్రహ్మ స్వరూపము. బ్రహ్మాకారవృత్తియు అవసన్నమగు పిదప బ్రహ్మస్థితి.

అశేష వృత్తులకంటె బ్రహ్మాకారవృత్తి భిన్నము. ఉపాస్యరూపమునుబట్టి ఉపాసనావృత్తి స్ఫూర్తమగును. బ్రహ్మమునకు రూపములేదు-బ్రహ్మబోధముచే బుద్ధి ఉద్బుద్ధమగుట బ్రహ్మాకారమై బ్రహ్మమై స్ఫూర్తమగును. అపుడో ఏ రూప మును ఉండదు. ఏలన బ్రహ్మము నీరూపము. బ్రహ్మాకారవృత్తి వేఱు వస్తువు.

## ఉపాసన - జ్ఞానము

లౌకికకర్మగాని అలౌకిక కర్మగాని ప్రాణసంవేగముచే పొడమును. అలౌకిక కర్మభోగము సూక్ష్మమయినను అది జ్ఞానమయ సత్తనుగాని విజ్ఞాన మయ సత్తనుగాని జాగరిల్లఁజేయజాలదు. దానజేసి ఉపనిషత్తులలో కర్మ ప్రశంస కానరాదు. ఆత్మజ్ఞానములేని మనుజుడు కర్మకేంద్రమునందే బంధింపబడి యుండును.

మానవునిలో ప్రాణము యొక్క స్థూలసంక్షోభములేని సూక్ష్మసంవేగ మొకటున్నది. దానితో ఉపాసనారంభము. సత్యమునను సంధానము చేయగల సంవేదనము ఉపాసనము నందున్నది. అది మానవుని అంతరసత్తను ఉద్దీపింప జేసి జీవనమును మేలుతరమగు వెలుగుతో చెలిమి కలుగునటు లొనరించును. ఉపాసనచే ప్రాణములకు ఊర్ధ్వసంచారము, విజ్ఞాన సూక్ష్మవికాసము, దాన అలౌకిక జ్ఞానమును శక్తియు నిత్యము కలుగుచున్నను ఉపనిషత్తులు శక్తి కంటె జ్ఞానమునే ఎక్కుడుగా గ్రహించెను. జ్ఞానము జీవుని సత్యమున ప్రతిష్ఠించును-శక్తి ఐశ్వర్యమున ప్రతిష్ఠించును. ఎవని శక్తిచే విశ్వము విధృతమై అనుప్రాణితమో ఉపాసన మతనితో పరిచితి కలిగించును. మఱియు దివ్యజీవనముచే దివ్యజ్ఞానముచే దివ్యాను ప్రేరణముచే సాధకుని పయిమెట్టు కెక్కించును. మానవుని ఉనికిలోగల అన్ని కోశములను విరాట్పురుషుని విశ్వ లీలా ఛందముచే అనుప్రాణిత మొనరించును.

ఉపాసన పైమెట్టులో సాధకునిచేతన క్రమక్రమముగా విశ్వచేతనతో అభేదత పడయుచున్నటులు కనుగొనును. పిదప విశ్వచేతనావలంబముచేతనే ఆ చేతననుగూడ నతిక్రమించి అతిమానస చేతన నెఱిగికొనును.

ఛందము యొక్క ఆకర్షణచే సగుణ బ్రహ్మ సంధానము. అపుడు జీవ నోల్లాసమునందు అనంతములగు రూపములును ఛందములును ముఖరితములగును. కాని యింత విభూతి సంచారము కలిగినను చేతన తృప్తినొందదు. దాని చూపు ఎంతసేపును ఏకత్వము మీద. సత్తకు అనగా ఉనికికిగల విరాట్తత్త్వాను భూతి కంటె స్వరూపానుభూతియే దొడ్డదికదా! ఉపాసనచే విజ్ఞానమున కవకాశము కలిగించి దానిగుండ సత్యముయొక్క విశ్వరూప సాక్షాత్కారము కలిగించినను జీవాత్మకును పరమాత్మకును ఏమాత్రము వ్యవధానమున్నను ఉపనిషత్తులు ఊరకుండవు. అవి చరమ సత్యమునకు తీసికొని పోయిగాని సాధకుని విడు వవు. ఉపాసనము మనల బ్రాహ్మశక్తిచే దీప్తిచే పూరించినను జీవేశ్వరుల తేడాను తీసివేయజాలవు. వానికట్టి యుద్దేశమును లేదు. ఏలనఁగా దానికిగల శక్తి అంతమాత్రమే. ఉపాసనము దివ్యజీవన విభూతిని ఐశ్వర్యమును అపేక్షిం చును. దానజేసియే అపుడపుడు ఈశ్వర సంబంధమగు స్థితితో అభిన్నత కల్పించుకొనును - ఆ అభిన్నత శక్తితోగల అభిన్నత - కానిసత్తతో కాదు-

ఉపాసన ఈశ్వరశక్తి సంవేగముచే జీవుని ఈశ్వరభావాపన్నుని జేయఁగలదు. కాని అతని నిరుపాధిక స్వరూపముతో సాధకుని పరిచితుని చేయఁజాలదు. ఈశ్వరుని జ్ఞానమునకును శక్తికిని అంతములేదు. ఒక హద్దు ఉన్నచో అతడు ఈశ్వరుడు కాడు. అతని ఉనికి ఎల్లెడను. దానికి సంకోచము ఉండజాలదు. అంతయు ఈశ్వరుని జ్ఞానము నందున్నది. అతడు ముక్తికి కారణము – అనాది నిధనుడు-అవ్యయుడు. అతడు తన అప్రతిహతశక్తిచే విశ్వమును నియమించును. సాలెపురుగు దారమువలె సృష్టి అతనినుండియే వచ్చుచున్నది.

జీవేశ్వరుల వేఱిమి యీ జ్ఞానశక్తికి ఒకహద్దు అని ఉండుటయు లేకుండుటయు బట్టియే నిర్ధారితమగుచున్నది. జీవుని జ్ఞానమున కొక హద్దున్నది. ఈశ జ్ఞానమునకు లేదు.

ఈ హద్దు కలదని తెలియుటచే జీవుడు తన్ను క్షుద్రుడని తెలిసికొనును. ఈ యెఱుకయను కాలిగొలుసుచే అతడు సంసారమను చెఱలోనున్నాడు. అతనికీ బంధమునుండి తప్పించుకొనుటలో నైసర్గికమగు ప్రవృత్తి కలదు. దానికొఱకే అతడీశ్వరునితో యోగము చెందగోరును. ఇతరమగు ఏ ప్రవృత్తియు అతనిని తృప్తిపఱుపదు. ఏలనగా ఇతర ప్రవృత్తులన్నియు జీవనము యొక్క ప్రాథమిక ప్రేరణమునుండియే ప్రసూతములు. ఈ ప్రేరణ స్వభావము యొక్క సహజసంస్కారము. దానితో ఉచ్చతర చేతనకెట్టి సంపర్కమును లేదు. ప్రాథమిక ప్రవృత్తి ప్రేరణచే జీవుడు ఒక విషయమునుండి మఱియొక విషయమునకు పరువిడుచుండును.

మానవుడనగా ప్రాణమును అన్నమయకోశమేకాదు - అతని సకల విధములగు ప్రవృత్తులమూలమునందును ఆత్మవికాసమునకు వ్యాకులత కలదు. ఈ వికాస వేగము, ప్రాణకోశమునందును మనఃకోశమునందును విజ్ఞానకోశమునందును ఆనందమయ కోశమునందును ఉత్పన్నమగును. స్థూలవికాసముచే జీవునకు తృప్తిలేదు. సూక్ష్మవికాసము కొఱకతడు ఈశ్వరసంబంధము కోరును. ఉపాసనచే ఆ సంబంధము కలుగును. భావనాతిశయముచే ఈశ్వరశక్తి జ్ఞానములతో క్రమపరిచయము కలుగును.

# ఉపాసన - విజ్ఞానము

విజ్ఞానరూపముగా ప్రాణరూపముగా వాగ్రూపముగా బ్రహ్మోపాసన మొనరించుటకు సాధనాక్షేత్రమున ఫలము కలదు. బ్రహ్మము విశ్వవిజ్ఞానమయము. విజ్ఞానము ప్రకాశించు స్వభావము కల వస్తువు. బ్రహ్మరూపముగా విజ్ఞానోపాసనచే చిత్తము విజ్ఞాన ప్రకాశముచే వెలుగును. ఈ వెలుగులోనుండి బయలుదేరి విశ్వమంతయు వ్యాప్తమగును. ఈ కాంతిముందు విశ్వావరణము విడివడును. చిదాకాశమున విశ్వమయమగు విజ్ఞానస్ఫూర్తిచే సాధకుడు తృప్తి ననును. ఈ విజ్ఞానప్రజ్ఞ నిరవచ్ఛిన్నము; అఖండము.

విజ్ఞానమునందేది ప్రకాశమో ప్రాణమునందది శక్తి. విజ్ఞాన వికాసముతో పాటు ప్రాణము శాంతమును వ్యాపకమును అనుచువచ్చును. చిత్త చాంచల్యము పూర్తిగ పోవగనే మహాప్రాణసంచారము కలుగును. బర్గ్‌సన్ భాషలో ఈ మహాప్రాణము **"Elan vital"**. మనుష్యుని క్షుద్రములగు సంకల్పములు వికల్పములు మహాప్రాణములో మునిగిపోయి చిత్తము ఈశ్వర సంబంధములగు సంకల్పముల కాధారమగును. అపుడు సంకల్పమాత్ర మెల్లయు సిద్ధించును. మహాప్రాణప్రతిష్ఠ జరుగగనే వాక్కు యొక్క సూక్ష్మస్తరమున కవతారణ. అపుడు వాక్కు ఛందస్సునకు వాహనమగును. ఛందోబద్ధమగు వాక్యమునుండియే మంత్రోత్పత్తి. ఛందోబద్ధమగు వాక్యమే శ్రుతి. అశరీరియగు ఈ వాక్కు మహాశక్తి కాధారము. దీనిస్ఫూర్తిచే సిద్ధి. సృష్టి ఇట్టి వాక్కుచేతనే ఉద్భూతమైనది. సంకల్పము – వాక్కు–సృష్టి వీనిలో పరస్పరము సంయోగసూత్రము కలదు. సూక్ష్మప్రాణముల స్పందనముతో సంకల్పోత్పత్తి. సంకల్పము వాగ్రూపముగా పరిణమించి జగత్తును సృజించును. ఒకరివ్యథ కనుగొని స్వాభావికముగా వ్యథననుభవించునపుడు కలుగు మనోవికారము అంతర్వేదన మనజెల్లునుగాని అది ప్రేమకాదు. అది యేదేనగుగాక, అది పరస్పరము సమవేదనము ఎంత పెంపొందించునో ఆఘాతము తగిలినంతనే అంత విచ్ఛేదము కలిగించును. అది జీవన సాధారణవృత్తి. అది ప్రాణస్తరమునందు అనుభూతమగును. ప్రేమ ఆత్మనిష్ఠము. ఆత్మ కేంద్రకము. ఆత్మోజ్జ్వల్యముచే అది ఉజ్జ్వలము. దాని వ్యాపకత్వమున కెందును సంకోచముండదు. అది సకల విరుద్ధావస్థలను దాటి తన

ప్రాణముల నొడ్డి విషయము నుజ్జీవింపఁజేయును. ప్రేమ మృత్యుంజయము. దాని తాకున జీవనోత్సము మీఁది బండ ఉబికిపడును. జీవన మానందలహరిలో ఈఁదులాడును. ప్రేమ శక్తిమంతము-ప్రేమము విరోధమును తినివైచును. జీవనమునందలి చిరపురాతన జీవనమును నవీన మొనరించి విశ్వప్రాణమును సమృద్ధతర మొనరింప గలదు. ప్రేమ తన హృదయమును విప్పార్చి బ్రహ్మాండమును పిండాండమును సమస్తమును ఆలింగనము చేసికొని, మృత్యువులో జీవనమును-కుత్సితములో సుందరమును-అకల్యాణములో శివమును జాగరిల్లజేయును.

ఉపనిషత్తులు చెప్పు సాధనలో ఒక స్వాభావికత ఉన్నది. అది - మన స్వరూపములో విరాట్ స్పృహ. దాని పరిచయము పొందగలుగుచో సాధన మిగుల సుగమము కాగలదు. అపుడు స్పష్టమగు అనుభూతి కాగలదు. అపుడు మనము ఏ క్షుద్రాశయమునకును పాల్పడజాలము. ఏలనగా అది అపుడు మన స్వభావమునకు సరిపడదు. మరియు విరాడనుభూతి మన స్వభావము. ఎప్పుడో ఒకప్పటి అనుభూతి కాదిది. విరాట్టయి పోవుటయే మన స్వభావము. ఉపనిషత్తులలోని క్రొత్తమాట ఇదియే. ఒకానొక మెట్టులో 'నేతి నేతి' అనునది. ఉపనిషత్ సాధనమయినను దానిని అభావమూలకమగు సాధనయని యనరాదు. ఉపనిషత్తు ఈశ్వరుని విశ్వరూపమును చూపెను. గావున దాన విరాట్ జీవనపు టాకర్షణ మున్నది. ఈ సాధన సర్వత్ర బ్రహ్మమును బడయును. కాని ఏతావన్మాత్రమున సంతృప్తి కాదు. ఈ బ్రహ్మదృష్టిచే మొదట బ్రహ్మకర్షణమును, పరిణతిలో బ్రహ్మైక్యమును కలుగును. సాధకుడు అచట బ్రహ్మదృష్టిని దాటి బ్రహ్మముతో అభిన్నుడగును. సాధనలో ఈ పరిణతి చిట్టచివరది. తత్త్వానుభూతి యనగా నిది.

విషయమునందు బ్రహ్మదృష్టితో ఉపనిషత్ సాధన మొదలగును. బ్రహ్మదృష్టి నెలకొనుచో ఆత్మదృష్టియు నెలకొనును. బ్రహ్మదృష్టివల్ల పదార్థముల ఆనందమయ స్వరూపము మనకు భాసించును. దివ్యదీప్తిచే సాధకుని అంతఃకరణము వెలుగును. విషయమునందుగాని అంతఃకరణమునందుగాని ఉన్న స్థూల భావము క్రమకమముగా నీరసించును. ఈ రీతిగా అన్ని విషయముల లోపలి నుండియు బ్రహ్మస్పర్శము సాధకుని పులకింపజేయును. ఇది కల్పన కాదు-ఇది

మున్మాటికిని సత్యము. ఇది సాధకుల కనుభవము. ఈ యనుభవము కలిగిన దనుచో సాధకుని అంతఃకరణము అతి స్వచ్ఛమాయె నన్నమాట. అటు తరువాత లోపలగూడ సాధకుడు బ్రహ్మదృష్టి చేయవలసియున్నాడు. అటు లొనర్చిన యెదలనే అంతఃకరణము సత్త్వశక్తిచే బలిష్ఠమగును. దానజేసియే ఉపనిషత్తులు ప్రాణోపాసనమును, మన – ఉపాసనమును, విజ్ఞానోపాసనమును విధించెను. మఱియు తత్త్వములయు వాయ్వాకాశాగ్ని వరుణాదులయు ఉపాస్తిని చెప్పెను. దాని యుద్దేశ మేమన అన్నిటిని బ్రహ్మమయ మొనరించుటయే. ఇట్టి ఉపాస్తులచే సాధకుడు జ్ఞానశక్తి సంపన్నుడగును. కేవలము ఆనంద సంచారమేకాక జ్ఞాన వికాసముగూడ (ఉపనిషత్తుల) ఉపాస్తుల ఉద్దేశము. తత్త్వబోధముకంటె వేఱుగా భావోచ్ఛ్వాసమున కుపనిష దుపాసనలలో తావులేదు. కావుననే ఒకొక్క ఉపాసన మొకొక్క విజ్ఞాన విశేషము లేక విద్య. ఈ విద్యలు అనుభూతి సోపానములలో సత్యముయొక్క ఏదో ఒక రూపమును ప్రకాశింపజేయును. ఒకొక్క విద్య కొకొక్క ఉపలబ్ధి కలదు. ఉపాస్తివల్ల స్థూలమునందు బ్రహ్మబోధ కలుగును. అది స్థిరపడిన పిదప సూక్ష్మమునందు బ్రహ్మబోధ కావలయును. ఈ రెంటను బ్రహ్మబోధ మేర్పడి వేరు తన్నినను ఇంకను సూక్ష్మానుభూతికి ప్రయత్నింపవలసియే యుండును. ఈ దెస అనేక లోకములు దాటి సగుణ బ్రహ్మానుభూతిలో మునుఁగుదుము. ప్రాణ మనో విజ్ఞానములపై నొక లోకమున్నది. జ్ఞానమయమును ఋతమయమును ఆనందమయమును అగు సత్తచే ఈ లోకము పరిపూర్ణము.

ఇచట ఉపాసనా ఫలము నిర్ణీతమగును. ప్రాణోపాసన చేసి ప్రాణశక్తి నుపార్జించి అటులొదవిన మహా ప్రాణశక్తిచే శాంతిని నొందుము. ప్రాణశక్తి శాంతమగుటజేసి వృత్తియు శాంతమగుచు వచ్చును. దీనికి ఫలమిదియేనా? కాదు-విశ్వప్రాణ సంచారముచే స్వభావజాతమగు మన ప్రవృత్తియు శాంతత దాల్చి నిస్తరంగమగు విశ్వప్రాణ ప్రభావ మనుభవించి ఒకానొక సుఖము వడయును. ఉద్వేలమగు ప్రాణశక్తి శాంతమగుచో దానిశక్తి వృద్ధి చెందును. అటు పిదప జ్ఞానసాధనా మార్గము నేరుగా కన్పించును. ప్రాణోపాసన మిందులకు ఆవశ్యకము.

ఈ రీతిగనే మన-ఉపాసనచే సూక్ష్మప్రాణమును సంకల్ప వికల్పములును శాంతములగుచు వచ్చును. సంకల్పముల శక్తియు గతియు అప్రతిహతము లగును. సూక్ష్మ విజ్ఞానము ఉదయించును. అది విశ్వ విజ్ఞానముతో పరిచయ మొదవించును. ఈ శక్తులు లెస్సగా నియంత్రిత మొనరింపబడెనేని అంతః కరణమునందు స్వచ్ఛతయు సూక్ష్మతయు నెలకొనుటతోపాటు విరాట్ సత్తా స్ఫూర్తియు విశేషశాంతియు అనుభవమునకు వచ్చును. సూక్ష్మము కంటె సూక్ష్మతరమును, స్వచ్ఛము కంటె స్వచ్ఛతరమగు లోకముల ప్రకాశము కలుగును. ఊర్ధ్వలోకములు మానసానుభూతి వేద్యములు కావు. అవి స్వతః ప్రకాశములు. ఈ ఊర్ధ్వగతికి శేషసీమ సగుణ బ్రహ్మలోకమున సగుణ బ్రహ్మప్రాప్తి. సాధకుడు అపహతపాపుడై అచటికి బోవును. ఇచట సాధకు నందు శాంతియు జ్ఞానమును వైరాగ్యమును ఐశ్వర్యమును పూర్ణములగును. ఇది దేవయానమార్గము.

పలు తెగలగు ఉపాసనలలో దహరాకాశోపాసన ఒకటి. ఇది అత్యంత సుఖకరమును ఫలదాయకమును. అంతఃప్రదేశములోని అంతరతమ ప్రదేశమున తేజోమయమగు అవకాశ మొకటి కలదు. ఈ ఆకాశమున ప్రవేశించుమార్గము హృదయగుహ. ఇది ధ్యానమునకు ప్రశస్తమగు క్షేత్రము. యోగశాస్త్రమున భ్రూమధ్యమున ధ్యానించు తెఱ గొకటి ఉన్నది. కాని హృదయాకాశమున ధ్యానము నిరుపద్రవమయినదియు అనాయాస సాధ్యమును అయియున్నది.

## సిద్ధిస్వరూపము

సిద్ధిమార్గములు రెండు. ఉపాస్తిచే ఈశ్వరశక్తి నాకర్షించి స్వసత్తను పూర్ణ మొనరించుకొని యోగైశ్వర్యముల ననేకముల బడయుట ఒకటి. ఇది యోగమార్గము. ఈ మార్గమున శక్తియొక్క బహు విధములగు ఆవేగ మధిక రించనగును. దివ్య విభూతి వికసింపనగును. దీనిచే సాధకుడు స్వతఃప్రవృత్తి నుండియు తదుద్వేగము నుండియు శాంతి నొందును. కాని యోగమున కిదియ ముఖ్యఫలము కాదు. ఈశ్వరజ్ఞానము తోడను, ఈశ్వర శక్తితోడను పరిచితియే ముఖ్యఫలము. ప్రకృతికి అధీనత్వమే జీవత్వము. ప్రకృతిమీది కర్తృత్వమే ఈశ్వరత్వము. ఉపాసనాఫలముగా ఎపుడో ఒకప్పుడు సాధకునిలో ఈశ్వరత్వా

వేశము కలుగును. ఉపాసనచే జ్ఞాన శక్తులును సాధకునిలో నిండారును. ఉపాస్తి సాధకుని విశ్వకల్యాణచ్ఛందముచే ఉద్బుద్ధుని చేయును. మఱి ప్రాణస్పందము తోడను, విజ్ఞాన స్పందము తోడను పరిచయము కలిగించును. అటు లయినను ఉపాస్తి ఛందోమయమగు ఈ జీవనపు కల్యాణమూర్తిని దాటజాలదు.

మానవుల అంతర్జీవనమందు ఛందమున్నది. ప్రకృతికి ఛందమున్నది. ప్రాణశక్తికి ఛందముతో నిగూఢమగు సంబంధమున్నది. సృష్టి ఛందోవికాసమే. ఛందోబద్ధమగు ప్రాణసంచారము సృష్టి నింత మధుర మొనరించెను. సృష్టిలో స్తర స్తరమందును ఛందః ప్రేరణ మంతర్నిహితమై యున్నది. ఈ ఛందోధారయే సృష్టి యొక్క సకల స్తరము లందును ప్రకాశించి సమగ్ర బ్రహ్మాండమును ఏక సూత్రముచే గ్రుచ్చుచున్నది. ప్రాకృత జగత్తులోనుండి వెలువడిన జీవనము గూడ ఛందః ప్రకాశమే. దానిపేరు ఉపనిషద్భాషలో అధిభూతము. ఇక అంతర్జీవనమునం దనుభూతమగు ఛంద మధ్యాత్మము. ఈ బహిః ప్రకృతికిని, అంతః ప్రకృతికిని గల ఛందమునం దొక రహస్సంబంధమున్నది. దానికి కారణ మీ యంతర్ బహిర్ జీవనములలో అనవచ్ఛిన్నమగు నొక జీవనధార ప్రవహించుటయే. గభీరమగు ఛందముల అంతరమునుండి ప్రకాశించు అనంత జీవనధార భేదబోధను తొలగించును. జీవనమున ఈ అధ్యాత్మ అధిభూతముల ప్రకాశము కంటె విడిగా మఱియొక గొప్ప ప్రకాశమున్నది. అది అధిదైవము. ఈ అధిదైవజగత్తు అధ్యాత్మాది భూతములను సమన్వయ పఱచును. అచట చైతన్య సూక్ష్మతయు దీప్తియు సుఖమయమగు ప్రాణకంపనమును వ్యాప్తమై యుండును. దాన అంతర్ జీవనము బాహ్య జీవనముతో ఏకమయిపోవును. ఈ అధిదైవ జీవనము స్వచ్ఛమును ప్రకాశశీలము నై యున్నది.

ఈ అధ్యాత్మము - అధిభూతము-అధిదైవము - అనునవి చైతన్యము యొక్కయే మూడు రూపములు. చైతన్య మొకటియే యయ్యు దాని ప్రకాశ మంతర్ జగత్తునందును బాహ్య జగత్తునందును వ్యాపించియున్నది. 'అంతర్ బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః' — అంతర్ జగతియందు విశేషించి నానా విధ క్రియలలో గుండ చైతన్య ప్రకాశము అధ్యాత్మము. బహిః పపంచమునందు శబ్ద స్పర్శ రూప రస గంధములు భూతవస్తు సముదాయము—

జీవావస్థయందలి అల్పత్వమును సంవేగమునుదాటి దివ్య జీవనముగని 'వైపే-సంపదను' బడయుట. అపుడు జీవనములోపల భాగవత మూర్ఛనప్రకాశించును. బ్రహ్మచ్ఛందముచే అపుడు జీవనము లీలాయితమగును. మానవునందే జీవన ధారాభివ్యక్తి శుష్కముకాలేదు — దానికింకను పై వికాసమున్నది. కావున ఈ రీతిగా అలౌకికమగు ఆ మార్గమును సాధకుడు ఉపాసనచే కనుగొనును. ఇది దివ్యసిద్ధి. ఈమార్గమున యోగశక్తికి వికాసము. తపశ్శక్తిచే ఇచ్ఛ అప్రతిహతమగును. ఈ యవస్థా విశేషము గూడ ముక్తియే. ఏలనగా జీవునందిచట అల్పత లేదు. కాని అవిద్య ఇంకను ఉండనే ఉన్నది. తన మహిమలో తానున్న పిదపనే దేశకాల కర్మముల నుండి మనకు బంధము పోగలదు. సిద్ధులు మొదలగు శక్తులిచట అకించిత్కరములు. ఆత్మవికాసము స్పందశూన్యము, స్వప్రకాశము శివము శాంతము అద్వైతము.

విశ్వచ్ఛందము పైన ప్రజ్ఞాలోకము. అచట ఛందము భాష. స్పందము అంతర్హితము. అది వ్యక్తమూ కాదు, అవ్యక్తమూ కాదు. మఱి యీ రెంటికి అతీతము. అచట వివర్తము శాంతము. శక్తి నిర్వాపితము. విశ్వలీల స్తబ్ధము. ఇది సత్యము, ఇది మహిమ, ఇది అభయము. ఉపనిషద్విద్యచే ఈ అభయ ప్రతిష్ఠ.



# 2. గీతలలో ఆత్మ

## పీఠిక

[ ఆత్మతత్త్వమును గురించి గీతల మత మిట్టిదని తేల్చుట తేలికయుఁ గాదు; అటులు తేల్చుకొనవలయునను పట్టుదలయు లోకులకులేదు. గీతలకేరీతిగా వ్యాఖ్యానము చేయుచో తమతమ సంప్రదాయములు సమర్థింపదగునో ఆ రీతిగా వ్యాఖ్యానము చేయుటయందే పలువురకు పట్టుదల. కాని నేనేమతమును సమర్థింప బూనుకొనను. గీతాకారుఁడే యుద్దేశముతో గీతను రచించెనో, ఏ మతమును పోషించెనో దానినే వివరింతును. గీతలలోని ఆత్మతత్త్వము నాకుద్దిష్టము.

గీతారచనము ఐతిహాసిక ఘటనామూలకము కాదా యని విచారించుట నా పనికాదు. ఒకవేళ అది ఐతిహాసికము కాకపోవచ్చును గాని అచట జరిగిన దనిన పని యిది – కౌరవులును, పాండవులును కురుక్షేత్రమున యుద్ధమునకు డీకొనిరి. చంపుకొనుట కిక ఆలస్యములేదు, అపుడు 'నేను యుద్ధము చేయను; జాతిని, కులమును, ధర్మమును నాశనముచేసి నేను జయమును కోరను, రాజ్యమును కోరను' అని అర్జునుఁడనెను. గీతాకారుఁడీ సంగతిని ఉపలక్షించెను–కాని గీతాకారుని లక్ష్యము ఆత్మతత్త్వము. శి. శా. ]

# ఆత్మతత్త్వము

## ౧

### ఆత్మస్వరూపము

"నేను యుద్ధము చేయను" అని అర్జునుఁడు కృష్ణునితో పలికి, విల్లు క్రిందఁబడవయిచెను. అపుడు కృష్ణుఁడు 'ఆత్మకు మృత్యువులే' దనియు, 'దేహము పోయినను ఆత్మకేమియు లోటు లే'దనియు అతనికి బోధచేసెను. కృష్ణుని మాటలివి–

'నీవు గాని నేనుగాని మఱి యీ రాజులుగాని వెనుక లేకపోము, ముందు ఉండకపోము-' (౨-౧౨)

'దేహి కౌమారము, యౌవనము, వార్థక్యమును తాల్చునటులనే ఆత్మయు మఱియొక దేహమును తాల్చును.' (౨-౧౩)

రెండు శ్లోకముల పిదప కృష్ణుఁ డిటు లనుచున్నాడు: 'లేని దానికి ఉనికి ఉండదు. ఉన్నదానికి లేమి ఉండదు' (౨-౧౬)

ఇటుపైని తొమ్మిది శ్లోకము లున్నవి :

"ఎవ డిది యంతయు వ్యాపించియుండునో ఆతం డవినాశియని తెలిసికో. అవ్యయుఁడగు అతని నెవరును చంపలేరు" (౨-౧౭)

శరీరి నిత్యుఁడు, అవినాశి, అప్రమేయుఁడు, అతని శరీరములు నశ్వరములు. (౨-౧౮)

అతఁడు చంపువాఁడనియు, చంపబడువాఁడనియు తలచువారు తత్త్వ మెఱుగనివారు. అతఁడు చంపువాఁడునుగాడు, చంపఁబడువాఁడును గాఁడు. (౨-౧౯)

అతడెన్నడును పుట్టువాఁడును కాడు, గిట్టువాఁడును కాఁడు; లేక అతఁడు పుట్టి మరల అస్తిత్వహీనుఁడగువాఁడును కాఁడు. అతఁడు అజుఁడు, నిత్యుఁడు, శాశ్వతుఁడు, పురాణుఁడు; శరీరము నాశమయినను అతఁడు నాశము పొందడు.' (౨-౨౦)

'ఎవఁడితనిని అవినాశి యనియు, నిత్యుఁడనియు, అజుడనియు,అవ్యయుఁ డనియు ఎఱుగనో, ఓ యర్జునా! అతఁడెవరినేని చంపించుననియు చంపుననియు నెటు లెఱుఁగును ? (౨-౨౧)

'ప్రాతబట్టలు వదిలి క్రొత్తబట్టలు కట్టుకొనునటులు దేహి — అనగా దేహముకల ఆత్మ ప్రాఁతగిల్లిన దేహములను వదలి క్రొత్త దేహములు తాల్చును.' (౨-౨౨)

'శస్త్ర్ర మితని నఱకలేదు; అగ్ని తగులఁబెట్టలేదు; నీరు నానఁబెట్టలేదు; గాలి ఎండఁబెట్టలేదు.' (౨-౨౩)

'అతఁ డచ్ఛేద్యుఁడు, అదాహ్యుఁడు, అక్లేద్యుఁడు, అశోష్యుఁడు. అతడు నిత్యుఁడు, సర్వగతుఁడు, స్థిరుఁడు, అచలుఁడు, సనాతనుఁడు.' (౨-౨౪)

'అతఁడు అవ్యక్తుఁడు, అచింత్యుఁడు, అవికారి. ఇటులెఱిఁగి నీవు దుఃఖింపకుము.' (౨-౨౫)

ఓ భారతా! నిత్యుఁడును అవధ్యుఁడును అగు దేహి అనఁగా ఆత్మ అందఱ దేహములందును గలఁడు. కావున భూతసమూహము కొఱకు నీవు వగవఁదగదు. (౨-౩౦)

మనుష్యులను చంపవలసి వచ్చునను భయముచే 'నేను యుద్ధము చేయ' నని అర్జునుఁడనెను. ఈ విషయమున అర్జుననకుఁగల భ్రాంతిని పోగొట్టుటకే కృష్ణుఁడు ఈ వెనుకటి ఉపదేశములు చేసెను.

ఈ యుద్ధమునందు దేహము నశింపవచ్చును గాని ఆత్మ నశింపదు. ఈ దేహము నశించినను వగచుట కిసుమంతయుఁ బనిలేదు. ఈ దేహము పోయిన పిదప ఆత్మ మఱొక దేహమును తాల్పఁగలదు. కావున యుద్ధము చేయకుండుటకు తగిన కారణమేమియు లేదని ఈ యుపదేశమునకు తాత్పర్యము.

కావున ఇక్కడఁ జెప్పఁబడిన ఆత్మ జీవాత్మయని తేటతెల్లము.

ఇఁక పూర్వము చెప్పఁబడిన అంశములను విడఁదీసి ఈ యాత్మ ప్రకృతి యెట్టిదో విచారించి చూతము :

## ౧. అనాది - అనంతము

మనుష్యునకు చావు పుట్టుకలున్నవి. కాని ఆత్మకు లేవు. (౨౦) ఆత్మ లేని సమయ మొకటి యున్నదని సాధారణ మనుష్యులు తలఁపవచ్చును; ఒకానొక నిర్దిష్ట సమయమున ఆత్మ పుట్టి, పిమ్మట కొన్నాళ్లు బ్రతికియుండి, అటు పిమ్మట చచ్చిపోవును. ఈ మతము కూడ సత్యముకాదని గీతాకారుఁడు చెప్పెను. (౨౦) వర్తమాన కాలమునం దున్నవారు భూతకాలములో లేరనిగాని, భవిష్యత్కాలములో ఉండఁబోవరని గాని చెప్పు మతముకూడ సత్యముకాదు. (౧౨) ఈ దేహము ధరించు ముందును, దేహత్యాగము పిమ్మటను గూడ ఆత్మ కలదు. (౧౩-౨౨) కావున యీ ఆత్మ అనాదియు అనంతమును.

## ౨. అజుఁడు - అవినాశి

ఆత్మకు పుట్టుటగాని గిట్టుటగాని లేదని పలుతావులఁ గలదు. అనఁగా ఆత్మ అజుఁడు అవినాశియును. ఇంతియకాక పలుతావులలో ఆత్మ అజుఁడనియు (౨-౨౦, ౨౧) అనాశి యనియు (౨-౧౮) అవినాశి యనియు (౨-౧౭, ౨౧) స్పష్టముగాఁ జెప్పఁబడినది.

## ౩. నిత్యుఁడు, శాశ్వతుఁడు, పురాణుఁడు

ఈ యాత్మ నిత్యుఁడు (౨-౨౦, ౨౧, ౨౪) శాశ్వతుఁడు (౨-౨౦) పురాణుఁడు (౨-౨౦) సనాతనుఁడు (౨-౨౪).

మఱియొక అధ్యాయమునందు పరమాత్మయొక్క జీవభూతమగు అంశము కూడ సనాతనమని చెప్పఁబడినది. (౧౫-౭) సద్వస్తువునకు వినాశము లేదనియు, అసద్వస్తువునకు అస్తిత్వము లేదనియు ఈ దేశమున ప్రాచీనమత మొకటి కలదు. గీతాకారుఁడును ఈ మతమునే ప్రచారము చేసెను. (౨-౧౬).

సత్, అసత్-అను ఈ రెండు పదములకును గల మూలార్థమును విచారింతముగాక. ఈ రెండును 'అస' ధాతువునుండి ఉత్పన్నములు. (అస = భువి) అస ధాతువునకు ఉండుట అని అర్థము. ఉండునది సత్తు- ఉండనిది అసత్తు. సద్వస్తువు అని యనుచో అస్తిత్వముకల వస్తువు అని యర్థము. అసద్వస్తువనఁగా అస్తిత్వహీనమగు వస్తువు అని అర్థము.

అసద్వస్తువునకు అస్తిత్వము లేదనిగాని, సద్వస్తువునకు అస్తిత్వము కలదనిగాని అనుట పునరుక్తి దోష దుష్టము. అసద్వస్తువనిననే లేని వస్తువనియు, సద్వస్తువనిననే కలవస్తువనియు అర్థము. కావున అసద్వస్తువునకు అస్తిత్వము లేదనిగాని, సద్వస్తువునకు అస్తిత్వము కలదనిగాని వేఱ చెప్పఁబని లేదు. కాగా ఎందులకీ పునరుక్తి యనినచో దీనికి తగినంత కారణము కలదు. లోకులకు సహజముగా కొన్ని విషయములు బోధపడవు. వారికి తెలియుటకుఁగాను, ఒక్కొక్క వాక్యమే ఇనుమాఱు లిచట ప్రవర్తించినది.

గీతాకారుడు చెప్పిన సత్, అసత్-అను విషయములలో ఇంకను గంభీర మగు తత్త్వము కలదు. గీతా మతములో ఏదిసత్తో అది యెల్లపుడును సత్తే. ఏది అసత్తో అది ఎల్లపుడును అసత్తే. 'ఈ జగత్తు ఇపుడు ఉన్నదనియు-అనఁగా సత్తనియు, కొంత కాలమునకు ఇది ఉండదనియు-అనఁగా అసత్తగు ననియు' కొందఱు అనుకొందురు. కాని గీతాకారుని మతమిదికాదు. ఈజగత్తెపుడయినను అసత్తు కాఁగలదేని అనఁగా లేకపోవునేని ఇది ఇపుడును అసత్తనియే-అనఁగా లేనిదనియే గీతాకారునిమతము. సత్తెప్పుడును అసత్తు కాదనియు, అసత్తెపుడును సత్తు కాదనియు తెలుపుటకే గీతాకారుఁడు- 'నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః' (౨-౧౬) అని చెప్పినాఁడు.

అసత్తునకు భావము లేదు, సత్తునకు అభావము లేదు. అనఁగా అసత్తునకు సత్త లెదు. సత్తునకు అసత్తలేదు. కాఁగా ఆత్మ నిత్యము శాశ్వతము పురాణము అజము అవినాశి అని తేలినది.

## ౪. అవ్యయుఁడు - అవికారి

ఆత్మ సత్తనియు నిత్యమనియు శాశ్వతమనియు పురాణమనియు అవినాశి యనియు అనునెడల, ఆయాత్మ అవ్యయమనియు అవికారి యనియు అంగీకరింప వలయునని శాస్త్ర సిద్ధాంతము.

ఏదేని ఒక అవస్థకు మార్పు ఒప్పుకొనుచో ఆ అవస్థకు వినాశమును గూడ ఒప్పుకొనవలయును. ఎట్లనిన, ఒక తెల్లని వస్తువు కలదనుకొందము. అది నల్లగా మాఱెను. పూర్వము తెలుపు కలదు. ఇపుడా తెలుపు లేదు. తెల్లఁదనము స్థాయిగా లేదు. అది వినాశము పొందెను. మొదట తెల్లఁదనమునకు వినాశమును, పిదప నల్లఁదనము పొడ చూపుటయు జరిగెను. ఈ రీతిగా ఏ వస్తువునందు ఈ మార్పు జరుగునో ఆ వస్తువునందే వినాశముకూడ జరుగును. ఏ యవస్థకుఁగాని వినాశ మంగీకరింపనిచో మార్పు రాఁజాలదు. ఆధ్యాత్మిక ప్రపంచమందును యిటులనే జరుగును. ఆత్మకు వికారముఁగాని మార్పుగాని అంగీకరించు నెడల ఆత్మయొక్క పూర్వ రూపము నష్టమయినదని అంగీకరింప వలయును. కాని ఆత్మయొక్క స్వరూపము అవినాశి. కావున ఆత్మ స్వరూప

మున కెట్టి మార్పును ఘటిల్లఁజాలదు. ఆత్మ స్వరూపము నిత్యము శాశ్వతము. ఇందువలనఁ గూడ ఆత్మ కే విధమయిన మార్పును లేదనియు, ఇది అవ్యయ మనియు, అవికారి యనియు తెలుచున్నది. ఆత్మ అవ్యయమని (౨-౧౩, ౨౧) అవికారి యని (౨-౨౫) స్థిరమని అచలమని (౨-౨౪) పలుచోటుల స్పష్టముగాఁ గలదు.

మఱొక అధ్యాయమునఁ గూడ 'శరీరము నందున్న' ఆత్మ అవ్యయమని కలదు. (౧౩-౩౧, ౩౨; ౧౪-౫)

## ౫. సర్వగతుఁడు - సర్వవ్యాపి

ఆత్మ సర్వగతుఁడు (౨-౨౪). జగత్తంతయు వ్యాపించి అన్ని వస్తువు లందును అనుప్రవిష్టుఁడయిన వాఁడే సర్వగతుఁడు. గీతాకారుఁ డీ యర్థము నందే దేహి యగు ఆత్మను సర్వగతుఁడని చెప్పెను. ఈ భావమే-'ఎవనిచే ఇది యంతయు వ్యాప్తమాయెవో అతనిని అవినాశి యని యారయుము.' (౨-౧౭) అని యీ రీతిగా కలదు. మనము లౌకిక భాషలో జీవాత్మ అని యందుము. ఆ జీవాత్మయే సర్వవ్యాప్తి యని యిచటఁ జెప్పబడినది.

## ౬. అవ్యక్త - అచింత్య

గీతల మతమున ఆత్మ అవ్యక్తము (౨-౨౫). సాంఖ్య దర్శనము నందును గీతలలో కొన్ని కొన్ని పట్టులందును అవ్యక్త పదమునకు ప్రకృతి యని యర్థము. కాని యిచట ఈ పదము 'అప్రకటము, అప్రకాశము' అను నర్థమున వాడఁబడినది. ఇంద్రియములకు ప్రకాశము కానిదియు, మనో బుద్ధ్యాదులకు విషయము చేయుటకు వీలులేనిదియు అవ్యక్తము. గీత లీ యర్థము నందె ఆత్మ నవ్యక్తమనును.

అవ్యక్తమయిన వస్తువు ఎన్నఁడును చింతా విషయము కాఁజాలదు. దానఁజేసి ఆత్మ అచింత్య మనియుఁ జెప్పఁబడెను. (౨-౨౫)

## ౭. అప్రమేయుఁడు

ఒకచో ఈయాత్మ అప్రమేయుఁడని చెప్పఁబడెను. (౨-౧౮) 'ఇతఁడు ఇట్టివాఁడు' అని నిరూపించుటకు వీలులేనివాఁడు అప్రమేయుఁడు లేక అపరి

మేయుఁడు. అనఁగా ఏ ప్రమాణమునకును అందఁడు. ఈ వెసనే జీవాత్మయు అప్రమేయుఁడు.

పరమాత్మ ఒక్కఁడే సర్వగతుఁడు, సర్వవ్యాపి, అవ్యక్తుఁడు, అచింత్యుడు, అప్రమేయుఁడు. గీతలలో జీవాత్మయు ఇట్టి వాఁడని చెప్పఁబడు టను గుఱించి, పిమ్మట ఆలోచించెదను. గీతాకారుఁడు జీవాత్మ పరమాత్మలలో భేదము చూపలేదనియు, ప్రకృత మతఁడు జీవాత్మయని కాని పరమాత్మయని కాని విచారింపలేదనియు మునిముందే మాత్రము చెప్పవచ్చును. అతఁ డాత్మను విచారించెను. ఆత్మ విషయమును చెప్పెను. అతని మతమున ఆత్మ ఒకటియే కాని ఇందు విభాగములేదు. 'ఇక్కడ ఆత్మ పదమునకు జీవాత్మ యనియు, ఇక్కడి ఆత్మపదమునకు పరమాత్మ యనియు' మనమే విడఁబఱచి ఆయా యర్థములు చెప్పికొనుచున్నాము. కాని గీతాకారుని మతమున జీవాత్మయు పరమాత్మయు ఒకటియే. గీతాకారుఁడు పరమాత్మ కే విశేషణములు ఉపయోగించెనో, జీవాత్మకును ఆ విశేషణమునే ఉపయోగించెను. ఏలయనఁగా జీవాత్మయు పరమాత్మయు ఒకటియే.

## ౭. అకర్త

మనము ప్రధానముగా రెండవ అధ్యాయమును అవలంబించియే ఆత్మ తత్త్వమును వ్యాఖ్యానింతుము. కాని ఇతరాధ్యాయము లందును అచట నచట ఆత్మ స్వరూపము వర్ణితమయియున్నది. ఈ యన్ని చోటులను కొంచొక విశేష మేమనఁగా 'ఆత్మ అకర్త'గా చెప్పఁబడెను.

ఆత్మ అవ్యయుఁడనియు, అవికారియనియు ననువారు ఆత్మయెన్నఁడును కర్త అని అనలేరు. కర్మతో కర్తకుఁగల సంబంధమును విడఁదీసి చూచిన యెడల ఈ విషయము సులువుగా తేలిపోవఁగలదు. కర్త యెవఁడేని తాను చేసిన కర్మను ఉదాహరణముగా గ్రహించి చూచుకొనుఁగాక ! కర్తకు ప్రధానముగా అయిదవస్థలు కలవు. కర్మ చేయవలయునను ఊహలేని అవస్థ యొకటి. కర్మ ఆరంభము కాఁబోవు అవస్థ రెండవది. కర్మచేయునవస్థ మూడవది. కర్మచేయుట అయిపోయిన అవస్థ నాలుగవది. కర్మచేయఁబడి స్మృతిగా పరిణమించునది గాని, మఱపులో పడిపోయినది గాని అగు అవస్థ అయిదవది. ఈ అయిదవస్థలును ఒక

దాని కొకటి యించుకయు కలిసియుండకపోవు. వీనిలో ఒకదానితో మఱియొకటి యేమాత్రమో కలిసి యుండును. సులభముగా తెలియుట కొఱకే మనమీ అయిదవస్థలను విడివిడిగా కల్పన చేయుచున్నాము. ఈ అయిదవస్థలును ఎన్నడు సంపూర్ణముగా ఒక్కటికావు. మొదటి అవస్థ యెల్లపుడును ఉండునెడల కర్మ మాటయే ఉండదు. మొదటి యవస్థ కేదేని మార్పు జరుగునెడలఁ గాని కర్మ చేయవలయునని జ్ఞానము, ఇచ్ఛ కలుగునెడలఁగాని కర్మ ఆరంభమగుటకు వీలు కలుగును, అటులు కలిగిననే మనుష్యుఁడు కర్మ చేయఁబూనును. కర్త యెపుడు కర్మ చేయఁబూనుకొనునో అపుడే ఆ కర్మతోపాటు అతనికి నూతన జ్ఞానమును నూతన భావముల ఉద్రేకమును కలుగును. మరియు అతడు నూతన భావములతో ఇచ్ఛాశక్తిని ప్రయోగించుచుండును. ఈ సమయమునం దేవస్థ యుండునో కర్మసమాప్తియం దతని కా యవస్థ యుండదు. కర్మను చక్కగాఁజేసి కర్త క్రొత్త యభిజ్ఞతను పొందును. నూతన భావములచే ఆక్రాంతుఁడగును. అతని ఇచ్ఛలు గూడ నూతన భావములచే చాలితములగును. ఈ నాల్గవ యవస్థ మూడవ యవస్థ కన్న వేఱు. కర్మచేసిన వెనువెంటనేయుండు నవస్థ చాలఁగాలముండదు. కర్మయెపుడు ప్రాచీన కాలమున జరిగిన దానితో పాటగునో యెపుడా కర్మమాట గుఱుతునందేని యుండదో అపు డాకర్త కొక క్రొత్త యవస్థ కలుగును. కావున కర్త యొక్క మనోఽవస్థ అన్ని సమయము లందును ఒక విధముగనే యుండదనియు వేఱువేఱు వేళలందు వేఱువేఱుగా మాఱుననియు కనఁబడుచున్నది. కర్మను గుఱించిన ఊహయే లేనపుడు కర్త కర్తయేకాఁడు, మఱి అకర్త. అతని యవస్థ కే మార్పును లేనంతవఱకు అతఁ డకర్తగనే యుండిపోవును. కర్మ చేయవలసి వచ్చుచో అతని అవస్థకు మార్పు కలుగవలసినదే. మఱియు ఎవఁడెల్లపుడును కర్మశీలుఁడగునో అతని యవస్థయు ఎల్లపుడును మార్పు పొందుచుండవలసినదే. కర్మ యెటులు వేఱువేఱో కర్మకు సంబంధించిన జ్ఞానమును భావమును ఇచ్ఛయు అటులనే వేఱువేఱు.

కర్మతత్త్వ మింకను లోతు. ప్రకృతము మనము విచారించు కర్మ, కర్త యొక్కయే బయటి చూపు. (బాహ్య ప్రకాశము). కర్త మనస్సులోని భావమే కర్మ రూపముగా ప్రపంచమునకు కనఁబడును. ఈ బాహ్యావస్థ యెటులు వేఱు వేఱో, యెటులు మార్పు చెందునో కర్తయొక్క మనోఽవస్థయు అటులనే వేఱు వేఱును, మార్పు చెందునదియును అగుచుండును. లోని అవస్థ మాఱనిదే

బయటి అవస్థ మాఱఁజాలదు. కావున కర్మ పొసఁగి నంతనే కర్తకు వేఱువేఱు అవస్థలు కలుగునని తేలుచున్నది; కర్తృత్వ మంగీకరించినంతనే కర్తకు వికారమును మార్పును అంగీకరింపవలసివచ్చును.

గీతల మతమున ఆత్మ అవ్యయుఁడు; అవికారియు. కర్తృత్వ మొప్పితిమేని మార్పు నొప్పుకొనవలయును. కావున గీతాకారుఁడు ఆత్మకు కర్తృత్వ మప్పగింపలేదు.

ఈ విషయమున గీత సాంఖ్యమతమును గ్రహించెను. ఆత్మ ఏ పనిని చేయదు. ప్రకృతి పనిచేయును. ఇయ్యెడ ప్రమాణము :-

(క) ప్రకృతియొక్క గుణములచేత చేయఁబడు కర్మలను చూచి వానికి నేను కర్తనని మూఢుఁ డనుకొనును. (౩-౨౭)

(ఖ) దీనిపై శ్లోకము-గుణములన నేమియో, కర్మ అననేమియో యెఱిఁగినవాఁడు గుణములే గుణములను అనువర్తించునని యెఱుఁగును. ఇది యెఱిఁగి అతఁడు వాని యెడల అసక్తుఁడు కాడు. (౩-౨౮)

గుణ కర్మ పదములకు పెక్కు అర్థములు కలవు. ఆ వ్యాఖ్యల నన్నిటిని కలిపి చూచుచో గుణ కర్మలకంటె ఆత్మ వేఱని తేటపడును.

గుణసమూహము గుణసమూహము ననువర్తించుననఁగా ఇంద్రియములు విషయములలో ఆసక్తములగునని తాత్పర్యము.

(గ) 'ప్రకృతియే అన్ని విధములను కార్యము చేయును, ఆత్మ అకర్త' అని యెవఁడు తెలియునో వాఁడే తెలిసినవాఁడు. (౧౩-౨౯,౩౦)

(ఘ) మఱియొకచో నిటులు కలదు— 'ఇంద్రియ సముదాయమే ఇంద్రియముల విషయమున ప్రవర్తించును. నేనేమియు చేయును'—అని తెలిసినవాఁ డనుకొనును. (౫-౮-౯)

(జ) ఈశ్వరుఁడు లోకులకు కర్తృత్వమును గాని కర్మలను గాని కర్మఫల సంయోగమును గాని సృజింపలేదు; స్వభావమే ప్రవర్తించుచున్నది.

(ఛ) ఈశ్వరుఁ డెవరి పాపమును గాని పుణ్యమును గాని గ్రహింపఁడు. కర్మ చేసినంతనే ఫలమును పొంది తీరవలయును. ఆత్మ కర్మ చేయదు. కావున అతనికి పుణ్యపాపములు లేవు. (౫-౧౫)

పదమూడవ అధ్యాయమున ఈ శ్లోకము దొరుకుచున్నది – అది లేని వాడగుటవలనను, గుణము లేనివాడగుటవలనను అవ్యయుఁడగు ఈ పరమాత్మ శరీరమునందు ఉండియు ఏమియు చేయడు; లిప్తుఁడును కాఁడు. (౩౧-౩౨)

గీతల మతమున ఎవఁడు జీవాత్మయో, అతఁడు పరమాత్మ. కావుననే ఇచట శరీరమునందు ఉన్న ఆత్మ పరమాత్మగా చెప్పఁబడియె. శరీరము నందున్న ఈ యాత్మ అకర్త. ఇతఁడేమియు చేయఁడు. దేనివలనను లేపము చెందఁడు.

(జ) అంతటనుగల ఆకాశము అతి సూక్ష్మమయిన దగుటవలన దేనివలనను లిప్తము కానటులనే దేహమునం దంతటను ఉన్నను ఆత్మ దేనివలనను లిప్తముకాదు. (౧౩-౩౨)

ఆత్మ యెటులును దేహ వ్యాపారముతో లిప్తము కాదని ఇచటను చెప్పఁబడినది.

(ఝ) పదునాల్గవ అధ్యాయమున ఇటులు కలదు– 'ఎవడు గుణములకంటె కర్తను విడిగా చూడఁడో, మఱియు గుణములకంటె అతీతుఁడగు పరుని జూచునో అతఁడు నా భావమును పొందును. (౧౪-౧౯)

ఆత్మ కర్త కాదనియు, గుణసమూహమే కర్తయనియు, ఆత్మ గుణములకంటె వేఱనియు ఇచట తెల్లము.

## ౯. ఏక – అద్వితీయ

గీతాకారుఁడు 'ఆత్మ ఏకము, అద్వితీయము'– ఈ ప్రకారమగు భాష నెచటను వాడలేదు. ఉపనిషత్కాలమున నీ మతము తొలుత ప్రచార మాయెను. సత్యమేదేని క్రొత్తగా వెలువడినచో అది పలు తెఱఁగుల నుల్లేఖింపఁబడుటయు, వ్యాఖ్యానింపఁబడుటయు ఆవశ్యకముగా సంభవించును. అది సాధారణ సత్య

ముగా గ్రహింపఁబడిన పిదప దాని కిఁక వ్యాఖ్యతోఁగాని గీఖ్యతోగాని పని యుండదు. 'ఆత్మ ఏకమును అద్వితీయమును' అను నీ మతము గీతాకారుని కాలమునాటికి మూల సత్యముగా గ్రహింపఁబడెను. దానఁజేసి గీతాకారుఁ డీ విషయమున విశేషించి యే మాటయుఁ జెప్పలేదు. కాని అతని వాక్యములవల్ల 'ఆత్మ ఏకమును అద్వితీయమును' అను విషయము స్పష్టము.

అందులకు కొన్ని ప్రమాణములు :—

(క) గీతలలో ఆత్మశబ్దము నానా విభక్తులలో ఏఁబది తొమ్మిదిమాఱు లుప యోగింపఁబడినది. జీవాత్మయనియు, పరమాత్మ యనియు భేదము లేకుండగనే పెక్కుతావుల ఈ ఆత్మశబ్దము వాడఁబడినది. అన్ని చోటులను ఇది యేకవచనాంతముగనే యున్నది. ద్వివచనాంతముగాఁ గాని బహు వచనాంతముగాఁ గాని ఇది ప్రయోగింపఁబడలేదు. దీనివలన ఆత్మ ఏకమనుమాట సులభముగా నిర్ధారితమగును.

(ఖ) ఒకచో నిటులు కలదు— 'నిత్యుఁడును, అవినాశియును, అప్రమేయుఁడు నగు శరీరికి ఈ దేహములు నశ్వరములు. (నిత్యస్య అనాశినః అప్రమే యస్య ఇమే దేహాః అన్తవన్తః—) (౨-౧౮)

శరీరిణః=శరీరము కలవానికి; ఇది షష్ఠ్యేక వచనాంతము—దేహాః-దేహ ములు; ఇది బహువచనాంతము. దేహములు పెక్కులనియు, ఈ దేహ సమూహములోని ఆత్మ ఒకటియనియు దీనివలననే తేలుచున్నది—

(గ) దేహి ముదిసిన శరీరములను వదలి క్రొత్త శరీరములను తాల్చును. (౨-౨౨)

దేహీ=దేహవిశిష్టుఁడగు ఆత్మ-ఏకవచనాంతము. శరీర శబ్దము బహు వచనాంతము—ఇచటఁగూడ ఆత్మ ఒకటియనియు, శరీరములు మాత్రము పెక్కులనియు స్పష్టము.

(ఘ) ఈ యధ్యాయమునందే (౨-౩౦) - 'అన్ని దేహములయందును ఉన్న ఈ దేహి అనఁగా ఆత్మ నిత్యుఁడు, అవధ్యుఁడు' అని కలదు.

దేహీ=ఆత్మ-ఏకవచనాంతము. ఒక్క దేహియే దేహసమూహమందు ఉన్నాఁడు. ఇటను ఆత్మ ఒకటియని స్పష్టము.

(జ) 'ఓ భారతా ! సర్వక్షేత్రములందును నన్ను క్షేత్రజ్ఞునిగాఁ గూడ నెఱుఁగుము. (౧౩-౨౩) క్షేత్రజ్ఞుఁడొకఁడు- క్షేత్రములనఁగా దేహములు పెక్కు. దేహమునందలి జీవాత్మయే క్షేత్రజ్ఞుఁడని మనము సాధారణ ముగా వ్యవహరింతుము. ఇచట ఈశ్వరుని క్షేత్రజ్ఞునిగా చెప్పుటవలన జీవాత్మకును పరమాత్మకును ఏకత్వము చూపఁబడినది. ఒక పర మాత్మయే సకల క్షేత్రములందును కలదనుటజేసి ఆత్మ ఒకటియని తెల్లము.

(చ) ఒకచో ఒక ఉపమచే ఈ మాటయే చెప్పఁబడినది :

'ఓ భారతా ! సూర్యుఁ డొకఁడే ఈ లోకమునంతయు ప్రకాశింపఁజేయు నటులు క్షేత్రి-అనగా ఆత్మ, క్షేత్రము లన్నింటిని ప్రకాశింపజేయును. (౧౩-౩౩,౩౪)

లోకులు పలువురు. క్షేత్రములును పెక్కు. సూర్యుఁ డొకఁడు. క్షేత్రజ్ఞుడును ఒకడు. పెక్కు లోకులలో సూర్యుఁడొక్కరుఁడు. పెక్కు దేహములలో ఆత్మ ఒక్కఁడు.

(ఛ) ఆత్మ సర్వగతుఁడు. (౨-౨౪) సర్వభూతములయందు అనుప్రవిష్టుఁడై యున్నవాఁడు ఒక్కడే కాఁగలడు గాని పలువురు కాలేఁడు.

(జ) ఎవనిని మనము జీవాత్మయని యందుమో ఆ జీవాత్మ నుద్దేశించి ఒకచో- 'ఎవనిచే ఇది యంతయు నిండెనో' అని కలదు. (యేన సర్వ మిదం తతమ్ (౨-౧౭) ఏది సర్వవ్యాపియో అది పెక్కుకాదు-ఒక్కటియే.

(ఝ) 'యోగయుక్తుఁడును, సమదర్శియు నగువాఁడు ఆత్మ నన్నిభూతము లందును ఆత్మయం దన్ని భూతములను చూచును.' (౧౩-౨౯)

ఇచట ఆత్మపదము ఏకవచనాంతము-భూతములు పెక్కు కాగా ఆత్మ అద్వితీయము.

ఇచట ఆత్మ పదమునకు పరమాత్మయని కొందఱు కొందఱు చెప్పుదురు. గీతాకారుఁ డిచట జీవాత్మ పరమాత్మల నడుమ ఒక గీటు గీయలేదనియే నా చెప్పునది. అతఁడు ఆత్మనే యెఱుఁగును. ఈ శ్లోకమున ఈ ఆత్మ మాటయే కలదు.

## ఉపసంహారము

పైని ఉదాహరింపబడినదాని సారాంశమిది :

ఆత్మకు ఆద్యంతములులేవు. అనాది, అనంతుఁడు. అతడు పుట్టఁడు, గిట్టఁడు. అజుఁడు. అవినాశి. అతఁడు నిత్యుఁడు, శాశ్వతుఁడు, పురాణుఁడు, అవ్యయుఁడు, అవికారి, సర్వగతుడు, సర్వవ్యాపి, అకర్త, ఒక్కఁడు, అద్వితీయుఁడు.

పలువురు ఆత్మయనఁగా మనస్సు, చిత్తము, బుద్ధి, ఇచ్ఛ, సుఖము, దుఃఖము— ఈ మొదలుగా అర్థము చేసికొందురు. కొందఱు బహుశః అహంకారమని అనుకొందురు. అహంకారమను నదొక దార్శనిక పదము. 'అహంభావము' —నేను అను బుద్ధి అని దీని భావము. గీతాకారుని యుద్దేశమున ఆత్మయనఁగా నిది యేమియుఁ గాదు. ఈ సమష్టియుఁ గాదు. (౧౩-౫,౬,౭)

ఇది యెల్లయు అనాత్మవస్తువు. ఆత్మ దీనికెల్ల అతీతము. ఆత్మ వ్యక్తము, అచింత్యము మఱియు అప్రమేయము—ఇదియే గీతోపదేశము !!

# అక్షరతత్త్వము - బ్రహ్మము

ఉపనిషత్తులును బ్రహ్మసూత్రములును పరమాత్మనే అక్షరునిగను బ్రహ్మమునుగను చెప్పును. గీతలలో ఈ విషయమున రెండు విరుద్ధ మతములు చూపట్టును.

గీతాకారుఁడు ఉపనిషదాదుల మతమును గూడఁగైకొనెను. కాని అతఁడు కొన్నికొన్ని చోటుల అక్షరునకును బ్రహ్మమునకును రెండవ స్థానమిచ్చెను. గీతాకారుని మతము నీ దిగువఁ గనుఁగొందము.

## అ క్ష ర

ఎనిమిదవ అధ్యాయమున అక్షరతత్త్వము చెప్పఁబడినది. ఈ దిగువ ఈతత్త్వమును విదఁబఱచుచున్నాను.

(క) "అక్షరం బ్రహ్మ పరమమ్" –అని మూడవశ్లోకము. అక్షరము పర బ్రహ్మము (అనగా ఈ రెండును ఒకటి).

నశించు స్వభావము కలదిగాని మాఱు స్వభావము కలదిగాని క్షరమనఁబడును. క్షరముకాని దక్షరము. అక్షరమనగా అవ్యయము, అవినాశి. (మాఱనిది, నశింపనిది).

(ఖ) పదునొకటవ శ్లోకము అక్షర పరము. ఈ శ్లోకము తెలిసికొనుటకు దీని వెనుకటి మూఁడు శ్లోకములును తెలిసికొనవలసి యుండును. ఇవి :

యోగయుక్తమును చెదరనిదియును అగు మనస్సుచే ధ్యానించుచు పరమ పురుషుని పొందును. (పరమం పురుషం దివ్యమ్) (౮–౮)

చీకటి కావలనున్న వానిని సూర్యప్రకాశుని అచింత్యరూపుని జగచ్ఛాసకుని అణువుకంటె అణువైన వానిని కర్మఫల జాతమును విధించువానిని పురాణుని సర్వజ్ఞుని ఎవడు స్మరించునో, అతఁడు పరమ పురుషుని పొందును. (౯)

'ఎవఁడు ప్రయాణకాలమునందు చలింపనిచిత్తముతో భక్తి కలిగి యోగబలముచే కనుబొమల నడుమ ప్రాణమును లెస్సగా చొప్పించునో అతఁడు ఆ పరమ పురుషుని పొందును.' (పరమం పురుషముపైతి దివ్యమ్) (౧౦)

ఈ మూడు శ్లోకములలోను పరమపురుషుని సంగతి కలదు. ఈ పరమ పురుషునికంటె దొడ్డవాడింకొకఁడు లేఁడని చెప్పఁబనిలేదు.

(గ) వీని పై శ్లోకమే అక్షరవిషయమును చెప్పు శ్లోకము. దానికి తెలుఁగిది :

వేదవేత్తలు దేనిని అక్షరమని యందురో, వీతరాగులగు సన్యాసు లెందు జొత్తురో, దేనినికోరుచు (బ్రహ్మచారులు) బ్రహ్మచర్యము నడుపుదురో, ఆ పదమును నీకు నేను సంక్షేపముగా చెప్పుదును. [౧౧]

ఎనిమిది తొమ్మిది పదవ శ్లోకములలో ఏది చెప్పఁబడెనో పదునొకండవ శ్లోకమునఁ గూడ అదియే చెప్పఁబడెను. వెనుకటి మూఁడు శ్లోకములలోని పరమ పురుషుఁడే పదునొకండవ శ్లోకమునందలి అక్షరుఁడు.

వేదవేత్తలు దేనిని అక్షరమని అందురు? యతు లెందు జొత్తురు? బ్రహ్మచారు లెవని గూర్చి బ్రహ్మచర్యము నడుపుదురు? అతఁడెవఁడు? పరమ పురుషుఁడు కాక మఱెవరు? అతనికన్న దొడ్డవాఁ డింకొకఁ డెవఁడు? కావున ఈ పరమ పురుషుఁడు అక్షరుఁడు.

(ఘ) ఈ పరమ పురుషుని పొందుటకు యోగధారణ ఒక ఉపాయము. పండ్రెండవ శ్లోకమున ఈ విషయము కలదు. దాని పైశ్లోక మిది:

బ్రహ్మమును చెప్పు 'ఓమ్' అను అక్షరమును ఉచ్చరించుచు నన్ను స్మరించుచు దేహమును విడుచువాఁడు పరమగతిని పొందును. [౮-౧౩]

ఇచట శ్రీకృష్ణుఁడు వక్త. తాను పరమాత్మగా పై ఉపదేశము లొనరించెను. కావున మరణ సమయమున ఎవఁడు 'ఓమ్' అనుచు పరమాత్మను స్మరించునో అతఁడు పరమగతిని పొందునని పదమూఁడవ శ్లోకమున జెప్పఁబడినది.

'నే నక్షరప్రాప్తి కుపాయము తెలిపెద'నని పదునొకండవ శ్లోకమున భగవంతుఁ డనెను. అటు పిమ్మట రెండు శ్లోకములలో పరమాత్మను పొందు నుపాయము చెప్పఁబడెను. కావున పరమాత్మయే అక్షరుఁడని స్పష్టము.

అటుపై మూడు శ్లోకములు :

"అనన్యచిత్తులై యెపుడును ఎవరు నన్నుఁ దలతురో నిత్యయుక్తులగు ఆ యోగులకు నేను సులభుఁడను."

"మహాత్ములు నన్ను పొంది పరమసిద్ధిని పొందుదురు. వారు మరల దుఃఖపూర్ణమును అశాశ్వతము నగు జన్మ పొందరు."

"బ్రహ్మలోకము వఱకునుగల లోకములన్నియు పునరావృత్తిని చెందును. ఓయి కౌంతేయా! నన్ను పడయుచో మఱి పుట్టువు ఉండదు."

పదునొకండవ శ్లోకమున దేనికి 'అక్షరము' అని నామకరణము చేయఁబడెనో పదపటి మూఁడు శ్లోకము లందును దానిని పొందుటను గూర్చియే చెప్పఁబడెను. ఎవనిని పొందుచో మరల జన్మముండదో [౮-౧౪,౧౫] అతఁడే పరమాత్మ-పరమ పురుషుఁడు. అతఁడే అక్షరుఁడు.

(జ) పదునేడు పదునెనిమిది పందొమ్మిది శ్లోకములందు బ్రహ్మము యొక్క దినమును, రాత్రిని గుఱించియు, సృష్టిని ప్రళయమును గుఱించియు తెలుపఁబడెను. ప్రళయ కాలమున సమస్తమును అవ్యక్తమున లీనమగును. ఈ అవ్యక్తము ప్రకృతికే మఱొక పేరు. పై శ్లోక మిది :

'ఈ అవ్యక్తముకంటె దొడ్డదగు ఏ మఱొక అవ్యక్త సనాతన భావము కలదో అది ఈ భూతము లన్నియు నశించినను నశింపదు.' [౮-౨౦]

'ఈ అవ్యక్తమే అక్షరము. దానినే పరమగతి యందురు. దానిని పొందుచో తిరిగి జన్మలేదు. అదియే నా పరమ ధామము.' [౮-౨౧]

అక్షరప్రాప్తి కలుగుచో పునరావృత్తి లేదు కావున అక్షరుఁడే పరమాత్మ.

పదునొకండవ శ్లోకమునఁగల అక్షరుఁడే ఈ శ్లోకమునఁగల అక్షరుఁడును. ఈ అక్షరుఁడే పరమగతి. కావున అక్షరునికంటె పై మెట్టులేదు.

ఈ ప్రసంగమునందే ఈ పయి శ్లోకమున పర పురుషుని ప్రశంస కలదు; 'ఓ పార్థా! భూతము లన్నియు ఎవరిలో నున్నవో, ఎవనిచే నిదియంతయు నిండెనో ఆ పరపురుషుఁడు (పురుషః పరః) అనన్య భక్తిచేతనే పొందఁదగినవాఁడు. [౨]

ఇచటగూడ అక్షరు నుపలక్షించియే పరపురుష పదము వ్యవహరింపఁబడినది. ఈ యధ్యాయమున ఈ శ్లోకముతోడనే అక్షరతత్త్వము ముగింపఁబడెను. దీని నాలోచింపగా ఈ సిద్ధాంతము లేర్పడును:

౧. అక్షరుని పొందుచో తిరిగి పుట్టుక లేదు.

౨. అక్షరుఁడే పరమగతి.

౩. అక్షరుఁడే పరబ్రహ్మము, పరపురుషుఁడు.

## అక్షరతత్త్వము - ౨

౧౧వ అధ్యాయమున అక్షర విషయమున రెండు శ్లోకము లున్నవి. అర్జునుఁడు కృష్ణ రూపియగు భగవంతుని ఇటులు మొదటి శ్లోకముచే సంబోధించు

చున్నాఁడు— 'తెలిసికొనఁదగిన పరమాక్షరుఁడవు నీవు; నీవు ఈ జగతి కాశ్రయుఁడవు; నీవు అవ్యయుఁడవు; నిత్యమగు ధర్మమునకు రక్షకుఁడవు; నీవు సనాతనుఁడవగు పురుషుడవని నా అభిప్రాయము. [౧౮]

'ఎవఁడు పరమాత్మయో అతఁడే అక్షరుఁడు.'

ఈ అధ్యాయమునందే ౩౭వ శ్లోకమున— 'ఓ యనంతా! ఓ దేవేశా! ఓ జగన్నివాసా! నీవు సదసత్తులకు పరుఁడవగు అక్షరుఁడవు.'

సత్=వ్యక్తము, అసత్=అవ్యక్తము. అక్షరుఁడు సత్తుకంటెను అసత్తు కంటెను శ్రేష్ఠుఁడు. కావున ఈ అక్షరుఁడే పరమాత్మ.

3

౧౨వ అధ్యాయమున అక్షరోపాసన చెప్పఁబడినది. అర్జునుడు కృష్ణు నిటు లడిగెను— 'సతతయుక్తులగు భక్తులు నిన్నుపాసింతురు. మఱొక రకపు సాధకులు అవ్యక్తబ్రహ్మము నుపాసింతురు. ఈ యిరువురలో ఎవరు దొడ్డ వారు?' [౧౨-౧]

కృష్ణు డిటులు ప్రత్యుత్తరించెను—

'నాయందు మనస్సును చొప్పించి నిత్యయుక్తులై మిగుల శ్రద్ధతో ఎవరు నన్ను ఉపాసింతురో వారు యుక్తతములు.' అని నా అభిప్రాయము. [౨]

అయినను, ఎవరు సమబుద్ధికలవారై ఇంద్రియముల నరికట్టి సర్వ భూతములందును రతులై యుండి అనిర్దేశ్యుఁడును, అవ్యక్తుడును, సర్వత్రగుఁ డును, అచింత్యుఁడును, కూటస్థుఁడును, అచలుఁడును, ధ్రువుఁడును, అగు అక్షరు నుపాసింతురో వారు నన్నే పొందుదురు. [౧౨-౩,౪]

ఆ అవ్యక్తము నెడల ఆసక్తి గొన్నవారికి కష్టము మెండు. ఏలనఁగా మిగుల కష్టపడియే అవ్యక్తమును పొందఁజెల్లును. [౫]

అక్షరుఁడే ఇచట అనిర్దేశ్యుఁడు ఇత్యాదిగా చెప్పఁబడియె. ఈ విశేషణము లన్నియు పరమాత్మకుఁ గాని, పరబ్రహ్మమునకుఁ గాని చెల్లును గాన అక్షరుఁడే పరమాత్మ యనియు, పరబ్రహ్మమనియు నిర్వివాదము.

కొన్ని శ్లోకములలో జ్ఞానయోగముతో భక్తియోగము తావేజా వేయఁబడెను. జ్ఞానయోగమున కష్టము మెండు. కాని భక్తియోగము సహజమార్గము. భక్తిమార్గము అవలంబించువారి లక్ష్యము సగుణబ్రహ్మము. జ్ఞాన మార్గము వారి లక్ష్యము అక్షర బ్రహ్మము. భక్తిమార్గము సహజమార్గ మగుచో కావచ్చునుగాని 'నిర్గుణ బ్రహ్మము కంటె సగుణ బ్రహ్మము శ్రేష్ఠము' అని సిద్ధాంతము చేయఁదగిన విషయ మిచట నేమియులేదు. ఇంతియ కాక ఈ రెండును ఒకటి యనియే యిచట కలదు. "ఎవ రక్షరము నుపాసింతురో వారు నన్నే పొందుదురు"రని కృష్ణ రూపియగు భగవంతుఁ డనును. అక్షరోపాసన చేయుచో భగవల్లబ్ధియగు నన్నఁగా అక్షరుఁడును భగవంతుఁడును ఒకటియే కదా! 'ఎవ రెవరి నుపాసింతురో వారు వారినే పొందుదురు.' అను మత మొకటి గీత లలో విశేషము. 'దేవతలను పూజించువారు దేవతలనే పొందుదురు, నన్ను భజించువారు నన్నే పొందుదురు.' (౭–౨౩) అని కృష్ణుడనును. మఱొకచో 'దేవతల నారాధించువారు దేవతలను, భూతములఁ గొలుచువారు భూతములను, పితరులఁ బూజించువారు పితరులను, నన్ను భజించువారు నన్నును పొందుదురు.' (౯–౨౫) అని యనును. కావున 'అక్షరోపాసకులు భగవంతుని పొందుదురు' (౧౨–౩,౪) అని యనుచో అక్షరుఁడును భగవంతుఁడును ఒకటి అయినట్లేకదా!

అచట నచటఁగల అక్షర విషయమును చర్చచేసి "ఎవఁడక్షరుఁడో ఆతఁడే పరమాత్మ, ఆతఁడే పరబ్రహ్మమ"ను సిద్ధాంతమునకు వత్తుము.

## అక్షరునకు క్రిందమెట్టు

౧౫వ అధ్యాయమున మూఁడు శ్లోకములలో అక్షరునకు క్రిందమెట్టు ఈయఁబడినది.

'లోకమునందు క్షరుఁడనియు, అక్షరుఁడనియు ఇరువురు పురుషులు కలరు. భూతములన్నియు క్షరుఁడు. కూటస్థుఁడు అక్షరుఁడు' (౧౫–౧౬)

'ఉత్తమపురుషుఁడని మఱియొకఁడు కలఁడు. అతఁడు పరమాత్మ. ఆతఁ డవ్యయుఁ డీశ్వరుఁడు. అతఁడు లోపల ఉండి లోకత్రయమును భరించును.' (౧౭)

'నేను క్షరున కతీతుఁడ నగుటవలనను అక్షరుని కంటెను ఉత్తముఁడ నగుటవలనను లోకమునందును వేదమునందును పురుషోత్తముఁడనాఁబరఁగు దును'. [౧౮]

ఈయంశ మవైదాంతికము. అటులయ్యును ఇది గీత కంగీభూతము. వ్యాఖ్యాతలు దీనికి వేదాంతపరముగా వ్యాఖ్యానము చేయఁబోయి దీనిని దుర్బోధము చేసి వైచిరి. ఈ మూడు శ్లోకముల అర్థమును గూర్చి నా యుద్దేశ్యమిది:-

౧ ఏది నశించునో ఏది మాఱునో అదియే క్షరము. జడ ప్రకృతిని క్షరమననగును. అదియే ఇచటి క్షరము. వేదాంతము నందును, సాంఖ్యము నందును, గీతలలో నచటనచటను పురుషుఁడు అక్షరుఁడని కలదు. అక్షరుఁడనఁగా నశింపనివాఁడు మార్పు చెందనివాఁడు. ఇఁక ఇచటి విశేషమేమనఁగా క్షర పురుషుఁడు.. (క్షరము క్షరపురుఁషుడుగా వాడఁబడెను.

౨ కూటస్థుఁడు అక్షరుఁడని చెప్పఁబడెను. కూటశబ్దమునకు పెక్కర్థములు కలవు.

(క) కూట=కొండ, శిఖరము, అన్నిటికంటె శ్రేష్ఠమగు స్థానము. స్తూపము. కావున శిఖరమువలె అచలమును, స్తూపమువలె స్థిరమయినదియును అని కూట శబ్దమునకు తాత్పర్యము.

గీతలలో మఱి రెండుచోట్ల కూటస్థశబ్ద ముపయోగింపబడినది. 'యుక్తుఁడగు యోగి కూటస్థుఁడు' అని (౬—౮) శ్లోకమున గలదు.

౧౨-౩ శ్లోకమున అక్షరుఁడు కూటస్థుఁడని కలదు. రెండు చోటులను కూటస్థుఁడనగా 'అచలుఁడు.'

అచలమును నిర్వికారమును స్థిరమును అగు వస్తువు కూటస్థము — అని పాళీ గ్రంథములందు కలదు. (దీఘ-౧—౧౪-౧-౩౬ చూ);మజ్ఝిమ్ ౧-౩౧౭; సంయుక్త ౩-౨౧౧ [ఇంగ్లండ్ సంస్కరణ] టీకాకారులును అనువాదకులును శిఖరము వలె అచలము అని అర్థము చెప్పిరి.

[ఖ] కూట=మాయ, వంచన, జిహ్మత, కుటిలత; అని శంకరాచార్యులవారర్థము చెప్పిరి. కాఁగా ఎవఁడు మాయయందుండెనో, మాయ యెవని యుపాధియో, లేక ఎవఁడు మాయకీశ్వరుఁడో అతఁడే కూటస్థుడు.

గీతలలో ఇతరేతరాంశములందు 'అక్షరబ్రహ్మ పరబ్రహ్మ పరమాత్మ పరమపురుష' ఈ మొగలగునవి ఏకార్థ సూచకములు. ఈ పదములలో అర్థము నెడల పార్థక్యము చూపఁబడలేదు. కూటస్థ శబ్దమునకు తొలియర్థము చెప్పుచో అక్షరుఁడు పరమాత్మ పరమ పురుషుడు-అని అర్థము చెప్పవలయును. అటులగుచో ఇతనికన్న వేఱుపురుషోత్తముని కల్పనచేయుట అనర్థకమగును. కాని గీతలలో పురుషోత్తముఁడను మూడవ పురుషుఁడొకఁడు కల్పింపఁబడెను. [౧౬-౧౭] అసలు కూటస్థుఁడగు అక్షరుఁడే పురుషోత్తముఁడు. గీతలలో అక్షరుని క్రింది మెట్టునకు దింపి క్రొత్త పురుషోత్తమ వాదమును తేవనెత్తుటకు కారణ విశేషము కలదు.

కూటస్థ శబ్దమునకు రెండవ యర్థము గ్రహించుచో అన్ని అంశములకును అర్థ సంగతి కలుగును. కూటస్థుఁడు మాయాయుక్తుఁడగు ఈశ్వరుఁడగునెడల, పురుషోత్తముఁడు మాయాతీతమగు తురీయ బ్రహ్మమగును. కాని ఇట్టి యర్థము అప్రచలితము.

౩ పదునెనిమిదవ శ్లోకమున 'నేను వేదమునందును పురుషోత్తముఁడనాఁబరగుదును.' అని కృష్ణుఁడనుట సరికాదు. ఏ వేదమునఁగాని ఏశాఖయందుఁగాని ఈ మాట లేదు. ప్రధానములును ప్రాచీనములును అగు ఉపనిషత్తులు పంౘ్రెండు. వీనిలో నెచటను పరమాత్మగాని మఱొకరుగాని పురుషోత్తముఁడని చెప్పఁబడలేదు. 'పురుషోత్తమ' శబ్దమే లేదు.

"ఉత్తమః పురుషః" – అని ఛాందోగ్యమునందొకట గలదు. కాని ఆ ఉత్తమ పురుషుఁడు పరమాత్మకాడు. శరీరియగు ఆత్మ దేహమునుండి లేచి పరమజ్యోతిగా నగునెడల నతఁడుత్తమ పురుషుఁడగునని అచట చెప్పఁబడినది.

ఇక ప్రకృతము – పురుషోత్తముఁడనునది శ్రీకృష్ణున కొక విశేష నామధేయము. వైష్ణవ సంప్రదాయమునందీ పేరునకు చాల ప్రసిద్ధి కలదు.

పురుషోత్తముఁడనఁగనే శ్రీకృష్ణుఁడు గోవిందుదు వాసుదేవుడు – అని ఈ మొదలుగా వైష్ణవు లెఱుగుదురు. వైష్ణవ గ్రంథములలో దీనికి బహుళ ప్రచారము కలదు. వైష్ణవ పురాణములందును తత్సాంప్రదాయికములగు ఉపనిషత్తులందును ఈ పదమునకు వ్యవహారము చూపట్టును.

గీతలయందలి 'పురుషోత్తమ వాదము' ఒక వైష్ణవ మతము; ఇది వేదాంతములకు అనగా ఉపనిషత్తులకు సంబంధించిన మతముకాదు.

## క్ష రా క్ష ర వా ద ము

మహాభారతమున కొన్ని శ్లోకములలో క్షరాక్షరతత్త్వము కలదు –

"అక్షరం చ అక్షరం చైవ ద్వ్యైధీభావోఽయ మాత్మనః
క్షర స్సర్వేషు భూతేషు దివి హ్యమృత మక్షరమ్" [౨౩౮-౩౧]

క్షరమనియు అక్షరమనియు ఆత్మ ఇరుదెఱఁగులు. భూతములందు క్షరము-దివ్యలోకమునం దక్షరము.

'నవద్వారం పురం గత్వా హంసోహి నియతో వశీ,
ఈశ స్సర్వస్య భూతస్య స్థావరస్య చరస్య చ'-

ఎవఁడు చరాచరములకు ప్రభువో, అచలుఁడో, వశియో అతఁడు తొమ్మిది గుమ్మములుగల నగరు చొచ్చి, అనఁగా మానవ దేహమున ప్రవేశించి హంసయను పేరు తాల్చును.

అజుఁడగు పరమేశ్వరుఁడేల హంసయని పేరు తాల్చెనో ఆ విషయము వర్ణింపబడినందువలన పదపడి శ్లోక ముదాహరింపఁబడలేదు-దాని పై శ్లోకము :

"హంసోక్తం చాక్షరం చైవ కూటస్థం యత్త దక్షరమ్
తద్విద్వానక్షరం ప్రాప్య జహాతి ప్రాణ జన్మనీ" [౨౩౮-౩౪]

ఎవఁడు హంస యనఁబడు అక్షరుఁడో అతఁడే కూటస్థుఁడగు అక్షరుఁడు-జ్ఞానవంతుఁడీ యక్షరుని బడసి ప్రాణజన్మములను ఉత్తరించును.

క్షరట కూటస్థుఁడు, అక్షరుఁడు, పరమాత్మయు నొక్కఁడే. ఈ యద్వైతవాద మౌపనిషదమే. ఈ మతమే లోగడ ప్రచారములో నున్నది. ఈ మొదటి శ్లోకమే గీతలలో కొలది మార్పులతో నున్నది. క్షరాక్షర తత్త్వపు మార్పు మాత్రము దొడ్డది. శాంతి పర్వమునందలి క్షరాక్షర తత్త్వము అద్వైత తత్త్వము. ఇచ్చోట గీతలలో త్రితత్వవాదము నెలకొల్పఁబడినది. ఈ యంశమున క్షరాక్షర పురుషోత్తమ తత్త్వములు మూడును మూఁడు తత్త్వములు.

అసలు గీతలలో ఈ యంశము లేదని నేనూహింతును. ప్రాచీనకాలము నందే తమ సంప్రదాయమున కనుకూలముగా ఏ వైష్ణవుఁడో దీనిని ప్రవేశపెట్టి యుండును. ఇందుకొఱకు చాల చోటుల క్రొత్త శ్లోకములగూడఁ గూర్పవలసి వచ్చెను. క్షరాక్షర సంక్రాంత శ్లోక సమూహ మీరకములోనిదే! వైష్ణవమత ప్రచారముకొరకవి ప్రక్షిప్తములయినవి. క్షరుఁడేకాక కూటస్థుఁడగు అక్షరుఁడు గూడ పురుషోత్తమునకు క్రింద నిలువఁబెట్టఁబడెను. అనఁగా వైష్ణవుల పురుషోత్తముఁడు ఔపనిషదమైన బ్రహ్మముకన్న దొడ్డ. ఈ యంశము ఎవరో యిందు కూర్చిరనుచో గీతల మూలమతమునకు వ్యత్యయము కలుగదు. ఈ యంశము తీసివేయుచో గీత అంగహీనము కాదు. గీతలలోని ఏ ఇతర మతము నకును ఇది ఆధారము కాదు గీతలలో మఱి యెచటఁగాని దీని కనురూపమగు మతములేదు. పైఁగా దీనికి విరుద్ధమగు మతములే ఉన్నవి. మఱియు దీని వెనుకటి శ్లోకములకును దీనికిని ఎట్టి సంపర్కములేదు. కావున ఈ యంశము ప్రక్షిప్తమని సిద్ధాంతము చేయవచ్చును.

బ్రహ్మతత్త్వము

ఆత్మతత్త్వము అక్షరతత్త్వమను ఆలోచించిన పిదప, బ్రహ్మతత్త్వమును గుఱించి యాలోచింపవలసిన పని యుండదు. ఏలనఁగా ఆత్మయు అక్షరుఁడును బ్రహ్మమును ఏకమే. కాని గీతలలో బ్రహ్మతత్త్వమునెడ మతభేద మున్నది. దానఁజేసియే విడిగా ఈ తత్త్వము విచారింపఁబడుచున్నది. బ్రహ్మ విషయమున ముఖ్యాంశము లివి :

"దేనిఁ దెలియుచో మోక్షము లభించునో దేనిని తెలిసికొనవలెనో దానిని గూర్చి చెప్పెదను. దానికి మొదలు లేదు. అది పరబ్రహ్మము; అది సత్తు కాదు.

[స త్తనఁగా దేశకాలములందు వ్యక్తమగు వస్తువు] అసత్తునుకాదు. [అస్తిత్వము లేనిది-౧౩-౧౩]

"దాని కెట జూచినను కాలు సేతులు చెవులు కన్నులు మోము తలలు కలవు. అది యెల్లయు ఆవరించి లోకమధ్యమున నున్నది." [౧౩-౧౪]

"దానికి అన్ని యింద్రియ ధర్మముల ఆభాసము కలదు. అయినను అది సకలేంద్రియ వివర్జితము. అది అసక్తము. అన్నిటిని భరించును, అది నిర్గుణము. అయినను గుణములను భోగించును." (౧౩-౧౫)

"అది భూతముల లోపలను బయటను గలదు. అది అచరమును చరమును. అతి సూక్ష్మమగుటజేసి తెలియరానిది. అది దవ్వులను దాపులను గలదు."

(౧౩-౧౬)

"అది భూత గణముల నడుమ అవిభక్తముగా నున్నను విభక్తముగా నున్నటులు కన్పట్టును. తెలియఁదగిన ఆ వస్తువు భూతములను ఏలును; తినును. మఱియు దాని స్వభావము పుట్టుట." (౧౭)

ఇందలి ౧౪వ శ్లోకము శ్వేతాశ్వతరమునుండి తీసికొనబడినది. [౩-౧౬] బ్రహ్మము లేక పరమాత్మ దాని యుద్దేశ్యము. మహాభారతమున పలుతావుల ఇది గైకొనఁబడియె ననుచో భారత కర్త కది యెంత ప్రియమో గ్రహింపనగును. [చూ. శాంతి ౨౩౮-౨౯; ౩౧౨-౧౪; అను ౧౪-౪౧౮; ౪౧౬ అశ్వ ౪౦-౪ ఇత్యాది]

ఈ పైని ౧౩, ౧౪ శ్లోకముల పూర్వార్ధములు గూడ శ్వేతాశ్వతరము నుండియే గైకొనఁబడినవి. [౩-౧౭]

ఈ పై నుదహరింపఁబడిన శ్లోకములు మిగుల ఉపాదేయములు. వీనిలో విశుద్ధ బ్రహ్మవాదమే కలదు. ఈ బ్రహ్మమే పరమసత్త. దీనికంటె దొడ్డది మఱియొకటి ఉండబోదు.

## బ్రహ్మమే లక్ష్యము

చాల చోటులలో బ్రహ్మమే లక్ష్యమని కలదు. కొన్ని చోట్లు:

(క) యోగయుక్తుఁడగు ముని ఆలస్యము లేక బ్రహ్మమును పొందును. [బ్రహ్మ న చిరే ణాధిగచ్ఛతి] ౫—౬

(ఖ) 'చచ్చిన పిదప కొందరు దక్షిణాయన మార్గమునను, కొంద ఱుత్తరాయణమార్గమునను పోదురు. ఉత్తరాయణమే దొడ్డబాట. ఈ బాటను వెళ్లువారికి మఱి పుట్టుక లేదు. ఆ మార్గమున అనఁగా ఉత్తరాయణ మార్గమున వెళ్లుచో బ్రహ్మవేదులు బ్రహ్మము నొందుదురు.' ౮—౨౪.

(గ) సిద్ధిపొందుట యనఁగా బ్రహ్మమును పొందుటయని. [బ్రహ్మ ఆప్నోతి] ౧౮—౫౦లో కలదు.

(ఘ) సాధకుఁ డెపుడు భూతముల వేఱిమిని ఒకనియందే చూచునో దానినే భూతముల యుత్పత్తిని చూచునో అపుడతఁడు బ్రహ్మమగును. [బ్రహ్మ సంపద్యతే] [౧౩-౩౦ లేక ౩౦]

'బ్రహ్మ సంపద్యతే' అను వాక్యము చాల ప్రసిద్ధిని సంపాదించుకొనినది. 'బ్రహ్మమగునని' బ్రహ్మలబ్ధి కలుగునని దీని యర్థము. భారతమున పలుతావుల నీ ప్రయోగము కలదు. శాంతి ౨౧-౫; ౨౬-౧౪౧౫; ౬౬-౩౮; ౨౩౮-౨౧; ౨౬౧-౧౫; ౧౬; ౩౨౫-౩౩ ఈ మొ. చూచునది. బ్రహ్మమే పరమ వస్తువు కాన బ్రహ్మత్వలాభము లక్ష్యరూపముగా చెప్పఁబడెను.

(ఙ) గీతలలో బ్రహ్మభూత శబ్దము ముమ్మాఱు [౫-౨౪; ౬-౨౭, ౧౮-౫౪] బ్రహ్మ భూయ ఇనుమాఱు [౧౪—౨౬; ౧౮—౫౩] బ్రహ్మనిర్వాణ నలుమాఱు [౨-౭౨, ౫-౨౪, ౨౫, ౨౬] బ్రాహ్మీస్థితి ఒకమాఱు [౨-౭౨] వాడఁబడెను. వీని అన్నిటికిని బ్రహ్మస్వరూప ప్రాప్తి, బ్రహ్మమును జొచ్చి నిర్వాణము పొందుట, బ్రహ్మమునం దునికి గొనుట అని అర్థము. సాధన లన్నింటికిని బ్రహ్మత్వప్రాప్తియే లక్ష్యము. దీనియందే సాధనలన్నింటికిని ముగింపు. దీనికంటె వేఱొక దొడ్డయవస్థ లేదు. కాఁగా బ్రహ్మముకన్న దొడ్డది మఱియొకటి లేదు. బ్రహ్మమే పరమవస్తువు. కాననే బ్రహ్మత్వలబ్ధికే ఇన్ని సాధనలును.

## బ్రహ్మము - శ్రీకృష్ణుఁడు

అంతటను బ్రహ్మమునకే ప్రథమస్థాన మీఁబడెను గాని ఒకచోట మాత్రములేదు. — 'నేను అమృతమును అవ్యయమును అను బ్రహ్మమునకు పునాదిని. (బ్రహ్మణోహి ప్రతిష్ఠాహమ్) మఱియు నేను శాశ్వత ధర్మమునకును పరమ సుఖమునకును పునాదిని. ౧౪—౨౭

కొందఱీ ప్రథమాంశమున కిటు లర్థము చెప్పుదురు :

"నేను బ్రహ్మమునకును అవ్యయమగు అమృతమునకును అనఁగా మోక్షమునకును పునాదిని."

ఈ యంశమున శ్రీకృష్ణుఁడు వక్త. కావున ఇచట కృష్ణుఁడు బ్రహ్మమునకును ఆశ్రయభూమిగ చెప్పఁబడెను. ఎవరో వైష్ణవ పండితుఁడీ శ్లోకమిచట ప్రక్షేపించెనని నేననుకొందును. ఇటులు చెప్పుటకుఁగల కారణము లివి :

(౧) గీతలలో నెచటనైని కృష్ణునికన్న బ్రహ్మము హీనమని చెప్పఁబడి యుండలేదు. పెక్కు తావుల కృష్ణుఁడు తనను బ్రహ్మ స్థానమున నిలువఁ బెట్టుకొనెను. ౧౦-౧౨ లో కృష్ణుఁడు పరబ్రహ్మముగా చెప్పఁబడెను. అంతియ కాని కృష్ణుఁడు బ్రహ్మముకన్న భిన్నుఁడని చెప్పఁబడలేదు.

గీతలలో విభిన్న విభక్త్యంతములతో బ్రహ్మశబ్ద మిరువది యెనిమిది మాఱులు ప్రయోగింపఁబడెను. వీనిలో మూడుచోట్ల పుంలింగ బ్రహ్మార్థమునను, రెండుచోట్ల వేదమను నర్థమునను, ఒకచోట "ఓమ్" అను అర్థమునను ప్రయోగింపఁబడినది. ఒకచోట వేదమని చెప్పినను చెప్పవచ్చును లేక బ్రహ్మయని చెప్పినను చెప్పవచ్చును. మిగిలిన ఇరువదియొక్క చోటులను గల ఈ బ్రహ్మ వేదాంతుల బ్రహ్మము అనఁగా పరమాత్మ. ఈ స్థలము లన్నియు పరిశీలించుచో బ్రహ్మము కృష్ణునికన్న హీనమని తోఁపదు.

(౨) ప్రకృతాలోచనమునకు విషయమైన శ్లోకమునకు వెనుకనున్న శ్లోకము లివి :

ఎవఁడు చలనములేని భక్తిచే నన్నుఁగొలుచునో, అతఁడు గుణములను దాటి బ్రహ్మత్వమునకు యోగ్యుఁడగును. (బ్రహ్మ భూయాయ కల్పతే) ౧౪-౨౬.

ఇచట కృష్ణుఁడే వక్త. కృష్ణుని గొలుచుచో బ్రహ్మత్వము కలుగునని చెప్పినటులయినది. ఇచట కృష్ణునకు బ్రహ్మమునకును ఏకత్వము చెప్పఁబడిన-దని స్పష్టము.

ఇయ్యెడ లోతుగా పరికించినచో కృష్ణత్వముకన్న బ్రహ్మత్వము మిన్న-యని చక్కఁగా తెలును. బ్రహ్మత్వప్రాప్తియే లక్ష్యమని ఈ శ్లోకము చెప్పును. దీని కుపాయము కృష్ణు నెడల భక్తి. లక్ష్యము దొడ్డది. లక్ష్యముకన్న దానిఁ-జూపుదారి దొడ్డది కానేరదు.

'కృష్ణుని గొలుచుచో బ్రహ్మమును బడయనగును' అనుచో బ్రహ్మము నకే శ్రేష్ఠత్వము చెప్పఁబడినటులగును. 'పరబ్రహ్మము నుపాసింపుము; నీవు ఆ-పరబ్రహ్మమును పడయఁగలవు.' అని ఎవరును చెప్పరు. ఇటులు చెప్పక పోవుట అటుండగా 'ఓయీ! అపరబ్రహ్మము నుపాసింపుము, అటు లుపా సించితివేని నీవు పరబ్రహ్మమును పడయగలవు.' అని చెప్పుదురు. కొలఁది ఉపాయముచే గొప్ప వస్తువును పొందుట కుపదేశింపనగును గాని గొప్ప ఉపాయముచే కొలఁది వస్తువును పొందుమని ఉపదేశింపఁదగదుగదా!

ఈ శ్లోకమున బ్రహ్మభావము దొడ్డదని చెప్పఁబడెననుటలో సందియ మింతయులేదు. కాని ఇది వైష్ణవ సాధకుల కింపితము కాలేదు. బ్రహ్మమును నీచపఱచి కృష్ణుని గొప్పచేయుట వారి కావశ్యకము. దానఁజేసి వైష్ణవ పండితుఁ డెవఁడో "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్" ఈ మొదలగు అంశమును ఇందు కూర్చెను.

ఈ శ్లోకమునందలి బ్రహ్మపదము అపరబ్రహ్మమును చెప్పునని కొంద-ఱందురు. ఇది యుక్తియుక్తము కాదు. ఏలయనిన 'కృష్ణుఁ డపరబ్రహ్మకంటె-గొప్పవాఁడని చెప్పినందువలన ఏమియు సార్థకత లేకపోవుట మొదటి కారణము. ఇందలి 'అవ్యయ, అమృత' పదములు బ్రహ్మమునకు విశేషితము లాయెనేని-

ఆ బ్రహ్మము పరబ్రహ్మమే యగుననుట రెండవ కారణము. దీని వెనుకటి శ్లోకమునందలి (౧४-౨౬) బ్రహ్మభూయ శబ్దముతో ఈ బ్రహ్మ శబ్దమునకు (౧४-౨౭) సంబంధ ముండుట మూడవ కారణము. వెనుకటి శ్లోకమున 'భక్తిచే బ్రహ్మమును పొందును' అని కలదు. పదపటిదగు ఈ శ్లోకమున 'కృష్ణుడు ఆ బ్రహ్మముకన్న మిన్న' అని చెప్పబడినది. ఇచట బ్రహ్మ భూయ శబ్దార్థ మెటులును అపరబ్రహ్మ ప్రాప్తి విషయక మగుటకు వీలులేదు. ఈ ప్రాప్తి పరబ్రహ్మ ప్రాప్తి. పరబ్రహ్మమును లక్షించి బ్రహ్మభూయ శబ్ద ముపయోగింపబడినపుడు శేష శ్లోకమునందలి బ్రహ్మము కూడ పరబ్రహ్మ మనియే సిద్ధాంతము చేయవలెను. కృష్ణశక్తి కంటె పరబ్రహ్మప్రాప్తి యెక్కువ అయినది అని చెప్పనిష్టములేక వైష్ణవు డెవడో 'బ్రహ్మమునకు నేనే ఆధారము' అను నర్థముకల 'బ్రహ్మణోహి' అను శ్లోక మిందు పడవయిచెను.

పరబ్రహ్మముకన్న శ్రీకృష్ణుడు మిన్న అని తలచు వైష్ణవు లిపుడును గలరు. వారి మతమున కృష్ణుడు, గోవిందుడు, వాసుదేవుడే పరమస్థితి. అతడే పురుషోత్తముడు. ఉపనిషత్తుల బ్రహ్మము ఆ పురుషోత్తముని 'తనుభా' అని అనగా శరీరకాంతియని వారందురు. ప్రాచీనకాలము నందును ఇటులనువారికి కొఱత లేదు. గీతలలో పూర్వోక్త శ్లోకమే దానికి ప్రమాణము.

## ఉపసంహారము

అక్షర-బ్రహ్మ విచారణమువలన తేలిన సంగతులివి.

౧. అక్షర, బ్రహ్మ, పరమాత్మ, పరమ పురుష-ఈ మొదలగునవి ఏకార్థములు, ఒకనికే పేరులు.

౨. క్షరాక్షర సంబంధమగు శ్లోకములు (౧౫-౧౬, ౧౮) ను, ౧४-౨౭ శ్లోకమును ప్రక్షిప్తములు. ఈ రెండు సంగతులును ప్రక్షిప్తములని అననిచో గీతలో ఆత్మవిరోధము కల దనవలయును.

# జీవాత్మ - పరమాత్మ

ఆత్మతత్త్వమును గుఱించి మునిమొదట వ్రాసితిని. గీతల మతమున ఆత్మ అనాది, అనంతము; అజము, అవినాశి; నిత్యము, శాశ్వతము, పురాణము; అవ్యయము, అవికారి; సర్వగతము, సర్వవ్యాపి; అవ్యక్తము, అచింత్యము; అప్రమేయము, ఏకము, అద్వితీయము.

పరమాత్మకే లోకులు సాధారణముగా ఈ విశేషణము లుపయోగింతురు. గీతాకారుని మతమున ఇవి ఆత్మకు విశేషణములు. కాని ఏ యాత్మకీవిశేషణములు వేయఁబడెనో ఆయాత్మను లోకులు జీవాత్మ అని అనుచుందురు.

గీతాకారుఁడు 'జీవాత్మ' శబ్దమును వాడలేదు. అతఁడు జీవాత్మను చెప్పఁదలఁచికొనెను గాని అందులకుఁగాను 'ఆత్మ' శబ్దమును వాడెను. పరమాత్మకు వాడిన విశేషణములే ఈ యాత్మకును—అనఁగా జీవాత్మకును వాడెను. దీనివలన 'జీవాత్మయే పరమాత్మ' యని సిద్ధాంతము చేయవచ్చును. గీతాకారుని మతమున ఈ రెండింటను భేదము లేదు. ఈ రెండును రెండుకావు; ఈ రెండు నొకటియే. కాని పండితులలో ఈ రెండును ఏకమో ఆయ్యేద మతభేదము లనేకములు కలవు.

శంకర, శ్రీకంఠ, నింబార్క, రామానుజ, విష్ణుస్వామి, వల్లభాచార్యాదు లగు పండితులు జీవాత్మకును పరమాత్మకును ఏకత్వ మంగీకరించిరి కాని ఈ యేకత్వ శబ్దార్థమును గుఱించిన మతభేదము గురుతరము. కొందఱు అన్ని విషయములందును ఏకత్వ మంగీకరింతురు. కొందఱు ఏకత్వ మొప్పుకొనియు భేదము స్వీకరింతురు. గీతాకారుఁడేరీతిగా ఈ రెంటికిని ఐక్య మంగీకరించెనో ఆ రీతి యిచట నాలోచింపవలెను. నేనే మతమునను చేరను. ఏ మతమునేని సమర్థించుటయు నా పనికాదు. ఏ మతమునకు జేరక గీతాకారుని అభిప్రాయమే కనుఁగొందును.

**ఐక్యమునకు ప్రమాణములు**

(క) ౬, ౭వ శ్లోకమున జీవాత్మ పరమాత్మగాఁ జెప్పఁబడెను.

ఆ శ్లోకమిది :

"జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మ సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః"

ఆత్మను జయించిన శాంతుఁడు పరమాత్మయగును. మఱియు శీతోష్ణ సుఖ దుఃఖ మానావమానములయెడ సముఁడగును. (ఖ) ఈ దేహమున ఉన్న పురుషుఁడే 'భర్త' యనియు, మహేశ్వరుఁడనియు పరమాత్మయనియు ౧౩-౨౩వ శ్లోకమునఁ గలదు. (నాలెక్క చొప్పున ౧౩వ అధ్యాయపు శ్లోకములు ౩౫).

"ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః" (౧౩-౨౨)

(గ) "ఓ కౌంతేయా! ఆదియును గుణములును లేకపోవుటవలన అవ్యయుఁడగు నీ పరమాత్మ దేహమునం దుండియు ఏమియుఁ జేయఁడు. దేని వలనను లిప్తుఁడు కాడు.

ఈ పై ప్రమాణముల వలన జీవాత్మయు పరమాత్మయు అన్ని అంశముల లోను ఏకమని స్పష్టము.

(ఘ) మనము సాధారణముగా ఏయాత్మను జీవాత్మ అని అందుమో ఆ యాత్మ 'సర్వగతము'గా చెప్పబడినది. (౨-౨-౩)

పరమాత్మకన్న వేఱొకటి సర్వగతము కాఁజాలదు. కావున ఇచట జీవాత్మ పరమాత్మలకు ఐక్యము చెప్పఁబడినది.

(ఙ) జీవాత్మ సర్వవ్యాపిగాఁ జెప్పఁబడియె. గీతాకారుని భాష యిది :

"యేన సర్వ మిదం తతమ్" (౨-౧౭)

—ఎవనిచే ఈ విశ్వమంతయు వ్యాప్తమో.

పరమేశ్వరుఁ డొకఁడే సర్వవ్యాపి కాగలఁడు. గీతాకారుఁ డందు కనురూపమగు భాషలోనే పరమేశ్వరుని సర్వవ్యాపిత్వమును వర్ణించెను.

ఉదా:

(౧) ౮-౨౨లో అంశముచే పరమ పురుషు నుద్దేశించి ఇట్లు చెప్పబడినది-

'యస్యాంతః స్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్'-

ఎవని లోపల భూతములు కలవో - ఎవనిచే ఈ విశ్వమంతయు వ్యాప్తమో-

(౨) 'నాచే నిది యంతయు వ్యాప్తము.' అని భగవంతుఁడనును. (మయా తత మిదం సర్వమ్. ౯-౪)

(౩) 'ఓ యనంతరూపా! నీచే ఈ విశ్వమంతయు వ్యాప్తము' అని అర్జునుఁడు విశ్వరూపుఁడగు భగవంతు నుద్దేశించి అనును. (౧౧-౩౮)

(౪) దేనినుండి భూతముల ప్రవృత్తియో, దేనిచే నిది యంతయు వ్యాప్తమో[యేన సర్వ మిదం తతమ్]దానిని తన కర్మచే అర్చించి మానవుఁడు సిద్ధిఁబడయును. ౧౮-౪౬

మన మెవరిని పరమాత్మయని యందుమో ఆ పరమాత్మయే ఈ నాలుగు తావులను చెప్పఁబడెను.

పరమాత్మ యొకఁడే సర్వవ్యాపి. కాని, ౨-౧౭ శ్లోకము, అంశముచే శరీరమునందలి ఆత్మ సర్వవ్యాపి అనుచున్నది. దీనివలన శరీరమునందలి ఆత్మ పరమాత్మయేయనియు, ఈ రెండు ఆత్మలును అన్ని అంశములలోను ఏకమే యనియు తెలియనగుచున్నది.

(చ) గీతాకారుని మతమున దేహమునందలి ఆత్మ అప్రమేయము. [౨-౧౮] పరమాత్మఁడొకడే అప్రమేయుఁడు. కావున ఈ యెడగూడ జీవాత్మ పరమాత్మ లిరువురకును ఏకత్వము చెప్పఁబడినదని సిద్ధాంతము చేయవచ్చును.

(ఛ) మఱియొకరీతి ప్రమాణములు కలవు:

"ఓ భారతా! అంతటను నన్ను క్షేత్రజ్ఞునిగా నెఱుఁగుము." (౧౩-౩)

క్షేత్రమన్నఁగా దేహము. దేహరూపమగు ఈ క్షేత్రము నెఱుగువాఁడు క్షేత్రజ్ఞుఁడు. (౧౩-౨)

దర్శనములభాషలో క్షేత్రమనఁగా విషయమనియు, క్షేత్రజ్ఞుఁడనఁగా విషయియనియు అగును. ఇంగ్లీషు భాషలో క్షేత్రమనఁగా Object అనియు, క్షేత్రజ్ఞుఁడనఁగా Subject అనియు అననగును. ఒకొక్క—

దేహమునందలి ఆత్మను విషయియనియు లేక జ్ఞాతయనియు, దేహమునందున్న ఒకొక్క ఆత్మకు దేహము విషయమనియు లౌకికముగా మన మనుకొనుచుందుము. దేహములెన్నియో జీవాత్మలన్ని. కాని భగవంతుఁ డిటులను చున్నాడు – 'అన్ని దేహములందును నన్నే క్షేత్రజ్ఞునిగా నెఱుఁగుము.'

"భగవంతుడే వేఱువేఱు దేహములందు జీవాత్మరూపములో ఉండి వేఱు వేఱు క్షేత్రజ్ఞులుగా ఆయెను" – అని దీనివలన సిద్ధాంతమైనది. వేఱువేఱయిన ఈ క్షేత్రజ్ఞులందఱును అసలు వేఱువేఱు పదార్థములుకావు. ఈ సముదాయమెల్లయు అద్వితీయమును ఏకమును అగు పరమాత్మయే.

(జ) ధర్మముకొఱకు మనుష్యుఁడు అతికష్టములయిన సాధనలు చేయును; వానివలన దేహమునకు క్లేశము కలుగును; తనకును కలుగును. 'మానవుఁడెంత కష్టపడుచున్నాఁడు పాపము' అని మనము వాడుచుందుము. అనఁగా జీవాత్మ కష్టమనుభవించుచున్నదని అర్థము. కాని భగవంతుఁ డిటులనుచున్నాఁడు–'ఇట్టి కృచ్ఛ్ర సాధనలచే నన్నే కష్టపెట్టుటయగును, ఏలయనఁగా శరీరమునం దున్న వాఁడను నేను–" (మాం చైవాంతః శరీరస్థమ్ కర్షయంతః–౧౭–౬)

'జీవాత్మకు కష్టము కలిగినది' – అని మనము వాడుదుము. కాని అది పరమాత్మకు కష్టము కలిగినది. అని యగుచున్నది. కాఁగా పరమాత్మయే దేహము లోపల జీవాత్మ రూపముగా ఉన్నాఁడని కానఁబడుచున్నది.

(ఝ) 'తమ శరీరములందును, పరుల శరీరములందును ఉన్న భగవంతుని ద్వేషించువారు కలరు'. అని కలదు–'మా మాత్మ పరదేహేషు ప్రద్విషన్తః" (౧౬–౧౮)

వేఱువేఱు దేహములందున్న జీవాత్మను మానవుఁడు ద్వేషించును. కాని ఇచట 'భగవంతుని' అని చెప్పఁబడెను. కాఁగా పరమాత్మయే ప్రతిదేహము నందును జీవాత్మ రూపముగా ఉండెనన్న మాట.

(ఞ) ౧౩ అధ్యాయమున పరమాత్మ నుద్దేశించి – "అది వెలుఁగులకు వెలుఁగు, అది చీఁకటికి ఆవల, అది యెఱుక, మఱి యెఱుఁగఁదగినది, ఎఱుకకు ఫలమైనది. అది అందఱి హృదయము లందును అధిష్ఠితము. – "హృది సర్వస్య అధిష్ఠితమ్' (౧౩–౧౭)

పరమాత్మ అందఱ హృదయములందును గలఁడని చరమ పాదము చెప్పుచున్నది.

(ట) 'నేను అందఱ హృదయములందును ఉన్నాను.'–'సర్వస్య చాహం హృది సన్నివిష్టః' అని ౧౫–౧౫లో కలదు.



ఈశ్వరుఁడు మాయచే భూతములను బొమ్మలవలె త్రిప్పుచు అందఱ హృదయ దేశములందును ఉండును.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా" (౧౮–౬౧)

'ఈశ్వరుఁడు' మానవుల హృదయమునందుఁగాని హృదయదేశమునందు గాని ఉన్నాఁడని ఈ ముందు చోటులఁ జెప్పఁబడెను. హృదయ శబ్దమునకు అనేకార్థములు, హృదయమనఁగా బుద్ధియని పలువురు చెప్పిరి. 'హృత్పిండము' లేక 'హృత్పిండమునందలి ఆకాశము' అని శంకరానందులును వేదాంత దేశికులును రామానుజులును చెప్పిరి. ఈ రెండవ యర్థమే ఉపనిషదర్థముతో సరిపోవును. (చూ. బృహదా. ౪–౪–౨౨, ఛాందోగ్య ౮–౩–౩ ఈ మొ) ఏ యర్థము గ్రహించినను 'పరమాత్మ మానవ దేహము నందున్నాఁడు' అని తాత్పర్యము. "ఎటులున్నాఁడు?" అని యిచట ప్రశ్న పుట్టును. జీవాత్మ రూప [illegible] సమానముగా పూర్ణభావముగా నున్నాఁడా అంశభావముగా నున్నాఁడా?" అని మరల ప్రశ్న.

ఈ రెండు మతములను సమర్థింపవచ్చును. పరమాత్మ హృదయపిండము [illegible] అంశభావముచే [illegible] పైనెప్పుడన శ్లోకములలో చివర ఆరు [illegible] అంశవాదమును గూడ సమర్థింపవచ్చును. కాని మొదటి ఆరు శ్లోకములవలన పూర్ణ భావమే సిద్ధాంతితమగును.

## అంశవాదము

గీతాకారుఁ డొకటి రెండుచోట్ల తేటతెల్లముగనే అంశవాదమును తెలిపెను– 'జీవలోకమునందలి జీవభావము నా యొక్కయే అంశము; ఇది సనాతనము. (మ మైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః (౧౫–౭)

ఇది జీవాత్మవిషయమనుటలో సందియమేమియు లేదు. ఏలయనిన ఈ శ్లోకతృతీయ చతుర్థ చరణములు – "ఇది (ఈ జీవాత్మ) మనస్సు ఆఱవదిగానున్న ఇంద్రియములను ప్రకృతియందు ఉన్నవానిని ఆకర్షించును" అని చెప్పను.

జీవాత్మ పరమాత్మయొక్క ఒక అంశమని ఇచట చెప్పఁబడెను. ఈ యంశము నిత్యమును శాశ్వతమును. ఇది యెల్లకాలమును అంశరూపముగనే యుండును. ఈ యంశమునకు ఆద్యంతములు లేవు.

సమగ్రమయిన ఒక వస్తువును దాని అంశమును ఎన్నడును ఏవిధముగను ఒక్కటగుటకు వీలులేదు. కావున జీవాత్మ పరమాత్మకంటె కొంచెము వేఱు. ఎల్లపుడును సంపూర్ణముగా వేఱయినది అంశమెన్నడును కాఁజాలదు. తుదకెప్పుడో ఒకప్పుడయినను మూల వస్తువుతో కలిసి యున్నదానినే అంశము అని అనవలసి వచ్చును. 'ఎపుడును కలిసిలేదు, కాని ఇది అంశము' అని యిట్టులు కల్పనచేయ వీలులేదు. మఱియు, 'ఈ యంశము నిత్యము' అని అన్నంతనే ఈ యంశ మెల్లప్పడును మూలవస్తువుతో కలిసియున్న'దవి అని తీరవలెను. 'ఎప్పుడో ఒకప్పుడు మూలవస్తువుతో కలిసి యుండెను గాని యిపుడు మాత్రము కలిసియుండలేదు' అని కల్పన చేసిన యెడల నిత్యత్వమునకు హాని.

కావున జీవాత్మ యెప్పుడును పరమాత్మకు అంగీభూతము, మఱియు ఈ రెంటికి నెప్పుడును వేఱిమి ఉన్నది. ఉండఁబోవును. గీత లిట్లు చెప్పుటచే భేదాభేదవాద మంగీకరించినది. భేదరహితమయిన అద్వైతవాదమును స్వీకరించినవారు పై అంశములను తమమతమున కనుకూలముగా అర్థము చెప్పకొనిరి కాని అవి కృత్రిమములు. ఈ చెప్పఁబడిన పై విషయములలో గీతాకారుఁడు భేదాభేదవాదమును విశిష్టాద్వైతవాదమును స్వీకరించెననునది ప్రకృతము.

## ప ర ప్ర కృ తి

పరమాత్మకు జీవాత్మతోఁగల సంబంధమును గుఱించి గీతలలో మఱియొక మతముకూడ కనఁబట్టుచున్నది. నేల, నీరు, నిప్పు, గాలి, మిన్ను, మనస్సు, బుద్ధి, అహంకారము ఈ యెనిమిది భాగములుగా నా ప్రకృతి విభక్తము.(౭-౪) ఈ ప్రకృతి అపర. జీవభూతమగు మఱొక ప్రకృతి కలదు. దానిచే ఈ జగత్తంతయు ధరింపబడియున్నది. అది వెనుకటి ప్రకృతికన్న దొడ్డది. అదియు నాదే. (౭-౫) రెండు విధములయిన యీ ప్రకృతినుండియే భూతములు పుట్టెనని తెలిసికొనుము. ఈ జగత్తు పుట్టుటయు గిట్టుటయు నా కడనే.(౭-౬).

పరమేశ్వరునకు రెండు ప్రకృతులు కలవు. ఒకటి అపర–రెండవది పర. ఈ రెండు ప్రకృతులే పుట్టుటకు ఉనికికి గిట్టుటకును కారణము. ఇవి పరమాత్మ యొక్కయే ప్రకృతులు. కావున పరమాత్మయే యిందుకు కారణమని చెప్పఁబడెను.

అపరప్రకృతి అచేతనమనియు, పరప్రకృతి చేతనమనియు వ్యాఖ్యాతలు వ్రాసిరి. కొందఱు కొందఱు క్షేత్రజ్ఞుఁడే పరప్రకృతియని వ్రాసిరి. పరప్రకృతి యనఁగా పరమాత్మ యొక్క తటస్థశక్తియని, విశ్వనాథుఁడు మొదలగు వైష్ణవాచార్యులు వ్రాసిరి. ఇచట గీతామతమునకు సాంఖ్య మతమునకునుగల పోలిక చూతము. సాంఖ్యుల తత్త్వము లిరువది అయిదు.

పురుషుఁడు ఒకతత్త్వము.

ప్రకృతియు ప్రకృతిమూలకములగు తత్త్వములు ౨౪. సాంఖ్య పురుషుని స్థలమున గీతలో పరప్రకృతి. గీత సాంఖ్యుల యితర చతుర్వింశతి తత్త్వములను గ్రహింపక ఎనిమిది తత్త్వములనే గ్రహించి వానికి అపరప్రకృతి యని పేరు పెట్టెను. ఈ రెండు మతములకును గల భేదమిది:

సాంఖ్యమతమున ౨౫ తత్త్వములు తక్క వేఱేమియులేదు. గీతామతమున పరాపర ప్రకృతులేకాక, మఱియొక సత్త కలదు. అది పరమాత్మ. ఈవిశేషము గీతలలోనేకాక మహాభారతమునం దచట నచటఁగలదు.

(చూ. శాంతి-౩౦౭-౩౮,౩౯)

సాంఖ్యులు పురుషుని, ప్రకృతిని అంగీకరించిరి. గీతలు పర ప్రకృతిని (సాంఖ్య పురుషుని) అపర ప్రకృతిని (సాంఖ్యుల ప్రకృతిని) పైని పరమాత్మను అంగీకరించెను.

గీతలలో మఱియొకచోట నెచటను పరప్రకృతి మాటలేదు. (౧౫–౭) అంశము విషయములో 'జీవభూత' శబ్దము వాడఁబడెను. పరమాత్మ యొక్క జీవభూతమును సనాతనమును అగు అంశమే దేహము కల ఆత్మరూపముగా ప్రకాశితమగుచున్నదని అంశవాద ప్రకరణమున చూపఁబడినది. ౧౫–౭ శ్లోకము నందును ౭–౫ శ్లోకము నందును గల అంశములకు సామంజస్యముచేసి అర్థము చెప్పచో పరప్రకృతి పరమాత్ముని సనాతనమగు ఒక అంశమని తేలును.

ఈ మతప్రకారము గీతలు చేసిన తత్త్వ విభాగమిది :

౧. పరమాత్మ.

౨. పరమాత్ముని జీవభూతమగు అంశము. (పరప్రకృతి).

౩. అపర ప్రకృతి (సాంఖ్యుల ప్రకృతి)

ఈ కాలపు ఆదర్శమునుబట్టి గీతాకారుని ఉద్దేశ్యమును వ్యాఖ్య చేయుచో ఇటు లుపపన్నమగును : గీతాకారుఁడు పరమాత్మకు రెండు భావములు స్వీకరించెను. ౧. విశ్వాతీతమగు భావమొకటి. ౨. విశ్వగతమగు భావమొకటి. పరమాత్మ ఒకదెస విశ్వాతీతుడు. మఱియొక దెస జగత్తులో చొచ్చియున్నాడు. పరమాత్ముని విశ్వాతీతభావము మనోబుద్ధుల కతీతము. కొన్నిచోటుల ఈభావము అవ్యక్తమనఁబడెను. (౨–౨౫; ౭–౨౪; ౮–౨౦: ౨౧; ౧౨–౧; ౩; ౧౩–౬ ఈ. మొ) ఇది దేశకాలములయందు ప్రకాశముకాదు. కావున మానవుఁడు దీని నిసుమంతయు నెఱుఁగఁజాలఁడు. భగవంతుని విశ్వగతభావమే జగత్తును తాల్చు చున్నది. జగత్తునకు ఈ భావముతోడనే సంబంధము. ఈ విశ్వగత భావమునే జీవభూత సనాతనాంశమనియు, పరప్రకృతి యనియు గీతాకారుఁడు చెప్పనోపు. ఈ వ్యాఖ్య యుక్తమగుచో గీతాకారుని తత్త్వవిభాగ మిటులు :

౧. పరమాత్ముని విశ్వాతీతమగు భావము. [సంక్షేపముగా పరమాత్మ].

౨. విశ్వగతమగు భావము. [పరమాత్మని సనాతనమగు అంశము లేక పర ప్రకృతి].

౩. అపర ప్రకృతి. [సాంఖ్య ప్రకృతి]

అపర ప్రకృతిని గురించి ముందు విపులముగా ఆలోచించెదను. దీనిలో పరమాత్మకు ఎట్టి అంగాంగిభావమును లేదని యిచటఁ దెలిపిన చాలును. కాని పర ప్రకృతియొక్క స్వభావము వేఱు. ఇది పరమాత్మయొక్క యే అంశము గాని అంగముగాని అయియున్నది–

ఉపసంహారము

ఈ పై వ్యాఖ్యానము వలన తేలిన సిద్ధాంతములివి :

౧. జీవాత్మయు పరమాత్మయు ఒక్కటే.

౨. కొన్ని కొన్ని అంశములందును, అన్ని అంశములందును గూడ ఈ రెండాత్మలకును ఏకత్వ మంగీకరింపబడియెను. కొన్ని కొన్ని అంశములలో జీవాత్మ పరమాత్మకు అంశముగాఁ జెప్పఁబడియెను.

౩. పరప్రకృతి పరమాత్మని విశ్వగతభావము కానోపును.

# గీతలలో ఆత్మ

## ఆత్మ – జగత్తు

సాంఖ్య దర్శనమున ప్రకృతి యనియు పురుషుఁడనియు మూలభావములు రెండు కలవు. ఈ రెంటికిని అంగాంగి భావము లేదు. రెండును వేఱు వేఱు. ఇవి రెండును రెండు సమాంతరాళ రేఖలవంటివి. పురుషుఁడు అకర్తయు అపరివర్తనీయుఁడును. కార్య మొనరించునది ప్రకృతి, పరివర్తనము చెందునది ప్రకృతి. కార్య మొనరించు ప్రకృతి దానికి స్వయముగా కలుగదు. అనఁగా తనంతట తానె కార్యమును చేయలేదు. పురుషుఁడో అకర్త. అగుచో కార్య మెటు

లారంభమగును? జగద్వ్యాపారమంతయు నెటు లగుచున్నది? ప్రకృతి సాన్నిధ్యమున పురుషుఁడున్నాఁడు; దీని వలననే ప్రకృతిలో వికారము కలుగుచున్నది. ఈ వికారమే సృష్టి, జగత్తు.

గీతాకారుఁ డీ సాంఖ్య మతమును ఈశ్వర వాదములోనికి తిప్పెను. సాంఖ్య దర్శనమున పురుషు లనేకులు; గీత ఒక్క పురుషుని లేక ఆత్మను గ్రహించెను. ఈ యాత్మతో ప్రకృతికెట్టి సంబంధమో విచారింతము.

## ఆత్మ అకర్త

గీతాకారుని ఆత్మ అకర్త యని తొలుతనే చెప్పఁబడెను. ఇతనిలో ఎట్టి కర్తృత్వమును లేదు; ఏ పని చేయుటకును చేతకాక పోవుటయే ఇతని స్వభావము. 'పని చేయఁడు, పని చేయలేఁడు' అను నీ రెండును వేఱు వేఱు. 'పని చేయఁడు' అని యనుచో 'పనిచేయు శక్తియున్నను చేయఁడు' అని అర్థమగును. ఈ యర్థములో 'ఆత్మ పని చేయఁడు' అని చెప్పుచో చెప్పవలసిన దంతయు చెప్పఁబడదు. గీతల కర్మతత్త్వము తెలుపవలయుచో 'ఆత్మ కర్మ చేయలేఁడు, ఇదియే ఆత్మ ధర్మము' అని చెప్పవలయును.

## పని ప్రకృతిదే

పని యంతయు ప్రకృతిదే. దాని వికారమున కదియే కారణము. సంసారము అనఁగా జగత్తు. సత్త్వరజస్తమోమయము. సత్త్వాదులు ప్రకృతి నుండియే పుట్టెను. ప్రకృతిజ (౩-౫; ౧౩-౨౨; ౧౮-౪౦) ప్రకృతి సంభవ (౧౩-౨౦; ౧౪-౫).

తానే పని చేయునని మనుజుఁ డనుకొనును గాని ఇది భ్రమ. ప్రకృతి యొక్క గుణ సమూహము పని చేయుచున్నది, కాని నేనే కర్తనని మూర్ఖుఁ డనుకొనును. (౩-౨౭; ౨౮) అన్ని విధముల ప్రకృతియే పని చేయునని తెలిసికొనినవారే జ్ఞానులు. (౧౩-౩౦; ౮-౯; ౧౪-౧౧) ఈ మొ.

## ఆత్మ అధ్యక్షుడు

ప్రకృతి ప్రపంచ మెల్ల ప్రసవించుచున్నది; కాని యిది పురుషుని సాన్నిధ్యము వలననే పొసఁగుచున్నది. పురుషుఁడు ప్రకృతి పార్శ్వమున నుండనిచో

ప్రకృతి యేమియు చేయలేదు. ఈ విషయమును గూర్చి భగవంతు డిటు లను చున్నాడు—'నే నధ్యక్షుఁడనుగా నుండుట వలననే ప్రకృతి చరాచర ప్రపంచము నీనుచున్నది. దీనివలన జగత్తు విపరివర్తిత మగుచున్నది.' (౯-౧౦)

అధ్యక్షుఁడనఁగా స్వామి, అధిపతి, ఈశ్వరుఁడు లేక ద్రష్ట సాక్షి అని అర్థము.

ఈ యధ్యక్షతలో కర్తృత్వవికార మేమియులేదని వ్యాఖ్యాతలు స్పష్టముగా చెప్పిరి. ఆత్మ స్వామిగా లేక ద్రష్టగా దాపున నుండును. దాపున నున్నంత మాత్రముననే ప్రకృతియందు కార్య ప్రవృత్తి కలుగును. ఈ రీతిగనే సృష్టి జరుగుచున్నది.

## క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగము

ఆత్మ యేపనియు చేయజాలఁడు. మఱి ప్రకృతియే ఒంటరిగా పని చేయుటకు శక్తిలేనిది. ఈ యిరువుర కలయిక వలన పని పుట్టును. గీతాకారుఁ డిటులు చెప్పెను—"పొడము స్థావర జంగమము లన్నియు క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగము వలననే పొడమునని యెఱుగుము" (౧౩-౨).

ప్రకృతి పురుషులు అనాదులు.

"ప్రకృతి పురుషుల ననాదులని యెఱుఁగుము" (౧౩—౨౦)

ఇది సరిగా ద్వైతవాదము. ప్రకృతియు పురుషుడును వేఱు వేఱే. ఈ రెంటిలో ఏదియు మఱొక దానినుండి పుట్టలేదు. ఈ రెండును అనామయిగా నున్నవి.

'ఒక సత్తయే కలదు.' అని ఉపనిషత్తులును బ్రహ్మ సూత్రములును చెప్పును. ఆ సత్తయే ఆత్మ లేక బ్రహ్మ. పుట్టిన దేదేని ఆత్మ నుండియే పుట్టును. ఇది అద్వైతవాదము. ఈ అద్వైతము గ్రహించుచో ప్రకృతి ఆత్మ నుండి పుట్టిన దనవలయును. గీతాకారుని దీ మతము కాదు. అతని మతమున ప్రకృతి పురుషులు వేఱు. ఈ రెండును అనాదులు.

## రెంటికి సంబంధము

ప్రకృతితో పురుషున కెట్టి సంబంధమో, జగత్తుతో పరమాత్మ కెట్టి సంబంధమో గీతాకారుఁడు పలు రెఁగులఁ దెలిపియున్నాడు.

సాత్త్వికములును రాజసములును తామసములును అగు భావములు నా వలననే కలుగుచున్నవని యెఱుఁగుము; నేను వానిలో లేనుగాని, అవి నాలోఁ గలవు [౭—౧౨].

'అవ్యక్తుడ నగు నాచే నీ జగతి యంతయు వ్యాప్తము. భూతములన్నియు నాయందు కలవు. కాని నేను వానిలో లేను' [౯—౪].

'భూతములు నా యందును లేవు, నా ఐశ్వర యోగమును చూచుకో! నా యాత్మ భూతముల ధరించి పాలించును, కాని నేను భూతములలో లేను' [౯—౫].

'ఎల్లెడలకుఁ బోవు వాయువు ఆకాశమున ఎల్లపుడు ఉన్నటులు భూతములన్నియు నాలో నున్నవని తెలిసికొనుము [౯—౬].

ఈ సంగతులు గొట్టుగా నుండును గావున వ్యాఖ్యాన మావశ్యకము.

౧. పరమాత్మ ఈ జగత్తంతయు వ్యాపించియున్నాడు. గాలి ఆకాశమంతయు వ్యాపించి యున్నటులు పరమాత్మ జగత్తంతయు వ్యాపించియున్నాఁడని అనుకొని పోదురని ఇటులు చెప్పబడెను. అతఁ డవ్యక్తభావముతో జగత్తునం దున్నాఁడు. అతని రూపము అవ్యక్తము. అతని వ్యాప్తియు అవ్యక్తము.

౨. భూతము లన్నియు పరమాత్మయందున్నవని యిటు తరువాతఁ జెప్పఁబడెను. భూతముల ఉత్పత్తి స్థితి ప్రలయములు పరమాత్మపై నున్నవి. అతఁడు లేనిచో నిదిడేదియు సంభవింపదు. భూతములు పరమాత్మయందున్నవనుట కిది యర్థము

ఈ సంగతి చెప్పిన వెనువెంటనే పరమాత్మ భూతములలో లేఁడని చెప్పఁబడెను.

౩. 'పరమాత్మ సుప్రతిష్ఠుఁడా? అప్రతిష్ఠుడా? అన్య ప్రతిష్ఠుఁడా?' అను మాట యేమియు నిట విచారింపఁబడలేదు. భూతముల ఉత్పత్తి స్థితి ప్రలయములు పరమాత్మపై నున్నవనుచో పరమాత్మకు ఈ యెడ భూతములతో ఎట్టి సంపర్క మున్నదని ప్రశ్న కలుగును. పదునేనవ అధ్యాయమున

ఈ ప్రశ్నయు దీని యాలోచనయు కలవు. పరమాత్మ ప్రతిష్ఠ విషయమున
నే ప్రశ్నయులేదు. తద్విచారణయును లేదు. ఏదేని పని కావలసిన అక్కఱ
యున్నచో, కర్త ఆ పనికి పూనుకొనును. ఆ పనితో తాఁకుచెందును. కలి
యును. మొదటినుండి తుదివఱకు మునిగితేలును. కాఁగా కర్త ఎల్లప్పుడును
పనిలో నుండును. ఈ రీతిగా పరమాత్మ సృష్టి పనికిఁగాను భూతములలో
నుండఁడని గీతాకారుఁడు చెప్పుచున్నాఁడు. లోకులే యర్థమున 'ఉండును' అని
వాడుదురో ఆ యర్థము చొప్పున పరమాత్మ భూతములలో ఉండడు.

లోక భాషలో చెప్పినచో 'పరమాత్మ ప్రకృతికి వెలుపలనున్నాఁడు'
అని చెప్పవలయును. అటులయ్యు అతని ప్రభావము ప్రకృతిపై ప్రసరించును.
ఈ ప్రభావమును విస్తరింపఁజేయవలయునను ఉద్దేశము పరమాత్మకు కలదా
యనుచో, అతని కెప్పుడును ఇచ్ఛలేదు, ప్రవృత్తిలేదు, కర్తృత్వమును లేదు.
అయినను ప్రకృతిపై నతని ప్రభుత్వ మపారము. ప్రకృతి ప్రక్క పురు
షుఁడు. పురుషుఁడు నిర్వికారుఁడు. కాని ప్రకృతి లోపల వికారము కలుగును.
ఈ వికారమే సృష్టి మొదలగు పేర వ్యవహరింపబడుచున్నది.

కావున పరమాత్మ ప్రకృతిలో ఉండఁడు. అటులుండకపోయిన అతని
అవ్యక్త ప్రభావముచే ప్రకృతి అభిభూతమై కార్యము చేయుచున్నదని తేలు
చున్నది.

౬. పరమాత్మ భూతములలో నుండని యెడల భూతము లయినను
అతనిలో ఎటు లుండఁగలవు? అనినచో గీతాకారుఁడు భూతములును పర
మాత్మలో లేవని చెప్పుచున్నాఁడు. లౌకిక కర్మకు లౌకిక కర్తతో ఎట్టి
సంబంధము కలదో, భూతములకు పరమాత్మతో అట్టి సంబంధము లేదు.
ప్రకృతికిని పురుషునకును అట్టి కలయిక లేకున్నను పురుషుని ప్రభావముచే
ప్రకృతి కార్య మొనరించుచున్నది. ఇది వింతలలో వింత. కావుననే భగ
వంతుఁడు ఇటులనుచున్నాఁడు :— 'చూచికో నా ఐశ్వర యోగము — భూత
ములు నాలో లేవు; నేను భూతములలో లేను. అయినను నేను భూతములను
ధరించుచున్నాను. పరిపాలించుచున్నాను.'

౩. భూతములు పరమాత్మలో ఉన్నవను నెడల వీని ఉత్పత్తి స్థితి ప్రలయములు పరమాత్మ కర్తృకములని అర్థమగును. భూతములు పరమాత్మలో లేవను నెడల వీనిలో లౌకిక కర్మ కర్తృత్వములకుఁ గల సంబంధము లేదని అర్థమగును. ఈ విషయము తెలుపుటకు వాయు దృష్టాంత మీయఁబడినది. చెట్లు నేలపై నున్నవి. ఇవి నేలలోనే పుట్టి నేలలోనే పాతుకుని ఉన్నవి. గాలి ఆకాశమున నున్నదే కాని అది యందు పుట్టనులేదు, అందు పాతుకొనియు నుండలేదు. గాలి యెల్లెడల తిరుగును. అది యిచ్చవచ్చిన చోటి కేగును. ఎటులు తినుగవలయు నని యనుకొనునో, యటులు తిరుగును. ఇందువలన ఆకాశమున కెట్టి మార్పును కలుగదు. గాలి తావి తెచ్చి వీచినను, చెడు కంపు తెచ్చి వీచినను, ఊరక వీచినను ఆకాశమునం దేమియు వికారము కలుగదు. గాలి ఆకాశముననే యుండును. ఆకాశముతో గాలి కెట్టి సంబంధమో పర మాత్మతో భూతముల కట్టి సంబంధమని గీతాకారుఁడు చెప్పెను.

౬. కావున ప్రకృతి పురుషు లిరువురును వేఱువేఱనియు, అనాదు లనియు గీతల మతము. వీనిలో ఏదియును మఱొక దానినుండి పుట్టలేదు. వీనికి అంగాంగి భావమును లేదు. అంగమనఁగా మనకేమి యర్థమగునో ఆ యర్థములో ప్రకృతి ఆత్మకు అంతరంగమునుగాదు, బహిరంగమును గాదు. ఆత్మ అవికారిగా నుండి అకర్తయయ్యు, అచింత్యమును అనిర్దేశ్యమును అనిర్వాచ నీయము నగు రీతిని ప్రకృతిలో వికారము కలిగించును. ఈ రెంటికిని గల సంబంధ మిది.

విడివిడిగా రెండు వస్తువులు కలవని చెప్పునది ద్వైతము. ఈ విషయ మున గీతాకారుఁడు ద్వైతి.

## ఈశ్వరవాదము

గీతాకారుఁడు సాంఖ్యుల ద్వైతవాదమును ఈశ్వరవాదముగా మార్చెను. ఈశ్వరవాదము ముఖ్యముగా ముత్తెఱగులు. అందు మొదటిది:

౧. ఈశ్వరుఁ డొక్కఁడే కలఁడు;

౨. ఆ యీశ్వరుఁడే జగత్తు సృజించును, రక్షించును, ఉపసంహరించును.

ప్రాచీనములగు ఉపనిషత్తులందును బ్రహ్మసూత్రములందును ఈ మతము గ్రహింపఁబడెను.

## రెండవ ఈశ్వరవాదము

౧. ఈశ్వరుఁడును,

౨. అతఁడు కాక ప్రకృతియు కలవు.

౩. ఈశ్వరుఁడు తన శక్తిచే ప్రకృతిని తన యిచ్ఛవచ్చినట్లు నడుపును. మఱియును క్రొత్త క్రొత్తగా రూపొనరించును.

కొందఱీ ఈశ్వరుని సూత్రధారుఁడనియు, కర్మకారుఁడనియు, కుంభకారుఁ డనియు వెక్కిరింతురు.

## మూఁడవ ఈశ్వరవాదము

౧. ఈశ్వరుఁడు కలఁడు. అతఁడు అకర్త.

౨. అనాదియగు మఱొక వస్తువు కలదు. దాని పేరు ప్రకృతి.

౩. ఈశ్వరుని అచింత్య ప్రభావముచే ప్రకృతి సృష్ట్యాది కార్యములు చేయుచుండును.

గీతాకారుఁ డీ మూఁడవ యీశ్వరవాద మవలంబించెను. సాంఖ్యుల పురుషులు పెక్కురు. గీతల పురుషుఁ డొకఁడే. ఇదియ ఈ రెంటికి భేదము. ఈ పురుషుఁడే ఈశ్వరుఁడు, భగవానుఁడు, ఆత్మ, పరమాత్మ, పరబ్రహ్మ ఇత్యాదిగా చెప్పఁబడును.

గీతల యీశ్వర తత్త్వ మెరుఁగవలయుచో ఈ నాలుగు సత్యములు గుర్తుంచుకొనవలయును.

౧. నిక్కమున కీశ్వరుఁడు నిష్క్రియుఁడు. అతఁడేమియుఁ జేయఁడు.

౨. ప్రకృతి సృజింపఁబడలేదు. అది అనాది.

౩. ప్రకృతియే కార్యము చేయును.

౪. ఈశ్వరుఁడు లేనిదే ప్రకృతి ఆవంతయుఁ జేయలేదు. ఈశ్వరుని అచింత్యమగు ప్రభావము ప్రకృతియందు సంక్రమించుటచేతనే అది పని చేయఁగలుగును.

ప్రకృతియే సృష్ట్యాది కార్యము చేయుచుండగా ఆత్మయే స్రష్ట, పాలయిత, సంహర్త అని చెప్పఁబడుచున్నది. ఈశ్వరుని ప్రభావమును ముఖ్యముగాను ప్రకృతిని గౌణముగాను — అనఁగా అముఖ్యముగాను తలఁచి యిటులు చెప్పుట. కావున ఇది గౌణార్థమని గుర్తుంచుకొనవలెను. ఈశ్వరునియందు స్రష్టృత్వాదికము ముఖ్యార్థము కాదు గదా! సృజించుట మొదలగు పని ఈశ్వరునిదే యని సహజముగా తోఁపఁజేయు భాష తెరవెనుక గీతాకారుఁడు ఈశ్వరుని అకర్తృత్వమును ప్రచ్ఛన్న మొనరించెను.

గౌణభావము

ఈ క్రింది ఉదాహరణములలో భగవంతుఁడు తనను స్రష్టనుగా వర్ణించుకొనెను.

నేను అజుఁడను అవ్యయుఁడ నయినను భూతముల కీశ్వరుఁడ నయినను నా ప్రకృతి నధిష్ఠించి నా మాయచే పుట్టుచున్నాను. [౪–౬].

ఓ భారతా! ధర్మము తఱిగి అధర్మము పెరిగినపుడెల్ల నేను నన్ను సృజించుకొందును. [౪–౭]

మంచివారిని కాపాడుటకును చెడ్డవారిని దండించుటకును ధర్మము స్థాపించుటకును నేనప్పుడప్పుడు పుట్టుచుందును. [౪–౮]

మఱి యొకచో నిటులు కలదు — నేను నా సొంత ప్రకృతిని అధిష్ఠించి ఈ భూతముల నన్నిఁటిని మాటి మాటికి సృజింతును. [౯–౮]

వీని యన్నిటి వల్లను పరమాత్మయే అసలు స్రష్టయని అర్థమగును. ఈ యర్థమును పట్టిన యెడల గీతాకారుఁడు మూఁడవ యీశ్వరవాదమును గాక

రెండవ యీశ్వరవాదము నంగీకరించెనని యనుకొనవలయును. కాని దీనిచే గీతల మూల సత్యమే మూలఁబడిపోవును.

శంకరాదు లిటు లందురు :

ఈ స్రష్టృత్వము మాయామయము. పాము లేకున్నను త్రాడు పామను భ్రమ కలుగును. ఇదియ మాయావాదము. ఇట్టి మాయావాదము గీతలలో లేదు. జడ జగత్తును, జడ చేతనముల కలయిక మొదలయినది యేదియు కల్ల గాదు. ఇది యంతయు జరుగుచున్న విషయమే. గీతలలో మాయ ఉన్నది కాని అది గుణమయి. సత్త్వ రజస్తమస్సుల సముదాయ ప్రభావమే మాయ. సత్త్వాది గుణములు ప్రకృతినుండి పుట్టెను. 'ఆత్మ యేమియు చేయఁడనియు, గుణములే చేయుననియు' ఆత్మ తత్త్వమున వ్రాసితిని. కాని ఈ ప్రకరణమున ఎత్తి చూపఁ బడిన శ్లోకములకు 'భగవంతుడు తన మాయచే సృష్టిచేయు'నని అర్థము వచ్చు చున్నది. ప్రకృతియు, దానినుండి కలిగిన గుణములును భగవత్ ప్రభావముచే కార్యము చేయుననుటకు భగవంతుఁడే కార్యము చేయునని చెప్పఁబడెను. కావున భగవంతుని స్రష్టృత్వాదికము ఆరోపితమనియు గౌణమనియు ఎఱుఁగవలెను.

ఆత్మ అవ్యయుఁడును - అకర్తయు. ఇట్టి యాత్మతో గుణాదులకు కలయిక యెటులో తెలియరాదు.

౨

ఈ క్రింది రెండు శ్లోకములలో భగవంతుడు సృష్టి వ్యాపారముచే లిప్తుడని స్పష్టముగా కనఁబడుచున్నది :—

'ఓ భారతా ! ఈ మహా ప్రకృతిలో నేను బీజ ముంతును. దానఁజేసి భూతము లన్నియుపుట్టును.' (౧౪-౩)

'ఓ కౌంతేయా ! అన్ని గర్భము లందును పుట్టు మూర్తులన్నింటికిని ప్రకృతి మహాగర్భము. నేను బీజ ప్రదుడనగు తండ్రిని.' (౧౪-౪)

ఇచట తలిదండ్రులయు బిడ్డలయు నుపమానము కలదు. భగవంతుఁడు తండ్రియై ఈ జగత్తును సృజించుచున్నాఁడని ముఖ్యార్థము వచ్చుచున్నది. గీతల

మూలమతము చెఱగకుండ నుండవలసిన యెడల దీనిని గౌణముగా గ్రహింపవలయును.

ఈ రెండు శ్లోకములలో భూతముల పుట్టుక యుండెనే కాని ప్రకృతి పుట్టుక లేదు. ప్రకృతి పూర్వము నుండియు కలదు; అది అనాది.

# 3

వేఱొక తీరు భాష యున్నది! దానిని జూచినచో గీతలమతము నెడల భ్రాంతి కలుగవచ్చును. భగవంతుఁ డిటు లనుచున్నాఁడు:

[క] నే నన్నిటికిని హేతువను. [౧౦-౮]

[ఖ] ఈ జగత్తంతయు నాలో కలుగును, నాలో లయించును. [౭-౬]

[గ] నేను ఉత్పత్తి ప్రలయములకు హేతువను, మఱియు ఆధారమును. [౯-౮]

[ఘ] నేను పుట్టింతును, గిట్టింతును. [౧౩-౧౭]

[ఙ] ఎవని నుండి సంసారమను నీ ప్రాయేఱు పాఱుచున్నదో [౧౫-४]

[చ] భూతముల పుట్టుక యెందుండియో [౧౮-४౬]

[ఛ] నా వలన, స్మృతియు జ్ఞానమును వాని లోపమును కలుగును. [౧౫-౮౫]

[జ] బుద్ధి జ్ఞాన సుఖ దుఃఖాదులఁ గూర్చి నొడివి, 'భూతముల కివి యన్నియు నా వలననే కలుగు'నని భగవంతుఁ డనును. [౧౦-౫]

వీని యన్నిటి వలనను పరమాత్మ నుండియే సాక్షాత్తుగా ఈ జగత్తు పుట్టుచున్నదనియును ప్రలయమునందు తనియందే ప్రవేశించుచున్నదనియు తోచును.

---

(క) అహం సర్వస్య ప్రభవః.

(ఖ) అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా

(గ) ప్రభవః ప్రలయః స్థానం.

(ఘ) గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.

తైత్తిరీయోపనిషత్తునందు-'ఎవని నుండి ఈ భూతములు పుట్టుచున్నవో, ఎవనిచే పుట్టి బ్రతుకుచున్నవో, ఎవనిని పొంది ఎవనిలో ప్రవేశించుచున్నవో అతఁడే బ్రహ్మము.' అని కలదు. (౩-౧)

వేదాంత సూత్రము లందును-'దేని నుండి ఈ జగత్తుయొక్క జన్మాది కమో అది బ్రహ్మము' అని యున్నది. (౧-౧-౨)

గీతాకారుఁ డీ భావమును ఈ భాషను అనుకరించి పరమాత్మనుండియే ఉత్పత్తి యనియు, అతఁడే ప్రలయమునకు తావనియుఁ జెప్పెను.

కనిచే గీతలు ఉపనిషత్తులయు బ్రహ్మసూత్రములయు మతమునే గ్రహించెనని తోఁచుట స్వాభావికము. కాని గీతలమత మది కాదు. ఆత్మ ఒకటియా పెక్కా అనునెడ ఉపనిషత్తులును, బ్రహ్మసూత్రములును, గీతలును, అద్వైతవాదము చేపట్టును. కాని ఆత్మ జగత్ సంబంధమున మత భేదము కలదు. ఈ యెడ ఉపనిషద్ బ్రహ్మసూత్రము లద్వైతములు. గీత ద్వైతము. పై రెండును ఒక వస్తువునే ఒప్పును. దాని పేరు ఆత్మ లేక బ్రహ్మము. ఈ వస్తువునుండియే ఉత్పత్తి. దీని చేతనే స్థితి. దీనియందే లయము. కాని గీతల మతమున వస్తువులు రెండు. ఆత్మయు ప్రకృతియు. ఈ రెండును అనాదులు. ఈ రెండును వేఱువేఱు. కావున సృష్ట్యాదుల యెడ గీతల మతము పై రెంటి మతముకంటెను సంపూర్ణముగా వేఱు. ఈశ్వరుఁడు లేనిదే ప్రకృతి యేమియు చేయలేదు. పరమాత్మని అచింత్య ప్రభావము చేతనే ప్రకృతి నుండి భూతాదులు పుట్టి ప్రకృతియందే లయించును. కావున పరమాత్మయే ఉత్పత్త్యాదులకు కారణమని ఒక రీతిగా చెప్పవచ్చును. ఈ విషయము చెప్పుటకు గీతాకారుఁడు ఉపనిషత్తులయు, బ్రహ్మసూత్రములయు అద్వైతమును చెప్పు భాషను వాడుకొనెను.

ఉపనిషత్తులును బ్రహ్మ సూత్రములును ముఖ్యార్థములో చెప్పిన విషయమును గీతాకారుఁడు గౌణార్థములో చెప్పెనని ఇచట గుర్తుంచుకొనవలెను.



గీతల మూల మతమగు ద్వైతవాదమును మఱుగుపఱచు మఱియొక తీరు భాష కలదు. భగవంతుఁడు అచటనచట ఇటులనును—

(క) నా ప్రకృతి (౭—౪)

(ఖ) నా మాయ (౭—౧౪)

(గ) ఆత్మమాయ (౪—౬)

(ఘ) నా ప్రకృతి (౪—౬; ౯—౮; ౯—౭).

ఈ యంశములు చదివినచో ప్రకృతియు మాయయు పరమాత్ముని స్వరూపమో లేక అతని అంగమో లేక అతని లోలోపల నున్నదేనేమో అని తోఁచును. కాని అస లది కాదు. పరమాత్ముని అచింత్య ప్రభావముచే ప్రకృతి కార్యము చేయును. అతఁడు లేక, ప్రకృతి కార్యము చేయజాలదని తెలుపుటకే శ్రీకృష్ణుఁడు 'నా ప్రకృతి' అని యనెను.

## సిద్ధాంతము

౧. గీతాకారుఁడు సాంఖ్య వాదమును ఈశ్వరవాదముగా పరిణమింపఁ జేసెను. సాంఖ్యులకు బహు పురుషత్వము. గీతల కేక పురుషత్వము. ఈ పురుషుఁడే ఆత్మగాని ఈశ్వరుఁడు గాని.

౨. ఆత్మయు ప్రకృతియు రెండు వేఱు వేఱు వస్తువులు. ఈ రెండును అనాదులు. కావున ఇయ్యెడ గీతాకారుఁడు ద్వైతి.

౩. ఆత్మ నిష్క్రియము. ప్రకృతియే సృష్ట్యాదు లొనరించును.

౪. ప్రకృతి పరమాత్మ లేనిదే ఏ పనియు చేయఁజాలదు. ప్రకృతి చేయునదెల్లయు పరమాత్ముని ప్రభావము వలననే. ఈ యర్థము మనసులో పెట్టుకొని పరమాత్మయే స్రష్టయనియు, పాలకుఁడనియు, సంహర్తయనియు, చెప్పఁబడెను. కాని పారమార్థికముగా పరమాత్మకు కర్తృత్వము లేదు.

౫. ఆత్మయు ప్రకృతియు రెండు అడ్డగీటుల వంటివి. ఒక గీటు మఱియొక గీటును ముట్టదు. ప్రకృతి ఆత్మకు వెలుపటను, ఆత్మ ప్రకృతికి వెలుపటను ఉన్నవి. నిక్కమునకు జగత్తు పరమాత్మలో లేదు, పరమాత్మయు జగత్తులో లేదు. అటులయినను సృష్ట్యాది కార్యము జరుగుచున్నది. గీతాకారుఁడే ఇందుల కచ్చెరు వొందెను. అతని నోట— 'నేను భూతములలో లేను; నాలో భూతములు లేవు; అయినను నేను భూతధారకుఁడను; భూతపాలకుఁడను; నా ఐశ్వర యోగ మెట్టిదో చూచుకో' [౯—౫] అను వాణి వెలువడెను.

# కర్మవాదము

గీతాకారుని కర్మనుగూర్చి చాల మతభేదము కలదు. మిగుల తక్కువ తరగతి సాధకులకే కర్మ యని కొందఱందురు. ముక్త పురుషులుకూడా కర్మ చేయుదురని కొంద ఱందురు. కావున ఈ విషయము ఆలోచనీయము.

## కర్త ఎవడు ?

కర్మచేయున దెవఁడు ? మానవుఁడే ! మానవ, మానుష, పురుష, నర, జనాదులగు పదములు ఏకార్థవాచకములు. ఈ పదము లన్నియు దేహముతోఁ గూడిన ఆత్మ' అను అర్థమున వాడఁబడుచుండును. కాని గీతలలో (అచట నచట) నొక్కొకచో ఆత్మదెసను, ఒకొక్కచో దేహము దెసను మొగ్గు కనిపించుటయే కాక ఆత్మ దేహముల రెంటియెడను గూడ తూకము సమానముగా నున్నటులు కానిపించును. కావున మానవుఁడు కర్మ చేయుననినంతనే ఆత్మ కర్మచేయునని అనుకొనుటకు వీలులేదు. గీతల ఆత్మ నిష్క్రియము-ఆత్మ కర్మ చేయను చేయడు, చేయనులేదు. కర్మ చేయునది ప్రకృతి, కర్మ చేయునవి దేహము, మఱియు ఇంద్రియము మొ.

## గుణముల కార్యము

**గుణములు** మూడు-సత్త్వము, రజస్సు, తమస్సు. సత్త్వగుణము ప్రకాశాత్మకము. నైర్మల్యము శమము తపము శౌచము క్షాంతి ఆర్జవము జ్ఞానము

విజ్ఞానము ఈ మొదలగునవి సత్త్వ గుణమువలన ప్రకాశితములగును. (౧౪-౬; ౧౮-౧౪ ఇత్యాది) ఈ గుణము మానవుని జ్ఞానమునందును సుఖమునందును ఆసక్తునిజేసి బంధించును. ప్రవృత్తి తృష్ణ అశాంతి స్పృహ కర్మారంభము ఈ మొదలగు గుణములు రజస్సు నుండి పుట్టును. (౧౪-౭, ౧౨) దీనివలననే కర్మయందు ప్రవృత్తియు ఆసక్తియు కలుగును. మోహము అజ్ఞానము ప్రమాదము ఆలస్యము ఈ మొదలగునవి తమస్సు నుండి పుట్టును (౧౪-౮) ప్రకాశము సత్త్వకార్యమనియు, మోహము తమః కార్యమనియు సంక్షేపము. చూ. [౧౪-౨౨]

ఈ మూఁడు గుణములచే అవ్యయుఁడగు ఆత్మయు తెలియని చందముగా సంసారమునం దిఱుకుకొని యున్నాడు. [౧౪-౫]

## గుణాతీతావస్థ

దేహి యెపు డీ గుణముల నతిక్రమించునో అపుడు జన్మ జరా మృత్యు దుఃఖములనుఁ బాసి అమృతత్త్వ మొందును. [౧౪-౨౦]

ఈ పృథివి మీద నివసించియు మానవుఁడు గుణాతీతుఁడు కావచ్చును. గుణాతీతుని లక్షణమునుగూర్చి గీత యిటుల చెప్పెను. గుణాతీతుఁడు ప్రకాశము గాని ప్రవృత్తిగాని మోహముగాని పొడచూపినపుడు ద్వేషింపఁడు; నివృత్తము లయినచో కోరఁడు. [౧౪-౨౨] గుణాతీతుఁడు ఉదాసీనునివలె నుండును. అతఁడు గుణములచే కలఁతగొనఁడు. గుణముచే తమ పనులు తాము చేసికొను చున్నవని యెఱిఁగి తా నచంచలుఁడయి యుండును. అతఁడు తనలోనే తానుండును; అతఁడు ధీరుఁడు; అతనికి మట్టియు బంగారము నొకటి; సుఖ దుఃఖములు, ప్రియాప్రియములు, నిందాస్తుతులు, మానావమానములు, శత్రు మిత్రులు ఇవన్నియు నతనికి తుల్యములు. అతఁడు సర్వారంభపరిత్యాగి. [౧౪-౨౩, ౨౫, ౧౨-౧౬]

జీవన్ముక్తుఁడు పాపకార్యములు చేయఁడనియు, పుణ్యకార్యములు చేయు ననియు కొందఱనుకొందురు. గాని యీ మతము సరియయినదికాదు. అతఁడు శుభాశుభములను [౧౨-౧౩] సుకృత దుష్కృతములను [౨-౫౦] రెంటిని విడ నాడును. సాధువుల యెడను పాపులయెడను అతనికి సమాన దృష్టి [౬-౯].

ముక్తావస్థ యొక్క గౌరవము నుద్ఘోషించుటకే ఇట్టి భాష ఉపయోగింప బడెననియు, ఇది యెల్లయు స్తుతియనియు కొందరు తలఁతురు. ఇది చెడ్డ భ్రమ. ఈ చెప్పబడిన దంతయు గీతల మూలతత్త్వపు పరిణామము. గీతల మూలతత్త్వ మిది—

'దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి అహంకారము ఈ మొదలగున వేమియు ఆత్మ కావు; ఆత్మవియు కావు. ఈ సముదాయ మెల్లయు ప్రకృతి యొక్క వికారము. కార్యము చేయున వింద్రియాదులు. వేఱువేఱు గుణముల ప్రభావమువలన వేఱువేఱు కర్మ సంపాదిత మగును. సత్త్వగుణమువలన పుణ్యాది కర్మయు, రజస్తమోగుణములవలన పాపాది కర్మయు తయారగును. పాప పుణ్యములు రెండును గుణములనుండి పుట్టినవనియును, గుణములు ప్రకృతి నుండి పుట్టిన వనియును, ఈ ప్రకృతియు ఈ ప్రకృతినుండి పుట్టిన గుణము లును ఆత్మకంటె వేఱనియును ఒప్పుకొన్న యెడల పాపపుణ్యములు ఇసుమం తయు ఆత్మవి కావనియును ఆత్మకు వీని స్పర్శయే లేదనియును ఒప్పుకొన వలయును. ఈ గీతామతమును ఈ క్రింది దృష్టాంతముచే స్ఫుటీకరింతును. ఉదాసీనుఁడగు మనుష్యుఁడొక నది యొడ్డున నిల్చియున్నాఁడు. అది ప్రవహించి పోవుచుండుట చూచుచున్నాఁడు. ఆ ప్రవాహము తనదను జ్ఞాన మతనికి లేదు. అందలి నీరు మురికిదయినను తేటదయినను అతనికి సమానమే. ఇందేదియు నతనిని స్పృశింపదు. ఆ రీతిగనే ముక్తుడును కర్మనది యొడ్డున నిల్చి యున్నాఁడు; కర్మప్రవాహము పరుగెత్తుచుండుట అతఁడు చూచుచున్నాఁడు. అతనికి దాని యెడ అహంతలేదు, మమత్వములేదు; అది పాపముచే పంకిల మయినను, పుణ్యముచే స్వచ్ఛమయినను రెండును అతని కొకటియే; ఏదియు అతని నంటదు. అతఁడు ఉదాసీనుఁడై నిలిచియుండెను.

## ముక్తుని కర్మ

మనము ఆత్మకు మూఁడవస్థలు కల్పించుకొనవచ్చును. ౧. దేహముక్తి, ౨. జీవన్ముక్తి, ౩. బద్ధావస్థ. ఇందు విదేహముక్తితో కర్మకేమి సంబంధమో ముందు విచారింతము. ఈ యవస్థలో ఆత్మ విదేహము ఇంద్రియాతీతము మఱియు గుణాతీతము. ఇంద్రియములును గుణములును ఉన్నచోటనే కర్మ

యుండును. ఇవి లేనిచోట కర్మయుండదు. కావున ముక్తునకు కర్మలేదు. ఈ యవస్థలో ఆత్మ అకర్త.

## జీవన్ముక్తుని కర్మ

దేహము వదలకమునుపును మానవుఁడు ముక్తిఁ బడయవచ్చును. దీనికే జీవన్ముక్తి యని పేరు. జీవన్ముక్తులు గుణాతీతులు.

కర్మకు మూలము గుణము. కర్మ చేయవలయునని పుట్టు కోరికకును కర్మ చేయవలయునను ప్రవృత్తికిని కర్మారంభమునకును మూలము రజోగుణము [౧౪-౧౨] రజోగుణము లెస్సగా పెరిగి చచ్చువాఁడు కర్మాసక్తులలో పుట్టును. [౧౪-౧౫]

మానవుఁడెపుడు జీవన్ముక్తుఁడో అపుడు గుణాగుణము లతని నేమియు చేయలేవు. కావున రజోగుణమునకుఁగూడ నేమియు పనియుండదు. కాఁగా అతఁడు కర్మయందు ప్రవృత్తుఁడును కాఁడు; ఆసక్తుఁడును కాఁడు.

జీవన్ముక్తుడును దేహధారియేకదా, అతనికిని ఇంద్రియములు మనస్సు బుద్ధి యివి యన్నియు నున్నవికదా; అతఁడు కార్యము చేయఁడని యనఁగా నర్థమేమి ? యని కొందఱందురు. జీవన్ముక్తునకు దేహేంద్రియాదులున్నను లేనట్లే. ఇంద్రియములే యింద్రియ విషయమున ప్రవర్తించుచున్న వనియును తానేమియు చేయుటలేదనియును అతఁడనుకొనును. ప్రకృతి కర్మచేయుచున్నది; తాను అకర్త [౩—౨౩; ౫—౧౩; ౧౪—౨౩ ఇత్యాది] తానెల్లపుడు ఉదాసీన భావముతో నుండును. [౧౨-౧౨; ౧౪—౨౩) ఇంద్రియాదులు కర్మయందు ప్రవృత్తమైనవని అతనికి వానియెడ ద్వేషములేదు; నివృత్తమైనపని వానియెడల కోరికలేదు. (౧౪, ౨౨, ౨౩) ఆత్మరతునకు ఆత్మతృప్తునకు ఎట్టి కోరికయు నుండదు. (౩-౧౭) ఇహలోకమునందు కర్మచేగాని, కర్మత్యాగముచేఁగాని అతనికే ప్రయోజనమును కావలసిన పనిలేదు. అతఁడు కేవలము శారీరకమగు కర్మచేయును. కాని దీని యెడ గూడ నతనికి మమత్వము లేదు' (౪-౨౫) అతఁడు సర్వారంభ పరిత్యాగి. (౧౪-౨౫) గీతలలో చెప్పిన చొప్పున నుండు పురుషవరేణ్యుఁడు ఎటుల కర్మయందు అనాసక్తుఁడో అటులు కర్మత్యాగము నందును అనాసక్తుఁడు జీవన్ముక్తుఁ డిట్టివాడు.

# బద్ధ జీవుల కర్మ

కర్మ జగత్తులో మనము బ్రతుకుచున్నాము. మనకు కాలుసేతులు గల వనియు, పనిచేయవలసి యున్నదనియు కార్యమునందు ప్రవృత్తియుఁగలదనియు మనము తలఁచుచున్నాము, మనము పని చేయుదుము; సుఖదుఃఖములలో తగులు కొందుము: సంసారములో మునిఁగి తేలుచుందుము. ఇదియే బద్ధ దశ. కర్మ జగత్తు బంధన జగత్తు; కర్మ బంధన మోక్షమే మోక్షము.

కర్మమే బంధనమునకు కారణమనుచో కర్మత్యాగ మొనరించినంతనే బంధనము నుండి ముక్తిబడయనగునాయని కొందఱందురు.

౧

## కర్మత్యాగ మసంభవము

గీతా కారుఁడు కర్మ వీడుటకు వీలులేదనును-"పని చేయనిచో జీవయాత్రయు జరుగదు" (౩-౮)

౨

"పని చేయక అరనిముసమేని ఎవఁడును ఊరకఉండఁజాలఁడు. ప్రకృతి నుండి కలిగిన గుణములు (రాగ ద్వేషాదులు) అందఱను అవశులఁజేసి పని చేయించును" (౩-౫)

"ఇచ్ఛలేకున్నను రజోగుణమునుండి పుట్టిన కామక్రోధాదులు కార్యమునందు నియోగించును." (౩-౩౬, ౩౭)

కావున మనుష్యుఁడు పనిచేయనిదే బ్రతుకలేకపోవు టొకటి, తనకు ఇచ్ఛలేకున్నను గుణములచే బలవంతముగా కర్మ చేయింపఁబడుటొకటి, కానవచ్చెడిని.

౩

## ఇంద్రియ నిగ్రహము

ఇంద్రియాసక్తియే అనిష్టము లన్నింటికి మూలమయిన యెడల ఇంద్రియ నిగ్రహ మొనరింపరాదా ? దాన ఈ బంధనము లన్నియు తెగిపోవునుగదా అని కొందఱందురు.

ఇంద్రియ నిగ్రహముచే ఈ యుద్దేశ్యము సిద్ధింప దని గీతాకారుం డనును. మనుష్యుండు తన ప్రకృతిని బట్టియే పని చేయుచుండును. ఆత్మ ప్రకృతితో కలిసియున్నది. ప్రకృతి వేలువేలు తెగల మనుష్యుల జీవనములలో వేలువేలు తెగల పనులు చేయుచున్నది. కొందఱు సత్త్వగుణ ప్రధానులు. మొత్తముమీంద తమోగుణమే యెక్కువ పనిచేయుచుండును. జ్ఞానవంతుండు కూడ సహజముగా ఈ గుణముల నతిక్రమింపలేండు-"జ్ఞానవంతుండును తన ప్రకృతి కనురూపమగు కర్మ చేయుచుండును. ప్రాణులు ప్రకృతికి అనువర్తు లగుదురు. నిగ్రహ మేమిచేయంగలదు? (3-33)

మనుష్యుండు బయట కర్మచేయకున్నను మనసు లోపల చేయునెడల అది త్యాగమేకాదు-కర్మేంద్రియములను బిగ్గంబట్టి మనస్సున విషయములను తల పోయు మూఢునిపని మిథ్య. (3-6) ఇచ్ఛ, కామన, ఆసక్తి, సుఖ స్పృహ ఈ మొదలగునవి కర్మరూపముగా ప్రకాశముచెందును. లోపలి భావమునకు బయటి రూపము కర్మ. ఒకవేళ బయట రూపము అనంగా బాహ్యప్రకాశము లేకున్నంత మాత్రమున లోపల ఉద్దేశము (భావము) లేదని అనుకొనుటకు వీలు లేదు. కర్మేంద్రియములు నిగ్రహింపంబడినను లోపలనున్న వాసనలు కార్యము చేయగలవు. దీనివలన గీతాకారుండు ఇంద్రియ నిగ్రహము యొక్క శ్రేష్ఠత్వ మంగీకరింపలేదు.



## కర్మవలన నైష్కర్మ్యము

కర్మచేయుట మొదలిడనిచో నైష్కర్మ్యము సిద్ధింపదనునది గీతాకారుని విశేషమతము.

నైష్కర్మ్యమనగా కర్మరాహిత్యమని ముఖ్యార్థము. కర్మానుష్ఠానము చేయనిచో కర్మ కూలిపోదు అనున దొక పరీక్షిత సత్యము. ఇంద్రియములకేదో యొక పని అప్పగింపనిచో అవి వశము కావనునటు లీ మానవజీవిత మేర్పాటు చేయంబడినది. పలువురకు తీవ్ర వైరాగ్యము కలుగును. వారు దాని నవలం

ఒంతురు కాని అనేక సమయములందు తీరని కోరికలును, పొందని సుఖములును వీరి ప్రాణములను ఊగులాడించి వైచును. తగిన భోగము కలిగిననే త్యాగము సహజముగా సులువగును. [౬-౧-౬-౧౭] తొలుతనే సన్న్యాసము గొన్నచో సులువుగా సిద్ధిబొందుట అక్కఱను - 'న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి' ౩,౪, దీనఁ జేసియు గీతాకారుఁడు కర్మానుష్ఠానమునకు వ్యవస్థ చేసెను.

## యోగము - కర్మ

### క

పరమాత్మ నిష్క్రియుఁడు. ముక్తుడును నిష్క్రియుఁడు. కాగా జీవన్ముక్తునకు కర్మలేదు. సాధనల కన్నిటికిని ముక్తియే లక్ష్యముకావున సాధకుడు కర్మాతీతుఁడయియే తీరవలెను. అటులయినను మనుష్యుఁడు కర్మ చేయక ఉండఁజాలఁడని గీతాకారుఁడు చెప్పుచున్నాఁడు. "కర్మత్యాగ మసంభవము. అటులయినను కర్మాతీతుఁడయి యుండవలసి యుండును — ఇది యెటులు పొసఁగును ? ఇందులకు గీతాకారుఁ డిటు లనుచున్నాడు. 'యోగస్థుఁడవయి కర్మ చేయుము.' (౨-౪౮)

గీతలలో యోగ మొకటి ముఖ్యమగు విషయము. సమత్వము యోగము. (౨-౪౮) సమత్వమనఁగా అంతరింద్రియముయొక్క సమావస్థ,స్థిరత, ప్రశాంతి ఈ మొదలయిన అర్థము. యోగమనఁగా బుద్ధియోగమనియు ౨-౪౯ లో వ్యవహరింపఁబడెను. కొందఱు కర్మచేసియు ముక్తులు. కొందఱు కర్మత్యాగము చేసియు బద్ధులు. ఈ విషయమున గీతాకారుఁ డిటులు అనుచున్నాడు — కర్మ ఫలము కోరక యెవఁడు చేయఁదగిన పనిని చేయునో, సన్న్యాసికాని యోగికాని అతఁడే. నిరగ్నియును అక్రియుఁడును అగువాడు సన్న్యాసియు కాఁడు, యోగియు కాఁడు. (౬-౧)

సాధకుఁడు యజ్ఞము చేయక నిరగ్నికావచ్చును, అనఁగా అగ్నిహోత్రము ఉంచుకొనకుండ నుండవచ్చును. పూర్తాది కర్మలను చేయక అక్రియుఁడు కావచ్చును. కాని అతఁడు కోరికను ఆసక్తిని వదలఁజాలనిచో కర్మత్యాగము చేసియు కర్మాసక్తుఁడే. ఎవని మనోబుద్ధి చిత్తములు సంయుతములగునో అతఁ

డనాసక్తుడు. అతఁడు కర్మ చేసినను సన్న్యాసియే. బాహ్య కర్మానుష్ఠానముగాని త్యాగముగాని అవాంతర విషయము. కావలసినది యోగ యుక్తావస్థ. దీనికొఱకు గీతాకారుఁడు కర్మ బుద్ధియోగము కన్న తక్కువ అని చెప్పెను- "బుద్ధి యోగముకన్న కర్మ చాల తక్కువ" (౨,౪౯,) యోగయుక్తునిపై కర్మ, ప్రస రింపదు. దీననే కర్మకన్న యోగము మిన్న. గీతల మతమున యోగి తపస్వుల కన్న, జ్ఞానులకన్న, కర్మిష్ఠులకన్న మిన్న. (౬-౪౬)

ఖ

కుశలత లేనిచో ఏ పనియు చక్కగా పూర్తికాదు. (కుశలత యనఁగా నేర్పరితనము లేక ఉపాయము). యోగమను ఉపాయ మవలంబించుచో మనుష్యుడు కర్మబంధనమున పడకయే కర్మచేయవచ్చును. దానఁజేసి యోగము కౌశలమని చెప్పబడెను – "కర్మలలో కౌశలము యోగము" (౨-౫౦). ఇందు లకు కొన్ని ప్రమాణములు :

ఆత్మ యేపనియు చేయదు, పనిచేయునది ప్రకృతి. కాని తెలియక మానవుఁడు "నేనే పనిచేయుచున్నాఁ"నని అనుకొనును. ఎరుక నొందినవాఁడు ప్రకృతియే పనిచేయుచున్నదని తెలిసికొనును. ఈ యవస్థలో అతని కేపని యందును మమత్వము లేదు. అపుడు లోకులు "అతఁడు అనాసక్తుఁడై పని చేయుచున్నాఁడు" అని వారి భాషలో అనుకొందురు. ఇందులకు గీతలలో పెక్కు ప్రమాణములున్నవి. ఈ క్రింద కొన్ని ఉదాహరింతును.

(క) ప్రకృతి యొక్క గుణములవల్ల కర్మ జరుగుచున్నది. కాని అహంకార మూఢుఁడు నేనే కర్తనని తలఁచును. (౩-౨౭) గుణములననేమో కర్మలననేమో వీని నైజ మెఱిఁగినవాఁడు ఇంద్రియములే ఇంద్రియముల దెసఁ బోవుచున్నవని యెఱిఁగి ఆసక్తుడు కాడు. (౩-౨౮)

(ఖ) అయిదవ అధ్యాయమున నిటులున్నది: యోగయుక్తుఁడు కానివానికి సన్న్యాసము దుఃఖలోభములకు హేతువగును. యోగయుక్తునకు వడిగా బ్రహ్మ లబ్ధి అగును. (౬)

ఎవని చిత్తమెల్లప్పుడును చంచలమై అసంయతముగ నుండునో అట్టి యోగహీనుడు కర్మను త్యజించినచో వాడు కష్టముల పాలగును. కోరిక తీరదు గాన లోపల భోగవాసన ఉండును. ఇంతకన్న కష్టము వేరేదికావలయును? కావుననే గీతాకారుడు యోగహీనునకు సన్న్యాసము దుఃఖకరమనెను.

పై శ్లోకముల క్రింద నీ శ్లోకముల గాంచునది-

"ఎవడు యోగయుక్తుడో విశుద్ధాత్ముడో విజితాత్ముడో జితేంద్రియుడో మఱియు ఎవని యాత్మ భూతము లన్నిటికి ఆత్మయో, అతడు కర్మచేసినను లిప్తుడు కాడు. (౭) తత్త్వ మెరిగిన యోగి చూచుచు వినుచు తాకుచు ఊర్చుచు తినుచు నడచుచు నిదురించుచు మాటాడుచు దేహ బాధలు తీర్చుచు గ్రహించుచు కనులు మూయుచు తెఱచుచు, ఇంద్రియములే వాని విషయమున ప్రవర్తించు చున్న వనియు, తానేమియు చేయుట లేదనియును గ్రహించును. (౭-౯) చిత్తమును జయించిన దేహి మనస్సున కర్మ లన్నియు సన్న్యసించి తొమ్మిది గుమ్మముల నగరిలో [తానే కర్మయు] చేయకయు [ఒర్లులచే ఏ పనియు] చేయింపకయు సుఖముగా నుండును. [౧౩]ఈశ్వరుడు లోకమునకు కర్తృత్వము సృజింపలేదు. కర్మమును కర్మఫల సంయోగమును గూడ సృజింపలేదు స్వభావమే [అనగా ప్రకృతియే] కర్మయందు ప్రవర్తించును.

(గ) నాలుగవ అధ్యాయమున కర్మతత్త్వ మిటులు చెప్పబడెను.

కర్మయం దెవడు అకర్మను మరియు అకర్మయందు కర్మను జూచునో వాడు మనుష్యులలో బుద్ధిగలవాడు, వాడు యోగి, వాడు సర్వకర్మ కారి.

ఈ యంశమునకు పలుదెఱగుల అర్థములు కలవు. నాకు ఇది సంగత ముగా నున్నటులు తోచును..."కర్మయం దకర్మను చూచుట యనగా ప్రకృతి. చేయు కర్మలో ఆత్మయొక్క నిష్క్రియత్వము కనుగొనుట. అకర్మయందు కర్మ చూచుటయనగా ఆత్మ నిష్క్రియుడయినను కర్మ జరిగిపోవుచున్నదని కనుగొనుట.

ఆత్మ అకర్త. అయినను ఈ యాత్మ యాశ్రయమున ఉండి ప్రకృతి కార్యము చేయుచున్నదను భావము దీనికి మూలము. కావున ఒక అర్థములో ఆత్మ సర్వ కర్మ కారి.

వీని పిమ్మట నాలుగు శ్లోకములు-"ఎవని కర్మలు కామ సంకల్ప వర్జితములో వానికర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధములు. జ్ఞానులు అతనిని పండితుడని యందురు. (౧౯) ఎవఁడు కర్మఫలమునం దాసక్తి విడిచి యెల్లపుడు తృప్తి గనియుండునో, ఎవఁడు నిరాశ్రయుఁడో (అనగా ఎవడు దేహేంద్రియాదుల నాశ్రయించుకొనియుండునో) అతడు కర్మ చేసినను చేయనివాఁడే. [౪-౨౦] నిష్కాముఁడును నియతమగు ఆత్మయు చిత్తమును కలవాఁడును, పరిగ్రహము చేయనివాఁడును, శరీరస్థితిమాత్ర ప్రయోజనమగు కర్మ మాత్రమే చేయు వాఁడు కిల్బిషము పొందడు. (౨౧) తనకు దా వచ్చిన వస్తులాభముచే సంతుష్టుఁడై ద్వంద్వాతీతుఁడై మఱియు సిద్ధియెడను అసిద్ధియెడను సమానుఁడై ఎవఁడుండునో అతఁడు కర్మచేసియు బద్ధుఁడు కాఁడు. (౨౨)

ఘ

ఈ క్రింది శ్లోకములు జగత్తులో సాటిలేనివి—"కర్మయందే నీకధి కారము; కర్మఫలమునం దెపుడును నీకధికారము లేకుండుఁగాక. నీవు కర్మ ఫలముకొరకు" అకర్మయందును ఆసక్తిఁగొనకుము, (౨౪౭)

కర్మఫలమునెడను కర్మత్యాగమునెడనుగూడ ఆసక్తి కూడదని యిచటఁ జెప్పఁబడియె. ఏ భావముచే కర్మచేయబడవలెనో ఇటుపిమ్మట కొన్ని శ్లోకములచే చెప్పబడెను.

"ఓ ధనంజయా! యోగస్థుడవై ఆసక్తి వీడి సిద్ధి, అసిద్ధులయెడ సామ్యమూని కర్మలుచేయుము. సమత్వమే యోగము సుమీ. (౨౪౮) ఫలము కోరువారు కృపణులు. (అనగా కృపా పాత్రులు) ౪-౬.

ఫలమును కోరనివారే కర్మబంధనమును తెంపఁగలరు.

## ఉపసంహారము

"కర్మ చేయుము, కాని యోగస్థుఁడవై, కర్మచేయుము; ఫలము కోరని వాడవై కర్మ చేయుము; అనాసక్తుఁడవై-గీతలలో ఎటుచూచినను ఇదియ యుపదేశము. జీవన్ముక్తులు ఈ విధికి పై వారు వారికి కర్మతో పనిలేదు. వారు

ఇటుల ఎరుగుదురు "మేము పనిచేయము, చేయనులేము. ఈ కర్మ యెల్లయు ప్రకృతిది. ప్రకృతియే పనులెల్లను చేయుచున్నది." సిద్ధుఁడు కర్మయుఁ జేయఁడు. అకర్మయందును ఆసక్తుడుకాఁడు.

## భక్తితత్త్వము

భక్తి శబ్దము ముఖ్యముగా మతవిషయముననే వాడఁబడుచున్నది. అయినను ఇతరత్రా కూడా దీనిని మనము వాడుదుము. ఉదా-రాజభక్తి, పితృభక్తి-ఈ మొ. ఈ ఉదాహరణములలో సన్మానము, సేవ మొదలయిన దర్థము. ఈశ్వరభక్తికిని ఇదియే మూలార్థము. ఈశ్వరుఁ డనంతశక్తి సంపన్నుఁడు. అతఁడేది బట్టిన నది చేయగలడు. మానవుని సుఖదుఃఖము లతని యధీనములు. అతడొకడే కళ్యాణదాత కావున అతని యెడల శ్రద్ధగొనుటయు సన్మానము చేయుటయు మఱియు అతని ప్రీతి బడయుటకు కర్మచేయుటయు స్వాభావికము. ఈ శ్రద్ధగాని భక్తిగాని భయముతో కూడుకొన్నది. ఆదిమ మతముల అన్నిటి మూలమునందును భయము కానిపించును.

## ఉపాస్యుఁడు - ఉపాసకుఁడు

ఉపాస్యోపాసకులకు గల సంబంధము భక్తియొక్క స్వభావమును నియమించును. తలిదండ్రులయెడ భక్తి వేరు, రాజు నెడ గల భక్తి వేరు. రాజునెడల భక్తి ముఖ్యముగా భయమూలకము. తలిదండ్రులదెస గల భక్తిలో కొంచెము భయమున్నను ప్రధానముగా ప్రీతి మూలము'. ఇక ఎవడు చెలికాడో, ఎవడు సుహృత్తో, ఎవడు ప్రాణములకు ప్రాణమో, అల్ల వానియెడల భక్తి శుద్ధ ప్రీతి.

## గీతల ఈశ్వరుఁడు

గీతలలో ఈశ్వరుడు పలుఁదెఱఁగుల వర్ణింపఁబడియున్నాడు. ఒకదెస అతఁడు రుద్రుడు. (౧౧-౨౩, ౩౦) సంహర్త (౯-౧౮; ౧౧-౩౨; ౧౩-౧౭) ప్రభువు (౧౧-౪)

**(ఇంతవరకే లభించినది)**



# 3. పురాణాలలో పురుషోత్తముడు

ఈ జగత్తుకు ఏదో కారణం ఉంది అని తోచటం సహజం. లోకంలో కార్యకారణ సంబంధం అనేక విధాలుగా కనిపిస్తూంది. తల్లిదండ్రులకూ సంతానానికీ ఉండే సంబంధం, కుండకూ మట్టికీ ఉండే సంబంధం, కుండకూ కుమ్మరివానికీ ఉండే సంబంధం, పాలకూ చల్లకూ ఉండే సంబంధం, తాడు పాముగా కనబడేటప్పుడు ఆ రెంటికీ కల సంబంధం : ఈ రీతిగా ఎన్నో సంబంధాలు. ఈలాటి సంబంధాలలో ఈ జగత్తుకూ దాని కారణానికీ ఉండే సంబంధం ఏమిటి?

లోకంలో ఉండే కార్యాలూ వాని కారణాలూ మన ఇంద్రియాలకు గోచరాలు. చెట్టు అనే కార్యానికి విత్తూ మృత్తూ నీరూ గాలీ మొదలయినవి కారణాలు. మనకు విత్తూ కనబడుతుంది, చెట్టూ కనబడుతుంది. ఇంకోటి,ఎక్కడైనా ఒక ధ్వని పుడితే, అది దేని ధ్వనో, అది ఏమూల నుంచి వచ్చిందో, అది మద్దెల మోతో డప్పుమోతో చెప్పగలం. అదేగనుక లోగడ ఎన్నడూ వినని వింత వాద్యపు మోత అయితే 'ఇది ఫలానా మోత' అని చెప్పలేం. కాబట్టి కార్యకారణాలను రెంటినీ ఎరిగి ఉంటేనే వాని సంబంధం కొంతకాక పోయినా కొంత నిర్ణయించగలం.

అట్టిస్థితిలో మనం జగత్తునే ఎరుగుదుం. కాని జగత్కారణాన్ని ఎరగం. జగత్తూ, దానికి కారణమూ-ఈ రెంటినీ చూచినవాళ్ళే ఆ రెంటికీ గలసంబంధం చెప్పగలరు.

అయితే ఎవరయినా ఆ రెంటినీ చూచిన వారున్నారా ?

ఆఁ చూచిన వారున్నట్లు మనకు వేదవేదాంతాదులలో కనబడుతుంది. 'నే నీ మహాపురుషుణ్ణి ఎరుగుదును.' అని ఒకరంటారు. 'అది నీవూను' అని ఇంకొకరంటారు. 'నేనూ బ్రహ్మమను.' అని వేరొక రంటారు. 'ఇదంతా బ్రహ్మమే' నని మరొక రంటారు. ఈలాగా ఎరిగిన వారున్నట్లు అక్కడా అక్కడా సాక్ష్యం ఉన్నది.

సరే ఈ యెరిగినవారు ఆ కారణాన్ని ఆ మహాపురుషుణ్ణి, ఆ ఆత్మను, ఆ బ్రహ్మను, ఆ భూమను సంపూర్ణంగా చెప్పారా అంటే చెప్పలేదు. సరికదా చెప్పడానికి వీలులేదన్నారు. యోగ వాసిష్ఠంలో ఒక కథ ఉన్నది.

"ఉప్పు బొమ్మ ఒకటి సముద్రంలోతు చూచి వద్దామని ఎగిరి యెగిరి సముద్రంలోకి దూకిందట. దూకీ దూకడంతోటే కరిగి సముద్రంలో కలిసే పోయింది. సముద్రం ఎంత లోతుంటో ఇక చూడడ మెక్కడ? పైకి రావడ మెక్కడ? మనకు చెప్పడమెక్కడ? అలాగే నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళిన వారెవరో ఒకరిద్దరు తప్ప తతిమ్మావారందరూ ఆ పరమ కారణంలో కలిసి పోయేవారే. ఈ వచ్చిన ఒకరిద్దరు కూడా ఎంగిలికాని వాడొక్కడేవుడే అని చెబుతారు. అనగా ఆయన్ను చెప్పడానికి నాలుక మెదలదు, ఆయన ఇట్టివాడు అని చెప్పలేము అని. అయితే ఏ కొంచెమో చెప్పడానికి వీలులేదా? వీలులేక పోలేదు. ఎలా అంటే – పది మంది గుడ్డివాళ్లు ఏనుగును తడిమి చూచారట. వారిలో ఒక గుడ్డివాడికి తోక దొరికింది. 'ఏను గెల్లా వుంది?' అని అడిగితే 'గరిటెలా ఉంది' అని అతడు సమాధానం చెప్పాట్ట. చెవి తడిమి చూచినవాడు "ఏనుగు చేటలా ఉంది" అని అన్నాట్ట. కాలట్టుకుని చూచినవాడు 'స్తంభంలా' అని అన్నాట్ట. తొండం తాకినవాడు 'రోకలి' అన్నాట్ట ఏనుగు యొక్క స్వరూపం నిరూపించడానికి ఈ వర్ణనలలో ఏ ఒకటీ సత్యముకాదు – కాకపోదు. వీరుచేసిన వర్ణనలన్నీ విని ఏనుగు నెన్నడూ ఎరగని కన్ను గలవాడెవడైనా ఏనుగును చూస్తే అప్పుడు అతడు" ఆహా! ఎంత బాగా చెప్పారురా! తోక సరిగ్గా గరిటెలావుంది, ఆ చెవి చేటను చంపి పుట్టింది, ఆ తొండం మూడురేకలా రోకలే" అని సంతోష పడతాడు. మరి ఏనుగును సాక్షాత్తూ చూడకపోతేనో? ఉప్పు కుప్పూ, ప్రసాదానికి ప్రసాదమూ.

అలాగా ఆ చూచినవారు ఆ పరమ కారణాన్ని 'ఉత్తముడైన పురుషుడు' అనీ, అక్షరుడనీ,[1] కూటస్థుడనీ, సత్యమనీ, జ్ఞానమనీ, ఆనందమనీ ఎన్నో విధాలుగా వర్ణించారు.

---

1. ఈ పదాలకు సరియైన అర్థాలు ప్రకరణాదులనుబట్టి నిర్ణయించాలి. అక్షర-అవ్యక్త-కూటస్థాది పదాలు శాస్త్రజ్ఞులను కూడా చిక్కుపెటతైయేమో. బహుశా శాస్త్రజ్ఞులనే చిక్కుపెటతైయేమో.

పురాణాలుగూడా - శివుణ్ణి చెప్పేవే కానీండి, విష్ణువును చెప్పేవే కానీండి, ముఖ్యమైనవి ఈ జగత్తుకు మూలకారణం ఏదో అది 'సన్మాత్రం' అని నిరూపిస్తున్నవి. అనగా 'అది అలాటిది, లేక ఈలాటిది' అని చెప్పము కాని 'ఉన్నది' అని మాత్రమే చెప్పదగినది అని అర్థం! ఈ సన్మాత్రానే బ్రహ్మ మనిన్నీ, ప్రధాన పురుషుడనిన్నీ,[2] పురుషోత్తముడనిన్నీ[3] ఇంకా ఎన్నో పేర్లతో వ్యవహరించినై.

ఈ బ్రహ్మానికి మొట్టమొదటి రూపం పురుషుడు. వ్యక్తము, అవ్యక్తమూ, కాలమూ[4] పదపటి రూపాలు. వెనుకటి పురుషుడు రూపంలేని పురుషుడు. ఈ పురుషుడో రూపంలేని ఆ పురుషుని మొదటిరూపం. వెనుకటి పురుషుడు పురుషోత్తముడనీ, ఈ పురుషుడు హిరణ్యగర్భుడూ లేక ప్రథమ శరీరి అని ఎస్పష్టం. ఈ హిరణ్యగర్భుణ్ణే అపరబ్రహ్మమనీ, మొదటి సన్మాత్రాన్నే పరబ్రహ్మమనీ అంటారు.

"హిరణ్యగర్భుడు మొదట పుట్టాడు. పుడుతూ భూతాల కేకాధిపతి అయాడు. అతడు ఈ ద్యావా భూములను ధరించాడు. అతణ్ణి హోమద్రవ్యంతో సేవిద్దాం.[5]

---

2. నాహో న రాత్రి ర్న నభో న భూమి
ర్నాసీ త్తమో జ్యోతి రభూచ్చ నాన్యత్
శ్రోత్రాది బుద్ధ్యానుపలభ్య మేకం
ప్రాధానికం బ్రహ్మపుమాం స్తదాసీత్ [విష్ణు. 1-5-23]

3. స ఏవ క్షోభకో బ్రహ్మన్ క్షోభ్యశ్చ పురుషోత్తమః
స సంకోచ వికాసాభ్యాం ప్రధానత్వేఽపి చ స్థితః. 12-31

4. పరస్య బ్రహ్మణో రూపం పురుషః ప్రథమం ద్విజ
వ్యక్తా వ్యక్తే తథైవాన్యే రూపే కాల స్తథా పరమ్. 15

5. హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే
భూతస్య జాతః పతిరేక ఆసీత్
సదాధార పృథివీంద్యా ముతే మాం
కస్మై దేవాయ హవిషా విధేమ.

ఆ హిరణ్య గర్భుడే మొదటి మనిషి. అతణ్ణి పురుషుడనిన్నీ అంటారు.[6]

'భూతాలను తొలినే సృజించే బ్రహ్మ మొదట పుట్టాడు'[7] అని స్మృతులు చెపుతున్నై.

ఈరీతిగా ఇద్దరు పురుషులు శ్రుతులలోనూ, పురాణాదులలోనూ మనకు కనబడతారు. భారతం మోక్ష ధర్మపర్వంలో యోగసాంఖ్య వివరణంలో క్షరాక్షర విభాగమూ అక్షరుడికి పురుషోత్తమత్వమూ[8] చెప్పింది. ఆ భారతమే గీతలలో మూగురు పురుషులున్నారని ఒక కొత్త త్రోవ తొక్కింది—

"ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః[9]

లోకంలో క్షరుడనీ, అక్షరుడనిన్నీ ఈ ఇద్దరు పురుషులున్నారు. భూతా

---

6. సవై శరీరీ ప్రథమ స్సవై పురుష ఉచ్యతే.

7. ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత.

8. "ఉత్తమశ్చ అసౌ పురుషశ్చ పురుషోత్తమః" అని ఉత్తమ శబ్దానికి పరనిపాత-చూ. పురుషోత్తమ ఇత్యత్ర త్రితయ సన్నిధానా భావా న్న నిర్ధారణ విభక్తిః కింతు సంబంధ సామాన్యేషష్ఠీతి తయా సమాసః అత ఏవ హలాదిః శేష ఇతి సూత్రే కి మయం హలా మాది రితి షష్ఠీ సమాస ఇతి భాష్యే ఉక్తం. గుణవచనేన నిషేధ స్త్వనిత్య ఇతి తరప్ సూత్రే కైయటః. ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృత ఇత్యాది గీతా వాక్యా దత్ర కర్మ ధారయ ఇతి లభ్యతే. రాజదంతా దిత్వా త్పరనిపాతః." —శబ్దేందు శేఖరే

9. కూటస్థ పదానికి వాడుకలోలేని కొత్త అర్థం చెప్పి అక్షరుణ్ణి కిందిమెట్టుకు దింపి 'వేదంలో ఉందని' చెపుతూ వేదంలోలేని పురుషోత్తమత్త్వం ఏ విష్ణువాదో గీతలలో ఇరికించారు. ఛాందోగ్యంలోని "ఉత్తమః పురుషః" పరమాత్మకాదు. శరీరం కల ఆత్మ దేహంలోంచి లేచి పరంజ్యోతిగా ఐపోతే అత డుత్తముడైన పురుష డపుతాడని దానికర్థం. ఏ వేదంలోగాని ఏ శాఖలోగాని 'పురుషోత్తమ' పదం లేదు. వైష్ణవుల పురుషోత్తముడు

(మిగతా ప్రక్క పేజీలో)

లన్నీ క్షరపురుషుడు. కూటస్థుడు అక్షర పురుషుడు.[10] ఉత్తముడైన పురుషుడు వేరే. అతడు పరమాత్మ. ముల్లోకాల్లోనూ చొచ్చి వానిని భరిస్తున్నాడు. అతడు అవ్యయుడు. ఈశ్వరుడు. నేను క్షరుడి కంటె దొడ్డవాణ్ణి కావడానా, అక్షరుడి కంటె గూడా ఉత్తముణ్ణి కావడానా లోకంలోనూ వేదంలోనూ నాకు పురుషోత్తము డనే[11] ప్రశస్తి ఉంది."

ఉత్తముడైన ఈ పురుషుడు లేక పురుషోత్తముడు అందరికంటెను అధికుడు కాబట్టి అతడు సన్మాత్రం. పురాణభాషలోనే చెప్పుకుందాం— పర బ్రహ్మం అజం అక్షయం అవ్యయం ఏక రూపం—

"త దేవ సర్వమేవైతద్
వ్యక్తావ్యక్త స్వరూపవత్."

ఔపనిషదం అయిన బ్రహ్మముకంటె దొడ్డ అని చెప్పడానికి ప్రయత్నం. ఎనిమిదీ పన్నెండూ అధ్యాయాలలో పరమాత్మగా చెప్పబడ్డ అక్షరుణ్ణి ఇక్కడ ఎందుకు కిందకు తోసెయ్యడం? ఇలా కిందికి తోసేయడానికి సంబంధించిన శ్లోకాలింకా కొన్ని ప్రక్షిప్తాలు. క్షరాక్షర సంక్రాంత శ్లోక సమూహం ఈ రకంలోదే. ఈ అంశం తీసేస్తే గీతల మూల మతానికి వ్యత్యయం కలుగదు, అందహీనమూ కాదు. గీతలలో ఏ యితర మతానికీ ఇది ఆధారం కాదు. గీతలలో మరెచ్చటా దీని కనురూపమతం లేదు. పైగా విరుద్ధమతాలే వున్నవి. ఈ పురుషోత్తమ పదం బౌద్ధ వాఙ్మయంలోని 'పురిసు ఉత్తమ'కు 'సంస్కృతం' అని బ్రాహ్మ ధర్మావలంబులు మహేశ చంద్రులు వ్రాశారు. కాని "అక్షరాత్ పరతః పరః" అను శ్రుతే అక్షరుణ్ణి కింది మెట్టుకు దింపింది. భారతంలోనే పరమాత్మకు పురుషోత్తమత్వం మోక్ష ధర్మపర్వంలో ఉంది. ఛాందోగ్యంలో 'ఉత్తమః పురుషః' అనేది పురుషోత్తముడే అని అద్వైతు లంటారు.

—చూ. ఉత్తరాదికరణం

10. సగుణ బ్రహ్మ.

11. ఈ ప్రకరణం యావత్తూ 'ఊర్ధ్వ మూలం. ఈ మొదలుగా సకారణమైన ప్రపంచాన్ని వర్ణించి క్షరాక్షరుల కతీతమైన తత్త్వం పురుషోత్తమరూపంగా నిర్గుణ బ్రహ్మాన్నే నిరూపిస్తూ అద్వైతాన్నే దోహదం చేస్తుంది. అలా కాకపోతే క్షరాక్షరులకు పైవాడు పురుషోత్తముడని చెప్పి, భగవానుడూనున్నూ క్షరాక్షరాతీతుడు కాబట్టి పురుషోత్తముడని అనడం వ్యర్థమేను. ఇచట పురుషోత్తముడు వేరని మొదట చెప్పి, అతడు ఈశ్వరుడు కాబట్టి అతడికంటె వేరైనవాడే భక్తముక్త జీవులకంటె భిన్నుడని తలపించి, అధికారిక పురుషుడైన తాను క్షరాక్షరా తీతవల్లనే పురుషోత్తముడు కానీ, స్వతహాగాకారని నిరూపితమయ్యే నిర్గుణ రూపమే పురుషోత్తమ స్వరూపాన్ని తోపజేస్తుంది. కాబట్టే....'స సర్వవిద్భజతి మాం సర్వ భావేన' అని "సంవిన్మాత్రరూపమైన బ్రహ్మజ్ఞానంచే సర్వాత్మనా బ్రహ్మ భావం చెప్పబడు తూందని ఉత్తర శ్లోకంలో అనడం చక్కగా ఉందని అద్వైతులంటారు.

అరవిందుల అభిప్రాయం Essays on the Gitas లో చూచేది.

# 4. అధ్యాస

శ్రీ శంకరాచార్యులవారు అద్వైత వేదాంతము అను ఒక గొప్పమేడను 'అధ్యాస' అను పునాదిమీద కట్టిరి. ఈ పునాదికి మొదట మొదట ఉప్పరపని చేసినవారు బౌద్ధులని పురాతన వస్తుశోధకులు కనుగొనుచున్నారు.

ప్రాజ్ఞులు ప్రజ్ఞానేత్రము తో పఠింపదగిన బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయబోవుచు శ్రీ ఆచార్యులవారు అద్వైతమతమునకు పీఠికగా అధ్యాస భాష్యమును రచించిరి. ఈ పునాదిలోని ఇసుకనే గీతాభాష్యము నందును వెదజల్లిరి. ఈ రేణువులే మధురమగు వారి కవితా గానములో సరిగమ పధని.

1

బ్రహ్మమనగా పరమేశ్వరుడు ; ఒకడే వున్నాడు. వేఱేమియు లేదు.

2

బ్రహ్మమునందు జగద్ భ్రాంతి (అధ్యాస) కలుగును.

3

జగత్తు లేనే లేదు :

పరమేశ్వరు డుండెనో లేడోకాని, తానును జగత్తును ఉన్నటులు ఆబాలగోపాల మెఱుగును గదా ! జగత్తు లేదనుట యెటులు? ఎటులంటివోయి! బ్రహ్మమునందు జగత్తు కల్పితమగుచున్నది. చీకటిలో త్రాటిని జూచి పాము అని అనుకొనవా? ఎండలో తలతలలాడు ఆలిచిప్పను చూచి వెండిరే కనుకొనవా ? ఎడారులలో ఎండమావులను జూడవా? ఆ త్రాటియందు పాము ఆరోపితమైనది. ఆలిచిప్ప వెండియయినది. తెలిసిన పిదప త్రాడు త్రాడే! ఆలిచిప్ప ఆలిచిప్పయే! ఈ రీతిగ బ్రహ్మమునందు జగత్తు ఆరోపితమయినది. తెలియుచో అంతయు బ్రహ్మమే!

**మూడు :** మనకు మూడు పదార్థములు చూపట్టుచున్నవి.

1. పరమేశ్వరుడు లేక బ్రహ్మము.

2. జీవాత్మ లేక నేను
3. ప్రపంచము లేక జడము

**బ్రహ్మము :** బ్రహ్మము సత్ + చిత్ + ఆనంద స్వరూపము. 'సత్' అనగా ఎల్లప్పుడును (నశింపక) ఉండునది. చిత్=చేతన స్వరూపము, అనగా ఎఱుకయే స్వరూపముగా గలది. మఱియు ఆనందము గూడ ఆయన స్వరూపము.

పరమేశ్వరుడు చచ్చిపోవు స్వభావము కలవాడనిగాని, తెలివి తక్కువ మొద్దనిగాని, ఎపుడును ఏడ్చుచు కూరుచుండువాడని గాని ఎవడును అనుకొనడు. కావున పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడని యనినచో ఎవరును వాదింపరు. ఇట మత భేదములేదు.

**జీవుడు లేక నేను :** నేను అను ఎఱుకకు తావు అయినవాడు జీవుడు. ఇతడు దేహేంద్రియాదులగు ఉపాధులతో కూడుకొని ఉన్నాడు. ఇతడే ఆత్మ; జీవాత్మ; ప్రత్యగాత్మ; చిదాత్మ; కర్మభోక్త.

'నేను పుల్లయ్యను, నేను వెంకయ్యను, నేను పుల్లమ్మను, నేను వెంకమ్మను' అని ఇతడనును. ఇతడు సుఖము కొఱకు దేవులాడును. ఆ సుఖము కొఱకు ఎన్నియో దుఃఖములను అనుభవించును.

**ప్రపంచము లేక జడము :** బుద్ధి మొదలుకొని శరీరము వఱకు అయిన ప్రకృతి పరిణామ మెల్లయు జడము. ఇది అసత్తు. అచేతనము. సచ్చిత్ స్వరూపుని కంటె వేఱయిన దెల్లయు జడము. ఇది 'నేను' కంటె వేఱు. కావున దీనికి 'నీవు' అని వేదాంతములో వాడుక. ఇది నేను అను ఎఱుకకు తావైన జీవాత్మచే చూడబడును గావున 'విషయ' మనిపించుకొనును. కాగా జీవాత్మ లేక 'నేను' విషయి యాయెను.

ఈ జడమే, ఈ జగత్తే అందఱచేతను బోల్తాలు కొట్టించుచున్నది. వింతలో వింత యేమనగా లేకుండగనే ఉన్నా ననిపించుకొనుచున్నది.

నిక్కమునకు జడము లేక ప్రపంచము విడిగా లేదు. చైతన్య సంయోగము లేక జడము దొరకదు. ఆకాశ సంయోగము లేక గాలి విడిగా

దొరుకునా ? కావుననే పుట్టునటువంటి స్థావర జంగమాత్మక మగునది యెల్లయు ప్రకృతి పురుష సంయోగము వలన పుట్టునని గీత చెప్పను.[1]

ఆత్మ అత్యంత నిర్మలము. అతి శుద్ధము. బుద్ధియు అత్యంత నిర్మలము. అతి శుద్ధము. అద్దమునందు సూర్యుడు ప్రతిబింబించినటుల బుద్ధియందు ఆత్మ చైతన్యాభ్యాస కలుగును. బుద్ధ్యాభాస మనసునందును, మన ఆభాస ఇంద్రియములందును, ఇంద్రియాభాస దేహమునందును కలుగును.[2] ఇట్టి బుద్ధి సంయోగము ఇటు ఇంద్రియములకును అటు ఆత్మకును గలదు.

## అ ధ్యా స

చీకటిలో త్రాడు చూచి పామనుకొనుచున్నాము. త్రాటియందు పాము అధ్యస్తము - అనఁగా ఆరోపిత మగుచున్నది.

ఒక వస్తువునందు మరియొక వస్తువు నారోపించుట అధ్యాస.

ఆకాశమున చంద్రు డొకడే వెలుగుచున్నను దృష్టి దోషము గలవానికి చంద్రులు ఇరువురు గానుపింతురు. దవ్వుదవ్వుల ఎండమావులు కానుపించును. ఇట్టి మిథ్యారూపమే అధ్యాస.

## అధ్యాస భాష్యము

'నా ఇల్లు, నా శరీరము, నా చేయి, నా మనస్సు' అని మనము వ్యవహరించుచున్నాము. ఈ వ్యవహారమునందలి ఇల్లు-శరీరము-చేయి-మనస్సు అను వీనికంటె వేఱుగా 'నేను' అని ఒక పదార్థము కలదు. ఈ 'నేనే' దర్శనములు వక్కాణించు చిదాత్మ. ఆ చిదాత్మకంటె వేఱయినా ఇల్లు-శరీరము-చేయి-మనస్సు ఇవి జడములు. అనాత్మ పదార్థములు లేక 'నీవు'. పై 'నేను'

---

1. యావత్ సంజాయతే కించిత్ సత్త్వం స్థావర జంగమం క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్. 13-27

2. బుద్ధేశ్చ ఆత్మ సమ నైర్మల్యా ద్యుపపత్తేః, ఆత్మ చైతన్యాకారాభాసత్వోపపత్తేః, బుద్ధ్యాభ్యాస మనః, తదాభాసానీంద్రియాణి, ఇంద్రియాభాసశ్చ దేహః. [అతో లౌకికాద్దేహ మాత్రే ఏవ ఆత్మ దృష్టిః క్రియతే.] గీతాభాష్య. 18-50

విషయి; ఈ 'నీవు' విషయము.[3]

ఈ నేను-నీవులు లేక చిజ్జడములు చీకటి వెలుగులవలె వేఱువేఱు దినుసులు. నేను నీవు కాదు. నీవు నేను కాదు. నేను = చిదాత్మ. నీవు = జడము. చిదాత్మయందుండు ధర్మములు జడమునందును, జడమునందుండు ధర్మములు చిదాత్మయందును ఉండవు. ఇటు లయినను చేతన ధర్మములు జడమునందును, జడధర్మములు చేతనమునందును ఆరోపించుచున్నాము.

దేహముకంటె, ఇంద్రియములకంటె, మనస్సుకంటె నేను వేఱుగా నున్నను ఆ దేహధర్మములను, ఆ ఇంద్రియ ధర్మములను, ఆ యంతఃకరణ ధర్మములను ఈ 'నేను' నందు ఆరోపించుచున్నాము. నేను ఎఱ్ఱగా నున్నాను-అని దేహధర్మమును ఆరోపించుకొనుచున్నాము.[4] ఈ ఆరోపణము పేరే అధ్యాస.

అతిశుద్ధము అతిసూక్ష్మము అగు ఈ నేనునకు (జీవునకు) బాహ్య జగత్తుతో సంబంధము కలుగునపుడు ఈ ఆరోపము కలుగుచుండును.

ఈ 'నేను' అను చిదాత్మ లేక వ్యక్తిగతమగు ఆత్మ విషయ ధర్మము లచే ఆవరింపబడి, 'నేను' అను ఎఱుకకు పాల్పడెను. ఇది సాక్షి గాదు-కర్త. ఇది అపరోక్షము కాదు. కావుననే దీనికి అర్థభావము మెండు.

దేహాదులను 'నేనే' అని యనుకొనుట భ్రాంతి. అటులయినను వ్యవహారమునం దది సంభవించుచున్నది. ఇది నైసర్గికము. అనాది. ఇదియ

---

3. యుష్మదస్మత్ ప్రత్యయగోచరయోః విషయ విషయిణ తమః ప్రకాశవద్ విరుద్ధ స్వభావయోః ఇతరేతర భావా నుపపత్తౌ సిద్ధాయాం, తత్కర్మణా మపి సుతరా మితరేతర భావానుపపత్తి రిత్యతః, అస్మత్ ప్రత్యయగోచరే విషయిణి చిదాత్మకే యుష్మత్ ప్రత్యయ గోచరస్య తద్ధర్మాణాం చ అధ్యాసః (బ్రహ్మ సూత్ర భాష్యం.)

4. **తథా దేహ ధర్మాన్-స్థూలోఽహం, కృశోఽహం, గౌరోహం, తిష్ఠామి, గచ్ఛామి, లంఘయామి చేతి. తథా ఇంద్రియ ధర్మాన్-మూకః, కాణః, క్లీబః, బధిరః, అంధోహ మితి. తథాఽన్తఃకరణ ధర్మాన్-కామ సంకల్ప విచికిత్సాఽధ్యవసాయాదీన్. (అధ్యాస భాష్య)**

అధ్యాస. త్రాటియందు మనకు అజ్ఞానము వలన-అనగా 'ఇది త్రాడు' అని స్పష్టప్రతిపత్తి లేమి వలన సర్పభ్రాంతి కలుగుచున్నది. లోగడ మనము పాము నెఱిగియుంటిమి. త్రాటిని గూడ నెఱిగియుంటిమి. రూపుచే త్రాడు పామును పోలియుండును. చీకటిలో ఆ త్రాటియొక్క మిగిలిన ధర్మములు కానిపింపవు. సర్పసామ్య మొకటియే కానిపించును. పూర్వ సంస్కారవశమున భయము కలుగును. దాన మోహ ముదయించును. దాన 'పాము' అను భ్రాంతి కలుగును.

అన్ని భ్రమలకును మున్మొదట ఇట్టి కారణము లుండును.[5] బ్రహ్మము నందు జగద్ భ్రాంతి కలుగుటకు ఇట్టి కారణ సామగ్రి కలదా? అసలు జగత్తునకును బ్రహ్మమునకును సామ్యము కలదా?

బ్రహ్మము సత్తు; జగత్తు అసత్తు. బ్రహ్మము చిత్తు; జగత్తు అచిత్తు. బ్రహ్మము ఆనందము; జగత్తు దుఃఖము. ఇక నీ రెంటికి పోలిక యేద?

దీని ప్రణాళిక ఇది కాదు. జీవుడు జడరథమును అధిరోహించినాడు; ఆ రథము కూడ తా ననుకొనుచున్నాడు. జీవుడు జడమను చొక్కా తొడుగు కొన్నాడు; ఆ చొక్కా కూడ తా ననుకొనుచున్నాడు. భ్రమచే బ్రహ్మ స్వరూపము మనకు ప్రచ్ఛన్నమయి యున్నది. కాన మనము జగదాకారముగా బ్రహ్మమునే చూచుచున్నాము. భ్రమ పోయినచో బ్రహ్మ స్వరూపము ప్రకాశించును. అపుడు మనకు బ్రహ్మజ్ఞానము కలుగును. పిమ్మట బ్రహ్మమునందు జగద్భ్రాంతి కలుగజాలదు.

శంకరులవారి అభిప్రాయ మేమనగా—జగత్తనికాని, జగదాకారమని గాని యేదియు లేదు. ఉన్న దొక బ్రహ్మమే. బ్రహ్మము తక్క జీవాత్మ యని వేఱొకటి లేదు. జీవాత్మ పరమార్థమున లేదు. బ్రహ్మమునందు జీవాత్మ అధ్యస్తమగుచున్నది.

5. నిక్కమైన వస్తువు నెఱుకచేగలుగు సంస్కారము, ప్రమాతృదోషము, ప్రమాణదోషము, ప్రమేయదోషము, అధిష్ఠానముయొక్క విశేష అజ్ఞానము, సామాన్య జ్ఞానము. ఇది అధ్యాస సామగ్రి.

అధ్యాసవలననే మనకు దుఃఖములు. అధ్యాసకే 'అవిద్య' అని మారు పేరు. అవిద్య మనకు సెలవిచ్చుచో ముక్తిద్వారము ఎదుట. అవిద్యను తొలగించుటకే వేదాంతశాస్త్రము దండధారి; ఇదియే శంకర దర్శనము.

## జగత్తు, అధ్యాస (అవిద్య)

ఉండునది సత్తు. ఉండనిది అసత్తు. సత్తునకు మార్పు ఉండమి ఒక విశేషము.

బ్రహ్మ మొకటియే ఉండునది. మార్పులేనిది, కావున అది యొకటియే సత్తు. కాగా ఈ జగత్తు, ఈ అధ్యాస ఎటనుండి ఊడిపడెను ?

జగత్తు మార్పు చెందుచుండును; కాన జగత్తు సత్తు కాదు. జగత్తు ఉన్నటులు తోచును. కాని అసలు జగత్తు లేదు; ఈ లెక్కన జగత్తు అసత్తు.

జగత్తు ఉన్నటులు తోపజేయునది అధ్యాస-లేక-అవిద్య. కావున అవిద్య అసత్తు కాదు. కాని అవిద్యయు మార్పు చెందుచుండును. విద్య ఆవిర్భవింపగనే అవిద్య తొలగును. కావున అవిద్య సత్తు కాదు. కాగా అవిద్య సత్తు కాదు; అసత్తు కాదు. సదసత్తు కానిది. అనిర్వచనీయము. అనగా కలదని కాని, లేదని కాని చెప్పరానిది. అనిర్వాచ్యమగు నీ యధ్యాసనే, ఈ అవిద్యనే 'మాయ' యనియు నందురు.

ఇది బ్రహ్మము యొక్కయే అంశవిశేషము. విద్యయు, అవిద్యయు బ్రహ్మాంశములు. విద్యకు అవిద్యకును చీకటివెలుగు లంత లేడా. చీకటి పోవుడు వెలుగు, వెలుగు పోవుడు చీకటియు వచ్చునటులు, అవిద్య పోవుడు విద్యయు-విద్య పోవుడు అవిద్యయు, దాగుడుమూత లాడును. విద్య ఆవిర్భవించుచో తత్త్వమును, అవిద్య ఆవిర్భవించుచో మిథ్యయగు జగత్తును కానిపించును. తత్త్వము విడివడగానే బ్రహ్మముకంటె వేఱేదియు ఎఱుకకు రాదు. అపుడెట్టి భేదజ్ఞానమును లేదు. విద్యయగు జగత్తు కానిపించునపుడు, ఆత్మ విషయిగా పరిణమించి విషయరూపమగు జగత్తును ఎదుట అనుభవము చేసికొనును.

"సచ్చత్యచ్చాభవత్
విజ్ఞానం చ అజ్ఞానం చ"

అని ఉపనిషత్తు చేతనమును జడమును తెలిపినను కేవల చేతన పదార్థమనియు, కేవల జడపదార్థమనియు విడివిడిగా లేవు. ఆత్మకే జడబుద్ధియు, చేతనబుద్ధియు. ఈ రెండు బుద్ధులును పారమార్థికములు కావు. ఆత్మయొక్క పారమార్థిక జ్ఞానము అధ్యాసచే రెండుగా తునిసి, రెండు తెఱగులుగా ప్రకాశమొందును. అవిద్య పోవుచో దానితోపాటు ఇదియు పోవును.

ఆత్మను అనాత్మను కలుపునొక తీరు, ఒక ధర్మము ఎఱుకకు కలదు. కాని ఆత్మకును జడమునకును చీకటివెలుగుల కున్నంత తేడా. ఇంత తేడాగల ఆత్మానాత్మలకు కలయిక ఉండదనియే మొదట తోచును. శంకరులు 'ఆత్మా నాత్మల కలయిక పారమార్థికముగా లేదు, కాని వ్యావహారికముగా నిక్కము'– అని అనిరి. ఆత్మకును జడమునకును వ్యావహారిక సంబంధము అనాది సిద్ధము. అనాది సిద్ధమయిన దానికి కడకు వ్యావహారిక సత్తను ఇయ్యకొనవలయును.

ఒకదానికి పారమార్థిక సత్త, మఱొకదానికి వ్యావహారిక సత్త ఇయ్యకొన్నచో ఎట్టి సిద్ధాంతము తేలును ? పారమార్థిక సత్త అనగా నిక్కమగు ఉనికి. వ్యావహారిక సత్తకు ఉనికియే లేదు. నిక్కముగా ఏది ఉండునో దానినే సిద్ధింపజేయుటకు వ్యావహారిక సత్త కలదు–అని తెలియవలయును. ఈ వ్యావహారిక సత్తకు దీనికంటె వేఱు సార్థక్యములేదు.

ఆత్మను అవిద్య ఆశ్రయించుటజేసి[6] అనాత్మ పొడమె ననరాదు. అటు లన్నచో ఆత్మ పరిణామి అగును. శ్రుతి ఆత్మను పరిణామి అనదు. కావున ఆత్మ అపరిణామి. అగుచో అది యెటులు అజ్ఞానవర్తి? అపూర్ణమును అజ్ఞాన మాశ్రయించును. ఆత్మ పూర్ణము. ఆత్మ దేనికిని అంశముకాదు. అది తనకొఱకు మఱొక దానిమీద బడదు. కావున ఆత్మను అజ్ఞానము ఆశ్రయింపనేఱదు.

---

6. పారమార్థిక సత్త నెఱుగమినిగాని, భ్రమచేగాని వ్యావహారిక సత్త సృష్టి కలుగునమట.

వివరణాచార్యుడు లోనగువారు బ్రహ్మమును అజ్ఞానమునకు ఆశ్రయము చేసిరి. ఈ మతము చొప్పున అజ్ఞానముగాని, అవిద్యగాని జగత్ కారణమగుచో జీవుని అజ్ఞానమునకు ఆశ్రయముజేసిన భామతీకారుని మతముకూడ సంగతముగా తోచును. కాని జీవుడు అజ్ఞానమునకు ఆశ్రయమాయెనా ? అతనికి పారమార్థిక సత్తను గూడ కట్టిపెట్టవలయును.

శంకరులు జీవునికి పారమార్థిక సత్తను ఇయ్యకొనలేదు. మఱియు జీవునిగాని, బ్రహ్మమునుగాని అజ్ఞానమునకు ఆశ్రయము చేయలేదు. వీరి మతమున బ్రహ్మము విషయముకాదు. 'నేను' అను ఎరుకకు గోచరమగు ఆత్మ కలదు. అది విషయము. 'నేను' అను ఎరుకకు విషయము కాదా ? ఈ 'నేను' అను ఎరుక ఎటనుండి వచ్చెను ? అవిద్యనుండి.

అనగా 'నేను' అను ఎరుకకు గోచరమగు ఆత్మ బ్రహ్మమునకు విషయముకాదు. అవిద్య బ్రహ్మమును ఆశ్రయము చేసికొననేరదు. అవిద్య వలన పుట్టినది బ్రహ్మమునకు విషయ మెట్లు కాగలదు ? ఇక నేను అను ఎరుక బ్రహ్మమునుగాదు; బ్రహ్మమునుండి పొడమినదియుగాదు. అవిద్య లేక మాయ బ్రహ్మాంశమనుట నిక్కమకాని దానిచే బ్రహ్మమునకు లేపము లేదు.

ప్రకృతినుండి అహంకారము పొడమెనని సాంఖ్యము. అవిద్యనుండి అహంకారమని వేదాంతులు. ప్రకృతి ఒక్కటియే అహంకారమును కనలేదు; పురుషుడు వలయు. ఇటులే బ్రహ్మ సాన్నిధ్యమున అవిద్య అహంకారమును సృజించును. బ్రహ్మమునకు దానితో ఎట్టి లేపమును లేదు. దాన బ్రహ్మ స్వరూపమునకు ఎట్టి మార్పును లేదు.

తేలినదేమన— జీవుడు బ్రహ్మము కాడు. జీవునికి పారమార్థికముగా అస్తిత్వములేదు. జీవుడు అవిద్యా సంభూతుడు. కావున జీవత్వము మిథ్య; ఉశక్తి. అవిద్యవలనగాని, అజ్ఞానమువలనగాని పుట్టునది మిథ్య.[7] దానికి జ్ఞానము పునాది

---

7. వివరణాచార్య ప్రభృతుల మతమున జీవబ్రహ్మ ప్రభేదములేదు. బ్రహ్మమే అవిద్యాగ్రస్తమయి జీవాకారితమగును. అవిద్య పాయుడు. జీవత్వమును పాయును. భామతీ కారుల మతమున జీవుడే అవిద్యకు ఆశ్రయము. అవిద్యమాయగనే జీవునికడ బ్రహ్మము స్వస్వరూపమున ప్రతీతమగును. భామతీ కారులు శంకర భాష్యమునకు టీక వ్రాసిరి. వారును అద్వైతవాదులే. కాని జీవభావము బ్రహ్మముయొక్కయే అంశ విశేషమని వారి అభిప్రాయము. ఇటులాయెనేని జీవుడు బ్రహ్మమునకు అనాది కాలమునుండియు అంశ విశేషముగా ఉన్నాడన్నమాట. ఏది అనాది కాలమునుండియు ఉండునో అది అనంత కాల వ్యాపి.

కాలేదు. బ్రహ్మము నిర్వికారము. అనాసక్తము. కావున బ్రహ్మముతో జీవ భావమునకు ఎట్టి సంపర్కమును లేదు. జీవుడు బ్రహ్మమును ఎఱుగనులేడు. జీవునకు బ్రహ్మమునందు చారితార్థ్యము ఉండను జాలదు— అని తోచును.

[ఇదొకరీతి శూన్యవాదము. జీవనముగాని జగత్తుగాని దుఃఖమునకే మూలమగుచో ఈ మతమునకు సార్థకత కలుగును. ఈ మతమున నిర్వాణము గాని ముక్తిగాని సాధిత మాయెనేని అంతయు శూన్యమయి పోవును.]

## బౌద్ధ దర్శనము

నేటి నైయాయికుల మతమున జ్ఞానము త్రిక్షణస్థాయి. ఒక క్షణమున పుట్టును, ఒక క్షణముండును. మూడవ క్షణమున మూలబడును. బౌద్ధుల దర్శనమున జ్ఞానము క్షణికము. దీనికి స్థితిలేదు. వెంటనే గిట్టును.

వీరు రెండు సత్యములు అంగీకరింతురు :

1. సంవృత సత్యము, 2. పరమార్థ సత్యము. సంవృత సత్యమును తఱవగా దీనికి పునాది లేదనియు, ఉళక్కియనియు తేలును. ఇది మాధ్యమికుల మతము. దీని పేరు అప్రతిష్ఠిత ధర్మవాదము. ఇక పరమార్థ సత్యమేమనగా— ధర్మధాతువు అనిర్వచనీయము. దీనికే మరొక పేరు శూన్యము. శూన్యము అభావవాదము కాదు, భావవాదమును గాదు. ఇది అనిర్వచనీయమగు ఒకానొకటి. ఇది అచ్ఛేద్యము; అభేద్యము. అచ్ఛిద్రము, దృఢము. సారము.[8] అదాహి, అవినాశి. ఇట్టి శూన్యత్వము పేరే వజ్రము. ఇది భావము కాదు. అభావము కాదు. భావాభావము కాదు. అభావాభవము కాదు. కావున ఇది మన ధారణ కావల. అటులని దీనిని ఇయ్యకొనకుండ వీలులేదు.

దీనికిని శంకర దర్శనమునకును గల పోలికనుబట్టి పలువురు శంకర దర్శనమును ప్రచ్ఛన్న బౌద్ధమని అన్నారు. కాని అది నిక్కము కాదు. శంకరులు బ్రహ్మమును చాటు చేసికొని శూన్య మతమును స్థాపింపలేదు. ప్రత్యుత వారి పరమ గురువులగు శ్రీ గౌడ పాదాచార్యులవారివలె వలసిన దానిని కైకొని, శూన్య సిద్ధాంతమును ధ్వంసము చేసిరి.

8. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ. గీత-2.

## న వీ ను లు

నేను లేక ఆత్మ నిక్కముగను లేనిచో బ్రహ్మము ఉన్ననేమి, ఊడిన నేమి? నేను ఉన్న ఎడలనే జగత్తుతోగాని బ్రహ్మముతోగాని ప్రయోజనము గదా! కావున అద్వైతమునకు భంగమురాని విధమున యీ 'నేను'ను నిలుప వలెనని నవీనులు అందురు.

'నాకు రెండు ప్రకృతులు కలవు. ఒకటి పరా, రెండవది అపరా. పర జీవప్రకృతి; అపర మన్ను–మిన్ను–నిప్పు–నీరు–గాలి–మనస్సు–బుద్ధి–అహం కారము[9] జగత్తు. ఈ రెంటి సంయోగమే జగత్తు.[10] ఈ రెండు ప్రకృతులును నావే అని గీత యనును. మఱియు నన్ను సర్వభూతములకును బీజమునుగా నెఱుగుమని భగవాను డనును.

ఈ సంయోగము అధ్యాసకంటె– అనగా– భ్రమకంటె– లేక– అసత్యము కంటె దృఢమై యుండవలయును. జీవుడు నా యంశమే యనుటయు, అతడు శరీరమును గొనుననుటయు గలిగి ఇదంతయు వట్టి అధ్యాస యగుచో అడియాస యని నవీను లనుచున్నారు. వీరి అభీష్టము తెలుపుటకు మఱొక వ్యాసము వలయును.

9. గీత. 7-4,5,6.

10. త్రాటియందును, అలిచిప్పయందును, అధ్యస్తము చేయబడిన సర్పము, రజతము-వీని సంయోగమువలె ఈ రెంటి సంయోగము గూడ ఇతరేతర తద్ధర్మాధ్యాస లక్షణ మని శంకరులు. గీతాభాష్య. 13-23.

# 5. ఉనికి - ఏకత

## ఉనికి

కుండ ఉన్నది; రాముడు కలడు— అనునెడ కుండ యొక్కయు రాముని యొక్కయు 'ఉనికి' లేక 'కలిమి' మనకు గోచరించుచున్నది. కుండ లేదు; రాముడు లేడు— అనునెడ కుండ యొక్కయు రాముని యొక్కయు ఉనికికి వేఱయిన లేమి గోచరించుచున్నది. ఉనికి యనగా కలిమి, అస్తిత్వము లేక సత్త.

ఏదేని ఉన్న యెడలగాని, ఏదేని అయిన యెడలగాని దాని దాని ఉనికి కలదని చెప్పవచ్చును. ఉనికిలేని వస్తువేదియు లేదు.

మన మున్నాము. మన చుట్టును వస్తువు లున్నవి. వాని కావల ప్రపంచ మున్నది; దాని కావల దేశము; దాని కావల కాలమును ఉన్నవి. ఇటులు ఉనికి యననేమో మన మెరుగుదుము. ఈ యునికిని గురించి విజ్ఞులలో చాల అభిప్రాయ భేదములు కలవు.

ఉనికి లేక సత్త యనునది జాతి విశేషమని నైయాయికు లందురు. జాతి యనునది ద్రవ్యగుణ కర్మలయందుండును. ఇది నిత్యము. అర్థక్రియా కారిత్వమే ఉనికి అని కొందఱందురు. దేనిచే ఏపనియు కాజాలదో, మఱియు దేని పని ఎచటను కనబడదో అట్టి దొకటి కలదని యెటులు చెప్పగలము? కావున అర్థ క్రియా కారిత్వమును, ఉనికియును ఒక పదార్థమే యగునా?

క్రియనుబట్టి ఒకానొక వస్తువు కలదని మనమూహింతుము. కాని కార్యమే ఉనికియా? ఏదేని పని జరుగవలసియున్నచో, దానికి ముందు అవశ్య మొక వస్తు వుండవలయును. క్రియయే ఉనికి; ఏకమాత్ర నిదర్శనమయినను పదపటి క్రియయు, తొల్లిటి ఉనికియు ఏకపదార్థము కాజాలదు.

కాలముతో సంబంధము పడుటయే ఉనికియని కొందరందురు. కాలముతో దేనికి సంబంధము కలదో అది ఉన్నది అని మన మనుకొనవచ్చును.

కాలముతో సంబంధపడి యుండుటయే ఉనికి కాదు. ఏలయనగా నిన్ననో మొన్ననో యొక కుండ పగిలిపోయెను. ఆ కుండ ఉన్నది అని మన మన గలమా ? కావున ఉనికి యనుదానికి వర్తమాన కాలముతో సంబంధపడిన దానికే ఉనికిని చెప్పవలయునని కొందరందురు. అసలు ఉనికి అనుదాని తావు దేశ కాలములలో కలదని మఱి కొందరందురు.

కలవని మనము తలచు వస్తువులన్నియు దేశకాలములతో సంబంధ పడియే యున్నవి. వీని కలయికలేని వస్తువే లేదు. దేశ కాలముల కలయికలేని స్థితి యనున దొకటి యుండునెడల, ఆ స్థితిలో ఏ వస్తువునకును ఉనికి లేక పోవచ్చును. గాని ఆయా యీ వస్తువుల యునికియే దేశకాల సంబంధ మనఁ జెల్లదు. కుమ్మరి నిన్న నొకకుండ నొనరించెను; నే డొకటి చేయుచున్నాడు. ఈ రెండు కుండల యునికియు దేశకాలములతో సంబంధపడెను. ఆ యునికియు ఈ సంబంధమును ఒకటియా ? ఆ కుండల కేదేని యునికి కలుగుచో, ఆ యునికి దేశ కాలములలో కలయిక చెందునుగాని ఆ కుండలు తా మునికి లేనివై దేశకాలముల వలన ఉనికి గొనవు. ఇంతియకాక, దేశకాలములకు గూడ నొక యునికి కలదే-వానికి ఆ యునికి యెచటనుండి వచ్చెను ? ఇతర వస్తువుల వలెనే అవి తాము లేకపోయి, తమ కలయిక వలన ఇతర వస్తువులన్నిటికిని ఆ ఉనికిని చేకూర్చిపెట్టుననిన నమ్మజెల్లదు కదా ! కావున ఉనికియు దేశకాల సంబంధమును ఒకటికాదు.

అబాధితత్వమే ఉనికియని కొందఱ యభిప్రాయము-అనగా కాలత్ర యమునందును నాశములేని దేది కలదో అదియే యునికి.

ఉత్పత్తి వినాశములు రెండును ఈ విశ్వమునందు పన్నిదము చఱచు కొని నటులు పనిచేయుచున్నవి. కారాకులు రాలుచున్నవి; క్రొత్తాకులు పొడము చున్నవి. ఇటులు ప్రకృతిధార ఇగిరిపోవుట లేదు. అయినను నిన్నటి వస్తువే నేడు లేదు. నేటి వస్తువు రేపు లేదు. ఉన్న వస్తువును ఉన్నదనుచున్నాము. లేని దానిని లేదనుచున్నాము. పారిభాషికమైన పై యునికి సంగతి మనకు గోచరము. కాని వాడుకలో నున్న ఉనికి మనకందఱకును తెలిసినదే !

## ఎఱుక

ఎఱుక యనగా తెలివి, లేక జ్ఞానము. మన యెట్టెదుట నొక కుండకలదు. దానితో మనకు పనియున్నది. దానిని మనము చూచితిమి. ఇది కుండ అను ఎఱుక మనకు కలిగెను.

కృష్ణుడు 'రామా' అని పిలిచెను. రాముడు ఆ శబ్దమును విని 'ఆఁ' అని బదులు పలికెను. మనము పూవులను మూరుకొని, వాని తావిని తెలిసికొనుచున్నాము. గాలి నీరుల చల్లదనమును వెచ్చదనమును గ్రహించుచున్నాము. తినుబండారముల పులుపు తీపి మొదలగు చవుల నెఱుగుచున్నాము. ఇటులు పంచేంద్రియముల తోడను ఆయా యీ విషయముల దెలియుచున్నాము.

ఆత్మ మనస్సుతోడను, మనస్సు కన్ను మొదలగు నింద్రియములతోడను, ఇంద్రియము కుండ మొదలగు ద్రవ్యముతోడను సంయుక్తమయినపుడు 'ఇది కుండ' ఈ మొదలగు ఎఱుక మనకు గలుగుచున్నది.

మనకపుడపుడు మన యెదుటలేని కొన్ని కొన్ని విషయములు నెఱుతు తగులును. సుఖదుఃఖాదు లనుభూతము లగును. కలలలో పలు విషయములు కానవచ్చును. ఇటులు ఎఱుక యనునది వివిధముగను విచిత్రముగను అనంతముగను ఉన్నది

ఎఱుకలేనిదే ఎవరికిని ఏ వ్యవహారమును సాగదు. ఎఱుకయే లేనిచో ప్రపంచమంతయు చీకటికొట్టు. జాగ్రదవస్థలో మన మెల్లపుడును దేనినో యొక దానిని తెలిసికొనుచునే యున్నాము. అటులనే సుషుప్తియందును మన కెఱుక కలదని కొందఱందురు.[1]

సుషుప్తియందును మూర్ఛయందును మనకెరుక యుండదుగాని మనము మాత్ర ముందుమని కొందఱందురు. దీని నంద ఱంగీకరింపరు. అంగీకరించిన వారు గూడ దీనికి ప్రత్యక్ష ప్రమాణము చూపజాలరు. అప్పటి మనయునికికి అనుమాన ప్రమాణము కలదు గాని ఆ స్థితిలో మనకెరుక యుండదు కాన ఆ యునికి యెటులుండునో మనము చెప్పజాలము.

---

1. యద్వైతన్న పశ్యతి పశ్య న్వైతద్ద్రష్టవ్యం నపశ్యతి నహిద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో దృశ్యతేఽవినాశిత్వాత్.

"సర్వ వ్యవహారములకును హేతువైనది బుద్ధి. అదియే జ్ఞానము."[2] అని నైయాయికు లందురు. జ్ఞానము ఆత్మగుణమని కొందఱును; మనోగుణ మని కొందఱును; ఆత్మాశ్రయమగు ప్రకాశమని మఱికొందఱును చెప్పిరి.

ఎఱుక యననేమియో అందఱకును అలతిగనో వలతిగనో తెలియును. ఎఱుక యననేమియో తెలియని వారికిని, ఎఱుకయనుచో దేనిని తెలిసికొను టుచితమో దానిని తెలిసికొనని వారికిని పైలక్షణము లేవియు నుపయోగింపవు.

## వస్తుజ్ఞానవాదులు

ఉనికికిని ఎఱుకకును ఏమయినను సంబంధము కలదా? ఉనికి యెఱు కలు రెండును అన్నదమ్ములు. ఉనికి వ్యాపకము; ఎఱుక వ్యాప్యము. ఉనికి లేని దేదియు లేదు. ఎఱుక లేని పదార్థములు ఘట పటాదులు చాల గలవు.

"ఓయీ! ఘట పటాదులకు ఎఱుక లేకపోయినను లేకపోయె; వాని యెఱుక మానవులకు గలదు కదా! ఎవరికో యొకరి కిట్టి యెఱుక లేకపోయినచో 'ఇది ఘటము, ఇది పటము' అని యెటులు నిరూపింప బడును? కావున జ్ఞానము వస్త్వధీనము. జ్ఞానము ఉండవలయుచో వస్తువు ఉండి తీరవలయును. వస్తువులేనిచో దేని యెఱుక యుండును? కాని వస్తువు ఉండవలయుచో ఎఱుక ఉండి తీరవలయునను నియమ మక్కఱలేదు అని వస్తువాదు లందురు.

"జ్ఞాన నిరపేక్షముగా వస్తువు ఉన్నదనుటకు ప్రమాణ మేమియును లేదు. వస్తువు ఉండవలయుచో దాని యెఱుకయు ఉండి తీరవలయును. ఎఱుక వినా వస్తువు యొక్క అస్తిత్వమునకు ప్రమాణము లేదు; అర్థమును లేదు." అని జ్ఞానవాదులందురు.

## బర్క్లీ

అను నతడు జ్ఞానవాది. ఇతని మతమున ఉనికియు ఎఱుకయు నొకటియే. "ఒకానొక వస్తువు ఉన్నది. మనకు దాని యెఱుక కలుగుచున్నది." అను నీరెండును వేఱు కావు. ఈ జగత్తులోగాని, మఱి యెచటగాని ఏదేని ఒక వస్తు

---

2. సుబోధయిషా పూర్వక వాక్ ప్రయోగః, అథవా తాదృశ వ్యవహార జనకతా వచ్ఛేదక జాతి మత్త్వమ్. (వాక్యవృత్తి-భాషా పరిచ్ఛేదము)

వున్నదనగా నేమి ? దాని యెఱుక మనకు కలదనియే అర్థము. ఎఱుకలో జేరని వస్తువునకు భావ మెటులు ?

ఇంద్రియములచే ఎఱుగ బడున దంతయు దృశ్యము.[3] ఈ జగత్తంతయు దృశ్యము. ఈ దృశ్యము జ్ఞాన సాపేక్షము. దర్శనము వినా దృశ్యమునకు వేఱ అస్తిత్వములేదు. దర్శన వ్యతీతమగు దృశ్యమునకు ప్రమాణమును లేదు; అర్థమును లేదు. పంచేంద్రియములకును విషయమయిన విశ్వ మెవరికిని తెలియదని కల్పన చేయజాలను. చూడబడని రూపమునకుగాని, చవిచూడ బడని రసమునకు గాని, మూరుకొనబడని తావికి గాని, వినబడని శబ్దమునకు గాని ఉనికి కలదని మన మనుకొనజాలము.

దృశ్యమునకు ఎఱుకకన్న వేఱుగా ఏదో యొక రూపము ఉన్నచో అది అందఱకును ఒక మాదిరిగానే ఎఱుకపడవలసి యుండును. కాని అది అటులు జరుగుట లేదు. ఒక వస్తువే పలువురకు పలుతీతులుగా కానిపించును. నే నీ దిక్కునుండి యీ బల్లను చూచుచున్నాను. ఇంకొకడావలి దెసనుండి చూచును. ఈ బల్ల నాకే రీతిగా కనబడునో ఆవలినుండి చూచువానికి ఆ రీతిగా కన బడదు. మనకు గానిపించునదియే దృశ్యమగు నెడల ఎవరి దృశ్యము వారిదే అని అనవలసియుండును. దృష్టి భేదముచే దృశ్య మవశ్యము భిన్నమయి పోవును. కావున దృశ్య మెప్పుడును దర్శన సాపేక్షము.

మన దృష్టిని బట్టియే దృశ్య ముండునని అంగీకరింతము. అయినను మనము చూడని వస్తువులు చాల నున్నవే! అవి యెటు లున్నవి ?

మనము చూడనంత మాత్రమునను, చూడజాలనంత మాత్రమునను అవి లేకపోవు. అవి ఉన్నవి. మానవులు చూడజాలనివి భగవానుని యెఱుకలో నున్నవి. మనము సర్వజ్ఞులము కాము. కాని భగవానుడు సర్వజ్ఞుడు. ఈ యెడ సందియము లేదు. "గుణమే మన కెఱుకయగుచున్నది. రూప రస గంధములు గుణములు. గుణముకల గుణి యొకటి యున్నది. అది మన జ్ఞాన సాపేక్షము కాదే" అని యనిన యెడల నిటులు ప్రత్యుత్తరింతము :

---

3. Esse is Percipi.

రూప రస గంధములు మనచే అనుభూతము లగుచున్నవి. అవి యున్న వని అంగీకరింపవచ్చును గాని వాని అడుగుననో, లోపలనో ద్రవ్యమను పేర నేది కలదో దానిని మనము చూడబడయజాలము. కావున అట్టి ద్రవ్యము కల దని అంగీకరించుటకు ప్రమాణము లేదు.

రూపాదుల నెఱుగగల మన జ్ఞానము బాహ్య పదార్థములవలన ఉత్పత్తిల్లి నదని మన మనసునకు వచ్చిన యెడలనే గుణముల వెనుక ఒకానొక జడ ద్రవ్యము కలదని అంగీకరింపవలసివచ్చును. కాని కేవలము బాహ్య జడ పదార్థములవలననే మనకు జ్ఞానోదయ మగుచున్న దనుటకు వీలులేదు. సాక్షాద్ భగవంతుని సన్నిధానము వలననే మనకు అట్టి జ్ఞానము కలుగును. బాహ్య పదార్థములు మన ఇంద్రియములమీద ప్రవర్తించి విషయజ్ఞానమును కలిగించునని అంగీకరించుట రాచబాటగా కానిపించును. దృశ్యజ్ఞానము నవలంబించియే కదా మీమాంస. జ్ఞానోపపత్తికొఱకు నానా జడ పదార్థముల నంగీకరించుటయు, వాని క్రియవలన దుర్నిరూపమగు నుపాయముచే అజడమగు నొకానొక జ్ఞానము సృష్టింపబడుననియు నంగీకరించుటకన్న భగవంతుని అంగీకరించుటయే లాఘవము. నిక్కమునను కేవలము మనము ఉన్నాము. భగవంతుడు ఉన్నాడు. బాహ్యమగు జడ పదార్థము లేదు. భగవంతుడు తన ఇచ్ఛాబలమున మనలో నానా దృశ్యపదార్థముల జ్ఞానము పుట్టించును. ఇది బర్కిలీ మతము.

## కాంట్

విషయరూపముగా గోచరించు జగత్తంతయును దృశ్యమే.[4] పదార్థము లకు బౌద్ధములగు కొన్ని యాకారములు[5] పెట్టి, మన మా పదార్థములను జ్ఞానమునకు విషయములనుగా జేసికొందుము. మఱియు దేశము, కాలము, కార్యకారణ సంబంధము, ఏకత్వము, బహుత్వము – మొదలగు వానివలన మనము విషయమును అవగత మొనరించుకొందుము. దేశమునందుగాని, కాలము నందుగాని లేనిదియు; కార్యముగాని కారణముగాని కానిదియు; ఏకముగాని అనేకముగాని కానిదియునగు పదార్థమును మన మెఱుగము. దేశకాలములుగాని, ఏకత్వ బహుత్వములుగాని, ద్రవ్యత్వముగాని, సాక్షాద్విషయ ధర్మము కాదు.

4. Phenomenal.
5. The forms of the understanding.

కాని విషయము బుద్ధిలో భాసింపవలయునేని వీని యన్నిటి సహకారము కావలయును.

విషయముగాని విషయతత్త్వముగాని[6] బౌద్ధమగు ఆకారము తాల్చి దృశ్యప్రపంచముతో మన జ్ఞానమున అవగహించును. ఈ యర్థమున దృశ్యప్రపంచము జ్ఞాన సాపేక్షము. కాని వ్యక్తిగతమగు జ్ఞానముచే దృశ్యప్రపంచము నియంత్రితము కాదు. మానవ జ్ఞానమునకు సర్వసాధారణములగు ఆకారములు చాలనున్నవి. దృశ్యప్రపంచము వాని యన్నిటిచేతను నియంత్రితము. దృశ్యప్రపంచమునందలి విషయరాశి వ్యక్తిగతమగు జ్ఞానదృష్టిలో జ్ఞాననిరపేక్షముకాదు.

అసలు విషయములకు అన్ని దృష్టులలోను స్వతంత్రమగు ఉనికి కలదు. విషయముల అసలు రూపము మన మెఱుగము, ఎఱుగను జాలము. బౌద్ధములగు ఆకారములు తాల్చి విషయములు ప్రతీత మగునంతవఱకే మన మా విషయముల నెఱుగుదుము. వాని నిజరూపమును అవి మనకు వెలడి చేయవు. రంగుజోడు పెట్టుకొని చూచినచో పదార్థముల అసలు రంగు తెలియనటుల బౌద్ధములగు ఆకారములవలన విషయముల నిజరూపము తెలియదు. తెలియుటకును వీలు లేదు. విషయముల నిజస్వరూపము జ్ఞాన సాపేక్షము కాదు-ఇది కాంట్ మతము.

## హెగెల్

మనకు సంపూర్ణముగా తెలియనిదియు, తెలిసికొనుటకు వీలులేనిదియునగు నొకానొకరూపము ఉన్నదనియే మన మెఱుగజాలము. మన మెన్నడును ఎఱుగజాలని వస్తువొకటి కలదని అంగీకరింపజేయు ప్రమాణమేదియు మనకు లేదు. దృశ్యప్రపంచమును మాత్రమే మన మెఱుగుదుము. దీని వెనుకనేని, లోపలనేని, అంతటనేని ఎఱుగబడనిదియు ఎఱుగబడజాలనిదియు నగు ఒకానొక రూపముతో వస్తువుగాని వస్తురాశిగాని అధిష్ఠితమయిగాని అధిష్ఠానమయిగాని ఉన్నదని అంగీకరించినందువలన ప్రయోజనమేమియులేదు. కావున దృశ్యప్రపంచమునకు మన యెఱుకకు దగిలిన యునికియేకాని వేఱ యునికి లేదు.

ప్రపంచము యొక్క యునికి దృశ్యాతిరిక్తము కానియెడల నది జ్ఞాన సాపేక్షము. దృశ్యప్రపంచము ఉండవలయుచో జ్ఞానముకూడ ఉండవలెను. 'దృశ్య ప్రపంచమే కలదు, జ్ఞానములేదు.— అని యనుట 'రూపాయకు బొమ్మ

6. The things in themselves.

పెదయే కలదు. అక్షరముల పెడలేదు' - అని యనుట వంటిది. దృశ్యమును జ్ఞానమును అసలు వేఱు కావు. ఇవి రెండును రెండు పదార్థములు కావు. అవి చరమ పదార్థము యొక్క రెండు పెడలు, లేక రెండు రూపములు.

వస్తువునకు స్వగతరూపము లేదు. జ్ఞానమొసగిన ఆకారమును తాల్చియే వస్తువు జ్ఞానమునకు విషయ మగును. నిర్జీవమును జడమును అగు రూపముకల వస్తువే లేదు. జ్ఞానాకారము తాల్చి వస్తువులన్నియు సచేతనములయి యున్నవి.

ఇక జ్ఞానమన్ననో శూన్యమును నిర్విషయమునగు చిత్తుకాదు. విషయాలింగితమయియే యెఱుక యునికి గొనును. నిరాకారమగు వస్తువులేదు. రూపములన్నియు జ్ఞాన నిర్మితములే.

ఉనికియు ఎఱుకయు సాక్షాత్తు వేఱు కావు. ఎరుగదగిన ఉనికియే ఉనికి. ఆ యునికి జ్ఞానరూపముతో మలచబడియే భావమగును. విషయముల వలన ఎఱుక యొక్క శూన్యతపోవును. ఎఱుక వలన విషయముల జడత్వమును అంధ్యమును లోపించును. విషయముతో గలిసిన యెఱుకయే యెఱుక. ఎఱుకతో గూడిన విషయమే విషయము. ఇది హెగెల్ మతము.

బర్క్లీ జీవ నానాత్వమును, భగవంతుని అంగీకరించును. జ్ఞాన విషయమైన విషయముల గూడ నంగీకరించును. జీవునకును భగవంతునకును జ్ఞానము కలదనునుగాని వారును జ్ఞానమును ఏకమని యనరు. అటులనే విషయములకు జ్ఞానము కలుగుననును గాని విషయమును జ్ఞానమును ఒకటియని యనడు.

హెగెల్ మతమున జ్ఞానము ముఖ్యతత్త్వము. అయినను అది విషయ సాపేక్షము. బుద్ధి నిర్మించిన ఆకారముకంటె విషయమునకు వేరు ఆకారములేదు. విషయము యొక్క మార్పే అట్టిది.

## అద్వైత వాదులు

కేవలము జ్ఞానమే కలదు. విషయములేదు. విషయములు మన కెఱుక యగు చున్నవే ! విషయము లేదనినచో మన ప్రతీతిని అపలంపించుటకాదా ?

నిక్కమే. విషయ మెఱుక యగును గాని దానికి ఉనికి లేదు. మనము చూచు విషయముల యునికి ప్రాతిభాసికము. వాని యునికిగాని, మనప్రతీతిగాని

యెఱుకలోనే పర్యవసన్నము. ఎఱుక వినా వానికి వేఱయునికియే లేదు. ఎఱుక చేతనే ఉనికియొక్క అర్థము వ్యక్తమగును. ఎఱుకకురాని యునికికి అర్థములేదు. ఎఱుకబడని యునికియు లేమియు నొకటియే. కావున ఉన్న యునికి యంతయు ఎఱుకలోనే కలదు. ఎఱుక వినా వేఱేమియు లేదు.

ఎఱుకలోగాని, ఎఱుకను ఆశ్రయించికొనిగాని విషయము కలదా ? విషయమును గూర్చి ఎఱుక యెపుడుండెనో విషయముగూడ నపు డున్నటులే కదా !

కాదు. ఎఱుకను మించిన ఉనికికి అర్థమేమియులేదు. కావున ఎఱుక వినా ఉనికి లేదు. మఱియు ఎఱుక యొక్క ఉనికి చేతనే విషయ మునికి గొను చున్నటులు పైకి గనబడుచున్నను లోతుగా చూచినచో విషయమునకు ఉనికి లేదని తేలును. ఎఱుకకు వేఱ యునికి యెపుడులేదో అపుడు ఎఱుకతో కలిసియే విషయము ఉనికికలది కావలసియుండును. కాని విషయ మెఱుకతో నెటులు కలసి పోగలదు. ? మఱియు ఎఱుకతో కలిసిపోయినచో విషయమునకు విషయత్వ ముండదు. ఇంతియకాక విషయము ఎఱుకతో ఏ రూపముగను సంబంధ పడ జాలదు. సంయోగసంబంధముతో సంబంధపడు ననుటకు వీలులేదు. సంయోగము ద్రవ్యములకు ఉండదు. ఎఱుక ద్రవ్యముకాదు. సమవాయసంబంధ మనరాదు. అది గుణగుణులకు ఉండును. విషయమునకును జ్ఞానమునకును గుణ-గుణి భావములేదు. సంయోగ సమవాయాతీతమగు మఱొక వాస్తవసంబంధము మన ఎఱుకలోలేదు. కావున విషయమని మనయెఱుకకు విషయమయినది మిథ్యా ప్రతి భావము. దీనికి నిక్కమగు ఉనికి లేదు. కావున ఎఱుకయే నిక్కమగు ఉనికి. ఇక రెండవ యునికి లేదు.

## వ స్తు వా దు లు

జ్ఞానవాదులకును, వస్తువాదులకును చుక్కెదురు. వారి వాద మిది : ఎఱుకకు వేఱుగా ఉనికి ఉపలబ్ధము కాదు. ఉపలబ్ధము కాని విషయ మున్న దనుటకు ప్రమాణము లేదు. కావున విషయము లేదు — అని కదా జ్ఞానవాదు లొత్తి పలుకుదురు. ఈ మాట సరియైనదేనా ? 'వస్తువు కలదనుటకు ప్రమాణము లేదు.' అనునదియు, 'వస్తువు లేదు' అనునదియు ఒకటికాదు. ఏలనగా, ప్రమాణమును వస్తువును ఏకవస్తువు కాదు. ప్రమాణమువలన వస్తువుయొక్క

అస్తిత్వము సిద్ధము కావచ్చును. ప్రమాణము దొరకనిచో వస్త్వస్తిత్వము సిద్ధము కాలేదననగును గాని, వస్తువే లేదనరాదు గదా! పలువురు పండితులు తమ తమ మత విశేషములను పోషించుకొనుట యందలి పట్టుదలచేత స్పష్టమగు ఇట్టి భేదమును తెలియజాలక వస్తువును సిద్ధమొనరింపజాలకపోవుటయే వస్త్వభావసిద్ధి యని పట్టుపట్టుదురు. ప్రమాణము లేనిచో వస్తువు ఉన్నదనియు చెప్పజనదు, లేదనియు చెప్పజనదు. లేకపోవచ్చునేమో యను సంభావనయు ఉండవచ్చును కాని ఈ సంభావననే వస్త్వభావముతో నిశ్చిత ప్రమాణరూపముగా గ్రహించుట మిగుల యుక్తి విరుద్ధము.

i. ఎఱుకకు ఆవలగూడ వస్తువు ఉన్నదనుకొందము. 'ఎఱుకకు ఆవల' అని యనగానే ఆ వస్తువును మన మెఱుగమన్న మాటయే కదా! మన మెఱుగ జాల మన్నమాత్రమున వస్తువే లేదని త్రోసివేయజనదు.

ii. ఒక వస్తువే పలువురకు పలురీతులుగా గోచరించుటబట్టి వస్తువునకు జ్ఞాన వ్యతిరిక్తమగు నిజరూపము లేదనరాదు. ఒక వస్తువును గుఱించి పరస్పర విరుద్ధములగు బహు రూపములు సత్యము కాకున్నను వస్తువునకు రూపమేదియు లేదనుట మాత్రము ప్రమాణ సిద్ధ మెటులగును? దాని వాస్తవరూపము మనకు తెలియకపోవచ్చును. అంతియకాని వస్తువు లేకపోదు. వస్తువు సరిగా తెలియక పోవుటయు, వస్తువే లేకపోవుటయు ఒకటి కాదు.

iii. వస్తువులు జ్ఞానాకారము తాల్చియే జ్ఞానమునకు నిజాకారమేదియు లేదు—అనుమాట మరతురు. బౌద్ధములగు ఆకారములు[7] కేవల విషయముల సాధారణరూప మాత్రములు. ఎఱుకచే మనము వస్తుగతములగు ఆకారములనే గ్రహింతుము. కాని బుద్ధిగతములగు ఆకారములను విషయములమీద ముద్రింపము. విషయ మే య్యాకారముతో మనకు గానిపించునో అది జ్ఞానగతము కాదు. కావున ఆ యాకారముకల విషయముయొక్క యునికితో జ్ఞానముయొక్క ఉనికికి సాహచర్య మంగీకరింప నక్కఱలేదు.

'ఎఱుకకు రాని యునికికి ఏమియు నర్థములేదు' అను అద్వైతమతమును అంగీకరింపవచ్చును. ఏలయన, ఎఱుక కాని వస్తువును తెలిసికొనజాలము గదా!

---

7. The forms of the understanding.

కాని ఒక విశేషము. ఎఱుకచే ఏ వస్తువునయినను తెలిసికొనుట యనగా ఆ వస్తువును ఆ ఎఱుకయు ఒకటి యనుట మాత్రము కాదు.

ఉనికియొక్క యర్థ మెఱుకచే నెఱుగవలసియుండుననుట నిక్కము. కాని ఆ యర్థమును ఎఱుకయును ఒకటియే యని యనుకొనుట మాత్రము కల్ల. ఉనికియు ఎఱుకయు ఏకార్థము లగునేని ఎఱుకకంటె వేఱుగా ఉనికి ఉన్నదా లేదా యను ప్రశ్న మెన్నడును పొడగట్టదు. ఉనికి యనగా ఎఱుకయే యని కొందరు తలపోయవచ్చును. కాని వారి కీ ప్రశ్న మెన్నడును తట్టదు. సత్తా జ్ఞానములు రెండును ఏకార్థకములు కావు గనుకనే మన కిట్టి ప్రశ్న యుదయించెను. తద్విచార స్వరూపముగా సత్తా జ్ఞానము లొకటియని తేలినది అని యనరాదు. పై జెప్పిన హేతువు వలన "ఎఱుకకంటె వస్తువేదియు లేదు"- అను జ్ఞానవాదుల వాదము నిర్వివాదము కాదని తేలుచున్నది. వారి యుక్తులు ప్రమాపకములు కావు.

"ఎఱుకకంటె వేఱ ఉనికి కలదా ?" అను విచారణకు ముందు 'జ్ఞానమును దాని విషయమును ఎన్నటికిని ఒకటికావు' అనుమాట లెస్సగా తెలియవలసి యున్నది. తెలియబడినది తెలివితో ఏకమగు నెడల తెలియబడున దేదియు నుండదు. కావున జ్ఞేయమగు విషయము జ్ఞానముకన్న సాక్షాద్భిన్నము.

మన మెఱిగిన వస్తువునే ఉన్నదని యందుము. లేని వస్తువు నెఱుగుటకు వీలుకాదు. విషయము తెలివిడి వెనువెంట విషయము ఉన్నదనియు మనకు ఉపలబ్ధమగును. ఏలనగా సద్రూపముగానే విషయము మన మెఱుగుదుము.

విషయము జ్ఞానము కన్న భిన్నము. కావున విషయము యొక్క యునికి ఎఱుకకు వేఱయియుండుటుచితము. విషయముయొక్క యునికి ఎఱుకతో ఏకమయి పోవు నెడల, విషయమునకు విషయత్వమే ఉండదు. జ్ఞానము నందే అది లోపించి పోవును. సూక్ష్మదర్శులగు అద్వైతవాదు లిది తెలిసికొనియే అసలు విషయమునకే అభావ మొప్పిరి. కాని ఎంతవట్టు విషయ ప్రతీతి కలుగుచున్నదో అంతవట్టు విషయమును ఒప్పుకొనినచో ఎఱుకకన్న వేఱయిన ఉనికిని ఒప్పుకొనకుండ నెట్లు ? కేవల జ్ఞానముచే ఏ వస్తువుగాని స్ఫూర్తిబడి యుండలేదు. ఎచట ఎల్ల ఉనికియు ఎఱుకలోనే పర్యవసన్నమో, ఎచట కేవల మెఱుకయే కలదో అచట విషయ మనునది ఏదియు నుండజాలదు. జ్ఞానాతిరిక్తములే జ్ఞానమునకు విషయములగుట సంభవించును.

ఎఱుకకును, విషయమునకును ఎఱుకలోనే భేదము కలుగునుగాని ఎఱుకకు వెలపట గలుగదు. కావున విషయము గూడ ఎఱుకలోనే ఇమిడి యున్నదని కొందరందురు.

"ఈ ఎఱుకలోపల" అనుదాని కర్థమేమి ? అని మన మడుగవలసి యున్నది. పప్పుప్పులు పెట్టుకొనదగిన కుండయా జ్ఞానము ? జ్ఞానమనగా అవబోధనము. దానికి బహిరంతర్భాగములు లేవు. విషయము జ్ఞానములో చొరబడి జ్ఞానముకన్న వేఱుగా తన విషయత్వము నెటులు కాపాడుకొనును ?

"జ్ఞాన విషయములు రెండును చరమమగు ఏక పదార్థము యొక్క రెండు ముఖములు" అను హెగెలును ఇటులడుగవలయును. చరమమగు ఆ యేక పదార్థ మెట్టిది ? అది జ్ఞేయమా ? అజ్ఞేయమా ? జ్ఞేయ మనుచో అదియు విషయమయిపోవును. మఱియు దానియందు జ్ఞానము ఉండబోవదు. అజ్ఞేయ మగుచో జ్ఞానవాదుల మతము చొప్పున అజ్ఞేయమగు పదార్థమునకు ఉనికి యెటు లొప్పజనును ?

జ్ఞానముతోడను విషయముతోడను గలిసిన ఒకానొక పదార్థమును మన మసలు కల్పింపజాల గలుగుదుమా ? హెగెలు మత మొప్పుకొనినను జ్ఞానము చరమపదార్థముయొక్క ఒక వైపనికదా ! ఉనికియో ఇరువైపుల నున్నది. కావున జ్ఞానాతిరిక్తమగు నునికి ఒక అంశమునం దంగీకరింపబడినటు లాయెను.

ఎఱుకకంటె వేఱుగా విషయముయొక్క యునికిని ఒప్పుకొనినను విషయ మెన్నడును జ్ఞానముతో అసంబద్ధమయి యుండలేదు. కాన దాని ఉనికియు ఎల్లయపుడును జ్ఞానముతో సంబద్ధమయియే యున్నది. విషయము యొక్క విషయత్వమే జ్ఞానముమీద ఆధారపడియున్నదని కొందరు చెప్పుదురు.

విషయత్వ మననేమి ? ఏదేని వస్తు వెపు డెరుగబడునో అపుడే అది ఎఱుకకు విషయమైనది అని చెప్పవలయును. కావున విషయత్వ మనునది ఏ వస్తువు యొక్కయు అంతర్నిహితధర్మము కాదు. ఎఱుకతో సంబంధపడుట యనునదే వస్తువుయొక్క విషయత్వము. ఈ సంబంధ మెట్టిది ?

వస్తు వెటు లున్నదో సరిగా అటులు తెలిసికొనువదే జ్ఞానము. వస్తువునకు రూపాంతర మొసగునది సత్యజ్ఞానము కాదు. కావున జ్ఞానముతో సంబంధపడి నందువలన వస్తువునకు రూపాంతరము కలుగదని తప్పక ఒప్పుకొనవలయును. వస్తువును కేవలము ప్రకాశింపజేయుటయే జ్ఞానస్వభావము. జ్ఞానమునకు కార్యమును పుట్టించు శక్తిలేదు. జ్ఞానము రూపాంతర మొసగలేదు. క్రొత్త సృష్టి చేయలేదు. ఇది నిక్కమగు నెడల విషయత్వము వలన వస్తుగుణముగాని, ధర్మముగాని మాఱదని ఒప్పుకొనినటులగును. జ్ఞానమునకు వస్తువును సృజింప గల శక్తియు, రూపాంతరము కలిగింపగలశక్తియు లేక వస్తువును ప్రకాశింప జేయుటయే దాని పనియగు నెడల, జ్ఞానముతో సంబంధపడినందు వలన వస్తువు నకు విషయత్వము వినా వేఱు ధర్మము కలుగదు. ఆ హేతువు చేతనే జ్ఞానముతో సంబంధ పడక పోయినచో వస్తువు తన గుణమునుగాని ధర్మమునుగాని కోలు పోదు. కావుననే జ్ఞానముతో సంబంధపడని అవస్థలో వస్తువు యొక్క ఉనికి అక్షుణ్ణముగా నుండునని అంగీకరించుటకు బాధ యేమియు లేదు. జ్ఞానముతో సంబంధము చెంది వస్తువు ఉనికిని ఆర్జించుకొనునెడల, అనగా జ్ఞానము వస్తువును సృజించునెడల జ్ఞానవ్యతిరిక్తముగా వస్తు వుండజాలదు. ఇటులు కానిచో జ్ఞానముతో సంబంధము లేకపోయినను వస్తువెన్నడును ఉనికిని పోగొట్టుకొన జాలదు. సర్వజ్ఞుడొకడుండ వచ్చును. కాని వస్తువు యొక్క ఉనికియు, ఆయన ఎఱుకయు ఒకటికాదు. వస్తువు యొక్క ఉనికి వస్తువునందే యుండును. ఏదేని వస్తువు కలయంత మాత్రమున ఎవరో ఒకరు దాని నెరిగి తీరవలయునను నియమము, వస్తువు యొక్క ఉనికిలో నెంత వెతికినను కానరాదు. కావున ఉనికికి ఎఱుకతో నేమి పని ?

[ఈ వ్యాసమున ఉపయోగించుకొనిన ముఖ్య గ్రంథములు :
బృహదారణ్యకము, తర్క సంగ్రహము, వాక్యవృత్తి.
ముఖ్య గ్రంథకర్తలు: మధుసూదన సరస్వతి, రసవిహారి.]

~

# 6. ఆరంభవాదము

అంధరకును జగద్రూపమగు కార్యము కనిపించుచున్నది. దీనిని సృజించిన వాడెవడు ? లేక దేనివలన నిది యగుచున్నది ? అనగా, ఈ కార్యమునకు కారణమేమి ? ఆ కారణముతో ఈ కార్యమునకు గల సంబంధమేమి ?

ఈ సంబంధము ప్రాయికముగా మనకు కానరానిది. మానవుడు కార్యకారణ సంబంధమును కనుగొనక ఒక్క అడుగేని ముందుల కిడ జాలడు. ఈ సంబంధము నాలోచించి యాలోచించి అనాదికాలమునుండియు మానవు డెన్ని తత్త్వములను మన స్సముద్రమునుండి ఎగబోసెనో దాని కెవరేని లెక్కవేయ గలరా ? వైద్య, పదార్థ, రసాయన, ఖగోళ, గణితాదులగు మహాశాస్త్రముల యెరుక యెటులు కలిగెను ? ఈ యెరుక మానవసభ్యత కెంత గౌరవము ! భూత కాల భావనయే యీ విజ్ఞానమునకు దూరవీక్షణ యంత్రముకాదా ? అది యటుండగా భవిష్యత్కాలపు నూతులలోనికి దృష్టిని సారింతము. అదియు ఈ కార్యకారణ భావనా రూపమగు జ్ఞాన సాహాయ్యము చేతనే కదా కనబడును? భవిష్యద్భావన లేని మానవులకు అభ్యుదయ మార్గము కనబడదు. అడుగు సాగదు.

కార్యము భవిష్యత్తు. కారణము భూతము. తిరిగి కార్యము వర్తమానము. కారణము భూతము. కావున కార్యకారణములే మనకు భూత భవిష్యద్వర్తమానములు.

ఈ కార్యకారణముల పరామర్శనమే దర్శనము. ఈ రీతిగా దర్శనమే మానవుని సకల విజ్ఞానమునకు పునాది. ఉపనిషత్తు, అవెస్తా, బైబిల్, కొరాన్ మొదలగు వేదాంతము లన్నియు అచలమగు ఈ భిత్తిపైనే నిలిచి యున్నవి. కార్యకారణ సంబంధమును సమగ్రముగ నెరుగ జెప్పుటయే దర్శనముల యుద్దేశము. దర్శనము లన్నియు మూత్తెరగుల సిద్ధాంతముల నవలంబించి యున్నవని

అనవచ్చును. అవి ఆరంభవాదము,[1] పరిణామవాదము,[2] మాయావాదము లేక వివర్త వాదము.[3]

## ఆరంభవాదము

కణాదుడును, గౌతముడును ఈ యారంభవాదమునకు ప్రవర్తకులు. ఉత్పత్తికి పూర్వము కార్యములేదు. కారణ సామగ్రి యెల్లయు కలసిన ఉత్తర క్షణముననే కార్యముత్పన్నమగును. కారణముకంటె కార్యము పూర్తిగా వేరని వీరందురు.

## సమవాయి కారణము

కుమ్మరి ఒక కుండ చేయబోవుచున్నాడనుకొందము. అతడు మొదట నేమి చేయును ? మన్ను నీరు బూడిద సారెకోల మొదలగు వానిని చేతికింద ఉంచుకొనును. కుండకివి యన్నియు కారణములే, ఆరంభవాదులీకారణములలో మట్టిని మాత్రము సమవాయికారణమని అందురు. ఏదేని కార్యము దేని యవలంబమున పుట్టి, దేని యవలంబమున మెట్టి, మఱి దేన గిట్టునో ఆ కారణము సమవాయి కారణము – లేక ఉపాదాన కారణము. కుండ మట్టివలననే అగును. ఉన్నంతవట్టు ఆ మట్టి చిదురలనే ఆశ్రయించుకొని యుండును. వినాశకాలమున ఈ మట్టి మట్టిలోనే కలిసి పోవును. కావున కుండకు మట్టి సమవాయి కారణము లేక ఉపాదాన కారణము.

---

1. సమవా య్యసమవాయి నిమిత్త కారణములు తమకంటె వేరగు కార్యమును పుట్టించునను ఆరంభవాదము నైయాయికులు వైశేషికులు మొదలగు వారిది.

2. ఉపాదాన కారణమేమారి కార్యమగునను పరిణామవాదము సాంఖ్యులు, పాతంజులులు, రామానుజీయులు మొదలగువారిది.

3. శంకరామయాయులగు అద్వైతులది వివర్తవాదము. అతాత్త్వికమగు కారణాన్యథా భావము వివర్తము.

> ఆరంభవాదః కణ భక్ష పక్షః
> సంఘాతవాదస్తు భద న్తపక్షః
> సాంఖ్యాది పక్షః పరిణామవాదో
> వేదాన్త పక్షస్తు వివర్తవాదః

## నిమిత్త కారణము

కుండ కీ సమవాయి కారణమేకాక సారెకోల మరికొన్ని కారణములు కానబడుచున్నవి. కార్య ముత్పన్నమగు పూర్వక్షణము వరకు ఇవి యన్నియు నుండవలయును. ఉత్పత్తియగు పిదప కార్యమునకు వీనితో పనిలేదు. ఇట్టి కారణము లన్నియు నిమిత్త కారణములు. కుమ్మరి సారెకోల మొదలగున వన్నియు నిమిత్త కారణములు. కుండయగు పూర్వక్షణమువరకు వీని యపేక్ష యుండును గాని ఉత్పన్నమయిన తరువాత నివి యేవియు లేకున్నను కుండకు ఢోకాలేదు. కావున కుమ్మరి మొదలగు కారణములు నిమిత్త కారణములు.

## అసమవాయి కారణము

ఇది సమవాయి కారణము నాశ్రయించుకొని యుండును. ఈ అసమవాయి కారణము నశించునేని కార్యముగూడ నశించును. ఇట్టి కారణమును ఆరంభవాదులు అసమవాయి కారణమని యందురు. కుండకు ఈవలి యావలి రెండు పెంకుల కలయికయు, కోకకు నూలుపోగుల కలయికయు అసమవాయి కారణము.

ఒక కార్యమునకు సమవాయి కారణము లనేకము లుండవలయును. ఒక కుండ చేయుటకు దానికి తగినన్ని మట్టి యణువు లుండవలయును గదా! ఈ సమవాయి కారణము లన్నియు నొండొండ కలిసి కొననిచో కుండకాదు. కాన పుట్టబోవుముందు సమవాయి కారణము లుండవలసిన చందముగనే, ఆ సమవాయి కారణముల కలయికయు నుండవలయును. ఆ కలయిక లేనిచో కార్యముత్పన్నము కాదు. కావున ఏదేని కార్యమగుటకు సమవాయి కారణములతోపాటు వాని కలయిక గూడ కారణమని అంగీకరింపవలయును.

### ఈ కలయికను నిమిత్త కారణములలో నొకటిగా ఏల చేర్చరాదు ?

నిమిత్త కారణములు నశించుచో కార్యము నశింపదు. అసమవాయి కారణము అనగా సమవాయి కారణముల కలయిక. విడివడుచో దానితోపాటు కార్యము గూడ విడివడును. అనగా నశించును. కావున నిమిత్త కారణముల స్వభావము వేరు; అసమవాయి కారణముల స్వభావము వేరు. ఉదాహరణమున కొక కుండను

చేకొందము. కుండకు నిమిత్త కారణములగు కుమ్మరి, సారెకోల మొదలగు వానిలో కుమ్మరి చచ్చినను, సారె పగిలినను, కోల విరిగినను కుండ పగిలి చెక్కలయిపోదు. రెండు పెంకుల కలయిక అసమవాయి కారణము. కుండ కావలి యీవలి కపాలముల కలయిక విచ్చుచో కుండయు విచ్చిపోవును. కావున నిమిత్త కారణములకంటె భిన్నముగా అసమవాయి కారణమును అంగీకరింప వలయును.

ఓయీ! మట్టి చిదురలు నశించుచో కుండయు నశించును. కాన సమవాయి కారణ నాశమే కార్య నాశమునకు కారణము. ఇటులయియుండగా మరల నొక కొత్తకారణమును ఏల నెత్తికెత్తుకొనవలెను? ఇది బరువు కాదా?

అగును. ఇది తప్పని బరువు. కార్యపు సమవాయి కారణము లనిత్యము లయిన యెడల కార్యనాశమునకు కారణమగుట నిక్కమే. కాని కార్యద్రవ్యము లన్నిటియు సమవాయికారణములు అనిత్యములు కావు. ఎటులనిన రెండు పరమాణువులు కలిసి 'ద్వ్యణుక' మను కార్యము కలిగె ననుకొందము. ఆరంభవాదుల మతమున పరమాణువులు నిత్యములు. కాబట్టి ద్వ్యణుకరూప మగు ఈ కార్యము నశించుటకు కారణ మేమి యని యాలోచింపవలసియున్నది. రెండు పరమాణువులు నశించిననే ద్వ్యణుకరూపమగు కార్యము నశించునని యనరాదు. ఏలన, పరమాణువులు నిత్యములు. వానికి నాశము లేదు. కావున ఈ రెండణువులయు కలయిక చీలిపోవుటవలననే యీ ద్వ్యణుకరూపమగు కార్యము నశించునని అనవలయును. ఏలన ఈ పరమాణువుల కలయికయే అసమవాయి కారణము. ఆ కలయిక ధ్వస్తమగుట జేసియే ద్వ్యణుకరూపమగు కార్యము ధ్వస్తమాయెను. కావున అసమవాయి కారణము వేఱుగా సిద్ధించు చున్నది.

కార్యము వేరు, కారణము వేరు.

ఏ మట్టి యణువులు కలిసి కుండ యాయెనో, ఆ మట్టి యణువులే కుండ యని మనకు తోచును గాని ఆ యణువులే కుండ కాదు. మృత్పరమాణువులు కుండకు కారణము. కుండ మృత్ పరమాణువుల కార్యము. కారణముకంటె

కార్యము వేరు. మట్టి చిదురల ప్రోవే కదా కుండయని యనజెల్లదు. కారణమే కార్యమగు నెడల శిల్పులు కార్యము నిర్మింప ప్రయాసపడవలసిన పని లేదు. కారణముకంటె కార్యము వేరు కాని యెడల కారణముతోపాటు కార్యముగూడ పూర్వసిద్ధమయి యుండవలయును. ఈ రీతిగా పూర్వమే కార్యము సిద్ధించుచో దానికి వేర ప్రయత్న మెవరు చేయుదురు?

ఇంతియకాక కారణముచే ననుకూలపడు పనులు కార్యముచే సానుకూలములు కావు. అటులే కార్యముచే కాదగిన పనులన్నియు కారణముచే కావు. మట్టితో ఇల్లు వేసుకొననగును గాని కుండతో నెవరు వేసుకొనజాలరు కదా! కుండతో నీరు తెచ్చుకొనవచ్చును గాని కోట్లకొలది మృత్ పరమాణువులతో నయినను నీరు తెచ్చుటకు వలనుపడదు గదా. మట్టియు కుండయు నొకటియే యగునెడల మట్టిపని కుండవలనను, కుండపని మట్టివలనను జరగవలయును. అటులు జరుగుటలేదు. కావున 'మట్టి వేరు, కుండ వేరు' అని అనితీరవలయును ఈ రీతిగా పెక్కు ఉదాహరణములు చూపి ఆరంభవాదులు కారణముకంటె కార్యము నిక్కచ్చిగా వేరని నిరూపించిరి.

## వి శ్వ ము

ఒక పరమాణువు మరియొక పరమాణువుతో కలిసి రెండణువులు కల ఒక ద్రవ్యమగును. ఇది ఇంకొక దానితో కలిసి మూడణువులు కల ద్రవ్యమగును. ఇటులు క్రమక్రమముగా అనేక పరమాణువులు కలిసి యీ విశ్వమంతయు నగుచున్నదని ఆరంభవాదులందురు. మరణ సమయమున ఈ ప్రపంచమునకు కారణమేమి? అని కణాదు నడుగగా "పీలవః పీలవః పీలవః" అని చెప్పెనని ఒక ఆభాణకము కలదు. పీలువనగా పరమాణువు. సృష్టి కవ్యవహిత పూర్వము రెండు మృత్పరమాణువులతో ఆరంభించి అనేక పరమాణువులతో కలిసి క్రమముగా స్థూలమును స్థూలతరమును స్థూలతమమును అయి యీ భూమి ఆయెను. ఆ చందముగనే అతి సూక్ష్మములగు జలీయ పరమాణువులును ఒండొండ కలిసి స్థూలమును స్థూలతరమును స్థూలతమమునగు పదార్థముగా

రూపొంది సముద్రముగా నాయెను. ఇటులే అగ్నిపరమాణువులును, వాయు పరమాణువులును కలిసి స్థూలాగ్నిగను స్థూలవాయువుగను ఆయెను. ఈ రీతిగా ఈ విశ్వమెల్లయు నలు తెరగులగు పరమాణువుల సమష్టి స్వరూపము.

ఈ సృష్టికి పూర్వము ప్రత్యక్షముగా కానిపించు వస్తువేదియు లేదు. నిత్యములగు గాలి నిప్పు నీరు మన్నుల పరమాణువులును, దిక్కాలాకాశము లును, ఈశ్వరుడును, లెక్కలేని జీవాత్మలును ఈ సృష్టికి పూర్వ మున్నవి.



# 7. పరిణామవాదము

కారణము యొక్క రూపాంతరమే కార్యము. పుట్టుక పడయకముందు కార్యము కారణమునం దవ్యక్తముగా నుండును. కావున కార్య మెప్పుడునున్నది. మరి ఉండగలదని పరిణామ వాదులందురు.

పుట్టుక పడయకముందు కార్యము లేనేలేదు. అసత్తు – అనగా కార్యమున కెట్టి సత్తయు నుండదు. పుట్టిన యెడలనే కార్యము సత్తని అనిపించుకొనునని ఆరంభవాదులందురు.

పుట్టువుముందు కార్యము అసత్తే, అనగా లేనేలేనిదే అగునేని, నూరు చెప్పు వేయి చెప్పు, దానిని సత్తు చేయ వీలులేదు. అసత్తెన్నటికిని సత్తు కాలేదు, సత్తెన్నటికిని అసత్తు కాలేదు. ఎటులనిన-నూవులు కారణము; నూనె కార్యము. నూవులలో నూనె అవ్యక్తముగా నుండనిచో గానుగాడించి దాని బడయగలుగుటెటులు ? ఇసుకను పిసికినను నూనియరాదు. నూవుల నుండియే వచ్చును. దీని కేమి కారణము? ఇసుకలో నూనె అవ్యక్తముగా లేదు. కావున ఒడలు విరుచుకొనినను దాన నూనె తీయలేవు. నూవులలో నూనె అవ్యక్తముగా కలదు. కాననే సులువుగా వానినుండి నూనె పిడువగలుగుదువు – అని పరిణామ వాదులందురు.

ఇసుమునకును నూనెకును కార్యకారణ భావరూపమగు సంబంధము లేదు; నూవులకును నూనియకును కలదు. కావున ఇసుమునుండి నూనె రాదు; నూవుల నుండియే వచ్చును. కారణము వలననే కార్యోత్పత్తి యగును. ఏది దేనికి కారణము కాదో అది దానివలన నెటులు పుట్టును ?–అని ఆరంభవాదు లందురు.

కారణమునుండియే కార్యము పుట్టును. ఈ రెంటికిని కార్యకారణ భావరూపమగు ఒక సంబంధ మున్నది. కావుననే నూవులనుండి నూనె వచ్చుచున్నది. ఇదంతయు మేమొప్పుదుము. కాని ఇచట సంబంధ మననేమియో విచారింప వలసి

యున్నది. రెండు వేరువేరు వస్తువుల కలయికయేకదా సంబంధము ! ఆరంభ వాదుల మతమున నూవుల గానుగాడక ముందు నూనె అసత్తుకదా ! అనగా లేనే లేదు కదా ! లేనిదానితో మరియెట్టి దానికిని ఎట్టి సంబంధమయినను ఉండుట పొసగునా? కావున నూనె పుట్టుటకు ముందు నూ నూ నియల కెట్టి సంబంధమును ఉండజాలదు. మరియు ఆ నూ నూ నియలకు కార్యకారణ భావ రూపమగు సంబంధమును పొసగదు. దీనివలన పుట్టుటకు ముందు నూనె అసత్యము కావున దానిలో దేనికిని ఎట్టి సంబంధమును లేదు. నూవులతో సంబంధము లేనటులే యిసుముతో గూడ దానికెట్టి సంబంధమును లేదు. 'ఏ సంబంధమును లేదు; మరి నూవులనుండి నూనె తీయవచ్చును' అనుమాట పాటి యగు నెడల 'ఏ సంబంధమును లేదు గావున ఇసుమునుండి నూనె పుట్టజాలదు' అనుమాటయు పాటికి రావచ్చును' అని తేలును. ఇది యెంత యుక్తి హీనము ! రెండు వస్తువులును సత్యము లగునెడల వానికేదో యొక సంబంధము ఉండనే యుండును. 'ఏది లేదో అట్టి దానికిని, ఉన్నయట్టి దానికిని ఎట్టి సంబంధము నుండజాలదు. 'అను ఈ నియమము ననుసరించి' నూ నూనియలకేదో యొక సంబంధమున్నదిగాన నూవులనుండి నూనె పుట్టునెడల నూనె పుట్టక మున్న కూడ 'నూవులకును నూనెకును సంబంధము కలదు, సంబంధముకలదు గాన, పుట్టుపునకు మున్న నూనె ఉండుచునేయున్నది – అని ఒప్పుకొని తీరవలయును. కావున నూనియ మొదలయిన కార్యములు పుట్టుటకు ముందు కూడ నూవులు మొదలగు కారణములలో అవ్యక్తముగా నుండుచునే యున్నవని ఆరంభవాదులు ఇచ్ఛగింపకున్నను అంగీకరించి తీరవలెను' అని పరిణామవాదులందురు.

పుట్టక ముందే కార్యము ఉండుచునె యున్నయెడల దానిని పుట్టించుటకు మనమేల ప్రయత్నించుతుము? స్వయంభువయిన వస్తువుము పుట్టింపబూనుకొనుట వెఱ్ఱివాని పనికాదా ?. అని ఆరంభవాదులందురు.

చీకటిగదిలో మనకు కావలసిన పుస్తకమొకటి యున్న దనుకొందము. అది మనకు కానరాదు. దానిని తీసి చదివికొనజాలము. దానిని మనము చదివికొన వలసియే యున్నచో దీపమ్మెగొనిపోయి ఆ పుస్తకము నభివ్యక్తము చేయుట మొదలిడుదుము. దీపమ్మెచే పుస్తకము నభివ్యక్తము చేయుటనగా పుస్తకమును చేయుట

యని యెవరు ననుకొనరుగదా! ఆ చందముగనే మట్టిలో కుండ మొదలయిన కార్యములును, నూవులు మొదలయిన వానిలో నూనె మొదలయిన కార్యములును అవ్యక్తములయి యుండగా, కుండ నూనె మొదలయిన కార్యముల నభివ్యక్తి చేయుటకు మనము పాటుపడుదుము. అభివ్యక్తియే ఉత్పత్తి. లేని దభివ్యక్తము కాదు. పూర్వసిద్ధమయిన వస్తు వభివ్యక్తముగాని ఉత్పన్నముగాని చేయబడ నగును. అంతియకాని గగన కుసుమమువలె ఉళక్కి యెటు లభివ్యక్త మగును? మరి యెటు లుత్పన్న మగును?

మరియు మన కెల్లపుడును కానిపించుచుండు వస్తువులే సమయ విశేషమున కనబడవు. ఆకాశమున కనబడుచు కనుబడుచు నుండు సూర్యుడు కానబడడు. చేటంతమబ్బు చెరువంత సూర్యుని ఆవరించి వయిచును గదా! ఆ మబ్బు ఉన్నంతసేపు సూర్యుడు మనకు కానరాడు. ఆ యావరణమును తొలగింపనంత వట్టు సూర్యు నభివ్యక్తము చేయ వీలులేదు. కావున ఆ యావరణము తొలగవలెను, లేక తొలగింపనయిన తొలగింపవలెను, లేక నాశమయినను చేయవలయును. ఆ యావరణమును తొలగించుటగాని నాశముచేయుటగాని సూర్యోత్పత్తికి కారణముకాదు. మఱి సూర్యుని అభివ్యక్తికి కారణము. అటువలెనే పుట్టకముందు ప్రత్తిలో అవ్యక్తముగా నున్న కోక ఆవరణమును తొలగించుటయే సాలీని పని. 'కోక లేదు. అది గగన కుసుమమువలె అసత్తు' అనినచో దాని నెవరు నుత్పాదింపజాలరు.

ఆవరణ మన నేమియో ఇట విచారింపవలసి యున్నది. 'సూర్యునకు మబ్బు ఆవరకము' అనినప్పుడు, ఆవరకము అనునది మనకే యర్థము చెప్పెనో 'ఉత్పత్తికి ముందు కోక ప్రత్తిలో ఆవృతమయి యున్నది' అనినపుడు- 'ఆవృతమయి యున్నది' అను పదముగూడ ఆయర్థమునే చెప్పెనా? కోక ప్రత్తికే కొంతొక రూపయిన చందముగా పింజలు ఏకులు మొదలగు నవతారములన్నియు ప్రత్తియే. ప్రత్తి విడిప్రత్తికానీ, పింజకానీ, ఏకుకానీ, నూలుకానీ ఏదేనొక రూపు విడిచి యుండనేరదు. విడిప్రత్తి - పింజ-ఏకు-నూలు-కోక మొదలగు వానిలో ఏదేనొక అవస్థను విడిచి ప్రత్తియుండ గలుగుట మన మెరుగము. ప్రత్తియని నంతనే వీనిలో నేదియో యొక వ్యక్తావస్థయే మనకు గోచరించును. అనగా ఏకు

మొదలగు నవస్థలలో నేదే నొక యవస్థనే మన మెరుగుదుము. ఏ అవస్థను పొందని ప త్తి యను ప్రసిద్ధికల ఒకానొక దినుసు మన యెరుక కావల. కావున అవస్థా విశేషములేని కారణమునకు సాధారణాస్తిత్వ మసంభవము. ఇది అంగీక రించుచో, ఆయా యీ అవస్థా విశేషములలో ఒక యవస్థ మరియొక యవస్థను కప్పిపుచ్చుట దానికి స్వభావమనియు అంగీకరింపవలయును. ప త్తి ఏకుగా వ్యక్త మైనపుడు పింజరూపు, నూలిరూపు, కోకరూపు మొదలగు అవస్థలు ఆవృతము లగును. అనగా కారణము యొక్క ఒక అవస్థా విశేషము వ్యక్తమయినపు డది మిగిలిన యవస్థల నన్నిటిని ఆచ్ఛాదించి అవ్యక్తముగా నుంచును. పెక్కుమాట లెందులకు ? వ్యక్తమగు కారణముల అవస్థా విశేషము అవ్యక్తములగువాని అవస్థాంతరముల కావరకమని ఒక వాక్యములో చెప్పవచ్చును. ప త్తి ఏకయి నపుడు దాని మిగిలిన అవస్థలన్నియు అడగి యుండును. నూలయినపుడు అది ఏకున కావరకము. కోక అయినపు డది పింజకును ఏకునకును నూలునకును ఆవరకము. ఈ రీతిగా ఒక అవస్థ మరియొక అవస్థకు ఆవరకము. దీనిని బట్టి "ప త్తిలో కోక ఆవృతమయి యున్నది' అనినపుడు ఆవృతమనగా ప త్తిలో కోక కాక మరికొన్ని అవస్థలలో నేదో యొక అవస్థ అభివ్యక్తమయి యున్న దనియు, అభివ్యక్తమయిన ఆ యవస్థలలో నేదోయొకటి కోక కావరణమనియు, ఆయావరణమును తొలగించినచో మన యెదుట కోక అభివ్యక్తమగుననియు చెప్పవలసి యున్నది.

ఓయీ ! ఏకురూపగు అడ్డును తీసివేయగలుగుచో కోక వ్యక్తమగునని కదా యంటివి. ఒక దుడ్డుతో ఏకును దుమ్ము ధూళిగా చేసినచోగాని, ఒక నిప్పుపుల్ల దానికి చూపినగాని కోక యేల అభివ్యక్తము కాదు ?

ఏకు రూపు వ్యక్తమై కోక నావరించినటులే, చూర్ణ భావము వ్యక్తమై కోక నవ్యక్తముచేసి విడువగలదు. కావున ఏకును నలిపివేయు చేష్టగాని, అగ్గి రాముని చేష్టగాని కోకను వ్యక్తముచేయు చేతకాదు. ఏకు రూపేకాక మరియెన్ని రూపులు కోక కావరకములో వాని యభివ్యక్తి కాకుండ జూచుచుండుటయు, కోకను వ్యక్తము చేయుచేతలలో నొకటిగా నెన్నవలసి యుండును. అనగా ఏకు రూపును తొలగించుటకు పాటుపడవలయును, దానితోపాటు చూర్ణభావము మొద

లగు అవస్థా విశేషముల అభివ్యక్తిని గూడ అరికట్టవలసి యుండును. ఈ రెండు పనులను చక్కగా జరపిన యెడల వత్తిలోని కోకరూపు అభివ్యక్తమగును. లోకు లిట్టి అభివ్యక్తినే ఉత్పత్తి యని అనుచుందురు. అంతియకాని అది, లేనిది పుట్టు కొని వచ్చుటకాదు.

గగన కుసుమమువంటి అళీకము నెవడును పుట్టించుటకు ప్రయత్నింపడు. అసత్తు నుండి సత్తు పుట్టుచున్నదని ఆరంభవాదులందురు. లేమినుండి కలిమి పుట్టదు కాన అసత్తనగా అవ్యక్తమనియు, సత్తనగా వ్యక్తమనియు వారర్థము చెప్పవలెనని పరిణామవాదులందురు.

పరిణామవాదమునకే సత్కార్యవాదమని పేరు. ఏ వస్తువును పుట్టదు. ఏ వస్తువును నశింపదని వీరిమతము.*

సాంఖ్య దర్శనము, పాతంజల దర్శనము ఈ రెండును పరిణామవాదమును దివ్వెగా గొని నడచెను. ఈ రెండు దర్శనములకును ఎక్కుడు భేదములేదు. ఇవి కవల పిల్లలు. కార్యమే కారణమనియు, వ్యక్తావస్థయే కార్యమనియు, అవ్యక్తా వస్థయే కారణమనియు ఇవి సందేశించెను. ఈ విశ్వమునందలి కార్యజాత మంతయు అవ్యక్తావస్థ పొందుటయే ప్రళయము. ఆ అవస్థయే వీరి మతమున ప్రకృతి, లేక ప్రధానము లేక అవ్యక్తము. ఈ అవ్యక్తావస్థారూపమగు మూల కారణమునుండి ప్రపంచమను నీ అశ్వత్థమెటులు పెరిగెనో దానిని ఈ కవలలు చక్కగా చూడగలిగిరి.

సత్త్వము, రజస్సు, తమస్సు అను నీ మూడును పరస్పర విరుద్ధము లగు గుణములు. ఇవి సమభాగములుగా నున్నచో నపుడు ఆ గుణత్రయమును అవ్యక్తమనిగాని, ప్రకృతి యనిగాని అననగును. గుణత్రయమనగా నేమి ?

---

* Law of Conservation of Nature-అను దానికిని దీనికిని పోలిక కలదు. ఒక కొవ్వత్తిని వెలిగించినచో ఆక్సిజన్ సంయోగముచే కొంత అంగారామ్లమను గ్యాసుగను, కొంత జలీయమగు ఆవిరిగను మారుచు మనకు కనబడకుండపోవును. ఆ యావిరి, అంగారామ్లముల బరువు తూచి దానినుండి ఆక్సిజన్ బరువును తీసివేసినచో శేషించు బరువు నకు కాలిన కొవ్వత్తి బరువు సరిపోవును. దీనివలన 'జడపదార్థము మారునేకాని అది నిత్యము.' అని తేలును.

జడపదార్థమంతయు ఈ మూడు గుణములయు తగ్గు మొగ్గు పాళ్ల కూటమియే. లోకములో సకల వస్తువులును సుఖము దుఃఖము మోహము అను మూడు ధర్మములకు ఆశ్రయములై యున్నవి. ఎట్లనగా, ఒక సుందరి ఉన్నదను కొందము. ఆమెయు సుఖదుఃఖ మోహముల కాశ్రయము. ద్రౌపది భీము భార్య; అతని అనురాగమునకు పాత్రి. ఆమె అతనికి సుఖమూర్తి. ఆమెను చూచుచో నతని హృదయము సుఖించును.

'ఆమె సుఖమునకు కారణము కావచ్చుగాని సుఖ మెటులగును ?' అని యిచట శంక కలుగవచ్చును.

దీనికి సాంఖ్యాచార్యు లిటు లుత్తరము చెప్పుదురు. బాహ్య విషయములు సుఖమయములు కాని యెడల ఆ విషయముల యనుభూతివలన యెవడును సుఖము నాస్వాదింపజాలడు. సుఖమయమగు సుందరీ స్వరూపము ప్రియుని అంతఃకరణమునందు ప్రతిబింబించి అచటి సుఖమయమగు సత్త్వగుణమును మేల్కొలుపును. సజాతీయములగు వస్తువులతో సంపర్కము కలిగినపుడు సజాతీయమగు వస్తువు అభివ్యక్తమగుచుండునట్లు పలుతావుల మన మెరిగినదే. ఇది దర్శనములకు క్రొత్తకాదు. ముక్కు పార్థివమగు వస్తువు. పూవుగూడ ఒక పార్థివ వస్తువు. ముక్కు పార్థివమగుచో దాన గంధరూపమగు ధర్మము ఉండనే యుండును. ఏలయనిన గంధము పృథివికి అసాధారణ ధర్మము. ఏ వస్తువు పృథివినుండి పుట్టెనో ఆ వస్తువున గంధము ఉండి తీరును. పూవునందలి తావియను ధర్మము నభివ్యక్తము చేయవలయుచో గంధయుక్తమగు ఘ్రాణేంద్రియమునకును పూవునకును సన్నికర్షము ఉండవలెను. మనకంటి ధర్మము గంధముకాదు. దాని ధర్మము రూపము. ఏల ? కన్ను పార్థివము కాదు, మరి తైజసము. కాని ఏ వస్తువు నందేని రూపోపలబ్ధి వలయునేని రూపయుక్తమగు కంటికిని, రూపయుక్తమగు వస్తువునకును సన్నికర్ష వలయును. గంధయుక్తమగు ఘ్రాణేంద్రియమునకు రూప సన్నికర్ష కలిగినను మనకు రూపోపలబ్ధి కాదు. కావున సజాతీయము లగు కారణములతో సంపర్కము కలుగుచో సజాతీయములగు ధర్మముల అనుభవము పొందవచ్చునని నియమము మేర్పడుచున్నది. ఈ నియమము ననుసరించి మనసులో సుఖోపలబ్ధి కలిగినపుడు సుఖమయమగు ఏదేనొక వస్తువునకును

మనస్సునకును సన్నికర్ష ఉండవలెను. కావున ప్రియుని అంతఃకరణమున అవ్యక్తముగా నున్న సుఖోపలబ్ధికి ముందు ఆ ప్రియుని యంతఃకరణమునకు సుఖమయమగు నేదో యొక విషయమునకును సన్నికర్ష ఉండవలయును. సుఖమయమగు ప్రేయసిరూపము ప్రియుని యంతఃకరణమునందు ప్రవేశింపగనే అనురక్తుడగు ప్రియుడు తన యంతఃకరణమునందు సుఖమయమగు నవస్థను అనుభవింపగలుగుచున్నాడు.

దుర్యోధనునకు ద్రౌపది యెడ వలపు కలిగెను. కాని ఆమె అతని కిల్లాలు కాదు. ఆమె కతనిపిద ప్రేమ లేదు. అట్టితరి దుఃఖమయమగు ద్రౌపదీమూర్తి దుర్యోధనుని యంతఃకరణమున జొచ్చి దుఃఖమయమగు నచటి యవస్థను రేకెత్తించెను. ఈ రీతిగనే మోహమయమును, విషాదమయము నగు ద్రౌపదీ స్వరూపము కామాంధుడగు కీచకుని హృదయములో జొచ్చి మోహమయమును, విషాదమయము నగు అచటి అవస్థనే అభివ్యక్తము చేసెను. కావున ద్రౌపదియే కాదు, యువతియే కాదు, పురుషుడే కాదు, ఏ వస్తువేనియు సుఖము దుఃఖము మోహము అను నీ మూడు గుణములయు అలతివలతిపాళ్ల పోతయే కాని వేరేమియు కాదని సాంఖ్యాచార్యులు నిర్ణయించిరి. కాగా సుఖ దుఃఖ మోహములే సత్త్వ రజస్తమోగుణములు. వస్తువులన్నియు ఈ మూడిటినుండి, సుఖ దుఃఖ మోహమయములగు వస్తువులు మన హృదయములలో ప్రవేశించి ఆయా కాల కారణ విశేషములచే సుఖ దుఃఖ మోహముల నభివ్యక్తము చేయుచుండును. ఇదంతయు చూచినచో- "బాహ్య ప్రకృతియు మన ఆంతర ప్రకృతియు ఏక సూత్ర గ్రథితము"లని చెప్పవచ్చును. అభివ్యక్తమయిన బాహ్య ప్రకృత్యవస్థ మన ఆంతర ప్రకృతిలోని సజాతీయావస్థనే అభివ్యక్తము చేయును.

౨

ఈ సత్త్వమునకును, రజస్సునకును, తమస్సునకును ఇంకను చాల స్వభావములు కలవు. నైర్మల్యము, లఘుత్వము, అనామయత్వము మొదలగునవి సత్త్వస్వభావములు. చాంచల్యము, ఉపష్టంభకత్వము, మొదలగునవి

రజస్స్వభావములు. గురుత్వము, నిద్ర, ఆలస్యము, ఆవరకత్వము మొదలగునవి తమస్స్వభావములు.[1] చందమామనుగాని, వెన్నెలనుగాని, చూచినచో మన హృదయములలో వికాసము, ప్రసాదము, శాంతి, సంతోషము మొదలగు గుణము లుద్బుద్ధమగును.

సృష్టిలోనున్న వస్తువులన్నియు త్రిగుణాత్మకములు గదా - చందమామను జూచినపుడు సాత్త్వికగుణములే ఉద్బుద్ధము లగుటకు కారణమేమి ?

చందమామగాని, వెన్నెలగాని త్రిగుణాత్మకమయినను వానిలో రజస్తమస్సుల పాళ్లు తక్కువ. సత్త్వముపా లెక్కువ. కావున నీ హృదయములోని సత్త్వగుణములే యుద్బుద్ధము లాయెను. కాగా ప్రకాశము, ప్రసాదము మొదలగు భావముల నభివ్యక్తము చేయు వస్తువులతో సంపర్కము కలిగి, తన్మయత చెందుచో మన హృదయమున కుపాదాన కారణమగు సత్త్వగుణ మభివ్యక్తమగును. కావుననే మనహృదయమునం దపుడు వికాస ప్రకాశాదు లనుభూతము లగును.

రజోగుణమునకు దుఃఖమేకాక క్రియ, సక్తి మొదలగు గుణములు కూడ కలవు. ఈ స్వభావములు కల బాహ్యవస్తువులతో సంబంధము కలిగినపుడు మన హృదయములందును ఆయాభావము లుదయించుచుండును. ఇటులే తమః ప్రధానములగు వస్తువుల సంపర్కముచే జడత్వము, మోహము, అవసాదము మొదలగు గుణములు మనహృదయములయం దుద్బుద్ధములగును.

ప్రపంచమంతయు ఈ మూడు గుణములచే విభక్తమగుటచే నీగుణముల యర్థము తిన్నగా తెలియదని కొందఱందురు.[2]

---

1. సత్త్వం లఘు ప్రకాశక మిష్ట ముపష్టంభకం చలంచ రజః గురు వరణక మేవ తమః.........(సాంఖ్యకా. 13)

2. "I have tried to explain the meaning of the three gunas before, but I am bound to confess that their nature is by no means clear to me, while unfortunately, to Indian Philosophers, they seem to be so clear as to require no explanation at all...." [The six systems of Indian Philosophy, p. 357]

ప్రకృతిలో పలుతెరగులగు పెక్కు గుణముల పరిశీలనము చేయు పదార్థవేదులును (Physicists), రసాయన వేదులును (Chemists), మనోవేదులును (Psychologists) 'ఏనుగు అడుగున అన్ని అడుగులు నిముడు నటులు లోకమున గనబడు ద్రవ్యము లన్నియు సత్త్వ రజస్తమస్సులలో నిముడునా? క్వినైన్ ఏగుణములో జేరును? నీ రేగుణముచే మంచుగడ్డయగును? సత్త్వము జ్ఞానము ప్రకాశకమై, తమస్సు జ్ఞానమున కావరకమై యుండు ననినపుడు ఇక రజస్సు నంగీకరించు టెందులకు? ఇటులే రజస్సు కర్మశీలమనియు, తమస్సు జాడ్యకుడ్యమనియు చెప్పినపుడు సత్త్వమునకు స్వత్వమెక్కడ?' అని యడుగుదురు.[3]

గౌతముడు గాని, కణాదుడుగాని, కపిలుడుగాని 'ప్రకృతి ఎట్టిది? ప్రకృతి ఏ గుణముచే పురుషు నరికట్టును?' ఈ మొదలయిన ప్రశ్నలకు అనుమాన ప్రమాణములచే సమాధానము చెప్పుటకు ప్రయత్నించిరి. ఇప్పటివారి పరీక్షాగారము లేబరేటరీ.[4] అప్పటివారి పరీక్షాగారము మనఃకోశము. కపిలుని లేబరేటరీలో ఈ గుణములకు, లేక యీ మహదాది కార్యమున కిది ప్రయోగము:—

మహదాది కార్యము సుఖదుఃఖ మోహాత్మకము. దేనిచేత? కార్యమెల్ల సుఖదుఃఖ మోహాత్మకమగుటచేత. ఉదా : వెన్నెల, ముల్లు, కల్లు.[5]

---

3. సాంఖ్య ప్రవచన సూత్ర. ౬-౨౫......౩౯ సాంఖ్య సమాస సూత్ర. ౧-చూ.

4. Atom మొదలగువాని విషయమున వీరును అనుమాన ప్రమాణము నవలంబింతురు.

5. **వెన్నెల మొదలగునవి సుఖాద్యుత్పాదకములుగాని సుఖ స్వరూపములుకావే అని అనినచో నిక్కువమే. కారణ గుణములు కార్యమునందు గుణాంతరము నారంభించునను న్యాయముచే మనోధర్మములగు సుఖాదులు కారణగుణ పూర్వకములుగాన అట్టి సుఖాదుల నారంభించుటచే పరంపరా కారణమగు మూలకారణమునందు, అనగా మూల ప్రకృతియందు సుఖాది ధర్మములున్నవని అంగీకరింపవలెను. ఆ మూల ప్రకృతియందలి సుఖాదిధర్మములు ఉక్తన్యాయమున కార్యవిశేషమగు మనస్సునందువలె భౌతికమగు కార్యాంతరమునందును సుఖాద్యారంభకములగును. సుఖాది సిద్ధిలో ధర్మమునకును ధర్మికిని అభేదమువల్ల భౌతికములగు వెన్నెల మొదలగునవియు సుఖాత్మకములని సాంఖ్యుల అభిప్రాయము. దీనిని మాయావాదులు గోట గిల్లివయిచిరి. దానిని మాయావాదమున జూతము. సుఖ దుఃఖ మోహములకు సత్త్వ రజస్తమస్సులు ప్రతిభువులనుట తుదిమాట.**

ఇక ప్రకృతము.

ఈ మూడు గుణములయు సామ్యావస్థ ప్రకృతి. ఇదియే మూలప్రకృతి. ఇదియే ప్రధానము. గంధముకంటె వేరయిన నేలకు, గంధము గుణమయిన చందముగా సత్త్వము మొదలగు గుణములకంటె వేరయిన ప్రకృతికి సత్త్వాదులు గుణములుకావు. సత్త్వాదులు ప్రకృతి స్వరూపములుకాని ప్రకృతి ధర్మములు కావు.[6] గుణము లసలు ద్రవ్యరూపములే. ఏలన, నివి మహదాదుల కుపాదాన కారణములు. మరియు సంయోగమునకును, విభాగమునకును ఆశ్రయములు. ఈ మూటిలో రజోగుణము తమస్సత్త్వముల నతిశయించి కార్యోన్ముఖమగును. ఈ గుణవైషమ్యమే సృష్టికి ప్రథమావస్థ. గుణత్రయ రూపమగు ప్రకృతి యపుడు కార్యావస్థలో నుండును. దీనికి మహత్తత్త్వమని పేరు.[7]

సృష్టిలోగల సకల జీవాత్మలయు, అతి సూక్ష్మములగు నంతఃకరణము లయు శక్తియే పరిణామవాదులగు సాంఖ్యుల మహత్తత్త్వము. జీవాత్మల సమష్టి బుద్ధి శక్తికే మునిముందుగా ఈవికాసము కలుగనిచో విచిత్రమగు నీ జడప్రపంచ ముద్భవించి యుండదను విశ్వాసము కలుగబట్టి సాంఖ్యాచార్యులీ సమష్టిబుద్ధి శక్తినే ప్రకృతి ప్రథమ పరిణతిగా నిర్దేశించి కణాదుని పరమాణువులు జగత్కార్యణము కావని అనిరి.

## పరమాణువు

గవాక్ష రంధ్రములగుండ ప్రసరించు సూర్యకిరణములలో గాలికి లేచుచు దిగుచు పచరిగిడుచు కనబడు రేణువులే పరమాణువులు, అణుత్వమున కదియే ఆట్టడుగని ప్రత్యక్ష ప్రమాణవాదు లందురు.

---

6. 'సత్త్వాదీనా మతద్ధర్మత్వం తద్రూపత్వాత్'-సాంఖ్య ప్రవచన సూత్ర-౬-౩౯. 'ప్రకృతి సంభవాః'. అను 14 అధ్యాయమునందు గీతలో చెప్పబడిన గుణములు విషమావస్థాపన్నములు. కొందరు సాంఖ్య శాస్త్రజ్ఞులు అష్టావింశతి తత్త్వపక్షమున విషమావస్థాపన్నమగు గుణత్రయము ప్రకృతికంటె వేరొక తత్త్వమని ఉపపాదించిరి.

7. మహత్-అనునది సంజ్ఞ. కావున "అన్మహతః...." అను సూత్రము ప్రవర్తింప లేదు. ఈ తత్త్వము చిదచిదాత్మకము.

ఈ రేణువులు కంటికి కనబడును. 'కంటికి కనబడునవి నలుదెరగులగు పరమాణువుల కలయికవలన నేర్పడును' అను అనుమానమువలన పృథివ్యప్తేజో వాయు పరమాణువుల సంఘాతము లేక చేరిక. కాన ఆ రేణువుల అవయవ ములు పరమాణువులని సౌత్రాంతికులును, వైభాషికులు నగు బౌద్ధులందురు. ఏఁబదే సంఘాతవాదము – సంఘాతవాదస్తు భవంత పక్షః.

మూల భూతములగు పరమాణువులు నలుదెరగులవి కావు. మరి అవి ఏక రూపములు. అది పృథివీపరమాణువనియు, ఇది యప్పరమాణువనియు భేదము ఘటపటాది భేదమువలె తరువాత దరువాత కలుగునని జైనులందురు.[8]

గవాక్షాదులగుండ ప్రసరించుచుండు సూర్యకిరణములలో కనబడు రేణు వులు మహత్పరిమాణముకలవి. మహదారంభకముల కవయవము లుండవలయును గాన ఈ రేణువులకును అవయవము లుండవలయును. మరియు ఆ అవయవ ములే పరమాణువులు కావు. ఆ అవయవములకును అవయవము లుండును. వానికి మరి కారణము లేదు. ఇవి నలుదెరగులు; మరియు రూపాది సహితములు. అవియే నలుదెరగులగు భూతములకు మూలకారణము. రెండు పరమాణువుల కలయికచే గలుగు కార్యము ద్వ్యణుకము. మనకు కనబడు రేణువునకు ఈ ద్వ్యణుకములే అవయవములు. మూడు ద్వ్యణుకముల కలయికచే త్ర్యణుక ముత్పన్నమగును. గవాక్ష రంధ్రములనుండి ప్రసరించు కాంతిలో కనిపించు రేణువు లీత్ర్యణుకములు. కావున పరమాణువు ఆ రేణువులో ఆరవవంతు, అని ఆరంభవాదులగు వైశేషికులు చెప్పుదురు.[9]

---

8. తత్త్వత్రయ భాష్య.

9. నవ్య వైజ్ఞానికులు ఇటులు చెప్పుదురు-మూల పదార్థములు తొంబది రెండు. వీని పరమాణువు లన్నిటిలో ఉదజని పరమాణువు చిన్నది. ఇది ఒక ఎలక్ట్రాను, ఒక ప్రోటాను; వీని కూడిక. ఒక అంగుళమును ఇరువది కోట్లచే విభాగించుచో అందొక భాగము పరమాణు వ్యాసము. ఇరువది కోట్ల పరమాణువులను సరసను బెట్టినచో ఒక అంగుళమగు నన్నమాట. దీని బరువు $\frac{2475}{1024}$ గ్రెయిన్. గ్రెయిన్ ఒక పౌనులో 7000 వ పాలు. అట్టి $24\frac{3}{4}$ గ్రెయినును ఒకటికి ఇరువదినాలుగు సున్నలు చుట్టగా వచ్చిన సంఖ్యచే భాగింపగా ఏర్పడు లబ్ధమునకు పై జెప్పిన పరమాణువు బరువు సరిపోవును. ఎలక్ట్రాన్ ప్రోటానులలో ఎలక్ట్రాన్ సూక్ష్మతరము. ఇది పరమాణువులో 54000 వ పాలు.

ఇంత గొప్ప పరమాణు కారణవాదు లణుత్వమున కింతకంటె సూక్ష్మాతి సూక్ష్మమగు అవధి నూహింప లేక పోయిరాయని అందరకును సామాన్యముగా తోచును. వారు ఊహింపక పోలేదు. ప్రత్యుత చాలలోతుగా నూహించిరి. మనకు కనబడు నీ రేణువులో ఆరవపాలని అంగీకరించిన పరమాణువు గూడ విభాజ్యమే. ఆ విభాగము గూడ విభాజ్యమే. ఇటు లీ విభాగమునకు అంతనుమాట ఉండదు. ఇది అనవస్థ. కావున నేదో యొకచోట మన మాగవలయును. ఆ యాగుట యీ యారవవంతగు అణువుకడనే ఆగుట మేలు అని వారు చెప్పిరి. ఈ చెప్పుట ప్రక్రియా లాఘవమునకు విభాజ్యముకాని చరమసీమయే పరమాణువు. అది నిరవయవము.

మరియు పరిమాణువునకు మరొక పేరు పరిమండలము. దాని పరిమాణము పారిమాండల్యము.

రెండు పరమాణువులు ద్వ్యణుకము నారంభించును. ఆ ద్వ్యణుకము అణువు. మరి హ్రస్వము. ద్వ్యణుక పరమాణువులు ద్వ్యణుకమునందు కారణమగు తమ పారిమాండల్యమును ఆరంభింపవు. విరుద్ధ ధర్మాక్రాంతము గనుక.

ఇట్లే నాలుగు ద్వ్యణుకము లొక చతురణుకము నారంభించును. అది మహత్తు. మరి దీర్ఘము వెనుకటి కారణముననే యీ ద్వ్యణుకములు తమ అణుత్వహ్రస్వత్వములను చతురణుకములో నారంభింపవు. ఇది ఆరంభ వాదుల ప్రక్రియ.

పృథివ్యప్తేజో వాయు పరమాణువులలో వాయు పరమాణువు తేజః పరమాణువునకును, తేజః పరమాణువు అప్పరమాణువునకును, అప్పరమాణువు పృథివీపరమాణువునకును కారణము. ఈ పృథివీపరమాణువు మరల అప్పరమాణువులోను, అది తేజః పరమాణువులోను, అది వాయు పరమాణువులోను, అదియు త్రిగుణాత్మకమగు[10] మూల ప్రకృతిలోను లయమగును. కావున ఈ పరమాణువు లనిత్యములు. ఇవి జగత్కారణము కావని పరిణామవాదు లందురు.

---

10. ఈ ప్రలయ ప్రక్రియయందు మతభేదములున్నవి. వానిని ఆకరములలో చూచునది.

# సృ ష్టి బౌ ద్ధ ము

ప్రపంచమునం దే కార్యమునందేని ఒకానొక నియమ కౌశలము కని పించినచో అది బుద్ధి పూర్వకముగనే జరిగియుండవలెనని దార్శనికులలో పలువు రంగీకరింతురు. ఆకాశగహ్వరమున గిఱ్ఱునఁదిరుగు నీ గోళములను, గోళము లలో గల నియమములను ఒకింత మనసుకు పట్టించుకొనినచో ఇది ఏ కల్పనా రాజ్యమునుండియో ప్రసరించుచున్నదని తోపకుండునా? ఈ ప్రపంచము తనకు దా నూడిపడెనని ఎవడేని అనుకొనునా? పలుదెరగులగు కూర్పుల తోడను, నేర్పులతోడను అనగి పెనగియున్న యీ విశ్వములో పరమాణువు మొదలుకొని పర్వతమువరకును గల ప్రతి వస్తువు కార్యకారణ భావ సంబంధము తోడను, ఉత్పత్తి స్థితి లయములతోడను బిగిసియున్నది. కావున 'నిచట నన్నియు నందరును అన్నిటి కొరకును అందరకొరకును అన్నిటితోడను అందర తోడనుకలసి అనుక్షణమును వింతయగు భవిష్యత్తు దెస ఒకేనియమముతో ముందు ముందులకు నడచుచున్నా'రని తెలిసి అభివ్యక్తికి పూర్వ మీ ప్రపంచమంతయు ఏ కారణములోనో ఎవని బుద్ధిలోనో ప్రతిఫలింపలేదని ఎవరు చెప్పగలరు?[11]

సరే, మంచిది. ఈ బుద్ధి ఎవరిది? భోక్తది. భోక్తయే జ్ఞాత. కాన, ఈ భోక్తయు జ్ఞాతయు జీవుడే. ఈ బుద్ధి జీవునిది.

అమ్మో, కానంత జీవు డీ బ్రహ్మాండమును సృజించుటా అని వింత పడనక్కరలేదు. ఈ జీవుడును అంతజీవుడు.

జీవు డొకడా లేక పలువురా?

పలువురు. కావున అసంఖ్యాకులగు జీవుల, అసంఖ్యాకములగు బుద్ధి శక్తుల అభివ్యక్తియే యీ బాహ్యప్రపంచ సృష్టికి పూర్వరూపము.

మహత్తత్త్వము స్పష్టమగుడు అవ్యక్త మహంకార రూపముగా నభి వ్యక్తమగును. బుద్ధికి వికాసము కలుగగనే మనకును అహంభావ మభివ్యక్త

11. నవ్య విజ్ఞాన చరిత్రలో అనిర్దేశ్యవాదము అరయునది.

మగును. దీనినిబట్టి సాంఖ్యాచార్యులు అహంతత్త్వము మహత్తత్త్వము నుండి అభివ్యక్తమాయెనని ఊహించియుందురు.

అహంతాభివ్యక్తికి పిదపనే మన కింద్రియాభిమానమును, విషయములను గోచరించును. దీన జేసి సాంఖ్యదర్శనము అహంతత్త్వము నుండి యింద్రియ సృష్టియు, సూక్ష్మభూతసృష్టియు కలిగెనని చెప్పెను.[12] జ్ఞానకర్మ భేదముచే ఇంద్రియములు ఇరుదెరగులు. త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు జ్ఞానేంద్రియములు. వాక్ పాణి పాదపాయూపస్థములు కర్మేంద్రియములు. మనస్సు అటు జ్ఞానేంద్రియములను, ఇటు కర్మేంద్రియములను నడపును గాన సాంఖ్యులు మనస్సును జ్ఞానేంద్రియముగను, కర్మేంద్రియముగను వ్యవహరించిరి.[13]

అహంతత్త్వము విషయముగా పరిణమించుడు, అనగా భోగ్యవస్తువుగా పరిణమించుడు, దానిని రెండుగా విభజించి సూక్ష్మభూతము లనియు, స్థూల భూతము లనియు నందురు. సూక్ష్మభూతము లనగా శబ్ద స్పర్శ రూప రస గంధములు. స్థూలభూతము లనగా పృథివ్యప్తేజో వాయ్వాకాశములు. పంచ భూతముల సూక్ష్మావస్థను, లేక కారణావస్థను సాంఖ్యులు పంచతన్మాత్రలని అందురు. వాని అభివ్యక్తావస్థయే స్థూలభూతములు.

---

12. విశేషములు సామాన్య ప్రకృతికములను న్యాయము ననుసరించి బుద్ధిసామాన్య భూతమగు మహత్తత్త్వమునుండి బుద్ధి విశేష భూతములగు తత్త్వములు పుట్టును. అహంతయు, ఇదంతయు అనగా 'నే'నను భావమును 'ఇది'యను భావమును బుద్ధి విశేషములు. వీనిలో అహంత వినా ఇదంత పొడసూపదుగాన తొలుత బుద్ధి విశేషరూపమగు అహంతత్త్వము పుట్టును. మహత్తత్త్వమువలెనే యిదియు త్రైగుణ్యముచే ముత్తెరగులు. అందు సాత్త్వికము వైకారికమనియు, రాజసము తైజసమనియు, తామసము భూతాదియనియు చెప్పబడును. ఇందు వైకారికము తైజసాంశ సాహాయ్యమున ప్రవృత్తి ధర్మముకల తన్మాత్ర పంచకమును సృజించును. తన్మాత్రములనగా శబ్ద స్పర్శ రూప రస గంధములును, తదాశ్రయములగు సూక్ష్మ భూతములును, తామస తైజసములనుండి తన్మాత్ర పంచకోత్పత్తియని వ్యపదేశము. ఇచట మతభేదములున్నవి. వాని నాకరముల నారయునది.

13. ఆరంభవాదుల మతమున ఇంద్రియములు భౌతికములు. 'అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగా దితి చే న్నావిశేషాత్' అను బ్రహ్మ సూత్రమును వివరించుచు శంకరులు మొదట భౌతికములని ఉపన్యసించి పిదప పక్షాంతర మవలంబించి అభౌతికములయినను కావచ్చునని ముగించిరి. విద్యారణ్యులు పంచదశిలో భౌతికములని చెప్పిరి. (౧-౧౮-౧౯)

కారణము కార్యముగా, మరల నది కారణముగా ఏర్పడి అవ్యక్తము వ్యక్తమై క్రమక్రమమున ఈ జడజగత్తు పరిణామము చెందెను. జడ మనున దెల్లయు ప్రకృతి మొదలుకొని మహాభూతముల వరకునుగల యేదో యొక తత్త్వములో జేరును.

వ్యక్తావ్యక్తమగు నీ జడజగత్తునకు స్వయంప్రకాశము కానరాదు. ఏ ప్రకాశముతో గలిసి ఈ తత్త్వములు ప్రకాశించునో ఆ ప్రకాశమే సాంఖ్యుల ఆత్మ. అతడు నిత్యుడు. అపరిణామి. అతడు ప్రకృతియు గాడు; వికృతియు గాడు. ప్రకాశమే అతని స్వభావము. ప్రకాశశీలమగు నీ వస్తువు అవివేకవశమున జడముతో కలిసి వ్యవహారగోచరమగుడు సంసారి యనియు, బద్ధుడనియు బిరుదు సంపాదించుకొనును. అవివేకమూలకమగు జడప్రకాశశక్తుల కలయికయే సంసారము. ఈ సంసారమే పెక్కు దెరగులగు దుఃఖముల కాకరము. నేను దుఃఖిని - నా శరీరము - నా యిల్లు - నీవు సుఖివి - నీ శరీరము - నీ ఇల్లు ఈ మొదలగు తెలివి తేటలేకదా సంసారము. ఇదియే అనర్థముల కన్నిటికిని కాణాచి.

'నేను' అనుమాటచే చెప్పదగిన జ్ఞానమయ వస్తువుతో దేహాదులగు జడ వస్తువులు అభిన్నముగా కలిసియే సకల ప్రకారములగు జ్ఞానముల కిరవు లగును. ప్రకాశమయుడును, అవికారియునగు నాత్మతో అప్రకాశమును పరిణామియు నగు జడమున కెట్టి పొందును పొసగదని దృఢమయిన నిశ్చయ మొదవిన తత్ క్షణము మనకు దుఃఖముతో తెగతెంపులగును. అపుడ వ్యక్తము, లేక ప్రకృతి వ్యక్తత బడసి మనల నీ జడరాజ్యములో పౌరుల జేయజాలదు. నేను జడుడ ననుకొని జడ రాజ్యమున ప్రవేశించుటయే యాత్మకు బంధము. జడ చైతన్యముల స్వభావమును చక్కగా దెలిసికొనుటయే ఈ బంధము బాపుకొనుట కేక మాత్రోపాయము.

దానిని లెస్స తెలియవలె ననినచో పరిణామవాదమును, లేక సత్కార్య వాదమును తిన్నగా నెరుగవలయును. సత్కార్యవాదమునందలి యుక్తులను సరిగా నెరుగుకొనుచో ఆత్మ-అనాత్మ- జీవుల స్వరూపము క్రమముగా తెలియ వచ్చును. అది తెలియుటవల్ల సర్వదుఃఖములయు అత్యంత నివృత్తి కలుగును. ఇది కాపిల దర్శనమునకు సంగ్రహము.



# 8. మాయావాదము

జీవము లనంతము లనంతములుగా పుట్టుచున్నవి, పెరుగుచున్నవి, గిట్టుచున్నవి. మనకు ప్రత్యక్షముగా కనబడు జీవచరిత్ర ఇది. ఇదియే ప్రపంచము.

ఇటులు పుట్టువుతోడను, పెంపుతోడను, చావుతోడను మనకు నిత్యమును అనుభవము కలదు. ఇట్టి ప్రపంచము సత్యమే యని అందమా—అనజాలము. ఏల? నిన్న చూచినది నేడు లేదు, నేడు చూచినదియు రేపుండబోదు. కావున ఇది అసత్యమని యందమా, అటులును అనజాలము. ఎందుచేత? కొన్నియేండ్లపాటుగాని, కొన్నినాళ్లపాటుగాని యీ ప్రపంచమును, దీని యునికిని మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము. కాబట్టి ఈ ప్రపంచమును ఏమని అనవలెను? ఉన్నదని వచించుటకా వీలులేదు. లేదని వచించుటకా వీలులేదు. అనగా అనిర్వచనీయము. ఇది ఇట్టిదని వివరముగా చెప్పుట నిర్వచనము. నిర్వచనము చేయుటకు వీలులేని దనిర్వచనీయము. ఈ ప్రపంచ స్వరూపము మనకు తెలియదు. ఇది యింద్రజాలము. ఇది మాయ. మాయావాదమున కిదియే సంక్షేపము.

## "మాయ - అనిర్వచనీయము"

మాయావాదమునకు వివర్తవాదమనియు, అనిర్వచనీయవాదమనియు ఇంకను పలుపేరులు కలవు. ఈ పేరు లన్నిటిలో అనిర్వచనీయవాదమను పేరే మాయావాదమును సాకల్యముగా తెలుపగలయది.

మనము దేనిని మాయ యని యందుము? దేనిని 'కనులారజూచి ఇది లేదు అని చెప్పజాలమో, పరిశోధించి చూచినచో దేని స్వరూపమును దెలుపు మాట మనకు దొరకదో అట్టి వస్తువు 'మాయ' అని యందుము. అదియే అనిర్వచనీయము. గారడివాడు మనము చూచుచు చూచుచునుండగా మన కనుల యెదుటనే మావి టెంకె పాతి కొలది కాలములో దానిని మొలిపించి పూయించి కాయించి మనచేత తినిపించును. మనము దానిని నిక్కువమయిన మామిడిచెట్టు

కాదని యనగలమా? దానికిని మామిడిచెట్టునకును తేడా యేమేని కలదా? కాని గారడివాడు చేసిన మామిడి మొక్క నేమని యందుము? 'ఇది మాయ' ఇది 'అనిర్వచనీయ'మని యందుము. ఏల యిటు లందుము? మనము మన కన్నులు పెట్టుకొని దానిని చూచితిమి.

మన కనులతో చూచిన దానిని చూడలేదని యపలపించు టెటులు? అది యటుండగా ఒక అరగడియలో ఒక యెండు టెంకనుండి పూతతో కాతతో కన్నుల పండువుగా నిది యెటులు పెరిగెనో, యది మనకెటులు తెలియును? మనకే తెలియని దానిని మన మొరులకేమి తెలుపగలము?

కలదని తెలిసిన వస్తువు కలిమిని సిద్ధము చేయుటకు వీలులేకపోయిన యెడల ఆ వస్తు వనిర్వచనీయమని యందుము. అదియ మాయ. ఈ ప్రపంచము కూడ మనకు కనబడుచున్నది. విచారించి చూడగా నశించిపోవు చున్నదని ఏర్పడుచున్నది. కావున నీ ప్రపంచమున్నదని చెప్పుటకుగాని, లేదని చెప్పుటకుగాని వీలులేదు. దీనికన్న మాయ యనగా నేమున్నది? ఇదియే యనిర్వచనీయము. అనిర్వచనీయమే మాయ.

## ఆరంభ వాద సమీక్ష

"కారణముకంటె కార్యము బొత్తిగా వేరు. వేరేకానిచో తొల్లిగూడ కోక యను బుద్ధి యుండవలెను. అట్టిది లేదే. మరియు 'నూలిపోగులు తెమ్మ' అని యనుటకు బదులు 'కోకను తెమ్మ' అని యెవడును అనడు. మరియు 'నూలు తెమ్మ'నిన ఎవడును కోక తేడు. కోకను కట్టుకొనను, కప్పుకొనను వచ్చును గాని నూలిపోగులను కట్టవచ్చునా, మరి కప్పుకొనవచ్చునా? ఉత్పత్తికిముందు కోకతోపాటు దాని యాకార విశేషముగూడ కానరాదు. నూలిపోగుల లెక్కయు, కోక లెక్కయు నొక్కటికాదు. నూలిపోగులు పెక్కులు. కోకయో ఒకటి. కావున సంఖ్యయందును నైక్యము లేదు. ఇటులు బుద్ధిభేదము, శబ్దభేదము, కార్యభేదము, ఆకారభేదము, సంఖ్యాభేదము ఇన్ని భేదములు కలవు. కావున తొల్లి లేనేలేని కోక, సాలెవాని పనితనమున ఉత్పన్నమగును. కలిమితో, అనగా సత్తతో సంబంధమే పుట్టుక" అని ఆరంభవాదు లందురు. ఇది ఎంత యుక్తమో చూతము.

కార్యమునకును, కారణమునకును భేద ముండుట వలననే బుద్ధిభేదాదులు సంభవించునని కదా యింత ఘోష. అవస్థాభేదమువలనను బుద్ధిభేదాదులు సంభవించునే! మరియు నొక దోషము. కోక తయారయిన పిదప గూడ నూలిపోగులు వినాశము చెందక కనిపించుచునే యుండును. గావున అపుడు నూలు, కోక అను రెండు వస్తువు లుండుటచే రెట్టి పరిణామము ఉపలబ్ధము కావలసి వచ్చును. అటు లుపలబ్ధమగుట లేదు. కావున నవస్థాభేదముతో నావిర్భవించుటయే పుట్టుక అని యనవలెను. కావున కార్యము కారణము కన్న భిన్నమనియు, అభిన్నమనియు ననుటకు వీలులేదు. కాగా కార్య మని ర్వాచ్యము. కార్యమెల్ల మాయామయము.

## పరిణామవాద సమీక్ష

"కారణమే కార్యము. కారణము వినా కార్యమునకు వేరుగా నొక యస్తిత్వమే లేదు. ఒకే వస్తు వవ్యక్తమగుచో కారణము, వ్యక్తమగుచో కార్యము" అని కదా పరిణామ వాదులందురు. ఇది యెంత సంగతమో యిక నాలోచింతము.

## తాడు - పాము

ఉన్నవస్తువే ఒకానొకపు డుండదు. మన మొకానొక సమయమున తాటిని పాముగా జూతుము. చూచుటేకాక పామనుకొని కాలుసేతులు వడవడవడక దూరముగా పారుదుము. ధీరుడయినచో దానిని కఱ్ఱతో బాదునని యనుకొందము. నిక్కముగ నది పాము కాదు. కొంచెము సేపు మాత్రమే అది పాము. అంత మాత్రమున అది పామై కూర్చుండునా? ఈ మాదిరిగనే మన చుట్టుప్రక్కల నున్న కుండ, కొండ మొదలగు వాని ఎరుక నిక్కపు టెరుకయేయని పాతుకొని పోయిన మన నమ్మక మా తాటిపాముపలె భ్రమకాదని ఎవ రనగలరు?

## అవిద్య

మాయావాదులు తాడు పామని తోచుటకు గల కారణమేమి చెప్పిరో యిట తెలిసికొనుట ఆవశ్యకము. తాడును చూచి పామనుకొనుట కొక రెప్ప

పాటు ముందు 'ఇది తాడు' అను ఎరుక మనకున్నచో 'ఇది పాము' అను నూహ కలుగదని అందరును ఇయ్యకొందురు. దీనివలన తాటి స్వరూపము నెరుగక పోవుటయే పామని యనుకొనుటకు కారణమని సిద్ధించుచున్నది. తాటి నెరుగక పోవుట కేవలము జ్ఞానాభావమేకాదు. ఇదొక భావ పదార్థము. మాయావాదులు దీనినే 'అవిద్య' అని అందురు. అవిద్య అనినను అజ్ఞాన మనినను ఒకటియే.

## ఆ వ ర ణ ము

ఈ అవిద్య రెండు పనులు చేయుచుండును. ఆ పనులనుబట్టి యీ అవిద్యను మనము పోల్చుకొనగలము. ఆ రెండు పనులలో నొకటి ఆవరణము; మరి యొకటి విక్షేపము.

'వస్తువులే' దని గాని, 'వస్తువు భాసించదే' దని గాని వ్యవహరించుటకు కారణమయినది ఆవరణము. ఈ రెంటిలో మొదటిది అసత్త్వావరణము. రెండవది అభావావరణము.

## వి క్షే ప ము

అజ్ఞానము వస్తువు నావరించుటయకాక దానిపై దాని విపరీత ధర్మము నారోపించును. ఇది విక్షేపము. తాటిని చూడబడయని యపుడు 'తాడులేదు' అని గాని, 'తాడు భాసించుటలేదు' అనిగాని మనమనుచుందుము. ఇట్టి వ్యవహారము వలన తాటిని అజ్ఞాన మావరించెనని మనము గ్రహింపగలము. అజ్ఞాన మిటు లావరించిన వెంటనే తాటికి లేని ధర్మమును తాటి కారోపింతుము. ఎటులు? 'ఇదితాడు' అని వ్యవహరింపక, 'ఇది పాము' అని వ్యవహరింతుము. ఇటులు వ్యవహరించుటవలన 'తాడు' అని తెలియని అజ్ఞానము తాటి స్వరూపము నావరించి 'పాము' అని వ్యవహరించుటకు కారణమాయెను. అజ్ఞానమునందున్న యీ శక్తిని 'విక్షేప' మందురు.

## అ భా వ ము

అజ్ఞాన మజ్ఞానమని అనుకొనినంత మాత్రమున జ్ఞానాభావమని కాని, శూన్యమని కాని అనుకొనరాదు. ఏలనగా, అజ్ఞానము వస్తువు నెటులావరించునో

అటు లన్యవస్తువుగా ప్రకాశింపజేయును. అభావముగాని, శూన్యముగాని దేనిని ఆవరింపను జాలదు, ప్రకాశింపజేయను జాలదు. ఈ రెండు పనులను భావ పదార్థమే సాధింపగలదు. అభావ పదార్థము సాధింపజాలదు. అజ్ఞానము లేక అవిద్య ఇటు లొక దెస ఆవరణమును, మరియొక దెస విక్షేపమును జేయుచుండగా దీనిని అభావ మనియు, శూన్యమనియు నెటు లనగలము? అవిద్య ఆకాశ కుసుమము వలె ఉళక్కి కాదు. మరియు ఘటము లేనిచోట ఘటాభావమువలె శుద్ధ-అభావముకాదు.

అజ్ఞానమునకు ఆవరణ విక్షేపములను రెండు శక్తులు కలవని చూచితిమి. మన మిక ఇది విచారింపవలెను.

"మన మొక పత్తినే ఒకపుడు కోక యనియు, మరొకపుడు నూలనియు, ఇంకొకపుడు ఏకనియు, వేరొకపుడు పింజెయనియు నందుము. వీని వీని స్వరూపము పత్తిస్వరూపమే యని యెటులు తెలిసికొందుము ? 'పత్తియే కోక' యని వాడుక వడసినపుడు కోక పత్తిస్వరూప మేలకాదు ? అని మాయావాది అనును. ఒకానొకపుడు తాడుగూడ పాముగా తోచెగావున పత్తి స్వరూపము కోక యయినటులు ఒకానొకపుడు తాడుగూడ పాముగా తోచె గావున పాము రజ్జుస్వరూపమని యంగీకరించుట పాడిగాదా?, అటులయ్యు ఏదో ఒక సమయమున తాటిని పాము వ్యవహరించినను 'పాము రజ్జుస్వరూపము' అని ఎవవరును అంగీకరింపజాలరు.

త్రాటిని పామని తలతుముకాని పామే అని యనము. పత్తినిగూడ కోక యని తలచియు కోకపత్తికి రూపాంతరమని యంగీకరింతుము. ఇటులేల యంగీకరింతుము? వస్తుతత్త్వమును విపరీతముగా తలచుటయకాక దీనికి కారణ మేమేని కలదా?

మరియు నొకటి కోక, నూలు, విచ్చె, ఏకు ఈ మొదలగు నవన్నియు పత్తి యొక్కడే స్వరూపములని పరిణామవాదులందురు. ఈ సిద్ధాంతము యుక్తికి పదభ్రంశ మాపాదించును. ఏలనగా. పత్తియు కోకయు ఒకే యొక వస్తువగునెడల దేని దేనిని మనము పత్తియని వాడుదుమో దానిదానినెల్ల కోకయే యని ఒప్పుకొనవలసి వచ్చును. ఏలన పింజెయు పత్తియే, నూలును

పత్తియే, పిచ్చెయు పత్తియే, పడుగును పత్తియే, పేకయు పత్తియే, కోకయు పత్తియే. వీని నన్నిటిని కోకయని అంగీకరింపగలమా? ఏదో భిద లేనిచో నూలికిని, కోకకును భిద యెటులుండును? భిద కలదనుచు అంతయు పత్తియే అనుట యెటులు యుక్తిసహము? ఈ కారణము వలననే మాయావాదులు 'కారణముకన్న కార్య మభిన్నమునుగాదు, మరి భిన్నమునుగా'దని యందురు. కాగా కార్య మనిర్వాచ్యము. 'ఇది లేనేలేద'ని ఎగురగొట్టి వేయ రానప్పటికిని 'ఇది ఉండనే యుండును' అని నిర్వచించుటకును వీలులేని దేదో ఆది అనిర్వాచ్యము, లేక మాయ.

సత్‌ఖ్యాతి వాదు లిట్లందురు :- ఆలి చిప్పలోగాని ముత్తెపు జిప్పలోగాని వెండి కొలది పా లుండును. అటు లుండబట్టియే మనకు వెండి తోచుచున్నది. లేని వస్తు వెటనేని తోచునా? తోచునని యందురేని వెండియే యేల తోపవలె? కుండ గాని బండగాని యేల తోపక పోవలె? పోలిక యుండుటజేసి అటులు తోచునని కొందరందురు. పోలిక సంస్కారమును మేలుకొలిపి స్మృతిని కలిగింపగలదేకాని వెండిని ప్రత్యక్షము చేయలేదు. కాన ఆలిచిప్పలోను, ముత్తెపుజిప్పలోను వెండి కలదు. పంచీకృతములగు పంచభూతము లెచటను నుండుటచే అన్నియు నన్నిట నున్నవి. ఆలిచిప్పరూపుగా నున్న పృథివిలో తేజోంశమగు వెండి కొలదిపాలుతో నున్నది. ఇటులే రజ్జుసర్పముకూడ నిక్కమే. 'రజ్జు సర్పభ్రాంతి' యను వాడుక సర్పాంశము స్వల్పమను నభిప్రాయము వలననే కలిగినది కాని సర్పాంశ లేనేలేనందువలన గలిగినది కాదు. మరియు కామిలారోగికి శంఖము పచ్చగా కనబడును. అదియు నిక్కమే. చూచువాని కనులలో నున్న పిత్త ద్రవ్యముతో సంయుక్తములగు నేత్ర కిరణములకు శంఖముతో సంయోగము కలదు గదా!

మరియు మంకెనపూవు దాపున నున్న స్ఫటికపు టెరుపుకూడ నిక్కవమే. నీటిలో నొక తేజోద్రవ్యము నుంచుచో నిక్కమగు దాని యుష్ణస్పర్శ నీటికి కలుగును. నీరు వేడెక్కును. అపుడు దానిని వేడినీరు అని యందుము. అటులే స్ఫటికముతో గూడిన మంకెనపూడాలునందలి నిక్కపు టెరుపే స్ఫటికమునందు భాసించును. అపుడు ఎఱ్ఱని స్ఫటికము అని వాడుక కలుగును.

ఏతావన్మాత్రమున విషయ మసత్యము కాదు. దాపుల నున్న అన్ని వస్తువుల మీదను ఎరుపు ప్రసరించును. కాని ఎరుపు కనబడదు. స్వచ్ఛమగుటచే స్ఫటికమునందే కనిపించును.

ఇటుల అద్దమునందలి ప్రతిబింబమును నిక్కమే. అద్దమునకు దవిలి మరలి వచ్చిన నేత్ర కిరణములకు స్వముఖముతో సంబంధము లేదా ? కలలలో గనబడు రథాదులన్నియు నిక్కమే. కలగన్నవానికే కానిపించినను వెనువెంట నశించినను అవి నిక్కములే. అఘటనఘటనా సమర్థుడగు నీశ్వరుడే వానిని సృజించును.

ప్రపంచముగూడ సత్యమే. కావున నిటులు అంతటను ఉన్న విషయమే కనబడునని తెలియునది.

అనిర్వచనీయ ఖ్యాతివాదు లిటు లందురు :- 'ఉన్నదానికే ప్రతీతి కాని లేనిదానికి పొసగదు.' అని యనుచో ఆ యునికి తాటిపామువలె ప్రాతిభాసికమా, లేక తాడువలె పారమార్థికమా ? ప్రాతిభాసిక మగుచో మా కిష్టమే. పారమార్థిక మగుచో ఎండమావులలో నీరు తోపక పోవలయును. త్రివృత్కరణముచేత, పంచీకరణముచేగాని పృథివిలో జలాంశముండుట నిక్కమే. త్రివృత్కృతము గాని పంచీకృతముగాని అగు విశిష్ట పదార్థమునందు జలత్వములేదు. ఎక్కడనో ఒక మూలనున్నను అది కనబడునది కాదు. పంచీకరణ మనగా నేర్పరచుటకు వీలుగాని కలగలుపు. పంచీకృతికి మున్ను భూతము లతిసూక్ష్మములు. అవి ప్రత్యక్ష యోగ్యములు కావు. పంచీకృతికి పిదపగూడ అందలి నీటిని వేరుగా జూడనయితి కాదు. 'ఈ నీటి పా లలతి అయినను దవ్వుల నున్నవారికి గన బడును గాని దాపుల నున్నవారికి గనబడదు.' అని యనుట ఏటి యుక్తి? దాపుల నున్నవారికే 'ఇది నీరు కాదు.' అని తోచును. 'ఉన్నదానికే ప్రతీతి' అను మతమున ఉన్ననీరే లేనియటులు తోచెడిగాన అన్యథావభాస మెటులు కాదన గలరు ? కావున ఆలిచిప్ప రూపుతోనున్న పృథివిలో తేజోంశమగు వెండి కొలది పాలుతో నున్నదనుట తగదు. మరియు నా ఆలిచిప్పలోనున్న తేజోంశము వెండి గనే యేల కనబడవలె? మెరుపుగ, సూర్యుడుగ నేల కనబడక పోవలె? కలగలుపు నకు ముందు తేజోంశము సర్వసాధారణముకదా. పంచీకృతమును, వెండిగా

పరిణతమును అగు తేజోంశము కొంత ఆలిచిప్పలో కలిసి భాసించునని యందు రేని తేజోంశ మచట గలిసెననుటకు తగు ప్రమాణమేమి? వెండిగా తోచుటయే ప్రమాణమని యందురా యీ తోచుబడివలననే'ఉన్నదే తోచును' అని సిద్ధించిన యెడలనేకదా వెండిపాలుండుట సిద్ధించును. మరివెండి పాలుండుట సిద్ధించిన యెడలనే కదా వెండిపా లుండుట సిద్ధించును. మరి వెండిపా లుండుట సిద్ధించిన యెడలనే అట్టితోపికవల్ల 'ఉన్నదే తోచును' అనుమాట సిద్ధించును. ఇటులిది ఒకదాని కొకటి లంకెయై నారాయణ మేకగును. పోనీ, తలతలలాడు గుణములు కలదగుట వలన ఆలిచిప్పలో వెండిపోలిక తోచుటచే వెండిపాలందు కలదందురేని పోలికగల వస్తువులందు పోలిన వస్తువుల అంశ లుండితీరునను నియమములేదు. తన వలువబోలిన పుల్లయ్య వలువయం దెల్లయ్యకు తన దను భ్రాంతి పొడము చున్నది. అచట ఎల్లయ్య వలువ అవయవములు పుల్లయ్య వలువలో చొరబారవు కదా! అట్టి యెడ 'ఉన్నదే తోచును.' అను మాట పాటి యెటులగును? తన వలువలు కాలిపోయినవని తెలియని ఎల్లయ్యకు తన వలువల బోలిన పుల్లయ్య వలువలు జూచినపుడు తనవని భ్రాంతి పుట్టును. ఈ రీతిగా తటస్థించు దోషము లనేకములు గావున నిది చింత్యము.

## శంఖము - స్ఫటికము

'శంఖము పచ్చగా నున్న'దను ప్రతీతి యందును, మంకెనపూవుదరి నున్న స్ఫటికమునందు 'స్ఫటిక మెఱ్ఱగా నున్న'దను ప్రతీతి యందును, పచ్చదనము పిత్తద్రవ్యమునందును, ఎఱ్ఱదనము మంకెనపూవునందును గలవు గాన మాయికమగు పచ్చదనమును, మాయికమగు ఎఱ్ఱదనమును కల్పింపవలసిన పని లేదు కాని యిచట ఆ పచ్చదనమునకు శంఖ సమవాయమును, ఎఱ్ఱదనమునకు స్ఫటిక సమవాయమును మాయికమే. మరియు పిత్తద్రవ్యమున పచ్చదన మియ్యకొననిచో ఆ పచ్చదనమును మాయికమే. అనగా గుణమునకును, గుణికిని సమవాయి సంబంధము ఉండును. పచ్చదనమును, ఎఱ్ఱదనమును గుణములు. పిత్తద్రవ్యమును, మంకెనపూవును గుణులు. పచ్చదనమునకును పిత్తద్రవ్యము నకును, ఎఱ్ఱదనమునకును, స్ఫటికమునకును సమవాయి సంబంధముండును. ఇది పచ్చదనమునకును, శంఖమునకును, ఎఱ్ఱదనమునకును స్ఫటికమునకును

ఉండెను. కాన పచ్ఛాదనను శంఖ సమవేతముగను, ఎఱ్ఱదనము స్ఫటిక సమ వేతముగను ఉన్నటులు తోచుట మాయికము.

## అద్దము - ప్రతిబింబము

అద్దములో కానిపించు ప్రతిబింబము నిక్కమయిన ముఖముదే. కాని అద్దము నందంటని మోమంటినటులు కలుగు ప్రతీతి సిద్ధించుటకును, ఆభిముఖ్యా దులకును అనిర్వచనీయమగు అంటు, అనగా సంబంధము ఉత్పన్నమగునని యియ్యకొనవలెను.

## క ల

సమస్తమగు అర్థజాతమునకును అదృష్టము సాధారణ కారణము. స్వసంబంధముచే సుఖముగాని దుఃఖముగాని కలిగింపని పదార్థ మొక్కటియు నీ ప్రపంచమున లేదు. కలలలో అట్టి పదార్థములు కోకొల్లలు. వీనిని గూడ భగవంతుడే సృజించెనని పలుకుచో ఎవని యదృష్టమును బట్టి సృజించెనని మే మడుగుదుము? కలలో పదార్థములు జీవకల్పితములు. ఈ కల్పనయు స్మృతి విశేషరూపము. రజ్జుసర్పము, శుక్తి రజతము మొదలగున వన్నియు స్వప్న పదార్థములవలె ఆయాయి వానిచేతనే అనుభవింపదగినవియు, ఆయాయి కాలములతోపాటే సమయు నవియు గావున నివి యన్నియు మాయికములే. అచింత్యమగు భగవచ్ఛక్తి కలలో నిట్టి వింతలను సృజింపగలదని అనుకొని రజ్జు సర్పమును, శుక్తి రజతమును సృజింపజాలదనుట అరిది. ప్రపంచము నందున్న కార్యము లన్నియును పయి యుక్తులనుబట్టి అనిర్వచనీయము లయినచో నీ ప్రపంచ రూపమగు కార్యము మాయామయ మేల కాదు? కలలలో మన మెన్నియో విచిత్ర వస్తువులను కనుచుందుము. అట నొక జగత్తే స్పష్టమగును. అది నశించును. మనము పుట్టినటులును, చచ్చినటులును కల గందుము. రథ మెక్కుదుము. రాజ్య మేలు దుము. ఏడూళ్ల బిచ్చమెత్తి తిన్నూళ్ల తిప్పలు బట్టుదుము. ఇట్టి కలలలో కనుటయే సత్యముకాని కనిన వస్తువులన్నియు కల్ల. దర్శనమే నిక్కము. కల గనునంతసేపే అచటి వస్తువుల బ్రతుకు. మేలుకొనుటతోపాటే వస్తువు లెక్కడి వక్కడ అస్తమించును. సమవాయి కారణ మనుము, అసమవాయి

కారణ మనుము, ఉపాదానకారణ మనుము, నిమిత్త కారణ మనుము, వీనిలో నే కారణముచే నీ కార్యములు కలిగెనందువు? ఏయే పరమాణువులవల్ల ఈ సృష్టి యాయె నందువు? మరి యేయే పరమాణువు లెందెందు లయమై స్వప్న విలయ మాయెనందువు? ఇచట నే కారణమును లేదు. ఏ కారణము లేకున్నను జీవుడు తలవెంట్రుకలన్ని కార్యములతో వ్యవహరించుచున్నాడు. ఈ వ్యవహారములో విషయము లన్నియు ప్రాతిభాసికములు. విషయములు ప్రాతిభాసికము లయినను వ్యవహారము సత్యము. ఇది ఎంత విచిత్రము! చాలకాలము వరకును వ్యాపించియుండు జాగ్రదవస్థ కలుగగనే క్షణికమగు కల విలయమై తోడు తోడ కలలో గనిన దెల్లయు కల్ల యయినటులు మన యీ జాగ్రదవస్థా రూపమగు కలయు భగ్నమయిపోయిన పిదప నీ జాగ్రదవస్థకంటె మరియొక గొప్ప జాగ్రదవస్థ కలుగదా? మరియు నా జాగ్రదవస్థలో ఇప్పటి జాగరణ రూపమగు నీ పెద్ద కలయు ప్రాతిభాసికమై తోపదా?

## మా య

మునుపులేనిది, ముందు ఉండబోనిది, ఈ రెంటి నడుమ కొంతకాలము పాటు వ్యవహార గోచరమయినది మాయ. ఈ మాయ వస్తువు స్వభావమేమి? ఎప్పుడు నొక మాదిరిగా నుండక మారుచుండుట దీని స్వభావము. ఈ ప్రపంచము మాయ. ఇది ఎప్పటి కప్పుడు మారుచుండును. దీని రూపమేదియు నిత్యముకాదు. మరియు నిది వినాశి. దీని స్వరూప మెవరును నిర్వచింపజాలరు. ఇది సత్తుకాదు, అసత్తును గాదు. ఇది సత్తగునేని దీనికి వినాశ ముండదు. మరియు నిది ఏకవిధముగనే యుండవలయును. ప్రపంచ మటులుండదు. దీనిని నసత్తనియు చెప్పవలను కాదు. ఏలనిన అసత్తు ప్రత్యక్ష గోచరము కాదు. ఏది సత్తు కాదో, అసత్తును కాదో అది మాయ. కావున నీ ప్రపంచము మాయ.

'తాటిపా మింతకు ముందు లేదు, ఇక ముందుండబోదు; ఈ నడిమి కాలమున మాత్రము తోచును. ప్రపంచము నందున్న వస్తువు లన్నియు నంతే. తెలిసిన పిదప తాటిపామునకు 'ఇది పాము కాదు' అని బాధ కలుగును. నశించు పిదప కుండ మొదలగు దానికిని పెంకులుగా విరిసిన అవస్థలో 'ఇది కుండ కాదు'

అని యీ మొదలుగా బాధ కలుగును.' అని కదా పై ఘట్టమంతయు ప్రతి పాదించునది. ఇచట 'పిదప తెలివిడిచే ప్రతీతికాలము నందలి పామునకు కూడ బాధ కలుగును. కుండ కటులు కాదే? అని యనినచో దోచునాకుండ యునికి క్షణికతుల్యము కావున దాన కుండ మొదలగున వన్నియు పారమార్థికములని నిర్ణయింపవలను కాదు. తత్త్వజ్ఞానదృష్టిలో ప్రాతీతి కాలికమగు కుండ మొదలగు వానికిని బాధ ఉండనేయున్నది. 'బద్ధజీవుని దృష్టిలో లేదే?' యని యనుచో నది యొక్క లెక్కలోనిది కాదు. భ్రాంతుని దృష్టిలో గూడ తాటి పాము నెడల బాధలేదు. మరియు నొక ఎల్లయ్య తాటిని జూచి పామని భ్రమసి పారిపోయె ననుకొందము. వాని కది తాడని తెలియదు. కాని బాధలేదే అని అనినంత మాత్రమున అది పామై పోదు. అచట బాధకు యోగ్యత యున్నచో జాలును. ఎల్లయ్య అటనుండి పారిపోవుటచే తాడను యథార్థజ్ఞానము వానికి కలుగమి బాధ లేదను నెడల, బద్ధునకును ఆత్మ యాథార్థ్యజ్ఞానము లేనందు వలన బాధ లేకపోవుట తుల్యమే కదా!

కావున నీ ప్రపంచము మాయ. ఇటు లగుచో ప్రపంచము నందలి యీ వస్తువులన్నియు మాయామయము లేనా? కాగా ప్రపంచమంతయును మాయయేనా? కాదు. ఏది మారుపు చెందునో, ఏది ఎల్లప్పుడును ఉండదో, ఏది నశించునో అదియే మాయామయము. ఒక్క వస్తువు తక్క ఈ ప్రపంచము నం దన్నివస్తువులును మారుపు చెందును. నశించును. కావున ఆ యొక్క వస్తువే మాయామయము కాదు.

ఆ వస్తు వేది?

ఆత్మ.

## ౨

## జ్ఞానము

కుండయు బండయు మొదలగు విషయము లన్నియు జ్ఞానము చేతనే ప్రకాశము పడయును. అనగా తెలిసికొనబడును. కనబడు వస్తు వెంతవరకు జ్ఞానముచే తెలిసికొనబడదో అంతవరకు 'అది కలదని' యెవరికిని నమ్మకము

కలుగదు. జ్ఞానము దేనిని ప్రకాశింపజేయునో ఆ వస్తువే కలదని మన మంగీక రింతుము. జ్ఞానముచే ప్రకాశింపజేయబడని వస్తువు నెవరును కలదని యంగీక రింపరు; అంగీకరింతురని తలంపేని ఉండబోదు.

వస్తువులను తెలియజేయు ఎరుక యెప్పుడు నొక్కరూపుగనే యుండును. దాని స్వరూపమున కెప్పుడును మారుపనున దుండదు. ఎరుకకు గురియగు కుండ బండ కొండ ఉండ మొదలగునవి వేరువేరు వస్తువులయినను ఎరుకమాత్ర మాయీ ప్రకాశ స్వరూపమును విడిచి యుండుట మన మెవరము నెరుగము. ఎరుక యనునది కుండయను నెరుకకు గురియగు కుండకంటె వేరువస్తువు. అటులే కొండయను నెరుకకు గురియగు కొండకంటె వేరు; కాని యీ కుండ కొండల యెరుకలో స్వరూపగతమగు భేదము కలదని యెవరును నిరూపింపలేరు. ఎరుకకు గురియగు వస్తువు లొండొండ వేరుకానోపు గాని విషయాంశమును విడనాడిన యెడల 'అచ్చ యెరుక' – యనగా మనమేదని యనుకొందుమో దానిలో భేదము కలదని యెవరును తెలియలేరు, తెలుపను లేరు.

## అనువృత్తము - వ్యావృత్తము

ఈ ప్రపంచములోగల పలుతెరగుల ఎరుకలలో ఇరుదెరగులగు భేదములు భాసించుచుండును. అందొకటి అనువృత్తము; రెండవది వ్యావృత్తము. అను వృత్తము అన్ని ఎరుకలందును అనువర్తించునుగాన దీనిని సామాన్య మనియు నందురు. 'కుండ ఉన్నది, కొండ ఉన్నది.' ఈ మొదలగు ఎరుకలన్నిటి యందును ఉనికి అనువృత్తము, లేక సామాన్యము. కుండ కొండ మొదలగునవి వ్యావృత్త పదార్థములు. ఏలనగా ఒకపు డివి యుండును; ఒకపు డుండవు. కుండ ఉన్నదనినపుడు కొండ లేదు. కొండ యున్నదనినపుడు కుండలేదు. కాగా ఇవి వ్యావృత్త పదార్థములు. వ్యావృత్తమునకే విశేషమని పేరు. కుండ ఉన్నది,కొండ ఉన్నది మొదలగు నేజ్ఞానము నందయినను మనకు సత్తారూపమగు సామాన్య పదార్థమును భాసింపజేయని జ్ఞానమని ఒకటి ఉండదు.

ఏ విశేష వస్తువులు మన యెరుకకు గురియయినను సత్తారూపమగు సామాన్యమును విడచి ఆ విశేష వస్తువుల ఏ విశేష రూపమును మనము బోధ పరచుకొనజాలము. ఇది మన జ్ఞానమునకు స్వభావము.

ఎవరేని 'రాముడు' అని యనినచో రాము డున్నాడనియో, ఉండెననియో, లేక ఉండగలడనియో మన మర్థము చేసికొందుము. 'ఉన్నాడు, ఉండెను, ఉండగలడు' అను నీ మూడు మాటలచే రాముని యునికికంటె వేరుగా మన మేమి యర్థము చేసికొందుము? రాముని యునికినే మన మొకపుడు వర్తమానకాలముచేతను, మరియొకపుడు భూతకాలముచేతను, ఇంకొకపుడు భవిష్యత్కాలముచేతను పరిచ్ఛిన్నము చేసికొనుట మాత్రమే యిచటి విశేషము. వస్తు వేదేని యగుగాక, దాని ఉనికిని తెలిసికొనక ఏ కాలమునందయినను దాని విశేషమును తెలిసికొనలేము.

## "వ్యావృత్తము మాయ"

మన యెరుకకు పట్టగు కుండ కొండ మొదలగున వన్నియు విశేషములయినను సత్తారూపమగు నొక సామాన్య పదార్థముతో కలిసియే జ్ఞాన గోచరములగును. 'రాము డిచట నున్నాడు, కుండ యిచట నున్నది.' ఈ మొదలగు సకల వ్యవహారము లందును రాముడును ఉండుటయు, కుండ ఉండుటయు వేరుకాని పదార్థములు. ఈ రీతిగా మన యెరుకకు తావలములగు వస్తు విశేషము లన్నియు ఉనికికంటె వేరు కావు. అనగా సదభిన్నములు. ఇది మన కందరకును తెల్లమే. కుండయు ఉనికియు ఎటు లొకే వస్తువో కొండయు ఉనికియు అటు లొకే వస్తువు కదా. ఇటులగుచో కుండయు కొండయు ఒకే వస్తువేల కాదు? కుండయు ఉనికికంటె వేరు కాదు, కొండయు ఉనికికంటె వేరు కాదు. ఉనికి, లేక సత్తనగా మన కొక పదార్థమే గోచరించును. కుండయు ఉనికియై కొండయు ఉనికియైన యెడల కుండ కొండకంటె వేరనుట ఎటులు పొసగును? ఇదియు నొక విధమగు మాయ కాదా? కుండను ఉనికికంటె వేరని చెప్పజాలము. ఏల? మన మెప్పుడును కుండ ఉన్నది' అని అనుచున్నాము. ఇటు లనుట కర్థమేమి? 'కుండ– ఉండుట యనగా కుండయు ఉనికియు ఒండొండ వేరు కానివి.' అని కదా యర్థము. ఇటులయ్యు కుండ ఉనికికంటె వేరు కానిదనియును చెప్పజాలము. ఏల? కుండ ఉనికికంటె వేరు కాదేని, ఉనికికంటె వేరు కాని కుండ ఉండ మొదలగు తదితర వస్తువులకంటె అది వేరు కానేల?

కావున ఉనికి కన్న వేరనియు, వేరుకాదనియు చెప్పరాని దాని నేమన వలయును ? మాయ. పచ్చిమాయ. మాయ యనగా నింతకు వేరేమి కలదు ?

ఇట్టి యుక్తులచే ప్రపంచమునందలి వ్యావృత్త పదార్థము లన్నియు మాయామయము లయిపోవును. ఇవి అనిర్వాచ్యములు కదా ! దీని వలననే మాయావాదు లీ ప్రపంచమును 'మాయ'యని యందురు. ఇది ఉన్నదనిగాని లేదనిగాని చెప్పనయితికాదు.

## "ఎరుక - ఉనికి"

వేరొకటి- దేనితో కలుపక యీ ప్రపంచములో ఏ వస్తువునేని మనము తెలిసికొనజాలమో, తెలుపనుజాలమో ఆ యునికియు నెరుకయు వేరా, లేక ఒకటియేనా ?

ఎరుక తాకు లేక మన మే వస్తువును వ్యవహరింపలేము. ఇటులే ఉనికి తాకుగూడ లేక ఏ వస్తువును వ్యవహరింపలేము. ఉనికి సామాన్యము. అనగా అన్ని వస్తువులతో నిది అనగి పెనగి యుండును. ఎరుకయు అటులే సామాన్యము. అదియు అన్ని వస్తువులతో కలసిమెలసిపోవును. ఉనికి తుదమొదళ్లు మన మెరుగము. అటులే ఎరుక మొదలుగాని తుదగాని మన మెరుగము.

'బట్ట యెరుక కానిమ్ము, గుట్ట యెరుక కానిమ్ము. మరి యే యెరుక కానిమ్ము. ఎరుక యనునదెల్ల క్షణికము. విషయములతో ఇంద్రియములకు సంబంధము కలిగిన పిదప ఎరుక పుట్టును. పుట్టిన పిదప నీ యెరుక ఒక క్షణికము మాత్ర ముండును. పరక్షణముననే నశించును' అని నైయాయికు డనును.

'ఎరుక ఎన్నటికిని క్షణికము కాదు. ఎరుకకు మొదలుగాని తుదగాని లేదు. ఎల్లపుడును ఎల్లచోటుల నిండి స్వయంప్రకాశమై యుండి ఎల్లవస్తువులను ప్రకాశింపజేయు చుండుటయే ఎరుకకు పాడి. ఎరుక యిటులు నిత్యమనుట కేమిప్రమాణము అని అడుగుదువో ? నీవుగాని మరియెవరుగాని ఎరుకకు మొదలుగాని తుదగాని చూచితిరా ? నీవుగాని మరి ఎవరుగాని ఆత్మ ప్రకా

శింపకుండుట చూచియున్నారా? మనము మన శైశవమునందలి నగవులను ఏడుపులను తల్లిదండ్రుల లాలనపాలనములను బందుగుల క్రీడనతాడనములను మరతుముగాని నిన్ను నీవును నన్ను నేనును మరవలేదు. ఇటులే మన యౌవన మున జరిగిన ఎన్నెన్నియో వింతల మరచి యుందుముగాని నిన్ను నీవు మరచి యుండలేదు; నన్ను నేను మరచియుండలేదు. నీవును ఇప్పుడుంటివి; నేనును ఇప్పుడుంటిని. ఎల్లయపుడును మనతోపాటుండునని యనుకొనిన ఆ యవస్థల నన్నిటిని స్మరించుపాటి శక్తిగూడ మనకిపుడు లుప్తప్రాయమే యయినను ఆ శైశవమునుండి యీ వార్ధకము వరకును మన యునికి మనకొక నిమిషమయి నను తెలియకయున్నదని నీవేని నేనేని ఊహింపనేని ఊహింపలేము.

## "ఎరుక - ఆత్మ"

వెలుగుచు వెలుగుచున్న దివ్వె గాలి కారిపోవగా మరల వెలిగించినపుడు మనకు పూర్వాపరకాలములనున్న ప్రకాశావస్థయు నడుమనున్న అంధకారా వస్థయు లెస్సగా మనసున పట్టియుండును. ఈ రీతిగా నీవు నీ శైశవావస్థ నుండి యీ జరావస్థా పర్యంతము నీ ఆత్మదీప మారినటులు గాని, ఒకవేళ ఆరనే ఆరి నచో దాని పిదప అట్టి అంధకారావస్థనుగాని ఎన్నడేని కనుగొంటివా? ఆ శైశ వము మొదలుకొని యీ జరావస్థవరకును ఉన్న యింత దీర్ఘకాలములో ఎన్ని అవస్థలను నీవపరిహార్యములని అనుకొంటివో ఆ యవస్థలన్నియు క్రమముగా మారి తీరుటతోపాటు క్రొంగ్రొత్త యవస్థలు మరల వచ్చి మీదబడగా 'ఇవి నా ఆత్మలో ఆత్మ' అని నీవెన్నియో మారు లనుకొని యీ సంసారమున సాగి యిటకు జేరితివో నీకు గురుతున్నదా? పోయిన అవస్థలనన్నిటిని మరచిపోయితివి పో, ఈ యవస్థలనన్నిటిని చూచుచున్న నీ యాత్మను నీ వెన్నడేని మరచితివా? దీపమారిన పిదప గలిగిన అంధకారావస్థవలె నీ యాత్మ కప్రకాశావస్థ గాని అభా వావస్థగాని సాగివచ్చుటలో తెంపుటగాని జీవితమునందు ఎన్నడేని కనుగొంటివా? కనుగొనియుండవు. ఇటులు కనుగొని యుండకపోగా ఈయవస్థలన్నిటికిని సాక్షియై ప్రవహించుచు ప్రకాశించుచుండు ఆత్మ ఎల్లపుడును 'నేను నే' ననుచు భాసించుచు ఘోషించుచునే యున్నది. దండలో దారమువలె ఏకులో పత్తివలె అనంతములగు విశేషములలో అనుగతమగు ఉనికియై ప్రకాశించుచుండు నేస్వరూ

పమును నీవు చూచుచుంటివో అదియే నీ ఆత్మ. ఈ యాత్మ శరీరముకాదు. ఏలందువా? శైశవమునుండి వార్ధకమువరకు నీ శరీరమెంతయో పెరిగెను; చిక్కెను; సడలెను, కాని నీ యాత్మయో పెరుగను లేదు - తరగను లేదు. జ్ఞానమే దాని స్వరూపము. దానికి జ్ఞానమయమును ప్రకాశమయమును సత్తామయమును అగు రూపముకంటె వేరొక రూపము కనబడదు.

## నిద్ర

"కలగనినపుడుగాని మేలుకని యుండునపుడుగాని నాకు నేనను సంగతి తెలియును. నిద్రయొడిలో పడిపోవగనే విషయము పోయె, నేనును పోయితినాయె; నా స్ఫురణము మాట యేడ? ఈ నిద్రావస్థలో ఆత్మదీపము చల్లారెను. అహంత నశించెను. జాగ్రత్ స్వప్నములు కలుగనంతవరకును జ్ఞానప్రవాహము ఇంకిపోయెను. ఈరీతిగా దైనందినమును దీపమారినటులు ఆత్మజ్యోతి ఆరుచుండుట నాకువలె నీకును అందరకును తెలిసినదే. స్వప్నావస్థగాని జాగ్రదవస్థగాని కలుగుట తోడనే దీపము మరల వెలిగించినటులు ఆత్మస్ఫురణము కలుగుటయు నాకువలె నీకును మరి యందరకును తెలిసినదే. కావున జ్ఞానమున కుత్పత్తియు, వినాశమును ప్రతిదినమును ప్రతివానికిని అనుభవములో నుండగా నీవు మాయావాదమని యొకటి తెచ్చి 'జ్ఞానమునకు ఆదియు అంతమును లేదు అని యెటుల చెప్ప సాహసింతువు? ఆత్మయు జ్ఞానము నొకే పదార్థమగునేని ఆత్మకు ఆదిగాని అంతముగాని ఉండుట అసంభవము కాదు.' అని నీవనవచ్చును.

## 'నిద్రలో జ్ఞానము కలదు'

నిద్ర బొత్తిగా జ్ఞానమును లేని అవస్థకాదు. నిద్రాకాలము నందు మనకే జ్ఞానమును లేనేలేదని యనుట అసంగతము. 'నిద్రావస్థను నీవెరుగుదువా యెరుగవా?' అని అడిగినచో నీ వేమని బదులాడుదువో చూతము. 'నేనేమియు నెరుగను' అని అనగలవా? ఇటు లనజాలవు ఏలయనిన నిద్రయననేమియో యెరుగని నీవు 'నిద్రలో నేనేమియు నెరుగను' అని నిద్ర సంగతి తెలుపుటకు నోరెటులు మెదిలింపగలవు? నిద్రావస్థ నెరుగనివాడు నిద్రను గూర్చి తెలుపగలుగుట సంభవించునా? కావున నా నిద్ర నాకు తెలియును.' అని నీవంగీకరించి తీరవలయును. నిక్కమున కెవరి నిద్రావస్థ వారికి తెలియును.

మేలుకనిన తర్వాత 'నిద్రలో మనకే జ్ఞానమును ఉండదు. ఏలన నిద్రలో మనకే విషయమును గూర్చి యయినను తెలిసియున్న యెడల జాగ్రద్దశలో ఏదో ఒకపాటి విషయస్మృతి ఉండనేయుండును.' అని నీ వనుమానింతువా? అదియు సరికాదు. ఏమన అనుమానించునెడ అనుమేయమగు వస్తువేదో దాని స్వరూపము, ఏ హేతువుచే అనుమింతువో ఆ హేతువుతో అనుమేయమగు వస్తువునకు గల విశేష సంబంధము – వెరసి ఈ రెండు విషయములయు జ్ఞానము మునిముందుగా నుండవలయును. అటులు లేనినాడు మన మే వస్తువును అనుమింపజాలము. ఎటులనగా – నిప్పనగా నేమియో పొగయనగ నేమియో ఈ రెంటికిగల విశేష సంబంధమేమియో మున్నెరుగని వాడెవడును దవుదవులనున్న కొండపై పొగ చూచి 'ఈ కొండలో నిప్పుకలదు' అని అనుమింపలేడు. అటులే మనువు ఆత్మయొక్క జ్ఞానములేని అవస్థ నెన్నడును ఏ ప్రకారముగను ఎరుగనివాడు ఆత్మని జ్ఞానశూన్యమగు అవస్థ యిట్టిదని ఎట్టులును అనుమింపలేడు.

## "తెలియబడునది అజ్ఞానము"

సుషుప్తినుండి మేలు కాంచినవాడు 'సుఖముగా నిద్రించితినిగాని నాకేమియు తెలియదు'అని అనును. అది స్మృతి స్మృతి యనగా పూర్వ మనుభవించిన విషయమువలన పుట్టు జ్ఞానము. స్మృతి కార్యము. అనుభవము కారణము. కార్యమునకు ముందు కారణము తప్పక ఉండవలయును. కావున ఆ యనుభవము నిద్రలోనిది. అనుభవ మెల్లయు జ్ఞానాత్మకము. కాన 'నిద్రలో నా కేమియు తెలియదు'. అను అజ్ఞానము మనచే తెలియబడుచున్నది.

'నే నేమియు నెరుగను' అను జ్ఞానములో జ్ఞానాభావము విషయమని అనరాదు. ఇచట 'నేను' అని నిత్యమయిన జ్ఞానము భాసించుచుండగా జ్ఞానాభావమేద ? ప్రతిబంధకముచే జ్ఞానాభావము కలదందువా ? మంచిది. ఆ ప్రతిబంధకమేది ? అది స్వరూపమున కావరకమగు తమస్సగునేని, ఆ తమస్సే 'నాకేమియు తెలియదు.' అను అనుభవములో విషయము. కాన జ్ఞానాభావ లక్షణమును భావరూపమునగు తమస్సు మనచే తెలియనగుచున్నది. ఆ తెలివి తమస్సుకంటె వేరు. ...గా జాగ్రత్ స్వప్నావస్థ లెటులు మనకు తెలియునో సుషుప్త్యవస్థయ యటులు ...ను. జాగ్రత్ స్వప్నముల కెవడు సాక్షియో సుషుప్తికి అతడే సాక్షి.

## 'జాగ్రత్ స్వప్నములకు నిద్ర కారణము'

మాయామయములగు ప్రపంచ రూపములు రెండు మన కనుభవసిద్ధములే. అందొకటి కార్యము; మరియొకటి కారణము. ప్రపంచము కార్యము. ఇదియే మరికొన్ని కార్యములకు కారణము. కావున ప్రపంచము కార్యమును, కారణమును. కార్యము వ్యక్తము. కారణ మవ్యక్తము. కార్యము పలువెరగులు. కారణ మేకాకారము. జాగ్రత్ స్వప్నములు కార్యములు. నిద్ర కారణము. జాగ్రత్ స్వప్నములు వ్యక్తములు. నిద్ర అవ్యక్తము. ఈ నిద్రయే మూలాజ్ఞానపు ఆవరణశక్తి. ఈ ఆవరణశక్తి ప్రభావముచేతనే ప్రకాశమయమును ఆనందమయమును సత్తామయమునగు ఆత్మ ఆవృతమై యుండును. జాగ్రత్ స్వప్నము లామూలాజ్ఞానపు విక్షేపశక్తి. ఈ విక్షేపశక్తి ప్రభావమువలననే జాగరణ రూపముగను స్వప్న రూపముగను వ్యక్తమగు నజ్ఞానము మన యెదుట ఎల్లలులేని యీ ప్రపంచమును నిర్మించి మనలను ప్రపంచమయులనుగా జేసి విడుచుచున్నది.

అజ్ఞానము తొట్టదొలుత వస్తువు నావరించును. పిదప విక్షేపశక్తి దానిని వేరుగా జూపును. తాడని తెలియనివాడు 'తాడులే'దని గాని, తాడు కనబడుట లేదని గాని తలచును. అజ్ఞానావరణ మనగా నిదియే. ఆవరించుచు ఆ యజ్ఞానమావరించిన వస్తువును వేరొకరీతిగా ప్రకాశింపజేయును. అపుడతడు 'ఇది పాము' అని అనును. అటువలె నిటగూడ జ్ఞానమయమగు మన ఆత్మ అవిద్యచే నావరింపబడుడు నిద్ర. అటుపిమ్మట ఆయీ విక్షేపశక్తికి వికాసము కలుగుడు జాగ్రత్ స్వప్నములు. నిద్రాక్రాంతమగు ఆ యాత్మయే అనిర్వాచ్యములగు జాగ్రత్ స్వప్నములను నీ రెండవస్థలచే కట్టబడును.

ఇది యంతయు తరచిచూడగా చైతన్య రూపమగు వస్తు వొకటియే సత్తనియు ఎల్లప్పుడును ప్రకాశించుచుండుటయే దాని స్వభావమనియు అదియే పలుదెరగులగు మన యవస్థలకు సాక్షియనియు స్థిరమగుచున్నది. ప్రపంచము నందలి అన్ని విధములగు వ్యవహారములకును అదియే ఏకైకావలంబనము. దాని నాశ్రయించుకొనియే యెన్నియో జాగరణము! లెన్నియో సుషుప్తులు! సూర్య్

నిచే ప్రకాశితమగు నీ యనంతాకాశమునందు మేఘమాలికలవలె ఎన్ని యెన్ని యవస్థ లెన్ని యెన్ని రూపములతో ప్రకాశించుచున్నవో వాని యన్నిటికిని ఎవరు లెక్క వేయగలరు ?

ప్రకాశమయమగు నీయాత్మయే యీ ప్రపంచమున కేక మాత్రాధిష్ఠానము. దేని స్వరూపము తెలియుచో అజ్ఞానము నివృత్తమగునో దానినే అజ్ఞానమున కధిష్ఠానమని యందురు. ఆత్మనియే యజ్ఞానము ఆత్మనే ఆవరించును. మరియు నాయాత్మనే భిన్న రూపముతో వ్యవహారగోచరు జేయును. మరియు సమయ విశేషమున అయ్యాత్మలోనే కలిసిపోవును. ఈ యజ్ఞానమే, యీ అవిద్యయే యాత్మని క్రియాశక్తి, మరియు ఆవరణశక్తి.

ఈ యజ్ఞానమే మాయ. ఏలనగా నది ఉన్నదో లేదో నిరూపింపరానిది. ప్రకాశమయుడగు నా చిదాత్మనికంటె నీ మాయ వేరో వేరుకాదో తెలియజెప్పుట కింత వఱకెవ్వరికిని అంతుపట్టలేదు.

# 3

## పరమాణువాద సారము

మనమేదేని స్థూలమగు నొక కార్యమును విభజించుచు బోవుచో నిక విభజించుటకు వీలులేని మిగుల చిన్నదగు నొక నలుసుకడ కేగి యాగిపోదుము. కార్యద్రవ్యముల నన్నిటి నీరీతిగా నలుసులుచేసి విభజించుచు విభజించుచు బోవ బోవ నిక విభజించుటకు వీలులేని నలుసులే పరమాణువులు. ఈ పరమాణువులు నిత్యములు. వీనికి అంశములు, అనగా భాగములు, లేక అవయవములు ఉండవు.

అంశము కలదియు, విభజింప వీలగునదియు నగు ద్రవ్య మనిత్యము. ద్వ్యణుకాదు లనిత్యములు. అవయవముల యన్యోన్య సమ్మేళనము వలన నేర్పడు వస్తువులకు వినాశము తప్పదు. ఏలనగా రెండవయవముల కలయికచే గలిగిన వస్తువులో నెపుడో యొకపు డాకలయిక విడిపోనే విడిపోవును. అతుకతుకే కదా. పిమ్మట నా కార్యద్రవ్యము నశింపనే నశించును. అవయవముల కలయిక కార్య

ద్రవ్యమున కసమవాయి కారణము. ఆ అసమవాయి కారణము నశించుచో కార్య ద్రవ్యము గూడ వెంటనే నశించును. కావున స్థూలముగా గనబడు పృథివ్యప్తేజో వాయు రూపమగు నీ ప్రపంచమేదో యొక సమయమున అతి సూక్ష్మములును, అదృశ్యములును అగు పరమాణు పుంజములుగా పిదిలిపోవుట తప్పదు. ఏలన, పరమాణు పుంజముల సమ్మేళనము వలనగదా స్థూలమగు నీ బాహ్య ప్రపంచ సృష్టి!

'సూక్ష్మములగు నీ పరమాణువులకును శాఖానాడులవలె లోలోపల లెక్కలేని అవయవము లుండవచ్చును. అవి అత్యంత సూక్ష్మములు గావున మన కనులకు గనబడక పోవచ్చును. వీనిని మనము స్థూలద్రవ్యములవలె విభజింప లేక పోవచ్చును; మరియు ఆ అవయవములకు గూడ అవయవము లుండవచ్చును. వానికిని మరల అవయవము లుండవచ్చును. వేరుపరచి చూప రాక పోయినను ఈ అవయవధార అనంతము కావచ్చును. అని అంగీకరించిన యెడల బాధ యేమి?' అని యడిగినచో ఆరంభ వాదులగు వైశేషికు లిటుల చెప్పుదురు.

## "ఉండ - కొండ"

అవయవధార అనంతమనియు, పరమాణువు సావయవమనియు చెప్పుచో అనవస్థ ఏర్పడుటయకాక యీ ప్రపంచమున 'ఇది పెద్దది, ఇది చిన్నది' అను భేదము లేకుండ బోవలసి వచ్చును. లోకమునందు ఉండ చిన్నదనియు, కొండ పెద్దదనియు అందరును వ్యవహరింతురు; అందరును ఒప్పుకొందురు. ఉండకును కొండకును గల భేద మెవ రెరుగనిది? ఉండ అవయవధార యనంత మగునేని దానిని తునియలు తుత్తునియలుగా జేసికొనుచుబోవుదము. ఏ తునియకడను విరామమే యుండదని అనుకొందము. అపుడు ఉండ అవయవము లనంతములని తేలును. ఈ దెసనే కొండ యవయవములును, అవిశ్రాంతములగు వాని అవయవములును అనంతములని తేలును. ఒక చిన్న ఉండకును అనంతములగు నవయవములు! ఒక పెద్ద కొండకును అనంతములగు నవయవములు! ఇందె డియు తక్కువ తిన్నది లేదు. ఒక చిన్న మట్టి ఉండ అవయవముల మొత్తమునకును, ఒక పెద్ద కొండ అవయవముల మొత్తమునకును ఎక్కువ తక్కువలు-

లేవు. ఇటులు లేనిచో పరిమాణ వైషమ్య మెటులు సిద్ధించును? ఉండ చిన్న దనియు కొండ పెద్దదనియు మన మెటులు వ్యవహరింపగలము? ఉండకును కొండకును పరిమాణగతమగు వైషమ్యము సిద్ధించుటకు ఉండ కుపాదాన కారణ మయిన పరమాణువుల సంఖ్య అల్పము కావున ఉండ పరిమాణము చిన్నదనియు కొండ కవయవములయిన పరమాణువుల సంఖ్య ఉండ పరమాణువుల సంఖ్య కంటె చాల నధికములనియు నొప్పుకొని తీరవలయును. ఇటు లొప్పుటవలన ఎక్కువ పరమాణువుల కలయికకు ఫలమయిన కొండ పరిమాణము ఉండ పరిమాణముకంటె చాల నెక్కువని చెప్పుటకు వలనుపడును. కావున కార్య ద్రవ్యములను విభజించుచు బోయినచో నిరవయవమును, నిత్యమునగు ఒక విభాగము కడ మన మాగిపోవుదు మని అంగీకరించి తీరవలెను. కాని నాడీ ప్రపంచమున 'ఇది చిన్నది, ఇది పెద్దది' అను వ్యవహారము అడపొడ లేకుండ బోవలసి వచ్చును. కావున పరమాణువులు నిరవయవము లనియు, నిత్యము లనియు ఒప్పుకొని తీరవలెను.

పృథివ్యప్తేజో వాయు రూపములగు స్థూలభూతములకు సమవాయి కారణ ముగా అనంతములును, నిత్యములును, అదృశ్యములును అగు పరమాణువులు కలవు. పరమేశ్వరుని యిచ్ఛచేతను, భోగానుకూలమగు జీవుని అదృష్ట ప్రభా వము చేతను ఈ పరమాణువులలో సృష్టికి పూర్వము కదలిక, లేక క్రియ కలుగును. ఈ క్రియచే పరమాణువులకు పరస్పరము సంయోగము కలుగును. దాన త్ర్యణుకాదిక్రమమున స్థూలతరమును, స్థూలతమమును అగు నీ ప్రపంచ మంతయు రూపెత్తును. అగ్నికి ఊర్ధ్వజ్వలనమును, వాయువునకు తిర్యగ్గమన మును, మనఃపరమాణువులకు ఆద్యక్రియయు అదృష్ట ప్రేరితములు.

మరియు నల్లనికుండ పెంకు లగును. చిల్లపెంకులకును చతురణుకము లగును. త్ర్యణుకములగును. ద్వ్యణుకములగును. అవియు నశించి పరమాణువు లగును. పాకము వలన గలిగిన వాని పూర్వరూపాదులు తొలగును. పిదప మరి యొక పాకమువలన ఎఱ్ఱదనము మొదలగు రంగులు కలుగును. పిమ్మట అదృష్ట సహకృతుడగు నాత్మని సంయోగముచే దానక్రియ ఉత్పత్తిల్లును. దానిచే నది పూర్వదేశము నుండి వేరుపడును. ఈ విభాగముచే నది మరియొక పరమాణు

వులో కలియును. ఇట్లు కొత్త ద్వ్యణుకము ఉత్పన్నమగును. ఇవి త్ర్యణుకము లుగను, చతురణుకములుగను, కపాలములుగను ఆయి తుదకు మరల కుండ యగును. కారణ గుణములు కార్యమునం దనువర్తించును గాన పరమాణువునకు గలిగిన ఎఱ్ఱదనము మొదలగు విశేషములు కుండకును కలుగును. వైశేషిక మతమున నిది పీలుపాక వాద ప్రక్రియ. ఆరంభవాదులు సృష్టివిషయమున జెప్పు మాటలలో నివి ముఖ్యములు. ఇవి యెంత సంగతములో నిక నాలో చింతము.

'రెండుపరమాణువులు సంయుక్తములగు నెడల అనగా ఒండొండ కలియు నెడల ఒక ద్వ్యణుక మేర్పడును. మూడు ద్వ్యణుకములు కలియునెడల ఒక త్రసరేణు వేర్పడును" అని కదా పరమాణు రహస్యము. పరమాణువునకు అంశములు లేవుకదా. అంశములనగా అవయవములనికదా. పరమాణువులు నిరవయవములే యగునెడల రెండు పరమాణువు లెటులు సంయుక్తములగును ?

## సంయోగము

ద్రవ్యములకు అంశములు, అనగా అవయవములు ఉండవలయును. ఆ అవయవములలో నొక యవయవమునందుగాని, పెక్కు అవయవములందు గాని సంయోగమను సంబంధ ముత్పన్నమగును. సంయోగసంబంధమన కిది స్వభావము. రాముడను నతడు సూర్యున కభిముఖముగా నిలిచి యున్నాడను కొందము. అపుడు సోముడు రాముని కెదురుగా వచ్చి సంయుక్తుడాయెనని అనుకొందము. అపుడు రాముని ముఖోదరాదులతో సోముని ముఖోదరాదులకు సంయోగము కలుగును. అట్టి యపుడు రాముని వెన్నునకును, సోముని వెన్నున కును వెట్టి సంయోగమును కలుగదు. ఎంతటి ప్రేయసీప్రియతముల యాలింగనము నకును ఇటులు పొసగదని అందరకును తెలియును. ఒక వస్తువుతో మరియొక వస్తువునకు సంయోగము కలిగెనని ఎవరేని అనినపుడు ఆ రెండు వస్తువులయు అవయవములు కొన్ని కలిసెనని మాత్రమే మనమర్థము చేసికొందుము. ఏ రెండు వస్తువులయు అవయవము లన్నియు సంయుక్తములగుట అసంభవము. ఏలనగా, అన్ని అవయవములకును అన్ని విధములను ఏ రెండు వస్తువుల కయినను

సంయోగము కలుగునెడల ఆ రెండు వస్తువులును ఒకటియయి పోవును. వేరు వేరు వస్తువులకు సర్వావయవ సంయోగమెవరికిని అనుభూతముకాదు. సంయోగ స్వభావమిదియేయేని నిరవయవములగు వస్తువులకు పరస్పర సంయోగము సంభవింపదను సిద్ధాంతము తేలును. కావున రెండు పరమాణువులకు సంయోగ సంబంధ మసంభవము.

పరమాణువు లిక సావయవములని యందురేని ద్రవ్యము లన్నిటియు నవయవధార అవిశ్రాంతము, ననంతమునని ఒప్పుకొనవలసివచ్చును. అటు లొప్పుకొనిన యెడల మిరియమునకును మేరువునకును పరిమాణ మొకటియే కావలసి వచ్చును. ఈ రెండు దోషములలో నొక దోషమును పరిహరింపబోవుచో వేరొక దోషము పరమాణువాదుల మెడమీద పడక తప్పదు.*

మరియు వైశేషికులు పరమాణువులకు రూపరసగంధ స్పర్శము లంగీక రించుచున్నారు. లోకమునందు రూపాదులు కల కుండయు, కోకయు మొదలగున వెల్లయు ననిత్యములుగా గనబడుచున్నవి. ఈ కార్యములను బట్టి వీని కారణము లును తప్పక అనిత్యములు కావలయును. వైశేషికులు లోకమున గానబడు రీతిని బట్టియే పరమాణువులకు రూపాదుల నూహించుచున్నారు. మనకు కాని పించు రీతినిబట్టి ఊహించు వస్తువున మన సిద్ధాంతమున కనుకూలములగు విశే షముల నారోపించుట యుక్తికి పదభ్రంశ మాపాదించుట కాదా ?

మరియు నీ ఆరంభవాదులు సృష్టికి మొదట పరమాణువులలో అదృష్ట వశమున ఆద్యక్రియ కలుగునని యందురు. ఈ క్రియ పరమాణువు లందుండు నదృష్టము వలననా, లేక ఆత్మయందుండు నదృష్టము వలననా కలుగును ? జీవులు చేసికొనిన పుణ్యపాపముల వలన కలుగునది కదా అదృష్టము. కావున

---

* గ్రీస్ దేశమున క్రీ.పూ. 5, 6 శతాబ్దుల నడుమనున్న ల్యూసిపస్ దిమిక్రిటస్ అను వార్శనికులును, మొన్నమొన్నటివరకు ఉన్న పాశ్చాత్య వైజ్ఞానికులును కణాదునివలెనే పరమాణు వభేద్యమనియు, నిత్యమనియు నమ్మిరి. కాని నేటి వైజ్ఞానికులు పరమాణువును పగులగొట్టు చున్నారు. పరమాణువు భిన్నమై శక్తిగా మారుచున్నదని నిరూపించుచున్నారు. కావున పరమాణు వొక శక్తి కేంద్రము. ఇక పరమాణువు అభేద్యమనియు, జడమనియు నమ్మబడిలేదు.

నది పరమాణువుల నంటిపెట్టుకొని యుండదు. ఒకవేళ యుండునని యందురా, పరమాణువు లెల్లయపుడును సృష్టి చేయుచునే యుండవలెను. ప్రలయమున కిక ప్రసక్తి యుండరాదు. పోనీ ఆత్మయందుండునని యందురా, అది పరమాణువుల యందెటులు క్రియను గలిగించును? ఇటులును గాక అదృష్టముతోగూడిన యాత్మతోగల సంబంధముచే పరమాణువులయందు క్రియ కలుగుననియందురా, అపుడును ఆ యదృష్టము నిత్యమును, సన్నిహితమును అగుటజేసి ఎల్ల యపుడును సృష్టి కలుగుచునే యుండవలయును గాని ప్రలయమనుమాట పొసగరాదు. కావున పరమాణువులు జగత్కారణమనుట పాడి కాదు. ఇన్ని దోషములతో గూడుకొనిన ఈ పరమాణువాదమును నమ్ముకొని సృష్టితత్త్వము నెవడు తెలిసికొనగలడు? ఈ కారణముచేతనే యీ ప్రపంచము మాయకాక మరి యేమని మాయావాదులు ప్రశ్నింతురు.

## పరిణామవాద సారము

జగతికి మూల కారణము ప్రకృతి. ప్రకృతి త్రిగుణాత్మకము. మరియు సుఖ దుఃఖ మోహాత్మకము. ప్రకృతికంటె వేరుగా పురుషుడు కలడు. పురుషుడనగా జీవాత్మ. సృష్టికి పూర్వము ఈ ప్రకృతియు పురుషుడును ఒకరితో మరియొకరి కిసుమంతయు సంబంధము లేక యుందురు. పురుషుడు నిర్లిప్తుడు.

సృష్టికి పూర్వక్షణమున సమభావాపన్నమును, సుఖ దుఃఖ మోహాత్మకమును, త్రిగుణాత్మకమును అగు ప్రకృతియందు వైషమ్యము కలుగును. వైషమ్యమనగా త్రిగుణములలో నొక గుణము మిగిలిన రెండు గుణములను అడచి యుండి తాను ప్రధానముగా పనికి పూనుకొనుట. అపుడు గుణత్రయమందలి సామ్యము లోపించును. ఈ గుణత్రయములో క్రియాశీలమగు రజోగుణము ప్రబలమై తమస్సత్త్వముల నభిభవించి తన పని తాను చేసికొననాయత్తమగును. ఇటు లభివ్యక్తమగు రాజస శక్తియే అవ్యక్తముగా నున్న మహత్తత్త్వము మొదలగు ప్రపంచమునంతయు క్రమక్రమముగా నభివ్యక్తము చేయును. ఈ మహత్తత్త్వమునుండి అహంతత్త్వమును, దానినుండి క్రమముగా ఆంతరములగు నింద్రియాదులును బాహ్యములగు తన్మాత్రలును స్థూలభూతములును అభివ్యక్తము లగును. ఇటు లభివ్యక్తమయిన ప్రపంచముతో అవివేక

వశమైన చిదాత్ముడు తన్ను ప్రపంచాత్మునిగా దలచి ప్రపంచ ధర్మములగు సుఖమును దుఃఖమును తన యందారోపించుకొనును. ఈ యారోపము వలన జీవాత్మ సంసరించి సంసారి యనిపించుకొనును. నిర్లిప్తుడగు పురుషునకు ప్రపంచముతో ఐక్యబుద్ధి లుప్తమైపోయినపుడు ప్రపంచ ధర్మములగు సుఖ దుఃఖములు అంటవు. ఈ రీతిగా సుఖదుఃఖములు పొడపొట్టు లేకుండ నశించు నపుడు పురుష డాత్యంతిక దుఃఖనివృత్తి బడయును. ఇది పరిణామవాదుల సిద్ధాంతసారము. ఇది ఎంత సంగతమో ఇక విచారింతము.

సృష్టికి పూర్వము సమభావాపన్నమగు గుణత్రయములో నొక గుణము ప్రబలమై తక్కిన రెండు గుణములను తొక్కిపెట్టి తాను స్వతంత్రముగా క్రియాశీలమగుట యెటులు? దీనికి పరిణామవాదులేమి బదులు చెప్పుదురు? గుణములు మూడును సమముగానున్న యప్పు డది యవ్యక్తావస్థ లేక ప్రలయము. ఆ యవ్యక్తావస్థలో ఏ కార్యమును వ్యక్తముగా నుండదు. కావున ఆగంతుక మగు కార్యమొకటి ఈ గుణవైషమ్యమును కలిగించునని యను టెటులు సంగతము? పుట్టబోవు ప్రాణులచే సుఖముగాని, దుఃఖముగాని అనుభవింప జేయు టకు ప్రకృతి స్వయముగానే పూనుకొని యీ గుణ వైషమ్యమును కలిగించునని యందురా? ప్రకృతి జడముకదా. దానికి చేతనా శక్తిలేదు కదా. జడమొక దానిచే సుఖదుఃఖము లనుభవింప జేయుటకు స్వయముగా పూనుకొను ననుట ఎటులు సంభవము? ఇటులు ప్రవర్తించుటయే ప్రకృతికి స్వభావమని యందురా? ప్రవృత్తియే ప్రకృతికి స్వభావమేని సృష్టికి సరిగా వెనుకటి నిముసముననే ఆ ప్రవృత్తి యెటులు కలిగెను? దానికి వెనుకటి నిముసమునను నిముసములను ఏల కలుగకపోయెను? దేని కేది స్వభావమో అది దానిని విడిచి యుండదు కదా. నిప్పునకు వేడిమి స్వభావము. నిప్పులో వేడిమి లేదని ఏ నిముసమునందేనియు మీరనగలరా? అటులే ప్రవృత్తియే ప్రకృతికి స్వభావ మయిన యెడల అన్ని సమయముల యందును ప్రకృతిలో ప్రవృత్తి ఉండనేయుండును. ప్రకృతిలో సృష్టి కనుకూలముకాని సమయమని ఒకటి కేటాయించుటకు వీలులేదు. కావున సృష్టి కనుకూలమగు ప్రవృత్తి ప్రకృతికి స్వభావమేని ప్రకృతి ఎల్లప్పుడును సృష్టి చేయుచునే యుండవలయును. మరియు గుణములు సమభావాపన్నము

లగు ననుటయే పొసగదు. ఈ రీతిగా జడమునకు చేతన ధర్మము నారోపించి నిలువదలచికొనిన పరిణామవాదము ఎంతసేపని నిలువగలదు ?

మహదాది కార్యములగు వెన్నెల - ముల్లు - కల్లు మొదలగునవి సుఖ దుఃఖ మోహాత్మకములని పరిణామవాదు లందురు. ఇది చెల్లదు. ఏలనగా, సుఖాదులు మానస ప్రత్యయముచే తెలియదగినవి. మరియు మనోమాత్ర ధర్మ ములు. వెన్నెల ముల్లు కల్లు మొదలగునవియో, కన్ను మేను మొదలగువాని ప్రత్యయముచే దెలియదగినవి. సుఖాదు లాంతరధర్మములు. వెన్నెల మొదలగు నవియో బాహ్య ధర్మములు. మరియు వెన్నెల మొదలగునవి సుఖాది స్వరూ పములే యగునేని, సుఖము వెన్నెల - యీ రెంటి యనుభూతియు ఒక అంత రింద్రియము చేతనో, లేక బాహ్యేంద్రియము చేతనో తెలియవలసి యుండును. కాని అటులు తెలియుటలేదు.

ఇక వెన్నెల మొదలగునవి సుఖాదిరూపములే యగునేని వసంతమునందు వలె హేమంతము నందును వెన్నెల సుఖకరము కాదేల? ప్రేయసీ పరిష్వక్తునకు బోలె విరహికిని ఏల సుఖకరముకాదు? ఆరోగ్యము, కల-వానితోపాటు జ్వరితు నకును ఏల సుఖకరముకాదు? మరియు ముల్లు నీకు కంటకము. అది నీకాహార మును కాదు. ఒట్టెయకది సంబరము. దాని నది లొట్టలు వేసికొనుచు ఆరగించును. కల్లు ఒకానొకప్పుడు రోగార్తున కమృతము. నీకు విషము. కావున వెన్నెల మొదలగు మహదాది కార్యములు కాల విశేషాదులబట్టి సుఖాది హేతువులేకాని సుఖాది స్వరూపములు కావు.

విషయములు సుఖాదిరూపములు కానిచో నవి సుఖాదులకు హేతువులు కాజాలవు. కావున విషయములు సుఖాదులకు హేతువులగుటవలననే సుఖాది స్వరూపములని అనుమింతుమని యందురా ? అటు లనదగదు. ఏలన, ఏది దేనికి హేతువో అది దాని స్వరూపము.' అని వ్యాప్తిలేదు. వెన్నెల మొదలగునవి ఇచ్ఛకుగాని, ద్వేషమునకు గాని హేతువగు టెపుడో యొకానొకప్పు డగుటజేసి అనియతమని అందురో ? కాల విశేషాదులబట్టి సుఖమునకు గాని, దుఃఖము నకు గాని హేతువగుటయు అనియతమే కదా. కావున మహదాది కార్యములు

సుఖాది స్వరూపములను మాటయు పొల్లు. ఇట్టి పొల్లును బెట్టుకొని జగద్ బీజము నెటుల నురుచగలము?

మాయావాదు లిట్టి యుక్తులచే ఆది సృష్టి ఎటు లాయెనో దాని నెవరును నిర్ణయింపజాలరని నిరూపించిరి. ఈ ప్రపంచపు కార్యకారణ సంబంధము విచారింపగల శక్తియు మానవునకు లేదని చెప్పుచో అది అసత్యము కాకపోగా సత్యమును ఒప్పుకొనినటు లగును.

స్వప్నావస్థలో ఎన్నియో కారణము, లెన్నియో కార్యములు చూతుము. స్వప్నభంగ మగు పిదప ఆ కారణములు గాని, ఆ కార్యములు గాని కల్లలని తెలిసి కొందుము. జాగ్ర దవస్థయందును మన 'మిది కారణము, ఇది కార్యము' అని తత్త్వ నిర్ధారణము చేయుదుము. కాని కాలాంతరమున మన యీ తత్త్వ నిర్ధారణము తప్పయి పోవు టెన్నిమారులు మన అజకు వచ్చునో దానికి లెక్క వేయగలమా?

మనము శైశవమున కొన్ని విషయములను సుఖ కారణముగా నెన్ను కొందుము. పిచ్చుక గూండ్ల గట్టి నిదే యింట నివసింపము. కొత్త వస్తువుల జూచినదే తడవుగా తలిదండ్రుల గదలనీయము. కుక్క పిల్లలతో సహ భోజన మొనరింతుము. బురద పూసికొందుము. ఇట్టి వన్నియు మన కపుడు నిరతిశయ సుఖ కారకములు. యౌవనము వచ్చియు రాకమునుపే శైశవ విషయము లన్నియు దుఃఖ కారణములని నిర్ణయించు కొందుము. అట్టి పనులు చేయము, చేయనీయము. అప్పటి ప్రవృత్తి వేరు. అది శుద్ధ కామ ప్రవృత్తి. నీవు కోరిన స్త్రీ నీకు దేవత. లేక నీవు వరించిన పురుషుడు నీకు దేవత. నీ వా దేవత లేనిదే బ్రతక జాలవు ఆ దేవత నీ కపుడు సుఖ స్వరూపము. వార్ధకము వచ్చియు రాకమునుపే తల పండక పండక మునుపే బాల్య యౌవనము లందు సుఖ కారణ మని అనుకొనిన ఆ వస్తువులనే మనము మరల దుఃఖ కారణములని నిర్ణ్వ చించు కొందుము. నామ పారాయణ మారంభింతుము.

మరి యొకటి. నీకు సుఖకరమయిన వస్తువు నాకు సుఖకరము కాకపోగా దుఃఖకరమే కావచ్చును. అదియే మరల జ్ఞానికి సుఖకరమును, దుఃఖకరమును

కాకపోవచ్చును. విచిత్రమగు నిట్టి ప్రపంచమును జూచి దీనిని స్థిరమని దీనిని సత్తని ఎవడు చెప్పగలడు ? మరియు ఇది మాయకాదు, ఇంద్రజాలము కాదు అని ఎవడు బోధింపగలడు ?



విచిత్రమగు నీ ప్రపంచమును జ్ఞాన మెల్లప్పుడును ప్రకాశింప జేయుచున్నది. జ్ఞానమే జడమునకు, అనగా ప్రపంచమునకు ఆధారము. జ్ఞానముచేతనే జడము తెలియబడుచున్నది. జడ మనునది ఎల్లయు జ్ఞేయమే. మరియు ప్రకాశ్యమే. ప్రకాశ్యమయిన దానికంటె, జ్ఞేయమయిన దానికంటె ప్రకాశము, లేక జ్ఞేయము విలక్షణము. కావున జ్ఞేయమయిన యీ సమస్త ప్రపంచము కంటె దీనిని తెలిసికొను జ్ఞాన మెంతయో విలక్షణమయినదని అందరకును తెలియును.

ఈ జ్ఞానమే సకల ప్రపంచమున కేక మాత్రాశయము. దీని ఆశ్రయము లేనిచో ఏ విషయమును ఎరుక పడదు. ఈ జ్ఞానమే ఏకమాత్ర మగు సత్ పదార్థము. దీని ఆద్యంతము లెవరికిని ఎరుక పడవు. దీని ఆద్యంతము లెరుక పడదగిన వేని ఆ యెరుకకు వేరొక యెరుకను ఆశ్రయింపవలసి వచ్చును. కావున దానికి ఆద్యంతము లుండవు. 'జ్ఞానమున్నదా లేదా ?' అని ఎవరును సందియం పడరు. ఏల ? తామే అది. జ్ఞానము స్వయంప్రకాశము. స్వయంప్రకాశమగు ఆ జ్ఞానము సూర్యునివలె తాను ప్రకాశించుచు జగత్తు నంతయు ప్రకాశింపజేయుచున్నది

సూర్యుని మేఘ మావరించి నటులు జ్ఞానమును అజ్ఞాన మావరించును. ఇటు లజ్ఞానముచే ఆవరింపబడియు జ్ఞానము తాను ప్రకాశించుచు అజ్ఞానమును గూడ ప్రకాశింపజేయుచుండును. సూర్యుడు మబ్బుచే ఆవరింపబడియు తాను ప్రకాశింపక మానడు. మబ్బును కూడ ప్రకాశింపజేయ మానడు కదా. అడ్డమయినవాని నన్నింటిని ప్రకాశింపజేయుచుండుట ప్రకాశశీలములగు వస్తువుల స్వభావము.

ఇట్టి జ్ఞానమును సంపూర్ణముగా నెరుగుటకు దాని కావరకమగు అజ్ఞానము నుండి పరిత్రాణము పడయవలయును. శక్తి స్వరూపము తెలియుచో తద్గోచర

మగు నజ్ఞానము విలుప్తమగును. దానితోపాటు అయ్యజ్ఞాన కార్యమగు వేండియు లోపము పడయును. ఇటులే జ్ఞాన స్వభావమగు ఆత్మని స్వస్వరూప మను భూత మాయెనేని ఆత్మకావరకమగు నవిద్యయు ఆత్మయందే విలీనమైపోవును. ఆ యవిద్యా విలయముతోపాటు తత్కల్పితమగు నీ సంసారమంతయు లోపము పడయును.

జీవు డజ్ఞానగ్రస్తుడు. జీవునకు గల జ్ఞానము ఖండజ్ఞానము. ఇది భేదము కలిగించును. తెలిసికొనువాడు; తెలిసికొనబడునది; తెలివి - అను మూడు వస్తువుల వేరువేరు అనుభవము భేదజ్ఞానము. నీ వొక గుఱ్ఱమును చూచితివని అను కొనుము. అపుడీ మూడు విధములగు అనుభవములును కలుగును. ఇచట చూచు వాడు తెలిసికొనువాడు. గుఱ్ఱము తెలిసికొనబడునది. గుఱ్ఱము నెరుక తెలివి. ఇదియే భేదజ్ఞానము.

భేదజ్ఞానమే దుఃఖముల కన్నిటికిని మూలము. దుఃఖ మనుభవించు నపుడు భేదజ్ఞాన ముండును. 'నేను దుఃఖ మనుభవించుచున్నాను.' అను జ్ఞానమే దుఃఖభోగము. దీన మూడు వస్తువులు విడివిడిగా కానవచ్చును. ఒకటి జ్ఞానము. రెండు జ్ఞేయము. మూడు జ్ఞాత. ఇచట జ్ఞానమనగా దుఃఖానుభూతి, జ్ఞేయ మనగా దుఃఖము. జ్ఞాత మనగా నేను. ఈ మూడును దుఃఖభోగమునకు, లేక దుఃఖ జ్ఞానమునకు విషయములు. దుఃఖానుభవమునకు సరిగా వెనుక గూడ ఈ మూడు వస్తువులును విడివిడిగా తెలియుచునే యుండును.

దుఃఖమునకు కారణమేమి ? ఇష్టమగు వస్తువు దొరకలేదను నెరుకయు, అనిష్టమగు వస్తువు వచ్చిపడె నను నెరుకయు దుఃఖమునకు కారణము. సుఖ దుఃఖములు రెండును సర్వానుభవ సిద్ధములు! ఇందు సుఖము ప్రవర్తకము; దుఃఖము నివర్తకము. ఈగ కడనుండి ఏనుగు వరకును గల జీవజాల మంతయు సుఖము పొందవలయునను ఆశతో పాటుబడుచుండును. దుఃఖమునుండి తొలగ వలయు నను పూనికతో దుఃఖమునకు దూరముగ నుండును. సుఖము కలుగు నని తోపకపోవుచోగాని, దుఃఖము దూరీకృత మగునని తోపకపోవుచోగాని యెవ డును ఏ పనినేని యిచ్ఛాపూర్వకముగా చేయడు. ఇష్ట వస్తువు పోయినపుడు గాని పోవునని తోచినపుడు గాని దుఃఖము కలుగును. అట్లే అనిష్టము కలిగి నపుడు గాని, కలుగగలదని తోచినపుడు గాని దుఃఖము కలుగును. కావున

దుఃఖము కలుగుటకు కారణము భేద జ్ఞానమే అని తేలును. నేను, నా జ్ఞానము, నా యిష్టానిష్టములు అను నీ మూడు వస్తువులయు జ్ఞానము అన్ని తెరగులయు దుఃఖభోగమునకు పూర్వమునం దుండనే యుండును.

ఇంకొకటి- గాఢ నిద్రలో ఈ జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయము లుండవు. మరియు ఎట్టి దుఃఖానుభూతియు నుండదు. ఈ గాఢ నిద్ర భగ్నమయిపోయిన తర్వాత మరల నీ భేదజ్ఞానము జీవుని పెనవైచుకొనును. దానికి ఫలముగా మరల దుఃఖ మనుభవించుట జీవుని వంతు. కావున భేదజ్ఞానము పోవునేని దుఃఖము పోవు ననియు, భేదజ్ఞానము కలిగినంతనే దుఃఖము కలుగుననియు నిరూపితమగు చున్నది. కావున అన్ని తెరగులయు దుఃఖములు లేకుండ జేసికొనవలయునేని భేదజ్ఞానము లేకుండ జేసికొనవలెననియు తేలుచున్నది.

ఈ భేదబుద్ధి యెటులు పోవును? అభేదజ్ఞానము వలననే, అద్వైతజ్ఞానము వలననే యిది పోవును. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములను మూడు వస్తువులలో నిక్క మున కెట్టి భేదమును లేదు. అఖండ ప్రకాశమగు నాత్మయే అజ్ఞానముచే ఆవ రింపబడి అజ్ఞానమునందుగల విక్షేప శక్తిచే మూడుగా తునిసి జ్ఞాతయనియు, జ్ఞేయమనియు, జ్ఞానమనియు మూడు తెరగుల ప్రకాశము వడయుచున్నది. ఆలి చిప్పను అజ్ఞానమావరించి వెండినిగా గోచరింపజేయగలదే కాని ఆ యాలిచిప్ప వెండి కానేకాదు గదా! అటులే అజ్ఞానము ఆత్మ నావరించి జ్ఞాతృ జ్ఞేయ జ్ఞాన రూపముగా వేరుపరచి వ్యవహారగోచర మొనరించునే కాని నిక్కమున కాత్మ ఒక్కటియే. అది అఖండము; అభిన్నము; స్వయంప్రకాశము. ఇట్టి యెరుక హృదయమునందు దృఢముగా నాటుకొనిన కొలది భేదబుద్ధి క్రమక్రమముగా సడల దొడగును. ఆ భేదబుద్ధి పూర్తిగా తొలగిన పిదప నిక దుఃఖమునకు వేళ్లు పుట్టవు. భేదజ్ఞానముగాని, దానిపై ప్రమాణ బుద్ధిగాని దుఃఖమునకు కారణమని తెలిసి దానిని పోగొట్టుకొనిన యెడల నడుమనడుమ నొకవేళ భేదబుద్ధి కలుగు చున్నను దుఃఖ మంతగా కలుగదు. ఈ శరీర మున్నంతవరకును ఈ భేదజ్ఞానము ఊచముట్టు నశించిపోవకున్నను ఈ భేద జ్ఞానమునే నమ్ముకొని యుండకపోవ చ్చును. మరియు దాని మెడ ప్రమాణబుద్ధిని సడలింపజేసికొనను వచ్చును. ఈ రెండును అసంభవములు కావు. భేదబుద్ధిని విలయము పొందించినవారే అన్ని

తెరగుల దుఃఖముల నుండియు విముక్తి పొందుదురు. వారే ముక్తులు. ఇట్టి ముక్తు లపుడపుడు ఈ భరత ఖండము నలంకరించి దీనిని పుణ్యభూమిగా జేసిరి. వారే యీ ప్రపంచమంతయు మాయ యని మనకు తెలిపిరి.

కార్యకారణముల తత్త్వమును తెలుపుట కీ ప్రపంచమున నెన్నియో ప్రయత్నములు జరిగెను గాని వానియందే ప్రయత్నమును సఫలము కాలేదు. ఈ కార్యకారణ తత్త్వము తెలిసికొన నయితి కాదని మాయావాదులే తొలుదొలుత ప్రచారము చేసినవారు. 'కార్యకారణ తత్త్వమును తెలిసికొనగల' నను నహంకార వృక్షము నుచ్ఛేదించు సత్యకుఠారమును పదను పెట్టగలుగుట చేతనే మాయావాదు లీ జగత్తును 'అనిర్వాచ్యము మాయామయము' అని వక్కాణింప సాహసించిరి.

మాయావాదు లొక కొత్త సిద్ధాంతమును స్థాపించి ప్రచారము చేయ దొడగ లేదు. వారి యుద్దేశము స్థాపనము కాదు. వారి యుద్దేశము ఖండనము. జగదుత్పత్తి యెడ నింతవర కెన్ని సిద్ధాంతమ్ములు ప్రచారితము లాయెనో ఆ సిద్ధాంతము లన్నియు భ్రమాత్మకములని యీ మాయావాదము నందలి రహస్యము.

ఉపనిషత్తులు మాయావాదమునకు మూలము. పురాణము లందిది పురాణించెను. బాదరాయణులు దీనిని సూత్రించిరి. శంకరులు వ్యాకరించిరి.



# 9. శక్తి - శక్తము

నిత్యవ్యవహారంలో మనమందరమూ 'శక్తి' అనే మాటను ఎన్నో అర్థాలలో వాడతాం. కాని ఆ శక్తిని ఎవరయినా చూచారా ? చూడకపోయినా వాడుకలో ఉన్న ఆ శక్తి అందరకూ అనుభవంలో ఉన్నది. లేకపోతే - 'నాకు ఆ బరువు మోయగల శక్తి ఉన్నది, నాకు ఉపన్యాసం చెప్పగల శక్తి లేదుగాని పుస్తకం వ్రాయగల శక్తి ఉన్నది, ఈ మొదలుగా ఎన్నో శక్తులను ఎందులకు పేర్కొంటాం ? సామాన్యంగా సామర్థ్యాన్ని తెలపడానికి శక్తి పదం మనకు ఊతః.

కార్యాన్ని పుట్టించగల ధర్మం 'కారణంలో ఉండి ఉండవలె కాబట్టి' 'కారణంలో ఉండే అలాంటి ధర్మం శక్తి' అని తార్కికులుంటారు. నిప్పుముట్టు కుంటే బొబ్బ ఎక్కింది. బొబ్బలెక్కించగల ధర్మం నిప్పులో ఉండి ఉండవలె అని ఊహిస్తాం. అయితే మణిమంత్రాదులవల్ల బొబ్బ లెక్కవు. అప్పుడే మంటారు ? కార్య ప్రతిబంధకం ఏమీలేని కారణ ధర్మాన్నే శక్తి అని అంటారు. ప్రతి కార్యానికీ ఏదో ఒక ప్రతిబంధకం ఉండవచ్చు. ప్రతిబంధకం లేక పోవడ మనేది కార్యకారణ భావంలోనే అంగీకరించాలి.

ప్రాభాకరులు అనుమాన ప్రమాణంచేత వ్యతిరేక ముఖంగా శక్తిని ఇట్లా సాధిస్తారు. నిప్పూ చేయీ కలిసినపుడు చేతికి బొబ్బ లెత్తు తున్నవి. మణి మంత్రాది సన్నిధానంలో ఆ చేయే ఆ నిప్పే కలిసినా బొబ్బలు కనిపించడం లేదు. కాబట్టి—'ఏది లేకపోతే కార్యం కలుగదో అది శక్తి'. అని ఒప్పుకోవాలి. కాగా కారణంలో శక్తి అనేది ఉన్నది.

సరే, ఈ శక్తి అనేది ఏమిటి ?

ఇది గుణాలలోనూ సామాన్యాదులలోనూ కనబడుతూంది, కార్యం పుట్టగానే గిట్టి పోతూంది. కాబట్టి ఇది గుణమూకాదు, కర్మాకాదు. ద్రవ్యమూకాదు. సామాన్యాదులలో ఏ ఒకటిన్నీ కాదు. ఇక ఇది వేరే ఒక పదార్థం.

---

* న ద్రవ్యం గుణవృత్తిత్వా ద్గుణకర్మ బహిష్కృతా,
సామాన్యాదిషు సత్త్వేన సిద్ధాభావాంతరం హి సా.

కొన్ని మతాలు శక్తి అనేది దేవత అనిన్నీ అది ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి అని మూడు విధాలశక్తిగా, గౌరీ బ్రాహ్మీ వైష్ణవీ రూపంలో ఆవిర్భవిస్తుందనిన్నీ చెపుతాయి. యోగులు ఇలా చెబుతారు :- దేనివల్ల క్రియకలుగునో అదిశక్తి, క్రియఅంటే అవస్థాంతరం. అభివ్యక్తమైన అవస్థ క్రియ; అభివ్యక్తం కాని అవస్థ శక్తి. అభివ్యక్తమైనది ద్రవ్యం కూడా. ద్రవ్యం అభివ్యక్తమవడానికి కారణం క్రియ. ఆ క్రియకు కారణం శక్తి. కాగా మూలకారణం శక్తి. క్రియ కనబడగానే, 'ఇది దేని క్రియ ?' అని ఆకాంక్ష కలుగుతుంది. ఇక విలోమంగా కార్యకారణ భావదృష్టి పెట్టుకొని చూచి—"కార్య ద్రవ్యం అభివ్యక్త మవడానికి శక్తి కారణం" - అని అనుమానిస్తాం.

అట్టి యీ శక్తి రెండు విధాలు. ఒకటి చేతనశక్తి, రెండు అచేతనశక్తి.

ప్రాణుల క్రియలన్నీ చేతనశక్తి. ఉదా : మనః కార్యములగు చింతాదులు, జ్ఞానేంద్రియ కార్యములు కర్మేంద్రియ కార్యములు ప్రాణకార్యములు. వీని అన్నిటికీ మూలంలో క్రియ ఉన్నది. అది చేతనశక్తిది.

అగ్ని, వాయువు, మొదలయిన వాని క్రియలు అచేతనశక్తి. తగుల బెట్టడం మొదలయినవీ వీవడం మొదలయినవీ వీని క్రియలు. ఈ క్రియలనే దాహకశక్తి, చలనశక్తి అని అంటారు.

ఇక శక్తుడెవడు? లేక ఆ శక్తికల ద్రవ్యమేది ?

ఎవనికి శక్తి ఉన్నదో వాడే శక్తుడు. లేక దేనికి శక్తిఉన్నదో అదె శక్తం కాబట్టి ఈ ప్రశ్నలో ఏమి చెప్పవలసిన దున్నది ? అని అనవచ్చును. అంటే 'అన్ని విధములైన చేతనశక్తులకూ అన్ని విధాలయిన జడశక్తులకూ మూలమేది?' అని యీ ప్రశ్న.

చేతన శక్తికి మూలం, 'నేను'

'ఎటులు'?

'నే నిచ్ఛయిస్తున్నాను.' అనిన్నీ, 'నేను చూస్తున్నాను' అనిన్నీ, 'నేను వెళుతున్నాను' అనిన్నీ 'నేను ప్రాణధారణాదులు చేస్తున్నాను' అనిన్నీ ఎవరికి

బడితే వారికి అనుభవమే. ఇవన్నీ 'నేను' యొక్క యే[క్రియలు. కాబట్టి 'నేను' అనేది చేతనశక్తికి మూల పదార్థం.

ఆ చేతన[ద్రవ్యానికి మూలం [ప్రకాశ [క్రియాస్థితులు. [ప్రకాశం అనగా అన్ని విధములయిన [క్రియలూ కార్యములూ. స్థితిఅనగా అన్ని విధములయిన సంస్కారాలూ ధార్యభావాలూ.

బాహ్య [ప్రపంచం అంతా [గహణ[గాహ్యరూపంగా ద్వివిధం. [గహణం = ఇం[ద్రియాలన్నీ. [గాహ్యం = విషయాలన్నీ, [గహణం = విషయజ్ఞాన, చాలన, ధారణాలు చేస్తుంది. శబ్దాదులు జ్ఞేయ విషయాలు, వాక్యాదులు కార్యవిషయాలు, శరీర వ్యూహాదులు ధార్యవిషయాలు. శబ్దం అనే విషయాన్ని విడదీస్తే శబ్దజ్ఞాన రూపమైన [ప్రకాశమూ, కంపన రూపమైన స్థితీ ఈ మూడూ కనబడుతవి.

కర్మేం[ద్రియాలు చూదాం. వాక్కు పలుకుతుంది. అది వర్ణాదులుగా పరిణమిస్తుంది. ఇదే వాక్యరూపమైన కార్యవిషయం. దీనిలోనూ [ప్రకాశాది [త్రయం ఉన్నది. తమః [ప్రధానమైన విషయంలో గూడా ఇట్లాగే [ప్రకాశాది [త్రితయం కనబడుతుంది.

కరణముల నన్నిటినీ విడగొట్టితే ఈ మూడు ఉంటవి· చెవిని పట్టుకుందాం. దీనిలో శబ్దరూప జ్ఞానము [ప్రకాశభావం. బయటి వీణాదుల కంపనం వలన చెవికి ఉ[ద్రేకం కలుగుతుంది, ఇతరాలూ కొన్ని దోర బెట్టుకోవడంలాటివి; ఇదంతా [క్రియ. ఏవి మేలు కొంటే జ్ఞానంగా పరిణామం కలుగుతుందో అట్టి స్నాయువు లందూ పేశ్యాదులందూ ఉండే శక్తి స్థితిభావం.

ఇవి బాహ్యకరణాలు. అంతఃకరణంలో గూడా [ప్రకాశ [క్రియాస్థితులు [ప్రఖ్యా [ప్రవృత్తిస్థితి రూపంగా ఉన్నవి. [ప్రఖ్యఅంటే [ప్రకాశశీలత, [ప్రవృత్తి అంటే [క్రియాశీలత, స్థితి అంటే [క్రియా[ప్రకాశ నిరోధశీలత లేక సంస్కారం. ఇవే సత్త్వరజస్తమస్సులు. [ప్రఖ్యారూప చిత్తసత్వానికి రజస్తమస్సులు కొలదిగా అంటితే ఐశ్వర్యాది విషయాలలో అది మగ్నం అవుతుంది. రజోమా[త్రం అంటితే ధర్మజ్ఞానాదులలోనూ, తమస్సు అంటితే అధర్మ - అజ్ఞానాదులలోనూ పడి ఉంటుంది.

అచేతన శక్తికి మూలం ఏది అని విచారించుకుంటూపోతే పరమాణువుల దగ్గరకు పోయి అంతటితో ఆగిపోవలసి వస్తుంది. ఆ పరమాణువులకు చలనశక్తి కలదనిన్నీ అవి చలన గుణకాలనీ అనుమాన ప్రమాణంచే తెలుసుకుంటాం.

శక్తి లేకుండా క్రియఅనేది జరగదు. క్రియ అనేది జరగకుండా ద్రవ్యమనేది పొడమదు.

క్రియ ఉంటే దానికి వెనుకాముందు జడత్వం ఉండకమానదు. ఆజడత్వం శబ్ద స్పర్శ రూపరస గంధాలుగా ప్రకాశం పొందకా తప్పదు. కాబట్టే ప్రకాశ క్రియా - స్థితులు గ్రాహ్య లేక బాహ్యమూలాలు. ఇవే బాహ్యమూల శక్తాలు గూడా.

శక్తి యీరీతిగా చేతన శక్తి లేక చితిశక్తి అనిన్నీ అచేతనశక్తి దృశ్యశక్తి అనిన్నీ రెండు విధాలు. చితిశక్తి లేకదృక్ఛక్తిజ్ఞ స్వరూపం; ఇది ప్రపంచానికి అపరిణామి కారణం. దృశ్యశక్తి లేక జరాశక్తి ప్రపంచానికి అపరిణామి కారణం. దృశ్యశక్తి లేక జరాశక్తి ప్రపంచానికి పరిణామ కారణం. బాహ్యాభ్యంతర క్రియకు శక్యరూపావస్థయే జరాశక్తి లేక అచేతన శక్తి. అనగా ఇది క్రియకు వెనుకగాని ముందుగాని ఉంటుంది కాబట్టి మనకు కనబడని అవస్థ. గ్రాహ్యమైన ప్రతిద్రవ్యమూ శక్తివల్ల అభివ్యక్తమవుతుంది. క్రియకు పర్యవసానంగా శక్తిలోనే లయిస్తుంది.

ఆంతరశక్తి మానసికమైన శక్యావస్థ (Psychical latency). ఇది సంస్కారరూపం. అనుమానప్రమాణంచే సిద్ధం చేయదగిన క్రియా శక్యావస్థ బాహ్యశక్తి.

క్రియ అంటే జరాశక్తి యొక్క లేక అచేతనశక్తి యొక్క ప్రత్యక్షావస్థ. ఈ క్రియ కూడా అంతరక్రియ అనిన్నీ బాహ్యక్రియ అనిన్నీ రెండు విధాలు. అంతరక్రియ కాలికం. బాహ్యక్రియ దైశికమూ మరి కాలికమూనూ.

ఇదంతా కలిపిచూస్తే కార్యద్రవ్యమూలమూ కారణ మూలమూ శక్తిమూలమూ ప్రకాశక్రియా స్థితులుగానే గోచరిస్తున్నవి. మూలానికి పోగా శక్తి శక్తమూ ఒకటిగానే కనబడుతూంది.

ఇప్పుడు చేతన శక్తమైన అస్మితను లేక 'నేను' ఎవరు? అని విచారిద్దాం! 'నేను'లో జ్ఞాన చేష్టా సంస్కారాలు కనబడుతున్నవి. కాబట్టి,

యీ మూడూ 'నేను'- శక్తులు దేనిలో ఉన్నవో ఆ 'నేను'ను కనుక్కోడం ఎట్లా? 'నేను' అనేది జ్ఞాన చేష్టా సంస్కార త్రయ రూపమే అయితే శక్తుడనబడే వాడు విడిగా దొరకడు.

'నేను'ను విడగొట్టి చూదాం. నేను విషయాలను ఎరుగుదు ననిన్నీ, ఒకానొకపుడు ఇంద్రియములు నేననిన్నీ మరొకపుడు మనస్సు నేననిన్నీ ఈ అనుభవం సర్వసామాన్యం. కాగా జ్ఞాత + జ్ఞేయము వెరసి 'నేను' అని అన్న మాట. ఇందు జ్ఞాత విషయి. జ్ఞేయము విషయము. విషయము (Object), విషయి (Subject), ఒకటి కావనిన్నీ ఈ రెండూ వేర్వేరు పదార్థాలనిన్నీ అందరకూ అనుభవమే. జ్ఞాత చేత జ్ఞేయమంతా ప్రకాశింప జేయదగినది లేక తెలియదగి నది. కాగా జ్ఞేయానికి జ్ఞాత ప్రకాశకుడు. ప్రకాశకుని ప్రకాశింప జేయడానికి వేరే ఒక ప్రకాశకుడితో పని ఉండదు. దీపాన్ని ఇంకో దీపంతో చూడాలా? కాన జ్ఞాత స్వప్రకాశుడు. లోకంలో దీపమూ చంద్రుడూ సూర్యుడూ మొదలయిన ప్రకాశాలన్నీ ప్రకాశక ప్రకాశ్య యోగంవల్లనైన ప్రకాశాలు. ఈ రీతిగా 'నేను'లో- 'అస్మిత'లో స్వప్రకాశుడైన ద్రష్ట లేక జ్ఞాత, అతనిచే ప్రకాశింప జేయదగిన దృశ్యమూ లేక జ్ఞేయమూ ఉన్నవన్న మాట. ఈ దృశ్యము-జ్ఞాన చేష్టా సంస్కారములనే స్వభూత శక్తి త్రయ రూపంగా అభివ్యక్తం అవుతుంది.

కార్యద్రవ్యానికి కారణం శక్తి అని వెనుక సిద్ధపరచాం. కారణం రెండు విధాలు-నిమిత్త కారణం ఒకటి. ఉపాదాన కారణం మరియొకటి. వీనిలో ఉపా దాన కారణం వికృతమై కార్యంగా పరిణమిస్తుంది. నిమిత్త కారణం పరిణమిం చదు. జ్ఞాత ఎన్నటికీ జ్ఞాతే కాన అతడు నిర్వికార కారణం, లేక హేతువు. జ్ఞాన చేష్టా సంస్కారాలు అనబడే అంతఃకరణం యొక్క మూలభావ త్రయమూ ప్రకాశ క్రియా స్థితులని అనబడే సత్వరజస్తమో గుణాల తారతమ్యం వల్ల ఐనది కాబట్టి ఈ జ్ఞాన చేష్టా సంస్కారాలకు త్రిగుణాలు మూలోపాదాన కారణం. అనగా జ్ఞాన చేష్టా సంస్కారాలు త్రిగుణ వికారాలు. మరి జ్ఞాన చేష్టా సంస్కార రూపమైన అంతఃకరణ శక్తికి శక్తం ఏది?

దేని తారతమ్యం వల్ల అశేష ప్రకారమైన జ్ఞాన చేష్టా సంస్కారాలు కలుగునో అట్టి ప్రకాశశీలమైన సత్వం క్రియాశీలమైన రజస్సూ స్థితిశీలమైన తమస్సు అనబడే త్రైగుణ్యమే దీనికి మూలోపాదన రూపమైన శక్తం.

ఇంతేకాదు, ఈ త్రిగుణాలు జ్ఞానాది రూప కార్యాలకు మూలోపాదనం కాబట్టి శక్తి లక్షణంలో గూడా చేరిపోతుంది. కాబట్టి మూలానికి పోతే అక్కడ శక్తీ శక్తమూ అభిన్నమై ఉపచరిస్తుంది. అంటే శక్తి హీనమైన శక్తే అవుతుంది. ఇట్లా అయితే సమస్త కార్యాలకూ సమస్తాభివ్యక్తికీ శక్తి మూలోపాదానం అని శక్తిలక్షణం తేలుతుంది. ఇలా మూలంలో శక్తీశక్తాలకు భేదం కల్పించడానికి అవకాశం దొరకదు. కాగా యీ సంబంధపదాలు మూలం దగ్గర నిరర్థకాలు. కాని ప్రత్యేక వ్యక్తభావం అంతా శక్తి శక్తరూపంగానే నిర్ణయింపబడాలి.

కార్యవస్తువుకు అనుమేయ కారణం శక్తి' అనే లక్షణంలో చితి లేక నిర్వికారజ్ఞాతకూడా శక్తే. ఎట్లాగంటే ఈ నిర్వికారజ్ఞాత జ్ఞానచేష్టాదులయిన వ్యక్త ద్రవ్యాలకు నిమిత్త కారణం. కాబట్టి నిమిత్త కారణం చితిశక్తి లేకదృక్ శక్తి. ఉపాదానకారణం ప్రకృతి శక్తి. ఇది త్రిగుణరూపం. సాంఖ్యయోగదర్శనాలలో జ్ఞానమూలమూ దృశ్య ప్రకాశకమూ నిర్వికారమూ ఐనజ్ఞానమాత్రాన్ని చితిశక్తి అని దృక్శక్తి అనీ దృశి మాత్రమనీ వాడతారు.

ధర్మము ధర్మి మరి గుణమూ గుణీ అనే విషయం ముందు సంచికలో చూదాం.

# 10. ధర్మము - ధర్మి : గుణము - గుణి

శక్తి అనే పదానికి అనేకార్థాలు ఉన్నట్లే ధర్మము, గుణము అనే పదాలకు కూడ అనేకార్థాలు ఉన్నవి. రాముని యొక్క ధర్మం రామత్వం, ఘటము యొక్క ధర్మం ఘటత్వం అని మనం మామూలుగా చెప్పుకుంటూ ఉంటాం. రామత్వం అంటే దశరథుని కొడుకూ సీతాపతీ మొదలయిన వనిన్నీ. ఘటత్వం అంటే పొట్టా మెడ మొదలయినవి ఉండడం, నీరు తీసుకోరా దగిన వీలు కనబడడం, యీ మొదలయిన లక్షణాలనిన్నీ, అర్థాలు చెపుతాం. ఆ యీ శాస్త్రాల దృష్టి ననుసరించి ధర్మం అనే మాటకూ గుణం అనే మాటకూ వేరువేరు అర్థాలు కనబడతవి.

సాంఖ్యయోగుల దృష్టిలో ధర్మమంటే ధర్మియొక్క శక్తి. ధర్మి అంటే ద్రవ్యం. మట్టి అనేది ఒక ద్రవ్యం-దాంట్లో అనేక శక్తులు ఉన్నవి. అది దుమ్ము కాగలదు, ముద్ద కాగలదు, కుండ కాగలదు, పెంకులు కాగలదు, మళ్ళా పొడి దుమ్ము కాగలదు, ఈరీతిగా ఇంకెవో్న్ని కాగలదు. ఇవి అన్నీ దాని శక్తులే. ఇట్టి శక్తులే ధర్మాలు. యోగదర్శన భాష్యంలో-'ధర్మికి యోగ్యత ఉన్న శక్తియే ధర్మము' అని ఉన్నది.[1] క్రియాదులచే ఏదో విధంగా తెలియదగినది కావడమే యోగ్యత. నిప్పు ముట్టుకుంటే బొబ్బలెక్కుతవి. ఈ బొబ్బలు చూచి నిప్పులకు బొబ్బలెత్తించే శక్తి అనగా 'దాహక శక్తి' అగ్నికి ధర్మం అంటాం. ఈ శక్తి బొబ్బలెత్తించడానికి - అనగా దాహక్రియకు కారణం. 'దాహికా శక్తి' దాహ క్రియచే అవచ్ఛిన్నం. అనగా విశేషితం. దహనం యోగ్యత. దహనంచే విశేషితమైన 'దాహికా శక్తి' అగ్నికి ఒక ధర్మం అన్నమాట.

ధర్మి, ధర్మ దృష్టిలో శక్తికిన్నీ శక్తివల్ల కలిగే క్రియకున్నూ భేదం చేయవలసిన ఆవశ్యకత ఉండదు. ఎందుచేతనంటే, క్రియా-, దానికి మూలమైన శక్తీ-, కూడా ధర్మమే. ద్రవ్యమును మనం ఏ రూపంతో తెలుసుకుంటామో

1. ధర్మిణో యోగ్యతావచ్ఛిన్నా శక్తిరేవ ధర్మః

(13-14)

లేక తెలిసికోగలమో అది అంతా ధర్మమే. కాబట్టి ఈ ధర్మిధర్మ దృష్టితో శక్తి క్రియలకు భేదం చేసినందువల్ల ఒరిగేది ఏమీ లేదు.

గుణపదాన్ని ధర్మముఅనే అర్థంలో వాడినప్పుడు ఘనద్రవ్యంలో కనిపించే విశేషాలు అని చెప్పడమే, 'గుణాలంటే ధర్మాలు' అని పలురీతిగా వ్యవహరించి నపుడు గుణి అని అంటే ధర్మి అన్నమాట.

ఏ గుణం చేత వస్తువు మనకు బోధపడుతుందో అదే ఆ వస్తువుధర్మం. ఎఱ్ఱకుండ ఒకటి ఉన్నదని అనుకుందాం. ఎఱ్ఱదనమూ గట్టిదనమూ పొట్టాపొట్టా మెడా పొడా మొదలయినవి కలిగి ఉండడం కుండధర్మాలు. బోధగమ్యాలయిన యీ ధర్మాలు గలకుండ ధర్మి.

ఇక శక్తిని ధర్మమని అన్నప్పుడు శక్తి అనాగత ధర్మం అని అనవలసి ఉంటుంది. భూత భవిష్యద్వర్తమాన రూపంగా ఉండే ధర్మం 'ఉన్నది లేక ఉండును' అని యీ రీతిగా వ్యవహరించవలసి ఉంటుంది. ఈ వ్యవహారం పద బోధ్యమైన త్రైకాలికధర్మ సమాహారం. తెలుగు వైయాకరణులు దీనిని తద్ధర్మార్థకం అని అంటారు. ఈ కల్పన ఈ ఊహ (Conception) కాలత్రయాన్ని వెనుకొని ఉండే పదార్థాన్ని అంటిపెట్టుకొని ఉండే భావం లేక బోధ. ఇది ధర్మి. కాలత్రయ త్రివిధ ధర్మాలలో అనుగతంగా ఉండే వస్తువేదో అది ధర్మి. 2. అనగా పదార్థానికి లెక్కపెట్టడానికి వీలులేనన్ని ఉదితానుదిత ధర్మాలు ఉంటవి. వాని ప్రోవు ఏ వస్తువులో - ఏ ద్రవ్యములో ఉంటుందో ఆ వస్తువు- ఆ ద్రవ్యం ధర్మి. ధర్మము=బోధగమ్యమైన ఏదో ఒక భావం.

కారణమునూ కార్యమునూ కూడా ధర్మం చేతనే కనిపట్టవలసి ఉన్నది కాబట్టి కారణం కార్యధర్మానికి ధర్మి. ఆ కారణానికి ఇంకొక కారణం కనిపించి నప్పుడు పరకారణమనే కార్యధర్మానికి పూర్వకారణ ధర్మం ధర్మి. ఈ లాగా కార్యకారణ రూపంగా గాని వికృతి ప్రకృతి రూపంగా గాని ఉన్నధర్మాలకు కారణమూ లేక ప్రకృతీ ధర్మి.

---

2. 'శాంతోదితా వ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ'. (యోగ, ద 3-14)

ఇపుడు వెనుదిరిగి చూచి 'ఏదో ఒక ప్రకారంగా తెలిసికోబడే భావాన్ని మనం ధర్మం అని అంటాం' అని నిబ్బరంగా చెప్పవచ్చు.

ఇట్టి ధర్మం త్రివిధం. 1. శాంత ధర్మం లేక అతీతధర్మం. 2. ఉదిత ధర్మం లేక వర్తమాన ధర్మం. 3. అవ్యాపదేశ్య ధర్మం లేక అనాగత ధర్మం[3]

ఈ ధర్మాలు కాలాన్నిబట్టి విభక్తాలయినట్లు ఇట్టే తెలుస్తుంది. కాని ఇందులో ఒక విశేషం ఉంది. మనకు వర్తమాన ధర్మమే గోచరమవుతుంది. గోచరం కానిది అతీతానాగత ధర్మం. ఈ రెండూ వర్తమాన ధర్మాలు కావని తేటతెల్లమే. కాని వర్తమాన ధర్మాలు కూడా అవుతవి. అవి గోచరం కావు కాబట్టి అతీత ధర్మమనిన్నీ అనాగత ధర్మమనిన్నీ అంటూ ఉంటాం. ధర్మిలో యీ ధర్మాలు లేవని అనడానికి వీలులేదు. అవి వర్తమానాలు కావచ్చు. అనగా సూక్ష్మ రూపంతో ఉండవచ్చు. కాబట్టే-'అతీతా నాగత పదార్థాలు సూక్ష్మంగా ఉన్నవి.'[4] అని పతంజలి భగవానుడు అంటాడు. ఒక మట్టిముద్ద తీసికొందాం. దీనిలో పిండత్వం వర్తమాన ధర్మం. ధూళిత్వం ఘటత్వం మొదలైనవి అతీతా నాగత ధర్మాలు. మొదటిది వ్యక్త ధర్మం. ఇటీవలివి అవ్యక్త ధర్మాలు లేక సూక్ష్మ ధర్మాలు.

కాలం అనేది లేకపోయినా సూర్యాదుల గమనాన్ని పురస్కరించుకొని మన ఉపయోగం కొరకు ఉన్న చందంగా భావిస్తాం. ఆ భావనచేత వ్యవహారాలు చక్క దోసుకుంటాం. ఈ రీతిగా మనకు కాలజ్ఞానం రూఢమైపోయింది. అందు వల్ల భూతకాల వస్తువూ భవిష్యత్కాల వస్తువూ లేదని అనుకుంటాం కాని ప్రకృత వ్యాపారోపరూఢ వస్తువులలో భూత భవిష్యద్ధర్మాలు అవ్యక్తంగా ఉన్నవి. మనకుగల జ్ఞానం విభక్తం. వస్తువును కాలభేదంచేత విభక్తంగా తల పోసి అతీతా నాగత ధర్మాలు వర్తమాన ధర్మిలో లేవని అనుకొంటాం. వర్త మానమైన నిమిత్తమే నైమిత్తికాన్ని అనగా ద్రవ్యాన్ని[5] వర్తమానావస్థను

---

3. 'శాంతోదితావ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ.' (యోగ. ద. 3-14)

4. 'అతీతానాగతం స్వరూపతోఽస్తి. (యోగ. ద. 4-12)

5. దండచక్ర కులాలాదులు నిమిత్తం. మట్టిలో సూక్ష్మ రూపంతో ఉన్న ఘటం నైమిత్తికం.

పొందిస్తుంది. ధర్మి అనేక ధర్మాత్మకం. ఆ ధర్మాలన్నీ మనం కల్పించుకున్న కాలంలో ఉన్నవి. వర్తమాన ధర్మం విశేష వ్యక్తి సంపన్నమైన ద్రవ్యంలో ఉన్నటులు అతీతానాగతాలు ఉండవు. నాలుగు తట్టల మట్టితో కుండలూ మూకుళ్లూ చేయవచ్చునని అనుకుందాం. ఈ కుండలూ మూకుళ్లూ ఆ మట్టిలో అనాగత రూపంగా ఉన్నవి. అనగా అవ్యక్తంగా సూక్ష్మంగా ఉన్నవి.

ఘటత్వం అనేధర్మాన్ని వర్తమానంగా చేయడానికి అనగా అభివ్యక్తం చేయడానికి కుమ్మరి ఉండాలి. కుమ్మరి కర్మేంద్రియాలూ జ్ఞానేంద్రియాలూ ఇచ్ఛా, డబ్బు సంపాదించేకోరికా, పనీ ఈ మొదలైనవన్నీ కూడా నిమిత్తాలు. కాబట్టి ధర్మిలో అనభివ్యక్తంగా ఉన్న ఫలాన్ని లేక కార్యాన్ని వర్తమానంగా పరిణమింప జేయడంలో నిమిత్తం సమర్థమౌతుంది. ఈ ఘట్టం అంతా సంగ్రహించి ఇలా చెబుదాం - బోధ లేక జ్ఞానం లేక చిత్తవృత్తి ఒకదానివెంట మరొకటిగా అనగా వరుసగా కాలంలో ఉండేవి కాబట్టి తెలియబడిన లేక ప్రకాశం పొందిన ధర్మాలు భూతాలనిన్నీ ప్రకాశం పొందుచున్నవి, లేక తెలియబడు చున్నవి. వర్తమానాలనిన్నీ బోధకు విషయం కాబోయేవి భవిష్యత్తులనిన్నీ లోకవ్యవహారం అన్నమాట.[6]

'గుణాలంటే సత్త్వరజస్తమస్సులు'. అని అనుకున్నప్పుడు గుణాలంటే విశేషాలు - విశేషణాలు - అని అర్థంకాదు. త్రాళ్లు అని అర్థం. ప్రవాహరూపమైన ఈ ప్రపంచం, అంతూ పొంతూ లేకుండా ముప్పేటగా పేనబడుకుంటూ సాగిపోయే మోకు. ఆ మోకులో గుణాలు మూడూ మూడు పేటలు. కాగా సత్వ రజ స్తమోఽర్థంలో వాడబడిన గుణపదానికి ఈడని అర్థం.

ప్రపంచాన్ని కార్యకారణ - వికృతి ప్రకృతి రూపంగా విశ్లేష (Analysis) చేసి మూలం పట్టుకొన్నప్పుడు ఉపాదాన కారణమైన త్రిగుణాల సాన్నిధ్యం కలుగుతుంది. అక్కడ ధర్మధర్ములు రెండూ ఒక దానిలో ఇంకొకటి కూడుకొని ఉంటాయి. ఎట్లా అంటే :

6. యోగులకు కాలత్రయమూ వర్తమానమే.

## స త్కా ర్య వా ద ం

'కారణంలో కార్యం ఇమిడి ఉంది-' అని చెప్పడం సత్కార్యవాదం. ఇదే 'నాఽసతో విద్యతే భావః' అనే గీత. కుమ్మరి మట్టితో కుండలు చేస్తున్నాడు. ఇదివరకు లేనిదేమీ ఇప్పుడు పుట్టుకురాలేదు. మట్టి నలుసుల సన్నివేశం మాత్రం మారింది. నలుసు నలుసూ చూడగల వాడుంటే కుమ్మరి ఆ నలుసుల నన్నిటినీ కుండ ఆకారంగా సవదరించి నటులు కనుక్కొని ఇది మట్టే అని అనుకోగలడు. అయితే ఇలా చూడలేక సముదాయం మాత్రమే చూడగలిగి, కుండలతో మాత్రమే పరిచయం గలవారు లోగడ లేని వస్తువొకటి కొత్తగా పుట్టుకొచ్చిందని అంటారు. నిజాని కది ఒక ఆకారంలో ఉంచిన మన్నే.

ఈ రీతిగా కార్యాలన్నీ కారణాలలో ఇమిడి ఉంటాయనిన్నీ ఒకటి గాని పెక్కులు గాని నిమిత్త కారణాల క్రియాకలాపాల చేత ఆ యా కార్యాలు అభివ్యక్తా లవుతాయనిన్నీ సత్కార్యవాదం చెబుతుంది. ఈ రీతిగా ప్రపంచావిర్భావం అభావంలోంచి- శూన్యంలోంచి- కొత్తగా పుట్టుకోరావడం కాదు, మరి దేశ కాలాలలో సన్నివేశభేద మాత్రమే అని తెలిసివస్తుంది. మహత్తత్త్వం లగాయతు పరమాణువు వరకూ ఈ ప్రపంచం అంతా ఇంతే.

దృశ్యమైన ప్రపంచమంతా ధర్మాలు ధర్మలే- (ఘన ద్రవ్యాలే) అని చెప్పే ధర్మ ధర్మి వాదంలో 'కారణంలో కార్యం ఉంది,' అనే పై సంగతి సమ్మ సరిపోతుంది. ఊహారూఢమైన ఏదో ఒకదానికి లక్షణం చెప్పబోతామని అనుకోండి, అప్పుడు- 'ఏది ఫలానా ఫలానా గుణాలు లేక ధర్మాలు లేక శక్తులు కలదో అది' అని చెబుతాం. ఇందులో ఆ 'ఏది' అనే దానికి లక్షణం చెప్పమంటే ఇప్పుడు చెప్పిన గుణ ధర్మశక్తుల కంటే ఇంకా ముఖ్య విశేషాల కోసం పరికిస్తాం. ఉదాహరణానికి - భూమి అంటే ఏమిటి? అని అడుగుతారని అనుకుందాం. ఏది నల్లగా ఇంకా అల్లా ఉంటుందో అల్లా ఉంటుందో అది భూమి అని అంటామని అనుకుందాం. ఆ 'ఏది' అంటే ఏమిటి అని అడుగుతారు. అప్పుడు మనకు తెలిసినంతమేరకు పోయి పరమాణువులు అనో ఇంకేమో అనో, వానికి మరికొన్ని విశేషాలు చేర్చి ఆ 'యేది'ని లక్షిస్తాం. పరమాణువులకు మరొక

మూలకారణం సరిగా తెలియకపోతే సందేహంలో పడతాం. అనగా మన అజ్ఞానాన్ని ఒప్పుకున్నట్టు. కాని ఇంకొక మూలకారణం మటుక్కు ఉండడానికి హేతువు లేనప్పుడు ఏమనాలి? అది కారణం లేని వస్తువు కాబట్టి నిత్యం అని అనాలి.

ఏదయినా వస్తువులో ఉండగలది ధర్మం అని చెప్పాం. ఇంకా సరిగ్గా చెప్పి చూదాం-ఏదో ఒక విధంగా తెలిసికోబడే ఆకార-ప్రకార- విశేషం ధర్మం. ఆకార-ప్రకారాలకు మార్పు కనబడుతుంది. అనగా పరిణామం ఉంది. అంటే ధర్మాలకు మార్పు ఉందన్నమాట. ఒక ఆకారం-ప్రకారం- ధర్మం, మారినప్పుడు అదేమయినట్టు? అది అవ్యక్తావస్థలో ఉన్నట్టు. ఎంచేతనంటే ఉన్నదెప్పుడూ పోదు,- 'నాఽభావో విద్యతే సతః.' వెనుకటి మాదిరి హేతువులు తటస్థించినప్పుడు మళ్ళా ఆ ధర్మం పొటమరించవచ్చు. కాబట్టి భూత ధర్మం ఒక అవ్యక్త సత్తా. భావిధర్మాలూ అంతే. గుండ్రంగా చేసిన మట్టి ముద్దను చచ్చవుకంగా చేశాం. గుండ్రతనం పోయి చచ్చవుకతనం వచ్చింది. దాన్ని మళ్ళా కోసుగా ఆకారించవచ్చు. ఈ రీతిగా ఎన్నెన్నో ఆకారాలెత్తదగి ఉంది కదా మట్టి ముద్ద! కాబట్టి ధర్మి అనేది లెక్కలేని ధర్మాల ప్రోవు; మరి దాన్ని వివిధ విధాలుగా బోధపరచుకోవచ్చు. వర్తమాన ధర్మాలే కనబడతై, మిగతావి ఉన్నట్లు ఊహింపబడతై. కాగా వ్యక్తావ్యక్త ధర్మాలకు కూటం ధర్మి.

## బౌద్ధమతం

బుద్ధులలో ఒక తెగవారు ఈ ప్రపంచమంతా ధర్మాలే, ఈ ధర్మాలు అనుక్షణమూ శూన్యంలోంచి పుట్టుకొచ్చి మళ్లా శూన్యంలోకే పోతున్నవి- అని అంటారు. శూన్యమంటే అభావం. మరికొందరు పుట్టుకొస్తున్న మాట నిజమే కాని దేంట్లోంచి పుట్టుకొస్తున్నయ్యో అది అజ్ఞేయం అని అంటారు. ఈ రెండు మతాలూ ఆదరింపదగినవి కావు.

మొదటి వాదంలో ప్రత్యయమూ ప్రతీత్యమూ ఈ రెంటికీ శూన్యంచేత సంబంధం విచ్ఛిన్నమవుతున్నది. బౌద్ధుల పరిభాషలో ప్రత్యయమనగా కారణము. ప్రతీత్యమనగా కార్యము. కార్యకారణాలకు సంబంధం విడగొట్టగల

ఊహలో సందర్భశుద్ధి లేదు. శూన్యం లేక అభావం అనేది దేనికీ అధికరణం కాజాలదు. ఆధారం లేకుండా నిరాధారంగా ధర్మాలు పుట్టి శూన్యంలోకి పోతై అనేది ఊహాతీతం. ఇక రెండవవాదం అజ్ఞేయత. అజ్ఞేయతలో ఒక విధమైన జ్ఞేయత ఉండనే ఉంటుంది.' దానిని వివేచించి విస్పష్టం చేస్తే సత్త్వము, రజస్సు, తమస్సు, అనే ఆధారం అవుతుంది.

## త్రి గు ణా లు

సాంఖ్యయోగుల దృష్టిలో ఆధారం లేక మూలం శూన్యం కాదు, మరి తప్పించుకపోయే మాయామృగమూ కాదు, ఈ గుణత్రయమే ప్రపంచానికి ఉపాదాన కారణం, తన కార్యాలకు ధర్మి, ఈ దెస మట్టి, కుండలకూ ఇటు కలకూ పెంకులూ మొదలయినవానికీ ధర్మి, ఈ పెంకులు మొదలయినవానిలో మట్టి అనుగతంగా ఉన్నా అవి మట్టికి వేరుగా ఉన్నటులు తోచునే కాని మట్టి యొక్కయే వేరు వేరు ధర్మాలు లేక రూపాలు లేక ఆకృతులు. ఈ తాడు పట్టుకొనిపోదాం. భూతాలు తన్మాత్రము లనబడే పరమాణువులకు మరి పర మాణువులూ మనస్సహితాలయిన ఇంద్రియాలూ అహంకారానికి మళ్లా ఆ యహంకారం, అచ్చ నేనుకూ లేక మహత్తత్త్వానికీ తానది మళ్లా గుణత్ర యానికీ ధర్మాలుగా కనిపిస్తాయ్. గుణాలకు మరొక మూలం లేకపోవ డాన ధర్మ ధర్మిభావం దాంతో సరి.

సత్త్వరజస్తమస్సులు ఘనద్రవ్యాలు కావు. మరి స్వయంపర్యాప్తాలైన సత్తా విశేషాలు (entities) ఉదాహరణానికి రజస్సు అనే మూల భావాన్ని చూదాం. పరిణమించడం లేక వికారం చెందడం, దాని గుణం లేక విశేషం కాదు, మరి శీలం. దాంట్లో వికారం తప్ప మరొకటి లేదు, ఉన్నదంతా వికారమే. కాబట్టి మూలరజస్సుకు వికారం గుణం కాదు. మరి స్వయం పర్యాప్తమైన వికార స్వభావమే. కాబట్టే—'ప్రధానంలో ధర్మమునూ ధర్మినీ విడదీయడానికి వీలు లేదు' అని యోగభాష్యం చెబుతుంది.

## వై క ల్పి క ధ ర్మా లు

ధర్మాలు వాస్తవాలూ వైకల్పికాలూ. చెప్పకుండా తెలిసేవి వాస్తవాలు. చంద్రునికి తెల్లదనం ఎండమావులకు జలత్వం ఆరోపిత వాస్తవం. వైకల్పికా

లనేవి వాఙ్మాత్రం. అనంతత్వం, సత్తా, ప్రకృతి యీ మొదలైనవి వైకల్పి కాలు. వ్యాకరణ ప్రకారం త్వ, తల్ ప్రత్యయాలు చేరడానికే ఇవి గుణ వాచులైనవి. త్రిగుణాలే ప్రకృతి కాబట్టి గుణాలంటే తాళ్లు అని అర్థం కాబట్టి ప్రకృతి వైకల్పిక ధర్మవాచి. త్రైగుణ్యంవలె నైర్గుణ్యమైన చైతన్యం ధర్మ ధర్మి దృష్టికి అతీతం. 'నిర్గుణత్వాన్న చి ధర్మా.' ఇలా అయినప్పటికీ మన మొక ధర్మం కల్పించి వాడతాం. అది మన కలవాటు. ఆవశ్యకం కాకున్నా మామూలు చొప్పున ద్రష్టకు అదృశ్యుడనే విశేషణం వేస్తాం. ఇది ఎన్నో 'నేతి నేతి' రూపాలను పిలిచిపెట్టింది.[7] 'విశేషేణ ఆపరామృష్టాదృక్' అని అంటాడు వ్యాసులు. విధిముఖంగా ద్రష్టకు' దృశిమాత్రుడు అనియే లక్షణం. నిషేధ ముఖంగా చెప్పబడిన లక్షణశతం చూచి కొందరనుకుంటారు — సాంఖ్య యోగుల మతంలో పురుషుడు నిషేధముఖంగా గాని చెప్పబడడానికి వీలులేదని.

వాస్తవ ధర్మాలు బాహ్యాలూ మరి ఆంతరాలూ బాహ్య ధర్మాలు మూలంలో ముప్విధాలు : అవి ప్రకాశ్య కార్య జాడ్యాలు. కాఠిన్యం భూధర్మం. కాన ఇది జడ ధర్మం. ఆంతర ధర్మాలు మూలంలో ప్రకాశ క్రియా స్థితుల రూపాంతరాలైన బోధ చేష్టా ధృతులుగా ముత్తెరగులు. ఈ వాస్తవ ధర్మాలకు అవస్థాంతరం అనగా పరిణామం ఉంది. కాని వినాశం అంటూ లేదు.

## ధ ర్మి వి కా రి

ధర్మలు అన్నింటికిన్నీ ధర్మాలు అనేక ప్రకారాలతో అనేకం. కాబట్టీ ధర్మ లనబడేవన్నీ వికారాలు.

వికారం అంటే ఒక ధర్మం అడగి వేరొక ధర్మం కలగడం. చితిశక్తి ధర్మ ధర్మలకు అతీతం కాబట్టి కూటస్థం. అనగా నిర్వికారం నిత్యం, అవినాశి.

ఏది ఏకతత్త్వ స్వరూపమో మరియు అసంయోగజమైన పదార్థమో అది కారణ హీనం. దానికి నాశం కల్పనీయం కాదు. దాన చితిశక్తి అవినాశి. ఇక...మూల దృశ్యమైన త్రిగుణం నిత్య పదార్థం – 'ప్రకృతిం పురుషం చైవ

7. చూ. బృహదారణ్యకం.

విద్ధ్యనాదీ ఉభావపి' గీత ప్రకాశ-క్రియా- స్థితులు (సత్త్వరజస్తమస్సులు) ఎంతకాలం నుంచీ ఉన్నవో, ఎంతకాలం ఉండబోతాయో 'ఇవి ఉన్నవి, ఉండగల యవి' అనియే సమాధానం చెప్పవలసి ఉంటుంది. ఇవి ప్రత్యేకించి అసంయోగ జాలు. కాబట్టి నిత్యాలు. చిత్తం మొదలయినవి ద్రష్టృ దృశ్య సంయోగజాలు కాన నాశం అనగా లయం పొందుతవి. కాని వాని మూల కారణమో అది అవినాశి.

ప్రకాశ క్రియాస్థితులు జాతి వాచకాలు కావున (Generalisations) సాధారణోపాదాన పదాలు [8]. దృశ్యమంతా ప్రకాశ క్రియాస్థితులే అని అనడం 'మృత్తికేత్యేవ సత్యమ్' అన్న చందంగా వ్యాపకమైన సత్యాన్ని చెప్పడమే.



8. 'ప్రకాశక్రియా స్థితి శీలం భూతేంద్రియాత్మకం దృశ్యం' (యో. 4-208)

# శ్రీ అరవిందులు

## ౧

శ్రీ అరవిందులు ౧౮౭౨వ సాలున అవతరించిరి. వీరి తండ్రి శ్రీకృష్ణ ధనఘోష్. ఇతడు కలకత్తాలో వైద్య విద్య చదివి, అచటినుండి సీమకు పోయి ఎబర్‌డీన్ యూనివర్శిటీలో వైద్యశాస్త్ర పారంగతుడై, యం. డి. డిగ్రీ తీసికొని తిరిగివచ్చెను. ఇతడు పాశ్చాత్య సభ్యతకు నమ్మినబంటనియు, ఇతని ఇల్లు యూరపియనులకును వంగీయులకును కూడలిగా నుండెడిదట! ఈయన ఇండియన్ మెడికల్ సర్వీస్‌లో ప్రవేశించి పెక్కు జిల్లాలలో సివిల్ సర్జన్‌గా పనిచేసెను.

శ్రీకృష్ణ ధనఘోషు తన కుమారుడు శ్రీ అరవిందుని బాల్యమున డార్జిలింగ్‌లోని రిట్టో కాన్వెంటులో చదువ బంపెను. అటుపిమ్మట, పై చదువులకు 1879 వ సాలున అరవిందుడు సీమకు వెళ్లెను. అచట లాటిన్ పండితులగు డ్రూసిట్ దంపతుల కడ సుమారు అయిదేండ్లు చదివెను. 1885వ సాలున సెయింట్‌పాలు స్కూలులో ప్రవేశించి, గ్రీకు లెస్సగా నభ్యసించుచు ఆ గ్రంథములను ఈ గ్రంథములను అవగ్రహించుటయ కాక కవనము చెప్పుటలో వింత నేర్పు కనబరచెను. అయిదేండ్లచ్చట జదివిన పిదప, కేంబ్రిడ్జిలోని కింగ్స్ కాలేజిలో ప్రవేశించి, ఇండియన్ సివిల్ సర్వీస్" పరీక్షకు కూర్చుండెను. గ్రీకు లాటిన్‌లలో ఇతనికి నిండు మార్కులు. పిమ్మట రెండేండ్లకు జరిగిన క్లాసికల్ ట్రైపాస్" పరీక్షలో నితడు ఫస్టు క్లాసులో వచ్చెను. విద్యాభ్యాసము చేయు నీ కాలమున గూడ నతడు గ్రీకు లాటిన్లలో కవనము చెప్పుచునే కింగ్స్ కాలేజిలో దాని కేర్పడిన బహుమతుల నన్నిటిని ఒక యేడాది యేడాది తానే గుత్తకొనెను. ఇటులు పదునాలుగేండ్ల పాటత డింగ్లాండులో ఉండి, ఇండియాకు వచ్చి, బరోడా స్టేట్ సర్వీస్‌లో ఉద్యోగము గ్రహించెను. ఈ కాలమున అతని విద్యాకృషి "ఆసీన ప్రచలాయిత"మయిన లేనిది. అపు డరవిందుడు గ్రీస్ బ్రిటిష్ యూర

పియన్ ప్రాజదువు లోతులలో మునిగి పడమటివారి సభ్యతా సముద్రమునుండి వెలువడు ఆలోచనా తరంగములలో నోలలాడెగాని, అతని కా పడమటింటిలో దేవ గృహము కానిపింపలేదు. 1906 వరకును అతడు బరోడాలోనే ఉండెను. అపుడే అతడు సమకాలికులలో గల జ్ఞానులయు, వృద్ధులయు, కర్మఠులయు భావధారతో బాంధవ్య మందెను. పొందిన కొలది అతడు ఆత్మీయ సభ్యతను అర్థము చేసికొనెను- చేసికొని;-

"పందొమ్మిదవ శతాబ్ది అనుకృతికిని ఆత్మ విస్మృతికిని పెట్టినది పేరు. అది పట్టి కృత్రిమము. ఇది స్వధర్మమును మఱచి యూరోపును ఇండియాలో సుప్రతిష్ఠత మొనరింపజూచెను. గత సంప్రదాయములు గతించిన దేశకాలము లలో మిగుల దొడ్డవి. మహత్తరమగు భవిష్యత్తు ప్రపంచమున జరుగుచున్న ఆయాయీ గొప్ప అనుసరించి తీరవలయును"- అని వ్రాసెను.

అరవిందుడు బరోడా నుండి కలకత్తాకు మారెను. అచట నతనికి దేశ భక్తులతో పరిచయ మొదవెను. 1906 వ సాలున 'వందేమాతరమ్' పత్రిక కతడు సంపాదకు డాయెను. అందు అతని వ్యాసములు చాలగలవు. కొలది నాళ్ళకే బహుళ ప్రచారము కలిగి దాని శక్తి హెచ్చెను. 1907 న అతడా పత్రికలో (passive Resistance) గురించిన వ్యాసములలో ఐర్లండులోని చార్లెసు వార్‌ట్ ప్రార్నల్‌కు రాజనీతిలో గల ప్రతిభను ఎత్తి చూపెను. యూరపునందలి నవ జాగృతియు, పరాసు విప్లవమును, ఇటలీ పునర్నిర్మాణ మును జర్మన్ సామంతరాజుల మేళనములోని రాజనీతియు, రషియా నిద్రా భంగమును, ఐర్లండు రాష్ట్రవాంఛయు, అరవిందుని కార్యదీక్షను దక్ష మొనరించి యుండవచ్చును. ఈ రీతిగా అతడు హిందూదేశమును ముని ముందులకు నడి పింపగలవా డాయెను. అందరి కన్ను లతని మీద పడెను. భారతీయు లతనికి ప్రమాణ పదవి నొసగి తమ సాహసమును, గరువమును అతని వాకున వెలువ రింప దొరకొనిరి.

ఇటులొక యేడాదిపాటు కడచనెనో లేదో 1917 అగస్టు నెలలో నాటి బెంగాల్ సర్కారు శ్రీ అరవిందుని విచారించుటకు అరెస్టులో నుంచిరి, అతడు ఆలీపూరు జైలు (అతడు పెట్టుకొన్న పేరు అలిపూర్ హాస్టల్)లో అరవిందుని

తరపున పనిచేయుటకు గాను చిత్తరంజన దా సారునెలలు తన ప్రాక్టీసు మాను కొనెను. 'అరవిందుడు జాతి స్వాతంత్ర్యము కావలయునని ఉద్ఘోషించిన మాట నిశ్చయము. ఇందుకుగాను శిక్ష ననుభవింపవలయు నేని, అది యెంత దేని అత డనుభవించును. అతడు ప్రజా ప్రభుత్వాదర్శములను, స్వాతంత్ర్య సంపాదనమును వేదాంతపు టచ్చులో పోసి చూపెను...దీర్ఘమగు నీ విచారణ మంతయు, చాటుననో మాటుననో జరిగి మరపున బడిన తరువాత...ఇతడు చనిపోయిన తరువాత...భారతదేశ మంతయు అరవిందుడు తన మహాకవి యనియు, దేశభక్తికి ప్రవక్తయనియు భూత దయకు చెలమ అనియు కీర్తింప గలదు. ఇతని సందేశ మిండియాలోపలనే కాక దేశముల కావల, సముద్రముల కావల ప్రతిధ్వనింపగలదు. పునః పునః ప్రతిధ్వనింప గలదు-" అని శ్రీచిత్త రంజనుడు కోర్టువారికి అప్పీల్ చేసెను.

అరవిందున కీ కారాగార వాస మాశ్రమ వాసమే ఆయెను. తన జీవిత మున కొక ప్రయోజనము కలదని అచట అతనికి తట్టెను. "నాకు నీవు కొండొక పని చేయవలసి యుంటివి, దానికి గాను నేను నిన్ను ఇటకు లాగుకొని వచ్చితిని. నీకు నీవు దాని జేయలేవు. నా పని నీకు నేర్పెదను." అని భగవానుడు నా చెవిలో చెప్పినటు లాయెనని అరవిందుడు వ్రాసికొనెను. అరవిందున కీ కారా వాసమే దివ్యావాసమాయెను. చెరలో అరవిందునకు గ్రంథములు చదివికొన ననుజ్ఞ దొరకెను. అత దందు భగవద్గీతను మననము చేసెను. పిదప పిదప అర విందుడు గీతను విపులముగా వ్యాకరించెను. గీతయే అరవిందుని సర్వస్వమని తత్ పాఠకులెరుగుదురు. గీతా మననము వలనను, నిది ధ్యాసనము వలనను అరవిందు నకు గలిగిన సిద్ధి అనితర సాధ్యము. ఆ సిద్ధియందలి అనుభవ ప్రపంచమునే మన మతని **"Essays on the Gita"** (గీతా వ్యాఖ్య) యందును, **Life Divine** (భాగవత జీవనము) నందును, **Synthesis of Yoga** (పూర్ణ యోగము) నందును చూడగలము.

## అ ను భూ తి స ం గ్ర హ ము

సచ్చిదానంద మయమగు ఒకానొక తత్త్వము విజ్ఞానముగను, మనస్సు గను, ప్రాణముగను, జడముగను అవతరించెను. మరల నది జడము నుండి

ప్రాణమునకును ప్రాణమునుండి మనస్సు వరకును ఆరోహించి అచట ఆగి యున్నది. అదియే యిపుడు మనకు కనబడు నీ జగత్తు. ఈ మనోమయ లోకము నుండి విజ్ఞానముగా వికసించుటకు దాని నిరంతర ప్రయత్నము.

ఈ విజ్ఞానమునే అరవిందుడు ఆంగ్లమున Super Mind అని వాడెను. అరవిందుని యీ దర్శనమున బ్రహ్మమునకును బ్రహ్మాండమునకును ప్రయోజనము కనబడును.

శాస్త్రజ్ఞు లీ పై వాక్యములలో అక్షర పరీక్ష చేయుదురు. ఉదా: జడముగా నవతరించెననగా పరిణమించె ననియా? వివర్తము చెందెననియా? ఏల అవతరించెను? ఎవరికొర కవతరించెను? ఎందు కారోహించుచుండెను? మనస్సు వఱకే ఆరోహించినవాడు విజ్ఞానమున కేల లోగడనే ఆరోహింపలేక పోయెను? పోయెబో, మనకు దానితో నేమిపని? సచ్చిదానందమయమగు మూల తత్త్వమున కది స్వభావమగుచో, మనంత మనమే మన యత్న మేమియు లేకుండ విజ్ఞానమయులమై పురుషోత్తమత్వము ఏల పడయజాలము? ఇట్టి ప్రశ్నలు ప్రతి దర్శనమునందును ఉత్థితము లగును. వానికి సమాధానములు చూపబడును. అటులే అరవిందులు తమ గ్రంథములందు వీని అన్నిటిని ఎత్తి చూపి, మనకు కలుగు సందేహములకు మనస్సును తృప్తిపఱచు సమాధానములు చెప్పిరి. జిజ్ఞాసువుల కా గ్రంథములు ముంజేతి యుద్దములు.

ఈ యరవింద దర్శనము జడమును గూడ సత్య మనుటచే లోకాయతమా? కాదు. పరిణామ వాదమా? కాదు. ద్వైత దర్శనములలో నొకానొక దర్శనమా? కాదు. అద్వైతమా? అంతకంటె కాదు. మరియేమి? ఇది యేకము నందు నానాత్వమును, నానాత్వమునం దేకత్వమును ఏకకాలావచ్ఛేదముగా చూచును. ఈశ్వరునం దీప్రపంచమును, ప్రపంచమునం దీశ్వరుని ఏకకాలావచ్ఛేదముగ జూచును. ఇది సంభవమా అని యెవరేని అడుగవచ్చును. ఇది సంభవము కానిచో ఉత్పత్తి ప్రకరణములో:

"ద్వైతం యథా నాస్తి చిదాత్మ జీవయోః
తథైవ భేదోఽస్తి న జీవచిత్తయోః

యథైవ భేదోఽస్తి న దేహకర్మణోః
తథైవ భేదోఽస్తి న దేహ కర్మణేః
కర్మైవ దేహో నను దేహ ఏవ
చిత్తం తదేవాఽహ మితీహ జీవః
సజీవ ఏవేశ్వర చిత్ స ఆత్మా
సర్వ శ్శివ స్త్వేక పదోక్త మేతత్. -యోగ. ఉత్పత్తి. ౧౨-౧౩

"చిజ్జీవులు వేరు కానటులు, జీవచిత్తములు వేరు కావు. జీవచిత్తములు వేరు కానటులే దేహకర్మములకు వేరిమిలేదు. కర్మమే దేహము. చిత్తమే నేనని జీవుడు. జీవుడే ఈశ్వరుడు. చిత్తు ఆత్మ. ఇది అంతయు శివుడని ఒక మాటలో చెప్పుదును." అని యనుట ఎటులు సంభవము ?

## గీ తా వ్యా ఖ్యా న ము

అరవిందు డొనరించిన Essays on the Gita గీతా వ్యాఖ్యానములను గురించి దిక్ప్రదర్శనముగా, లేక సంగ్రహముగా చెప్పుటకు ముందు ప్రాచీనా చార్యుల ముఖ్యాభిప్రాయములను పీఠికగా చెప్పు టావశ్యకము.

ఈ జగత్తుకు 'అపరా ప్రకృతి' పునాది. అది త్రిగుణాత్మకము. దానికే 'అవిద్య' అనియు పేరు. గుణములు జీవుని సంసారమున బంధించును. కావున ప్రకృతియను నీ చెర విడిపించుకొనుటయే-అనగా- ఈ సంసారమును ధ్వంసము చేయుటయే- తన వ్యష్టిసత్తను బ్రహ్మమున లయ మొనరించుటయే- మానవుని లక్ష్యము. ఇట్టి నిశ్శ్రేయసము వడయుటకు నిష్క్రియుడ వగుము. మిథ్యను సత్యమును వివేచించి ఎఱుకలుడయుము. జ్ఞానమే నిన్ను బ్రహ్మమునకు గొంపోవు రాదారి. మిగిలినవి ఇందుకు ఇరుకుదారులు. అటులని ఎల్లరును పై రాదారిలో పోజాలరు. నీకా బాటలో నడవగలుగు నేర్పు అబ్బువరకు విహిత కర్మముల నాచరించుచుండునది. — అని కొంద ఱాచార్యులును, భక్తి యోగమే శ్రేయమని మరికొందఱును, కర్మయోగమే శ్రేష్ఠమని మరికొందఱును నిర్వచించిరి. నేటి వారిలో మరికొందఱు పరుల కుపకరించు పనులు చేయుటయే గీతోద్దేశమనియు, అదియే నిశ్శ్రేయసము కలిగించుననియు వ్రాసిరి.

అరవిందు లిటు లందురు : జగత్తు అపర ప్రకృతి చేసిన సృష్టికాదు. అది ఒక జడయంత్రము. దీనికి పునాది 'పరాప్రకృతి'. అది సచ్చిదానంద మయమగు భగవంతుని చిచ్ఛక్తి. కావుననే జగత్తు అసలు జడమును గాదు; దుఃఖాత్మకమును గాదు. మరి ఆనందమయము. ఆనందముచేతనే దీని సృష్టి. ఆనందమునుండి ఆనందములోనికే దీని నడక. అపరప్రకృతి మనలోని భగ వానుని ఆవరించియున్నది. ఇట్టి యీ అపర ప్రకృతి ఆవృతిని తొలగించుకొని, పరప్రకృతిలో ఆనందమయమగు జీవనమును బడయుటయే మానవుని లక్ష్యము.

జీవ పరప్రకృతు లొకటి. గీత పరప్రకృతిని జీవభూతమనునే కాని జీవాత్మక మనదు. పరప్రకృతియే జీవులందరయు స్వభావము. దీని మేర యింతయకాదు. ఇదియే జగతికి మూలము. ఇదియే జగన్మాత. లేక 'ఆద్యాశక్తి'.

పరప్రకృతియు పురుషుడును ఒకటి. ఇంతేకాక అది ఆతని కంశము- 'మమైవాంశః.' జీవుల నందరను, బ్రహ్మాండముల నన్నిటిని ఒకత్రాసున బెట్టి తూచినను భగవంతునితో తూగవు. జగత్తు అతనిలో ఒక అంశము. జీవుడు తన మూల సత్తచే దేవుడు. ప్రకృతిచే భగవంతుని పరప్రకృతిలో అంశము. జీవులందరును భగవానుని బహురూపములు. ఇటులయ్యు మానవుడింకను మిక్కిలి తక్కువయగు ప్రకృతిలోనే ఉనికి గొన్నాడు. ప్రతి మానవుడును తన స్వరూపమును వికసింపజేసికొని, తన భగవద్ధర్మమును భాగవత ప్రకృతిని బడయవలయును. మానవులు తమలో నున్న దివ్యప్రకృతిని వికసింప జేసికొని, ఈ ప్రపంచమునందే దివ్య జన్మమును పొంది, దివ్య కర్మము లొనరించి తమ అపరిపూర్ణతను దాటి యీ విశ్వలీలలో అనంతమగు ఆనందమును అనుభవింప వలెను. దీనికొరకే పరప్రకృతి అతనిని భగవత్ సత్తనుండి వేరు కాపురము పెట్టించి తానే అతనికి మూల స్వభావ మాయెను. ఈ పర ప్రకృతి యిటులు బ్రహ్మాండమును తన గుప్పిట బెట్టుకొని యున్నది. కాని మనుజు డిపుడు సంస రించు చున్నాడు. ఇది త్రిగుణాత్మకమగు అపరప్రకృతి ఆట. ఈ జగత్తున సుఖదుఃఖాదులగు ద్వంద్వములు కలవు. వీనికిని ప్రయోజన మున్నది. మనుజు డీ అపరప్రకృతి గుండ అన్న - ప్రాణ - మనః కోశములకు వికాసము కలిగించుకొనియే పరప్రకృతి నడుమనుండి జీవనలాభము పడయవలెను.

ఈ విషయమునే ఈశావాస్యము 'అవిద్యయా మృత్యుం తీర్త్వా, విద్యయాఽమృత మశ్నుతే' – అని చెప్పెను.

మన మిప్పుడీ సంసారమున సుఖదుఃఖాదు లనుభవించుచున్నాము. మనకీ అపర ప్రకృతియే మూలశక్తి కాదని తెలిసికొనుట మాత్రమే ముఖ్యము కాదు.

సాంఖ్యులకును, జ్ఞానయోగులకును ఇదియే చరమ సంభావన. 'గుణములు గుణములయందు వర్తించుచున్నవనియు, సుఖదుఃఖాదులగు ద్వంద్వములన్నియు ప్రకృతి వనియు, పురుషు నివి స్పృశింపవనియు, పురుషు డచలుడు అక్షరుడు సనాతను డనియు, నాటకమును చూచుచున్నటులు ఈ జగత్తును చూచుచుంటయే పురుషార్థమనియు సాంఖ్యులందురు. పురుషు డహంభావముచే ప్రకృతిఖేలను చూచి, ఇదియంతయు తనఖేలయేయని అనుకొనును. అహంభావమును విసర్జించి నంతటనే ప్రకృతి ప్రేరణయు, క్రియయు ఆగిపోవును – పురుషుడు ముక్తు డగును. తన ఉనికిని అడగును.

గీత సాధనకు అంగముగా ఈ భేద విచారమును ఒప్పెను. ఇది ఒప్ప వలసినదే! కాని ఇదియే గీతా సర్వస్వముకాదు. గీత చెప్పిన దంతయు నిదియే యగునెడల, మనుజుడు జీవము నుండి బుద్ధిని ప్రత్యాహరించి శాంతమును నిష్క్రియమును అగు బ్రహ్మమున మునిగి పోవలయునని ఒప్పుకొనుట యగును. సాంఖ్యమత మిదియే చెప్పెను.

జ్ఞానయోగము కూడ సంసారత్యాగము చేసి, సన్యాసస్వీకారము చేయుమని చెప్పును. ఇదియే గొప్ప సత్యమగునేని, ప్రకృతిప్రేరణ మాగిపోయి సంసార లీలయు జీవనమును అసంభవ మగును. కాని గీత ఆ అక్షర పురుషున కంటె గొప్ప సత్యమును కనుగొమ్మని సందేశించెను. ఆ సత్యమే పురుషోత్తముడు. అక్షరపురుషు డీ పురుషోత్తముని ఒక ముఖమే. అక్షరపురుషుని శాంతికిని, నిష్క్రియత్వమునకును పురుషోత్తముడే పునాది. ఇటులయ్యును ఆ పురుషోత్తముడే మరల అక్షర పురుషుడుగా భాసించును. అతడీ బ్రహ్మాండము నందలి అనంతమగు కర్మ పరంపరలో తన ప్రకృతితో ఒకడై జగద్వినోద మొనరించుచున్నాడు. క్షరుడు. అనగా భూతము లన్నియు తమతమ కర్మములు చేయుచున్నవి – 'వర్త ఏవ చ కర్మణి'.

అతని యిచ్ఛచే, అతని యే ప్రకృతి లేక శక్తిచే ఈ జగత్తులో ప్రతి కర్మయు ఏర్పాటయి సాగిపోవుచున్నది. గాలి ఆకాశముచే ధరింపబడి, అందే ఉండి అంతటను తిరుగాడినటులు ఈ బ్రహ్మాండము లన్నియు కూటస్థమును అక్షరమునగు ఆతని సత్తచే ధరింపబడి అతని సత్తలోనే ఉన్నవి. కాని అతడో క్షరపురుషునకు ఆవలివాడు - అక్షర పురుషునకు ఆవలివాడు - పురుషోత్తముడు. ఇట్టి పురుషోత్తమత్వమే మనకు ప్రాప్యము. ఇదియే నిశ్శ్రేయసము.

క్రింది ప్రకృతికి సంబధించిన అహంభావమును విడనాడు పొందే మనుజు డక్షర పురుషుని సాక్షిత్వములందు తనను ప్రతిష్ఠించుకొనవలయును. ఈ అక్షర పురుష డన్ని భూతములకును ఏకాత్మ-అనగా కూటస్థుడు. మనుజుడీ పురుషునిలో నుండెనేని అతని కన్ని భూతముల తోడను ఏకత్వము కలుగును. కాని మనము స్వభావముగా సంసారమునందు చేయు కర్మల నన్నిటిని పురుషోత్తము నుద్దేశించి యజ్ఞరూపముగా నొనరింప వలెను. మన బ్రతుకంతయు పనులన్నియు ఉత్తమ సత్తయగు పురుషోత్తముని పాద పీఠమున నునిచి ఎల్లపుడు నతని భజించుచు, అన్ని భూతములలోను అతని సేవ చేయుచు అతని భావము పొందవలెను- 'మద్భావ మాగతాః'- అపుడు మనలో అక్షర పురుషుని అచలమగు శాంతియు, ఏకత్వమును అనాసక్తియు సమత్వమును నెలకొనును. వేరు రూపెనసిన మన బాహ్యప్రకృతి యీశ్వరుని ఇచ్ఛ ననుసరించి జగత్తులో పనిచేయగల యంత్రముగా మారును- 'నిమిత్త మాత్రమ్'- ఇది గీత చెప్పెడి జ్ఞాన కర్మ భక్తి రాజయోగముల చరమార్థము. ఇటులు చెప్పిన యెడలనే వీని కేక వాక్యత.

శంకరులకు జ్ఞానకర్మ సముచ్చయము గిట్టదు. కర్మలు ప్రథమావస్థలోనే ఉపకరించును. కర్మత్యాగమే పరమసిద్ధి. ఉత్తమ చైతన్యమునందే దివ్య జన్మము పొందవలెను. దాని కుపాయముగా దివ్య కర్మము లొనరింపవలెను. ఇటులు దివ్య జన్మమును బడయు పిదప తదభివ్యక్తి స్వరూపముగా దివ్య కర్మము లొనరింపవలయు ననుట గీతోద్దేశము. శంకరులు కర్మ త్యాగమే శ్రేష్ఠావస్థయని అనుటకు కారణము అతని మతమున నిర్గుణమును, నిష్క్రియమును, నిశ్చలము నగు బ్రహ్మమే ఏక మాత్ర సత్త. మిలిగిన దెల్లమాయ. కాని, శంకరుడు నిర్గుణ

బ్రహ్మ మనుకొన్నది, గీత అక్షర పురుషుడు, జగత్తుకు మూలమగు మాయయని అతడనుకొన్నది గీతలోని అపర ప్రకృతి. శంకరుని మాయాశబల బ్రహ్మ గీతలోని పురుషోత్తముడు, ఈశ్వరుడు, స్రష్ట. అతడు నిర్గుణ బ్రహ్మమునకు క్రింద కాని పురుషోత్తముడే ఉత్తమమగు సత్తయని గీత. అసలు శంకరుని సగుణ బ్రహ్మ గీతచెప్పు క్షరపురుష డగును. గీతలందలి పురుషోత్తముడు శంకరున కందలేదు. బ్రహ్మము నిర్గుణమనియు, సగుణమనియును ఉపనిషత్తు చెప్పెను.- 'నిర్గుణో గుణీ'- సగుణత్వ నిర్గుణత్వములను రెండు భావములు కలుగబట్టియే అతడు పరబ్రహ్మము. అతడే గీతల పురుషోత్తముడు. ఈ రెండును పురుషోత్తముని రెండు మోములు. భగవంతుడగు పురుషోత్తముడు చైతన్య స్వరూపుడు. అల్ల ఆ చైతన్యపు సక్రియత్వ రూపమే అతని ప్రకృతి. పురుషునకును ప్రకృతికిని మూలమున భేదములేదు. అపర ప్రకృతి లేక మాయ లేక అవిద్య అన్నది, పరప్రకృతి లేక విద్యకు క్రింది మెట్టు. ఈ తత్త్వములను సరిగా కనుగొనని యెడల గీతలలోని వేరువేరు అంశములలో విరోధము కలదని తోచును. మరియు గీతలు చెప్పిన భాగవత జీవన రహస్యము ఎరుక పడదు.

శ్రీ అరవిందుల తపస్తేజము గీతావ్యాఖ్యానముగను [Essays on Gita] – భాగవత జీవనముగను [Life Divine] – మహాయోగముగను [Synthesis of Yoga] – మూడు స్రోతవల ప్రవహించెను. అందు మన మిపుడు భాగవత జీవనమను గంగాఘట్టములోనికి దిగుదము.

'ప్రపంచమునం దెల్లెడలను చిచ్ఛక్తి ప్రచ్ఛన్నముగా నున్నది. అటు లయ్యును అది సక్రియము. అది అతీంద్రియమగు ప్రకృతి రహస్యము." కాని, సృష్టికి చిచ్ఛక్తి మూల మను సంగతిని మనస్సు సాజముగా ఒప్పదు. ఏల ? మానవులకు దాని కనుగొనగలిగిన సహజదృష్టిగాని, దివ్యదృష్టిగాని లేదు. కొన్ని కొన్ని చోటుల కార్యమును బట్టి కారణమును కనుగొనగలిగిన అవకాశమే యున్నది. మానవు డీ తర్కబుద్ధితో ప్రపంచముగాని, తన్నుగాని పరిశీలించి, చైతన్యమని యొకటి యున్నదని కనుగొనలేడు. మానవునిలోగల చిదాభాసుని యెడ దృష్టి ప్రసరింపజేసితి మేని అది ఒక వెలుగు చీకటుల వింత యాటగా కనుపట్టును. ఇక ప్రపంచము దెస జూతమా, అది యంతయు చావు పుట్టువుల పునరావృత్తి. సృష్టికి అనంతమగు చిచ్ఛక్తియే – Infinite Consciousness Force – మూలమగునేని అది రాలలోను, రప్పలలోను, అణువులలోను, పరమాణువులలోను, మరి యెల్లెడలను కనుబడి తీరవలెను. అది మనకు కనబడకపోగా ఈ ప్రపంచమునకు అనంతమగు ఒకానొక అచేతనము – Infinite Nescience – లేక బ్రహ్మాండములను మింగు నొకానొక శూన్యము మూలమనియు, అనగా ఈ సృష్టికి పూర్వము సూర్యుడుగాని, చంద్రుడుగాని, నీరుగాని, నిప్పుగాని, గాలిగాని, ధూళిగాని లేదనియు, జడప్రపంచం బీజ మీ అచేతన శూన్యముతో నారంభమై, శబ్ద స్పర్శ రూప రస గంధ వికారమగు బ్రహ్మాండ పద్మముగా వికసించెననియు తోచును. ఈ స్థూలప్రపంచ మిటు లావిర్భవించుటకు ఎన్ని కోట్ల కోట్ల యేండ్లు పట్టెనో, అటు పిమ్మట ఎంత కాలాంతరమున ఈ స్థూలరూప మాధారముగా ప్రాణము, జీవకణము, జీవ దేహము మొలకెత్తెనో, ఎంతెంత కాలము కడ చనిన పిదప ఈ జీవదేహ మాధారముగా మానస చేతన స్ఫురించెనో ఎవరు చెప్పగలరు ? ప్రకృత పరి

ణామ ప్రక్రియ, లేక యీ ఆరోహణక్రమము ఇచటనే ఆగక బలపడి యింకను కొత్త కొత్త భూమికలకు ప్రాకువెట్టు దారిలో నున్నయటుల చూపట్టును. కావున ఏ దినుసుతో ఈ ప్రపంచ మారంభమాయెనో, ఆ దినుసు మనకు కనబడకున్నను, తెలియకున్నను సద్వస్తువే కావలయును గదా. అదియే అనంత శాఖలతోడను, ఉపశాఖలతోడను దేశకాలములగూడ గర్భీకరించుకొని యీ బ్రహ్మాండమునకును, ఇట్టి బ్రహ్మాండ సహస్ర సహస్రములకును మూలము కాదా? ఇట్టి అభిప్రాయముతో దానిని సత్తని అనినను, అసత్తని అనినను తేడా లేదు. విచిత్రమగు నీ ప్రపంచమునకు ఈ అసత్తే (సద్ + భిన్నము) కారణమని నమ్మించగల సంచారముతోగూడ మానవ మనస్సు సంఘటితము కాలేదు.

ఈ ప్రపంచమునకు దేశము కారణమని కొందరును, కాలము కారణమని కొందరును, నిత్యమును విరివియగుచుండు పదార్థము కారణమని మరికొందరును చెప్పుదురు. కాని యీ మాటలే సిద్ధాంతములని మన మనస్సు నమ్మజాలదు. అది యటుండె. జగద్రహస్యమును జెప్పుమతము లెట్టివయినను, అవి యన్నియు నీ జగన్మూలము అవాఙ్మానసగోచర మనియు, అనిర్దేశ్యమనియు, అప్రమేయ మనియు అంగీకరించును, కావున, ఈ మూల తత్త్వము అనంతమగు సత్తుగాని, అనంతమగు అసత్తుగాని, నిత్యమును వృద్ధి చెందుచుండు పరిమేయ పదార్థము గాని యగుచో, నీ మూటిలో నెటులో ఒకటులు చెప్పదగిన విశేషముగాని లక్షణముగాని లేదేని, అట్టి అవిశేషమునుండి విలక్షణమునుండి నిర్గుణమునుండి విశిష్టమును, సలక్షణమును, గుణముగాని సగుణమునగు నీ ప్రపంచ మెటు లుద్భవించెను ?

జడవిజ్ఞాన మిటులు చెప్పును - 'ఈ ప్రపంచమునకు ఒక మహాశక్తి- Energy - కారణము. దాని స్వరూపము నేటికిని విశదముగా తెలియదు. అది ప్రత్యక్షము కాదు. కార్యమును బట్టి యిట్టిశక్తి యొకటి యున్నదని యూహింప వలెను"

కొన్ని చిల్లర తత్త్వములు గూడ ఇంద్రియ గ్రాహ్యములుకావు. వానిని పెంచుటకు ప్రమాణములేదు. ప్రమాణము లేకున్నను జడవిజ్ఞానము వీనిని

పాటించును. కేవలమ్ము కల్పనా సాహాయ్యమే వీనికి ప్రామాణ్యము. కొండమీద పొగ లేచుచుండుట చూచి, కొండలో నిప్పుకలదని ఊహింతుము. వంటింటిగాని, మరియొకటిగాని నిప్పును పొగనుగూడ మన మెరుగుదుము. వీనిలో నిప్పును గాని, పొగనుగాని లోగడ మన మెరుగమేని కొండలో నిప్పు కలదనియు, అది అగ్నిపర్వత మనియు మనకు తెలియదు. ప్రకృతమునందు హేతువగు ప్రపంచ మును మాత్రమే మన మెరుగుదుము. శక్తిని - Energy - ఎరుగము. ఎరుగ కున్నను ప్రపంచమునకు 'ఏదో' కారణ మొకటి ఉండి తీరవలయును గనుక, కారణమగు 'ఏదో' - అది 'శక్తి'యై యుండునని జడ విజ్ఞానము కల్పన చేయును. 'ఏదో' అనుదానికి 'శక్తి' యనునది ప్రత్యామ్నాయముగా కల్పన చేయబడెను - గావున, దీని ప్రత్యామ్నాయ కల్పన - Representative-fiction - అని అందురు. శక్తి - Energy - అనునది యీ తెగకు చేరిన తత్త్వము. శక్తి - Energy - ప్రపంచమునకు మూలము. దీని నుండియే జడాజడావిర్భూతి. జడమునుండి ప్రాణమును, ప్రాణమునుండి మనస్సును పరిణమించెను.

"అజ్ఞేయమును, అచేతనమును నగు నీ శక్తినుండి జ్ఞేయము, చేతనో పేతము నగు నీ ప్రపంచ మెటులు పుట్టుకొని వచ్చుచున్నది?" - అను శంక యీ సిద్ధాంతమునందును ఉండనే యున్నది. మిగిలిన మాట యటుండగా, చైతన్యము పుట్టుకొని వచ్చుటయే పరమాశ్చర్యము. చేతన లేని ఒకానొక అంధశక్తియే మూలతత్త్వ మగునేని, దీనినుండి వైధర్మ్యము కల చేతన నెట నుండి తెత్తము? గ్రుడ్డి పరమాణువునుండిగాని, గ్రుడ్డి ఎలక్ట్రానునుండిగాని ప్రకాశ స్వభావమును సహస్రముఖమును నగు ఎరుక ప్రవహించుననుటకు జడ విజ్ఞానములో సమాధానము దొరకునా? జడాణువులయు, తటి దణువులయు, తత్పరివారములయు జీవకోష్ఠములయు, గ్రంథులయు, లాలాదులయు చేష్ట షేక్స్పియర్, ప్లేటోవంటివారల మెదడులను సునిశితముచేసి వారలచే హామ్లెట్, సింపోజియమ్, రిపబ్లిక్‌వంటి ఉత్తమగ్రంథములు రచియింపజేయగల సామర్థ్యము నకు ప్రతిభువు కాగలదనుమాట విన్నదా, కన్నదా? మరి నమ్మదగ్గదా? కావున, జడవిజ్ఞానము ప్రపంచమునకు మూలతత్త్వమును గ్రహింపలేదని చెప్పి

నదో నది గడుగ్గాయి మాట కాదని అనవచ్చును. అవాఙ్మానస గోచరమగు నీ ప్రపంచ మూల రహస్యమును తెలిసికొనవలయుచో ఈ దారి దాటుట లగ్గు. జడ విజ్ఞాన మీ మూల ప్రశ్నముననే కాక, ఏతదంతర్గతములును, ఏతత్సదృశ ములును నగు పెక్కు సందియములను పోగొట్టజాలకున్నది.

సృష్టి మొదటి సోపానము మొదలుకొని నేటి చివర సోపానము వరకును స్తరము వెంబడి స్తరము లెటు లావిర్భూత మాయెనో పరిశోధింపవలెను. జడ విజ్ఞాన మెడతెగక పరిశ్రమించి పరిశ్రమించి వివిధములగు జడ వికాసములలో కార్యోత్పాదకములగు సంబంధములను, అదమనీయమగు బాహ్య వికాస వేగమును నిరూపించుచున్నమాట నిక్కమ కాని, ఏత దంతర్నిహితమగు తత్త్వము నది తెలిసికొనవలసియే యున్నది. ఈ అశ్వత్థము మొదట అలక్ష ణీయమగు నొక మహాశక్తి -An Indeterminate Energy- ఉన్నదని మన మెరుగుదుము. ఈ మహాశక్తి భూమికపై లక్షణీయములగు పెక్కు తత్త్వ ములు - General determinates - మనకు కనబడుచున్నవి. లక్షణీయము లగు ఆ తత్త్వములయు, శాఖాతత్త్వములయు, ఆధారమున విశిష్ట లక్షణీయము లగు - Particular determinates - పదార్థము లనంతముగా కానిపించు చున్నవి. ఒక తటిచ్ఛక్తి సాధర్మ్యం, వైధర్మ్య ధర్మోభయ శూన్యశక్తులతో ప్రకాశించి, అనుపదముననే తరంగములుగను అణువులుగను మారిపోవుచున్నవి. శక్తికృతమగు నొకానొక బాష్పావస్థ వేరువేరు బాష్పములను - Gases పెక్కింటిని పెట్టించుచున్నది. ఘనీభవించిన ఒక శాక్తావస్థనుండి భూతత్త్వము పొటమరించి పలుతెరగులగు మన్నులుగను, పెక్కు రకములగు రాలుగను, వింత వింత లోహములుగను వికాసమొందుచున్నది. ఈ రీతిగా సృష్టిలో స్తర స్తరమునందును ఒక స్తరమునుండి పెక్కు స్తరములును, గుణహీనములగు నవస్థ లనుండి గుణయుక్తములగు నవస్థలును ఉద్గమించుచున్నవి. ఉద్భిదము లందును, అండజములందును, జారుజములందును, స్వేదజము లందును, స్థావరములందును, జంగమముల యందును ఈరీతియే కనబడును. కాని యీ సృష్టిలో ఒక స్తరము నుండి భిన్న ధర్మములుకల వేరొక స్తర మెటు లుత్పన్నమగుచున్నదో, వేరువేరు తెగ లెటు లుద్భవించుచున్నవో మనతెలివి కావల. అవిశిష్టమగు నొక యవస్థనుండి విశిష్టమగు నొక యవస్థ విశిష్టావిశిష్ట మూర్తులతో నెటులు బయలుదేరుచున్నదో

యీ దేవ రహస్యమును జడవిజ్ఞానకోణమునుండి యించుకేని గ్రహింపజాలము. ప్రతిస్తరమునందును, ప్రతిక్షేత్రమునందును అసంఖ్యేయమగు నీ నానాత్వ వైచిత్రికి అవిచలమగు ఆ ఏకమే ప్రతిష్ఠ. దీనివలన ప్రకృతి మార్గ మిదియే యనుట నిశ్చిప్రచము. కాని యిది యెటులు సంభవ మగుచున్న దనునదియే అగోచరము. దేవరహస్యము. మరల మాటాడిన బ్రహ్మరహస్యము. దీని వెను వెనుక బ్రహ్మాండమగు నొక మనస్సో, సృజన శీలమగు నొక ఆలోచనా ప్రవాహమో, ప్రచ్ఛన్నమగు నొక యిచ్ఛాశక్తియో ఉండియుండును గాని వీనిలో నేదియు నీలోక పద్మమునం దే రేకునందును పట్టుపడదు. దీనికి జడ విజ్ఞానము చెప్పు ఏ సమాధానమును మనలను సందేహ విముక్తుల నొనరించి సంతుష్టుల నొనరింపలేదు. సృష్టిలీల నంతయు ప్రహతమగు నొక మార్గమున నియంత్రణ మొనరించుచున్న పరమరహస్యమునకు 'అంధశక్తి స్వైర ఖేల' - Dynamic Chance - యని బొడ్డు కోసి పేరు పెట్టుటయే తుది మాటయని యంగీకరించుటకు సహజముగనే మన మన సియ్యకొనదు. కుశలమగు నొక స్వైరాచారముగాని, కాకచమ్మలుగల ఒకానొక శక్తిగాని యీ సృష్టి ప్రవాహము నట్టడుగుననుండి జాత్యంధములగు ఆవర్తముల పాటుపోటులచే, ఘాత ప్రతిఘాత ములచే నీ విశ్వమును సృజించుచున్నదనుచో నిది యుక్తి సంగతము కాగలదా? - "అటులు కాదు; ఈ విశ్వమునం దెల్లెడలను కఠోరమగు యంత్రశాసన మొకటి చూపు నిష్ఠురమగు తర్జనీతర్జనము నీకనుల వ్రేలెడినే. అట్టిచో నిందు స్వైరాచారమునకుగాని, అంధశక్తికిగాని ప్రసక్తి యేద?" అని యడుగు నెడల ఇట నిది గమనింపదగినది. సృష్టి ప్రవాహములో రెండు పాయలున్నవి. ఒక పాయలో సమస్త విధులను, సమస్త నిషేధములను బాంధవ శాత్రవములను ఏట గలిపి, అపరాని వడితో కొండలను బదాబద లొనరించు స్ఫోటప్రయత్నము కన బడును. కానలు, కోనలు గానక గిరగిర తిరుగు నీ సుడిగుండము నడుమ చూపుబరపుదు మేని, దీన నొక నియమముగాని నీతిగాని లేదనియు, నిది యొక యంధశక్తిచేయు నున్మత్త హాల్లిసకమనియు తోపకమానదు. మరియొక పాయ దెస తల తిప్పితిమేని, అందు జంత్రపు కట్టుబాటువంటి దిట్టమగు కట్టుబాటొకటి నిక్కచ్చిగా జరగిపోవు చున్నటులు కనబడుచుండుట వలన ఈ ప్రపంచము వెనుక ఎవడో ఒకానొక గొప్ప జేరిక అనపొడుచుచుండుట లేదు కదా అని

యనిపించును. కావున అదృష్టవాదముగాని - Theory of Chance - యంత్రశాసనముగాని - Theory of Mechanical Necessity - సృష్టి రహస్యమును విడదీయు వ్యాఖ్యాన మెంతయును కాజాలదు. వేయివిధములగు నీ విశ్వలీల వెనుక అంధమగు అచేతనము - Nescience - ఉన్నదని గాని మరి యొక రీతిగా ఈ విశ్వమునంతయు జాత్యంధమగు నొకానొక యంత్రశాసనము నడపుచున్నదనిగాని చెప్పిన యెడల మనసు శాంతి చెందునా ? చేతన లేని యీ గుడ్డిశక్తినుండిగాని, యీ యంత్రశాసనమునుండిగాని చైతన్య మెటులు ఉప్పతిల్లెనను శంక క్రమ్మరగ్రమ్మర తల యెత్తుచునే యుండదా ? ఈ ప్రశ్న మునకు సరియగు సమాధానము వలయుచో వెలిచూపుల కీ ప్రపంచకారణ మొక అచేతనమని తోచినను, లోజూపునకు మాత్ర మీజడమునందే చేతన పేరు కొనిపోయి యున్నదనియు. అది అనంతమనియు, దాని వికాసక్రమ మసాధారణ బలోపేతమనియు తోపదా ? కావున నేటి వైజ్ఞానికులు వెనుకటి మతము మార్చు కొని కొత్తరీతిగా జడమును పరిశీలింప బాటుపడుట కనుగొనుచున్నాము. ఇపుడు వారు జడములో చేతనము నాహ్వానించి, దానిచే 'ఓ' యని యనిపింప గలమని ఆసాసల పొలగుచున్నారు. 'జడము ఇక జడమే యని ఎంతోకాలము మన మనుకొన'మని సుప్రసిద్ధ వైజ్ఞానికు డొకడు సంభావించుచున్నాడు. 'సదృశావస్థలో సదృశాచరణము జడవస్తువునకు స్వభావము - All Phenomena behaves similarly under similar circumstances - అను పూర్వ సిద్ధాంతమునకు భిన్నముగా "తటి దణువులకు సదృశావస్థలో విదృశా చరణము కలదనియు, ఇవి ఇచ్ఛాశక్తిగల పదార్థము లనియు, జడము ప్రసుప్త మగు చేతన యనియు - Concealed Consciousness - మరియొక వైజ్ఞానికు డూహించుచున్నాడు. కాగా, జడమని చేతన పొందిన సుప్తావస్థతో గూడుకట్టిన ఒకానొక పదార్థము. అనగా జడము నిశ్చేతనముగా పయిపయికి కనబడినను దీనిలో చేతన ప్రచ్ఛన్నముగా నున్నదని నేటి వైజ్ఞానిక మహా మహోపాధ్యాయులు తలచుచున్నారు. వీరి యూహల నంగీకరింపనివారు లేక పోలేదు గాని యీ విషయము లన్నియు వినగా కనగా, జడమునకును చేతనకును ఇంత కాలమునుండియుగల పగపోయి చెలిమిగలుగు అడియాలము పొనపొన కాని పించుచున్నది. ఈ రీతిగా నేటి వైజ్ఞానికుల సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనమువలన

ఒక కొ త్తదారి ఏర్పడినమాట నిక్కవమే కాని, యిది చీకటిలో వెలుగునకు వెతుకులాడు చందము. ఋషులు జడములో అనంతమగు చైతన్యమును కనుగొనిన వైఖరి యీ వైజ్ఞానికుల బాహ్యదృష్టి కెటులు పట్టుబడును? జడమును విడగొట్టి వీరు చూపనెంచిన సంవిత్ స్వరూపము అజ్ఞేయము. అవచేతన కనురూపమగు నొకానొక ఛాయ వారికి దొరకవచ్చునేమో కాని, సరియగు దాని స్వరూపము జడవిద్యాలవాలమున కావలనే యుండునని తోచును. కావున నీ జడవిజ్ఞానుల ప్రయోగాగారమునుండి వెలువడి, వేరొక దారి బట్టనిచో ఈ జగద్రహస్యమును కనుగొనగల మను నాస పేరాస.

నేడు ప్రపంచమున మనో విజ్ఞానము - Psychology- అను శాస్త్రము పెరిగినది. పెరుగుచును ఉన్నది. అది బాహ్య విషయములతో మనస్సునకు గల స్థూల సంబంధములను పరిశీలించును. అనగా-దీని పరిశీలన మెంత సేపును విషయగతము - Objective. ఈ శాస్త్రము మనస్సునకు దేహ యంత్రము తోడను, విశేషించి స్నాయు మండలము తోడను అవినాభావ సంబంధము కలదని నిరూపించును. శారీరక-మనోవిజ్ఞానమును - Physiological Psychology ప్రవృత్తి మనోవిజ్ఞానమును - Behaviouristic Psychology - పై విషయములలో ధురంధరములు జడమగు మనస్సు - Physical mind- సమగ్రమగు దేహ క్షేత్రమున చేసికొనుచు బోవు తటిత్ఖేలను మనమిపుడు అతిమాత్రముగా దీనివలన నెరుగుదుము. మనో దేహములు రెండును 'ఎవరికి వారే యమునా తీరే' అని తొల్లి మనమనుకొనుచుంటిమి. ఇపు డీ శాస్త్రము ప్రసాదించిన వెలుగువలన ఈ రెండును సన్నిహిత జ్ఞాతులని మనకు తెలియుచున్నది. ఇంతియకాక మనో విజ్ఞానమునకును, ప్రత్యక్ష శారీరమునకును - Physiology గాఢ మైత్రి కలిగి నటులు మనకు తెలియుచున్నది. అది యటుండె. ఇపుడు జడ విజ్ఞాన మొక పెడ, ఆధ్యాత్మికమగు తేజో మార్గము దెస మెల్లమెల్లనా నడుగులు వెట్టుచుండగా, మరియొక పెడ మనో విజ్ఞానము జడములో తానెచట నున్నదో తన యా యునికిని వెతకుకొనుచు బోవుచున్నది. ఇంత సిరిసంపదలున్నను ఆధునిక మనోవిజ్ఞాన మాంతర ప్రపంచనాభికి కడు దవ్వుగనే యున్నదని చెప్పక తప్పదు. ఇది విషయ నిమగ్నమైనంతవరకు దీని స్వస్వరూప మెరుగగల శక్తి ఉప్పతిల్లదు. యజ్ఞదత్త, విష్ణుదత్తాదులతో గల సంబంధమువలన దేవదత్తునిలో జరిగిన పరివర్తన మాత్రమును నిర్వచించినందువలనగాని, అతని వ్యుత్పత్తి నిమిత్తమును నిర్ణయించినందువలనగాని దేవదత్త చరిత్రము సమగ్రము కాదు. ప్రవృత్తి నిమిత్తము, దేవదత్తత్వమే దేవదత్త చరిత్రలో సారము. దీనికి పరాఙ్ముఖత పనికిరాదు. ప్రత్యఙ్ముఖత తోడనే పని. అది యీ మనోవిజ్ఞానమున ఉండదు. మనస్తత్వము తెలియవలయు వారికి యోగమే అవలంబము.

ప్రత్యక్షానుభవము వలన జగన్మూల కారణము తెలియబడదు. అపరోక్షానుభవమువలన ఈ జగమునకు మూలము చేతన యని తెలియనగును. అది చిన్మ

యమగు మహాశక్తి. విచిత్రశక్తి ఖచితమును, సర్వజ్ఞమును, సర్వేశ్వరేశ్వర మును అగు దాని అభివ్యక్తియే యీ బ్రహ్మాండము. అనంతమగు ఆ చైతన్యము నందే, ఆ సత్తునందే యీ బ్రహ్మాండముల సృష్టి స్థితి లయమున తౌర్యత్రికము. ప్రకృతి లీలలలో మన కగపడు గణితశాస్త్ర మా చిన్మయ పురుషోదితమే. ఈ ప్రపంచము నందలి రూప సౌందర్య మంతయు, రసానందమంతయు అతని ఆనందచ్ఛాయయే. అతడు బ్రహ్మాండాతీతుడై - Extra Cosmic Divinity- బ్రహ్మాండ యంత్రమునకు వెలుపట నుండి - Dues exmachina - ఈ ప్రపంచమును నడుపుచున్నచో ఈ ప్రపంచాతీతుని ప్రపంచములో వెతకుట వృథా. సృష్టియందలి పొరపొరలోను గణితశాస్త్ర ప్రక్రియలో కనబడు కచ్చిత మగు నియమముల బోలు నియమములు కనబడుచుండుటచే ఒకానొక సర్వజ్ఞుడు దీనికి కారణమని స్వీకరించుట యుక్తిసంగతము కాకపోదు. కావున నితడు విశ్వాతీతు డయినప్పటికిని విశ్వమయుడును కావచ్చును. అణువణువు నందును ఆ మహాశక్తి ప్రచ్ఛన్నమయి యుండవచ్చును. కావున అది మన ప్రత్యక్షాను భవమున కావలగను ఉండవచ్చును. విచారించి చూచినచో ఈ యూహయు యుక్తికి దూరమని చెప్పుటకు వీలులేదు. ఐనను ఈ మతమునందును ఈ సంది యము ఉండనే యుండును - ఈ బ్రహ్మాండ లీలయంతయు చేతనాభివ్యక్తియే యగునేని, దీనిలో నింత దుఃఖ మేల కనబడగలదు? ఈ దుఃఖము, ఈ కష్టము, ఈ జర, ఈ మరణ మింతెందులకు? ఇది యంతయు చూచి "ఓ భగవంతుడా! నీ యిచ్ఛాశక్తినంతయు నీ తలనే తాల్చి నీ దారిన నీవు లేచిపో; మమ్మొలను చంపకు." అని ఆక్రోశింపవలయునని తోపకుండునా? "ఈ కనబడున దంతయు బ్రహ్మమే, అంతయు అతని సృష్టియే." అని మాటిమాటి కనుట మనకు మామూలే కాని, ఎటు లిది నిష్పన్నమాయెనో, ఈ రెంటి నడుమగల హద్దుపద్దు లేవియో దొరికినచో జగద్వ్యాపారమును, జగన్మూలమును తెలిసికొనగలమని ఆశ పెట్టుకొనుట వలన ఏమియు ప్రయోజనము లేదు. ఈ జగత్తులోగల అజ్ఞాన మును, అభావమును, దుఃఖమును ఒకానొక మహాభావము, ఒకానొక మహాజ్ఞానము ఒకానొక మహానంత మావిష్కరించుచున్నదనుట మేటి యుక్తి?

ఇచట మాయావాదులు కొందరు 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా' - బ్రహ్మము నిక్కము, జగత్తు కల్ల. జీవజగత్తులు మాయాకల్పితములు. వీనికి

సార్థకత లేదు. బ్రహ్మమొకటియే పరమార్థ సత్త. అది నిర్విశేషము. నిర్గుణము, నిరాకారము. ఈ జగత్తు మిథ్యయని తెలిసి బ్రహ్మమునందే నిర్వికల్ప సమాధి గొనుట పరమార్థము - అని సాధారణముగా చెప్పుదురు. వీరి మతమున బ్రహ్మము నేతి నేతి బోధ గృహీతము. అనగా బ్రహ్మము నేలకాదు, నీరుకాదు, నిప్పుకాదు, గాలికాదు, మిన్నుకాదు - అను నీ మొదలగు వేరిమి ఎరుకచే - **Complete negation of all realities**-తెలియదగినది. నిర్విశేషమగు ఆ తత్త్వమునకు - **A featureless absolute** - ఎట్టి వికారమును అనగా మార్పును పొనగదు. కావున సవిశేషమగు నీ జగత్తు నిర్విశేషమగు వస్తువు నుండి ఎటు లుద్భవించును? బ్రహ్మము 'ఏక మేవా ద్వితీయమ్' రెండవది లేని ఒకటియే. కావున నామరూపాత్మక మగు ప్రపంచమెల్ల మిథ్య. జీవు డవిద్యకు లోనయి మిథ్యాప్రపంచమును నిక్కమని తలచుచున్నాడు. లో జూపుచే ఎరుక గలిగిననాడు మాయ తొలగుడు ప్రపంచ ముండదు. ఈ ప్రపంచ మొక కల. జీవుడు కలలో గాంచిన దానిని నిక్కమని చూచును. మేలు కాంచినంతనే కల్లయని తెలియును. ఆ చందముగనే మాయామోహితుడగు జీవుడు ప్రపంచమును నిక్కమని తలచును. మాయాపాశము తెగినంతనే మిథ్యయని తెలిసికొనగలడు.

మాయావాదు లీ ప్రపంచమును మనకు మ్యూఘూలుగా కలుగు భ్రాంతులతో జమ కట్టుదురు. వానిలో రజ్జుసర్ప భ్రాంతి యొకటి. త్రాటిని జూచి పాముని భ్రమయు, వానికి తోడు అజ్ఞానము యొక్క ఆవరణ శక్తిచే ఆవరింపబడుటు దానియే విక్షేప శక్తివలన పాముగా కానిపించును. ఇది భ్రాంతి మూలకము. ఈ యవస్థలో నున్నవానికి పాము ప్రత్యక్ష సత్యము. భ్రమ తొలగినంతనే అతడు త్రాటిని జూచును. ఈ చందమున అవిద్యావశుడగు జీవునకు సత్యవస్తు వావృతమయి పోవును. ఆ స్థలమున మిథ్యా ప్రపంచము కనబడును. కాని ఎరుక కలిగినంతనే అవిద్య నశించుడు తొల్లి మిథ్యా ప్రపంచము కనబడ్డ చోటి భూమ, లేక బ్రహ్మము కనబడును. అపుడు జీవజగత్తు లుండవు.

మరు మరీచిక మరియొక భ్రాంతి. ఎడారిలో ఎండవేళ నడచు తెరువరికి పొనపొన ఎండమావులు కానిపించును. ఆ యెడారిలోగాని, దానికి దాపులగాని జలము లేకున్నను చెరు వున్నటులు కనిపించును. ఆలి చిప్పను జూచి వెండి

రేకని అనుకొనుటయు ఇట్టి భ్రాంతియే. కావున జీవ జగత్తులు మనకు ప్రత్యక్ష సత్యములుగా కనిపించినను ఇవి మాయా కల్పితము లనియు, బ్రహ్మమే సత్య మనియు, ఆ బ్రహ్మమునం దివి యారోపితము లనియు మాయావాదుల ఆశయము.

జీవ జగత్తులు మాయాకల్పితము లేనా? సృష్టి రహస్య మిదియేనా? ఈ ప్రపంచ మా యీశ్వరుని ఐశ్వర్యములలో ఒకానొక ఐశ్వర్యము కాదా? నేటి మన అవిద్య క్రమక్రమముగా ఆత్మజ్ఞానము దెస పురోగమించుట లేదా? మరియు జడము నాశ్రయమున పరిపూర్ణ సచ్చిదానందాభివ్యక్తియే యీ సృష్టి కుద్దిష్టము కాదా? ఈ ప్రశ్నములకు సదుత్తరములు వలయునేని మాయావాదుల పై యుక్తులు పరీక్షణీయములు.

కలతో పోల్చినను ప్రపంచమును ఉహ్వాని ఊదివేయుటకు వీలులేదు. ఏలన కలలోని వస్తువులన్నియు ఉత్తవికావు. లో జూపును దవ్వులకు బరప గలిగినచో స్వప్నములందు కలుగు వింతల కభినవమగు నొక సంగతియు, తాత్ప ర్యమును కానవచ్చును. కలలలో కలుగు నతీంద్రియ స్పర్శల ననేక సమయము లలో కల్లలని యనుకొనుట కలదుగాని అవి నిక్కములే! దాన, ప్రపంచ మొక కలయని త్రోసి పారవేయుటకు వీలులేదు.

రజ్జు సర్ప దృష్టాంతము కూడ సరియైనది కాదు. త్రాటిపై పాము లేకున్నను పామసలు మిథ్యా వస్తువుకాదు. చూపు పడినచోట పాము లేకపోయి నను పా మొక సత్యవస్తువు. మన మొకపుడు దాని నెరుగుదుము. కావుననే సమయాది విశేషముల వలనను భ్రమ పొందుదుము. అవిద్యాప్రభావమున జీవుడు బ్రహ్మముపై ప్రపంచము నారోపించి, సత్యముగా గ్రహించునేని ఎచట నీ ప్రపంచమును మనము చూచుచున్నామో, అచట నది లేకున్నను సత్యమగు ప్రపంచము ఎచటనో ఒకచోట పామువలె నుండి తీరవలయును కదా. కావున దృష్టాంత దార్ష్టాంతికములకు తౌల్యము లేదు.

మరు మరీచికా దృష్టాంతముకూడ సరికాదు. ఎచటనో ఒకచట, కడు దవ్వులనే యగుగాక, చెరువులు కలవు. అవి కాల్పనికములు కావు. కావున ప్రపంచమును మిథ్య యని త్రోసివేయుటకు తగిన కారణము కనిపించదు.

ఈ తెగకు జెందిన మాయావాదులు కొందరు జీవజగత్తులు రెండును మిథ్యయగునేని, మాయ యెటులు సత్యమగును? జీవుడు మిథ్య యగుచో బంధ మెవరికి? మిథ్యా వస్తువున కసలు బంధ మెటులు? మిథ్యాబంధమునుండి ముక్తి వడయుట కర్థమేమి? ఇంతియకాక, యీ ప్రపంచ మసత్యమను నను భవముగూడ నేల మిథ్య కాదు? మరియు నీ మాయావస్తు వెటనుండి దిగెను? బ్రహ్మమునుండియే దిగినచో నిది మిథ్య యగు టెటులు? మరియు నా మాయా ప్రభావముచే కేవల మసత్య వస్తు దర్శన మెటులు తటస్థించును. కాన నీ మాయము మిథ్యయగునేని, జీవజగత్తు లీ మిథ్యామాయా కల్పితములేని, యీ మాయాశరీరమునందు మాయోపహతమగు మనస్సులో తురీయమగు నా సత్తాను భూతియు, మాయాకల్పిత మేలకాదు?' అని యీ మొదలుగా శంకించుకొని అజాతవాదాది వాదములను వెలువరించిరి. వాని యాశయ మిది— "ఈ ప్రపంచ మిదివరకు లేదు. నేడును లేదు, రేపును ఉండబోదు. ప్రపంచ మసలు సృజింపబడనే సృజింపబడలేదు. ఈ మతమునందు కనిపించు నీ మిథ్యా ప్రపంచము బ్రహ్మమునం దెటు లారోపితమాయె"నను శంకకే ఆస్కారము లేదు. బ్రహ్మముతో మాయ కెట్టి సంపర్కమును లేదు. మాయ బ్రహ్మము నుండి పుట్టలేదు. మాయ వేరే ఒక వస్తువు - అని చెప్ప వారున్నారు. వీరు 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ.' ఇది యెల్లయు బ్రహ్మము - అని ఒక మూల చెప్పుచు, మాయ బ్రహ్మమునుండి పుట్టలేదు, ఇది విడి వస్తువు అని యను టెటులు సమంజసము? ఈ రీతివాదమువలన అసలు సంగతి మూలకొదుగుటయే ఫలము. పై జెప్పబడిన మాయావాదులలో శంకర భగవత్పాదు లొకరు. వా రతిసూక్ష్మబుద్ధితో చేసిన సృష్టి రహస్య వ్యాఖ్యానము దార్శనిక ప్రపంచ మున సుప్రసిద్ధము. వారిది విశిష్ట మాయావాదము - Qualified illusionism.

శంకరులవాదము జీవజగత్తులను రెంటిని ఊదివేయదు. శంకరులు వ్యావహారిక సత్యము, పారమార్థిక సత్యము - అను రెండు సత్యములను జెప్పి జీవ జగత్తులకు వ్యావహారిక సత్యత్వ మంగీకరించిరి. కావున వారి మతమున జగత్తున కాంశిక సత్యత్వము కలదు. కాని ఆత్మజ్ఞానము కలిగినంతనే జగత్ ప్రవాహ మెండిపోవును. బ్రహ్మ మొకటియే సత్యమని తెలియును. 'అహం

బ్రహ్మాస్మి'- నేను బ్రహ్మమును - అనుమాట నిక్కమయినను జీవుడు మాయోపహతుడయినంతవట్టు తన స్వరూప మెరుగజాలడు. నామరూపాత్మక మగు నీ ప్రపంచ మతనికి సత్యము. మాయాపాశము తొలగగనే అతడు తురీయమున కలిసిపోవును. మరి యచట ప్రపంచ మేమియు నుండదు. నే డీ దేశకాలముల హద్దులలో ఈ ప్రపంచము సత్యమయ్యు, మాయాసీమ దాటగనే దీని క స్తిత్వ ముండదు. (భేదాభేద విచారము పునాదిగాగల) వ్యావహారిక దృష్టితో ఈ ప్రపంచమును జూచుచున్నాము. కావున పై సాదృశ్యమున మనకు ఇంచుకయు సాదృశ్యోపలబ్ధి కలుగదు. ఒక్క పరమార్థ దృష్టిచేతనే మన మీ జీవజగత్తుల ప్రకృత స్వరూపములను చూడగలము. పలురకములగు కుండల యందును, నగలయందును మట్టి యునికియు బంగారపు టునికియు ఏకమాత్ర సత్యమయినటులు నామరూపాత్మకమగు నీ జగదంతరాళమున ఆ పరబ్రహ్మమే ఏకమాత్ర సత్యమని తెలియగలము. ఈ ప్రపంచోద్భవ ప్రలయముల మూల మున, ఈ నిర్విశేష నిర్గుణ బ్రహ్మమే సత్యము, సనాతనము. మాయనుండి పరి త్రాణము పడయుటయే చరమ లక్ష్యము. ఇది శంకరుల మతము. కాగా శంక రుల మతమున జీవ జగత్తులకు అసత్య సత్యత్వము - Unreal reality - కలదు. అనగా అవి మన యజ్ఞానమునకు సత్యములు. సరియగు నే జ్ఞానమునకేని అస త్యములు-real to our ignorance, unreal to any true knowledge-- శంకరుల వాదమున జగత్ బ్రహ్మముల నడుమగల ఏకాంత విరోధమే వ్యక్త మగును. శంకరులు సృష్టికిగల ప్రకృతోద్దేశమును గాని, సార్థకతాదులనుగాని స్పృశింపలేదు.

మాయావాదుల పై దృష్టి భంగియంతయు పురాతన వేదాంత విచార ధార న్నాశ్రయించుకొని యున్నదేకాని యిది ఒక ఆంశిక సత్యము. అది ఒకానొక భావమాత్రము. అది బ్రహ్మమును అభావాత్మకమగు బోధముచే గ్రహించి, బ్రహ్మ ప్రపంచముల ఏకాంత విరోధమును స్థాపింపబూనుకొనెను గాని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' - ఇది యెల్లయు బ్రహ్మమే. అనగా జీవ జగత్తులు ఆ యీ బ్రహ్మస్వరూపము నుండి క్రమముగా అభివ్యక్తమాయెను. బ్రహ్మ మొక నిర్వి శేష సత్తామాత్రమే కాదు. అది సంపూర్ణ భావాత్మక బోధచేతను గ్రహింప

ధికనదే, కాక - యీ రెంటినిగూడ అతిశయించినది - It is both a supreme negation and supreme affirmation and transcends both.

ఉపనిషత్తులందలి చతుష్పాద్ బ్రహ్మవర్ణనమును గ్రహించిన యెడల వీనసి ప్రవాహమును కొట్టి వేయుటకు వీలులేదు. మాయావాదులకు జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడును నిద్రయే. జీవుడీ మూడవస్థలయందును నిద్రితుడే. లెనగా ఈ యవస్థాత్రయము నందును అతనికి తత్త్వోపలబ్ధి లేదు. జాగ్రత్ స్వప్నములు నిద్రకంటెను ఎక్కువ దోసగులు. ఏమన, ఈ రెండిటి యందును తలకు తత్త్వమును వేరుగా చూచును. కాని యిట్టి వ్యాఖ్య యుక్తముకాదు. 'సర్వం హ్యేతద్ బ్రహ్మ, అయ మాత్మా బ్రహ్మ, సోఽయ మాత్మా చతుష్పాత్'- ఇది యెల్లయు బ్రహ్మము. ఈయాత్మ బ్రహ్మము, ఆ యీఆత్మ చతుష్పాత్తు'- అని ఈ యుపనిషత్తు ముమ్మొదటనే చెప్పెను. దీనిని విడబరచి చూచినచో, మాయ కెచటను తావు దొరకదు. ఇందలి తృతీయ పాద 'మన్నిటికిని కారణము' - Contains the seeds of creation-ఇచటి సుషుప్త్యాద్యవస్థలు ప్రతీకములు. నిద్రతో సామ్యము పెట్టుట భ్రమ ఇది ధ్యానమగ్నుడును సమాధ్యవస్థితుడును అగు బ్రహ్మ అవస్థ. కాని నాడిది యెల్లయు బ్రహ్మమే, ఈ యాత్మ బ్రహ్మము, ఆ యీ యాత్మ చతుష్పాత్తు - అను నీ మాటల కన్నిటికిని తాత్పర్యము పొస దు. మరియు బ్రహ్మ యొక నిర్విశేషతత్త్వమైన జగద్విరోధము సాధించును. ఎవో యొక ఆధ్యాత్మికాభిజ్ఞతలో ఈ రీతిగా భాసించినను, బ్రహ్మ చైతన్యము నం వెడి యొక ఆంశిక సత్యము. ఇదియే పరమసత్యమని గ్రహించుట భ్రమయే యగును. కేవలము 'ఇది కా దిది కాదులతో' బ్రహ్మమును వ్యక్తము చేయ వీలుగాదు.

నిర్గుణ, నిర్విశేష, నిరాకార, క్షర, అక్షరాది నామములను బట్టి బ్రహ్మ మునకు గుణములేదని కాని, ఏ యాకారము నతడు పొందలేడని గాని అర్థము చెప్పరాదు. గుణాకారాదులు బ్రహ్మమును సీమాబద్ధము జేయలేవనియే వీని తాత్పర్యము. అనంత గుణములను వ్యక్తము చేసినను, బ్రహ్మ చైతన్యమునం దింకను అనంత గుణములకు సంభావ్యత కలదు. అత డెన్ని రూపము లెత్తినను ఇంకను ఎన్నియో రూపముల నెత్తగలడు. ఏ గుణమును, ఏ రూపమును, ఏ

ధర్మమును అతనిని రిక్తుని జేయలేవు. కావుననే నిర్విశేష, నిర్గుణ, నిరాకార, నిరంజనాది పదము లతని అసామర్థ్యమునకు పరిచాయకమ్ములు కావు. మట్టితో ఎన్ని కుండలు చేసినను, మరియెన్నియో కుండలకు మట్టి యుండదా? బంగారముతో ఎన్ని నగలయినవో, మరి బంగారమునకు కరవా? కుండలయు, నగలయు ఆకారములు, మన్ను బంగారములలో అనంత సంభావ్యతా రూపముగా నున్న చందమున అనంత గుణములును, అనంత రూపములును, అనంత ధర్మములును బ్రహ్మ చైతన్యమునందు సంభావ్యతా రూపముగా నున్నవి. నిర్గుణ సగుణ సాకార నిరాకారాది పదములు మానస చేతనలో పరస్పర విరుద్ధము లయినను ఇవి పరమ సత్యమును కాకితమున ఆవలి యీవలి వైపులు. బ్రహ్మ వస్తువునందు వీనికి ప్రకృత విరోధమేమియులేదు. ఈ చందముగనే ఏకానేకముల యెడ మానస చేతనలో తోచు విరోధమును బ్రహ్మమునం దారోపింపరాదు.

'పలు తెగల నగలలో బంగారమే ఒకే ఒక సత్యమయినటులు, ఈ నామ రూపాత్మక ప్రపంచమున యీ బ్రహ్మమే ఒకే ఒక సత్యము.'-అని యనుట కర్థమేమి? బంగారము సత్యవస్తువగుచో నగ మిథ్యావస్తు వెటులగును? వికాస విలయములు కలిగినంత మాత్రమున ఆకారము గూడ మిథ్యయనుటకు కారణము లేదు. "అగ్ని ర్విస్ఫులింగః, అగ్ని రేవేతి" నిప్పులు అగ్నియే. కనుకనే ఆ బ్రహ్మ చైతన్యమునుండి యేది పుట్టినను, అది ఆ బ్రహ్మ చైతన్యముయొక్కయే ఆంశిక సత్యము. అది అసత్యము కాజాలదు.

అచ్చ అద్వైత వాదమున బ్రహ్మమును తప్ప వేరొక తత్త్వమును స్వీకరించుటకు వీలులేదు. ప్రపంచమునం దెయ్యది వికాస మందినను అద్దాన నద్దాన చేతన సత్త లేకుండ నుండదు. అది వికారము వడయక విచిత్రమగు నీ ప్రపంచమునందు వివర్త ప్రవాహమున బడి, లెక్కలేని రూపములతో వికసించు చున్నది. కనుకనే జీవ జగత్తులు రెండును దాని యొక్కయే ఆంశికాభివ్యక్తి. అనంతమగు నతని ఐశ్వర్యమునందలి ఒకానొక అంశమున కది పరిచాయకము. అదియే అద్వైత వాదము నందలి మూలతత్త్వము. ఈ చూపుతో చూచినచో లీలా జీవ వ్యక్తి రహస్యము తెలుసుకయగును. యుగ యుగాంతములనుండి ప్రవహించుచు వచ్చుచున్న వివర్తమునకు ఫలముగా ఇపుడు మనోమయు డగు

మానవు డుద్భవించెను. ఈ ప్రవాహ మింతటితో ఆగిపోదు. అది ఆ యీ ఆకీన వరమును గ్రహించుటకు-అనగా సాంతములో అనంత పరిపూర్ణాభివ్యక్తిని పొందుట కగ్రగసరమగుచున్నది. నే దవిద్యవలన కలిగిన చిన్న చూపులో నీ ప్రపంచము మన కెటు లగపడుచున్నదో, మానస చేతనలో మన మెంత సత్య స్పర్శ పడయుచున్నామో, అదియే సమగ్ర సత్యము కాదనుట నిర్వివాదము. మనస్సుచే ఆ విరాట్సత్యమును కనుగొనుటకు వీలులేదు. ప్రత్యగ్దృష్టిచే ఆత్మజ్ఞాన మొదవి బ్రహ్మైక్యము కలుగుచో సృష్టి రహస్యము తెలియును. అపుడు జీవ జగత్తులకు లోపము కలుగదు. కేవలము అహంతా సంపన్నమగు-ego centric సత్తకు లోపము కలుగును. మనము అవిద్యనుండి అజ్ఞానము నుండి ఆత్మజ్ఞానము, విశ్వ విజ్ఞానముల కెగబ్రాకవలసి యున్నాము. ఇది కల్పనా విలాసము కాదు. అవశ్యం భావి యగు సృష్టి పరిణామము.

"అసద్రూపమును, అచిద్రూపమును, దుఃఖరూపమునగు నీ జగత్తు సచ్చిదానంద బ్రహ్మ స్వరూపమును ప్రకటించుచున్నదని చెప్పుటేమి యుక్తి?" అను ప్రశ్నకు మాయావాదమువల్ల సందేహము పోలేదని తెలిసికొంటిమి.

చిచ్ఛక్తి విభిన్న భూమికల నుండి జడముగా అవతరించుటకు తన్ను సంకోచము చేసికొనినందువలన ద్వంద్వాజుష్టమగు సృష్టి యేర్పడెను. జగత్కారణమునకు సంకోచము, వ్యాకోచము అను రెండు ధర్మములు కలవు. చేతన మొకొక మెట్టే అవతరించుచు వచ్చిన కొలది సంకోచము చెంది చెంది, తుదకు జడములో తన్ను దా మరచిపోయెను. అచేతనమగు జడదమునం దిది దాగుకొనెను. ఇట్టి సంకోచ చరమసీమయందే జడోత్పత్తి. ఇచట సత్తు బొత్తిగా అసత్తాయెను. వెలుగు చీకటిగా గడ్డకట్టెను. ఆనంద మనానందముగా మారిపోయెను. దాని యేకత్వ మసంఖ్యేయములగు పరమాణువులుగా తునిసెను. చిన్మయమగు ఇచ్ఛాశక్తి కఠోరమగు యంత్రశాసనములో చెరపడెను. ఈ సంకోచము ముగియుడు, అచేతనమగు జడమునం దంతర్నిహితమగు చేతన ఒత్తిడివలన వికాసము లేక వివర్తము ఆరంభమాయెను. మొదట అవతరణము, అవరోహము, అనులోమము లేక స్వాపము. పిదప ఉత్తరణము, ఆరోహము, విలోమము లేక జాగరణము. చేతన ఏ మార్గమున అవతరించి అచేతన మాయెనో, ఆ మార్గముననే తాపలు తాపలుగా ఏర్పడిన వివర్త ప్రణాళికగుండ వికసించుటయే సృష్టి ఉద్దేశము. ఇది తప్పనిసరిగా జరగవలసిన పరిణామము. కావుననే ఈ సృష్టికి రెండు ప్రవాహములు. ఒకటి ఎరుకకు మరపు. రెండు దాని మెరుపు. నిదిరించు నీ చేతనకు మెలమెలగా మెలకువ కలుగుటయే వివర్తమునకు సార్థకత. ఈ సృష్టికొరకు ఏక మనేకము, అసీమము ససీమము, నిర్గుణము సగుణమును అయెను. విచిత్రమగు నీ సృష్టియంతయు తరుగని పరమేశ్వరుని ఐశ్వర్యములలో నొక ఐశ్వర్యమున కాంశిక సత్యమని చెప్పక చెప్పుచున్నది.

అద్వితీయమును, అనంతమును, అఖండమునగు ఈ భూమ తన స్వరూపములో నిసుమంతయు మార్పులేకుండగనే సోపాన క్రమమున బహుళత్వమును

ఘంపత్వమును చెందుచు, సాంతమగు జడమువరకు దిగుచు వచ్చెను. ఈ దిగుటలో మొదటి సోపానము అతిమానస లోకము - Super Mind. ఇచట ఏకాత్మ జ్ఞానమేకాని బహుత్వ సంఘర్షములేదు.

దీనికి పిమ్మట అధిమానసలోకము - Over Mind. ఇచటగూడ ఏకాత్మ జ్ఞాన మావరింపబడిపోలేదుగాని అద్వితీయుడగు నా యొకడు బహుకేంద్ర గతుడాయెను. ఇచట బహుత్వమును స్వాతంత్ర్యమును ప్రకటమయినను ఏకత్వము లోపింపలేదు.

దీనికి దిగువ మానసలోకము. ఇచట ఏకాత్మజ్ఞాన మించుమించుగా లోపించెను. కాని అది క్షీణవాసనవలె ఇచట మినుకు మినుకు మనుచుండును. ఏకాత్మ జ్ఞానమునకు మారుగా భేదాభేద జ్ఞానముపై దీని ప్రతిష్ఠ. ఇదియే మానస లోకమునందు గల విశేషము.

దీనికి దిగువ ప్రాణలోకము. ఇది కామనలకును, కర్మమునకును, కర్మశక్తికిని, వాసనలకును, వీనికి తోబుట్టువులగు ఇతర వృత్తులకును, క్రీడారంగము. ఇచట చేతన మరియు నెక్కుడు చీకటిచే పొదువబడెను.

చిట్టచివర జడము. ఇచట చేతన జడావరణముచే పరిపూర్ణముగా ఆచ్ఛాదింపబడెను. ఇట్టి అవతరణము సృష్టిప్రవాహమునం దొక పాయ.

జడములో సంపూర్ణముగా మరుగుపడి పోయియు అనుస్యూతమై యున్న ఆ చేతన మరల పరావర్తనము చెందుటయే వివర్తమూల రహస్యము. జడాశ్రయమున బహుకేంద్రములందు దివ్యచైతన్య క్రమ వికాస మీ వివర్తధారకు పరిణతి. తదభిముఖముగనే యీ వివర్తము ప్రవహించుచున్నది. అవతరణ చరమ సోపానమగు జడము, మరల ఉత్తరణ ప్రయత్నములో ప్రథమ సోపానము. తన ప్రవాహములో లోపల అతిమానస విజ్ఞానము సక్రియమగుటయు అనేకములను సొంతములు నగు కేంద్రములందు ఏకత్వానంతత్వములు అభివ్యక్తమగుటయు వివర్తమునకు ఫలము. ఏది ఆవరింపబడెనో అదియే వికసితమాయెను. ఏది నిద్రించెనో అదియే మేలుకనెను. మరియు నేటికిని ఏది అనుస్యూతమయి యున్నదో అది పూర్తిగా ప్రస్ఫుటము కావలయును. ఈ

బ్రహ్మాండమునం దింతవరకు పరిపూర్ణముగా సచ్చిదానంద మభివ్య క్తము కాలేదు. ఈ వివర్త ప్రవాహము అట్టి చరమ పరిణామము లక్ష్యముగా గొనియే ముందుకు నడచుచున్నది.

మనస్థూల దృష్టికీ ప్రపంచమున ఈ దిగువ సంగతులు కనబడును- చెట్లు చేమలుగాని, కీట పతంగాదులుగాని ఉద్భవింపక మున్ను ఈ భూమి కళ పెళలాడు బాష్పకటాహము. ఆ స్థితిలో జీవకణ మేదియు, నిందుండుటకు వీలు లేదు. ఏలనగా జీవకణము బ్రతికి బట్టకట్టుట కిందు చక్కని గాలిగాని, పేయ మగు నీరుగాని, ఉనికి గొనదగిన ఉర్వరగాని ఉండదుగదా. క్రమక్రమముగా ఆ ఆవిరిముద్ద చల్లనగుచు రూపాంతర మొందెను. మెత్తని మన్ను నిర్మలమగు గాలి, తీయని నీరు మొదలగున వన్నియు క్రమముగా ఆవిర్భవించెను. పిదప భూమిమీద ఉద్భిద్ రూపముగా ప్రథమ ప్రాణస్పంద మేర్పడెను. అది కాలము కడచిన కొలది బహుళమగు అడవిగా మెండుకొనెను. జడ మిటులు ప్రాణమయ మాయెను. ఇది యెటులు సంభవించెను? ప్రాణశక్తి జడములో అర్ధసుప్తమయి ఉండవలయును గదా! కాని నా డిది యెటులు సంభవించును?

ఈ వివర్తప్రవాహము మరికొంత ముందులకు సాగెను. ఈ భూమి జీవ ధారణ మొనరించుటకును, నివసించుటకును అనువైన కొలది నిదిరించుచున్న యీ చేతన మెలమెల్లగా మేలుకొన దొడగెను. పలుతెగలగు కీటములు పక్షులు పశువులును పుట్టుకొని వచ్చెను. అచేతనమునం దిటులు చేతన సంచారము మొదలై సోపానక్రమముగా ఊర్ధ్వాభిముఖ మగుచుండుట మనకు విశదమగు చున్నది.

జీవజాలములో చేతనా సంచారము కలిగెనను మాటయేకాని మనోవికా సము మాత్రము కలుగలేదు. మనుజుని ఆవిర్భావముతోపాటు మనస్సు జాగ రిల్లెను.

ఈ ప్రవాహములో ఒక విశేషమున్నది. జడమునం దింకను సంచా రము కనబడకముందే ప్రాణుల యునికికి జడ ముపయుక్త మాయెను. మొదట ఆధార మేర్పడెను. పిదప ప్రాణము స్పందించెను. అటు పిమ్మట అభివ్యక్త

మాయెను. ప్రాణము జడమును ఆధారముగానో రూపాంతరముగానో చేసికొనెనే కాని దానిని తినివైచి తాను మిగులలేదు. ఇట్టి ప్రాణముచే జడ మనుప్రాణిత మాయెను. లేక ప్రాణమయ మాయెను. ఇటులే ఆ వివర్తము మనస్సోపానమున గూడ ప్రాణమును గాని, జడమునుగాని లోపింపజేయలేదు. మనోమయుడగు మనుష్యునిలో జడమునకును ప్రాణమునకును అద్భుతమగు రూపాంతరము, ఆశ్చర్యమగు సమన్వయము కలిగెను. అదృశ్యములగు రెండు శక్తుల ప్రభావము వల్ల మనోమయుడును, సంవిద్యుక్తుడునగు మానవు డావిర్భవించుచున్నాడు. దిగువ నుండి పైకెగయ నెంచు చేతన, స్ఫోట ప్రభావ మొకటి. పైనుండి కిందికి దిగు ప్రాణాదిశక్తి ప్రభావ మొకటి. ఈ రెంటి వలనను వివర్తము క్రమక్రమ ముగా ముందుకు సాగుచున్నది. జడ మీ రెంటియు ప్రభావముచేతనే ప్రాణమయ మగుచున్నది. నిద్రించుచున్న ప్రాణము మేలుకొనగనే జడము ప్రాణమయ మయినపుడు జడమునందున్న చేతనాశక్తి పైకి ఉత్తరించు శక్తి యొకటియు, ప్రాణము క్రిందికి అవతరించు శక్తి యొకటియు కనబడును. ఇటులే ప్రాణము నందును మనస్సు మెలగినపుడు మనోలోకమునుండి మనస్సవతరించు ప్రయ త్నము కనబడును. ఈ రెండు శక్తుల సమన్వయము వినా జడము రూపాంతర మెనయజాలదు. అనగా జడమునందు ప్రాణరూపమగు నొక కొత్త ధర్మము వికాస మొందజాలదు. ఈ రీతి ఉత్తరావతరణములకు ఫలముగా జడాధారమున ప్రాణప్రకాశమును మనఃప్రకాశమును కలిగెను. మరియు వీనియే ప్రభావము వలన వివర్తలీల అతిమానవత్వమున ముగియగలదు. మనఃప్రాణములు రెండును సుప్తమయి యున్నవి. గనుకనే వానికి క్రమజాగరణము సంభవించెను. కాని నాడు అచేతనమగు జడమునం దెటు లీ రెండును ఆవిర్భవించెను ? స్థితిశీలమగు జడమున క్రియాశీలమగు ప్రాణమెటులు వికసించును ? ప్రాణము, జడమును గూడ తనతోపాటు ఎటులు తీసికొని పోవును ? కావున ఈ వివర్త ద్వారమున క్రమాభివ్యక్తి కాక తప్పదు.

ఈ మనోమయ మానవుని నిమ్న ప్రకృతి యెటులు రూపాంతరము చెందునో పరికింతము.

జీవుడు పరమేశ్వరుని అంశము – 'మమైవాంశః.'–మరియు నిత్యుడు– 'సనాతనః'. కావున జీవుడు వివర్తమునకు వెలుపల.

జీవునకు ప్రతిభులై అన్న ప్రాణ మనః కంచుకాంతరితుడై హృదయ మణికోష్ఠమున చైత్య పురుషుడు - **Psychic Being** వెలు గొందుచున్నాడు. అంతర్నిగూఢుడగు నీ చైత్య పురుషుడే మనలో బ్రహ్మ జ్యోతిచే నిత్య దీప్తమును, అధూమకమును అగు చేతనా దీపశిఖ. మన బాహ్యప్రకృతి నావరించు దట్టమగు అజ్ఞానము నడుమ గూఢ గంటవలె నది వెలుగుచునే యుండును. బ్రహ్మ జాతుడగు నీ జాతవేదుడు అవిద్యాకుహరమును ప్రకాశింపజేయుచు తన యింట వృద్ధి పొందుచు- 'వర్ధమానః స్వేదమ్'- తన శక్తిచే అవిద్యను విద్యగా మార్చివేయుచున్నాడు. మరియు నితడు గుహాహితుడగు సాక్షి, శాస్త. మన అంతర్యామి సోక్రటీస్ - **Damon** - భావుకుల అంతర్జ్యోతి లేక అంతర్వాణి బ్రహ్మమునుండి ఆరని చిత్కణముగా పొడమిన యితడు జన్మ మృత్యు క్షయాది వికారములచే అపరామృష్టుడు. ఇతడు జీవుడు కాడుగాని అతనికి ప్రతిభువు. ఇతడు సూక్ష్మమగు అన్నమయ ప్రాణమయ మనోమయ పురుషులకు భర్త, మరియు సాక్షి. వారి పుష్టిని అనుభవమును ఇతడు భుజించును. ఈ మూవురు పురుషులయు స్వరూప మాధారము నడుమ అవృతమయి యున్నను సమయ విశేషములందు వారి ప్రతిభాసము బయటికి ప్రక్షిప్తమై మన ప్రాకృత జీవ భావమును నిర్మించును. వారి సమష్టి బాహ్య వ్యాపారము, స్థితి స్వరూపము మన స్వరూపమని మన మెరుగుదుము. కాని గుహాశయమును, అధూమకమునగు జ్యోతియే చైత్య పురుషాధారమునం దావిర్భవించి మన జీవసత్త్వమును జన్మము నుండి జన్మాంతరమునకు తీసికొని పోవును. ఇతడు మరల మరల చినుగు పాతల మార్చి కొత్త వలువల దాల్చుచు జన్మమునుండి మృతికి, మృతినుండి జన్మమునకు వచ్చుచు బోవుచునుండు పథికుడు. ఈ చైత్య పురుషుడు తొలు దొలుత అన్న ప్రాణ మనస్సులలో అంశికముగ అపరోక్షముగనే పని చేయగలడు. ఏలన ఆత్మ స్ఫురణమున కివియే ఉపకరణములు. వీని ఉపచయము తన కావశ్యకము. అన్నప్రాణ మనస్సుల పూర్ణ పరిణామము నపేక్షించి ఇతడు దానిచెరలో చాలకాల ముండవలసి యున్నాడు. ఇంత ఇతని ప్రతీక్ష వ్యర్థము కాదు. ఏలన అవిద్యా గ్రస్తుడగు మానవుని జ్యోతిర్లోకమున కెత్తుటయే అతని వ్రతము. కావుననే అవిద్యాభూమిలోని అనుభవముల అన్నిటియు సారముగొని దానిచే నతడు ప్రకృతిలోనే జ్యోతిః కంద మొకటి నిర్మించును. పరమపురుషుని

దివ్యనిమిత్తములుగా ఎంతవరకు అన్న ప్రాణ మానసముల సకల సాధనములును భాస్వరములు కావో, అంతవరకును అనుభవశేష మతని భవిష్యత్ సాధన సంపత్తి కుపాదనమగును. నిగూఢముగా నున్న ఈ చైత్య పురుషుడే మనస్వ ధర్మమును యథార్థముగా నెరిగినవాడు. కల్పితమును, గతానుగతికమును నగు నీతివాదుల ధర్మబోధకంటెను ఇతడు సత్యతరుడు. ఇతని ఊర్ధ్వప్రేరణము నిగూఢము. ఏలనగా హృత్శయానుడగు నీ పురుషుడే సత్యము, ఋతము, శ్రీ, ప్రేమ మొదలగు దైవసంపద దెసకు మనల నెల్లపుడును ప్రబోధించు చున్నాడు. ఈ చేతనయం దెంతవరకు దివ్యప్రక్ర్యత్యేషణ బలపడబోవదో అంతవర కితని సాధనకు విరామ మనుమాట యుండదు. ఈ చైత్యపురుషుడే మనలో సాధకుడును, ఋషియు, కవియు. స్వారాజ్య పూర్ణదీప్తిచే వెలుగొందగనే ఇతడు మనలను బ్రహ్మవిద్య దెసకు త్రిప్పి పరమాకాశమున కెత్తి అద్వైతభావ నిబిడమగు విశ్వమైత్రియను పరుసవేదితో మనచేతనను పులిమివైచును.

ఇక ఈ చైత్య పురుష భావము తిన్నగా పరిణతముకాక వికృతమును దుర్బలమును ఆయెనేని సాధకుని మానస మోజోదీప్తులతో పయికి కనబడినను హృదయ వాసనావేగము ప్రబలమై, అకుంఠమై, దుర్ధర్షమై, ప్రాణశక్తి విజయవంతమై, శరీర సంపద అనుకూలమై, బాహ్య జీవనముగూడ ఐశ్వర్యమండితమై కనబడినను ఆధారమునందలి సూక్ష్మతరాంశములు వికసింపనయిన వికసింపకుండును. వాని సామర్థ్యమయినను కుంఠితమగును. అదియే అపుడు కామపురుషుడు చైత్యపురుషుని వేషము వేసికొని చేయు తాండవము. అపు డతని యింగితమును, అభీప్సను, భావములను, ఆదర్శములను, ఆకూతిని, కామనను జూచి– "ఇది, అంతరపురుషుని నిర్దేశ – Psychic suggestion[1] మనియు

---

1. ఐతరేయమునకు ప్రతిధ్వనియగు భాగవత తృతీయ స్కంధమునందలి కపిల-దేవహూతి సంవాదములోని సృష్టి ప్రకరణమున చైత్య పురుషుడు క్షేత్రజ్ఞుడు. యోగవాసిష్ఠమునందలి ఉత్పత్తి ప్రకరణము. ౬౬ మొ. సర్గలందలి చైత్య పురుషునకు ఆది జీవుడు ఇత్యాదిగా అర్థము. అచటి చైత్య పదమునకు దృశ్య సమూహము, అనుభవ విషయము, చిత్త వృత్తి-ఇత్యాదిగా చిత్త భవిత్వమను వ్యుత్పత్తితో వ్యాఖ్యాత అర్థము చెప్పిరి. అరవిందులు Psychic Being అను పదమునకు చైత్య పురుషుడని వాడిరి. ఈ చైత్య పురుషుడు చిత్త ప్రాణ దేహములకు నాభి. మరియు దాని వెనుక నుండువాడు. చిత్తము బాహ్యము. ఇంకను విశేషములకు Life Divine Vol. I. Ch. 23, Letters of Aurobindo to Disciples చూ.

అధ్యాత్మ జీవసంపద యనియు మనము భ్రమింతుము. గుహాత్తుడగు చైత్య పురుషుడు జీవనమునకు పురోధయై కామపురుషుని జయించి అన్న ప్రాణ మనః కంచుకముల వెనుకనుండి ఆధారములో కొంత భాగమును గాక నిండార ఏలు కొనునేని, అతని చల్లని యేలుబడి వెలుగుచే జీవనమును అభీప్సయు, ఆకూతియు ఆదర్శమును, సత్యఋతి శ్రీల చిన్మయ విగ్రహములుగా మూర్తములై తత్ఫల ముగా స్వభావమంతయు పరమపురుషార్థము కేసి దివ్యజీవన మహా విషువముకేసి తిరుగును.

జీవనమునకు సాక్షాన్నియంతృ రూపముగా చైత్య పురుషుని మన ఆత్మ యందు మనము నిలువబెట్టుకొన గలుగుచో చరితార్థుల మగుదు మనియు, దివ్య జ్యోతిర్ద్వార మపావృత మగుననియు తోపవచ్చును. ఇంతియకాక, 'బ్రాహ్మీ స్థితి'కి లేక పూర్ణసిద్ధికి ఋత చిత్తునుండి – truth Consciousness నుండి గాని – అతి మానసోత్తర లోకమునుండి గాని శక్తిపాతముతో ఇంచుకయు పని లేదని తోపవచ్చును. జీవనము పరిపూర్ణముగా రూపాంతరము చెందుటకు తైజస రూపాంతరము –Psychic Transformation– తప్పనిసరి యయినను సర్వో త్తరమగు చిన్మయ పరిణామమున కిదియు చాలదు. చైత్య పురుషుడు ప్రకృతి యందున్న వ్యష్టి పురుషుడు కావున నిగూఢమైన దివ్యభూమికల ననావృతముల చేసి వాని జ్యోతిని, శక్తిని, అనుభవమును మనకు కలుగజేయగలడు. కాని విశ్వాత్మకమును విశ్వాతీతమునగు పరమాత్మ మహిమను సంపూర్ణముగా ప్రతి ష్ఠించుటకు ఉత్తర లోకమునుండి శక్తిపాతము కావలయును. చైత్య పురుష డొకానొక స్థితిలో సత్యమును శివమును సుందరమును అగు లోక మొందు కల్పించుకొని దానియందే నివసించుచు తృప్తిగొనవచ్చును. లేదా కొంచెము ముందుల కేగి విశ్వాత్మకు – world Self – వశుడై విశ్వసత్తా చేతనా వీర్యా నందములకు స్వామిగాని, భాగస్వామిగాని కాకున్నను అద్దమువలె గ్రహింప సమర్థుడు కావచ్చును. నిబిడమగు విశ్వచేతనా – Cosmic Consciousness వేశముచే పులకితుడై మనో హృదయములందే కాక, యింద్రియములందు కూడ తదావేశోన్మాదము ననుభవించియు వివశుడై దానిని ధరింపవచ్చునుగాని బాహ్య జగత్తునందు దానిని సంచారిత మొనరింపజాలడు. మరియు విశ్వోత్తర భూమిలో స్థాణువుగా నిలిచి, జగతికి వేరై వ్యష్టిత్వము వదలి, మరల అనాది మూల స్వరూ

పమును చేరుకొనవచ్చును. అంతియకాని, తా నిచటి కెందులకు వచ్చునో ఆ పని చేయు సంకల్పముగాని శక్తిగాని - అనగా- మన ప్రకృతిని దివ్యమును సార్థకమును చేయగల సంకల్పముగాని శక్తిగాని అతని కుండదు. ఏలయన బ్రహ్మము నుండి ప్రకృతిలో 'ఈ చైత్యపురుష నావిర్భూతి'. కాన ప్రకృతి నుండి నిస్తరంగమగు అక్షర పురుషుని నిశ్చలతలోని కితడు క్రమ్మర వచ్చును. చైత్యపురుషుడు దివ్యపురుషునియే సనాతనమగు అంశము. కావున అంశమయ్యు నితడు బాహ్యరూపమున దక్క, బాహిరమును భేదకమునగు ఆత్మానుభూతిని దక్క, అంశితో అవినాభూతుడు. కావున స్వరూప సత్తానుభూతిచే అతని చేతన శోషితము కావచ్చును. మరియు నత డవిద్యా తమఃపుంజమునం దొక జ్యోతిః కందమయ్యు దాన జేసియే "అంగుష్ఠ మాత్రః పురుషః [2] " అని వర్ణితుడగు నితడు అధ్యాత్మికాఽఽపూరణముచే - Spiritual influx - తన్ను విరియించుకొని మనో హృదయాభివ్యాప్తిచే ఐక్యమొంది విశ్వమును కౌగిట బట్టవచ్చును.

మరియు నిత్యసహచరుని సంధాన మెనసి సంతత సాన్నిధ్యమును కోరవచ్చును. అధ్యాత్మానుభవ మన్నిటిలో సౌందర్యానందములచే గాఢతరమగు భావకాంతి పొంది పరమ ప్రియునికి పరమ ప్రియకృతియై ప్రేమోత్తరమగు మాధురిలో మునిగి పోవచ్చును. ఈ రీతిగా మన ఆధ్యాత్మిక జిజ్ఞాసలకు ఫలముగా పలుసిద్ధులు పలుతెగలుగా జరుగవచ్చును. కాని మన కిదియే అగ్రభూమి కాదు.

ఇవి అన్నియు ఆధ్యాత్మికమగు మనోభూమికలోనే కలుగు సిద్ధులు. ఇది ఉన్మనీ స్థితియైనను నిజ సంస్కారము తుడిచి పెట్టుకొని పోదు. భేద బుద్ధి యింకను ఉండును. కావున శాశ్వతమగు సన్మాత్రమే సత్యమని దాని నిశ్చయము. అతీంద్రియమగు అనుభవ రాజ్యమునందును పర్యాయ క్రమమున బ్రహ్మమున అచాంచల్యము, శక్తి చాంచల్యము, నిర్గుణత్వము, సగుణత్వము, సత్త్వ సంభూతి పురుషత్వము అపురుష విధత్వము మొదలగు ద్వైత సంస్కారము నది సృష్టించుకొనును. ఈ విరోధాభాసము నందలి విరోధములలో ఒక కోటిని ప్రత్యాఖ్యానము చేసి, మరియొక కోటిని సత్యమని నమ్మి తా నందు మునిగిపోవును. కాని ఆవలి ఒడ్డున అతి మానసమును, సర్వోత్తరమునగు ఋతః

---

2. శ్రీ శంకరాదుల అభిప్రాయమునకు శతము నారాయణము. మొ॥ చూచునది.

చిదనుభవ మొకటి ఉన్నది. అచ్చట ఈ ద్వంద్వము లన్నియు సమసిపోవును. అటనుండి శక్తి నీయాధారమునకు తేవలసి యుండును.

అవిద్యా ప్రపంచములో ప్రకృతి తన మనోమయ ప్రవృత్తుల కంతరాత్మను గాక తత్ ప్రతిభువగు అహంతను అక్షముగా కల్పించుకొనును. దీనిని కేంద్రముగా జేసికొనియే మనము ద్వంద్వ విరోధములచే అసంగతిచే సంకుల మగు జగన్మధ్యము నందును మాత్రా స్పర్శల మధ్యమునందును విచిత్రములగు అనుభవములయు సంబంధములయు విరోధములయు వ్యూహమును నిర్మించు కొందుము. మనము ఈ అహంతా దుర్గమును అడ్డముగా పెట్టుకొనియే విశ్వాఘాతము నుండియు, అనంత్యాఘాతము నుండియు మనలను రక్షించుకొనుచున్నాము. చిన్మయ రూపాంతరముచే ఈ దుర్గము కూలుచో సాధకుని అహము తుడిచి నటులు పోయి, ఒకానొక నిర్విశేషానుభవ సముద్రమునం దీ ఉప్పు బొమ్మ కరగి పోవును. ఆ స్థితిలో ఆ సాధకుని వృత్తులకును, వ్యాపారములకును ఒకే పద్ధతి ఉండదు. దానచేసి అతడు లోలోపల చిన్మయుడే కాని బయటికి ప్రాకృతుడు. అతని ప్రత్యక్ చేతన అచలప్రతిష్ఠమయ్యు పరాక్ చేతన సంస్కారాంధము – "అవశః ప్రకృతే ర్వశాత్-" దీని వలననే విభిన్నకోటికి చెందిన సాధకులను మనము చూతుము. ఇట్టి సాధకులు జడమువలె బాలురవలె ఉన్మత్తులవలె పిశాచులవలె తిరుగువారు కలరు. ప్రారబ్ధ మెపుడు క్షయమగునా యని వారు సాక్షి మాత్రులుగా సంస్కారములను చూచుచుందురు. చిన్మయ స్థితికిని, మనశ్చలనమునకు ఏకశ్రుతి యింకను పొసగలేదు. గాన దివ్యానుభవబలము వారి మనస్సును ఊపి వైచినను, అంతరానుభవ మంతయు వికసింపదు. ఆ స్థితిలో సాధకుడు అయోగ్యులగు మంత్రులచే నడిపింపబడు మహారాజు. ఏలనగా అతని అజ్ఞాన ప్రపంచమును బట్టి అతని ఆంతర విజ్ఞానమునకు విలువ కట్టవలసి యుండును. అతి మానస భూమి యందలి ఋతంభర ప్రజ్ఞా సత్య సంకల్పముల సామరస్య మాధారమునం దవతరించినగాని ఆంతర బాహ్యముల చిత్ స్వరూప పరమసామ్య మేర్పడదు. ఏలనగా అజ్ఞానమును విజ్ఞానమునుగా మార్పగల శక్తి అతిమానస మొకదానికే కలదు.

మనఃప్రాణముల ప్రాకృతసత్త స్వరూపసత్తతో కలియుచో వానికి పరమాస్వాయనము. అటువలె చైత్య పురుషునకును పరమబ్రహ్మము నందు

నిహితమగు తన స్వరూప సత్యముతో ఐక్యము కలుగుచో పరమాభ్యుదయము. ఉభయ క్షేత్రములందును అతి మానస శక్తియే దూతి. సంపూర్ణ సామరస్యము నదియే తాదాత్మ్య సంగమున పర్యవసన్నము చేయగలదు. ఏలన అతి మానస శక్తియే అద్వయ సత్తా పరావర కోటులను కలుపు వంతెన - 'అమృతస్య సేతుః-' అతి మానసమునందే అఖండమగు ద్యులోక ద్యుతియు, సర్వార్థ సాధకమగు మహాశక్తియు, అపావృత ద్వారమగు మహానందమును కలవు. ఈ ద్యుతి శక్తులచే సముద్ధృతు డయి యే చైత్య పురుషుడు మనః ప్రాణ శరీర ములను సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి దాటించి, భయజుగుప్సాదుల నుండి తప్పించి, మర్త్యము నందలి మాత్రా స్పర్శలను బ్రహ్మానందముగా మార్చి, తా నెచట నుండి వచ్చెనో - అట - మూల సత్తానందమునం దైక్యము చెందగలడు.

జడమునుండి మానవ స్తర వివర్తమున కెవనికి నే ప్రయత్నము నక్కర లేకపోయెను. కానరాని ఒక శక్తి ప్రభావము చేతనే అది నెరవేరెను. కాని యిక మానవు డతి మానవత్వము వడయుటకు మాత్రము తానే ప్రయత్నము చేయవలెను. అతడు తన అజ్ఞాన కవచమును ఛేదించుకొనవలెను, తన స్వరూప మేదో తానే కనుగొనవలయును.

విరక్తి చెందినంతనే మాయామయమగు నీ సంసారమును పరిత్యజించి, శ్రవణాదు లొనరించి, తురీయ బ్రహ్మమున కలిసిపోవుటయే పలువుర సాధనకు మూలోద్దేశము. జడ ప్రకృతి నుండి తప్పించుకొని పోవుటయు పై సాధన కొక కారణము. కావి జడాశ్రయమున చైతన్య వికాసమును, పరిచ్ఛిన్నములో అపరిచ్ఛిన్న పూరణ విస్ఫూర్తియు, సృష్టి కుద్దేశమగు నెడల మనోమయ మానవు డతిమానవుడయి తీరవలెను.

ఆత్మ ఆవరించి ఉద్గమించుచున్నదను ఈ దృష్టితో ప్రపంచమును చూచిన యెడల జడశక్తి వలన కలుగు క్రియాకలాపము వెనుక సృజనశీలమును, అనంతమునునగు చైతన్యము విగూఢమై ఆ బాహ్యక్రియా కలాప ద్వారమున మేరలు లేని జడ ప్రపంచముగా క్రమక్రమమున పరిణమించి ఆవిర్భవించు చున్నదని విస్పష్టమగును. ప్రపంచ శరీరమగు జడమును నిర్మించుకొరకు జడశక్తి అచేతనమువలె కనబడక తప్పదు. ఏలన పయికి విరుద్ధమైనదివోలె కనిపించు జడములో పరిణామోపాయముచే వికాసము చెందవచ్చునని చైతన్య మీజడములో అణగియుండ నుద్దేశించుకొన్నది. అట్టి యుపాయమేదియో యొకటి లేనినాడు సంపూర్ణమగు నవతరణ మసంభవము. అనగా అనంతమగు చైతన్యమును లేక ఆటలాడు వాడును, వాని యే ఆటయు వీనిసందున ఒక పెద ఉద్భవము జరగిపోవుచున్నది. వానియే ఛాయ నవలంబించి యింకొక పెద అనంతమును అనిర్దేశ్యమును అచేతనమువలె కనబడు జడమునందు అనంతమగు చైతన్యము తన సమస్త తత్త్వైశ్వర్యముతో అపూర్వమగు నొక భంగిమతో అంతర్నిహితమై యున్నది. విశ్వమున కతీతుడైనను ఆ యాటలాడు వాడును, ఈ యాటయు ఎటులో ఒకటులు ఒకటియే అయి, అందదగియుండి, అతడు పరిణామక్రమములో అనంతములగు రూపములను పోతపోయుచున్నాడని అంగీకరింపనిచో నిట సందేహ వసాస్తము కాదు. ప్రకృతిలో పైపైకి అంధముగా మనకు కనబడు స్వైరాచారము, ప్రచ్ఛన్నమయియున్న ఆ యీ చైతన్యము పయికి పెకలించుకొని వచ్చుచుండుటకు–అనగా ఆత్మప్రకాశమునకు పరిచాయకము. ఇక మరియొక పెద మనకు కనబడు కఠోర యంత్రశాసనమును, మూడుమూళ్ళు తొమ్మిది కెక్కువ గాని తక్కువగాని కాక, సరిగా తొమ్మిదియే యగునను గణితపు నిక్కచ్చివంటి నిక్కచ్చియు, ఆ యీ ఋత చైతన్యముతోని (Truth Consciousness) అనివార్యమగు నియతికి పరిచాయకము. మఱియు క్రమావరోహణ మార్గమున అనిరూపణీయమును అచేతనము వంటిదియునగు జగమునుండి మెలమెలగా బహుముఖమగు చైతన్య స్ఫురణ మెటులు జరగుచున్నదో అది యీ మతమున దురుత్తరము కాదు. ఈ యవతరణోత్తరణ భంగితో విచారించి చూచితిమేని

సృష్టిలీలా రహస్య మెరుక యగును. అచేతనమువలె కనబడు జడమనగా అతి విశిష్టతమగు కేంద్రమునందు పరమైకాగ్రతతో తన్ను దా మరచిన చైతన్యము. కఠినమగు జడావరణమును భేదించుకొని పరమ చిచ్ఛక్తిగా (Consciousness Force) ప్రకాశ మొందుటకు జేయు ప్రథమ ప్రయాసము జడశక్తి. ఈశక్తిలో సహస్ర ముఖములగు ప్రకాశముల అనంతలీలాభంగులను (Principles of Variation) పలుతెగలగు పోకడల తమ్ము తాము ప్రకటించుకొనుచుబోవు సృష్టిత్తుల విధివ్యవస్థలును నిలీనములయి యున్నవి. ఇవి యన్నియు అసంఖ్యేయములగు నియమములుగా (Innumerable Laws of Nature) మన బాహ్య దృష్టికి తోచును. ప్రతిక్షేత్రమునందును, ప్రతిసోపానమునందును ఆ యీ క్షేత్రము యొక్కయు, ఆయీ సోపానము యొక్కయు వాస్తవమగు భావము లేక చిద్రూపము (Real Idea) ఆ పరమ చైతన్యమునందుగల అనంతతత్త్వ భాండారముల అమూర్త భావధార.

చెట్టు వాస్తవ భావము లేక చిద్రూపము (Real Idea) విత్తునందు సంకుచితావస్థలో నున్నది. మరియు దానియే ఒత్తిడిచే మెలమెల్లగా వృక్షమూర్తి వికసించుచున్నది. జడమును పునాదిగా చేకొని ప్రాణము వికసించుచున్నదన్న మాట. దీనికి కారణము జడమునందలి వాస్తవమగు భావము (Real Idea) పైకి ఉద్గమించుటకు విరామము లేకుండ చేయు ఒత్తిడి. ఇటులే ప్రాణగుహలో అమూర్తములై క్రిక్కిరిసియున్న మనోరాజ్యమునందలి చిద్రూపముల ఒత్తిడిచే మనోమయసత్త వికసించుచున్నది. జీవాణువులన్నియు ఈ చందముగనే వాస్తవమగు భావపు ఒత్తిడి చేతనే మూర్తిని ధరించుచున్నవి. అట్టడుగు జడము నుండి సుప్తమును అనంతమును అగు చేతన ఒత్తిడిచే చిత్రమగు నీ సృష్టిధార మెలమెలగా ఎటులు ప్రవహించుచు వచ్చుచున్నదో మన మిపుదర్థము చేసికొనగలము. ఇంతియకాక ప్రపంచమున కనబడు దుఃఖదైన్యములును వేదనావ్యథలును శోక మోహములును మనకిపు దర్థమగును. ఈ క్రమోత్తరణ మార్గమున మెట్టుమెట్టు నందును చేతన అంకమున కందని ఆతంకముల నతిక్రమించుకొనుచునే పయి పయి కెక్కవలసియుండు టెంతయు స్వాభావికము. కావున ఈ క్రమోత్తరణ సంభావ వాదములో అశుభమునకును దుఃఖమునకును అపరిహార్యమగు స్థానమున్నది.

ఉనికి సప్తభూమమగు మహాప్రాసాదము. సచ్చిదానంద విజ్ఞాన మనః ప్రాణశరీరములే ఏడు భూమికలు. మొదటి మూడియు ఉనికికి చెందిన సచ్చిదానందములు చైత్యమయములు. మరియు అనంతములు. వీనిలో రెండు రెండుపసర్జనమై ఒకొకటి ప్రాధాన్యము బడసినపుడు వానివానిచందముమారి వేరు వేరు లోకము లేర్పడుచున్నవి. వీనియందానంత్యానుభూతియేకాక సమష్ట్యనుభూతి వ్యష్టియందును, వ్యష్ట్యనుభూతి సమష్టి యందును ఉండును. వాని పరస్పర సంబంధములును, వానిని నియమించు ధర్మములును విజ్ఞానము (Super mind) సొత్తు. ఈ విజ్ఞానమునం దునికిలోగల చిచ్ఛక్తియే జ్ఞాన సంకల్పముల రూపు తాల్చును. సంకల్పమే భావము. విజ్ఞాన భావ సృష్టియే వస్తు సృష్టి. వస్తువు కల్ల గాదు. విజ్ఞానమే సృజించు వాస్తవమగు భావము. (Real Idea).

"ఈశ్వరు డెట్టివాడు ? సృష్టి ఎట్టిది ? ఈరెంటికిని గల సంబంధమేమి?" అని విచారించిన ప్రతిదర్శనమునందును ఏదో అసంతృప్తి ఉండనే ఉండును. జడమును విడగొట్టిగాని, ప్రాణ గుహలో మూల మూలలు వెతకిగాని, మనో విజ్ఞాన సాహాయ్యముచే వృత్తుల ఉదయాస్తమయముల తత్త్వము తెలిసిగాని, మరియు వాని ధర్మమును నిరూపించిగాని, మూల రహస్యమును కనుగొన జాలము. దుర్భేద్యమగు జడకుడ్యమును పగులగొట్టుచో అస్ఫుటమగు చైతన్యము ధూమలాభాసము పొనపొన కానరావచ్చును. కాని జ్వాలమాలాకులమగు అనంత చైతన్యలీలను జడ విజ్ఞానము తెలిసికొన జాలదు. మరియు ప్రాణమయ క్షేత్రములో అవచేతన (Sub Conscious mind) స్పందించిన దెసకు దృష్టి త్రిప్పినను ప్రచ్ఛన్నమగు చిచ్ఛక్తి నందుకొనగలమని ఆసాసల పాలగుటయు వృథా. క్రమ జాగరణ మార్గమున చైతన్య మొక భూమికపై మరియొక భూమిక నతిక్రమించి మానవ మనస్సులో ప్రత్యఙ్ముఖమైనది. అటనుండి దాని పయి సోపాన మెక్కి తన్నుదా జూచుకొనగల సౌభాగ్యము మానవున కున్నది. అనంతమగు చేతనారాజ్యములో ప్రవేశించుటకు జాగ్రత్ చేతనయే మానవున కాలంబము.

విషయిగతమగు (Objective) దృష్టిభంగి గల మనో విజ్ఞానము (Psychology) మన కీ యెడ సాయము చేయజాలదని ఎరిగికొంటిమి. విషయ

గతమగు (Subjective) దృష్టి భంగి గల యోగము మనకిచట దారి చూప గలదు.

యోగబలముచే మనస్సును శాంతపరచుకొన గలుగుదుమేని నానా విధము లగు వృత్తి తరంగముల వెనుక వెనుక అచంచలమును విశాలమును అగు మానస వస్తు క్షేత్ర (A Realm of mental Substance) మొకటి యున్నటులు కనుగొందుము. ఇంతియకాక మన మననశక్తి యీ మానస వస్తువునుండి సంవేద నము, అనుభవము, ఇచ్ఛాద్వేషములు మొదలగు చిత్తవృత్తుల నన్నిటిని నిర్మించు చున్న దనియు తెలిసికొనగలము. ప్రశాంతమగు ఏకాగ్రతతో ఇంకను లోలోతు లకు దిగితిమేని, మన మనస్సులో నుదయించుచు అస్తమించుచు నుండెడు వృత్తులలో చాలవృత్తులు విశ్వగతమగు విరాణ్మానసావర్తమునుండియో లేక మన కావలనున్న ప్రజల మానసము నుండియో వచ్చుచు బోవుచున్నవని గ్రహింపగలము. బాహ్యములగు ఈ తరంగము లన్నియు ఎపుడో ఒకపుడు మాంసలములగు అవయవముల తోడను, పరిపుష్టమగు ఆకారము తోడను మనో గుహలో ప్రవేశించును. లేక మననశక్తి ప్రభావమువలన చిత్త దేహాళిపై కాలు మోపుచునే నామ రూపముల దాల్చును. ఉభయపక్షము లందును మనదృష్టికి వెలుపటనే కార్యము జరుగును. కాని యిది యంతయు మన చింతాధారయే యని మన మనుకొందుము. యోగసాహాయ్యముచే లోజూపు వాడి యగుడు తోడు తోడనే యీ సత్యము తేటతెల్లమయి పోవును. మరియు ఈ యోగ మార్గమున మగ్నచేతనా (Subliminal Mind) భూమిక యొకటి * ఉన్నయటులు కనబడును. ఈ మగ్నచేతనా క్షేత్రమున అపారమగు బీజ భాండారము కలదు. దీనికి వెలుపలిదగు జాగ్రత్ చేతనలో బహువిధములగు జ్ఞానములును ప్రేరణము లును అనుభవములును తేలాడుచుండును. యోగదృష్టిని త్రిప్పి పయికెత్తి పట్టి నచో ఊర్ధ్వ చేతనాకాశమందు (Super Conscience) గల నానాసోపాన ములు అవగతము లగును. ఆకాశములోని కెగురవలయునను కోరిక మన కీ భూమిక నుండియే అవతరించుచుండును. అది యటుండె - వీని యన్నిటికిని వెనుక ఒక మనోమయ సత్త యున్నదని మనకు తెలియవచ్చును. మన మానస

---

* అవచేతన-Sub Conscious mind-అన అందరకును సామాన్యముగా అర్థమగు పదార్థము మగ్న చేతన కాదు.

వస్తువునకును (Mental Substance) మనన శక్తికిని (Mental Energy) వృత్తులన్నింటికిని ఇదియే ఉత్సము. ఇదుండియే వృత్తు లుదయించుచున్నవి, అస్తమించుచున్నవి. విశాలమగు ఈ మానస క్షేత్రమునకును ఈ మనోమయ పురుషుడే సూత్రధారుడు. ఇతడు కేవలము సాక్షి స్వరూపుడని తొలుదొలుత మనకు తోచునుగాని చూపింకను నిశితమగునేని సాక్షిస్వరూపుడగు ఈ మనోమయ పురుషుడే అనుమంతయు కర్తయు సర్వమయుతును నను నెరుక గలుగును- ఇంతియకాదు. మానసవస్తువును మనన శక్తియు ఈ మనోమయ పురుషుని నిజస్వరూపమనియు, చిత్తవృత్తు లన్నిటికిని ఇతడే స్వామియనియు, సమగ్రమగు ఈ భూమికి నితడే పరిపాలకు డనియు మనము తెలిసికొన గలుగుదుము.

"విరాణ్మానసములో వ్యక్తి మానస మొకయంశమని మన కెరుక. మనకు ఉదయించెడు ప్రతి ఆలోచనయు, ప్రతి ప్రేరణయు, ప్రతి అనుభవమును మన ఆధారములో ప్రతిఫలించిన విరాట్ చైతన్యపు విశిష్టధార యనియు మనకు తెలియును. కావున వ్యష్టి చిత్తములో ఆవిర్భావ తిరోభావములు చెందు వృత్తులకు మనోమయపురుషు డెటుల కారణమగును ? మన చిత్తములో నియతముగా ఉదయించి అస్తమించుచుండు ఈ వృత్తుల ఘటన మరి యెవరిది ? ఇది విరాట్ శక్తి అవభాస మాత్రము కావచ్చును. ఈ శక్త్యవభాసము ఆధారానుపాతముగా వేరువేరు రూపములు దాల్చి కోరకితము పుష్టితము కావచ్చును. ఇటులు కావచ్చునేని మనోమయ పురుషు డెటులు చిత్తవృత్తులకు కారణము కాగలడు ? మరియు కర్తయు అనుమంతయు నెటులు కాగలడు? కావున ఒకవేళ విరాట్శక్తివలననే, విరాణ్మానసము వలననే ఇది యంతయు సంపన్నమగు చుండుట నిక్కమా ? యని మనకు సందియము కలుగుట స్వాభావికము. ఈ సందియము పోగొట్టుకొన వలసి యున్నచో మనము వైయక్తికమగు మానసమును దాటి విశ్వగతమగు సత్తా చేతనాకాశములోనికి ఎగురవలయును. అచటి కెగిరిన యెడల మనకు అధిమానసక్షేత్ర మొకటి దొరకును. ఇది వైయక్తికమగు మనస్సునకును, అజ్ఞానాశ్రితమగు విశ్వమనస్సునకును జాల పైది. ఈ క్షేత్రమును మెట్టిన యెడల మనకు విశ్వసత్య (Cosmic Truth) సాక్షాత్కారము కలుగును. ఊర్ధ్వ తన మగు నొక మహా సత్యమునుండి వ్యక్తియు, విశ్వమును వెలువడు

చున్న వనియు Both the individual and the Cosmos from a transcendent reality) ఊర్ధ్వ తనమగు నీ సత్యము విశ్వవ్యక్తుల మనః ప్రాణములలో అభివ్య క్తమగుచు బోవుచున్న దనియు మనకు దెలియగలదు. విశ్వాతీతమగు సత్యధార వ్య క్తిగతమగు ఆధారములో పృథగ్భావముగా రూపము దాల్చుచున్నది. లేక విశ్వాధారగుండ వ్య క్తిలో వేరుగా రూపాయిత మగుచున్నది. మరల వ్య క్తి ఆధారమును బట్టి వ్య క్తమగు చేతనలో కలుగు అభివ్య క్తి నిరూపిత మగుచున్నది. కావున అధిమానస క్షేత్రమున (Over mind) వ్య క్తియు, విశ్వమును విశ్వాతీతమగు మహా సత్యమును ఎటులు సంబద్ధములయి యున్నవో మనము కనుగొనగలము. ఈ తావున ప్రకృతి మూలగతిధార మనకు కనబడును.

ప్రకృతి రహస్యమునకు, సృష్టి రహస్యమునకు మూలము దీని పయి మెట్టున గలదు. ఈ అధిమానస స్తరము క్రింది వయిపున ఏక మనేకముగను, అఖండము ఖండముగను అగు ఆవేగము చూపట్టును. ఈ మండలము మీది భాగమున వ్య క్తి స్వాతంత్ర్య వేగమున్నను పరమసత్య మిచట అఖండమును, అనంతమును, అసీమమునేకాని దీని క్రింది భాగములోనే చేతనలోగల విభాజకతా శ క్తియు స్ఫుటముగను స్ఫుటతరముగను సాగిపోవును. ఈ రీతిగా ఈ అధిమానస భూమికలో సత్యదృష్టి యెడ ఏకదేశ దర్శితాదోషము కలుగుట కవకాశమున్నది. కావున మన యీ జాగ్రన్మనోమయ పురుషుని కడ కుపస్థితములగు సృష్టిమూల సూత్రము లన్నింటిలో ఏవి ముమ్మాటికిని సత్యములో, మరి యేవి కావో ఆ విషయ మీ యధిమానస చేతన తేల్పలేదు. కాగా సృష్టి వ్యాపారమును వ్యాకరించిన మూడు దర్శనములలో దేని కదియే యు క్తి సంగతమని మనకు తోచును. మనోమయ పురుషునిలో ఆధ్యాత్మికమగు నొక స త్త యున్న యటులును, అది నిజ ప్రకాశముకొరకు తన విరాట్ స త్తలో సృష్టిలీల చేయుచున్న టులును మనకు తెలియును. సాధనలో నిది యొక ఉపలబ్ధి. ఈ సాధనా కోణము మరియొక వైపునకు తిరిగినచో సృజనోల్లాసియగు మహాప్రకృతి నిర్వికారుడును శాంతుడును అగు పురుషుని ఆనందము కొరకు ఈ జగత్ సూత్రమును ధరించుచున్న దనియు, దీనిలో పురుషున కావంతయు క ర్తృత్వము లేదనియు, అతడు ద్రష్టమాత్రుడుగను, భో క్తృమాత్రుడుగను అనాస క్తుడుగను నున్నాడనియు

ఉపలబ్ధి కలుగును. ఇంతియకాక, దేని పరాక్రాంతి అనంతమును నిర్వికారమును అగు భూమి నాచ్ఛాదించునని కొందరు సాధకులు వక్కాణింతురో అల్ల మాయయే యీ ప్రపంచ రహస్యమనియు ఉపలబ్ధి కలుగును. ముత్తెరవల వారు నీయుపల బ్ధులలో ఒకొక ఉపలబ్ధి వెను వెనుక ఆధ్యాత్మిక తేజపు తీవ్ర ప్రభావమును, దృఢమగు తర్క ప్రతిష్ఠయు కలవు. అధిమానస చేతనా జ్యోతి వెలుగు జూచిన యెడల ఈ ఉపలబ్ధులలో ఏ యొకటియు అగ్రాహ్యమని యనుటకు వీలులేదు. కాగా ఈ యాధ్యాత్మిక గ్రంథిని విడదీయు టెటులు ? ఈ యధిమానస చేతనా భూమిక యందును ఏల యీ చిక్కు ? అని ప్రశ్న ఉదయించును.

అధిమానస చేతనా స్తరము నుండి చూచిన యెడల నిచటను దీనికిందను సంబుద్ధ మానసము లేక సంబోధి (Intuitive mind) ప్రదీప్తమానసను (Enlightened mind) ఉత్తరమానసము (Higher mind) అను ఈ చేతన లోని స్తరభేదములు ప్రస్ఫుతములై కానిపించును. వీనిలో దేనికి దానికే ప్రత్యేక ముగా విశ్లేషణ ముఖమగు ఆవేగము కద్దు. ఈ యావేగాఘాతముచే సమగ్రదృష్టి సర్వవ్యాపకతోపలబ్ధి తునిసి ఏకదేశదృష్టికి పర్యాయముగా పరిణమించును. ఈ అధిమానస భూమియందు పూర్ణమును ఖండించి చూచు వైఖరి చూపట్టును. విశేషించి దాని నిమ్నార్థమున, ఇటులీ విశ్లేషణ వేగము కిందకింద నున్న సమస్త చైతన్య భూములలో తీవ్రతరమును తీవ్రతమమును అగుచు దొరలుకొనివచ్చెను. కావున ఈ చేతనా భూములన్నింటిలో కలుగు ఆధ్యాత్మిక తత్త్వోపలబ్ధి సమగ్ర సత్యమని (Integral truth) స్వీకరించుటకు వీలులేదు.

సమగ్రతత్త్వము ద్విముఖము. అందొక ముఖము మీదనే చూపు నిలుపుదు మేని శాంతమును శుద్ధమునగు ఆత్మోపలబ్ధి కలుగును. ఇది నిర్గుణము, అవ్యవ హార్యము. (With whom there can be no Pragmatic relations) ప్రపంచోపశమము (In whom the world existence is stilled) అగ్రా హ్యము, అలక్షణము, శాంతము, శివము, అచంచలము అను ప్రతీతి విస్పష్టముగా కలుగును. ఇక, రెండవ ముఖము మీదనే చూపు నిలుపుదుమేని, మహాబ్రహ్మాండ సహస్ర సహస్రముల ధరించిన ఒక విరాట్ చిచ్ఛక్తి కేంద్రము కనబడును. ఈ రెండు ఉపలబ్ధులలో ఒకటి నిర్గుణమనియు, వేరొకటి సగుణమనియు వాడుక.

కావున ఈ నిర్గుణ బ్రహ్మోపలబ్ధియు, సగుణబ్రహ్మోపలబ్ధియు సమానముగనే ఆక్రాంతము లనియు, సమానముగనే సత్యములనియు స్వీకరింపవలయును. మానసచేతనలో నివి రెండును పరస్పరము విరుద్ధములని తోచినను, అధిమానస చేతనలో 'ఇవి రెండును అనంత సత్యమునకు రెండు మోములు' అను ప్రతీతి జాగరిలును. ఇటులగుటజేసి పరస్పర విరుద్ధ ధర్మాక్రాంతములగు ఈ రెంటిని అపూర్వ సమన్వయములో ధరించిన ఒక మహాసత్యమును మన మెరుగవలసి యుండును. క్షుద్రమగు మనమనస్సునకు అందదు గావున ఇది అనిర్దేశ్యమనియు అనిర్వచనీయ మనియు అనుకొనవలసి వచ్చినది. కాని పరతత్త్వస్వరూపము నిర్దేశింపదగినది కానే కాదని పట్టుపట్టిన యెడల – "ఈ సృష్టి ఎటులు సంభవ మాయెను? అనిర్వచనీయమగు నీయేకము నుండి తరగని అనేకము లెటులుత్పన్న మాయెను ? అను ప్రశ్నకేది సమాధి ? సృష్టికొక శక్తినిగాని, మాయనుగాని వేరుగా స్వీకరింతుమేని, ఆ శక్తిగాని ఆ మాయగాని బ్రహ్మముకంటె భిన్నముగా అవలనున్నవని ఒప్పుకొనవలయును. లేదా బ్రహ్మములోనే కలిసి యున్నవని అంగీకరింపవలయును. కాని ఈ రెండు సిద్ధాంతములును విచార సహములుకావు. శక్తిగాని మాయగాని బ్రహ్మముకన్న భిన్నములన్నచో, ప్రకృతిని పురుషుని అంగీకరించిన సాంఖ్య సిద్ధాంతమువంటి ఒక సిద్ధాంతములో జేరి ద్వైతమగును. ఇటు లగుచో పరమబ్రహ్మ పరమాస్తిత్వము స్వీకరింప పోయినటులగును. ఇక రెండవ సిద్ధాంతము నంగీకరించుచో, ఒక పరబ్రహ్మమే ఒక పెడ అనిర్దేశ్యు డనియు, మరియొక పెడ సమస్త నిర్దేశ్యములకును సంబంధములకును ప్రవర్తకు డనియు గ్రహింపవలసి వచ్చును. కాని ఇది విచారబుద్ధికి మింగరాని గడ్డపార. కావున ఈ యధిమానసదృష్టికి పరమేశ్వరుని సమగ్ర సత్యము పట్టుపడదని చెప్ప వలయును.

పరబ్రహ్మము అనిర్దేశ్యమనుమాట నిక్కమేగాని నిర్దేశ్యమగు నొక యెల్లలో స్వప్రకాశ సామర్థ్యము దానికి లేదను నర్థములో మాత్రము కాదు. ఇట్టి బ్రహ్మాండము లెన్నియయినను దాని యానంత్యమును, అసీమత్వమును శోషింపజేయజాలవను నభిప్రాయములో బ్రహ్మము అనిర్దేశ్యమే. బ్రహ్మ మిట్టిది అని ఎన్నియేని విశేషణములచేగాని, యోగ్యమగు నెన్నియేని విశేషణముల

సముదాయముచేగాని పరిమేయము కాదను నర్థములో బ్రహ్మము అనిర్దేశ్యమేకాని, అది తన్నుదా పరిమిత మొనర్చుకొనజాలదను నర్థములో మాత్రము అనిర్దేశ్యము కాదు. కావున అధిమానస భూమికలో గలుగు నుపలబ్ధి మూలతత్త్వము కాదు. ఇట గలుగు ఉపలబ్ధులును అనుభూతులును చేతనాలోకముచే మనోజ్ఞ్వలములే కాని ఆ యాలోకము మాత్రము సర్వతః ప్రసృతము కాదు. దట్టమగు చీకటి తుటుములు దాని నలుప్రక్కలను కుండలితములయి యున్నవి కాన సమగ్రమగు సత్యము. ఆద్యంతములు లేని జ్యోతి కనబడదు. పూర్వాచార్యులు ఈ అధిమానస భూమికనే పట్టి ద్వైతవాదము, నేతివాదము, శూన్యవాదము - మొదలగు ఆంశిక సత్యమే సమగ్ర సత్యమని ఉద్ఘోషించి పోయిరి.

మనోభూమిలోగాని అధిమానసభూమిలోగాని (Over-mind) మనకు నిండుసత్యము దొరకదు. అది దొరకున దీరెంటిని దాటిన వేరొక భూమికలో. అది అతిమానస చేతనా భూమిక (Supramental Consciousness). ఆ అతి మానస భూమిక కెగురగలిగిన యెడల సృష్టిమూల రహస్యము మనకు కరతలా మలకము. ఆ భూమి విజ్ఞానమయము. ఈ విజ్ఞానమయ లోకమునందు అనంత మగు ఋతచేతన (Truth Consciousness) అనంతమగు తన ఉనికిలో, అనంతమగు తన శక్తులతో దేశకాలముల నతిక్రమించిన సత్యములను, దేశ కాలములలో అనంతముగా ప్రకటించి వానిని ధరించుచున్నది. బ్రహ్మమిచట అత్యంతాభావము (All-negating Abslolute) గాని, సుదుర్నిరూపము (rigid indeterminable)గాని, అనంతమగు బండి సున్న (infinite zero) గాని కాదు.

సత్యములగు సృష్టి మూలతత్త్వములు సచ్చిదానందమయుని ఋతచేత నలో (truth consciousness) వింతపొం దెనసియున్నవి. విజ్ఞానమయమగు సృష్టి ప్రక్రియలో వికాసోన్ముఖములగు తత్త్వములును, వాని బీజములును, వాని ఫలితములును పిండీకృతములై దుర్విభేదములై యున్నవి. అనంతమగు ప్రకాశవేగ ప్రవాహ మిచట విచ్ఛిన్నము కాలేదు. మరియు పరస్పర విరోధ మిచట చూపట్టనయిన చూపట్టలేదు. సర్వతః ప్రసృమరములును, విజ్ఞానమయ ములును అగు సత్తా చేతనా శక్తు లిచట నానాత్వ బహుత్వముల నట్టనడుమ ఏకత్వమును పెనపైచుకొని నిలుపుకొనుచున్నవి. ఇచట బడయగల తొట్టతొలు తటి మూలోపలబ్ధిలో సచ్చిదానందముల మూటియు సమన్వయ సుషమ అని దంపూర్వము. మానస భూమిలోగాని, అధిమానస భూమిలోగాని సచ్చిదానంద ములలో నొక సత్తుగాని, ఒక చిత్తుగాని, ఒక ఆనందముగాని స్వతంత్రముగా వికాసము చెందవచ్చును. అటులు వికాసము చెందిన పిదప, మనము వీనిలో ఏ యొకదానితోనేని నిట్టనిలువున మునిగిపోయి మిగులు రెంటిని స్వీకరింపకపోయిన స్వీకరింపక పోవచ్చును. అనగా మనమొక సమాధ్యానందమునందే మునిగిపోయితి మేని అపుడు సత్యమయమును, చేతనామయమును అగు రెండు తత్త్వములను

మన తత్త్వమునకు పట్టికపోవచ్చును. ఈ రీతిగనే మనము సత్యమయమగు తత్త్వమునందే మునిగి జ్ఞానానందముల నేమరవచ్చును. ఇటులే సత్యజ్ఞాన తత్త్వములను ఉపసర్జనము చేసికొని ఒకేఒక చిత్తత్త్వమున విలీనులమై జ్ఞానఘనులము కావచ్చును. కాని అతి మానస క్షేత్రమునందు లేక విజ్ఞానమయ లోకమునందు (Super mind) ఈ విస్మృతి, ఈ యేకదేశాంగీకృతి పొసగనే పొసగదు. ఏలయనగా నిచట నీ మూడును ఓతప్రోతములు. సచ్చిదానందము లిచట నొక ముప్పిరి దారము. విజ్ఞానమయ లోకము (Super mind) నందలి సమన్వయ సామంజస్యమును భావింపబోయినంతలో మనము గుంటలో పడిపోదుము. ఏకాగ్రతతో ఏకత్వము దెసనే చూపు నిలుపుదుమేని మనకీ యేకత్వమొక జడ పిండమై కనబడును. దానిలో నేమూల నెమకినను ఎంత గాలించి చూచినను బహుత్వ స్పర్శ గోచరింపదు. వైచిత్రీ విన్యాసము కనబడదు. ఇక ఏకాగ్రతతో నానాత్వముదెస చూపు త్రిప్పితిమేని ఎటుచూచినను నానాత్వమే ప్రత్యక్షమగును, విభేదమే విశదమగును. వైపరీత్యమే వెంపరలాడును. కాని అతి మానస భూమిలో (Supramental Consciousness) బహుత్వ వికాసభంగి, నానాత్వాంకురము, స్వచ్ఛముగను స్పష్టముగను కనబడును. అచట క్రింది లోకములోని చీకటి వెలుగుల చెలగాట మిసుమంతయు లేదు.

విజ్ఞానమయ భూమిలో అనంతమగు సత్తయు, అనంతమగు చేతనయు, అనంతమగు శక్తియు, అనంతమగు లీలలతో నిండుకొని యున్నవి. ఇచట నే విధమగు సంఘర్షముగాని, విరోధముగాని లేదు. స్వైరతగాని, వైపరీత్యముగాని యిచట మొగము చూపలేదు. సత్యములును అనంతములునగు తత్త్వములన్నియు నిచట నంగాంగిభావముతో కలిసి ఒక విద్యుత్ఖేల చేసికొనుచు బోవుచున్నవి. ఇచట తొలుదొలుత సత్తు - చిత్తు - ఆనందము; అను నీమూటి అవిభక్తానుభూతియు, బహుత్వములోని పరమాణువు పరమాణువు నందును ఈ మూటి ఏకత్వానుభూతియు కలుగును. ఈ సచ్చిదానంద త్రయములో సత్తునకును ఆనందమునకును విడివిడిగా కొన్ని భావప్రవాహము లున్నవి. ఆత్మ (Self) ఈశ్వరుడు (The Divine) పురుషుడు (The conscious being) జ్ఞానము, ఇచ్ఛ మొదలగునవి. సంతోషము, సౌందర్యము, ప్రేమ మొదలగునవి. ఇందు ఆత్మేశ్వర పురుషులు సత్కుటుంబమునకును, జ్ఞానేచ్ఛాదులు చిత్ కుటుంబమున

కును, సంతోష సౌందర్య ప్రేమాదులు ఆనందకుటుంబమునకును చెందినవి. విజ్ఞానమయములగు నీ త్రోవ లన్నిటిలోనే సృష్టి మూల రహస్యము. ఈ విజ్ఞాన ధామమే సృష్టికి మూల కేంద్రము.

మరి యీ మూలత్రయి నుండియే ముత్తో9వల బారు నొక క్రొంగ్రొత్త లీలా ప్రవాహము మనకు గానిపించును. ఆనందము, ఆనంది, ఆనంద్యము.. జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము లేక విషయగతమగు ఆత్మ, విషయిగతమగు ఆత్మ, వీని సంసర్గము. ఈ త్రిపుటిలో ఆనందమున కాశ్రయుడు (Subjective) ఆనంది; ఆనందమునకు విషయము (Objective) ఆనంద్యము; ఇటులే జ్ఞానమున కాశ్రయుడు (Subjective) జ్ఞాత. జ్ఞానమునకు విషయము (ఘటాదికము) జ్ఞేయము. (Objective) ఇది యెల్లయు ఆత్మలో స్వగతమగు త్రేధా ప్రతిఫలనము. ఈ క్రమ మవలంబించి ఏకమును అఖండమునగు చేతనయు, సత్తయు, శక్తియు బహుచేతనా సత్తా శక్తులలో ప్రతిఫలించుకొనుచు బోవుచున్నది. అనగా తనలోతానే ప్రతిఫలించుకొనుచు బోవుచున్నది.

అతి మానస చేతన యందు ఈ నానాత్వ బహుత్వములు ఏకత్వముమీదనే సంప్రతిష్ఠితములు. మన మీ అపూర్వ సమన్వయమును మానసిక చేతనా సాహాయ్యముచే కనుగొనజాలము. ఏలనగా కండెతుండెములుగా విడగొట్టి చూచుటయే మనస్స్వభావము. సంపూర్ణతను కనుగొనజాలు శక్తిగాని, తెలివిగాని మనస్సునకు మొదల లేదు. కాని మనశ్చేతన వెనుక మనస్సాహాయ్యము చేతనే మనస్సునతిక్రమించి సత్యమును చూడగల పట్టుదల మానవున కున్నది. సృష్టిమూలమున గల శక్తి చేతనా నందములే ఆ సత్యము. తదానంద ఆస్వాదమునకే ఆ పట్టుదల.

అంధకారాచ్ఛన్నమగు మనోమయ భూమి యందుగాని, దానికంటే నిమ్నములగు భూములందుగాని ద్వంద్వములయు సంఘర్షములయు నడుమబారు ప్రవాహములలో ప్రతి యొకటియు అతి మానస భూమిలో ఒకొక ఆధ్యాత్మిక సార్థక్యము పొందుకొరకే పరుగిడుచున్నది. ఊర్ధ్వతన చేతనా వ్యాప్తమగు జగత్తు, అధస్తన చేతనా వ్యాప్తమగు జగత్తు – ఈరెండును అనంత ప్రస్ఫుమరమగు అతి మానసతత్త్వము సృజించిన అపూర్వసృష్టి.

సమస్త సృష్టి నతిక్రమించి నిరపేక్షముగను దుర్నిరూపముగను ఉన్న కేవల తత్త్వము గూడ అతి మానసదృష్టి కంగి కగోచరము కాదు. సచ్చిదానంద

మయుని అనిర్దేశ్యమగు స్వరూపము అజ్ఞేయమని తోచునుగాని, అంతమాత్రముచే అనిర్దేశ్యమగు నా యుపలబ్ధి దుర్విజ్ఞేయమును దుర్భేద్యమును అగు అభావోపలబ్ధి గాని, అంధకారోపలబ్ధిగాని కాదు - ఈ రెండు భంగులును ఉపనిషత్తులలో గన బడును - మనస్సుతో గూడ పొందు లేక పలుకులు మరలును. (1)ధీరు లానంద మును అమృతమును అగు ఆత్మను విజ్ఞానముచే చూచుచున్నారు. (2) అపూర్వ మగు సచ్చిదానందమయుని వెలుగుచే అదియు భాస్వరమును ప్రదీప్తమును అగును. కాని దాని అనంత్యమును అసీమత్వమును వర్ణనమున కావలివి. ఏలనగా పూర్ణముగా గ్రహించినను పూర్ణమే మిగిలియుండగల దిది. ఈ మహా సత్యము నేకాగ్రమగు చూపుతో నవహింతుమేని 'ఇది నేల కాదు, నీరు కాదు, నిప్పు కాదు, గాలి కాదు, నింగి కాదు, అహంకారము కాదు, మహత్తుకాదు, అవ్యక్తము కాదు, - అని యిటులు నిషేధముఖముగా చెప్పుటకంటె వేరుగతి లేదు. కావున ఈ తత్త్వము అదృష్టము, అగ్రాహ్యము, అవ్యవహార్యము. అలక్షణము, అచింత్యము, అవ్యపదేశ్యము, అక్షరము, అనిర్దేశ్యము - అను నీ మొదలగు పదములచేతనే వ్యాఖ్యేయము. మరి యీ సత్యము రెండవమోము నేకాగ్రతతో చూతుమేని ఆ యుపలబ్ధి వేరు. అది సగుణము. విజ్ఞానమయ చేతనలో ఈరెం డుపలబ్ధులును అపూర్వమగు నొక సమన్వితిలో యుగప దుద్భాసితము లయి యున్నవి.

ఈ యతిమానసభూమిలో కలుగు ఆధ్యాత్మికోపలబ్ధియందలి వేరువేరు తీరులకు విశిష్టమగు స్థానమును తాత్పర్యమును గలదు. అధిమానస (Over-mental) భూమిలో గలుగు నుపలబ్ధులలో సంఘర్ష వైపరీత్యము లుబుకుకొని రాజూచునని మున్నెరిగి కొంటిమి. ఈ రెండు భూములలో గలుగు నుపలబ్ధులలో అనుభూతులలో నొక భూమియందు గలుగు నుపలబ్ధియు అనుభూతియు మరి యొక భూమిలో గలుగు నుపలబ్ధిని అనుభూతిని అనుమతింపనొల్లదు. కావున ఈ భూమికలో గలుగు ప్రత్యేకానుభూతికి ఏకదేశ దర్శితా దోషము దుర్ని వారము. ఏలయనగా ఇచటి చేతనలో ఖండప్రకాశమునకును భేదాంకురమునకును ప్రథమ సమున్మేషము. కావున ఈ స్తరమునందు అంశమునకు సమగ్రముగను

1. యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ.
2. తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా ఆనందరూప మమృతం య ద్విభాతి.

అఖండమును ఖండముగను భావించి ప్రచార మొనరింప అనివార్యమగు ఇచ్ఛ జనించును. అతిమానసికమగు (Supramental) దృష్టి భంగి, ఈ అధిమానసిక (Overmental) స్తరమునందలి ప్రతి అనుభూతికిని ఒకానొక పరమ సార్థక్యమును పరమోద్దేశమును సిద్ధింపజేయు నుపాయమును సమకూర్చి పెట్టును.

ఈ యతిమానస తత్త్వమున గల సృజనశక్తి వెలయించు కౌశలమంతయు వింత గొలుపును. అనంతమగు చిచ్ఛక్తి (Consciousness force) ఇసుమంతయు కనిపించనంతగా తన్నంతయు దాచికొనిన జడమునందును ఆ కౌశలి మనకు కనబడును. ఆ యనంతచైతన్యశక్తికి జడము ప్రధానసాక్షి. అయ్యనంత శక్తికే ఆత్మగోపనము చేసికొనగల అనంతకౌశలము లేనిచో దాని యానంత్యము మాసిపోయెడిది. భూమను యథాతథముగా తెలుపవలయుచో దానికి సంపూర్ణమగు సంకోచశక్తి కలదని ఇయ్యకొని తీరవలెను; భూమకు ఊర్ధ్వజ్యోతిలో ఆత్మ సమాహితావస్థ ! కింద, అచలమును నిశ్చేతనమునగు ఈ స్థాణువులో తద్విపరీతావస్థ !!.

పైని అతిమానస చేతనము; (Supra Conscience) కింద జడాంధకారము: (Night of Inconscience) ఈ రెండును ఒకే సత్యమునకు విరుద్ధమగు రెండు దిక్కులు. సత్తా శక్తి చేతనల అతిమానస క్షేత్రము ఒకానొక వెలుగులో జిగేలు జిగేలుమని దీపించుచు ఊర్ధ్వమున సంప్రసారితమయి యున్నది. దాని యెరుక యెరుకపొలము లన్నిటికిని ఆవల. దాని నిండార నెరిగినను, ఎరుగ లేదను మపలబ్ధి కలుగును. ఇట్టి ఉనికియు, ఇట్టి ఆనందమును, ఇట్టి వెలుగును సత్యమయములగు అధిమానస స్తరము (Over mind) సంబుద్ధమానసము (Intuitive mind) ప్రదీప్తమానసము (Enlightened mind) ఉత్తర మానసము (Higher mind) అను భూమికలగుండ కిందికి దిగి, వీని కింద నున్న మనోమయ - ప్రాణమయ - అన్నమయ క్షేత్రములకు వాలినది. ఇట్టి అవతరణ భంగి చేతనే యీ విశ్వసృష్టి !

అతిమానస తత్త్వమును పూర్తిగ నెరుగుచో విశ్వము మిథ్యయనిగాని, అలీకమనిగాని తట్టదు. ఇంతియకాదు. స్వతంత్రమగు నొక విశ్వశక్తిచే

ఈ మహాలీల జరుగుచుపోతున్నదనిగాని, దాని యధ్యాస శాంతమును నిర్వికారము నగు అక్షర బ్రహ్మముపై బడుచున్నదని గాని తోచదు. ఇచట జగల్లీల యెల్లయు సచ్చిదానందమయుని చిచ్ఛక్తిలో ఒక అంశమునందు స్వగతమగు ప్రతిఫలన మను భ్రాంతిలేని జ్ఞాన ముదయమగును. విశ్వమునందలి ప్రతిస్తరము గూడ సత్యము విశిష్టమునగు నొక్కొక తత్త్వమునందలి గూఢతాత్పర్యమును వహించుచునే పోవుచున్నదని తేటతెల్లముగా గోచరించును.

ఈ యతిమానస జ్ఞానమే ఉత్తమ జ్ఞానమా, దీనికన్న ఉత్తమమగు జ్ఞానము వేరొకటి ఉన్నదా ? లేక అతిమానస భూమికన్న ఉత్తమమగు కొండొక భూమి ఉన్నదా ?

సచ్చిదానందమయునికి బహుత్వములో ఆత్మ ప్రకాశ మనునది- 'బహు స్యాం ప్రజా యేయేతి' - ఒక లెక్కలోనిది కాదు - అది ఒక అంశమే.

అనంతమును శాశ్వతమునగు నొక సద్వస్తువు, అనంతమగు ఒకచిచ్ఛక్తి అపరిసీమమగు నొక యానందము ప్రతి పరమాణువునందును అనుస్యూతమయి యున్నది. సచ్చిదానందమయమగు నీ వస్తువు ద్విముఖము. ఒక ముఖము నిర్గుణము, మరొకటి సగుణము. సత్తని చెప్పినంత మాత్రమున సర్వమును చెప్పబడదు. ఏలయన ఈ సద్వస్తువే మరల సత్పురుషుడు. ఆయీ పరమసత్త మన ఊర్ధ్వ చేతనలో (Absolute and Omnipresent Reality) ఆత్మగను, (Self) ఈశ్వరుడుగను, (The Divine Being) పురుషుడుగను (the Conscious being)ముత్త్రివిధముల ప్రకాశించును. ఇక అతని చిచ్ఛక్తి మాయ, ప్రకృతి, శక్తి అను మూడులతో దృశ్యాదృశ్యమగు నీ జగత్సమూహమున లీలలతో ఓలలాడుచున్నది. బ్రహ్మమయి యగు మాయ సృష్టికి పైనుండి భావ జగత్తునందును, కారణ జగత్తునందును విత్తనములు చల్లుకొనుచుబోవుచున్నది. ఇక మహా ప్రకృతి ఆ బీజములకు మూర్తి దాన మొనరించి ధరించుచున్నది. మరి యీశ్వరశక్తి యన్ననో ఉభయ సంయోగమును స్థాపించుకొనుచు బోవుచున్నది. ఇది ఒక మహాశక్తియే త్రేధాభివ్యక్తి. ఈ విశ్వలీలకు బయటను, లోపలను ఒకటియే సత్త చిజ్జీవేశ్వరులు. ఆ సత్తకు మూడు శక్తులు; మాయ, ప్రకృతి, ఐశ్వరశక్తి. జగల్లీల నొక కొతికికి దేవలయుచో అనంతమగు సత్తునకుగల

మూడు రూపులును, దాని లీలాశక్తికిగల మూడు రూపులును చూపులో నుంచు కొనవలయును. నిర్గుణ బ్రహ్మమునకును, సృష్టికిని జీవస్వాతంత్ర్యమునకును నడుమగల సంబంధమును సమంజసముగ సమన్వయింప వలయుచో పరమ పురుషుని యీ మూడవ స్థానములును ఆ పురుషోత్తముని శక్తి యందలి త్రివిధములగు లీలలును ఎట్టెదుట నుంచుకొనవలయును. సరియ! ఏకాంశమగు ఈ బహుత్వమును దాటి దానికి పయినున్న సచ్చిదానందమయునకు ఏకత్వము, కేవలత్వము (బ్రహ్మాద్వైతము) కలదా, మరి లేదా? ఉన్నయెడల - 'అతి మానసావస్థకు స్థానమెచట? విజ్ఞానమయ చేతన సచ్చిదానంద స్వరూపుని నిజస్వమగు శక్తి. కావున అతిమానస ఋతచేతన (Supramental truth Consciousness) ఆయీ పరమ సత్యదేశమునం దెల్లెడలను స్వప్రకాశము కలది. సచ్చిదానంద స్వరూపుని కేవలత్వముతో, ఏకత్వముతో దానికి సంపూర్ణ ముగా సారూప్యము సాయుజ్యము సాలోక్యము కలదు. విజ్ఞానమయమగు నీ సచ్చిదానందతత్త్వమే పరమ సత్యము. దీనికి పైనేమియు లేదు-

"పురుషా న్నపరం కిఞ్చిత్
సా కాష్ఠా సా పరా గతిః".



# 12. యోగ సుధాకరము

అను

# యోగసూత్రవృత్తి

అవ: వలయువారి ప్రవృత్తికి అనువుగా ఈ శాస్త్ర మీ విషయమును చెప్పనని భగవత్పతంజలి తెలుపుచున్నాడు.

—అథ యోగానుశాసనమ్

అర్థము: యోగానుశాసనమ్=యోగశాస్త్రము, అథ = ఆరంభింపబడుచున్నది.

వృత్తి: 'అథ' శబ్దమునకు ఆరంభమనియు, మంగళ మనియును అర్థము. యోగము సమాధి.

అను=హిరణ్యగర్భుడు తొల్లి చెప్పిన శాస్త్రము ననుసరించి చెప్పబడిన, శాసనమ్=శాస్త్రము. ససాధకమును సఫలమునగు సమాధి దీనిచే వివరింపబడును. కైవల్యము కోరువానికి చెప్పదగిన యోగమును గూర్చి చెప్పుశాస్త్రము ఆరంభింపబడుచున్నదని అక్షరార్థము.

సంప్రజ్ఞాత మనియు, అసంప్రజ్ఞాతమనియు సమాధి ద్వివిధము. అది చిత్తధర్మము. చిత్తము త్రిగుణాత్మకము. దాన నది ఐదు విధములు. క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము. ఈ ఐదింటిని 'భూము'లనియందురు. రజస్సుచే విషయములలోపడి కొట్టుకొనునది క్షిప్తము. తమస్సుచే నిద్ర సోమరితనము మొదలగు వృత్తులు కలది మూఢము. ఈషద్రజస్తమస్సుల స్పర్శ కల సత్త్వముచే ఎపుడో ధ్యానమున కనువయినది విక్షిప్తము. క్షిప్తము కంటె ఇది విశిష్టము. రజస్తమోమలములు అడగి శుద్ధ సత్త్వముతో గూడినది ఏకాగ్రము. వృత్తులన్నియు శమింపగా మిగిలిన సంస్కారము కలది నిరుద్ధము. (చూ. 16 సూ). ఇటులు కావున మొదటి మూడును గాక మిగిలిన రెండు

భూములతో గూడిన చిత్తమునకు సంప్రజ్ఞాతా సంప్రజ్ఞాత సమాధులు - రెండును ధర్మమని వివేకము.

విశేషము :- 'యుజ=సమాధౌ (దివాది) + ఘఞ్ = యోగ = సమాధి, అనుశాసనమ్ = హిరణ్యగర్భుడు చెప్పిన శాస్త్రము ననుసరించి చెప్పబడిన శాస్త్రము. 'శిష్యతే అనేన=దీనిచే వివరింపబడును. గావున 'శాసనమ్ = శాస్త్రము.

వివరణము :

అవ:- ఇరుతెరగులగు ఈ సమాధికి కలసివచ్చునటుల ఒకే లక్షణమును చెప్పుచున్నాడు.

—యోగ శ్చిత్తవృత్తి నిరోధః— ౨

అర్థ :- చిత్త...ధః—చిత్త = చిత్తముయొక్క, వృత్తి = రజస్తమో వృత్తులయొక్క, నిరోధః = అరికట్టుట, యోగః = యోగమని చెప్పబడును.

వివ—తత్త్వముల పరిపూర్ణజ్ఞానముచే పరిపక్వమయిన చిత్త మెందుం డునో అది సంప్రజ్ఞాత యోగము. ఏకాగ్ర భూమియందు సమాధి యొదవినచో సంప్రజ్ఞాతము సిద్ధించును. ఈ సమాధిలో బాహ్య విషయములు దుఃఖ జనకము లని లెస్స తెలిసి వాని యెడల వైరాగ్యము కలుగును. సంప్రజ్ఞానము పడసి దానిచేగూడ విరక్తితో చిత్తము నరికట్టుచో వృత్తులులేని సమాధి కలుగును. అది అసంప్రజ్ఞాతము. నిరుద్ధభూమియందే ఇది సిద్ధించును. కావున వివేకము కంటె వేరైె తన కభీష్టమైన ఒకానొక వృత్తికంటె అన్నివృత్తులను నిరో ధించుట సంప్రజ్ఞాతము. సకల వృత్తులను నిరోధించుట అసంప్రజ్ఞాతము.

వృత్తి :- రజస్తమో వృత్తుల నాకట్టుట యోగమని అర్థము. ఇట్లు చెప్పుటచే సాత్త్వికవృత్తి ఉన్నను సంప్రజ్ఞాత సమాధియందు అవ్యాప్తిలేదు.

వివరణము : మనకు కుండ కర్ర మొదలగు జ్ఞానములు కలుగుచుండును. చిత్తముయొక్క ఇట్టి ఖండఖండ జ్ఞానావస్థకు వృత్తియనియు, ప్రత్యయ మనియు పేరు. వృత్తి సమష్టియే చిత్తము. (౪వ సూత్రము చూ.)

అవ- 'బుద్ధి వృత్తి స్వభావము కలది చితిశక్తి. వృత్తిని నిరోధించుచో దానికి ఉనికి ఎటులు?' - అని శంకించి చెప్పుచున్నాడు—

—తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్— ౩

వృత్తి- తదా = వృత్తులన్నియు అడగినపుడు, ద్రష్టుః = చితిశక్తికి, స్వరూపే = స్వాభావికమైన రూపమునందు, స్థితిః = ఉనికి.

దాపున ఎఱ్ఱపూవులు తీసివేసినచో స్ఫటికము తన సహజస్థితిలో నున్నటులు, చితిశక్తియు తన స్వరూపము నందుండును. చితిశక్తికి చైతన్యమాత్రము స్వభావము. అంతియకాని వృత్తులు స్వభావము కాదు.

వివ- ద్రష్టయన ఎరుగువాడు. ఇత డిరు దెరగులు. 'నేను కుండ నెరుగుచున్నాను.' అను ఎరుకను ఎవడెరుగునో, మరియు ఆ యెరుక నెరుగు నేనును గూడ ఎవరెరుగునో అతడింకొక ద్రష్ట. ఈ చరమద్రష్టయే అసలు ద్రష్ట.

కుండ మొదలగు వాని నెరుగువానిని 'అస్మీతిమాత్ర' అనియు, 'అస్మితాబుద్ధి' యనియు నందురు. ఇతనికి వ్యావహారికుడని, విరూపద్రష్టయని గ్రహీతయనియు పేళ్లు. ఈ ద్రష్టను గూడ నెరుగువాడే స్వరూపద్రష్ట.

ద్రష్ట ఎల్లపుడును స్వరూపమునందే యుండును గాని చిత్తవృత్తులబట్టి సూర్యబింబము అలలలో కొట్టుకొనుచున్నటులు చంచలుడని తోచును.

అవ- ఓయీ! వృత్తులు పొడమినపుడు చితిశక్తికి స్వరూపభ్రంశము కలుగదా యనుచో చెప్పుచున్నాడు—

—వృత్తి సారూప్య మితరత్ర- ౪

అర్థ :- ఇతరత్ర = వృత్తులను నిరోధింపనపుడు, సారూప్యమ్ = వృత్తులతో సమాన ధర్మము - అనగా ఏకరూపత్వము (తోచును.)

వృత్తి :- నిర్వికారమైన చితిశక్తి యెల్లపుడును స్వరూపమునందే యుండును. వృత్తులు అనిరుద్ధావస్థతో పుట్టుచుండునపుడు ఆ వృత్తులలో చితిచ్ఛాయ ప్రతిబింబించుచుండును. ఈ సంగతి తెలియక చితిశక్తి జపా-

కుసుమములచే ఎఱ్ఱబారిన స్ఫటికమువలె వృత్తులతో తాదాత్మ్యము పొందిన చందముగా నుండును. కావున స్వభావభ్రంశము లేదు. ఎఱ్ఱది అని భ్రమ కలిగిన సమయమందు స్ఫటికము తన తెల్లదనపు స్వభావమునుండి తొలగిపోవ దని భావము. ఈ రెండు సూత్రములచేతను రెండవ సూత్రమునందలి 'చిత్త' పదము ఇటులు వ్యాఖ్యానము చేయబడినది: దేని నిరోధముచే చితిశక్తి స్వరూపము నందుండునో, దేని జాగరణముచే స్వరూపమునం దుండనటు లుండునో అది 'చిత్తము'.

వివ:- రాము డొక కుండను చూచునని అనుకొందము. కుండను చూచు ఆ క్షణమున 'కుండకంటె నేను వేరు' అను జ్ఞానము కలుగదు. కాగా 'దృశ్యముకంటె ద్రష్ట వేరు' అను జ్ఞానము కలుగకపోవుట వృత్తి సారూప్యము. ద్రష్ట స్వభావముగా వేరైనను వృత్తులతోడి సరూపతచే స్వరూపోపలబ్ధి కావుట లేదు.

వ్యావహారికద్రష్టయు, చరమద్రష్టయు వేరైనను 'నేను జ్ఞాతను నేను జ్ఞాతను' అని ఎల్లపుడును పై యిరువురను కలుపు ఏకత్వజ్ఞాన మొదవు చుండును. ఈ అభిన్నజ్ఞానమే ఈ అవివేకమే ద్రష్టతో వృత్తి సారూప్యము. భేదజ్ఞానమే వివేకఖ్యాతి.

ఈ చరమద్రష్ట చైతన్య స్వరూపుడు. ఆ చైతన్యముచే చేతన కలిగిన దానివలె చిత్తము విషయములను గ్రహించును. ఇటులు గ్రహించునపుడు 'నేను గ్రహించుచున్నాను' అని అనుకొను గ్రహీత ఒకడు బయలుదేరుచున్నాడు. అతడే వ్యావహారిక గ్రహీత లేక వికారపురుషుడు. చిత్తము గ్రహణము లేక దర్శనశక్తి. విషయ గ్రహణమునం దిది గ్రహీతకు కరణము.

మరియొక అవస్థలో ఈ చిత్తము గ్రహీతకు గ్రాహ్యముగా అనగా దృశ్యముగా అగుచున్నది. ఎటు లనగా 'అస్మిత' పేరి అభిమానము లేక అహంకారము చిత్తమునకు ఉపాదానము. ప్రతిఖండ జ్ఞానమును ఈ అహంకారముగా పరిణమించుచుండును. చిత్తగతమగు విషయజ్ఞానము ఆయా 'అహంకారము' లేక 'అభిమానము' యొక్క విశేషాకారమగు వికారమాత్రము. చిత్తమును స్థిర మొనరించి పరిణమించుచుండు నీ యహంకారమున నెలకొనుచో

దాని వికారములగు విషయములు వేరుగా కానిపించును. ఈ యవస్థలో విషయములను తెలుపు చిత్తము అనగా విషయాకారములగు చిత్తవృత్తులు దృశ్యములగును. వృత్తులే చిత్తమని తెలిసికొనియున్నాము గదా! మరి అహంకారము గ్రహణము లేక దర్శనశక్తి అనగా కరణము అగు అభిమానమును నీ యహంకారమును అడచి శుద్ధమగు అస్మిభావమున అనగా అస్మితాధ్యానమున నుందుమేని అపుడు ఈ అభిమానము వేరని తెలియును. ఈ యవస్థలో శుద్ధమగు అహంభావము కరణముగను, అభిమానము లేక అహంకారము దృశ్యముగను అగును. మరి శుద్ధమగు నీ యహంకార బుద్ధియు జడము, వికారశీలము నని తెలిసి సమాధిప్రజ్ఞచే బుద్ధిప్రతి సంవేదియగు పురుషుని ఉనికి వివేచించుచో ఆ వివేకజ్ఞానము పురుషుని ఉనికినే తెలుపుచుండును. ఆ వివేకజ్ఞానముగూడ అడగి పరవైరాగ్యముచే విషయాభావముగా లీనమగును. అనగా జ్ఞాతృత్వమునందలి అస్మితారూపమగు పరిచ్ఛేదముగూడ సమయును. అటులు సమసినపుడు ద్రష్ట స్వరూప స్థితుడైనట్లు. ఆ యవస్థలో శుద్ధబుద్ధియు వేరని తెలియును గావున అదియు దృశ్యమగును. ఈ రీతిగా బుద్ధి మొదలుకొని అన్నియు దృశ్యములే.

అవ :- ఇపుడు నిరోధింపదగిన వృత్తులు ఇన్ని అని చెప్పుచున్నాడు-

—వృత్తయః పంచతయ్యః క్లిష్టా అక్లిష్టాః— ౫

వృత్తి :- వృత్తులు అయిదు విధములు. మైత్రుడు చైత్రుడు మొదలగు పలువురు పురుషుల అభిప్రాయముచే బహువచనము (కానిచో వృత్తి అయిదు విధములనియే చెప్పవచ్చును.) అవి ఎట్టివి? క్లిష్టములును అక్లిష్టములును... సూత్రమున చెప్పబోవు క్లేశములతో కలసినవియు స్వరూపస్థితిని తోపజేయనవియును క్లిష్టములు. క్లేశములతో కలియనవియును స్వరూపస్థితిని తోపజేయునవియును అక్లిష్టములు. క్లిష్టములకును అక్లిష్టములకును ఐదింటియందే అంతర్భావమయినను క్లిష్టములను మాత్రమే నిరోధింపవలయునని తలచు మందబుద్ధులను నివారించుటకు అక్లిష్టములుగూడ క్లిష్టములతో ఉదాహరింపబడెను.

విశేష :- పంచతయ్యః = చెప్పబోవు ప్రమాణము మొదలగునవి ఏ సామాన్య వృత్తులకు ఐదు అవయవములో అవి 'పంచతయ్యః' అని చెప్పబడును. అనగా ఐదు విధములు. అవి ఇటుపై సూత్రముచే చెప్పబడును.

అవ :- ఇటుపైని, పేర్లచేతను లక్షణములచేతను వృత్తులను విశదము చేయుటకు ఆరు సూత్రములను చెప్పుచున్నాడు—

—ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః— ౬

అర్థ :- ప్రమాణ మనియు, విపర్యయ మనియు, వికల్ప మనియు, నిద్ర యనియు, స్మృతి యనియు వృత్తుల పేరులు.

వృత్తి :- వీనికంటె వేరు వృత్తిలేదని ఉద్దేశసూత్రమునకు ఫలము.

—ప్రత్యక్షానుమా నాగమాః ప్రమాణాని— ౭

అర్థ :- ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అనునవి ప్రమాణములు. వెనుక చెప్పిన అయిదు విధములగు వృత్తులలో 'ప్రమాణము' అను వృత్తి ప్రత్యక్ష మనియు, అనుమాన మనియు, ఆగమ మనియు మూడు విధములు.

వృత్తి :- మూడే ప్రమాణము లని భావము. వృత్తియందలి తెలియని అర్థమును అవగహించిన చితిశక్తియొక్క ప్రతిబింబము ప్రమ. ప్రమకు కరణమగు వృత్తి ప్రమాణము. 'ప్రమకు కరణము - ప్రమాణము' అని సామాన్య లక్షణము. ఆ ప్రమాణములలో కన్ను మొదలగు ఇంద్రియములచే వ్యక్తి విశేషమును నిర్ధారణ మొనరించు చిత్తవృత్తి ప్రత్యక్షప్రమాణము. ఘటాద్యాకారవృత్తియందు చితిశక్తియొక్క ప్రతిబింబము ప్రత్యక్షప్రమ. ఇటులు ధ్యాన సమాధిచే చితిశక్తి విశేషమును తెలుపు సంప్రజ్ఞాతమను పేరి చిత్తవృత్తి ప్రత్యక్షప్రమాణము. జ్ఞాత లేక చితిశక్తి ఫలము.

లింగజ్ఞానముచే అనగా హేతువైన పొగ మొదలగు దానిచే లింగి సామాన్యమును (లింగ మనగా హేతువని తెలిసికొంటిమి. లింగి యనగా హేతువు కలది. అది నిప్పు.) నిర్ధారణ చేయు వృత్తి అనుమానము. ఆ వృత్తియందలి ప్రతిబింబము అనుమితి.

పదార్థజ్ఞానముచే వాక్యార్థమును తెలియజేయు వృత్తి ఆగమము. ఆ వృత్తియందలి ప్రతిబింబము శాబ్దము. ప్రమాణముల పేరులుకూడ అనుమానాగమములే కావున ఆ మాట విడిగా చెప్పలేదు.

వివ :- ప్రమ = (ప్ర + మీయతే, అనేన ఇతి ప్రమా) అనేన = దీనిచే, ప్ర = లెస్సగా, మీయతే = తెలియబడును. గావున ప్రమ. చిత్తవృత్తిచే కుండ మొదలగు వస్తువులు తెలియబడును. ప్రమకు కరణము ప్రమాణము.

మన మొక తాడునుగాని, ఆలిచిప్పనుగాని మఱి దేనిని గాని చూతుము. అపుడు తాడు తాడుగను, ఆలిచిప్ప ఆలిచిప్పగను తెలియుట ప్రమ. అంతకు ముందు తెలియబడని వస్తువు ఉన్న దున్నటులు తెలియుట ప్రమ అన్నమాట. కావున ప్రమ యనగా యథార్థజ్ఞానము. ఇది విపర్యయముచే అబాధితమగు అర్థమును అవగహించిన జ్ఞానము. అనగా తాడును చూచి పామని భ్రమపడక పామని తెలియుట. అట్టి తెలివిలో కరణము ప్రమాణము. తెలియబడని విషయమును గూర్చిన ప్రమాప్రక్రియకు ప్రమాణమని పేరని చెప్పవచ్చును.

ఇట్టి సద్విషయకజ్ఞానము లేక యథార్థజ్ఞానము ప్రమాణ మనియు అనుభవ మనియు ద్వివిధము. కరణములకంటె వెలుపలి విషయములకు సంబంధించినది ప్రమాణము. లేక కరణములకంటె వెలుపలివని వ్యవహరింపబడు వస్తువులకు సంబంధించినది ప్రమాణము. ప్రత్యక్షానుమానాగమముల యెడ ఇది సమానము. కరణగతమగు భావములకు సంబంధించినది అనుభవము. స్మృత్యనుభవము సుఖానుభవము మొదలగున విందులకు ఉదాహరణము.

తెలియబడని తత్త్వము తెలియుట ప్రమయని ప్రమకు మరియొక లక్షణము. ప్రమకు కరణము ప్రమాణము. ఈ లక్షణమున స్మృతి ప్రమాణము కంటె వేరు. ఈ యోగశాస్త్రమున కొన్ని అనుభవములు మానసప్రత్యక్షములు. కావున నవి ప్రమాణమునం దంతర్గతములు. స్మృత్యనుభవమో మానసప్రత్యక్షము. కాదు- తెలియబడిన విషయమునే తిరిగి తెలియుట స్మృతి కదా! కావున ప్రమాణముకంటె స్మృతి వేరు.

కన్ను మొదలగు ఇంద్రియములకు బాహ్యావస్తువులతో సంపర్కము కలిగినపుడు చిత్తము రంజితమగును. వస్తుభేద సంబంధముచే చిత్తముగూడ బిన్నాకారము తాల్చును. అదియే ఉపరంజనము. అదియే వికారము. చిత్తసత్త్వము యొక్క ఒకొక్క పరిణామమే ఒకొక్క జ్ఞానము. అదియ ఘటజ్ఞానము, పటజ్ఞానము. ఆరు విధములైన ఇంద్రియమార్గముల గుండ చిత్తమునకు విషయ

సంపన్నము కలుగును. ఈ శాస్త్రమున మనస్సుతో కలిపి జ్ఞానేంద్రియములు ఆరు. శబ్దాదులను గ్రహించుట మాత్రమే బాహ్యేంద్రియముల పని. అటు పిమ్మట అంతరింద్రియమునందలి మరియొక వృత్తి వినిపించిన ఆ శబ్దము ఏదియో మద్దెలదో తెలిసికొనును. ఆ తెలివియే లేక ఆ జ్ఞానమే చైత్తిక ప్రత్యక్షము లేక మానసప్రత్యక్షము.

అనుకూలవేదనీయ మనియు, ప్రతికూలవేదనీయ మనియు చెప్పబడు సుఖము, దుఃఖము వీని అనుభవ మాత్రము మానసగ్రహణము. పిమ్మట గలుగు ఆ యావేదనా జ్ఞానము మానసవిషయక ప్రత్యక్షము.

వర్షాకాలమున ఒక నీలమేఘమును చూచినచో సుఖము కలుగును గదా! అపుడు బాహ్యేంద్రియమగు కన్ను ఆ రూపమును గ్రహించును. మనస్సు సుఖించును. పిమ్మట అంతఃకరణ మందలి మరియొక వృత్తి సాహాయ్యమున మానస విషయ ప్రత్యక్షము కలుగును. ఇక భగవంతుని దివ్యమంగళ విగ్రహ భావనవలన సుఖము కలుగును. మనస్సే ఆ యనుభవమును బాహ్యేంద్రియము చందమున గ్రహించును. పిదప దానిచే చిత్త ముపరంజితమగును. అపుడు దాని చైత్తిక ప్రత్యక్షము కలుగును. కావుననే చైత్తిక ప్రత్యక్షములందన్నింటను మొదట గ్రహణమును, పదపడి దాని ప్రత్యక్షప్రమాణమును సంభవించును. కావున కరణములకంటె వెలుపలి భావముల నిశ్చయ జ్ఞానము ప్రమాణము - అని చెప్పినచో ఈ లక్షణము ప్రత్యక్షప్రమాణము లన్నిటికిని సరిపోవును.

విశేషము :- వస్తువులకు సామాన్య ధర్మము, విశేషధర్మము నుండును. ఘటమునకు సామాన్యధర్మము ఘటత్వము. గుండ్రని పొట్టయు సన్నని మూతియు ఈ మొదలగు ఆకారము విశేషధర్మము. ప్రత్యక్ష ప్రమాణమునందు ప్రధానముగా విశేషధర్మమే భాసించును. సామాన్యధర్మ మప్రధానముగా భాసించును. ఎటు లనగా సత్తా పదార్థము సర్వవస్తు సాధారణము కావున అది సామాన్యము. ప్రత్యక్షమునం దదియు అప్రధానముగా ఉండును.

అనుమాన ప్రమాణమునందును ఆగమప్రమాణమునందును సామాన్యమే భాసించును. పొగను బట్టి నిప్పును అనుమించునపుడు దాని ఆకార ప్రకారములు తోపవు. 'స్వర్గము కలదు'- అను నెడలను సామాన్య జ్ఞానమే కలుగును.

ఈ యెడ 'దేవదత్తుడు ఉన్నాడు:' - అనునది అనుమానముచే గాని ఆగమముచేగాని సిద్ధమగునెడల దేవదత్తుని పేరి విశేషపదార్థ జ్ఞానమే కలిగెనే. అని శంకింతువేమో - ఇది సరియగు శంక కాదు-దేవదత్తుని లోగడ నీవు చూచి యుండనిచో ఈ రెండు ప్రమాణములచేతను దేవదత్తుని ఎరుక నీకు కలుగదు. ఈ మాటలచే నీకు కలిగిన దేమన స్మృతి జ్ఞానమాత్రము. ఇక మిగిలిన 'ఫలాని చోట నున్నాడు' అనునది మాత్రమే ప్రమాణము కాగలదు. దేవదత్తు డసలు ఎన్నడును చూడబడనిచో విశేషజ్ఞాన మిసుమంతయు లేకపోగా ఏకైకాంశ సామాన్యజ్ఞానమే ఆ యనుమానాగమ ప్రమాణ లభ్యము.

ఫలము - వ్యక్తి విశేషమును నిర్ధారణ మొనరించు చిత్తవృత్తి ప్రత్యక్ష ప్రమాణము. తదాకారవృత్తి యందు ప్రతిఫలించిన చితిశక్తి ప్రతిబింబము ప్రత్యక్ష ప్రమయని లోగడ చెప్పబడెను.

మన మొక ఘటమును చూతుము. ఘటముచే చిత్తము ఉపరక్తమగును. అట్లు ఉపరక్తమయిన చిత్తము ఘటాకారము. అట్టి ఘటాకార చిత్తవృత్తి ప్రత్యక్ష ప్రమాణము. కాగా చిత్తవృత్తి ప్రత్యక్ష ప్రమాణమని కుంచించి చెప్పవచ్చును.

చిత్తగతమగు ఈ వృత్తికి ఫలమేమి ?

ఘటజ్ఞానము - ఈ జ్ఞానము దేనివల్ల కలిగెను ? చితిశక్తి ప్రతిబింబము వల్ల - ఘట ప్రత్యక్షములో చిత్త ప్రతిబింబితమగు చైతన్యమే ఘటాకారమైన చిత్తవృత్తిచే తదాకారత్వమును పొందింపబడుట ఫలము. ఇచట పురుషగతమగు బోధ పుట్టుటలేదు. చైతన్యము బుద్ధ్యాత్మక మాయెను. వృత్తియు బుద్ధ్యాత్మక మాయెను. ఇటులీ రెంటికిని బుద్ధి సమానముగా అధికరణము-కావున ప్రమాణఫల భావము నెడ 'పురుషునందుండు ఎరుక చిత్తమునందుండు వృత్తికి ఎటులు ఫల భావము పొందును ?' అను శంక లేదు -

[ ఇంతవరకే లభించినది ]



# 13. ఆనందము

మానవ యంత్రమును చూడగనే ఇది సుఖ దుఃఖముల కాస్పదమని తెలిసిపోవును. ఏలన దీని కాకలి కలదు. దీనికి ఆహారము కావలెను. దీనికి కామము కలదు. దీని కుపాయము కావలెను. దీని కిల్లు వాకిలి, పొలముపుట్ర, బంటు బైద-లక్ష కావలెను.

కోరికలో సుఖములేదు. ఇది లభించునో లభింపదో అను తలంపులో వగపు కలదు. లభింపనిచో అది పెచ్చరిల్లును. ప్రతిబంధమే కలిగెనేని క్రోధమును, ప్రతికూల మాయెనేని ద్వేషమును కలుగును. ప్రతిక్రియ చేయజాలని యెడల విషాద ముదయించును. వీని యన్నిటను దుఃఖమే కలదు. ఈ కోరిక నెఱవేఱునది తోచుచో, శాంతియు, దానిలో కొంత సుఖమును కనిపించును. మఱి ఈ కామ్యవస్తు భోగములో కొంత సుఖము గోచరించుచున్నది.

## వృత్తులు

మనుష్య ప్రయత్న మంతయు సుఖమునకు. దాని సాధించుటకు మనుజుడు దుఃఖమును లెక్కసేయడు. ఈ ప్రయత్నములో కలుగు మఱపు, భయము మొదలగు తామస వృత్తులలో సుఖములేదు. పేరాసయు, విషయ ప్రీతియు మొదలుగాగల రాజస వృత్తులందును సుఖములేదు. ఓర్పు, ఔదార్యము, విర క్తి లోనగు శాంతవృత్తులలో సుఖము కలదు. ఈసుఖ మానందము. ఇది బ్రహ్మ ప్రతిబింబము. ఇది విషయానందము.

## విషయానందము

లోగడ కలుగనిదియు, విషయభోగము వలన గలిగినదియు, నగు ఈ విషయానందము నీ స్వరూపమగు ఆనందములో బిందువు. సుషుప్తిని యానందము నిరతిశయము. భూతము లీ యానందలేశమునే యనుభవించుచున్న వని బృహదారణ్యకము. ఈ విషయానందము బ్రహ్మానందము పేర వరూధినికి లెస్స తెలియును. ఆమె ఇటులనెను.

''ఎందే డెందము కందళించు రహిచే, నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీప కళికాశ్రీ దోప నెందెందు బో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాజదువు నంతర్బుద్ధి నూహింపుమా-''

అది యటుండె. నిరంశమగు బ్రహ్మ ముపాధి భేదముచే సాంశ మగును. మృచ్ఛిలాదులందు సత్తును, రాజస తామసవృత్తులందు సచ్చిత్తులును, శాంత వృత్తులందు సచ్చిదానందములును ప్రతిబింబించును. ఒక్కడగు నాత్మ ప్రతి భూతమునందును ఉండి జలచంద్రునివలె నొక్కండుగను, పెక్కంద్రుగను కనబడును అని బ్రహ్మబిందూపనిషత్తు. ఎంత శరచ్చంద్రుడును బురదనీట చక్కగా ప్రతిబింబింపడు. తేటనీట చంద్రుడు చక్కగా ప్రతిబింబించి నటులు శాంతవృత్తులచే నిర్మలమగు నంతఃకరణమునందు ఆనందము ప్రతిబింబించును.

## మా యా స్ఫు ర ణ ము

మాయ అసత్తుగను, జాడ్యముగను, దుఃఖముగను విజృంభించి శశశృంగా దులందును, శిలాకాష్ఠాదులందును, రాజస తామస వృత్తులందును స్ఫురించు చున్నది. ఇట్టి మాయతో గలిసిన బ్రహ్మమును మిశ్రబ్రహ్మ మందురు.

ఈ విషయానందము బ్రహ్మానందము గనుటకు ద్వారము. ఈ మిశ్ర బ్రహ్మమును తలచి తలచి అమిశ్రబ్రహ్మమున కెగబ్రాకవలెను. మాయాకార్య ములలో శశశృంగాదుల నుపేక్షించి శిలాదులందలి నామరూపములను విడిచి సన్మాత్ర చింతనమును చేయునది. రాజస తామస వృత్తులందలి దుఃఖము నుజ్జగించి సచ్చింతనమును శాంతవృత్తులందు సచ్చిదానందములను మూటిని ధ్యానించునది.

## వా స నా నం ద ము

మన కుదాసీనత యను నొక అవస్థ కలదు. ఉదాసీనత యనగా ఊరక యుండుట. ఇది తలచు సుఖ దుఃఖాంతరాళములందును, నిద్రకు పూర్వపరము లందును ఉండును. ఈ యవస్థలో పరివ్రాజకిని 'నా కిపు డేమియు చింతలే'

దనియు, నేను సుఖముగా నుంటి ననియు తోచును. ఇది నిజానందమునకు ద్యోతకము, నేను రాముడను, నేను కృష్ణుడను, అను విశేషాహంకారము లేక, నేను సుఖి నను సామాన్యాహంకారముచే గ్రస్తమగుటవలన దీనికి వాసనానంద మని పేరు.

నీటికడవ మీద చేయి వైచుచో అది చేతికి చల్లగా తాకును. ఆ చల్లదనము ద్రవము కాదు గాన నీరు కాదు. మఱి నీటి గుణము. దాన కడవలో నీరున్నదని తెలిసికొందుము. అటులే అభ్యాసముచే అహంకార మెంత మాత్రము విలయము పొందునో అంతమాత్రము నిజానందము స్ఫురించునని సూక్ష్మదృష్టిచే అనుమింతుము. ఉదాసీన కాలమునందు తోచెడు ఈ వాసనానందము బ్రహ్మానందమునకు ద్వారము. ఈ ద్వారము విషయానంద ద్వారముకంటె లోపలిది. ఈ వాసనానంద మందు చిత్తవృత్తులు శిథిల మగుటవలన మిశ్ర బ్రహ్మజ్ఞానము ధీవృత్తి రూపము. ఈ వాసనానందము ధీవృత్తి రూపము కాదు. ఈ వాసనానందము బ్రహ్మానంద మునకు దారి తీయునని యెఱిగి ఉదాసీనావస్థ యందును, ఈ యానందమును ఉపేక్షించి ముఖ్యానందమునే భావింపవలయును. ఒరుల ఇంటి పనులయందు మునిగి తేలుచున్నను దాసి యెప్పుడును తనయిల్లు మఱవదు. అటులే లోక వ్యవహారములందు మునిగి తేలుచున్నను ధీరుని చూపెప్పుడును నిజానందము మీదనే యుండును. ఈ యహంకార విలయమునకు మనము చేయవలసిన పని 'వాక్కును మనస్సునందును, మనస్సును బుద్ధియందును, బుద్ధిని మహత్తునందును, మహత్తు నాత్మయందును నియమింపవలె నని కఠము చెప్పను. ఇటులు నిరోధముచే అంతఃకరణము మఱుగుపడి మిగుల సూక్ష్మత్వము పొందును. ఆనందావిర్భావమే ఈ సూక్ష్మత కవధి. ఈ యవస్థయందు అంతఃకరణము లయముకాదు. నిద్రలో నంతఃకరణము కారణ రూపముగా నుండును గాన నిది నిద్రకాదు. మఱియు నీ యవస్థలో దేహము వ్రాలదు. ద్వైతము తోచదు. ఇప్పటి సుఖము బ్రహ్మానందము.

## ఆత్మానందము

లోకు లందఱును ఆలుబిడ్డలను చుట్టపక్కములను, బంటుబైదను ప్రేమింతురు. ఎందులకు వీరెటులు ప్రేమింతురు ? దీనికి బృహదారణ్యక మిటులు చెప్పు

చున్నది - యాజ్ఞవల్క్యుడు తన ఇరువురు భార్యలలో మైత్రేయిని పిలిచి "నేను నీ సమ్మతితో సన్యసింప గోరుచున్నాను. మీ ఇరువురకును ఆస్తి పంచిపెట్టి మీ సంబంధమును తెగతెంపులు చేసి లేచిపోవుదును" అనెను. 'ఓ దేవుడా! విత్త పూర్ణమగు నీ సమస్త పృథివితో నా కమృతత్వలబ్ధి కలుగునా? అని మైత్రేయి అడిగెను. కలుగదు. ధనవంతులకు జీవిత మెంత సుఖముగా గడచిపోవునో నీ జీవితమును అంతసుఖముగా గడచిపోవును. అంతియకాని విత్తముచే అమృతత్వ లబ్ధి కనుచూపు మేర నేని లే'దని అత డనెను.

'అమృతత్వము లేనిచో నే నావిత్తము నెత్తిని వేసికొందునా?' అని ఆమె యనగా యాజ్ఞవల్క్యుడు 'ఆహా, ఎంత చక్కని పలుకు పలికితివి! ఇటు చేర రమ్ము, ఇందు కూర్చుండుము. అమృతత్వ సాధన మగు ఆత్మజ్ఞానమును చెప్పుదును. చెవి యొగ్గి వినుము. మగనికొరకు మగ డాలికి ప్రియుడుకాడు. మఱి తనకొఱకు బిడ్డలకొఱకు బిడ్డప్రియులు కారు. మఱి తనకొఱకు విత్తముకొఱకు. విత్తము ప్రియము కాదు. మఱి తన కొఱకు...కావున ఆత్మను కనుగొనవలెను మననము చేయవలెను, ధ్యానింపవలెను' అని చెప్పెను.

మగని యెడ ఇచ్ఛ కలిగిననే భార్య మగనిని ప్రేమించును. ఇచ్ఛ తప్పినచో విడియాకు లిచ్చును. కావున ఆ ప్రేమ మగని మీదిది కాదు. మఱి తనమీదిదే. లోకము స్వప్రయోజనమునకే సమస్త భోగ్యరాసిని ప్రేమించుచున్నది. బాలుడు ముండ్లు గ్రుచ్చుకొనుచున్నవని లబలబ లాడినను మనము ముద్దుగొందుము. అది బాలునిమీది ప్రీతి కాదు. మఱి ఆత్మప్రీతి. ఆత్మప్రీతికే వాని నేడిపించుచున్నాము.

## ప్రీతి

ప్రీతి యనునది ప్రియులయెడ ననురాగముగను, గుర్వాదులయెడ భక్తిగను, సత్కర్మలయెడల శ్రద్ధగను, అప్రాప్తములయెడ ఇచ్ఛగను ఇటులు పలురీతులుగా కనబడుచున్నది. ఆత్మయెడ గల ప్రీతి వీనిలో నెట్టిదియు కాదు. సుఖమాత్రము ననువర్తించెడి సత్త్వ పరిణామముకల చిత్తవృత్తియే ఆత్మప్రీతి. సుఖలబ్ధియైనను విషయము నశించినను ఈ ప్రీతి పోదు. కాన ఆత్మయెడగల ప్రీతి, ఇచ్ఛకంటె వేఱు. పరయని సుఖమే ఇచ్ఛకు విషయము.

## మిథ్యాత్మ - గౌణాత్మ

తెనాలి రామలింగం మహాకవి యిటులు వెటకారము చేసెను.

"కీలారముననుండి పాలింటి కేతేర
బహుధాన్యములు చేలబండి యొరగ
ఎడనెడ బెండ్లిండ్లు వడుగులు వొడమ గృ
తార్థులై యర్థించు నర్థు లలర
పరిచారికాకోటి పనిపాటు పాటింప
జుట్టంపు సందడి నెట్టుకొనగ
గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకు దన్ను సాక్షిగోర
నిత్య నైమిత్తికములు నిర్నిద్రబుద్ధి
నాచరించుచు హరిభక్త మాత్మభార్య
భక్తినిడ భుక్తిగొను చున్కి ముక్తిగాని
నిదురవంటిది జాతివంటిదియు గాదు"

ఇది పంచకోశాత్మకమగు మిథ్యాత్మ. మఱియు భార్యాపుత్రాది రూపక మగు గౌణాత్మ.

## ఈ యాత్మ యెవరు ?

సుఖసాధనమగు భోగ్యరాసి యెల్లయు ఆత్మార్థము గాన ఈ యాత్మ నిరతిశయప్రీతికి మొదల దేహాది విత్తాంతములగు విషయములు. తమతమ తారతమ్యమునుబట్టి సమీపములును, సమీపతరములు నగుచున్నవి. దాన ప్రీతిలో భేద మేర్పడుచున్నది. విత్తముకంటె పుత్రుడును, పుత్రునికంటె దేహమును, దేహముకంటె చక్షురాదీంద్రియములును, వానికంటె ప్రాణమును ప్రేమాస్పదములు. ప్రాణముకంటె ఆత్మ ప్రియతమము.

ఈ యాత్మ నిరతిశయ ప్రేమాస్పదమగుట నిది పరమానంద స్వరూపము. 'నాకు నాశము రారాదు', 'నే నమరుడ గావలయు'నని ప్రతివాడును ఆశించును.

ఇదియ ఆత్మానందము. ఈ యాత్మ తనకు దానుగానున్న ముఖ్యాత్మ. ఇదియ తాన తందాన.

## యో గా న ం ద ము

ఆనందము వలననే యీ భూతములు పుట్టుచున్నవి. ఆనందము చేతనే జీవించుచున్నవి. ఆనందమునందే లయించుచున్నవి! అని వరుణుడు చెప్పగా భృగువు విని అన్న ప్రాణ మనో బుద్ధులుకాక ఆనందబింబము బ్రహ్మ మని తెలిసికొనెను. ఆనందమువలన్న పుట్టి ఆనందమున మెట్టి ఆనందమున గిట్టు భూతము లానందమే కావలెను.

## ని ద్ర

నిద్రయందును, సమాధియందును, మఱికొన్ని యెడలను మన కీయానందము కనబడుచున్నది. నిద్రలో దుఃఖములే దని చెప్పబనిలేదు. 'ఈ సేతువు దాటి గ్రుడ్డియు నిద్రలో గ్రుడ్డికాడు. విద్ధుడును విద్ధుడుకాడు. రోగియు రోగి కాడు అని ఛాందోగ్యము చెప్పెను. జాగ్రద్ వ్యాపారములచే నలసి పాన్పున నొరగి సేదదేఱి మనము శయ్యాసుఖ మనుభవించుచున్నాము. ఇంకను త్రిపుటి అనగా అనుభవించువాడు, అనుభవింపదగినది అనుభవము అనువానిచే గలుగు శ్రమపోవుటకు ఆనంద రూపమగు బ్రహ్మమును గూర్చి పరుగెత్తి యానందమై పోవుదుము– ''త్రాట గట్టబడిన పిట్ట నలుదెసల కెగిరి గూడుకానక మరల గట్టు కొయ్యకో, చేతిమీదకో చేరునటుల ఈ పురుషుడును ఆనందము కడకు పరుగిడి ఆ యానందమునందే నిద్రించి ఏమియు కోరడు.'' అని బృహదారణ్యక మనును. ఈ బృహదారణ్యకమే మఱియొకచోట పసుబాపవలె, మహారాజువలె, మహా జ్ఞాని వలె దుఃఖమును దహించు నానందావస్థను బొంది నిదిరించును.' అని చెప్పెను. కావున నీ సుషుప్తిలో దొడ్డసుఖ మున్నది. నిద్రితుడు బాహ్యాభ్యంతరము లెఱుగడు. అపు డతని జీవత్వము పోవును. అపు డత డానందమై పోవును. నేను సుఖముగా నిదిరించితిని కాని యేమియు నెఱుగను–అని అతడు లేచి సుఖమును, తదజ్ఞతను గూడ స్మరించును. అజ్ఞాన ప్రతిబింబితమగు చైతన్య మీ నిద్రానందము ను భుజించును. జీవుడు కర్మచే మరల జాగ్రదవస్థ పొందును. నిద్రకు

ముందును పిఱుందను బ్రహ్మానంద వాసనయుండి క్రమక్రమముగా అపస రించును.

## యోగానందము - సమాధి

దీనిని యోగముచే బడయనగును. చిత్తవృత్తి నిరోధము యోగము. అటు ఇటు తిరుగు మనస్సును ఆత్మయందు అడచుటయే యీ యోగమునకు పరమావధి. ఇందు ద్వైతము లేదు. ఇది నిద్రకాదు. నిద్రలో నంతఃకరణము కారణమందు లయించును. ఇందు లయముకాదు. వాసనానందమునుండి బయలుదేఱిన పథికు లీ మకామునకు వత్తురు. ఈ సమాధిబలమున దైనికవ్యథ పోవునని భాగవత సప్తమస్కంధము, ఇందలి సుఖము అనుభవింప దగినదే కాని చెప్పుటకు వీలులేనిదని జ్ఞానులు చెప్పుదురు. రెండు భాషలు నెఱిగిన వాని చందమున సాధకుడు బ్రహ్మానందమును జాగ్రదవస్థ యందును, స్వప్నావస్థయందును అనుభవించును. యోగముచే వచ్చినది గాన దీనికి యోగానంద మని పేరు.

## అద్వైతానందము

ఈ యాత్మ యెవరు? ఆకాశము మొదలు శరీరమువరకుగల జగత్తు ఆనందము వలన పుట్టి ఆనందముచే మెట్టి ఆనంద మందే గిట్టుచున్నదని ఉపనిషత్తు చెప్పుటచే ఈ యాత్మ యానందము. దానిని తెలుసుకొను టెటులు? విచారముచే.

## వివర్తము

ఆనందము జగత్కారణ మేని యెట్టి కారణము? జగత్తున కానందము వివర్తోపాదాన కారణము. వివర్త మనగా విశేషముగా భాసించుట. ఇది అవస్థాంతర భాసమాత్రము. తాడు తాను వికారము పొందకయే పామువలె కనబడును. అటులే జగత్కారణమగు ఆనందము తాను వికారము పొందకయే జగత్తుగా కనబడును. నిరవయవ పదార్థమునందును వివర్తము వర్తించును.

నిరవయవమగు ఆకాశము నల్లదను, బోర్లగిలబడిన ఇంద్రనీల కటాహము వలెను కనబడును. అటులే నిరంశమగు నానందము తాను మాఱకయే విచిత్రమగు జగదాకారముగ కనబడును. కల్పించు వాడొకడు లేనిదే వివర్తము

భాసింపదే అని యనుచో- అగును, ఇట మాయాశక్తి కల్పకము 'క్రియేచ్ఛా జ్ఞానరూపమగు మాయాశక్తి ఆత్మలో గల'దని శ్వేతాశ్వతరము చెప్పును.

## శక్తి

శక్తి శక్తముకంటె వేఱని కాని వేఱుకాదని కాని చెప్పనయితి కాదు. చేయి కాలినపుడు బొబ్బలెత్తుచున్నవి. ఈ దాహక శక్తికి కార్యము బొబ్బ. ఆ దాహకశక్తి కాశ్రయ మగ్ని. ఇది స్వకార్యాశ్రయములకంటె విలక్షణము. బొబ్బలెత్తినపుడు దాహకశక్తి లేదు. దాహకశక్తి యున్నపుడు బొబ్బలు లేవు. ఇట్టులే మఱియొక యుదాహరణమునకు పోవుదము. పెద్దపొట్టగల బాన కార్యము. దీనికి కారణము శబ్దాదులగు నైదు గుణములు కల మన్ను మృచ్ఛక్తి అటు బానయు కాదు; ఇటు మట్టియు కాదు. కార్యోత్పత్తికిముం దీశక్తి మట్టిలో దాగి కులాల సాహాయ్యమున వికార మొందును. స్పర్శాదులు కల మట్టి మొదలు పెద్దపొట్టయు సొట్టయు కల వికారమువఱకును కలిపి బాన అని జనులు వాడు కొందురు. కుమ్మరి చేయి పడకముందు బాన లేదు. పొట్టయు సొట్టయు గలిగిన పిదప బాన రూపొందుచున్నది. ఉరిసి మట్టిలో గలిసి పోవుటవలన బాన మట్టి కంటె వేఱుకాదు. మట్టిముద్దగా నున్నప్పుడు బాన కానరామి నీబాన మట్టికంటె వేఱుకాకయు పోదు. కాన శక్తివలె శక్తిజమగు నీ బానయు విలక్షణము. అవ్యక్తదశలో శక్తియు, వ్యక్తదశలో కార్యమును నున్నవి. శక్తి యున్నపుడు బాన లేదు. బాన యున్నపుడు శక్తిలేదు. కావున నీ శక్తియు, బానయు సత్యములు కావు. మూడుకాలములందును అంటి పెట్టుకొనియున్న మట్టియే సత్యము. 'ఒక మట్టిముద్దను తెలిసికొనినచో దాని వికారమగు బాన కుండ ముంత మొదలయిన వెల్ల తెలిసిపోవును. వాఙ్మాత్రాలంబనమగు కార్యము వట్టిమాటలే. మట్టియే సత్యము' అని అరుణి చెప్పును. కావున నిటు లన్నివస్తువులను వివేచన చేసి కార్యము లన్నియు అసత్యములని యెఱుగునది—

## మాయ - మాయి

'నామ రూపాత్మకమగు నీ జగమంతయు సచ్చిదానందాత్మక'మని నృసింహతాపనీయమును, 'ఆనందమే యని ఛాందోగ్య తైత్తిరీయములు చెప్పును.

ఈశ్వరుడు నామ రూపములను కల్పించి విస్తరింప జేయుచున్నా డని పురుష సూక్తమును, ఛాందోగ్యమును చెప్పుచున్నవి.

వికారము పొందని బ్రహ్మమునందు, అచింత్యమగు మాయాశక్తి పలు వికారములను పుట్టించుచున్నది. ఈ మాయ ప్రకృతి, మాయ మహేశ్వరుడు.

## మాయజేసిన మొదటి వికారము

ఈ మాయ జేసిన మొదటి వికారము ఆకాశము. అది ఉన్నది. భాసించు చున్నది. అవకాశ మొసగి మనకు ప్రియ మగుచున్నది. దాని స్వరూప మవకాశము. అభివ్యక్తికి పూర్వపరములం దది లేదు. ఆద్యంతములందు లేనిది నడుమను లేదు. కాన నది మిథ్య. అవకాశమునం దాకాశబుద్ధిని వీడినచో కుండలో మట్టివలె అచట బ్రహ్మమే యున్నది. 'కాదు శూన్యమున్న దందువా' అనుము, ఉన్నది కదా. అది యెందున్నది ?

## ని జా న ం ద ము

ఆనుకూల్యముగాని, ప్రాతికూల్యముగాని లేకపోవుటయే నిజమగు నానందము. ఆకాశము మొదలుకొని దేహాంతము వఱకు గల వికారమైన నామరూపములందు నటులు సచ్చిదానందము లున్నవి. ఈ నామరూపములు సముద్రమునందు బుడగలవలె పుట్టి మరల నామరూపములు లేకుండ బోవుచుండును. ఈ నామరూపములు బ్రహ్మపటమున గీచిన చిత్తరువులు. నామరూపముల నుపేక్షించినచో బుద్ధి బ్రహ్మచింతన మందు నిరాతంకమగును. నటుడు తన పాత్రను నిర్వహించినటు లీ బ్రహ్మచింతకుడు లౌకికములను నిర్వహించును. సందులేని అద్దమునందు తారకాపుంజములుగల యాకాశము ప్రతిబింబించినటులు బ్రహ్మమునందు కోటానకోటులు జగత్తులు ప్రతిబింబించుచున్నవి. అద్దమును బొందక ప్రతిబింబమును చూడజాల నటుల, సచ్చిదానందముల బొందక నామరూపముల నెటులు కనుగొనగలవు? కావున తొలుత అద్వైతమగు నాత్మ తోచగనే దాననే బుద్ధిని నియమించి నామరూపముల నెడబాయునది. ఇది నిర్ జగత్కమగు నద్వైతానందము. యోగముచేతను, ఆత్మవివేకముచేతను, అద్వైత విచారముచేతను బ్రహ్మానంద మనుభవించు వానికి 'నాకు దుఃఖము లేదు, నే నాప్తకాముడను,

కృతకృత్యుడను, ప్రాప్తప్రాప్తుడను.'' అని నలుతెగల యానందము పొంద మును. ఇది ధీవృత్తి రూపమగు విద్యానందము.

## దుఃఖాభావము-ఆప్తకామత

ఇతని కైహికాముష్మిక దుఃఖము లేదు. స్థూల సూక్ష్మ కారణ శరీరము లతో ఐక్యభ్రాంతి కలుగుటంజేసి జీవుడు భోక్తయనియు నామరూపములతో నైక్యమొందిన పరమాత్మ భోగ్యుడనియు తెలిసి తన్నాత్మగా నెఱిగిన వానికి దుఃఖమేడ? పాపపుణ్యము లేడ? ఇతడు 'నేనే' అన్నాదుడను; 'నేనే' భోజ్య మును, నేనే భోక్తను అని గానము చేయును.

దుఃఖాభావమే ఆప్తకామత. సుఖముపొందుటె కదా కామము. సుఖముల కన్నిటికిని సముద్ర మయిన ఆనందమే ఇతడు. ఇతనికి కామ మేడ! మఱియు నీజ్ఞాని అజ్ఞులతో, విజ్ఞులతో, స్త్రీలతో పురుషులతో కలిసిపోవును. ఇతడు శరీర మెఱుగడు. కర్మమే ఇతని శరీరమును నిలుపును.

## కృతకృత్యత - ప్రాప్తప్రాప్యత

తొల్లి నా కైహికాముష్మిక సిద్ధికి చేయదగిన దుండెను. ఇపు డది యంతయు చేయబడినటు లాయెను- అని తెలిసి అజ్ఞులు కర్మచేయనీ, నా కేటి కర్మ? విపరీత భావకుడు నిది ధ్యాసింపనీ, అది లేని నాకేటి నిది ధ్యాస. విక్షి ప్తుడు సమాధి పొందనీ, నిత్యానుభవముకల నాకేటి సమాధి? అని ఇతడు కృత కృత్యుడును ప్రాప్తప్రాప్యుడును నయి నేను ధన్యుడ, నేను ధన్యుడ, ఓహో ఆనందమోహో ఆనంద మని జీవన్ముక్తుడై బాలోన్మత్త పిశాచములవలె తిరుగుచు ఆనందమే అయిపోవును.

# 1. మన ప్రాచీన విద్యాలయములు

## (మంచిర్యాలలో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు పట్టప్రదానసభలో శాస్త్రిగారి స్నాతకోపన్యాసము)

* * *

"ఆంధ్రసారస్వత పరిషత్తున నిరుడు రెండువేలమంది పరీక్షలో నుత్తీర్ణులగుట! ఈ సంవత్సరము పదివేలమంది ఆంధ్ర సారస్వత వ్యాసంగముచేసి పరీక్షకు గూరుచుండుట! ఎట్టి ఆశ్చర్యము! ఈ విద్యార్థు లెంత ధన్యులు. "తెలుంగా నీకు దీర్ఘాయువౌ".

"మనకు పరభాషయెడ ఇంపు. పరాచారములయెడ మంపు. అట్టితరి మీ బండిచక్రము లెటు లీ సరియగుదారిని బడెనో నాకద్భుతముగా నున్నది. నాటి నలందా నాతోపాటు మీ కన్నుల ప్రేలునని అనుకొనుచున్నాను".

"చాల వెనుకటి కాలమున భరతవర్షమున పెక్కు విద్యాలయములున్నవి. తక్షశిల, నలందా, విశాల, కాశీ, అమరావతి, వలభి, మధుర, విక్రమశీల, పాటలీపురం, అజంతా, నాగార్జునశైలము ఈ మొదలగు తావులు విద్యకు క్షేత్రములు. మరియు నెచటనేని ఒక బౌద్ధ విహారముగాని, ఒక జైనమందిరముగాని వెలసిన దనుచో అదియు నదియు నొక విద్యాలయమే.

"తక్షశిలలో వ్యాకరణము, అర్థశాస్త్రము, ఆయుర్వేదము మొదలగు తంత్రములు వృద్ధి బొందెను. వీనిలో నచట నాయుర్వేదమునకు ప్రాముఖ్యము. ప్రసిద్ధులలో నొకడగు జీవకుడు తక్షశిలలో చదివిన 'ఓల్డుబాయ్'. అతడచట నేడేండ్లు చదివెను. చదువు ముగిసెను. అపు డతడు సమావర్తమునకు గురుదేవుని దరికేగగా నతడు ఓయి వత్సా! ఈ తక్షశిల చుట్టును ఒక యోజనము దూరములో మందుకు పనికిరాని ఆకేదేని ఉన్నచో దానిని కోసుకొనివచ్చి నాకు కట్నమిమ్మని ఆదేశించెను. జీవకుడు ఇయ్యకొని పరిశోధించి వచ్చి-అయ్యా! నేను మందభాగ్యుడను. తమకు పనికిరాని ఆకును ఈయజాలనని మోక

రించెను. అపు డాచార్యుడు జీవకుని మూరుకొని "నాయనా ! నీవిపుడు పండితుడ వయితివని" ఆశీర్వదించెను. దీనివలన తక్షశిల విద్యాలయమున వైద్యముతోపాటు ఓపధీజ్ఞాన మెంత వృద్ధిగనెనో మనకు తెలియవచ్చుచున్నది.

"నలందాలో పదివేలమంది విద్యార్థులు చదువుకొను చున్నటులు హుయన్ చోయాంగ్ వ్రాసెను. అతడు వ్రాసిన విషయములు గమనించదగినవి. నలందా విద్యాలయమున నూరుగురు ఆచార్యులు విద్యాదానము చేయుచుండిరి. ఆ విద్యాపీఠమునకు నూరూళ్లు గలవు. ఇంతియగాక చుట్టుప్రక్కలనున్న సామంతులందరును వంతులవారీగా విద్యార్థులకును, ఆచార్యులకును గ్రాస వాసోదైన్యము లేకుండా చేయుచుండిరి. ఇటు లేడు వందల యేండ్ల నుండి హుయాన్ చోయాంగ్ వరకు ఆ విద్యాలయ మవ్యాహతముగా సాగెను. అతని సమయమున శీలభద్రు డాచార్యుడు. శీలభద్రునికి పూర్వము ధర్మపాలుడు, ధర్మపాలుని గురువు మహానైయాయికుడు దిజ్నాగాచార్యుడు. ఇది పంద్రెండవ శతాబ్దిలో మాట.

"విశాల యనగా ఉజ్జయిని. బుద్ధదేవుని జననమునకు మునుపే యిచట సర్వవిధముల సంపూర్ణమగు విద్యాలయముండెనని సాక్ష్యముకలదు. తక్షశిలలో ఆయుర్వేదమటులు, ఉజ్జయినిలో జ్యోతిశ్శాస్త్రము పెంపొందెను. అచట నేటికిని ప్రాచీన యంత్రములు కలవు. అమెరికాలో ఈనాడు సుఖబోధకొరకు ఆకాశమున కృత్రిమముగా రాసులను, నక్షత్రములను అన్నిటిని జూపుచున్నా రనుకొనుడు. ఆనాడు ఉజ్జయినిలో రాసులను నేలమీద యంత్రములలో జూపిరి. నేటికిని అవి అచట చెడిపోయియు మన మనోయంత్రము నొకతూరి గిర్రున తిప్పి విడుచును. అది యటుండగా ఆయా యీ కాలములందు ఆయా యీ శాస్త్రములు అచట పరీక్షింపబడెను. రాజశేఖరుడు కావ్యమీమాంస పదవ అధ్యాయమున-

> ఇహ కాళిదాస మేంఠా
> వత్రామర రూప సూర భారవయః
> హరిచంద్ర చంద్రగుప్తౌ
> పరీక్షితా విహ విశాలాయామ్.

"ఈ ఉజ్జయినిలో కాళిదాసు, మేంఠుడు, అమరుడు, రూపుడు, శూరుడు, భారవి, హరిచంద్రుడు, చంద్రగుప్తుడు పరీక్షింపబడిరని వ్రాసెను.

"ఎనిమిదవ శతాబ్దివివర ధర్మపాలు డనురాజు విక్రమశాలలో నొక విద్యాలయమును నిర్మించెను. ఇది మహాయాన బౌద్ధులకు శిక్షాకేంద్రము.

దీనితో విక్రమశిలలో ఆరు విద్యాలయములుండెను. నూరు వేదాలయము లుండెను. అతీశదీపంకరు డిచట ప్రధానాచార్యుడు. ఇతడు బౌద్ధమత ప్రచారమునకు తిబెత్తు పోయి అచట మేను రాల్చెను.

"పశ్చిమ చాళుక్యుల నాగవాపిలో (నేటి నాగాయ్) ఒక విద్యాపీఠమును ఒక గ్రంథాలయమును, దానికింద కొన్ని గ్రామము లున్నటులును మనము శాసనములలో చదివితిమి. ఇట్టి వింకను కలవు.

"ఆ కాలమునందు చదువు లెటులుండెడివో చూతము. బృహదారణ్యమున నిటులుగలదు. "శ్వేతకేతు వనెడు కుఱ్ఱడు చదువుసందెలు మాని తిరుగుచుండగా ఆతని తండ్రి అరుణి - నాయనా! మన ఇంటిలో నింతవరకు బ్రహ్మబంధువు పుట్టియుండలేదు." అని మందలించెను. ఇట్టివే కాకపోయినను ఇట్టి మందలింపులు చిన్నతనమునందు నాతోపాటు పలువురెరిగి యుందురు. శ్వేతకేతువున కామాట గాటముగా తాకెను. అంతట నతడు గురువు కడకు బరుగిడెను.

"ఛాందోగ్యమున నింతకంటె వింతయగు ప్రరోచన మొకటి కలదు. జానశ్రుతి యనురాజు మేడపై చంద్రశాలలో బవళించి యుండెను. ఆకాశమున హంసలా మేడమీదుగా బోవుచుండెను. అపు డొక హంస తోడి హంసను జూచి "ఓయోయి భల్లాక్ష! జానశ్రుతి తేజస్సు పట్టపగటివలె మిన్నంటుచున్నది. దానిని తాకుచు దాని మీదుగా బోవుచో భస్మమైపోవుదువు. కొంచెము తొలగి రమ్ము" అని అనెను. ఆ మాటలు విని మొదటిహంస "ఇత డేమి మహాబండి రైక్వుడా? ఏమి విడ్డూరము వినవలసి వచ్చెను?" అని అనుచు ఎగిరిపోయెను. ఆ మాటలు విని జానశ్రుతి సిగ్గిలి బండి రైక్వు డెచట నుండెనో వేగులవారిచే కనుగొని అతని కడ శ్రవణ మొనరించెను. ఎందరోరాజులు, మహారాజులుగూడ గురువులను వెదకికొనబోయినటుల చదువుదుము. భాగవతములో భరతునిచేత మోపించుకొనుచు నిర్విణ్ణుడయిన రహూగణుడు కపిలుని కడకేగుచు మనకు కనబడును.

"అపు డెన్ని విధములగు శాస్త్రములుండెనో వాని నన్నిటిని వివరించినచో మన కీ యిరువదవ శతాబ్దిలో కూడ చాల వింతగానుండును. నారదు డొకానొక నాడు సనత్కుమారుని కడకేగి "అయ్యా! తమ్ము బోలిన ఆత్మవేత్తలు ఎన్ని ఎరిగినను ఆత్మ నెరుగని వారు శోకము తరింపరు అని చెప్పుదురు, నేను శోక మనుభవించు చున్నాను. నన్నీ శోక సముద్రమును దాటింపుడు". అని వేడు కొనెను. అది విని సనత్కుమారుడు "నీవే మెరుగుదువో ముందు చెప్పు! పిదప నేను నీకు తెలియనిదానిని జెప్పెదను." అని అనెను. నారదుడు ఇటులు బదులు చెప్పెను. "నేను నాలుగు వేదములను, పంచమవేదమగు ఇతిహాస, పురాణ, వ్యాకరణ, పిత్ృవిద్యా, దైవతవిద్యా, నిధివిద్యా, గణితవిద్యా, తర్క, నీతి, నిరుక్తి, భూతవిద్యా యుద్ధవిద్యా, నక్షత్రవిద్యా, సర్పశిల్పగీత, నృత్యవిద్యల నెరుగుదును." భాస మహాకవి ప్రతిమా నాటకమున రావణుడు "నేను అంగ సమేతముగా నాలుగు వేదములను, మానవధర్మశాస్త్రమును మహేశ్వర కృత యోగమును, బృహస్పతి అర్థశాస్త్రమును, మేధాతిథి న్యాయశాస్త్రమును, ప్రవచేతసుని పిత్ృకల్పమును చదివికొంటిని." అని యనును. వీనిలో చాలపట్టు మనకు తెలియనే తెలియవు. వీనిని బట్టి ఆ కాలపు విద్యల నైపుణ్యమును స్థూలముగా మనము గ్రహింపుదుము.

కౌటిల్యు డర్థశాస్త్రమున రాజకుమారులకు శిక్షా ప్రణాళిక నిటుల నేర్పరచెను. ఐదవయేట చౌలమగు పిదప లిపిని, అంకశాస్త్రమును నేర్చునది. ఆన్వీక్షకిని తెలియునది. రాజాధ్యక్షునికడ వార్తను అనగా కృషి పశుపాలనా వాణిజ్యాల నభ్యసించునది. వక్త్ర ప్రయోక్తలకడ అనగా పుస్తక – వ్యవహారోభయ జ్ఞానము కలవారికడ దండనీతి నేర్చునది. దిన పూర్వభాగమున హస్త్యశ్వరథ ప్రహరణ విద్యలనగా యుద్ధవిద్య నభ్యసించి అపర భాగమున ఇతిహాస శ్రవణము చేయునది.

''క్రీస్తుశక మేడవ శతాబ్దిలో నాలందా కేంద్రమున ఐదవయేట లిపిశిక్ష లేక 'సిద్ధిరస్తు' అని పేరుగల బాలశిక్ష విద్యారంభ మగును. ఏడవయేట వ్యాకరణారంభము, పిదప శిల్పకళాశిక్ష, తరువాత చికిత్స, అటుపిమ్మట హేతు విద్య లేక న్యాయశాస్త్రము, తుదకు ఆధ్యాత్మవిద్య, ముప్పదవయేడు వచ్చువరకు

విద్యాభ్యాసము పూర్తియగునని హుయాంగ్ చోయాంగ్ వ్రాసెను: ఇత్సింగ్ అనునతడు "మూడు వందల శ్లోకములుగల సిద్ధిరస్తు అను గ్రంథముతో విద్యారంభము, ఎనిమిదేండ్ల యీడు రాగానే పాణినీయము, ఇరువదవయేట న్యాయశాస్త్రాభ్యాసము, లేక అభిధర్మకోపము. పిమ్మట రెండు మూడేండ్లలో నాలందా వలభి విద్యాలయములలో విద్య ముగిసెడిది." అని వ్రాసెను. ఆంధ్రదేశములో నేటికిని అనుస్యూతమయి వచ్చుచున్న "సిద్ధం నమః" అను అక్షరాభ్యాసము నాటి ఓం నమశ్శివాయ అను వాక్య పుచ్ఛమునకు మూలము ఈ 'సిద్ధిరస్తు' అను గ్రంథములోనిదే కావలయును.

ప్రాచీన భరతవర్షమున విద్య రాజతంత్రముగాదు. అటులగు నెడల విద్యకు వికాసము పొసగదు. ఈ సంగతి నాటి వారికి లెస్స తెలియును. విద్యాధికార మపుడు ఆచార్యుల చేతులలో, కుంభీ ధాన్యు చేతులలో అనగా ఆరునాళ్లకు ఆహారముగలవారి చేతిలో, ఫలమేమియు నపేక్షించని సదాచారుల చేతులలో, శిష్టులయిన విద్యా పారంగతుల చేతులలో నుండెడిది. రాచవారి చేతులందే విద్య యుండినచో అది తుఫానులోని నావయే గదా! విద్యలను సాగునటుల చూచుటయే రాజుల పని. విద్యలను గౌరవించుటే రాజుల పని. విద్యలు పరిపక్వమగుటకు తగినంత ధనము నర్పించుటయే రాజుల పని. విద్యలు ఆచార్యాధీనములయి యుండుటవలననే రాజ్యములు కూలిపోయినను, రాజులు పరాజితులయినను విద్యనాశనము జరుగలేదు. నలందాలో విద్యాప్రవాహ మేడువందల యేండ్లు శోషింపక సాగిపోయెను. పరధర్మావలంబకుల పాలనయందే విద్యలకు వేరుపురుగు పట్టెను.

"భరతవర్షమున క్రీస్తుకు ఎన్నియో శతాబ్దులవెనుకనే చాల శాస్త్రములు శిఖర మందుకొనెను. బాదరాయణునకు పూర్వమే అశ్మరథ్యుడు జీవేశనరులకు భేదవాదమును, ఔడులోమి భేదాభేదవాదమును, కాశకృత్స్న దభేదావాదమును ఆవిష్కరించిరి. న్యాయ వైశేషికాదులగు షడ్దర్శనములును బాదరాయణునకు మునుపటివి. ఆ కాలమున అవతరించిన వ్యాస వాల్మీకులు భరతవర్షమునకే గాక ప్రపంచమునకే "పొయెట్‌లారియెట్స్". చరక శుశ్రుతులవంటి చికిత్సకులు, పింగళునివంటి ఛందోవేత్త, నాగార్జునునివంటి రాసాయనికుడు, కణాద గౌతముల వంటి పదార్థవేత్తలు, శుక కౌటిల్యులవంటి అర్థశాస్త్రాచార్యులు, పాణిని

కాత్యాయనులవంటి వ్యాకరణజ్ఞులు, పతంజలి శంకరులవంటి భాష్యకారులు, భాస శూద్రకులవంటి నాటకకర్తలు, కాళిదాసు భవభూతులవంటి కవులు, భట్టి శ్రీహర్షులవంటి పండితకవులు ఇంకెందరెందరో భరతవర్షము నలంకరించిరి. మనము వారి వారసులము.

మనదేశమునందు ధర్మాచార్యులు "కలసి పఠింతము; కలసి అనుభవింతము. కలసి వర్ధిల్లుదము, మనకు వైరము వలదు." అనియు, "భూమయే సుఖము, అల్పమునందు సుఖము లేదు" అనియు చెప్పిరి.

"భరతవర్షమున ఆర్యనటుడు భూభ్రమణమును ఆవిష్కరించెను. భాస్కరుడు భూమ్యాకర్షణ నావిష్కరించెను. పాటీ గణిత, బీజ గణితములు భరత వర్షముననే మొలకెత్తెను. వ్యాస కలనపు మూల సూత్రములు భాస్కరోపజ్ఞము, బంగారము; ఇనుము, మట్టి మొదలగువానిని కరిగించి అలంకారములు, స్తంభములు, కాచములు చేయుట క్రీస్తు వెనుకనే భరత వర్షమునకు తెలియును. సముద్రయానమున దిక్సూచీ యంత్రమును చీనావారు కనుగొనినది ప్రవాద మాత్రము. భరతవర్షమునకు అంతకు మున్నే మత్స్యయంత్ర మున్నది. ఇది నూనెలో తేలుచుండును. దీనికి అయస్కాంతశక్తి గలదు. బట్టలు మొదలగువానికి మాంచిష్ట నీలివేయుట పాణిని నాటికే తెలియును. ఫేనకము అనగా సబ్బు మొదలుకొని ఫేన్‌పౌడరువరకును నేడు వాడు సుగంధ ద్రవ్యములను, వాడుకనుండి తొలగిన సుగంధ ద్రవ్యములును ఎన్నియో అటనట గ్రంథములలో చూపట్టును. స్థాపత్య భాస్కర్యములకు భరతవర్షమునందలి కొండలును, బండలునే సాక్షి.

"ఇట్టి మహాసభ్యత గల భరతవర్షమునకు ఆంధ్రదేశము తనవంతు సమర్పించెను. నాలుగు వేదములకును వ్యాఖ్యాత విద్యారణ్యుడు విద్యానగరము వాడు. మీమాంసాచార్యుడు ప్రభాకరుడు తెలుగువాడు. నవీనతర్కమునకు పునఃప్రతిష్ఠ చేసిన అన్నంభట్టు ఆంధ్రుడు. కాళిదాస వ్యాఖ్యాత మల్లినాథుడు మనవాడు. ఇట్టి మహా విజ్ఞానమునకు మనము దాయాదులము. ఇది యిటులుండగా నన్నయనుండి చిన్నయవరకు వెలసిన ఆంధ్ర వాఙ్మయమునకు మన మౌరసులము.

"మన చదువు లింత చొద్దవి. మన సభ్యత ఇంత మహనీయమైనది. ప్రపంచమునం దితరులకంటె ముందే మనము జ్ఞానవంతుల మయియుంటిమి." అని చంక లెగురవేయుచో నిపుడు నవ్వులపాలయి పోదుము. ఏలనగా పాశ్చాత్యుల నేటి ఐహిక విజ్ఞానము మనల నతిక్రమించి వేలమైళ్ల ముందునకు పరుగిడెను. కాన పరుగు పట్టుకొనుటకు మన మెన్నియో జన్మ లెత్తవలసి యున్నాము. పదార్థశాస్త్రము, రసాయనశాస్త్రము, జీవశాస్త్రము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము మొదలగున వెన్నియో శాస్త్రములు మన మిపుడు పూరించుకొన వలసియున్నాము.

## మాండలిక పదాల ప్రాచుర్యం; "ఆంధ్రప్రభ" కృషికి ప్రశంస

"తెలుగంతయు సంస్కృతమునకును, ప్రాకృతములకును వికారమని ఒక వాదమును, తెలుగు స్వంతభాషయే యని యింకొక వాదమును కలదు. ఈ వివాదము సులువుగా తేలదు. ఏల ననగా సంస్కృత ప్రాకృత పదము లనంతములు. నన్నయ నన్నెచోడులకు పూర్వము వాడుకలోనున్న తెలుగు పదము లెవరికీ తెలియవు. నేడు ఒక మండలమున వాడుకలో నున్న పదములు మరొక మండలమువారి కచుంబితములు. ఈ మాండలికపదముల కొక నిఘంటువు రచియింప జేయ దలపెట్టిన యీ ఆంధ్ర పరిషత్తు నిక్కముగా ప్రజాపరిషత్తు. ఇట్టి పదముల నీనడుమ పెక్కింటిని "ఆంధ్రప్రభ" ప్రకటించెను. ఇందులకు దీని నే నుగ్గడింతును. అది యటుండె. నేటి మాండలికము లలో అటు నన్నెచోడుడు, ఇటు తొండమాన్ భూపాలుడు మొదలయిన వారు వాడిన భాషలో అరవమునకు, కన్నడమునకును దాపుగనున్న పదములను అరవ కన్నడములకు దొరలింపగా మిగిలిన తెలుగుపదములలో నెటనేని సంస్కృత పదముల తల్లి చాఱ నున్నదేమో అన్వేషింపవలెను. శివకవుల వాఙ్మయము, అన్నమాచార్యాదుల గేయ వాఙ్మయమును, జానపద వాఙ్మయమును, తెలుగు బాసకు నిధులు. ఇందలి పదముల నన్నిటిని తరచి చూచినచో తెలుగు దేవభాష కంటె సాక్షాద్భిన్నమని తెలియును. మఱియును తెలుగున గల అఱసున్న, శకటరేఫము, అవ్యయములు, ద్రుతము, తెలుగు క్రియలు, క్రియాగతమగు లింగము, కారకము, వాక్య శరీర మీ మొదలగున వన్నియును తమ విశిష్టతకు శిలాక్షరములుగా నిలువబడునని తోచును.

"కొందరు లాక్షణికులును, పండితులును తద్భవములను కొన్నింటిని దేశ్యములని భ్రమపడిరి. ఈ విషయమున ఎవరయినను భ్రమపడుట అసంభవముకాదు. పదములందును దొంగలును,దొరలును కనిపింతురు. బొమ్మిడాయి అనుపదము దొంగవలె సంస్కృతమున దూరెను. చేప "నేను శఫరీభవము"నని చెప్పమొదలిడెను. కాని, దాని పొట్ట కోసినచో అఱసున్న బైలుపడును. ఇటులే బొటారము, లొటారము మొదలయిన వెన్నియో శబ్దరత్నాకరాది నిఘంటువులలో దొంగతనముగా దూరి దేశ్యము లనిపించుకొనుచున్నవి. ఇటువంటి వానిని చూచి కొందరు అంతయు సంస్కృతమేకాని తెలుగులేదని వాదింతురు. ఈ నడుమ నొకరు గాథాసప్తశతిలోని ప్రాకృత పదములను తెలుగు పదములుగా చూపిరి. అది యింకను ఆలోచనీయమే. శాతవాహనుడు తెలుగు వాడయినచో అది అసంభముకాదని చారిత్రక దృష్టితో పరిశీలించుటకు తావున్నది. కావున "తెలుగుతెలుగే" లేక "తెలుగు సంస్కృతమే" యని వెంటనే చెప్పుటకు వీలులేదు.

"మనము మత భేదములను తప్పక గౌరవింపవలెను. మంచి విమర్శము అపురూపము. మంచి విమర్శ మమూల్యము. మనము మనలను చక్కగా విమర్శించిన విమర్శకులతో ఎపుడానందించుచు కలసి పోదుమో అపుడే సభ్యులము. ఆంధ్రభాషాతత్త్వము, ఆంధ్రపదచరిత్రము, శబ్దవిజ్ఞానము, మన స్తత్వ దృష్టిలో ఆంధ్రము ఈ 'మొదలగు శాస్త్రములు' మన కుద్భవింపవలయును. వీని అన్నిటి సాయము లేనిచో "తెలుగు తెలుగే" లేక "తెలుగంతయు వికృతియే" యని చెప్పవీలు కలుగదు. ఇక ప్రాంతీయ భాషలకు విద్యాలయములలో నిత్య వ్యవహారము జరుగబోవునుగాన పైశాస్త్రములన్నియు వడివడిగా జనింపబోవునని యే నా విశ్వాసము. వీనితోపాటు మిగిలిన శాస్త్రములన్నియు తెలుగులో నవతరించుగాక!

## ఆంధ్ర సభ్యత

భరతవర్షము నందలి సంస్కృత సారస్వతముతోపాటు ప్రాంతీయ సారస్వతములును చాల దొడ్డవి. మన అందరిది రామాయణ మహాభారత సభ్యత. హిందూ దేశమున ప్రతి అంగుళమునందును రామాయణ మహాభారతములు వ్రాయబడియున్నవి. ఇట్టి సారస్వత వాహినిలో నన్నయాది కవిత్రయము తెలుగులో మూలమునకు మిన్నగా ఆ రామాయణ మహాభారత సభ్యతను

అమృతప్రవాహములవలెగా పారించిరి. తెలుగుభాష జీవితమున, పరిమాణమున, మిగుల లేత అయినను ఇది పూర్ణము. నన్నయకడనుండి చిన్నయవరకును, తిక్కన నుండి తిరుపతి వేంకటకవుల వరకును వాఙ్మయము పలుతెరగుల అభివృద్ధి నందెను. ప్రపంచమునం దిరువదవ శతాబ్దిలో సారస్వతశాఖ అనంతముగా పెరిగెను ఇంకను పెరుగవలె? తెలుగు కవితకూడ తోడికవితలతో తలఎత్తుకొని తిరుగ యత్నించుచున్నది. "ప్రతి దినమును నీ కొక రసవద్రచన కావలెనా లేక ఒక సామ్రాజిన్మణి కావలెనా?" అని నన్ను అడుగుచో రసవద్రచనయే నాకు కావలెనని నేను కోరుకొందును. మీరును అటులే కోరుదురని తలతును.

"మీరెన్నియో గ్రంథములు చదివితిరి. మంచి గ్రంథములు కథాశరీరము గుండా పలు తెరగులగు జీవిత విశేషములజూపి, రసములో ముంచి, ఆనందము కలిగించి మానవునిలోగల సత్యము నుద్ఘాటించును. ఆ సత్యము మనసభ్యతకు శాణము. ఆ శాణమే సారస్వతము. భూభ్రమణము వలన ఋతువు లేర్పడి వేరువేరు అంశలలో వేరువేరు పండ్లను పండించి నటుల విద్యాతపస్సు వేరువేరు కవులలో వేరువేరు గుణముల బండించును. అట్టిగుణములు కలవారే మన తెలుగు కవులు; ఆ గుణములు సత్యమునకు రూపాంతరములే.

"పుస్తకములు పుస్తకములు! చమత్కారము చమత్కారము! రసము రసము!" అని మన మెలుగెత్తి చాటుదుము. అది అంతయు ప్రపంచములో- అనగా మానవునిలోగల సత్యముగాక వేరేమి?

ఆనందమే రచనకు మూలము. రచనము వలన ఆనందము. ఆ రచనలో సత్యములేనిదే ఆనందోదయముకాదు. సత్యమే కావ్యముగా వివర్తమగును. చిదానందములే రసించును.

ప్రపంచమునం దిప్పుడు మానవుడు తోడి మానవుని తొక్కివేయు చున్నాడు. మానవునిలోగల సత్యమును మానవుడు మరచుచున్నాడు. పైగా మానవు డిపుడు మానవుని వ్యాఘ్రమువలె జూచుచున్నాడు. ఆంధ్ర సారస్వత పరీక్షలలో స్నాతకులయిన మీరందరును- "వ్యాఘ్రములను మాకడకు బంపుడు. మేము వానిని జదివించెదము" అని చేతులెత్తి ఏకగ్రీవముగా అందురుగాక.

మూకములయిన ప్రాంతీయ భాషలకు వాకట్టు పోవుచున్నది. శతాబ్ది నుండియు ఆరిపోయి యున్న ఈ తెలుగు దీపము నిక మీరు అఖండ దీపముగా జేయుదురుగాక!

# 2. గ్రంథాలయములు

[పెదపాడు శ్రీ జితేంద్ర సహకార గ్రంథాలయముయొక్క ప్రథమ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించిన శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు చేసిన అధ్యక్షోపన్యాస సారము.]

*　　　*　　　*

పూర్వకాలంలో గురువే ఉండేవాడు. పుస్తకాలకు బ్రహ్మాస్త్రో బ్రహ్మ అయేది. అందుకనే "కోశవాన్ ఆచార్యః" అనేమాట పుట్టింది. ఈ కాలంలో గురువు లేడు. గ్రంథాలున్నాయి గుట్టలలాగా పడి. ఇప్పుడు "కోశవాన్ దంబాచార్యః"గా తిరిగిపోయింది.

కాబట్టి గ్రంథాలయోద్యమంలో ఈ రెండు లోపాలను సరిచెయ్యాలి. అటు గురువూ ఉండాలి; ఇటు గ్రంథాలూ ఉండాలి. అనగా గ్రంథాల దుకాణం పెట్టినంత మాత్రం చాలదు. గ్రంథాలు తెలుసుకునే శక్తికి ప్రతినిధి ఒకడు ఉండాలి; 'పుస్తకం హస్తభూషణమా ?'

## గ్రంథము - బోధ

పూర్వకాలంలో గ్రంథాలు కొలది, బోధ యెక్కువ. ఈ కాలంలో గ్రంథాలు కోటాన కోటులు. బోధ అల్పము. పూర్వకాలంలో హృదయాలే పుస్తకభాండాగారాలు. బిల్హణుడు - "భాండాగార మఖండ మేవ హృదయే జాగర్తి సారస్వతం" అన్నాడు. ఎప్పుడు ? రాజుగారికి కోపంవచ్చి తన యిల్లు లూటీ చేయించడానికి పంపినప్పుడు.

## తుక్కు

నేటి కాలంలో హృదయాలు అలాయిదా, పుస్తక భాండాగారాలు అలాయిదా. ప్రతిదీ 'రిఫరెన్స్ నోట్సు'. ఈ తారతమ్యం ఎందుకు వచ్చిందంటే 'తుక్కు' ఎక్కువయింది. అది మన చదువులోనూ ఉంది; ఇంగ్లీషు చదువు

లోనూ ఉంది. మన చదువులో సూత్రం, దానికి భాష్యం, దానికి వ్యాఖ్యానం, దానికి వివరణం, దానికి టీక, దానికి లఘుటీక. ఇహ ఇంగ్లీషులో చూడండి, టెక్స్ట్- దానికి తెల్లవాళ్లు వ్రాసిన నోట్సు, నల్లవాళ్లు వ్రాసిన నోట్సు, క్రిటిసిజమ్, ప్రోజీకరణం, అబ్రిడ్జీకరణం, మేడీజీ - ఇవన్నీ కలిసి, గిరీశం చెప్పినట్లు 'మేడ్ డిఫికల్టు' అయిపోతుంది. ఒక పుస్తకానికే ఇవన్నీ డ్రెస్. ఇంత ఎందుకు పెరగాలిసి వచ్చిందంటే గురుత్వం తక్కువ; బోధ తక్కువ, వ్యాసంగం తక్కువలో తక్కువ. శైష్యోపాధ్యాయిక ఉల్టా.

## స్కాలర్లు

పూర్వకాలంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్న వాళ్లందరూ మనం చదివిన గ్రంథాలలో ఎన్నోవంతూ చదివి ఉండరు. ఈ కాలములో 'స్కాలరు' అనిపించుకున్న ప్రతివాడూ ఏ పదివేల గ్రంథాలో చులాగ్గా చదివి ఉంటాడు. కాళిదాసుగాని షేక్స్పియరుగాని ఇన్ని గ్రంథాలు చదివి వుంటారని మీరు నమ్మ తారా ? మా గురువుగారికి మేము చదువుకున్న గ్రంథాల పేరులు గూడా వ్రాస్తే వారూ ఆనందిస్తారు, మీరున్నూ కోపాశ్చర్యాలు పడతారు. మేము చదువుకున్న తుక్కు వారెఱుగరు. వారికెంత కావాలో అంతవరకూ బాగా జీర్ణం చేసుకున్నారు. ఈ స్కాలర్లందరూ ఏమి చేస్తారూ అంటే, మాట్లాడితే పుస్తకాలలోంచి 'కోట్' చేస్తారు. మఱి జీర్ణం చేసుకున్నవారో ఒక క్రొత్త ఒరిజినాలిటీకి దారిచేస్తారు. అటువంటి వానిని ఒక్కణ్ణి తయారుచేస్తే గ్రంథాలయం చరితార్థమవుతుంది.

## గ్రంథాలయం పెట్టడం ఎందుకు ?

గ్రంథాలయోద్యమం అన్ని ఉద్యమాలతోటిదీ కాదు. గ్రంథాలు చదువు కొనే వాళ్లు గ్రామంలో లేకపోతే గ్రంథాలయంతో పనియేముంది ? చదువుకొనే వాళ్లు లేకపోతే, ఇది కూడా ఒక ఉద్యమంగదా అని ఉద్యమిస్తే 'గజభుక్త కపిత్థ' మవుతుంది. చదువుకొనేవాళ్ళు గనుక ఉంటే 'గ్రంథాలయం పెట్టడం ఎందుకు ?' అనే శంకే లేదు.

సామాన్యజ్ఞానం కలిగాక గ్రామాలలో ఊరకే కూచోవలసి వచ్చేవాళ్లకు గ్రంథాలయ మనేది సరస్వతీదేవి గుడి. గ్రంథాలయాల వల్ల ఏమీ ప్రయో

జనం లేదని చెప్పేవాళ్లు చాలామంది వున్నారు. కాని చదువులో గూడా ఇకానమీ ఉండాలనే ప్రఫుల్లచంద్రరాయిగారికి సమేతం గ్రంథాలయోపయోగం అత్యవశ్యంగా కనబడింది.

ఈక్రింది మాటలు వారివి :

## గ్రంథాలయ పండితులు

విశ్వవిద్యాలయాలలోనూ తయారైన వాళ్ళున్నారు. గ్రంథాలయాలలోను తయారైనవాళ్ళున్నారు. ఈ రెండో దాంట్లో తయారయినవాళ్ళు - కేశవచంద్ర సేను, ప్రతాపచంద్ర మజుందారు, విపినచంద్రపాలు, గిరీశచంద్ర ఘోషు, రవీంద్రులు ఇత్యాదులు. మెకాలే సీమనుండి హిందూదేశానికి వచ్చేటప్పుడు స్టీమరులో చాలా పుస్తకాలు చదివి పారేసేవాడట. అప్పటి కింకా సూయెజ్ కెనాలు లేదు. కేప్ ఆఫ్ గుడ్ హోప్ తిరిగి రావలసి ఉండేది. కాబట్టి ప్రయాణం ఆలస్యమయేది. ఆ కాలంలో చాలా పుస్తకాలు చదవడం అయేదట ! గిబ్బన్ ఆక్సు ఫర్డునుంచే తిరిగి వచ్చేశాడు. అతడు ఏ విశ్వవిద్యాలయంలోను చదివిందిలేదట ! కాని అతనిని బోలిన వారెందరు ? అతడు గ్రంథాలయములో కూరుచుండే జ్ఞానోపార్జన చేశాడు. దీనికి ఫలముగా అతడు మనకు "రోమక సామ్రాజ్య పతనము" అనే అపూర్వ వస్తువును ఇచ్చిపోయాడు. లోకం అంతా ఎరిగిన జాన్సన్ అతి దరిద్రుడు. ఒకపూట వుంటే రెండో పూట తిండి ఉండేది కాదతనికి. తన పుస్తకాలు అచ్చు వెయ్యడానికి గుత్తగొన్న సాహుకారు దగ్గిర డబ్బు కొంత అప్పు తెచ్చుకోవడానికి అతడు చీటిరాసి కింద 'తిండికి లేనివాడు' అని దస్కతు చేశాడు. కాబట్టి ఇతడు అంత కటిక దరిద్రుడు. ఇట్టి జాన్సన్ ఏ విశ్వవిద్యాలయంలోను ప్రెజెంటు వేయించుకోలేదు. ఇత డప్పసమూ గ్రంథాలయాలలోనే హాజరు.

మహాపండితుడు కార్లైలు ఇల్లు స్కాట్లండులో. తండ్రి మేస్త్రీ. వీళ్ళందరూ చాలా దరిద్రులు. దైవకృపవల్ల నేను జమీందారుల ఇంట్లో పడలేదు కాబట్టి మనిషినయినానని కార్లయిలు చెప్పేవాడట ! చదువుకోసరం తండ్రి ఇతణ్ణి ఎడింబరో పంపాడు. అత దందులో ప్రవేశించాక అక్కడి మేష్టర్లమూకలో లెక్కల మేష్టారొకడు, ప్రకృతి శాస్త్రాల మేష్టారొకడు తక్క ఇక మనుష్యులే లేరని

అన్నాడు. ప్రకృతం అతడు ఎడింబరోలో ఉంటానికి కారణం అక్కడ గొప్ప గ్రంథాలయం ఉంది. అందులో ఇతడు సొంతంగా ఇటాలియను, ఫ్రెంచి, జర్మను భాషలు నేర్చుకొన్నాడు. కాబట్టి గ్రంథాలయోపయోగం అంతులేనంత అని తెలుస్తుంది.

విశ్వవిద్యాలయాలలో తయారయిన ప్రతివాడికీ బి. ఏ. అనో, యం.ఏ., అనో బిరుదు లభిస్తుంది. గ్రంథాలయంలో తయారయిన వాని పేరే బిరుదయి పోతుంది.

బిరుదుల కోసం తంటాలు పడటం నౌకరీకి. కావలసింది జ్ఞానతృష్ణ. జ్ఞానతృష్ణ ఉంటే గురువు మనస్సు మీద ఆవరణం తీసివేసినాక, గ్రంథాలయం సాక్షాత్ సరస్వతీదేవిగా ఆవిర్భావం అవుతుంది. పిదప చదవాలి, మననం చేయాలి.

## గ్రంథాలు

గ్రంథాలయములలో సరియగు గ్రంథాలు లేకపోతే, అది ఆలయమో లయమో అవుతుంది. స్కూలు ఫైనలు దాకా ఉండే టెక్స్టుబుక్కులూ - మళ్ళా ఆ పయివికావు - నోట్సులూ, జిల్లాగెజిట్లూ, కేటలాగులూ, అర్థమెటిక్కులూ, స్త్రీలనోములూ, హిస్టరీలూ, వోటర్లలిస్టులూ, వగైరాలతో నిండిన గ్రంథాలయాలే మనకు కనిపించేవన్నీ. తప్పితే రంగురంగుల నవలా సామ్రాజ్యం ! పిదప నాటక సరకు. అమృతాంజనానికి అమృతాంజనేయం, అమరాంజనం, అమృత రంజనం, అమృత రామాంజనం, దిల్ రంజనం లాంటి అంజనాలు బయలుదేరినటులు, ఒకే నాటకానికి ప్రతిబింబ నాటకాలు పుట్టకొక్కులు. గ్రంథాలు వ్యాపార సరళిలోకి దిగాయి. సరస్వతీదేవిని బేరసారాలతో లక్ష్మీదేవిలోకి మారుస్తున్నారు. ఇక్కడ ఈ మధ్య జరిగిన ఒక ప్రసంగం చెపితే అప్రస్తుతం కాదు. ఒక గ్రంథాలయము వారు వావిళ్లవారికి 'అప్నా తనామనా' అనే పాటకున్నూ, 'చల్ మోహనరంగా' అనే పాటకున్నూ ఆర్డరిచ్చారు. వావిళ్లకూ, వేలూరికీ 'వాపీ పీవో వృషభం' అన్నట్టు వకారసంబంధం తోటి ఆ ఉత్తరం దారితప్పి నావద్దకు వచ్చింది. ఇట్టి ఉత్తరం మరోటి వస్తే, వావిళ్ల వారికి తిరగగొట్టించాను. ఇట్టి 'అపనా తనాలు' కావలసిన గ్రంథాలయాలను

వెంటనే ఎత్తేస్తే, సరస్వతి కన్నీరు తుడుచుకుంటుంది. గ్రంథాలయము గ్రంథాలయ సభ్యుల చిత్తవృత్తికి అద్దము. తూకముగా అన్ని శాఖలలోను తగిన గ్రంథాలను చేర్చి, చదివించడం మహాపుణ్యం చేసుకుంటేనే గాని సమకూరదు.

## మంచి గ్రంథములు

మన హృదయములలో దాగిఉన్న రసాన్ని ఆకాంక్షనూ పయికి లేవనెత్తుకొని వచ్చేవే మంచిగ్రంథాలు. అవే మహాకావ్యాలూ, ఉపనిషత్తులున్నూ. కడమవి చాలాభాగం చాకి మూటలు. గ్రంథం మనస్సుకు భారం కాకూడదు. నిత్యమూ నిలవవుండే పరిమళం కావాలి. ఇట్టి గ్రంథాలే చదువదగినవి, వినిపింపదగినవి. ఇవే మన పూర్వులందఱున్నూ మనకు సమానంగా పంచిపెట్టిపోయిన సార్వజనిక ధనం.

## లై బ్రే రి య న్

మంచి లైబ్రేరియన్ లేకపోతే గ్రంథాలయానికి తాళము పెట్టవచ్చు. విపిన చంద్రపాలుగారు గ్రంథాలయంలో ఓరంత ప్రొద్దూ కూర్చుండి, చదివి, ప్రపంచకములో మహావ్యక్తిగా పేరు పొందాడు. ఆయనకు పెద్ద డిగ్రీలేదు. కాళిదాసుకు మహామహోపాధ్యాయ డిగ్రీ ఇస్తేనూ, షేక్స్పియరుకు డాక్టర్ డిగ్రీ ఇస్తేనూ ఏమయినా కొత్త గౌరవం వస్తే వీరికి గూడా ఒక డిగ్రీ కట్టిపెట్టవచ్చు. పాలు గారికి లైబ్రేరియన్ అనేదే పెద్ద బిరుదు.

గ్రంథాలు చదివి, ప్రతిగ్రంథము మీదా తమ తమ ఉద్దేశాలు వ్రాసి, మిగతా వాళ్ళందరకూ దాన్ని ఉపయోగపఱచాలి. లైబ్రేరియన్ గ్రంథాలయానికి పురోహితుడు. పురోహితుడు లేకుండా ఏ కార్యమూ తలపెట్టము. కాబట్టి, ముందర అటువంటి పురోహితుణ్ణి తయారుచేయాలి.

సామాన్యంగా మంచి తెలుగు గ్రంథాలు వందలకున్నూ, సంస్కృత గ్రంథాలు వేలకున్నూ, ఇంగ్లీషు గ్రంథాలు లక్షలకున్నూ సమకూరుతవి గాని లైబ్రేరియన్?

## తె లు గు

దేశ కాల పాత్రముల ననుసరించి జనసామాన్యానికి ఇంగ్లీషు బళ్లు తప్పవు. తెలుగు సంస్కరణం కావాలని ఉంటే, ముఖ్యంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం

ద్వారా రావాలిసిందే. విశ్వప్రయత్నాలు చేస్తే- సంస్కరణం సిద్ధించేమాట పక్కమీద పని.

గ్రంథాలయాలకు సంబంధించిన ఏ కొలది మందైనా తెలుగును బాగా అభ్యసించి, స్పెషలైజ్ చేస్తే దానిద్వారా తెలుగు సంప్రదాయం నిలుస్తుంది. అవి మన పైతృకధనం. ఇదివఱకే చాలాభాగం నశించింది. హతశేషాన్ని కాపాడుకొనే శక్తికూడా మనకు లేనట్లుంది. జనాభాలో హిందీవారి తరువాత బంగాళీవారు-వారి తరువాత తెలుగువారు. వీరు రెండు మూడు కోట్ల మధ్య ఉంటారు. ఇందులో నూటికి పదుగురో పదముగ్గురో అక్షరాస్యులు. ఈ అక్ష రాస్యులలో దస్కతుమాత్రం ఎఱిగినవాళ్ల చాలామంది ఉంటారు. ఇక భాష బాగా వచ్చినవాళ్లు వేయికి ఒకడుంటే ఎక్కువ. సారస్వతవ్యాప్తి బంగాళీలో ఎక్కువ. పిదప అరవమట! పిదప తెలుగుట. తెలుగువారికంటె అరవవారు జీవికకు పాటుపడవలసినవారు. కాబట్టి అన్ని ఉపకరణాలతోపాటు భాషను కూడా ఒక ఉపకరణం చేసుకొని, దాని ద్వారా జీవికను నెట్టుతున్నారని నే నొకరివల్ల విన్నాను. తెలుగువారు సోమరులట! కావున అరవ ప్రచారానికి తెలుగు ప్రచారం తీసికట్టని అనుకోవలసివస్తూంది.

తెలుగుకుకూడా వంగభాషవలె మహాభాష కాదగిన ఆనుకూల్యం ఉంది. కొలది రోజులలో కాదగిన సూచనలున్నాయి. తెలుగుభాష ఇప్పుడు కటాహంలో కాగుతూంది. కొంత ఆవిరి అయి ఉంది. ఈ అవ్యక్తస్థితిలోంచి ఇహ వచ్చేది శుభమైన సృష్టి. ఆ సృష్టికోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

మీ గ్రంథాలయాన్ని గ్రామానికి మెదడుగా చెయ్యండి. ఇంట్లో కోపం వచ్చో, తీరికకోసమో కాకుండా "ఇక్కడ కుమ్ము, అక్కడ దుమ్ము! పదరా పందిట్లోకి!" అన్నట్లు కాకుండా, పుస్తకాలను తలదిండ్లు చేసుకోకుండా, ఆరోగ్యనీతుల ననుసరించి మీ గ్రంథాలయాన్ని సరస్వతికి ఆలయాన్ని చేయండి.-

[భారతి 1930 డిసెంబరు. పుటలు 1028-1031]

# 3. మన సాహిత్య పత్రికలు: భారతి

(భారతి రజతోత్సవసభలో శాస్త్రిగారి అధ్యక్షోపన్యాసము)

భారతికి జరిపే ఇరవై యైదు హేమంతాల యీ మహోత్సవంలో సభాధిపత్యం అంగీకరించటానికి నాలో నాకే సందేహంగావుంది. ఎందుచేతనంటే, నేనొకపత్రికాధిపతిని కాను, సంపాదకుడను గాను. పత్రికానిర్వహణలో కష్టాలు మోసినవాడనుకాను. కాబట్టి యీ విషయంలో-

"బలము నీవ నాకు, భక్తుండ నీయెడ
నాలు బిడ్డలు లేని యట్టివాడ
కావు నన్ను నధిక కారుణ్యమున నిమ్ము
నుజ్ఞ కమల దళ మనోజ్ఞనయన!"

అని భీష్ముడు శ్రీకృష్ణుని కోరినటులు మీ అనుజ్ఞ కోరవలసినవాడను. పోనీ రచయితల పక్షాన్నయినా రెండు మాటలు చెప్పగలనా అంటే, ఆ సంసారం కూడా నేను తిన్నగా నిర్వాకం చేసినవాడను కాను. కాబట్టి సమర్థులు నేపథ్యంలోనే ఉండి, అసమర్థులను పైకి తీసుకురావడానికి చేసిన ప్రయత్నానికి ఫలితంగా నే నిందుల కంగీకరింపవలసి వచ్చింది. సంపాదకుల విషయంలో, రచయితల విషయంలోను నేను చెప్పగలవి అతిసాధారణ విషయాలు. సమాజబుద్ధినీ రాష్ట్రబుద్ధినీ ఎవరు లోకహితము దెసనూ, సౌందర్యము దెసనూ దైనందినము పదనుపెడుతూ వుంటారో, బృహస్పతుల కడనుండి అంధస్ఫతుల వరకూ ఉన్న రచయితలు ఎవరి సహాయ సంపత్తిచే పేరు ప్రతిష్ఠలకు వస్తారో, ఎవరు శబ్దం వలన కలిగే పీడావమానాలను కూలివాండ్రవలె మోస్తారో అట్టి పత్రికా సంపాదకులు లోకులతిట్లనూ దీవెనలనూ సమానంగా చూచుకుంటూ నిత్యైకాదులకు పాలు పడినా, తమ రచనా నందము వలననే నిర్విచారంగా బ్రతుకుతూ లోకసేవ కోసం, శిల్పంకోసం కలంపట్టిన రచయితలు అవరుద్ధములైన వారి హృదయాంతరాళాలలోని నాలుగు ముక్కలు చెప్పగలిగితే, అవి తమకు సానుభూతి కలిగించ గలిగితే నేను ధన్యుడను.

## సాహిత్య పత్రికలు

"అముద్రిత గ్రంథ చింతామణి"తో ఆంధ్రసాహిత్య పత్రిక లారంభ మైనవని అనుకుంటాను. ఆనాటి సాహిత్య మహారథుల ప్రబంధ రచనలూ, సాహిత్య చర్చలూ కనబడతవి. ఆ మహారథులు మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు, మచ్చ వెంకటకవిగారు, వేదం వేంకట్రాయశాస్త్రిగారు. శతఘంటం వేంకట రంగశాస్త్రిగారు, నాగపూడి కుప్పుస్వామయ్యగారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారు, – దేవు డింకా మేలు చేస్తే – కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, వావిలకొలను సుబ్బారావు పంతులు గారు మొదలయినవారు – నాటి సాహిత్య విమర్శన యావత్తూ పదాలచుట్టూ, రచనాలంకార పూర్వకంగా, వ్యాకరణంచే శరసంధానంచేసి బహుదూరంనుంచీ ఒకరిమీద ఒకరు ఘాశిక్రీడ చేసికోవడముగా ఇప్పటి వారికి కనిపిస్తుంది. అయితే ఈ పత్రికలలో కనబడే శబ్దవిచారం కాని, పాండిత్యంకాని అపారమని అనడానికి స్వీకరం. నేటికాలంవారు శబ్ద సాధు త్వాన్ని బహిష్కరించి అర్థావిష్కరణానికి ఎట్లా భల్లూకపు పట్టు పడుతున్నారో నాటి కాలంవారు ఆ భాండాయు ఉంచి, శబ్దంకోసమే పెనగులాడుతూ వుండేవారు. అప్పుడు ప్రబంధనాయికా నాయకులు ఓమలపాటల వలన పుష్పసంలో కలిగే ఊర్పు నిట్టూర్పులలో మాత్రమే వైచిత్రి కనబడుతుంది.

వాడుకభాషలో అందెవేసిన శ్రీ గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం లోని సీసపద్యం ఒకటి సదరు అముద్రిత గ్రంథ చింతామణిలో చూచి నేనాశ్చర్య పోయి 1913 లోనో '14లోనో ప్రెసిడెన్సీ కాలేజీలో జరిగిన ఒకసభలో దానిని గురించి అప్పారావుగారి నడిగాను. మొదట ప్రబంధభాషలోనే కన్యాశుల్కం వ్రాసి, అది రుచించక పోవటంచేత గ్రామ్యంలో తిరిగి వ్రాశానని వారప్పుడు చెప్పారు. శ్రీ రెంటాల వెంకట సుబ్బారావుగారు కన్యాశుల్కానికి పోటీగా వరశుల్కం వ్రాశారుగాని దానికి పాతకశుల్కం దొరకలేదు. అప్పుడే శ్రీ సోమంచి భీమశంకరంగారు రఘువంశం కొన్నిసర్గలు వాడుకభాషలో పద్యాలు వ్రాశారు. అవేమయినవో తెలియదు.

అముద్రిత గ్రంథ చింతామణిలో శ్రీ శతఘంటం వెంకట రంగంశాస్త్రిగారు తాము గుంటూరు వెళ్ళడము, తిక్కనగారి వంశవృక్షాన్ని ప్రదక్షిణించడము,

తిక్కనగారి గంటమును చూడటము ఈ మొదలుగా వ్రాసిన విషయాలు చదువుతూ వుంటే మనం సజీవులయిన తిక్కనగారిని సాక్షాత్కరించుకుంటాము.

తరువాత వచ్చిన సాహిత్య పత్రికలకు 'అముద్రిత గ్రంథ చింతామణి'యే ఒరవడియై వుంటుంది. 'కల్పలత' పత్రికలో ప్రాచీన ప్రబంధములు, నవీన ప్రబంధములు, కొందరు పండితుల ద్వంద్వ యుద్ధాలు, సంకుల సమరాలు మాత్రమే ప్రధానంగా కనబడతవి. శ్రీ వీరేశలింగం పంతులు గారి 'వివేక వర్ధని'లో మాత్రం సాహిత్యపురుషుని సహస్ర ముఖాలు స్పష్టాస్పష్టంగా గోచరిస్తవి. ఈ రీతిని క్రమ వికాసం పొందుతూ వచ్చిన సాహిత్య పత్రికలన్నీ ఆయా సంపాదకుల ఏకైకాభిప్రాయమునే ప్రచారం చేస్తూ రావడంవలననో, ఆంధ్రమహాజనులకు ఆ సాహిత్యంలో రసగ్రహణశక్తి లేకపోవడం వల్లనో, మరి రచయితలలో లోపం వల్లనో మెల్ల మెల్లగా అస్తమిస్తూ వస్తున్నవి.

## వార్తా సాహిత్య పత్రికలు

నేను కొంచెం కళ్ళు తెరిచే సరికి సాహిత్యపత్రికలైనా వార్తాపత్రికలైనా, బందరులో 'కృష్ణ' ఒకటీ-ఈ చెన్నపట్నంలో 'శశిలేఖ' ఒకటీ. శశిలేఖ చిన్న పత్రిక, శ్రీ గట్టుపల్లి శేషాచార్లుగారు కాబోలు దీనిని ప్రచురించేవారు. ఈ రెండు పత్రికలున్నూ రాజకీయాలు ప్రధానంగా సమయిక పద్యాలనూ పండితుల విమర్శనములనూ ప్రకటిస్తూ వుండేవి కొలది రోజులలోనే 'శశిలేఖ' లేకుండా పోయింది.

కాంగ్రెసువాజీ గాలివలె మూలమూలకూ పాకుతున్న రోజులవి. జన సామాన్యంలో కాకున్నా, నాయకులలో చైతన్యాగ్ని తీవ్రమని మండజొచ్చిన రోజులవి. సాహిత్యంలోకూడా రాజకీయాలు అమ్ములవలె దూసుకువచ్చిన రోజులవి. అప్పుడు దేశాభిమానం మాత్రకట్టుగా పద్యాలలో మింగడానికి అనువు పడ్డది-

> "పాయిజామా మాని పంచెను కట్టు వాఁ
> డుండునా దొరలలో నొక్కఁడయిన"-

ఈ మొదలగు పద్యాలు ఆనాటివే !!

## సంస్కృత పత్రికలు

ఈ సమయంలోనే మహోపాధ్యాయ అప్పాశర్మ విద్యావాచస్పతులు 'చంద్రిక' అనే మాసపత్రికను, 'సూనృతవాది' అనే రాజకీయ వారపత్రికను ప్రకటిస్తూ వుండేవారు. చంద్రికకు అప్పటికి షుమారు ఇరవయ్యేండ్లు వుండ వచ్చును. ఈ చంద్రిక ఫిజిక్సును సూత్రాలలో వ్రాయ మొదలెట్టింది— సూనృతవాది శిశువు. ఈ శిశువు రాజకీయాలలో 'తిలక్'కన్నా ఏడాకులు ఎక్కువ చదువుకున్నది. ఆ పత్రికలలో నుంచి ప్రతివారమూ శ్లోకరూపములో కొన్ని తుపాకి గుండ్లు మోగుతూవుండేవి. ఈ రెండు పత్రికలూ తమకు చాలా బలదానం చేసినవని శ్రీనాగేశ్వరరావు పంతులుగారు చెప్పారు. ఇంకా కొన్ని సంస్కృత సాహిత్య మాసపత్రికలు ఈ యేడు కాంగ్రెసు జరిగిన జయపురం మొదలగు ప్రదేశాలనుంచి, కాశీనుంచి, నవద్వీపంనుంచి, కలకత్తానుంచి కొన్ని సంస్కృత వారపత్రికలు, 'మంజుభాషిణి' మొదలైనవి కంచినుంచీ వస్తూవుండేవి— ఇప్పుడొక్కసారి యీ సంస్కృత పత్రికలకేసి సింహావలోకనం చేస్తే కృశించి పోతున్న ఈ సంస్కృతానికి ఇంత సింహశౌర్యం ఎక్కడ వున్నదా అని తోచక మానదు. అట్టి సంస్కృతాన్ని రాష్ట్రభాషగా తీసుకోక హిందుస్థానీనో, హిందీనో తీసుకోవటం ఏమి రాజకీయ పరిజ్ఞానమో, ఏమి భాషావిజ్ఞానమో తెలియదు!

## ఆంధ్రపత్రిక

'ఆంధ్రపత్రిక' బొంబాయినుండి చెన్నపట్నానికి మారి దినపత్రికగా వికసించింది. చర్చిలో ప్రతివారమూ జరిగే సాముదాయకోపాసనవలె ఈ ఆంధ్ర పత్రికలో ప్రతివారమూ సాహిత్యోపాసన జరుగుతూవుండేది. 'ఇల్లు ఇరకటం ఆలి మరకటం' అన్నట్లు ఇది బాగానే ఇరకటంగా వుండేది. ఆ కాలంలో కూడా వార్తాపత్రిక అన్నా సాహిత్యపత్రిక అన్నా ఒకటే. ఆంధ్రుల కప్పుడు ముఖ్యంగా ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక - ఈ రెండూ రెండు కళ్ళు. మరచాను. సావిత్రి, హిందూసుందరి, సువర్ణలేఖ మొదలైన మాసపత్రికలు కూడా చాలా సాహిత్యం ప్రచారం చేస్తూ వచ్చినవి.

## పత్రికయే పాథేయం

నేటి జీవితయాత్రలో పత్రికయే పాథేయం. అన్నం లేకున్నా బ్రతక వచ్చుగాని పత్రిక లేకుంటే బ్రతకటం కష్టం. అందువల్లనే పత్రికలకు ఇప్పుడు ఆదివారం కూడా సెలవులేదు.

సైన్సు యంత్రములు వచ్చి వేలకొలది ఉన్న మానవసమాజాలను మానవ సభ్యతలను ప్రతిరోజు నట్టింటికి తెస్తున్నవి. భూగోళంలో వుండే మానవ సమాజాల కర్మకలాపాలు, సభ్యతాసంపత్తుల సంస్కారాలు అనేక విధాలు. పత్రికల ప్రదేశం ప్రాదేశిక మాత్రం. ఈ అంగుష్ఠమాత్ర పురుషుడు ఈ ప్రాదేశికమాత్రంలోనే జనబాహుళ్యానికి నచ్చే విషయాలు ఏరి ప్రకటించాలి. ఏ భాషలో వీరికి స్వరూప ప్రకాశం ఇవ్వాలనేది విదప.

## పత్రికల భాష

"అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయెకాదె కవి వివేకంబు"

—అని పాలకురికి సోమనాథుడు అనినటులు ఎంత పెద్ద విషయాన్ని ఎంత కొద్ది మాటలలో ప్రకటన చేయకల్గితే అంత మంచిదనేది వార్తాపత్రికలకు ముఖ్యాంశం.

విఖ్యాతుడైన విలాతీ వ్రాయస కాడొకడు- "వార్తా పత్రికల సాహిత్యం ఆడువారి దుస్తులవలె విషయమునంతా ఆవరింపదగినంత పొడుగుగానూ, ఆహ్లాదింప గలిగినంత పొట్టిగాను వుండాలి" అని అన్నాడు. ఈ ఆడువారు ఆపాదమస్తకము ఆచ్ఛాదన చేసుకొనే ఆడవారు. కాని, కౌపీనమాత్రంచే ధన వంతులైన హాలీవుడ్ తారలు వేరే చెప్పనక్కరలేదు. వీరు గౌరవింపదగిన ఆంగ్ల గృహిణులు.

## సంపాదకుల ఓర్మి

నేల నాలుగు చెరగుల నుంచి ఇంగ్లీషులో వార్తలు వస్తవి. మన సంపాద కులు ఊపిరి బిగపట్టుకొని రెండుమూడు గంటలలో ఆ ఇంగ్లీషు ప్రవాహానికి

తెలుగుకట్ట వేయవలసి ఉంటుంది. భాషా సముద్రం మింగికూర్చున్న అగస్త్యులు ఆలోచించి ఆలోచించి తూకంగా వాడే శబ్దాలు మన సంపాదకుల మనస్సులలో సద్యోజాతాలు కావాలి. వానిని వెంటనే అచ్చుయంత్రముముందు బలిపెట్టాలి. ఇంగ్లీషు పారిభాషిక శబ్దాలకు సరియైన దేశ్యాలు లేవు. వానిని ఈ సంపాదకులు అప్పటికప్పుడు పూరించాలి. చరిత్రకు సంబంధించిన కారణాలచేత పుట్టిన శబ్దాలను, సైన్సుకు సంబంధించిన శబ్దాలను తెలుగుచేయటం అసాధ్యం. సంపాదకులీయసాధ్యాలను దైనందినము సాధించాలి. వీరు ఇంతా తంటాలుపడి ఈ అసాధ్యసాధన చేస్తే విమర్శకులు వీరి వ్రాతను 'బ్రహ్మవ్రాత' అని వెక్కిరిస్తూ వుంటారు. ఈ వెక్కిరింతల నన్నిటిని సహిస్తూ తమ పని నిర్వహించుకుంటూ పోయే ఓరిమి ఒక్క సంపాదకులకే ఉన్నది-కవులకు గాని తదితర రచయితలకు గాని ఈ సహనం ఉండదు-

## భాషాలోపం

కొందరు ఈ తెలుగు భాషలోనే ఈ లోపం ఉన్నదని అంటారు. అది తెలుగు భాషాలోపం కాదు, మరి ఏ భాషాలోపమూ కాదు. అది మన ప్రయత్నలోపం. కావ్యాలకు మాత్రం ఉపయోగపడ్డ భాష, రాజనీతి అర్థనీతి గణితము భూగోళ విజ్ఞానము ఖగోళ విజ్ఞానము యంత్ర విజ్ఞానము మొదలైన విషయాలలో వేగవంతం కాదు-అసలు అనువాద మంటేనే అప్పనాలు చెప్పాలి-సింహాద్రి అప్పన్నకు. అటువంటప్పుడు పారిభాషిక పదాలకు అనువాదం చెయ్యాలంటే పితరులు దిగి రావాలి. మన వేదాంత భాషను ఇంగ్లీషులో పెట్టమనండి చూదాం. తర్కపు గొలుసుకట్టు మరియొక భాషలో బంధింపబడుతుందా? 'వ్యధికరణ ధర్మావచ్ఛిన్నాభావం' అనేదానికి ఇంగ్లీషు ఎట్లా? ఇటువంటివి దీర్ఘకాలంమీద పరిషత్తులు సాధింపవలసిన పనులు. ఈ లోపం అన్ని భాషలకూ వుంది-ప్రయత్నం చేస్తే అన్ని భాషలకూ లేదు.

## పత్రికా సాహిత్యాలకు అంగాంగిభావము

పత్రికలు వార్తలనే కాక న్యాయమైన తమ మతాన్ని ప్రజా ప్రవాహములమీద తైలబిందువువలె వ్యాపింపజేయవలసివుంటుంది. దానిని బట్టియే

జాతీయ జీవన ప్రభావం విశాలమవుతుంది. ఏ పత్రిక ఈ పని చేయ కలిగితే ఆ పత్రికకు జనప్రియత్వం హెచ్చుతుంది. అన్యాయంనుండి, అవ్యవస్థనుండి తొలగించి ప్రజలను న్యాయం దెస త్రిప్పుకొనేందుకు సంపాదకులు వ్రాసిన వ్యాసాలు క్షణభంగురాలైనా వానికి సాహిత్యోత్సవంలో పాంక్తేయత ఉన్నది. జన సామాన్యానికి నచ్చేటటులు చెప్పే నేర్పు గొప్ప సాహిత్యరచన కాక పోయినా, అది బుద్ధికుశలతకు పరిచాయకం. భాషలో నుడికారము, భావోద్దీపము, బాణవేగము, మోహిని హాస్యము, ఇటువంటి గుణాలు వుంటే ఆ సంపాదకుడు జనప్రియుడు కాగలడు. సంపాదకుడు గొప్ప సాహిత్య రచయిత కానక్కర లేదు. పండితుడు కానక్కరలేదు. కాని హృదయవేగము, తీవ్రమైన అనుభూతి, జాతితోటి జాతిగతమైన ఆంక్షలతోటి సాక్షాత్ సంబంధమూ లేకపోతే మంచి సంపాదకీయాలు రావు. సంపాదకుడు నిత్య యౌవనుడు. అతనికి నిన్న లేదు; రేపు లేదు. అతని కున్నది నేడే !!

తెలుగు భాషలో పత్రికలే రాజనీతికి, అర్థనీతికి నడ దివియలు. వీని వెలుగే ఆంధ్రదేశానికీ వెలుగు. చింతాశీలురైన దేశభక్తులు రాజనీతి గురించి, అర్థనీతి గురించి చేసే ఆలోచనలకు పత్రికలే క్షేత్రాలు. పత్రికలే ఈ శాస్త్రా లకు సంచార భాండాగారాలు.

పలువురు రచయితలు సంపాదకులను అనుసరించడం కలదు. కవులు, రచయితలు ఈ పత్రికల సహాయం చేతనే కీర్తిప్రచారాలను పొందుతున్నారు. ఈ పత్రిక లెన్నో నవలలను, కథలను, నాటకములను, పద్యాలను, పదాలను ప్రకటించినవి-ప్రకటిస్తున్నవి. ఇవి మళ్లా పుస్తకాకారంగా వెలువడి ప్రజా హస్తాలను అలంకరించినవి-అలంకరిస్తున్నవి. ఈ రీతిగా పత్రికలకూ సాహిత్య మునకున్నూ అంగాంగీభావ మున్నది.

## శారద

రాజకీయాలలో సాహిత్యం కలగాపులగం అవుతున్న ఈ రోజులలో వంగ భాషలో కలలుగనే శ్రీరామశాస్త్రిగారు 'శారద'ను సాహిత్య పత్రికగా అవతరింప జేశారు. అప్పుడు బందరు నేషనల్ కాలేజీలో శిల్పాచార్యులుగా వున్న ప్రమోదకుమార ఛటోపాధ్యాయులు తమ శారదతో ఆ శారదను రంజింపజేశారు.

'ప్రథమ కబళే మక్షికాపాతః' అన్నట్లు పోష్టల్ డిపార్టుమెంటువారి దృష్టి లోపం దానికి తగలడము, దానికి వారు ఆంక్ష వెయ్యడం, తరువాత ఉపసంహరించుకోవడం జరిగింది. ఏమయితే నేం? సంపాదకుల లోటు లేకపోయినా, రచయితల లోటు లేకపోయినా, ఎత్తుకు తగినంత ధనం లేకపోవటం వలన, చందాదారులు తగినంత మంది లేకపోవడం వల్ల సాహిత్య జగత్తులో మళ్లా కృష్ణపక్షం వచ్చింది.

## భారతి

ఆ కృష్ణపక్షం ఎన్నాళ్లో వుండలేదు. కొద్దిరోజులలోనే సాహిత్య ప్రపంచానికి శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారి ప్రయత్నంతో సాహిత్య ప్రపంచంలో మరల భారతీముఖంగా చంద్రోదయమైంది. అప్పుడు తెలుగు ప్రజలందరూ 'నవో నవో భవతి' అని తలా ఒక నూలు పోగూ వేసి చంద్ర దర్శనం చేసుకోవడం మొదలుపెట్టారు.

శ్రీ నాగేశ్వరరావు గారి కిరణాలు మూలమూలలకు ప్రసరించినవి. తెలుగు రచయిత లందరూ క్రమక్రమంగా ఆ చల్లని కిరణాలలో ప్రకాశించారు. ఆ చంద్రోదయానికి ప్రజాసముద్రం పొంగింది. రచయితలు పాఠకులు నాటినుండి ఆరాత్రికము మొదలుపెట్టారు. దానితో తెలుగు సాహిత్యం తెలుగు మీరింది. పిదప ఈ భారతిలో ప్రాచీన సాహిత్యము నవీన సాహిత్యము కలిసి గంగాయమునలవలె ప్రవహిస్తూ అటు పెద్దలకు, ఇటు పిన్నలకు ఆనందం కలిగించింది.

## నవీన సాహిత్యము - ప్రాచీన సాహిత్యము

నిక్కానికి నవీన సాహిత్యమంటూ, ప్రాచీన సాహిత్యమంటూ రెండు సాహిత్యాలు లేవు. ఇవి విభక్తులగు సోదరులవంటివి కావు. కవలలు కూడా కావు. ఇవి ఒక - అంటే ఒకటే! ప్రాచీనతా నవీనతలు కాలంవల్ల కల్గుతవి. సజీవమైన సమాజంలో నిరుటి సాహిత్యం ఈనాటికి పాత చింతపండు. మనదేశంలోనే, మన భాషలోనే అభ్యుదయ పత్రికను చూడండి. ఒక పాతికేళ్ళలో ఒక ఏటికి మరిమొక ఏటికి భారతినే చూడండి ఎంత తేడా వుందో?

సాంఘికాచారాలు, పరిసరాలు, రాజ్యపరివర్తనము, ఆయాయీ విప్లవాలు, భావన - ఈ మొదలైన వాని ప్రాబల్యం సాహిత్యాన్ని పరిణమింప జేస్తూనే వుంటుంది. జగత్తు - ప్రతి దినమూ కాలంచే పక్వమవుతూ పరిణామం చెందుతూనే వుంటుంది. దానితోపాటు సాహిత్యం పరిణామం చెందకపోతే కవుల చైతన్యము, రచయితల చైతన్యము నిద్రాణమై ఉన్నదన్నమాట. దానిని సంపాదకులు మేల్కొల్పాలి. భారతి కూడా తెలుగు వారి ప్రతిభ ననుసరించి పరిణమిస్తూ పాతికలో పడ్డది. అందులకే నేటి ఈ ఆనంద సమావేశం. ఈ ఉత్సవానికి శ్రీ నాగేశ్వరరావుగారే వుంటే భారతి బహుళార్థక సంపత్తితో భాసిస్తూ వుండేది. అయినా 'భారతి'కి లోటేమిటి? శంభుప్రసాదం వలసినంతఉంది.

## రచయితలే భారతి

ఈ భారతి దేవాలయంలో భారతిలేదు - భారతి అంటూ విడిగా విగ్రహం లేదు. తెలుగుదేశంలో వుండే రచయితలే భారతి! భారతి అంటే రచయితలు. వారు మథించిన వాగమృతమే భారతి. భారతికి ఉత్సవం జరుగుతున్నదనగా రచయితలకు జరుగుతున్నదన్నమాట.

విగ్రహరూపమైన భారతికి మనం అనేకమైన దివ్యాలంకారాలు కల్పించి నిత్యనైవేద్యాలు చేస్తూ ఆరాధిస్తాం. అటువంటప్పుడు ఈ సజీవ భారతులగు రచయితలు ఎలాగు బ్రతుకుతున్నారో పత్రికాధిపతులకు తెలియకపోదు.

తెలుగుదేశంలో పత్రికా పాఠకులే కొద్దిమంది. సాహిత్య పత్రికా పాఠకులు మరీ కొద్దిమంది. రచయితలు లక్ష కొకమంది ఉంటారో వుండరో? ఇదంతా కూప మండూక వ్యవహారం.

## శ్రీ నాగేశ్వరరావుగారు - భారతి

ఆంధ్రదేశంలో తలచూపిన ఉద్యమ సహస్రానికి తమ బాహు సహస్రాలతో శ్రీ నాగేశ్వరరావుగారు ఎట్టిపునాదులు వేశారో, సాహిత్యానికి కూడా అట్టి గట్టి పునాదులు వేశారు. బంగారంతో రచయితలకు లక్ష్మీప్రసాదం వారితోనే ప్రారంభమని నేను చెపితే మీరెవరూ వివదింప రనుకుంటాను. సాహిత్యానికి

ఇట్టి పునాదివేసిన శ్రీ నాగేశ్వరరావుగారికి ఆంధ్రదేశంలో సువర్ణ ప్రతిమను ప్రతిష్ఠించడం సముచితం. కవులు రచయితలు శ్రీ నాగేశ్వరరావుగారి సువర్ణ ప్రతిమ ప్రతిష్ఠించ లేకపోయినా, సు-వర్ణ ప్రతిమ దైనందినమూ ప్రతిష్ఠ చేస్తూనే వుంటారు. శ్రీ నాగేశ్వరరావుగారు వేసిన యీ బంగారు పునాది మీద శ్రీ శంభుప్రసాదుగారు రజతోత్సవము చేసి భారతి విషయంలో ఆంధ్రదేశాన్ని కాశ్మీరాన్ని చేస్తారని మన మందరమూ కోరుకొందాము-



# 4. 'గారు' శబ్ద విచారము

లోకులు విద్యావృద్ధులకును, వయోవృద్ధులకును 'గారు' తగిలింతురు. సవయస్కులను, బాలురను 'ఏమోయి' యనిగాని, 'ఏమిరా' యనిగాని సంబోధింతురు. పెక్కు కారణములచే అయ్యా, అండీ, ఓయీ, ఓసీ, ఏమిరా ఏమే లు మారుచుండును.

గారు అనునది భయభక్తులను దెల్పుమాట దీని పుట్టుపూర్వోత్తరములు గూడా నట్టివే. ఇది బహువచనమయినను ఏకవచనమున గలిసిపోయి గౌరవమును వెలిబుచ్చును. ఉదా: తాతగారు. కేవల బహుత్వమును దెలుపుటకు వెంకయ్య పుల్లయ్యగార్లని యందురు. కావున గారు అను దానిని గౌరవమును దెలుపు ఏక వచనమని యనదగును.

గారు అనునది గౌరవమును దెలుపు ఏకవచనమగు నెడల గాడు అనునది నైచ్యమును దెలుపు ఏకవచనము. ఉదా: ఏలిగాడు. ఈ గాడు దిగువ వర్ణముల వారి కంటుకొన్నది. కొందఱు శాస్త్రజ్ఞులు మిడిమిడి సాహిత్యము కలవారిని సాహిత్యగాండ్లనుటకు బదులుగా డు ప్రత్యయాంతములని వేళాకోళము చేయు దురు. కల వాడు అను రెండు పదములు కలాడుగా మాఱి కాడు కానగును. విల్లు కలవాడు విలుకాడు. అందము కలవాడు అందగాడు.

కల + వారు కారుఅయి గారు కావచ్చును. అగుచో విలుకాఱు అను బహువచనమున శకటరేఫ మెటులు వచ్చెను? "ండ్రు" అను నీ సంయోగపు బరువును మోయుట కీ శకటము వచ్చెనా? ఇది పరిశీలింపదగిన విషయము.

గాడు అనునది నైచ్యమును దెలుపును గావున ఏలిగాడు మొదలగు పదములను దొరతనమువారు తమ సారస్వతమునుండి ఎత్తివేసిరట. ఇది ప్రశంసనీయము.

పల్లియలలో నిన్నమొన్నటివఱకును గారు వినబడునది కాదు. 'ఏమోయీ నాన్నా'. "ఏమే అమ్మా" అని సంబోధించు బాలురు నేటికి నన్ని

కుటుంబములందును జెదురుగా గలరు. మిగిలిన పెద్దల యెడలను, పూజ్యుల యెడలనుగూడ 'గారు' వినబడదు. అది పల్లియల ప్రేమకును, నిరాడంబరత కును పతాక.

పల్లియ లందలి పామరులకు గారు అపరిచితము. వా రెంత పెద్దలయినను నీవు అని యందురు. పిల్లలకు 'మీరు' అను మాట రాదు. ఏలనిన పెద్దలెవరును వారిని మీరు అని సంబోధింపరు. దాన వారి వాఙ్మయమున మీరు అను పదము మృగ్యము. వారెంత పూజ్యుల నయినను నీవు అని అమాయికముగా నందురు. క్రొత్తవారెవరేని వచ్చుచో బిల్లలు వారిని నీవు అని యనుటయు, నింటివారా క్కుర్రలను కసరుటయు కుర్రలు చిన్న బోవుటయు మామూలు. ఇపుడిపుడు పల్లెలందును బాలు 'రేమండీ నాన్నా' యనియు నాన్నగార'నియు నేరుచుకొని నాగరకులై పోవుచున్నారు. ఈ పదము లాతండ్రి కొడుకుల నెంతదూరమునకు నెట్టుచున్నవో, మఱి యా నాగరికత అనగ్నులకంటె నెంత నగ్నమై పోవు చున్నదో వారితండ్రులు గమనించి యుండరు. కుర్రల ప్రేమ కిది వేరుపురుగు. పిల్లల కీగారనునది చాలబారు. నాగరికతకు రూపమేకాని హృదయము లేదు !

బ్రాహ్మణక్షత్రియులుగారు తోడనే పుట్టిరి. వీరు తమలో దమకును, బరు లకును గారు. వెలమవారిలో జిన్నయు, బెద్దయు లేక యొకరి కింకొకరు గారు. వీ రించుమించు గారు మతస్థులు. వీరిలో వీరు తిట్టుకొనునపుడేని మానవుని మీది గౌరవము తీసివేసినను గారు మీది గౌరవము తీసివేయరు. వీరి కీ గారు పేరులో నొకభాగమే యాయెను. కావుననే కొందఱు ఫలానావారు 'వేంకటరాయణింగారు గారు' అని చేవ్రాలు చేయుదురని యెకసక్కెము లాడుదురు.

వైష్ణవులకును, లింగధారులకును, గారు రూఢము. ఉదా : అయ్యంగారు, అయ్యవార్లంగారు. అయ్య అనునదే గౌరవమునకు వాచకము. పైనివారు దానిపైని మఱియొక గారు. అయ్యవారు పేరయినటులును, దానిమీద నీ గారు ఎక్కినటు లును కానిపించును.

అగ్రగవర్ణములవారు కొంద ఱితరుల వర్ణము నారయక యేమండీ యనిగాని, ఏమోయి యనిగాని యనకయే తమ ప్రసంగమును సాగించుకొని పోగలరు.

నేటి బడులలో సహాధ్యాయులకుగాని, సతీర్థ్యులకుగాని గారు పట్టిం పంతగా నున్న చందము కానరాదు.

ఎవరిని నీ వనవలయునో, మఱి యెవరిని మీరనవలయునో యాసంగతి యించుమించుగా నందఱెఱుగుదురు. అది తెలిసియే లోకుల వ్యవహారము తూక ముగా నడచును. తూకము తప్పినప్పటికిని యేవ్యక్తి యయినను మీ రనిపించు కొనవలయునని ప్రయత్నించుచో వారిని మీరని వ్యవహరించుట సామాన్య విధి. ఇక నచట గుణమే యున్నయెడల గౌరవింపవలయునని వేఱ చెప్పవలయునా ?

ఔత్తరాహులు గంగాజీ యనియు, గాశీజీ యనియు వ్యవహరింతురు. గంగగారు, కాశీగారు అని తెలుగువారు ఎవరేని యనరుగాని గంగమ్మ యని యందురు. కాశెమ్మ యని పేరు పెట్టుకొందురు. ఈ గారు విషయమున భాషా స్వాభావ్యము వింత. ఇంకొకభాషలో గంగరో ఏనుగురో వంటి వింతలుండునా? "వాగ్వైచిత్ర్యాణా మనంతత్వాత్". ఈసముద్రము నిపుడు కదిలింపజనదు.

ఇపు డౌత్తరేయు లీగారు మొదలయిన (ఆ పని) బహువచనముల దొల గించి నీవు (తుమ్ తుమి) చేసి వేయవలయునని యొక య్యుద్యమ మారంభించు చున్నారు. కాని ఇది సఫలము కాదు. స్వభావము దురతిక్రమము. మదరాసు దొరతనమువారు యమ్మారార్వై తీసివేసి శ్రీ యనిరి. కాని కోర్టుభాషలో నీవు తప్ప మీరు లేదు. ఇది చింత్యము. లోకవ్యవహారమున నీవు తుడిచిపెట్టుకొని పోదు.

ప్రేయసికిగాని, ప్రియతమునకుగాని గారు లేదు. కాననే ఆచార్య గోవర్ధ నుడు -

> శా. "ఏమండీ యని పిల్చుచో బరుసమౌ నేమోయినా బిల్చినన్
> సామాన్యంబగు నేమిరా యనుచునున్ సంబోధనం జేయుచో
> నామోదంబు ననుగ్రహం బెవరికౌ నవ్వారె దాంపత్యపున్
> స్వాముల్; కానిది పల్చు భార్య, పశువై నాధుండు చూపట్టెడిన్"

అని పల్కెను.

పరోక్ష ప్రత్యక్షములలో దేడా కలదు. హరి నాగభూషణం ఏం పాడేశా డోయ్, "నారాయణదాసు ఏంహరికథ చెప్పాడోయ్" అని అందురు. ప్రత్యక్ష

మున నీ యేకవచనప్రయోగమును జేయరు. అటులు చేయుచో డొక్కబద్ద లగునని వారికి దెలియును.

ప్రతిష్ఠగల వారందఱకును ప్రత్యక్షములో గారు తగులును. గోడ చాటుచో మాత్రము పేరే మిగులును. వారు గోడచాటున బొంచుండి ఈ యేకవచన ప్రయోగమునకు సంతాపపడవలసిన పనిలేదు. వారిపేరులే గౌరవమునకు బర్యాయపదములు. కాళిదాసు నెవరును కాళిదాసుగారని యనరు. మృత్యువులేని వా రెవరికిని గారు లేదు. ఒకవేళనున్నను దాని కర్థము లేదు.

కవులు పొగడువేళ గాంతలు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణముసేయువేళ రాకొట్టి పిలుతురు........."

ఆయీ స్థలములలో రా కుండు గౌరవము గారుకు లేదు.

ఇన్ని వేదములలో, నిన్ని దర్శనములలో దేవుని చివర నెవరేని గారు చూచియున్నారా ?



# 5. మార్క్సు మతము

జర్మనీలో 19వ శతాబ్దిని ఆస్తిక దర్శనములందు తర్కశాస్త్రమున కెక్కుడు ప్రచారము కలిగెను. ఈ తర్క మార్గమున ఇమానుయేల్ కాంట్ మొదటి తెరువరియని యనవచ్చును. ఇతడు విజ్ఞానమునకు సంబంధించిన తత్త్వముల నన్నిటిని శోధించి జగత్కారణమును కనుగొనుటకు ప్రత్యక్ష ప్రమాణమువలన కలుగు జ్ఞాన మతిదుర్బలమని నిరూపించెను. ఇతని మతమిది: ప్రత్యక్షజ్ఞానముచే వస్తుసత్త తెలియదు. వస్తువు వస్తుత్వము మన జ్ఞానసీమ కావల. మానవ జ్ఞానము మాయామయము. మరియు దానికొక హద్దున్నది. ఇంద్రియములను విషయములను దాటినచో అది పంగువు. ప్రపంచము మిథ్య. మనః ప్రతిబింబమే ప్రపంచము. ప్రపంచము లేక విషయము మాయా కల్పితము. కావున గౌణము. ఆత్మయే నిత్యము.

ప్రపంచము పరిణామ శీలము. పరిణామ మనగా వికాస వినాశనాది వికారముల కాస్పదము. కావున పరిణామమున కెల్ల లున్నవి. అట్టి పరిణామము 'ప్రత్యక్ష జ్ఞానము సీమాబద్ధ'మని తెలుపును. కావున ప్రత్యక్షజ్ఞానముచే ఆత్మోపలబ్ధి కాదు. కావున మూలవస్తువు నెరుగుట కనుభూతియే ఆశ్రయణీయము.

## హెగెల్

ఇతని మతమున జగత్తు గతిశీలము, సృజనశీలము, మరియు వాస్తవము జ్ఞానమున కగమ్య మనున దేదియు లేదు. ప్రపంచము ద్వంద్వములచే ఓతప్రోతము. ప్రపంచాభివ్యక్తియందును, ఇతిహాసాభివ్యక్తియందును వికాస వినాశములను విరుద్ధ ధర్మములకు గల సాధర్మ్య వైధర్మ్య సమన్వయము లితని చింతాప్రవాహమున గలవు. వైధర్మ్యము లేక వైపరీత్యమును (Antithesis) కాంటు నొకసీమలో బంధించెను. హెగెల్ సమన్వయమును (Synthesis) మూడవ స్థితికి గొంపోయెను.

పరమ కారణ (Absolute Reason) ప్రకాశమే అనగా ప్రజ్ఞాన ప్రకాశమే నైయాయిక జ్ఞానమని ఇతని మతము. దీని కద్వైతమే మూలాధారము,

అద్వైత చైతన్యమే ప్రపంచమున కంతర్నిహితమైన కారణమని నిరూపింప నితడు ప్రయత్నపడెను.

కాంట్ ప్రత్యక్ష జ్ఞానమును విసర్జించి అనుభూతి నాశ్రయింపగా, హెగెల్ ప్రపంచము వాస్తవమని అంగీకరించియు రహస్యవాదమునుండి తనను విడిపించుకొనజాలకపోయెను.

పేరిరువుర* చింతాప్రవాహములవలన ఆస్తిక దర్శనక్షేత్ర మిటు లుర్వరితమాయెనుగాని వాస్తవ జీవనమునందలి మూల సూత్రములు మూలనే దాగియుండెను. ఐనను పీరిరువురి పనియు వాస్తవజీవనమును సత్యభిత్తిపై ప్రతిష్ఠించుట కెంతయో సాయము చేసెను.

## ఫయార్ బాగ్

ఇతడు హెగెల్ దళమున వామపక్షము వాడు. 'జడము లేక ప్రకృతి మనుష్యునిచేగాని మనస్సుచేగాని చేయబడు వస్తువు కాదు. సద్ దృష్టిలో గాని ప్రజ్ఞానదృష్టిలోగాని కాంట్ చూచిన స్వతంత్ర సత్త అవాస్తవము, మరియు నిర్గుణము. దాననే దానికి పతనము కలిగెను. మానవుని కస్తిత్వమేలేని యొకా నొక దశ కరకు నేటి నవ్యవిజ్ఞానము మనలను నెట్టెను. అనగా ఆ దశలో ఈ ప్రపంచము మానవ జ్ఞానమునకు విషయము కాలేదు. కావున 'ప్రకృతి లేక జడము మానవజ్ఞాన నిరపేక్షమగు వస్తువు' అని యిత డనును.

ఇది కాంట్ చెప్పిన స్వతంత్ర సత్తయని యితని అభిప్రాయము కాదు. ప్రత్యక్ష జ్ఞానమునకు విషయము కాని జడమున కస్తిత్వము కలదనియు, దాని బాహ్యరూప స్వభావ మిదానీంతనరూపమునే పోలినదనియు, మరియు నది విష యము కాదనియు నితని యభిప్రాయము. జడవాదములో ప్రథమ పాతమే యిది. వస్తువునకు గల అజ్ఞేయ రూపమునకు సంబంధించిన కాంట్ మతము నందలి ప్రతిబంధము నిటులు తొలగించుకొని జడవాద మితని నాశ్రయించుకొని మరల తలయెత్తెను.

---

* ఆలోచనా స్రవంతి

# మార్క్స్

18వ శతాబ్దికి చెందిన పరాసు జడవాదులు బేకన్, హబ్స్ లక్ మొదలగు వారి మతములలోని స్థూలరూపమును జటిలత్వమును వదిలిపెట్టి మార్క్స్ వికాస వినాశములు ప్రధానముగాగల విశిష్ట జడవాదము నవలంబించి దర్శనమును ఇతిహాసమును అర్థనీతిని విపులముగా వ్యాకరించెను.

మార్క్స్ తొలుదొలుత హెగెల్ మతానుయాయి. కాని ఫయార్‌బాగ్ మత మతనిని తనదెసకు లాగుకొనెను. ఇత డున్నదాని నున్నటులు నిక్కచ్చిగా చూడగలవాడు గాన ఫయార్‌బాగ్‌ను పట్టుకొని పై కెగబ్రాకి పోయెను. ఫయార్ బాగ్ మనుష్యుని జడ వికాసముగా తలచి (చార్వాకులవలె) నృతత్త్వవేత్తల అభిప్రాయములో అంతర్ధానము చెందెను. ప్రకృత సామాజిక రూపములో మనుష్యుని ప్రతిష్ఠింపవలసిన ప్రయోజన మతని మనస్సును తొంగిచూడలేదు. అది తెలిసి మార్క్స్ మనుష్యుని ప్రాకృత సీమనుండి దాటించి గతిశీలమగు సాంఘికావస్థలో విశ్లేషించి చూపెను.

'ప్రపంచము వాస్తవము; మిథ్యకాదు. ప్రపంచమునందలి తత్త్వములు వ్యపేక్షములు కావు; సాపేక్షములు. ద్రవ్యము స్థిరముకాదు; పరిణామి. అనగా ద్రవ్యము మారును, వికాసము చెందును, వినాశిల్లును. వికాస మొక దశవరకు క్రమముగా జరిగిన తరువాత వినాశబీజము లేర్పడును. అపు డంతరంగ ఘర్షణము కలుగును. అదియే విప్లవము, పిమ్మట దానికి మరల నవ్య స్వభావ మేర్పడును.

ఇతని పరిణామ వాదములో వికాస వినాశములు ముఖ్యమైనవి. ఇవియే మార్క్స్ గీతికి మకుటము. ప్రపంచ మీ ద్వంద్వముచే ఓతప్రోతము. నీటిని మరగబెట్టిన కొలదిని ఆవిరియగును, శిశిరీకరించిన కొలదిని కరకమగును. ఈ మార్పులు మనస్సునందును, జ్ఞానమునందును [ఇవియు జడములు] సంఘమునందును అనగా సంఘశక్తియందును కనుపట్టుచునే యుండును.

కర్మరతుడయిన మనుష్యుని పరిణామాలోకమున మార్క్స్ పరివారమును సమాజమును రాష్ట్రమును సమస్తమును వేరుపరచి చూచెను.

'ఈ పరిణామము గతికిగల వైజ్ఞానిక నియమము ననుసరించియే జరుగు చున్నది. ఆ పరిణామము 'నేతికి' ఘంటాఘోషముగా 'నేతి' చెప్పి, క్రిందినుండి క్రమాన్వయముగా మీదివరకును చక్రాకారముగా పోవును.

మానవుల సమస్త ప్రతిష్ఠానములందును వస్తు పరిమాణ పరివర్తనము గుణ పరివర్తనము తెచ్చిపెట్టు నను న్యాయము ప్రవర్తించును. మానవుల జీవన ధారణోపాయము వికాస వినాశములను జంటచే విభిన్న వ్యవస్థల నేర్పరచి, ప్రతి పథమందును ఆ వ్యవస్థల కంగభూతమగు భావమునొక దానిని సృజించును. భావ ప్రక్రియ యేదియు వాస్తవమును సృజింపనేరదు. వాస్తవ మొకానొక భావమునకు సంబంధించిన బహిః ప్రకాశము కాదు.

మరియు విశిష్ట జడవాదముచే (ద్వంద్వాత్మకమగు జడవాదము) హెగెల్ మతము నిర్దుష్టముగా సమన్వితము కాదు. పరమ కారణముగాని, భిత్తిగాని విశిష్ట జడవాద విశ్లేషణమునకు నిలువదు. విశిష్ట జడవాదము ప్రత్యక్ష జ్ఞాన భిత్తి మీదనే నిటారుగా నిలువబడును.

"నా విశిష్ట జడవాదమును, హెగెల్ మతమును మూలమాత్ర భిన్నములే కావు; ప్రత్యుత విపరీతములు. హెగెల్ విచార పద్ధతికి 'భావ'మని లేక 'సత్' అని పేరు పెట్టి, దానినొక విషయినిగా (Subject) చేసి, దానియందు ప్రపంచ కర్తృత్వ మారోపించి, ఆ భావమున కీ ప్రపంచము అంగీ అని యనెను. కాని మానవ మనస్సునం దేది జగత్తును ప్రతిఫలింపజేయునో మరియు భావనలో నేది రూపు తాల్చునో అది నాకు భావము." అని మార్క్స్ అనును.

మార్క్స్ ప్రత్యక్ష జ్ఞానమును చైతన్యాసనమున కూరుచుండ బెట్టెను. పిమ్మట వెనుక జెప్పిన విశిష్ట జడవాదముచే మనుష్యేతిహాసమును వేర్పరచి- "మనుష్య చైతన్యము మనుష్య సత్తను నియంత్రిత మొనరింపదు. మనుష్యుని సామాజికావస్థయే మనుష్య చైతన్యమును నియమించును."-అనెను. మార్క్స్ 'కాపిటల్' ఈ ఇతిహాసమునకు వ్యాఖ్య. అందిటులు గలదు: మానవుడు ప్రపంచమును చూచుచు కూరుచుండజాలడు. జడముతో కలిగిన ఒరిపిడివలన మనుష్యుడు తన ప్రకృతిని మార్చుకొనుచు బోవును. ఈ మార్పునందు మనుష్యునిపై జడ ప్రతిక్రియ కనబడుచునే యున్నది. ఇంతియకాక జడముపై

మనుష్యుని ముద్రయి యున్నది. కాగా దర్శనము లన్నియు జగత్తును కారణ మును వేర్పరచి ఊరకున్న చందముగా విశిష్ట జడవాద మూరకుండక కర్మ దక్షతకై మానవుల నుసికొలుపును. మానవులు కర్మపారీణు లగుచో జగత్తును పరివర్తింప జేయగలరు. వ్యక్తిపరివృత్తి సమాజ రాష్ట్ర పరివృత్తులు కలిగించును.

జగత్తున పురాణ సమాజములందు వినాశక్రిము లుదయించును. సమాజ మెటులేని నిలద్రొక్కుకొనజూచును. క్రిములు బలవత్తరములై ప్రతిఘటించును. ఈ సంఘర్షణలో పురాణ సమాజము నలిబిలియైపోవును. మరల నూతన సమాజ మొకటి ఉదయించును. ధర్మముగాని, దర్శనముగాని, శిల్పముగాని, సాహిత్యము గాని అమూర్తమును స్వతంత్రమును అగు ఒకానొక భావమను ఉత్సము నుండి ప్రవహింపవు. ఇవన్నియు సమాజము నుండి జన్మమెత్తిన వస్తువులు. ప్రకృతితో సమాజమునకు కలిగిన యుద్ధమునకు ఫలితముగా మతము పుట్టుకొని వచ్చెను. మతము మానవుని తోబుట్టువుకాదు.

మార్క్సు మతము నిట్లు చూచెను : "మతము నిర్యాతితులగు మానవుల రోదనము, హృదయ హీనమగు ప్రపంచపు భావావేగము, ప్రాణహీనమగు అవస్థకు ప్రాణము. మతము మానవుల నల్లమందు."



# 6. మార్క్స్ చెప్పిన చరిత్ర

ఫయార్‌బాక్ మానవసత్యమును సిద్ధాంతము చేసెను. కానీ ఆ మానవులు కర్మఠులు కారు. వారు తమ్ము కానీ తమ సమాజమును కానీ పరివర్తన మొన రించుకొనుచు పైపైకి పోరు. చరిత్రలో మానవులకు కూడా ఒక పద్దు కలదు. అంతియకాని చరిత్ర పరివర్తన మార్గమున సమాజ బద్ధులయిన మానవులు నిత్య పథికులను మాట అతని వ్రాతలలో గోచరము కాదు. కొంతమంది మానవులే సమాజము కాదనియు కొన్ని కొన్ని సంఘములు సంఘటితమగు ననియు ఈ సత్యము అత డెచటను ఉద్ఘాటితము చేసి ఉండలేదు.

తొల్లిటి చరిత్రలలో ఏ పుట తిరుగవేసినను ఏ రేడో, ఏ రెడ్డో యుద్ధము చేసి జయించినటుల కన్పడును. అతని ఏలుబడిలో ప్రజలందరును గుండెలమీద చేయివైచికొని నిదురింతురు. లేదా అతని దుష్టపరిపాలనవలన అష్టకష్టము లను భవింతురు. చరిత్రల సారాంశము లింతటితో సరి. దాని వెనుక సుప్తప్రాయ ముగానున్న సాంఘిక సంబంధములను మార్క్స్ మరియొక దృక్కోణమునుండి చూచి వ్యాకరించెను.

చరిత్రకు మానవులే స్రష్టలు. కాని వారు తమ ఇష్టానుసారముగా దానికి ముక్కుత్రాడువోసి తీసికొనిపోజాలరు. భూతకాలమునుండి అనుస్యూతమగుచున్న మానవ సమాజముపై వర్తమాన మానవసమాజ ముద్ర పడును. దాని ప్రతి క్రియయే చరిత్ర.

మానవుల దేహనిర్మాణము తోడను మానవులకు ప్రకృతితోగల సంబంధముతోడను మానవచరిత్ర కంకురార్పణము. దేహనిర్మాణమే మానవునకు జీవనోపాయమును మప్పెను. ఆ జీవనోపాయము నవలంబించియే మానవులు– 'మిగిలిన ప్రాణులకంటె మే మెక్కువవారము' అని తెలిసికొనిరి. జీవికోపాయ ములను కనుగొనుటబట్టియే మానవులు తమ్మొదాము నిరూపించుకొందురు. బ్రతుకు నుపాయములే మానవుల రూపరేఖల దిద్దెను.

జనాభా పెరిగిపోవుకొలది మానవుల పరస్పర సంబంధము గూడ గాఢమాయెను. ఆ సంబంధ స్వరూపము జీవికోపాయ సాపేక్షము. చేపలు పట్టుటయు, వేటాడుటయు, కాయగసుళ్ళు ఏరుటయు, వేళ్ళు వెల్లంకులు త్రవ్వి తీయుటయు, అడవి నేలలో చెట్లుచేమలు నరికి మోడు మొద్దులు దీసి దున్ని జొన్న వి త్తి పండించుటయు మొదలగు జీవికోత్పాదనోపాయము లనంతములు. ఈ యుత్పాదనశక్తి నలవరచుటయందును పరిణామమువందును శ్రమ విభాగమునందును సంబంధ పరివర్తన మావశ్యకమగు. అనగా జీవనార్జనోపాయము మానవులలో పరస్పర సంబంధమును నియమించును. మానవుల కొండొండ కలిగిన యీ సంబంధములబట్టి ఏకపురుష ప్రధానమగు సమాజమును దాస్య ప్రధానమగు సమాజమును సామంత ప్రధానమగు సమాజమును శ్రేణీభూత సమాజములును వేర్వేరు రూపములలో నెలకొనెను. కార్మిక సమాజము లందలి షేర్లన్నియు ధనమునకే మారుపేళ్ళు. క్రొత్త క్రొత్త శక్తులు మొలకెత్తి ఉత్పత్తి సంబంధమును మార్చెను. ఆ సంబంధముతోబాటు సమాజములును మారెను. ఈ రీతిగా వివిధ సమాజము లేర్పడెను. పాటుబడి ఉత్పత్తి చేసిన వస్తువుచేగానీ వుత్పత్తిచేయు యంత్రముతోగానీ వ్యుత్పత్త్యుపాదానముచే గానీ కలుగు సంబంధములను ధనమే నిర్ణయించును.

మానవు లాటవికులుగా నున్నపుడు కోనలలోను కొండలలోనూ జంతువుల మందలు గుంపులుగా నివసించి జట్టుకట్టి వేటాడి జంతుమాంసము తోడను పిట్టలతోడను చేపలతోడను జీవించెడివారు. అప్పుడు వారి వేటకు సాధన సామగ్రి రాలు రప్పలు, కర్రలు, ఎర్రలు, ముండ్లు విండ్లు. చంపిన జంతువులును సర్వభోగ్యములు.

గుంపులు గుంపులుగా నివసించు వారలలో బలమును బట్టియు, స్త్రీలను బట్టియు, పశుధనమును బట్టియు, వైరమొదవి యుద్ధములు జరుగుచుండెడివి. జయించిన వా రోడిన వారిని చంపెడివారు. ఆ క్రౌర్యము కొన్నాళ్ళకు మారెను. దానికి ఫలితముగా జయించిన వారోడిపోయిన వారిని బానిసలుగా చేసికొనుచుండెడివారు. ఈ వ్యవహారము అన్ని దేశములందును జమీందారుల యేలుబడిలో అనుగతమై కానిపించును. జమీందారులు బానిసలచే చేతిపను లెక్కుడుగా చేయించి

లాభములను పొందుచుండెడివారు. ఇదియే దాసప్రథకు బీజము. కొలది కొలదిగా వస్తూత్పత్తి చేయగల కొంతమందికడనే ముమ్మొదట ధనాధికార ముండును. అపుడు చేపలను పిట్టలను జంతువులను వేటాడి బ్రతుకుచుండువారి సమాజమునకే కాక, పశుపాలనము వ్యవసాయము, వ్యవసాయమున కుపయోగించు కొరముట్లుమొదలగు వానిని చేయువారి సమాజమునకును గణేశ పూజ. మానవులు సేద్యము చేయదొడగుడు పశుపాలనమునకును, చేతి పనులకును ప్రారంభము. పాటుపడు జనము ఒక కూటముగా జేరును. ఆ కూటము ఏక పురుష ప్రధానము. అనగా అది సమిష్టి కుటుంబము. కుటుంబమునకు తండ్రి స్వామి. ఆ కుటుంబ వ్యవస్థ ఎప్పుడు ఏర్పడెనో దాసత్వమునకు బీజావాపము అపుడే ఏర్పడెను. ఏలనగా భర్తకు భార్యమీద, సంతానముమీద ఎదురు చెప్పరాని అధికారమున్నది. చేతి పను లెక్కుడగుడు మానవుడు తనకు కావలసిన దానికంటె ఎక్కువ వస్తువులు చేయును. దానితో కొందరు స్వాములును కొందరు దాసులును అగుదురు. ఒక కొక రాటమును మగ్గమును పెట్టి నను కొందము. వాడు తనకు కావలసిన వస్త్రములు నేయుటతో మాత్రము ఆగడు. తనపరివారమునకే కాక బంధువులకు కూడా దాని ఉపకారమును ప్రసరింపజేయును. ఇది చూచి ఇంకొకడు వస్తువిని మయముచే ఆ వస్త్రము లాగికొన చూచును. దీనివలన ఎక్కువ వలువలు నేయును. క్రమముగా వానికి కూలితో పని గల్గును. ఇట్లు దాస్య ప్రధానము సంఘమునకు నాంది. అటుపిమ్మట వ్యవసాయము ప్రధాన నాంది అయ్యెను. లోక సంఖ్య హెచ్చినకొలది ఒక గుంపుతో మరియొక గుంపునకు విరోధము కానీ యుద్ధము కానీ సంభవించి ద్రవ్య వినిమయము ఏర్పడవలసి రావచ్చును. అపుడు విజేత ఒకడు, వాని బంధువులు కలసి ఒక సంఘముగా నెలకొందురు. విజితులందరూ కలసి ఒక సంఘముగా ఏర్పడుదురు. విజేత స్వామి; విజితుడు దాసుడు. అపుడు భూపాలనము కూడా కలసి సామంత పాలనము ఏర్పడును. రాజొకడే స్వతంత్రుడు. మంత్రి కడనుండి బంటు వరకు ప్రజలలో కొందరు దాసులు, కొందరు దాసానుదాసులు. దానితో సామంత తంత్రమునకు దాస్య ప్రధానమగు వికాసము యుద్ధములు యోద్ధలు, బంట్లు, బైదలు ఈ మొదలగు విభాగము ఏర్పడినందుకు ఫలముగా రాష్ట్రము రాజు నగరులు వెలసినవి. అప్పుడును మొదట మొదట ధనము సర్వభోగ్యముగనే యుండెను. కాని క్రమ

క్రమముగా స్థావరా స్థావర రూపమగు సంపత్తి వ్యక్తుల అధికారములోకి రాదొడగెను. ధనము సర్వభోగ్య మేలకావలెను? అను విరుద్ధశక్తి రూపముగనే యుక్తి భోగ్యమగు విత్తమేర్పడెను. రాష్ట్రమునకు అధీనమగు సంపత్తికిగల నియమములే వ్యక్తిగతమగు భూసంపత్తికిని అనుగతము లాయెను. రాష్ట్రము దాసులను హస్తగతము గావించుకొనెను. భూస్వాములు కూడా దానిని చూచియే తమ ప్రయోజనము కొరకు దాసులను నియోగించుకొనదొడగిరి. భూమిమీద కల్గిన వ్యక్త్యధికారము– భూమియు దాసులును సర్వభోగ్యులు అని మున్నుండు ఏర్పాటును త్రిగ త్రొక్క దొడగెను. నాగరిక జీవనమునందలి శ్రమవిధానం, జటిలతర మాయెను. నౌకా వ్యాపారము, హస్త శిల్పములందును ఇది విస్పష్టముగా కన్పించును. యుద్ధములుగానీ, చూరకొనుటకుగానీ, చేతిపనులకు వత్తాసు కల్గింపవు. వాని ఉద్దేశ్యము ధన సంచయమే. ఈ రీతిగా పురాతన కాలమున ఉత్పాదన భిత్తియే దాసత్వ ప్రథగ వికసించెను.

ధనమునకు సామంతప్రథ మూడవమెట్టు. ప్రాచీన కాలమున నగరములకు ప్రాధాన్యము. మధ్యకాలమున పల్లియలకు. బర్బరులు, హూణులు కొల్లగొట్టి నగరములను నాశనము చేసిరి. పిదప అస్త్రశక్తి సామంత తంత్రము ఏర్పాటు చేసెను. అపుడు గృహదాసుల స్థానమును భూదాసులు ఆక్రమించిరి. సమాజపతులు సామంతులైరి. పల్లియలలో విత్త విభాగము ననుసరించియే పట్టణములందును విత్త విభాగము జరిగెను. అనగా పల్లెలలో కష్టజీవుల సంఘములను వణిక్ సంఘములను చూచియే నగరములలో ఆ సంఘములు పెద్ద పెట్టున ఏర్పాటాయెను. నగరము లందున్నవారు చేతి పనులు మొదలుకొని పాద సంవాహనమువరకుచేసి చెమటవోడ్చి జీవింపదొడగిరి. చేతి పనులు పెంపగుటవలన పెట్టుబడులు ఎక్కువ కావలసి వచ్చెను. అపుడు రాజబంధువులును, వణిగ్రాజులు మొదలగువారు పెట్టుబడిదారులైరి. అది వారి సంతసము. కానీ అప్పుడు ధనికులు చాల తక్కువ. సమాజ నిర్మాణమునకు సంబంధించిన ఈ అర్థనీతికిని, రాష్ట్రమునకు సంబంధించిన మూలనీతికిని అపుడనైక్యము కలుగలేదు. సామంత తంత్రములయిన దేశముల విజయము సామంత రాజులకు మాత్రమేకాని నగరముల కుపయోగ పడలేదని చెప్పుటకు వీలు లేదు. దీనిని బట్టి చూచినచో ఉత్పత్తి కుపయోగించు కర్మకలాపమును బట్టియే

సమస్తమును ఏర్పడెనని తేలును. అర్థనీతిని బట్టి సమాజచరిత్ర నడచును. వస్తుస్థితియే భావములను నియమించును. వస్తుస్థితి నియమించని ఒకానొక అతి ప్రాకృత భావక్షీరముచే రాష్ట్రము ఒడలు చేయదు. మానవుల చేతనా జీవనము నియంత్రిత మొనరింపదు. జీవనప్రవాహమే చేతనను నియంత్రిత మొనరించును.

భోగ్యములగు వస్తువుల ఉత్పత్తి మానవులలో ఒక సంబంధమును స్థాపించును. ఈ ఉత్పాదనశక్తికి ప్రతినిధు లొక విశేషావస్థలో పడి ఉత్పాదన సంఘముల కెదురు తిరుగుదురు. అపు డీ సంబంధములు ఉత్పత్త్యున్నతికి కారణములు కాక పోగా దానికి కాలబంధ మగును. దీనితో సమాజ విప్లవ మారంభించును. పదునేడవ శతాబ్దిలో ఇంగ్లండులో పెట్టుబడిదారులు జమీందారులయెడ తెచ్చిన విప్లవము ఇచ్చట ఉదాహరణము.

ఒక మనుజునకు తనను గూర్చి కొన్ని అభిప్రాయము లుండవచ్చును. ఆ అభిప్రాయములనుబట్టి లోకులు అతని విలువ తేల్చలేరు. తేల్చరు. ఆ రీతిగనే ఒక విప్లవమునకును తననుగూర్చి ఒక ఉద్దేశ ముండును. ఆ ఉద్దేశ ప్రకటనమును బట్టి దాని విలువ కట్ట వీలులేదు. కాని వాస్తవ జీవనమునందలి ద్వంద్వమును బట్టి ఆ ఉద్దేశ్యమును విడబరచి చూడవలయును.

ఉత్పాదన పద్ధతిలో ఉత్పాదన శక్తికిగల విరోధమును అరుగదీసి చూడవలయును. ఈ రెండును ద్వంద్వము. సమాజ మెంతవరకు ఉత్పాదన శక్తిని ఎక్కువచేసి పరిపూర్ణత పొందదో అంతవరకునూ సమాజమునకు పతనము కలుగదు. ఆ ఉత్పాదన శక్తికంటే మరొకరకపు పెద్ద ఉత్పాదనశక్తికి సూత్రపాతము కానంతవరకు, మరియు పురాణ సమాజ శరీరమునందు ఆ విపరీత శక్తికి దానోపయుక్తమగు వాస్తవ లక్షణము పొడకట్టనంతవరకును ఆ సమాజము పడిపోదు. కావున విశిష్టజడవాదమును బట్టి సమాజవ్యవస్థ ఉత్పాదనశక్తి పరిణమించు బాటలో పడి ఒక విశేష స్తరమునకు చేరును. అదియే దాని వైపరీత్యమునకు జన్మ మొసగును. "ధర హెచ్చుట తగ్గుకొఱకె తథ్యము సుమతీ." ఈ విరోధమునకు ఫలముగా ఒక నూతన సమాజ వ్యవస్థ ఉదయించును. అపుడు ఉత్పాదనశక్తి ఉన్నతతరమును ముక్తతరమునగు రూపము బడయగలుగును.

౨

సామంతతంత్రములో పెట్టుబడిదారుల వలన ఏర్పడిన వైయక్తికవిత్త సంచయపద్ధతి స్టీమ్ ఎంజిన్‌వచ్చిన తరువాత మారెను. స్టీమ్ ఎంజిన్ దేహపరిశ్రమను పూర్తిగా తగ్గించెను. దీనితో చేతిపనులు చేయు శిల్పులకు పని లేకుండా పోయెను. ఇపుడు పెట్టుబడిదారులకు ఈ శిల్పములను దాసులుగా తొక్కి పట్టుకొనవలసిన శ్రమ లేదు. ఏల యనగా కూలివారు 'కో' యనిన కోటిమంది. వారివలన కాదగిన పనియూ కడు కొలది. మరియు వారి పనియూ వారి ఇచ్ఛాధీనము.

ధనికులకును కూలివాండ్రకును జీతములే పరస్పరసంబంధము సమకూర్చుచుండెడివి. హస్తశిల్పమును పడగొట్టి యంత్రశిల్పము ఉత్పాదన ప్రణాళికలో ఒక ఉత్పాదన తెచ్చిపెట్టుటతో సమాజమునందు అసాధారణమగు ఒక పరివర్తనము చూపడెను. చేతిపనుల వారందరును తొల్లిటి దాస్యమునుండి విడివడి ఇపుడు చేతిపనిముట్లను పారవైచి శ్రమను విక్రయించు కూలివారయి పోయిరి. పెట్టుబడి పెట్టువారు యంత్రాధిపతులైరి. ఈ ఇరువురును రెండు తెగలుగా వెలసిరి. ఈ యంత్ర ధనాశచే కోట్లకొలది కూలివారు కూటికి వాచుకొనవలసిన వారైరి. సామంతతంత్రములో చేతిపనులుచేయు వారి సంఘములో గల పెద్ద తలకాయలకు పెద్ద పలుకుబడి యుండెడిది. ఇపుడు యంత్రపతులైన ధనికులు వారి స్థాన మాక్రమించుకొనిరి. కూలివారికిని తమకును తగాదా వచ్చినపుడు దానిని పరిష్కారముచేయగల స్వాతంత్ర్యము తమ కుండవలెనని, జీతములు ఒసగు ఏర్పాట్లలో తమ మాటయే చెల్లవలెనని యీ యంత్రపతులు అభిలషించిరి. ఈ యధికారముకొరకు యంత్రపతులు రాష్ట్రాధికారులతో తలపడిరి. రాష్ట్రము నడుపువారికంటె యంత్రపతులే ధనవంతులు అగుటవలన విప్లవము వచ్చెను. యంత్రపతులు విజయమందిరి. దానితో రాష్ట్రమును నడుపవలసిన యధికారము యంత్రపతులచేతిలోనికి మారినది. ధనికతంత్రము ఏర్పడెను. జీతములు పుచ్చుకొను కార్మికుల దాస్యమునుండియే యీ సమాజస్వరూపము పరఁగెను.

శోషణయంత్ర మిప్పుడు సామంతరాజుల ఒడ్డోలగములనుండి యంత్రపతుల [illegible] కెక్కెను. దీనినిబట్టి చూచినచో శ్రేణీద్వంద్వ ప్రవాహము నుండి ఆటుపోటులే యితిహాసము లేక చరిత్రమనుట తేటతెల్లము.

ఒక్కొక్క కాలమున కొక్కొక్క సమాజమున ఒక శ్రేణి మరియొక శ్రేణి అధికారము ఒడగార్చి తన ఆధిపత్యమును విస్తరింపచేసికొనుచూ పోయెను. ఇపుడు జరుగుతున్నది యదియే. రాజ్యనిర్వహణము ఏ శ్రేణి చేతిలో యుండునో ఆ శ్రేణికి రాష్ట్రము స్వార్థ మన్నమాట. రాష్ట్ర మెప్పటికప్పుడు శ్రేణీస్వార్థమునకు యంత్రమాత్రము. ధనతంత్రపు ఉత్పాదన సంబంధము సామాజికోత్పాదన ప్రణాళికకు చరమ విరుద్ధరూపము. సమాజముతో వ్యక్తికి గల అవస్థనుండి ఈ విరోధమునకు పుట్టుక. బూర్జువా సమాజమునందలి ఉత్పాదనాశక్తియే యీ విరోధమును తొలగింపగల వాస్తవావస్థను సిద్ధ పరచును. ఈ సమాజము తోడుతోడనే మానవుల మొదటిచరిత్రకు భరత వాక్యము. కానీ యీ చరిత్ర ముగియవలయునేని సమాజములందు కొన్ని లక్షణ ములు కన్పట్టవలయును. కోట్లానుకొలది ప్రజలకు కూడుగుడ్డలు లేకపోవల యును. కుబేరులు కూడబెట్టిన అత్యాచారమువలన కలిగిన ఆపద ఆ ప్రజకు మర్మభేదకము కావలయును. ఇంతియేకాక ఉత్పత్తిచేయు యంత్రములశక్తి అపరిమితము కావలయును. ఈ లక్షణములు సమకూడనియెడల దారిద్ర్య సంభావనయే ఎక్కుడగును గాని విప్లవము రాదు.

యంత్రశక్తి ఎక్కుడగుట యనగా వాణిజ్య మెక్కుచగుట. యంత్రశక్తి ఒకదేశమునం దెక్కువయినంతమాత్రమున విప్లవసిద్ధి కలుగునను ఆశ లేదు. గణతంత్రమునకు స్థాయిత్వము వలయునేని పలుదేశములందు యంత్రశక్తి అపారముగా నుండవలయును. ఇంతియకాక డబ్బులేక మలమలమాడు కూలి వారు ఎక్కువగా నుండవలయును. అప్పుడే సార్వజనికమగు విప్లవము కలుగుటకు అవకాశము. సార్వజనికమగు విప్లవము కలిగినపుడే గణతంత్ర విప్లవము చరితార్థమగును. శ్రేణీద్వంద్వమును నిరసించి అసలు శ్రేణీవిభాగమునే విధ్వంసముచేసి శ్రేణీహీనమగు సమాజమును స్థాపించుటయే గణతంత్ర విప్లవమునకు ప్రాధాన్యము.

ధనతంత్ర శ్రేణు లన్నింటిలో కూలినాలి చేసికొని బ్రతుకు దరిద్ర శ్రేణికి మాత్రమే శ్రేణీమహత్వము లేదు. దరిద్రులకు శ్రేణీస్వార్థమును కాపాడుకొనవలసిన అక్కర లేదు. పైగా శ్రేణీవిధ్వంసమే వారికి ఉద్దిష్టముకాగా

దరిద్రదేవతలగు కార్మికుల విప్లవము మిగిలిన సామాజిక విప్లవములకన్నా వేరు. వారు సామాజికోత్పాదనా వ్యవస్థలో ప్రత్యేకవ్యక్తి సంబంధమునకు పునఃప్రతిష్ఠ కావింతురు.

సంఘమునకును వ్యక్తికిని సంపూర్ణముక్తి యీ విప్లవమునందు అంతర్నిహితమైయున్నది.

"గణతంత్రపు సమాజమునం దెవనినిగాని ఒక విశిష్ట కార్యమునందే నియోగము చేయవలసిన పని యుండదు. ఎవడేని తనకు నచ్చిన పనిలో పడవచ్చును. సామాజికోత్పాదన మపుడు సమాజ నియంత్రితము. నేను నే డొకపని చేసికొనవచ్చును. రేపు నా కిష్టమయిన ఇంకొకపని చేసికొనవచ్చును. ప్రొద్దున వేటకు పోయెదను. మధ్యాహ్నము చేపలు పట్టుకొందును, సాయంకాలము పశువులు కాచుదును. రేయి ప్రాతకు కూరుచుందును. నా పనులకు అనుకూలముగా కాలమును విభజించుకొని యిచ్ఛానుసారముగా ఆయా పని పాటలు చేసికొందును. ఫలానా వేళయందు ఫలానాపని చేసితీరవలయునని ఎట్టి నియమము నాకు లేదు. ఇట్టి సమాజ శ్రమ విభాగమున కాకాశము తెచ్చి శ్రేణులను తుడిచిపెట్టును. విత్త సంచయమును విధ్వంస మొనరించి శ్రేణి ద్వంద్వమును విచ్ఛేదించును. కార్మికుల అస్తిత్వ ముత్పాదనకే ఇకయుండబోదు. కార్మికుల అనుభవము కొఱకే ఉత్పత్తి జరుగును.

ఒక వస్తూత్పత్తి చేయుటకు ఎన్నియో ఉపకరణములు కావలసివచ్చెను. ఒక కుండకు మన్ను, నీరు, సారె, కోలా, మనుష్యుడు-మున్నగు హేతుసామగ్రి కావలయును. ఇంత హేతుసామగ్రితోగూడా కుండ సిద్ధము కాదు. ఈ హేతు సామగ్రిలోగల పరికరములకును, వాని నుపయోగించు మనుష్యులకును, కుండలు కొనువారికిని, అమ్మువారికిని నడుమ నానావిధమగు సంబంధము లుండును. అవియే ఉత్పత్తి సంబంధములు.

ఆటవిక సమాజమునకు రాలు రప్పలు కర్రలు క్రొర్రులే ముఖ్య సాధనములు. అప్పుడు ఆ ఆటవికులకు వేటయే వృత్తి, వారి శ్రమకు ఫలము జంతు మాంసము లేక పక్షిమాంసము. ఇది సంఘభోగ్యము. ఈ మాంసమును నిలువ చేయుటకు వీలులేదు. నిలువచేయవచ్చు నను నూహయు వారికి లేదు. కావున

ఏనాటి కానాడు సంపాదించిన దానిని తినవలయును. కావున ఏనాడును ఎవరును సోమరితనమును అలవరుచుకొనుట కవకాశము లేదు.

కొంతకాలము ఆ ఆటవికులకు సేద్యము తెలిసెను. అందులకు పశు పాలనము, క్షేత్రపాలనమును చేయవలసిరాగా నాగలి అవతరించెను. ఆటవిక సమాజమునందలి రాలు, రప్పలకు బదులు ఇపుడు విండ్లు, ముండ్లును, రాతి పాత్రలుకు బదులు మృల్లోహ పాత్రలును, బట్టకు బదులు ఉన్ని బట్టలును, నూది బట్టలును గుహలకు బదులు గుడిశెలును ఏర్పడెను. క్రమక్రమముగా కొలదిమంది పనిచేసి చాలమందికి కూడుగుడ్డల సృజింపగల నేర్పేర్పడెను. ఇపుడు ఉత్పత్తి సాధనములు మారెను. దాని కనుగుణముగా సంబంధములును మారెను.

బానిసీంద్రుడు కష్టపడి పండింపగా బలవంతులగు సామంతులు సగమో షడ్భాగమో తీసికొనిరి. అపుడు మనుష్యులలో మనుష్యులకు సంబంధములు మారెను. ఒకడు దొర; ఒకడు బంటు. ఈ రీతిగా ఉత్పత్తి సాధనములు మారుకొలదిని సేవ్య సేవకభావ సంబంధములు సామంత కర్షక రూపముగను యాంత్రిక కార్మిక రూపముగను కనపడును. సమాజములును మారును.

సామంత్ర తంత్రమునందు కర్షకులకు పొలముల మార్పిడిగానీ, గ్రామము వదలి గ్రామాంతర మేగుటకుగానీ హక్కులేదు. సామంతుల ఇండ్లలో శుభశోభ నాలు వచ్చినపుడు కర్షకులు కట్నముల పేర సుంకములను చెల్లింపవలెను. పనిపాటులు చేయవలెను. పెండ్లిలోని బరువెల్లయు కర్షకుల మూపులమీద. సుఖమెల్లయు సామంతుల శరీరములమీద. ఇక యుద్ధములే వచ్చిన కర్షకులు ప్రాణము లొడ్డవలెను. ఇట్టివి రైతులకు సామంతులతోగల సంబంధములు.

సామంతులు రైతుల ఇండ్లలో శుభ శోభనాలకు రారు. వడ్డీ పుచ్చుకొని అప్పిచ్చి పంటలో వసూలుచేసికొందురు. కష్టనిష్ఠూరములకు కన్నెత్తియైన చూడరు. అంటురోగములచే పొలము పాడుపెట్టవలసి వచ్చినను పన్నులను శిస్తులను మానరు. రైతులలో ఎవరేని చచ్చినను గృహదాహము జరిగినను దొంగలు దోచుకొనినను సాయమను మాట చేయరు. చదువులు చూడరు. అప్పు లీయరు. ఇచ్చినను చాల లాభములతో ఇత్తురు. ఇవియు నిట్టివియు రైతులు

సామంతుల సంబంధములు. ధనిక తంత్రములో యంత్రాధిపతులకును కార్మికులకును జీతము లిచ్చిపుచ్చుకొనుట ఒకటే సంబంధము. జీతములకు పని చేయుట ఒకటే వారి విధి. యంత్రపతుల కష్టసుఖములలో కార్మికులు తమ కిష్టమగుచో పోయి ఆదుకొందురు. లేదా లేదు. కావున ధనిక తంత్రములో కార్మికుడు స్వతంత్రుడు.

మరియు యంత్రములు పలుతెరగులు. యంత్రపతులును పలుతెరగుల వారు. ఆయా యంత్రపతుల పలుదెరగులగు యంత్రములకడ కోటానుకోటుల కార్మికులు పనులు చేయుచుందురు. వారి పనులును పలుదెరగులు. పలుతెరగులగు ఆ కార్మికులలో కార్మికులకు ఒక సానుభూతి ఉత్పన్నమగును. అటులే యంత్ర పతులలో యంత్రపతులకును ఒక స్నేహము ఉత్పన్నమగును వారలలో వారికి పోటీలు వచ్చినపుడు మాత్ర మా స్నేహము గుర్రపు స్నేహముగా మారును.

ఉత్పత్తి సాధనములు మారి యంత్రతంత్రము ప్రభవింపగనే కార్మికు డుత్పత్తిచేయువా డగుటచేసి ఉత్పత్తి సంబంధములు మారి దానితోబాటు సమాజ వ్యవస్థయు మారెను. ఉత్పత్తి సాధనములు మారి ఉత్పత్తి బ్రహ్మాండ ముగా మారినపుడు కార్మికుల మైత్రి వృద్ధి అగును. యంత్రపతుల లోభము వృద్ధిపై పోటీలుపడినను పడకపోయినను కార్మికులు ధనిక తంత్రమును నేల మట్టము చేయజూతురు. అపుడు వారు యంత్రములను స్వాధీనము చేసికొందురు. అప్పుడు ఉత్పత్తి చేయువాడే యంత్రములకు యజమానుడై తన ఉత్పత్తిని తా ననుభవింప గలుగును. ఈ విధముగా సమష్టి కృషియు, సమష్టి భోగమును కలిగిన యెడల సమష్టి సంబంధములు లేక కమ్యూనిస్టు సంబంధములు రాగలవు- ప్రజాతంత్రమున కపుడే ప్రాజాపత్యము.

# 7. అర్థశాస్త్రము - మార్క్స్

ఏ అర్థనీతిమీద బూర్జువా-ఉత్పాదనము నిలువబడెనో, ఆ అర్థనీతిని విప్పి చెప్పగల బుద్ధిమంతులనుగూడ బూర్జువా సమాజమే లోకమునకు దానము చేసెను. ఆదాంస్మిత్, రికార్డో అనువార లిచట నుదాహరణలు.

ఈ అర్థనీతి పండితులు "బూర్జువా ఉత్పాదన ప్రణాళికపట్ల మనుజులలో మనుజుల కేర్పడు సంబంధము, శ్రమ విభాగము, ఋణము, ధనము-ఈ మొదలగు విషయము లెల్లపుడు మారని శాశ్వతసత్యము" లని అనిరి. ఈ సంబంధము లన్నిటిచేతను ఉత్పత్తి యెటులు జరుగుచున్నదో తావన్మాత్రమే వీరు వేరుపరచి చూపిరి. ఈ సంబంధము లేరీతిగా పొటమరించుచున్నవో యితిహాసమునందలి యేగతి ఏరీతిగా వీనిని పొటమరింపజేయుచున్నదో యను నంత మేరకు వీరు పోలేదు.

ఈ బూర్జువాఅర్థనీతి పండితుడేకాక కార్మికుల ముక్తికి కోరు ప్రుధ్కూడా హస్తమలకముగానున్న ఈ యర్థనీతినే గ్రహించి ఈ సూత్రములు ముందు కాలములకును మారనివనియు, అటుల మారకపోవుట వస్తుస్వభావమనియు, అవి నీతిశాస్త్రమునందలి సుభాషితములనియు విశ్వసించెను. ఉత్పాదన సంబంధముల ఇతిహాసపు గతి వేగముచే ఈ విషయము లన్నియు సిద్ధమై పురోగమనము చేయుచున్నవని మన మెరుగకపోయినచో వారు చెప్పిన చొప్పుననే ఇది అంతయు స్వాభావమనిగానీ, అదృష్టమనిగానీ, కర్మ అనిగానీ, బ్రహ్మవ్రాలనిగానీ భావింపవలసి ఉండును. మన యజ్ఞానమ్ము నూతయు దైవమో దయ్యమో యవతరించును. వాగు మోయని బరువును, సవరింపని వైరుధ్యమును, సృజింపని చింతయు లేదుకదా!

దర్శనములన్నియు ఈ ప్రపంచమును కొన్ని నియమములచే జాతులుగా విభజించును. ప్రపంచమంతయు ఈ రీతిగా ఇరువది పైచిలుకు తత్వములుగనో, అరువది పై చిలుకు మూలపదార్థములుగనో బద్ధమగును. ఇటులే గతియు ఉత్పత్తియు హెగెల్ చెప్పిన శాశ్వతరీతిక పర్యాయమై పోవును. హెగెల్ ధర్మశాస్త్రమును న్యాయశాస్త్రమును ఏ దశలో పెట్టెనో ప్రుధ్ రాజ్యనీతికి సంబంధిం

చిన అర్థశాస్త్రమును ఆ దశలోనే పెట్టెను. వస్తు సత్యము నతడు దార్శనికుల వలెనే తల్లక్రిందులు చేసి చూపెను. మానవులు నూతనమగు నుత్పాదన సంబంధములచే నిశ్చితమగు నొక పద్ధతిని భోగవస్తువుల నుత్పత్తి చేయుదురని ప్రుధ్ ఎరుగును. కాని భోగ్యవస్తువులతోపాటు సామాజిక సంబంధములు గూడా పరిణామము చెందునని యెరుగడు.

ఉత్పాదనశక్తితో సామాజికసంబంధ మణగి పెనగియున్నది. నూతనమగు నొక ఉత్పాదన శక్తిని పడయవలయునెడల ఉత్పాదన ప్రణాళిక పరివర్తన మొనరింపవలసి ఉన్నది. ఉత్పాదన ప్రణాళికను పరివర్తించినచో మానవుల జీవికోపార్జన రీతియందున పరివర్తనము కలుగును. అనగా సామాజిక బంధములు పరివర్తితములు అగును. చేతిబలమునను కాలిబలమునను నడచు మర సామంతరాజు సమాజమును సృజించెను. ఆవిరి యంత్రములు శిల్పోత్పాదకమగు బూర్జువా సమాజమును సృజించెను.

ఎవరు వాస్తవమగు ఉత్పాదన శక్తితో కలయిక పొంది సామాజిక సంబంధమును ప్రతిష్ఠింతురో వారే సామాజిక సంబంధముతో కలసి మెలసియుండు నీతి రీతి భావాదుల సృజింతురు. ఈ సంబంధములే శాశ్వతములు కావు. ఇవే ఎప్పుడు కావో అపుడు నీతి రీతి భావాదులును శాశ్వతములు కావు. ఇవి తాత్కాలికములు.

ప్రుధ్ అర్థనీతిశాస్త్రములో సవ్యమార్గములు మరియు అపసవ్య మార్గములని రెండు మార్గములు కలవనియు, వానిలో అపసవ్యమార్గము వదలి సవ్యమార్గమున నడచిన చాలునని వచించెను. ఇందులకు మేలుగేచ్చు యెడల భ్రాంతిలేని జ్ఞాన మావశ్యము. కావున అర్థనీతి యంతయు అతనిమతమందు నీతి శాస్త్రముతో పాటయిపోయెను. ఈ నీతిబలముచేతనే మానవులు తమకు పరమ కల్యాణ మొదవించు సమతదశ కెగబ్రాకుదురు అర్థనీతి సంబంధము లీ పరమ లక్ష్యము చేరు కొరకే ఆవిష్కృతమైనవా ? ప్రుధ్ ఈ సమతను బ్రహ్మగారి ఆద్యసృష్టితో సమానముగా చూచెను. అతని చూపులలో అర్థశాస్త్రమునకు ధర్మశాస్త్రమునకు భేదమేమి ?

ధర్మశాస్త్రజ్ఞులు ఎట్లు చెప్పుదురో ఈ అర్థనీతిజ్ఞులును సరిగా అట్లే చెప్పుదురు. ధర్మశాస్త్రజ్ఞుల మతమున ధర్మ మిరుదెరగులు. స్వధర్మము, పర

ధర్మము. స్వధర్మము అపౌరుషేయము. అనగా ఈశ్వరావిష్కృతము. ఇక పరధర్మము మానవ కల్పితము.

అర్థనీతిజ్ఞులకు తమ సమాజ వ్యవస్థ స్వాభావికము. పరసమాజ వ్యవస్థ అస్వాభావికము, సామంతతంత్ర సమాజము వారికి అస్వాభావికము. బూర్జువా సమాజము స్వాభావికము. తమ సమాజములో విత్తోత్పాదనముగాని ఉత్పాదన శక్తి యున్నతిగాని ప్రాకృత నియమమునుబట్టియే జరుగుతున్నదని వారి తలంపు. కాగా అర్థనీతి సంబంధము లన్నియు వారి తలపులో చిరంతన నియమములే కాని వేరు కాదు. ఎంతవట్టు సమాజవ్యవస్థ ప్రాకృత నియమములలో బద్ధముకాదో అంతవట్టు చరిత్రకు ప్రయోజనము. సామంతతంత్ర సమాజముతోపాటు చరిత్రయు ముగిసిపోయెను. స్వభావధారలో కొట్టుకు వచ్చిన బూర్జువా సమాజమునకు చరిత్రతో ప్రయోజనములేదని వారి యభిప్రాయము.

బూర్జువా ఉత్పాదన సంబంధముల ద్వైత ప్రకృతిని వారవగతము చేసికొనలేదు. ఏ సంబంధముచే విత్తోత్పత్తి జరుగుచున్నదో ఆ సంబంధమే విత్తభావమున కలుగు దుఃఖమును ప్రసవించుచున్నది. ఒకమూల నిత్యాతనము రెచ్చగొట్టుచు ఉత్పాదనశక్తి ఉప్పర మంటుచున్నది. ఈ సంగతులు తెలిసికొను పాటి అర్థనీతిజ్ఞుల యావశ్యకము కాదు.

ఆదాంస్మిత్, రికార్డో అనువారలు బూర్జువావిత్త తాత్పర్యమును విప్పి చెప్ప ప్రయత్నించిరి. కాని వారు చెప్పిన నియమములు కాని సూత్రములుకాని క్రొత్త విషయములు కొంచెమైనను ఆవిష్కరింపలేదు. యంత్ర శిల్పాధికృతమగు సమాజవ్యవస్థలో కలుగు కష్టము స్వాభావికమగు ప్రసూతి వేదనవలె అనుభవమనియు అఖండమనియు వారి యభిప్రాయము.

మరియొక తెగ అర్థనీతిజ్ఞులు కలరు. వారు మానవ ధర్మజ్ఞులు. కూలివారల దురవస్థను వారర్థము చేసికొని, ఓ కూలివారలారా! మీరు ఒడలు వంచి పనిచేయుడు, త్రాగకుడు, ఎక్కువమంది పిల్లలను కనకుడు; ఓయంత్రాధిపతులారా! మీరు పవిత్రముగను, న్యాయసంగతముగను ఉత్పత్తి చేయుడు, అని ఉపన్యాసములు ఇచ్చెదరు. పని, నీతి సవ్య అపసవ్య మార్గములు- ఈ ద్వంద్వము నడుమనున్న వ్యవధానమును తొలగింప వీలులేదు అను నిశ్చయము

మధ్యబిందువులుగా వీరి ఉపదేశములు గిరుకొనును. మరొక విధముగు అర్థ
శాస్త్రజ్ఞులు ఉన్నారు.

వారు క్రాంతులు. అంతర్థనూ బూర్జువాలు అయిపోవలెనని అభిలషిం
తురు. బూర్జువాకు సంబంధించిన సూత్రములు అటుతేయుంచి వాని యంతర్
విరోధములను లేకుండా చేయవలెనని వీరి కోరిక. ఇది చేయ వలను కాకపోవు
టయే కాక అసంభవము కూడ.

అర్థనీతిలో శాశ్వత నియమములు లేవు. ఈ మహా ప్రపంచమునందు
మార్పొక్కటియే శాశ్వత నియమము. మరొక శాశ్వత నియమము లేదు. ఒకొక్క
కాలమున ఒకొక్క రీతిగా ఈ యర్థనీతి విశేషాకారము తాల్చుచున్నది. ఈ యర్థ
నీతిని బట్టియే ఆ కాలపు సమాజము రూపుతాల్చుచున్నది. ఉత్పాదనశక్తి రూపాం
తరము పొందగనే అర్థనీతి రూపాంతరము పొంది తీరుచున్నది. ఈ రెంటికిని
'ఎన్సు' నియామికత్వాప మున్నది. ఉత్పాదనశక్తి యన్నగా ఉత్పాదన కౌశలము
మరియు శ్రామికులు. పరిమాణ గతమగు ప్రకృతినిబట్టి సామాజిక పరివర్తనము
కొంత దప్పు మందరికి పోశ్చునంతవరకు సమాజభిత్తి లేక అప్పటికి ప్రతిష్ఠిత
మగు విత్తస్వరూపము జంకదు. కాని పరిణతమగు ఉత్పాదనశక్తి ఆ విత్త
రూపములో ఇమిడియుండజాలని సమయము తటస్థించినపుడు ఒక భూకంపము
వచ్చినాట్లీ అనుగుణమగు పరివర్తనమొకటి కలుగును.

ఎపుడో ద్రవ్యము వినిమయ యోగ్యమయ్యెను. వినిమయ మనగా
మార్పు. ఉప్పు ఇచ్చి దానికి సరియగు పప్పు తెచ్చుకొనుట. ధనతంత్రమునందలి
అర్థశాస్త్రమునకును ఇదియే ధనకోశము. ధనతంత్రపు సమాజము వినిమయ
భిత్తిమీదనే సమాజ సంబంధమును నిర్మించుకొనును. ఆ సంబంధ మిట్టిదే.
ఒకరితో మరొకరికి పనిలేదు. ఎవరి పనులు వారివి. అందరు తమ పనిలో
మునుగుదురు! కార్మికులు తమ శ్రమ నమ్ముకొనుచున్నవి. కర్షకులు బస్తీకి
ధాన్యముతో వెళుచుకొనుచున్నారు. బ్యాంకులు ఋణమిచ్చుచున్నవి. దుకాణ
దారులు అంగళ్ళు తెరుచుకున్నారు. ధనపతులు కార్ఖానాలు కట్టించుచున్నారు.
లాభము సంపాదింపగోరు బేరగాండ్లు షేరు, బజారులలో పొంచి పచారులు చేయు
చున్నారు. ఎవరికిని తీరుబాటు లేదు. ఇట్టి వైషమ్యమునందును అసంయోగము

నందును సంపూర్ణముగా విరోధము కానిపించుచున్నను అదియే సమాజమును నిలిపి ఉన్నత దిశకే కొంపోవుచున్నది. యాంత్రిక ప్రక్రియలో అర్థనీతి యంత్రపు కూటకౌశలమును జాగరూకముగా సంభుటయే ధనతంత్రమునకు ఆయుధము ధనతంత్రమునకు సంబంధించిన అర్థనీతిలో నియమములు అసంఖ్యాకములే కాని వానికొకటే మూలము. అది శ్రమమూల్యము.

సమాజమున కధీనముగా అపారమును సజీవమునగు శ్రమశక్తి కలదు. ఈ శ్రమశక్తిని ప్రకృతిపై ప్రయోగించినచో మనుష్యులకుపయుక్తమగు వస్తువు లుత్పన్నమగును. ఉత్పాదకు లందరును ఒకే వస్తువులు తయారుచేయుదురు. శ్రమవిభాగము ననుసరించి పలు రకములగు వస్తువులు ఉత్పన్న మగును. వస్తువులు వినిమయ యోగ్యము లగుట కిదియే కారణము. నిర్ణీతముగ ఒకే మానము ననుసరించి వస్తువే ఒక వినిమయ యోగ్యమయ్యెను. రానురాను తుదకు వెండి, బంగారముల మాధ్యస్థ్యమున వినిమయ మారంభమాయెను. వస్తువుల నుత్పత్తి చేయుటకు వ్యయమగు శ్రమయే రెండు వస్తువులలోగల గుణమునకు నిర్ధారణము. మానవ శ్రమయే వెలకు నిర్ణాయకము.

పనులు రెండు విధములు. మోటు పనులు, నాజూకు పనులు. మోటు పని కుపయోగించు శ్రమను శ్రమయనియు, నాజూకు పని కుపయోగించు శ్రమను నిపుణ శ్రమ అనియు నందురు. ద్వివిధమగు నా శ్రమను వెచ్చముచేయు కాలమును శ్రమకాలమని యందము.

వెలకొలది నిర్ణీతమైన ఉత్పాదకుల నడుమగల శ్రమ విభాగము సమాజమును పలువిధములుగా విభిన్నము చేయకుండుటకు సమాజోపయోగము ననుసరించెడి శ్రమ సమయమనగా ఆ యా యీ కాలమున స్వాభావికావస్థలో జరుగు ఆయా యీ సగటు ఉత్పత్తుల బట్టి ఆ సమాజమున ఉత్పత్తికి పట్టు సగటు కాలము. మిల్లుమీద ఒక బట్ట నేయుట కొకగంట పట్టుననియు, కాలిమగ్గము మీద రెన్నాళ్ళు పట్టుననియు ననుకొందము. శ్రమ సమయము మిల్లుకు తక్కువ. మగ్గమున కెక్కువ. ఇచ్చట మిల్లుశ్రమకంటె మగ్గముశ్రమ నలుబది రెట్లు. మిల్లు బట్టకు రూపాయి వెలయగుచో శ్రమ సమయమునుబట్టి మగ్గపు బట్టకు నలుబది ఎనిమిది రూకలు. కాని ఇపుడీ రెంటికిని ఇంచుమించు ఒకటే వెల.

నేటి సగటు సమాజ ఉత్పత్తి పద్ధతిలో సగటు గంటకే ఒక వస్త్రము సిద్ధమగుచున్నది. పైజూపిన శ్రమ సమయమే వెలను నిర్ణయించుచున్నది.

సంఘమున కుపయోగించు వస్తువుల నుత్పత్తి చేయుటయందీ శ్రమ పరిమాణమునుబట్టి అంగడిలో ఆ వస్తువుల వెల ఎక్కువగుట గాని తక్కువగుట గాని తటస్థించును. దీనిని బట్టియే వినిమయ పరిమాణము గూడ నేర్పడును. శ్రమ మూల్యమును పరివేష్టించి యున్నది కావుననే వస్తు మూల్యము తన అసలు వెల కంటె ఒకానొకప్పుడు హెచ్చుట తగ్గుట జరుగుచున్నది. ఇది యేదో ఒక వస్తువుకు సంబంధించినది. కాని సమాజ ప్రసూతములగు వస్తువుల యన్నిటి వెలయు తమ అసలు వెలతో సమానము కావలయును. ఏలనగా మానవుల శ్రమయే వెల నేర్పరచుచున్నది. మానవ సమాజము చేతులలో అదియు యున్నది. వెలకు ఆ గిరి దాటిపోవు నుపాయములేదు. వినియోగింపబడిన శ్రమ పరిమాణపు విలువ చేతనే వస్తు వినిమయము జరుగునెడల ఈ సమతనుండి ఆ సామ్య మెటు లుద్భవించుచున్నది ? అన్ని వస్తువులకును నామాంతర రూపాంతరము లిచ్చునే శ్రమ శక్తి కలదో దానిని ఉత్పాదనోపాయము లెరిగిన మిల్లు యజమానులును ధనపతులును కొందురు. వారు బ్రతుకుటకు చాలిన జీతములిచ్చి కార్మికులను పనిలో ప్రవేశపెట్టుకొందురు. కార్మికులను పనిలో పెట్టుకొనుట యనగా నూతన మూల్యము నుత్పత్తి చేయుట. ఈ మూల్య పరిమాణము కార్మికుల గ్రాసవాసో మూల్యముకంటె ఎక్కువ. కార్మికులను శోషింపజేయగల మను ఆశతోడనే - అనగా కార్మికులు ఎంతపని చేయగలరో అంతపనియు వారితో చేయింపగల మనియే యీ కుబేరులు వారి చెమట కొందురు. ఈ శోషణమే అసామ్యము నొదవించును.

ఉత్పాదనము రెండు విధములు. ఒకటి ఉపయుక్తము, రెండు ఉద్వృత్తము. ఉత్పన్నమగు వస్తువు వెలలో ఎంతవట్టు శ్రామికుల కూటి గుడ్డలకు చాలునో అంతవట్టు వెలకల వస్తువుల ఉత్పాదనము ఉపయుక్తోత్పాదనము దాని కెక్కుడుగా శ్రామికులు చేయు నుత్పాదనము ఉద్వృత్తోత్పాదనము. బానిస లేలిన వారి కొరకును, భూమిదాసులు సామంతుల కొరకును, జీతములు పుచ్చుకొను శ్రామికులు మిల్లులవారికిని ఉద్వృత్తోత్పాదన మొనరించుచున్నారు. అటు లొనరింపనినాడు ధనికు లీ శ్రమశక్తిని కొనవలసిన పనిలేదు. ఈ ఉద్వృత్తో

త్పాదనచే వచ్చిన లాభములు పొంది ధనసంచయములు చేసిన వారే సమాజము నకును రాష్ట్రమునకును కర్ణధారులగుదురు. ఉద్వృత్తోత్పత్తి వలన కలిగిన ఉద్వృత్త మూల్యమునకు ప్రుధ్ "దొంగ సొమ్ము" అని పేరు పెట్టుట జరిగెను. దీనికి "దొంగ సొమ్ము" అని పేరు పెట్టుట అర్థనీతి రహస్యోద్ఘాటనమే.

మూలధనము లాభములు తెచ్చుచు సంచయమునకు త్రోవ చూపును. ధనపతు లీ ఉద్వృత్త మూల్యములో కొంతపాలు మూలధనము పేర నిలువ చేయుదురు. అది చక్రవడ్డీవలె పిల్లలు పెట్టుచుండును. ఉత్పాదన వృద్ధియగు చుండు కొలదిని ఉద్వృత్త మూల్యము పెంచిన ధనముముందు మొదటి ధనమును చూచినచో అది గుమ్మడికాయలో ఆవగింజయు కాదు.

తొల్లి మానవుల సంపదకు మానవుల శ్రమయే ఆధార మగుచుండెడిది. ఉత్పాదక వస్తువులను మార్చుకొని తమ శ్రమకు తగిన సంపదను సంపాదించు కొనగలిగెడువారు. ఇపుడో ఉత్పాదకులగు శ్రామికులకు ఉత్పాదితములగు వస్తువులమీద ఎట్టి హక్కును లేదు. పైగా కొంత శ్రమశక్తిని ఉచితముగా ఇచ్చి వచ్చువారు కార్మికులు. ఉద్ వృత్తమగు ఆయా శ్రమ మూల్యమును లాభముగా పొందువారు ధనపతులు. ఈ మూల్యములో కొంతపాలు ధనపతులతో షాఖానాలో జమ చేయబడును. కొంతపాలు ధనపతుల సొంతఖర్చులకు పోవును. కొంత పాలు లాభము క్రింద జమపడును. ధనపతు లనగా ధనాగారములే. వారి కింత భూమిక లేదు. వారికి కూడబెట్టుట కొరకే కూడబెట్టు లోభము. మూలధనమును సత్రాజన్మణిగా చేయలేనిదే వారికి నిద్ర పట్టదు. వారు ఉత్పాదన వృద్ధికి-అనగా ఉత్పాదనకొరకే ఉత్పాదన మొనరించుటకు వేలకొలది మానవులచే పనులు చేయింతురు. వారట్లు చేయింపగా చేయింపగా వ్యాపారపు వెల్లువయు ఆర్థిక సంక్షోభమును కలుగును. అపుడు ధనతంత్రము విప్లవమునకు గురియగును.

## హెచ్చరిక

మార్క్స్ వాదము లన్నిటిని పలువురు పలుకేంద్రములనుండి చూచి తరిచెన పట్టిరి. వాని నన్నిటిని తరచి యీ సైంటిఫిక్ సోషలిజపు - అస్త్రాగారములో ఎన్ని అస్త్రములు తుప్పతినెనో మరి ఎన్ని పదనుగ నుండెనో పాఠకులు పరిశీలించు కొనవలెను.

# 8. శ్రీ స్థానం నరసింహారావుగారు

పఠనమాత్రమున నాటకము సమగ్రముగా అర్థము కాదు; చక్కని ప్రదర్శనమునందు వీనులు దాని వినవలయును, కన్నులు కాంచవలయును, మనస్సు రసింపవలయును. అపు డది ప్రియురాలివలె పరిపూర్ణానంద మొసఁగును.

మంచి నాటకము మంచి నటున కెదురు చూచి యెదురుచూచి మంచి నటులను సృజించును. నక్షత్రములలో చంద్రునివలె వానిలో నొకానొకఁడు సర్వ మహానుఁ డగును.

నాటకము మొత్తముమీద సఫలము కాకున్నను దాన దివ్యమగు పాత్ర మొకటేని యున్నను ఆ పాత్ర మొక దివ్యనటుని ప్రసవించును. మన యాంధ్ర దేశమునం దిట్టినటులు కొంద రున్నారు. వారిలో స్థానం నరసింహారావు గారి కొక స్థాన మున్నది.

పగలు నటుని గాంచి 'యితడు నటుఁ డితడు నటు'డని పట్టియిచ్చును. అందును స్త్రీ పాత్రమును దాల్చు నటుడు దానికి కడు లోకువ. ఇంతమించ తనిలో సాబా లాడుచి కదా! స్థానం నరసింహారావుగారిని పగలు పట్టి యీలేదు. రాత్రియు, ఇతడు నరసింహారావుగారని వ్రేలఁ జూపలేదు.

జీవితరసము నంతయు నాట్యమునకు ధారపోసిన నందుల గావలయు పాత్రమునకు తగిన శరీరలక్ష్మి యితనికి లేదు. బలమును సర్వమంగళము. కాని వేషము ధరించినపు డితడు తన శరీరమును పాత్రమున చతురస్రముగ దిగగొట్టుకొనినటు లుండును. ఒక చిత్రకళ, ఒక సర్వ సంపత్తి, ఒక భావన, ఒక అనుకరణము, ఒక చురుకుఁదనము – ఇవి ఇతనిని సుప్రసిద్ధ నటునిగా జేసెను.

జడములగు చిత్తరువులకు వస్త్రాలంకారాదుల గియుట యేమి వింత? ఇతఁడు తనలో నొక ప్రతిమను ప్రతిష్ఠించి దానికి వస్త్రాలంకారాదుల నర్పించును. అవి రెక్కలవలె ఇతని శరీరముతోపాటు పుట్టినటు లుండును. అందితని

చిత్రకళ పరినిష్ఠితమైనది. లోక మీ వస్త్రాలంకారాదుల ననుకరించుచున్న దన్నచో నందు స్థానం నరసింహారావుగారి కెట్టి స్థాన మీయవలయును ?

ఇతడు గానము నాపుచో నింకను పాడడేమి ? యని కోర్కెని వెంటగొని కోపము వచ్చును. ఇతని పాటకు తలకట్టులు లేవు; తోకలు లేవు; గొలుసు కట్టులు లేవు. వలసినంత ఇతని స్వరము "లేతకు లేత" వరూధిని. దానికి సాటి లేదు. కోకిల స్వరము పరుషము. వీణా స్వరము మోమునను ముక్కును బుట్టినటు లుండును. ఇతని లేతఁదనము గ్రామోఫోనులోని కెక్కునా ?

భావన యితనిలోను, ఇతడు భావనలోను సంచరించుచుందురు. ఇతని భావననుండి సూక్ష్మ వ్యాపారము లతి నిశితములై బయలుదేరి సౌందర్య లుబ్ధ మగు మానసమును మంత్రించును. ఇతని ముఖ రంగమున భావము పాతర లాడును. (పాత్ర కుచితముగా) ఆహార్యాభినయము, దానిమించిన భావము, దాని వ్యక్తము చేయు శబ్దము, ఈ మూడును ఇతనిలో ఇల్లు కట్టుకొన్నవి.

ఇతని యనుకరణ మనుకార్యమునకు జీవాతువు. ఇతని చురుకుఁదనము పులికి లేదు. రంజనమున నితడు చిత్రకళాచార్యునకు వన్నెలు దిద్దును. ఇతని స్వరము 'లేతకు లేత' యంటిని. వలసెనా, ఆ కంఠమున సింహగర్జనము లేక నరసింహ గర్జనము విందువు. శాసించుచో ఆ కంఠము కాలమేఘము. కవి సృష్టి కితడు వ్యాఖ్యాతృ. మహామహోపాధ్యాయుడు లేక ప్రకృతి కద్దము.

ఇతడు మధురవాణి పాత్రము ధరించునని విని జుగుప్సించితిని. కాని పోయి చూచితిని. అందాతడు నవ్విన నవ్వు విచ్చిన పువ్వువలె నిప్పటికిని స్మృతి తంతువునం దనుస్యూతమై యున్నది. వలపుసాని చేత లన్నియు అతని మెయి వాతలవలె నంటియుండెను. గురజాడ అప్పారావుగారి మధురవాణి మన కక్కరలేదు. కాని స్థానం నరసింహారావుగారి మధురవాణి మన కొకసారి కావలయును.

భరతు డన్నాడు- నీచ భావములు కలవారిచేతనే నీచపాత్రములు ధరింప జేయు మని. ఇతని పాత్రధారణమువలన నీచ పాత్రమునకు గూడ నేదియో కొలది విలువ (ఆ విలువ తాత్కాలికమే, శాశ్వతికము కాదు) వచ్చినటు లున్నది.

స్వాధీనపతికగా గర్వపర్వత శిఖరమున నితడు విహరించును, పతివ్రతా భక్తి నిమ్నపల్వలములలో మోఁకారించును. ఇతడు ప్రేమానునయమున చక్రవాకి - భావశబలతలో కృకవాకి. విఫలప్రేమమం దాడు పులి. వాత్సల్యమున తల్లి.

విప్రలంభ మితనిలో మొలకెత్తినది. విఫలప్రేమ మితనితో మిన్నుముట్టినది. దాని నితడు కామదాహమునుండి తెచ్చెనో-లేక యిటనుండియే యటకు బంపెనో? దాని నితడు సహస్రవదనములతో నేడిపించెను. దానినుండి సహస్ర రుధిరధారలు కురిపించెను. ఇతని గున్వకుత్తుకనుండి వెడలిన దీనాలాపము కరుణరసమును చిలుకగా పుట్టిన జున్ను. ఇతని విఫలప్రేమమును చూచునపుడే ప్రేక్షకుని హృదయము కన్నుల మరగొమ్ములనుండి దుఃఖ ప్రవాహమును గండఫలకములనుండి వక్షస్సీమవఱకును ప్రవహింపజేయలేదు? ఓ ప్రేక్షకుడా! సుఖమయమైన దుఃఖమును చవిచూడ దలతువేని ఒకసారి యేని చూచి నీ హృదయపు దాళమును పగులగొట్టి నీకు తెలియని దుఃఖమున కుత్తుక బంటిగా మునుగుము. దుఃఖమునం దెంతటి సుఖమున్నదో నీ కపుడు తెలియగలదు.

వధూటియొక్క నూతన ప్రేమ మీతనిలో మూర్తీభవించినది. శరీర లక్ష్మికి పేదతనమనుమాట కాని మాట. పాటలలో నితని కెవరు సాటి? వియోగ వేదన కితఁడు మూలపురుషుఁడు. విఫలతవలన గలుగు క్రౌర్యము నితడు సాధించెను. శాసనమునం దితడు గురువు; క్రౌర్యమున త్రాచు; ఇతడు కత్తి నూరక తాల్చును గాని అది విడంబనా మాత్రము.

భావ శబలత కితడు పెట్టినపేరు. దానిని సమగ్రముగా రచించినవాడు కాళిదాసు. నా ఎరుకలో నటించినవాడు నరసింహారావు.

ఏ వేషము వేయదలచుకొనిన ఆ వేష మితనికి 'సలా' మొనరించును. ప్రతి వేషమును 'నేను నే'నని ఇతని వరించును. స్త్రీ పుంస పాత్రములు రెండును ఇతని రెండు చేతులు. ఇతడు యశోద కాగలడు. ఆమె కోడలు కాగలడు. పురుషపాత్రమునం దర్జున పాత్ర మితని కనురూపము. ప్రాయమునందును, రూపమునందును, కులమునందును, భావమునందును సుదూరప్రకృతులు గల బహుపాత్రము లితడు ధరించును. 'నటభార్యావత్ వ్యంజనాని

భవన్తి' అను మహాభాష్యకారుని 'నటభార్య'కు ఏ నలుగురైదురకో భార్య యని తోచినది కాని నలుగురైదుగురే కాదు - ఏబందైనన కావచ్చునని తెలిసినది. ఇతడు అన్ని యలంకారములందును నిగూఢముగా నటించు ఉపమవలె అన్ని పాత్రములను ధరింపగల నటుఁడు.

ప్రకృతిమాత ఇతనికి స్ఫుటమగు శరీర వైభవ మిడియుండుచో మనము చాలఁగాలమువఱకు ఒక దివ్యమగు స్త్రీ పాత్రమును చూడగలిగియుండువారము. కొంతకాలము దాటిన పయి ఇతని పురుషపాత్రము మాత్రమే కనులార చూడ గలుగుదు మనుకొందును.

ఆంధ్రనాటకమా! నీ విటువంటి నటులను ప్రసవింపుము. నీ పెంపునకు నటులును, నటుల పెంపునకు నీవును, మీ యుభయుల పెంపునకు సహృదయులును ఏ కోత్తరాభివృద్ధి చెందుదురు గాక.

సహృదయుడా! నీకు తీరిక యైనపుడెల్ల నాటక పఠనము మానకు. సహృదయుడా! నీకు అవకాశము చిక్కినపుడెల్ల స్థానం నరసింహారాయని పాత్రము చూడమానకు. నాకింత దాపుననున్నను ఇదివర కీ పాత్రమును చూడనందులకు విచారమును, మొన్నమొన్ననే చూడగలిగినందులకు ఆనందమును పంచుకొంటిని. మహానటుడీ నటుని నాట్యద్వారమున కర్మయోగిని చేయుగాక !!



# 9. నా జ్ఞాపకములు

౧

రమారమి పాతికయేండ్లక్రిందట నా ఒంటెద్దుబండి సాయంకాలము నాలుగు గంటలవేళ సముద్రప్రాంతమున ఉప్పుటేఱు దాటబోవుచుండెను.

ఒకప్రక్క నల్లసముద్రము. మఱియొక ప్రక్క పచ్చసముద్రము. చల్లగాలి. చక్రవాళము చూపుల గ్రోలుచుండెను. మనస్సు తనకన్న లోతుగానున్న మఱియొక వస్తువులో నప్రయత్నముగా మునుగుచు దేలుచు, దేలుచు మునుగుచు నుండెను. 'తాను' దనలో వెలుగుచు నాఱుచు దాగురుమూత లాడ జొచ్చెను. అట్టి ఘట్టములలో దూరదూరమునుండి శహనారాగము కర్ణజాహరము నకు దగిలెను.

బండి మునిముందులకు సాగిన కొలదియు ఆ స్వరము స్ఫుటతరమును, స్ఫుటతమమును అగుచు వచ్చుచుండెను ; గాని అది యేయంత్రమునుండి వెలువడు చున్నదో తెలియ నయితి కాలేదు. వీణకాదు. ఫిడేలు కాదు. ఏదో తెలియదు.

నా శకటము మఱికొంచెము దవ్వరిగెను. పొనపొన ఒంటెద్దుబండి. దాని దాపున ఒక యెద్దు మేయుచుమేయుచు దలయెత్తి ఆలకించుచున్నటు లుండెను. సుమారు ముప్పదుగురు చక్రాకారముగ గూరుచుండిరి. దాని నడుమ మధ్య బిందువువలె నొకరు కూర్చుండి నాగసౌర బుర్రతో దన్మయులై పాడుచుండిరి.

నేను నాబండిని రోడ్డుమీద నూడదీయించి సుమారు నాలుగు ఫర్లాంగులు నడచి వారి కడకు వెళ్లి కూరుచుంటిని. ఆ గాయకు నంతకుముందు నేను కని యెఱుగను గాని వినియెఱుగుదును. వారపుడు చాల గ్రుశించి యుండిరి.

అపు డచటనున్నవా రెవరును గదలుటయు, మెదలుటయు లేదు. "చిత్రార్పితారంభ మివావతస్థే", చేపలు తియనీటి కెదురెక్కినటులు శ్రోత లందఱు నానందప్రవాహములోని కెదురెక్కుచుండిరి. ఆ పాటకు నాలోనున్న పాము పడగవిప్పి యాడమొదలుపెట్టెను. మఱికొంచెము సేపటికి గానమును

గాయకుడును, శ్రోతలును నేకమైపోయిరి. అందఱ హృదయములును ఏకమై పోయెను.

అంతట విహంగగాన మారంభమాయెను. సభాభంగమాయెను. గాయకుడు మెల్లగా నాగసారము క్రింద నిడబోయెను. వారిశిష్యురాలు కాబోలు నొకామె దానిని బుచ్చుకొని బెట్టి బెట్టెను. అచట నున్నవారి నెవరిని నేనెఱుగ గాని వారిలో గొందఱు నన్నెఱిగియుందురు. కాగా నామాట వారి గురువుల చెవివఱకు బోయెను. వారు మిగుల శ్రద్ధాభక్తులతో నాకాతిథ్యమిచ్చిరి. వారి పేరు ముగ్గిళ్ల రామారావుగారు. వారి కేడాదినుండియు దీర్ఘవ్యాధి. వారి మామగా రొక లక్షాధికారి. ఆయన తన యల్లుని శిష్యులతోగూడ దనయింటికి దీసికొనివచ్చి మందిప్పించుచుండెను.

శ్రీ రామారావుగారును, వారి తమ్ములు శ్రీ విశ్వనాథముగారును జోళ దేశమున చాలకాలము నివసించి అచటిఫక్కి నలవరుచుకొనిరి. శ్రీ రామారావు గారు మైసూరు విద్వాంసులతో బన్నిదము చఱచి వేయినూటపదాఱులు పలు మాఱులు గెలుచుకొనిరని వినికి. వీరు వాచని వాద్యములేదు. వీరిది మయూర కంఠము. 'రాచప్పపాటకు రాలుపగులును, రామప్పపాటకు రాలుకరగును' అను నానుడి నేనొకతూరి బెంగళూరున వింటిని. శ్రీవేంకాగా రొకతూరి వీరి గానమును సాగరగాన మనిరి. వీరిది గొప్ప పాండిత్యము. దానికి తగిన రక్తి. వీరి సంపాదనమునకును, వ్యయిమునకును బరిమితిలేదు.

వీరి మామగారిది గట్టి పిడికిలి. వారు రెండవలక్షకు మీదుకట్టిరి. విదేశ వాసము చేసిచేసి తిరిగివచ్చిన యీయల్లు డీగట్టిపిడికిటిని గొంచెము సడలింప నేర్పెను. ఆ మామగారీయల్లుని, అల్లుని పిదప నల్లునంతవాడును, అల్లుతమ్ము డును అగు విశ్వనాథముగారిని, శిష్యురాండ్రను, శిష్యులను సుమారు ముప్పదు గురను, ఇరువురు వైద్యులను, నడుమనడుమ నావంటి సత్తరకాయలను, ఆరు నెలలనుండి పోషించుకొనుచు వచ్చుచుండిరి. అపుడు నేను రెన్నాళ్లు వీరి కతిథి నైతిని.

వైద్యులు కొందఱు ప్రతి దినమును వచ్చి రామారావుగారి చేయిచూచి వారిపాట విని పోవుచుండెడివారు. ఇరువురు వైద్యులెపుడును అచట మకామే.

ఇంత వైద్యోపచారమున్నను వారి యారోగ్య భాస్కరు డస్తాచలము దెసకే మొగ్గుచుండెను.

నేనచట రెన్నాళ్లుండి వారి యమరగానము విని వీడుకొంటిని. రామారావు గారు తమతమ్ముడు విశ్వనాథముగారితో నన్ను సాగనంపుటకు నూరిచివర వరకు వచ్చి "నాకు కొంచె మారోగ్యము కలుగగనే నా శిష్యుని మీకడకు బంపుదును. తమరు దయచేయుదురేని నా గాత్రము పూర్తిగా వినిపించెదను" అని యనిరి.

"మీరిపుడు పాడవలదు. విశేషించి గాత్ర-పాట నిషిద్ధమని వైద్యుల యభిప్రాయము" అని నేనంటిని.

"కాదండీ! వైద్యులకేమి తెలియును? యీ తూరి మీరు నా గాత్రము పూర్తిగా విననిచో మఱి వినలేరు" అని రామారావుగా రనిరి.

నా మనస్సార్ద్రి మాయెను. దాని ప్రభావమును గనులలోనికి రాకుండ జేసికొని "వార్త నంపుడు, రెక్కలు కట్టుకొని వాలెద"నని నేనంటిని.

ఒకరినొకరము విడిచిపెట్టి వెళ్లలేక యెట్టెటులో విడబడి వెళ్లితిమి. ఒక వారము గడిచెను. వార్తలేదు. నా శిష్యుని వారికడ కంపితిని. అతడు తిరిగి వచ్చి, "రామారావుగారికి జాల నెక్కువగా నున్నది. విశ్వనాథముగారు మిమ్ము వెంటనే రమ్మనిరి" అని చెప్పెను. నా గుండెలో రాయి పడెను.

వీరితో నాకు పరిచయ భాగ్యము కలిగి ఒక నెల యయినను కాలేదు. ఈ పరిచయము మిగిలిన పరిచయముల వంటిది కాదు. ఇది వైయక్తికముగా గాక కళద్వారమున గలిగిన పరిచయము. ఈ కళ యానంద సంధాయకము. గాన మును తీసివేసినచో రామారావుగారే మిగులుదురు. వారు వైయక్తికముగా గూడ గొప్పవారే కావచ్చును. కాని ఆ సంగతి నాకపరిచితము. రామారావుగారి గాయకత్వము నే నెఱుగుదును. ఇటువంటి మహాగాయకుని పరిచయము గలుగుట యును, వెంటనే... జగత్తంతయు నెంత క్షణికము?

నేనచటికి వెళ్లునప్పటికి రామారావుగారి స్థితి తెలుపిమఱుపుగా నుండెను. శిష్యుల మొగములపై నిత్తరుములులేని మేఘము లాచ్ఛాదించియుండెను. రామా

రావుగారికి ఆ గ్రామమున పలువురు గణికలు శిష్యురాండ్రు కలరు. వారిలో సువదన యనునామె మక్కువ శిష్యురాలు. కాగా, వచ్చి చూచుపోవు స్త్రీలకును బురుషులకును ఎడతెఱపి లేదు.

నేను వారు పడుకొనిన గదిలోని కడుగిడితిని. వైద్యు లమృతమిచ్చు ప్రయత్నములో నగపడిరి. రామారావుగారి మొగము అంధకారములో నంతర్ధాన మగుచున్నటులు కానబడెను. ఫలానా వారు వచ్చిరని శ్రీవిశ్వనాథముగా రన్నగారి చెవిలో నూదిరి. రామారావుగారు వెంటనే కనులువిప్పి "నాపాట వినిపింపలేకపోతిని" అని యనిరి.

"మీపాట నాచెవిలో మ్రోగుచునే యున్న"దని నేనంటిని.

వైద్యు లందఱును తెల్లబోయి మరల నాడిచూచిరి.

సంచికట్లు కట్టిపెట్టి వాకటిలోనికి వెళ్లి కూర్చుండిరి. సందులో సందు చేసుకొని యొకర్కొత్తవా రచ్చటికి వచ్చిరి. వారిని జూడగనే రామారావుగారి మొగము మారిపోయెను. వారు వెంటనే చేతులు జోడించి, "అయ్యా! తమ ఋణము నేను తీర్చికొనలేకపోయితిని; నాకొక సెంటుపొలము లేదు. మీఋణము నుండి యెట్లు విముక్తి బడయగలనా యను నాలోచన తెగకే నా ప్రాణములు పోకున్నవి" అని యనిరి.

"ఎంత ఋణము?" అని నేనంటిని.

"అసలు మూడువేలు" అని ఋణదాత యనెను. విశ్వనాథముగా రిటు లనిరి: "అయ్యా! సుబ్రహ్మణ్యముగారూ! మీఋణమునకు నేను పూటకాపను. ఈ కష్టసమయములో మీరు..."

సుబ్రహ్మణ్యముగారు విశ్వనాథముగారి మాట సాగనీయక "మీ తెవరు పూటకాపు!" అనివేసిరి.

రామారావుగారికి పాదసంవాహనము చేయుచు నిలువబడియున్న సువదన సుబ్రహ్మణ్యముగారిని గనులనిండ జూచెను. విశ్వనాథముగారు తెల్లబోయి "అయ్యా! అన్నగారికిని, నాకును తోడాలున్నవి. నాకు దివాణమున జీతమున్నది. ఇంతియకాక మీఋణము తీరుదాక నేను నిదురపోను." అని యనిరి.

"వడ్డీ నిదురపోదు గాని మనుష్యుడు నిదురపోవడటండీ ?" అని సుబ్రహ్మణ్యముగా రనిరి. 'హరిహరి' అని రామారావుగారు మరల గనులు మూసికొనిరి. మరల వారినాడి భేదించెను. వైద్యులు త్రొక్కిసలాడిరి. సుబ్రహ్మణ్యముగారు కక్కసపడిరి.

నేను సదరు సుబ్రహ్మణ్యముగారి చేతిని బుచ్చుకొని ఒకిమాదిరి బలవంతముగనే వాకటిలోనికి దీసికొని వెళ్లుచుంటిని. ఇంగ్లీషు డాక్టరు మా కెదురు వచ్చెను. నేను సుబ్రహ్మణ్యముగారిని వాకటి యరుగుమీద గూరుచుండ బెట్టితిని. డాక్టరు వెనుదిరిగి నాచెయ్యి పుచ్చుకొని నన్ను మరల లోనికి దీసికొనిపోయెను. రామారావుగారి స్థితి అయోమయముగా నుండెను. డాక్టరు కొంచెము సేపటికి నాచేయి పుచ్చుకొని బలవంతముగా నన్ను వాకిటిలోనికి దీసికొనివచ్చెను. నే నది గ్రహించి వారితో నూరివెలుపటి దాక వెళ్లితిని. అక్కడ వారు నిలువబడి "ఈ రాత్రి గడచునని తోచదు" అని వైద్యరహస్యము వెలిపుచ్చి నన్ను దమయింటి కతిథిగా గొంపోయిరి.

"ఏ నిమిషమున కానిమిష మొకొక్క యుగముగా దోచెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు స్తంభించునటు లగపడెను. గాలి కదలదు. మూర్తపదార్థమంతయు నాకాశమున లయమగుచున్నటు లాయెను. నేను డాక్టరుగారి యింట నొకడ గూర్చుండి దైవమును బ్రార్థించితిని.

మృత్యు వనతిక్రమణీయ మని యందఱు నెఱుగుదురు. కాని ప్రతివాడును దానిని దప్పించుకొనుటకును, ఇతరులను దప్పించుటకును ప్రయత్నించును. మందులతో బనితీరిన తరువాత శేషించిన దొకదైవమే.

ఆపత్సమయమున మన మీశ్వరుని జాలదగ్గరగ జూతుము. అతడు సుదూరమున నున్నటు లుండును. మామూలు సమయములలో మన మాతని దూరమున నున్నటులు చూతుము. కాని యతడెప్పటివలెనే దగ్గఱ దగ్గఱనే యుండును.

ప్రతి యెదబాటునందును ఒక్కొక మృత్యువు కలదని నాకు లోగడ రామారావుగారిని వీడుకొనునపుడే తెలిసి వచ్చెను. ఆ యెదబాటునకు వంతెన యుండెను గాని ఈ యెదబాటునకో ?

రాత్రి జాము ప్రొద్దుపోయెను. నేనొకడనే రామారావుగారిని జూడబోయి తిని. సుబ్రహ్మణ్యముగారు వాకిటి యరుగుమీద దిష్ఠ వేసికొని కూర్చుండిరి. వారిమో మెల్లయు జేగురురంగు కొట్టుకొనియున్నటు లుండెను. కనవచ్చుచున్న యేరి మోముననుకళలేదు. ఏదో గందరగోళము జరిగియుండె ననుకొంటిని. మెలమెల్లగా గదిలోని కరిగితిని. రోగి తక్క మఱి యెవరును లేరు. ముదుసలి మామగారును, పదియేండ్ల భార్యయు దూరముగా మఱియొక గదిలో గూరుచుండి యుండిరి. శిష్యు లందఱును సుబ్రహ్మణ్యముగారిని లేచిపొమ్మని కటువుగా నన మొదలిడిరి.

"రామారావుగారూ !" అని పిలిచితిని. వారు తంగున గనులు విప్పి చూచి చూపులతో నా కాతిథ్య మిచ్చిరి. నేను కూర్చుండు చున్నంతలో సువదన ఆ గదిలోనికి గబగబ వచ్చి, "అయ్యా !" మీరు బెంగపెట్టుకొనకుడు; సుబ్రహ్మణ్యముగారూ ! తమరిటులు లోనికి దయచేయుడు" అని యనెను.

ఋణదాత లోనికి వచ్చెను. ఆయన వెనువెనుకనే విశ్వనాథముగారును, వైద్యులును లోనికి వచ్చిరి.

సువదన యిటు లనెను. "అయ్యా ! సుబ్రహ్మణ్యముగారూ ! ఇవిగో నగలు. నాలుగువేల పైచిలుకు బంగారము. ఈ పెట్టె మీరు తాకట్టు పెట్టు కొనుడు. కానిచో బాకీ రద్దు చేసికొనుడు." అని ఒక్కొక నగ తీసి మరల చేపెట్టెలో పెట్టి ఆయన కిచ్చివేసి నాకేసి తిరిగి "అయ్యా ! తమరు సాక్షి" అని యనెను.

నే నాశ్చర్య సముద్రములో బడిపోతిని. వసంతసేనా చారుదత్తులు నా యెదుట నిలువబడిరి.

ఇంతకుముందు మాటలేని రామారావుగారు 'అమ్మ' యని నిట్టూర్చి బలువుగా 'సువదనా' యని, ఉచ్చరించి కనులు మూసికొనిరి.

'నే నీ నగ లీయకుండినచో మఱి కొంచెము సేపు ఉండెడి వారేమో' యని విలపించిన సువదన మాటలు నా చెవిలో నేటికిని వినిపించుచునే యున్నవి.

[ఇచట ప్రసక్తులయినవారి పేరులు మార్చబడెను.
కారణము సుగమము. వే. శి. శా.]

ఒక గొల్లగూడెము. దానికి బరుగు దూరము మేరలో నొకపంట చెరువు. దాని క్రింద నొక చిన్న యారామము. దాని చుట్టును చొరరాని యావరణము. దానిలో నొక పెద్ద మఱ్ఱి. దాని క్రింద నొక బైరాగి. స్థావరమగు మఱ్ఱి క్రింద జంగమమగు మఱ్ఱి.

ఆ దారిని రాకపోకలు చేయుచు పలుమారులు నే నా నడమఱ్ఱిని జూచు చుంటిని. అదియు నన్ను జూచుచుండెను.

ఒకనాడా మఱ్ఱి క్రింద బైరాగుల సమ్మేళనము; మఱియొకనాడు స్త్రీసభ; ఇంకొకనాడు సార్వజనిక సమ్మేళనము. వృక్షాగ్రమున పక్షుల అవ్యక్త ధ్వని; చెట్టుక్రింద సాధువుల అవ్యక్త ధ్వని.

నాకు లోనికి వెళ్లవలయునని కుతూహలము కలిగెను. వెళ్లుట కుపా యము ? వెళ్లి ... ఇటులు కౌతుక సందేహములు కాలమును గడపెను.

ఆ నడమఱ్ఱి కూరగాయ లమ్మునని తెలిసెను. ఇంకేమి ? రాచబాట దొరికెను.

ఒక రూపాయ చూపి లోని కేగితిని. పలువురు సాధువుల నడుమ గూర్చుండి ఆ బైరాగి గంజాయి పీల్చుట కాయత్తు దగుచుండెను. నే నీలోపుగా వట ప్రదక్షిణమున కాయత్తుడ నయితిని. ప్రదక్షిణము చేయుటకు వటము చుట్టును వలయాకారముగా ఊడలతో గోడ యేర్పాటు చేయబడెను. దీనికి మూడు గజముల యెడమున మఱొకటి. ఇది స్త్రీలకు. ఈ మార్గమున గోడగా నేర్పడిన ప్రతి యూడక్రిందను ఒక్కొక్క పుట్ట కలదు. ప్రతి పుట్టయు ఫల పుష్పములతోడను, కుంకుమచందనములతోడను పూజాపురస్కారము లందు కొనుచుండెను. ఈ రెండు మార్గములును వటమూలమునకు గొంపోవును. అచట ఊడలమీద మట్టిమేగి యేర్పఱచిన గోడలమీద సజీవములైన యూడలనే పైకప్పుగా నమర్చి డాబాచేసి దానిమీద మఱొక గదికట్టి దానిని ద్విభూమమగు ప్రాసాదముగా చేసిన ఆ బైరాగి శిల్పము మన కబ్బురము కలిగించును. క్రిందిది సమాధి గృహము, పయిది నిద్రాగృహము.

ఆ యారామము సుమా రొక యెకరముమేర ఆక్రమించి యుండ వచ్చును. కాని పది యెకరములలో నుండదగిన చెట్లందుండుటజేసి వాని క్రింద వానినీడకు గూడ తావులేదు.

నేను వటప్రదక్షిణము చేసి సాధుబృందము కడకు వచ్చి కూరుచుంటిని. కలుగబోవు చిత్తైకాగ్రతకు సూచకమగు జెండావలె గంజాయిపొగ అంబరవీధిలో మీదిమీది కెగసి పీడకలవలె నంతరించెను. జన్మాంతర వాసనవలె దానివాసన నన్ను బట్టుకొని వదలలేదు. కొంతసేపటికి అచటి స్థలాకాశములు రెండును నిర్మలము లాయెను. సాధువుల ముఖముద్ర నిద్రాభిముఖ మగుడు ఆ బైరాగి 'భం మహాదేవ' అని ఒకఅఱ పఱచెను. సాధువులందఱు నతని ననుకరించిరి. చెట్టుమీది పిట్టలన్నియు తుపాకీదెబ్బ కెగిరిపోయినటు లెగిరిపోయెను. ఆ మట్టి గూడ ఆకులచే నంబరకేశ నాహ్వానించెను. పిదప నతడు "మట్టిలో తొట్టి, తొట్టిలో పర్ర, పర్రే పంచభూతాల జీవగర్ర, అంతా సింగినాదం జీలకర్ర." అని ఉపన్యసించెను. సాధువు లందఱును అత్యానందమును వెలిబుచ్చిరి.

అక్కడనున్న చాకిసాధు వొకడు "పర్రే పంచభూతాల జీవగర్ర యేమిటి?" అని ప్రశ్నించెను.

ఈతడు క్రోసుమేరనున్న ఒకయూరినుండి దైనందినమును జిజ్ఞాసువై అక్కడికి వచ్చుచుండును. ప్రశ్నించుటయే అతని పని. ఈ ప్రశ్న పడగనే బైరాగి "పర్రే జీవగర్ర. సొరబుర్ర పెద్ద నెర్ర. ఓరి కుర్ర" అని ప్రత్యుత్తరించెను.

సాధువు లందఱు పకపకా నవ్విరి. చాకికి మాత్రము సంశయము తీర లేదు. దాన నతడు నాకేసి తిరిగి "అయ్యా, తమరు తెలిసినవారు, మర్రే జీవగర్రగాని పర్ర జీవగర్రా?" అని అడిగెను. నేను నా అజ్ఞానము నివేదించితిని. అంత బైరాగికి కోప మెత్తుకొనివచ్చెను. "ఇదిగో పర్రే జీవగర్ర. చాకలోడికి నా పిర్ర" అని అభినయించెను. సాధువు లందఱును చాకిసాధువును పరిహసించిరి.

ఈ రీతిగా నాటి తత్త్వసభ ముగిసెను. బైరాగి అందఱి తలలపై నక్షతలు చల్లి తనపైగూడ జల్లుకొనెను. వెంటనే యతడొక కలుగుప్రక్క

గూర్చుండి ముక్కుమూసికొని ఒకానొక శబ్దము చేసెను. కొన్ని యెలుక లాకలుగునుండి వెలువడి అతని జటాజూటముమీదికెక్కి అక్షతలను దినిపోయెను. ఈ వినోదమును జూచి నేను నా కుటీరమునకు మరలితిని.

నాటిరేయి తీరికగా కూర్చుండి యీ బైరాగి భాష కర్థ మాలోచింప దొడగితిని. చట్టున అథర్వణములోని—

"కస్మిన్నఙ్గే తిష్ఠతి భూమిరస్య
కస్మిన్నఙ్గే తిష్ఠతి అంతరిక్షమ్,
కస్మిన్నఙ్గే తిష్ఠతి ఆహితోద్యౌః
కస్మిన్నఙ్గే తిష్ఠతి ఉత్తరం దివః."

అను సూక్తము స్మృతికి దవిలెను. అంతట మ్రియనగా దైవమనియు, తొర్ర యనగా అవ్యక్తమనియు అర్థము చెప్పుకొని సరిపెట్టుకొంటిని. కాని మరల నాబైరాగి కడకు వెళ్లినపు డాతనితో జరిగిన సంభాషణలకు ఫలముగా ఆతని మాటలలోగాని, బోధలలోగాని లోతులకు దిగవలసిన పని యుండదని తెలిసికొంటిని. ఆతడు తత్త్వప్రసంగములు చేయునపుడెల అనర్థకములగు రూపకాతిశయోక్తులలో అంత్యప్రాసములుకల శబ్దముల నతికి దిగ్భ్రాంతి కలిగించుచు వాక్సముద్రము నుబికించుచుండును. చాకిసాధువు దర్భశయనముచేసి ప్రశ్న బాణముల బరగించుచుండును.

ఇటు పిమ్మట నాకును, బైరాగికిని తత్త్వచింతలోగాక కూరగాయల చింతలో సంబంధము కలిగెను. ఖాతాకూడ నేర్పడెను. బైరాగికి గంజాయి కావలెను. నాకు కూరగాయలు కావలెను. గంజాయి కావలసినపుడెల్ల ఆ బైరాగి నా కక్కరలేకున్నను సుమా రిరువది సపోటాలు పంపి రూపాయ వసూలుచేయ మొదలిడెను. ఇది నా కిబ్బందిగా నుండెను. '25వ సంవత్సరమున తుపానుకు అతని ఆరటితోటయంతయు దాటాదూట మాయెను. విఱిగిన వేయనటిపిండెల గెల యొకటి శిష్యునిచే బంపి రూపాయ ఆఱణాలకు హుండీ పంపించెను. నే నా పనికిమాలిన గెలను దూరముగానుంచి నా కోరని వస్తువేదియు నిక బంపవలదని మీగురువుతో జెప్పుమని అతని నంపితిని. పదినాళ్లు దాటిన పిదప ఆ బైరాగి నిండువేసముతో నా కుటీరమధ్యమునకు వచ్చి కూర్చుండి ప్రాణాయామ

మొనర్చి వెంటనే ధ్యాననిద్రనుండి లేచి కనులెఱ్ఱజేసికొని 'రూపాయ ఆఱణాలు' అని గర్జించెను. నేను శాంతిమార్గ మవలంబించితిని గాని లాభము లేకపోయెను. తుదకు శాతనదండము చేకొంటిని. నన్నతడు బిగ్గఱగా శపించి ఆ శాపాక్షరముల అక్షరాల నడపుటకు సూర్యు నామంత్రించి ఆకసము జూచుచు పాఱిపోయెను.

సూర్యు డతని శాప మమలు పఱుపక పోవుటచే గాబోలు నాతడే కొన్నాళ్లకు స్వయముగా వచ్చెను. నేనపుడు కొండనెత్తమునుండి దిగుచుంటిని. అంధకార మపుడే అతనికి దోడుపడెను. కాని బైరాగి నా కంటబడెను. అతడు కంచెకాల్దరినుండి నా కుటీరమును తొంగితొంగి చూచుచుండెను. నేను గబగబా పైనుండి దిగితిని.

అతడు చేతికి దొరికిన రాలుపుచ్చుకొని కుటీరము మీదికి విసిరి ప్రత్యుత్తరమున కపేక్షించుచుండెను. ఇంతలో ననపేక్షితముగా నేనతని వెనువెనుకనే యుండి కొన్ని చిన్న గులకరా లతనిమీద విసరితిని. అతడు వెనుదిరిగి చూచి వెఱగుపడి పాఱిపోయెను. నేను వెంటాడితిని గాని అతనిని పట్టుకొనలేకపోతిని. ఆ మఱునా డాతడు చాకిసాధువు నాపాకమీద రాలురువ్వె నని ప్రచారముచేసెను. ఆ చాకిసాధు వాయకార్యము తానే చేసినటుల పెద్దలముం దొప్పుకొనెనట.

అటుపిమ్మట కొన్నియేండ్లవఱకును మా ఇరువురకు సమావేశము కలుగలేదు. నే నొకనా డొక రాదారిని బోవుచుంటిని. ఆ రాదారి ప్రక్క పెంటపాడు బైరాగుల మఠము కలదు. హఠాత్తుగా అచట నా బైరాగి!

అత డామఠములోనుండి వచ్చుచుండెను. అతని కొఱ కొకడు బయట బొంచుండెను. బైరాగి కాలు గడప కీవలబడెను. పొంచున్న యతడతని గడ్డము పట్టి అటునిటు జాడింపదొడగెను. బైరాగి 'చస్తి చస్తి' అని యార్చెను. గబాలున నే నాయిరువుర నడుమ కుఱికితిని. అతని గడ్డములో గుప్పెడు వెంట్రుక లూడిన పిదపగాని నేనతనికి ముక్తి కలిగింపలేకపోతిని.

ఆత డామఠములో గంజాయి దొంగిలెను. దానికి శాస్తిగా ముఖమునందలి కంబళినుండి కొన్ని వెంట్రుకలే కాక గడ్డమునందలి కొంత రక్తమును గూడ నత డీయవలసి వచ్చెను. అతడు నన్ను చాటు చేసికొని వెనుదిరిగి

చూచుచు ఒక క్రోసుమేర వచ్చెను. అక్కడ గ్రామసీమ మేమిరువుర మొంచొండ మాటాడకుండ మామాదారుల బోయితిమి. అతడీ దొంగతనమును గూడ చాకి శిష్యునిపై మోపెను. అత డొప్పుకొనెను. గురువు నపరాధము లన్నిటిని నిశ్చలముగా మోయు నీచాకివా డెదురుపడినపుడెల్ల నా మేను పులకరించిపోయెడిది.

కొన్నాళ్లకు పలువురు లక్ష్మీపుత్రు లాబైరాగికి శిష్యులయిరి. దాన నతడు గంజాయి దొంగిలుట మానివేసెను. ఆ శిష్యు లొక్కొక్కరొక్కొక్కయే డొక్కనాడు ఆ మర్రిక్రింద అష్టాదశ వర్ణములవారికిని సంతర్పణ మొనర్ప జూనిరి. అందులకు దెచ్చిన సంభారములలో గొన్ని మాయమాయెను. ఉన్నాడు కదా పాపాలకెల్ల భైరవుడు! బైరాగి చాకిహానిమీద నా దొంగతనము మోపుటయు, నత డొప్పుకొనుటయు, దానికి ఫలముగా శాస్తి యనుభవించుటయు జరిగిపోయెను.

కొలదినాళ్లలోనే ఆ చాకిసాధువు శరీరము చాలించెను. పుచ్చు కుక్క నీడ్చి పాఱవేసినటు లాతని శరీరము నా మర్రి క్రింది నుండి యీడ్చి పాఱవైచిరి.

అటుపిమ్మట నయిదాఱేండ్లకు నే నాబైరాగి తోటప్రక్కనుండి పోవుట తటస్థించెను. అచట నా కాచాకి సాధువు గుఱుతు దవిలెను. అతడచట ధ్యానము చేసికొను నేల బొరియ చూడ గోరిక కలిగెను. (ఇది పవాహారి బాబా గంగయొ ద్రవ్వుకొనిన బొరియవంటిది.) అంతట లోని కరిగితిని.

బైరాగి కంకాపొంకములుగా జ్వరము కాయుచున్నదని తెలియవచ్చెను. నే నతని శయ్య కడ కరిగితిని. అతడు సంధిలో నుండెను. నే నపుడతనికి నారాయణు నందించితిని. అతడు 'గంజాయి గంజాయి' అని యనెను. నే నచట నుండి చాకిసాధువు నేలబొరియ కడ కరిగితిని. దాని నెవరో బూడ్చివైచిరి.

మఱి పదిరోజుల కాబైరాగి మరణించెను. శిష్యు లెందఱో చేరి యాశవము నలంకరించి పెండ్లికొడుకు నూరేగించిన ట్లూరేగించిరి. పిమ్మట నచట నొక సమాధి కట్టించిరి!

# 10. పుస్తకం

పుస్తకం గురువునూ, స్నేహితుడునూ, ప్రియురాలున్నూ. ఒక శాస్త్ర గ్రంథం తీసుకోండి; అది చేతిలో ఉన్నంతసేపూ గురువు మన యెదుట ఉన్నట్లే వుంటుంది. ఏదో కావ్యమూ, నాటకమూ తీసుకోండి; స్నేహితుడిలాగానూ, ప్రియురాలిలాగానూ, లేక ఇంకో ఆత్మలాగానూ, ఛాయలాగానూ కూడాకూడా వస్తూ వుంటుంది.

పూర్వకాలంలో తాటాకులమీదా, భూర్జపత్రాలమీదా గంటాలతో వ్రాసేవారు. ఆ యాకులు లేతవి కాకుండానూ, చాలాకాలం మనేవిగానూ ఉండేటట్లు కొలతలుపట్టి కోసి బహు ఓర్పుతో ముత్యాలు వాటిమీద ఒలకపోసి, పుస్తకానికి రెండుపక్కలా అట్టలక్రింద బల్లలుకట్టి ఆకాశవిధి చేసేవారు. పిల్లవానిమీదకంటె ఎక్కువ వాత్సల్యంతో దింపి చదువుకొని శత్రువును కట్టినట్లు కట్టిపెట్టి మళ్లా డోలోత్సవం చేస్తూండేవారు. ఈలా ఒక్కొక్క గ్రంథం వ్రాయడానికి కొన్ని యేండ్లు పట్టేది.

భారతం వ్యాసుడు చెప్పాడు, గణపతి వ్రాశాడు. 'ఏమి చెప్పదుం గురునాథా!' అనే ఇతిహాసంవల్ల తిక్కన చెప్పాడు- కుమ్మర గురునాథుడు వ్రాశాడు అనిన్నీ వింటాం. గంటంతో వ్రాసే వానికి చురుకైనకవి అక్షరాలందించడం మనుష్యప్రజ్ఞ కతీతమో కాదో తెలుసుకోవడానికి అవకాశం లేకుండా పోయింది. ఈలా వ్రాయబడే యీ గ్రంథాలు కొన్ని శరీరంలో అతికాయులను మహాకాయులను దాటిపోయేవి.

మనదేశంలో త్రికాలజ్ఞులు, మయబ్రహ్మలూ ఎంతమందివున్నా అచ్చు కనిపెట్టారు కారు. తెలిసే కనిపెట్టలేదని దేశభక్తులూ దైవభక్తులూ కొందరు చెపుతూవుంటారు. ఎంచేతనంటే, అస లిన్ని పుస్తకాలూ, ఈ పుస్తకాల కింత ప్రచారమూ అక్కరలేదు. కాబట్టి అచ్చు మరలతో ఏమి ప్రయోజనం? ఇంతే కాక పుస్తకం ఎవడు పడితే వాడు చదువగూడదు.

ఈ కలికాలంలో పుస్తకాలు ముందు అంగుష్ఠమాత్ర ప్రమాణంలోకి దిగాయి. ఇవి చాలాచాలా సుకుమారాలూ, సుందరాలూ. "పుస్తకం హస్త భూషణం" అనే మాట వాచ్యంగా వీటికి చెలామణీ అవుతుంది. కాని వీట్ల ఆయుర్దాయం దరహంమీద చాలా తక్కువ. ప్రాచీనకాలంలో ఇంత కష్టపడి వ్రాసుకున్న గ్రంథాలను కూడా దుర్వినియోగం చేసే వారున్నా రనేందుకు ఈ క్రింది కథ ఒక మంచి ఉదాహరణం:

"వ్యాకరణశాస్త్రం ఆరంభించిన కుర్రవా డొకడు 'నాన్నా! నాన్నా! కయ్యటం వ్రాయించి పెట్టు' అని తండ్రిని ఏడిపించటం మొదలుపెట్టాట్ట. 'అ ఇ ఉ ణ్' మొదలుపెట్టావో లేదో అప్పుడే నీకు కయ్యటం ఎందుకురా? అని తండ్రి గదమాయించాడు. అంతటితో కొడుకు సత్యాగ్రహంలో ప్రధాన భాగ మయిన నిరశనవ్రతమే కాకుండా నిర్నిద్రవ్రతమూ, అహింసాపూర్ణంగా ఆత్మోపాలంభనమూ, సర్వాంగీణంగా రోదనమూ అవలంబించుకున్నాడు.

వీడేమో చదివేద్దున్నా డనుకొని తండ్రి చాలాధనం వ్యయపరచి కయ్యటం వ్రాయించి కొడుకిచ్చాడు.

కయ్యటం అనేది ఒక వ్యాకరణ గ్రంథం. అది ఒక మనిషి మోతకు కొంచెం ఎక్కువ! కొడుకు ఆ గ్రంథం ఎగాదిగా చూచి, చాలా సంతోషించి "నాన్నా! నాన్నా! నాకో గది కావాలి!" అని అన్నాడు. కొడుకు నిర్విఘ్నంగా చదువుకుంటాడని తండ్రి ఒక గది కాళీచేసి యిచ్చాడు. ఆ కుర్రవాడు ఆ కయ్యటంతో ఆ చదువులగదిలో ప్రవేశించి తలుపులు మూసుకున్నాడు. వాడు తెగ చదువుతున్నాడని ఇంటిల్లిపాదీ అనుకుంటున్నారు. ఇల్లా చాలా కాలం గడిచిపోయింది.

కుర్రాడిల్లా తెగ చదివితే పిచ్చెక్కిపోతుందని తండ్రి తలుపులు తియ్యమని నడుమ నడుమ పిలుస్తూండేవాడు. కాని కుర్రాడు ఏక టాకీమీదవుండి సమాధానం ఇచ్చేవాడు కాదు. తండ్రి ఒకనాడు పిలిచి పిలిచి విసుగెత్తి ఏమిటో ఈ వ్యవహారం చూదామని ఉరకెత్తాడు. శేషశాయిలా వుంచి కొడుకు వ్యవహారం! కయ్యటం కొంత కాళ్ళకిందా, కొంత తలకిందా వేసుకొని కొడుకు సుఖనిద్రలో వున్నాడు. 'కయ్యటం మొదలెయ్యంగానే కంటి నిండా నిద్ర' అనే

సామెత ఆనాటినుంచి వ్యవహారంలోకి వచ్చింది. పరుల గ్రంథాలను కూడా ఈలా దుర్వ్యవహారం చేసే వారుండే వారు!

"పుస్తకం వనితా విత్తం పరహస్తం గతం గతః
అథవా పునరాయాతి జీర్ణం భ్రష్టా చ ఖండశః"

అనే సూక్తి పుట్టింది. పుస్తకమూ, ఆడదీ, డబ్బూ - ఈ మూడూ పరుల చేతులలోకి పోతే ఇహ పోయినట్టేట! ఒకవేళ వస్తేగిస్తే, పుస్తకం తుక్కుతుక్కై వస్తుందిట! ఆడది వస్తే భ్రష్టురాలై వస్తుందిట! డబ్బువస్తే అప్పుడో కాస్తా, అప్పుడో కాస్తాగా వస్తుందిట. ఈ శ్లోకంలో ఉదాహరింపబడ్డ పుస్తకం అచ్చు పుస్తకం కాదు; తాటాకుల పుస్తకం. దాన్నే తుక్కుతుక్కుగా చేయంగల మహాత్ములు ఆ కాలంలో ఉండేవారన్నమాట!

ఆడంగులు కొందరు ఈ కాలంలోని పుస్తకాల కాకితాలు కొన్ని చింపి పొయ్యిలో పెట్టుకుంటుంటే, మగవాళ్లు కొన్ని కాకితాలు చింపి మందుపొట్లాలు వగైరా కుపయోగిస్తున్నారు. కొందరు మగవాళ్ళు కొన్ని పొడుగుపాటి పుస్తకాలను బంతులు కొట్టడానికి 'బ్యాట్'లుగా ఉపయోగిస్తున్నారు. కొంద రాడవాళ్ళు పుస్తకాలలోనే గనక బొమ్మలుంటే వాట్లను విరిచి వాళ్ళ పిల్లల యేడ్పు పోగొడ్తారు. కొందరు ఇంకోళ్ళ పుస్తకాలలోని బొమ్మలు చింపి, దాచుకొని ఏ తొందరలోనో వాపస్‌చేసి దాటుకుపోతారు. కొంద రీ పుస్తకాలను తల దిండ్లుగానూ, కుర్చీలలో మెత్తగానూ వాడుకుంటారు. పూర్వకాలంలో ఆడవాళ్ళు వాకిట ఉన్నపుడు మోచెయ్యో లేక గడ్డి దిండో తలకింద పెట్టుకునేవారు. నేటి పూర్వాచారం వారు పేపర్లు కొన్ని కొన్ని కట్టకట్టి దిండుగా వాడి పేడనీళ్ల చల్లి వాటిని కలుపుకుంటున్నారు. నవీనాచారంవారు పుస్తకాలను నిరాఘాటంగా దిండ్లు చేసేసుకుంటున్నారు.

పూర్వకాలంలో కూడా తాటాకు పుస్తకాలు మడే! ఈ కాలపు పుస్తకాలు మరలలో మెదగడంవల్లా, అద్దమైనవాళ్లూ దారాలతో కుట్టడంవల్లా మడికావు. అందుకని కొందరు తాటాకుల పుస్తకం మాత్రమే పెట్టి సరస్వతీపూజ చేసుకుంటారు. కొోట్టలు పుస్తకాన్ని ప్రమాణం కింద ఉపయోగించి సర్వకాల సర్వా

వస్తులలోనూ అచ్చు పుస్తకం మడి అని 'లా' చేసేసినయి. అది నెత్తిమీద పెట్టు కునే సరికల్లా అసత్యాలన్నీ సత్యాల కింద మారిపోతయి.

ఇప్పుడు మగవాళ్లకంటే ఆడవాళ్లకే పుస్తకాలెక్కువ ఉపయోగిస్తున్నట్లు చూస్తా. హస్తభూషణమైన పుస్తకం ఈ కాలంలో ఆడవాళ్లకు 'పాకసాధనం'.

ఆడవాళ్లకు మగవాళ్ల దయవల్ల చదువుకని వేరే తీరిక వుండదు. వాళ్లు మడిగట్టుకొని, గిన్నె పొయిమీద పడేసి, ఏ కుర్రాడి చేతో పుస్తకం చేతుల్లో పడేయించుకుంటారు. వాళ్ల చేతులు నడుమనడుమ నిప్పు నీరూ మొదలయిన భూతాలతోటీ, నేయి నూనె మొదలయిన స్నేహ ద్రవ్యాలతోటీ, ఉప్పు కారం మొదలయిన షడ్రసాలతోటీ మెదుగుతూ ఉండవలసినందువల్ల, వాట్ల గుణాలన్నీ ఎప్పటికప్పుడు పుస్తకాలకు కూడా సంక్రమిస్తయి. పొయ్యి ఊదవలసివస్తే విసినికర్రై రెక్కలు తెరుచుకుంటుంది. పిల్ల లేడిస్తే బెత్తంగా మారుతుంది. మళ్లా ఆ పిల్లాళ్ల కన్నీళ్లు తుడవటానికి చే రుమాలవుతుంది. ఇంతలో మగడు వచ్చి 'ఈ పాడు చదువులతోటి వంటంతా మంటవుతుంది' అని ఉరిమితే పాపం అలుగ్గుడయి పోతుంది.

కొంద రాడవాళ్లు ఈ మగవాళ్ల అధికారానికి జంకి పడుకునేటప్పుడు మాత్రం పుస్తకాలు విప్పుతారు. కొంచెం సేపట్లోనే నిద్రాదేవి వచ్చి యీ సరస్వతీదేవిని ఓడించేస్తుంది. ఆ పళంగా పుస్తకమూ తెరుచుకున్న పళంగా అప్పచ్చి అయిపోతుంది. కాని కొందరు జాగ్రత్తగా తలకిందికి తా సేసుకుంటారు. పుస్తకాలలో చదువు, వారి తలలోకి ఎక్కదు. కాని వారి తలల్లోని వారి పరి మళ నూనో, కొబ్బరి నూనో సరస్వతి కూడా రాసుకుంటుంది.

కొందరు చదువుకున్నంతసేపూ చదువుకొని, పుస్తకాలను నీటిబిందెల మీద మూతలుగా ఉపయోగిస్తారు. ఒకానొకప్పుడు బిందెలో జలక్రీడ చేయటం కూడా కద్దు. అనుకోని పెద్ద మనుష లెవళ్లో హఠాత్తుగా రావడంవల్ల ఆ పుస్త కాలు ఆకాశయానంచేసి, ఏ మారుమూలో చుక్క తెగిపడ్డట్టు అట్టలువిరిగి, కోణాలు చితికి, ధ్వనిభేదాలతో దుఃఖించి మట్టిముద్దయిపోతాయి. ప్రాచీనాచార పరాయణులకు గ్రంథాలమీద భక్తి ఎక్కువ. వాళ్లేదైనా అపూర్వగ్రంథం తీసు కుంటే వాళ్లదగ్గరనుంచి మరి రాదు. వారికి గ్రంథకర్తా గ్రంథమూ ఒక్కటే.

మాతో మహాభాష్యం చదివే వారొక రుండేవారు. నరకప్రయాణం చేస్తున్నపుడు ఆయన మహాభాష్యాన్ని నెత్తిమీదినుంచి దింపేవారు కాదు. ఆయ నేదైనా చిన్నపని చేయవలసివస్తే, దాన్ని నేలమీద పెట్టక ఇంకోరి నెత్తిమీద పెట్టేవారు. పతంజలి తరువాత పతంజలి అంతవాడు నాగేశభట్టు. "శబ్దేందు శేఖరః పుత్రో, మంజూషా మమ పుత్త్రికా" అన్నాడు. పుస్తకాలు ఈలాటి పూజాపురస్కారాలూ అత్యాచారాలు ఎన్నో అనుభవిస్తున్నాయి. లోకులు కొన్ని కొన్ని వస్తువులు పుచ్చుకోవడమూ, తిరిగీ ఇచ్చివేయడమూ మామూలు. పారలూ గునపాలూ మొదలయిన వ్యవసాయపు పనిముట్లూ, చేటలూ జల్లెడలూ మొదలయిన గృహవస్తువులూ అందరూ తెచ్చుకోవడమూ మళ్లా ఇచ్చివేయడమూ కద్దు. ఈ యిచ్చిపుచ్చుకోడాలు లేకపోతే లోకవ్యవహారం స్తంభించిపోతుంది.

ధనధాన్యాలు కాలం జరిగినకొద్దీ వడ్డీలచేతా, నాములచేతా పెరిగీ పెరిగీ తిరిగీ యివ్వబోయేసరికి ఇబ్బడి ముబ్బడి అయిపోతయ్. పుస్తకం మాత్రం ఆసామీ చేతుల్లోకి వెళ్లే యోగం వుంటే చిక్కి శల్యమై మాసి మరీ పోతుంది.

తీసుకున్న వస్తువును ఇద్దామని లోలోపల అనుకున్నా ఇవ్వడం మరిచిపోయేవాళ్లు పూర్వజన్మలోగాని, ఈ జన్మలోగాని దొంగతనానికి అలవాటు పడ్డవాళ్లని 'సైకో మెసలిస్టులు' చెబుతారు. ఇది పుస్తకాలతో మనకున్న బాహ్య పరిచయం !!



# 11. యోగదర్శనము

## ౧

హిరణ్యగర్భుఁడు యోగమునకు మొదటి ఉపదేశకుఁడు. పిదపఁ బిదప యోగి యాజ్ఞవల్క్యాదులు యోగమును ప్రపంచించిరి. తరువాత పతంజలి సూత్రీకరించెను. ఈ సూత్రములకు యోగదర్శనమని పేరు. దీనికి (౧) భాష్యకర్త వ్యాసులు. పతంజలి కాలనిర్దేశము సులభము కాదు. సాంఖ్యసూత్రములకును బ్రహ్మసూత్రములకును నడుమ ఇతఁడున్నాఁడని చెప్పుట క్షేమము. ఈ సూత్రములలో బౌద్ధమతఖండనము ఉండుటచే పతంజలి కది ప్రాచీనము. యోగదర్శనమునకు ప్రత్యక్షమును అనుమానమును, (౨) ఆగమమును ప్రమాణము. కాన కణాదుఁడును గౌతముఁడును ఇతనికి ప్రాచీనులో కారో చెప్పుటకు మాత్ర మాలోచింపవలెను.

సాంఖ్యము గ్రహించిన ఇరువదియయిదు తత్త్వములతో యోగ మింకొక తత్త్వమును (౩) గ్రహించెను. కాన ఇందు తత్త్వము లిరువదియాఱు. ఇంత

---

(౧) సూత్రముల మీదను భాష్యముమీఁదను ౨౬ వ్యాఖ్యలు కనిపించుచున్నటులు శ్రీ రాజేంద్రలాల్ మిత్రగారు వ్రాసిరి. ఇంకను ఉన్నవి. ఈ కాలమున రచితమయిన వానిలో శ్రీ హరిహరానందారణ్యుల భాస్వతీవృత్తి చెప్పుకోదగినది. తెలుఁగులో ఓమండూరు దొర సామయ్య గారి వ్యాఖ్య కలదు. శ్రీ. తి. కం. తిరువెంగడాచార్యులవారి తెలుఁగు వ్యాఖ్య దొడ్డది. ఒక చేతితో ఇంతవఱకు అయిదు దర్శనములను వ్రాసిన పండిత గోపదేవుల తెలుఁగు యోగదర్శనము సులభగ్రాహ్యము. ఇవికాక నా చూడనివి ఇంకను ఉండవచ్చును.

(౨) యోగులు సాంఖ్యులవలె మూలకారణము ననుమానముచే సిద్ధమొనర్తురుగాన వీరికి ముఖ్య ప్రమాణ మనుమానము. పిదప ఆగమము—ఆగమానుమాన ధ్యానములు ఉత్తమయోగసిద్ధి కావశ్యకము లని వ్యాసులు (౧-౪౮). ఈ మూఁడును శ్రవణ మనన నిదిధ్యాసనము లని వాచస్పతి (౧-౧౨).

(౩) రాధాకృష్ణులు- 'Indian Philosophy, Vol ii-342 - పుటలో The twentyfive principles are accepted by the Yoga which does not care to argue about them' అని వ్రాసిరి. ఉపాదానముగాని నిమిత్తముగాని కాని ఈ పురుష విశేషుని జాతిపరముగా చేకొనిగాని కొండొక ఉద్దేశముతోఁగాని పై రిటుల వ్రాసియుందురు.

మాత్రమున ఈ రెండును వేఱుకావు. కావుననే దీనికి సాంఖ్యప్రవచనమని పేరు. సాంఖ్యము విశ్లేషించి చెప్పిన తత్త్వములను సాక్షాత్కరించుకొనుటకు ఉపాయమైన ధ్యానమును యోగము చెప్పెను. ప్రధానము తక్క తక్కిన తత్త్వముల నన్నింటిని ఈ ధ్యానముచే సాక్షాత్కరించుకొనవచ్చును.

పురుషతత్త్వము తక్క తక్కు తత్త్వము లన్నియు పరిణామము చెందుచున్నను నిత్యములు. ప్రలయమునందు ఇరువదిమూఁడు తత్త్వములు ప్రకృతిలో లయించును. ప్రకృతి పురుష తత్త్వములు రెండును పరమనిత్యము. మిగిలినవి ఆపేక్షికనిత్యములు.

## పురుషుఁడు

ఒక్క పురుషతత్త్వముతక్క తక్కిన తత్త్వము లన్నియు పరిణామి తత్త్వములు. పురుషతత్త్వ మపరిణామి. పురుషునకు పుట్టు సావులుగాని రూపాంతరముగాని లేదు. ఇతఁ డెపుడును మాఱక ఒక తెఱఁగుననే యుండును. ఇపుడు చిత్ స్వరూపుఁడు. అనఁగా ఇతని స్వరూపము జ్ఞానము. జ్ఞానము ఇతని స్వరూపము కాని ధర్మము కాదు. అనగా జ్ఞానమున కితఁ డాశ్రయము కాఁడు. ఈ జ్ఞాన మొకపు డుండి ఒకపుడు పోవునది కాదు. వెలుఁగు దేనికి స్వభావమో దానిలో చీకటి సుంతయేని ఉండదు. విషయ సన్నిధానమున జ్ఞాన మితనికి కలుగునది కాదు. అటులు కలిగెనేని ఇతని స్వభావము చిద్రూపము అయ్యేడిది కాదు. ప్రపంచ సన్నిధానమున సూర్యునకు భాస్వరత్వము కలుగలేదు. ప్రపంచము ఉండుఁగాక పోవుఁగాక, సూర్యుఁడు ప్రకాశించుచునే యుండును. దేనికేది స్వభావమో అది పోదు. పురుషుఁడు స్వప్రకాశుఁడు. పురుషుఁడు సదా జ్ఞాతవిషయుఁడు. చిత్తమున ఏవృత్తి కలిగినను అది పురుషునకు తెలియును. పురుషుఁ డపరిణామి యని యనుట కిది అనుమాపకము. ఈ చిత్తమున కొకపుడు తెలియుటయు ఒకపుడు తెలియక పోవుటయు కలదు. పరిణామికి ఇది స్వభావము. పురుషుఁడు జ్ఞానస్వరూపుఁడు. కాన అతని జ్ఞానమున కెన్నడును టొంపులేదు.

పురుషునిలో వ్యాపారము సంచరింపదు. క్రియ లేకపోయియు ప్రకాశరూపతయే పురుషుని స్వరూపము. వ్యాపార మితనిలో గలదనుచో నితనిలో

శక్తియు (౪) ఉండవలసివచ్చును. శక్తియు పురుషుఁడును వేఱు వేఱు. శక్తి పరిణమించును. పురుషుఁడో పరిణమించువాఁడు కాఁడు.

క్రియ యున్నచోట రూపాంతరము కలుగును. దాన నవస్థాంతర ప్రాప్తి. నేలలో పాఁతిన విత్తు చెట్టుగా పరిణమించును. చెట్టు విత్తుయొక్క స్ఫుటమగు రూపము. విత్తు చెట్టుయొక్క అస్ఫుటరూపము. ఈ పరిణామ మూలమున బీజ శక్తియు శక్తివ్యాపారమును కలవు. బీజము ఘనీభూతమైన శక్తి విశేషము. విత్తు రూపు చెట్టుగా మాఱును. ఇది పరిణామము. పరిణామ విశేష మేమియును లేమి పురుషుఁడు దృశిమాత్రుఁడని చెప్పబడును. అనఁగా వికారము పొందని ద్రష్ట. ద్రష్ట ఎప్పుడును స్వద్రష్ట. మరియు నితఁడు స్వబోధకు కరణముల అపేక్ష లేనివాడు. మన మాటలందును చేఁతలందును 'నేను' అను భావము దబ్బనముతో తాడువలె అనుస్యూతమయి యుండును. ఇది బుద్ధి విశేషము. దీనికి కరణాపేక్ష కలదు. ఈ 'నేను' అను భావమున కేది ఏది మూలమో దానికిని మఱి యేది వెనుకఁ గలదో దేనిని జెప్పుటకు ప్రయత్నింతుమో అలదానికి కరణములతో పనిలేదు. కరణమునకు విషయము దృశ్యము. కరణముకూడ దృశ్యము. కాన ద్రష్ట కరణమునకు అవిషయము. ద్రష్టలోని ద్రష్టృస్వరూపబోధ స్వబోధ. ద్రష్ట యన స్వద్రష్ట. అనఁగా 'నేను జ్ఞాతను' అను స్వవిషయకమగు బుద్ధి నెఱుఁగువాఁ డని పర్యవసానము. వృత్తిని నిరోధించినపుడు దృశ్యము లయమగుఁ గాన ద్రష్టృత్వవ్యవహార మెటు లున్న యెడల దానఁజేసియే ద్రష్టకు దృశి యని చితి యని చితిశక్తి యని చైతన్యమని ఇన్ని పేర్లు. 'పురుషుఁ డపరిణామియు అప్రతి సంక్రముఁడును' అని పంచశిఖాచార్యు (౫) లందురు. 'చితి అప్రతి సంక్రమ' అని పతంజలి ౪-౨౨ కైవల్యపాదము చూ. అప్రతిసంక్రముఁ డనఁగా వ్యాపార మితనిలో సంక్రమింప దని తాత్పర్యము. వ్యాపారము ప్రకృతిది. పురుషుఁడు ప్రకృతికంటె పూర్తిగా వేఱు. పురుషుని ఏ క్రియయు దఱియఁజాలదు.

---

(౪) చిద్రూపునే చితిశక్తియని వాడుదురు. దీనికి చైతన్యమే అర్థము. ఇతని శక్తి వేఱేలేదు.

(౫) కపిలునకు శిష్యు డాసురి. అసురికి శిష్యుఁడు పంచశిఖాచార్యులు. మొట్టమొదటి సాంఖ్యసూత్రకర్త యితఁడే కానోపును. వ్యాసులు తమ భాష్యమున వీరి సూత్రములను పెక్కింటి నుదాహరించిరి. మహాభారత మోక్షధర్మపర్వమున వీరి ప్రస్తావము కలదు.

పరిణామశీలముకాని వస్తువులో క్రియాసంచార మసంభవము. ఉపాధియగు బుద్ధి వలన పురుషునిలో క్రియాసంచారము కలుగునే యని యనుచో క్రియాసంచారము కలిగి నటు లుండునేకాని నిక్కముగా కలుగదు. కలుగినటు లుండుట భ్రాంతి. ఆ భ్రాంతికే యోగము మందు. రోగము, రోగమునకు నిదానము, ఆరోగ్యము దానికి మందు, వీనినిఁ జెప్పు వైద్యశాస్త్రము చతుర్వ్యూహము. అటులే సంసారము, సంసారమునకు కారణము, ముక్తి, ముక్తి కుపాయము, వీనిని బోధించు యోగశాస్త్రము చతుర్వ్యూహము.

## ప్రతిబింబ పురుషుఁడు

ప్రకృతి పురుషులు మూలతత్త్వములు. దృశ్యభావమున కెల్ల మూలము ప్రకృతి. ద్రష్టృభావమున కెల్ల మూలము పురుషుఁడు. 'అమూలమ్ మూలమ్' అను న్యాయముచే వీనికి కారాణాంతరము లేదు. కారణము లేని దనాది. కాన ప్రకృతి అనాది. పురుషుఁ డనాది. ఈ రెంటి సంయోగ మనాది! ఇటులే గ్రహీతృ గ్రహణ గ్రాహ్యములయు సంయోగమున కనాదిత్వము సిద్ధము. లింగాశ్రితములగు ధర్మజ్ఞానాదు లనాదులనియు దాన కర్మ అనాదియనియు, దాన సంసార మనాది యనియు తేలుచున్నది.

అనాదియగు ప్రకృతి పురుష సంయోగము వలన గలుగు సంసార మెటులు నివర్తింపఁ గలదని ప్రశ్నించుచో 'సంసారము సహేతుకముగాని అహేతుకము కాదు. సంయోగ మవివేక హేతుకము. అవివేక ప్రత్యయమువలన సంయోగము, సంయోగము వలన మరల నవివేకము. ఇటులు సంయోగము అవివేకముల అనాదిత్వము బీజవృక్షముల చందము. వివేకముచే అవివేక నివృత్తి. దాన సంయోగ నివృత్తి. దాన సంసార నివృత్తి' అని బదులు చెప్పుదుము.

అత్యంతము వేఱయినను ఈ ప్రకృతి పురుషులకు సంయోగము సంభవింపఁ గలదు. సంయోగ మనఁగా ప్రకృతి పరిణామ మగు గుణము లందు పురుషుని బ్రతిబింబము. సూర్యుఁడు నీరు కాదు. నీరును సూర్యుఁడు కాదు. ఇటులయ్యు ఈ రెంటికిని సంయోగ (౬) మున్నచో ప్రతిబింబ మేర్పడును.

---

(౬) కొన్ని లక్షల క్రోసుల దవ్వుల నున్న సూర్యునకును జలములకును సంయోగ సంబంధ మెటులని శంక కలుగవచ్చును. ఇది దైశికసంబంధము కాదు. యోగ్యతయే ఇచటి సంబంధము. గోడమీఁద సూర్యప్రతిబింబము పడదుగదా! అటులే ప్రకృతి పురుషులకును గల సంబంధము యోగ్యత. సూర్యునకు ప్రతిబింబించు శక్తి కలదు. జలములకు ప్రతిబింబింప జేసికొను శక్తి కలదు. ఇటులే పురుషునకును ప్రకృతికిని యోగ్యత కలదు. ౧-౪ వాచస్పతి చూ.

ఈ ప్రతిబింబమునకు జలస్వభావము లేదు. సూర్యప్రభావమును లేదు. మఱియు రెంటియును పోలేదు. నీరు కదిలినచో ప్రతిబింబము కదలును. మఱియు ప్రతిబింబమునకు ప్రకాశమును కలదు. కాఁగా ఈ ప్రతిబింబము సూర్యునకు సరూపమును కాదు. విరూపమును కాదు.

సూదంటురాయి ఇనుముకంటె వేఱు. ఇనుము సూదంటురాతికంటె వేఱు. ఇటులయ్యు ఈ రెంటికిని సామీప్యమున్నచో సూదంటురాతి ధర్మము ఇనుమునందు ప్రవేశము పొంది ఆ రాయి యినుమును తనవంటిదానినిగాఁ జేసికొనును.

ఇటులే ప్రకృతి పరిణామమయిన చిత్తమునందీ చితిశక్తి జలమున సూర్యశక్తివలె, ఇనుమున అయస్కాంత శక్తివలె ప్రవేశము పొంది చిత్తమును తనవంటి దానినిగా చేయును. చిత్తమునందీ చితిప్రవేశమే ప్రతిబింబము. ఇదియే ప్రతిబింబితుఁడగు పురుషుఁడు లేక గ్రహీత. ఈ ప్రతిబింబమే ప్రకృతి పురుషుల సంయోగము. ప్రతిబింబితుఁడగు నీ పురుషుఁడును చిత్తమును వేఱు వేఱు స్వభావములు కలవయినను విరుద్ధస్వభావములు కలవి కావు. కావున చిత్తపరిణామరూపమగు వృత్తికి ఈ ప్రతిబింబ పురుషుఁడు ప్రతిసంవేది. బుద్ధివృత్తి సంవేదనము. ప్రతిబింబ పురుషుఁడు ప్రతిసంవేది. ఇతఁడు బింబ పురుషునకు విషయము. బుద్ధి బింబ ప్రతిబింబ పురుషుల కిరువురకును విషయము.

'నేను' అను నీ భావము వ్యావసాయిక గ్రహీత. 'నేను ఉంటిని. ఉందును' అను నీ భావములు అనువ్యావసాయిక గ్రహీత. ఇచ్ఛాస్మృత్యాదు లనువ్యవసాయములు.

ప్రతిఫలకము లేనిచో అను వ్యవసాయ మసంభవము. జ్ఞానప్రతిఫలకుఁడు ప్రతిసంవేది. జ్ఞానములన్నియు ప్రతిసంవేద్యములు. ప్రతిసంవేది యొకఁడు లేనియెడల జ్ఞాన మసంభవము. కాన బుద్ధి ప్రతిసంవేదియగు పురుషునకు విషయమగు గ్రహీతచే గ్రహింపఁబడని జ్ఞాన మని ఒకటి ఉండబోదు. గ్రహీత సదాజ్ఞాత. కాన గ్రహీత కెవఁడు ద్రష్టయో అతఁడపరిణామి యగు యజ్ఞస్వరూపుఁడు. ఇటులు కానిచో అజ్ఞాతగ్రహీతను సృజింప వలసివచ్చును. 'నేను జ్ఞానము గ్రహించువాఁడను' అను ప్రత్యయ మెఱుఁగఁబడకపోవుట అసంభవమెప్పుడు కాదో అపు డతఁడు సదాజ్ఞాత. సదాజ్ఞాతవిషయము నెఱుఁగువాఁడును సదాజ్ఞాత.

ఈ ప్రతిబింబపురుషుఁడును స్వభావముచే నిస్సంగుఁడు. ఇటులయ్యు చిత్త సంగముచే గుణివలె కనుపట్టును. కాని ఈ ప్రతిబింబ పురుషుఁడు పురుషునకు సరూపుఁడు కాఁడు, విరూపుఁడును కాఁడు. విషయములకును బింబపురుషునకును నడుమ ఈ ప్రతిబింబపురుషుఁడు లేనిచో ప్రపంచ వ్యవహారమే లేదు. ఈ ప్రతిబింబ పురుషుఁడే భోక్త, కర్త, అనుభవిత. బింబపురుషుఁడు శుద్ధపురుషుఁడు. ఇతఁడు అభోక్త, అకర్త, అననుభవిత. ప్రతిబింబితుఁడగు ఈ పురుషునకు వ్యావహారిక పురుషుఁడనియు గ్రహీత యనియు పేరు. గ్రహీత వికారి యగు జ్ఞాత. ద్రష్టృగ్రహీతలు సదృశులుగాని ఒకరు కారు. ద్రష్ట అప్పసము స్వద్రష్టయే. గ్రహీత జ్ఞానకాలమున గ్రహీత, నిరోధకాలమున కాఁడు. 'నేను ద్రష్టను' అను బుద్ధియే గ్రహీత.

౨

బింబమున కనురూపమగు బింబము ప్రతిబింబము. ధ్వని కనురూపమగు ధ్వని ప్రతిధ్వని. అభిజ్ఞానమున కనురూపమగు నభిజ్ఞానము ప్రత్యభిజ్ఞానము. ఇటులే సంవేదనమునకు అనురూపమగు సంవేదనము ప్రతిసంవేదనము.

బింబమునకును ధ్వనికిని అనుకూలములగు ప్రతిఫలకములు ఉండవలయును. జలము బింబమునకును గుహ ధ్వనికిని అనుకూలములగు ప్రతిఫలకములు. ఇటులే స్వరూపద్రష్ట యీ ప్రతిసంవేదనమునకు అనుకూల ప్రతిఫలకుఁడు.

మనమొక ఘటమును చూచునపుడు 'ఇది ఘటము' అను సంవేదనము లేక జ్ఞానము కలుగును. ఈ జ్ఞానమునందు గ్రహీతృ గ్రహణ గ్రాహ్యములిమిడియున్నవి. అనగా 'నేను ఘటము చూచుచున్నాను' అని. నేను=గ్రహీత. చూచుట = గ్రహణము. ఘటము = గ్రాహ్యము.

'ఇది ఘటము' అను జ్ఞానమున 'నేను ఘటము చూచుచున్నాను లేక ఎఱుఁగుచున్నాను' అను జ్ఞానముగాక 'ఘటము' అను జ్ఞానమే ఉండుటవలన

ద్రష్టకు వృత్తి సారూప్యము (1) కలుగుచున్నది. చిత్తమును ఘటము తోడను ఇటు ద్రష్టతోడను ఉపరక్తమయినపుడు (2) 'ఘటము' అను జ్ఞానమే కలుగును గాని 'నేను ఘటమును చూచుచున్నాను లేక ఎఱుఁగుచున్నాను లేక ఎఱుగుదును' అను జ్ఞానము కలుగదు. ఈ జ్ఞానము సమనంతరమున గాని కాలాంతరమున గాని ప్రతిఫలింపవచ్చును. ఇది అనుభూతమగు విషయము నున్నదాని నున్నటు లెఱుఁగుట. తార్కికులు దీని ననువ్యవసాయమని చెప్పు దురు. ఇది స్మృతిరూపము. ఇది ఒక వృత్తి. (3) ఇది ప్రత్యక్షప్రమాణ రూపమగు వృత్తి కాదు. సుఖాదులవలె మానస ప్రత్యక్షమును కాదు. ఇది స్వరూప పురుషునిచే భాసింపఁజేయబడి (4) 'నేను ఘటము లెఱుఁగుదును' అని బుద్ధిచే ప్రతిసంవిదిత మగును. (అనువ్యవసితమగును) ఈ ప్రతిసంవేదనమునకు హేతువు స్వరూప ద్రష్ట.

---

(1) వృత్తి సారూప్య మితరత్ర ౧-౪ 'ఘటైకాకారధీస్థా చిద్ఘటమే వావ భాసయేత్'- పంచదశి, కూట ౪. పోల్చి చూచునది.

(2) వాచస్పతి ౧-౪- సూత్రమున - 'పురుషుఁడు లోక ప్రత్యక్ష గోచరుఁడు కాఁడు గాని ఆగమానుమాన గోచరుఁడు' అని చెప్పి 'ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్- ౪-౨౩,' అను సూత్రమున. - 'నీలాద్యనురక్తమగు చిత్తము నీలాది వస్తువును ప్రత్యక్షముగ నెలముకొలిపినటుల ద్రష్టృచ్ఛాయను బడసి తదనురక్తమగు చిత్తము ద్రష్టను సైతము ప్రత్యక్షముగనే నెలకొలుపుచున్నది. నీలమును నేఁ జూచుచున్నాను అని యిరుమొగముల యెఱుక ఉన్నది కద! కాన జ్ఞేయమువలె జ్ఞాతయు ప్రత్యక్షసిద్ధుఁడు' అని స్వోక్తి విరోధ ముగా జెప్పెనని కొందఱందురు. కాని ఇదికాదు. ఇచటి ద్రష్టృపదమునకు వాచ్యము విరూప ద్రష్ట. లక్ష్యము స్వరూపద్రష్ట. ఈ రెండును కలిసివచ్చుట కేక ద్రష్టృపద ప్రయోగము. వాచ్యార్థమగు విరూప ద్రష్ట (గ్రహీత) ప్రత్యక్షప్రమితుఁడే. ఈ ద్రష్టవెనుకనే ఉన్న స్వరూప ద్రష్ట అనుమాన ప్రమితుఁడు. సాక్షాత్తు చిత్తమునకు విషయుఁడు కాడు. మఱి దానికి నిమిత్త కారణము. ఈ సంగతి పై వాక్యములందు కలదు. అయినను నీటిలో చంద్రబింబమువలె విడిగా నెలకొలుపఁబడదు. ఇంత మాత్రమున నది అప్రత్యక్ష మనరాదు. బింబము జలములో నున్నదనుట అప్రమాణము కాన చంద్రరూపమందు అది (ప్రతిబింబము) అప్రమాణమా?

(3) అనుభూత విషయాఽసంప్రమోషః స్మృతిః ౧-౧౧.

(4) 'ఘ స్య జ్ఞాతతా బ్రహ్మచైతన్యే నావభాస్యతే ౪.
'ధీ వృత్త్యా భాసకుంభానాం సమూహో భాస్యతే చితా' కూట - ౧౪.

ఈ స్వరూపద్రష్ట అట్టి యపుడు అనుభూతుఁడగునా? ఉఁహూఁ కాఁడు. ఈ బుద్ధి ప్రతిసంవేదనమును (అను వ్యవసాయమును) బట్టి యీ ప్రతిసంవేదనమున కొక హేతు వుండవలయునని అనుమానముచే బుద్ధిప్రతిసంవేత్త దీనికి హేతువని గ్రహింతుము. ఇచట బుద్ధి యనఁగా 'నేను ఘటము నెఱుఁగుదు'నను అనువ్యవసాయిక బుద్ధి యని గుర్తింపవలెను. ఈ బుద్ధియే అనువ్యవసాయిక గ్రహీత.

అను వ్యవసాయమును విడఁబఱచిన యెడల ఘటము వేఱు. ద్రష్ట వేఱు అనియును ఘట ప్రత్యక్షరూపమగు వ్యవసాయ ప్రధాన వృత్తిలో (ఇది ఘటము) ఘట ద్రష్టల వేఱిమి తెలియదనియును ఏర్పడుచున్నది. ఘట జ్ఞానముతోఁగూడిన ఈ 'నేను'ను భాసింపజేయుటకు ప్రతిఫలకుఁ డొకఁ డుండవలయును. ఇటులు ప్రతిఫలింపజేయు నతఁడే ప్రతిసంవేది, మూలద్రష్ట.

ద్రష్ట బుద్ధి ప్రతిసంవేది యనఁగా బుద్ధిని చూచువాఁడు అని మాత్రమే చెప్పి కొందరు ఇటులు సమన్వయింతురు: చిత్ ప్రతిబింబము పడుటచే బుద్ధి చైతన్య మయమయి ఇటు ఘటాదులను ప్రకాశ పఱుపను, అటు చిత్సత్త నను భవింపను సమర్థమగును. బుద్ధి చిత్ ప్రతిబింబ స్వరూపము. ఐనను భాషలో ప్రకటించు పట్టున బుద్ధిలో చైతన్యము ప్రతిబింబించు'నని అందుము. బుద్ధి యను అద్దమున పురుషుఁడు ప్రతిబింబించుటఁ జేసియే పురుషుఁడు బుద్ధి ప్రతిసంవేదియని ఎన్నఁబడును. పురుషుఁడు తన సత్తా, ప్రకాశ, రూపమగు ప్రతిబింబముచే బుద్ధి మాత్రమును జూచును.

ఈ ఉపాదనలో విశేషము లేదు. సంవేది యనిననే సరిపోవుచుండఁగా ప్రతిసంవేదియని యనుటలో నేదో ఉద్దేశము ఉండవలదా?

'నేను' అనుబోధ ఉత్తరక్షణమున 'నేను నన్నెఱుఁగుదున'ను ప్రతిబోధ మగును. ఇది ప్రతిఫలితబోధ లేక దృశిబోధ. ప్రతిబింబమున కద్దము కారణమైనటులు ఈ ప్రతిబోధమునకు కారణము స్వబోధ రూపుఁడగు పురుషుఁడు. ప్రతిసంవేది శబ్దముచే స్వరూప ద్రష్ట లక్షితుఁ డగును. ప్రతిసంవేదయిత అను నర్థమున ప్రతిసంవేది అని ప్రయుక్తమని తెలివిడి.

'నేను నన్ను ఎఱుఁగుదును' అనునెడ కర్తయే కర్మ అగుచున్నది. ఇటు లగుట అసంభవము ఇది కర్తృ కర్మవిరోధము. అయినను మనమిటు లను చున్నాము. దీనికి హేతువేమి?

అసలీ 'నేనే' మి; నేను నన్ను ఎఱుఁగుటే'మి?

'నే నెఱుఁగువాఁడన'ను అనుభవము మన కందఱకును గలదు. ఈ యెఱుక బాహ్యములగు ఘటాదికములయు ఆంతరంగికములగు రాగక్రోధాదు లదియు నగు ఎఱుక. ఈ ఘటాదులను క్రోధాదులను ఎఱుఁగు 'నేను' వృత్తి సారూప్యము పొందిన యది. ఇది తన్నుఁదా నెఱుఁగు నెఱుకకాదు. ఇతరుల క్రోధాదులకు మనము సాక్షులముగా నుండవచ్చును. అపుడు మనము క్రోధాదు లచే నుపరక్తులము కాము. (5)

'నా కపుడు క్రోధము కలిగి క్రుద్ధుఁడ నయితిని; ఈ తడవ క్రోధము కలగకుండఁ జూచుకొనవలెను' అను ప్రవృత్తి మనలో కొందఱకు కనఁబడు చున్నది (6) కావున 'నేను వేఱు; చిత్తము వేఱు' అని ఏర్పడుచున్నది. కాని వృత్తిసారూప్యము కలిగి సాక్షిగా ఉండనందువలన ఈ భేదము అనుభవమునకు రాఁజాలక యున్నది.

చిత్తమే తన్నును క్రోధాదికమును ఎఱుఁగునని ఏల అనరాదు? అందుము. అపుడు జ్ఞాతయగు నేను + జ్ఞేయ మగు క్రోధాదికము = వెరసి, చిత్తమగు చున్నది. అపుడు జ్ఞేయాంశము అనఁగా జడాంశమగు క్రోధము, జ్ఞానము అనఁగా

(5) వార్తికకారు లిటుల చెప్పుచున్నారు-
'దుఃఖీ యది భవేత్ సాక్షీ క స్సాక్షీ దుఃఖితో భవేత్
దుఃఖిన స్సాక్షితా నాస్తి సాక్షిణో దుఃఖితా కుతః?

(6) స్వబుద్ధి ప్రచార ప్రతిసంవేదనాత్ సత్త్వానాం ప్రవృత్తి
ర్దృశ్యతే - 'క్రుద్ధోహం భీతోహ మముత్ర మే రాగోఽముత్ర మే క్రోధ' ఇతి.
ఏతత్ స్వబుద్ధే రగ్రహణే న యుక్తమ్' వ్యాసభాష్య ౪-౨౦

'అహంవృత్తౌ చిదాభాసః కామక్రోధాదికాసు చ సంవ్యాప్య వర్తతే తప్తే లోహే వహ్ని ర్యథాతథా 'స్వంమాత్రం భాసయేత్తప్తం లోహం నాన్యత్కదాచన ఏవ మాభాసనహితా వృత్తయః స్వస్వభాసికాః'

అజడ మగు నేను, కలిసిన ఈ జడాజడమగు చిత్తమును అనఁగా గ్రహీతను ఎఱుఁగువాఁ డెవఁడను ప్రశ్న ఉదయించును. కావున మనలో తానే తన్నెఱుఁగు నొకానొక తత్త్వము ఉండి యుండవలయును అని తెలియుచున్నది. ఆ తత్త్వము పురుషుఁడు లేక ద్రష్ట. ద్రష్ట స్వాభాసుఁడు. అతఁ డొకఁడు మాత్రమే తన్నుఁ దా నెఱుఁగగలవాఁడు. అతనియెడ కర్తృ కర్మ విరోధము లేదు. వికారియగు గ్రహీత 'నేను నన్నెఱుఁగుదు' నని అనుకొనుటకు కారణము దృశిరూపుఁడని అనుమానముచే కనుఁగొనఁగలము. స్వరూప పురుషుని ఎఱుకను గ్రహీతదెగాఁ జేకొని వాడుచున్నాము గావున నిది లక్షణామూలకము.

మనము నిదురలో నుండఁగా నడికిరేయి ఇంటి వెలుపల పిలుపు వినఁబడి బయటికి వచ్చితి మనుకొందము. ముంగిలి యెల్ల చిమ్మచీకటి. ఎదురుగ గోడ నెఱిఁగిన మొకర మున్నది. అది కనఁబడదు. కాని గుఱుతు వచ్చును. దానిని కన్నులారఁ జూచిన చందముగా తప్పుకొని పోవుదుము. ఈ స్మృతి అప్పుడు మనకు భాసింపఁజేసిన దెవరు ? మూలద్రష్టకాక మఱి యెవరు ? కొంద ఱదృష్టమందురు. అదృష్టమే ఆ ద్రష్ట!

ఉదానాది ప్రాణకార్య బోధములకు ప్రతిఫలకములు స్నాయుకేంద్రములు. వైషయికబోధ ప్రతిఫలకత్వమునకు లేక ప్రతిసంవేదనమునకు కేంద్రము, బుద్ధియు కరణములయు శక్తి బుద్ధిరూపమగు ఆత్మభావమునకు (నేనను భావమునకు) ప్రతిసంవేది స్వరూపపురుషుఁడు లేక చిద్రూపుఁడగు ఆత్మ. ఈ ప్రతిసంవేదనమును పట్టుకొని పురుషతత్త్వము నెఱుఁగవచ్చును. బుద్ధితత్త్వము నెఱిఁగి సంప్రజ్ఞాత సమాధిచే (7) ప్రతిసంవేదనభావమును పట్టుకొనినచో వివేకఖ్యాతి ఉదయించును. అనఁగా బుద్ధి పురుషు నెరుఁగుటకు ఏకాగ్రమగుచో బుద్ధి వెనుక నున్న పురుషుఁడు బుద్ధికేసి తిరిగినటు లగును. పురుష విషయకమగు బుద్ధియనినను బుద్ధినెరుఁగు పురుషుడనినను భేదములేదు. (8) బుద్ధి పురుషాకారమగుచో పురుషుఁడు బుద్ధ్యాకారాపన్నుఁడగును. 'అహం

(7) తత్ర శబ్దార్థ జ్ఞాన వికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః - ౧-౪౨.

(8) పురుషః విషయః యస్యాః = పురుష విషయా
అథవా - పురుషం విషిత్య ఉత్పన్నా = పురుష విషయా.

బ్రహ్మాస్మి' = నేను బ్రహ్మమను, అనఁగా 'నేను ద్రష్టనగు పురుషుఁడను' అను సంప్రజ్ఞాత సమాధిలో బుద్ధి ఏకాగ్రత చెందినపుడు ప్రతిసంవేదనము అనుభూతమగును. అసలిది వివేకఖ్యాతి. ప్రతిసంవేదనమునకు కారణము ప్రతిసంవేది లేక ప్రతిసంవేత్త. (౯)

## పురుష బహుత్వము

ప్రతివానికిని 'నేను, నేను' అను ఎఱుక కలదు. పురుషుఁడొకడే యగుచో ప్రతి కేంద్రమునందును 'నేన'ను ఎఱుక కలుగదు. ఈ సృష్టిలో ఎవరి అనుభవము వారిది. ఎవరి ఎఱుక వారిది. ఎవరి కర్మ వారిది. ఎవరి సుఖము వారిది. ఎవరి దుఃఖము వారిది. 'ఎవరికి వారే; యమునా తీరే'. ఇది ప్రత్యక్షసిద్ధము.

పురుషుఁడొకఁడే యగుచో ఒకఁడు ముక్తుడగునెడల ననాయాసముగ నందఱును ముక్తులగుదురు. ఒకఁడు బద్ధుఁడగునెడల నందఱును బద్ధులగుదురు. అట్టియపుడు ముక్తియు బంధమును లేక పోవలసివచ్చును.

వృత్తులన్నియు గ్రహీతకు గోచరమగుటఁజేసి మనము ద్రష్ట ఉనికిని అనుభవ మొనరించుకొనుచున్నాము. మనకు ప్రతి క్షణమునను ఏకమాత్ర జ్ఞానమే కాని బహుజ్ఞానములు కలుగవు. కనుక ఒక క్షణమునందే ఒక జ్ఞాతయే బహుజ్ఞానములకు ద్రష్టయని యను టనుభవవిరుద్ధము. ఒక క్షణముననే మనకు సుఖమును దుఃఖమును కలుగుచున్నదా? ఒక క్షణముననే నలుపును ఎఱుపును చూడఁగలమా? ఇది అనుభవవిరోధము. ప్రాణులందఱయు ద్రష్ట ఒకఁడే అని

(౯) సాంఖ్యయోగుల మతమునందు పురుషుఁడు సాక్షిజ్ జ్ఞాతయు భోక్తయు అధిష్ఠాతయు. కాని సాక్షాత్తు కర్తయు ధర్తయు కాఁడు. ఏలనఁగా పురుషుఁడు జ్ఞస్వరూపుఁడు. అతనిచే ఎల్లయు జ్ఞాతము లేక దృష్టము. మఱి కార్యధార్యము లతనికి దృశ్యములు. కావున సాక్షాత్తు అతనికి కార్యధార్యములు లేవు. కాఁగా అతఁడు జ్ఞానమును ప్రకాశింపఁ జేయువాడు లేక ప్రతిసంవేదియగు జ్ఞాత. అతఁడు ప్రవృత్తిని ప్రకాశింపఁ జేయువాఁడు లేక భోక్త. అతఁడు స్థితిని ప్రకాశింపఁ జేయువాఁడు లేక అధిష్ఠాత. ఇటులగుటఁ జేసి ద్రష్ట యనిన ఆత్మబుద్ధి ప్రతిసంవేది. విజ్ఞాత యనిన శబ్దాదిబుద్ధి ప్రతిసంవేది. భోక్త యనిన ఇష్టానిష్టబుద్ధి ప్రతిసంవేది. అధిష్ఠాతయనిన ధార్యవిషయ ప్రతి సంవేది యని తెలివిడి.

చెప్పుచో అనుభవ విరుద్ధుఁడును అకల్పనీయుఁడును ఆగు ద్రష్టను కల్పింప వలసి యుండును.

యుక్తి సిద్ధమైన యెడల అకల్పనీయమగు వస్తువునయినను అనుమాన ప్రమాణముచే ఒప్పుకొనవలెను. శక్తి స్వరూపావస్థను అనుమానముచే సాధించుచున్నాము. ఇది అకల్పనీయమయినను యుక్తి సిద్ధమని స్వీకరించుచున్నాము. అటులే ద్రష్టయు నొకఁడే యని యేల స్వీకరింపఁగూడదు ?

ద్రష్ట ఒకఁడే యని చెప్పువారు ఒక సూర్యుఁడే పెక్కు కుండలలో ప్రతిబింబించినటులు ఒక పురుషుఁడే పెక్కు బుద్ధులలో ప్రతిబింబించునని యందురు. ఈ యుదాహరణమునుబట్టి ద్రష్ట ఒకఁడని అనుచో అతఁడు అవయవి కావలసి వచ్చును.

సరియ. ద్రష్ట లసంఖ్యాకు లగుచో ప్రత్యేకద్రష్ట ససీముఁ డేల కాఁడు ? సమానములగు పదివస్తువులచే ఒక పెట్టె నిండెనని అనుకొందము. అందలి ప్రతి వస్తువును ఆ పెట్టెలో పదవపాలు ఐపోవదా? ద్రష్ట దేశాశ్రితుఁ డయినయెడల నట్లే యగును. జ్ఞానవస్తువు దేశము నాశ్రయింపదు. ఒకని తరువాత నొకరుగా పదుగురు నిలిచి సూర్యుని చూచుచుందు రని అనుకొందము. అపు డా పదుగురిలో నొకరొకరికి సూర్యునిలో పదవవంతే కనఁబడునా? కావున ద్రష్ట లనేకులయ్యు దేశాశ్రయములగు పదార్థములవలె ససీములు కారు. దేశాశ్రయములగు పదార్థములు ఒకదాని ప్రక్క మఱొకటి యుండునటులు కాలాశ్రయములగు పదార్థములు ఒకక్షణము తరువాత ఒకక్షణము ఉండును. కాలము నాశ్రయించిన జ్ఞానపదార్థము లెగిరిపోయి లయమయిన యెడలనే లేక వికారము చెందిన యెడలనే ససీమము లగును. ద్రష్టయం దది సంభవింపదు. ద్రష్ట నిర్వికారి. కాన కాలమువల్లఁ గూడ అతనికి ఎల్ల లేదు. దానఁజేసియే యతఁ డద్వైతబోధ రూపుఁడు, చిద్రూపుఁడు, అనంతుఁడు, అనేకుఁడును. ఇట్టి పురుషు లందఱు ఏక రాశి· ఎవరిలోను హెచ్చుదగ్గులు లేవు.

**3**

ముక్తిభూమికలో పురుషుని వ్యక్తిత్వము లయము చెందదు. వ్యక్తిత్వము నిత్యము. వ్యక్తిత్వము=అవిభాజ్యమగు ఏకత్వము, మఱియు అద్వితీయత్వము (1) ఇది చిదాత్మకమేకాని చిత్శక్తి కాశ్రయము కాదు. ఏ సంబంధమును ఏ ధర్మమును లేనిదీ వ్యక్తిత్వము. ఇది నిత్యసిద్ధము. ముక్తిభూమికయందును ముక్తపురుషుల పార్థక్యము పోదు. ఉపాధిపోవునుగాని వ్యక్తిత్వము పోదు. ఈ వ్యక్తిత్వ ముపాధివలన వచ్చినదికాదు. ఒకొక్క బుద్ధిలో ఒకొక్క పురుషుని యనుప్రవేశము.

ముక్తులలో ఒండొకళ్ళకు భేదకమేది? స్వరూపభేదము లేని పెక్కువస్తువులు ఒకటి యనిన నొకటిగనే ఉండవలయునను నియమము ఉన్నదా? అట్టివెన్నియో విడివిడిగనే ఉండవచ్చును. కొన్ని ఏకత్వములున్నవి. వానిలో సమష్టిగతమగు ఏకత్వము సాంఖ్యయోగుల కభిమతముకాని వ్యష్టిసమష్ట్యతీతమగు ఏకత్వ మభిమతము కాదు.

అది బుద్ధి కతీతమే! కావున పురుషబహుత్వ మెటులు తెలియును?

బుద్ధి కతీతము కావుననే ఏకత్వము మాత్ర మెటులు తెలియును? ఒకండనుటగాని పలువు రనుటగాని బుద్ధి. సాంఖ్యయోగుల మతమున ఒకొక బుద్ధిలో నొకొక పురుషుఁడు ముక్తిభూమికలో బుద్ధితో సంయోగ మెడయు నెడల పురుషుని వ్యక్తిత్వమున కపాయము లేదు.

పురుషుఁడు సమ్మిశ్రిత ద్రవ్యముకాదు. ఇతఁడు దేని సంయోగముచేతను పుట్టినవాఁడు కాఁడు. కావున నీరు మొదలగువానివలె ఇతనిలో ఔపాదానిక పరిణామములేదు. ఏకాధికోపాదాన సంయోగమువలన గలుగునది ఔపాదానిక పరిణామము.

పురుషుఁడు అసీముఁడు. కాన గతియులేదు. మఱి ఆకారాది రూప పరిణామమును లేదు. గతితో లాక్షణిక పరిణామమున కెక్కుడు చుట్టరికము. కాలము, గతియు అవలంబముగా ఒక అవస్థనుండి మఱియొక యవస్థ సంభ

---

(1) Uniqueness.

వించును. బంగారము గతి యవలంబముగా మురు గగును. గతి కాలమునందే పురుషునిలో పరిణామమున కాస్కారమేదియు లేదు గాన నతనిలో గతిగాని కాలముగాని లేదు. ఈ రెండును అతని అసీమత్వమునకు సాక్షులు ఏరికి నిది విషయము కాదుగాన అసీమము స్వాతిరిక్తమేదేని యిందు లేదుగాన దేని చేతను ఇది సీమాబద్ధము కాదు. విషయమునకు సీమ కలదుగాని పురుషునకు లేదు.

'చితిశక్తి అపరిణామిని శుద్ధఅనంత, అని భాష్యము. ఇటనున్న అనంత పదము దేశకాలసీమాభావము చెప్పును. ధర్మహీనుఁడు కాన కాలమువలన సంభ వించు న్క్రియయు అతనిలోనుండదు. కావుననే కాలహీనతా రూపమగు అనం తత్వము నిత్యావస్థాయిత్వమును జెప్పదు. దేశవ్యాప్యత్యము విషయధర్మము. దేశమం దున్నది సావయవము. పురుషుఁడో నిరవయవుఁడు. చేతనావ్యాపకత కర్థము దేశరాహిత్యము. చేతనకు సంకోచ వికాసములు లేవు. ఇవి జన్యపదార్థ మున కుండును.

పెక్కు విషయము లొండొకటికి బాధకము లయినటులు పెక్కురు పురుష లొకళ్ళ కొకళ్ళ బాధకులు కారా? అటులగుదురేని పురుషులకు ససీ మత్వము సంభవించునే అని యనుచో దేశాశ్రయులు కాని పురుషులయెడ నిది సంభవింపదు. దేశకాలముల కంటని పురుష లొకళ్లొకళ్ళకు సాధకులుగాని బాధ కులు గాని కారు. వీరిలో నొకరి కొకరికి ఎట్టిసంబంధమును లేదు. దేశకాలాతీత మగు దానిలో సంబంధకల్పన అసంగతము. వీరిలో నెవరికిని వ్యాప్యవ్యాప కత్వములు లేవు. పురుషుని ఏకత్వము ఏకజాతికి సంబంధించినదికాని ఏక సంఖ్యకు సంబంధించినది కాదు. (2)

---

(2) 'ఏవ మేకత్వేన పరివర్తమానస్య న విరుద్ధ ధర్మాధ్యాసః' (1-102) సాంఖ్య సూత్ర, చూ.

పురుషైకత్వము చెప్పువారు- 'ఏకమే వాద్వితీయమ్' ఇత్యాది శ్రుతుల నుదాహరింతురు. ఆ శ్రుతులు సంఖ్యాపరములు కావు. మఱియు 'అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టః వాయుర్యథైకో భువనం ప్రవిష్టః. సూర్యో యథా సర్వలోకస్య చక్షుః' అను కఠ 2-2-9, 10.11 ఉపనిషదాదుల నుదహరింతురు. అవి ఉపమలు. ఉదాహరణములు కావు. హిరణ్యగర్భుఁ డిచట నుపమేయము. పురు షుఁడు కాఁడు.

వ్యుత్థానదశలో విషయములు బుద్ధియందు ప్రతిబింబించును. కావున బుద్ధి తత్త్వమువఱకే క్రియాసంచారము. వృత్తి, ప్రతిబింబ పురుషుని దాఁటి పురుషునికడకు పోదు. బుద్ధిలో వృత్తి పొడమును. తెలియనిదానిని తెలుపుట దానిపని. ఇంద్రియములు విషయములను గ్రహించును. ఆ విషయబోధ బుద్ధిలో పర్యవసించును. ఇది ఆత్మకు లేక పురుషుని పొంతకు పోదు. 'నేను' అనుకొను ప్రతిబింబ పురుషునిలో 'నే నెఱుఁగువాఁడను' అను ప్రకాశశీలమగు వృత్తి సంచరించును. కాని పురుషునిలో ఏవృత్తియు లేదు, ఆతఁడు బుద్ధి భాసకుఁడు. వ్యుత్థానమునందును నిరోధము నందును అతఁడు నిష్క్రియుఁడు.

నిరోధ మనఁగా వృత్తిలయము. వృత్తితోపాటు చిత్తేంద్రియ విలయము పూర్ణనిరోధము కలుగుచో సమాధి సమాధిగాని విక్షేపముగాని చిత్తమునకు పురుషునకు నిరోధముగాని విక్షేపముగాని లేదు. చిత్తావస్థ యేదియు పురుషు నంటదు. నిరోధము నలవాటు చేసికొనుచో క్రమముగా విషయములకు ఇంద్రియ సంచారమునకు పిదప అభ్యంతర వృత్తులకు విలయము. పిదప 'నేను' కు మాత్రము మిగులు. ఇంకను అభ్యాసబలముచే ఆ భూమికకును ప్రలయము.

'నేను నేను' అను బోధమాత్రము బుద్ధిసత్త్వము. ఇది స్వచ్ఛజ్ఞానవృత్తి. పురుషునికేసి ఆ వృత్తి తిరుగఁగనే అది పురుషావబోధమున లయ మగును. ఈ దెస పురుషుఁడు వ్యుత్థానమునను నిరోధమునను బెల్లముకొట్టిన రాయి. ఇటులు చిత్తధర్మమేదియు పురుషు నాక్రమింపకున్నను 'నేను సుఖిని, నేను దుఃఖిని' అని లోకము భావనాక్లిన్నమగుచునే యుండును. ఇది అవిద్య.

## భోగాపవర్గములు

అస్మత్ ప్రత్యయమును అనఁగా 'నేను' అను బుద్ధి నాశ్రయించి పురుషుఁడు భుజించును లేదా త్యజించును. ఈదెస పురుషునకు భోగసంపర్కముగాని ముక్తిసంపర్కముగాని. అసలు పురుషునకో భోగాపవర్గములు జూటా. 'నేను' అనుబోధ మింద్రియములతోఁగూడి విషయముల వేఁటాడి సుఖమేని దుఃఖమేని భుజించును. గ్రహణరూపమగు ఇంద్రియములయు, విషయములయు సంచారమీభోక్తయగు 'నేను' కడకు లేక ప్రతిబింబపురుషుని కడకు బుద్ధియే 'గ్రహీత'. బుద్ధిలో పడిన నీడ అనఁగా ప్రతిబింబము లేక వ్యావహారిక పురుషుడు భోక్త (3). పురుషావభాసము లేక భోక్తృత్వము ఉపపన్నము కాదుగదా !

---

(3) 'ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః-కఠ)

ఇంద్రియ సంపర్కము ఇంచుకయు లేని బుద్ధిలో పురుషావభాసమే 'నేను'. నిర్వితర్క సమాపత్తిలో (4) ఈ 'విడి-నేను' ఎఱుక. ఈ 'నేనును' వివిక్తముగా నెఱిఁగికొన్నచో ఎఱుకను కొంత కొల్లగొన్నట్లే. ఈ యెఱుక పోను పోను వివేకము. దాన వైరాగ్యము. దాన గుణత్రయోపసంప్యాప్తి. అదియ అపవర్గము.

వివేకమునందు నెలకొనిన సాధకుల బుద్ధి సత్త్వమునందు సకల విషయములయు సకల చిత్తములయు భావము ప్రతిఫలించును. ఈ సాధకుల బుద్ధిసత్త్వమునందు శక్తులును విభూతులును అంకురించును. వారి సంకల్పములకు వ్యాహతి లేదు. క్రమక్రమముగా వారికి సర్వజ్ఞత్వమును సర్వచిత్తాధిష్ఠాతృత్వమును కలుగును. వారు జ్యోతిష్మత్యాది సిద్ధులు. అనఁగా వారు సానంద సాఽస్మిత సమాధులు బడసినవారు. ఇట్టి సిద్ధులు కలిగినను వీరు పరమవైరాగ్యముచే వృత్తి నిరోధముచేసి ముక్తులయిన వారు మాత్రము కారు. విశోకా భూమికలో అ కమమగు జ్ఞానము కలుగును. ఈ భూమికలో నున్నవారికి పాపపుణ్యము లంటవు. వీరీశ్వరునితో పాటు జ్ఞానమునకును సిద్ధులకును కల్యాణమునకును ఆశ్రయమే కాని ఈశ్వరులు మాత్రము కారు.

## పురుష విశేషుఁడు లేక ఈశ్వరుఁడు

పురుషులందఱును అవిద్య మొదలగు క్లేశములతోడను అవి చేయించు శుభాశుభకర్మలతోడను వానివలన కలుగు సుఖదుఃఖముల తోడను వాని సంస్కారములతోడను గుచ్చి యెత్తఁబడినవారే. ఇవి యేవియు ఎన్నఁడును అంటని ఒకానొక పురుషుఁడున్నాఁడు. ఈ మహాపురుషుఁ డీశ్వరుఁడు. ఇతఁడు నిత్య ముక్తుఁడే కాక నిత్యేశ్వరుఁడు.

ఇతఁడు ప్రధానతత్త్వమా కాదు, పురుషతత్త్వమా కాదు. ఇతఁడును ప్రధాన పురుషతత్త్వ సంకలితుఁడే. కాని పురుషవిశేషుఁడు. ఇతని ఐశ్వరికోపాధి ప్రాకృతము. ఈయుపాధి అనాదికాలమునుండియు పురుషోపదృష్టమై నిరతిశయోత్కర్ష సంపన్నము. అనాదివివేక ఖ్యాతికతన అనాది సర్వజ్ఞతా సర్వభావాధిష్ఠాతృత్వయుక్త మీ యుపాధి.

(4) 'ఏతయైవ సవిచారా నిర్విచారా చసూక్ష్మవిషయా వ్యాఖ్యాతా- (1-44 యో.ద.)

జగతి కుపాదాన నిమిత్తములు ప్రకృతి పురుషులు. ఇతఁడీ రెంటిలో నేదియు కాని పురుషవిశేషుఁడు. తత్త్వములలో నితనికి ప్రవేశము లేదు.(5) ఈ పురుషవిశేషుఁడు పురుషతత్త్వముకాదు. నిత్యముక్తుఁడుగుటజేసి ఇతఁడొక పెడ నిర్గుణుఁడు, ఐశ్వరికోపాధికలిమి ఇంకొక పెడ సగుణుఁడు. ఇట్టివీఁడు సిద్ధించునా?

అనుమాన ప్రమాణముచే ఈశ్వర సత్తామాత్రము సిద్ధించును. (కల్పము యొక్క ఆద్యంతములందు) ఇతని ప్రయోజనము ఆగమముచే సిద్ధించును.

అనుమానముచే ఇతఁడు సిద్ధించుఁగాక ! ఉపాధి సర్వోత్కృష్ట మయినను సృష్టిస్థితి లయములతో ఇంచుకయేని సంబంధము లేని యీ పురుషునివల్ల నేమి (6) యుపయోగము?

కల్పప్రలయ మహాప్రలయములందు నిర్మాణచిత్తము వికసింపఁజేసికొని సంసారులకు జ్ఞానధర్మ మితఁడుపదేశించును. ఇంతియకాక కర్మమార్గమున పయ

---

(5) 'ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః
మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః
మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః - కఠ)

(6) ప్రొఫెసర్ శ్రీ రాధాకృష్ణులు ఇట్లు అభిప్రాయపడుచున్నారు:
God is only a Particular self (Purusavisesa), and not Creator and Preserver of the Universe. He does not reward or punish the actions of men. But some work had to be devised for him When once he was on the scene. He is said to aid those who are devoted to him in removing the Obstacles to their upward progress by Pranidhana, or disinterested devotion or bhakti, we become eligible for the grace cf God. Isvara facilitates the attainment of liberation, but does not directly grant it. We cannot help saying that the yoga Philosophy introduced, the conception of God just to be in the fashion and catch the mind of the public - (Indian Philosophy - Vol. II, P. 371).

నించువారికి (7) ఇతఁడు పరమగతి. కర్మయోగులు ఈశ్వర ప్రణిధానముచే సమాధి (8) బడయుదురు.

జ్ఞానమునకు ఐశ్వర్యమునకు నిత్యాశ్రయుఁడు కాన ఈశ్వరుఁడు, ఈశ్వరులకు ఈశ్వరుఁడు, (9) మఱి పూర్వగురువులందఱకునూ గురువు. ప్రతిసృష్టికిని మొదట ఈశ్వరుఁడు జ్ఞానోపదేష్ట, యోగాచార్యుఁడు. కర్మయోగుల చిత్తములలో నతఁడు జ్ఞానైశ్వర్య ధర్మములు సంచరింపఁజేయును. కర్మయోగులు ఈశ్వర ప్రణిధానముచే సమాధిఁబడసి క్రమముగా నిర్గుణపురుషు నెఱిఁగి కొందురు.

ఈశ్వరుఁడు సాక్షాన్ముక్తిహేతువుకాఁడు. ప్రకృతిపురుష వివేకమే ముక్తికి సాక్షాత్కారణము. ఈశ్వరప్రణిధానము పరంపరా సంబంధముచే ముక్తి కారణము. జ్ఞానము వినా ముక్తిలేదు. ఈశ్వరుఁడు శాంతసమాహిత పురుషుఁడు. అతఁడు భూతములను ప్రకృతి బంధమునుండి సాక్షాత్తు విమోచనము చేయింపఁజాలఁడు. ఆయన కా యధికారములేదు. ఈశ్వరభక్తిచే ధ్యానము, ధ్యానముచే సత్త్వ శుద్ధి, సత్త్వశుద్ధిచే వివేకము, వివేకముచే విరక్తి, దాన పురుషావబోధము అదియ ముక్తి.

---

(7) తపః స్వాధ్యాయ ఈశ్వరప్రణిధానాని క్రియాయోగ, 2. 1. 2. 32. 45, 49.

'శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః' 2-32.

'స మాధి సిద్ధి రీశ్వరప్రణిధానాత్.' 2-45.

'సత్త్వపురుషాన్యతా ఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వంచ' 3-49 యో. ద.

(8) ఈశ్వర ప్రణిధానాద్వా 1.23 యో.ద

'యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తమా హ దేవ మాత్మబుద్ధి ప్రకాశమ్
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే.'-శ్వేతాశ్వతర-

(9) 'స పూర్వేషా మపిగురుః కాలే నానావచ్ఛేదాత్ - 1-26 యో.ద.

౪

## ప్రకృతి

బుద్ధి మొదలు భూతతత్త్వముల వఱకును గల తత్త్వముల నన్నిఁటిని విడఁగొట్టి చూచితిమేని వాని యన్నిఁటియందును ప్రకాశము, క్రియ, స్థితి యను మూఁడుగుణములు కానిపించును. (1) భూతములు గ్రాహ్యములు. దానఁజేసి యీ మూఁడు గుణములును వానియెడ ప్రకాశ్యముగను కార్యముగను ధార్యము గను అగును. ఈ భూతములు శరీరముగా పరిణామము చెందినపుడుగూడ శరీర బోధాధిష్ఠానరూపమగు ప్రకాశగుణముతోడను, శరీర కార్యాధిష్ఠానరూపమగు క్రియాగుణముతోడను, శరీరధారణాధిష్ఠాన రూపమగు స్థితి గుణముతోడను కూడుకొనియుండును.

గ్రహణతత్త్వమునకు లేక ఇంద్రియము లన్నిఁటికిని ఈ ప్రకాశ క్రియా స్థితులు, బోధ చేష్టా ధృతిరూపముగా నున్నవి. కరణములం దొక విధృతి భావము కలదు. అది క్రియాశీలమయినంతనే జ్ఞానము కలుగును.

'నేను ఉన్నాను' అను నిట్టి బుద్ధిలో జ్ఞానాంశము ప్రకాశ గుణము. ఇది ప్రవాహరూపమై ఎప్పుడును ఉండునుగాన పరిణామ శీలము, కాన నిది క్రియా గుణము. స్థితిశీలత స్థితిగుణము. అహంకారాదులగు ఎల్ల కరణము లందును ఇటులే ప్రకాశ క్రియా స్థితులు పొడకట్టును.

కరణశక్తుల కన్నిఁటికిని పైనున్న అంతఃకరణమునం దీ ప్రకాశ క్రియా స్థితులే ప్రఖ్యా ప్రవృత్తిస్థితి రూపముగా నున్నవి (2). ప్రఖ్య యనిన జ్ఞానాది కము (3). ప్రవృత్తి యనిన చేష్టాదికము(4). స్థితి యనిన సంస్కారాదికము(5).

---

(1) 'ప్రకాశ క్రియా స్థితి శీలం భూతేంద్రియాత్మకం బోధాపవర్గార్థమ్ దృశ్యమ్.-యోగ-2-18.

(2) "చిత్తంహి ప్రఖ్యా ప్రవృత్తి స్థితి శీలత్వా త్త్రిగుణమ్"(యోభాష్య-1-2)

(3) "ప్రసాద లాఘవ! పీత్యాదులు." (చూవాచ-1-2)

(4) "పరితాపకోకాద్ధులు"-(చూ-,,)

(5) గౌరవావరణదైన్యాదులు"-(చూ,,)

ఈ జ్ఞాన చేష్టా సంస్కారములను తఱచిచూచినచో 'నేను' అను నొక మూలజ్ఞానము దొరకఁగలదు. దానిచే మన శ్చిత్తముల సృష్టి (6) 'నేను' అను నీమూలజ్ఞానములో చేష్టా సంస్కారముల మూలబీజము లున్నవి. 'నే నెఱఁగు చున్నాను, నేను చేయుచున్నాను, నేను శరీరమును ధరించుచున్నాను' అని మనకు సతతానుభవము. ఈ 'నేనే' అహంకారము. అహంకార మన్ని ఎఱుకల కును కుదురు. అనఁగా మనశ్చిత్తములకు సాధారణోపాదానకారణము. కాఁగా ప్రమాణాదులగు నెల్లతెఱఁగుల జ్ఞానములును చేష్టా సంస్కారములును ఈ 'నేను' వికారములు.

అహంకార ధర్మ మభిమానము. అభిమాన మన'నేను' యొక్క వేఱు వేఱు రీతులు. 'నేను గొప్పవాఁడను, తెలివితేటలు గలవాఁడను ఈ మొదలగు విశిష్టాహంతాజ్ఞాన మభిమానము. సంకీర్ణ మగు నిట్టి 'నేను' అను జ్ఞానమునకు మూలము అసంకీర్ణమగు 'నేను' అను జ్ఞానము. దీనికి అస్మిత అని పేరు. దీనిని అస్మిమాత్ర మనియు అస్మితిమాత్ర మనియు నందురు. ఇదియే వికృతమై నానా రూపమగు అహంకారముగా మాఱును. ఇది అభిమానముచే అసంకుచితము. కావున అస్మిమాత్రము. ఇదియ మహత్తత్త్వము లేక 'మహాన్ ఆత్మా' ఇది ఎల్లజ్ఞానములకును మూలముకావున దీనిని బుద్ధితత్త్వ మనియు (7)నందురు. ఇది

---

(6) చేష్టా సంస్కారాంశముల పారిభాషికనామము మనస్సు వృత్తిరూపము చిత్తము.

(7) బుద్ధి యను పదమునకు తెలివి లేక జ్ఞానము అను అర్థమున సాధారణముగా దర్శనములుగూడ ఈ పదమును అనియతార్థములందు వాడెను. కావున నిది అపుడపుడు చిక్కులు కలిగించును. జ్ఞానము లన్నింటికిని మూలజ్ఞాన మేదియో అట్టి "నేను" అను జ్ఞానమే బుద్ధితత్త్వము. జ్ఞానము లన్నియు బుద్ధి, బుద్ధివృత్తి, చిత్తవృత్తి, ఈ మొదలుగా పెక్కువిధముల గౌణముగా వాదబడును. దీనికి కారణము లేకపోలేదు, ఏలనఁగా ఇవన్నియు బుద్ధితత్త్వచ్ఛాయలే. మఱియు కర్తవ్య నిశ్చయము ఆత్మనిశ్చయములందేకాక ఐంద్రియిక జ్ఞానములందును దీనికి ప్రయోగము కలదుగాని ఇవి యేవియు బుద్ధికి స్వరూపలక్షణములు కావు. అధ్యవసాయమనఁగా కర్తవ్యనిశ్చయ మని కొన్నిపట్ల ప్రయోగము కలదు. ముమ్మొదటి వ్యక్తతత్త్వమగు బుద్ధికిది లక్షణము కాదు. ఈ బుద్ధి తత్త్వమునకు క్రిందనున్న అన్ని కరణములయు మిశితకార్యము అధ్యవసాయము.

అసంకీర్ణమగు 'నేను' 'అస్మి' కావున 'మహాన్ ఆత్మా'. 'అభిమానమును పొఱ(
బ్రోలుచో శుద్ధుఁడ నగుదును' అను జ్ఞాన మందఱకును ఉండును. దాని చొప్పున
అభిమానత్యాగ మొనరించినచో మన కీ 'మహాన్ ఆత్మా' 'అస్మీతిమాత్రము'
'అస్మిత' అనుభవమునకు రాఁగలదు.

ఇట్టి అస్మిత మొదలుకొని భూతముల వఱకును ఉన్న తత్త్వము
లన్నియు మనచే తెలియఁబడును. (ప్రకాశ), మఱియు ఇవి పరివర్తనము
చెందును. అనఁగా సక్రియములగును, మఱియును ఆవరింపఁబడుటచే మనకు
తెలియని అంశ మొకటి ఇందు ఉన్నదనియు మనకు తెలియవచ్చును. సమస్త
ప్రకాశము లేక జ్ఞానము అప్రకాశముచే లేక అజ్ఞానముచే పొదుగఁబడియున్నది.
సమస్తక్రియయు జడతచే పొదుగఁబడియున్నది. కాన 'నేను' మొదలుకొని భూత
పర్యంత మంతయు ప్రకాశ క్రియాస్థితులచే (జడత) నిర్మితము. కాన మహ
త్తత్త్వము మొదలు పంచభూతముల వఱకును గల బాహ్యాంతరసమస్తజ్ఞేయ
పదార్థములకును ప్రకాశ క్రియాస్థితు లుపాదానకారణము.

ఈ మూటిలో ప్రకాశశీలమగు భావమునకు సత్త్వమనియును క్రియాశీల
మగు భావమునకు రజస్సు అనియును, స్థితి శీలమగు భావమునకు తమస్సు అని
యును పేళ్లు. వీనికి నిఁక మౌలిక విశ్లేషము దొరకదు. ఇవి మూలభావములే
కాని మఱి వీనికి మూలము లేదు (8) మూలము లేదు కాన నివి నిత్యములు.
మఱియు నివి అవినాభావులు. వీనికి ప్రకృతి యని పేరు. సత్త్వరజస్తమస్సులు
అను ఈమూఁటిని గుణము లని అందురు. గుణము లన ద్రవ్యాశ్రితములగు
ధర్మములు కావు. మఱి త్రాళ్లు అని అర్థము. ముప్పేటలు వైచిన త్రాటితో బంధ
నము చేయుదురు. అటులే సత్త్వరజస్తమస్సులు అను ముప్పేటత్రాటివంటి ప్రకృతిచే
పురుషుఁడు బంధింపఁబడును గావున సత్త్వరజస్తమస్సులకు గుణములని పేరు.

సృష్టి అనంతము. దానికి ఉపాదానకారణముగూడ అనంతమైతీరవలయును.
కావున అనంతమగు ప్రకాశము; అనంతమగు క్రియ, అనంతమగు జడతయు
ఈ సృష్టికి ఉపాదానకారణము. త్రిగుణస్వరూపమగు ఈ మూలోపాదానము పేరు
ప్రధానము లేక ప్రకృతి. అనంతమగు సత్త్వము, అనంతమగు రజస్సు, అనంత

(8) "మూలేమూలాభావా దమూలం మూలమ్" సాం.-సూ-1-67.

మగు తమస్సు, కలిసి ప్రకృతి అని ప్రకృతిని లక్షింపవచ్చును. లేదా సమపరిమిత మగు సత్త్వము, సమపరిమితమగు రజస్సు, సమపరిమితమగు తమస్సు: వెరసి ప్రకృతి యని లక్షింపవచ్చును. అనఁగా సత్త్వరజ స్తమస్సుల సామ్యావస్థ ప్రకృతి యన్నమాట.

ఏదే నొక తత్త్వమునకు ఉపాదాన కారణమును గూడ ఆ తత్త్వమునకు ప్రకృతియని యందురు. 'ప్రకృష్టముగా కార్యోత్పత్తి చేయునది ప్రకృతి' యని మిశ్రులు (9) ఈ లక్షణమునుబట్టి మహత్తత్త్వము అహంకారము తన్మాత్రములుగూడ ప్రకృతి. కాన త్రిగుణస్వరూపమగు ప్రకృతిని మూలప్రకృతి యనియు (10) మహదాదులను ప్రకృతి వికృతు లనియు సాంఖ్యకారిక లక్షించెను.

## అవ్యక్తము

శక్తి రూపముగా నుండునది, అనుమానముచే కనిపట్టనగునది, సాక్షాత్కారమున కయోగ్యమగునదియు అవ్యక్తతత్త్వమని చెప్పఁబడును. స్వవ్యాపారముచే పుట్టువు గొనునది, వ్యక్తతత్త్వము. ప్రకృతి సత్త్వరజస్తమ స్సామ్యావస్థ కావున స్వరూపముతో అవ్యక్తము. తమస్సెంతయో రజస్సంత. రజస్సెంతయో సత్త్వమును అంత. జడత యెంతో క్రియ అంత. క్రియ యెంతో ప్రకాశ మంత. ఈ మూఁడు సమాన మగుట అనగా నిది యర్థము. జడతయు క్రియయు సమానమగుచో క్రియ కనఁబడదు. క్రియ కనఁబడదనగా ప్రకాశము పడయ దని యర్థము. ఈ యవస్థ సాక్షాత్కారయోగ్యము కాదన్నమాట. క్రియచే రజస్సు ఉద్ఘాటితము కానినాఁడు సాక్షాత్జ్ఞానము కలుగదు. క్రియచే రజస్సు ఉద్ఘాటితమైనంతనే సాక్షాత్ జ్ఞానము కలుగును. కానిచో కలుగదు కావున ఆ యవస్థ అవ్యక్తము. పూర్తిగా ఇది అజ్ఞేయము కాదుగాని ధారణకుమాత్ర మయోగ్యము. ఈయవస్థ ఒకటి ఉన్న దని ఎఱుఁగనగునుగాని ఎటులున్నదో అది మాత్రము ధారణ కందదు. ఏపదార్థమేని వ్యక్తముగా తెలియఁబడనంత మాత్రమున అది

---

(9) "ప్రకరోతీతి ప్రకృతిః, ప్రకృతిత్వం తత్త్వాంతరోపాదానత్వమ్."

(10) "మూల ప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త. షోడశస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః"-సాం-కా-3.

లేదని అనుట చెల్లదు. ఉన్న ద్రవ్యములనుగూడ పలుకారణములచే మనము కనుఁగొనఁజాలము. మిగుల దవ్వు, మిగుల దాపు, ఇంద్రియవైకల్యము, అన్యమనస్కత, సౌక్ష్మ్యము, వ్యవధానము, అభిభవము (11) సమానాభిహారము (12) ఈ మొదలగు కారణములచే ఉన్న దానినే మనము కనుఁగొనజాలము (13) వీనిలో సూక్ష్మతాహేతువుచేతనే ప్రకృతి కానరాదుగాక; మఱి అసలు లేక కాదు. దాని కార్యములు కానఁబడుచున్నవి. కావున దాని ఉనికి ఉపలబ్ధ మగునుగదా! ఏవి దాని కార్యములు ? మహదాదులు! అవి ప్రకృతికి కొంతవట్టు సరూపములు. ఎటులు ? త్రిగుణమయము లగుటవలన. కొంతవట్టు విరూపములు. ఎటులు ? వ్యక్తము లగుటవలన (14) ఈ ప్రకృతి సూక్ష్మత యెట్టిది ? ఒక మోకును తుల్యబలము కల యిరువురు ఒకఁడొక చివరను ఇంకొకఁ డింకొక చివరను పట్టుకొని లాగుచున్నా రని అనుకొందము. ఆ మోకులో మనకు కనఁబడని యుద్ధమొకటి జరగుట లేదా ? విపరీతములగు రెండు శక్తులు తుల్యబలము కలవగుచో నే క్రియయు కానరాదు. కాని అలక్ష్యము అనఁగా కనిపట్టరాని ఒక సూక్ష్మక్రియ జరగుచున్నదని ఊహింపను మాత్రము వీలుకలుగును. ప్రకృతి సూక్ష్మతయు ఇట్టి అలక్ష్యమగు నవస్థయే. రాజసికమగు క్రియయు తామసిక మగు జడతయు తుల్యబలము లాయెనేని అపుడు వ్యక్తక్రియ యుండదు. అది కొంచెమేని ఉన్న చందము తెలియరాదు. అది ప్రకాశము పడయదు. అపుడు ప్రకాశము, క్రియ, స్థితి : ఈ మూఁడును కానరావు. ఇది అవ్యక్తావస్థ.

## సత్కార్యవాదము

కొండ బండ యుండలవలెఁగాని ఇచ్ఛాప్రేమ ద్వేషాదులవలెఁగాని సాక్షాదనుభవయోగ్యము కాకున్నను అవ్యక్త మను నొక వస్తువు కల దని ఒప్పక

(11) ప్రకాశ మధికమగుచో కన్ను చూడఁజాలదు.

(12) మినుముల రాశిలో ఒక మినుపగింజను కలిపివేసి మరల దానిని తీయఁబనిచినయెడల నది చేత కాని పని అగును. అట్టిది సమానాభిహారము.

(13) "అతిదూరాత్ సామీప్యా దింద్రియఘాతాత్మనోఽనవస్థానాత్ సౌక్ష్మ్యాద్. వ్యవధానా దభిభవాత్ సమానాభిహారాచ్చ" సాం. కా 7.

(14) సౌక్ష్మ్యాత్తదనుపలబ్ధిర్నా భావాత్కార్యత స్తదుపలబ్ధేః మహదాది తచ్చ కార్యం ప్రకృతి సరూపం విరూపం చ. సాం. కా. 8.

తప్పదు. ఏలయన్న బుద్ధ్యాదులు ఉత్పన్నములైన సత్పదార్థములు. ఇవి అసత్పదార్థమునుండి పుట్టనేరవు. సత్కారణమునుండియే సత్కార్యము కలుగుట నియమముగా కానిపించుచున్నది. సాంఖ్యులును యోగులును మూలకారణపర్యంతము నీ నియమము చూపుదురు. కాన వారిది సత్కార్యవాదము.

పుట్టఁబోవుముందు కార్యము తన కారణమునందు సూక్ష్మరూపముగా నుండును. ఏలయన లేని దెన్నఁడును ఉనికి గొనఁజాలదు. సదుపాదానకారణము నుండియే సత్కార్యము పుట్టును. అభావమునుండి భావోత్పత్తియని ఒప్పుకొనుచో దేనినుండి ఏదేనియు పుట్టుకొనిరావచ్చునని చెప్పుటయే యగును. అదిఅసంభవము. శక్తి లేనిదే కార్యమెటులు? కావున ఉన్న శక్తినుండియే శక్యమగు ద్రవ్యము పుట్టుచున్న దని అనవలయును. మఱియు కార్యమున్నచో కారణము ఉండి తీర వలెను. ఈదెస పుట్టుకకుముందు కార్యము సూక్ష్మరూపముతో కారణమునం దున్న దని తేలుచున్నది. లేమినుండి కలిమి పుట్టదు గనుకనే మహత్తత్త్వ ముత్పత్తికి మున్నుగూడ ఉనికిరూపుగనే యుండును. అది ఉనికిగొనియేయున్నదికాని అది కానరాకున్నది. ఈ కానరానితనమే అవ్యక్తప్రకృతి.

మహదాదులగు వ్యక్తవస్తువు లుత్పత్తిలయశీలములు. ఇట్టి వస్తువులకు కారణ ముండును. మఱియు కార్యమునందు కారణగుణము లుండును. కాన త్రిగుణాత్మకమగు వస్తు వొకటి వానికి మూలకారణము. మహత్తత్వము స్వకారణ మగు త్రిగుణాత్మకమగు వస్తువునుండి పుట్టి దానియంద లయమగును. మహత్త్వము వ్యక్తవస్తువు లన్నిఁటికిని మొదటిది. ఇది మిగిలిన వ్యక్తవస్తువు లన్నిటికిని కారణము. దీనికి లయ మవ్యక్తమున. కావుననే దీనికి కారణ మొక వ్యక్త వస్తువు కాదు. అది ఒక అవ్యక్తవస్తువు.

వ్యక్తమంతయు లింగము. అనఁగా లయశీలము (15) మహదాదులన్నియు స్వస్వకారణములందు లయమగును. మఱి అవ్యక్తమో అలింగము. లింగమను పదము స్వకారణమునకు జ్ఞాపకము అను నర్థముగూడఁ జెప్పును. బుద్ధి మొదలగునవి తమ తమ కారణములకు జ్ఞాపకములు, అవ్యక్తమునకు మఱి కారణము లేదుగాన అది దేనికిని లింగము కాదు.

---

(15) "లయం గచ్ఛతీతి లింగమ్."

త్రిగుణాత్మకమగు అవ్యక్తమునుండియే సకలమున కుత్పత్తి. ఈ త్రిగుణములును కలిసి కార్యమొనరించును కావున ఉత్పన్నమగు నాకార్య మొకటొకటిగనే ఉత్పన్నమగును. కారణములు మూఁడయినను మహదాది కార్యములలో ప్రతికార్యమును ఏకస్వరూపమే కలదై ఉత్పన్నమగును ([16]) కాని సత్త్వాదుల ప్రకాశాది విశేషముల ననుసరించియే గుణవికారము కలుగుచుండును. ఆశ్రయ భేదముచే ఒక కార్యము ప్రకాశ ప్రధానముగనే, వేఱొకటి క్రియప్రధానముగనే ఇంకొకటి స్థితి ప్రధానముగనే ఉద్భవించును.

అసంప్రజ్ఞాత సమాధిలో బుద్ధియు ఇంద్రియములును లయ మగును. ఆ అవ్యక్తభావము ప్రకృతి. 'గుణముల చరమరూప మెప్పుడును పట్టుపడదు'-([17])అని భాష్యము. ఇట్టి అవ్యక్తదశలో త్రిగుణ వికారములగు చిత్తేంద్రియములు లయము హొంది సమాధి భగ్నమగుటతోపాటు మఱల వ్యక్తము లగుటఁజేసి సాంఖ్య తత్త్వదృష్టిలో([18])అవ్యక్తము సత్స్వరూపము అని యోగులందురు. ఆత్మజ్ఞాన మొదవి చిద్రూపత నెలకొనుడు చిత్తాదు లవ్యక్తతలో మునియుఁగాన అపుడు ప్రకృతి అసద్రూపము. యోగభాష్య మిటులు చెప్పను-' అవ్యక్తము సత్తా-అసత్తా శూన్యము సత్తుగాని అసత్తుగాని కానిది, అసత్తును కానిది'([19])అనఁగా 'పరమార్థ

(16) "పరిణామైకత్వా ద్వస్తుతత్త్వమ్." (యో. సూ. 4-14)

(17) "గుణానాం పరమం రూపం న దృష్టిపథ మర్ఛతి" (యోభా.4-13)

(18) "ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్య శ్చ పరం మనః
మనసస్తు పరా బుద్ధిర్ బుద్ధే రాత్మా మహాన్ పరః
మహతః పర మవ్యక్త మవ్యక్తాత్ పురుషః పరః
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః"[కఠ 1-3-10.11]

(19) —..."ని స్సత్తాసత్తం ని స్సదస న్నిరస దవ్యక్తమ్ (యోగభాష-2-19) ని స్సత్తాసత్తమ్. పురుషార్థసంపాదకత లేనిదయ్యు శూన్యము కానిది. నిస్సదసత్-స్థూలకార్యము సూక్ష్మకారణములు లేనిది అనఁగా కార్యకారణములు లేనిది. నిరసత్-అసత్తు కానిది అనఁగా భావ పదార్థము అని వ్యాఖ్యావిశేషములు,

ఈ కఠమే సాంఖ్యులకును యోగులకును తత్త్వములయెడ ప్రమాణము. బాదరాయణులు ఈ విషయ మెల్ల ఖండించిరి. "అనుమానిక మప్యేకేషా మితిచేన్నశరీర రూపక విన్యస్తగృహీతే ర్దర్శయతిచ"1-41, "ఇతరేషాంచా నుపలబ్ధేః" 2-1-2. "ఏతేన యోగః ప్రత్యుక్తః" 2-1-3, ఈ మొదలగు బ్రహ్మ సూత్రములును శంకరభాష్యమును చూచునది.

దృష్టిలో చరితార్థమగుడు బుద్ధి సత్తు కాదు-అనుభావ్యము కాదు, మఱి సాంఖ్య తత్త్వదృష్టిలో అసత్తును కాదు' అని తాత్పర్యము.

అవ్యక్తావస్థ క్రియాహీనము. ఈ యవస్థలో విశ్వప్రకృతి లీనమయి యుండును. ఇది స్థాయికాదు. ఏలయన ప్రకృతికి పరిణమించు స్వభావముకలదు. సృష్టికి పూర్వము ప్రకృతి యిటులు విశ్రాంతి గొనును. కాని పరిణమించు స్వభావము కల దానికి ఈ యవస్థ నిత్యముకాదు. అపుడు అదృష్టవశమున వ్యక్తావస్థ. దీనికి పరిణతి ఉన్నను ధ్వంసము లేదు. కాన నిత్యము అవస్థాంతర ప్రాప్తి పరిణామము. ఇది అభావము ధ్వంసము నాశముకాదు. పరిణామముననే విచిత్రసృష్టి. దీనికి విరామము లేదు. దేశము లేక కాలము అవలంబముగా సృష్టి. దీని ప్రవాహము అనాది, అనంతము. ప్రకృతి పరిణామమునకు కాలవ్యాప్తిగాని దేశవ్యాప్తిగాని లేదు. గుణముల వైషమ్యమే క్రియాస్ఫూర్తి. అపుడ సృష్టివికాసము. గుణములు గుణములు'అని అనుచో ప్రకృతి అనియే మనకవగతమగును. పరిణామ మనిన సృష్టి కభిముఖమగు క్రియ. ఒకదానిచే మఱియొకదాని నియంత్రణమే యీ క్రియా స్వభావము. స్పందము వేగము నియంత్రణమును ఇవి గుణ వైషమ్యముననఁగాని కలుగవు. అపుడ ప్రకృతికి వ్యక్తావస్థ. ఈ యవస్థలో, ఒక గుణమింకొక గుణమును అభిభవించును. ఒకటి సత్త్వమునకు వేఱొకటి రజస్సునకు కొండొకటి తమస్సునకు. దీన వస్తుగతమగు స్వభావము భేదించును. ఒక ప్రకృతియొక్కయే పరిణామము ఈ విశ్వము. కానీ పరిణతమగు పదార్థముల స్వభావమొకటికాదు. లోనున్న గుణ ధర్మముబట్టి పదార్థస్వభావము ఏర్పడును. దీనఁజేసి వస్తువైవిధ్యము. వానిలో గుణధర్మ సంచారమును సంక్షోభమును వేఱు వేఱు. ఇంతియకాక ఒక వస్తువునందే వేఱువేఱు వేళల ఈ సంచార సంక్షోభములు వేఱువేఱు. దీనఁజేసి వస్తువిశేషములందు నానావస్థల పుట్టుక. పరిణతి ప్రకృతి స్వభావము. దీనికి విరతిలేదు.

పరిణామమునకును ఒకరీతి కలదు. ఇది నియమబద్ధము. కారణస్వరూపము కార్యమందు స్ఫుటమగును. అది అనురూప పరిణామము. నూవులనుండియే నూనె గాని యిసుకనుండి రాదు. పరిణతి శృంఖలాబద్ధముగాన సృష్టిలో శ్రేణీ విన్యాసము, సంగతి, పర్యాయము కానిపించును. కాని అన్నిటికి మొదట గుణధర్మానుగతమగు సంచారము. సంచార విశేషముచే పరిణతికి వైశ్వరూప్యము.

గుణములు మూఁడును పరస్పరోపరక్తములు. సత్త్వము రజస్తమస్సులచే రజస్సు సత్త్వతమస్సులచే, తమస్సు సత్త్వరజస్సులచే ననుగతము. అవి ఏయె

దను విడిపోవు. మఱి విడిగా కార్యము చేయవు. ఇవి కలసి క్రియాశీలము లగుడు భూతేంద్రియ పరిణామము. ఇవి ఒండొకటి కలిసి మిథునములయినను విడిగనే ఉన్నట్టులు పరిణతదశలో కానిపించును. పరిణతిలో ప్రత్యేక గుణవిశేష మావశ్యకము. ఇటులని వీని కలిసికట్టుతనమునకు విలయము లేదు. సత్త్వమధికమగుచో మిగులు రెండును అడఁగియుండును. ఇటులే మిగిలినవియు. సత్త్వము ప్రధానమయినచోట ప్రకాశ మాత్రము సత్త్వము. ప్రకాశక్రియ రజస్సుది. ప్రకాశ సంరక్షణము లేక స్థితి తమస్సుది. ఇటులే మిగిలిన వానియెడ నరయునది. ఈ రీతిగా గుణముల క్రియ నిష్పన్న మగును.

ప్రపంచమున ప్రతివస్తువుగూడ దేనియో సుసూక్ష్మమగు పరిణామ మని అనుమానముచే సాధింపనగును. ఇంతియకాక తన్మాత్రములకడనుండి మహత్తత్త్వము వఱకును తత్త్వములు సమాధిజమగు ప్రజ్ఞలో సాక్షాదనుభవగమ్యములు. ఈరెస 'పరిణామమునకెల్ల మూలము ప్రకృతిలో' అని తెలిసివచ్చును. వ్యక్తావస్థలో సృష్టి భిన్నపర్యాయమయ్యు పరిణామ వాదమున నిది పర్యాయి నిత్యత కాదు. గుణధర్మనివేశభేదముచే వస్తుపర్యాయము మార్పుచెందును. మూలప్రకృతియొక్క వికృతులు మాత్రము మాఱవు. కాని గుణసమావేశముచే వ్యక్తి మాఱనగును. వ్యక్తినిగాని జాతినిగాని ఎపుడును ఒకే రీతిగా నుంపఁగల నియామకతలేదు. 'సాధన పురుషకారములచే మనుష్యుఁడు మనుష్యత బాసి దైవముగా పరిణమింపవచ్చును' అని భాష్యము (20)

నిత్యము పరిణామినియగు నీ ప్రకృతితోడను మఱియు నిత్యుఁడును అపరిణామియునగు పురుషునితోడను సృష్టి. ఇటులయ్యు ప్రకృతియొక్కయే పరిణామము సృష్టి. ఇది స్వాభావికము. ఈ పరిణామమున కేమేని ఉద్దేశము కలదా? కలదు - ఒక దెస పురుషుని భోగము. మఱియొక దెస అపవర్గము. ప్రకృతి పురుషుని ఆకర్షించి ఐశ్వర్యానందము లొసఁగు చందముననే ఆధ్యాసిక బంధమునుండియు నిష్కృతి కలిగించును. ప్రకృతిక్రియ యెల్ల - సృష్టిగాని సృష్ట్యుపసంహృతి కాని పురుషుని గూర్చి ఏల? అది జడము. తన పనికి తన వఱ్ఱ నేమి ఫలము? పురుషపట్ల తనపని సార్థకము.

---

(20) [యో-సూ-భా-4-8]

కేవల ప్రకృతి సృష్టి చేయలేదు అది పురుషోపదృష్టము కావలయును. ఇటులని పురుషేచ్ఛగాని ప్రయోజనముగాని సృష్టికి కారణముగాదు. పురుషునకు ప్రయోజన మేమియులేదు. ఆ ప్రయోజనము ప్రకృతికే. జడమున కేటి ప్రయోజనము? పురుష సంస్పర్శలో ఈ ప్రయోజనమునకు అభివ్యక్తి. దీన అవ్యక్తత తొలఁగుటయు వ్యక్తత ఏర్పడుటయు సిద్ధించును.

౨౪

ఇరువది యయిదు తత్త్వముల కూర్పు ప్రపంచము. ఆ తత్త్వము లివి: మూల ప్రకృతి ఒకటి. మహ దహంకార పంచతన్మాత్రము లేడు ([1]) భూతములు, మనసుతో కలిసి ఇంద్రియములును పదునాఱు ([2]) పురుషు ([3]) డొకటి. వెరసి ఇరువదియయిదు.

ఈ తత్త్వములలో అహంకారతత్త్వము అభిమానాత్మకము కావున ఇంద్రియములకు కారణ మని కనుఁగొనవచ్చును. అహంకారము శుద్ధమగు బుద్ధికార్యమనియు తెలిసికొనవచ్చును. ఈబుద్ధియే అస్మిత-సత్త్వము. లేక మహత్తత్త్వము. మహత్తత్త్వము మూలప్రకృతికార్యము. ఇట్టి మూలప్రకృతి పురుషులతో కలిసి మహాప్రలయానంతరమున మహత్తత్త్వమునకు (లకును) కారణమగును.

పురుషుడు శాంతాత్మ, చిద్రూపుడు, విజ్ఞాత. ఎఱుగువానికి ఎఱుకలేక పోవుట యనునదుండదు గాన ([4]) విజ్ఞాత వికారములేనివాడు. కాని ప్రపంచ

---

(1) మహత్తత్వము ప్రకృతికి వికృతి. దాని కహంకారము వికృతి. దానికి తన్మాత్ర పంచకము వికృతి. మఱి తన్మాత్రముల కహంకారము ప్రకృతి, దానికి మహత్తత్త్వము ప్రకృతి. కావున ఈ యేడింటికిని ప్రకృతి వికృతులని పేరు.

(2) ఈ పదునాఱింటికి వికృతులని పేరు. ఇవి దేనికిని ప్రకృతులు కావు. భూతములు హిరణ్యగర్భుని అహంకారమునకును ఇంద్రియములాయాయా పురుషుల అహంకారమునకును వికృతులు. కాఁగా ఇవి వికారము.

(3) పురుషుడు దేనికిని ప్రకృతిగాని వికృతిగాని కాదు.

(4) -'న హి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే'-బృహ.

మున వికారము కలదు. కాన దానికిని ఒక హేతు వుండవలయును. అది ప్రకృతి లేక దృశ్యము. దృశ్యముండునేని ద్రష్టయు నుండును. ఈ రెండును చీకటి వెలుగులవలె వేఱు. వీనికి ఆధారాధేయతలు లేవు. దేశకాలాతీతమగు వస్తువుల కాధారాధేయకల్పన మదార్శనికము (5) కాన వీనికి కలయిక యెటులు? ద్రష్టయెడ (విషయి) దృశ్యాధ్యాసయు దృశ్యమునెడ (విషయ) ద్రష్ట్రధ్యాసయు కలుగుటయే యీ కలయిక. అధ్యాసచే (6) ద్రష్ట దృశ్యమువలెను, దృశ్యము దష్టవలెను కనుపట్టును. మన అందఱయు మహదాత్మ సరిగా అట్టిది(7) పురుషునిచే చూడబడిన ప్రకృతికి కలిగిన తొలిబిడ్డ మహదాత్మ. ఇదియ అస్మితామాత్రము, లేక శుద్ధబుద్ధి. దాన నుండి అహంకారము. అహంకారమునుండి కరణములు.

బద్ధపురుషుల లింగశరీరశక్తిచే (కరణశక్తి) దేహములు ఉద్భవించును. ఈ రీతిగా ఏ పురుషుని సృష్టి ఆ పురుషునిదే. ఇది తత్త్వదృష్టిలో ప్రతిపురుషసృష్టి.

ఈ తత్త్వదృష్టిలో అనగా తత్త్వములలో పురుషతత్త్వమే కాని ఈశ్వర తత్త్వములేమి మహా భూతసృష్టియు బ్రహ్మాండ సృష్టియు నెటు లాయె నని శంక కలుగును. అనగా ఎవని అహంకారతత్త్వము-ఎవని మహత్తత్త్వము-ఎవని అంతఃకరణ మీ బ్రహ్మాండమును సృజించుచున్నది? ఈ జగత్కర్తయెవరు?

---

(5) మాయావాద మిదియే చేసెను-బ్రహ్మములో అవ్యాకృత శక్తిరూపముగా ప్రకృతి కలదు. ఈ ప్రకృతి మిథ్యయే. అనగా కల్పనయే. ఇట్టి బ్రహ్మము గూడ నిర్వికారమగునా? ఈ కల్పనయు ఒకవిధమగు వికారము కాదా? మఱియు ప్రకృతియన్న అవిద్య [చూ. గీతాభాష్య ౧౩-౨౨] అవిద్యయన్న ఒకదానియందు మఱొకదాని జ్ఞానము. ఇదియ యధ్యాస లేక యజ్ఞాన మని మాయావాదము. జ్ఞాన మున్నచో జ్ఞాతయు జ్ఞేయమును స్మృతి యీ మొదలగునవియు ఉండవలయును. 'అమనాః' అని చెప్పబడు శుద్ధ చైతన్యమునం దివి యెటులు కల్పనీయములు?

(6) 'అనిత్యా శుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా' [యో. ద. ౨-౫] మఱియు-'విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్' [యో. ద. ౧-౮]

(7) పురుషుని మహత్తత్త్వము లింగము. 'చేతనావదివ లింగమ్' అని సాంఖ్యకారిక.

## స్రష్ట

సాస్మితసమాధిలో సిద్ధి పొంది (8) దేహత్యాగమొనరించిన యోగి సంజ్ఞా సంజ్ఞి నామకమగు దేవత్వము అనగా సగుణ బ్రహ్మసారూప్యము గొని మహా ప్రలయము దనుక సత్యలోకమున (9) నుండును. ఈతనికి సర్వజ్ఞతయు సర్వాధిష్ఠాతృత్వమును కలుగును. ఇట్టివానిని పూర్వసిద్ధుడని (10) యోగులందురు. 'పూర్వము హిరణ్యగర్భు డుండెను. అతఁడు పుట్టి భూతముల కేకమాత్రాధిపతియాయె'నని శ్రుతి చెప్పును (11). ఈ పూర్వసిద్ధునకు ఈ హిరణ్యగర్భునకు-ఈ జన్యేశ్వరునకు-ఉచితమగు పూర్వైశ్వర్య స్వభావముచే బ్రహ్మాండ మభివ్యక్తమగును. (ధాతా యథాపూర్వ మకల్పయత్-బ్రహ్మ తొల్లిటివలె సృష్టిచేసెను) 'నేను సర్వభూతములయందును ఉన్నవాడను, సర్వమునకును అధిష్ఠాతను' అను

---

(8) 'వితర్క విచారాస్మితా నందానుగమాత్ సంప్రజ్ఞాతః' [యో. ద. ౧-౧౯].

(9) 'సత్యలోకే చత్వారో దేవ నికాయా అకృత భవనన్యాసా స్స్వప్రతిష్ఠా ఉపర్యుపరి స్థితాః ప్రధాన వశినో యావత్ సర్గాయుషః! తత్రాచ్యుతాస్సవితర్క-ధ్యానసుఖాః శుద్ధనివాసాః సవిచార ధ్యానసుఖాః సత్యాభా ఆనందమాత్ర ధ్యానసుఖాః సంజ్ఞా సంజ్ఞినశ్చాస్మితా మాత్రధ్యానసుఖాః' [చూ. యోగ, ద భాష్య ౩-౨౬]

(10) 'యత్ర కామావసాయిత్వం సత్యసంకల్పతా యథా సంకల్పస్తథా భూతప్రకృతీనా మవస్థానమ్. న చ శక్తోఽపి పదార్థ విపర్యాసం కరోతి. కస్మాత్? అన్యస్య యత్ర కామావసాయినః పూర్వసిద్ధస్య తథా భూతేషు సంకల్పాత్.

(11) హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే
భూతస్య జాతః పతి రేక ఆసీత్
సదాధార పృథివీ ముత ద్యామ్.
ఋక్-౧౨

హిరణ్యం - అత్యుజ్జ్వలమగు జ్ఞానము, గర్భః-అంతస్సారముగా గలవాడు.

నది ఐశసంస్కారము. ఇట్టి సంస్కారములో భూతములును వానిలో ఈశునుని కియు గలవు. కావున ఈక్షాపూర్వక సృష్టియు నిరీక్షా పూర్వక సృష్టియు (12) సంగతములు. ఇది అలలులేని సముద్రమువంటి సృష్టి. అనగా దీన పురుషకారము లేదు. ఏలయన తొల్లిటి ఐశసంస్కారవశమున సృష్టి ఊర్పులవలె స్వాభావికముగనే జరిగినటులు జరిగిపోవును.

పూర్వసిద్ధుడు లేక హిరణ్యగర్భు డావిర్భవించె ననగా అతనితోపాటు బ్రహ్మాండ మావిర్భవించె నన్నమాట. పురుషుల భోగాపవర్గముల కాతడు ద్వారము. అతడు మంచి రోజు చూచికొని ఇదే మొదలుగా విషమమగు నీసృష్టిని క్రొత్తగా ఆరంభింపలేదు. కాని యిపుడు కనబడు ఈ బ్రహ్మాండము ఒక నిర్దిష్టసమయమున ఆవిర్భవించెను. దీనికి ముందు ముందుగూడ పాంచభౌతికములగు బ్రహ్మాండములు కడచన్నవి. సృష్టి అనాది. హిరణ్యగర్భుని ఆవిర్భావములో జీవకోటుల కర్మపరిపాకము లేక పరిణామ మిమిడియున్నది. క్లేశకర్మఫల మగు ఎవరిసంసారము వారిది. సత్త్వపురుషాన్యతాఖ్యాతి రూపమగు ఎవరి మోక్షము వారిది. వీనిలో హిరణ్యగర్భుని చేయి (13) లేదు. ఇది అనుమాన సహితమగు ఆగమదృష్టి.

## మహాన్ ఆత్మ లేక మహత్తత్త్వము ఆత్మ

అనుభవము ననుసరించి చూచుచో మన అందఱియు మనస్సుల ప్రథమాంకురము 'నేను' అనునది. అదియే అస్మిత. అది అంతట ఇంద్రియములకు తానై వానిలో నొకటిప్తై వానికి వశమై 'నాకు' అది కావలయు, నిది కావలయు ననియు క్రమక్రమముగా నేనిట్టివాడ నట్టివాడ ననియు, నే నింతవాడ నంతవాడ

---

(12) ఈక్ష-ఇచ్ఛ లెక సంకల్పము.

(13) అటు లున్నటులు చెప్పు పురాణాదులు స్తావకములు. హిరణ్యగర్భుని ఈశ్వరుడనుటయు స్తావకము. ఈశ్వరుఁ డొక్కఁ డనిన నొక్కఁడే. అతడు పురుషవిశేషుడు, నిత్యముక్తుడు. ఇతడు ఈ హిరణ్యగర్భుడు ఇంకను బద్ధుడు. ఇతనిని జన్యేశ్వరు డని యందురు.

ననియు అనుకొనుటయ కాక అనును. ఉద్రిక్తసత్త్వమైన అవ్యక్తము పురుషోప దృష్టమయి నపుడు అది మహత్తత్త్వముగా పరిణమించును. 'మహత్తత్త్వము మొదటి కార్యము, అది మనస్సు అని సాంఖ్యులు చెప్పుదురు. (14) యోగదర్శన మున మహత్తత్త్వము లేక మహదాత్మయనగా అస్మితామాత్రబోధ.-'సత్తామాత్ర మగు మహదాత్మయందు-కేవలాస్మిత యందు-ఉండి అహంకారాదులు షోడశ వికార రూపమగు వృద్ధిని బొందును, మఱి మహదాత్మయందే లయము చెందును' (15) అని యోగభాష్యము చెప్పును.

'ఇంద్రియములను మనస్సునందును, మనస్సును జ్ఞానాత్మయందును, జ్ఞానాత్మను మహదాత్మ యందును, (16) మహదాత్మను శాంతాత్మయందును నియమించునది' అను కఠశ్రుతికి ఫలము——'అల్ల నలుసంత తన్నెఱిగి తానే అల్లంత అని ఎఱుగు (17) ట'ని పంచశిఖాచార్యులందురు.-'అస్మితా సమాపన్న మగు చిత్తము అలలు లేని మహోదధివలె శాంతమును అనంతమును అస్మితా మాత్రమును అగును' అని వ్యాస భాష్యము (18), ఈ దెస పురుషోపదృష్టమగు మహత్తత్త్వము లేక మహదాత్మ జగత్కర్త. ఇతడే ప్రథమజీవుడు.

ఇక శ్రుతులను విందము.

---

(14) 'మహదాఖ్య మాద్యం కార్యం తన్మనః' సాం. కా.

(15)...ఏతే [షడవిశేషాః] సత్తా మాత్ర స్యాత్మనో మహతః ష డ విశేష పరిణామాః. య త్తత్పరమ విశేషేభ్యో లింగమాత్రం మహత్తత్త్వం తస్మి న్నేతే సత్తామాత్రే మహత్యాత్మ న్యవస్థాయ వివృద్ధికాష్ఠా మనుభవన్తి, ప్రతి సంసృజ్యమానాశ్చ తస్మి న్నేవ సత్తామాత్రే మహ త్యాత్మన్యవస్థాయ యత్త న్నిస్సత్తాసత్తం నిస్స దస న్నిరస దవ్యక్త మలింగం ప్రధానం తత్ ప్రతియన్తి. [౧-౧౯]

(16) యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని జ్ఞాన మాత్మని మహతి తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని.

(17) -త మణుమాత్ర మాత్మాన మనువి ద్యాస్మీ త్యేవం తావత్ సంప్రజానీతే.'

(18)-'తథా చాస్మితాయాం సమాపన్నంచిత్తం నిస్తరంగ మహోదధి కల్పం శాంత మనంత మస్మితామాత్రం భవతి' [౧.౩౬]

## ఆత్మ-అక్షరుడు-హిరణ్యగర్భుడు

'మొదట ఆత్మ ఒకటియే యుండెను......అది లోకములను సృజింప జూచెను' అని [19] ఐతరేయము. అస్మితా బోధకంబె వేఱ ఆత్మ యుండదు. బ్రహ్మాండసృష్టికిని మున్మొదట ఆత్మ. అనగా అస్మితామాత్రము. పిదప సంకల్పము. వ్యక్తద్రవ్యములలో అనులోమముగా తొట్టతొలుతదియు విలోమముగా చిట్టచివరదియు మహదాత్మ. ఇదియ శ్రుత్యుక్తమగు ఆత్మ.

'మనః ప్రాణాదు లక్షరునుండి పొడమి అక్షరునందే లయ మగు ననియు ఇంతియ కాక అక్షరునుండియే' యీ బ్రహ్మాండ మావిర్భవించి అక్షరునందే లీన మగుననియు ముండకము [20] చెప్పును. మహదాత్మ యిట్టిదని వెనుక చూచి యుంటిమి. ఇక హిరణ్యగర్భుడు బ్రహ్మాండము సృజించి ధరించుననియు శ్రుతిచెప్పుటచే ఈ హిరణ్యగర్భరూప పురుషుని మొదటి అస్మిత-మహదాత్మ, అక్షరుడు 'నేను పలువు రగుదును గాక, పుట్టుదును గాక' అని [21] ఆత్మ తలపోసినటులు శ్రుతి వర్ణించుటచే స్రష్టకు మున్మొదట 'నేను'-'అహమ్'- ఉన్నది, కావున ఆ నేను- ఆ. అహమ్'- జగత్ కారణము.

అక్షరునుండి మనఃప్రాణాదుల పుట్టుకకదా! కాగా ఈ యక్షరుడు మన అందఱలోనను కలడనియు మన అందఱకును ఆత్మవిశేష మనియు తెల్లము. ప్రాణాదు లందఱయు కరణములు. అవి మన అస్మిత-లేక-అభిమానము నుండి

---

(19) 'ఆత్మావా ఇద మేక ఏ వ అగ్ర ఆసీత్...న ఐక్షత లోకాన్ను సృజా ఇతి'

(20) యథా సుదీప్తాత్ పావకా ద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే స రూపాః
తథాఽక్షరాద్ వివిధా స్సోమ్య భావాః
ప్రజాయంతే తత్రచైవాపి య న్తి [౨-౧]
ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ
ఖం వాయుర్ జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ. [౨-౨]

(21) బహూస్యాం ప్రజాయేయ [వై].

పొడమును. ఇటులగుటచే మన అందఱిలో నున్న అక్షరుడు మన మొదటి అస్మిత లేక మహత్తత్త్వము ఇది మన కరణములన్నిటికిని మూలము.

మహదాత్మ అవ్యక్తమున లయించును. అవ్యక్తము పైని చిద్రూపుడగు పురుషుడు. పురుషపద మిచట జాతిపరము. కావున ఇతడు (మహదాత్మ) మన అందఱిలోను జీవాత్మగా భాసించువాడును హిరణ్యగర్భునిలో ప్రథమజీవుడుగా భాసించువాడునగు పురుషుడు. అసలితడు నిర్గుణుడు, అసంగుడు. దీనివలన మన అందఱియు హిరణ్యగర్భునియు మహదాత్మయే శ్రుతియందలి అక్షర పురుషుడు. అహంకారాది వికారములతో పోల్చిచూడగా నితడక్షరుడు. ఇంతియ కాక నిర్వికార పురుషుని ప్రతిచ్ఛాయ కాన నితడక్షరుడు. ఇక పరమాక్షరుడో శాంతాత్మ లేక నిర్గుణపురుషుడు. అతఁడు-'అక్షరునికంటె చాల పరుడ'ని (22) శ్రుతి చెప్పును. ఇతడు - అక్షరుడు-అందఱిలోను హిరణ్యగర్భునిలోను ఉన్న పురుషుడే. అనగా అందరిలోగల మహదాత్మ చిజ్జడగ్రంథి (23). ఇతడు ముక్తేశ్వరుడు కాడు అని గుర్తించునది.

## మహదాత్మ - హిరణ్యగర్భుడు

మహదాత్మ పురుషు లందఱియు చరమ-అస్మిత. కావున మహదాత్మ అసంఖ్యము. మహదాత్మలలో నెవరి మహదాత్మ నుండి వారివారి అహంకారము మనస్సు ప్రాణము పొడమును.

హిరణ్యగర్భుని మహదాత్మనుండి- అక్షరునుండి- ఐశసంకల్పము దాన బ్రహ్మాండము పొడమును. అత డన్ని రూపములందును, ప్రతిరూపము. మఱియు నతడు భూమి మొదలుగా ఎల్ల భూతములకును ఏకమాత్రాంతరాత్మ. అంతరాత్మ

---

(22) అక్షరాత్ పరతః పరః [ము-౨-౨]

(23) ఉపనిషత్తులలో పలుతావుల నిర్గుణ పురుషపరముగా అక్షరశబ్ద ముపయోగింపబడెను. బృహదారణ్యక మీయర్థమున ఎక్కువగా వాడెను. ముండకము ఎవరికిని సందియము కలుగకుండ అక్షరపదమును నిలిపెను. ఇది సగుణ పరము. కావుననే ప్రాకృతోపాధి గల ఏపురుషుడేని అక్షరుడు, అక్షరుడే హిరణ్యగర్భుడని శ్రుతియే విశదీకరించెను.

యనగా లింగశరీరము. హిరణ్యగర్భుని భూతాది ([24])యను పేరియహంకారమున నీ బ్రహ్మాండము నిలిచియున్నది. బండిచక్రపు కుండలో ఆకులున్న చందముగా భూతము లన్నియు అతనిలో నున్నవి-'ఏక స్తథా సర్వభూతాంతరాత్మా.' ఈభూత ములను సృజించినది హిరణ్యగర్భుని అంతరాత్మ లేక అంతఃకరణము. అనగా లింగము. ఈబ్రహ్మాండమున రూపరూపమునను ప్రతిరూపముగా పరిణతమయిన 'ఆత్మ' అనగా అంతఃకరణముఒకటియే వేఱువేఱుప్రాణుల ఆత్మవేఱువేఱు. ఆ యీ హిరణ్యగర్భు డొకడే-ఏకః శ్రుతి యిచట నిర్గుణ పురుషజాతిపరము కాదు. రూపురూపునను ప్రతిరూపుగా పరిణతమయిన అంతఃకరణము హిరణ్య గర్భునిదే. కావున బ్రహ్మాండమునకు హిరణ్య గర్భరూపమగు ఆత్మ ఒకటియే.

హిరణ్యగర్భుడు జన్యేశ్వరుడగుటచే, అనగా పుట్టిన వాడగుటచే నితనికి జాత్యాయురోభోగము లున్నవి. సాస్మితసమాదిసిద్ధి శాంతము సర్వజ్ఞము సర్వ గతము సర్వాధీశము. హిరణ్యగర్భుడు ఈ జ్ఞానముతో పుట్టును. జ్ఞానమనగా లింగము లేక కరణశక్తి. లింగము నిరాశ్రయమై ఉండజాలదు. కాన హిరణ్య గర్భునకును ఒక శరీరము ఉండవలెను. సంస్కారము లేదుగాన స్థూలశరీరము ఉండదు. శ్రుతి యీ హిరణ్యగర్భుని-మహదాత్మను పెక్కుచోటుల ప్రాణమని వ్యపదేశించును. ప్రాణము శరీరమును నిలువరించు నట్టులు ఇతడు ఈ బ్రహ్మాం డమును నిలువరించును. శ్రుతి యితనిని మనస్సనియు చెప్పను- 'మనోమయః ప్రాణశరీరనేతా' జ్ఞానబాహుళ్యమిట వివక్షితము. కాగా ఇచ్ఛామాత్రమున వికసించు దివ్యశ్రవణాదికరణశక్తియు సర్వవ్యాపిత్వమునకును సర్వభావాధిష్ఠా తృత్వమునకును ఉపయుక్తమగు ప్రాణశక్తియు 'ఇది యెల్లయు నేనే; నేనే యీ యెల్లయు' అను అనుభవరూపమగు జ్ఞానశక్తియుగల ద్రష్టకు ఛాయకాన ద్రష్ట వంటి వాడు. సూక్ష్మశరీర మితని కుండును. దీనిని సూక్ష్మశరీరమనుట కంటె అస్మితాశరీర మనుటయ క్షేమము. దీనికి బ్రహ్మాండాభివ్యక్తి రూపమగు కర్మయు కలదు.

---

(24) 'సంప్రజ్ఞాతే సోపాధికావస్థాయాం సర్వభూతే ష్వాత్మాన మను స్యూతం పశ్యతి-'అహమేవేదమ్; సర్వోస్మీత్య' నుభవతీత్యర్థః' అని భారతము నందలి- సర్వభూతేషు చాత్మానమ్-' అనుదానికి నీలకంఠుని వ్యాఖ్య.

మఱియు అందఱలో నున్న మహదాత్మయే గ్రహీత లేక జీవుడు (25). ఇతడు నిర్వికారుడగు ద్రష్టకు ఛాయకాన ద్రష్టవంటివాడు. ఇతడు ద్రష్ట కత్యంతము విరూపుడును సరూపుడును కాడని యోగులందురు (26) కాన నితనిని గూడ అజుడనియు అమృతు డనియు నందురు.

మఱియు మహదాత్మ ప్రత్యక్చేతనుడు. ఈశ్వరు డెటులు ధర్మాధర్మ రహితుడో అవిద్యాది స్పర్శహీనుడో జాత్యాయుర్భోగశూన్యుడో బుద్ధిప్రతిసంవేదియగు పురుషుడును అట్టి వాడు; అట్టి యీప్రత్యక్ చేతనుని (27) లేక ప్రత్యగాత్మని సాక్షాత్కార మొదవునని (28) యోగభాష్యము. జీవాత్మ తొలుత శుద్ధ మహదాత్మ యని దీనికి సారము. మనసుతో తాదాత్మ్యము చెందినవాడు జీవాత్మ. చెందనివాడు మహదాత్మ, చిన్న అక్షరుడు.

మనసుతో తాదాత్మ్యము చెందిన జీవుడు మహదాత్మను తెలిసికొనియో ప్రత్యఙ్మహదాత్మోపలబ్ధి నెనసియో, హిరణ్యగర్భుని ధ్యానించియో మఱి పరమేశ్వర ప్రణిధానమున అంతరాయము లెడసి నిర్బీజసమాధి గొనియో నిర్వికార ద్రష్ట కావలయును. అనగా శాంతాత్మ. ఇదియ స్వరూపస్థితి.

ఇటులు అనుమానముచేతను ఆగమము చేతను జగత్కర్త ఒకడు సిద్ధించుచున్నాడు. పూర్వసిద్ధుడు అక్షరుడు హిరణ్యగర్భుడు ప్రజాపతి బ్రహ్మ సగుణ బ్రహ్మ ఈశ్వరుడు మొదలగున వితని నామవిశేషములే. క్లేశకర్మాదు లంటని యీశ్వరుడు నిత్యముక్తుడు. అతడు ఈశ్వరేశ్వరుడు.

హిరణ్యగర్భుడు మహదాత్మను (29) విడనాడి శాంతాత్మతను బడసి ముక్తుడగు నెడల బ్రహ్మాండము లీనమగును. ఈ దెస ముక్తిపదమునకు క్రింద నున్న సగుణ బ్రహ్మ జగత్కర్త.

---

(25) ఇది ఈశ్వర ప్రకృతి అని గీత-జీవభూతా, మాయావాదులును జీవాఖ్యయగు బుద్ధి అని అందురు.

(26) సబుద్ధేర్న సరూపో నాత్యంతం విరూప ఇతి-౨-౨౦. [యో.ద భాష్య]

(27) ప్రతీపమ్-విపరీతమ్, అంచతి-విజానాతి. ఆత్మకు విపరీతమగు అనాత్మ భావము చెందువాడు, అని వాచస్పతి.

(2) యత్త్వేవేశ్వరః పురుషః శుద్ధః ప్రసన్నః కేవలో నుపసర్గ స్తథా యమపి. బుద్ధేః ప్రతిసంవేదీ యఃపురుష ఇత్యేవ మధిగచ్ఛతి. [౧-౨౯]

(29) శంకరుల మహాన్ ఆత్మ మహత్తత్త్వము కాదు. వారి మతమున మహత్తత్త్వము శ్రౌతముకాదు. మహాయానబౌద్ధుల మహాత్మ అద్వైతులు చెప్పు ఆత్మ - transcendental Self.

౬

# సాంఖ్య సృష్టి ప్రక్రియం

సాంఖ్యులలో కొందరు చెప్పు సృష్టిప్రక్రియయు గమనింపదగినది. దాని సంగ్రహమిది : ప్రకృతి తనకు దా కలగి జీవవిశేషుడగు నారాయణునితో కలియును. పిదప మహత్తత్త్వమారంభమగును. ఇది చిజ్జడాత్మకము. ఇందు జడాంశము పుట్టును. చేతనాంశ మభివ్యక్తమగును. ఈరీతిగనే సృష్టికి మొదట ప్రకృతి కలయికచే జీవవిశేష భూతయగు శక్తి అభివ్యక్తమగును. ఇదియే ఆదిశక్తి. మహాలక్ష్మి మహాసరస్వతి మహాదుర్గ యీ మొదలగు పేర్లతో పురాణాదులు కీర్తించున దీశక్తినే.

జీవగతములగు విశేషములు ఔపాధికములు. విశేషములు పొటమరింపక ముందు నిర్విశేష జీవసమష్టి బ్రహ్మశబ్దవాచ్యము. సవిశేషజీవసమష్టి నారాయణుడు లేక స్వాయంభువు. విశేషములు ఔపాధికములే. ఆ యుపాధి లింగ శరీరము. ఉపాధి ఆత్మచైతన్యమునకు అభివ్యక్తిస్థానము. ముమ్మొదట నారాయణున కుపాధియగు లింగశరీరము ఒకటియే పుట్టును. పిదప తండ్రి లింగశరీరమునుండి పుత్రలింగశరీరమువలె నారాయణుని లింగశరీరమునుండి జీవుల లింగశరీరములు విడివడును. ఈ నారాయణుడు సూక్ష్మములును అల్పములును అగు స్వలింగశరీరావయవములను స్వాంశములగు చేతనలకు కూర్చి ప్రాణికోటిని సృజించును.

జీవు లసలు భిన్నులే. జీవసమష్టి నారాయణుడు. జీవులలో పరస్పరము భేదము స్వయముగ నున్నదే. దీపముచే ఘటాదులవలె శరీరాదులచే ఆ భేదము అభివ్యక్త మగును

స్థూలశరీరోపాధికుడు నారాయణుడు. మహత్తత్త్వమునుండి పది అంశలు తక్కువగా అహంకారము దాని నుండి తన్మాత్రద్వారమున ఒకదానికంటె మరి యొకటి పది పది అంశములు తక్కువగా పంచభూతములును పుట్టును. ఇది స్థూలశరీరమునకు బీజము. ఇది అండరూపముగా పరిణమించును. ఆ అండము నడుమ తద్దశమాంశమగు పదునాలుగు భువనములు, నారాయణుని స్థూలశరీరము.

## పరిణామము

విత్తు చెట్టగుచున్నది, గ్రుడ్డు పిల్ల అగుచున్నది. ఇటులగుట కెన్నియో అవస్థలు గడపవలసియున్నది. ద్రవ్యమొక అవస్థనుండి ఇంకొక అవస్థపడయుట పరిణామము. ఇందు ఒక అవస్థనుండి ఇంకొక అవస్థపడయుట అనునది క్రియ లేక వ్యాపారము. క్రియచే ఈ పరిణామము. పరిణతిలో కారణమొకటియే కార్యముగా రూపాంతర మొందును. అనగా కారణస్వరూప మవస్థావిశేషము పొంది కార్యమై కానవచ్చును. ఇట రూపాంతరమే భేదము. గ్రుడ్డే పిల్ల, విత్తే చెట్టు. రూపాంతరమొందుట నిత్యము, పరిణామము నిత్యము.

గ్రుడ్డు పిల్లగ మారునపుడును విత్తు చెట్టుగ మారునపుడును పరిణామ వ్యాపారము పెక్కు అవస్థల లయోదయముల నడుమ నడచును. పదపడి కార్యముగా కనబడును. కావున కార్యము కారణముయొక్క పరిణతి. కారణమునం దొకశక్తి ఉండును. శక్తికి కదలిక కలిగినంతనే పూర్వావస్థమారి మరియొక యవస్థ కలుగును. గ్రుడ్డు, విత్తు, మొదలగువాని లోలోపల ఈ శక్తి పేరియుండును. అది నిండుగా విప్పారుటకు పలు అవస్థలు పొందును. ఇటులు పొంది గ్రుడ్డు పిల్లగను విత్తు చెట్టుగను బయటపడును.

ఏ వస్తువును క్రొత్తగా పుట్టుకొని రాదు. మరి? అభివ్యక్తమగును. క్రొత్తగా పుట్టుట యన ఇదివరకు లేనిది యిపుడు క్రొత్తగా పుట్టుటయని మన మనుకొందుము. కాని లేనిదేదియు పుట్టదు. అటులు పుట్టుననుచో అభావమునుండి భావ ముత్పన్నమగునని చెప్పుటయే. ఇది అసంభవము. నూవులలో నూనె అవ్యక్తముగా నున్నది. కాన వానినుండి నూనె పుట్టును. ఇసుకలో లేదు. ఇసుకను గానుగాడినను నూనె రాదు. కనుక అభావమునుండి భావోత్పత్తి నంగీకరించుచో కార్య కారణభావమునకు ఒక నియమమేర్పడదు. దేనినుండియేని ఏదియేని పుట్ట వలసివచ్చును. కార్యకారణములకు సంగాతమును కాపాడుటకు కారణమందు కార్యము అడగియుండునని చెప్పక తప్పదు. కాని దానికి వెనువెంటనే అభివ్యక్తి ఉండకపోవచ్చును. పెక్కుఅవస్థలు కడచిన పిదప కార్యమునకు పూర్ణాభివ్యక్తి కలుగవచ్చును. ఈ అవస్థలన్నియు పరిణామసోపానములు. అవ్యక్తమగు కార్య మీ యవస్థల ననుభవించిన తరువాత వ్యక్తమగును. పరిణామమునకు క్రమ-

మున్నది. కార్యకారణభావము క్రమికమగు నీ యవస్థలదాటిన తరువాత వెల్లడి యగును. పరిణామవాదమందు శక్తి నిత్యము. ఈ శక్తికే రూపాంతరత్వము. స్థూలదృష్టికీ శక్తి సులభముగా బోధపడదు.

వ్యక్తమగు అవస్థ కార్యము. అవ్యక్తమగు అవస్థ కారణము. కార్యము లన్నియు కారణమగు ప్రకృతిలో అడగిపోయియున్న అవస్థ, ప్రలయము. ఆ ప్రకృతియే అవ్యక్తము. అవ్యక్తముగానున్న ప్రకృతి సృష్టికి మొగియగనే రూపాంతర మారంభమగును. ఈ పరిణామ మిటులు కొంతకాలము జరుగుచు బోవును. ఇది స్థితి. పదపడి మరల బీజావస్థకు మారును. ఇంతియకాని దీనికి నాశమనుమాట ఉండదు. ఇంత మఱ్ఱిచెట్టుగూడ బీజమం దడగిపోవును. కార్యము నిత్యము కాకున్నను కారణము మాత్రము అవినాశి. కారణమే నశించినచో ఉత్పత్తి యనుమాట ఉజాడయిపోవును. కావున ప్రవాహశీలమగు పరిణామమున కొన్ని కొన్ని కార్యములు అధికకాలము, కొన్నికొన్ని కార్యములు అల్పకాలము ఉండును. కాని ఇం దేపరిణామమేని నిత్యముకాదు. ప్రతి పదార్థము ప్రతిక్షణము అవస్థాంతరము పొందుచుండుటయే దీనికి కారణము. కావున పరిణామమనగా ఒకానొక సమయమందభివ్యక్తి. మరియు ఒకానొక సమయమందు స్థితి. లయ ముండుటజేసి కార్యముల ఉత్పత్తి స్థితులకు నిత్యతలేదు. ప్రలయమునం దీ సృష్టి యెల్ల అవ్యక్తములోనికి జనును. మరియొక సర్గమున మరల ఆవిర్భావ మొందును. ఇది పరిణామస్వభావము. ఇది శాశ్వతము. దీనికి అలపును సొలపును లేదు. ఇటులెన్ని సర్గములాయెనో ఎన్ని కాగలవో ఎవరును చెప్పజాలరు. ప్రకృతిశక్తి నిత్యము. ప్రకృతికో పరిణమించుటయే స్వభావము. కావున సృష్టి నిత్యము. కావుననే ఇది అనాది.

కార్యమునందు క్రొత్తయేమియు నుండదు. ఏలనఁగా కారణమే కార్యము. కారణములో లేనిది నలుసంతేని కార్యమునం దుండదు. కార్యము కారణము యొక్క అభివ్యక్తి. కావున కారణముకంటె కార్యము వేరుకాదు. ఈ సృష్టియం దెటచూచినను విడనాడరానిదియు మారనిదియు నగు నొక నియమము కలదు. ఇది అఖండము. గుణముల హెచ్చుతగ్గుల సంబంధమువలన ద్రవ్యముయొక్క రూపము వేరయినను పరిణామ స్వరూపము మారదు, అనగా కారణముకంటె

కార్యము వేరుకాదు. ఈ నియమము నియమమే (1) ఇట్టి ఊహలో సృష్టికి అలంఘనీయమగు నొక క్రమము అదృష్టసారముగా నున్నదని సుజ్ఞేయము.

## సృష్టికి కారణములు

సృష్టికి ఉపాదానకారణము అచేతనమగు అవ్యక్తము. నిమిత్తకారణము చైతన్యరూపుడగు పురుషుడు. ఈ యిరువురకు సంబంధము కలిగినపుడు అవ్యక్తము వ్యక్తమగును. చేతనాచేతనములు రెండును జగత్కారణ మగుటవలన వ్యక్తావస్థ మూడు విధములుగా అగుచున్నది. ఒకటి- చేతనమునకు అభిముఖమైన చేతనవంటి అవస్థ. రెండు- అవ్యక్తమున కభిముఖమగు ఆవరణావస్థ. ఈ రెంటి కలయికకు ఫలమైన చంచలావస్థ. ఇవియ సత్త్వరజస్తమస్సులు. ఇపుడు వెనుదిరిగిచూచి ప్రకృతి సృష్టికి ఉపాదానకారణమయినను ఏకమాత్రమగు నుపాదానమువలన సృష్టి పొసగదనియు విశ్వవికాసమునకు నిమిత్తకారణమగు పురుషుడు నియతముగా ఉండవలయుననియు గ్రహింపగలము. మరియు నిమిత్తమగు చిదవభాసమే అచేతనమగు ప్రకృతిని చేతనమువలె చేయుననియు అపుడె గుణవైషమ్యముచే సృష్టికారంభమనియు తెలియగలము. చిజ్జడ సంయోగములో కర్తృత్వోత్పత్తి యనియు కేవల ప్రకృతికిగాని (2) కేవల చిత్తునకుగాని కర్తృత్వము లేదనియు తెలియగలము.

## మహత్తత్త్వము

ప్రకృతికి విశ్వవికాసము వికృతి. ప్రకృతికి మొదటి వికృతి మహత్తత్త్వము. మహత్తత్త్వమున 'నేను'అను స్ఫురణ. జ్ఞానచేష్టలు రెండును ఈ నేను లో. వ్యవ

---

(1) "కారణగుణాః కార్యేషు సంక్రామంతి" "కారణగుణములు కార్యమందు సంక్రమించును" అనియేకాక "పుట్టుకకు పూర్వములేని విశేషము పుట్టిన పిదప ఉండును" అను వైశేషిక మతములో ఒక లేశము - "కారణమునుండి క్రొత్తలు పుట్టును" అని చెప్పు నేటి నవాభ్యుదయవాదుల Theory of Emergent Evolutions, మతమునం జేరును. దీనిని సాంఖ్యు లొప్పరు. అద్వైతులును. చూ. బ్ర. సూ. శాంకరభాష్య ౨-౩-౭.

(2) బ్రహ్మసూత్ర - శాంకర భాష్యమున "రచనా నుపపత్త్యధికరణ మున దీని ఖండనము చూచునది."

హారముల కన్నిటికి జ్ఞానములకన్నిటికి ఇది కుదురు. ఈ కుదురే వ్యావహారిక గ్రహీత. అస్మితామాత్రస్ఫురణమే దీని స్వరూపము. ఇది శాంతము, మరియు ప్రకాశశీలము. కాని యీ శాంతిగాని యీ ప్రకాశముగాని కేవలము అవికారి కాదు. ఈ జ్ఞాతృత్వ బోధ సకలజ్ఞాత అయిననే మహత్తత్త్వము. ఈ సకల జ్ఞాతయే అటు యోగులు చెప్పు పూర్వసిద్ధుడు, ఇటు శ్రుతిచెప్పు హిరణ్యగర్భుడు లేక అక్షరుడు. ఇదియే ఆ సకలజ్ఞాతగాని అల్పజ్ఞాతగాని యగుచో బుద్ధి. బుద్ధియు మహత్తత్త్వమును వేరువేరు తత్త్వములు కావు. వ్యాపకతా వ్యాపారసంకరతలను బట్టి యీ భేదము. బుద్ధిలో సర్వజ్ఞత్వమను బీజమున్నది. బుద్ధియు మహత్తత్త్వమును పరప్రకాశకములు. ప్రకాశశీలత యీ రెంటికిని స్వరూపము. ఈ ప్రకాశము క్రియాశీలము. కావున సవికారము.

జ్ఞానము ఎపుడు 'నేను నేను' అను ఎఱుకయందే నిలిచియుండునో అపుడు అది మహత్తత్త్వముగా సాక్షాత్కరించును. జ్ఞానమెపుడు 'నేను జ్ఞాతను' అను జ్ఞాతృత్వముగా అవభాసించునో అపు డది బుద్ధి. మహత్తత్త్వము అస్మితి మాత్రము. బుద్ధి-జ్ఞాన జ్ఞానక్రియా ద్వయస్వరూపము. మహత్తత్త్వమున జ్ఞాతృ మాత్రస్ఫురణము. బుద్ధిలో జ్ఞాతృత్వస్ఫురణము. 'నేను, నేను' అను ఎరుక మాత్రమే మహత్తత్త్వము. 'నే నెరుగువాడను' అను ఎరుక బుద్ధి.(3)

## అ హం కా ర ము

మహత్తత్త్వమునకు అహంకారము వికారము. మహత్తత్త్వము క్రియా శీలము అయినంతనే అనాత్మభావముతో ఆత్మభావమునకు సంబంధమేర్పడును. అదియ అభిమానము. 'ఇది నాది, నే నిట్టివాడను, అట్టివాడను'. ఈ మొదలగు జ్ఞానములన్నియు అభిమానజాతములు. ఇది క్రియాత్మకము మరియు రాజసికము. బుద్ధికిని అహంకారమునకును ఇదియే భేదము. బుద్ధిలోమమత్వమును సక్రియమగు కర్తృత్వమును ఉండవు. అహంకారతత్త్వములో కర్తృత్వబుద్ధికి వికాసము.

(3) "ఉపాత్త విషయాణా మింద్రియాణాం వృత్తౌ సత్యాం బుద్ధేస్తమోఽభిభవే సతి య స్సత్త్వసముద్రేక స్సోఽధ్యవసాయ ఇతి వృత్తి రితి జ్ఞాన మితి చా ఖ్యాయతే." -వాచస్పతి.

'నేను' అను ఎఱుకలో 'నేనెఱుగు వాడనుమాత్రమే' అను భావమే కాక సక్రియ మగు జ్ఞాతృత్వ మిమిడియున్నది. సక్రియమగు నీ జ్ఞాతృత్వమే అహంకార తత్త్వములో ప్రధానపాత్ర. ఈ తత్త్వమందు జ్ఞాతృత్వము సక్రియమై 'నేను అనుభవితను, నేను జ్ఞాతను' అని మొరపెట్టును. అహంకారతత్త్వమునందు క్రియాజ్ఞానముల రెంటియు స్ఫుటప్రకాశము. ఇచట బుద్ధిచే అహంకార ముద్భాసితమగును. రజస్సుచే క్రియాశీల మగును.

## మనస్సు

అనాత్మపదార్థము లాత్మవిషయములై యెచట నిలువ యుండునో అది మనస్సు. సంస్కారముల కిది ఆధారము. ఇచట తమోభాగ మధికము. కాన ఇది స్థితిశీలము.

## నేను

మహత్తత్త్వ మిటులు అంతఃకరణత్రయము. ఎన్ని విధములగు జ్ఞానము లుండునో వాని అన్నిటికిని ఇది గని. అందరకును 'నేను నేను' అను స్ఫురణ మున్నది. ఇది ఎన్నియో రకములుగా భాసించును. పురుషుడును బుద్ధియు విడదీయుటకు వీలులేని చందముగా అతుకుకొనిపోయినపు డీ నేను స్ఫురించును. ఇదియ అస్మిత. ఇది జ్ఞానమునకును వ్యవహారమునకుగూడ కుదురు. శుద్ధ సత్త్వ సంపన్నమైనపు డీ 'నేను' విద్యాపరిణామము. అనాత్మభావముతో ఆవరింపబడిన యెడల అవిద్యాపరిణామము. వృత్తులు నిరుద్ధమయినపుడు 'నేను' అని మాత్రమే తోచు అవస్థ విద్యాపరిణామము. ఇటులు నిదురలో మనస్సు తమస్సుచే ఆవరింపబడి యున్నను 'నేను' అను తెలివి అస్పష్టముగా నుండును. ఇది అస్మితకు అవిద్యాపరిణామము. ఈ అస్మితకు పరిణామము స్వాభావికము. ఈ అస్మిత లేక 'నేను' ఈ రెండవస్థల యందును ఎటులో ఒకటులు ఉండుట తప్పనిసరి.

ఈ 'నేను' అను నేలమీద అహంకారము మనస్సు అను నీ రెండు బొంగరము లెటులుదయించి ఆడునో చూతము. సాత్త్వికాహంకారము జ్ఞానేంద్రియములకు జనకము. అహంకారములో వ్యాపారము కలుగును. అపుడిది వేదనాత్మకమగు జ్ఞానమునకు నేను కర్తనని అభిమానించును. వేదనను తాను గ్రహించుట

కిది జ్ఞానేంద్రియముల సృజించును. అట్టియెడ ఇంద్రియగతమగు అస్మిత మేలు కొనెనన్నమాట. గ్రహీత ప్రకాశశీలుడు. అతడు విషయప్రకాశ దెటులగును ? ఇంద్రియజన్యమగు నీ బోధవలన. కాగా విషయప్రకాశ మనగా ఇంద్రియముల వలన కలుగు జ్ఞానము.

సంస్కారగతమగు అస్మితనుండి కలలపుట్టుక. ఈ అస్మిత సత్త్వ పూర్ణ మగు నేని కలలో ఆనందమును రజఃపూర్ణమగునపుడు కలలో భోక్తృత్వ బోధయు కలుగును.

అహంకారగతమగు అస్మిత, విషయముల మీద కర్తృత్వము వహించు వ్యాపారములో, కర్మేంద్రియముల పుట్టుక. స్వేచ్ఛాపూర్వకచాలనము కర్మేంద్రి యముల స్వభావము. వాక్పాణి పాద పాయూపస్థములు కర్మేంద్రియములు.

తామసాహంకారమునుండి విషయముల లేక భోగ్యపదార్థముల పుట్టుక. ఇచట అహంకారము ఇంద్రియములచే గ్రహింపదగిన విషయములుగా లేక భోగ్య పదార్థములుగా పరిణామము పొందును. తమః ప్రధానమగు ప్రకృతినుండి పుట్టి నవి కావున నివి గ్రాహ్యములు. జ్ఞానమునకు విషయములు కావున బోధ్యములు లేక జ్ఞేయములు. తమః ప్రధానములు కావున జాడ్యధర్మము కలవి. లేక జడ ములు. జడములుకదా యని ఇవి బొత్తుగా క్రియాశూన్యములు కావు. దేశాం తరగతియు పరిణతియు ఉండుటచే వీనికిని క్రియ కలదని ఊహింతము.

విషయములకు ముఖ్యధర్మము గ్రాహ్యత్వము. స్థూలములనియు సూక్ష్మము లనియు విషయము లిరుదెరగులు. ఇవి క్రమముగా పంచతన్మాత్రలు, పంచభూతములు. పంచభూతముల కారణావస్థ పంచతన్మాత్రములు. ఇవి శబ్ద స్పర్శరూపరస గంధములు. ఇవిసాంఖ్యమున అణువులు. అణువులనగా ఏకావయవ మాత్ర రూపములు (4) ఆకాశాది స్థూలభూతములు తన్మాత్రల అభివ్యక్తావస్థ.

---

(4) "శబ్దాది విశేషాణాం హి క్షోభాత్మనాం య దేక మక్షోభాత్మకం ప్రాగ్భావి సామాన్య మవిశేషాత్మకం త చ్ఛబ్దతన్మాత్ర మేవం గ్రంథాంతేఽ పి వాచ్యమ్." —అభినవగు ప్త

ఇట్టి సూక్ష్మగుణముల కాశ్రయమగు క్షణముల ననుక్రమించి తెలిసి కొనబడు ద్రవ్యముల ఏకావయవము పరమాణువు. ఇవియు భూతములవలె జ్ఞానేంద్రియ గ్రాహ్యములు. శబ్దతన్మాత్రను ప్రత్యక్షము చేసుకోదలచిన యెడల చెవితక్క మిగిలిన జ్ఞానేంద్రియములను నిరోధించి చెవిని విచారానుగత సమా ధిలో స్థిరపరచి చూడవలయును. ఇటులే మిగిలిన తన్మాత్రల ప్రత్యక్షత.

ఇపుడు మహాభూతములుగా మనము వ్యవహరించున వివి కావు. ఇవి పంచీకృతములు. అవి అపంచీకృతములు. ఇటులు సూక్ష్మవిషయములగు తన్మాత్రముల నుండి స్థూలములును శబ్దాదిమాత్రగుణకములు నగు పంచభూతముల వికాసము. ఈ తన్మాత్రలను ఈ భూతములను యోగులు విచారానుగత సమాధితో సాక్షాత్కరించుకొందురు.

## అస్మిత విశ్వాత్మ

విషయములకును వానిని గ్రహించు నింద్రియములకును మూల మొకటియే. అది అహంకారము. విషయములు బాహ్యప్రపంచము. ఇంద్రియములు అంతఃప్రపంచము. ఈ రెంటికిని అహంకారము కారణమని అర్థము. ఇంకను సూక్ష్మకారణము అస్మిత. కావున ఈ అస్మితయే విశ్వాత్మ, మహాన్ ఆత్మ. వికాసతారతమ్యముచే ఈ అస్మిత ఒకటియే గ్రహీత, గ్రహణము, గ్రాహ్యము, అయెను. ఈ మూడు పదార్థములకును పరస్పరసంబంధమునందు వ్యాపారగత మగు భేద మున్నను ఉపాదానగత మగు భేదము లేదు. ఇటు లంతర్బాహ్య ప్రపంచములకు మూలము అస్మిత. కావున ఈ రెండు ప్రపంచములకును అన్యోన్యసంబంధము సుసంగతము.

మూలకారణమునుండి కార్యోత్పత్తి. ఆ కార్యమునుండి కార్యాంతరోత్పత్తి. శబ్దస్పర్శరూప రసగంధములు జ్ఞాతకు గ్రాహ్యములు. ఎవరి అంతఃకరణము వారిదే యయినను అన్ని అంతఃకరణములకును గ్రాహ్యములతో సంబంధము. గ్రాహ్యములును గ్రహణమును అనగా విషయములును అంతఃకరణమును ద్రష్టకు విషయములు.

ఈ తత్త్వములలో దేశకాలములు చేరలేదే? వేనినుండి వీని ఉత్పత్తి ?

## దేశము - కాలము

మనము దిక్కాలములను 'దేశకాలములు' అని వాడుచుందుము (5) ఇచట దేశమనగా ఆంధ్రదేశము ద్రవిడదేశము ఈ మొదలైన దేశము అని

---

(5) "దిక్కాలా వాకాశాదిభ్యః" సాం. కా. ౨.౧౨

అర్థము కాదు. ఇట్టి వాడుకలో, దేశమనగా భూమి అని అర్థము. చెట్లు మొదలగు ద్రవ్యముల అవయవాదులగూడ దేశ మని అందుము. చెట్టు కొమ్మను దేశమని చెప్పుదుము. ఇచట భాగమని అర్థము. ద్రవ్యమునుబట్టియే మనకు దేశజ్ఞానము కలుగుచున్నది. కావున ఈదేశ మొక భావపదార్థము. మనకు సూర్యుడు చంద్రుడు మొదలగు గ్రహములును నక్షత్రములును ఎడమెడముగను, దాపు దాపుగను తిరుగుచు కనబడుచున్నవి. ఎందు ఇటులు ఇవి తిరుగుచున్నటులు కనబడు చున్నవో అది భౌతికాకాశము. ఇది ఎన్నెన్నియో గోళములు తిరుగుట కవకాశ మిచ్చుచున్నది. ఈ అవకాశము (6) మన మనస్సులో దేశము లేక శూన్యము అను నొక కల్పన పుట్టించి ఈ శూన్యము, ఈ పదార్థములన్నిటికిని ముందుండ వలెనను నిశ్చయముతో నిలుచుచున్నది. పదార్థములకు సమాశ్రయము శూన్యము లేక దేశము అని చెప్పినటు లయినది. అసలు శూన్య మనునది పదార్థము కాదు. ఏదియు లేని ఉత్త లొత్త పదార్థములకుగాని పదార్థమునకుగాని ఆశ్రయము కాదు. పదార్థములన్నియు ఒకదేశములో నుండవు. ఏదియు నుండనిదియు దేనిచే నిండనిదియు నగు పెద్దబయలు నిత్యమై ఉన్నదనుట అర్థము లేనిమాట. ప్రకృతి పురుషులు దేశవ్యాప్యులు కారు. అగుచో వారికి నిత్యత్వమెటులు? ప్రకృతినుండి అభివ్యక్తమైన పదార్థములు దేశసంబంధముతో నుండవు. ఉన్నచో అవి కారణాం తర్గతములు కాకపోవలసివచ్చును. అవి కారణాశ్రితములు కాని దేశాశ్రితములు

---

(6) "You cannot have space without things or things without space." —A. N. Whitehead

'Space is the order of existences. —Liebnitz

ఈతడు చెప్పిన Space, కేవల విస్తారమాత్రము, టంగుమైదానముకాదు. 'But this space between which I have called a desert of emptiness, is not entirely empty. There are vestiges of matter every where. [Eddington, New pathways in science.] 'I take it that near the outset of reflection one's incipient notion of space is that of room to move about in.'

'The Emergence of Novelty' by C. Lloyd Morgan, D.Sc, L.L.D., F.R.S. (Page 142.) మరియు ఇందే కల Space-Time Problem అను అధ్యాయమును చూచునది.

కావు. కావున నిత్యమైన దేశము లేక శూన్యము కల దని చెప్పుటకు వీలులేదు. మరియు ప్రధానము బీజధర్మి. శూన్యమున కే ధర్మము కలదు ? ప్రధానము గుణయుక్తము. శూన్యమో ? ప్రధానము భావరూపము. శూన్యమో ఇక దేశము నకు ప్రదేశ మనియు అవయవమనియు అర్థము. ఇది భావపదార్థము. పదార్థముల సహావస్థితి వలన దీని ఉత్పత్తి. దేశమునకు ఆశ్రయముగా శూన్యము అను నిత్య పదార్థమొకటి ఉండదు. (7)

## కాలము

ప్రపంచము, అందలి క్రియాసమూహము ప్రలయము దెస నడచుచున్నది. లోకక్షయము నొనరించుకాలము నేను, అని భగవాను డనినటులు గీత చెప్పను. ఇటులే ఉద్భవశక్తియు నున్నది. 'కాలము సమకూడనిచో ఏదియుకాదు' అని అందుము. సూర్యగమనమునుగూడ కాలమని వ్యవహరింతుము (8) వీడు చిన్న వాడు, వీడు పెద్దవాడు, వాడు నిన్న వెళ్లెను, వీడు రేపు పోగలడు అనియు వాడుదుము. ఇట్టి కాలము క్రియయు శక్తిరూపమగు భావపదార్థములు.

ఏండ్లతరబడి గుహలో నిదిరించిన ముచికుందుని ముకుందుడు లేపెను. అతని కపు డీ ప్రపంచమునం దెంతయో మార్పు కనబడెను. ఇటులే చిమ్మచీకటి గుహలో వెలుపలి పను లేమియు తెలియక మేలుకనియున్నవానికి చింతారూప మగు మానసిక క్రియవలననే కాలజ్ఞానము కలుగును. (9) కలలలో ఒక క్షణము ననే పెక్కేండ్ల జ్ఞానము కలుగును. చిత్తవృత్తుల సంఖ్యవలన కాలబోధ (10) ఇది లేనిచో కాలబోధ లేదు.

---

(7) శంకరుల మతమున దేశకాలము లున్నవి. ౨-౩-౧ అధికరణము. తైత్తిరీయ బృహదారణ్యక భాష్యములు చూ.

(8) భౌతిక పదార్థవాదులు భూమిగతియే కాలమని యందురు. Time and Space and many other quantities such as Number, Velocity, Position, Temperature etc. are not things = దేశకాలములు, సంఖ్య, వేగము, స్థితి, శీతోష్ణస్థితి మొదలగునవి ద్రవ్యములు కావు. Physics P. 1.

(9) 'Our consciousness moves along time.'–Silberstien

(10) 'Time is the order of successions' –Liebnitz

ప్రపంచమున ప్రతి పదార్థము ఒక అవస్థనుండి ఇంకొక అవస్థ పొందుచున్నది. దీనికి కాలమని పేరు పెట్టితిమి. కాలసూక్ష్మతమాంశము క్షణము. ఇట్టి క్షణములు కొన్ని కలిసి కాల మని అనిపించుకొనుచున్నవా? ఇటులేని కాలము క్షణప్రవాహము కావలయును. గత క్షణమునకును వర్తమాన క్షణమునకును సంబంధములేదు. ఈ క్షణముతో భవిష్యత్ క్షణమునకు సంబంధములేదు. ఇటులు సంయోగము కూర్పగల తంతువులేదు. ఇవి పరస్పరము కలియగల వీలు లేదు. కావున కాలము అనునది క్షణద్వయవ్యాపిగాని బహుక్షణవ్యాపిగాని కాదు. వేరు వేరు క్షణముల కూటమి వాస్తవముకాదు. బుద్ధి యిట్టి సముదాయమును సంపన్నమొనర్చి 'కాలము' అను కల్పనచేయును. ఇది వస్తుశూన్యమగు జ్ఞానము. పురుషునకు కాలవేధ లేదు. అతడు నిర్వికారుడు. కాలముతో పురుషునకు క్రియాపరంపరాసంబంధము గూడ లేదు.

ప్రకృతిలో పరిణామమున్నను ప్రకృతి మాత్రము దేనికిని పరిణామము కాదు. కాన ప్రకృతియు కాలాంతర్గతము కాదు.

పరిణామము కారణమునకు. పరిణామమున కొక క్రమధార కలదు. ఆ పరిణామక్రమము కాలముకాదు. వ్యవహారము కొరకు కాలమును పరిణామమును వేరు పరచి చూతుము. ఇది బుద్ధికార్యము. అసలీ పరిణామావస్థా క్రమముగాని కాలముగాని సృష్టిలో, మెలకువతో చూచినయెడల నిరవచ్ఛిన్నమును అఖండమును అఖండమును అగు పరిణామస్వరూపము కంటె కాలము వేరుకాదని గ్రహింపగలము. వ్యాసు లీ కాలమును బుద్ధినిర్మితమనియు వస్తుశూన్యమగు జ్ఞానమనియు లౌకిక వ్యవహారసంపన్నులకు వస్తువువలె తోచుననియు చెప్పిరి. [11] 'మహర్షులు ప్రలయమున నిద్రించుచున్న కాలమును కనుగొనిరి' అని పురాణములు చెప్పును. [12] ప్రకృతికి పరిణామము స్వభావము. పరిణామమనగా అవస్థాంతర

---

(11) క్షణ తత్ క్రమయో ర్నాస్తి వస్తు సమాహార ఇతి బుద్ధి సమాహారో ముహూర్తాహో రాత్రాదయః సఖల్వయం కాలో వస్తుశూన్యోఽపి బుద్ధినిర్మాణః శబ్దజ్ఞానానుపాతీ లౌకికానాం వ్యుత్థితదర్శనానాం వస్తుస్వరూప ఇవావభాసతే (యోగభాష్య. ౩-౫౨)

(12) ఏవం బ్రాహ్మీషు రాత్రీషు హ్యతీతాసు సహస్రశః
దృష్టవన్త స్తథా హ్యన్యే సుప్తం కాలం మహర్షయః
(వాయు. ౭-౭౬)

ప్రాప్తి. దీనివలన కాల బుద్ధి. కాలము కలిసి వచ్చునెడల అవస్థాంతరము సంభవించు ననుట చెల్లనిమాట. అవస్థాంతరముచేతనే కాల బోధ. ఇది మనఃకల్పన. పరిణామమో వాస్తవము. పరిణామము తానే కలుగును. మనసులో కాలము దానికి పరిమాపకము. అసలు పరిణామము కాలసాపేక్షముకాదు, మరి మూలమయిన కారణసాపేక్షము.

సకాలమున పరిణామము కలుగుననుచో కాలమునకు నిత్యత్వము అంటగట్ట వలెను. కాలము నిత్యమగుచో ప్రకృతి పురుషులు కాలాంతర్గతు లని చెప్పవలసి వచ్చును. (13)

## ద్వైతము

ప్రకృతి నిత్యము. పురుషుడు నిత్యుడు. ప్రధానము ప్రసవధర్మి. పురుషుడు దృశి. ఈ రెంటిలో ఏ యొకటియు మరియొకటికి సాధకముగాని బాధకముగాని కాదు. వాని స్వరూపము వేరు. అవిద్యాజాతమగు అవివేక మీ రెంటి నొకటిగా జేయుచున్నది. ఈ రెండును తమతమ స్వరూపమును గురుతెరుగుచో అవివేక ముదయింపదు. తమలో తమ వేరిమి నెరుగకపోవుటయే అవివేకమునకు కారణము. ఆ యవివేకము పరస్పర సంబంధమునకు కారణము. అవివేకమువలన గలిగిన యీ ఐక్యజ్ఞానము మిథ్యాజ్ఞానము. ఈ మిథ్యాజ్ఞానము అఖ్యాతియే. తామెవరో తాము తిన్నగా నెరుగుచో ఈ ఐక్యభావము ఉండజాలదు. వేరువేరయిన రెండు పదార్థము లొండొండ ఒకటియే యని యనుకొనుటయే అఖ్యాతి లేక మిథ్యాజ్ఞానము. తాము వేరని తెలిసికొనుటయే ఖ్యాతి. వివేకము ఈ ఖ్యాతిని కలిగించును. ఈ ఖ్యాతియే ముక్తికి హేతువు. సాధక బాధక సంబంధము లేని రెండు వస్తువుల ఐక్యజ్ఞాన మీసంబంధమును సృజించును. వివేక మీసంబంధమును

(13) వేదాంత మతమున దేశకాలములు జన్యములు - ప్రమాణము - "స సంవత్సరోఽభవత్" (బృహ. ౧-౨)

"ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" (తై. ౨-౧) అను ఉపనిషత్తులు.

"పదార్థ తత్వనిర్ణయః" అను గ్రంథమున "ఆనందానుభవులు" - దిగ్విభాగేఽ విభాగేఽపి వ్యోమ్నియద్వ ద్వికల్పితః" అని వ్రాసిరి.

తెగగొట్టును. ప్రకృతి ఒకటియే జగత్కారణము కాదు, మరి పురుషుడకూడ నొక కారణము. ప్రకృతి ఉపాదానము. పురుషుడు నిమిత్తము. ప్రకృతి ఒకటియే జగత్కారణ మగునేని సృష్టికినియామకత గాని ఏకరూపమగు పరిణామముగాని పొసగదు. మరియు ప్రకృతి పురుషునకు భోగమును అపవర్గమును కలిగించునని అనుటలో అర్థము ఉండదు. ఈ ప్రకృతి, పురుష సంబంధము లేనిదయ్యు పురుషునిదెస పరువిడి పురుషచ్ఛాయలో పుష్పించి అతనికి భోగ మొసగును. మరియు అవసితాధికారము కలదై ముక్తి నొసగును. పురుషుడు నిష్క్రియుడు కావున ప్రకృతికి ఇటులు చరితార్థత. పురుషున కసలు భోగము లేదు, ముక్తియు లేదు.

ఇటీవల కొందరు పురుషుడు ప్రకృతిలో ప్రతిబింబించు ననిరి. మరి కొందరు ప్రకృతియు పురుషునిలో ప్రతిబింబించు ననిరి. ప్రకృతి పురుషులకు 'అవివేకముచే సంబంధము కలుగునని చెప్పుట కివి ఉపమానమాత్రములు. ఇంత మాత్రమున పీ రెవరును 'పురుషుడు ప్రకృతిసొమ్ము' అని చెప్పలేదు. అటులు చెప్పినటులె ఐనదనినచో 'సంబంధకల్పన ఎందులకు చేయుదురు?' అని ఎదురడుగవలయును.

## 2

# యోగమునకు పునాది

యోగదర్శనము, జ్ఞాన కర్మయోగములు రెండును ముక్తికి రెండు మార్గము లని చెప్పను. క్రమక్రమముగా ౨౪ తత్త్వముల నెరిగి తుద కిరువది యయిదవ తత్త్వమగు పురుషుడు తానే యని తెలియుట జ్ఞానయోగము. తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము: వీని ననుసరించుట కర్మయోగము. ప్రణిధాన మనఁగా భక్తి. కావున ఇచట కర్మయోగ మనగా భక్తి యోగమని చెప్పవచ్చును. చెప్పవచ్చునని యనుటయే కాదు, యోగమతమున కర్మయోగ మనినను భక్తియోగ మనినను ఒకటియే. అది యటుండె. ఈ రెండు యోగములతో మొదటిదగు జ్ఞానయోగము, 'తత్త్వముల దెలియుట ముక్తి'

యని చెప్పను. తెలియుట యనగా తత్త్వముల గడగడ అప్పజెప్పి వానిని నిర్దుష్టముగా నుపన్యసించుటగాని వానిగూర్చి గ్రంథరచన చేయుటగాని కాదు. ఇది పరోక్షజ్ఞానము. ఇక సాక్షాద్జ్ఞానమునందే తత్వములు స్ఫురించును. తుట్టతుదకు నేను ప్రకృతికంటె వేరయినవాడను అని అనుభవము కలుగును. తత్త్వములను తెలియుట యనగా తత్వాధిగమము.

చిత్తము సంస్కారములకు పుట్ట. ఇవి జ్ఞానమునకు అడ్డు. ఈ గోడ పడగొట్టుటకు సాధన పలుగు. మరియు తత్త్వవిచారముచే బుద్ధిశుద్ధి యెంత ముఖ్యమో శరీర హృదయములయు పరిశుద్ధి అంత ముఖ్యము. దీనికి అష్టాంగయోగసాధన. ఈసాధన చేయదలచువారికి హృదయము విశాలమగుటకును తేటయగుటకును కొంత భావనా శక్తి కావలసియుండును. ఈ భావనాశక్తి చిత్తమును విశాలపరచి సత్త్వముచే నిండించును. మనవిగాని పరులవిగాని క్లేశములు మన మనసును మథించును, వాని నడుమ మన ముండకతప్పదు. ఇటు లున్నను భావనాశక్తి మనల కలత చెందనీయక హృదయమును ఆర్ద్రమొనరించును. దీనివలన మనసులోని మకిలపోయి శుక్లధర్మము నెలకొనును. శుక్లధర్మమనగా ప్రసన్నత. ప్రసన్నచిత్తము తత్త్వాధిగమమునకు తగియుండును. చిత్తప్రసాదము సమత్వమును వైశాల్యమును శాంతిని చేకూర్చును. మైత్రీభావన, కరుణాభావన, ముదితాభావన, ఉపేక్ష అనునవి భావనా విశేషములు.

సుఖ మనుభవించు జీవులయెడ మైత్రీభావనయును దుఃఖ మనుభవించు జీవులయెడ కరుణాభావనయును పుణ్యాత్ములంజూచి ముదితాభావనయును అపుణ్యాత్ములయెడ నుపేక్షయును చేయుట యభ్యసింపవలయును. వీనిలో మొదటిదాని వలన ఔదార్యము, రెండవదానివలన అన్నిటితో స్నిగ్ధత, మూడవదానివలన ప్రసన్నత, నాల్గవదానివలన ఔదాసీన్యము, అనునవి కలుగును. ఉపేక్షాబుద్ధి ఇతరుల పాపస్పర్శను తప్పించును. పాపస్పర్శచే చిత్తమునకు క్లేశము కలుగును. ఈ తెరగున ఆయా భావనలు ప్రసన్నతను కల్యాణస్పృహను స్ఫూర్తిని ధర్మప్రవణతను చిత్తమున మేలుకొలిపి ఇతోఽధికమగు జ్ఞానసాధనకధికారమును వృద్ధిచేయును. ఇటువంటి భావనలు ముముక్షువుల చిత్తమును సంస్కరించును.

## యోగము

అష్టాంగయోగము చిత్తనిరోధమున కుపకరణము. చిత్తనిరోధమే యోగము. యోగశబ్దము నానార్థములం దుపయుక్తము. కాని పాతంజలముననో యోగ పదమునకు చిత్తవృత్తినిరోధమనియే అర్థము. పరమాత్మతో చిత్తసంయోగము కూడ యోగమే. భక్తిమార్గమునందు యోగశబ్దము భగవదనుధ్యానమునందు వాడబడు చుండును. కాని పాతంజలముననో వృత్తివిలయమునందే వాడబడును.

వృత్తు లేవేని అగుగాక, అవి చిత్తమువే. చిత్తముతో పురుషున కెట్టి సంబంధమునులేదు. కాని అవిద్యచే ఈ సంబంధము వచ్చిపడును. సమాధివలన కలుగు ప్రజ్ఞచే బొడమిన వివేకము ప్రకృతి పురుషులను వేరుపరచి పెట్టును. ఇదియే యోగమున చరమార్థము. వివేకమువలన అవిద్య తొలగును, ఆత్మఖ్యాతి పొడమును. వివేక ఖ్యాతితో సాధన సరి. ఈశ్వర ప్రణిధానముచే సత్త్వము కలుగును. అది బాధాదికమును తొలగించి వివేకము కలిగించుటకు సాయపడును. కాని అది అపరోక్షజ్ఞానమును కలిగింపనేరదు. అశుద్ధిని శోధించుటకు యోగాం గానుష్ఠానము. యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధారణ ధ్యానము సమాధి అనునవి యోగాంగములు.

## యమము

అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము ఇవి యమము. మనోవాక్కాయ కర్మలచే ప్రాణిని కష్టపెట్టకుండుటయేకాక మైత్ర్యాది భావనతోడను తత్ప్రేషణతోడను ఇది కూడియుండవలయును. భావనలోనేని మాటలోనేని ఏ కొంచెము హింస యున్నను అది అహింసకాదు. ఇట్టి అహింస స్వభావమై పోయిన వానికడ వైరము ఉండదు. వాని చిత్త మహింసచే సత్త్వో ద్రిక్తమగును. అట్టివాని చిత్తసత్త్వము పరిసరములలోనికి వచ్చిన జీవచిత్తముల నన్నిటిని లోగొనగలిగిన శక్తికి ఆస్పదమగును. దానికి లోబడిన ప్రాణులన్నియు దానివలె నిర్వైరము లయిపోవును. ఈ చిత్తమైత్రీభావన పరచిత్తములందును మైత్రీభావనను తెచ్చిపెట్టును.

విన్నది విన్నటులు, చెప్పినది చెప్పినట్లు ప్రకటము చేయుట సత్యము. ఇట్టి సత్యము నలవరచికొనిన వాని పలుకు అవ్యర్థము. ఏల యనిన వానిలో

సత్యమును, దాన బొంకమిన దృఢేచ్ఛయు సుప్రతిష్ఠితమై పోవును. ఇట్టి సత్యమును వారు ప్రాణుల కల్యాణమున కుపయోగింతురేకాని అపకారమున కుపయోగింపరు. అటులేని అది హింసలో జమ. యోగులకును అపకృతికిని చాల దవ్వు.

న్యాయముగా పొందరానిదానిని కోరుట స్తేయము. అట్టిదానిని కోరకుండుటయే అస్తేయము, ఇట్టి అస్తేయసిద్ధి కలిగినచో రత్నములన్నియు లభించును. ఏమియు కోరనివాని కెల్లయు చేకూరునను మాట యోగులయెడ నిండునిక్కము.

వీర్యధారణారూపమగు వ్రతము బ్రహ్మచర్యము. దాన అణిమాదులు సిద్ధించును. మరియు బ్రహ్మచర్యమున నెలకొనిన వాని ఉపదేశము శిష్యుని మనమున తూపువలె నాటుకొనును.

కావలయు దానికంటె నెక్కుడిసుమంతయు చేకొనకుండుట అపరిగ్రహము. కూడబెట్టువారికి విషయాసక్తి యుండును. కూడబెట్టిన దానిని కాపాడుటకు శ్రమ తప్పదు. కూడినది పోయినచో దుఃఖము. అపరిగ్రహములో రహస్యము, కూడబెట్టకుండుట. భోగ్యములు తుచ్ఛములని తెలిసినచో శరీరము తుచ్ఛమని తెలియును. దాన మనసు విరమించును. దీన శరీరము వేరు, మనసు వేరు అని ఎరుక కలుగును. ఇది తెలియుచో వెనుక జన్మమున నే నెటులుంటిని ? ముందెటులు కాబోవుదును ? ఈ శరీరమేమి? నేనేమి?' అను ఆలోచన సాజముగా కలుగును. యోగికి భోగప్రాచుర్యము కూడదు. అది సిద్ధికి అడ్డు. దానయోగులు ప్రాణధారణ మాత్రము చూచికొందురు గాని కూడబెట్టరు. ఈ దెస యమము మనోవాక్కాయకర్మలతోడి మహావ్రతము.

## నియమము

శౌచము సంతోషము తపము స్వాధ్యాయము, ప్రణిధానము ఇవి ఇయమము. కాయాదిశుద్ధి శౌచము. ఎంత తోమికొనినను కొలది కాలమునకే శరీరము మలపూర్ణమగును. ఇది తెలిసి యోగి శరీరముదెస ప్రీతి పొందకపోవు టటుండగా అప్రియమును వహించును. ఇంతియకాక అతడు పరశరీరసంసర్గము కోరడు. శౌచమువలన సత్త్వము శుద్ధమగును. దాన మనోమాలిన్యము తొలగును. దాన ఏకాగ్రత కుదురును. దాన ఇంద్రియ జయమును, దాన ఆత్మదర్శన యోగ్యతయు ఏర్పడును.

తృష్ణాక్షయము సంతోషము. కోరికలవలన కోరికలకే వృద్ధి. దాన మనసునకు నిలుకడ చిక్కదు. ఇహపరసుఖము లెంతలేని, ఎన్నియేని, అవి యన్నియు తృష్ణాక్షయమువలన గలుగు సుఖములో అవంతేని కావని పెద్దలందురు.

అనాయాసముగా లభించిన దానియెడనే తృప్తి కలుగును గాని కోరిక పెట్టుకొనినచో అది గొంతమ కోరికలలోనికి దింపును. కోరికలో ధీరత్వము నష్టమగును. స్థైర్యము చెదరును. అస్థిరతకును యోగమునకును చుట్టరికము సున్న.

తపస్సనగా ప్రాణాయమాదికము. అట్టి తపస్సును తిన్నగా చేయుచో శరీరము నావరించిన మలము తొలగును. ఆకలి, దప్పి, నిశ్చలముగా కూరుచుండ జాలక పోవుట, నియమములేని ఊర్పునిట్టూర్పులు ఈ మొదలగునవి శరీరమలములు. ఈ మలములు తొలగునెడల చిత్తశరీరముల లంకె విడివడును. దాన ఇచ్ఛాశక్తి ప్రభావము, కలిమి, అణిమాదులు, ఇంద్రియసిద్ధి, దూరశ్రవణాదులు, ఇట్టి కాయసిద్ధి కలుగును. యోగమున కంగమగు ఈతపమును యోగులు పరమార్థము వెనకే వినియోగింతురు. ద్వంద్వములను సహించుటయు తపస్సులోనిదే. దీనివలన మనశ్శరీరములకు దృఢత్వమును వ్రతమును కొనసాగించు శక్తియు కలుగును. మరియు ఈ తపస్య మనోవాక్కాయములను యోగానుకూలములనుగా ఒనరించును.

స్వాధ్యాయము అనగా వేదపఠనము మోక్షశాస్త్రపఠనము మరియు ప్రణవజపము. పఠనమువలన బ్రహ్మాసక్తి కలుగును. ప్రణవజపమువలన బ్రహ్మను ప్రవేశము కలుగును. మఱియు ఇట్టి స్వాధ్యాయమువలన దేవర్షి సిద్ధదర్శనమును దాన ఇష్టప్రాప్తియు కలుగును.

జపము చేయువారికి సామాన్యముగా జపించు మంత్రమునకు గల అర్థము వెస చూపుచుండదు. దాన జేసియే 'తజ్జపస్తదర్థభావనమ్' (౧–౨౮) అనియు 'శబ్దార్థజ్ఞాన వికల్పైః సవితర్కా సమాపత్తిః (౧-౪-౨) 'స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యే వార్థ మాత్రనిర్భాసా నిర్వితర్కా' (౧-౪౩) అనియు చెప్పబడెను. చేతులు శివునిమీద; చిత్తము చెప్పులమీద' అను సామెత జపితల కెక్కు దెరుక.

స్వాధ్యాయమునందు స్థిరత చేకూరునెడల మంత్ర మంత్రార్థ భావన చాలకాలము చేయుట కనువుపడును. అటు లనువుపడుటలో గల స్థిరత్వముతో దేవతాదుల జూచు కోరిక గలిగినయెడల ఆ కోరిక వమ్ముకాదు. స్వాధ్యాయమునకును దేవాది దర్శనమునకును గల సంబంధము ఈ స్థైర్యము.

ప్రణిధానమనగా ఈశ్వరప్రణిధానము. ఈశ్వరునకు సర్వభావములను అర్పించునెడల సమాధి సిద్ధించును. సర్వభావార్పణమనగా భావనచే ఈశ్వరునిలో తన్నుముంచివేసికొనుట. భక్తియోగ భాషలో ప్రపత్తి లేక శరణాగతి. ఇట్టివానికి సమాధి సిద్ధించును. సమాధిసిద్ధి కతన దేహాంతరమందును దేశాంతరమందును కాలాంతర మందును జరిగినవియు జరుగుచున్నవియు నగు విషయములు తెల్లమగును.

యమనియమాదులు పరంపరాసంబంధముచే సమాధిని సిద్ధింపజేయును. ఈశ్వర ప్రణిధానము సాక్షాత్సంబంధముచే సమాధిని కలిగించును. ఇది సమాధికి అనుకూల భావనారూపము. ఆ భావన సాంద్రమై శరీరమును నిశ్చలముగను (ఆసన) ఇంద్రియములను విషయవిరతములుగను (ప్రత్యాహార) చేయును. దాన ధారణయు ధ్యానముగా పండి తుదకు సమాధిగా మారును.

ప్రణిధానమువలననే సమాధి సిద్ధించునేని యమనియమాదికమగు యోగాంగము లేలయని శంక కలుగవచ్చును. సమాధి గాఢమగు ధ్యానావస్థయే. ధారణైక తానతయే ధ్యానము. సమాధి సిద్ధించునెడల యోగాంగములన్నియు దానయందనే యుండును. కాన మిగిలిన యోగాంగములను మాని సాధకుడు తొట్టతొలుత నుండియు ప్రణిధానపరాయణులగు వారికి సాజముగనే సమాధి సిద్ధించును. మరియు సంప్రజ్ఞాతా సంప్రజ్ఞాతక్రమమున కైవల్యలాభము కలుగును.

ఇక యమనియమములలో ఏదే నొకటి నష్టమయినచో అంతయు నష్టమగును.

## ఆసనము

చిత్తము దేనియందేని చాల సేపు ఉంచుటకు శరీరస్థిరత కావలయును. సౌఖ్యము లేనిచో అది కొరవడును. కావున నిశ్చలమును సుఖావహము నగు

ఉపవేశనము ఆసనము. పద్మాసనము వీరాసనము భద్రాసనము స్వస్తికాసనము దండాసనము సోపాశ్రయము పర్యంకము క్రౌంచనిషదనము హస్తినిషదనము ఉష్ట్రనిషదనము సమసంస్థానము అను ఈ ఆసనములు స్థిరసుఖములు.

శరీరమునకు కదలిక కలిగించు యత్నమేమియు చేయ కూరక కూరుచున్న ఆసనసిద్ధి కలుగును. శవమున కెక్కడపెట్టిన కాలుసేతులక్కడనే యుండును. అందు శవప్రయత్నమేమియు లేదు. చిత్తము ననంతసమాపన్న మొనరించినను ఆసనసిద్ధి కలుగును. అనంతుడనగా భూమి మోయు శేషుడు. శేషాహి కదలుచో భూమి తలకిందగును. కావున నతనివలె నుండవలయునని భావన చేయవలయునని కొందరు వక్కాణింతురు. మరికొందరు ఆకాశము లేక శూన్యమోయన చిత్తము నలవరుచుచో ఆసనము సిద్ధించునని వక్కాణింతురు. మొదట మొదట కష్టపడని యెడల ఆసనము సిద్ధింపదు. కొంచెమెక్కువసేపు కూరుచున్నయెడల పలు తావులలో పీడకలుగుచుండును. ఈ పీడ పాచుటకు ప్రయత్నశైథిల్యము శూన్యవద్భావన ఉపదిష్టము. ఈ రెంటివలనను నిశ్చలత కుదిరినచో శరీరము కూరుచున్న నేలతో అంటుకొని పోయినటులై భూమితోపాటు అయిపోవును. ఇంకను స్థిరమగు నేగు నేని శరీరమున్న చందమేతోచదు. 'నాయీ శరీరము శూన్యమైన తెరగుగా అనంతమగు ఆకాశమున కలిసిపోయెను; నేను ఆకాశమువంటివాడను' అను భావన అనంతసమాపత్తి.

ఆసనసిద్ధుడగు యోగి చలియెండలచేగాని ఆకలిదప్పలు మొదలగు జంటలచేగాని బాధపడడు. ఆసన స్థైర్యముచే శరీరమనంత సమాపన్నమగు నెడల బోధశూన్యత (anaesthesis) తటస్థించును. దాన ద్వంద్వములు తెలియవు.

మన మందఱమును సామాన్యముగా గాలి పీల్వవలయునని పీల్వము. విడువ వలయునని విడువము. ఈ రెండు పనులును వానియంతన అవి జరగి పోవుచుండును. ఈ యూర్పు నిట్టూర్పుల ప్రవాహవేగమును అరికట్టినయెడల మనసునకు కుదిరిక అమరును. ఏకాగ్రత కిది ఆవశ్యకము.

## ప్రాణాయామము

ఊరుపు నిట్టూర్పులకు నిలుకడ కలిగించు నేరుపరితనమే ప్రాణాయామము. ఆసనము మేని నిలుకడను కలిగింపగా ప్రాణాయామము ప్రాణమునకు నిలుకడ (సంయమము) కలిగించును. ప్రాణగతి సమనియతమైనచో ఆ ప్రాణము శాంతిబడసి మహాప్రాణమునం దనుప్రవిష్ట మగును.

ఊర్పు నిట్టూర్పుల నడుమనున్న విరామమును పెంపగల నేరుపు ఎంత పెరిగిన అంతమేలు. ఈ విరామము పెరిగినకొలది ప్రాణాపానములకు స్థితికలుగును. దానితో పాటు అంతఃకరణ వృత్తులకును విరామమేర్పడును. ప్రాణజయమువలన ప్రాకాశావరణము తొలగిపోవును. క్రమముగా జ్ఞానము వికసించును.

హఠయోగులు తొలుత రేచకము పిదప పూరకము పిమ్మట కుంభకమును చెప్పుదురు. అందఱును సామాన్యముగా అటులే చేయుదురు. వాసిష్ఠము మొదలగు వానిలో అంతర బాహ్యాదిభేదము లెన్నియో కలవు. ఈరాజయోగమున ఆ ప్రక్రియ లేదు. గాలిపీల్చి వెనువెంటనే విడువనిచో ఊర్పునిట్టూర్పులకు గతి విచ్ఛేదము కలుగును. రాజయోగము ఇది ఒక ప్రాణాయామమని చెప్పును. ఇటులే నిట్టూర్చి వెను వెంటనే గాలి పీల్వనియెడల నదియు నొక ప్రాణాయామమగును. పూరాకాంత రేచకాంతము లెట్టివయినను శ్వాసప్రశ్వాసములకు కొంత విరామము కలిగించుట ఒక ప్రాణాయామము. ఇట్టి ప్రాణాయామమును విరామమును నెమ్మది నెమ్మదిగా పెంచుచు నభ్యాసము చేయవలయును. ప్రాణాయామమును కేవలము గ్రంథములలో చదివిచేయుట తగదు. యోగదర్శనమునందే రేచకాంత ప్రాణాయామము 'ప్రచ్ఛర్దన విధారణాభ్యామ్' (౧-౩౪) అను సూత్రమున గలదు. ఇంకను సాధన పాదమున మరికొన్ని విధములగు ప్రాణాయామములు చెప్పబడెను. వీని నభ్యసించిన యోగులకడ తెలిసికొని సాధకులు మెలమెలగా ప్రాణాయామమునకు అలవాటు పడవలెను. గ్రంథములలో చూచి చేసి చెడినసాధకు లున్నారు. ఇటులు చేయుట అనారోగ్యమును పిలిచి తెచ్చికొనుటయే.

## ప్రత్యాహారము

ఇంద్రియములు తమతను విషయములనుండి ఉపరమము చెందుట ప్రత్యాహారము. చిత్తమును నిరోధించునెడల ఇంద్రియములును చిత్తస్వరూపము ననుకరించి నటులగును. తేనెటీగల రాణి యెగిరిన యెడల మిగిలిన యీగలన్నియు ఎగిరినటులును అది కూర్చుండినచో ఇవియు కూరుచుండినటులును చిత్తము లేచుచో ఇంద్రియములును లేచును; చిత్తము నిరుద్ధమగుచో ఇంద్రియములును నిరుద్ధమగును.

శబ్దాదులయెడ వ్యసనములేకుండు టింద్రియ జయమని కొందరందురు. వ్యసన మనగా ఆసక్తి. (వి + అస్యతి ఏనమ్ ఇతివ్యసనమ్, అని వ్యుత్పత్తి- శ్రేయస్సునుండి తొలగించునది వ్యసనము). శాస్త్రాదులకు విరుద్ధముకాని శబ్దాది విషయసేవన మింద్రియజయమని మరికొందరందురు. పారతంత్ర్యము పొందక స్వేచ్ఛాపూర్వకమయిన శబ్దాది విషయాస్వాదము ఇంద్రియజయమని ఇంకొందరందురు. అనగా భోగపారతంత్ర్యములేని భోగ మింద్రియజయమని తాత్పర్యము. రాగముగాని ద్వేషముగాని లేక సుఖదుఃఖములు పొందక శబ్దాదులనెరుగు టింద్రియ జయమని ఇతరులందురు. ఇవి యన్నియు ప్రచ్ఛన్నమగు ఇంద్రియలౌల్యమే. అనాసక్తితో పాప మొనరించు నెడల అనాసక్తితోడనే నిరయప్రాప్తి. నిప్పును ముట్టుకొనిన యెడల కాల్చునని తెలియువా డందు కాలు పెట్టడు, అనాసక్తముగను పెట్టడు. ఆసక్తముగను పెట్టడు. పరతంత్రతతోడను పెట్టడు, స్వతంత్రతతోడను పెట్టడు. పారమార్థిక విషయము నెరుగక పోవుటయే విషయములందు స్వేచ్ఛాపూర్వకమగు సక్తికి కారణము. కావున నివి యెల్ల ఇంద్రియజయము కావు. మరి ఇంద్రియజయమేది యని యడుగుదురు. ఇచ్ఛామాత్రముచేతనే చిత్తనిరోధముతో పాటు ఇంద్రియ నిరోధముగూడ ఆయెనేని దానికి మించిన యింద్రియజయమని ఒకటి ఉండదని జైగీషవ్యు డనెను. ఈ ప్రత్యాహారమువలన అట్టి యింద్రియావశ్యకత కలుగును.

పురుషుడు 'క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టః పురుష విశేష ఈశ్వరః' అను సూత్రముచే జెప్పబడిన పురుషవిశేషుడు కాడు. పూర్వసిద్ధుడగు హిరణ్యగర్భుడు లేక జగత్కర్తయు గాడు. 'ఇంద్రియేభ్యః...' అను కఠమునకు

సాంఖ్యులు వ్యాకరించియు యోగులు పరీక్షించియు చెప్పిన పురుషతత్త్వము. తన్నుదాను తిన్నగా దెలియు నెడల జీవుడే పురుషుడు. మాండూక్యము-'అశబ్ద మద్రూపస్వమి' త్యాది 'నేతి' రూపముగా చెప్పిన వా డీ పురుషుడు:

## ౮
## సమాధి విశేషములు

ప్రాణాయామ విశేషముచేగాని భావోద్రేకముచేగాని అద్భుతమగు దివ్య దర్శనము మొదలగువానిచే గాని మనస్సు నిశ్చలము కావచ్చును. వీనిలో ప్రాణాయామముచే ఏకాగ్రమగు వృత్తి ఉదయించును. అది ఇంకొక వృత్తికి చోటొసగదు.

భావోద్రేకముచే ఆనందము పొంగి దివ్యభావ ముదయింపవచ్చును. దివ్య జీవితమునం దిది యొక గొప్పఘట్టము. మరియు నిది ఇంకొక విధముగా ఆధ్యాత్మిక స్ఫూర్తిగా వికసింపవచ్చును. 'ఆనందవికాసమే ప్రపంచము' అని అనుకొను ఆనంద సాధకులు ఆనందములో మునిగిపోవుటయే సమాధియని యందురు.

భక్తిసాధకులలో నొకానొక తెగవారు చేతనతోడి ఆనందము ఉక్కిరి బిక్కిరి చేసి చిత్తమును ముంచివేయగా బాష్పములు జాలువారినంతనే కొలది బాహ్యజ్ఞానముతో ఉదాసీను లగుచుందురు. ఇవియు ఇట్టివియు నగు భావసమాధులను వానిని సాధించిన సాధకులను మన మటనట గనుగొనుచుందుము.

అద్వైతులు ఆరు విధములగు సమాధులు చెప్పిరి. యోగులు ద్వైతులు. కావున సిద్ధాంతములలో యోగులకును అద్వైతులకును కొంచెము భేద మగపట్టుచుండును. అయినను యోగదర్శనము చెప్పిన సమాధిసాధనను అద్వైతులేకాదు, మరి యెవరును నిరసింపరు. కాని అద్వైతులు తమ అద్వైతమును నిలిపికొనుటకు సాధనయెడ కొంచెము వేరుతోవ తొక్కిరి. ఈ రెంటికిని మేనమామపోలికలు చాల నున్నవి.

వారి మతమున సమాధి సవికల్పము నిర్వికల్పము అని రెండు విధములు. యోగమునకును అద్వైతమునకును భేదము తెలియనివారు సవికల్పమనినను

సంప్రజ్ఞాతమనినను సబీజ మనినను ఒక్కటియే యనియును, ఇట్లే నిర్వికల్ప మనినను అసంప్రజ్ఞాత (1) మనినను నిర్బీజ మనినను ఒకటియే యనియును అనుకొందురు. కాని వీని యాథార్థ్యము వేరు. పదములందును అర్థమునందును వీనికి చాల పోలికలున్నవి.

ఈరెంటిలో సవికల్పసమాధి అంతర దృశ్యానువిద్ధ మనియు అంతర శబ్దానువిద్ధ మనియు రెండు విధములు,

## అంతర దృశ్యానువిద్ధము

వీథిలో పదుగురు పోట్లాడుకొనుచుందురు. వారికి ఎట్టెదుట నొక యిల్లున్నది. ఆ యింటివాడు కలహించువారిలో చేరబడక యేమియు కల్పించుకొనక కనులార చూచుచుండును. అట్టివానిని సాక్షి అని యందుము. ఇటులే 'నేను వీడు నాది నీది' అనియు, కోరికలు కోపములు తాపములు మొదలగు వృత్తులు మదిలో మల్లడి గొనుచుండును. ఈ వృత్తులకు వేనికిని వశుడు కాక వానిని వేరుగా చూడ గలిగినవాడు సాక్షి అని అనిపించుకొనును. కావున 'కామాదివృత్తులు దృశ్యములు; వీనికి నేను సాక్షిని. దేహము మొదలు బుద్ధివరకును గల యీ మొత్తము నేను కాను' అను తెలివిచే భ్రాంతికతన దోచు దృశ్యమునంతయు తనయంద యడచి తన్నుదా చూచుచుండు నవస్థ అంతర దృశ్యానువిద్ధము. మనసునందు తోచు వృత్తులు అను దృశ్యముతో అంటియున్నది అని దీనికర్థము. ఈ సమాధిలో అనగా కొంత ఏకాగ్రమగు మనోఽవస్థలో ఆత్మాకారమగు వృత్తితోపాటు తెలిసికొను వాడును తెలివియు తెలియదగినదియు అను త్రిపుటియు మినుకు మినుకు మనుచుండును. మట్టితోజేసిన ఏనుగును చూచుచుండునపుడు ఏనుగుతోపాటు మట్టిని గూడ చూడకతప్పదు. 'మట్టిని జూచినపు డేనుగులేదు; ఏనుగును జూచినపుడు మట్టిలేదు' అనునది వేరుమాట. ఆ మనోఽవస్థ వేరు.

## అంతర శబ్దానువిద్ధము

ఇటులు దృశ్యమును తనయంద యడచి-'నేను స్వప్రకాశుడను, జ్ఞాన స్వరూపుడను, ద్వైతవర్జితుడను, అంతరాత్మగా నిత్యసిద్ధుడను, సదానందుడను,

(1) 'ప్రశాంతవృత్తికం చిత్తం పరమానంద దీపకమ్
అసంప్రజ్ఞాతనామాఽయం సమాధి ర్యోగినాం ప్రియః'
(ముక్తికోపనిషత్ - ౨-౧౪)

అను ఇట్టి సన్మాత్రమగు ఆత్మను పట్టుకొనగల వృత్తిచే ఆ యాత్మస్వరూప మును బోధించు శబ్దములు నిరూపించు వస్తువును హృదయమున భావనచేయుట ఆంతర శబ్దానువిద్ధము. మనసులో మనసులో శబ్దముల తాకు ఈ సమాధిలో నుండు నని దీనికి అర్థము. సాధకు డీ సమాధిలో నేను సాక్షిని, అంతరాత్మను అని తలచును. కోరికలు మొదలగు వృత్తులకు వేరయిన ఆత్మ యీ సమాధిలో విషయము. ఆత్మజ్ఞానప్రవాహ మిం దుండును. దీని యందును నేను ద్వైతవర్జి తుఁడను, అని తెలియు వాఁడును తెలివియు తెలియదగినదియు అను త్రిపుటి యుండును. కాన నిదియు సవికల్పము.

## నిర్వికల్ప సమాధి

తన్ను దా నెరిగిన తనువున నిట్టనిలువుగా మునిగిన ముంపుచే దృశ్యము శబ్దము అను నీ జంటను ఒప్పరికించి నీటబడిన ఉప్పుగల్లు నీరుగనే అయిపోవు చందముగా బ్రహ్మాకారము నొందిన వృత్తి బ్రహ్మమాత్రమయి తాను వేరుగా కనబడని అవస్థ నిర్వికల్పము. సంతతమును సవికల్పసమాధిలో నుండుటవలన విషయాసక్తికి ఫలమగు విక్షేపము తొలగి నిర్వికల్పసమాధికి దారితీయును. నిర్వికల్పసమాధిలో త్రిపుటి బ్రహ్మవృత్తియం దడగును. సవికల్పసమాధిలో మానసికమగు క్రియ ఉండును. నిర్వికల్పసమాధిలో అది అడగును. నిద్రలో తనయెరుక ఉండదు. నిర్వికల్ప సమాధిలో తనయెరుక తోచని అనుభవము ఉండదు. సదసద్విచారణా ఫలమగు వివేకము కలిగిన పిదప సాధకుడు బాహ్య ప్రపంచము నెడల ఉదాసీను డగును. ఈ యవస్థలో సాధకుడు వృత్తిశూన్యు డెటులగునో అటులు ఆనందపూర్ణు డగును. ఈ యవస్థను వసిష్ఠుడు ఆకస మందును సముద్రమునందును ఉంచిన కుండనుగా పోల్చెను. ఆకసమందుంచిన కుండ లోపలను బయలే వెలుపలను బయలే. సముద్రము నందుంచిన కుండ లోపలను నిండే వెలుపలను నిండే.

## బాహ్య దృశ్యానువిద్ధము

లోగడ జెప్పిన సమాధులలో సాధకుడు తన స్వభావము సచ్చిదానంద స్వభావమని యెరుగును. ఇక బాహ్యప్రపంచమునందలి విషయముల నాధార

ముగా గొనియు సమాధి నభ్యసింపవచ్చును. ఇట్టి సమాధిచే ప్రపంచ స్వభావ మును బ్రహ్మ స్వభావమును ఎరుగనగును.

తెల్లదనము చల్లదనము ద్రవత్వము అను నీ మూడును నీటి గుణములు. నిడుదతనము కెరటము అను నీ రెంటిలో మొదటిది రూపము, రెండవది నామము. వీని నన్నిటిని కలగ పులగముచేసి లోకులు కెరటమందురు. అటులే ఉనికియు ఎరుకయు ప్రేమయు బ్రహ్మస్వరూపము. ఇట్టి స్వరూపమునందు నామరూప ముల నధ్యస్తముచేసి దానివి లోకులు ప్రపంచమని వాడుదురు. ఇది తెలిసి సాధ కుడు ప్రపంచమునందు కానిపించు వస్తువులన్నింటియు నామరూపములను బ్రహ్మమునందే విలాపన మొనరించి కెరటమని పేరే కాని నీరే యని తెలిసికొను నటులు 'నేను ఈ నామరూపములకు అధిష్ఠానమను' అని తెలిసికొనును. వెలుపలి వస్తువు లీ సమాధిలో విషయము కావున ఇది బాహ్యదృశ్యానువిద్ధము.

## బాహ్య శబ్దానువిద్ధము

సాధకుడు నడచుచును నిలుచుచును పడియుండుచును ఎపుడును దృశ్య మును నామరూపాత్మకము నగు ఈ ప్రపంచము తనకు అధిష్ఠానమును అఖం డైక రసమును సచ్చిదానందలక్షణము నగు వస్తువే యను సంతత చింతనము బాహ్య శబ్దానువిద్ధము. ఆంతర శబ్దానువేధ కల సమాధిలో శబ్దానుగతమయిన సంబంధము తనతో. ప్రకృత సమాధిలో శబ్దానుగతమగు సంబంధము ప్రపంచ ముతో. ఈ సమాధియందును తెలియువా డొకడును తెలివి యొకటియు తెలియ దగిన దొకటియు నుండెగాన నిది సవికల్ప సమాధి భేదమే. ఈ సమాధి బాహ్య దృశ్యానువిద్ధ సమాధికంటె దొడ్డదియు బాహ్య నిర్వికల్పసమాధి కంటె కీస తక్కువ యనియు నందురు.

## బాహ్యనిర్వికల్ప సమాధి

బ్రహ్మనంద రసావేశముకతన బాహ్యప్రపంచము ఉన్నటులే యెరుగక బ్రహ్మస్వరూపముతో ఏకత్వ మెనసి సాధకుని చిత్తవృత్తి గాలి లేనిచోట పెట్టిన దీపమువలె నుండును. ఇది బాహ్య నిర్వికల్పము. నిర్వికల్ప సమాధిలో వలె ఇందును మాయచే ప్రతీత మయినదెల్ల కెరటము నీరే యని తెలిసినటులు

బ్రహ్మమే అని తెలియును. మరియు దృశ్యముతోపాటు బ్రహ్మమునందును గల అఖండత్వము ఏకరసత్వము మొదలుగా గల విశేషములు కానరావు. ఇటులగుట జేసి చలనముతోపాటు చిత్తమును అడగును. (2)

బ్రహ్మజ్ఞానమువలన ఆనందము కలుగును. బ్రహ్మము రసమనియు ఆనందమనియుగదా శ్రుతి చెప్పను. అట్టి బ్రహ్మమే తాను. ఆంతర సమాధులలో దృశ్యమునకు సాక్షియగు 'తాను' బ్రహ్మభిన్నుడగును. ఇటులు కాని నాడు అధిష్ఠానములేని ఆ సమాధి నిర్వృత్తికమయినను శూన్యమునందే పర్యవసన్నమగును. ఇక ఇటులు బాహ్యసమాధులలో వ్యాపకతాస్వభావము కలిమి ప్రపంచమునం దెల్లెడ నిండియుండిన అఖండరసైకబ్రహ్మము తనతో ఏకమగుచున్నది. బ్రహ్మజ్ఞాన మానందముతో కలిసియున్న చందముగనే ఆత్మజ్ఞానము గూడ ఆనందముతో కలిసియే యున్నది. మరియు దేహాభిమానము పోవుటతో పాటు పరమాత్మ యెరుక కలిగి మనస్సు ఎచ్చటెచ్చటి కేగినను అచ్చటచ్చట సమాధులే యని అద్వైతు లందురు. అనగా పైజెప్పిన సమాధులను జ్ఞానపూర్వకముగా చిరకాలము అభ్యసించిన యెడల సాధకుడు ఆంతర విషయములును బాహ్యవిషయములును సమస్తమును బ్రహ్మమని తెలిసికొనును. పామరుడు గూడ అనిత్యము లనియు, అసత్యము లనియు నెరుగు నామరూపములను నిత్యమును సత్యము నగు బ్రహ్మమని సాధకు డరయును అతనికి క్రిందను మీదను ముందును వెనుకను డాపలను వెలుపలను బ్రహ్మమే. మొదట మొదట ప్రయత్నముచే నెరిగికొనినది పిదప పిదప అప్రయత్నకృతముగను స్వాభావికముగను అయిపోవును.

---

(2) సరస్వతీ రహస్యోపనిషత్తునందు ఆరు విధములయిన యీ సమాధులు చెప్పబడియున్నవి. దృగ్దృశ్య వివేకమునందును సర్వవేదాంతసార సంగ్రహమునందును ఇవి చెప్పబడినవి. వీనిలో దృగ్దృశ్య వివేకమునందలి శ్లోకములును సరస్వతీ రహస్యోపనిషత్తునందలి శ్లోకములును ఒకటియే. దృగ్దృశ్య వివేకమునే సరస్వతీ రహస్యోపనిషత్తు ఉట్టంకించుకొనెనని విమర్శకుల అభిప్రాయము. సర్వవేదాంతసార సంగ్రహము స్వతంత్రముగనే పేరిని చెప్పి యోగులు చెప్పు సమాధులను యమనియమాదులను ఇంకొకరీతిగా అద్వైత ప్రక్రియ యం దంతర్భావ మొనరించెను.

యోగదర్శనము చెప్పు సమాధు లివి కావు. వానికిని వీనికిని గల పోలికల నెరుగుటకే యిచట నివి వివరింపబడినవి. ఇక ప్రకృతమునకు వత్తము.

## చిత్త భూమికలు

క్షిప్త మనియు మూఢ మనియు విక్షిప్తమనియు ఏకాగ్రమనియు నిరుద్ధ మనియు చిత్తభూమిక లయిదు. అతి చంచలమును ఏ విషయమునందేనియు కొంచెము సేపు అంటిపెట్టుకొని యుండజాలని చిత్తము క్షిప్తము. ఈ భూమి కలోనున్న చిత్తము జ్ఞానగర్భమగు సమాధికి పనికిరాదు.

ఏదో ఒక విషయము ఆకర్షించు ననుకొందము. ఆ యాకర్షణమునకు లోగబారి ఆ విషయముతో సమాహితమగు చిత్తము మూఢము దవ్వులనున్న బంధువునెడ చిత్తము ముగ్ధమగును. మోహావిష్టమగుటచే ఇట్టి చిత్తముగూడ సమాధికి పనికిరాదు.

ఒకచిత్త మొకపుడు నిలుకడగా నుండును. ఇంకొకపుడు నిలుకడగా నుండదు. ఇట్టి చిత్తమునకు శ్రవణమునందును మననమునందును అధికారము కలదు. దీనికి సమాధ్యధికార మున్నను వేళావేళలున్నవి. కావున నిశ్చలత పొసగనేరదు. దీనజేసి ఈ చిత్తమునందు నిండుఱెరుక నెలకొనజేయుట అంత సులభము కాదు. ఒకవేళ ఈ చిత్తము సమాహితమై సూక్ష్మజ్ఞానము కలిగి అనగా తన్మాత్ర ప్రత్యక్షతచే సుఖదుఃఖమోహములకు లోగక తప్పదు. ఏలనగా ఈ చిత్తమునకు విక్షేప మున్నది. కావున ఈ భూమికలోని చిత్తమున సమాధి ఒదవినను అది నిలుకడగా నుండదు. సాధకులలో పలువుర చిత్త మీభూమిక లోనిదే.

ఒకదానినే పట్టుకొని యుండునది ఏకాగ్రచిత్తము (3) చిత్తము ఈశ్వ రుని అవలంబనము కావించుకొనినదని యనుకొందము. ఆ యవలంబనమును వదలక అటులే ఉండగల చిత్తము ఏకాగ్రచిత్తము. అలవాటు చొప్పున ఇట్టి

---

(3) 'ఏకమ్ అగ్రమ్ అవలంబనం యస్య' ఏకాగ్రమ్। 'త్వ మగ్ర భూమి ర్నిరపాయ సంశ్రయా' ఈ మొదలగు మాఘాదిప్రయోగముల నారయు నది.

నిలుకడ స్వభావమై రే యనక పవలనక యెక్కువసేపు ఏకాగ్రము కాగలిగి కలయందును అట్టి కలయే కనగలిగినను అట్టి చిత్తమును ఏకాగ్రభూమిక మని యననగును. ఈ భూమికలోనున్న చిత్తము సాధనచేసి సంప్రజ్ఞాత సమాధి పొందగలదు. ఈ సంప్రజ్ఞాత సమాధియే ప్రకృతమగు యోగము. మరియు కైవల్యమునకు సాధకము. ఈ భూమికలోనే సంప్రజ్ఞాతము సిద్ధించును గాని క్షిప్త మూఢవిక్షిప్త భూమికలలో సిద్ధింపదు. మూఢ భూమికలలో సైంధవునకు సిద్ధి కలిగినటు లూహ చేయవచ్చును గాని దానిని చెడ్డ ఫలమిచ్చిన దానినిగాను ఊహింపవచ్చును. పురాణములలో పలువురు తపస్వుల తపస్సు అచ్చరలచేగాని మన్మథునిచేగాని యింద్రుడు భంగపరచిన కథ లున్నవి వారి చిత్తములు క్షిప్త మూఢ విక్షిప్త భూమికలలోనివి.

ఇట నిది గమనించునది- సంప్రజ్ఞాతయోగము కేవలము సమాధికాదు. సమాధిప్రజ్ఞ చిత్తాయత్తమగునేని అది సంప్రజ్ఞాతయోగము.

'ఏకాగ్రభూమిలో నొదవిన సమాధి సత్ స్వరూపార్థమును వెల్లడించు'నని భాష్యము. కావున విక్షిప్తభూమికలో నున్న సాధకులు తమ చిత్తము నెప్పుడును ఏకాగ్ర మొనరించుకొనవలెను.

రేయింబవళులలో ఎక్కువ కాలము వృత్తులు అరికట్టబడియుండు చిత్తము నిరుద్ధ చిత్తము. నిరోధ మనగా ప్రత్యయహీనతయే. ఈ చిత్తమునం దేవృత్తియు మొలకెత్తదు. సమాధి గట్టిపడిన యెడల ఈ యవస్థ సుస్థిత మగును. ఇట్టి చిత్తము నిరుద్ధభూమికము. సకలవృత్తి నిరోధము యోగచరమ భూమిక. ఈ భూమికలో చిత్తము లీనమగును. ఏకాగ్ర భూమికలో చిత్తము సర్వార్థముకాదు. అనగా ఇంద్రియము లేవిషయముతో సంబంధపడిన ఆ విషయమునందు సంబంధము పెట్టుకొనదు. ఇటులు పెట్టుకొనక తా నవలంబించిన పట్టునొక్కనే పట్టుకొని యుండును. ఈ రీతిగా ఏకాగ్రభూమికలోని చిత్తమున సర్వవిషయ విలయపూర్వకమగు ఒకే ఒక వృత్తికి ఉదయము. నిరుద్ధభూమికలో వృత్తికి అనుదయము. ఈ భూమికలో చిత్తమున ఒదవిన సమాధిని ఏకాగ్రభూమికలో చిత్తమున ఒదవిన సమాధిని యోగము అని అందురు

౯

శబ్ద స్పర్శ రూప రస గంధములను గ్రహించుచుండుట చిత్తమునకు స్వభావము. వేయేల, సర్వార్థములను అనగా విషయములను గ్రహించుటయే దానిపని. సర్వార్థత చిత్తధర్మము. ఈ ధర్మమువలన ప్రత్యయములును (ఇది కుండ ఇది కొండ ఖా మొదలగు జ్ఞానములు) ఈ ప్రత్యయములవలన సంస్కారములును కలుగుచుండును.

చిత్తముమీద జ్ఞానముగాని క్రియగాని హత్తుకొనిన యెడల అవి సంస్కారము లగును. జ్ఞాన సంస్కారానుభవము స్మృతి. క్రియాసంస్కారానుభవము స్వారసిక క్రియ. పూర్వసంస్కారమును పూర్తిగా త్రోసివైచినయెడల ఎరుగబడు ఎరుకయు చేయబడు పనియు స్వతంత్రముగా ఉండగలవని ఊహింపనవకాశము లేదు. ఇటులు చిత్తము ప్రత్యయ సంస్కారోభయాత్మకము.

గుణముల యితివృత్తము చంచలము. మంచికి బోవునపుడు మంచిగను చెట్టకు బోవునపుడు చెట్టగను తరతమ భావములతో నవి పరిణమించుచునే యుండును. కాని ఆ పరిణామమున కొక అవధి యున్నది.

## సమాధి పరిణామము

కొలది కాలమేని చిత్త మేకాగ్ర మగునేని దానిని సమాహితచిత్త మని యందుము. ఏకాగ్రతయే సమాధి. ఏకాగ్రతలేని సమాధి లేదు. ఏకాగ్రత సమాధిసామాన్య లక్షణము. యోగారంభమున విభిన్నములగు ప్రత్యయముల నన్నిట నేకాకార మొనరింపవలసివచ్చును. అటు లొనరించునపుడు సర్వార్థతా ప్రత్యయములును వాని సంస్కారములును అడగి ఏకాగ్రతా ప్రత్యయమును దాని సంస్కారమును పొడముచుండును. సమాధి సామాన్యమునందు ఇట్టి పరిణామము సంభవించును. ఇది సమాధి పరిణామము :

ఏకాగ్రభూమికలో చిత్తము కనిపించిన విషయము వెంట బరుగిడక ఒక విషయమునందే నాటుకొనును. ఇటులు అన్ని విషయములకు విలయమును ఒక

X Automatic action.

విషయమునకే ఉదయమును గాగలుగు చిత్తపరిణామము సమాధి పరిణామమని
చెప్పబడును. సమాధిలో చిత్తమునకు ఏకవిషయమునందు పరిణతి. పూర్వ
ప్రత్యయ సంస్కారములకు లయమును సమాహిత విషయ ప్రత్యయ సంస్కా
రముల కుదయమును (ఏకాగ్రతా ప్రత్యయ సంస్కారములకు ఉత్పత్తి) కలుగును.

## ఏకాగ్రతా పరిణామము

ఇట్టి అభ్యాసము బలపడిన యెడల సమాధి కాలమునందు పూర్వ ప్రత్యయ
మడగి సరిగా అట్టి ప్రత్యయమే పొడముచుండును. అడగిన వృత్తియు పొడమిన
వృత్తియు ఏకాకారముగనే యుండును. ఇది సదృశవృత్తి ప్రవాహము. సాధకు
డొకడు కొన్ని గంటలపాటు సమాధిలో నుండెనని అందము. అతడు మొదట ఏ
వృత్తితో చిత్తమును సమాహిత మొనరించెనో సమాధికాలమునందును అతని
చిత్తమున అట్టి వృత్తియే పొడముచుండును. ఆ వృత్తి మారుటయే సమాధి
భ్రేషము. ఇది ఏకాగ్రతా పరిణామము లేక ఏకాగ్రతాపరిణామరూప సమాధి.

## సమాపత్తి

ఈ భూమిక స్థిరమయిన యెడల చిత్తము విషయములపైనుండి క్రమ
క్రమముగా ఏకైక విషయమునందు లీనమగును. ఇటువైని సాధకుడు సంప్ర
జ్ఞాతభూమి నారోహించును. అప్పడతని చిత్త మేకాగ్రభూమికము కాగలదు.
అందుల కాతడెల్లప్పుడును చిత్తమును సమాపన్న మొనరింప యత్నించుచుండును.
అప్పుడా చిత్తము విషయములను మరచెడి ధర్మమును విడిచి ఎల్లప్పుడును ఏదో
ఒక విషయమునందు లయమందు భావనను తాల్చ నెంచును. ఇదియె సమా
పత్తి. ఈశ్వర ప్రణిధానాదిక మొనరించి చిత్తము నెల్లప్పుడును అభీష్ట విష
యమునందు తనకు స్వాభావికమయిన చందమున నిశ్చలముగా ఉండగలుగు
నెడల ఆ చిత్తము నిలుకడ చెందినదని చెప్పుదురు. నిలుకడ చెందిన చిత్తమున
గలుగు సమాధియే సమాపత్తి. కేవల సమాధికిని సమాపత్తికిని ఇదియే భేదము.
సమాపత్తి రూపప్రజ్ఞ యే సంప్రజ్ఞాత యోగము. దీనిని సంప్రజ్ఞాతసమాధియ
నందురు.

ఏకాగ్రత సమాహితత ఏకాగ్రతాపరిణతి సమాపత్తి ఇవి అన్నియు
ఏకాగ్రతాభివృద్ధి క్రమము. మరియు ఈ సమాపత్తి సమాధి పరిణామమే.

## నిరోధ పరిణామము

సమాధి పరిణామమునందు చిత్తమునకు పరిపూర్ణమగు నిరోధము కలుగదు. అది వివేకఖ్యాతిసాపేక్షము. వివేక ఖ్యాతి పూర్వకమగు పరవైరాగ్యముచే చిత్తాధికారము కడముట్టును. ఇట్టి యోగ్యత నిరోధభూమికలో.

సంప్రజ్ఞాత సంస్కారము లడగి నిరోధ సంస్కారములు పొడముట నిరోధ పరిణామము. ఈ సంస్కారములు ప్రత్యయముల సూక్ష్మావస్థలేకాని ప్రత్యయములు కావు. సంస్కారము లెట్టివో అట్టి ప్రత్యయములు నిరోధింపబడిన యెడలనే సంస్కార నిరోధమగునని అనజెల్లదు. బాల్యాద్యవస్థలలో నెన్నియో ప్రత్యయము లడగియుండును గాని సంస్కారములు మాత్రము పోవు. ఆ సంస్కారములవల్ల యౌవనాద్యవస్థలందు ఆ సంస్కారముల కనురూపములగు ప్రత్యయములు చూపట్టుచుండును. రాగ మున్న తరిలో క్రోధ ప్రత్యయము లడగియుండినంతమాత్రముననే క్రోధ సంస్కారము లస్తమించునా? సంస్కారములు సంస్కారముల వలననే అడగును. సంప్రజ్ఞాత సంస్కారములు నిరోధసంస్కారముల వలననే అడగును. ఎటులనగా క్రోధ ప్రత్యయోత్థాన సంస్కారములు క్రోధనిరోధ సంస్కారముల వలననే అడగును. క్రోధము నక్రోధముచే జయించుటనగా నిదియే.

## పరిణామత్రయమున విశేషము

ఏకాగ్రతాపరిణామమున చిత్తమునకు సమాధి. సమాధి పరిణామమున సంప్రజ్ఞాతయోగము. నిరోధపరిణామమున అసంప్రజ్ఞాతయోగము.

ఏకాగ్రతా పరిణామమున సదృశవృత్తి ప్రవాహము. సమాధి పరిణామమున ఒకే ఒక విషయమున చిత్తమునకు లయము. నిరోధ పరిణామమునందు చిత్తమునకు అవస్థితి.

సమాధివల్ల ప్రజ్ఞోత్పత్తి. ప్రజ్ఞవల్ల ప్రజ్ఞాసంస్కారోత్పత్తి. ప్రజ్ఞా సంస్కారమువల్ల అవిద్యా సంస్కార విలయము. దాన వివేక ఖ్యాతి. అటుపిదప పురుషప్రజ్ఞ.

నిరుద్ధమగు పిదప చిత్తమునకు పని యుండదు. ఆత్మకును గుణములకును వేరిమి తెలిసినందు వలన పరవైరాగ్యము కలిగి చిత్తము లీన మగును. ఇది కేవలస్థితి. ఈ స్థితి కలుగగనే గుణపరిణామము ఉండదు. చిత్తమున ప్రత్యయముతోపాటు సంస్కార మిగిరిపోవును. చిత్తమే యిక నుండదు: నిరోధాభ్యాసము గట్టిపడినకొలది నిరోధ సంస్కారముల కుపచయము కలుగును. ఈ సంస్కార దార్ఢ్యమే నిరోధభూమికాస్థైర్యము. ఈ సంస్కారము సంప్రజ్ఞాత సమాధిలో కలిగిన ప్రత్యయమునకును సంస్కారమునకును విలయము కలిగించును. దానితో చిత్తము నిర్బీజమగును. అసంప్రజ్ఞాతరూపమగు నిరోధము నిరోధ సంస్కారములను పొడమజేయును. ఈ సంస్కారముచే పరవైరాగ్యము కలుగును. చిత్తమిక మొలకెత్తదు.

## యోగైశ్వర్యము

సంప్రజ్ఞాతయోగమున భాసింపని దేదియు నుండదు. ఈ సమాధికతన బుద్ధితత్త్వము మొదలుకొని భూతతత్త్వమువరకును గల తత్త్వములన్నియు ఎరుకపడును. ఈ యోగమున గలిగిన జ్ఞానము సంప్రజ్ఞానము. దీనిచే స్థూల సూక్ష్మకారణము లన్నియు తెలియును. దీనికి కనబడని విషయ మని ఒకటి ఉండుటకు వీలులేదు. ఇది సమాధివలన బొడమిన జ్ఞానము. సంశయమేని ఆవరణమేని దీనిముందు నిలువజాలదు. ఈ సంప్రజ్ఞాతయోగము సృష్టిలోని సోపానముల నన్నిటిని బహిరంగపరచును. సంప్రజ్ఞాతయోగము సృష్టిరహస్యమును ప్రకాశింపజేసి క్లేశములను పోకార్చి కర్మబంధమును సడలించి చిత్తమును నిరోధమున కభిముఖ మొనరించును.

గుణవృత్తము చంచల మని తెలిసికొంటిమికదా! ప్రఖ్యారూపమగు చిత్తసత్త్వము తమోగుణ యుక్తమగునేని అది అధర్మ - అజ్ఞాన - అవైరాగ్య - అనైశ్వర్యముల కాశ్రయ మగును. రజస్తమో గుణయుక్తమాయెనేని అది విషయ - ఐశ్వర్య ప్రియ మగును. మోహావరణము లేని రజోలేశముతో కూడెనేని అది ధర్మ - జ్ఞాన - వైరాగ్య - ఐశ్వర్యముల కాలవాల మగును. ఆ లేశముగూడ లేని యెడల ఆ చిత్తమున కపుడు స్వరూప ప్రతిష్ఠ. అపుడు బుద్ధితత్త్వమునకును పురుషతత్త్వమునకును గల భేదము తెలిసిపోవును. రజస్తమోనువిదమె

ప్రఖ్యారూపమగు చిత్తసత్త్వమునందు క్రియ సూక్ష్మమగుటవలన ఐశ్వర్యము భాన మగును. విషయ-ఐశ్వర్య - పరత్వము రజోభిభూతమగు చిత్తక్రియ. తమోభిభూతమగు చిత్తమున ప్రకాశ మించుకయు లేమి అధర్మ - అజ్ఞాన-అవైరాగ్య - అనైశ్వర్యముల కుద్రేకము. ఇవి జ్ఞానమునకును శుద్ధ సత్త్వమునకును విరుద్ధ ధర్మములు. తమఃస్పర్శ లేని రజస్సుతో గూడిన చిత్తమున ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యములకు ప్రకాస్తి. ఇచట రజఃప్రధానమగు సత్త్వమునకు క్రియాశీలత. దీనివలన చిత్తమున ఉత్తమమగు జ్ఞానమునకు వికాసము. ఈ జ్ఞానదర్పణమున నన్నియు ప్రతిఫలించును. మరియు ఈజ్ఞానమున వివేక వైరాగ్యముల కలిమి స్వాభావికము. అట్టియెడ పదార్థ జ్ఞానము సునిశ్చితము. విశుద్ధమగు నీవిజ్ఞానమున సూక్ష్మతమమగు శక్తితో పరిచితియు దానిమీద కర్తృత్వమును ఒదవును. ఇదియ యోగైశ్వర్యము. యోగుల కిది విశుద్ధ విజ్ఞానమువలన గలుగు ఫలము. ఇది స్వాభావికము. యోగుల ఇచ్ఛకు ప్రతిఘాత ముండదు. తమోగుణాపచయముచే చిత్తమునకు వెలుగును స్ఫురణమును కలుగును. ఈస్ఫురణము వలననే యోగులకు సహజముగనే సూక్ష్మవిషయముల మూలమూలలు తెలియును. ఇట్టి శక్తి విస్తృతియు స్వాభావికముగనే పొందుపడును. ఇక రజోగుణము క్షీణించి శుద్ధసత్త్వ ముదయింపగనే యోగి ప్రసంఖ్యానమునందును వివేకమునందును ప్రతిష్ఠితుడగును. యోగి అటు మీద శక్తిని ఐశ్వర్యమును వికసింపజేయడు. ఏలయనగా అందుల ప్రకృతి స్పర్శ యుండక తక్కదు. వశిత్వము కామావసాయిత్వము మొదలగు సిద్ధులన్నియు రజోగుణాశ్రయములు. శుద్ధ సత్త్వముచే జ్ఞానమునకు పెంపు, అవిద్యకు తెంపు.

చిత్తమునకు గలుగు పరిణామ స్వరూపమును తెలిపి భాష్యము వేరువేరు సోపానముల నధిరోహించిన యోగులతో మనకు పరిచయ మొనరించినది. శక్తి వికాసము జ్ఞానసోపానమునకు దిగువ. శక్తివికాసము రజఃప్రధానము. జ్ఞాన-వివేక వికాసము సత్త్వప్రధానము. శక్తివికాసముచే ఈశ్వరాధికారమువంటి అధికారము. జ్ఞానము వికసించు నెడల ఆ అధికారమునందలి మోహము తొలగిపోవును. ఆ వ్యామోహము తొలగ బారుటయ తడవుగా ప్రసంఖ్యానమును వివేకమును ఉదయించును. అంతట ముక్తికి రాదారి యేర్పడును.

# 12. శ్రీ లల్ల

౧౪ వ శతాబ్ది కాశ్మీరాలలో లల్ల పుట్టింది. పుట్టింది మొదలు ఆత్మాన్వేషణే పని. ప్రాచీన కాశ్మీరిలో కవిత్వం కట్టింది. ఈమె కవితలో శివాద్వైతం అద్వైతం తంత్రం ప్రత్యభిజ్ఞ సుఫీసంప్రదాయం మొ. వానిలో చిలికిన వెన్నా గయని సున్నా కనిపిస్తవి. తత్త్వద్వేషులు వీనినే లల్లాయి పదాలని అన్నారా లేక తెలుగు వారిలో ల (లొ)ల్లయ్యో పదాలనే ఇలా అన్నారా అనే సంశయం కలుగుతుంది.

శ్రీమ దభినవగుప్తుని ఈశ్వర ప్రత్యభిజ్ఞావ్యాఖ్యాత భాస్కరుడు 'లల్లేశ్వరీ వాక్యాని' అనే పేరుతో ఈమె పద్యాలు కొన్ని సంస్కృత శ్లోకాలుగా మార్చాడు. వీనిలో కొలది లోపాలు కనబడతవి. అవి అచ్చులోపాలై యుండాలి!

ఈమెకు హిందువులలో లల్ల లల్లాదేవి లల్లేశ్వరి లల్లాయోగిని అనిన్నీ ముస్లింలలో లల్లా అరీఫా అనిన్నీ ప్రసిద్ధి.

(నేను ఈక్రిందివానిని అర్థక్రమంకోసం, పాఠక్రమాన్ని అతిక్రమించి, తెలుగువాక్యాలు వ్రాస్తున్నాను. భాష ఎలా ఉంటుందో అనే కౌతుకం తీర్చటానికి ఒక పద్యంమాత్రం కాశ్మీరీ భాషలోది ఉదాహరిస్తాను)

శివ్ వా కేశవ్ వా జిన్ వా కమలజ నాథ్‌నామ్ దారిన్ యుస్
మ్యో అబలి కాసితన్ భవ రుజ్‌సుహ్ వా సుహ్‌వా సుహ్.

నేను అబలను. నన్ను భవరోగం పట్టుకొని పీక్కుతింటూంది. శివుడు కేశవుడు [1]జినుడు - బ్రహ్మ. వీరిలో ఎవరు నాకు చికిత్స చేసినా సరే? (౮) ౨

నేను విభునికోసం దేశదేశాలు తిరిగి వేసారిపోయాను. పొరపాటు పడ్డాను. ఊపిరి నిలిపి, జ్ఞానదీపం వెలిగించి, చూతునుగదా తీరా ఇంట్లోనే చిత్స్వరూపుడు కనబడ్డాడు. (౩-౪) ౨

1. కాశ్మీరీలకు సామరస్యం చాలా ఉన్నట్లు కనబడుతుంది. అభినవుడు జైనాచార్యుల కడా, బౌద్ధాచార్యులకడా జైనం బౌద్ధం చదువుకొని-'శాస్త్రాలలో కుతూహలంవల్ల నాస్తిక అర్హత బౌద్ధాదులైన గురువులను సేవించాను'-అని తంత్రాలోకంలో (౮-౨౦౬) చెప్పుకొన్నాడు.

విభు దర్శనం కోసం ఎన్నో తీర్థాలు తిరిగాను. అతని గుణాలు కీర్తించి కీర్తించి నోరు నొచ్చింది; దానికంటె ఎక్కువ మనస్సు మలమల మరిగింది. అతని విమర్శచేస్తూ మనస్సు లోపలికి వెళ్లా. (౪౭)

అక్కడ అన్నీ ఆవరణాలే. వాని లోపలనే ఉంటాడని నిశ్చయించా. వానిని దూసుకుని లోపలికి వెళ్లా. అపు డందరూ నన్ను లల్లా లల్లా అని అన్నారు. (౪౯) ౩

సంసారంలో కుమిలి దిక్కులేనిదాననైనాను. ఇపుడు సహజమైన ప్రబోధం కలిగింది. ఒకళ్ళకోసం నే నిహ చావనక్కరలేదు. నాకోసం ఇంకొకళ్ళు చావనక్కరలేదు. నాకిపుడు చావూ బ్రతుకూ ఒకటే. (౩౪) ౪

ముక్తికోసం, పాపం ! ఈ సన్న్యాసులు తీర్థాలు పోతారు. ముక్తి చిత్తసాధ్యంకాని తీర్థసాధ్యం కాదు. దూరపుకొండలు నునుపు ! (౩౬) ౫

చిత్తం అనే అద్దం నిర్మలం ఐంది. ప్రత్యభిజ్ఞ కలిగింది. దైవం నా స్వరూపంగానే కనిపించింది. నేనూ హూష్, నీవూ హూష్, ఈ ప్రపంచమూ హూష్. (౩౧) ౬

అమ్మలక్కలు నన్ను వేవిధాల తిట్టనీ; ఉదాసీనమైంది నా మనసు. దానికి మకిల పట్టదు. ఉదాసీనమైన ! (పైన వేలదీసిన) అద్దాన్ని (నేలమీది) దుమ్ము ఏం చేస్తుంది ? (౧౭) ౭

నన్ను తిట్టుకోండి తిమ్మకోండి, పూలతో పూజించుకోండి రాలతో కొట్టుకోండి. నాకు దుఃఖమూ లేదు, సంతోషమూ లేదు. బోధామృతం తాగి నాలో నే నున్నా ! (౨౧) ౮

(ఓకతె) శీలాన్నీ మానాన్నీ కాపాడటానికి శీల మానాలే భటులు (కాని. నీవా?, నేనా ?.) గాలిని ఏ మొనగాడైనా పట్టుకుంటాడా; ఏనుఁగు నెవడయినా దారంతో కట్టివేస్తాడా ? (౨౪) ౯

అంతా తెలిసీ మొద్దులా ఉండు ! అంతా వినీ చెవిటివి కా! అంతా చూచీ గ్రుడ్డి వవు ! ఇదే తత్త్వాభ్యాసం. (౨౦) ౧౦

అభ్యాసంచేత దృశ్యం శూన్యమైతే సాక్షిరూపం మిగులుతుంది. శాంతమైన ఆ సాక్షిన్నీ శూన్యమైతే ఇక అనామయం. (౧) ౧౧

వాక్కూ, మనస్సూ శివుడూ శక్తీ సమస్తమూ దేంట్లో లయమైతే అదే-అభ్యాసం ! (౨) ౧౨

తంత్రమంతా మంత్రంలో, నాదమూలమైన మంత్రమంతా చిత్తంలో లయమవుతుంది. చిత్తం లయం అయితే దృశ్యమూ ద్రష్టాకూడ చిత్ స్వరూపంగా శేషిస్తుంది.

సూర్యుడ స్తమిస్తే చంద్రుని వెలుగు. చంద్రుడ స్తమిస్తే చిత్తం వెలుగు, చిత్తం అస్తమిస్తే దృశ్య జాతమంతా ఎంతో లీనమవుతుంది. ౧౪

లే లే, శక్తి పూజచేసే ఓ అమ్మీ ! లే! కల్లూ గిల్లూ పోసి పూజ చెయ్ ! దాంతో అక్షరలబ్ధి కలిగితే చెరుపా ? ౧౫

౧

నీ వెవరో తెలియదు, నే నెవరో తెలియదు నీతో ఐక్యమూ తెలియదు. దేహమే నేనని అనుకోడంవల్ల—'నీ వెవరు ? నేనెవరు ?' అని సంశయం. (౬)

౨

శివుడు గుఱ్ఱం, కేశవుడు జీను, ఆత్మ-భవుడు ల్లాడాలు; తగిన రౌతు ఎవడో నాకు చెప్పు. (౧౪)

౩

అప్పు సొప్పులు తీర్చుకోడం ఒక తీర్చుకోడం కాదు, తిండి బట్టల భ్రమ తీర్చుకోవాలి. (౨౬)

౪

చలికిమాత్రం గుడ్డ; ఆకలికి మాత్రం కూడు. (౨౮)

౫

సహజావస్థకు శమదమాలు కారణం కావు; మరి వివేకం నీటిలో ఉప్పు కలిసినట్లు ఏకమయినా ఈ యవస్థ కాదు. (౨౯)

౬

సహజస్థితిలో భేదం అనేది కలికానికి కూడా కానరాదు! బయలులో బయలు కలిసినటులు కలిసిపోవడం సహజస్థితి. (౩౦)

౭

ఒకానొకడు నిదురపోతైనా జాగరూకుడే! ఒకడు జాగరూకుడైనా నిదుర పోతే! ఒకానొకడు ఆడంటు ఐనా పవిత్రుడే! ఒకడు స్నానంచేసినా అశుచే.

౮

ద్వాదశాంతంలో తానే కట్టిన దేవళంలో కూచుని ప్రాణసూర్యుణ్ణి ప్రరో చనచేసి శంకరుడై పోయేవా డిక ఎవరిని పూజిస్తాడు? (౭౫)

౯

ఓయోగీ! నీకు జలస్తంభం ఎందుకు? అగ్ని స్తంభన ఎందుకు? ఆకాశ గమనం ఎందుకు? కొయ్యావు పాలుపిండడ మెందుకు? ఇదంతా బడాయి కాదా?

౧౦

ఏ దిక్కున ఏ దారిని వచ్చానో మళ్ళా ఏదారిని పోతానో తెలియదు; ఉచ్ఛ్వాసమే నాకు ధైర్యం.

౧౧

ఓ ప్రభూ! నీకూ ఆరు. నాకూ ఆరు; నీవు ఏలికవు. నేను లెంకను: ఇదే తేడా. (౧౩)

౧౨

అయ్యా! దేహాదులైన ఆరు కోశాల అడ్డువల్ల నిన్ను కానక చాలాకాలం దుఃఖపడ్డాను! ఇపుడో ఉపాధి బద్దలయింది; విశ్రాంతి దొరికింది. (౪౪)

౧౩

ఆడుతూ పాడుతూ నవ్వుతూ నసుపుతూ నీ దేహంలోనేవున్న ఆత్మదేవుణ్ణి చూడు; దేశాంతరంలో ఏమి వెతుకుతావ్? (౪౬)

౧౪

ఒజ్జా! నాకిది చెప్పు :—హాహ్, హూహ్, ఈ రెండూ ఆస్యమతాలేకదా! హాహ్ వేడిగా ఉండద మేం? హూహ్ చల్లగా ఉండదమేం? (౫౬)

౧౫

హాహ్, జఠరాగ్నితప్తమై నాభిదగ్గరనుంచి లేస్తుంది; హూహ్ ద్వాదశాంతంనుంచి పుటుతుంది; హాహ్ ప్రాణం; హూహ్ అపానం;

౧౬

లల్ల పత్తికాయలాగ జీవితం ఆరంభించింది. అది వికసించేసరికి దాన్ని కోశారు! ఒకరు పింజ తీశారు! ఒకరు ఏకారు! ఒకరు వడికారు! ఒకరు ఉతికారు! ఒకరు మగ్గంలో పెట్టి అటూ ఇటూ కొట్టారు! ఒకరు కత్తిరించారు! ఒకరు అంగీ కుట్టారు! అమ్మయ్య! అంతటితో దీనికి విముక్తి! జీవుడిదారి ముండ్లడొంక!

౧౭

నన్ను నేను తెలుసుకోడానికి శ్రమపడి శ్రమపడి ప్రాణాయామాదులతో అలసి అలసి అతివిజనమైన జ్ఞానమార్గంలో నడచి నడచి ఆనందసురా గృహం చూచాను! ఇక్కడ ఉన్నవన్నీ నిండుకుండలే! ఎవడుకాని ఈ కల్లుపాక చేరీ తాగకుండా పోతే, పోనీ; వాడి ఖర్మం!



---

లల్లనుగూర్చి Sir R. C. Temple ఇలా వ్రాశాడు:

Thine is a song that enslaveth me,
Son of an alien kin and cline.

# 13. శ్రీ సత్యసాయిబాబా

శ్రీ సత్యసాయిబాబా గురించి మీ అభిప్రాయం ఏమిటి? అని పలువురు ప్రశ్నిస్తారు; నేను తెల్లపోతాను కాని; అంతలోనే సంబాళించుకొని 'స్వయంగా దర్శనం చేసుకోండి; మీకు మీరే అర్థం చేసుకోండి' అని వారికి విన్నవిస్తాను.

'పరమ హంసవంటివారా? లేక రమణమహర్షి వంటివారా?' అని మరి కొంద రడుగుతారు. 'సత్య సాయిబాబా సత్యసాయిబాబా వంటివారు' అని వారికి ప్రత్యుత్తరం చెపుతాను.

పుట్టపర్తిలో (ఇది అనంతపురం జిల్లా పెనుకొండ తాలూకాలో ఉన్నది.) శ్రీ సత్యనారాయణ అనే బాలుడు అపుడపు డావలించినపుడు యశోదాదులు శ్రీకృష్ణుని వదనకుహరంలో బ్రహ్మాండాలు చూచినటులు కొందరు రామకృష్ణా ద్యవతారాలు చూచి 'ఇతడు దేవబాలుడు' అని అనుకొన్నారు. కొంద 'రితడు, పిశాచగ్రస్తుడు' అని అనుకొన్నారు. అపు డితడు తోటిబాలురచేత సంకీర్తనం చేయించడం ఆరంభించాడు. తోడివారికి పుష్పఫల ఖాద్యాదులను సృష్టించి ఇస్తూ ఉండేవాడు. 'ఇవన్నీ ఎట్లా వస్తున్నవి' అని అడిగితే 'నాలో ఒక వృద్ధుడు ఉన్నాడు; ఆయన కడనుండి ఇవి వస్తున్నవి' అని చెప్పేవాడు. ఈ రీతిగా లీలలు చూపుతూ చూపుతూ బలవంతాన ఉరవకొండలో ఫోర్త్‌ఫారమ్ చదువుతూ చదువుతూ పద్నాల్గు ఏండ్లప్పుడు (20 అక్టో- '40) చల్లకువచ్చి ముంత దాచడం ఎందుకని 'నేను సాయిని, నేను సాయిని; నే వచ్చిన పని కిక నేను పోతాను' అని బడితోపాటు ఇల్లుకూడా వదలి ఈ సాయి 'మానస భజరే గురు చరణమ్ దుస్తర భవసాగర తరణమ్' అనే సంకీర్తనంతో వెలువడి తన మహిమలు సహస్రముఖాల చూపడం మొదలు పెట్టాడు. ఆ సాయిచరిత్ర బి. నరసింహస్వామి-గుణాజీలు వ్రాసిరి. మరాటీలో పలువురు (విని వ్రాసినది కాబట్టి కొంత ప్రమాణం కాకపోయినా) చదివినవారు, మరి ఎరిగిఉన్నవారు, ఈ సాయి మహిమలు చూస్తే ఈ ఉభయులూ తాపత్రయం పోగొట్టడానికి వచ్చినవారనిన్నీ ఒకే తత్త్వమనిన్నీ గ్రహిస్తున్నారు.

అందరకూ అందుబాటులోని దని వీరు భక్తిని బోధిస్తారు. పుస్తకాలు చదివి నట్లు అందర హృదయాలూ చదివేస్తారు. ఆధివ్యాధులను పోగొట్టుతున్నారు. ఇష్ట దేవతా విగ్రహాలను, వజ్రాదులను, అమృతాది రసాయనాలను, వింతలైన తిను బండారాలను దివ్యములైన ఔషధాలను, ఒకటేమిటి- సంకల్పమాత్రాన తాము తలచిన సమస్తాన్ని సృజించి యివ్వడమేకాదు, తిమ్మిని బమ్మిని బమ్మిని తిమ్మిని గాను చేస్తారు, నిర్మాణకాయంతో దేశాంతరం వెళ్ళి ఆర్తులగు భక్తులను అన్ని విధాల ఆదరిస్తారు, కడతేరుస్తారు. దూర శ్రవణజ్ఞానాదులు వీరికి వెన్నతో పెట్టి నవి. ఇలా వీరిమహిమలను చెప్పవలసివస్తే వ్యాసులవారి నోరైనా కాసుకుగూడా పనికిరాదు. ఈ తత్త్వము మహిమలకు కుబేరనిధి.

ఇది అందరకూ అందుబాటులో ఉన్నా అందని తత్త్వం. సైన్సుకు ఇది అందదు. హేతుజ్ఞానం పొందదు. వీను మిగిలిన భక్తుల- జ్ఞానుల పరిపాకం ఇందున్నా ఇది అందరకన్న విజాతీయం. దీనికి సహస్రముఖాలు. నీకు కనబడేది వేరు; నాకు కనబడేది వేరు కావచ్చు. దీనిని కనినంతచాలు; మరి చాలదు. ఇది ఎంత పరమో అంత ఆత్మీయం. ప్రపంచంలో తల్లులందర ప్రేమా ఏకత్ర పెట్టినా ఈ తత్త్వానికి తూగదు.

ఈ తత్త్వం, పర్తిలో పుట్టినా పుట్టుక లేనిది. తెలుగు దేవరమైనను ప్రపంచమునకు వెలుగు. చదువనిదయినా చదువు. ఇది శుద్ధ భక్తికి సులభం. పాండితికి పరీక్ష. అందరకూ శ్రీరామరక్ష.

[5-10-59 వ జరిగిన దశరా కవి సమ్మేళనములో, శతావధాని శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు బాబావారికి సమర్పించిన ఆశుకవితను ఇందుతో ప్రచురిస్తున్నాము.]

కవీశ్వర హృదీశ్వరో విబుధ పంకజాహస్కరో
మునీశ్వర మనోహర స్సకల హృద్గుహాభాస్కరః
పనీపత దనీకినీ సురధునీ మహామోహినీ
ఫణీశ్వర వచోభరో జయతి సాయివాగీశ్వరః

సాయి మహానుభావుఁ డను సంగతి పల్కు రెఱింగియున్న దా
సాయియె సత్యసాయి యన చల్లని మూర్తిగ పుట్టపర్తిలో
కాయము దాల్చె నన్నదియు ఖాయము కాని, యెఱుంగువారు నా
రాయణుఁడో మహేశుఁడొ హిరణ్మయపూరుషుఁడో వచింతు రే !

కరుణామూర్తి యటంచు కొందఱు నినున్, గాలించి లోలో నహం
స్ఫురణామూర్తి యటంచుఁ గొందఱు మదిం బూజింతు రింకొంద ఱం
దరు యోగీశ్వరుఁ డంచు నిందు నిజ మేదో యన్నియు న్నిక్కమో
యెఱుఁగన్నేరము నీవ చెప్పవలె సాయీ ! శ్వాసరూపప్రభూ !

ఏ యద్వైత సుఖానుభూతికయి నేనీక్షింతునో దానికిన్
మాయోపాయము లెన్నియో తెలిసియుండంబోలు నౌఁగాక, యీ
నీయం దారసి విశ్వరూపము నొగి న్నీ భక్తు లొందంగలా
వాయద్వైతమొ ద్వైతమో మఱివిశిష్టాద్వైతమో తెల్పుదే ?

కనులార నిన్నుఁగాంచం
గనినంతన శరణు జెంది కనుదోయికినిం
గనరాక నీ వెలుంగౌ,
వననిధి మునుఁగుదురు నీదుభక్తశ్రేణుల్.

పిలిచినఁ బలికెడి దైవము !
కలదా యని సందియంబు కలిగినయెడలన్
బిలిచి పరీక్షింపుఁడు ! మీ !
పిలుపు హృదంతరమునుండి పెకలఁగవలయున్.

ఉఱిమి మబ్బులు వర్షింప నోలలాడు
చేలు లన్నియుఁ బ్రాయేలు చేరునటులు
కవుల మదినుండి పొంగు సత్కావ్యరసము
లల్ల రసరూపుఁడగు సాయియందు కలియు.

చివరకు నాకవిత్వ మది చెల్లరె నాలుగె యక్షరాలుగా
మివిలె, రసంబు లన్నిఁటను మేలి రసంబున కాలవాల మ
య్యావి యెవి ? 'సత్యసాయి'యను నట్టివి, అయ్యవిగూడ రెండెయై
మివిలెడి 'సాయి, సాయి' యని; మిక్కిలి వర్ణము తెల్ల చూర్ణముల్.

'రసోవై స' ఇతి బ్రూతే తిత్తిరి శ్ఛందవాం గిరిః
శివరామ స్త్వనుబ్రూతే సాయినం తస్య విగ్రహమ్.



# అనుబంధం - I

## మార్క్స్ వ్యాసాలు - పారిభాషిక పదాలు

| | శాస్త్రిగారి ప్రయోగాలు | మూల పదాలు | ప్రస్తుతం వాడుకలో వున్న శబ్దాలు |
|---|---|---|---|
| 1. | సామంత పాలనము | Feudalism | భూస్వామ్య వ్యవస్థ |
| 2. | ధనవంతులు | Capitalists | పెట్టుబడిదారులు |
| 3. | యంత్రపతులు | Industrialists | పారిశ్రామిక వేత్తలు |
| 4. | ధనిక తంత్రము | Capitalism | పెట్టుబడిదారీ వ్యవస్థ |
| 5. | గణతంత్ర విప్లవము | Socialist Revolition | సోషలిస్టు విప్లవము |
| 6. | గణతంత్ర సమాజము | Socialist Society | సోషలిస్టు సమాజము |
| 7. | శ్రేణీ ద్వంద్వము | Class Struggle | వర్గ పోరాటము |
| 8. | ప్రజా తంత్రము | Democracy | ప్రజాస్వామ్యము |
| 9. | బూర్జువా ఉత్పాదన ప్రణాళిక | Capitalist Productive System | పెట్టుబడి దారీ ఉత్పాదక పద్ధతి |
| 10. | విత్తోత్పత్తి | Production of Wealth | సంపద ఉత్పత్తి |

## సంగ్రహ పరిచయాలు

1. ఇమాన్యుయేల్ కాంట్ :— [1724-1804] జర్మన్ భావవాద తత్వవేత్త-శాస్త్రజ్ఞుడు. పదార్థ స్వరూప స్వభావాలు ఎంతగా తెలుసుకున్నా, మూలవస్తువు అజ్ఞేయమని ఈయన సిద్ధాంతం.

2. హెగెల్ :— [1770-1831] వస్తుగత భావవాద తత్త్వవేత్తలలో అగ్రగణ్యుడు. గ్రీకు తత్త్వవేత్తల కాలంనాటి గతి తార్కిక దృష్టిని పునరుద్ధరించి, విస్తరించి చరిత్రకు వ్యాఖ్యానం చెప్పిన వాడు. మార్క్స్ ఎంగెల్స్‌కు ఉపాధ్యాయుడు.

3. ఫయార్‌బాగ్ (ఫ్యూర్‌బా) :— [1804-1872] జర్మన్ భౌతికవాద తత్త్వవేత్త. నాస్తికుడు. మార్క్స్‌మీద ఫ్యూర్‌బా ప్రభావం విశేషంగా ప్రసరించింది. "ప్రకృతికి సంబంధించి ఫ్యూర్‌బా భౌతికవాది. సమాజశాస్త్రానికి సంబంధించినంతవరకు కాదు" అని మార్క్స్ వ్యాఖ్యానించాడు.

4. మార్క్స్ :— [1813-83] శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతానికి మూల పురుషుడు. గతి తార్కిక చారిత్రక భౌతిక వాదాన్ని, శాస్త్రీయ అర్థశాస్త్రాన్ని రూపొందించినవాడు. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి ఆద్యుడు.

5. "కాపిటల్" :— మార్క్స్ రచనలలో ప్రధాన గ్రంథం. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలోని అంతర్గత సూత్రాలను వివరించే బృహద్రచన. తన గ్రంథాలన్నింటిలో ఇది అత్యుత్తమమైనదని మార్క్స్ చెప్పుకున్నాడు.

6. ఆదాంస్మిత్, రికార్డో :— ప్రఖ్యాత బ్రిటిష్ ఆర్థికవేత్తలు. బూర్జువా సాంప్రదాయ అర్థశాస్త్ర మూలపురుషులు. "వెల్త్ ఆఫ్ నేషన్స్" స్మిత్ గ్రంథాలలో ప్రసిద్ధమైనది.

# అనుబంధం - II

## వేలూరి శివరామశాస్త్రి వ్యాస ప్రచురణ వివరణాదికములు

| | | | |
|---|---|---|---|
| 1. | నాస్తిక దర్శనములు | ... | ఆం. ప. ఉగాది సంచిక 1921-22 |
| 2. | ప్రాచీన భరత వర్షమునందు శూద్రులకు గల అధికారము | ... | భారతి - మే 1925 |
| 3. | నాట్యము | ... | భారతి - నవంబరు 1926 |
| 4. | స్థానం నరసింహారావు | ... | భారతి - డిసెంబరు 1926 |
| 5. | భావకవిత్వము | ... | భారతి - సెప్టెంబరు 1928 |
| 6. | అధ్యాస | ... | భారతి - సెప్టెంబరు 1930 |
| 7. | గ్రంథాలయములు (పెదపాడు ఉపన్యాసము) | ... | భారతి - డిసెంబరు 1930 |
| 8. | ఉనికి - ఎఱుక | ... | భారతి - డిసెంబరు 1936 |
| 9. | పుస్తకం: రేడియో ప్రసంగం | ... | భారతి - జనవరి 1940 |
| 10. | 'గారు' శబ్దవిచారము | ... | భారతి - మార్చి 1941 |
| 11. | నా జ్ఞాపకములు | ... | భారతి - ఏప్రిల్, మే 1941 |
| 12. | మధ్యాకర్షణ | ... | ఆం. ప. ఉగాది సంచిక 1944-45 |
| 13. | కట్టడాలు | ... | భారతి - జూన్ 1946 |
| 14 | సంఘము - సాహిత్యము | ... | భారతి-నవంబరు, డిసెంబరు 1946 |
| 15. | విద్యుల్లోకము | ... | భారతి - మే, జూన్, జులై 1947 |
| 16. | ప్రాచీన భూగోళము | ... | భారతి-ఆగస్టు నుండి డిసెంబరు 47 |
| 17. | సేద్యము | ... | ఆం. ప. ఉగాది సంచిక 1947-48 |
| 18. | రాష్ట్రభాష | ... | సమత - ఫిబ్రవరి 1948 |
| 19. | మార్క్స్ - మతము | ... | సమత - ఏప్రిల్ 1948 |
| 20. | శిల్పము కొఱకే శిల్పమా? | ... | సమత - మే 1948 |
| 21. | మార్క్స్ చెప్పిన చరిత్ర | ... | సమత - జూన్, జులై 1948 |
| 22. | కవులూ - స్వాతంత్ర్యమూ | ... | సమత - ఆగస్టు 1948 |

| | | | |
|---|---|---|---|
| 23. | అర్థశాస్త్రము - మార్క్స్ | ... | సమత - సెప్టెంబరు 1948 |
| 24. | గణిత విజ్ఞానము | ... | ఆం. ప. ఉగాది సంచిక 1948-49 |
| 25. | శృంగారము | ... | భారతి - జనవరి 1949 |
| 26. | ఆరంభవాదము | ... | భారతి - అక్టోబరు 1949 |
| 27. | పరిణామవాదము | ... | భారతి-నవంబరు, డిసెంబరు 1949 |
| 28. | మన సాహిత్య పత్రికలు - భారతి | ... | ఆం. ప. దినపత్రిక 8-12-1949 |
| 29. | మాయావాదము | ... | భారతి-జనవరినుండి ఏప్రిల్ 1950 |
| 30. | ఆనందము | ... | ఆం. ప. ఉగాది సంచిక 1949-50 |
| 31. | న బహూనాం ప్రేయః కింతు సర్వేషాం శ్రేయః | ... | ఆం. ప. దినపత్రిక 11-11-1950 |
| 32. | శ్రీ అరవిందులు | ... | భారతి-జనవరినుండి జులైవరకు 1951 |
| 33. | పురాణాలలో పురుషోత్తముడు | ... | ఆం. ప. ఉగాది సంచిక 1952-53 |
| 34. | తిరుపతి మహాకవి | ... | కృష్ణాపత్రిక - జనవరి 1953 |
| 35. | ఆనందత్రయము | ... | భారతి - ఆగస్టు 1955 |
| 36. | మంజూష - భీష్ముడు | ... | భారతి - జనవరి 1957 |
| 37. | తంత్ర వార్తికము - భీష్ముడు | ... | భారతి - మార్చి 1957 |
| 38. | శక్తి - శక్తము | ... | భారతి - ఆగస్టు 1959 |
| 39. | ధర్మము - ధర్మి గుణము - గుణి | ... | భారతి - సెప్టెంబరు 1959 |
| 40. | శతావధానం | ... | ఆం. ప. స్వర్ణోత్సవ సంచిక 1959 |
| 41. | ఎఱ్ఱన ఆరణ్య రచన మెప్పుడు ? | ... | భారతి - జులై 1960 |
| 42. | ఉపనిషత్తులలో ఆత్మ | ... | భారతి-జనవరినుండి ఏప్రిల్ 1980 |
| 43. | గీతలలో ఆత్మ | ... | భారతి - జులైనుండి మార్చి 80-81 |
| 44. | మన ప్రాచీన విద్యాలయములు | ... | అముద్రితము |
| 45. | ఉపకథ | ... | అముద్రితము |

| | | |
|---|---|---|
| 46. | యోగసుధాకరము ... | అముద్రితము |
| 47. | రూపమూ - రసమూ ... | అముద్రితము |
| 48. | నేటి సాహిత్యము - క్రొత్త పోకడలు ... | అముద్రితము |
| 49. | నాటక మీమాంస | అముద్రితము |
| 50. | తెలుగు భాష - కొన్ని విశేషములు ... | అముద్రితము |
| 51. | కుల పర్వతాలు - రేడియో ప్రసంగము ... | అముద్రితము |

## పీఠికలు - పరిచయములు

| | | |
|---|---|---|
| 52. | నాట్యవేదము ... | 1964 |
| 53. | ధ్వన్యాలోకము ... | 25-2-1959 |
| 54. | నృసింహ పురాణము ... | 1953 |
| 55. | హరివంశము ... | 1960 |
| 56. | గోవింద రామాయణము ... | 1963 |
| 57. | బ్రిటిష్ ఇండియా చరిత్ర ... | 28-9-1938 |
| 58. | గద్య కాదంబరి ... | ... |
| 59. | సాధన సామగ్రి ... | 6-7-1964 |
| 60. | శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర ... | 12-6-1956 |
| 61. | అమ్జద్ రుబాయీలు : పరిచయం ... | 15-8-1964 |
| 62. | సమగ్ర ఆంధ్ర సాహిత్యం ... | 21-3-1965 |

## —: గ్రంథరూపం దాల్చిన వ్యాసాలు :—

| | | |
|---|---|---|
| 1. | ప్రాచీన ఖగోళము ... | భారతి-ఏప్రిల్ నుండి ఏప్రిల్ 1948-49 |
| 2. | అరవిందుని పురుషోత్తమ తత్త్వము ... | భారతి - 1966-67 |

